3460



శ్రీరస్తు

శ్రీ పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి కృతము

# సీతారామాంజనేయసంవాదము.

## టీకాతాత్పర్యవివరణసహితము.



035,1AL:9:1
G4P

చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచేఁ బ్రకటితము.

1934

23/A

*All Rights Reserved.*

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



శ్రీరస్తు

శ్రీ పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి కృతము.

# సీతారామాంజనేయసంవాదము.

## టీకాతాత్పర్యవివరణసహితము.




చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స

వారిచే ప్రకటితము.

1934



*All Rights Reserved.*

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# పీఠిక.



సీతారామాంజనేయ మనునీప్రబంధము రచించినకవి పరశురామపంతులలింగమూర్తి. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. రామమంత్రితిమ్మమాంబలకుమారుఁడు. ఇతనినివాసస్థలము నిజామురాష్ట్రములోని వరంగల్లునకుఁ జేరిన మట్టెవాఁడ. నేఁటివఱ కీకవివంశీయులు లింగమూర్తి కవిపాదరజముచేఁ బవిత్రీకృతమైన ప్రాచీనగృహముననె వసించుచున్నారు. ఈవంశమున నీయనకుఁ బూర్వము కవులున్నటులఁ దెలియదు. ఆంధ్రమున నీకవివర్యుఁడు రచించినగ్రంథములఁ బేర్కొందుము.

1 రతిమన్మథవిలాసము

2 జీవన్ముక్తిప్రకరణము

3 బ్రహ్మనారదసంవాదము

4 తారకయోగము

5 మానసశతకము (కందములు)

6 సీతారామాంజనేయము

ఇందు సీతారామాంజనేయము, రతిమన్మథవిలాసము అను రెండు గ్రంథములే యించుక పెద్దవి. మిగిలినకబ్బములు శతకప్రాయములు. రతిమన్మథవిలాసము మూఁడాశ్వాసములప్రబంధము. ఈగ్రంథము కవి బాల్యమున రచించినటుల నందలిభావలోపములు వ్యాకరణలోపములు సాక్ష్యము లగుచున్నవి. గద్యములో "శ్రీమదాంజనేయచరణకమల సేవావిధేయ శృంగారకవితాచమత్కారధౌరేయ పరశురామపంతుల లింగమూర్తినామధేయప్రణీతం బైనరతిమన్మథవిలాస మను శృంగార ప్రబంధమందు" అని వ్రాసికొనియున్నాఁడు. దీనింబట్టి యౌవనమున నీగ్రంథము కవి రచియించియుండునని తేలుచున్నది. సీతారామాంజనేయము లిఖించునప్పటికి కవిస్థితిగతులు మాఱెను. ఈతనిమానసము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శృంగారరసమునుండి విముఖమై వేదాంతరసమున నోలలాడఁ దొడఁగెను. కవితయు నిగ్గుతేఱి వశంవదయై భావబింబముల నిర్జీవకథాంశములలో సైతము చిత్రించుశక్తి కల దయ్యెను. రతిమన్మథవిలాసము హనుమంతునకుఁ గృతి యీయఁబడినది. గద్యమున హనుమద్భక్తుఁడ నని కవి చెప్పికొనెను. గ్రంథమున గురుప్రశంస లేదు. తుదకు స్వవంశవిషయమేని చెప్పికొనియుండలేదు. సీతారామాంజనేయ మీకవి తన యుత్తరవయస్సున రచించియుండును. ఇందులకుఁ గవితాధారయు వేదాంతపాండిత్యము మనకు దృష్టాంతములు కాఁగలవు. ఈకవి బాల్యమున సామాన్యునివలె విద్యాజ్ఞానశూన్యుఁడై తనగ్రామమగు మట్టివాడకు సమీపముననున్న "ఈదులవాయ" యనుగ్రామమున సంచరించుచుండ సమీపశైలమున వసించు మహాదేవయోగి యను నొక మహాత్ముఁడు రామమంత్రోపదేశ మొనరించె ననియు, నాగిరియందె యామంత్రరాజముసిద్ధించువఱకువసించి యోగివలనిసెలవంది యాయన దయచేసిన షట్చక్రసీతారామస్వరూపము నిజగృహమునఁ బ్రతిష్ఠించె ననియుఁ జెప్పుటయేకాక నేఁటివఱకు నాసీతారామమూర్తిస్వరూపము వంశీయులు భక్తితాత్పర్యములతోఁ బూజించుచున్నారు. కవి, తాను మహాదేవగురుశిష్యుఁడ ననియు, షట్చక్రసీతారామోపాసకుఁడ ననియు సీతారామాంజనేయగద్యమున నిటుల "శ్రీమన్నారాయణ మహాదేవగురుకరుణాకటాక్ష వీక్షణవిమలీకృత నిజహృదయకమలకర్ణికాంతస్సందర్శితాఖండ సచ్చిదానందరసైకస్ఫూర్తిషట్చక్రసీతారామమూర్తి పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి ప్రణీతము" అని వ్రాసికొనియున్నాఁడు. మఱియు నీకవివర్యుఁ డార్జించిన శ్రీరామమాడయు స్ఫటికవినాయకవిగ్రహము మరకతలింగము సాలగ్రామములు సైతము వంశీయులు శ్రద్ధాభక్తులతోఁ బూజించుచున్నారు. ఎట్టివిపత్కాలమున నేని తాఁ గడించినవిగ్రహముల మట్టివాడయందుంచియే పూజింపవలయునని కవి యాజ్ఞయొసఁగెనఁట. నేఁటికి వంశజు లటులే సల్పుచున్నారు. కవికి గురుమూర్తిపదము బిరుదనామము. ఇది యిక్కవి రామమంత్రోపదేశకుఁడై నిజాము రాష్ట్రమున నఖిలదిశలఁ బల్లకి నెక్కి తిరిగి పెక్కండ్రు శిష్యుల గడించి వారివలనఁ బొందెనఁట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కవి తనగురుపరంపర నిటులఁ జెప్పికొన్నాఁడు.


శ్రీదత్తాత్రేయుఁడు
|
జనార్దనయోగి
|
ఏకోగురుస్వామి
|
సరహరిమహేశగురుస్వామి
|
నాగోజీరామగురుఁడు
|
కోనేరుగురుఁడు
|
మహాదేవగురుఁడు

ఇందు కడపటివాఁడగుమహాదేవగురుఁడే ప్రకృతకవి కుపదేశ మొనరించిన దేశికుఁడు. ఈదేశికనామము రతిమన్మథవిలాసమునఁ గాన రామిచే నప్పటి కీకవి భక్తియోగాభ్యాస మొనరించి యుండఁడని తెలియుచున్నది. సీతారామాంజనేయమునఁ దనదేశికు నిటుల స్తోత్ర మొనరించి యున్నాఁడు.

సీ. "అఖిలభూతంబుల నాడించుమాయను
 సొంపుగా నెవ్వఁ డాడింపుచుండు
గురుజనంబుల కెల్ల గురువులై తగుహరి
 హరుల కెవ్వఁడు గురు వగుచునుండు
విబుధలోకంబుల వెలిఁగించి వెలుఁగుల
 మించి యెవ్వఁడు వెలిఁగించుచుండు
ప్రభువుల కెల్ల సత్ప్రభు వైనబ్రహ్మకుఁ
 బ్రభు వౌచు నెవ్వఁడు పరఁగుచుండు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. సగుణనిర్గుణరూపుఁ డై నెగడుచుండు
నమ్మహాదేవగురువరు నభినుతింప
సకలనిగమాగమాంతశాస్త్రంబు లోప
వనఁగ మముబోంట్లకు నుతింప నలవి యగునె.”

ఈపద్యమువలన మహాదేవయోగి దైవసముఁ డని తోఁచు చున్నది. ఎంతవాఁడో కానిది లింగమూర్తికవికి గురువు కాఁగ లఁడా! కవి తాను, మహాదేవయోగి గురుఁ డని యిట్లు చెప్పి కొనెను.

తే. “అమ్మహాదేవగురుచరణారవింద
వరపరాగాంశభజనతత్పరుఁడఁ బరశు
రామపంతులకులజాతరామమంత్రి
మౌళితిమ్మాంబికా ప్రియాత్మజుఁడ నేను.”

కొండొకచోట నిక్కవి తనదేశికుని సీతారామస్వామికి సమా నునిగ నీక్రిందిపద్యములోఁ జెప్పికొని యున్నాఁడు.

క. “ప్రణవాత్మకసదసత్కా
రణసంపూర్ణప్రభాభిరామసగుణని
ర్గుణనిర్వికారనారా
యణసీతారామగురుమహాదేవశివా.”

కవి తానీగ్రంథమున బ్రహ్మాండపురాణాంతర్గత మగు అధ్యాత్మ రామాయణమునందలి శ్రీరామహృదయమును విస్తరించి వ్రాసితి ననియు శ్రీరాముఁడు స్వప్నమునఁ బ్రత్యక్షమై కృతి రచింపు మనె ననియు వ్రాసికొనియున్నాఁడు.

ఈకవి యీగ్రంథమును మూఁడాశ్వాసములుగ విభజించి క్రమముగఁ దారకయోగము సాంఖ్యయోగము అమనస్కయోగము అని పేరులఁ బెట్టియున్నాఁడు.

రజతగిరియందు శంకరుఁడు పేరోలగముఁ దీర్చియుండుతఱిఁ దనపరిచర్యలయం దప్రమత్తురాలగు పార్వతిని జూచి శంకరుఁడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంతసించి నీ యభీష్టంబుఁ దీర్తు నెద్దియేని వరము కోరు మనె నఁట. అందులకుఁ బార్వతి పవిత్రమగుమంత్రరాజ ముపదేశింపుమనికోర శంకరుఁడు నీకుఁదగినది శ్రీరామమంత్రమని దాని నుపదేశించెనఁట. పిమ్మట పార్వతి శంకరునిఁజూచి శ్రీరామతత్త్వస్వరూప మెట్టిదని ప్రశ్నింప, శ్రీరాము ననుమతిచే సీత హనుమంతున కెఱింగించిన యంశము శంకరుఁడు పార్వతి కెఱింగించెనఁట. ఇదియే యీగ్రంథావతారిక.

కవికాలము తెలిసికొనుటకు గ్రంథమున నాధారములు లేవు. రతిమన్మథవిలాసము కవిస్తుతిలో అయ్యలరాజు రామభద్రుని పేర్కొని యుండుటచే పదునాఱవశతాబ్దమునకుఁ గడపటివాఁ డనువిషయము స్థూలదృష్టికిఁ దోఁచును. కవికిఁ గడపటివంశవృక్షు మీక్రింది విధముగ నున్నది.




ఈవంశవృక్షమునందలి పట్టాభిరామయ్య గ్రంథకర్తయగు లింగమూర్తికవి కైదవతరమువాఁడు. ఈపట్టాభిరామయ్యకు వయస్సు 40 సంవత్సరము లుండును. ఈయనవద్దనుండి తరమునకు ముప్పదియేండ్ల చొప్పున లెక్కించినచో ప్రకృతకవి యిప్పటికి రమారమి 150 సంవ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్సరముల పై కాలమువాఁ డగును. అధ్యాత్మ రామాయణము, శుకచరిత్రము లోనగు గ్రంథముల విరచించిన మహాకవియు లింగమూర్తికవి కుమారుఁడు శిష్యుఁడు నగు రామమూర్తి తనతండ్రి లిఖించిన రతిమన్మథవిలాసమునకు శుద్ధప్రతి వ్రాయుచుఁ గ్రింద, "ప్లవంగసంవత్సర జ్యేష్ఠ బ ౧౩ గురువారమువఱకు పరశురామపంతులురామన్నగారు రతిమన్మథవిలాసము పూర్వప్రతిలోనున్నక్రమాన వ్రాసిరి." అని వ్రాసికొనెను జీర్ణమయమై యున్న గ్రంథమువలనను, ప్రకృత వంశీయులకు రామమూర్తికవి యైదవపురుషుఁడగుటవలనను ప్లవంగ సంవత్సర మిప్పటికిఁ బదియేండ్లక్రిందను డెబ్బదియేండ్లక్రిందను గతించినది కాక నూటముప్పదిసంవత్సరములక్రింద గతించినదై యుండును. అంతకు ముందు లింగమూర్తిగారు రమారమి యిరువదిసంవత్సరములక్రింద నుండె ననుకొనినను సీతారామాంజనేయ మిప్పటికి నూటయేఁబది సంవత్సరములక్రిందః—అనఁగా క్రీ. శ. 1760 ప్రాంతములో విరచింపఁబడి యుండుననుట నిస్సందేహము. కవిజీవిత మిఁక విడిచి కావ్యము విమర్శింతము.

## సీతారామాంజనేయసంవాదము.

ఇది యితనితక్కిన గ్రంథములకంటె శ్రావ్యముగఁ బ్రౌఢముగ నిర్దుష్టముగా నున్నది. కావ్యమంతయు యోగశాస్త్రమగుటచేఁ గవితావిమర్శమునకు వీలు కానరాదు. అందందుఁ గలస్వతంత్రపద్యములచేఁ గవిశక్తిసామర్థ్యములు గుర్తింపవచ్చును. ప్రాచీనకవులపద్యముల పోలికల ననుసరించి వ్రాయఁబడినపద్యములు కొన్ని సీతారామాంజనేయమున కలవు.

సీ. "స్వామియై నిగమాలిభూమియై సురపురో
గామియై యబ్ధిజాకామి యుండ
హారియై హాలహాలాహారి యై భవదంశు
ధారియై ప్రసవాయుధారి యుండ......"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
మనుచరిత్రము, చతుర్థాశ్వాసము. ప-36.

సీ. "ఏకమై పరమై విశోకమై సత్య మ
లోకమై వ్యాపకాలోక మగుచు
సారమై చిదచిదాకారమై యతినిర్వి
కారమై విగతసంసార మగుచు......"

సీతారామాంజనేయము ఆ-2 ప-6.

ఉ. "హా యను గాధినందనమఖారినిశాటమదాపహారిబా
హా యను గ్రావజీవదపదాంబురుహా యను రాజలోకసిం
హా యనుఁ బోషితార్యనివహా యనుఁ గానల కేఁగితే నిరీ
హా యను నిర్వహింపఁగలనా? నిను బాసి రఘూద్వహా యనున్."

రామాభ్యుదయము. ఆ-5. ప-10.

ఉ. "మాయను మిథ్యగాఁ దెలియుమా యను దత్కృత మెల్లఁ గల్లసు
మ్మా యను మేను నే ననకుమా యను సాక్షిని నీవు చూచుకొ
మ్మా యనుఁ జూడఁగా నితరమా యను నే నని నిశ్చయించుకొ
మ్మా యనుఁగాకపో నితరమా యనుమానముమానుమాయనున్."

సీతారామాంజనేయము ఆ-3. ప-143.

ఇట్టిపోలికలచే నీకవి ప్రాచీనకవులకవిత్వముపై గౌరవభావము కలవాఁ డనియు రసార్థియనియుఁ బాఠకులు తలంతురుగాక. కఠినతమ మగు వేదాంతశాస్త్రమును, కవితాప్రపంచమున వెలయించుట సామాన్యకార్యము కాదు. అందును నీకవి వర్ణనాంశములలో నిరోష్ఠ్యపద్యములు, సర్వతఃప్రాసపద్యములు, చతుఃప్రాసపద్యములువ్రాసి తనశక్తిని వెల్లడించియున్నాఁడు. విస్తరభీతిచే నుదాహరింప మానితిమి. ఈలింగమూర్తికవి మొదలు కడకు వంశవృక్షములోనివారందఱును కవులుగను పండితులుగను రామమంత్రోపాసకులుగ నున్నారు. ఈ పవిత్రమగువంశమునఁ బట్టాభిరామయ్యగారును వారిపుత్త్రులును గవితాపరిచయము లేనివారుగ నున్నారు. ఈ సీతారామాంజనేయమునకు సర్వాంకషముగ మొదట వ్యాఖ్యాన మొనరించిన శ్రీ పాలపర్తి నాగేశ్వర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శాస్త్రినిగూర్చిన విశేషాంశములు తెలియరావు. సీతారామాంజనేయమువలెనే యీకవి రచించిన రతిమన్మథవిలాసముకూడ ముద్రించి భాషాలోకమున కుపకృతి యొనరింప శ్రీవావిళ్లవారి నడిగికొనుచుం బ్రకృతాంశమును ముగించుచున్నారము.

ఇట్లు భాషాసేవకులు,
శేషాద్రిరమణకవులు, శతావధానులు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మొదటికూర్పు పీఠిక.

మాతృభాషయందుఁ బ్రౌఢము లై పండితైకవేద్యము లై వాదానువాదప్రతివాదభూయిష్ఠములై శాస్త్రజ్ఞానము లేనివారలకు దురవగాహము లైన ద్వైతాద్వైతవిశిష్టాద్వైతసంబంధము లగు వేదాంతగ్రంథము లనేకములు గలవు; గాని యందఱకుఁ దేటతెల్ల మగుదేశభాషయందు సామాన్యు లగు వేదాంతజిజ్ఞాసువులకు సులభముగ సిద్ధాన్తస్వరూపమును దెలుపు వేదాంతగ్రంథములు మాత్రము మిక్కిలి తక్కువగనున్నవి. ఇట్టికొఱఁత యన్నిమతములవారికిఁ గలదని చెప్పుట సాహసముగాదు గాని చాలవఱకు విశిష్టాద్వైతులకుమాత్ర మీకొఱఁత దీర్పఁబడినది. ఏలయన: సుమారు 5000 సంవత్సరములకు ముందునుండియే భూతయోగి మహాయోగి సరోయోగి శఠకోపాదు లగువిశిష్టాద్వైతులు తమసిద్ధాంతమును ద్రావిడభాషలోనికిఁ బద్యరూపముగ మార్ప నారంభించిరి. తరువాతను వారిమతము ననుసరించియే లోకాచార్యాదులు తత్త్వత్రయతత్త్వశేఖరాదిగ్రంథములఁ బెక్కింటిని వచనరూపముగ నెల్లరకుఁ దేటతెల్లమగునట్లు రచించిరి. ఇంతియకాక, క్రీ. శ. 16 శతాబ్దములో నుండు కృష్ణదేవరాయలు, సంకుసాలనరసింహకవి మున్నగువారు తమవిష్ణుచిత్తీయకవికర్ణరసాయనాదిగ్రంథములయం దీమతస్వరూపమును జక్కఁగ వివరించి యాంధ్రభాషయందును విశిష్టాద్వైతసిద్ధాంతమును వెలయించిరి. తరువాతివారును ముముక్షుజనకల్పకము మున్నగు కొన్నిపద్యకావ్యములను రచించిరి. పిదప నూఱుసంవత్సరములనుండి యఱవమునుండి తెలుఁగున కెల్లగ్రంథములు మార్చుకొనఁబడుచున్నవి గదా!

ఇట్లె కొంతవఱకు ద్వైతగ్రంథములు గూడఁ గర్ణాటభాషలోనికి మార్చుకొనఁబడినవఁట! కాని యల్పవ్యాప్తి గల యామతగ్రంథము లంతగాఁ బ్రసిద్ధినొందినవి గావు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇఁక ననాదిరైు లోకమునం దత్యంతవ్యాప్తి గలయద్వైతమత మును దెలుపు దేశభాషాగ్రంథములు సుమారు 400 సంవత్సరముల క్రిందటివఱకు లేనట్లు కనంబడుచున్నది. అఱవభాషలోఁ గొన్ని గల వందురు గాని యవియు నంతప్రసిద్ధములుగా లేవు. తెనుఁగునందు నిటీ వల వాసుదేవమననము మున్నగు కొన్ని వచనగ్రంథములు బయలు వెడలినవి గాని యందు సర్వవిషయములను సోదాహరణముగఁ జర్చింపఁ బడకుండుటయే కాక యాశైలియు సహృదయహృదయరంజకముగా నుండ లేదనియుఁ జెప్పవచ్చును.

ఇఁకఁ బద్యకావ్యమై సరసకవితావిలసితమై యద్వైతమతము నకు సంజీవిని యనందగి విలసిల్లు వేదాంతగ్రంథరత్నము—

# సీతారామాంజనేయసంవాదము.

ఇయ్యది మూఁడాశ్వాసముల ప్రబంధము. దీనిని బరశురామ పంతుల లింగమూర్తి గురుమూర్తి యనుకవి రచించెను. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. రామమంత్రికిని దిమ్మాంబకును బుత్త్రుఁడు. శ్రీరామభక్తుఁడు. మహాదేవయోగికి శిష్యుఁడు. ఇతని కాలాదులను గూర్చి యాధారము లేవియు దొరకనందున సుమారు 100-150 సంవ త్సరముల క్రింద నుండియుండెనని యూహింపవలసియున్నది. ఇతఁ డద్వైతమతమును వివరింపఁబూనియుఁ దాను యోగాభ్యాసపరుఁ డగుటవలన రాజయోగమును, బాలలోఁ జక్కెరను గలిపినట్లు, అద్వైతమతమునందుఁ గలిపి యేకముగ సమన్వయించియున్నాఁడు.

ఈ వేదాంతమును బార్వతీదేవి శివుని బ్రశ్నఁ జేయఁగా నతఁడు పూర్వకాలమున రామపట్టాభిషేకానంతరము జరిగిన సీతారామాంజ నేయసంవాదమును బార్వతికిఁ దెలిపినట్లు గ్రంథకర్త గ్రంథాది యందుఁ బొందుపఱచియున్నాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇందు మొదటఁ బ్రథమాశ్వాసమునందుఁ దారకయోగమును నిరూపించుచు, తొలుత యోగాభ్యాసమువలనఁ బ్రాణవాయువు స్వాధీన మగుననియు, వాయువునకు మనసునకును సంబంధముండుట వలన వాయుజయముతోఁగూడ మనోజయము గలుగుననియు, నింద్రియముల కన్నిటికి మనసే ప్రభువుగాన వెంటనే యింద్రియజయము గూడఁ జేకూరుననియు, నిట్లన్నియు జయింపఁబడెనేని సంసారమునకు ముఖ్యకారణములగు కామక్రోధాదులు నశించి జీవునకు బ్రహ్మానంద సుఖము గలుగుననియు, సహేతుకముగ సయుక్తిముగ యోగఫలమును నిరూపించి పిదప యోగాభ్యాసము సేయువా రనుసరింపఁదగిన యాహారాది నియమములు మొదలుకొని—యోగమఠలక్షణము, పంచముద్రాలక్షణము, సూర్యచంద్రమండలకళానిర్ణయము, హంస తత్త్వోపదేశము మున్నగువానిని విపులముగ వివరించి తారకయోగమును ముగించెను.

రెండవయాశ్వాసమునందుఁ బరబ్రహ్మస్వరూపము, భావాభావ పదార్థస్వరూపము, మాయాస్వరూపము, ప్రపంచకారణస్వరూపము, సూక్ష్మశరీరసృష్టిప్రకారము, జీవబ్రహ్మైక్యవిచారము, ఓంకారస్వరూప నిరూపణము, పంచకోశవివేచనము, దృగ్దృశ్యవివేకము, ఆరురుక్ష్వాది లక్షణము, సద్రూపలక్షణము, ప్రళయవివరణము, చిద్రూపలక్షణాఖండలక్షణాదులను సహేతుకముగ నిరూపించి సాంఖ్యయోగమును బూర్తిసేసెను.

ఇఁక మూఁడవయాశ్వాసమున, అమనస్కయోగలక్షణము, తద్వర్తనము, వైరాగ్యబోధోపరతుల తారతమ్యము, వైరాగ్యశబ్ద విమర్శనము, గురుశుశ్రూషావిచారము, మహావాక్యార్థవివరణము, సుస్థితప్రజ్ఞలక్షణము, పంచదశయోగాంగవిభాగము, యోగిలక్షణము మున్నగువానిని సాంగముగ వివరించి యమనస్కయోగమును ముగించెను. ఈమూఁడుయోగములును రాజయోగభేదములే కావున నీగ్రంథము రాజయోగ నిరూపక మనందగియున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈకావ్యమునందు విషయమువలెనే కవిత్వమును జాల సమంజస ముగనే యున్నది. దురవగాహ మగువేదాంతమును సులభశైలిలోఁ గ్లిష్టపదసందర్భము గలుగకుండఁ బద్యములో నిముడ్చుట సామాన్య మగుపని కాదు కదా! వేదాంతములో నెంతయో యనుభవము కలిగి వశ్యవాక్కులు గలకవికిఁ గాని యిట్టిసామర్థ్యము గలుగ నేరదని చెప్పవచ్చును. ఇంతియ కాక యీకవి తనగ్రంథమునం దచ్చటచ్చట నేకాక్షర ద్వ్యక్షర ముక్తపదగ్రస్తాదిశబ్దచిత్రములు గలపద్యములఁ బెక్కింటిఁ జొప్పించి నిజపాండిత్యప్రకర్షను వెల్లడించియున్నాఁడు. ఇట్టి యుత్తమగ్రంథ మెంతయో శ్రమపడి పూర్వముద్రితగ్రంథముల కన్న మిన్నయగునట్లు సులభశైలిలో నద్వైతవిషయములనెల్లఁ జక్కఁగఁ జర్చించు టీకాతాత్పర్యములతో ముద్రింపఁబడినది. విచా రించి చూచినఁ బెక్కువిషయములఁబట్టి యీగ్రంథ మద్వైతులకుఁ బరమోపకారకమగునని నొక్కి వక్కాణింపవలసియున్నది. ఇఁక మన దేశమునందు నూటికిఁ దొంబదిమంది యద్వైతజిజ్ఞాసువు లీగ్రంథ మును దప్పక చదువుచుండుటంబట్టియే యీగ్రంథప్రాశస్త్యము వెల్లడియగుచుండ వేఱుగ వ్రాయ నక్కఱలేదు గదా! కాఁబట్టి రాజ యోగజిజ్ఞాసువులందఱు నీగ్రంథమును జదివి తత్స్వరూపమును జక్కగ నెఱింగి బ్రహ్మానందము నొందుదురుగాక!

ఉత్పల వేంకటనరసింహాచార్యులు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీ ర స్తు.

# వి ష య సూ చి క.





CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నీతిశతకసంపుటము—౧

ఇందు 1 సుమతి, 2 భాస్కర, 3 వేంకటేశ, 4 గువ్వలచెన్న, 5 చంద్రశేఖర, 6 వేమన(పద్యములు), 7 శరభాంకలింగ, 8 కుమార, 9 కుమారీ, 10 కోలంక శ్రీ మదనగోపాల, 11 నీతి, 12 జగన్నాయక, 13 కుక్కుటేశ్వర, 14 రామలింగేశ, 15 నమశ్శివాయ, 16 బాలనీతి, 17 రామచంద్ర, 18 శ్రీకృష్ణనీతి, 19 మానినీ, 20 రఘురామశుభోదయశతకములు గలవు. వెల రూ. 2-0-0

# నీతిశతకసంపుటము—౨

(అచ్చగుచున్నది.)

# భక్తిరసశతకసంపుటము—౧

భక్తిరసశతకముల మొదటిసంపుటములలో భక్తిరసోద్బోధకములగు ఈక్రింది శతకములను చేర్చి ముద్రింపించితిమి. శతకములన్నియు నిర్దుష్టముగ మనోహరముగ ముద్రింపఁబడి విపులములగు పీఠికలతో నలరారుచున్నవి. 1 వృషాధిప, 2 చెన్నమల్లు (సీసములు), 3 సర్వేశ్వర, 4 ఒంటిమిట్ట రఘువీర, 5 దేవకీనందన, 6 నారాయణ, 7 దాశరథి, 8 సింహాద్రినారసింహ, 9 కృష్ణ, 10 మాతృ, 11 ఉన్నవరాజగోపాల, 12 మానసబోధ, 13 చిత్తబోధ, 14 ఆంధ్రనాయక, 15 ప్రసన్నరాఘవ, 16 రామతారక, 17 రామరాఘవ, 18 రామప్రభు, 19 భద్రాద్రిరామ, 20 మారుతిశతకములు గలవు. వెల రూ. 2-0-0

# భక్తిరసశతకసంపుటము—౨

ఇందు 1 సూర్యనారాయణ, 2 రాజలింగ, 3 రఘుకులతిలక, 4 మహిషాసురమర్దని, 5 ఉద్దండరాయ, 6 గొట్టుముక్కలరాజగోపాల, 7 రుక్మిణీపతి, 8 జ్ఞానప్రసూనాంబికా, 9 ముకుంద, 10 శివ, 11 రమాధీశ్వర, 12 భక్తచింతామణి, 13 సీతాపతి, 14, మహిజామనోహర, 15 పార్థసారథి, 16 రాజశేఖర, 17 రంగేశ్వర, 18 మాధవ, 19 కామేశ్వరీ, 20 విశ్వనాథశతకములు గలవు. వెల రూ. 2-0-0

# భక్తిరసశతకసంపుటము—౩

ఇందు 1 నారాయణ (పోతనకవి), 2 కాళహస్తీశ్వర, 3 రమణీమనోహర, 4 భద్రాద్రిరామ(వేదాంతము), 5 యాదగిరీంద్ర, 6 నృకేసరి, 7 నృసింహ, 8 భద్రాద్రి, 9 వసుదేవనందన, 10 వీరనారాయణ, 11 సదానందయోగి, 12 శివముకుంద, 13 రామరామ, 14 సంపంగిమన్న, 15 శ్రీకృష్ణ, 16 లక్ష్మి, 17 రంగశాయి, 18 కాళహస్తి, 19 ముకుందరాఘవ, 20 సర్వలోకేశ్వరశతకములు గలవు. వెల రూ. 2-0-0

ఈశతకసంపుటములు చిన్నసైజులో పెద్దక్షరములతో ముద్రింపఁబడి ముద్దులు గులుకు చక్కని కాలికోబైండుతో నలరారుచున్నవి.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, మదరాసు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీహయగ్రీవాయనమః.

# శ్రీ సీతారామాంజనేయ సంవాదము

## టీకాతాత్పర్యవిశేషార్థము.



## పీఠిక.

### ఇష్టదేవతాస్తోత్రము.

అవతారిక. పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి యను గ్రంథకర్త శిష్టుల యాచారము ననుసరించి మంగళము నాచరించుచు గ్రంథార్థమును గూడ సూచించుచున్నాఁడు.—

శా. శ్రీమద్దివ్యనిజాంఘ్రిపద్మములు సంసేవించుచుఙ్ భక్తిచే
ధీమంతుం డగునాంజనేయుని నసద్దేహేంద్రియాతీతచి
ద్వ్యోమానందుఁడ వీవ నే నని కృప న్బోధించు శ్రీజానకీ
రామబ్రహ్మము నంతరంగమున నారాధింతు నశ్రాంతమున్. 1

### వ్యాఖ్యాతృకృతస్తుతి.

శా. శ్రీలోకేశుఁ డెవండు సర్వమున దాఁ జెల్వొందియుఙ్ సర్వముఙ్
ఆలోకించుట నన్యుఁ డయ్యును సమస్తాధారతఙ్ సర్వమై
లీలఙ్ వెల్గు విచారదృష్టి నరయఙ్ లే దన్య మెవ్వానికిఙ్
జాలం గొల్చెద నయ్యనాదినిధను స్సచ్చిత్ప్రమోదాత్మునిన్.

ఉ. సుందరమాంబకుఙ్ ప్రథితసువ్రతకుఙ్ పరదేశమంత్రికిఙ్
నందనుఁడఙ్ రమేశకరుణాపరిలబ్ధకవిత్వశక్తిని
స్పందుఁడ రామదాసబుధపౌత్త్రుఁడ వెన్నెలకంటివంశ్యుఁడఙ్
సుందరరామనామకుఁడ సూరిజనైకవిధేయచిత్తుఁడన్.

తే. శంకరాచార్యపదముల సాఁగి మ్రొక్కి
యస్మదీయగురుశ్రేణి నభినుతించి
యొసఁగ వివరింతు శ్రీరామహృదయ మేను
ఘనులకరుణచే విన్నంత గనినయంత.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. అనిశము పాముఁజేరి విషమై చెడుపాలునుబోలె సద్గుణం
బును గుణహీనుఁ జేరి చెడుఁ బొల్పుగఁ దోయపుబిందువైన శు
క్తినిఁ బడి ముత్య మైనగతిఁ గిల్బిషహీనునిఁ జేరి దోషమై
నను మహనీయమై తగుఁ గనన్ జగతీస్థలి నిట్టితత్త్వమున్.

క. కని నిశ్చయించి సాహసమును బూనితి నప్రబుద్ధముగ్ధాత్ముఁడ న
య్యును నిది యార్యుల యాదృతిఁ, గని వర్ధిలు నాపయోధిగగనార్కముగాన్.

టీక. శ్రీమ ..ములు-శ్రీమత్ = శోభాయుక్తములైన, దివ్య = శ్రేష్ఠములైన (లేక, లోకాతీతములైన), నిజ = తన, అంఘ్రిపద్మములు = పాదకమలములను (ఇచ్చట ద్వితీయార్థమునందు ప్రథమ), భక్తిచేత్=అపరోక్షజ్ఞానమునకు సాధనమగు అనన్య భక్తిచే (బాహ్యభక్తి, అనన్యభక్తి, ఏకాంతభక్తి అని భక్తి మూఁడు విధములు. అందు బాహ్యభక్తి పరోక్షజ్ఞానమును (అనఁగా: తనకంటె నధికుఁ డగుపరమేశ్వరుఁడు ఒకఁడున్నాఁ డనుజ్ఞానమును) కలిగించును. అనన్యభక్తి అపరోక్షజ్ఞానమును (అనఁగా: తనకును ఈశ్వరునకును భేదము లే దనుజ్ఞానమును) కలుగంజేయును. ఏకాంతభక్తి పరమానందానుభవమును గలిగించును), సంసేవించుచున్, ధీమంతుండు=వివేకముగలవాఁడు (పరబ్రహ్మము నిత్యమనియుఁ బ్రపంచ మనిత్యమనియు జ్ఞానము గలవాఁడు), అగునాంజనేయునిన్ = ఐనహనుమంతుని, అస...డవు-అసత్ = లేని (అసత్యములైన), దేహ= (స్థూలము సూక్ష్మము కారణము మహాకారణము అను) దేహములును, ఇంద్రియ = ఇంద్రియములను, అతీత=అతిక్రమించిన (దేహేంద్రియాదులకంటె వేఱైన), సత్ = సత్యస్వరూపుఁడవును, చిత్ = జ్ఞానస్వరూపుఁడవును, భూమానందుఁడవు = పరమానంద స్వరూపుఁడవును అగు, ఈవ=నీవే, నేను (జీవుఁడే బ్రహ్మమనుట), అని, కృపన్=పరమానుగ్రహముచే, బోధించు = తెలిసికొనునట్లుచేయు, శ్రీ...బ్రహ్మమున్-శ్రీ=అష్టైశ్వర్యయుక్తమగు, జానకీరామబ్రహ్మమున్ = సీతాసహితరామబ్రహ్మమును (ఇచ్చట సీతను మాయఁగాను, రాముని పరబ్రహ్మముఁగాను జెప్పియున్నాఁడు), అంతరంగమునన్=మనసునందు, అశ్రాంతమున్=సర్వకాలములయందును, ఆరాధింతున్=సేవింతును (ధ్యానింతు ననుట).

తాత్పర్యము. అనన్యభక్తిచేఁ దనపాదముల నెప్పుడును సేవించుచుఁ దత్ప్రభావమువలన దృఢమగు వివేకవైరాగ్యములు గలిగి యుత్తమాధికారియై యున్న హనుమంతునకు "తత్త్వమసి" = "ఆబ్రహ్మమే నీవు" అను మహావాక్యముయొక్క యర్థమును గరుణవెలయ నుపదేశించు నాసీతారామబ్రహ్మమును సర్వకాలములయందును ధ్యానించెదను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇట్లు తన యిష్టదైవ మగు శ్రీరాముని పరబ్రహ్మరూపునిగా వర్ణించి యీ పద్యమున సీతాదేవిని మూలప్రకృతిరూపముతో నభివర్ణించుచున్నాఁడు.—

సీ. తనరజోగుణముచేఁ దనరంగ నేదేవి
గల్పించు నఖిలలోకములనెల్లఁ
దనసత్త్వగుణముచే నొనరంగ నేకొమ్మ
పోషించు నీసర్వభూతములను
దనతమోగుణముచేఁ దగ నేవధూమణి
జగములనెల్ల సంక్షయముఁ జేయుఁ
దాశుద్ధసత్త్వప్రధానయై యేరామ
రామాంకమున నజస్రము వసించు
తే. నట్టిభువనైకమాత దయాసమేత, సద్గుణవ్రాత నిర్మలస్వాంతపూత
భక్తజనమానసోద్యానపారిజాత,సీత కరుణించి నన్నురక్షించుఁగాత.

టీ. ఏదేవి = మూలప్రకృతియగు నేసీతాదేవి, తనరజోగుణముచేన్ = తనకుఁ గలరజోగుణముచేత, తనరంగన్ = ఒప్పునట్లుగా, అఖిలలోకములనెల్లన్=నానావిధము లగు భేదములుగల యీబ్రహ్మాండములనెల్లను, కల్పించున్ = సృష్టించునో (ఇచ్చట కల్పించు ననుటచే వాస్తవముగ నీప్రపంచము బ్రహ్మమునకంటె వేఱు కాకున్నను వేఱుగానున్నట్లు తోఁపఁజేయుచున్నది యని భావము.) ఏకొమ్మ = ఏస్త్రీ, తనసత్త్వగుణముచే = తనకుఁగల సత్త్వగుణముచేత (శుద్ధసత్త్వమనియు, మలినసత్త్వమనియు సత్త్వగుణము రెండువిధములు. అందు రజస్తమోగుణములతోఁ గొంచెమైనను సంబంధ పడనిది శుద్ధసత్త్వము; అట్లుకానిది మలినసత్త్వము. ప్రకృతమున ఆమలినసత్త్వమును గూర్చియే చెప్పఁబడియున్నది యని తెలిసికొనవలయును.) ఒనరంగన్ = ఒప్పునట్లుగా, ఈసర్వభూతములను, పోషించున్, ఏవధూమణి=ఏనారీరత్నము, తనతమోగుణముచేన్ = తనకుఁగల తమోగుణముచేత, తగన్ = ఒప్పునట్లుగా, జగములనెల్లన్ = లోకముల నంతయు, సంక్షయముచేయున్=నశింపఁజేయునో, ఏరామ=ఏయువతి, తాన్=తాను, శుద్ధసత్త్వప్రధాన+ఐ = శుద్ధసత్త్వమే ప్రధానముగాఁ గలదియై (శుద్ధసత్త్వస్వరూపిణి యై యనుట.) రామాంకమునన్ = పరబ్రహ్మస్వరూపుఁడగు శ్రీరామునితొడపై, అజస్రమున్ = సర్వకాలములయందును, వసించున్ = నివసించునో (మాయాశక్తి పరబ్రహ్మమునకు నిత్యానపాయిని. అనఁగా: అగ్నియందున్న యుష్ణశక్తియునుం బోలె నెప్పుడును పరబ్రహ్మమును విడువకుండునది యని భావము.) అట్టిభువనైకమాత = ఆ లోకజననియు, దయాసమేత = దయగలదియు, సద్గుణవ్రాత = శ్రేష్ఠము లగుగుణసమూ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హములు గలదియు, నిర్మలస్వాంత = పవిత్ర మగుహృదయము గలదియు, పూత=నిర్వి కారస్వరూపము గలదియు (బ్రహ్మము మాయయు నొక్కటియే కావున నిట్లు చెప్పఁబడెను.) భక్త...పారిజాత-భక్తజన = భక్తజనులయొక్క, మానస = మనస్సులనియెడు, ఉద్యాన = ఉద్యానవనమునందు, పారిజాత = పారిజాతవృక్షమువంటిదియు (తనను ధ్యానించినవారికి కోరినకోర్కుల నొసంగునది యనుట), అగు, సీత, నన్నున్, కరుణించి = దయఁజూచి, రక్షించున్ కాతన్ = రక్షించునుగాక (ఆపదలనుండి తొలఁగించును గాక.)

తా. గుణసామ్యము (సత్త్వరజస్తమోగుణములు ఎక్కువతక్కువలు లేక సమానములుగా నుండుట.) స్వరూపముగాఁ గలది యగుటచేఁ దనరజస్సత్త్వతమోగుణములమూలమున సృష్టిస్థితిసంహారములను జేయుచు శుద్ధసత్త్వస్వరూపముతోఁ బరబ్రహ్మమునందు భేదముగా నిలిచియుండు నాలోకజనని మూలప్రకృతి (మూలప్రకృతి యగు సీతాదేవి) కోరినకోర్కుల నొసంగి నన్ను రక్షించుఁ గాక (ఓంకారమునందు అకార ఉకార మకారము లను మూఁడువర్ణములు కలవు. ఇవి మూఁడును క్రమముగ సత్త్వరజస్తమోగుణము లనియు, మకారము పైనున్న యర్ధమాత్ర గుణసామ్యస్థితి యనియుఁ, ఇవియన్నియుఁ గలిసి యేర్పడిన "ఓమ్" అనుఅక్షరము ప్రకృతి యనియు, ఆ యక్షరముయొక్కయర్థము పరబ్రహ్మమనియు నుపాసింపవలయు నని చెప్పఁబడి యున్నది. దీనిచేఁ బ్రకృతికిని బ్రహ్మమునకును గలసంబంధమును బాఠకులూహింతురు గాక.)

అవ. ఇట్లు ప్రకృతిపురుషుల వినుతించి, బ్రహ్మ విష్ణు రుద్రు లనుపేళ్లతో సత్త్వరజస్తమోగుణములు ఉపాధులు (ఆవరణములు)గాఁ గలిగి విలసిల్లుపరమాత్మ ప్రతిబింబముల వినుతించుచున్నాఁడు.—

సీ. తతశుద్ధసత్త్వప్రధానవిగ్రహుల నిమ్ముల రజస్సత్త్వతమోగుణకుల
స్వసుధర్మ శృంగార వైరాగ్యవేషుల విశ్వోద్భవస్థితివిలయకరులఁ
దప్తకాంచనరసీధర చంద్రవర్ణుల శుభకమండలుచక్రశూలధరుల
ఘనసత్య వైకుంఠ కైలాసవాసుల వరహంసఖగవృషవాహనులను

తే. షడ్గుణైశ్వర్యయుతుల భాషావధూప్ర
సన్నమంగళదేవతాసర్వమంగ
ళాధిపతుల సాక్షాత్పరమాత్మమయుల
బ్రహ్మవిష్ణుమహేశుల బ్రస్తుతింతు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. తత...విగ్రహులర్ - తత = వ్యాపించిన, లేక, ప్రసిద్ధ మైన, శుద్ధసత్త్వ ప్రధాన = శుద్ధసత్త్వరూప యగుమాయయే, లేక, త్రిగుణములకును లయము నొందు స్థానమైనచిత్ప్రకృతియే, విగ్రహులర్=శరీరములుగాఁ గలిగినట్టియు (మాయామయము లగుశరీరములు గలవారు, లేక, సర్వమునకు నధిష్ఠాన మైనప్రకృతితో నభిన్ను లై యుండువారు అని భావము.) రజస్సత్త్వతమోగుణకులర్=రజోగుణము సత్త్వగుణము తమోగుణము (ఈగుణములకు కార్యము లగుఘోరవృత్తి, శాంతవృత్తి, మూఢవృత్తి) కలిగినట్టియుం (ఆవృత్తులవలన క్రమముగా సృష్టిస్థితిసంహారములు జరుగు నని భావము), స్వ...వేషులర్-స్వ = స్వకీయ మైన, సుధర్మ = శ్రేష్ఠ మగుధర్మము (వర్ణధర్మములు, ఆశ్రమధర్మములు మొదలగునవి.) శృంగార = వస్త్రభూషణాద్యలంకారములు, లేక శృంగారరసము, వైరాగ్య = విరక్తి, ఇవియే, వేషులర్ = వేషములుగాఁ గలిగినట్టియుం (బ్రహ్మ ధర్మపరుఁడనియుం, విష్ణువు శృంగారపరుఁడనియుం, ఈశ్వరుఁడు వైరాగ్యపరుఁడనియు భావము.), విశ్వ...కరులర్-విశ్వ = ప్రపంచముయొక్క, ఉద్భవ = సృష్టిని, స్థితి=రక్షణమును, విలయకరులర్=ప్రళయమును ఆచరించునట్టియు, తప్త...వర్ణులర్-తప్త=పుటము వేయఁబడిన, కాంచన=సువర్ణముయొక్కయు (కాంతియొక్క యాధిక్యమును జెప్పుటకై ఇచ్చట "తప్త" అనువిశేషణము వేయఁబడినది.), నీరధర=మేఘము యొక్కయు (నీటితోఁగూడియున్న మేఘము మిగులఁ గాంతి గలదై యుండును గావున నిట "నీర" పదము ప్రయోగింపఁబడినది.), చంద్ర = చంద్రునియొక్కయు, వర్ణులర్=వర్ణమువంటి వర్ణముగలిగినట్టియు (ఇవి క్రమముగా రజస్తమస్సత్త్వగుణముల వర్ణములు కావున త్రిమూర్తులకును ఇవి బాహ్యోపాధులని తెలిసికొనవలయును. బ్రహ్మకు లోపలను వెలుపలను గూడ రజోగుణమే; విష్ణువునకు లోపల సత్త్వము, వెలుపల తమస్సు; రుద్రునకు లోపలఁ దమస్సు, వెలుపల సత్త్వము ఆవరణము లని యెఱుంగునది.), శుభకమండలు చక్ర శూలధరులర్ = శుభకరము లగు కమండలువు చక్రము శూలము ధరించినట్టియు, ఘనసత్యవైకుంఠ కైలాసవాసులర్ = శ్రేష్ఠములగు సత్యలోక వైకుంఠ కైలాసములయందు నివసించువారును, వరహంసఖగవృషవాహనులను = శ్రేష్ఠములగు హంస గరుడ నందికేశ్వరులు వాహనములుగాఁ గలిగి నట్టియు, షడ్గుణైశ్వర్యయుతులర్ = షడ్గుణములసమృద్ధి గలిగినట్టియు (అధికమగుప్రభావము, ధైర్యము, కీర్తి, సంపద, జ్ఞానము, వైరాగ్యము, అనునివి షడ్గుణములు), భాషా...పతులర్ - భాషావధూ=సరస్వతీదేవికిని, ప్రసన్నమంగళదేవతా=ప్రసన్నురాలగు, లేక, దయయే స్వభావముగాఁగల లక్ష్మీదేవికిని, సర్వమంగళా = పార్వతీదేవికిని, అధిపతులర్ = ప్రభువు లయినట్టియు (గుణత్రయశక్తులను స్వాధీనముగాఁ జేసికొనియుండువా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రనుట.), సాక్షాత్...మయుల౯ - సాక్షాత్ = ప్రత్యక్షమైన, పరమాత్మమయుల౯ = నిర్వికారపరబ్రహ్మమే స్వరూపముగాఁ గలిగినట్టియు ('పరమాత్మవిభాగస్థాః' అను శాస్త్రమును అనుసరించి యీ బ్రహ్మ విష్ణు మహేశ్వరులు పరమాత్మరూపులే, సృష్ట్యాదియందు గుణములు మూఁడును విజృంభింప నారంభించినపుడు వానిలోఁ ప్రతిబింబించి సర్వవ్యాపకమగు నాపరబ్రహ్మము మూఁడువిధములుగాఁ జెప్పఁబడు చున్నది. అని తెలిసికొనవలయును.), బ్రహ్మవిష్ణుమహేశుల౯, ఇమ్ముల౯=అధికముగా, ప్రస్తుతింతు౯ = స్తోత్రముచేయుచున్నాను.

తా. సత్త్వరజస్తమోగుణములు లయము నొందుటకు (ఉత్పత్తిస్థితిలయములం జెందుటకు అని కూడ గ్రహింపవలయును. వస్తువైనను తా నుత్పత్తిఁ జెందిన స్థలము నందె, అనఁగా ఉపాదానకారణమునందె, లయమునొందును గదా!), స్థానమగు చిత్ప్రకృతియే, లేక, మాయయే, దేహములుగాఁ గలిగి రజస్సత్త్వతమోగుణవృత్తుల నాశ్రయించుచు వర్ణాశ్రమధర్మములు, శృంగారము, వైరాగ్యము అనునవియే వేష ములుగాఁ గలిగి నామరూపాత్మక మగుసకలప్రపంచమును (ఈ ప్రపంచమునందు పేర్లును రూపములును దప్పఁ బరబ్రహ్మమునకంటె నన్యమగుపదార్థ మేదియును లేదు.) బుట్టించుచు రక్షించుచు సంహరించుచు, ఎఱుపు నలుపు తెలుపు అనుశరీరచ్ఛాయ గలిగి, కమండలు చక్ర శూలముల ధరించుచు, సత్యలోక వైకుంఠ కైలాసములయందు విలసిల్లువారును, హంసగరుడవృషభవాహనులును, ప్రభావము ధైర్యము మొదలగు షడ్గుణములచే నొప్పువారును, సరస్వతీ లక్ష్మీ పార్వతీనాయకులును, బరబ్రహ్మరూపు లును అగుబ్రహ్మవిష్ణుమహేశ్వరుల వినుతించెదను.

అవ. ఇట్లు బ్రహ్మవిష్ణుమహేశ్వరుల నుతించి, వారలయధీనతలోనుండి వారికి సృష్ట్యాదికార్యములు చేయఁగల సామర్థ్యముల నిచ్చు త్రిగుణశక్తులఁ బ్రార్థించు చున్నాఁడు.—

శా. బ్రహ్మాండంబు సృజింపఁ బెంప సమయింపం జాలుసామర్థ్యముల్
బ్రహ్మోపేంద్రనగేంద్రచాపులకు సంపాదించుచు న్వారిక౯
బ్రహ్మాత్మైక్యవివేక మిచ్చుచును సంభావించుచుం బ్రోచునా
బ్రాహ్మీమంగళదేవతాగిరిజలం బ్రార్థింతు నశ్రాంతమున్. 4

టీ. బ్రహ్మాండంబు౯ = ప్రపంచమును, సృజింప౯ = సృష్టిఁజేయుటకును, పెంప౯ = వృద్ధిఁ జెందించుటకును, సమయింప౯ = నశింపఁజేయుటకును, చాలు...ముల్ - చాలు = తగిన, సామర్థ్యముల్ = శక్తులను, బ్రహ్మ...చాపులకు౯ - బ్రహ్మ=చతుర్ముఖున కును, ఉపేంద్ర = విష్ణువునకును, నగేంద్రచాపులకు౯ =శివునకును (త్రిపురసంహార

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మున రుద్రుఁడు మేరుపర్వతమును ధనుస్సుగా ధరించె నని పురాణగాథ కలదు. దానింబట్టి, నగేంద్రచాపుఁడు=పర్వతము ధనుస్సు గాఁగలవాఁడు, అనుపదము ప్రయోగింపఁబడెను.), సంపాదించుచున్ = కలుగఁజేయుచు (ఈత్రిమూర్తులు నిర్వికారులే కావున వీరలకు సృష్ట్యాది కార్యములు చేయుసామర్థ్యము స్వయముగా లేదు. వీరి సాన్నిధ్యమువలన త్రిగుణశక్తులే యీకార్యములను జేయును. అవి శక్తియుక్తులగు నీ త్రిమూర్తులయం దారోపింపఁబడును. అని తెలిసికొనవలయును.), వారికిన్=అత్రిమూర్తులకు, బ్రహ్మాత్మైక్యవివేకమున్ = నిర్గుణపరబ్రహ్మజ్ఞానమును (తామును ఒక్కటియే అనుజ్ఞానమును), ఇచ్చుచును సంభావించుచున్ = ఇచ్చి గౌరవించుచు (అవిద్య జీవులకు స్వాధీనముకాక వారిని లోఁబఱుచుకొని వారికి బంధములు గలిగించును. ఈగుణశక్తులట్లుగాక బ్రహ్మవిష్ణుమహేశ్వరులకు లోఁబడి వారలకు బంధమును గలిగింపకున్నవి యనియు, అట్లగుటచే వారలకు బ్రహ్మాత్మైక్యజ్ఞానము దృఢముగా నున్నదనియు భావము.), ప్రోచునాబ్రాహ్మీమంగళదేవతాగిరిజలన్ = రక్షించునట్టియా సరస్వతీలక్ష్మీపార్వతులను (ఇచ్చట రక్షించుటకు ననఁగా బంధము గలుగఁజేయకుండుటయే యని తెలిసికొనవలయును.) అశ్రాంతమున్=ఎల్లప్పుడును, ప్రార్థింతున్.

తా. చతుర్ముఖునకు సృష్టిఁజేయుటయందును, విష్ణువునకు రక్షించుటయందును, రుద్రునకు సంహరించుటయందును సామర్థ్యమును గలుగఁజేయుచు, తమవికారములచే బంధమును గలిగింపక వారికి "అహం బ్రహ్మాస్మి"="నేనే బ్రహ్మమును" అనుజ్ఞానమును దృఢముచేయుచు నుండు త్రిగుణశక్తులగు వాణీలక్ష్మీపార్వతుల ధ్యానించెదను.

అవ. గణేశుని బరబ్రహ్మరూపునిగా స్తోత్రముఁ జేయుచున్నాఁడు:—

క. పరవిశ్వోద్గతి హేతువు
పరముఁడు పురుషుండు ప్రకృతి బ్రహ్మముపరమే
శ్వరుఁ డంచుఁ దజ్జ్ఞు లెవ్వనిఁ
బరికింపుదు రగ్గణాధిపతి నర్చింతున్. 5

టీ. ఎవ్వనిన్ = ఏమహాత్ముని, పరవిశ్వోద్గతిహేతువు = ప్రపంచోత్పత్తికిఁగారణభూతుఁడు (ఉత్పత్తిస్థితిలయములకుఁ గారణమనుట.), పరముఁడు = ప్రకృతికిని పురుషునకును అధికుఁడగువాఁడు, పురుషుఁడు=జీవస్వరూపుఁడు, ప్రకృతి = ఉపాదానకారణభూతుఁడు ("పరవిశ్వోద్గతి" అనుటచే నిమిత్తకారణభూతుఁ డనుటనుగూర్చి చెప్పఁబడెనని తెలియునది. లేక, మాయారూపుఁడును; పరబ్రహ్మమునకును, మాయకును భేదములేదు గావున నిట్లు చెప్పఁబడెను.), బ్రహ్మము=చతుర్ముఖుఁడు, పరమేశ్వరుఁడు = రుద్రుఁడు, అంచున్=అని, తజ్జ్ఞులు=తత్త్వవేత్తలు, పరికింపుదురు=విచారింతురో, లేక, ధ్యానిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తురో (చిత్తశుద్ధికొఱకై యేయేరూపములతో ధ్యానింతురో యనుట.), గణాధిపతిన్=ఆవిఘ్నేశ్వరుని, అర్చింతున్=పూజించెదను.

తా. ఈప్రపంచమునకు నిమిత్తకారణముగాను, ఉపాదానకారణముగాను ఉన్న ప్రకృతిపురుషాతీతమగు పరబ్రహ్మమనియు, జీవరూపుఁడనియు, బ్రహ్మరుద్రాదిస్వరూపములతో నున్నాఁడనియు తత్త్వజ్ఞానము గలవారిచే సర్వకాలములయందును ధ్యానింపఁబడుచున్న (లేక, అధికారభేదములచే ననేకవిధములుగా సేవింపఁబడుచున్న) యాగణేశ్వరుని బూజించుచున్నాను.

అవ. ఇట్లు దేవతల ప్రార్థించి, దేవతల నుపాసించునట్లు తత్త్వవేత్తనుగూడ నుపాసించుట చిత్తశుద్ధికరమని ధ్యానించుచున్నాఁడు:—

మ. తనరం గాయము చేత రామచరణద్వంద్వైకదాస్యంబు హె
చ్చినభక్తిం దగువాక్కుచే ననిశముం శ్రీరామనామప్రకీ
ర్తనముం జిత్తము చేత రామపరతత్త్వధ్యానముం జేయు శ్రీ
హనుమంతున్ సముపాశ్రయింతు మదభీష్టార్థంబు సిద్ధింపఁగన్. 6

టీ. తనరన్=ఒప్పునట్లుగా, కాయము చేతన్=శరీరముచే, రామ...దాస్యంబున్-రామ = శ్రీరామునియొక్క, చరణద్వంద్వ = పాదయుగ్మముయొక్క, దాస్యంబున్= సేవను, తగువాక్కుచేన్ = యుక్తమైన (వేదాధ్యయనము, సత్యభాషణము మొదలగు వాఙ్మయతపస్సుతో కూడిన దగుటచే నిర్మలమైన) వాక్కుచేత, అనిశమున్=ఎల్లప్పుడును, శ్రీరామ...కీర్తనమున్-శ్రీరామ=శ్రీరామునియొక్క, నామ = నామధేయముయొక్క, ప్రకీర్తనమున్ = జపమును, చిత్తముచేన్ = మనస్సుచేత, తదీయ...ధ్యానమున్-తదీయ = ఆశ్రీరామునిసంబంధమైన, పరతత్త్వ = యథార్థస్వరూపముయొక్క (బ్రహ్మస్వరూపముయొక్క), ధ్యానమున్=ధ్యానించుటను, హెచ్చినభక్తితో, చేయునాహనుమంతున్, మదభీష్టార్థంబు-మత్=నాచేత, అభీష్ట=కోరఁబడిన, అర్థంబు= విషయము, సిద్ధింపఁగన్ = సిద్ధించునట్లుగా (ఈగ్రంథము నిర్విఘ్నముగాఁ బరిసమాప్తియగుటకై యనుట.) సముపాశ్రయింతున్=ఆశ్రయించెదను.

తా. మిగుల భక్తిగలవాఁడై తనశరీరముచే శ్రీరామపాదసేవయు వాక్కుచే దన్నామస్మరణంబును మనస్సుచేఁ బరమార్థస్వరూపధ్యానంబును గావించుచుఁ ద్రికరణశుద్ధిగా నాశ్రీరాముని సేవించుచున్న యాహనుమంతుని భక్తాగ్రేసరుని నాశ్రయించెదను. అవ్విభుఁడు నాకభిమతార్థముల సమకూర్చును గాక !

అవ. "యస్య దేవే పరా భక్తిః యథా దేవే తథా గురౌ"="ఎవనికి దేవునియందు అధికముగ భక్తియుండునో గురువునందుఁ గూడ నట్లే యుండునో వానికిని" అనున్యాయము ననుసరించి కవి గురువుల వినుతించుచున్నాఁడు:—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. ఆరయ మద్బాల్యంబున,గారవమునఁ జిత్తశుద్ధికరముగ నాకుం [న్.
దారకయోగముఁ దెలిపిన,నారాయణగురువులనుమనంబునఁగొలుతు

టీ. ఆరయన్ = విచారింపఁగా (లేక, పరతత్త్వస్వరూపమును విచారించుటకు, విచారించుశక్తిగలుగుటకు), మద్బాల్యంబునన్-మత్ = నాయొక్క, బాల్యంబునన్ = బాల్యమునందు ('చెప్పిన విషయములను గ్రహించి వానిని మనస్సునందు నిలుపుకొనఁ గలవాఁడు బాలుఁడు' అనువాక్యము ననుసరించి యిచ్చట బాల్యశబ్దమునకు అర్థము చెప్పవలయును. లేకున్న బాలుఁడు వేదాంతశాస్త్రోపదేశమునకుఁ దగియుండఁడుగదా!,) గారవమునన్ = ప్రేమతో, చిత్తశుద్ధికరముగన్ = మనసును బరిశుద్ధము చేయునట్లుగా, నాకున్, తారకయోగమున్ = అక్షిపురుషునుపాసించువిధమును (యోగస్వరూపము ఈ ప్రథమాశ్వాసమునందు వివరింపఁబడును.) తెల్పిన నారాయణగురువులను = ఉపదేశించిననారాయణుఁ డనుగురువును, మనంబునన్ = మనస్సునందు, తలఁతున్ = స్మరించెదను.

తా. నేను బ్రహ్మవిద్యార్థి నై యున్నకాలమున నన్నుఁగ్రహించి మనసును బరిశుద్ధము చేయఁజాలుతారకయోగము నుపదేశించి పరమార్థతత్త్వమును దెలిసికొనుట యందు శక్తిని గలిగించిన నారాయణగురువును మదిలోఁ దలంచెదను.

అవ. మఱియొకగురువునకు వందన మాచరించుచున్నాఁడు.—

సీ. ఘనపాపమును మాపఁ దనుతాపమును బాపఁ
దనరూపమును జూపఁ దనరువాని
దనుకాయమును ద్రోయఁ బెనుమాయ నొగి మాయ
ముగఁ జేయ గుఱి డాయఁ దగినవాని
మును కారణశరీరమును జీఱ నవికార
వరకారణముఁ జేరఁ బరఁగువానిఁ
దనయందు జగమందుఁ దాఁ బొందుగా నొందు
చెలు వొందువిందుగాఁ దెలియువాని
తే. నిగమనిగదితసుగుణము లగణితముగ
మిగుల నిగుడఁగ సగుణుఁడై యగుణుఁ డగుచుఁ
బగలు రే యన కొకరీతి నెగడువాని
శ్రీమహాదేవగురుని భజింతు నెపుడు. 8

టీ. ఘనపాపమునన్ = అధికమైనపాపమును (బ్రహ్మజ్ఞానమునకుఁ బ్రతిబంధకములై యుండు వానిని), మాపన్ = పోఁగొట్టుటకును, తనుతాపమునన్ = శరీరమునందలి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంతాపములను (అధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము అనుతాపత్రయమును; వాతపైత్త్యాదులవలనఁ దనకుఁ గలుగువ్యాధులు అధ్యాత్మికతాపము, ఇతరజంతువులవలనఁ గలుగుబాధ యాధిభౌతికతాపము; ఎండ వాన గాలి మొదలగువానివలనఁ గలుగు తాపము అధిదైవికతాపము అని యెఱుఁగునది.), మాపక౯ = నశింపఁజేయుటకును, తన రూపమును=తనయథార్థస్వరూపమును (బ్రహ్మస్వరూపమును), చూపక౯=కనఁబఱుచుట కును (అపరోక్షబ్రహ్మసాక్షాత్కారమును గలిగించుటకు), తనరువాని౯=శక్తిగలవానిని, తనుకాయమును౯=సూక్ష్మశరీరమును, త్రోయక౯ = నశింపఁజేయుటకుఁగా (హృదయ గ్రంథిని ఛేదించుటకు, అనఁగా: తనకంటె బ్రహ్మము వేఱను భ్రాంతిని తొలఁగించుకొను టకు), వెనుమాయక౯=గొప్పదియగునట్టి (సకలలోకములను దనకు వశములను గావించు కొని త్రిప్పునట్టి సామర్థ్యము గల) మాయను, ఒగి౯=సంపూర్ణముగ, మాయముగ౯= కనుపడనిదానినిగా, చేయక౯=చేయుటకును, గుఱిడాయఁదగినవాని౯=లక్ష్యముగా నాశ్ర యింప నర్హుం డైనవానిని (ఈయన నాశ్రయించిన హృదయగ్రంథియు, అవిద్యయు నశించుట కేసంశయమును లేదనుట.), మును=మొట్టమొదట, కారణశరీరమును=అవిద్యా స్వరూపమైన కారణశరీరమును, జీఱ౯=నశింపఁజేయఁగాను, అవికారవరకారణము౯= నిర్వికార మగు నుత్తమమైన పరబ్రహ్మమును, చేరక౯=పొందుటకును, పరఁగువాని౯= తగినవాని (లేక, సమర్థుఁడగువానిని), పరబ్రహ్మమును అపరోక్షానుభవపూర్వకముగఁ దెలిసి కొనినవానిని, తనయందు౯=తనలో, జగము=ప్రపంచము (కలదు), అందు=ఆప్రపం చమునందు, తాక౯=తాను, పొందుగా నొందుచెలువు౯=బాగుగా చెందునట్టిసమృద్ధిని (తా నాప్రపంచమునం దుండుటను), ఒందువిందుగా౯ = ఒందుచున్నసంతోషముతో, తెలియువాని౯=తెలిసికొనువానిని (తనయందు ప్రపంచ మున్నదనియు, తా నాప్ర పంచమం దున్నాఁడనియు బాగుగఁ దెలిసికొనియున్నవానిని), నిగమ...ములు-నిగమ= వేదములందు, నిగదిత=చెప్పఁబడిన, సుగుణములు, అగణితముగ౯=లెక్కకుమిక్కిలియై, మిగుల౯=అధికముగ, నిగుడఁగ౯ = నిలచియుండుటచేత, సగుణుఁడై = గుణవంతుఁడై, అగుణుఁడు = నిర్గుణుఁడు, అగుచు౯ (పరబ్రహ్మరూపముతో వర్ణింపఁబడుచుండుటచే నిట్లు చెప్పఁబడినది.), పగలు రే యనక౯ = పగలు రాత్రి అని భేదములేక (కాలపరి చ్ఛేదమనఁగా ఈకాలమునఁ గలఁడు, మఱియొక కాలమున లేఁడు అనుభేదము లేక), ఏకరీతి౯ = ఒకటేవిధముగా, నెగడువాని౯ = విహరించువానిని, శ్రీమహాదేవ గురుని౯ = శోభాయుక్తుఁడగు మహాదేవుఁ డనుగురువర్యుని, ఎప్పుడు౯, భజింతు౯ = సేవించెదను.

తా. బ్రహ్మజ్ఞానమునకు విఘ్నములై యుండు నానావిధము లగుపాపములను నశింపఁ జేయుచు ఆధ్యాత్మికాదితాపములను బోఁగొట్టి తనసత్యస్వరూపమును బ్రత్యక్షముగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చూపఁగలసామర్థ్యము గలవాఁడును, సూక్ష్మశరీరమును ధ్వంసముచేసి అవిద్యను తొలఁగించి కృతార్థులుగాఁ దలంచువారలకు శరణ్యుఁడును, కారణశరీరమును ధ్వంసము కావించి నిర్వికారపరబ్రహ్మముతో నైక్యముఁ జెంది యుండువాఁడును, "మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితం, మయి సర్వం లయం యాతి తద్బ్రహ్మాద్వయ మస్మ్యహమ్" "ప్రపంచము నాయందే జనించినది. నాయందే నిలచియున్నది. నాయందే లయమగును. సర్వకారణభూతుఁడగు పరబ్రహ్మము నేనే" అనువిషయమును జక్కఁగ నెఱింగి యున్నవాఁడును, నిర్గుణస్వరూపుఁ డయ్యును శాస్త్రోక్తములగు సకల సద్గుణములును గలవాఁ డగుటచే సగుణుఁడై కూడనుండువాఁడును, కాలపరిచ్ఛేదము లేక నొకరీతిగ నుండువాఁడునగు నామహాదేవగురువును సేవించెదను. (ఈకవికి నారాయణుఁడు అనియు మహాదేవుఁడనియు నిరువురుగురువులు. అందు నారాయణుఁడు పద్యమున వర్ణింపఁబడి యున్నాఁడు. ఈపద్యమున మహాదేవగురువు విజ్ఞానవంతుఁడుగఁ గొన్నిచోట్లను కేవల పరబ్రహ్మరూపుఁడుగ మఱికొన్నిచోట్లను వర్ణింపఁబడి యున్నాఁడని తెలిసికొనవలయును.)

## సంస్కృతకవిస్తోత్రము.

అవ. ఈక్రింద నాలుగుపద్యములచేఁ గవిప్రశంస చేయుచున్నాఁడు.—(ఇది యాంధ్రకవులయాచారము).

శా. లోకాలోకపరీతభూచరమహాలోకోపకారంబుగాఁ
 శ్రీకల్యాణకరోరుకావ్యచయముల్ సిద్ధంబుఁ గావించి సు
 శ్లోకుల్ పుణ్యమతుల్ జగద్గురువులై శోభిల్లుచున్నట్టి వా
 ల్మీకివ్యాసమయూరబాణకవికాళీదాసులం గొల్చెదన్. 9

టీ. లోకా...ఉపకారంబుగాన్ - లోకాలోక = చక్రవాళపర్వతమువఱకు (ఇది 'సప్తసముద్రములకు అవల నున్నపర్వతపంక్తి' అని పౌరాణికులు చెప్పుదురు. ఈ లోకాలోకపర్వతముల కావల భూమి లేదు.) పరీత=వ్యాపించిన, భూ=భూమియందు, చర=సంచరించుచున్న, మహత్=అధిక మైన (లెక్కకు మిక్కిలి యగు), లోక = జనులకు, ఉపకారంబుగాన్ = ఉపకార మగునట్లుగా, శ్రీ...చయముల్ - శ్రీ = శోభాయుక్తము లైనవియు (ప్రసిద్ధిఁజెందిన), కల్యాణకర = శుభమును కలిగించునవియు (జ్ఞానము నొసంగునవి యనుట.) ఉరు = విశాలములయినవియునగు, కావ్య=రామాయణము మొదలగుకావ్యములయొక్క, చయముల్=సమూహములను, సిద్ధంబుఁగావించి = నిర్మించి, సుశ్లోకుల్=చక్కనికీర్తి గలవారును ('పద్యే యశసి చ శ్లోకః' శ్లోకమనఁగాఁ బద్యము, కీర్తి' అని అమరము.) పుణ్యమతుల్ = నిర్మలమైన హృదయములు గల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వారును, జగద్గురువులు = త్రిభువనములకును గురువులును, ఐ=అగుచు, శోభిల్లుచున్నట్టి, వాల్మీకి వ్యాస మయూర బాణకవి కాళిదాసులన్ = వాల్మీకి వ్యాసుఁడు మయూరుఁడు బాణుఁడు కాళిదాసుఁడు మొదలగుసంస్కృతకవులను, కొల్చెదన్ = సేవించెదను (కొనియాడెద ననుట.)

తా. సకలజనులకును పరిపూర్ణజ్ఞానము నొసంగుచుఁ బరలోకసౌఖ్యములను గూడఁ గలిగించుచు మిగులఁ బ్రసిద్ధిఁ జెందియున్న విశాలము లగుకావ్యముల నిర్మించి సప్తసముద్రముద్రిత మగునీభూమండలమునం దున్నవారల కందఱకు మహోపకారమును గావించి లోకగురువు లై పరిశుద్ధము లగుచిత్తములతో రాజిల్లుచుఁ దమకీర్తిచే లోకముల నెల్లఁ బావనముఁజేయుచున్న వాల్మీకి వ్యాస మయూర బాణ కాళిదాసాదుల నభినుతించెదను.

## సుకవివర్ణనము.

తే. మహితగురులఘువర్ణధర్మములు నియమ
ములుఁ గలితకర్తృకర్మక్రియలను దెలిసి
నామరూపావ్యయవిలక్షణంబు లాత్మ
నెఱిఁగినకవీశ్వరుండె కవీశ్వరుండు. 10

టీ. మహిత...ములు-మహిత=ఒప్పుచున్న (లేక, గౌరవార్హములైన), గురు = గురువులును, లఘు=లఘువులైనట్టియుఁ, వర్ణ =అక్షరములయొక్క ("దీర్ఘస్సంయుక్తాద్యః పూర్ణానుస్వారపూర్వవర్ణశ్చ" దీర్ఘమును, విసర్గలున్నయక్షరమును, సంయుక్తాక్షరమునకును బూర్ణానుస్వారమునకును ముందున్నయక్షరమును గురువు లనఁబడును. మిగిలినవి లఘువులు.) ధర్మములు=స్థితులును, నియమములు=యతిప్రాసనియమములును, కలిత... క్రియలను-కలిత=ఒప్పుచున్న, కర్తృ=కర్తలను, కర్మ=కర్మలను, క్రియలను = ధాతువులను, తెలిసి=తెలిసికొని, నామ...లక్షణంబులు - నామ = ప్రాతిపదికములయొక్కయు (ప్రాతిపదిక మనఁగా విభక్తిప్రత్యయములుగాని, వానికి సంబంధించిన వికారములుగాని కలుగక ముందున్నశబ్దరూపము; రామ, కృష్ణ మొ.) రూప=విభక్తిరూపములయొక్కయు, అవ్యయ = అవ్యయములయొక్కయు, విలక్షణములన్ =చక్కనిలక్షణములను (అనఁగా: స్వరూపములను), ఆత్మన్ = తనలో, ఎఱిఁగిన కవీశ్వరుండె = తెలిసికొనిన కవీశ్వరుఁడె, కవీశ్వరుండు=కవి యనుటకుఁ దగినవాఁడు.

ఈపద్యమునందు బ్రహ్మవేత్తృపరముగ మఱియొకయర్థము కూడ స్ఫురించుచున్నది:—

టీ. గురు...ధర్మములు-గురు = ఉత్తమములును, లఘు = అధమములైన, వర్ణ = జాతులయొక్క, ధర్మములు = ఆచారనియమములను, నియమములు = యోగాంగము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లగుశౌచము, తపస్సు మొదలగువానిని (నియమము లనుటచే యోగము సమగ్రముగ అని అర్థము. కేవలము నియమములనిమాత్రమె తెలిసికొనినందున నంతప్రయోజ నము లేదుగదా.) కలిత కర్తృ కర్మ క్రియలను - కలిత = ఒప్పుచున్నట్టి (అనఁగా: ప్రసిద్ధము లైన), కర్తృ=చేయువాఁడు, కర్మ=చేయఁబడునది, క్రియ = చేయుట అను వానిని (వీనియథార్థస్వరూపము ననుట. ఇచ్చట 'క్రియ' అనఁగా ఫల మని కొందఱు. అది విచారింపవలసియున్నది.), తెలిసి, నామరూపా...ముల - నామరూప = నామ రూపములయొక్కయు (అనఁగా: నామరూపాత్మక మగు నీప్రపంచముయొక్కయు), అవ్యయ = ఈ నామరూపములవలన వికారముఁజెందని పరబ్రహ్మముయొక్కయు, విలక్షణములన్ = చక్కనిలక్షణములను, ఆత్మన్ = తనలో, ఎఱిఁగిన కవీ శ్వరుండు = తెలిసిన పండితోత్తముఁడె (ప్రపంచము మిథ్య యగుటచేత అది సర్వ కాలములయందును గనఁబడుచునే యుండును గావునను, పరబ్రహ్మము తనకంటె వేఱైనవాఁడు గావున నచ్చటఁ జేయవలసినకార్య మేదియును లేకపోవుటచేతను, ఈప్రపంచబ్రహ్మములలక్షణములఁ జక్కఁగ నెఱుఁగుటయె పురుషార్థమని భావము.), కవీశ్వరుండు=పండితశ్రేష్ఠుఁడు (బ్రహ్మజ్ఞాని యనఁదగినవాఁ డనుట).

తా. గురువులు, లఘువులు, యతిప్రాసములు, కర్తృ కర్మ క్రియలు, ప్రాతి పదికములు, విభక్తిరూపములు, అవ్యయములు మొదలగువానిధర్మముల బాగుగనెఱింగి చక్కఁగఁ బ్రయోగింపఁ గలకవియె కవి. (బ్రహ్మవేత్తృపరమునందు) మాయాకల్పిత మగు ప్రపంచముయొక్కయు నిర్వికారుఁడగు పరమాత్మయొక్కయు లక్షణముల బాగుగనెఱింగి భ్రాంతిరహితుఁడై, చేయువాఁడు, చేయుట, చేయఁబడునది అను త్రిపుటియొక్క యథార్థతత్త్వమును (అనఁగా: ఈత్రిపుటి పరబ్రహ్మమునకంటె వేఱు కాదనువిషయమును, లేక, దీనివలనఁ గలుగుఫలము లనిత్యములు గావున ఈకర్తృత్వాదు లను బరిత్యజింపవలయు ననుటను) బాగుగ నెఱింగి చిత్తము స్థిరమగుటకై (లేక, పరమా నందానుభవ మెప్పుడు జరుగుచుండుటకై) ధ్యానయోగము నాచరించుచు "నైవ తస్య కృతే నార్థో నాకృతే నేహ కశ్చన" "జ్ఞాని కర్మను జేసినను జేయకున్నను సమానమే" అను గీతావాక్యము ననుసరించి తన కెట్లున్నను బాధ లేదు గాన లోకసంగ్రహము కొఱకై (అనఁగా: లోకులను జక్కనిమార్గమునందు నడిపించునిమిత్తముగ తనకులమున కుచిత మగు ధర్మముల బాగుగ తెలిసి యాచరించుచు నుండు బ్రహ్మజ్ఞానియె బ్రహ్మ జ్ఞాని. ఇతరులు లోకవంచకులు.

వ. అట్లు గావునన్. 11

టీ. అట్లుగావునన్ = పెప్పద్యమునందు చెప్పఁబడినవాఁడే కవీశ్వరుఁడుగావున.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ఆంధ్రకవినుతి.

ఉ. నన్నయభట్టు నాంధ్రకవినాథుని దిక్కనసోమయాజినిం
బన్నుగ సోమసత్కవిని భాస్కరబమ్మెరపోతరాజులన్
మున్ను ప్రసిద్ధి గాంచుకవిముఖ్యుల నందఱ నెమ్మనంబులో
నెన్ని నమస్కరించెద నభీష్టఫలాప్తి దనర్చునట్లుగాన్. 12

టీ. ఆంధ్రకవినాథునిన్=ఆంధ్రకవులలో నుత్తముఁడగు, నన్నయభట్టు, తిక్కనసోమయాజిని, పన్నుగన్=ఒప్పునట్లుగా, సోమసత్కవిని=చక్కనికవి యగు నాచనసోమన యనువానిని, భాస్కరబమ్మెరపోతరాజులన్=హుళక్కిభాస్కరుని (భాస్కరరామాయణకవి), బమ్మెరపోతరాజును, మున్ను = పూర్వమున, ప్రసిద్ధిగాంచు కవిముఖ్యులన్=ప్రసిద్ధిఁజెందిన కవిశ్రేష్ఠులను, అందఱన్=అందఱిని (పైఁజెప్పినవారిఁ గాక తిక్కనవారలఁ గూడ నందఱిని), నెమ్మనంబులో=మనసులో, ఎన్ని = పొగడి, అభీష్టఫలాప్తి = కోరినఫల (గ్రంథనిర్మాణసామర్థ్యము) లాభము, తనర్చునట్లుగాన్ = కలుగునట్లుగా, నమస్కరించెదన్.

తా. ఆంధ్రకవులలో ముఖ్యుఁడగు నన్నయభట్టును, తిక్కనసోమయాజిని, ఉత్తమకవి యగు నాచనసోమునిని, హుళక్కి భాస్కరుని, బమ్మెరపోతరాజును, మఱియుఁ బూర్వకాలమందుఁ బ్రసిద్ధిగాంచినకవిశేఖరుల నందఱను వినుతించి నమస్కరించెదను. వారియనుగ్రహమువలన నాకీగ్రంథరచనయందుఁ దగినసామర్థ్యము కలుగును గాక!

## కుకవినిందనము.

క. శుద్ధపదయుక్తిఁ దొఱఁగి య,బద్ధమును నిబద్ధిగా నిబద్ధినొగి మహా
బద్ధముగాఁ గనుకుకవుల,నౌద్ధత్యముమానుకొఱ కభినందింతున్.

టీ. శుద్ధపదయుక్తిన్=చక్కనిపదములను బ్రయోగించుటను, తొఱఁగి=విడిచి, అబద్ధమున్ = వ్యాకరణసంబంధము లేనియపశబ్దమును, నిబద్ధిగాన్ = పరిశుద్ధమైనదానినిగా, నిబద్ధిన్=పరిశుద్ధమైనదానిని, ఒగిన్=వరుసగా, మహాబద్ధముగాన్=మిగుల నపరిశుద్ధముగాను, కుకవులన్ = (భ్రమించు) కుకవులను (భాషాజ్ఞానము లేనికవులను), ఔద్ధత్యమున్ = గర్వమును (పరులకావ్యములను దిరస్కరించుటను), మానుకొఱకు = విడుచుటకై, అభినందింతున్=కొనియాడెదను.

తా. సుశబ్దములఁ బ్రయోగించుట మాని యపశబ్దముల సుశబ్దములఁగను, సుశబ్దముల నపశబ్దములఁగను భ్రమించుచుఁ బరు లొనరించినగ్రంథములఁ దిరస్కరించుటయే పనిగా సంచరించుచుండు కుకవులఁ గొనియాడెదను. వారు నాగ్రంథమువైపునకు రాకుండెదరు గాక!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవివేకిపరమైన యర్థము:—

టీ. శుద్ధపదయుక్తిన్=పరిశుద్ధమగు మోక్షమును జెందుటను (మోక్షమనఁగా: తనరూపమును దా దెలిసికొనుటవలన కలుగు భ్రాంతినివృత్తి కావున మోక్షము సర్వకాలములయందును తనకు సిద్ధించియే యున్నది. ఇట్లున్నను, ఆమోక్షమును జెందుటకు ప్రయత్నింపక అజ్ఞానులు చెడుచున్నారని యభిప్రాయము.), తొలఁగి, అబద్ధమున్= అసత్యమగుదానిని (ప్రపంచమును), నిబద్దిగాన్=సత్యముగాను, నిబద్ధిన్ = సత్యమును (పరబ్రహ్మమును), ఒగిన్, మహాబద్ధముగాన్ = మిగుల నసత్యమైనదానినిగాను, కను కుకవులన్ = (తమ భ్రాంతివలన) చూచుచున్న (లేక, భావింపుచున్న) దుష్పండితులను (యథార్థజ్ఞానము లేకున్నను, పండితులమని యభిమానించుకొనుచుండు నజ్ఞానులను), ఔద్ధత్యమున్=కుతర్కవిజృంభణములను, మానుకొఁ అకున్, అభినందింతున్.

తా. నిర్మలమై స్వభావసిద్ధమై యున్న మోక్షమువైపునకు పోక యసత్యమగు ప్రపంచమునే సత్యముగాను, పరబ్రహ్మము నసత్యముగాను తలంచుచు నీవిషయసుఖములే సత్యము లనియు, నింతకంటె నితరములగు సౌఖ్యములు లేవనియు భ్రాంతిఁజెంది పరమానందరూప మగు మోక్షమును గూడ ధిక్కరించుచుఁ దమ కేమియుఁ దెలియకున్నను సర్వమును దెలిసితిమని విఱ్ఱవీగుచుఁ గుతర్కముల నాచరించుచుండు నవివేకులకు నమస్కారము. వా రీదెసకు రాకుండుదురు గాక !

అవ. ఈకవి యిష్టదేవతాప్రార్థనము ముగించువాఁడై యీక్రిందిపద్యమున సకల భూతములకును నమస్కారము నాచరించుచున్నాఁడు:—

మ. గరిమన్ స్వర్ణ మనేకభూషణము లై కన్పట్టుచందంబునం
బరమాత్ముం డఖిలప్రపంచమయుఁ డై భాసిల్లు న ట్లౌటచే
సురసిద్ధోరగయక్షకిన్నరనరస్తోమాదిశశ్వచ్చరా
చరరూపోజ్జ్వలసర్వభూతములకున్ సద్భక్తితో మ్రొక్కెదన్. 14

టీ. గరిమన్ = గౌరవముచేత, స్వర్ణము = బంగారు (ఒక్కటియైనను), అనేక భూషణములు ఐ=నానావిధములగు (నామములును రూపములును గల) భూషణములుగా నేర్పడి, కన్పట్టుచందంబునన్ = కనఁబడునట్లు, పరమాత్ముండు = నిర్గుణ నిర్వికార పరబ్రహ్మము, అఖిలప్రపంచమయుఁడు ఐ=అనేకవిధములగు భేదములుగల యీప్రపంచమంతయును దానేయై, భాసిల్లున్=ప్రకాశించుచున్నాఁడు. అట్లు ఔటచేన్=కాఁబట్టి, సుర...భూతములకున్ - సుర, సిద్ధ, ఉరగ = నాగకుమారులు, యక్ష, కిన్నర, నర (వీరియొక్క), స్తోమ = సమూహములే, ఆది = మొదలుగాఁగల, శశ్వత్=పలుమాఱు తిరుగు (జన్మపరంపరల నొందు), చర=జంగమములును (సంచరింపఁగలిగినవి), అచర= స్థావరములును (కదలనేరనివి) అగు, రూప=మనుష్యులు మృగములు పక్షులు కొండలు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వృక్షములు మొదలగురూపములతో, ఉజ్జ్వల=ప్రకాశించుచున్న, సర్వ=సమస్తములైన, భూతములకున్=జంతుజాలమునకు, సద్భక్తితోన్=మిగులభక్తితో, మ్రొక్కెదన్=నమస్కరింతును.

తా. సువర్ణ మొక్కటి యయ్యును అనేకభేదములు గల భూషణములై యున్నట్లు పరబ్రహ్మ మొక్కఁడయ్యును, నానాభేదములు గల ప్రపంచమై తోఁచుచున్నాఁడు. కావున నీప్రపంచములో నెద్దియు నాబ్రహ్మమునకంటె నితరము కాదు. కాఁబట్టి దేవసిద్ధనాగయక్షకిన్నరమనుష్యసమూహములకును, మఱియు ననేకవిధములై జంగమస్థావరరూపములగు సకలభూతసంఘంబులకును నమస్కారము చేసెదను. (ఈ భూతములు బ్రహ్మరూపము లగుటచే సత్యములయ్యునుగల్పితమగు కర్మసంబంధముచే పలుమాఱు జన్మించుచు, మృతినొందుచు, ఒకదేహమును బరిత్యజించుచు, మఱియొక దేహమును గైకొనుచు తిరుగుచుండును. కావున భూతభవిష్యద్వర్తమాన కాలములయందలి సకలప్రపంచమునకును నేను మిగుల భక్తితో వందనముల నాచరించెదననుట.)

అవ. తా నీప్రబంధము నొనర్చుటకుఁ గల కారణము నీక్రింద వివరించుచున్నాఁడు.—

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును సద్గురుకీర్తనంబును సంస్కృతాంధ్ర సత్కవిస్తోత్రంబును గావించి యేను ముముక్షుజన హితంబును సంసారసాగరోత్తారకంబును దారకసాంఖ్యామనస్కాత్మకంబును జీవబ్రహ్మైక్యసాక్షాత్కారసాధారణకారణంబునైన రాజయోగం బంతయు నొక్కప్రబంధంబుగా రచియింప నిశ్చయించి పరమైకాంతంబు శ్రీగురుమంత్రదేవతాతత్త్వానుసంధానంబు సేయుచున్న సమయంబున. 15

టీ. అని = ఇట్లు, ఇష్టదేవతాప్రార్థనంబును = ఇష్టదేవతలను వేఁడుటయును, సద్గురుకీర్తనంబును = సద్గురువులనుతించుటయు, సంస్కృతాంధ్ర సత్కవిస్తోత్రంబును = సంస్కృతకవుల నాంధ్రకవుల నుతించుటయును, కావించి=చేసి, ఏను=నేను, ముముక్షు...హితంబును - ముముక్షు = మోక్షమునుగోరు, జన = మనుష్యులకు, హితంబును = మేలు సేయునదియును, సంసార...బును-సంసార = సంసారమనియెడు, సాగర = సముద్రమునుండి, ఉత్తారకంబును = తరింపఁజేయునదియు, తారక...కంబును-తారక = తారకయోగము, సాంఖ్య=సాంఖ్యయోగము, అమనస్క=అమనస్కయోగము, ఆత్మకంబును=స్వరూపముగాఁ గలదియును, జీవ...కారణంబును-జీవ=జీవునకును, బ్రహ్మ=పరబ్రహ్మమునకునుగల, ఐక్య = అభేదమును, సాక్షాత్కార = ప్రత్యక్షముగాఁ దెలిసికొనుటయందు, సాధారణ = సుఖమైన, కారణంబును = సాధనంబును, ఐన, రాజ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యోగంబుఁన్ అంతయుఁన్ = రాజయోగమును సంపూర్ణముగా, ఒక్క-ప్రబంధంబుగాఁ= ఒక్క-కావ్యముగా, రచియింపఁన్ =చేయుటకు, నిశ్చయించి, పరమై...బునన్ -పరమ= శ్రేష్ఠమైన, ఏకాంతంబునన్ = విజనస్థలమునందు, శ్రీ...అనుసంధానంబుఁన్ -శ్రీ = శోభాయుక్తుఁడైన, గురు = గురువగుమహాదేవాచార్యుఁడె స్వరూపముగాఁగల, మంత్ర దేవతా=తారకమంత్రాధిదేవత (యగు శ్రీరామమూర్తి) యొక్క-, తత్త్వ=పరమార్థ పరబ్రహ్మస్వరూపముయొక్క-, అనుసంధానంబుఁన్=ధ్యానమును, చేయుచుఁన్, ఉన్నసమ యంబునన్.

తా. ఇట్లు ఇష్టదేవతలఁ బ్రార్థించి సద్గురువులఁ గొనియాడి సంస్కృతాంధ్ర కవులకు నమస్కరించి సంసార మనుసముద్రమును దరింపఁజేయుటకును, జీవునకును బ్రహ్మమునకును భేదము లేదనువిషయము ప్రత్యక్షముగఁ దెలియఁజేయుటకును, సుఖమగుసాధనమై, మోక్షాపేక్ష గలవారలకు మిగుల మేలుచేయు రాజయోగమును దారకసాంఖ్యామనస్కమ లగు మూఁడుభేదములు గలదానిని సమగ్రముగాఁ గావ్యముచే వర్ణింపఁ బూని నే నేకాంతస్థలమునందుండి మహాదేవగురురూపుఁ డగు శ్రీరామునిపరమార్థరూపమును (నాకును బ్రహ్మమునకును భేదములేదు; అను విషయ మును) ధ్యానించుచుండఁగా (పైపద్యముతో నన్వయించుకొనవలయును.)

సీ. కమనీయవరదివ్యకాంచనచేలంబుఁ గాషాయవస్త్రంబుగా ధరించి
చాపబాణంబులుచంచత్క-మండలు దండముల్గాఁగహస్తములఁబూని
రమణీయరత్నహారంబురుద్రాక్షమాలిక గా గళంబున లీలఁ దాల్చి
సీతావధూటిని శ్రీరాజయోగాహ్వయాధ్యాత్మవిద్యగా నవధరించి
తే. ప్రేమ మీఱంగ శ్రీరామ రామ రామ
యనుచుఁ దనపేరు నుడువుచు నద్భుతముగ
శ్రీమహాదేవగురుఁడైనరామవిభుఁడు
గరుణతోడుత నెదుర సాక్షాత్కరించె. 16

టీ. కమనీయ...చేలంబు-కమనీయ = రమ్యమైన, వర=శ్రేష్ఠమైన, దివ్య=దేవ లోకసంబంధమైన, కాంచనచేలంబుఁన్ = సువర్ణవస్త్రమును, కాషాయవస్త్రంబుగాన్ = కాషాయవస్త్రమగునట్లుగా (కాషాయవస్త్రమువలె) ధరించి, చాపబాణంబులు = ధనుస్సుబాణంబులును, చంచత్...దండముల్ - చంచత్ = ప్రకాశించుచున్న, కమం డలు = కమండలములు, దండముల్ = దండను, ఇవి, కాఁగన్ = అగునట్లుగా, హస్తములన్ = చేతులయందు, పూని=ధరించి, రమణీయరత్నహారంబుఁన్ = మనోహర మగురత్నాలహారము, రుద్రాక్షమాలికగాన్, గళంబునన్ = కంఠమునందు, లీలన్ = విలాసముగా, తాల్చి = ధరించి సీతావధూటినిన్ = సీతాదేవిని, శ్రీ విద్యగాన్ -

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీ=ఒప్పుచున్న, రాజయోగ = రాజయోగమనియెడు, ఆఖ్య = పేరుగల, అధ్యాత్మ విద్యగాన్ = ఆత్మవిద్యగా, అవధరించి = స్వీకరించి (పార్శ్వమునందుంచుకొని), ప్రేమ మీఱంగన్ = ప్రీతి యధికమగుచుండఁగా (నన్ననుగ్రహించి), శ్రీరామరామరామ, అనుచున్, తనదు పేరున్ = తనదివ్యనామమును, నుడువుచున్ = చెప్పుచు, అద్భుత ముగన్=ఆశ్చర్యము గలుగునట్లుగా, శ్రీమహాదేవ గురుఁడు అయిన=శ్రీమహాదేవ గురు స్వరూపుఁడైన, రామవిభుఁడు=శ్రీరామమూర్తి, కరుణతోడుతన్=దయతో, ఎదురన్, సాక్షాత్కరించెన్ = ప్రత్యక్షమయ్యెను.

తా. మనోహర మగుపీతాంబరము కాషాయవస్త్రముగ, ధనుర్బాణంబులు కమండలు దండములుగ, రత్నహారంబులు రుద్రాక్షమాలికలుగ, సీతామహాదేవిరూపమును దాల్చిన వేదాంతవిద్యగా, తననామధేయము నెలిఁగించుట తారకజపముగ నా శ్రీరామ మూర్తి మహాదేవగురుస్వరూపముతో నాపైఁ గరుణ వెలయఁ బ్రత్యక్షమయ్యెను.

(ఇచ్చట శ్రీరామమూర్తికిని, మహాదేవాచార్యునకును అభేదము చెప్పఁబడి యున్నది. శ్రీరామునకుఁ గలపీతాంబరము మొదలగునవి అన్నియు మహాదేవయతీంద్రునకుఁ గలకాషాయవస్త్రము మొదలగునవిగా వర్ణింపఁబడి యున్నవి. కావున ప్రత్యక్షమైనవాఁడు రామమూర్తియే యనియు, ఆయనను గురుస్వరూపునిగా నీ కవి భావించె ననియు పాఠకులు తెలిసికొందురు గాత.)

వ. ఇట్లు శిష్యవాత్సల్యంబున సాక్షాత్కరించి మదీయదీర్ఘదండనమస్కారంబులు చతుర్విధపురుషార్థప్రద చతురక్షరసమన్విత నారాయణస్మరణపూర్వకంబుగా నంగీకరించి కలకల నవ్వుచు శరీరత్రయ విలక్షణావస్థాత్రయసాక్షి పంచకోశవ్యతిరిక్త సచ్చిదానందస్వరూప ప్రత్యగాత్ముండవైననీవ సత్యజ్ఞానానందస్వరూపపరమాత్ముండనైన నేను; సత్యజ్ఞానానందస్వరూపపరమాత్ముండ నైన నేన సచ్చిదానందస్వరూప ప్రత్యగాత్ముండవైననీ వని సర్వోపనిషత్సారభూతార్థంబైన పరమతత్త్వరహస్యార్థంబుపదేశించి యీయభేదవిజ్ఞానదృష్టి చేత నిరంతరంబు నన్నవలోకించుచు జీవన్ముక్తిసుఖం బనుభవింపుము. ప్రారబ్ధభోగావసానసమయంబున ఘటాకాశంబు మహాకాశంబునం గలసినవిధంబున నాయందు విదేహకైవల్యంబు నొందెదు సందేహంబు లేదని యాజ్ఞాపించి యిప్పుడీవు బ్రహ్మాండపురాణంబునం దధ్యాత్మరామాయణంబుమామహేశ్వర సంవాదరూపంబై యొప్పునందు శ్రీరామహృదయంబను నితిహాసంబు సీతారామాంజ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నేయ సంవాదంబునఁ బ్రవర్తిల్లు నది సంక్షేపరూపంబు గావున నయ్యర్థంబు విస్తరించి యొక్క ప్రబంధంబుగా రచియించి నాపేర నంకితంబు నేయుము సర్వపాపవినిర్ముక్తుండవై కృతార్థుండ వయ్యెద వని యానతిచ్చి తిరోహితుండయ్యె నంతట మేల్కని పరమానంద భరితాంతఃకరణుండనై. 17

టీ. ఇట్లు = ఈప్రకారముగ, శిష్యవాత్సల్యంబునన్ = శిష్యునియందలిప్రీతి చేత, (గురుజనులయందున్నప్రేమకు భక్తి అనియు, స్త్రీలయందున్నప్రీతి కనురాగ మనియు, సోదరీ సోదర పుత్రశిష్యాదులయందుఁగల ప్రీతికి వాత్సల్యమనియు పేరు.) సాక్షాత్కరించి = ప్రత్యక్షమై, మదీయదీర్ఘదండనమస్కారంబులు = నా సాష్టాంగ నమస్కారములను, చతు...గాన్ - చతుర్విధ = నాలుగువిధములైన, పురుషార్థ = ధర్మార్థకామమోక్షము లనుపురుషార్థముల (పురుషార్థము లనఁగా: పురుషునిచే నవశ్యము సాధింపఁబడవలయునవి. వీనిలో దేనినైనను సాధింపకుండిన జన్మము నిరర్థకము. అందు ధర్మమోక్షములు ప్రధానములు; అర్థకామము లప్రధానములు అనఁగా: అర్థకామముల విడిచియైనను ధర్మమోక్షముల నార్జింపవలయును. ధర్మమోక్షములకు విరుద్ధకామములు పనికిరావనుట.) ప్రద=ఇచ్చునట్టి, చతురక్షర=నాలుఁగుఅక్షరములతో, సమన్విత = కూడిన, నారాయణ = నారాయణ అనెడు పేరుయొక్క, (ఈనారాయణ పదమునందలి నాలుగు అక్షరములును, క్రమముగ నాలుగుపురుషార్థములను గలుగఁ జేయు నని భావము.) స్మరణపూర్వకంబుగాన్=స్మరించుటయే (లేక, ఉచ్చరించుటయే) మొదలగునట్లుగా ఉచ్చరించుచు, అంగీకరించి, కలకలనవ్వుచున్, శరీర...ఆత్ముఁడవు - శరీరత్రయ = స్థూలసూక్ష్మకారణము లనుమూఁడు శరీరములకును, విలక్షణ = లేనట్టియు, అవస్థాత్రయ = జాగ్రత్త స్వప్నము సుషుప్తి అనియెడు మూఁడు అవస్థలకును, సాక్షి= చూచునట్టి, పంచకోశ = అన్నమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞాన మయము, ఆనందమయము అనునైదుకోశములకంటెను, (కోశ మనఁగా: ఆవరించు నది. పరమాత్మస్వరూపము తెలియకుండునట్లు ఆవరించుచున్నవి గావున ఈ అన్నమయాదులకుఁగూడఁ గోశములని పేరు గలిగెను.) వ్యతిరిక్త = వేరైనట్టియు, సత్ = సత్తామాత్రస్వరూపుఁడైనట్టియు, (సత్త అనఁగా: ఉనికి. ఇదియే పరబ్రహ్మమునకును జీవునకును స్వరూపము. చిత్ = చైతన్యము, ఆనంద = ఆనందము, స్వరూప=స్వరూపము గాఁగల, ప్రత్యగాత్ముండవు అయిన = జీవుఁడవైన, (సర్వదేశములయందును, సర్వకాలములయందును, సర్వవస్తువులయందును ఉండుట అనునొక స్వరూపముతో నిలిచి యుండుట.) చైతన్యము =(జ్ఞానము) ఆనందము (ఇదియె జీవునియాకారము.), నీవ =

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీవే, సత్యజ్ఞానానందస్వరూప పరమాత్ముఁడను = సచ్చిదానంద స్వరూపముగాఁగల పర బ్రహ్మస్వరూపుఁడను, అయిన, నేన = నేనే, సచ్చిదానందస్వరూప ప్రత్యగాత్ముండవు, అయిన, నీవు, అని, సర్వ...అర్థంబు-సర్వ=సారాంశమగు, ఉపనిషత్సారభూత=ఉప నిషత్తులయొక్క పరమాభిప్రాయము, అర్థంబు అయిన = విషయమైన, పరమతత్త్వరహ స్యార్థంబుఁ=పరతత్త్వమనియెడు రహస్యవిషయమును, ఉపదేశించి, ఈ...దృష్టిచేఁ-ఈ=పైనవివరింపఁబడిన, అభేదవిజ్ఞానదృష్టిచేఁ=జీవబ్రహ్మైక్యము నెఱుంగుట యనెడు దృష్టిచేత, నిరంతరంబుఁ = సర్వకాలములయందును, నన్నుఁ = పరబ్రహ్మస్వరూపుఁ డగు నన్ను, అవలోకించుచుఁ=చూచుచు (నేను పరబ్రహ్మమును ఒక్కటియే యని నిదిధ్యాసనము చేయుచు), జీవన్ముక్తిసుఖంబుఁ=బ్రతికియుండియె మోక్షమును జెందుట (భ్రాంతినివిడుచుట) వలనఁ గలుగునానందమును, ('నేను మనుష్యుఁడను బ్రాహ్మణుండను' అను మొదలగు నభిమానము లున్నంతకాలము బహువిధము లగుదుఃఖములు కలుగును. 'నాకీప్రపంచమునందలి వికారము లంటవు. నాకును పరబ్రహ్మమునకును భేదములేదు' అనుజ్ఞానము దృఢముగఁ గలిగినేని యీ దుఃఖములు వానిని బాధింపవు. ఇదియే జీవన్ముక్తి) అనుభవింపుము, ప్రా...సమయంబున-ప్రారబ్ధ=ప్రస్తుతశరీరమునందు సుఖదుఃఖ ఫలముల నొసంగుట కారంభించిన కర్మముయొక్క, భోగ=అనుభవముయొక్క, అవసా నంబునఁ = అంతమునందు (మరణసమయమునందు ప్రారబ్ధకర్మ మనుభవించిన నే యీశరీరము తొలఁగిపోవును. ఇదియే మరణము.) ఘటాకాశంబు = కుండలోని యాకాశము, మహాకాశంబునఁ=సర్వవ్యాపక మగునాకాశమందు, కలసినవిధంబునఁ= అప్రయత్నముగనే ఐక్యమును జెందినట్లు, (ప్రతిస్థలమునందును ఆకాశముకలదు గదా! కుండలోపల నున్నయాకాశము, లేక, కుండలోపల జలములోఁ బ్రతిబింబించిన యాకాశము ఆకుండపగిలిపోవఁగానే మహాకాశములో నప్రయత్నముగఁ గలసి పోవుట ప్రత్యక్షము.) నాయందుఁ = పరబ్రహ్మస్వరూపుఁడ నగునాలోన, విదేహకైవల్యంబుఁ = దేహోపాధి లేకపోవుటచేతఁ బరిపూర్ణ మగునైక్యమును (మోక్షమును), ఒందెదు = పొందఁగలవు. సందేహంబు లేదు, అని, ఆజ్ఞాపించి, ఇప్పుడు, ఈవు=నీవు, బ్రహ్మాండ పురాణంబునందుఁ, అధ్యాత్మరామాయణంబు, ఉమామహేశ్వరసంవాదరూపంబై = పార్వతీపరమేశ్వరుల ప్రశ్నోత్తరరూపంబుగ, ఒప్పుఁ=కలదు, అందుఁ=ఆ అధ్యాత్మ రామాయణంబునందు, శ్రీరామహృదయంబు, ఇతిహాసంబు=కథ, సీతారామాంజనేయ సంవాదంబుఁ=సీతారామహనుమంతులసంవాదముతో, ప్రవర్తిల్లుఁ=ఉన్నది. (సీతా రామాంజనేయులసంవాదమే ఆశ్రీరామహృదయమునందలివృత్తాంతము అనుట.) అది= ఆకథ, సంక్షేపరూపంబు = మిగులసంగ్రహంబుగా నున్నది, కావునఁ, అయ్యర్థంబుఁ = ఆకథయందలివిషయంబును, విస్తరించి, ఒక్కప్రబంధంబుగాఁ = ఒకకావ్యముగా, రచి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యించి=చేసి, నా పేరన్ =నా పేరుతో, అంకితంబు సేయుము=నాకు కృతి యిమ్ము, సర్వపాపవినిర్ముక్తుండవు ఐ=పాపరహితుఁడవై, కృతార్థుండవు అయ్యెదవు, అని, ఆనతిచ్చి=ఆజ్ఞాపించి, తిరోహితుండు = అంతర్ధానముఁ జెందినవాఁడు, అయ్యెన్, అంతటన్ = తర్వాత, మేల్కని = ధ్యానమును జాలించి, పరమ...నై-పరమ = అధికమగు, ఆనంద = సంతోషముతో, భరిత=నిండిన, అంతఃకరణుఁడను ఐ=మనస్సుకలవాఁడ నై, (ఉత్తర పద్యముతో నన్వయము.)

తా. ఇట్లామహాదేవగురురూపుఁ డగుశ్రీరామమూర్తి శిష్యునియందలి ప్రేమాతిశయముచేఁ బ్రత్యక్షుఁ డై, ధర్మార్థకామమోక్షముల నొసంగఁజాలునక్షరములు గల నారాయణనామము నుచ్చరించుచు నేనొనర్చు సాష్టాంగనమస్కారముల నంగీకరించి పకపక నవ్వుచు, "నాకంటె నీవు గాని నీకంటె నేను గాని వేఱు కాము. నీవు స్థూలసూక్ష్మకారణశరీరములకంటె వేఱై జాగ్రదాదు లగునవస్థలఁ జూచుచుఁ బంచకోశముల నతిక్రమించి సచ్చిదానందస్వరూపుఁడవై యున్నావు. నేనును అట్లె యున్నాను. కావున మన కిరువురకును భేద మించుకైనను లేదు. ఈఅభేదదృష్టిని మనసునందు స్థిరముగ నిలిపికొని జీవన్ముక్తి ననుభవింపుము. ప్రారబ్ధానుభవము ముగిసినపిదప ఘటాకాశము మహాకాశమునం దైక్యముఁ జెందునట్లు నాయం దైక్యము నొందెదవు" అని సర్వోపనిషత్సార మగువిషయము నుపదేశించి, మరల "ప్రస్తుతము నీవు చేయవలసినకార్య మొకటి కలదు. బ్రహ్మాండపురాణంబునఁ బార్వతీపరమేశ్వర సంవాదరూపముగ నధ్యాత్మరామాయణము కలదు. దానియందు సీతారామాంజనేయ సంవాదరూప మగుశ్రీరామహృదయ మను నితిహాసము మిగుల సంక్షేపముగ నున్నది. దాని విస్తరించి యొకకావ్య మొనరించి నాకుం గృతి యిమ్ము. దీనిచే సకలపాపరహితుఁడ వై, కృతకృత్యుఁడ వగుదువు." అని యాజ్ఞాపించి యంతర్ధానమును జెందెను. తర్వాత నేనును సమాధిని విడిచి యాచార్యుని పరమానుగ్రహమువలన నుల్లాసముఁ జెందుమనస్సుతో.

## కృతికర్తృభాగ్యప్రశంస.

శా. శ్రీవిశ్వేశ్వరపార్వతీప్రియదమున్ శ్రీజానకీరామవా
క్యావిర్భూతము మారుతాత్మజసుబోధ్యం బెత్తగన్ శ్రీమహా
దేవాచార్యవరాంకితంబుగను ధాత్రి న్రాజయోగంబు సం
భావింపన్ రచియింపఁ గల్గె నిఁక నాభాగ్యంబు సామాన్యమే? 18

టీ. శ్రీ...దమున్ - శ్రీ = సంపద్యుక్తులైన, విశ్వేశ్వర = ఈశ్వరునకును, పార్వతీ = పార్వతీదేవికిని, ప్రియదమున్ = సంతోషము గలిగించునట్టియు, శ్రీ...

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భూతము-శ్రీజానకీ = సీతాదేవియొక్కయు, రామ=శ్రీరామునియొక్కయు, వాక్య=వాక్యములనుండి, ఆవిర్భూతము = పుట్టినట్టియు, మారుతాత్మజసుబోధ్యంబు = ఆంజనేయునకు బాగుగఁ దెలుపఁ దగినది. (ఆంజనేయున కుపదేశించినది.) ఐ=అయిన, రాజయోగంబుల్ = తారకసాంఖ్యామనస్కరూప మగురాజయోగమును, తగన్ = ఒప్పునట్లుగా, శ్రీ...గను-శ్రీమహాదేవాచార్యవర=మహాదేవయతి యను నాచార్యశ్రేష్ఠునకు, అంకితంబుగను=సమర్పితంబుగ, ధాత్రిన్=భూమియందు, సంభావింపన్ = సర్వజనులును గౌరవించునట్లుగా, రచియింపన్ కల్గెన్ = చేయుటకుఁ దటస్థమయ్యెను. (కావ్యముగా రచించుట తటస్థ మయ్యె ననుట.) ఇఁకన్=ఇప్పుడు (లేక ఇట్లగుటచేత), నాభాగ్యంబు= నాయదృష్టము, సామాన్యమే = స్వల్పమైనదా?

తా. పార్వతీపరమేశ్వరులకు సంతోషకరమై, మహానుభావుఁ డగు హనుమంతునకు సీతారాములు చేసినయుపదేశమే స్వరూపము గాఁ గలిగిన యీ రాజయోగమును, ఒక ప్రబంధముగా రచియింప సమకూరెను. అందును సదాచార్యులలో నుత్తమోత్తముఁ డగుమహాదేవాచార్యుఁడు కృతిపతి యయ్యెను. ఇఁక నాభాగ్యము నకు మితి గలదా ?

క. దివ్యము భవ్యంబగు,మత్కావ్యము సంతతము మోక్షకాములచేశ్రో
తవ్యము వక్తవ్యముమం,తవ్యము భావ్యమునుగీర్తితవ్యముగాదే?

టీ. దివ్యము = శ్రేష్ఠమయినదియు, భవ్యంబు = క్షేమకరమైనదియు, అగు మత్కావ్యము = అయిన నాకావ్యము, సంతతమున్ = ఎల్లప్పుడును, మోక్షకాముల చేన్ = మోక్షేచ్ఛగలవారిచే, శ్రోతవ్యము=వినఁదగినదియు, వక్తవ్యము = పఠింపఁ దగినదియు, మంతవ్యము = మననము, (లేక విచారణము చేయఁ దగినదియు), భావ్యమును = అన్నిఁటిలో నుత్తమమని తలఁపఁదగినదియు, కీర్తితవ్యము = కొనియాడఁదగినదియు, కాదే=కాకుండునా? (అగుననుట.)

తా. పైపద్యమునందు వర్ణింపఁబడినవిధముగ నుపదేశ మొనర్చినవారు, దాని గ్రహించినవారును, ఆచరిత్రమును మిగుల నాదరముతో గ్రహించినవారును, కృతిపతియును, ఉత్తమోత్తములై యుండుటచే నేను రచింపఁబోవుకావ్యము పరమపవిత్రమైనదియు లోకులకు క్షేమము కలిగింపఁ జాలినదియుఁ గాఁగలదు. మోక్షేచ్ఛగల ప్రతిమనుజుఁడును సదా దీని నాకర్ణించుచుఁ బఠించుచు దీని యర్థమును మననము సేయుచు దీనికంటె నుత్తమమైనది మఱియొకటి లేదని ప్రశంసింపఁగలరు. దీనికి సంశయము లేదు.

వ. అని విచారించి సంతోషభరితచిత్తుండనై మదీయాచార్యపరంప
రావతారంబు నభివర్ణించెద. 20

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. అని = పైనఁ జెప్పినవిధముగ, విచారించి, సంతోషభరితచిత్తుండనునై = సంతోషముచేఁ బూర్ణ మగుమనస్సు గలవాఁడనై, మదీయ...అవతారంబుల్ - మదీయ = నాసంబంధముగల, ఆచార్య = గురువులయొక్క, పరంపరా=వరుసయొక్క, అవతారంబుల్ = క్రమమును, అభివర్ణించితిన్=వర్ణించితిని. (గ్రంథారంభమునకు ఉపక్రమించితి నని భావము.)

తా. పైన వర్ణించినవిధముగా నామహాభాగ్యమును గూర్చియుఁ గావ్యము యొక్క మాహాత్మ్యమును గూర్చియు విచారించి మిగుల సంతోషముతోఁ దత్క్షణమే కావ్యము నుపక్రమించి దాని మొదట నలంకారంబుగ నాగురుపరంపరను వర్ణింప నారంభించినాఁడను.

## గురుపరంపరాభివర్ణనము.

అవ. వంశము రెండువిధములు:—విద్యావంశము, జన్మచేఁగలుగువంశము. అందు శరీరమును మాత్ర మొసంగఁగలజన్మవంశముకంటె సర్వవ్యవహారసాధన మగుజ్ఞాన మొసంగిన విద్యావంశ ముత్తమ మను నభిప్రాయమును సూచించుచు కవి మొట్టమొదట గురుపరంపర నభివర్ణించుచున్నాఁడు:—

శా. సత్తామాత్రుఁడు నిర్విశేషుఁడు తనూసర్వేంద్రియప్రాణహృ
చ్చిత్తాహంకృతిధీప్రకాశకుఁడు సచ్చిత్తోషకాయుండు వి
ద్వత్తాపాంధతమఃప్రదీపమయుఁ డాత్మస్వామి భాసిల్లె శ్రీ
దత్తాత్రేయగురుం డనంగ జగదంతర్యామి యై మున్నిలన్. 21

టీ. సత్తామాత్రుఁడు=సత్తయె, (ఉనికియె, లేక దేశకాలవస్తువులవలనఁగలుగు మార్పులు లేక పోవుటయే), స్వరూపముగాఁ గలవాఁడును, నిర్విశేషుఁడు=భేదములు, వికారములు, ధర్మములు లేక నేకస్వరూపుఁడై యుండువాఁడును, తను...ప్రకాశకుఁడు-తను=స్థూలసూక్ష్మకారణశరీరములను, సర్వేంద్రియ=సమస్తములగు నింద్రియములను, ప్రాణ=ప్రాణములను, హృత్=మనస్సును (సంకల్పముఁజేయునంతఃకరణము), చిత్త, (సందేహించునట్టియంతఃకరణము) అహంకృతి=అహంకారమును, '(ఇది. "ఈపని నేనైనను జేయుదును" అని యుక్తాయుక్తవిచారణముకూడఁ జేయక త్వరపడు నంతఃకరణము), ధీ=బుద్ధిని (ఇది యుక్తాయుక్తవిచారపూర్వకముగఁ గార్యములను నిశ్చయించు నంతఃకరణము. అంతఃకరణ మొక్కటియేయైనను, ఆయావృత్తులచే, అనఁగా: ఆయావృత్తులు గలిగినసమయములయందు ఆయాపేర్లచే వ్యవహరింపఁబడుచున్నది. అని తెలిసికొనవలయుఁ), ప్రకాశకుఁడు=ప్రకాశింపఁజేయువాఁడును, సత్...కాయుండు-సత్=సత్యమును, చిత్=జ్ఞానము, తోష=ఆనందమును, కాయుండు=స్వరూపముగాఁ గలవాఁడును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విద్వత్...మయుఁడు-విద్వత్=జ్ఞానులయొక్క, తాప=తాపత్రయ మనియెడు, అంధ తమః=గాఢాంధకారమునకు, ప్రదీపమయుఁడు=దీపముతో సమానుఁడు (పోఁగొట్టు వాఁడు) అగు, ఆత్మస్వామి=పరబ్రహ్మరూపుఁడు, శ్రీదత్తాత్రేయగురుండు అనంగన్=శ్రీదత్తాత్రేయాచార్యుఁ డనుపేర, జగదంతర్యామి యై = సర్వజగత్తులను నియమించు వాఁడై, ఇలన్=ఈభూమియందు, మున్ను=పూర్వకాలమున, భాసిల్లెన్=ప్రకాశించెను. (కలఁ డనుట.)

తా. దేశ కాల వస్తువులచేఁ గల్గుభేదములు లేక (సర్వదేశములయందును, సర్వ కాలములయందును సర్వవస్తువులయందును ఒక్కరూపముగ నుండుచు) మనోబుద్ధి చిత్తాహంకారములకు సాక్షియై సచ్చిదానందరూపుఁడై యాశ్రితు లగువారి తాప త్రయముల నడంచుచు, నొక్కకూటస్థపరబ్రహ్మము (భ్రాంతి లేనిజీవుఁడు) సకల జగంబుల నియమించుచు, దత్తాత్రేయాచార్యుం డనుపేర భూమిపై వెలుఁగొందు చుండెను.

క. ఆదత్తాత్రేయగురు, శ్రీదివ్యపదారవిందసేవాదిశ్రీ
మోదుఁడు ప్రత్యక్షప్రహ్లాదుం డన శ్రీజనార్దనాహ్వయుఁ డొప్పున్.

టీ. ఆదత్తా...దుఁడు - ఆ దత్తాత్రేయగురు = దత్తాత్రేయాచార్యునియొక్క, శ్రీ=మంగళకరము లైనట్టియు, దివ్య=ఉత్తమోత్తమము లైనట్టియు, పదారవింద=పాద కమలములయొక్క, సేవాది=సేవ మొదలగునవియే (లేక, సేవ మొదలగువానివలనఁ గలిగిన), శ్రీమోదుఁడు=సంపదచే సంతోషించువాఁడు, (లేక, సంపదయే సంతోష ముగాఁ గలవాఁడు) అగు, శ్రీజనార్దనాహ్వయుఁడు=జనార్దనుఁడనుయోగి, ప్రత్యక్ష ప్రహ్లాదుండు అనన్ = ప్రత్యక్షముగాఁ గానవచ్చుచున్న ప్రహ్లాదుఁడో యనునటు, ఒప్పున్=ప్రకాశించుచుండెను.

తా. ఆదత్తాత్రేయగురువునకు శిష్యుఁడై యమ్మహానుభావుని పాదసేవయే తనకు మహోన్నతపదవిగ నానందించుచుఁ బ్రత్యక్షముగాఁ గానవచ్చుప్రహ్లాదుఁడో యన జనార్దనయోగి జగత్ప్రసిద్ధుఁడై యుండెను.

మ. తనసౌశీల్యము శాస్త్రచింతనము నాత్మజ్ఞానముంజూచి హె
చ్చినకూర్మిన్నిజదివ్యరూపములతో శ్రీభారతీమోక్షకా
మిను లేతెంచి యహర్నిశంబు దను నెమ్మిం గొల్వఁగా శ్రీజనా
ర్దనయోగీశ్వరుఁ డొప్పె నెల్లెడ నవిద్యాధ్వాంతమార్తాండుఁడై 23

టీ. తనసౌశీల్యము=తనసత్ప్రవర్తనము, శాస్త్రచింతనమున్ = శాస్త్రవిచారము, ఆత్మజ్ఞానమున్=ఆత్మజ్ఞానమును, చూచి, హెచ్చినకూర్మిన్=అధికమైనప్రేమచేత, నిజ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దివ్యరూపములతోఁ=తమలోకోత్తరము లగునాకారములతో, శ్రీ భారతీమోక్షకామి నులు=లక్ష్మీ-సరస్వతీ-పార్వతులు. (సదాచారమును జూచి లక్ష్మియు, శాస్త్రజ్ఞానమును జూచి సరస్వతియు, బ్రహ్మజ్ఞానమును చూచి పార్వతియు చెంతఁజేరి రనియు, ఈజనార్దనయోగి విష్ణుబ్రహ్మమహేశ్వరరూపుఁడనియు భావము.) ఏతెంచి = వచ్చి, అహర్నిశంబుఁ=రేయుం బవలు, తనుఁ=తనను, నెమ్మిఁ=ప్రేమతో, కొల్వఁగాఁ=సేవించుచుండఁగా, శ్రీజనార్దనయోగీశ్వరుఁడు, ఎల్లెడఁ=అంతటను, అవిద్యాధ్వాంతమార్తాండుఁడై=అవిద్య యనెడి (లేక, అజ్ఞాన మనెడి) చీఁకటికి సూర్యునివంటివాఁడై, (జీవులకు అవిద్య యనునది ఆవరణము కావున దానినిఁ దొలఁగించి వారిని ముక్తులను జేయుచు అనుట.) ఒప్పెఁ=ప్రకాశించెను.

తా. ఆజనార్దనయోగీశ్వరునిధర్మప్రవర్తనమును జూచి లక్ష్మియు, విద్యాసమృద్ధిని జూచి సరస్వతియు, బ్రహ్మజ్ఞానమును జూచి పార్వతియు నాయన నాశ్రయించి స్త్రీస్వరూపములతో మిగుల ననురాగవతులై. సేవించుచుండిరి. ఇట్లపరిమిత మగు ప్రభావముతోఁగూడి త్రిమూర్తులస్వరూపము గలవాఁడై యాశ్రితులయజ్ఞానమును ధ్వంసము గావించి, మోక్షము నొసంగుచు నాఘనుఁడు ప్రకాశించుచుండెను.

తే. ఆజనార్దనగురున కత్యద్భుతముగ
శ్రీమదేకోగురుస్వామి శిష్యుఁడయ్యె
మును వసిష్ఠమహామునీంద్రునకునర్థి
దాశరథి భక్తుఁ డైనచందంబు దనర. 24

టీ. ఆజనార్దనగురునకుఁ, అత్యద్భుతముగఁ = మిగుల నాశ్చర్యముగ, శ్రీమదేకోగురుస్వామి = బ్రహ్మజ్ఞానము గలయేకోగురుస్వామి యనువాఁడు, మును = పూర్వకాలమున, వసిష్ఠమహామునీంద్రునకుఁ = వసిష్ఠమహర్షికి, అర్థిఁ = ఆదరముతో, దాశరథి = శ్రీరాముఁడు, శిష్యుఁ డైనచందంబు = శిష్యుఁడైనవిధము, తనరఁ = ఒప్పునట్లుగా, శిష్యుఁడు, అయ్యెఁ.

తా. మున్నా రామభద్రుఁడు వసిష్ఠమహామునికి శిష్యుఁ డైనట్లు బ్రహ్మవేత్తలలో నగ్రేసరుం డగు నేకోగురుస్వామి యాజనార్దనయోగీంద్రునకు శిష్యుఁడయ్యెను.

సీ. తనదువైరాగ్యంబుఁ గనుఁగొని సిగ్గుచే
సనకాదిమునులజువెనుకనొదుగఁ
దనదుసద్భక్తిచేఁ దగఁగట్టుపడియింట
శ్రీకృష్ణుఁ డాత్మీయసేవఁ జేయఁ
దనదువిజ్ఞానతీర్థమునందుఁ గ్రుంకుచు
గంగాదినదులెల్ల గంతు లిడఁగఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దనదుపూర్ణాత్మసంతతసమాధినిజూచి
ప్రహ్లాదుఁడాశ్చర్యపరతనొంద
తే స్వకృతగీతాదిశాస్త్రభాష్యంబు లెల్ల
వేదతుల్యంబులై ధాత్రి వెలయుచుండ
వామదేవశుకార్జునవ్యాససభీష్మ
సదృశుఁ డేకోజనార్దనస్వామి వెలసె. 25

టీ. తనదువైరాగ్యంబున్ = తనకుఁగలవైరాగ్యాతిశయమును, కనుఁగొని = చూచి, సిగ్గుచేన్ =తమకట్టివైరాగ్యము లేదనునవమానముచేత, సనకాదిమునులు = బ్రహ్మ యొక్క మానసపుత్రులగు (సంకల్పముచేతనే జనించినవార లగు) సనకసనందనాది ఋషులు, అజువెనుకన్ = బ్రహ్మదేవుని వెనుకభాగమున, డాఁగన్ = దాఁగుచుండఁగా, (ఇచ్చట బ్రహ్మమానసపుత్రులగువారు బ్రహ్మకు సమీపమునం దుండుట స్వభావమేయైనను, ఏకోగురుస్వామియొక్క వైరాగ్యమును జూచి, సిగ్గుజెందుటచేఁ గలిగినదిగా నుత్ప్రేక్ష చేయఁబడెను.) తనదుసద్భక్తిచేన్ = తనయొక్క అత్యుత్తమమైనభక్తిచేత, తగన్ = ఒప్పునట్లుగా, కట్టుపడి, ఇంటన్ = తనగృహమునందు, నిలిచి, శ్రీకృష్ణుఁడు, ఆత్మీయ సేవన్ = తనయొక్క సేవ, చేయన్ = చేయుచుండఁగా, తనదువిజ్ఞానతీర్థమునందున్ = తనయొక్క బ్రహ్మజ్ఞాన మనియెడుతీర్థమందు, క్రుంకుచున్ = స్నానముచేయుచు, గంగాదినదు లెల్లన్ =గంగ మొదలగు లోకపావనము లైననదులన్నియు, గంతులిడఁగన్ = విఱ్ఱవీగుచుండఁగా, (గంగాదినదులు లోకమును బావనముసేయుట స్వాభావికమే యైనను అది యేకోగురుస్వామియొక్క జ్ఞానతీర్థమునందు మునుంగుటవలనఁ గలిగి నదిగా నిచట నుత్ప్రేక్షింపఁబడెను.) తన...సమాధిని - తనదు = తనయొక్క, పూర్ణ = సర్వవ్యాపకుఁడైన, ఆత్మ=పరబ్రహ్మమునకు సంబంధించిన, సంతత = అధికమగు (లేక, సర్వకాలసర్వావస్థలయందు నొక్కటేరీతిగానున్న), సమాధిని = ధ్యానమును, చూచి, (పరమాత్మ సర్వవ్యాపకుఁడు గావున ఆయన నెఱింగినయోగి ఏయేవిషయముల సంక ల్పించినను సర్వము సమాధి నాచరించినట్లే యగునని తెలిసికొనవలయును) ప్రహ్లా దుఁడు, ఆశ్చర్యపరతన్ = మిగుల నాశ్చర్యము గలిగియుండుటను, ఒందన్ = పొందు చుండఁగా, స్వకృతగీతాదిశాస్త్రభాష్యంబులు ఎల్లన్ =తనచే రచియింపఁబడిన భగవద్గీతా భాష్యము మొదలగునవి యన్నియు, (ఏకోగురుస్వామిచే రచియింపఁబడినవ్యాఖ్యానము లేవియును గానరావు. కావునఁ బ్రకృతమున నీకవి శంకరభగవత్పాదులకును ఏకోగురు స్వామికిని అభేదము చెప్పినాఁడని తోఁచుచున్నది.) ధాత్రిన్ =భూమియందు, వేద తుల్యంబులు ఐ=వేదములతో సమానములై, వెలయఁచున్ =ప్రకాశించుచు (లేక, ప్రసిద్ధిఁ జెందుచు), ఉండన్ = ఉండఁగా, వామదేవ-శుక-అర్జున-వ్యాస-భీష్మ-సదృశుఁడు=వామ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేవాదులతో సమానుఁడు అగు, ఏకోజనార్దనస్వామి=జనార్దనయోగీంద్రుని శిష్యుఁడగు ఏకోగురుస్వామి, (కుమారుని పేరుతోఁగూడ తండ్రి పేరును, శిష్యుని పేరుతోఁగూడ గురువు పేరును కలిపి చెప్పుట కొన్ని దేశములలో నాచారము. ఆంధ్రకావ్యములలోఁ బలుచోట్ల నిట్టిప్రయోగములను జూడవచ్చును.) వెలసెన్ = ప్రసిద్ధుఁడై యుండెను.

తా. తనవైరాగ్యమును జూచి సిగ్గుపడి సనకసనందనాదులు సత్యలోకమును విడిచివచ్చుటకు సందేహించుచుండ తనభక్తిచేఁ గట్టువడి భక్తపరాధీనుఁడగు శ్రీకృష్ణుఁడు తనగృహమునందే వసియించి సర్వవిధముల తోడ్పడుచుండఁద్రిభువనపావనము లని ప్రఖ్యాతిఁ జెందియున్న గంగాదిపుణ్యనదు లన్నియుఁ దన బ్రహ్మజ్ఞానతీర్థమున నోలలాడి మిగులఁ బ్రభావమును సంపాదించుకొనుచుండఁ దా రచించిన గీతాభాష్యాదులు వేదములట్లు పరమప్రమాణములై తనరారుచుండ నజ్జనార్దనయోగీంద్రశిష్యుఁ డగు ఏకోగురుస్వామి వామదేవుఁడు, శుకుఁడు, అర్జునుఁడు, వ్యాసుఁడు భీష్ముఁడు మొదలగువారితో సమానుఁడై ప్రసిద్ధి గాంచెను. (ఆమ్మహాత్ముని పరబ్రహ్మనిష్ఠను జూచి ప్రహ్లాదుఁడు సైతము ఆశ్చర్యపడుచుండెననుట.)

క. ధరలో నారాయణునకు, నరుగతి నేకోజనార్దనస్వామికి శ్రీ
నరహరిమహేశగురుఁడ, చ్చెరువుగసద్భక్తిమెఱయశిష్యుండయ్యెన్.

టీ. ధరలోన్ = భూమిపై, నారాయణునకున్ = శ్రీకృష్ణునకు, నరుగతిన్ = అర్జునుని యట్లు, ఏకోజనార్ధనస్వామికిన్ = జనార్దనయోగీంద్రుని శిష్యుఁడగు ఏకోగురుస్వామికి, నరహరిమహేశగురుఁడు = నరహరి మహేశ్వరుఁడను మహాత్ముఁడు, (ఇచ్చట మహేశ్వరుఁ డనునది నరహరి యనునాతని తండ్రిపేరుగా నుండునని యూహింపవలసియున్నది. అట్లు గాకున్నను యతులకు శివవాచకములును విష్ణువాచకములును అగుపదములును ఉపపదములుగ చేర్చుట కలదు. ఉదా:—శివనారాయణతీర్థుఁడు; మొదలగునవి.) అచ్చెరువుగన్ = ఆశ్చర్యము కలిగించునట్లుగ, సద్భక్తిమెఱయన్ = మిగులభక్తితో, శిష్యుండు అయ్యెన్, (భక్తితో నాయేకోగురుస్వామి నాశ్రయించె ననుట.)

తా. శ్రీకృష్ణునికి అర్జునుఁడు శిష్యుఁడైనట్లు ఆయేకోగురుస్వామికి నరహరి మహేశ్వరుఁ డనుమహాత్ముఁడు మిగుల భక్తియుక్తుఁడై శిష్యుఁడయ్యెను. (ఈగురుశిష్యులు లోకమున కాశ్చర్యము గలిగించుచుండిరనుట.)

చ. అతఁడు సమస్తభూతబహిరంతరనావృతబోధమూర్తియై
వితతసమాధి నుండునెడ వేల్పులు సూచి యితం డయారె యా
శతధృతియో రమావరుఁడో శంకరుఁడో శుకుఁడో యటంచు న
ద్భుతమును బొందుచుండఁ బరిపూర్ణత నొప్పె ధరాతలంబునన్,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. అతఁడు = ఆనరహరిగురువు, సమస్త...మూర్తి-సమస్తభూత = ఆకాశాది పంచభూతములయొక్కయు, లేక, పంచభూతవికారము లగు సకల ప్రాణులయొక్కయు, బహిరంతః=లోపల వెలుపల, అనావృత=ఆవరింపఁబడని (అజ్ఞానావరణములేని), బోధ = అపరోక్షజ్ఞానమే (బ్రహ్మమే తానని యెఱుంగుటయె), మూర్తి ఐ=స్వరూపముగాఁగలవాఁడై (స్వప్రకాశస్వరూపుఁడై యనుట.), వితతసమాధిన్ = ఎక్కువైన ధ్యానమునందు (ధ్యాననిష్ఠుఁడై యనుట.), ఉండు నెడన్ = ఉన్నప్పుడు, వేల్పులు = దేవతలు, చూచి, ఇతండు=ఈయోగి, అయారే=ఆహా! ఆశతధృతియో=ఆబ్రహ్మయో, రమావరుఁడో = విష్ణువో, శంకరుఁడో = రుద్రుఁడో, శుకుఁడో = శుకమహర్షియో, (అగునుగాని సామాన్యుఁడు కాఁడు; అని అధ్యాహారము.) అటంచున్=అనుచు, అద్భుతమునున్=ఆశ్చర్యమును, పొందుచున్, ఉండన్ ='ఉండఁగా, పరిపూర్ణతన్ = సంపూర్ణుఁడై, (సర్వగుణములచేత సంపూర్ణుఁడై, లేక, పరబ్రహ్మరూపుఁడై యనుట.), ధరాతలంబునన్=భూమియందు, ఒప్పెన్=ప్రసిద్ధిగాంచెను.

తా. సర్వప్రపంచమునకును లోపల వెలుపల నిండియున్నట్టియు, అజ్ఞానావరణము లేనట్టియు, స్వప్రకాశస్వరూపముగలిగి నిర్వికల్పసమాధియందు (ధ్యానించువాఁడు, ధ్యానము, ధ్యానింపఁదగినది అను భేదములు లేనిసమాధియందు) ఉండునప్పుడు నరహరియోగిని జూచి దేవత లందఱు, 'ఆహా! యీతఁడు బ్రహ్మయో, విష్ణువో, రుద్రుఁడో, శుకమహర్షియో కాని సామాన్యుఁడు కాఁడు' అని యాశ్చర్యపడుచుండురు. ఇట్లు సర్వభూతములకు నాశ్చర్యకరము లగు సద్గుణసమృద్ధితో ప్రత్యక్ష పరబ్రహ్మమో యన నాతఁడు భూమియందుఁ బ్రసిద్ధిఁ జెందియుండెను.

క. ఆనరహరిసద్గురునకు, శ్రీనాగోరామగురుఁడు శిష్యుండై వి
జ్ఞానంబునఁ బ్రత్యక్ష, శ్రీనారాయణుఁ డనం బ్రసిద్ధి వహించెన్. 28

టీ. ఆనరహరి సద్గురునకున్=నరహరి యనుగురువునకు, శ్రీనాగోరామగురుఁడు=బ్రహ్మజ్ఞానవంతుఁ డగునాగోరాముఁ డనువాఁడు, శిష్యుండు ఐ, విజ్ఞానంబునన్ = పరబ్రహ్మమే తానని తెలిసికొనుటయందు, శ్రీనారాయణుఁడు లోకోత్తమ మగునారాయణమహర్షి, (ధర్మము నశించినప్పుడు దానినుద్ధరించుటకు నారాయణమహర్షి యనుపేర నవతరించిన విష్ణువు), అనన్ = అనఁగా, ప్రసిద్ధిన్ = విఖ్యాతిని, వహించెన్ = పొందెను.

తా. నాగోరామగురువనువాఁడు ఆనరహరిగురునకు శిష్యుఁడై బ్రహ్మజ్ఞానప్రభావముచే నారాయణమహర్షియొక్క యపరావతారమో యన ప్రసిద్ధిఁ జెందెను.

శా. రాజన్మూర్తులతోడఁ బెంపెసఁగువై రాగ్యోపరత్యాళులు
త్తేజం బొప్ప సహాయులై మెఱయ సద్విద్యాప్రబోధస్ఫుర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్రాజాస్య న్వరియించి మోక్షసుఖసామ్రాజ్యంబుతో నొప్పె నా
గోజీరామగురుండు పండితులు కోర్కుల్దీర సేవింపఁగన్. 29

టీ. రాజన్మూర్తులతోడన్ = ప్రకాశించుచున్న యాకారములతో (మనుష్య రూపమును దాల్చియనుట.), పెంపు ఎసఁగు=వృద్ధిపొందుచున్న, వై...ఆళులు-వైరాగ్య = ఇహపరలోకములయందు ఇచ్ఛలేకపోవుట (చిత్తవిశ్రాంతి) అనెడు, ఆళులు = చెలులు, ఉత్తేజంబు = అధిక మగుతేజస్సు, ఒప్పన్ = ప్రకాశింపఁగా (సకలలోకముల యందును ప్రసిద్ధికలుగునట్లు), సహాయులు ఐ=సహాయభూతురాండ్రై, మెఱయన్ = ప్రకాశింపఁగా (వైరాగ్యము, ఉపరతి యనియెడు చెలికత్తెలతోఁగూడిన అనుట.), అద్ది...స్యన్-అద్దివ్య=ఆయుత్తమమైన, ప్రబోధ = బ్రహ్మజ్ఞాన మనియెడు, స్ఫురత్ = ప్రకాశించుచున్న (సౌందర్యముగల), రాజాస్యన్ = స్త్రీని, వరియించి = వివాహమాడి, నాగోరామగురుండు = నాగోరామగురువు, పండితులు = విద్వాంసులు (లేక, బ్రహ్మ జ్ఞానులు), కోర్కుల్ దీరన్ = కోరిన కోర్కులు సిద్ధించుటకై, సేవింపఁగన్ = సేవించు చుండఁగా, మోక్ష...తోన్ - మోక్షసుఖ = బ్రహ్మానంద మనియెడు, సామ్రాజ్యంబు తోన్ = చక్రవర్తిత్వముతో (పరమానందమే రాజ్యమనుట,), ఒప్పెన్ = ప్రకాశించు చుండెను.

తా. ఆనాగోరామగురువు వైరాగ్యోపరతులు చెలికత్తియలుగాఁ గలిగి, జగ త్ప్రసిద్ధిఁ జెందియున్న బ్రహ్మజ్ఞాన మను నుత్తమకాంతను వివాహమై, మోక్షసుఖ మనియెడు సామ్రాజ్యమునకుఁ బ్రభువై బ్రహ్మవేత్త లగువారలకోర్కుల నెఱవే ర్చుచు తత్త్వార్థమును బలుమాఱు వివరించి, సంశయములనెల్లఁ దొలఁగించి జ్ఞానమును దృఢము చేయుచు సుప్రసిద్ధుఁడై యుండెను.

క. ఆనాగోరామునకున్, శ్రీనారాయణున కజుని చెలువున భక్తుం
డై నెగడె నెల్లదిక్కులఁ,గోనేరుగురుండు తత్త్వకోవిదుఁ డగుచున్.

టీ. ఆనాగోరామునకున్ = ఆనాగోరామగురువునకు, శ్రీనారాయణునకున్ = శ్రీవిష్ణునకు, అజునిచెలువునన్=బ్రహ్మవలె ("నారాయణం పద్మభవం వసిష్ఠం" అని వేదాంతవిద్యాసంప్రదాయమునకు మొదటిగురువు విష్ణువు; ఆయనకు శిష్యుఁడు బ్రహ్మ దేవుఁడు; ఆయనకు వసిష్ఠుఁడు అని చెప్పఁబడి యున్నది. దాని ననుసరించి ఇచ్చట నీయుపమానము ప్రయోగింపఁబడిన దని తెలిసికొనునది.) కోనేరుగురుండు = కోనేరుఁ డనుగురువుభక్తుండు ఐ (శిష్యుఁడై యనుట.), తత్త్వకోవిదుఁడు అగుచున్ = తత్త్వ జ్ఞానముకలవాఁడై, ఎల్లదిక్కులన్ = అన్నిదిక్కులయందును, నెగడెన్ = ప్రసిద్ధి నొందెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. శ్రీమన్నారాయణమూర్తికి బ్రహ్మదేవుఁడు శిష్యుఁ డైనట్లు ఆనాగోజీ రామగురువునకుఁ గోనేరుగురువు శిష్యుఁ డయ్యెను. బ్రహ్మవేత్తలలో నుత్తముఁడై త్రిలోకములయందుఁ బ్రసిద్ధిఁ గాంచెను.

శా. ఆకాశీతలసేతుమధ్యకలితజ్యాధీశ్వరోద్యచ్ఛిర
శ్శ్రీకోటీరమణిప్రభార్చితనిజాంఘ్రిద్వంద్వపంకేరుహుం
డాకాశాదిసమస్తతత్త్వసముదాయాతీతవిశ్వేశుఁ డై
శ్రీకోనేరుగురుండు మోక్షపదలక్ష్మీకాంతుఁ డై రంజిలెన్. 31

టీ. ఆ...పంకేరుహుండు - ఆకాశీతలసేతుమధ్య = కాశీక్షేత్రము మొదలు సేతువువఱకుఁ గల మధ్యదేశమునం దంతటను, కలిత = ప్రకాశించుచున్న, జ్యా అధీశ్వర = ప్రభువులయొక్క, ఉద్యత్ = ప్రకాశించుచున్న, శిరః = శిరస్సులయందలి, శ్రీకోటీర = కాంతిగల కిరీటములయందలి, మణి = రత్నములయొక్క, ప్రభా = కాంతులచేత, అర్చిత = పూజింపఁబడిన (అలంకరింపఁబడినది అనుట.), నిజ = స్వకీయ మైన, అంఘ్రిద్వంద్వ పంకేరుహుఁడు = కమలములవంటి పాదములు గలవాఁడును (సకల ప్రభువులచేతను నమస్కరింపఁబడువాఁడును), ఆకాశ...విశ్వేశుఁడు - ఆకాశాది = ఆకాశము మొదలగు, సమస్త=సకలములైన, భూతసముదాయ = పంచభూతముల యొక్కయు వానివలనఁ బుట్టిన సకల ప్రాణులయొక్కయు సమూహమును, అతీత = అతిక్రమించినవాఁడును, విశ్వేశుఁడు = ప్రపంచమును నియమించువాఁడును ఐ, మోక్ష...కాంతుఁడు - మోక్ష = మోక్షమనియెడు, పద = స్థానమనెడి, లక్ష్మీ = లక్ష్మి (మోక్షలక్ష్మికి), కాంతుఁడు=ప్రియుఁడు-భర్త ఐ, ఆకోనేరు గురుండు = ఆకోనేరుఁ డను గురువు, రంజిలెన్ = ప్రకాశించుచుండెను.

తా. ఆకోనేరుగురువు కాశీరామేశ్వరమధ్యదేశమునం దున్నసకలప్రభువుల చేతను సాష్టాంగముగా నమస్కరింపఁబడుచు ఆకాశాదిసమస్తప్రపంచమునకును అతీతుఁడై శుద్ధపరబ్రహ్మరూపుఁడై సర్వదా మోక్షసుఖము ననుభవించుచుఁ దేజరిల్లుచుండెను.

పరబ్రహ్మము షడధ్వాతీతుఁ డయినను తత్త్వాధ్వాతీతుఁడనిమాత్రము ఈపద్యమునఁ జెప్పుటకు హేతువేమన ; తత్త్వాధ్వము కడపటి దైనదధ్వముల యుత్పత్తికిని గారణమగుటచే నిట్లు చెప్పఁబడెను.

## షడధ్వములవివరణము.

మంత్రాధ్వము పదాధ్వము వర్ణాధ్వము తత్త్వాధ్వము భువనాధ్వము కళాధ్వము అని అధ్వములు ఆఱువిధములు, అందు—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧. మంత్రాధ్వము:—సద్యోజాతము, వామదేవము, అఘోరము, తత్పురుషము, ఈశానము, హృదయము, శిరస్సు, శిఖ, కవచము, నేత్రము, అస్త్రము అని పదునొకండు విధములు.

౨. పదాధ్వము:—మహాదేవ సద్భావేశ్వర మహాతేజ యోగాధిపతి ముంచ ముంచ ప్రథమప్రథమ సర్వసర్వ భవభవ భవోద్భవ సర్వభూత సుఖప్రద సర్వసాన్నిధ్యకర బ్రహ్మ విష్ణురుద్రపర అనార్చితానార్చిత అస్తుతాస్తుత పూర్వస్థితి సాక్షిసాక్షి తురుతురు పతంగ పతంగ పింగ పింగ జ్ఞాన జ్ఞాన శబ్ద శబ్ద సూక్ష్మ సూక్ష్మ శివ సర్వసర్వ ఓం నమశ్శివ ఓం నమోనమ నమశ్శివ ఓం నమరూపి అరూపి ప్రథమ ప్రథమ తేజస్తేజ జ్యోతిర్జ్యోతి అరూప జనగ్ని అధూమ అభస్మ అనాది నా నానా ధూధూధూ ఓంభూః ఓం భువః ఓగ్ంసువః అనిధన నిధన నిధనోద్భవ శివసర్వ పరాపరాత్మ భువనేశ్వర ధ్యానహార ఓంనమశ్శివ సర్వ ప్రభు శివ ఈశానమూర్ధ్నే తత్పురుషవక్త్ర అఘోరహృదయ వామదేవగుహ్య సద్యోజాతపాద ఓంనమః గుహ్యాతి గుహ్య గోప్త అనిధన సర్వయోగాధీకృత సర్వవిద్యాధిప జ్యోతిరూప పరమేశ్వర పరమేశ్వర అచేతనాచేతనా వ్యోమ్నిన్ వ్యోమిన్ వ్యోమ్నివ్యాపిన్ వ్యాపిని వ్యోమవ్యాపిని వ్యోమరూప సర్వవ్యాపిని శివానంత అనాథ అనాశ్రిత ధ్రువ శాశ్వతయోగ పీఠ సంస్థిత నిత్యయోగి ధ్యానహార ఆద్యోంకారములని ఎనుబదియొకటి.

3. వర్ణాధ్వము:—అం ఆం ఇం ఈం ఉం ఊం ఋం ౠం ౡం ౡం ఏం ఐం ఓం ఔం అం అః; కం ఖం గం ఘం ఙం చం ఛం జం ఝం ఞం టం ఠం డం ఢం ణం తం థం దం ధం నం పం ఫం బం భం మం యం రం లం వం శం షం సం హం ళం క్షం అని ఏఁబది యొకవిధము.

౪. తత్త్వాధ్వము:—పృథివి ప్రకృతి బుద్ధి అహంకార మన శ్రోత్ర త్వక్ చక్షు ర్జిహ్వాఘ్రాణ వాక్ పాణి పాద పాయు గుహ్య శబ్ద స్పర్శ రూప రస గంధ ఆకాశ వాయు వహ్ని జల మాయ కాల నియతి కాలా విద్యా రాగ పురుష సదాశివ ఈశ్వర శుద్ధవిద్య శివశక్తు లనుతత్త్వములు ముప్పదియాఱు. లేక, భూతపంచక జ్ఞానేంద్రియపంచక కర్మేంద్రియపంచక ప్రాణపంచక శబ్దాదిపంచకములును నాని చతుష్టయమును శరీరత్రయమును అవస్థాత్రయమును అజ్ఞానమును, ఇవియే ముప్పదియాఱు తత్త్వములు. జ్ఞానేంద్రియ కర్మేంద్రియ ప్రాణశబ్దాదివిషయపంచకములు మానసాది చతుష్టయమునుగూడి యిరువది నాలుగు తత్త్వములు. పైఁజెప్పిన ముప్పదియాఱుతత్త్వములును షడ్భావవికార షట్కోశికషడూర్మి అరిషడ్వర్గములును, జీవత్రయ గుణత్రయ కరత్రయములును, వచనాదానగమనవిసర్గానందములును, సంకల్పాధ్యవసాయాభిమానావధారంబులును, వైచిత్ర్యాదిచతుష్టయమును, దిగ్వాతార్కాదిచతుర్దశేంద్రియాధిష్ఠానదేవతలును, అనునవి యన్నియుఁగూడి తొంబదియాఱు తత్త్వములు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౫. భువనాధ్వము:—భద్రకాళి వీరభద్ర త్రిలోచనసభ లిప్సువివాహసంవాహ త్రిదశేశ్వరత్ర్యక్ష విభుశంభుదంష్ట్రవజ్రఫణీంద్ర ఉదుంబరగ్రసన మారుతాసనక్రోధ అనంత వృషధర వృషబలి ప్రియ భూతపాల జ్యేష్ఠ శర్వసురేశ్వర వేదపారగజ్ఞానభూ సర్వజ్ఞ ఈశానవిద్యాధిప ప్రకామదప్రసాద శ్రీధర రత్నధర లక్ష్మీధర జటాధర సౌమ్య ధర ధన్యరూప నిధీశ మేఘవాహన కపర్దిపంచశిఖ పంచాంతక క్షయాంతకతీక్ష్ణ సూక్ష్మ వాయువేగ లఘు శీఘ్ర సునాదమేసునాదజలాంతక దీర్ఘబాహు జయభద్ర శ్వేత మహా బల పాశహస్త అతిబల బలదంష్ట్ర లోహిత ధూమ్రవిరూపాక్ష ఊర్ధ్వకేశ భయాంతక క్రూరదంష్ట్రదంష్ట్రి మారణ నిర్మృతి ధర్మపతి అధర్మపతి వియోక్తసంయోక్తకర్త విధాత ధాతహర మృత్యు ధర్మఅక్షయాంతక భస్మాంతక వజ్రబాహు దహనజ్వలనహరఘాతుక పింగళహుతాశన అగ్నిరుద్ర త్రిదశాధిప పినాకిశాన్త అవ్యయ విభూతి వివర్ధన వజ్ర దేహబుధఅజకపాలీశ రుద్ర విష్ణు బ్రహ్మ హాటకేశ్వర కూశ్మాండ కాలాగ్నిరుద్ర శ్రీకర్ణ ఔమకౌమారవైష్ణవ బ్రాహ్మ్యాభైరవకృత అకృతస్థలేశ్వర సుబ్రాహ్మ్య పాజేశసౌమ్య ఇంద్రగాంధర్వ యక్షరాక్షసపైశాచ సుస్థలేశ్వర శంఖకర్ణ కాలాంజన మండలేశ్వర మహాండ ద్విరండ సకలాండస్థాణు స్వరాక్ష భద్రకర్ణగోకర్ణ మహాలయ అవిముక్త రుద్ర కోటివస్త్రాపద భీమేశ్వర మహేంద్ర అట్టహాస విమలేశ్వర నఖిల నాఖిల కురుక్షేత్ర గయాక్ష మహాభైరవ కేదార శ్రీశైల మహాకాళ మధ్యమేశ్వర అమ్రాదికేశ్వర జలేశ్వర హరిశ్చంద్ర అకులేశ్వర డుండిముండి భారభూతి ఔషధిపుష్కరనైమిశ అమరేశ్వర అంగుష్ఠమాత్రార్క ఈశాన ఏకేక్షణ ఏకపింగళ ఉద్భవ అభవ వామదేవ మహాద్యుతి శిఖేద ఏకవీర క్రోధ చండ శూర పంచాంతక సంవర్తజ్యోతిష మహాక్రోధ మహాదండ ఏకశివ అనంత అజ ఉమాపతి ప్రచండ ఏకపాద ఈశాన భవ ఉగ్ర భీమ అనంత సూక్ష్మ శివోత్తమ ఏకనేత్ర ఏకరుద్ర త్రిసూత్రశ్రీకంఠ శిఖండి వామజేష్ఠరౌద్రి కాళి కలవికర్ణ బలవికర్ణ బలప్రమథవ సర్వభూతదమన మనోన్మని అనాశ్రిత అనాధన అనంత వ్యోమరూపవ్యాపిని ఊర్ధ్వగామిని రోచిద మోచిక దీపిక ఇందిర శాంత్యతీత శాంతి విద్యాప్రతిష్ఠనివృత్తి అని భువనములు ఇన్నూటయిరువదినాలుగు.

౬. కళాధ్వము:—నివృత్తి, ప్రతిష్ఠ, విద్య, శాంతి, శాంత్యతీతమని కళలుఐదు. ఈ పంచ కళలలో మంత్ర పద వర్ణ తత్త్వభువనములును, ఈతత్త్వములలో భువనములు చేరియున్నవి. వీనివిశేషవివరణము కైవల్యనవనీత ప్రథమప్రకరణమున ఆఱువదియొక పద్యమునం జూడవలెను.

మఱియు సర్వసమయమంత్రములును సప్తకోటిభేదములు కలవై ఉండగా మంత్రాధ్వమందు పదునొకండు మంత్రములుమాత్రము చెప్పుటకు హేతువేమనిన:— పరమశివుని పంచముఖములయందే సకలాగమమంత్రములును పుట్టుటచేత సద్యోజాతా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పంచమంత్రములును ఆమంత్రములకు ముఖ్యములయిన షడంగ దేవతామంత్రములును చేరి పదునొకండుమంత్రము లని చెప్పఁబడెను.

మఱియు—శ్లో. 'మకారం మననం చైవ త్రకారం త్రాణముచ్యతే, మననత్రాణ మిత్యాహు ర్మంత్రమిత్యభిధీయతే.' అనున్యాయముచేత పరబ్రహ్మము మననమునకును రక్షణమునకును విలక్షణమగుటవలన మంత్రాధ్వాతీతమును సర్వదేశవ్యాపకత్వము గలుగుటవలన పదాధ్వాతీతమును అవర్ణమగుటవలన వర్ణాధ్వాతీతమును సర్వతత్త్వవిలక్షణమగుటవలన తత్త్వాధ్వాతీతమును సర్వస్వామి యగుటవలన భువనాధ్వాతీతమును నిష్కళ మగుటవలన కళాధ్వాతీతమును అగును.

శా. ఆకోనేరుగురూత్తముం గొలిచి దివ్యాధ్యాత్మయోగంబు దా
శ్రీకల్యాణగుణప్రసిద్ధుఁ డగుచున్ శ్రీమన్మహాదేవలో
కైకాచార్యుఁడు సంగ్రహించె నతిసౌఖ్యం బొప్ప సాందీపనిన్
శ్రీకృష్ణుండు భజించి విద్య నొనరం జేకొన్న చందంబునన్. 32

టీ. శ్రీకృష్ణుండు, సాందీపనిన్=సాందీపనియను గురువును, భజించి = సేవించి, విద్యలు = అఱువదినాలుగువిద్యలను, ఒనరన్ = ఒప్పునట్లుగా, చేకొన్నచందంబునన్ = గ్రహించిన విధమున, శ్రీమన్మహాదేవలోకైకాచార్యుఁడు=బ్రహ్మవేత్త యగుమహాదేవుఁడను లోకగురువు, ఆకోనేరుగురూత్తమున్ = ఆకోనేరుగురుశ్రేష్ఠుని, కొలిచి = సేవించి, తాన్ = తాను, శ్రీ...ప్రసిద్ధుఁడు-శ్రీ = మోక్షసమృద్ధిగల, కల్యాణగుణ = శాంతి, ఇంద్రియ నిగ్రహము మొదలగు సద్గుణములతో, ప్రసిద్ధుఁడు అగుచున్ = ప్రసిద్ధిఁ జెందుచు, అతిసౌఖ్యంబు = అధికమగునానందము (లేక, మోక్షసుఖము), ఒప్పన్ = కలుగునట్లుగా, దివ్యాధ్యాత్మయోగంబున్ = ఉత్తమమగు జీవబ్రహ్మైక్యమును (లేక దానికి సాధన మగురాజయోగమును), సంగ్రహించెన్ = తెలిసికొనెను.

తా. శ్రీకృష్ణమూర్తి సాందీపని సేవించి అఱువదినాలుగువిద్యలను గ్రహించినట్లు బ్రహ్మవేత్తయగు మహాదేవుండనుగురువరుండు మనోనిగ్రహము, ఇంద్రియనిగ్రహము మొదలగు సమస్త సద్గుణములకు నిధియైన యాకోనేరుగురువు నాశ్రయించి జీవబ్రహ్మైక్యమును దెలిసికొనుటకు ముఖ్యసాధన (సుఖసాధన) మగురాజయోగమును గ్రహించి బ్రహ్మానందమును వైకొనియెను.

## చతుష్షష్టికలావివరణము.

అఱువదినాలుగు విద్యలు:—శ్లో. ఇతిహాసాగమా చైవ కావ్యాలంకార నాటకమ్, గాయకత్వం కవిత్వం చ కామశాస్త్రం దురోదరం. దేశభాషాలిపిజ్ఞానం లిపికర్మ చ వాచకం, సర్వాణి చావధానాని స్వరశాస్త్రం చ శాకునం. సాముద్రికం రత్నశాస్త్రం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రథాశ్వగజకౌశలం, మల్లశాస్త్రం సూదకర్మ భూరుహాణాం చ దోహదం. గంధవాదో ధాతువాదః ఖనివాదో రసస్యచ, జాలవాదోఽగ్నిసంస్తంభో ఖడ్గస్తంభో జలస్య చ. వాచస్తంభో వయస్తంభో వశ్యాకర్షణమోహనం, విద్వేషణోచ్చాటనం చ మారణం కాలవంచనం. పరకాయప్రవేశశ్చ పాదుకాసిద్ధి రేవ చ, వాక్సిద్ధి ర్ఘుటికాసిద్ధి రైంద్రజాలిక మేవ చ. అంజనం పరదృష్టే స్తు వంచనం స్వరవంచనం, మణిమంత్రౌషధాదీనాం సిద్ధయ శ్చోరకర్మ చ. చిత్రలోహాశ్మమృద్దారువేణు చర్మాంబరక్రియాః, అదృశ్యకరణం దండకరణం మృగయానిధిః. వాణిజ్యం పాశుపాల్యం చ కృషి రాసవకర్మచ, లావకుక్కుటమేషాదియుద్ధకారక కౌశలం, చతుష్షష్టికలా స్త్వేతాః కలావిద్భిః ప్రకీర్తితాః.

## చతుర్దశవిద్యలు.

పదునాలుగువిద్యలు:—శ్లో. 'అంగాని వేదా శ్చత్వారో మీమాంసాన్యాయవిస్తరః, పురాణం ధర్మశాస్త్రం చ విద్యా హ్యేతా శ్చతుర్దశ.'

## అష్టాదశవిద్యలు.

పదునెనిమిదివిద్యలు:—శ్లో. 'ఆయుర్వేదో ధనుర్వేదో నీతిశాస్త్రార్థశాస్త్రయోః, వేదాంగాని చ వేదాని మీమాంసా న్యాయవిస్తరః, ధర్మశాస్త్రపురాణం చ విద్యా హ్యష్టాదశాయితి.'

సీ. అఖిలభూతంబుల నాడించుమాయను
        సొంపుగా నెవ్వఁ డాడింపుచుండు
    గురుజనంబుల కెల్ల గురువులై తగుహరి
        హరుల కెవ్వఁడు గురు వగుచు నుండు
    వివిధలోకంబుల వెలిఁగించు వెలుఁగుల
        మించి యెవ్వఁడు వెలిఁగించు చుండుఁ
    బ్రభువుల కెల్ల సత్ప్రభు వైన బ్రహ్మకుఁ
        బ్రభుఁ డౌచు నెవ్వఁడు పరఁగుచుండు
తే. సగుణనిర్గుణరూపుఁ డై నెగడుచుండు
    నమ్మహాదేవగురువరు నభినుతింప
    సకలనిగమాగమాంతశాస్త్రంబు లోప
    వనఁగ మముఁబోంట్లకు నుతింప నలవి యగునె? 33

టీ. ఎవ్వఁడు = ఏమహానుభావుఁడు, అఖిలభూతంబులన్ = సమస్తజీవులను, ఆడించుమాయనున్ = శరీరాదులయందు ఆత్మ యనుబుద్ధిని గలిగించి భ్రమింపఁజేయు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నట్టిమాయను, సొంపుగాన్ = అందముగ, ఆడించుచున్ ఉండున్ = నటింపఁజేయుచుండునో (సర్వకార్యములయందు ప్రవర్తింపఁ జేయుచుండునో), ఎవ్వఁడు, గురు జనంబుల కెల్లన్ = గురువు లగువారలకందఱకును, గురువులు ఐ = ఆచార్యులై (లోక జనకులై), తగుహరిహరులకున్ = ఒప్పునట్టి విష్ణురుద్రులకు, గురువు అగుచున్ = ఆచార్యుఁడై (లోక జనకుఁడై), ఉండున్ = ఉండునో, ఎవ్వఁడు, వివిధలోకంబులన్= సకలవిధము లగుప్రపంచములను, వెలిఁగించువెలుఁగులన్ = ప్రకాశింపఁజేయు సూర్య చంద్రాగ్నులను, మించి = అతిశయించి (సూర్యాదులకంటె నధిక మగుప్రకాశముగల వాఁడై యనుట.), వెలిఁగించుచున్ ఉండున్ = ప్రకాశింపఁజేయుచుండునో (పర బ్రహ్మముయొక్క ప్రకాశమువలననే చంద్రుఁడు సూర్యుఁడు అగ్ని మొదలగు తేజస్సులు ప్రకాశించుచున్నవి యని భావము.), ఎవ్వఁడు = ఏమహానుభావుఁడు, ప్రభువులకున్ ఎల్లన్=ఇంద్రుఁడు మొదలగు లోకపాలకులకందఱికింగూడ, సత్, ప్రభువు= అధిపతి. అయిన బ్రహ్మకున్=అగునట్టిహిరణ్యగర్భునకు, ప్రభుఁడు అగుచున్ = నియామకుఁడై (అధికారియై), పరఁగుచున్ ఉండున్ = ప్రకాశించుచుండునో (ఇట్లు చెప్పుటచే, బ్రహ్మ విష్ణువు రుద్రుఁడు ఈశ్వరుఁడు సదాశివుఁడు అనునట్టి పంచభూతసృష్టి కర్తలందఱకును నియామకుఁడు అనినట్లయ్యెనని తెలిసికొనునది.), ఎవ్వఁడు, సగుణ... డై-సగుణ=శాంతి మొదలగుసద్గుణములతోఁ గూడి (ఉపాసన చేయుటకుఁ దగినదియై, చిత్తశుద్ధిని గలిగింప సాధనమైనట్టియు), నిర్గుణ = గుణము లేవియును లేనిదై (నిర్వికల్పముగ ధ్యానించుటకుఁ దగినదియై యుండునట్టియు), రూపుఁడు ఐ = రూపములు గలవాఁడై, నెగడుచుండున్, ప్రకాశించుచుండునో, అమ్మహాదేవ గురువరున్ = అట్టి మహాదేవాచార్యుని, అభినుతింప=స్తోత్రము చేయుటకు, సకల...ములు-సకల=సమస్తములైన, నిగమ=వేదములయొక్కయు, ఆగమ=కామికము మొదలగు నిరువదియెనిమిది యాగమములయొక్కయు, అంత=తుదలు, (వేదములకు అంతములగు నుపనిషత్తులును, ఆగమముల కంతము లగుచర్యా, క్రియా, యోగ, జ్ఞాన పాదము లనునాల్గింటియందుఁ జెప్పఁబడు షడధ్వములతోఁ గూడిన కర్మసాదాఖ్య కర్తృసాదాఖ్య అమూర్తిసాదాఖ్య మూర్తిసాదాఖ్య శివసాదాఖ్య మహాసాదాఖ్యములును), శాస్త్రంబులు=బ్రహ్మసూత్రములు మొదలగు వేదాంతశాస్త్రములును, ఓపవు=సమర్థములుకావు (ఈపద్యమున మహాదేవాచార్యునకును పరబ్రహ్మమునకును అభేదమును జెప్పెను). అనినన్=అని చెప్పఁగా, మముబోంట్లకున్=మాయట్టి యల్పజ్ఞులకు, నుతింపన్=స్తోత్రము చేయుటకు, అలవి అగునె=శక్యమగునా?

తా. ఆమహాదేవాచార్యుఁడు సకలజీవులను సంసారభ్రాంతిలోఁ జిక్కించి త్రిప్పునట్టి మాయను దనచేఁ జిక్కించుకొని త్రిప్పుచున్నాఁడు. గురువు లని చెప్పఁదగువారల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కందఱకు నాచార్యులై సకలజగత్తులకును గారణభూతులై యుండు హరిహరులకుఁ గూడ జ్ఞానోపదేశకుఁడై కారణభూతుఁడై యున్నాఁడు. నానావిధములగు ప్రపంచములను గూడ నపరిమిత మగుశక్తితోఁ బ్రకాశింపఁజేయుఁ సూర్యాదులకుఁగూడఁ గాంతి నొసంగు చున్నాఁడు. ఇంద్రుఁడు యముఁడు మొదలగు సమస్తలోకపాలకులకునుగూడ నాజ్ఞాపించుచు వారల కధిపతియై యున్న చతుర్ముఖునకుఁ గూడ ప్రభువై యున్నాఁడు. ఆయాచార్యుని రూపము సగుణమై ఉపాసకుల ననుగ్రహించుచుండును. నిర్గుణమై నిర్వికల్పముగ ధ్యానింపఁబడుచు, నపరోక్షజ్ఞానమునకు విషయమై మోక్షమును గోరువారి దయఁ జూచుచుండును. ఇట్టి మహాప్రభావసంపన్నుఁ డగు నాగురుశ్రేష్ఠుని వేదాంతములో నుపనిషత్తులు గాని ఆగమాంతము లగు షడధ్వసహితములైన కర్మసాదాఖ్యము మొదలగు నవిగాని బ్రహ్మసూత్రము మొదలగు శాస్త్రములు గాని వర్ణింపనేరవు. ఇట్లుండ నమ్మహాత్ముని వర్ణింప నే నెంతవాఁడను?

అవ. ఇట్లు విద్యావంశమును వర్ణించి మిగుల సంక్షేపముగ జన్మవంశమును వర్ణించు చున్నాఁడు.—

తే. అమ్మహాదేవగురుచరణారవింద
వరపరాగాంశభజనతత్పరుఁడఁ బరశు
రామపంతులకులజాత రామమంత్రి
మౌళితిమ్మాంబికాప్రియాత్మజుఁడ నేను. 34

టీ. అ...రుఁడన్-అమ్మహాదేవగురు = కోనేరుగురునకు శిష్యుఁడైన యామహాదేవాచార్యునియొక్క, చరణారవింద=పాదపద్మముయొక్క, వర=శ్రేష్ఠమైన, పరాగ=రేణువుయొక్క, అంశ=అల్పభాగమును (స్వల్ప మగుపాదధూళిని), భజన=సేవించుట యందు, తత్పరుఁడన్=ఆసక్తి గలవాఁడను (ఆమహాదేవాచార్యుని శిష్యుఁడను అనుట.), పరశు...జుఁడన్=పరశురామపంతులకులమందుఁ బుట్టిన (ఈకవి యింటిపేరు పరశురామపంతులవారు), రామమంత్రి మౌళి=మంత్రులలో నుత్తముఁడగు రామయ్య అను వానికిని, తిమ్మాంబికా=తిమ్మాంబ యనునామెకును, ప్రియాత్మజుఁడన్=ప్రియపుత్త్రుఁడను (ఈకవిపేరు లింగమూర్తి, గురుమూర్తి), అయిన నేను.

తా. కోనేరుగురుశిష్యుఁ డగునామహాదేవాచార్యునకు శిష్యుఁడనై పరశురామపంతుల రామయ్యకును తిమ్మాంబికకును పుత్త్రుఁడనై యున్న నేను. (ఈపద్యము షష్ఠ్యంతములతోను వానికావలనుండు వచనముతోను జేర్చి యేకవాక్యముగా నన్వయించుకొనవలయును.)

క. శ్రీరామనామమంత్రా, కారునకు నసంగనిర్వికారునకు మహా
కారునకు నిర్వికారుహం, కారుని జ్ఞానము ... రునకున్. 35

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. శ్రీరా...నకున్ - శ్రీరామ=రాముఁడనియెడు, నామ= పేరు గలిగినట్టియు, మంత్ర=తారకమంత్రమే, ఆకారునకున్=స్వరూపముగాఁ గలిగినట్టియు (రామదేవతా స్వరూపుఁడైనట్టియు, తారకమంత్రరూపుఁడైనట్టియు), అ...నకున్-అసంగ=ప్రపంచ వికారములతోఁ సంబంధము లేనట్టియు, నిర్వికారునకున్=షడ్వికారములు లేనట్టియు, (అస్తి=కలఁడు, జాయతే=పుట్టుచున్నాఁడు, వర్ధతే=వృద్ధిఁజెందుచున్నాఁడు, విపరిణమతే=మార్పునొందుచున్నాఁడు, అపక్షీయతే=క్షీణించుచున్నాఁడు. నశ్యతి=నాశనముఁను జెందుచున్నాఁడు. అని చెప్పుటకు వీలైనస్థితులు ఆఱును వికారము లనఁబడును.) మహాకారునకున్=సర్వవ్యాపక మైన (లేక విరాట్పురుషరూపమైన) ఆకారము గలిగినట్టియు, (ఇచ్చట మహోంకారునకున్ అని పాఠాంతరము గలదు. అప్పుడు "పూజనీయమైన ఓంకారమే స్వరూపముగాఁ గలవాఁడు" అని యర్థము.) ని...నకున్-నిర్జిత=జయింపఁబడిన, అహంకారునకున్=అహంకారము గలిగినట్టియు, అ...నకున్-అజ్ఞాన భూమికా= ఏడువిధము లగు అజ్ఞానభూమికలకు, దూరునకున్=దూర మైనట్టియు (అజ్ఞాన భూమికలు లేనట్టియు).

తా. శ్రీరామస్వరూపుఁడును, తారకమంత్రమే యాకారముగఁ గలవాఁడును, ప్రపంచముతోఁ గాని, యందలివికారములతోఁ గాని సంబంధము లేనివాఁడును, గర్భస్థుఁడగుట పుట్టుట వృద్ధిఁజెందుట మార్పునొందుట (లేక, ముసలితనమునొందుట) క్షీణించుట చచ్చుట యనియెడునాఱువికారములు లేనివాఁడును, విరాట్పురుషరూపుఁడును, అహంకారమును జయించినవాఁడును, అజ్ఞానభూమికలయందుఁ జిక్కఁబడనివాఁడును.

## అజ్ఞానభూమికావివరణము.

బీజజాగ్రము, జాగ్రము, మహాజాగ్రము, జాగ్రత్స్వప్నము, స్వప్నము, స్వప్నజాగ్రము, సుషుప్తి అని అజ్ఞానభూమిక లేడు. 1 అందు నామరూపరహితాఖండ పరిపూర్ణసచ్చిదానందపరబ్రహ్మమందు జగత్సృష్టికి కారణముగఁ గలిగిన తెలివియే బీజజాగ్రము; 2 అవిభక్తమగునా తెలివికి ముందులేని భేదము సూక్ష్మముగఁ గలిగి ప్రపంచాభిముఖమగుట జాగ్రము; 3 ఆలోకవాసన ప్రబలుట మహాజాగ్రము; 4 జాగ్రద్దశయందు చూడనివి సంకల్పించి, నిష్ప్రయోజకముగ మనోరాజ్యమేలుట జాగ్రత్స్వప్నము; 5 ఆజాగ్రమందు కల్పితస్వరూపములఁ జూచుట స్వప్నము; 6 మఱచి దానిఁ దలఁచుట స్వప్నజాగ్రము; 7 ఆత్మ ప్రతిబింబముగాఁ దోఁచుచున్న జగద్విషయము సుఖమని దాన మునుఁగుట సుషుప్తి.

క. ధీరునకు భక్తజనమందారునకు నిరంతరాత్మ్యుదారునకు నిరా
ధారునకు నిఖిలజగదాధారునకు వనాద్యఖండితశరీరునకున్. 36

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ధీరునకున్ = ఆత్మానాత్మజ్ఞానముగలిగినట్టియు, భక్త...నకున్-భక్తజన = భక్తులగువారికి (శిష్యు లగువారికి) మందారునకున్=కల్పవృక్షమువంటివాఁ డగునట్టియు (తత్త్వార్థమును జక్కఁగ నుపదేశించి బ్రహ్మానందానుభవము నొసఁగునట్టియు అనుట) నిరం...నకున్-నిరంతర=ఎప్పుడును, అత్యుదారునకున్=మిగుల దానము చేయునట్టియు (మహాత్యాగియైనట్టియు), నిరాధారునకున్ = వేఱొకపదార్థము తన కాధారముగ లేనట్టియు, సకల జగదాధారునకున్=సమస్తప్రపంచమునకు ఆధారభూతుఁడైనట్టియు, అనా...నకున్ - అనాది = పుట్టుక లేనట్టియు, అఖండిత = నాశనము లేనట్టియు, శరీరునకున్=శరీరముగలవాఁడును.

తా. స్వయముగ సంపూర్ణమగు పరబ్రహ్మజ్ఞానము గలిగి కల్పవృక్షమువలె నాశ్రితు లగుశిష్యులఁ గృతార్థులఁజేయుచు, మహాత్యాగి యై యుండువాఁడును, తాను మఱియొకయాధారము నపేక్షింపక స్వతంత్రుఁడై నిలిచి తనయందు సకల ప్రపంచమును స్థిరముగ నిలుపుకొని యుండువాఁడును, ఉత్పత్తివినాశములు లేనివాఁడును.

మహాత్యాగిలక్షణము.

క. జనియును మృతియును ధర్మం,బు నధర్మము సౌఖ్యదుఃఖములు లేవని నె
మ్మనమునఁ దలంచు నెవ్వం, డనఘమతీ యతఁడపో మహాత్యాగి ధరన్.

క. వ్యాపకునకుఁ ద్రిశరీరా, లేపకునకు నిర్జితావలేపకునకు ధీ
దీపకునకు సచ్చిత్సుఖ,రూపకున కనంతవిశ్వరూపాత్మునకున్. 37

టీ. వ్యాపకునకున్ = సర్వమును వ్యాపించియున్నవాఁడును, త్రి...నకున్ - త్రిశరీర = స్థూలసూక్ష్మ కారణశరీరములను (లేక, శరీరములయందు), ఆలేపకునకున్ = సంబంధము లేనివాఁడును, నిర్జిత అవలేపకునకున్=జయింపఁబడిన గర్వము గలవాఁడును (ఇచ్చట గర్వ మని చెప్పుటచే, సర్వవిధము లగుదుర్గుణములను గూర్చియుఁ జెప్పినట్లె యని యూహించునది.), ధీ దీపకునకున్ = తనజ్ఞానశక్తిచే బుద్ధిని బ్రకాశింపఁజేయువాఁడును, సత్ చిత్ సుఖరూపకునకున్=సచ్చిదానంద స్వరూపుఁడును, అ...నకున్-అనంత=తుదిలేని, విశ్వ=ప్రపంచమె, రూప = స్వరూపముగాఁగల పరబ్రహ్మమే, ఆత్మ నకున్=శరీరముగాఁగలవాఁడును, (పరబ్రహ్మరూపుఁడును అనుట.)

తా. సకలలోకములను వ్యాపించి, స్థూలసూక్ష్మ కారణశరీరములతో (వానివికారములతో) సంబంధపడక గర్వము మొదలగు సకల దుర్గుణములను జయించి యుండువాఁడును, తనజ్ఞానశక్తిచే బుద్ధిని బ్రకాశింపఁజేయువాఁడును, సచ్చిదానంద స్వరూపుఁడును, సకలప్రపంచమయుఁడును అయినపరబ్రహ్మమే తానై యుండువాఁడును.

క. శ్రీమద్దత్తాత్రేయమహా,మునిసదృశునకు శ్రీమహాదేవగురు
స్వామికిఁ దతసర్వాంత,ర్యామికి విజ్ఞానభూమి నాథామునకున్. 38

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. శ్రీమ...నర్క-శ్రీమత్ = సంపద్యుక్తుఁడైన, దత్తాత్రేయమహాముని = దత్తాత్రేయుఁడను యోగీశ్వరుతోడ, (వైదికసంప్రదాయము నశించినకాలమున దానిని మరల నుద్ధరించుటకై యత్రిమహామునికి దత్తాత్రేయుఁడను పేర విష్ణువు జన్మించెనని యొకగాథ కలదు) సదృశునర్క=సమానుఁడైనవాఁడును, తత...కిక్-తత= విస్తారమైన, సర్వ=సమస్తమునకును (నానావిధము లగు సకలప్రపంచమునకును అనుట.) అంతర్యామికిక్=లోపల నుండి నియమించినవాఁడును (అనఁగా: ప్రతిభూతములను వాని వాని కార్యములయందుఁ బ్రవర్తింపఁజేయువాఁడును), వి...నర్క-విజ్ఞానభూమికా = ఏడుజ్ఞానభూమికలే, ఆరామునర్క=విహారస్థానములుగాఁ గలవాఁడును (జ్ఞాననిష్ఠుఁడు ననుట), అగు, శ్రీమ...కిక్-శ్రీ = శోభాయుక్తుఁడైన (లేక బ్రహ్మజ్ఞానవంతుఁడైన), మహాదేవగురుస్వామికిక్=ఆచార్యస్వామి యగు మహాదేవునకు.

తా. అత్రిమహాముని దత్తాత్రేయరూపముతో నవతరించిన శ్రీమన్నారాయణునితో సమానుఁడును, సకలలోకములకు నంతర్యామిస్వరూపుఁడును, జీవబ్రహ్మైక్య సమాధినిష్ఠుఁడును ఆచార్యులలో నుత్తముఁడు నగుమహాదేవాచార్యునకు.

## జ్ఞానభూమికావివరణము.

శుభేచ్ఛ, విచారణ, తనుమానస, సత్త్వాపత్తి, సంసక్తినామిక, పదార్థభావని, తుర్యగ అని జ్ఞానభూమికలేడు. అందు శుభేచ్ఛయనఁగా: బహుజన్మార్జిత సుకృత పరిపాకమువలనఁ గాకతాళీయన్యాయముగ దైవికముచేత జ్ఞానముగలవాఁడై, "అయ్యో నేనేల మూఢుఁడ నయితిని ? ఈయపార సంసారసాగర మెట్లు దాఁటఁగల"నని పరితపించి సజ్జనులచేరువఁ జేరి వారి యపారకరుణాపూరసేవనంబున దురాపంబు లగుతాపంబులు దీఱి పిమ్మట వారల యుపదేశబలంబున సత్కర్మాచరణమును వేదాంతశాస్త్రపరిజ్ఞానమును ఇహపరలోకభోగవిరక్తియుఁ గలిగి మోక్షము నపేక్షించుట. విచారణ యనఁగా: అద్వైతశాస్త్రపరిజ్ఞానంబును సత్సంగమంబును వైరాగ్యంబును గలిగి బ్రహ్మ మెయ్యది యని విచారించుట. తనుమానసయనఁగా: ఈరెండు భూమికలసాధన పూర్ణముగఁ గలిగి దారుణము లగు విషయేంద్రియముల త్రిప్పులోఁ దగులక, మనసును క్షీణింపఁజేయుట. దీనికి అసంగమమని మఱియొకపేరు గలదు. ఆయసంగమము సామాన్యమని విశేషమని ద్వివిధము. మఱియు నది సామాన్యవిశేషభేదములచేత నాల్గు విధములు. అందు సామాన్యాసంగమమనఁగా: శబ్దాదివిషయములయందు నేను కర్తను భోక్తను గురువును శిష్యుఁడను బాధ్యుఁడను బాధకుఁడనుగాను. సుఖదుఃఖము లీశ్వరాధీనములు. యోగవియోగభోగరాగాదులు కాలవశములని యెంచి దేనియం దాశలేక యుండుట. సామాన్యసామాన్యాసంగమమనఁగా: సంచితకర్మములచేత లభ్యములైన సుఖ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుఃఖములయందు ప్రియాప్రియములు లేక, వాని నంటకముందు విచారించిన వేదాంత మహావాక్యార్థనిశ్చయమందుఁ జేరుట. విశేషాసంగమమనఁగా: సత్సహవాసమువలనను, అపరోక్షజ్ఞానమువలనను, పురుషప్రయత్నమువలనను, జ్ఞానశాస్త్రములసంగతాభ్యాసము వలనను, పరమవస్తువు కరతలామలకమై కనఁబడుచుండఁగా, సంసారసాగరోత్తారకమై, పరతత్త్వస్థితిఁజెంది, సకలమునీశ్వరాధీనమనుటను, కర్మమే సుఖదుఃఖములకుఁ గారణమను టను మాని మౌనియై పరమశాంతి గలిగియుండుట. విశేషవిశేషాసంగమమనఁగా: బాహ్యాభ్యంతరములను ఊర్ధ్వాధః ప్రదేశములను దిక్కులను ఆకాశమును స్థావరజంగమజంతువులను చీఁకటి వెలుతురులను చిజ్జడములను సకలవస్తువులను అవస్థానుభవములను వేఱుగాఁ జూడక అఖండాకారముగఁ జూచుచు చిత్తవిశ్రాంతి గలిగి నిస్సంకల్పుఁడై ముందు దర్శించిన యాత్మయందు మనస్సుకరుగుట. ఈమూఁడు భూమికలలో దేనినైన నభ్యాసముచేయుతఱిని మృతులైనయోగులు దేవవిమానములయందు దేవతాస్త్రీలతో కూడి స్వర్గవైకుంఠకైలాసాది పుణ్యలోకములయందు సకలదివ్యభోగములు చిరకాల మనుభవించినవెనుక, శ్లో. "శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టో హి జాయతే, అథవా యోగినా మేవ కులే భవతి ధీమతాం." అను గీతావచనప్రకారముగ భూలోకంబున శ్రీమంతులయింటఁ బుట్టి పూర్వము తాను విడిచిన నెలవునఁ జేరి క్రమముగా నావల్ల భూమిక నెక్కును. మూఁడు భూమికలవఱకు జన్మము గలదు. తక్కిన భూమికలయందు జన్మము లేదు. సత్త్వాపత్తియనఁగా: ఈ మూఁడుభూమికల నభ్యసించి యింద్రియార్థములయం దాశ మాని శుద్ధాంతరంగుఁడయి యితరసంకల్పములు లేక బ్రహ్మనిష్ఠ గలిగి యుండుట. సంసక్తినామికయనఁగా: ఈనాల్గుభూమికల యభ్యాసమువలన విషయసంగమ గుణత్రయసంగమంబులు లేక బ్రహ్మనిష్ఠయందు పట్టుదప్పక యుండుట. పదార్థభావనయనఁగా: ఈయైదుభూమికల యభ్యాసవిశేషముచేత అంతర్బహిర్మధ్యదృశ్యములు లేక స్వాత్మారాముఁడయి బ్రహ్మము నేననుట. తుర్యగ యనఁగా: ఈయాఱుభూమికల మార్గముల నెఱిఁగి యేమిట భేదములేమిఁ దెలిసి పరబ్రహ్మమాత్రముగా నుండుట. దీనిలో మొదటి మూఁడుభూమికలు జగద్వ్యాపారముగలవి గనుక జాగ్రదవస్థయగును. నాల్గవభూమికయందు నామరూపములుగల జగత్తు స్వప్నమువలె తోఁచును గాన అది స్వప్నావస్థయగును. ఇట్టి యనుభవముగలవాఁడే బ్రహ్మవిదుఁడు. ఐదవభూమిక నిర్వికల్పమై సుషుప్తివలె సుఖముగా జగము తోఁచుటవలన అది సుషుప్త్యవస్థయగును. అట్టి యనుభవముగలయోగియే బ్రహ్మవిద్వరుఁడు. ఆఱవభూమిక సర్వవాసనాక్షయమైనది గనుక గగనమున మునిఁగిన ఘటమువలె బాహ్యాభ్యంతరములు లేనిదై సముద్రమున మునిఁగినకుండవలె లోపల వెలుపల పరిపూర్ణమై జగము పరమాత్మప్రకాశముగాఁ దోఁచుటవలన, అదియే తురీయావస్థ. ఇట్టి అనుభవము గలవాఁడే బ్రహ్మవిద్వరీయుఁడు. ఇదియే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జీవన్ముక్తి. సప్తమభూమిక అవాఙ్మానసగోచరము. దానిని బ్రహ్మ విష్ణు రుద్ర జీవ శూన్య కాల ప్రధానాదినామములచే వెక్కండ్రు వెకుగతులఁ జేర్కొందురు. అది నామ రూపములు లేనిదైనను కల్పితనామరూపములచేఁ జెప్పఁబడును. అట్టి యనుభవముగల యోగియే బ్రహ్మవిద్వరిష్ఠుఁడు; అదియే విదేహముక్తి.

వ. సమర్పితంబుగా నాయొనర్పం బూనిన శ్రీసీతారామాంజనేయసంవా
దంబను వేదాంతగ్రంథమునకుఁ గథాప్రారంభం బెట్టి దనిన. 39

టీ. సమర్పితంబుగాన్=సమర్పణము చేసి (కృతియిచ్చి), నాయొనర్పంబూనిన= నేను రచించుటకుఁ బూనుకొన్న, శ్రీసీతారామాంజనేయసంవాదం బను వేదాంతగ్రంథ మునకున్=శోభాయుక్త మగుసీతారామాంజనేయసంవాద మను పేరు గలయద్వైత గ్రంథమునకు, కథాప్రారంభంబు=కథయొక్క యారంభము (లేక, క్రమము=గ్రంథము నందలి విషయములు విచారించుట), ఎట్టిది అనినన్=ఏవిధమైన దనఁగా.

తా. ఇట్లు గురుపరంపర నభివర్ణించి, పరశురామపంతుల రామయామాత్యపుత్త్రుఁ డగు నేను (లింగమూర్తి గురుమూర్తి యనువాఁడను) నాగురువగు మహాదేవాచార్యు నకుఁ గృతి యిచ్చి సీతారామాంజనేయసంవాద మను పేరు గల యొక యద్వైతగ్రంథ మును రచియింప నుపక్రమించితిని. దానియందలి విషయముల నీక్రిందఁ గ్రమక్రమ ముగా వివరించెదను.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీ ర స్తు.

# శ్రీసీతారామాంజనేయసంవాదము

## ప్ర థ మా శ్వా స ము.

---

## క థా ప్రా రం భ ము.

---

### కైలాసపర్వతవర్ణనము.

అవ. ఈ గ్రంథమున వర్ణింపఁబడుచరిత్ర బ్రహ్మాండపురాణములోని గౌరీ శంకర సంవాదము గావున నావిషయమును మొట్టమొదట వర్ణించుటకై యా క్రిందఁ గైలాసపర్వతమును వర్ణించుచున్నాఁడు.—



సుఖదశుద్ధసత్త్వా
వాసము శివపార్వతీనివాసము సుమహా
భాసమనాభాసము కై
లాసము తనరారుఁ జిద్విలాసం బగుచున్. 40

టీ. శ్రీసు...సము - శ్రీ=సమృద్ధిగల, సుఖ = ధర్మార్థకామమోక్షములనియెడి పురుషార్థములవలనఁ గలుగుసుఖమును (లేక ఇహలోకమునందును, పరలోకమునందును, పరిపూర్ణ మగునానందమును), ద=ఇచ్చునట్టి, శుద్ధసత్త్వ=పరిశుద్ధ మగుసత్త్వగుణముగల (రజోగుణమును తమోగుణమును విడిచి పరిశుద్ధమగు సత్త్వగుణము నాశ్రయించి యున్న అనుట) మునులకు, ఆవాసము=నివాస మైనదియు, శివ...సము-శివ = శంకరునకును, పార్వతీ = పార్వతీదేవికిని, నివాసము=ఉనికిపట్టు అయినదియు, సు...సము - సుమహత్=మిక్కిలి యధిక మైన, భాసము (లేక ఆభాసము)=కాంతిగలదియు, అనాభాసము = తనపై నివసించువారలకుఁ గలదుర్గుణములను నశింపఁజేయఁనట్టిదియు, (అగు) కైలాసము = కైలాసపర్వతము, చిద్విలాసము = సత్యజ్ఞానానందస్వరూపు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డగు పరబ్రహ్మముయొక్క విలాసములవంటి విలాసములు గలది యై (పరబ్రహ్మమువలె ననుట), తనరారున్ = ఒప్పుచుండును. కే (శివయోః)లాసః యస్యసః = శిరస్సునందు (పార్వతీపరమేశ్వరుల) విలాసము గలది కేలాసము. కేలాస ఏవ కైలాసః = కేలాసమే కైలాసము, 'కీలయోః ఆసనం యస్యసః కీలాసః' = భూమియందును జలమునందును నివసించునది కీలాసము. అనఁగా: స్ఫటికము. (తస్య అయం కైలాసః = అస్ఫటికమునకు సంబంధించినది కైలాసము, స్ఫటికమయమైనది యనుట.)

తా. ధర్మార్థకామమోక్షంబుల నొసంగఁ జాలు సత్త్వగుణము నాశ్రయించి, పరమశాంతులై యున్న మునులకు నివాసమై తన్నాశ్రయించినవారలకుఁ గల అహంకారము మమకారము డంబము మొదలగు సకలదుర్గుణముల నడంచుచు, పరబ్రహ్మమునుంబోలె కైలాస మనునొకపర్వతము మిగుల ప్రకాశించుచుండును. దానిపై పరమానందముతో పార్వతీపరమేశ్వరులు నివసించుచుందురు. (పైపద్యమునందు చిద్విలాసము అనుటచేత కైలాసపర్వతమును పరబ్రహ్మముతో పోల్చి యున్నాఁడు. కావున నీ పద్యమునందుఁ బరబ్రహ్మపరముగ రెండవయర్థముకూడఁ గలదు. 'కేళీనాం సమూహః కైలం' కేళియనఁగా నానందము. వానియొక్క సమూహము కైల మనఁబడును. "కైలేన ఆస్యత ఇతి కైలాసః, కైలం ఆసో యస్య సః కైలాసః' కైలముచే నిలుచువాఁడు, కైలము ఉనికి గాఁ గలవాఁడు, ఆనందరూపుఁ డనుట. ఈవ్యుత్పత్తిచే కైలాస పదము పరబ్రహ్మమునందు కూడ వర్తించును.)

### బ్రహ్మపరమైన యర్థము.

టీ. శ్రీ=ధర్మార్థకామము లను సంపత్తును, సుఖ = పరమానందరూపమగు మోక్షమును, ద = (కర్మమార్గముచేతను, జ్ఞానమార్గముచేతను, తనను సేవించువారలకు) ఇచ్చునట్టి, శుద్ధసత్త్వ = రజోగుణములతోఁ గాని తమోగుణములతోఁ గాని కొంచెమైనను సంబంధములేని (లేక తిరస్కరింపఁబడని పరిశుద్ధ మగుసత్త్వగుణమె స్వరూపముగాఁ గలమాయకు), ఆవాసము = నివాసమైనట్టియు (మాయకంటె వేఱుగాక తనను కర్మయోగముచే సేవించువారలకు ధర్మార్థకామములను, జ్ఞానయోగముచే సేవించువారలకు మోక్షమును ఇచ్చునట్టి అని భావము.), శివ = ఆనందస్వరూపుఁడగు (లేక మంగళకరుఁడగు) పురుషునకును (జీవునకును), పార్వతి = మలినసత్త్వప్రధాన యగు నవిద్యకును, (జీవుఁడు బ్రహ్మమునకంటె వేఱుకాఁడు. అవిద్యయు మాయకంటె వేఱుకాదు. అగ్నికంటె దానియందున్న యుష్ణశక్తియు, యుష్ణశక్తికంటె నగ్నియు వేఱు కానట్లు పరబ్రహ్మమునకంటె మాయయు మాయకంటె పరబ్రహ్మంబును వేఱు కాదు. కావున నిచ్చట "జీవుఁడును అవిద్యయుఁను బ్రహ్మాయం దున్నవి" అని చెప్పఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బడియున్నది. పార్వతీశబ్దమునకు అవిద్యయని యర్థము చెప్పుట ఔపచారిక మని తెలిసికొనవలయును.) నివాసము, సుమహాభాసము = సూర్యుఁడు చంద్రుఁడు అగ్ని మొదలగువానిని ప్రకాశింపఁజేయఁజాలు తేజస్సుగలదియు, అనాభాసము = ఈశ్వరుఁడు జీవుఁడు ప్రపంచము అను మొదలగువికారము లేవియును లేనిదియు, అగ కైలాసము=పరబ్రహ్మము (లేక పర్వతము. ఇది యుపమాలంకారము కావున విశేషణములయందు మాత్రము శ్లేష యుండినఁజాలును. విశేష్యమగు కైలాసపదమునందుకూడ అర్థద్వయము నంగీకరించినచో శ్లేషాలంకారమగును.) చిద్విలాసంబుఅగుచుఁ, అపరోక్షజ్ఞానమే రూపముగాఁ గలదియై, తనరారుఁ.

తా. శుద్ధసత్త్వప్రధానమగుమాయకు నాశ్రయమై తనను కర్మయోగముచే నుపాసించువారలకు (బ్రహ్మము వేఱు; తాను వేఱు అను భేదదృష్టి కలిగి సుఖములు కావలయునని పరబ్రహ్మమును సగుణరూపముతో సేవించువారలకు అనుట.) ధర్మార్థకామముల నొసంగుచు, జ్ఞానయోగముచే నుపాసించువారలకు, (జీవబ్రహ్మైక్యమును తెలిసికొనిన వారలకు (మోక్షము నిచ్చుచు, జీవావిద్యలు తానే యై, నిర్వికారుఁడై సూర్యచంద్రాగ్నుల సహితము ప్రకాశింపఁ జేయఁజాలుదివ్యతేజస్సుతో జ్ఞానరూపుఁడగు నాపరబ్రహ్మము ప్రకాశించుచున్నది.

వ. అది మఱియు నాదిమధ్యాంతవిహీనంబును స్వజాతీయవిజాతీయ స్వగత భేదశూన్యంబును నిత్యాపరోక్షస్వప్రకాశాపహసితానంత కోటిసూర్యచంద్రానలాలోకంబును వేదశాస్త్రపురాణేతిహాసాగమాగమ్యంబును బహువిధవర్ణధర్మకర్మగుణనామరూపవికారశక్తి విరహితంబును బ్రహ్మేంద్రాద్యమరాసురోరగగరుడగంధర్వకిన్నర కింపురుష సిద్ధసాధ్య విద్యాధర చారణాప్సరోయక్షగుహ్యకభూత ఖేచర దేవర్షి బ్రహ్మఋషీశ్వర యోగీశ్వర మునీశ్వర యతీశ్వర కవీశ్వరాద్యుపాస్యంబును నిత్యనిర్గుణ నిర్వికల్ప నిర్వికార నిరంజన నిర్విషయాతీంద్రియావాఙ్మానసగోచరాప్రమేయ శుద్ధ బుద్ధ ముక్త కేవలాఖండ సచ్చిదానందమయంబునైన తురీయాతీత పరతత్త్వ కైలాసంబున నవ్యక్తమహదాది సప్తావరణపరివేష్టితంబును జతుర్దశ లోక కందర మందరంబును సార్వభౌమాది హిరణ్యగర్భాంతానంద గండశైలభాసురంబును భానుసోమనక్షత్ర తారాగ్రహ పావక సౌదామన్యాది వివిధ తేజోరత్న శర్కరిలంబును బ్రవిమల వైరాగ్యోపరత్యేకాంతాత్యంత ముముక్షుతాధిత్యకాధ్యాత్మానంద జీవనాభిషిక్తనిర్మల నిశ్చలతాకలితా కలితపవిత్ర నిష్కామకర్మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పాసనా యాగయోగ జపతప స్సత్యశౌచదయాశీల వ్రతదానాది నానావిధానోకహోద్యానవిరాజితంబును శాస్త్రపుష్పోపేత నిగమాగమాంత కల్పలతావిలసితంబును షడ్విధసమాధి సౌధవిభ్రాజితంబును బరమాధ్యాత్మ విద్యానంద జలాభిషిక్త నిర్మల చిత్తవృత్త్యంగణ శమదమోపరతితితిక్షాశ్రద్ధాసమాధానామానిత్వాదంభిత్వాది కల్యాణగుణ మణిగణ రంగవల్లీప్రకాశితంబును నిరతిశయకైవల్యభాండాగారశోభితంబును ఫలకామనాభావస్వభావనియతకర్మాచరణ చిత్తశుద్ధి సర్వకర్మపరిత్యాగ గురుభక్తి వేదాంతశ్రవణ మనన నిదిధ్యాసనజ్ఞానాది సోపానసమన్విత విజ్ఞానరాజమార్గలలితంబును బంచాక్షరీ మహామంత్ర మాణిక్యతోరణాలంకృతంబును బ్రణవనాద మంగళవాద్యరవ పూరితంబును నగు తురీయ మహాస్థాన మంటపాంతరంబున సర్వోపనిషత్సారభూతబ్రహ్మాత్మైకత్వదర్శనరూపోంకారసింహాసనాసీనుండై శుద్ధసత్వప్రధానమాయామయదివ్యశోభన విగ్రహుండును సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వసర్వాంతర్యామిత్వసర్వస్రష్టృత్వసర్వరక్షకత్వసర్వసంహారకత్వాద్యగణితసమగ్రసుగుణపరిగ్రహుండును సత్యజ్ఞానానందస్వరూపుండును సర్వవ్యాపకుండును దేవదేవుండునగు శ్రీమహాదేవుండు మూర్తిమంతంబులైనచతుర్వింశతి తత్త్వంబులును నిచ్ఛాజ్ఞానక్రియాదిశక్తులును హృషీకేశ్వరవాణీశ్వర సురేశ్వర నందికేశ్వర భృంగీశ్వర విఘ్నేశ్వరకుమారాది ప్రమథగణాధీశ్వరులును బ్రాహ్మీమాహేశ్వరాదిసప్తమాతృకలును స్వసాన్నిధ్యంబున నిజకరుణాకటాక్షవీక్షణంబు నవేక్షించి కొలువ స్వస్వరూపావలోకనంబు సేయుచు నాత్మారాముఁడై యున్నసమయంబునఁ దదీయవామార్ధశరీరిణియుఁ బరాపరప్రకృతిస్వరూపిణియు నిఖిలజగదుపాదానకారణభూతయు నఖిలలోకైకమాతయుఁ द్రిభువనగేహినియు విశ్వమోహినియు ధీముఖియు జ్ఞానవిజ్ఞానలోచనయు విషయవిరక్త్యధరయు విచారమందస్మితయు నిర్మమతానిరహంతాహస్తయు యోగబోధస్తనియు సందేహమధ్యయుసంసారచక్రనాభియు రాగద్వేషజఘనయుఁ గామలోభోరుయుగళయు సంకల్పవికల్పచరణయుఁ గాలానుగతకర్మయానయు వేదాంతవిద్యాయానమనోహరతిరంచుకధారిణియు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రజస్సత్త్వతమోగుణగ్రంథినీవీబంధకంచుకబంధ వేణీబంధ సురుచి రయు ఫలత్యాగపూర్వవర్ణాశ్రమోచితధర్మానుష్ఠానేశ్వరప్రణిధానాచార్యోపాసనేంద్రియాత్మవినిగ్రహస్థితప్రజ్ఞత్వాది సాత్త్విక గుణభూషణాలంకారిణియు శుద్ధవాసనావాసితయు నిత్యానపాయినియు దేవదేవియు నగుశ్రీమహాదేవి యతిప్రీతిపూర్వకంబుగాం జతుర్విధశుశ్రూషలు గావించుచు సేవించుచుం బూజించుచు భావించుచు నమస్కరించుచు నారాధించినం బ్రసన్నుండై మెచ్చి నీకు నెయ్యది యిష్టం బిచ్చెద నడుగు మనిన సంతోషభరితచిత్తయై యమ్మత్తకాశిని చిఱునవ్వు నగుచు నిట్లనియె. 41

టీ. అది=ఆమహాకైలాసపర్వతము, (పరబ్రహ్మమనియు రెండవయర్థముకలదు. ఈవచనమునందు పరబ్రహ్మమునకును, కైలాసమునకును అభేదమును వర్ణించుచున్నాడు.) మఱియుఁ, ఆది...నంబును-ఆది=మొదలు, మధ్య=నడుమ, అంత=తుదియు, విహీనంబును = లేనిదియు (పర్వతపక్షమునందు మిగుల విశాలమైన దనియు, బ్రహ్మపక్షమునందు ఉత్పత్తిస్థితివినాశములు లేనిదనియు నర్థము.), స్వజా...బును-స్వజాతీయ = తనజాతికి సంబంధించినవానివలనఁ గాని, విజాతీయ = మఱియొకజాతికి సంబంధించిన వస్తువులవలనఁ గాని, స్వగత=తనయందేయున్న యనేకపదార్థములవల్లఁ గాని కలుగు, భేద=భేదముతో, శూన్యంబును=లేనిదియును, ('ఏక మే వాద్వితీయం బ్రహ్మ' అను శ్రుతిప్రకారము ఆ పరబ్రహ్మమునకు తనజాతిలోఁ జేరిన మఱియొక బ్రహ్మవలనఁ గాని యితరజాతిలోఁ జేరిన మాయాప్రపంచము మొదలగువానివలనఁ గాని, తనలోపలనే యుండు నింద్రియములు మనస్సు మొదలగువానివల్లఁగాని భేదము లేదు. అనఁగా: ఆయనయొక్కఁడే యనుట. ఈవిశేషణమునకు పర్వతపక్షమున నంతచక్కని యర్థము దొరకుట లేదు. అయినను అనేకపర్వతములును, వృక్షములును, భేద మేర్పఱుచుటకు వీలులేకుండ చుట్టు నావరించియున్న వనియు, ఆపర్వతముపై మొలచియున్న తీఁగెలు మొదలగునవి కూడ నట్లె దాని నావరించి యున్నవని కాని; లేక, ప్రపంచమునందున్న సకల పర్వతములును, వృక్షములు రాళ్లు మొదలగునవియును, ఆపర్వతమునందు మొలచియున్న తీఁగెలు మొదలగునవియును అనఁగా: ప్రపంచమంతయు, ఆకైలాసపర్వతముయొక్క కాంతిచే తెల్లనై యేది కైలాసమో యేది యితరపదార్థమో అను భేదమును కనిపెట్టుటకు వీలులేక; యున్నది అని కాని చెప్పవచ్చును.) నిత్య...లోకంబును - నిత్య = శాశ్వతమైన, అపరోక్ష = సకల జనులకును ప్రత్యక్షమైన (బ్రహ్మపక్షమునందు జ్ఞానులకు ప్రత్యక్షమైన), స్వప్రకాశ=తనయొక్క

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాంతిచే, అపహసిత = తిరస్కరింపఁబడిన, అనంతకోటి = లెక్కలేనికోట్లసంఖ్యగల, సూర్య = సూర్యులయొక్కయు, చంద్ర = చంద్రులయొక్కయు, అనల = అగ్నిహోత్రములయొక్కయు, ఆలోకంబును = కాంతి గలదియు (రెండుపక్షములయందును 'అపహోషి' అను స్థలమునతప్ప తక్కినచోట్ల సమానమే. అచ్చటివిశేషమును అచ్చటనే చూపియున్నాను.) వేద...బును-వేద=చతుర్వేదములచేతను, శాస్త్ర=ఆఱు శాస్త్రములచేతను, పురాణ=పదునెనిమిది పురాణములచేతను, ఇతిహాస=భారతరామాయణాదీతిహాసములచేతను, ఆగమ=కామికము మొదలగు నిరువదియెనిమిది ఆగమముల చేతను, అగమ్యంబును = చక్కఁగాఁ దెలియఁదగినదియును (పరబ్రహ్మపరమున, అగమ్యంబును = తెలియ నలవికానిదియును అనియర్థము), బహు...బును-బహువిధ=అనేక విధములగు, వర్ణ=నలుపు పసుపు మొదలగువర్ణములు, ధర్మ=(పొడుగగుట పొట్టియగుట మొదలగు) ధర్మములును, కర్మ=(కదలుట, నడచుట మొదలగు) పనులును, గుణ = (స్వభావసిద్ధములైన గుణములకంటె వేఱైన) గుణములును, నామ = (కైలాసము లనుపేరుకంటె వేఱగు) పేర్లును, రూప = (సహజమై యుండు తెలుపునకంటె వేఱైన) రూపంబును, వికార = (సిద్ధముగా నుండుట అనుదానికంటె వేఱగు) వికారములును, శక్తి = (కఠినముగానుండుట అనుదానికంటె నితరములగు) శక్తులును, (శిలయొక్కకఠినత్వము, అగ్నియొక్కవేఁడిమి, మంచుయొక్క చల్లఁదనము, ఇవి యన్నియు వానివానిశక్తు లనఁబడును.) విరహితంబు=లేనిదియు, (బ్రాహ్మణాదివర్ణములును, ఆవర్ణములకుఁ దగిన ధర్మములు, ఆచారములు, సత్త్వరజస్తమోగుణములు, సకలవిధము లగునామరూపములు, ఉండుట పుట్టుట మొదలగువికారములు, సర్వస్వతంత్రుఁడును, దేనితోను సంబంధపడకయుండుట, నాశరహితుఁ డగుట, అనాదియగువిజ్ఞానమే స్వరూపముగాఁ గలిగి యుండుట, సర్వమును దెలిసికొనుట, సర్వకాలములయందును తృప్తి గలిగి యుండుట అనునట్టి యాఱుశక్తులును, లేనివాఁడు అని పరబ్రహ్మపక్షమునం దర్థము.) బ్రహ్మే...బును-బ్రహ్మ = చతుర్ముఖుండును, ఇంద్ర = దేవేంద్రుఁడును, ఆది=మొదలుగాఁగల, అమర = దేవతలును, అసుర = రాక్షసులును, ఉరగ=అనంతుఁడు (వాసుకి మొదలగుసర్పములు)ను, గరుడ = గరుడులును, గంధర్వ = గంధర్వులును, కిన్నర = అశ్వముఖు (మనుష్యశరీరము గలకిన్నరు)లును, కింపురుష = (నరముఖము అశ్వశరీరము గల విశ్వావసు పరావసు ప్రభృతు లగు) కింపురుషులును, సిద్ధ, సాధ్య, విద్యాధర, చారణ (దేవేంద్రునిచారులు లోకవృత్తాంతమును దెలిసికొనివచ్చి, యాయనకుఁ జెప్పువారు.) అప్సరః = అప్సరసలు (రంభ ఊర్వశి మొదలగువారు), యక్ష = (కుబేరుఁడు మొదలగు) యక్షులును, గుహ్యక = (మాణిభద్రుఁడు మొదలైన) గుహ్యకులును, భూత = [illegible] లిప్పటి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వఱకు: జెప్పఁబడినవారందఱును దేవతలేయైనను, వేఱువేఱుజాతులు గలవారు గావున ప్రత్యేకముగాఁ జెప్పఁబడిరి.), ఖేచర = సూర్యాదులు, దేవర్షి = నారదాదులును, (వీరు దేవతలలోఁబుట్టి మునులైరి గావున దేవర్షు లనఁబడుచున్నారు) బ్రహ్మఋషీశ్వర సనకాదులును, (భక్తి యోగాదుల నవలంబింపక కేవలజ్ఞాననిష్ఠులై పరబ్రహ్మనిష్ఠులై యున్న మునులు గావున వీరలకు బ్రహ్మఋషు లని పేరు. బ్రాహ్మణులై జన్మించి ఋషులైనవారికిఁ గూడ నీపేరు గలదు గాని యీవిశేషణమునందు మునీశ్వర అని సామాన్యమునివాచికమగు పదము కలదు. గావున నిచ్చట నాయర్థముఁ జెప్పుటకు వీలులేదు. ఈపదము మొదలు విశేషణాంతరమువఱకు ప్రతిపదమునందును గానవచ్చు ఈశ్వరశబ్దము శ్రేష్ఠవాచకమని తెలిసికొనవలయును) యోగీశ్వర = కపిలుఁడు దత్తాత్రేయుఁడు మొదలగుమహాయోగులును, మునీశ్వర=అగస్త్యాదులును, యతీశ్వర = గోవిందభగవత్పాదులు శంకరాచార్యులు మొదలగు యతులును, కవీశ్వర = వాల్మీకిలోనగుకవులును, ఆది = మొదలగువారిచేత, ఉపాస్యంబును = సేవింపఁదగినదియును (ఈవిశేషణమునకు పరబ్రహ్మపక్షమునందును, పర్వతపక్షమునందును అర్థ మొక్కటియే.), నిత్య...బును - నిత్య = భూతభవిష్యద్వర్తమానకాలములందు నాశనమును జెందక సర్వకాలములందును స్థిరమై యుండునట్టియు, నిర్గుణ = సత్త్వము రజస్సు మొదలగు గుణములు లేనిదియు, నిర్వికల్ప = చిత్తము లేనిది యగుటచే, సంకల్పించుట, సంశయించుట మొదలగునవి లేనిదియు, నిర్వికార=వికారములు లేనిదియు, నిరాకార = రూపము లేనిదియు, నిరంజన = ఇతరసాధనములతో పనిలేక తనను తానే యెఱుగునదియు (స్వప్రకాశమైనది అనుట), నిర్విషయ = శబ్దము స్పర్శము మొదలగువిషయములు లేనిదియు (విషయములతో సంబంధపడనిదియు, లేక విషయములు గూడ తనకంటె వేఱుగాకపోవుటచే, "విషయములను దెలిసికొనుట" అనుమాట లేనిదియు), అతీంద్రియ=ఇంద్రియములకు గోచరము గానిదియు, అవాఙ్మానసగోచర = వాక్కుచే చెప్పుటకును, మనస్సుచే భావించుటకును గూడ వీలు కానిదియు, అప్రమేయ=ఇంతయని పరిమితిఁజెప్పుటకు వీలు లేనిదియు (కప్రత్యక్షము మొదలగు నేప్రమాణములకును గోచరము కానిదియు), శుద్ధ=నిర్మల మైనదియు, బుద్ధ=జ్ఞానముచే తెలియఁదగినదియు, ముక్త = ఇతరపదార్థములతో సంబంధము లేక స్వతంత్రమై యుండునదియు, (ఇచ్చట స్వతంత్రమనఁగా: "ఏపదార్థముతోఁ గాని, యేగుణముతోఁ గాని సంబంధము లేక యున్నది" అని యర్థము. పైన నొకవిశేషణములో "పరబ్రహ్మమునకు స్వతంత్ర శక్తిలేదు" అని చెప్పఁబడియున్నది. దానికి "తన్ను ప్రేరేపించువాఁడు లేక తాను యథేచ్ఛముగా ప్రపంచమును ఆజ్ఞాపించుట అనుశక్తిలేదు" అని యర్థము.) కేవల = తనకంటె రెండవపదార్థము లేనివాఁడును, అఖండ = విభాగములు లేనిదియు వీలులేనిదియును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సచ్చిదానందమయంబును=సత్యజ్ఞానానందస్వరూపంబును, ఐన, తురీ...బునన్ - తురీయ = సుషుప్త్యవస్థకంటె నావలనుండు తురీయావస్థను (జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు క్రమముగ సత్త్వరజస్తమోగుణస్వరూపము లనియు, ఆయవస్థలకావలనుండు తురీయావస్థ శుద్ధసత్త్వస్వరూపమైనదనియు తెలిసికొనవలయును.), అతీత = అతిక్రమించిన, ఐదవయవస్థకంటె, (ఈయయిదవ యవస్థ, పైనఁ జూపఁబడిన నాల్గవయవస్థలోని కడభాగమేకాని క్రొత్తదికాదు.) పర = మిగిలిన, తత్త్వ=పరబ్రహ్మ మనెడు, కైలాసంబునన్=కైలాసమునందు, అవ్య...బును-అవ్యక్త=మూలప్రకృతియును, మహత్ = ప్రపంచోత్పత్తికి ప్రథమావస్థ యగు మహత్తత్త్వము, ఆది = మొదలుగాఁ గల, సప్తావరణ = ఏడుప్రాకారములచేత, పరివేష్టితంబును = ఆవరింపఁబడినదియును, మూలప్రకృతి, మహత్తత్త్వము, శబ్దస్పర్శరూపరసగంధము లనియెడు నేడును పరబ్రహ్మమునకు ఆవరణములు అనఁగా: పరబ్రహ్మమును దెలిసికొనకుండునట్లు చేయునది. ఈయేడింటిని ఆస్థానమంటపముయొక్క ప్రాకారములుగా చెప్పియున్నాఁడు. ఇట్లే యీవిశేషణములయం దంతటను, వేదాంతమునకు సంబంధించిన విషయముల నన్నిటిని, వృక్షములు గుహలు మొదలగుదానినిగాఁ జెప్పియున్నాఁడు.) చతు...బును-చతుర్దశలోక = పదునాలుగులోకములనియెడు, కందర = గుహలచే, సుందరంబును = మనోహర మైనదియు, సార్వ...బును - సార్వభౌమాది = చక్రవర్తిమొదలు, హిరణ్యగర్భాంత=చతుర్ముఖబ్రహ్మవఱకు నుండువారియొక్క, ఆనంద = సుఖము లనెడు (అనేక తారతమ్యములతో నున్నఆనందము లనియెడు), గండశైల = గుండ్రాళ్లచేత, భాసురంబును=ప్రకాశించుచున్నదియును (అనఁగా: చక్రవర్తి, మనుష్యగంధర్వులు, ఆదేవతలలోని గంధర్వులు, పితృదేవతలు, ఆజానజానులను దేవతలు, కర్మదేవతలు, దేవతలు, ఇంద్రుఁడు, బృహస్పతి, నవబ్రహ్మలు, చతుర్ముఖబ్రహ్మ. వీరియానందములు క్రమముగా, నొకరి యానందముకంటె నొకరియానందము నూఱురెట్లధికము.) భాను...రిలంబును-భాను=సూర్యుఁడు, సోమ=చంద్రుఁడు, నక్షత్ర=నక్షత్రములు, తార=అశ్విని మొదలగు నిరువదియేడునక్షత్రములు. (అశ్విని మొదలగు నిరువదియేడునక్షత్రములు తప్ప మిగిలినవి నక్షత్రములని సామాన్యముగాఁ జెప్పఁబడును. అశ్విన్యాదులకు తారలు అని పేరు.) గ్రహ=అంగారకాదిగ్రహములును (చంద్రసూర్యులనుగుఱించి యివఱకే చెప్పఁబడియున్నది.) పావక=అగ్నియును, సౌదామని = మెఱపులును, ఆది = మొదలుగాఁగల, వివిధ=నానావిధములైన, తేజః=దీప్తులనెడు, రత్న=మణులచే, శర్కరిలంబును=గండిసుకగలదియును; ప్రవి...బును-ప్రవిమల=నిర్మలమైన, వైరాగ్య, ఉపరతి = చిత్తవిశ్రాంతియును, ఏకాంత = నిశ్చలచిత్తమును, అత్యంతముముక్షుతా = శీఘ్రముగ మోక్షము కావలయు ననుదృఢనిశ్చయమును (లేక స్థిరమగు కోర్కెయును), అనెడు, అధిత్యకా=

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పర్వతము పైభాగమునందలి (పర్వతము పైభాగమునందు మొలచియున్న అనుట.) అధ్యాత్మానంద=బ్రహ్మానంద మనియెడు, జీవన=జలముచేత, అభిషిక్త=తడుపఁబడినట్టియు, నిర్మల నిశ్చలత్వ కలికా=చాంచల్యము లేక యుండుట అనియెడు మొగ్గలచేత (లేక పిందెలచేత), కలిత=ఒప్పుచున్నట్టియు, ఫలిత=పరిపక్వములైనట్టియు, నిష్కామ=కోరిక లేని, కర్మ=కర్మలును,(కర్మము ఇష్టమనియును, అపూర్త మనియును రెండువిధములు. అందిష్టములనఁగా శ్లో. 'అగ్నిహోత్రం తపః సత్యం వేదానాం చానుపాలనం, ఆతిథ్యం వైశ్వదేవం చ ఇష్టమి త్యభిధీయతే'='అగ్నిహోత్రము చేయుట, జపను నాచరించుట, సత్యము పలుకుటఁ వేదాధ్యయనము చేయుట, అతిథిపూజ, వైశ్వదేవము అనునవి ఇష్టకర్మలు. శ్లో. 'వాపీకూపతటాకాదిదేవతాయతనాని చ, అన్నప్రదాన మారామః పూర్త మిత్యభిధీయతే.' = 'చెఱువులు బావులు మొదలగువానిని త్రవ్వించుట, దేవాలయంబులు కట్టుట, అన్నదానము, తోఁటలు వేయించుట అనునవి అపూర్తకర్మలు) (ఉపాసన=మంత్రజపపూర్వకముగా దేవతలను ధ్యానించుటయు, యాగ=యజ్ఞములును, యోగ = అష్టాంగములతోఁగూడిన రాజయోగము మొదలగు యోగములును, జప = గాయత్రి మొదలగుమంత్రముల జపించుటయును, తపః=శరీరమును శోషింపఁజేయునట్టి కృచ్ఛ్రము చాంద్రాయణము మొదలగువ్రతంబును, సత్య యథార్థముఁ జెప్పుటయును, శౌచ = లోపల వెలుపల పరిశుద్ధముగా నుండుటయును, దయ = భూతములయందు ప్రేమతోనుండి వానికష్టముల నోర్వలేక పోవుటయును, శీల = సత్స్వభావంబును, వ్రత = బ్రహ్మచర్యాదివ్రతంబులును, దాన = ఈవియు, ఆది=మొదలైనవి యనియెడు, నానావిధ = అనేకవిధములైన, అనోకహ = వృక్షములతోఁగూడిన, ఉద్యాన = ఉపవనములచేత, విరాజితంబును = ప్రకాశించుచున్నదియును, శాస్త్ర...బును - శాస్త్ర = తర్కము మొదలగుశాస్త్రము లనియెడు, పుష్ప = పూవులతోడ, ఉపేత = కూడిన, నిగమ = వేదములయొక్కయు, ఆగమ=కామికము మొదలగునాగమములయొక్కయు, అంత = కొన లనియెడు (వేదముయొక్క కొనలు ఉపనిషత్తులు. ఆగమముల యొక్క కొనలు చర్య, క్రియ, యోగ, జ్ఞానపాదములయందుఁ జెప్పఁబడు కర్మసాదాఖ్య కర్తృసాదాఖ్య మొదలగునవి అని తెలిసికొనవలయును.), కల్పలత = కల్పవృక్షముల చేత విలసితంబును, షడ్వి...బును - షడ్విధ = ఆఱువిధములైన, సమాధి = సమాధులనియెడు (మనసు నొకవస్తువునం దేకాగ్రముఁజేసి యావస్తువును రూపసహితముగాఁ గాని రహితముగాఁ గాని ధ్యానించుట సమాధి యనఁబడును.), సౌధ = రాజగృహములచేత, విభ్రాజితంబును = మిగుల ప్రకాశించుచున్నదియును, పరమ...బును - పరమ=నిరతిశయమైన (దీనికంటె నధికమగునది లేదనుట.), అధ్యాత్మవిద్య = బ్రహ్మజ్ఞానమువలనఁగలిగిన, ఆనంద = బ్రహ్మానంద మనియెడు, జల = నీటిచేత, అభిషిక్త=తడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

Acc. No. 7641



పఁబడిన, నిర్మల = పరిశుద్ధమైన, చిత్తవృత్తి = మనోవృత్తి యనియెడు (మనస్సుఅనుట.) అంగణ = ముంగిటియందున్న, శమ = మనోనిగ్రహము, దమ = ఇంద్రియములజయించుట, ఉపరతి = చిత్తవిశ్రాంతి (లేక సన్యాసము), తితిక్షా = శీతోష్ణాదుల సహించుట, శ్రద్ధా = శ్రద్ధ, సమాధాన = గురువుపదేశించిన విషయములను శాస్త్రములఁ జూచియు తనబుద్ధిచే విచారించియు నిశ్చయించుకొనుట, అమానిత్వ = నిరభిమానము, అదంభిత్వ=డంబము లేకపోవుట, ఆది = మొదలైన, కల్యాణగుణ = సద్గుణములనియెడు, మణిగణ = రత్నములతో నమర్చియున్న, రంగవల్లీ = ముగ్గులచేత ప్రకాశితంబును, నిరతి... బును-నిరతిశయ = మహత్తరమైన, కైవల్య = మోక్షమనెడు, భాండాగార = బొక్కసముచేత, శోభితంబును = ప్రకాశించునదియును, ఫలకామ...లలితంబును - ఫలకామనాభావ = ఫలములనుగోరని, స్వభావనియత = ఆయాగుణస్వభావములనుబట్టి శాస్త్రములయందు విధింపఁబడిన, కర్మ = తమతమకులములకుఁ గలకర్మలను, ఆచరణ = ఆచరించుటవలనఁగలిగిన, చిత్తశుద్ధి = మనశ్శుద్ధియును, సర్వకర్మపరిత్యాగ = సకలములగు దుష్కార్యములను విడచిపెట్టుటయును, గురుభక్తి, వేదాంత = వేదాంతవాక్యములను, శ్రవణ = వినుట, మనన = మనసునందు విచారణసేయుట, నిదిధ్యాసన = నిశ్చయించిన విషయమును ఏకాగ్రచిత్తముతో ధ్యానించుట, జ్ఞాన=స్వస్వరూపజ్ఞానంబును, ఆది= మొదలైనదనెడు, సోపాన = మెట్లతోడ, సమన్వితకూడిన, విజ్ఞాన = బ్రహ్మానుభవమనెడు, రాజమార్గ=రాజవీధులలో, లలితంబును = మనోహరమైనదియును, పంచ... బును-పంచాక్షరీ = 'నమశ్శివాయ' అను అయిదక్షరములు గల, మహామంత్ర = గొప్ప మంత్రమనెడు, మాణిక్య = మాణిక్యమైన, తోరణ = వెలుపలివాకిండ్లచేత, అలంకృతంబును = అలంకరింపఁబడినదియును, ప్రణవ...తంబును - ప్రణవనాద = పదివిధములగు ఓంకారనాదము లనియెడు (ఈదశవిధనాదములను గూర్చి ముందు గ్రంథకర్తయే సవిస్తరముగ వివరింపఁ గలఁడు.), మంగళవాద్య=శుభకరములైనవాద్యముల, రవ= ధ్వనిచేత, పూరితంబును=నిండింపఁబడినదియు, అగు=అయినట్టి, తురీయ...బునన్- తురీయ=ఉన్మన్యవస్థయనియెడు (జాగ్రదాది మూఁడవస్థలవలె సహజముగా వచ్చునది గాక యపరోక్ష బ్రహ్మజ్ఞానమువలనఁ గలుగునట్టి యీయున్మన్యవస్థయే బ్రహ్మానందానుభవ మనియును నిర్వికల్పసమాధి యనియును జెప్పఁబడినది.), మహాస్థానమంటప=గొప్పకొలువుకూటముయొక్క, అంతరంబునన్=లోపల, (ఇచ్చట ఈ యున్మన్యవస్థకును, పరబ్రహ్మమునకును నామములందుఁ దప్ప రూపములందు భేదములేదు. కావునఁ బరబ్రహ్మమునకు ఆవరణములగు మూలప్రకృతి మొదలగువానిని ఈ ఆస్థానమంటపమునకు ప్రాకారములు గాను మఱియు నాయావస్తువులను సోపానాదులు గాను వర్ణించి యున్నారు.) "కంధరసుందరంబును, గండశైల భాసురంబును" అనుచో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రమణీయంబగు నొకానొక కైలాసగుహలో నున్నదనియు, ఒకానొకవిశాలమగు బండపై నమర్చఁబడినదనియు "అధిత్యక...ఉద్యాన" అను విశేషణబలమువలన నా గుహాయు బండయు పర్వతముయొక్క పైభాగమునందు (శిఖరమునకంటె కొంచెము క్రింద) నున్న వనియు, అర్థముచెప్పుట యుక్తమని తోఁచుచున్నది. లేకున్న నాస్థాన మంటపమందు గుహాలు గండశైలములుండుటకు వీలులేదు గదా. "ఆగుహా శిఖరమున కంటెఁ గొంత క్రిందనున్నది." అని చెప్పకున్నయెడల నచ్చట గండశైల ముండుటకు వీలుండదని తెలియవలయును.) సర్వో...నుండై-సర్వ = అశేషములైన, ఉపనిషత్ = వేదాంతములయొక్క, సారభూత = సారాంశమైన, బ్రహ్మాత్మకత్వ = జీవుఁడును బ్రహ్మయును ఒక్కటియే అనువిషయమును, దర్శక = చూపునట్టి, రూప = స్వరూపముగల, ఓంకార=ప్రణవ మనియెడు, ఓంకారమును ధ్యానించినవారు శీఘ్రముగ జీవబ్రహ్మైక్యమును దెలిసికొందురనిభావము. ఓంకారమునకు అర్థ మాపరబ్రహ్మయే కావునను "తజ్జపస్తదర్థభావనం" = "దానిని జపించుట దానియర్థమును మనసున ధ్యానించుట" సాక్షాత్కారమునకు సాధనములు "అది యనఁగా ఓంకారము" అను యోగసూత్రమునుబట్టి జపకాలమునందు ఆపరబ్రహ్మమును (అనఁగా: ఆయన యథార్థస్వరూపమును) స్మరించుచుండుట యత్యావశ్యక మగుటచేతను, దీనికి శ్రవణాదులుగూడ సాహాయ్యమయ్యెనేని జీవబ్రహ్మైక్యజ్ఞాన మతిశీఘ్రములోఁ గలుగు ననుటకు సంశయమే లేదని తెలిసికొనవలయును. సింహాసన = సింహాసనమునందు, ఆసీనుండై = కూర్చున్నవాఁడై, శుద్ధ...డును - శుద్ధసత్త్వ = శుద్ధసత్త్వమే, (లేక గుణసామ్యావస్థయే) గుణసామ్యమనఁగా: మూఁడుగుణములును ఎక్కువ తక్కువలులేక యుండుట; లేక గుణసామాన్య సత్త్వరజస్తమము లను భేదములు లేక, వాని కన్నిటికి నాధారమైయుండు గుణత్వజాతి) ప్రధాన = ముఖ్యముగాఁగల (అదియే స్వరూపముగాఁ గల యనుట.), మాయామయ - మాయ = మాయయె ఆకారముగాఁ గలిగినట్టియు, దివ్య = శ్రేష్ఠమైనట్టియు (ఆమాయ ఆవరణము కాఁ గలది అయినను, దానివికారములతోఁ గొంచెమైనను సంబంధపడ కుండునట్టి అనుట.), శోభన = ఉపాసకులకు శుభముల నొసంగునట్టియు, విగ్రహుండును = శరీరము గలవాఁడును, ("మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరమ్" = "మాయయె ప్రకృతి. ఆమాయ ఉపాధిగాఁ గలవాఁడు ఈశ్వరుఁడు" అను శ్రుతి ననుసరించి, యిచ్చట ఈశ్వరస్వరూపము వర్ణింపఁబడెనని చెప్పవలయు.) సర్వ...డును - సర్వజ్ఞత్వ = సమస్తమును దెలిసికొనుట, సర్వేశ్వరత్వ = సమస్తమునకును ప్రభు వగుట (లేక సమస్తప్రపంచమును ఆజ్ఞాపించుట.), సర్వాంతర్యామిత్వ = సమస్తప్రపంచమునందును వ్యాపించి తనమాయాశక్తిచే దానిని స్వకార్యానుగుణముగా నడుపుట ("[illegible] హృద్దేశేఽర్జున తిష్ఠతి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా" = "శరీర మనుయంత్రముపై నెక్కియున్న యీసకలజీవులను, దనమాయాశక్తిచే తత్తత్కర్మానుగుణముగం ద్రిప్పుచు, నాపరమేశ్వరుఁడు సర్వభూతములహృదయములయందును ఉన్నాఁడు" అను గీతావాక్య మీవ్యాఖ్యానమునకుఁ బ్రమాణము.) సర్వస్రష్టృత్వ = సకలమును సృష్టిచేయుట, సర్వరక్షకత్వ=సమస్తమును బాలించుట, సర్వసంహారకత్వ = సర్వమును లయింపఁ జేయుట, ఆది=మొదలగు, అగణిత = లెక్కపెట్టఁగూడని, సమగ్ర = సంపూర్ణములైన, సుగుణపరిగ్రహుండును = సద్గుణములు గలవాఁడును, సత్యజ్ఞానానందస్వరూపుఁడును, సర్వవ్యాపకుండును, దేవదేవుండును - దేవ = ఇంద్రియాది దేవతలకు, (లేక ఇంద్రాది దేవతలకు), దేవుండును = దేవత యగువాఁడును (అనఁగా: నియామకుఁడగు వాఁడును, లేక తనప్రకాశముచే నింద్రియములఁ బ్రకాశింపఁజేయువాఁడును), అగు శ్రీమహాదేవుఁడు = అయినశోభాయుక్తుఁడగు సాంబమూర్తి, మూర్తిమంతంబులు = ఆకారములను ధరించినవి, అయిన చతుర్వింశతితత్త్వంబులును = స్థూలశరీరమునందుండు నిరువది నాలుగుతత్త్వములును (ఆకాశాదిభూతము లైదు, జ్ఞానేంద్రియములు అయిదు, కర్మేంద్రియములు అయిదు, ప్రాణము లయిదు, మనోబుద్ధి చిత్తాహంకారములు నాలుగు, యవి యిరువదినాలుగుతత్త్వములు.), ఇచ్ఛా...లును-ఇచ్ఛా = సృష్టి చేయవలయునని తలంచుట అనుశక్తియును, జ్ఞాన = జీవరూపమును బ్రవేశించి సమస్తమును దెలిసికొనుచుండుశక్తియును, క్రియా = ప్రాణరూపముతో శరీరమునందుండి సమస్తము లగుకర్మేంద్రియములచేతను పనులఁజేయించుచున్నట్టిశక్తియును, ఆదిశక్తులును= మొదలగు నానావిధము లగుశక్తులును (సత్వశక్తి, రజశ్శక్తి, తమశ్శక్తి మొదలగునవి యనుట.), హృషీ...లును-హృషీకేశ్వర = విష్ణువు, వాణీశ్వర = బ్రహ్మ, సురేశ్వర = ఇంద్రుఁడు, నందికేశ్వర = నంది, భృంగీశ్వర = భృంగి, విఘ్నేశ్వర = వినాయకుఁడు, కుమార = కుమారస్వామి, ఆది = మొదలైన, ప్రమథగణ = ప్రమథులసమూహము యొక్క (ప్రమథులు శివునిసభయందు సభ్యులు), అధీశ్వరులును = ప్రభువులును, బ్రాహ్మీ...లును - బ్రాహ్మీమహేశ్వర్యాది = బ్రాహ్మి మహేశ్వరి మొదలగు సప్తమాతృకలును, (బ్రాహ్మి, మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండి అనువా రేడుగురు మాతృక లనఁబడుదురు.) స్వసాన్నిధ్యంబునన్ = తనసమీపమున, నిజ...బున్-నిజ = తన (రుద్రుని) యొక్క, కరుణా = దయతోఁగూడిన, కటాక్షవీక్షణంబున్ =కడగంటిచూపును, అపేక్షించి = కోరి (దయారసపూర్ణముగ నారుద్రుఁడు తమవైపుఁ జూచునా యని కోరుచు అనుట.), కొలువన్ = సేవించుచుండఁగా, స్వస్వరూపావలోకనంబు = తనస్వరూపమును (అనఁగా: పరబ్రహ్మస్వరూపమును) చూచుటను (లేక అనుభవించుటను), చేయుచున్ = బహానుభవము చేయుచు (పరమానంద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సముద్రమున మునిఁగి అని భావము.), ఆత్మారాముండు ఐ=తనలోఁ దాను ఆనందించు చున్నవాఁడై, ఉన్నసమయంబునన్=ఉన్నప్పుడు, తదీ...యున్-తదీయ=ఆయాశ్వరునియొక్క, వామార్ధ=ఎడమదగుసగభాగమే, శరీరిణియున్=శరీరముగాఁ గలదియు, పరాపరప్రకృతి స్వరూపిణియున్ = పరాప్రకృతి అపరాప్రకృతి పరాపరప్రకృతి అను మూఁడుప్రకృతులును స్వరూపముగాఁ గలదియు (ఈప్రకృతులను గూర్చి మూలమునందే స్పష్టము చేయఁబడును.) నిఖిలజగదుపాదానకారణభూతయున్=సమస్త జగత్తునకును ఉపాదానకారణమైనట్టియుం, నిఖిల...యున్ - నిఖిల = సమస్తమైన, లోక = లోకములకు, ఏక = ముఖ్యమైన, మాతయున్=తల్లియును, త్రిభువనగేహినియున్ = మూఁడులోకములను దనకుఁ గుటుంబముగాఁ గలదియు, విశ్వమోహినియున్ = ప్రపంచమును మోహింపఁ జేయునదియు, ధీముఖయున్ = పరిశుద్ధమగు బుద్ధియే ముఖముగాఁగలదియు, జ్ఞాన...యున్ - జ్ఞాన = పదపదార్థవిజ్ఞానము (మహావాక్యములయందలి పదములయొక్క వాక్యార్థము. అనఁగా: పైకిఁ దోఁచునర్థము యొక్కయుం లక్ష్యార్థము. అనఁగా: వాక్యార్థములయందున్న విరోధములను బోఁగొట్టుటకై యూహింపవలసిన యర్థముయొక్క జ్ఞానము.), విజ్ఞానము = అనుభవపూర్వకమైన జ్ఞానమును, లోచనయున్=కన్నులుగాఁగలదియును, విషయ...యున్-విషయ=శబ్దస్పర్శాదివిషయములందలి, విరక్తి=వైరాగ్యమే, అధరయున్=పెదవిగాఁ గలదియును (వైరాగ్యమునకంటె నధికమగునానందము లేదు గావునను అధరామృతము నాస్వాదించుట పరమానందకరము గావునను ఇట్టియుపమానము చెప్పఁబడినది. ఇట్లే తక్కినచోట్లను అచ్చటసందర్భముల కనుకూలముగ పోలిక గల దని యూహింపవలయును.), విచారమంద...యున్-విచార = బ్రహ్మవిద్యవిచార మనునదియే, మందస్మితయున్ = చిఱునవ్వుగా గలదియును (పరిశుద్ధముగా నుండుటయే ఇచ్చట బ్రహ్మవికారమునకును చిఱునగవునకును పోలిక.), నిర్మ...యున్ - నిర్మమతా = ఇది నాది యను నభిమానము లేకుండుట, నిరహంతా=నేను అను అభిమానములేకుండుట (అనునవియే), హస్తయున్=హస్తములుగాఁ గలదియును (సర్వకార్యములును జేయుటకు హస్తములే ముఖ్యసాధనములైనట్లు ముక్తిని జెందుటకు అహంకారమమకారముల విడుచుటయె ప్రధానసాధనము గావున నిట్లు పోల్పఁబడెను.) యోగబోధస్తనియున్ = రాజయోగంబును (లేక కర్మయోగంబును) జ్ఞానంబును స్తనములుగాఁ గలదియు, (క్షీరమను అమృతమును వర్షించు స్తనములతో బ్రహ్మానందామృతమును వర్షించు యోగజ్ఞానములకుఁ దగినపోలిక గలదని యెఱుఁగునది.) సందేహమధ్యయున్=నేను జీవుఁడనో, బ్రహ్మంబునో అనునట్టిసందేహమే నడుముగాఁగలదియును (ఇచ్చట "కలదా లేదా అను సందేహమునకు ఆశ్రయ మగు మిగుల సన్ననగు నడుము గలది" అని రెండవయర్థము గలదు.) సంసారచక్రనాభియున్

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

=సంసార చక్రమే బొడ్డుగాఁ గలదియును (సంసార మనఁగా: పురుషుని బహువిధము లగు కార్యములయందు ప్రవర్తింపఁజేయు అహంకారము. అది చక్రమువలె ఆద్యంత ములు లేనిది కావున ఆద్యంతములు లేకుండుట అనునది అహంకారచక్రములకును, గుండ్రముగా నుండుట అనునది చక్రనాభులకును క్రమముగా పోలిక లని యెఱుంగు నది.), రాగ...యుక్-రాగ = తనకుఁ గావలసిన వస్తువులయందుఁ బ్రేమ, ఆవస్తువును సంపాదింపవలయునని త్వర, ద్వేష=తన కక్కఱలేనివస్తువుల వైరము, వానిని బరిత్యజిం చుట, జఘనయుక్=కటిపురోభాగముగాఁ గలదియు ("క్లీబే తు జఘనం పురః" "జఘన మనునది కటిపురోభాగమునకు పేరు. అది నపుంసకలింగము" అని అమరము.), కామ...యుక్ = పరస్త్రీ పరధనాదులను గోరుటయు, లోభ = తనధనమును బరుల కీయక తానైనను అనుభవింపకయుండుటయు, అను నవియే, ఊరుయుగళయుక్ = తొడలుగాఁ గలదియును, సంకల్పవికల్పచరణయుక్ = సంకల్ప వికల్పములే పాదము లుగాఁ గలదియును (సంకల్పవికల్పములే సకలవిధములగు ప్రవర్తనములకును సాధన ములు గావునఁ జరణములతోఁ బోల్పఁబడినవి. దుర్గుణములన్నియును బరిత్యజింపవలసిన వని సూచించుటకై యథః కాయరూపముగ వర్ణింపఁబడియున్నవి.), కాలా...యుక్- కాల = కాలములచేత, అవగత=వచ్చిన, పుణ్యపాప మిశ్రకర్మములే, యానయుక్= నడకలుగాఁ గలదియును, వేదాం...యుక్-వేదాంత విద్యావసన = బ్రహ్మవిద్య యని యెడు వస్త్రమును, ఉపరతికంచుక = చిత్తవిశ్రాంతి యనియెడు ఱవికను, ధారి ణియుక్ = ధరించినదియు, రజస్సత్త్వ...సురుచిరయుక్ - రజః = రజోగుణము యొక్కయు, సత్త్వ = సత్వగుణముయొక్కయు, తమః = తమోగుణముయొక్కయు, గ్రంథి=ముడులను, (సత్త్వగుణము జాగ్రదవస్థ, దానికిని రజోగుణ మగు స్వప్నావస్థ కును మధ్యనుండు సంధియును, ఇట్లె తమోగుణరూపమగు సుషుప్త్యవస్థకును స్వప్నావస్థ కును మధ్యనుండు సంధియును, ఇట్లె జాగ్రదవస్థకును సుషుప్తికిని మధ్యనుండు సంధి యును అను నీ మూఁడు సంధులును, అనఁగా: ముళ్లను.) నీవీబంధ = పోకముడియు కంచుకాబంధ = ఱవికముడియు, వేణీబంధ=జడముడియు, కొప్పును, అగునట్లుగా, సురు చిరయుక్ = ప్రకాశించుచున్నదియును (పైన వర్ణించియున్న మూఁడుముడులును, ఈ పార్వతీదేవికిఁ గలపోకముడి మొదలగు మూఁడుముడులుగా నున్నవి యనుట.), ఫలత్యా...కారిణియుక్-ఫలత్యాగపూర్వక = ఫలమును గోరకుండుటయె ప్రధానము గాఁగల, వర్ణ=బ్రాహ్మణాదివర్ణములకును, ఆశ్రమ=బ్రహ్మచర్యము మొదలగు ఆశ్రమము లకును, ఉచిత=తగిన (అనఁగా: వేదమునందు విధింపఁబడిన), ధర్మ = స్నానము సంధ్య మొదలగు నిత్యకర్మములతోను, శ్రాద్ధము మొదలగు నైమిత్తికకర్మములతోను గూడిన సకలవిధముల ధర్మములు, అనుష్ఠాన=వాని నాచరించుటయు, (లేక ఫలత్యాగపూర్వక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముగ సర్వధర్మములను ఆచరించుటయు), ఈశ్వరప్రణిధాన = భగవద్ధ్యానమునకు, ఆచార్యోపాసన=సద్గురుసేవ, ఇంద్రియ = జ్ఞానేంద్రియములయొక్కయు కర్మేంద్రియములయొక్కయు, ఆత్మ = మనస్సుయొక్కయు, వినిగ్రహ=జయించుట, స్థితప్రజ్ఞత్వ=దృఢమగు పరమార్థజ్ఞానము కలిగియుండుట, ఆది = మొదలైన, సాత్త్వికగుణ = సత్త్వగుణమును సంపాదించుకొనుటవలనఁ గలిగిన చక్కని మనోవృత్తులు (దీనికే దైవసంపద యని పేరు.) అనియెడు, భూషణ = నగలు, అలంకారిణియుఁ = అలంకారముగాఁ గలదియును, శుద్ధవాస...యుఁ - శుద్ధ = సత్త్వరజస్తమోగుణములులేని (అనఁగా: శుద్ధసత్త్వమయ మైన), వాసనా = మనోవృత్తులచేతను, చందనము పుష్పములు మొదలగు సుగంధములచేతను, ఈరెంటికిని శుద్ధసత్వము సమానమే. వాసితయుఁ = పరిమళించు చున్నదియును, (నివసింపఁబడినదియును అనఁగా : పరిశుద్ధము లగు మనోవృత్తుల కాధారమైనదియును అని రెండవయర్థము. "వాసనా ద్వివిధా ప్రోక్తా శుద్ధాచ మలినా తథా, మలినా జన్మకృత్ప్రోక్తా శుద్ధా జన్మవినాశనీ" "శుద్ధవాసన యనియు మలినవాసన యనియు, వాసన మనోవృత్తి, లేక మనస్సునం దున్నసంస్కారము రెండువిధములు. అందు శుద్ధవాసన పునర్జన్మమును నశింపఁ జేయును. మలినవాసన దానిని గలిగించును" అని తెలిసికొనవలయును.) నిత్యానపాయినియుఁ=శివుని నెప్పుడు నెడఁబాయనిదియు, దేవదేవియుఁ=స్వప్రకాశరూపుఁ డగు పరమశివునకు భార్యయును అగు, శ్రీమహాదేవి=బ్రహ్మవిద్యాస్వరూపిణి యగుపార్వతీదేవి, అతిప్రియపూర్వకంబుగాఁ=మిగుల ప్రీతితో, చతుర్విధశుశ్రూషలు=నాలుగువిధములగు సేవలను (శిష్యులు గురువులకు సేయు సేవకు శుశ్రూష యని పేరు.), కావించుచుఁ=చేయుచు, సేవించుచుఁ=పూజించుచు, భావించుచుఁ=ధ్యానము చేయుచు, నమస్కరించుచుఁ, ఆరాధించినఁ=ఆపరమేశ్వరునిమనసునకు సంతసమును గలిగింపఁగా, ప్రసన్నుండు ఐ=అనుగ్రహదృష్టిచేఁ జూచుచు, సుముఖుఁడై, మెచ్చి, నీకుఁ ఎయ్యది ఇష్టంబు=నీకేమి కావలయును?, ఇచ్చెదఁ, అడుగుము, అనినఁ=అని చెప్పఁగా, సంతో...ఐ-సంతోష=ఆనందముచేత, భరిత=నిండింపఁబడిన, చిత్తయై=మనస్సుగలదై, అమ్మస్తకాశిని=ఆపార్వతీదేవి, చిఱునవ్వు నగుచుఁ, ఇట్లు అనియెఁ=ఈక్రింద రాఁబోవువిధముగా చెప్పెను.

తా. మొదలు నడుమ తుది యనునవి లేక యేవిధ మగునితరవస్తువులవలనఁగూడ భేదములు చెందక, స్థిరమై ప్రత్యక్షమై యున్న తనకాంతిచే ననేకకోట్ల సూర్యచంద్రుల్నలఁ దిరస్కరించుచు వేదశాస్త్రాగమాదులయందు సుప్రసిద్ధమైన బహువిధము లగు వర్ణములచేతఁగాని, తనకు విరుద్ధములగు శీతోష్ణనము మొదలైన ధర్మములచేతఁ గాని నడక మొదలగు పనులచేతఁ గాని, యితరగుణములచేతఁ గాని, కైలాస మను ప్రసిద్ధమైన యొక పేరు తప్ప యితరములగు పేర్ల చేతఁ గాని, ... యితరరూపములచేతఁగాని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వికారములచేతఁ గాని, కఠినత్వము అనునదితప్ప తక్కినశక్తులచేతఁ గాని ఆశ్రయింపఁబడక (కైలాస మని మిగుల ప్రసిద్ధిఁజెందిన తెల్లనివర్ణము గలదియై అనుట) బ్రహ్మ, దేవేంద్రుఁడు మొదలగుదేవతలును, సిద్ధ సాధ్య విద్యాధర చారణ గంధర్వాదులును, శారదాదులగు దేవమునులును, దత్తాత్రేయుఁడు మొదలగు యోగీశ్వరులును, అగస్త్యాది మహర్షులును, సనకసనందనాదులును, సర్వకాలములయందును సేవించుచుండ నాకైలాస పర్వతము నాశరహితంబును రూపము గుణములు వికారములు సంకల్పములు మొదలగునవి లేనిదియు, ఏసాధనముచేతనైనను తెలిసికొనుటకు వీలుకానిదియు, శబ్దాదివిషయములతోఁగూడ సంబంధపడనిదియు, ఇంద్రియములకుఁ గాని మనస్సునకుఁ గాని గోచరముగాక, ప్రత్యక్షాదిప్రమాణములచేతఁ దెలియ రానిదియు, ఇది యింతయని పరిమితి చెప్పుటకు వీలులేనిదియు, పరిశుద్ధమై సకలప్రపంచమునకంటె వేఱై అనుభవసహిత మగు జ్ఞానమునకుం దక్క మఱి దేనికిని గోచరముగాక సచ్చిదానందరూపమైయుండు నా తురీయాతీతపరబ్రహ్మమో యనఁ బ్రకాశించుచుండును. పరబ్రహ్మరూపమగు నాకైలాస పర్వతమున అవ్యక్తము మొదలగు నేడు ప్రాకారములచేత నలంకరింపఁబడినదియు, పదునాల్గు లోకములను గుహయందు నిర్మింపఁబడినదియు చక్రవర్తిమొదలు చతుర్ముఖునివఱకు ననేకతారతమ్యములతో నున్నయానందము లనియెడురాళ్లపైఁ గట్టఁబడినదియు, సూర్యుఁడు చంద్రుఁడు అగ్ని నక్షత్రములు మెఱపులు మొదలగు జ్యోతులే రత్నములుగా, నారత్నములయొక్క చూర్ణమే యిసుకగాఁ గలదియునై, బ్రహ్మానుభవమనియెడు నొకకొలువుకూటమున రాజిల్లుచుండెను. దానిసమీపమున పరిశుద్ధమగు వైరాగ్యమే యేకాగ్రచిత్తముతో ధ్యానము చిత్తవిశ్రాంతి, మిగుల త్వరగా మోక్షము కావలయునని ఇచ్ఛ అను పర్వతాగ్రభాగమున మొలచి బ్రహ్మానందమను నీరు పోయుంటచే పెరిగి నిష్కామకర్మము యాగములు యోగములు జపములు కృచ్ఛ్రము చాంద్రాయణము మొదలగు తపస్సులు ఉపాసనలు సత్యమువలుకుట పరిశుద్ధత్వము దయ మంచిస్వభావము దానము వ్రతము మొదలగు ఫలవృక్షములు మనసు నిశ్చలముగా నుండుట యనియెడు పిందెలతో నొప్పి ఫలించుచునుండును. వేదాంతములును, ఆగమాంతములును అనియెడు కల్పవృక్షపుతీఁగెలును శాస్త్రములనియెడి పుష్పములచే నొప్పుచుండును. ఇట్లాఫలవృక్షములతోడను, పూఁదీఁగెలతోడను రాజిల్లునుపవనంబులు లెక్కకు మిక్కిలియై యాకొలువుకూటమునకుఁ జుట్టును గ్రమ్ముకొని యుండును. షడ్విధసమాధులనియెడుమేడలు, దానిపార్శ్వములయందుఁగలవు. మఱియు, పరిశుద్ధమగు చిత్తవృత్తి యనియెడు దానిముంగిలి, బ్రహ్మానందమనియెడు జలముచేఁ దడుపఁబడి మనోనిగ్రహము ఇంద్రియనిగ్రహము చిత్తశాంతి ఓర్పు శ్రద్ధ తృప్తి గర్వము లేకపోవుట డంబము లేకపోవుట మొదలగు సద్గుణములే రత్నములుగా, నారత్నములచే ముగ్గులు పెట్టి యలంక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రింపఁబడి యుండును. అచ్చట సర్వాధిక మగుమోక్ష మనియెడుభోక్కస మొకటి గలదు. ఫలమును గోరక వేదోక్తకర్మల నాచరించుటయు, మనశ్శుద్ధియు, సర్వకర్మల శాస్త్రోక్తవిధానంబున విడుచుటయు, గురుభక్తియు, వేదాంతవాక్యములవినుటయు, విచారించుటయు, వానియర్థమును ధ్యానించుటయు, బ్రహ్మమైయుండుటయు ననుసోపానములచే నలంకరింపఁబడి, అనుభవజ్ఞాన మనియెడు రాజవీథియొకటి దానిసమీపమునకుఁ బోవుచుండును. పంచాక్షరీమంత్ర మనియెడు మాణిక్యములచేఁ జెక్కఁబడి ద్వారములు మిగులఁ బ్రకాశించుచుండును. పదివిధములగు ఓంకారధ్వనులు మంగళవాద్యములై యెప్పుడును అచ్చట మ్రోయుచుండును. ఇట్టికొలువుకూటమున, ఉపనిషదర్థమగు జీవబ్రహ్మైక్యమును ప్రత్యక్షముగఁ జూపఁజాలు ఓంకార మనియెడు సింహాసనముపై శుద్ధసత్త్వప్రధాన యగుమాయయే యాకారముగాఁ గలిగి సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వాంతర్యామిత్వ సృష్టిస్థితి సంహారకత్వములు మొదలగు సకలకల్యాణగుణములచే నొప్పుచు, సత్యజ్ఞానానందస్వరూపుఁడై, దేవతలకు దేవతయై యుండు నా మహాదేవుఁడు కొలువు దీఱి యుండెను. అమ్మహాత్ముని దయారసపూర్ణము లగు కటాక్షములఁ గోరుచు, స్వరూపములఁ దాల్చిన యిరువదినాలుగుతత్త్వములును, ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి అను శక్తులును, విష్ణువు బ్రహ్మ ఇంద్రుఁడు మొదలగుదేవతలును, నందికేశ్వరుఁడు భృంగీశ్వరుఁడు విఘ్నేశ్వరుఁడు మొదలగు ప్రమథులును, బ్రాహ్మి మొదలగు సప్తమాతృకలును, కుమారస్వామియును సేవించు చుండిరి. అప్పరమశివుఁడు బ్రహ్మానుభవము సేయుచు పరమానందపరవశుఁ డై యుండెను. అట్లున్న సమయంబున, నమ్మహాత్ముని శరీరమునందలి వామభాగమే తనశరీరముగాఁ గలదియు, పరాప్రకృతి అపరాప్రకృతి పరాపరాప్రకృతి అనియెడు మూఁడు ప్రకృతులును స్వరూపముగాఁగలదియు, సకలప్రపంచమునకు ఉపాదానకారణ మైనదియు (కార్యరూపముగాఁ బరిణామములు చెందుకారణము ఉపాదానకారణ మనఁబడును. కుండకు మట్టి ఉపాదానకారణము; గుడ్డకు నూలు ఉపాదానకారణము), సకలలోకమునకుఁ దల్లియు, మూఁడులోకములు తనకుఁ గుటుంబముగాఁ గలదియు, సకలప్రపంచమును మోహింపఁ జేయునదియు, బ్రహ్మజ్ఞానముచేఁ బ్రకాశించుబుద్ధియే ముఖముగా జ్ఞానమును అనుభవసహితజ్ఞానమును నేత్రంబులుగ వైరాగ్యము పెదవిగ వేదాంతవిచారము చిఱునగవుగ మమకారములు లేకుండుట అహంకారములు లేకుండుట అనునవి హస్తములుగ రాజయోగము జ్ఞానము అనునవి స్తనములుగ సంశయము నడుముగ సంసారచక్రము బొడ్డుగ అభిలాష వైరము అనునవి కటిపురోభాగముగ కామము లోభము అనునవి తొడలుగ సంకల్ప వికల్పంబులు పాదములుగ కాలము ననుసరించి వచ్చుప్రారబ్ధకర్మములు నడకలుగఁ బ్రకాశించుచు, బ్రహ్మజ్ఞాన మనియెడు చీరయు, చిత్తవిశ్రాంతి యనియెడు అవికయు, జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థాసంధి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లనియెడు శోకముడి అవికముడి కొప్పు అనునవియు, ఫలాపేక్ష లేకుండ తనవర్ణమునకును ఆశ్రమమునకును దగినకర్మల నాచరించుట పరమేశ్వరధ్యానము గురుసేవ ఇంద్రియములను మనస్సును జయించుట దృఢమగు విజ్ఞానము అను మొదలగు సద్గుణములు అనియెడు భూషణములును, తనసౌందర్యమునకు సొంపు గూర్చుచుండఁ బరిశుద్ధ మగు మనోవృత్తు లనియెడు సువాసనలచేఁ గలుగు పరిమళము వ్యాపించుచుండ నప్పార్వతి సర్వకాలముల యందును ఆపరమశివుని విడువక యాశ్రయించియే యుండునది యైనను అధిక మగు భక్తిని అనురాగమును జూపుచు నాలుగువిధము లగు (అనఁగా: స్థానశుశ్రూష మొదలగు) శుశ్రూషలఁజేసి సేవించుచుఁ బూజ లొనర్చుచు, మనసున తదేకనిష్ఠతో ధ్యానము చేయుచు మ్రొక్కుచు, నామహాత్మునకు మిగుల సంతోషమును గలిగించెను. అప్పు డనుగ్రహదృష్టితో నాశంకరుండు పరమేశ్వరిం జూచి "నీకిష్ట మేమి? ఇచ్చెదను అడుగుము" అనుటయు నద్దేవి యానందభరితాంతరంగయై చిఱునగ వొప్ప నీక్రిందఁ జెప్పఁబోవువిధంబునఁ బ్రశ్న చేసెను.

## ప్రమాణవివరము.

ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, అర్థాపత్తి, అనుపలబ్ధి అని వేదాంతు లంగీకరించు ప్రమాణములు ఆఱు. ప్రమాణమనఁగా: ఒకవస్తువు కల దని నిర్ధారణ చేయుటకుఁ దగినయుపాయము. ఇందు ప్రత్యక్ష మనగా: చెవి కన్ను మొదలగు నింద్రియములతో నేవస్తువునైనను తెలుసుకొనుట; అనుమాన మనఁగా: ఏది యైన గుఱుతునుబట్టి యిచ్చట నీవస్తువు కలదని నిర్ణయించుట. పొగను జూచి యిచ్చట యగ్ని యున్నదని చెప్పుట; చల్లదనమును జూచి యావస్తువు పచ్చిది యని నిర్ణయించుట; ఉపమానమనఁగా: తానొకమాఱు చూచి యున్నవస్తువును బట్టి, దానిని పోలియున్న మఱియొక వస్తువును గ్రహించుట; శబ్దమనఁగా: ఆప్తు లగు వారు, లేక సర్వజ్ఞులగువారు చెప్పిన దానినిబట్టి వస్తుతత్త్వమును నిర్ణయించుకొనుట; అర్థాపత్తి అనఁగా: కారణమునకు విరుద్ధ మగు కార్యమును జూచి దానికిఁ దగిన కారణము నూహించుట ; దేవదత్తుఁడు బలిసియున్నాఁడుగాని వాఁడు పగలు భోజనము సేయఁడు అను మొదలగు సందర్భములయందు భోజనము బొత్తిగా లేకయుండిన బలియుట సంభవింపదు గావున వాఁడు రాత్రిభోజనము చేసి తీరవలయును అని నిర్ణయించుకొనుట ; అనుపలబ్ధి అనఁగా: ఈవస్తువు లేదు గనుక కానరాలేదు. కావున నిచ్చట దాని యభావ మున్నది యని యభావముల నిర్ణయించుట.

## చతుర్విధశుశ్రూషావివరణము.

౧. గురుని గృహారామక్షేత్ర పశుధనధాన్యాదులు రక్షించుట స్థానశుశ్రూష

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. దేశికునకు అభ్యంగనస్నానపాదసంవాహనాదులఁ జేయుట అంగశుశ్రూష.

౩. గురుఁడే తల్లి దండ్రి చుట్టము స్నేహితుఁడు విద్య ధనము దాత దైవము రక్షకుఁ డని తలఁచుట భావశుశ్రూష.

౪. గురువున కిష్టములగు పదార్థము లడుగక మునుపే తుష్టిగఁ దెచ్చియిచ్చుట యాత్మశుశ్రూష.

## షట్ఛాస్త్రములు.

"తర్కో వ్యాకరణం ధర్మశాస్త్రం మీమాంస మిత్యపి, వైద్యశాస్త్రం జ్యోతిషం చ షట్ఛాస్త్రాణీతి కథ్యతే."

## అష్టాదశపురాణములు.

"బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ శైవం భాగవతం తథా, తథాన్యం నారదీయం చ మార్కండేయం చ సప్తమం. ఆగ్నేయ మష్టమం చైవ భవిష్య న్నవమం స్మృతం, దశమం బ్రహ్మకైవర్తం లైంగ మేకాదశం స్మృతం. వారాహం ద్వాదశం చైవ స్కాందం చాత్ర త్రయోదశం, చతుర్దశం వామనం చ కౌర్మం పంచదశం తథా. మాత్స్యం చ గారుడం చైవ బ్రహ్మాండం చ తతఃపరమ్."

## షడ్విధసమాధుల వివరణములు.

శ్లో. "సవికల్పో నిర్వికల్ప స్సమాధి ర్ద్వివిధా భవేత్,
దృశ్యశబ్దానువిద్ధోఽయం సవికల్పః పునర్ద్విధా."

"సమాధి సవికల్పమని నిర్వికల్పమని ద్వివిధము. అందు సవికల్పము దృశ్యానువిద్ధసవికల్పమని శబ్దానువిద్ధసవికల్పమని యిరుతెఱఁగులు గలదియగును." ఈరెండును నిర్వికల్ప మొకటియునుగూడి మూఁడువిధములయ్యెను. ఈ మూఁడును బాహ్యాంతరభేదములచేత 1 బాహ్యదృశ్యానువిద్ధసవికల్పకసమాధియని, 2 బాహ్యశబ్దానువిద్ధసవికల్పకసమాధియని, 3 బాహ్యనిర్వికల్పకసమాధియని, 4 అంతరదృశ్యానువిద్ధసవికల్పకసమాధియని, 5 అంతరశబ్దానువిద్ధసవికల్పకసమాధియని, 6 అంతరనిర్వికల్పకసమాధియని ఆఱువిధములు. అందు 1 తనకంటె అన్యములుగ తోఁచెడు బ్రహ్మవిష్ణురుద్రేశ్వరసదాశివాదిపిపీలికాంతమగుసమస్తచేతనములును తృణాదిమేరుపర్యంతమైన అచేతనములును తన తెలివియందే పుట్టిగిట్టినవి కాఁబట్టి అవి తనప్రజ్ఞానకల్పితములని, ఆప్రజ్ఞానమే పరబ్రహ్మమని, ఆపరబ్రహ్మమే తానని చూచుట బాహ్యదృశ్యానువిద్ధసవికల్పకసమాధి. 2 శివరామగోవిందనారాయణవాసుదేవమహాదేవాది సకలనామములలో తనచెవి వినఁబడిన నామము తాను గానని విడిచి సర్వనామవిలక్షణమయిన పరబ్రహ్మ వస్తువు తానని యోచించుటే బాహ్యశబ్దానువిద్ధసవికల్పక సమాధి. 3 కామాదిస్వజ్ఞప్తి వఱకుఁ గల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వృత్తులు తనయందుఁ గలిగినప్పుడు వానినన్నిటిని అప్పుడప్పుడు ఒక్కటొక్కటిని క్రమముగా నేను గానని నిగ్రహించి వీనికన్నిటికిని విలక్షణమైన పరబ్రహ్మము తానని భావించుటే అంతర్దృశ్యానువిద్ధసవికల్పకసమాధి. 4 రాగద్వేషకామక్రోధలోభ మోహమదమత్సరేర్ష్యాదర్పాహంకారాది స్వజ్ఞప్తిపర్యంతమైన సకలాంతర వస్తునామ ములను నేను గానని విడిచి సర్వవిలక్షణమైనపరమాత్మ తానని యూహించుటే అంతర శబ్దానువిద్ధసవికల్పకసమాధి. 5 ఈచతుర్విధసవికల్పకసమాధులయందు సుస్థిరత గలిగి అంతరబాహ్యములయందు తనకు నన్యమేమియుఁ దోఁపక, తోఁచినను సముద్రము నందు ముంచినకుండ లోపల వెలుపల పరిపూర్ణమై ఆకాశమందుంచిన కుండ లోపల వెలుపల శూన్యమైనట్లుండుటే బాహ్యనిర్వికల్పకసమాధి. 6 పైనఁ జెప్పినవృత్తులేవియుఁ లేక అఖండపరిపూర్ణసచ్చిదానందపరబ్రహ్మస్వరూపమయి ఉండుటే అంతరనిర్వికల్పక సమాధి.

ఆ. ప్రాణనాథ తనదుపతిని గొల్చుటకంటె, వేఱుపనులుగలవె చారుమతికి
గాననీదు సేవఁ గావించుటయె కాని,యొండుకోర్కి లేదఖండమూర్తి.

టీ. ప్రాణనాథ = ఓప్రాణేశ్వరా! చారుమతికిన్ = మంచిమనస్సుగలస్త్రీకి, తనదుపతినిన్ = తనభర్తను, కొల్చుటకంటెన్ = సేవించుటకంటెను, వేఱుపనులు, కలవె=ఉన్నవా? (లేవు అనుట), కానన్=కావున, అఖండమూర్తి = ఓసర్వవ్యాపకా! నీదు సేవన్ కావించుట ఎ కాని=నీకు సేవ చేయుటయే తప్ప (నాసేవను ప్రేమతో స్వీకరింపవలయుఁ ననుటయే తప్ప), ఒండుకోర్కి = మఱియొకయిచ్ఛ, లేదు.

తా. ఓసర్వవ్యాపకా! ప్రాణనాయకా! పతివ్రత లగుస్త్రీలకుఁ బతిని సేవిం చుటకంటె కావలసినది వేఱేమియు లేదుగదా? కావున నాకును మిమ్ము సేవించు చుండవలయుఁ ననుటకంటె వేఱొకకోర్కి లేదు.

ఆ. అయిననీ కభీష్టమడుగుమి చ్చెదనని,యానతిచ్చితిరిమహాత్మ యిపుడు
గాననాకు నెల్లమానవులకు మేలు,గలుగ నొకటియడుగవలసెననఘ.

టీ. ఐనన్ = అట్లు అయినప్పటికిని, మహాత్మ, ఇపుడు, నీకు, అభీష్టమున్ = కావలసినదానిని, అడుగుము, ఇచ్చెదను, అని, ఆనతిచ్చితిరి = ఆజ్ఞచేసితిరి. కానన్, అనఘ=పాపరహితుఁడ వైనయోమహాత్మా!, ఎల్లమానవులకున్ = సకల జనులకును, మేలు కలుగన్=మేలగునట్లుగా, ఒకటిన్=ఒకదానిని, నాకున్ అడుగన్, వలసెన్.

తా. ఓపాపరహితా! మహానుభావా! భర్త సేవకంటె నితరమైనది పతి వ్రతల కక్కఱ లేకపోయినను పతియాజ్ఞను పరిపాలించుట ముఖ్యధర్మము కావున నాకు లోకహితార్థముగా, నొక్కదాని నడుగవలసివచ్చినది. "నీకిష్టమైనదాని నడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గుము ఇచ్చెదను" అని మీరు నన్ను ఆజ్ఞాపించియుంటిరి గదా! దాని మీఱుట సరి యగునా?

అవతారిక. ఇట్లు గౌరీప్రశ్నమునకుఁ గారణమును వర్ణించి యీక్రింద ప్రశ్న స్వరూపమును వర్ణించుచున్నాఁడు.—

క. నిఖిలకలుషసంక్షయకర, మఖిలాభీష్టప్రదం బనంతాన్వయచి [న్మా.
త్సుఖదముజగదధిపత్యభి,ముఖకరమగుమంత్ర రాజముంగృపఁ జెప్పు

టీ. నిఖిల...మున్-నిఖిల = సమస్తమైన, కలుష = పాపములయొక్క (పంచ మహాపాపములయొక్క, లేక అంహము మొదలగు త్రివిధపాపములయొక్క), సంక్ష య=నాశనమును, కరమున్=చేయునట్టిదియు, అఖిల...దంబున్-అఖిల = సమస్తము లగు, అభీష్ట=కోరినపదార్థములను, ప్రదంబున్ = ఇచ్చునట్టిదియు, అనంత...దమున్- అనంత=మితిలేనిదియు, అవ్యయ = నాశనము లేనిదియుఁ (ఎంత అనుభవించినను తరుగ నిదియు), చిత్ =జ్ఞానస్వరూపమువలన (బ్రహ్మస్వరూపమును తెలుసుకొనుటవలనఁ)గలిగిన, సుఖ=మోక్షసుఖమును, దమున్=ఇచ్చునట్టిదియు, జగ...రమున్-జగత్ = ముల్లోక ములకును, అధిపతి=ప్రభు వైనపరబ్రహ్మమును, అభిముఖకరమున్=ఎదుటనుండునట్లుగాఁ జేయునదియును, అగుమంత్రరాజమున్=అయిన మహామంత్రమును, కృపన్=దయతో, చెప్పుమా=ఉపదేశింపుము.

తా. సకలపాపములను నశింపఁజేసి యైహికాముష్మికములగు సకలభోగముల నిచ్చుటయేకాక శాశ్వతమగు బ్రహ్మానంద సుఖమును గూడ నొసఁగి పరబ్రహ్మసాక్షా త్కారమునుగూడఁ గలిగించుచు నుపాసకుల నుద్ధరింపఁజాలు నొకమహామంత్రమును నాకు దయతో నుపదేశింపవలయును.

## పంచమహాపాపములవివరణము

కల్లుద్రావుట, గురుపత్నిఁ గవయుట, విప్రుఁ జంపుట, బ్రహ్మస్వవిషయమైన మ్రుచ్చిమియు; ఇవి గలిగినక్రూరజనులఁ బ్రీతిఁ బొందుటయును మహాపాతకములు. (బ్రహ్మస్వవిషయము=బ్రాహ్మణధనమునకు సంబంధించిన, మ్రుచ్చిమి=దొంగతనము.)

## త్రివిధపాపవివరణము

శ్లో. "విహిత స్యాననుష్ఠానా న్నిషిద్ధస్య చ సేవనాత్, అనిగ్రహా చ్చేంద్రి యాణాం నరః పతన మృచ్ఛతి."

తా. "విధింపఁబడిన కర్మల నాచరింప కుండుట, నిషేధింపఁ బడిన వాని నాచ రించుట, ఇంద్రియముల నిగ్రహింప కుండుట (అనఁగా: ధర్మమునకు విరుద్ధ మని తలం పక యేయింద్రియ మెట్లు పోయిన నట్లు పోనిచ్చుట) అను మూఁటివలనను పురుషుఁడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పతితుఁ డగును.” (పతితుఁడనఁగా: బహిష్కారము జెందినవారికంటె నెక్కువగా, నెవ్వరితోడను ఏవిధముగా నైనను సంబంధపడనివాఁడు. పైవర్ణింపఁబడిన మాటిలో మొదటి పాపమునకు అంహమనియు, రెండవదానికి అగము అనియు మూఁడవదానికి ఏనను అనియు సంకేతనామములు.)

తే. అనిన విని నవ్వి గిరిజ కిట్లనియె శంభుఁ
డడుగరానిరహస్యార్థ మడిగితీవు
దగ నిది మదీయనిక్షేప మగుపదార్థ
మైన నెఱిఁగింతు నీకు నెయ్యంబువలన. 45

టీ. అనినన్ = అని-పార్వతి ప్రశ్నింపఁగా, విని, నవ్వి, శంభుఁడు, ఇట్లు, అనియెన్, ఈవు=నీవు, అడుగరానిరహస్యార్థంబున్ = అడుగకూడని మిగుల రహస్య మగు విషయమును (సంపూర్ణ మగునధికారము గలవానికిఁ గాని చెప్పకూడదు. అని దాచియుంచిన విషయమును), అడిగితివి, తగన్=ఒప్పునట్లుగా, ఇది=నీకుఁ జెప్పఁబోవు విషయము, మదీ...పము-మదీయ=నాసంబంధమైన, నిక్షేపము = నిధి, అగుపదార్థము= అయినవస్తువు (ఒకనిధివలె నాచే మిగుల ప్రేమింపఁబడువస్తువు), ఐనన్=అయినప్పటికిని, నెయ్యంబువలనన్ = నీయందున్న ప్రేమాతిశయమువలన, నీకున్, ఎఱిఁగింతున్ = ఉపదేశించెదను.

తా. పైన చూపఁబడినవిధముగాఁ బార్వతీదేవి ప్రశ్నచేయఁగా, దానిని విని “ఏదియో అడుగు నని తలంచు చుంటిని. అట్లుగాక చక్కనిప్రశ్న చేసినది” అని నవ్వి, యా యీశ్వరుఁ డిట్లని చెప్పెను. ఓపార్వతీ! అడుగఁ గూడనివిషయమును అడిగితివి. నీప్రశ్నమునకుఁ జెప్పవలసినయుత్తరము అతిరహస్యమైనది. సర్వసాధారణముగ బయలు పఱుపఁ దగినదికాదు. ముఖ్యముగ నాచే పెన్నిధివలె ప్రేమింపఁబడుచుండునది. అట్లయి నను, నీయందు ప్రేమ యధికము గావున నీకు సవిస్తరముగా నెఱిఁగించెదను వినుము.

అవ. ప్రశ్నమునకు శివుఁ డిచ్చినయుత్తరమును వర్ణించుచున్నాఁడు.—

తే శ్రీమనోరామ శ్రీరామరామరామ
యనుచు రమియింతు రామునియంద రామ
నామము వరానన సహస్రనామతుల్య
మట్లు గావున దీని నీ వవధరింపు. 46

టీ. వరానన=సుందరమగుముఖము గలిగినట్టియు, శ్రీ...రామ-శ్రీ=బ్రహ్మజ్ఞాన మను సంపదతోఁ గూడిన, మనః = (నా) మనస్సును, రామ = రమింపఁజేయునట్టి (అనఁగా: ఆనందపఱుచునట్టి), ఓపార్వతీ, శ్రీరామరామరామ అనుచున్ = శ్రీరామ రామరామ అని జపము చేయుచు, రామునియందు = పరమానందరూపుఁడగు నాపర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్రహ్మమునందే (లేక రామపదముచేఁ జెప్పఁబడు మహావిష్ణువునందే), నేను, రమి యింతుఁ = క్రీడించుచుందును. (అనఁగా: ఆనందము నొందుచుందును.) నామము = ఈరామనామము, సహస్రనామ తుల్యము = కృష్ణ విష్ణు మొదలగు పేర్ల వేయింటితో (లేక ప్రసిద్ధములగు విష్ణుసహస్రనామములతో) సమానము. అట్లు కావునఁ, దీనిఁ, నీవు అవధరింపు = తెలిసికొనుము. (ఈపద్యమున మొదటిపాదమందు, రామనామమును మూఁడుమాఱులు చెప్పుట స్థూల సూక్ష్మ కారణములను మూఁడుశరీరములకును దానిన భిమానించు ముప్వురు జీవులకును, జాగ్రత్త మొదలగుమూఁడవస్థలకును, పవిత్రతకలిగించు టకును, ఆధ్యాత్మికము మొదలగు మూఁడుతాపములను శాంతి నొందించుటకును, శక్తి గలదై యుండుననియు నీవిషయమును సూచించుటకే అట్లు చేయఁబడిన దనియు తెలిసి కొనవలయును.)

తా. ఓసుందరాననా! మనోహారిణీ! పార్వతీ! నేను శ్రీరామరామరామయని జపము చేయుచు, సర్వకాలములయందు నారామునియందే నిలచి యానందించు చుండె దను. ఈరామనామ మితరనామములు వేయింటికంటె నధికమై జపించినవారలకు భోగ మోక్షముల నొసంగును. కావున దీనిని గ్రహింపుము. రామనామమంత్రమే సకలమంత్ర ములలో నుత్తమను.

## శ్రీరామనామార్థము శివుండు పార్వతికిఁ దెలుపుట.

అవ. ఈరామనామమంత్రముయొక్క యర్థమును వివరించి, 'ఈమంత్రమె యన్నిటిలో నుత్తమము' అనువిషయమును ఈక్రింద మూఁడుపద్యములచే నిరూపించు చున్నాఁడు:—

క. ఆదిపరబ్రహ్మప్రతి, పాదక మత్యంతపరమపావనము సుమీ
యీదివ్యమంత్రరాజము, మోదితధర్మార్థకామమోక్షప్రదమున్. 47

టీ. ఈ...జము-ఈదివ్య=శ్రేష్ఠమైన, మంత్రరాజము = మంత్రములలోనుత్తమ మగు రామమంత్రము, ఆ...కము-ఆది=ప్రపంచమునకు నాదికారణమగు, లేక "అహ మాదిశ్చ మధ్యం చ భూతానా మంత యేవ చ "నేను (పరబ్రహ్మమును) సమస్తభూత ములకును, ఆది మధ్య అంత స్వరూపుఁడను" (అనఁగా: ఈభూతములు పుట్టుటకును, నిలుచుటకును స్థానభూతుఁడను) అనుగీతావాక్యమునుబట్టి ఉత్పత్తిస్థితిప్రళయకారణ భూతుఁడగు (ఇచ్చట ఆదిశబ్దముచే మధ్యాంతములుకూడ చెప్పఁబడినవని తెలిసికొను నది) పరబ్రహ్మ=పరబ్రహ్మమును, ప్రతిపాదకము = తెలియఁజేయునది (రామనామము పరబ్రహ్మవాచక మనుట), అత్యంతపరమపావనము=మిక్కిలి పవిత్రములని చెప్పఁదగిన వస్తువులలోనెల్లఁ బవిత్రమైనది. మోది...దమున్-మోదిత=మంత్రజపముచే సంతసించు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వారికి (అనఁగా: సర్వకాలములయందును రామనామధ్యానమును జేయుంటయే యానందముగాఁ గలవారికి), ధర్మార్థకామమోక్ష=ధర్మము మొదలగు నాలుగు పురుషార్థములును, ప్రదమ్=ఇచ్చునది.

తా. ఓపార్వతీ! ఈరామనామమంత్రము సకలమంత్రములలోను శ్రేష్ఠమైనది. ఏల యనఁగా: ఇతరమంత్రము లన్నియును ఉపాధివశమున ననేకవికారములు చెందినట్లు తలఁపఁబడుచున్న పరబ్రహ్మమునుగూర్చి (అనఁగా: బ్రహ్మవిష్ణురుద్రేంద్రాది దేవతలను గూర్చి) చెప్పును. ఈమంత్రమట్లుగాక పరమానందస్వరూపుఁడై జ్ఞానయోగుల కందఱకును, విశ్రమస్థానమైనవా రందఱును (క్రీడించుస్థానమైన) శుద్ధపరబ్రహ్మమును గూర్చి చెప్పును. ఈకారణమువలన సర్వకాలములయందును మిగుల ప్రీతితో నీమంత్ర ముపాసన చేయువారలకు ధర్మార్థకామమోక్షము లనియెడునాలుగుపురుషార్థములును గలుగును.

అవ. ఇట్లు సామాన్యముగా మంత్రార్థమును జెప్పి దానిని వివరించువాఁడై రామశబ్దము పరబ్రహ్మను జెప్పువిధమును నిరూపించుచున్నాఁడు:—

క సత్యజ్ఞానానంద, ప్రత్యగ్భిన్నాత్మునందు బ్రహ్మాదిబుధుల్ [బరునకున్.
నిత్యము రమించుచుండఁగఁ, గాత్యాయని! రామపదము గలిగెఁ

టీ. ఓకాత్యాయనీ=ఓపార్వతీ! సత్య...నందున్-సత్య = కాలమువలనఁగాని, దేశమువలనఁగాని, వస్తువులవలనఁగాని భేదముఁ జెందక (అనఁగా: సర్వకాల సర్వదేశ సర్వావస్థలయందు నొక్కరీతిగ నిలిచి) సత్యమై యుండునట్టియు, జ్ఞాన = ఒకదానిచే తెలిసికొనఁబడక తానన్నిటిని జూచుచు స్వయంప్రకాశస్వరూపముతో నుండునట్టియు, ఆనంద=ఏదుఃఖములతోను సంబంధము లేక పరమానందరూపుఁడైనట్టియు, ప్రత్యక్ష కూటస్థునికంటె (అనఁగా: ఘటాకాశమువలె శరీరోపాధియం దున్నఅభిన్నబ్రహ్మమున కంటె) జీవునికంటె వేఱుకాని, ఆత్మునందున్=పరమాత్మునియందు, బ్రహ్మాదిబుధుల్=బ్రహ్మ మొదలగు దేవతలు (లేక జ్ఞానయోగులు), నిత్యమున్=సర్వకాలములయందును, రమించుచుండఁగన్=క్రీడించుచుండఁగ :(అనఁగా: జీవబ్రహ్మైక్యజ్ఞానము కలిగి యాజ్ఞానముచే మోక్షరూప మగు పరమానందము ననుభవించుచుండుటచేత), పరునకున్ = అపరబ్రహ్మమునకు, రామపదము = రామనామము, ("రమయతీతి రామః, రమంతే అస్మిన్ ఇతి రామః=రమింపఁజేయువాఁడు గాన రాముఁడు, లేక యాతనియందు రమింతురు కావున రాముఁడు" అనువ్యుత్పత్తిచే, రామశబ్దము పరబ్రహ్మవాచక మగునని తెలిసికొనవలయును.) కలిగెన్. (రామశబ్దముచే పరబ్రహ్మమును చెప్పుచున్నా రనుట.)

తా. ఓపార్వతీ! చతుర్ముఖుఁడు మొదలగుజ్ఞానయోగులందఱును జీవాభిన్నుఁడగు నాపరమాత్మునియందే సర్వావస్థలయందును గ్రీడించుచుందురుగదా! ఇట్లు సకలయోగులకును క్రీడాస్థాన మగుటవలన నాపరబ్రహ్మమునకు రామనామము కలిగెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కావున రామనామమంత్రము శుద్ధపరబ్రహ్మమును బోధించునదియే యని నిశ్చయించు కొనవలయును.

అవ. రామనామము విష్ణువుయొక్క యవతారములలో నొక్కటి యగురామావతారమునుగూర్చి చెప్పునని లోకమునఁ బ్రసిద్ధి కలదు గదా! ఇది పరబ్రహ్మవాచకమ్ము యని నిర్ణయించుట యెట్లు? అను సంశయము నీక్రిందిపద్యముతో నివారించుచున్నాఁడు:—

తే. రామపదవాచ్యుఁ డాదినారాయణుండె
యతనికిని నాకు భేద మింతైనఁ గలుగ
దద్వయబ్రహ్మమయుల మట్లగుటవలన
నింతి నాయంద నేను రమింతు నెపుడు. 49

టీ. రామపదవాచ్యుఁడు=రామపదముచే చెప్పఁతగినవాఁడు, ఆదినారాయణుండు ఎ=ఆదిపురుషుఁడగువిష్ణువే, అగును. (విష్ణుమూర్తియవతారములలో నొక్కఁడానిని చెప్పునది యగుటచే నారామనామము విష్ణువాచక మగు ననుటలో సంశయము లేదనుట.) అతనికిని=అవిష్ణువునకును, నాకున్, భేదము, ఇంత ఐనన్ = కొంచెమైనను, కలుగదు= లేదు. అద్వయబ్రహ్మమయులము = మే మిరువురము కేవలపరబ్రహ్మస్వరూపులము (అనఁగా: ఉపాధు లగుశరీరములు వేఱువేఱుగా నున్నను, ఆశరీరములయందున్న పరమాత్మునకు భేదము లేదు కావున మే మిరువురము నొక్కటియే. మఱియు ఈరామనామము విష్ణువును చెప్పునదియే యనినను విష్ణుశరీరోపాధియందున్న పరబ్రహ్మమును గూర్చియే చెప్పును గాని దేహమునుగూర్చి చెప్పదుగదా! ఈరామనామముమాత్రమే కాదు. పేరైనను కేవలశరీరమును గూర్చి చెప్పు ననుట సంభవింపదు. నేను అనుశబ్దమునకు అర్థ మగునట్టిజీవస్వరూపమే నీవు వాఁడు అను మొదలగుపదములకుఁగూడ నర్థమగునని విచారణచే స్పష్ట మగుచుండుటచేత, లోకమునందలి యేపేరు గాని శరీరమును గూర్చి చెప్పుటయే సంభవింపదు. "ఇది శరీరము" అను మొదలగు స్థలములయందు వ్యవహరింపఁబడుశరీరాదినామములు కూడ ఆయాభూతముల స్వరూపములతోనున్న పరబ్రహ్మమునే చెప్పవలయును. పరబ్రహ్మభిన్న మగువస్తువే లేదుగదా! కావున వాచ్యార్థము (పైకి తోఁచునట్టియర్థము.) విష్ణువే యైనను లక్ష్యార్థము (ఊహింపతగినయర్థము, లేక విచారణచే నిర్ణయింపఁదగినయర్థము) పరబ్రహ్మమే యగును. అట్లు అగుటవలనన్, ఇంతి= ఓపార్వతీ! నేను, నాయంద = ఆత్మస్వరూపమునందే, (నలువదియారవపద్యమున "రమియింతు రామునియందు" అని చెప్పఁబడియున్నది. దాని కిది వ్యాఖ్యాన మని తెలిసికొనవలయును.) ఎపుడున్, రమియింతున్ = క్రీడించెదను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఓపార్వతీ! ఈరామనామము రామావతారమును గూర్చి చెప్పునది యగుటచే విష్ణువాచక మనుటలో సంశయము లేదు. అట్లైనను ఇది విష్ణుశరీరోపాధియందున్న పరబ్రహ్మమునుగూర్చియే చెప్పును గాని శరీరమును గూర్చి యెన్నటికిని జెప్పదు. ఆపరబ్రహ్మమునకు స్వభావముగ నేయుపాధులును లేవు కావున రుద్రనామముగల నేనును, విష్ణునామము గలయాహరియును నొక్కటియే. కావున నీరామనామము విష్ణువాచక మైనట్లె రుద్రవాచక మగును. ఇంత యేల? భ్రాంతివలన గనుఁగొన నేరక పోవుటయే కాని చక్కఁగ విచారించిన లోకమున వ్యవహారమునందున్న సర్వనామములు నిట్టివేకదా! అనఁగా: పరబ్రహ్మము నెఱిఁగించునవియేకదా! ఇట్లగుటచేత నేను సర్వకాలములయందును రామపదవాచ్యుఁ డగునాపరబ్రహ్మమునందే, అనఁగా: నాయందే క్రీడించుచుందు నని తెలిసికొనుము. "రమియింతు రామునియందు" అని చెప్పుట "రామునకును నాకును భేదము కలదు" అని నిరూపించుటకుఁ గాదనియు, "పరబ్రహ్మమును దెలిసికొనవలయును" అను మొదలగువాక్యములయందువలెనే ఆరామపదము పరబ్రహ్మవాచకముగా మాత్రమే యుపయోగింపఁబడిన దనియుఁ దెలిసికొనుము. పైనిరూపించినయుక్తివలన "రామనామము పరబ్రహ్మమును జెప్పును" అనువిషయములోఁ గొంచెమైనను సంశయింపవలసినపని లేదు.

## శ్రీరామనామప్రభావము.

అవ. ఇట్లు రామనామమంత్రార్థమును వివరించి, సాధకులకు దానియం దభిరుచిని గలిగించుటకై యర్థవాద ముపక్రమించుచున్నాఁడు:—

తే. రామ తారకపావన రామనామ
మెంతపాపంబు నడగించు నంతయఘము
శ్వపచుఁ డైనను జేయఁగాఁ జాలఁ డనఁగఁ
దత్ప్రభావంబు నెన్నంగఁ దరమె నాకు. 50

టీ. రామ=పార్వతీ! తారకపావనరామనామము = సంసారమును దరింపఁజేయఁగల (లేక, ఓంకారార్థమైనపవిత్రమగు రామనామము.) ఎంతపాపంబున్, అడఁగించున్ =పోఁగొట్టునో, అంతయఘమున్=అంతపాపమును, శ్వపచుఁడు ఐనను=కుక్కమాంసము తినుచండాలుఁడైనను, (ఈజాతి మిక్కిలి యధిక మగుతమోగుణముగలది యగుటచేత నిట్లు చెప్పఁబడెను.) చేయఁగా చాలఁడు=చేయలేఁడు, అనంగన్=అని చెప్పుచుండఁగ, తత్ప్రభావంబున్=ఆమంత్రముయొక్క సామర్థ్యమును, నాకున్ వర్ణింపన్ తరము ఎ = నేను వర్ణింపఁగలనా?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఓపార్వతీ! ఈరామనామ మెంతపాపమును బోఁగొట్టఁగలదో అంతపాపమును జండాలుఁడు కూడఁ జేయలేఁ డని చెప్పుదురు. ఇట్లుండ దీనిప్రభావమునుగూర్చి నే నేమని వర్ణింపఁగలను? అయినను నాశక్తికొలఁది కొంత వర్ణించి చెప్పెదను.

క. ఈరేడుజగములందును, నారీమణి విమలరామనామముచేతం
జీరఁబడనిఘనదుర్భర,ఘోరమహాఘంబు లేదు కోరి వెదకినన్. 51

టీ. నారీమణి = స్త్రీరత్న మగు ఓపార్వతీ! ఈరేడుజగములందున్ = ఈపదునాలుగు లోకములయందును, విమల... చేతన్ - విమల = పవిత్రమైన, రామనామము చేతన్ = రామనామమంత్రముచేత, జీర...ఘంబు - జీరఁబడని = నశింపఁజేయఁబడని, ఘన=అధికమైన, దుర్భర=ఓర్వరాని, ఘోర = భయంకరమైన, మహత్ = గొప్పదైన, అఘంబు=పాపము, కోరివెదకినన్=కావలయునని వెదకినప్పటికిని, లేదు=దొరకదు.

తా. ఓపార్వతీ! ఈపదునాలుగులోకములయందు నెచ్చట వెదకినను, ఎంత శ్రద్ధతో విమర్శించినను, రామనామజపము నశింపఁజేయలేని పాపమే లేదు. (అనఁగా: ఎంతగొప్ప దైనను, ఎంతభయంకరమైన దైనను, ఎన్నిమాఱులు మనఃపూర్వకముగాఁ జేయఁబడిన దైనను పాపము రామనామజపముచేఁ దత్క్షణమే ధ్వంస మగును.)

తే. బ్రహ్మహత్యాయుతము మద్యపానదశశ
తమును గుర్వంగనాకోటిగమనదురిత
మపరిమిత హేమచౌర్యంబు లనవరతము
రామనామాభిహతము లో రాజవదన. 52

టీ. ఓరాజవదన = చంద్రునివంటి ముఖము గల యోపార్వతీ! బ్రహ్మహత్యాయుతము = పదివేలబ్రహ్మహత్యలును, మద్యపానదశశతంబు = వేయిమద్యపానదోషములును, గుర్వంగనాకోటిగమనదురితము=కోటిసంఖ్య గలగురుపత్నులఁ గవయుదోషంబును (ఇచ్చట అయుతాదిశబ్దములకు "లెక్కకు మిక్కిలి యైనవి" అనియే యర్థముగాని, ఆయాసంఖ్యలుమాత్రమే యర్థములుగావని తెలిసికొనవలయును.) అపరిమిత హేమచౌర్యంబులు=లెక్కకు మిక్కిలియగుస్వర్ణస్తేయమహాపాపములును (స్వర్ణస్తేయమనఁగా: బంగారమును దొంగిలించుట (పరులధనము నపహరించుట,) ఈవిధముగ పంచమహాపాతకములలోని నాలుగుపాపములను గూర్చియు చెప్పఁబడియుండుటచే పైనాలుగుపాపములలో దేనినైనను చేసినవారితో స్నేహము చేయుట యనునైదవపాపమును గూర్చి కూడ చెప్పఁబడియెను.) అనవరతమున్ = ఎల్లప్పుడును, రామ...ములు-రామనామ = రామమంత్రముచేత, అభిహతములు=పోఁగొట్టఁబడినవి, (ఈపాపము లన్నిటిని రామమంత్రము పోఁగొట్టు ననుట.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఓపార్వతీ! పదివేలబ్రహ్మహత్యలు గాని, లెక్కకు మిక్కిలి యగు మద్యపానదోషములు గాని, గురువధూసంగమదోషములు గాని, సువర్ణస్తేయములు గాని, ఇట్టిపాపులతో సహవాసము చేయుంటవలనఁ గలుగుదోషములుకాని (అనఁగా: మహాపాపములు అని చెప్పఁబడు అయిదును), రామమంత్రజపముచే నిమిషమాత్రమున తొలఁగిపోవును. ఈపాపములన్నియు, రామమంత్రమును జూచిన నెప్పుడును భయపడుచుండును.

సీ. బ్రహ్మహత్యాఖ్యపాపతమోర్కబింబంబు
మధుపానదోషాభ్రమారుతంబు
తపనీయచౌర్యపాతకశైలభిదురంబు
గురువధూగమనాఘకుంజరహరి
జననీపితృభ్రాతృవనితార్భకాచార్య
గోవధారణ్యోరుదావవహ్ని
పరసతీసంగమపరధనహరణాది
ఘోరపంకోరగక్రూరబర్హి
తే. యనృతభాషణవల్లీమహాలవిత్ర
మార్యదూషణపంకేరుహద్విపేంద్ర
మఖిలకలుషాంబునిధిబడబానలంబు
రామనామంబు హిమశైలరాజతనయ. ౯౩

టీ. హిమశైలరాజతనయ = పర్వతరాజగు హిమవంతునకుఁ బుత్రిక వగు నో పార్వతీ! రామనామంబు = రామమంత్రము, బ్రహ్మ...బంబు - బ్రహ్మహత్యాఖ్య = బ్రహ్మహత్య యనియెడు పేరుగల, పాప = పంచమహాపాతకములలో మొదటిదగు పాపమను, తమః = చీఁకటికి, అర్కబింబంబు = సూర్యబింబమువంటిది. (సూర్యుఁడుదయింపఁగానే, యెంతగాఢమగు చీఁకటియు విచ్చిపోవునట్లు ఈ రామనామము స్మరింపఁబడినతోడనే బ్రహ్మహత్య తొలంగిపోవునుట.) మధు...తంబు - మధుపాన దోష = మద్యపానమనియెడు, అభ్ర = మేఘమునకు, మారుతంబు = ప్రబలమగువాయువువంటిది. తప...రంబు - తపనీయచౌర్యపాతక = స్వర్ణస్తేయపాప మనియెడు, శైల=పర్వతమునకు, భిదురంబు = వజ్రాయుధమువంటిది. గురు...హరి - గురువధూగమనాఘ=గురుపత్నీగమనపాప మనియెడు, కుంజర = ఏనుఁగునకు, హరి = సింహమువంటిది, జననీ...వహ్ని-జననీ = తల్లియొక్కయు, పితృ=తండ్రియొక్కయు, భ్రాతృ = అన్నదమ్ములయొక్కయు, వనితా = స్త్రీలయొక్కయు, అర్భక = శిశువులయొక్కయు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆచార్య=గురువులయొక్కయు, గో = గోవులయొక్కయు, వధ = సంహారమనియెడు, అరణ్య=అరణ్యమునకు, ఉరుదావవహ్ని = గొప్ప (అరణ్యమునంతయును దహింపఁగల) దావానలమువంటిది. పర...బర్హి - పరసతీసంగమ = పరస్త్రీసమాగమము, పరధన హారణ=ఇతరులధనముల నపహరించుట, ఆది = మొదలుగాఁగల, ఘోర = భయంకరము లైన, పంక = పాపములనియెడు, ఉరగ = సర్పములకు, క్రూరబర్హి = క్రూరమైన నెమలివంటిది. (నెమలి సర్పముల కెంతశత్రు వైనను గొంతశాంతగుణముగలదియయ్యె నేని యొకానొకసర్పము నొకానొకప్పుడు చంపక విడిచినను విడువవచ్చును గావున నట్టిశంక కవకాశము లేకుండుటకై ఇచ్చట క్రూరపదము ప్రయోగింపఁబడినది.) అనృ...త్రము-అనృతభాషణ=అసత్యమాడుట యనియెడు, వల్లీ=తీఁగెకు, మహా లవిత్రము=గొప్ప (మిగులపదునుగల) కొడవలివంటిది. ఆర్య...ద్రము - ఆర్యదూషణ= పెద్దలఁదిరస్కరించుట యనియెడు, పంకేరుహ = పద్మములకు, ద్విపేంద్రము = గజ శ్రేష్ఠమువంటిది. అఖి...లంబు-అఖిల = సమస్తమైన, కలుష = పాపములనియెడు, అంబునిధి=సముద్రమునకు, బడబానలంబు=బడబాగ్నివంటిది.

తా. ఓపర్వతరాజపుత్రీ! ఈరామనామము సూర్యుఁడు చీఁకటిని పోఁగొట్టు నట్లు బ్రహ్మహత్యను బోఁగొట్టును. గాలి మేఘముల చెదరఁగొట్టునట్లు మద్యపాన మహాపాపమును చెదరగొట్టును. వజ్రాయుధము కొండల నురుమాడునట్లు స్వర్ణస్తేయ మహాపాపమును ధ్వంసము చేయును. సింహము మదగజమును బరిమార్చునట్లు గురు వధూసంగమమహాపాపమును రూపుమాపును. దావానలము మహారణ్యములఁ గాల్చు నట్లు తల్లి తండ్రి యన్న తమ్ములు శిశువులు స్త్రీలు గురువులు మొదలగువారినివధించు పాపములఁ గాల్చివేయును. క్రూరస్వభావము గల నెమలి తాఁ జూచినపాముల నెల్ల వధించునట్లు పరస్త్రీసంగమ పరధనాపహారాదిమహాపాపములఁ దలయెత్తకుండునట్లు చేయును. మిక్కిలి పదను గలకొడవలి మృదువగుతీఁగెను అతిసులభముగ ఛేదించు నట్లు అసత్యభాషణదోషమును ఛేదించును. మదపుటేనుఁగు తామరతీఁగెల నున్మూలించు నట్లు సజ్జనదూషణ మనియెడు పాపము నున్మూలించును. ఇంత యేల? బడబానలము మహాసముద్రముల నింకించునట్లు సకలవిధము లగుపాపముల నింకించును. దీనితో సమానమగునది మఱియొకటి లేదు.

తే. రమణి యవశముచేనైన రామనామ
మమర వర్ణింపఁ బడుచుండ నఖిలపాత
కములచే విడ్వఁబడుసుమ్ము సుమతి యపుడె
సింహ మతిభీతమృగముల చేతఁ బోలె. 54

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. రమణి = ఓపార్వతీ! అవశముచేఁ ఐనన్ = మనఃపూర్వకముగాఁ గాక నేదియో యొకకారణముచేత నైనను, రామనామము, అమరన్ = ఒప్పునట్లుగా, కీర్తింపఁబడుచుండన్ = ఉచ్చరింపఁబడఁగా, సుమతి = ఆరామనామము నుచ్చరించిన మహాత్ముఁడు, సింహము, అతిభీతమృగములచేత పోలెన్ = తనను చూచినతోడనే మిగుల భయముఁజెందుస్వభావము గలలేళ్లచేతవలె, అపుడె = రామనామోచ్చారణఁ జేసినసమయమునందే, అఖిలపాతకములచేఁ = సమస్తము లైనపాతకములచేతను, విడ్వఁబడున్ సుమ్ము=విడిచిపెట్టఁబడును సుమా!

తా. ఓపార్వతీ! రామనామమును జపింపవలయు ననియు అట్లు జపించిన సకలపాపములును దొలఁగి పోవు ననియుఁ దెలియక పోయినను, ఆజపమునందు శ్రద్ధ లేక పోయినను, ఏదియైన నొకకారణమువలనఁ బ్రమాదమువలన నైనను రామనామము నొక్కమాఱైనను స్మరించినఁ జాలును. సింహ మనినపేరు వినినతోడనే భయముఁజెంది పరుగిడులేళ్లు ఆసింహమును బ్రత్యక్షముగాఁ జూచిన నచ్చట బొత్తిగనే నిలువనియట్లు, రామనామమనినతోడనే భయము నొందుపాపములు ఆనామము నుచ్చరించినక్షణము ననే సంపూర్ణముగ తొలఁగిపోవును.

తే. అనవరతరామనామకీర్తనపరుండు
వెనుకటియఘంబులఁ దలంచి వెఱవవలదు
ఘనత నేనుఁగు నెక్కి కుక్కలను గాంచి
భయపడఁగ నేల మనుజుఁ డోపంకజాక్షి. 55

టీ. ఓపంకజాక్షి = పద్మములవంటినేత్రములు గలపార్వతీ! అన...రుండు-అనవరత=ఎల్లప్పుడును, రామనామ = రామనామముయొక్క, కీర్తన = జపించుటయందు, పరుఁడు = ఆసక్తిగలవాఁడు. (లేక, రామనామకీర్తనమే ముఖ్యముగాఁగలవాఁడు; అనఁగా: మనఃపూర్వకముగా నాజపము నాచరించువాఁడు) వెనుకటియఘంబులన్ = తానంతకు పూర్వము చేసిన పాపంబులను, తలంచి, వెఱవన్ వలదు=భయపడనక్కఱ లేదు. (ప్రమాదముగా రామనామమును జపించినను, సకలపాపములు పోవుచుండ సర్వకాలములయందును భక్తియుక్తుఁడై యాజపము నాచరించువానికి పాపభయము గల్గునా యని భావము.) మనుజుఁడు = మనుష్యుఁడు, ఘనతన్=గొప్పగా, ఏనుఁగును, ఎక్కి, కుక్కలను, కాంచి=చూచి, భయపడఁగన్ ఏల=ఏల భయపడవలయును.

తా. ఓకమలలోచనా! రామనామమును జపింపవలయు ననుసంకల్పమే లేక ప్రమాదమువలన నొక్కమాఱు "రామ" యనినను, సకలపాపములు తొలఁగిపోవుచుండ సర్వకాలములయందును భక్తియుక్తుఁడై రామమంత్రజపము నాచరించువాఁడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"ఇంతకుముందు నే ననేక పాపముల నాచరించితినే" అని ఏల భయపడవలయును? ఏనుఁగుపై నెక్కినవాఁడు క్రిందనున్నకుక్కలు తన్ను కఱచునని భయపడునా? ఎప్పటికిని భయపడఁడు.

క. ఇలలోనరామనామము, సులభంబై వెలుఁగుచుండఁజులకఁగఁబలుకం
గలనాలుక కలుగఁగన,ల్పులుమిన్నక నరకములను బొందెదరకటా.

టీ. ఇలలోనన్ = భూమియందు, రామనామము, సులభంబు ఐ = సుఖముగ దొరకునదియై, వెలుఁగుచున్ ఉండన్ = ప్రకాశించుచుండఁగా, చులకఁగన్, పలుకం గల నాలుక = ఉచ్చరించుశక్తి గలనాలుక, కలుగఁగన్ =ఉండఁగ, అల్పులు = జ్ఞానహీనులు, మిన్నక = నిరర్థకముగ, నరకములనున్, పొందెదరు, అకటా = అయ్యో?

తా. ఇట్లు రామనామము సర్వజనులకును అనాయాసముగనె దొరకునదియై యున్నను, దానిని సుఖముగ నుచ్చరింపఁగలవారలయి యుండినను (అనఁగా: దాని ననాయాసముగనే యుచ్చరింపఁ గలిగి యున్నను.) జ్ఞానహీను లగువారు ఆమంత్రజపమును జేయక పాపములకు లోఁబడి నరకములఁ జెందు చున్నారు. ఆహా! ఇంతకంటె వేఱాశ్చర్య మేమి గలదు!

ఉ. ప్రాపుగ రామనామము నిరంతరమున్ భజియించువారికిం
బాపము లేదటంచుఁ బెనుపాముఁను బట్టఁగవచ్చు నగ్నిసం
దీపితలోహఖండము నతిత్వరితంబుగ మ్రింగవచ్చు బ
లోపము బెంచు పెద్దపులికోఱలుఁ దీయఁగవచ్చు నిద్ధరన్. 57

టీ. ఇద్ధరన్ = భూమియందు, ప్రాపుగన్=ఆశ్రయ మగునట్లుగ, (అనఁగా: ఆరాముని శరణముగా నమ్మి) రామనామమున్, నిరంతరమున్ = ఎల్లప్పుడును, భజియించువారికిన్ = సేవచేయువారికి (అనఁగా: జపము సేయుచు, దానియర్థమును, పరబ్రహ్మమును, మనసున ధ్యానము చేయువారికి పాపము లేదు.), అటంచున్ = అని చెప్పుచు, పెనుపామునున్ = పెద్దపామును, పట్టఁగన్ వచ్చున్ =(శపథము చేయుటకై) పట్టుకొనవచ్చును. అగ్ని...డమున్-అగ్ని = అగ్నిహోత్రముచే, సందీపిత = బాగుగఁ గాల్పఁబడిన, లోహఖండమున్ = ఇనుపతునుకను, అతిత్వరితంబుగన్ = మిగుల త్వరతో మ్రింగన్, వచ్చున్, బల్...అలు - బల్ కోపము = విశేష మగుకోపమును, పెంచు=వృద్ధిఁజెందించు, పెద్దపులికోఱలు, తియ్యఁగన్ వచ్చున్.

తా. రామనామమే శరణ మని నమ్మి దానిని సర్వదా జపించుచు దానియర్థ మగు పరబ్రహ్మమును సర్వదా ధ్యానించుచు నుండువారలకుఁ బాప మేమాత్రము నంటదని చెప్పుచు [illegible] ప్రతిజ్ఞా పైనను జేయవచ్చును. అత్యుగ్ర మగుసర్పమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జేతితో పట్టుకొనవచ్చును. బాగుగఁ గాలినయినుపతునక నైనను మ్రింగవచ్చును. మిగులఁ గోపము కలిగియున్న పెద్దపులిని సమీపించి దానికోరలను గూడ బలాత్కారముగ నూడఁబెరుకవచ్చును. ఇట్లెన్నిసాహసములు చేసినను సత్యప్రభావమువలన నాపురుషున కేమియును బాధ కలుగనేరదు.

క. ఏపాపమునైనఁ దగం, బాపఁగలదు రామనామభజనపరునకుఁ
బాపము గలదనిపలుకుమ,హాపాతకియఘమునడఁపనది యోపదిలన్.

టీ. అది = ఆరామనామము, ఏపాపమును ఐనన్ = ఎట్టిమహాపాపమునైనను, తగన్ =ఒప్పునట్లుగా, పాపఁగలదు=పోఁగొట్టఁగలదు. (అయినను) ఇలన్ = ఈ భూమి యందు, రామ...నకున్-రామనామ = రామనామమును, భజన = సేవించుటయే, పరు నకున్=ప్రధానముగాఁగల పురుషునకు (ఎప్పుడును రామనామజపము సేయుపురుషునకు కూడ) పాపము, కలదు, అని, పలుకు...అఘమున్-పలుకు = చెప్పునట్టి, మహాపాతకి= మహాపాపాత్మునియొక్క, అఘమున్ = పాపమును, అడఁపన్ =పోఁగొట్టుటకు, ఓపదు= సమర్థముకాదు.

తా. ఇట్టిప్రభావము కలదియైనను ఆరామనామము సకల పాపములను హరింపఁ గలదే కాని "రామనామజపము చేయువానికిఁ గూడఁ బాపము కలదు" అని చెప్పు పాపాత్ముని పాపమును మాత్రము పోఁగొట్టనేరదు.

## శ్రీరామనామమంత్రాధికారివివరణము

అవ. ఈరామమంత్రము సకలమంత్రములలో శ్రేష్ఠమనుటకు మఱియొకకారణ మునుగూడఁ జూపుచు తజ్జపమున నధికారుల నిరూపించుచున్నాఁడు.

సీ. ద్విజవరేణ్యులకును విప్రోత్తములకు యో
గీశ్వరులకును యతీశ్వరులకు
భక్తివైరాగ్యసంపద్విశిష్టులకు నే
కాంతవాసులకు వేదాంతులకును
జండాలపుల్కసశ్వపచకంకకిరాత
శబరహూణాంగనాసంగతులకు
బ్రహ్మహత్యాసురాపానహేమస్తేయ
గురువధూసంగమకరవరులకు
తే. సుందరీక్షత్రియోరవ్యశూద్రులకును
మఱియు నానావిధానేకమానవులకుఁ
బరమపావనమై శుభప్రదము నైన
రామనామంబు శరణంబు రాజవదన! 59

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ఓరాజవదన = చంద్రునివంటిముఖము గలయోపార్వతీ ! ద్విజవరేణ్యులకును = ('జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః' పుట్టినప్పుడు కేవలబ్రాహ్మణుఁ డనునామ మొక్కటియే యుండును గావున నప్పుడు ఆశిశువు శూద్రప్రాయుఁడగును. పిదప నుపనయనసంస్కారము జరుగఁగానే ద్విజుండని చెప్పఁబడును. అనువాక్యముల ననుసరించి ఉపనయనసంస్కారసంస్కృతు లగు) బ్రాహ్మణోత్తములకును, విప్రోత్తములకున్ ("వేదపాఠేన విప్రః స్యాత్" "వేదాధ్యయనమువలన విప్రుఁడగును" "విశేషేణ పరాన్ పాతీతి విప్రః" "విశేషముగఁ బరులఁ గడతేర్చువాఁడు." ఇది సర్వపురుషార్థసాధన మగు వేదాధ్యయనము వలనం గాని కలుగదుగదా? అను మొదలగు వాక్యములం బట్టి) విప్రు లనఁదగినవారిలో శ్రేష్ఠులగువారికిని, యోగీశ్వరులకున్ = యోగము చేయువారిలో (అనఁగా జీవబ్రహ్మము లొక్కటియే యని తెలుసుకొనువారలలో, లేక, తారకాదియోగముల నభ్యసించువారలలో) శ్రేష్ఠులగువారలకును, యతీశ్వరులకున్ = బ్రహ్మజ్ఞానమునకై యత్నించు సన్యాసిశ్రేష్ఠులకును, భక్తి=గురువేదాంతవాక్యములయందు శ్రద్ధయనునట్టియు (లేక, దైవభక్తియనునట్టియు,) వైరాగ్య ఇహలోకభోగములయం దిచ్ఛలేకపోవుట యనునట్టియు,సంపత్ =సంపదలచేత,విశిష్టులకున్ =కూడికొనినవారికిని, ఏకాంతవాసులకున్ =ఏకాంతస్థలము లగునరణ్యము మొదలగువానియందుండి పరమేశ్వరసాక్షాత్కారము కొఱకుఁగాని చిత్తవిశ్రాంతికొఱకుఁగాని ప్రయత్నించువారికిని, వేదాంతులకున్ =వేదాంత శాస్త్రజ్ఞానము కలిగి (అనఁగా: పరోక్షజ్ఞానము కలిగి) యున్నవారికి, చండాల...కున్ -చండాల=మాలవాండ్రు, పుల్కస = ఉరియలయందలి మాంసమును దినువారు, శ్వపచ=కుక్కమాంసమును తినువారు, కంక=పక్షులను తినువారు, కిరాత=బోయలు, శబర=ఎఱుకులు, హూణ=హూణులు, (అనఁగా ఆంగ్లేయులు=ఇంగ్లీషువారు) వీరియొక్క, అంగనా=స్త్రీలతో, సంగతులకున్ =సమాగమముఁ జేసినవారికిని (అనఁగా: అనాచారపరులై యుండువారికిని,) బ్రహ్మ...కున్, బ్రహ్మహత్యా=బ్రహ్మహత్య, సురాపాన=కల్లుద్రాగుట, హేమస్తేయ = సువర్ణమును దొంగిలించుట, గురువధూసంగమ, (ఈమహాపాపములను) కర=చేసినవారిలో, వర్యులకున్ =శ్రేష్ఠులైనవారికిని, (అనఁగా: కేవలమనాచారపరులగుటయేకాక, పంచమహాపాపములనఁబడు బ్రహ్మహత్యాదులఁ బలుమాఱు లొనరించిన వారికిని,) సుంద...కున్ -సుందరీ=స్త్రీలు, క్షత్రియ = క్షత్రియులు, ఊరవ్య = వైశ్యులు, శూద్రులకును, (సర్వవర్ణములవారికిని అనుట, ఇతరమంత్రములకు అన్నివర్ణములవారు నధికారులు కారు. అని తెలుసుకొనవలయును) మఱియున్, నానా...లకున్ -నానావిధ=అనేకవిధములైన, (అనఁగా: ఆచారములయం దనేకభేదములుగల,) అనేక=లెక్కకు మిక్కిలియగు (అనఁగా: అనేకజాతిభేదములుగల) మానవులకున్ = మనుష్యులకును, పరమపావనము ఐ=పవిత్రము లగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పదార్థములలోనెల్లఁ బవిత్రమై, శుభప్రదమును ఐన రామనామంబు = సకలశుభముల నిచ్చునట్టిదియు నైనఆరామనామమే, శరణంబు=రక్షకము.

తా. ఓపార్వతీ! ఉపనయన సంస్కారమును మాత్రముఁ జెంది నిష్ఠాపరులై ద్విజశ్రేష్ఠు లనిపించుకొనువార లైనను, సకలవిధము లగుజ్ఞానములకు నాధారమగు వేదమును బాగుగ నభ్యసించి దానియందుఁ జెప్పఁబడిన స్నానసంధ్యాది కర్మల నాచరించుచుఁ దాము కడతేరి పరులం గడతేర్చుసామర్థ్యము గల విప్రులైనను, తారకసాంఖ్యామనస్కరూప మగుయోగము నభ్యసించుచు, నిశ్చలచిత్తు లగుమహాత్ములైనను, బ్రహ్మజ్ఞానమునకై ప్రయత్నించుచు శాస్త్రోక్తప్రకారముగ సకలకర్మలఁ బరిత్యజించిన సన్న్యాసులైనను, గురువులయందును, దైవమునందును మిగుల భక్తిగలిగి యుపాసనలఁ జేయుఁవారైనను, పరిపూర్ణ మగువైరాగ్యము గలిగి మోక్షమును గోరువారైనను, వనములు మొదలగు నేకాంతస్థలములయందుండి చిత్తవిశ్రాంతికై ప్రయత్నించుచుఁ గాని తనకత్యధిక మగుస్థితి గలుగవలయునని పరమేశ్వరసాక్షాత్కారముఁ గోరుచుగాని యుండువారైనను పరోక్షజ్ఞానము (పరబ్రహ్మ మొక్కఁడున్నాఁడు అనుజ్ఞానము లేక, పరబ్రహ్మమే నేను అనుజ్ఞానము) కలిగి యది యనుభవపూర్వకముగ దృఢము కావలయు నని ప్రయత్నించువారు అయినను, యీరామనామమునే ఆశ్రయింపవలయును. పరబ్రహ్మము నెఱింగించు నీరామమంత్రమునకంటె శ్రేష్ఠమగునది పైఁ జూపఁబడిన యధికారులస్థితి నభివృద్ధిసేయఁగలది వేఱొక్కటిలేదుగదా. వీరేకాదు. మిగుల ననాచారపరులైనమాలవారు, ఊరియలలోని మాంసము తినువారు, కుక్కలఁ దినువారు, పక్షులఁ దినువారు, బోయలు, ఎఱుకులు, హూణులు, మొదలగు (తాఁకుటకు సైతము వీలులేని) జాతులవారి స్త్రీలతో సంబంధముకలవారైనను, కేవల మనాచారమాత్రమేకాదు. బ్రహ్మహత్య, మద్యపానము, సువర్ణమును దొంగలించుట, గురువధూసంగమము అనుమహాపాపములను సైతము పలుమాఱాచరించినవారైనను, తమపరిశుద్ధికై రామనామమునే యాశ్రయింపవలయును. స్త్రీలు గాని క్షత్రియాదిజాతులవారు గాని, యీమంత్రజపమునం దధికారులే! ఇంత యేల? పరమపవిత్రమై సకలశుభములఁ గలిగించునది యై యున్న ఈరామనామ మెట్టిమనోవైకల్యము కలవారి నైనను, ఏజాతికలవారి నైనను బ్రోవఁగలదు. వారి నభివృద్ధిఁజేయఁ గలదు. ఇట్లు అధికారిభేదము లేక సకలవిధము లగువారును, సకలజాతులవారును ఈమంత్రజపమున (లేక, నామజపమున) నధికారులై యుండుటయె దీనికిని ఇతరమంత్రములకును గలభేదము. ఇతరమంత్రములకు నధికారినియమము కలదు. దీని కానియమములేదు. వీఁడు వాఁడు అనక నిది సర్వజనుల నుద్ధరించును కావున నిది సర్వమంత్రములలో నుత్తమ మనుటకు సంశయము లేదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. కనదురురామనామమునకంటె ఘనం బగుపాపనాశసా
ధనము నిరంతరేష్టఫలదాయక మైనవిశేషకారణం
బును మఱి లేదు లోకమున మూఢులెఱుంగరు దాని నాశ్రయిం
చిన సకలార్థసంపదలు చేకుఱు సిద్ధము శైలనందనా. 60

టీ. శైలనందనా = పార్వతీ! కన...కంటెన్ - కనత్ = ప్రకాశించుచున్న; ఉరు=గొప్పది యైన, రామనామమునకంటెన్, ఘనంబు = శ్రేష్ఠమైనది. అగుపాపనాశసాధనము = ఐనట్టిపాపముల నశింపఁ జేయఁగలయుపాయము; నిరం...కము-నిరంతర= సర్వకాలములయందును, (లేక, ఆటంక మేమియును లేకుండ) ఇష్ట = కోరిన, ఫల = ఫలములు, దాయకము=ఇచ్చునట్టిదియు, ఐనవిశేషకారణంబును = అగునట్టిముఖ్యమైన కారణంబును, (అనఁగా: యుపాయంబును,) లోకమునన్, మఱి=మఱియొక్కటి, లేదు, మూఢులు-ఎఱుఁగరు = ఈవిషయమును తెలిసికొనలేరు. దానిన్ = ఆరామనామమును, ఆశ్రయించినన్, సకలార్థసంపదలు = సకలవిధము లగునిష్టఫలసమృద్ధులు, చేకుఱున్ = కలుగును, సిద్ధము=యథార్థము.

తా. ఓపార్వతీ! ఈలోకమున సకలపాపముల నశింపఁజేయుటకుఁ గానీ, కోరిన కోర్కుల నొసంగుటకుఁగానీ, రామనామమునకంటె శక్తిగలపదార్థము వేఱొకటి లేదు, అయినను, ఈవిషయమును మూఢులు తెలిసికొననేరరు. వివేకవంతులై యారామనామము నాశ్రయించిరేని వారు పొందరాని పెద్దియును లేదు. ఇది యథార్థము.

## అష్టభోగములవివరణము.

శ్లో. దాసో భృత్యస్సుతో బంధుర్వస్త్ర వాహనమేవ చ,
ధనధాన్యసమృద్ధిశ్చాప్యష్టభోగాః ప్రకీర్తితాః."

ఇచ్చట దాసుఁ డనఁగా, తనవలన జీతము తీసుకొనుచు సేవచేయువాఁడు, భృత్యు డనఁగా తనయనుగ్రహమును కోరి కాని, లేక తనయం దున్న గౌరవమువలనఁగాని తనకు లోఁబడి తనకార్యములఁ జక్కబెట్టువాఁడు; ఈఅష్టభోగములకంటె కొరతగినది మఱి యేదియుండదు కావున వీని నిచ్చట వివరించియున్నాము.

తే. అబల శ్రీరామరామనామాఖ్యమంత్ర
మీప్సితంబుల నర్థుల కిచ్చుచుండఁ
గాంచి నెఱి సిగ్గుపడుచుండుఁ గల్పతరువు
కామధేనువు నలఘుచింతామణియును. 61

టీ. అబల=పార్వతీ! శ్రీ...త్రము-శ్రీ = బ్రహ్మవిద్యారూపముఁగలచిత్ప్రకృతికి, (లేక, లక్ష్మికి), రామ = మనోహరమైన, రామ = రామునియొక్క, (లేక, విష్ణువు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యొక్క, లేక, పరబ్రహ్మముయొక్క,) నామ = పేరని, ఆఖ్య = ప్రసిద్ధిఁజెందియున్న (రామనామమనియెడు) మంత్రము. (మంతారం త్రాయత ఇతి మంత్రః=ధ్యానించువానిని రక్షించునది), అర్థులకున్ = యాచకులకు, ఈప్సితంబులన్ = కోర్కులను, ఇచ్చు చుండన్=ఇచ్చుచుండఁగా, కాంచి=చూచి, కల్పతరువు=కల్పవృక్షంబును, కామధేనువు= కోరినకోర్కుల నీయఁ జాలుకామధేనువును, అలఘు=గొప్పది యగు (అనఁగా: కోరిన కోర్కుల నిచ్చువానిలో నుత్తమమగు) చింతామణియును, నెఱిన్ = మిగుల, సిగ్గు పడుచుండున్.

తా. ఓపార్వతీ! మూలప్రకృతికి మనోహరుం డగు, (లేక, లక్ష్మీనాయకుఁడగు) నా రాముని నామమంత్రము తన్ను సేవించువారలకు కోరినకోర్కుల నెల్ల—(మోక్ష మునుసహితము) నిచ్చుచుండుటను జూచి, "మన కట్లన్నికోర్కులిచ్చుటకు శక్తి లేదు కదా! నిరర్థకముగా కల్పవృక్షము కామధేనువు చింతామణి అను ప్రసిద్ధిని మాత్రము జెంది యున్నాము. ఈ ప్రసిద్ధి హాస్యకారణ మగుచున్నది" అని కల్పవృక్షాదులు మితి లేని లజ్జచే బాధింపఁబడుచుండును. (అనఁగా: కల్పవృక్షమునకంటెను, కామధేనువున కంటెను, చింతామణికంటెను అధికముగా ఈరామనామము భక్తులయభీష్టముల నొసంగు ననుట.)

### శ్రీ రామనామమంత్రోపాసనాఫలము.

సీ. ధర్మార్థులకు సర్వధర్మంబులొనగూర్చు
  నర్థార్థులకుఁ జేయు నర్థములను
గామార్థులకు నెల్లకామంబుల నొసంగు
  నాత్మజార్థుల కిచ్చు నాత్మజులను
శ్రీధృతిస్మృతియశశ్శ్రీయస్సుఖక్షమా
  విద్యార్థులకు వాని వెలయ నిచ్చు
ఛత్రచామరగజాశ్వప్రభుత్వార్థుల
  కవియు సంపాదించు ననవరతముఁ

తే. జంద్రసూర్యాలయంబుల స్వర్గలోక
సత్యవైకుంఠకైలాససదనములను
గోరువారల కవియుఁ జేకూఱఁ జేయు
రామనామంబు విలసిల్లి రాజవదన. 62

టీ. రాజవదన = పార్వతీ! రామనామంబు, విలసిల్లి = ప్రకాశించి, అనవర తమున్ = ఎల్లప్పుడును, ధర్మార్థులకున్ = ధర్మమును కోరువారికి (అనఁగా: స్వకులా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చారధర్మముల నేకాగ్రచిత్తముతో నాచరించి దానిచే కృతార్థులు కాఁదలంచు వారికి), సర్వధర్మంబులు = సమస్తమైన ధర్మములను, ఒనగూర్చుఁ = కలిగించును (అనఁగా: వారితలంపుప్రకారము ధర్మముల చక్కఁగ నాచరించుసామర్థ్యమొసంగి దానిమూలమున వారి నుద్ధరించును). అర్థార్థులకుఁ = ధనము గోరువారికి, అర్థములను=ధనములను, చేయుఁ = కలిగించును. కామార్థులకుఁ = సకలవిధము లగుభోగముల ననుభవింపఁదలంచువారికి, ఎల్లకామంబులనుఁ = కోర్కెలనెల్లను (అనఁగా: భోగసాధనములను), ఒసంగుఁ = ఇచ్చును, ఆత్మజార్థులకుఁ = సంతానమును గోరువారికి, (లేక, సత్పుత్రులను గోరువారికి), ఆత్మజులనుఁ=పుత్త్రులను, ఇచ్చుఁ, శ్రీ... లకుఁ-శ్రీ=సంపత్తు, ధృతి = ధైర్యము, (అనఁగా: ఆపదలు కలిగినను జలింపకుండుట) స్మృతి=సర్వవిషయములను బాగుగ జ్ఞప్తియందుంచుకొని సమయోచితముగ స్మరింపఁగల సామర్థ్యము. యశః=కీర్తి, శ్రేయః=సర్వకాలములయందును, శుభపరంపరలు, సుఖ = శరీరమునకును మనస్సునకును, సుఖము, క్షమా=ఓర్పు, (అనఁగా: క్రోధము లేకుండుట) ఇట్లు చెప్పుటవలన కామాదిశత్రువుల జయించుసామర్థ్యము. అని కూడ నర్థము.) విద్యా=సకలవిద్యలు (అనఁగా: వేదాదిచతుర్దశవిద్యలు లేక, ఆస్వీక్షికి మొదలగు రాజవిద్యలు) వీనిని, అర్థులకుఁ=కోరువారికి, వానిఁ=పైఁజెప్పినధనాదుల, వెలయఁ=ఒప్పునట్లుగా, (లేక, యభివృద్ధియగునట్లుగా) ఇచ్చుఁ, ఛత్ర...లనుఁ-ఛత్ర=శ్వేతచ్ఛత్రము, చామర=వింజామరములు, గజ=ఏనుఁగులు, అశ్వ=గుఱ్ఱములు, ప్రభుత్వ=రాజ్యాధిపత్యము (వీనిని అర్థులకుఁ=కోరినవారికి,) అవియుఁ=ఆఛత్రాదులనుగూడ, సంపాదించుఁ=కలిగించును, (ఇచ్చట ఛత్రాదులు ప్రభుత్వమునకు అంగములే అయినను, మరల ప్రత్యేకముగాఁ జెప్పఁబడి యున్నవి కావున ప్రభుత్వమునకు "స్వల్పరాజ్యాధిపత్యము" అనియును, ఛత్రాదిపదములకు "ఏకచ్ఛత్రాధిపత్యము" అనియును అర్థము) చంద్రసూర్యాలయంబులఁ = చంద్రలోక సూర్యలోకములను, స్వర్గ...లను-స్వర్గలోక, సత్య = బ్రహ్మలోకము, వైకుంఠ, కైలాస, సదనములనుఁ = స్థానములను, కోరువారలకుఁ, అవియుఁ, చేకూరఁ చేయుఁ=ఇచ్చును.

తా. ఓపార్వతీ! ఈరామనామమంత్రము సర్వకాలములయందును, ఇతరసాధనములతోఁ బనిలేకయే ధర్మములఁ గోరువారికి ధర్మముల నొసంగును. (అనఁగా: మనసును నిర్మలము చేసి ధర్మమునందు స్థిరతఁజేయును.) ధనములనుగాని సకలవిధములగు భోగములనుగాని సత్పుత్రులనుగాని, గోరువారలకు అవియెల్ల నొసంగును. సకలవిధములగు సమృద్ధులును గావలయునని గాని, చిత్తము స్థిరముగ నుండవలయు నని కాని, చక్కని ధారణాశక్తి కావలయు నని కాని, కీర్తి కావలయు నని కాని, సర్వకాలములయందును శుభములు కలుగుచుండవలయు నని కాని, శరీరమున కారోగ్యసుఖము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మనమునకు విశ్రాంతిసుఖము కలుగవలయునని కాని, కామక్రోధాదులబాధ తొలంగ వలయు నని కాని, విద్యాభివృద్ధి కావలయు నని కాని, తన్నాశ్రయించినవారి కెల్ల వాని నొసంగును. ఇంతమాత్రమే కాదు. రాజ్యము కావలయునన్నను, అశ్వసమృద్ధిగజ సమృద్ధి కావలయు నన్నను, కట్టకడకు ఏకచ్ఛత్రము వింజామరములు (అనఁగా: చక్ర వర్తిత్వము) కావలయునన్నను, వాని నొసంగును. ఇంతయే కాదు. ఏపుణ్యముల నాచ రింపకయే, చంద్రసూర్యలోకములను గాని, స్వర్గ సత్య వైకుంఠ కైలాసలోకములను గాని కావలయునని కోరినను నన్నిటిని ఒసంగును.

### అన్వీక్షిక్యాదిచతుర్విద్యావివరణము

"అన్వీక్షికీత్రయీ వార్తా దండనీతిశ్చ శాశ్వతీ,
విద్యా హ్యేతా చతస్రస్సు ర్లోకసంస్థితిహేతవః."

అన్వీక్షికి, త్రయి, వార్త, దండనీతి, అని లోకాధారములగు విద్యలు నాలుగు. ఇవి శాశ్వతములైనవి.

"అన్వీక్షిక్యాంతు విజ్ఞానం దండనీత్యాం నయానయౌ,
అర్థానర్థౌ చ వార్తాయాం ధర్మాధర్మౌ త్రయీస్థితౌ."

అన్వీక్షికియందు సకలవిధములగు (తర్క-వేదాంతాదిసంబంధములైన) జ్ఞానములు, దండ నీతి (అర్థశాస్త్రము) యందు నీతి దుర్నీతులు, వార్త (ఆర్థికవిషయములని వ్యవహరింపఁ బడుచున్నది.) అందు మనుష్యులకు హితములును అహితములును అనువిషయములు త్రయి (వేదములు) యందు ధర్మాధర్మములు విమర్శింపఁబడియుండును. ఈనాలుగింటిని సమకూర్చుకొని పురుషుఁడు తనజీవయాత్ర నడుపవలయును.

వ. అదియునుంగాక. 63

టీ. అదియునుఁ గాక=ఇట్లు కోరినకోర్కుల నిచ్చుటయే కాక.

సీ. నిఖిలరోగంబుల నిర్మూలముగఁ జేయు
        భవభయంబులనెల్లఁ బాఱఁదోలు
    బంధనంబులఁ బటాపంచలు గావించి
        నొలయునాపదలను నులిమివైచు
    శాత్రవవిజయంబు సతతంబు సమకూర్చుఁ
        దూలించు బహువిధదుఃఖములను
    దలఁ జూప కుండ దుర్దశలను దొలఁగించు
        సకలశుభంబుల సంగ్రహించు

Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. బరమపావనమంగళప్రదము గాన
గలితధర్మార్థకామమోక్షములలోన
నెసఁగుభక్తుల కొసఁగని దెద్ది లేదు
ఏమి చెప్పుదు శ్రీరామనామమహిమ. 64

టీ. నిఖిలరోగంబులన్ = సమస్తమైనవ్యాధులను, నిర్మూలముగన్ = నిశ్శేషము లగునట్లుగా చేయున్ (పోఁగొట్టుననుట) భవభయంబులన్ = జన్మములవలన (అనఁగా: జననమరణములవలన, లేక, సంసారమువలన) కలుగుభయములను, ఎల్ల = అన్నిటిని, పాఱన్, తోలున్ = పోఁగొట్టును. బాధనంబులన్ = సకలవిధములగు నిర్బంధములను (అనఁగా: అష్టపాశములవలనఁ దనకుఁ గలిగినట్లు తోఁచుచున్ననిర్బంధములను,) పటాపంచలు గావించున్ = చెదరి పోవునట్లు చేయును. ఒలయునాపదలనున్ = వచ్చుచున్న యష్టకష్టములను, నులిమివైచున్ = నశింపఁజేయును. సతతంబున్ = ఎల్లప్పుడును, శాత్రవవిజయంబున్ = శత్రుజయమును, సమకూర్చున్, బహువిధదుఃఖములను=అనేకవిధములైనదుఃఖములను, (లేక, సర్వదుఃఖములకును కారణము లైన పంచక్లేశములను,) తూలించున్ = ధ్వంసముచేయును. దుర్దశలనున్ = హీనములైనస్థితులను, తలఁజూపకుండన్ = కొంచమైనను పుట్టకుండ, తొలఁగించున్ = అణఁచివేయును. సకలశుభంబులన్ = సమస్తవిధములగు శుభములను, సంగ్రహించున్ = సంపాదించును. పర...దము - పరమపావన=పవిత్రము లగువానిలో నెల్ల పవిత్రంబును, మంగళప్రదము=సకలము లగుశుభముల నిచ్చునదియు, కానన్ = కావున, కలి...లోనన్ - కలిత=ప్రసిద్ధములైన, ధర్మార్థకామమోక్షములలోనన్, ఎసఁగుభక్తులకున్ = ఒప్పుచున్న (లేక, మిగుల శ్రద్ధగల) భక్తులకు (అనఁగా: తన్ను సేవించువారలకు) ఒసఁగనిది=ఇయ్యకుండునది, ఎద్ది=ఏదియును లేదు, (అనఁగా: నాలుగుపురుషార్థములలో దేనిని కోరినను దానినిచ్చుననుట) శ్రీరామనామమహిమన్ = రామనామప్రభావమునుగూర్చి, ఏమి చెప్పుదున్ = ఏమని చెప్పఁగలను.

తా. అట్లు అన్నికోర్కులనిచ్చుటయె కాక సాధకునకుఁ (అనఁగా : జపము చేయువానికి) గల సకలవిధవ్యాధులను నిశ్శేషముగ ధ్వంసముఁజేయును. జన్మమరణరూప మగుసంసారమువలన జనించిన భయమును నివృత్తిచేయును, (అనఁగా: ముక్తినిగలిగించును. సకలవిధనిర్బంధములను జెదరఁగొట్టును. అష్టకష్టములను దొలఁగించును. సకలశత్రువుల జయింపఁగల సామర్థ్యము నిచ్చును. ఇంతయేకాక యేవిధములగు దుఃఖము లున్నను సర్వదుఃఖములకు మూలకారణములగు పంచక్లేశములతోఁగూడఁదొలఁగించును. (అనఁగా: మఱియెప్పటికిఁగూడఁ గలుగకుండునట్లుచేయును.) సకలదుర్దశలను పోఁగొట్టి శుభములఁగలిగించును. శ్రీరామనామము ... పవిత్రములగువానిలో నెల్లపవిత్ర మైనదియు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సకలవిధములగు మంగళముల సంపాదించుసామర్థ్యము గలదియగుటచే దన్నాశ్రయించిన భక్తులు ధర్మార్థకామమోక్షములలో దేనిని గోరినను దాని నొసఁగును. ధర్మార్థకామమోక్షములకంటె వేఱె కోరఁదగినవస్తువేదియును లోకమున లేదు కదా! కావున ఓపార్వతీ! ఈరామనామప్రభావము నెంత యని వర్ణింపఁగలను? సాకల్యవర్ణన మలవిగాదు.

## పంచక్లేశవివరణము.

అవిద్యాక్లేశము, అభినవక్లేశము, అస్థిగతక్లేశము, రాగక్లేశము, ద్వేషక్లేశము అని క్లేశము లైదువిధములు. అందు నేను జీవుఁడనని నిర్ణయించుట అవిద్యాక్లేశము, సంసారమును, దానికి కారణమయిన మనస్సును పరిత్యజింపకుండుట అభినవక్లేశము. విషయాభిలాష కలిగి విఱ్ఱవీఁగుచుండుట అస్థిక్లేశము. అర్థములయందు అధికాసక్తి కలిగియుండుట రాగక్లేశము. ఉదరపోషణార్థము పరుల నాశ్రయించి వారివలన తనయభిమతము గొనసాగనందున వారల దూషించుట ద్వేషక్లేశము.

## అష్టపాశవివరణము.

క. దయయుఁ జుగుప్సయుఁ మోహము, భయమును సంశయము గులము బలశీలము ల
న్నియుఁ గూడ నష్ట పాశము, లయి వెలయును వాని నాత్మఁ డంటకయుండున్.

(శుకచరిత్రము.)

## అష్టకష్టములవివరణము.

శ్లో. "ఋణం యాచ్ఞా చ వృద్ధత్వం జారచోరదరిద్రతాః,
రోగశ్చ భుక్తశేషశ్చాప్యష్టకష్టాః ప్రకీర్తితాః."

క. అచ్చటనె సరస్వతియును, నచ్చటభాగీరథియును యమునానదియున్
నచ్చట సమస్తతీర్థము, లెచ్చట శ్రీరామనామ మెప్పుడు కలుగున్.

టీ. శ్రీరామనామము, ఎచ్చటన్ = ఏస్థలమునందు, ఎప్పుడున్, కలుగున్ = జపింపఁ బడుచుండునో, అచ్చటనే=ఆస్థలమునందే, సరస్వతియున్ =సరస్వతీనదియును, అచ్చటన్=ఆస్థలమునందే, భాగీరథియున్ = గంగానదియును, అచ్చటన్, సమస్తతీర్థములు, (కలుగున్) యమునానదియున్, (కలుగున్ అని అధ్యాహార్యము.)

తా. ఏస్థలమునందురామనామజపము సర్వకాలములయందును జరుగుచుండునో ఆస్థలమునందే సర్వతీర్థోత్తమములని చెప్పఁదగిన గంగాయమునాసరస్వతులు, మఱియు లోకమునఁగల సకలతీర్థములును ఎప్పుడును నివసించుచుండును. కావున నాస్థలము సర్వతీర్థమయమై చూచువారలకును గూడ మోక్షమును గలిగించుచుండును.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. తవిలి శ్రీరామనామసుధారసంబు
నమృతులై గ్రోలుభక్తుల కమృత మేల?
నమర నమృతాంధసులచేత నదియె మిగులఁ
గోరఁబడుచుండుఁ గావున వారిజాక్షి. 66

టీ. వారిజాక్షి = కమలములవంటి నేత్రములుగల యోపార్వతీ !, అమరన్ = ఒప్పునట్లుగా, అమృతాంధసులచేతన్ = అమృతమును పానముచేయునట్టి దేవతలచేత కూడ, అదియె=ఆరామనామనే, మిగులన్=అధికముగ, కోరఁబడుచుండు, కావునన్, (దేవతలు అమృతమును పానము చేసినవా రయ్యును, ఆరామనామమును మిగుల శ్రద్ధతోఁ గోరుచుందురు కావున) తవిలి = తత్పరులై (అనఁగా : రెండవపనిలేకుండ అమృతులై రామనామమంత్రప్రభావమువలన మరణము లేనివారై, అనఁగా : జనన మరణరూపమగు సంసారమునుండి ముక్తులై) శ్రీరామనామసుధారసంబున్ = శ్రీరామ నామామృతమును, గ్రోలు భక్తులకున్=పానముచేయు నుపాసకులకు, అమృతము=క్షీర సముద్రమునుండి చిలికి సంపాదించియున్న యమృతము, ఏల=ఎందుకు ?

తా. కమలమువలె విశాలనేత్రములుగల యోపార్వతీ ! సంసారబంధ విముక్తులై (అనఁగా: అహంకార మమకారముల బాధవలన బహుముఖములుగఁ దిరుగుచుండు మనసును నిలిపి పరమశాంతిని బూని) సర్వకాల సర్వావస్థలయందును రెండవపని లేక యీ శ్రీరామనామామృతమును పానముచేయుచుండు భక్తులకు, ప్రసిద్ధమగు నమృతముతో పనియే లేదనుట నిశ్చయము. ఏలయనఁగా : మిగుల శ్రమపడి యమృతమును సంపాదించి, దానిని బానము చేయుటవలన జరామరణ భయంబులనుండి తొలఁగినవారైనను, దేవతలు ఆయమృతము మోక్షప్రదము కాకపోవుటచే నీ శ్రీరామనామామృతమునే సర్వకాలములయందును గోరుచుందురు. ఇట్లుండ రామనామమంత్రసాధనకు, క్షీర సముద్రమునఁ బుట్టిన యీయమృతముతో పనియే లేదుకదా !

తే. కోరి మును గానిమనుష్యుఁ బేరు వాడి
చీరిన నతం డతనిచెంతఁ జేరినట్లు
తన్నెఱుంగక తనపేరుఁ దలఁచినంతఁ
గరుణచే రాముఁ డపుడె సాక్షాత్కరించు. 67

టీ. కోరి=ఇష్టపడి, మునున్ = ఇంతకుపూర్వము, కానని మనుష్యుని = చూడని మనుష్యుని, పేరువాడి చీరినన్ = పేరుపెట్టి పిలువఁగానే, అతండు = ఆమనుష్యుఁడు, అతనిచెంతన్ = పిలిచినవానిసమీపమునకు, చేరునట్లు, తన్నున్, (రాముని) ఎఱుంగక = తెలిసికొనకయున్నను, తనపేరున్, తలఁచినంతన్ = స్మరింపఁగానే, అపుడె = ఆక్షణముననే, రాముఁడు, కరుణతోన్ = దయతో, సాక్షాత్కరించున్ = ప్రత్యక్షమగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఒక మనుష్యుని, మన మెఱుంగకున్నను బేరుపెట్టి పిలిచినచో వాఁడు మన దగ్గరకు వచ్చునట్లు, ఆరాముని మన మెఱుంగకున్నను, (అనఁగా నారాముని రూపము లేక యారాముని తత్త్వము మన కింతకుముందు ప్రత్యక్షము కాకున్నను) అమ్మహాత్ముని నామమును జపించినయెడల నాదయామయుఁడు తత్క్షణమె ప్రత్యక్షమగును.

సుగంధివృత్తము. రామ రామ రామ రామ రామ రామ యంచు శ్రీ
రామ రామ రామ రామ రామ రామ యంచు శ్రీ
రామ రామ రామ రామ రామ రామ యంచుఁ ద
న్నామకీర్తనంబుఁ జేసినం గలుంగు మోక్షమున్. 68

టీ. తన్నామకీర్తనంబున్ = ఆ రామనామముయొక్క స్మరణను, (తక్కిన యర్థము సులభము.)

తా. "త్రిషట్కాని చ నామాని పఠేద్రామస్య యో నరః, స త్రయోపాధి రహితో మోక్షం సమధిగచ్ఛతి" "ఏమనుష్యుఁడు రామనామమును పదునెనిమిదిమాఱులు (అనఁగా: ఒక్కొక్కపర్యాయమునకు ఆఱునామములుగా మూఁడుమాఱులు) జపించునో వాఁడు క్రమముగా స్థూలసూక్ష్మ కారణశరీరములను మూఁడు ఉపాధుల నతిక్రమించి మోక్షమును జెందును" అను వాక్యము ననుసరించి, రామనామజపమువలన మోక్ష మవశ్యముగ సిద్ధించును.

క. నిరతంబు రామనామ, స్మరణంబునకంటె మోక్షసాధన మితరం
బరయఁగ లేదు ధరలోఁ, బరమసులభ మైనలసదుపాయం బబలా.

టీ. అబలా = ఓపార్వతీ!, నిరతంబున్ = ఎల్లప్పుడును, రామనామస్మరణంబున కంటెన్ = రామనామజపము సేయుటకంటె, ఇతరంబు = వేఱైన, మోక్షసాధనము = మోక్షమును సాధింపఁగలిగినట్టియు, పరమసులభము=మిగుల సులభమైనదియు, ఐన లస దుపాయము=ఐనట్టి శ్రేష్ఠమైనయుపాయము, ధరలోన్ =ఈభూమిలో, అరయంగన్ = విచారింపఁగా, లేదు.

తా. పార్వతీ ! మనస్సునకును, శరీరమునకును శ్రమ కలిగించు మోక్షసాధనము లనేకములున్నను ఈ రామ నామ జప మంతసులభమైనవి, ఇంత దృఢముగా మోక్ష ఫలము నిచ్చునవి ఎవ్వియును లేవు. కావున నీ రామనామము సకల మనుష్యులచేతను ఉపాసింపఁదగినది.

వ. అని యిట్లు శ్రీరామమంత్రంబును దత్ప్రభావంబు నుపదేశించిన నాకర్ణించి పరమానందభరితస్వాంత యై య క్కాంతామణి యత్యంత భక్తిపూర్వకంబుగా ననేక ప్రణామంబు లాచరించి విను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తించి స్వామీ తన్మంత్రాధిష్ఠానదేవతా శ్రీరామతత్త్వస్వరూపం బెట్టిది యెఱిఁగింపుమనిన నొక్కింత విచారించి శ్రీరామహృదయం బను పరమేతిహాసంబు గల దందు శ్రీరామతత్త్వం బతివిస్పష్టంబుగా విలసిల్లునది యతిరహస్యంబు గావున నెవ్వరికి గోచరంబు గాకుండు దాని నేఁ దెలియం జెప్పెద వినుమని శ్రీమహాదేవుం డప్పార్వతీ దేవి కిట్లనియె. 70

టీ. అని, ఇట్లు, శ్రీరామమంత్రంబును, తత్ప్రభావంబుల్ = ఆరామమంత్రము యొక్క సామర్థ్యమును, ఉపదేశించినన్ = తెలియఁజేయఁగా, ఆకర్ణించి=విని, పర... యై-పరమ = అధికమగు, ఆనంద = సంతోషము చేత (అనఁగా: లోకుల నుద్ధరించుటకు చక్కనియుపాయము దొరకెను గదా యను సంతసము చేత,) భరిత = సంపూర్ణమైన, స్వాంతయై=మనస్సు కలదియై, ఆకాంతామణి=ఆస్త్రీరత్నమగు పార్వతీదేవి, అత్యంత భక్తిపూర్వకంబుగాన్=అధికమగు భక్తితో, అనేకప్రణామంబులు = అనేక నమస్కార ములను, ఆచరించి=చేసి, వినుతించి=స్తోత్రము చేసి, "స్వామీ=ఓప్రభువా ! త...పంబు- తన్మంత్ర=ఆశ్రీరామనామ మంత్రమునకు, అధిష్ఠాన దేవతా = దేవతయగు (అనఁగా: మంత్ర మెవ్వనినిఁగూర్చి జపింపవలయునో ఆదేవతయగు,) శ్రీరామ = శ్రీరాముని యొక్క, తత్త్వస్వరూపంబు = యథార్థస్వరూపము, ఎట్టిది (రాముని యథార్థస్వరూప మేమి ?) ఎఱింగింపుము = తెలియఁజేయుము" అనినన్ = అని చెప్పఁగా, ఒక్కింత = కొంచెము, విచారించి = ఆలోచనచేసి, (అనఁగా: అతిరహస్యమగు నీ శ్రీరామతత్త్వ స్వరూపము నీయమకుఁ జెప్పవచ్చునా కూడదా ?, అది చెప్పుట కీయమ తగినయధి కారిణి యగునా కాదా ? అని కొంత విచారించి) "శ్రీరామ హృదయంబను=శ్రీరామ హృదయమను పేరుగల, పరమ...ఇతిహాసంబు=శ్రేష్ఠమగు నొక్క పూర్వకథ గలదు, అందున్=ఆకథయందు, శ్రీరామతత్త్వంబు=శ్రీరాముని యథార్థస్వరూపము, (అనఁగా: ఆ యథార్థస్వరూపమును, గూర్చిన వివరము), అతివిస్పష్టంబుగాన్=మిగుల స్పష్టముగ, విలసిల్లున్ = ప్రకాశించుచుండును, అది = ఆకథ, (లేక, ఆ తత్త్వస్వరూపము) అతి రహస్యంబు = మిక్కిలి రహస్యమైనది. (అనఁగా : మిగుల నుత్తమములగు నధికారులకుఁ గాని, చెప్పరానిది) కావునన్ = కాఁబట్టి, ఎవ్వరికిన్, గోచరంబు కాక ఉండున్ = తెలియకుండును. (అనఁగా: దాని నెవ్వరు నెఱుంగరు.) దానిన్=ఆ తత్త్వస్వరూపమును (లేక, కథను,) ఏన్ = నేను, తెలియన్ జెప్పెదన్ = బాగుగ బోధపడునట్లుగా నీకు చెప్పెదను, వినుము" అని, శ్రీమహాదేవుండు = శోభాయుక్తుఁడగు నా యీశ్వరుఁడు, పార్వతీదేవికిన్, ఇట్లు=ఈక్రిందరాఁబోవు విధముగ, అనియెన్=చెప్పెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. పైఁ జెప్పినవిధముగ నాపరమేశ్వరుఁడు రామమంత్రము నుపదేశించి దాని సామర్థ్యము తెలుపఁగానే "లోకుల నుద్ధరించుటకు చక్కని యుపాయము దొరకెను గదా" అని మిగుల సంతసించి యాపార్వతీదేవి తన ప్రియుని గొనియాడి పలుమారు నమస్కరించి యిట్లనియె. "ఓ స్వామీ! మీరు మంత్రమును దాని ఫలమును దెలియఁ జేసితిరి; గాని ఆమంత్రమునకు అధిదేవతయగు శ్రీరాముని తత్త్వస్వరూపమునుగూర్చి వివరింపలేదు. కావున దానిని వివరించి యనుగ్రహింపవలయును" అని వేడుకొనఁగానే, ఆపరమేశ్వరుఁడు మొదట కొంత సంశయించియు పార్వతీదేవి మిగుల జ్ఞానవతి యగుట చేత శ్రీరామతత్త్వస్వరూపమును ప్రకటింప నిశ్చయించి ఇట్లనియె. "ఓపార్వతీ! రామహృదయమను నొక కథ గలదు. అది సాధారణముగ నందఱకును తెలియునది కాదు. అట్లయినను నీవు జ్ఞానవతి వగుటచే, నీకు దాని వివరించి చెప్పెదను. అందు నీ వడిగిన విషయమంతయు స్పష్టము కాఁగలదు." అని చెప్పి క్రింద రాఁబోవువిధముగ శ్రీరామహృదయమును జెప్పుట కారంభించెను.

## పార్వతీసంశయవివరణము.

శ్రీరాముని యథార్థస్వరూపమును గూర్చి పార్వతికి సంశయము కలదని యధ్యాత్మరామాయణమునం దున్నది.

"వదంతి రామం పర మేక మాద్యం నిరస్తమాయాగుణసంప్రసారమ్,
భజంతి చాహర్నిశమప్రమత్తాః పరం పదం యాంతి తథైవ సిద్ధాః"

"ఓపరమేశ్వరా! ఈరాముఁడు అద్వితీయుఁడగు పరబ్రహ్మమనియు, సకల జగత్తులకును కారణభూతుఁడనియు, మాయతోఁగాని దానిగుణములగు సత్త్వరజస్తమస్సులతోఁగాని, సంబంధ మేమియును లేని పరిశుద్ధుఁడనియు చెప్పుచున్నారు. ఇంత మాత్రమేకాక నారామునిపై పర్ణింపఁబడిన స్వరూపముతోనే రేయుంబవ లొక్కరీతిగ మనసును రెండవదానిపైకిఁ బోనీయక సేవించుచున్నారు. ఆసేవయందు సిద్ధిఁజెందిన వారు పునరావృత్తి రహితమగు మోక్షమును గూడఁ జెందుచున్నారు. ఇది భక్తజనులలో ప్రత్యక్షమయియే యున్నది.

"వదంతి కేచిత్పరమోఽపి రామః స్వావిద్యయా సంవృతమాత్మసంజ్ఞమ్,
జానాతి నాత్మాన మతః పరేణ స బోధితో వేద పరాత్మతత్త్వమ్.
యది స్మ జానాతి కుతో విలాపః సీతాకృతే తేన కృతః పరేణ,
జానాతి నైనం యది కేన దేవః సమోఽపి సర్వైరపి జీవజాలైః."

"ఇట్లున్నను మఱికొందఱు మఱియొక విధముగఁ జెప్పుచున్నారు. ఈ రాముఁడు పరబ్రహ్మస్వరూపుఁడగుటలో సంశయములేదు; కాని అట్లయినను ఆయన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తన యథార్థస్వరూపము నెఱుంగలేఁడు. అజ్ఞానము ఆవరించి యుండుటచేత తాను సామాన్యుఁ డనియే తలంచెను గాని, పరమాత్మరూపుఁ డని యెఱుంగఁడు. ఈకారణము వలననే ప్రతిస్థలమునందుండును, రామునకు యథార్థస్వరూపము దెలియుటకై ఇతరు లగు అగస్త్యుఁడు మొదలగువారే బోధించుచుండినట్లు ఆరామాయణమువలనఁ దెలియుచున్నది. మఱియు ఆరామునకు స్వయముగానే తనయథార్థస్వరూపము తెలిసియుండిన యెడల నిర్వికారుఁడైనతాను-సీతానిమిత్తమై దుఃఖించునా! ఆయనకు తనస్వరూపమె ఎప్పటికిని తెలియదనిన సకలజీవులతో సమానుఁడే యగును గదా! అప్పు డాయన పరబ్రహ్మ మగుట ఎట్లు? కావున రాముఁడు పరబ్రహ్మమే యైనను అజ్ఞానావరణము కలిగి యున్నాఁడనవలయును."

("ఓపరమేశ్వరా! ఈరెంటియందును ఏది సత్యమో యని (అనఁగా: రామునకు మాయాగుణములతో సంబంధము కలదా లేదా? యని) నాకు సంశయము కలుగుచున్నది. ఈసంశయమును బోఁగొట్టుఁడు" అని పార్వతీదేవి ప్రశ్నచేసెనని తెలుసుకొనవలయును.

## రామాయణకథాసంగ్రహము.

అవ. పైన వర్ణించినవిధముగ శ్రీరామహృదయమును జెప్పెదనని ప్రతిజ్ఞచేసి దానికుపోద్ఘాతముగ రామాయణకథను సంక్షేపముగా వర్ణించుచున్నాఁడు.—

సీ. ఆదినారాయణుం డార్తరక్షణపరా
యణుఁడు లోకోపకారార్థముగను
శ్రీరామచంద్రుఁ డై క్షితిపై నవతరించి
ప్రేమతో సీతను బెండ్లియాడి
సాకేతపురమున సంభ్రమించుచు నుండి
జగముల రక్షింప జననివరము
జనకునివాక్యంబు సమపూర్చి చెల్లింపఁ
దమ్ముఁడు భార్యయుఁ దాను గూడి
తే. తాపసులవేషములు దాల్చి తాల్మిమీఱ
దండకారణ్యభూములఁ దగఁ జరించి
సకలరాక్షసగణముల సంహరించి
యరిగి సీతానిమిత్తమై యంతమీఁద. 71

టీ. ఆర్త...నుఁడు-ఆర్త=ఆధ్యాత్మికాది తాపత్రయమువలన బాధపడువారిని, రక్షణ=రక్షించుటయే, పర=శ్రేష్ఠమగు, అయనుఁడు=గతి(...) గల, ఆదినారాయ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఖుండు=సకలజగత్తులకు నాదికారణభూతుఁడగు మహావిష్ణువు, లోకోపకారార్థముగను= దుష్టుల శిక్షించి శిష్టుల రక్షించి లోకమున కుపకారము చేయుటకై, శ్రీరామచంద్రుఁడు ఐ=రాముఁడను పేర దశరథునకుఁ బుత్రుఁడై, క్షితిపై=భూమియందు, అవతరించి=పుట్టి, ప్రేమతోన్=అనురాగముతో, సీతను, పెండ్లియాడి, సాకేతపురమునన్=అయోధ్యాపట్ట ణమునందు, సంభ్రమించుచున్=సంతసించుచు, ఉండి=పండ్రెండుసంవత్సరములుండి, (వివాహమైనపిదప రాముఁడు పండ్రెండుసంవత్సరములకు అరణ్యమునకు పోయె ననుట రామాయణమున ప్రసిద్ధము.) జగములన్=ప్రపంచములను, రక్షింపన్=రావణబాధ లేకుండ రక్షించుటకును, జననివరమున్=కైకకు దశరథుఁ డంతకు పూర్వమిచ్చియున్న వరములను, జనకునివాక్యమున్ = దశరథునిమాటను, (లేక, ప్రతిజ్ఞను,) సమకూర్చి చెల్లింపన్=సిద్ధించునట్లు చేయుటకును, తమ్ముఁడు=లక్ష్మణుఁడు, భార్యయున్=సీతాదేవి యును, తానున్, కూడి, తాపసులవేషములు=ఋషులవేషములను (అనఁగా: నారచీరలు మొదలగువానిని), తాల్చి=ధరించి, తాల్మి=ఓర్పు, మీరన్=అతిశయించునట్లుగా, (అనఁగా: ఈవనవాసము చేయవలసివచ్చెనే యని కొంచెమైనను విసిగికొనక) దండకారణ్య భూములన్=దండకారణ్యమునందు, తగన్=ఒప్పునట్లుగా, చరించి=తిరిగి, సకలరాక్షస గణములన్ = సమస్తరాక్షసులను, (అనఁగా: విరాధఖరదూషణాదులను,) సంహరించి, (ఈరాక్షసవధయె రావణునకు రామునిపై క్రోధము కలిగించినది కావున నీవధను చెప్పుటచే రావణసంహారమునకుఁ గారణము సీతాపహారాదులను గూర్చి చెప్పినట్లె యని యూహింపఁ చునది.) అంతమీఁదన్=అటుతర్వాత (అనఁగా: సీత రావణుని యంతఃపురమున నున్న దని ఆంజనేయునివలన నెఱింగినపిదప) సీతానిమిత్తమై=సీతను గొనివచ్చుటకై, అరిగి= లంకకుఁ జని.

తా. భక్తులతాపత్రయమును జల్లార్చుటయే ముఖ్యమగు కార్యముగాఁ గలిగి సంచరించు నామహావిష్ణువు దేవతలప్రార్థనమువలన రావణసంహారముచేసి లోకమున కుప కారము చేయుటకై రాముఁ డనుపేర దశరథపుత్త్రుఁడై భూలోకమున జన్మించి, భూమికి పుత్త్రికయై సీత యనుపేర జనకునియింటఁ బెరుగుచున్న లక్ష్మీదేవిని వివాహమయ్యెను. ఆవివాహమున కనంతరము పండ్రెండు సంవత్సరములు సకలభోగముల ననుభవించుచు నయోధ్యయందుండి తాను వచ్చిన పనిని (రావణసంహారమును) శీఘ్రముగ నిర్వహించు తలంపునఁ దనతండ్రియగు దశరథుని ప్రతిజ్ఞను బరిపాలింపవలయుననియుఁ దల్లికిచ్చిన వరములఁ జెల్లింపవలయు ననియు మిషచే సీతాలక్ష్మణులతోఁగూడి ఋషివేషము ధరించి దండకారణ్యమును బ్రవేశించెను. అచ్చట విరాధుఁడు ఖరదూషణాదులు మొదలగు రాక్షసుల ననేకుల సంహరించి యావృత్తాంతమువలనఁ గోపించి, రావణాసురుఁడు మాయచే సీతాదేవిని లంకకుఁ గొనిపోవ, సుగ్రీవసహాయమువలన నాయమను వెదకించి,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హనుమంతునివలన లంకలో నాయను యుండుట నెఱింగి యాలంకకు వానరసైన్య సమేతుఁడై చనియెను.

మ. రణభూమిం దగ రావణాసురునిఁ బుత్ర భ్రాతృబంధూరువా
రణగంధర్వశతాంగయుక్తముగ నస్త్రశ్రేణిచేఁ ద్రుంచి ల
క్ష్మణసుగ్రీవహనూమదాదియుతుఁడై కాంక్షించి సీతావధూ
మణితో వచ్చె నయోధ్య కార్యులు నుతింపం బుష్పకారూఢుఁడై.

టీ. రణభూమిన్ = యుద్ధభూమియందు, తగన్ = ఒప్పునట్లుగా, పుత్ర...ముగన్. పుత్ర = పుత్రులతో, భ్రాతృ = సోదరులతో, బంధు = బంధువులతో, ఉరు = గొప్పవియగు, వారణ = ఏనుఁగులతో, గంధర్వ = గుఱ్ఱములతో, శతాంగ = రథములతో, యుక్తముగన్ = కూడినట్లు, రావణాసురునిన్, అస్త్రశ్రేణిన్ = బాణసమూహము చేత, త్రుంచి = సంహరించి, లక్ష్మణ...తుఁడై - లక్ష్మణ, సుగ్రీవ, హనూమత్ = హనుమంతుఁడు, ఆది = మొదలగు వారితో (ఇచ్చట ఆదిశబ్దమువలన విభీషణుఁడు మొదలగురాక్షసులుకూడఁ జెప్పఁబడిరి), యుతుఁడై = కూడినవాఁడై, కాంక్షించి = కోరి, పుష్పకారూఢుఁడై = పుష్పకమనువిమానము నెక్కి (ఇది కుబేరునిగెలిచి రావణుఁడు సంపాదించిన విమానము), సీతావధూమణితోన్ = స్త్రీరత్నమగు సీతాదేవితో, ఆర్యులు = మహాత్ములు, నుతింపన్ = స్తోత్రములఁ జేయుచుండ, అయోధ్యకున్ = (తనరాజధానియగు) నయోధ్యాపట్టణమునకు, వచ్చెన్.

తా. ఇట్లు సీతను గొనితెచ్చుటకై లంకాపట్టణమునకుఁ జని, అచ్చట రావణాసురుని పుత్రమిత్రబంధుసహితముగాఁ జతురంగసైన్యసమేతముగా రూపుమాపి లోకముల భయముఁ బాపెను. తమ్ముఁడగు లక్ష్మణునితోను, సుగ్రీవుఁడు, హనుమంతుఁడు మొదలగు వానరులతోను, విభీషణాదిరాక్షసులతోను, దనకు ప్రాణసమానయగు సీతాదేవితోఁ గూడి పరమానందభరితస్వాంతుఁ డగుచు పుష్పకవిమానము నధిష్ఠించి యయోధ్యాపట్టణమును జేరెను. మహాత్ములందఱు తన శౌర్యధైర్యాదుల వినుతించుచుండఁ జిరవియోగము వలన నాతురులైయున్న పురజనుల పరమానందభరితులఁ గావించెను.

తే. ఇట్లరుగుదెంచి రాముఁడు హితపురోహి
తార్యబాంధవసచివభృత్యప్రభృతులు
ననుజులును గొల్వ సక్తుఁడై జనకజాభి
యుక్తుఁడై యంతఁ బట్టాభిషిక్తుఁ డయ్యె. 73

టీ. అంతన్ = పిమ్మట, రాముఁడు, ఇట్లు = పైఁజెప్పినట్లు, అరుగుదెంచి = అయోధ్యాపట్టణమునకు వచ్చి, హిత...లును - హిత = మిత్రులును, పురోహిత = పురోహితులును (లేక, గురువులును), ఆర్య = పెద్దలును, బాంధవ = బంధువులును, సచివ = మంత్రులును, భృత్య =

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సేవకులును, ప్రభృతులును=మొదలగునందఱును, అనుజులును=తమ్ములగు లక్ష్మణ, భరత, శత్రుఘ్నులును, కొల్వన్=సేవించుచుండఁగా, సక్తుఁడై=ప్రీతిగలవాఁడై (లోకము నను గ్రహించు నిచ్ఛగలవాఁడై అనుట.) జనకజాభియుక్తుఁడై=సీతాదేవితోఁగూడినవాఁడై, పట్టాభిషిక్తుఁడయ్యెన్=పట్టాభిషేకముఁ జేసికొనియెను.

తా. పైనవర్ణించినవిధముగా నయోధ్యాపురముఁ జేరినపిమ్మట మంత్రిపురోహిత బంధుగురుమిత్ర సేవకాదిజనంబులును దమ్ములును కాలోచితమగురీతి సేవించుచుండిరి. రామ భద్రుండును ప్రజల ననుగ్రహింపవలయు ననుతలంపున సీతాసమన్వితుఁడై పట్టాభిషేక మహోత్సవము ననుభవించి కులక్రమాగతమగు రాజ్యభారము వహించెను.

## శ్రీరామపట్టాభిషేకము.

సీ. శృంగార మేపార సీతాంగనామణి
మును నిజవామాంకమున వసింపఁ
దనపాదుకలు శిరంబున మోచి ముందఱ
హనుమంతుఁ డతిభక్తి ననుసరింప
ధవళాతపత్ర మాతతధనుర్బాణముల్
దాల్చి లక్ష్మణుఁడు కైదండ నలర
సరి నిరుగడల వింజామరంబులు పూని
భరతశత్రుఘ్నులు పరిఢవింప
తే. ననుపమోజ్జ్వలరత్నసింహాసనమున
నమరఁ గూర్చుండి కోటిసూర్యప్రకాశుఁ
డై వసిష్ఠాదిమునిసమూహములచేతఁ
జెలఁగి రాముండు పట్టాభిషిక్తుఁడయ్యె. 74

టీ. సీతాంగనామణి = సీతాదేవి, శృంగారమేపారన్-శృంగారము = శృంగార రసము, (లేక సౌందర్యము,) ఏపారన్=అభివృద్ధియగుచుండఁగా, మును=ముందు, నిజ వామాంకమునన్, నిజ = తనయొక్క, వామాంకమునన్=ఎడమతొడపై, వసింపన్= ఉండఁగా, హనుమంతుఁడు, అతిభక్తి=మిగులభక్తితో, తనపాదుకలు=తనపావుకోళ్లను, శిరంబున మోచి=తలపైనుంచుకొని, ముందఱన్=ఎదుట, అనుసరింపన్=నిలచియుండఁగా (లేక, సేవించుచుండఁగా) లక్ష్మణుఁడు, ధవళాతపత్రము=తెల్లనిగొడుగును, ఆత... ములు-ఆతత=గొప్పవియగు, ధనుః=ధనువును, బాణములు=బాణములును, దాల్చి=ధరించి, కైదండన్=చేతిప్రక్కన, అలరన్=ఉండఁగా భరతశత్రుఘ్నులు, సరిన్=సమముగా, ఇరుగడలన్=రెండుపార్శ్వములయందును, వింజామరంబులు=సురటీలను, పూని=ధరించి,

CC-0. Sangamwadi Math Collection. Digitized by eGangotri

పరిఢవిల్లన్ = ఒప్పుచుండఁగా, అను...మునన్ - అనుపమ = సరిలేని, ఉజ్జ్వల = ప్రకాశించు చున్న, రత్న = నవరత్నఖచితమైన, సింహాసనమునన్ = సింహాసనముపై, అమరన్ = బాగుగా కూర్చుండి, కోటిసూర్యప్రకాశుఁడై = కోటిసూర్యులకు సమానమైన కాంతిగలవాఁడై, వసిష్ఠాదిముని సమూహములచేతన్ = వసిష్ఠుఁడు మొదలగుఋషుల సమూహములచేత (అనఁగాఁ బెక్కండ్రుమునులచేత), చెలఁగి = ప్రకాశించి, రాముండు, పట్టాభిషిక్తుఁ డయ్యెన్ = పట్టాభిషేకముఁ జేయఁబడియెను. (వసిష్ఠాదిమునులందఱు నారాముని నభి షేకించిరని భావము.)

తా. ఆపట్టాభిషేకసమయమున సౌందర్యరాశి యగుసీతాదేవి రాముని యెడమ తొడపైఁ గూర్చుండి యుండెను. అగ్రభాగమున పరమభక్తుఁ డగునాంజనేయుఁ డమ్మహా త్ముని పాదుకల శిరమునఁ దాల్చి సేవించుచుండెను. శ్వేతచ్ఛత్రంబును ధనుర్బాణంబులును గూడ ధరించి లక్ష్మణుఁడు చేరి ప్రక్క నిలచి యుండెను. భరతశత్రుఘ్నులును సుర టీల వీచుచు నుభయపార్శ్వముల నలంకరించు చుండిరి. ఇట్టి మహావైభవముతోఁ దన రారుచు కోటి సూర్యప్రకాశుఁడై యొప్పుచున్న యారాజచంద్రుని నవరత్నఖచిత సింహాసనముపై నిలిపి వసిష్ఠాదిమహామునులు అభిషేకము నొనర్చిరి.

అవ. ఇట్లు పట్టాభిషేకమును వర్ణించి యామహోత్సవమును ఉపసంహారము చేయుచు రామహృదయము నుపక్రమించుచున్నాఁడు.—

వ. ఇట్లు పట్టాభిషిక్తుండై శ్రీరామచంద్రుండు హితపురోహితా మాత్యసుహృద్విద్వద్బ్రాహ్మణదాసదాసీజనంబులకును నానాదేశా ధీశ్వరులకును విభీషణ సుగ్రీవ జాంబవ త్సుషేణ నలనీలగజగవయ గవాక్షగంధమాదనాదులకును వందిమాగధపాఠకలోకంబునకును దక్కినవారలకందఱకును మనోరథంబులు దీరం దగినరథతురగ వారణగోభూహిరణ్యాగ్రహారరత్నదివ్యవస్త్రాభరణ గంధమాల్యా దు లొసంగి సత్కరించి యంతటఁ దనపురోభాగవర్తియుఁ బుణ్య కీర్తియు నిటలతటఘటితాంజలియును గృతకార్యుండును నిరా కాంక్షుండును నిత్యానిత్యవస్తువివేకయుక్తుండును సకలవిధైహికా ముష్మికభోగవిరక్తుండును శమాదిషట్కసంపత్తియుతుండును ముముక్షుతాసమన్వితుండును మహాబుద్ధిమంతుండు నైనహను మంతుం గనుంగొని కరుణారసంబు పొంగార జనకజాంగనామణి నెమ్మొగంబుఁ జూచి మనకు నిత్యభక్తుండును మదీయజ్ఞానాసక్తుం డును బరమభాగవతశిఖామణియు నైన యితనికి మద్దివ్యతత్త్వ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్వరూపం బుపదేశింపు మనిన బంగారంబునకుఁ బరిమళంబుగలిగిన
తెలంగున నుప్పొంగి మందస్మితముఖారవింద యై విశ్వమోహిని
యైనసీతామహాదేవి యాంజనేయుని కభిముఖయై యి ట్లనియె. 75

టీ. ఇట్లు = పైనఁ జెప్పినవిధముగా, శ్రీరామచంద్రుఁడు, పట్టాభిషిక్తుండై = పట్టాభిషేకము నొనర్చుకొని, హిత...లకుఁ-హిత=ఇష్టులకు, పురోహిత = పురోహితులకు, అమాత్య=మంత్రులకు, సుహృత్=స్నేహితులకు (మొట్టమొదటఁ గొంచె మనిష్టముగాఁ దోఁచునట్లున్నను శంకింపక యుత్తరకాలమున శుభముఁ గూర్పఁగల బోధసేయువారు హితులు; ఇతరులు సుహృత్తులు), విద్వత్=విద్వాంసులకు, బ్రాహ్మణ = బ్రాహ్మణులకు, దాస=సేవకులకు, దాసీజనంబులకుఁ=దాసీజనులకును, నానాదేశాధీశ్వరులకుఁ = సకలదేశముల ప్రభువులకును, విభీషణసుగ్రీవజాంబవత్సుషేణనలనీలగజగవయగవాక్ష గంధమాదనాదులకుఁ = విభీషణుఁడు మొదలగు రాక్షసులకును సుగ్రీవుఁడు జాంబవంతుఁడు సుషేణుఁడు నలుఁడు నీలుఁడు గజుఁడు గవయుఁడు గవాక్షుఁడు గంధమాదనుఁడు మొదలగు వానరభల్లూకశ్రేష్ఠులకును, వంది...నకుఁ - వంది = స్తుతిపాఠకుల యొక్కయు, మాగధ=రాజవంశావళినిఁ గొనియాడువారియొక్కయు, పాఠక=గాయకులయొక్కయుం, లోకంబునకుఁ = సమూహమునకును, తక్కినవారలకందఱకుఁ = మిగిలిన సకలవిధము లగుజనులకును, మనోరథంబులుదీరఁ=కోర్కులు దీరునట్లు (సమృద్ధిగా), తగి...దులు-తగిన=వారివారియోగ్యతకు నుచితములగు, రథ=రథములు, తురగ= గుఱ్ఱములు, వారణ=ఏనుఁగులు, గో=గోవులు, భూ=భూమి, హిరణ్య=సువర్ణము, అగ్రహార=అగ్రహారములు, రత్న=నవరత్నములు, దివ్య=శ్రేష్ఠములైన, వస్త్ర = వస్త్రములు, ఆభరణ=సొమ్ములు, గంధ=గంధము, మాల్య=పుష్పమాలికలు, ఆదులు=మొదలగువానిని, ఒసఁగి=ఇచ్చి, సత్కరించి=గౌరవించి, అంతటఁ = తర్వాత (వారలనందఱను స్వస్థానములకుఁ బంపిన పిదప), తనపురోభాగవర్తియుఁ = తనయగ్రభాగమున నుండునట్టి వాఁడును, పుణ్యకీర్తియుఁ = పవిత్ర మగుకీర్తి గలిగినట్టివాఁడును (ధర్మపరుఁడగుటచే లోకమున మిగులఁ బ్రశంసింపఁబడుచున్నట్టియు), నిట...లియుఁ-నిటలతట = ఫాలభాగమున, ఘటిత=కదియింపఁబడిన, అంజలియుఁ=చేమోడ్పుఁ గలిగినవాఁడును, కృతకార్యుండును=తనకార్యమును సాధించినవాఁడును, నిరాకాంక్షుండును = ఆశయేమియు లేనివాఁడును (సువర్ణఅగ్రహారాదులలోఁ దేనినిఁ గోరనట్టియు), నిత్యానిత్యవస్తువివేకయుక్తుండును = బ్రహ్మము నిత్యము ప్రపంచ మనిత్యము అను వివేకము గలిగినట్టి వాఁడును, సకల...మును-సకలవిధ=సమస్తవిధములగు, ఐహిక=పూర్వజన్మకర్మమువలన గలిగి అనిత్యములై యిహలోకమున ననుభవింపఁబడుచున్నవియు, ఆముష్మికభోగ=యజ్ఞాదులవలనఁ బుట్టి స్వర్గాదులయం దనుభవింపఁ బడుచున్నవియు నగుభోగములయందు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విరక్తుండును = వైరాగ్యముకలవాఁడును, శమా...డును-శమాది = శమము మొదలగు (శమ, దమ, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానము లను), షట్క = ఆఱుగుణముల యొక్క, సంపత్తి = సంపదతో, యుతుండును = కూడియున్నవాఁడును, ముము... డును - ముముక్షుతా = మోక్షేచ్ఛచే, సమన్వితుండును = కూడియున్నవాఁడును (సాధనచతుష్టయ సంపత్తి గలవాఁడును), మహాబుద్ధిమంతుండును = అధిక మగు సూక్ష్మ బుద్ధి గలవాఁడును, ఐన హనుమంతుర్ = అయిన యాంజనేయుని, కనుంగొని=చూచి, కరుణారసంబు = దయారసము, పొంగారర్ = అభివృద్ధి యగుచుండ, జనకజాంగనా మణి మొగంబుర్=సీతాదేవిముఖమును, చూచి, మనవుర్, నిత్యభక్తుండును = ఎప్పుడును మిగులభక్తితో సేవయొనర్చువాఁడును, మదీ...ను - మదీయ = నాదగు (నాసంబంధ మైన), జ్ఞాన = యథార్థజ్ఞానమునందు (నాస్వరూపమును యథార్థముగాఁ దెలిసికొనుట యందు), ఆసక్తుండును=ఇచ్ఛ గలవాఁడును, పర...యుర్-పరమ = శ్రేష్ఠులగు, భాగ వత=భగవద్భక్తులలో, శిఖామణియుర్ = శిరోరత్నమువంటివాఁడును, ఐనయితనికిర్= అగు నీహనుమంతునికి, మద్ది.. పంబుర్-మత్ = నాయొక్క, దివ్య=శ్రేష్ఠమగు (లేక, లోకోత్తరమైన), తత్త్వస్వరూపంబుర్=యథార్థస్వరూపమును (బ్రహ్మస్వరూపమును), ఉపదేశింపుమనినర్ = ఉపదేశింపవలయుననని చెప్పఁగానె, బంగారంబునకుర్=సువర్ణము నకు, పరిమళంబు = సువాసన, కలిగిన తెఱంగునర్ = కలిగినవిధంబున, ఉప్పొంగి = సంతోషించి, మంద...దయై-మందస్మిత = చిఱునగవుతోఁ గూడిన, ముఖారవిందయై= ముఖపద్మము కలదియై (సర్వసాక్షి, సర్వవ్యాపకుఁడై, "జీవునికంటె నభిన్నుఁడై యున్న బ్రహ్మమును దెలిసికొనుట కింతప్రయత్నము కావలయునా" అను నభిప్రాయముచే సీతాదేవి నన్వే నని తెలిసికొనవలయును), విశ్వ = సకలప్రపంచమును, మోహినియై= మోహింపఁజేయునది యైన (మాయాస్వరూపిణి యైన) సీతామహాదేవి, ఆంజనేయు నికిర్, అభిముఖియై = ఎదురై, ఇట్లనియె = ఈక్రింద రాఁబోవు విధముగా నుపదే శించెను.

తా. రామభద్రుఁడు పట్టాభిషేకోత్సవము పైన వర్ణించినవిధముగా మహావైభ వముతో ముగియఁగానే హితపురోహితమంత్రిమిత్రదాసదాసీజనులకును అభిషేకోత్సవ మును జూడవచ్చిన రాజులకును విభీషణాదిరాక్షసులకును సుగ్రీవాదివానరులకును జాంబ వదాదిభల్లూకవరులకును వందిమాగధాదులకును మఱియు సకలవిధము లగు వారికిని, వారివారిమనస్సులు తృప్తిఁ జెందునట్లు రథగజతురగసువర్ణాగ్రహారాదిబహువిధ బహు మానములనొసంగి వీడ్కొల్పెను. హనుమంతుఁడు మాత్రము నిత్యానిత్యవస్తువివేకము వైరాగ్యము శమాదిషట్కసంపత్తి మోక్షేచ్ఛ యనుజ్ఞానసాధనములచేఁ బ్రకాశించుచు రామునియొక్క యథార్థస్వరూపము దెలిసికొన ... నుండువాఁ డగుటచేత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నమ్మహాత్ముఁ డిచ్చు బహుమానముల నపేక్షింపక ఫాలభాగంబునఁ జేమోడ్పుఁ గదియించి యెదుట నిలచియుండెను. ఇట్లు తన కంతటి మహాకార్యమును సాధించియు నేమియుఁ గోరకున్న సత్స్వభావుఁడగు నాహనుమంతుని మహాబుద్ధిమంతుని నవలోకించి యాతని మనోరథము నూహించి దయారసము మఱియు నుప్పొంగ సీతాదేవితో నిట్లనియె. "దేవీ! ఈతఁడు మనయెడల మిగుల భక్తికలవాఁడు. పరమభాగవతులలో శిరోరత్నముంబోలువాఁడు. నాయథార్థస్వరూపము నెఱుంగఁ దలంచుచున్నాఁడు. కావున నీతనికి లోకోత్తరమగు నాయథార్థస్వరూపము నెఱిఁగింపుము" అని యిట్లు రామచంద్రుఁ డాజ్ఞాపింపఁగానే జగన్మోహిని యగు నాసీతాదేవియు బంగారమునకు సుగంధముఁ గలిగినట్లు సంతసించి యాయాంజనేయుని కెదురై ముఖకమలంబున చిఱునగవు తళుకొత్త నిట్లని యుపదేశింప నారంభించెను.

## సీత హనుమంతునకుఁ దారకయోగంబు బోధించుట.

మ. సుమతీ! రాముఁడు నిర్వికారము సదా శుద్ధంబు బుద్ధం బచిం
త్య మవాచ్యం బతులం బతీంద్రియము సత్తామాత్రముఁ స్వప్రకా
శము నిర్ద్వంద్వము నిర్వికల్ప మజముఁ సత్సంవిదానందరూ
ప మమూర్తం బజరంబు కేవలపరబ్రహ్మంబు చింతింపఁగన్. 76

టీ. సుమతీ = ఓ సూక్ష్మబుద్ధిగల హనుమంతుఁడా!, చింతింపఁగన్ = బాగుగ విచారించినయెడల, రాముఁడు, నిర్వికారము = షడ్వికారములు లేనట్టియు, సదా=ఎల్లప్పుడు, శుద్ధంబు=దేనితోను సంబంధము లేక స్వచ్ఛమై యుండునట్టియు, బుద్ధంబు = జ్ఞానస్వరూపమైనదియు, అచింత్యము = మనసుచే తలంపరానిదియు, అవాచ్యంబు = నోటిచే వచింపరానిదియు, అతులంబు=తనతో సమానమగు మఱియొకవస్తువు లేనిదియు (లోకోత్తర మైనదియు), అతీంద్రియము = ఇంద్రియములకు గోచరము కానిదియు, సత్తామాత్రముఁ = సర్వకాలములందును సర్వదేశములందును సర్వవస్తువులయందును ఒక్కటే విధముగ నుండుటయే స్వరూపముగాఁ గలదియును (నిత్యమైనదియును), స్వప్రకాశము=పరునిసహాయము లేక స్వతంత్రమై ప్రకాశించునదియు (అనఁగా: తెలిసికొనఁబడునదియు, పరబ్రహ్మమును దెలిసికొనువాఁడు మఱియొకఁడు లేఁడని భావము), నిర్ద్వంద్వము=సుఖదుఃఖములు శీతోష్ణములు మొదలగుద్వంద్వములు (ఒకటి విడచిన మఱియొకటి పురుషుని నాశ్రయించియే యుండుస్వభావము గలగుణములు) లేనిదియు, (వానిచే బాధింపఁబడనిదియు), నిర్వికల్పము = సంకల్ప వికల్పములు లేనిదియును, అజముఁ=ఉత్పత్తిలేనిదియు, సత్సం...పము-సత్=సత్యము, సంవిత్=జ్ఞానము, ఆనంద=ఆనందము, రూపము=స్వరూపముగాఁ గలదియు, అమూర్తంబు = ఇంద్రియము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లకు గోచర మగునాకారము లేనిదియు, అజరంబు=ముదిమి లేనిదియునగు, కేవల... బు-కేవల = అద్వితీయమైన (తనకంటె నన్య మగు వస్తువు లేని), పరబ్రహ్మంబు = ప బ్రహ్మస్వరూపుఁడే.

తా. ఆంజనేయా! రాముని సామాన్యమనుష్యునిగా భావింపుచున్నా వేమో ఆఘనుని యథార్థస్వరూపమును దెల్పెద వినుము. ఉండుట పుట్టుట అభివృద్ధి యగుట పరిణామముఁ జెందుట క్షీణించుట నశించుట యనురూపములతో ప్రత్యక్షములైయున్న వికారములతో సంబంధముఁ జెందనిదనియు, నిర్మలమైయుండునదనియు, జ్ఞానరూప మనియు, లేక, వివేకు లగుమహాత్ముల కెఱుఁగవచ్చున దనియు, 'ఇది యిట్లని' యూహింపరానిదనియు, వాక్కుల కగోచర మైనదనియు, దృష్టాంతములఁ జెప్పి నిరూపింప నశక్యమైనదనియు, ఇంద్రియములకు గోచరముకానిదనియు, ఉనికియే స్వరూపముగా గలదనియు, పరులచే నెఱుంగఁబడకఁ దన్నుతానే యెఱుంగునది (అనఁగా: తనంతఁదానే ప్రకాశించునది) యనియు, సుఖదుఃఖాదిద్వంద్వములతోఁ గాని లేక భేదవాదు లొనర్చు నానావిధములగు వికల్పములతోఁగాని (అనఁగా: "చైతన్యరూపునియందు జీవబ్రహ్మ భేదముకలదు. జ్ఞాన మాత్మకు గుణమేకాని స్వరూపముకాదు." అను మొదలగు విరుద్ధకల్పనలతోఁగాని) పుట్టుక ముదిమి మొదలగువానితోఁగాని సంబంధములేనిదనియు, సత్యజ్ఞానానందరూపమైనదనియు, వేదము లేపరబ్రహ్మమునుగూర్చి యుద్ఘోషించుచున్నవో అట్టిబ్రహ్మమే యీరాముఁడని తెలిసికొనుము.

అవ. ఇట్లీరాముఁడు నిర్వికారుఁ డగునేని యీతనివలనఁ బ్రపంచము పుట్టుననుట సంభవింపదుకదా. అట్లైన రాముని (పరబ్రహ్మమును) జగత్కర్తనుగాఁ జెప్పుశ్రుతులప్రమాణములు కావచ్చును. శ్రుతి యప్రమాణ మగుట సమ్మతముగాదు కదాయని సమాధానము జెప్పుచున్నాఁడు.—

క. అవికారుఁడయ్యుఁ గనకము, వివిధాభరణంబులై నవిధమున నితఁడే
దివియై భువియై రవియై, కవియై సర్వాత్ముఁడై ప్రకాశించుఁదగన్.

టీ. అవికారుఁడయ్యున్ = స్వయముగ నెట్టిమార్పును జెందనివాఁడయ్యును, కనకము=సువర్ణము, వివిధాభరణములైనవిధమునన్ = అనేక విధము లగు నాభరణములైనట్లు, ఇతఁడే = ఈపరబ్రహ్మ మగురాముఁడే, దివియై = ఆకాశరూపుఁడై, భువియై= భూస్వరూపుఁడై, రవియై=సూర్యస్వరూపుఁడై, కవియై=బ్రహ్మస్వరూపియైన చంద్రుఁడై (లేక, శుక్రగ్రహస్వరూపుఁడై), సర్వాత్ముఁడై = సర్వప్రపంచరూపుఁడై, తగన్ = ఒప్పునట్లుగా, ప్రకాశించున్ =ప్రకాశించుచున్నాఁడు.

తా. పరబ్రహ్మము నిర్వికారుఁ డని చెప్పుట కాక్షేప మేమియు లేదు. ప్రపంచమా బ్రహ్మమునకంటె వేఱగు నేని యప్పుడు ఆప్రపంచమునకు ... యుత్పత్తివలనఁగాని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వినాశమువలనఁ గాని ఆపరబ్రహ్మమునకు వికారములు కలుగు నని చెప్పవచ్చును గాని ప్రకృతవిషయముమాత్ర మట్టిదికాదు. ప్రపంచమునకును పరబ్రహ్మమునకును భేదము కొంచె మైనను లేదు. ఎంత విచారించి చూచినను ఈప్రపంచమున నామరూపములకంటె నితర మగుపదార్థ మేదియును గానవచ్చుట లేదుగదా! కావున, సువర్ణముచేఁ జేయఁబడిన భూషణములు ఎన్నిరూపభేదములు కలవి యైనను వానికిఁ గారణమగుసువర్ణమునకంటె వేఱుకానట్లు ఈప్రపంచము ఎన్నినామరూపభేదములు కలవియైనను కారణభూత మగుపరబ్రహ్మమునకంటె వేఱగునది కానేరదు. ఆభూషణములయందలి వికారములవలన సువర్ణమున కేమియు వికారముఁ గలుగునట్లు ప్రపంచమునందలి వికారములవలనఁగూడ నాపరబ్రహ్మమునకు వికారములు గలుగనేరవు. కావున నోయాంజనేయా! మన కెన్ని భేదములతోఁ గానవచ్చుచున్నను ఈభూమి ఆకాశము మొదలగు భూతములుగాని, సూర్యచంద్రాదిగ్రహములు గాని, జంగమస్థావరములు గాని యీరామునికంటె బ్రహ్మము వేఱు కావని తెలిసికొనుము!

అవ. ఇట్లు చెప్పినచో 'పరమాత్మ కర్త' అని చెప్పుశ్రుతుల కేకాదు. 'పరబ్రహ్మమునందు సత్వరజస్తమోగుణరూప యగు నొకశక్తి గలదు. ఆశక్తి ప్రపంచమునుఁ బుట్టించును.' అని చెప్పు శ్రుతులకుఁ గూడ నప్రామాణ్యము వచ్చును. అనిన సమాధానమును జెప్పుచున్నాఁడు.—

క. త్రిగుణాత్మికరై యనిశము,జగములఁబుట్టింపఁ బెంపసమయింపంగాఁ
దగుమూలప్రకృతియ నేనగుదుఁజుమీ సత్యముగ మహాగుణశాలీ.

టీ. మహాగుణశాలీ=సద్గుణవంతుఁడ వగు నోయాంజనేయా! త్రిగుణాత్మికరై= సత్త్వరజస్తమోగుణములే స్వరూపముగాఁ గలిగి, అనిశమున్ = ఎల్లప్పుడును, జగములన్=లోకములను, పుట్టింపన్, పెంపన్, సమయింపఁగాన్ = నశింపఁజేయుటకును, (అనఁగా: సృష్టిస్థితిసంహారములఁ జేయుటకు), తగు...ప్రకృతియ-తగు = సామర్థ్యము గల, మూలప్రకృతియ=మూలప్రకృతియే (మాయాశక్తియే), సత్యముగన్=నిజముగా, నేనగుదుఁజుమీ=నేను అయి యున్నాను సుమా!

తా. మూలప్రకృతి యనుశక్తి పరబ్రహ్మమునందు కల దనియు ఆశక్తియే ప్రపంచమును సృజించుచు సంహరించుచు నున్నదనియు వేదములు చెప్పుచున్నవనుట సత్యము. మూలప్రకృతియనినను, అవిద్యయనినను, అజ్ఞానమనినను, మాయ యనిన నొక్కటియే. ఆశక్తిని నేనే యని తెలిసికొనుము. వేద మిట్లు చెప్పినను పరబ్రహ్మమునకు మాత్రము వికారము కలుగ నక్కఱలేదు. యథార్థస్థితిలో నీమూలప్రకృతి కూడ నాబ్రహ్మమునకంటె వేఱు కానేరదు. వేఱైయుండిననే కాని యామాయనను వికారమును గలిగింపనేరదుగదా. ఆపరబ్రహ్మ మొక్కఁడే సత్తాస్వరూపుఁ డగుటచేతను (ఉనికియే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్వరూపముగాఁ గలవాఁ డగుటచేతను) మఱియొకసత్త (ఉనికి) యున్నదనిన రెండుసత్త లకుఁ గలభేదమును నిరూపించుటకు వీలులేకపోవుటచేతను పరబ్రహ్మమునకంటె నితర మగుపదార్థముండుటకే వీలులేదు.

మఱియుం ఉత్పత్తి వినాశము అనుపదములయర్థమునుగూర్చి విచారణీయాం శము కొంత గలదు. ఎట్లనిన: ఉత్పత్తి యనఁగా నింతకుఁ బూర్వము లేనిపదార్థము క్రొత్తగా పుట్టుటయా? లేక అంతర్ధానమైయుండునది ప్రకాశించుటయా? క్రొత్తగాఁ బుట్టుట యుత్పత్తి శబ్దార్థమనిన నది యుక్తియుక్తము కానేరదు. అభావమునుండి భావ ముత్పత్తి యగుననుట ప్రత్యక్షవిరుద్ధముగదా! కావున నీవిషయమున నవశ్యముగ రెండవ పక్షము నే యంగీకరింపవలయును. (అనఁగా: ఏదియో యొక కారణమునఁ గొంతకాలము నుండియుఁ బ్రకాశింపకున్న పదార్థము ప్రకాశించుటయే యుత్పత్తి శబ్దార్థమనవల యును.) ఈయుక్తి ననుసరించియే విచారించిన, అంతర్ధానమునుఁ జెందుటయే వినాశ శబ్దార్థమని చెప్పవలసివచ్చును. కొంతకాల మవిచ్ఛిన్నముగఁ బ్రకాశించుచుండుటయే స్థితశబ్దమునకుఁ గూడ నర్థమని యేర్పడును.

ఇప్పు డాలోచించి చూడుము. మూల ప్రకృతిచే ప్రపంచము పుట్టింపఁబడును (అనఁగా: మూలప్రకృతిచే ప్రపంచముతోఁచునట్లు చేయఁబడును.) అని యర్థమేర్ప డును. మూలప్రకృతి యనినను అజ్ఞానమనినను ఒక్కటియే యని యిదివఱకే చెప్పి యున్నాను. కావున "మూలప్రకృతి ప్రపంచమును సృష్టించును." అనిన "అజ్ఞానముచే ప్రపంచ మున్నట్లు తోఁచును" అనియే యర్థము. అజ్ఞానులకుఁ గూడ ప్రారబ్ధవశమునఁ గొంతకాలమువఱకు (అనఁగాఁ: బ్రళయమగునంతవఱకు) ఇహపరలోకరూప మగుప్రపం చము తోఁచుచు మఱికొంతకాలము (అనఁగా: వారివారికర్మలు ఫలముల నిచ్చుట కభి ముఖము లగునంతవఱకు) దోఁపదు. కావున ప్రపంచాంతర్ధానరూపమగు వినాశముగూడ మూలప్రకృతిచేతనే చేయఁబడుచున్న దని శ్రుతులు చెప్పుచున్నవి. ఈప్రపంచ మంతయు నజ్ఞానకల్పితమే యని యెఱింగినవారలగుటచేత, వారికది బ్రహ్మభిన్నముగా నెప్పటికిని తోఁపదు. కావున నెట్లు చూచినను పరబ్రహ్మమునకు వికారములు కలుగ నక్కఱలేదని తెలిసికొనుము. ఆమూలప్రకృతియు నేనే యని నిశ్చయించుకొనుము.

అవ. ఇట్లు చెప్పినను పరబ్రహ్మము కర్తయగుటకు వీలులేకపోవుటచే శ్రుతికి విరోధము వచ్చియే తీరును. సృష్టియనఁగా నుత్పత్తి యైనను, వికాస మైనను, దానికొక కర్త యవశ్య ముండితీరవలయును గదా. అజ్ఞానమే దానికి కర్త యనిన పరబ్రహ్మము జగత్కారణమని చెప్పు శ్రుతులకు విరోధము వచ్చును. కావున మూలప్రకృతి పరబ్రహ్మ మునకంటె వే అనియు, ఆపరబ్రహ్మము దానిమూలమున ప్రపంచమును సృజించు చున్నాఁడనియు, ఇట్టివాఁ డగుటచే నా బ్రహ్మము సవికారమే యనియు, కర్త యనియుఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జెప్పితీరవలయును. పరబ్రహ్మమునకుఁ గలశక్తియే ప్రకృతి యని శ్రుతులు చెప్పు చున్నవిగదా! అనిన సమాధానముఁ జెప్పుచున్నాఁడు:—

క. అమలుఁ డగునితనిసాన్ని
ధ్యమువలన సృజింతు జగ మతంద్రితనై యి
ట్లమర జడులచేఁ దత్సృ
ష్టము కల్పింపఁబడు నీయసంగునియందున్. 79

టీ. అమలుఁడు=నిత్యసిద్ధుఁడు (నిర్వికారుఁడు), అగునితనిసాన్నిధ్యమువలనన్ = అయినయీపరబ్రహ్మముయొక్క సామీప్యమువలన (అనఁగా: ఈరాముఁడు నాసమీప మున నుండుటచేత), అతంద్రితనై = ఏమఱుపాటులేనిదాననై, జగము = లోకము, సృజింతున్ =సృష్టిచేయుచున్నాను, ఇట్లమరన్ = ఈవిధముగా నుండఁగా, జడులచేన్ = అజ్ఞానులచేత, తత్సృష్టము=నాచేఁజేయఁబడిన సృష్టి, ఈయసంగునియందున్ = నిర్వి కారుఁ డగు (లేక, దేనితో సంబంధము లేని) యీరామునియందు, కల్పింపఁబడున్ = ఆరోపింపఁబడును.

తా.ఇట్లాత్మ నిర్వికారుఁడైనను శ్రుతులయందుఁ గొన్నిచోట్ల నాయనయే జగ త్కర్తయని చెప్పఁ బడి యున్నది. మూలప్రకృతికిని ఆబ్రహ్మమునకును భేదము లేదని యిదివఱకే నిరూపించి యున్నాను. పారమార్థికస్థితి యిదియే యైనను, వేదము జనుల క్రమక్రమముగ నుద్ధరించుతలంపుచే నారంభమున నిట్లు చెప్పుచున్నది. తిమిరరోగము గలవాఁ డొకచంద్రబింబమును రెండుగాను మూఁడుగాను చూచినట్లు లోకులును తమభ్రాంతివలనఁ బరబ్రహ్మమునందు భేదమున్నట్లు తలంచుచున్నారు. వేదముకూడ తత్త్వస్వరూపము వానికి సుఖముగ గోచరమగుటకై మొట్టమొదట వారవలం బించియున్న భేదమునే యాధారము చేసికొని యుపదేశించుచుఁ గ్రమక్రమముగ యుక్తులచే దానిని నిరాకరించి పరమార్థతత్త్వమును మనసున నాటింపఁ బ్రయత్నించు చున్నది. ఇంతియేకాని ఆశ్రుతికి భేదమును జెప్పుటయందుఁ దాత్పర్యములేదు. ఒకని కొకగొప్పవిషయము బోధింపవలయు ననిన మొట్టమొదట వారికిఁ గలజ్ఞానమును తలం పులను గమనించి వానికిఁదగినట్లు బోధయొనర్చుచుఁ గ్రమక్రమముగఁ జిత్తమును బరి పక్వముఁ జేసియే కదా యావిషయము నుపదేశింపవలయును. ఇట్లు చేయక యొక్కమా ఱిట్టివిషయముల నుపదేశించిన వారిమనసు (శిష్యులమనసు) దానిని సంపూర్ణముగ గ్రహింపలేక, నాకు సర్వముఁ దెలిసె నని యభిమానించుచు ముందున్నస్థితియందు నిలువనొల్లక యుభయభ్రష్టమై చెడిపోవు ననుటయు ప్రత్యక్షసిద్ధమే కదా. కావున మూలప్రకృతి పరబ్రహ్మమునకంటె వేఱనియు, అది పరబ్రహ్మశక్తియనియు, ఆశక్తి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మూలముననే పరబ్రహ్మము సృజించుచున్నాఁడనియుఁ జెప్పుటవలన దోషమేమియు లేదు.

యథార్థస్థితిలో నిట్లు చెప్పినను పరబ్రహ్మముమాత్రము సవికారుఁడుకా నక్కఱలేదు. ఏలయనిన: లోకమునందు కర్తృత్వము రెండు తెఱఁగులై యున్నది. కొందఱు స్వయముగఁ గొన్నిసాధనములఁ గైకొని కార్యముల సాధించుచున్నారు. మఱి కొందఱు తామేమియుఁ జేయకయే పరులచే సర్వకార్యములఁ జేయించుచున్నారు. ఈరెండు తెఱఁగులవారిని కూడ లోకమునఁ గర్తలనియే చెప్పుచున్నారు. ఇందు మొదటిది సాధనసాధ్యకర్తృత్వము (సాధనములఁ గైకొనియే కార్యముల సాధించుటవలనఁ గలుగు కర్తృత్వము), రెండవది సాన్నిధ్యమాత్రసాధ్యకర్తృత్వము (స్వయముగ సాధనములఁ గైకొనకున్నను తనసామీప్యమువలనఁ బరులచేఁ గార్యముల సాధింపఁజేయుటవలనఁ గలుగుకర్తృత్వము) ఈరెండవకర్తృత్వము పరబ్రహ్మమునకుఁ గలదు. ఆయనయుఁ దనకంటె వేఱుగా నున్నప్రకృతిచేఁ బ్రపంచసృష్టినిఁ జేయించుచునుండవచ్చును గదా!

ఈప్రకృతి పరబ్రహ్మమునకు శక్తియే యైననుగూడ నీకర్తృత్వమునకు భంగము రాదు. పురుషునికంటె వానియం దున్నశక్తి వే ఱనుటలో సంశయ మేమియు లేదు. శక్తికిని శక్తిగలవానికిని సమవాయసంబంధము (అనఁగా: నిత్యసంబంధము) కలదని తార్కికు లందురు గాని అది వేదాంతులకు సమ్మతము కాదు గదా. యథార్థస్థితిలో పదార్థములు రెండైనప్పుడు అవి యొక్కటిగానే యున్నట్లు భ్రాంతివలనఁ దోఁచవచ్చునేకాని అట్టినిత్యసంబంధము కూడ నొకటి కలదనుట యుక్తిశూన్యముకదా! ఇట్లు సర్వమును విమర్శించిన భ్రాంతిసిద్ధ మగుభేదము నాశ్రయించి పరబ్రహ్మమునందు కర్తృత్వ మారోపింపఁబడుచున్నను ఆపరబ్రహ్మమునకు మాత్రము వికారములు కలుగ నక్కఱలేదు.

ఈతత్త్వము నెఱుంగలేక యజ్ఞానులగువారు నాచేఁ (మూలప్రకృతిచే) జేయఁబడుచున్న సకలకార్యములను నిర్వికారుఁ డగునాపరబ్రహ్మమునం దారోపించుచున్నారు. అమ్మహాత్మునకు దేనితోను సంబంధము లేకుండినను, ఆకాశమువలె సర్వవ్యాపకుఁడై యుండుటచేత నాప్రకృతియందుఁగూడ వ్యాపించియే యున్నాఁడు. కావున నట్లు కల్పించుచున్నారు. మాయ ఆబ్రహ్మమున కుపాధి యనియు, పరబ్రహ్మము తనయందుండుటచే నామాయయే సర్వమును సృజించుచున్న దనియు, బ్రహ్మమునకు నీసృష్టితో నేమియు సంబంధము లేదనియుఁ దెలిసికొన లేకున్నారు. కావుననే మాయయందుఁ గల సాన్నిధ్యమాత్రసాధ్యకర్తృత్వమును, సాధనసాధ్యకర్తృత్వమునుగా భావించి పరబ్రహ్మముకూడ సవికారమే యనుచున్నారు. బ్రహ్మమునకు సాన్నిధ్యమాత్రసాధ్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కర్తృత్వము గలదనిచెప్పినను, ఆయన నిర్వికారుఁ డగుటకు వీలులేదు. పరులచేఁ గార్యములఁ జేయింపవలయునన్నను, గర్తయగువారికి సంకల్పము మొదలగునవి యుండియే తీరవలయును గదా" అనుటయు యుక్తియుక్తముగాదు. అయస్కాంతశిల యినుము నాకర్షించుచున్నది కదా! ఆశిలకు సంకల్పము గల దనుట కవకాశము గలదా? కావున సాన్నిధ్యమాత్రసాధ్యకర్తృత్వము గలవాఁడు సంకల్పము మొదలగు వికారములు కలిగియుండవలయు ననుట నియమము గాదు. కావున నీవేదాంతసిద్ధాంతమే శ్రుతికిఁ గూడ విరుద్ధము కాదని తెలిసికొనవలయును.

అవ. పైనిరూపించినవిషయమును అనుభవసిద్ధముగ నిరూపించి చూపుచున్నాఁడు.—

వ. అదియెట్లనిన నాకర్ణింపు మయోధ్యానగరంబున నతినిర్మలం బయిన రఘువంశంబునం దితనిజన్మంబును విశ్వామిత్రసహాయత్వంబును దన్మఖరక్షణంబు నహల్యాశాపశమనంబును హరధనుర్భంగంబును మత్పాణిగ్రహణంబును పరశురామపరాక్రమభంజనంబును బురప్రవేశంబును దండకారణ్యగమనంబును విరాధవధంబును శూర్పణఖాకర్ణనాసికాచ్ఛేదనంబును ఖరదూషణత్రిశిరఃప్రముఖ రాక్షసఖండనంబును మాయామారీచహరణంబును మాయాసీతాపహరణంబును జటాయుకబంధమోక్షలాభంబును శబరీపూజనంబును సుగ్రీవసమాగమంబును వాలివధంబును సీతాన్వేషణంబును సముద్రసేతుబంధనంబును లంకానిరోధంబును భీమసంగ్రామంబున భ్రాతృపుత్రపౌత్రబాంధవహితజనాదిసహితంబుగా రావణహరణంబును విభీషణరాజ్యప్రదానంబును బుష్పకారోహణంబును మత్సమేతంబుగా సాకేతపురగమనంబును రాజ్యాభిషేకంబును మొదలుగాఁ గలకార్యంబు లన్నియు నాచేత నాచరితంబు లయ్యె నట్లగుచుండ నిర్వికారుం డఖిలాత్మకుం డైనయీరామునియం దజ్ఞానులచే నారోపింపఁబడుఁ గావున. ౭0

టీ. అది యెట్లనినన్ = అయారోపణ యెట్లనఁగా, ఆకర్ణింపుము = వినుము, అయోధ్యానగరంబునన్ = అయోధ్యాపట్టణమునందు, అతినిర్మలంబైన = మిగులపరిశుద్ధ మగు, రఘువంశంబునందున్ = రఘుమహారాజుయొక్క వంశమునందు, ఇతనిజన్మంబు = ఈరాముఁడు పుట్టుటయు, విశ్వామిత్రసహాయత్వంబును = విశ్వామిత్రునికి సహాయుండగుటయు, తన్మ...బును - తత్ = ఆవిశ్వామిత్రమహామునియొక్క, మఖ= యజ్ఞమును, రక్షణంబును = రక్షించుటయు, అహ...బును - అహల్యా = అహల్యయొక్క, శాపశమనంబును = ... హరధనుర్భంగంబును =

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శివునివిల్లు విఱుచుటయు, మత్పా...బును-మత్ = నాయొక్క, పాణిగ్రహణంబును = వివాహంబును (అనఁగా: నన్ను వివాహముఁ జేసికొనుటయు), పర...బును - పరశురామ=పరశురామునియొక్క, పరాక్రమ=శౌర్యమును (లేక, బలమును), భంజనంబును =అడంచుటయు, పురప్రవేశంబును=మరల అయోధ్యాపట్టణమునకు వచ్చుటయు, దండకారణ్యగమనంబును = దండకారణ్యమునకుఁ బోవుటయు, విరాధవధంబును = విరాధుఁ డనురక్కసుని సంహరించుటయు, శూర్ప...బును - శూర్పణఖా = రావణాసురుని చెలియలగు శూర్పణఖయొక్క, కర్ణ = చెవులను, నాసికా = ముక్కును, ఛేదనంబును= కోయుటయు, ఖర...బును-ఖర=ఖరుఁడు, దూషణ=దూషణుఁడు, త్రిశిరః=త్రిశిరుఁడు, ప్రముఖ=మొదలుగాఁగల, రాక్షస=రాక్షసులయొక్క, ఖండనంబును=ఖండించుటయును, మాయా మారీచ హరణంబును=మాయలేడియై వచ్చినమారీచుని సంహరించుటయు, మాయాసీతాపహరణంబును=రావణుఁడు మాయా సీత నెత్తికొని పోవుటయు (రావణుఁడు మాయాసీతను గొనిపోయెననుట యధ్యాత్మ రామాయణ సంప్రదాయముఁ వాల్మీకిరామాయణమున నీవిషయము ప్రత్యేకముగ ఖండింపఁబడియుండకపోవుటచేత నామునికికూడ నిదియే యభిప్రాయమని తోఁచుచున్నది. ఒకవిషయము సామాన్యముగా నొకచోటఁ జెప్పఁబడినప్పుడు మఱియెచ్చట నైనను దానిని గూర్చిన విశేషమున్న యెడల గ్రహింపవచ్చు ననుట సుప్రసిద్ధము.), జటా...ను-జటాయు=గృధ్రరాజగు జటాయువునకును, కబంధ = కబంధుఁడగు రాక్షసునకును, మోక్షలాభంబును = మోక్షము నిచ్చుటయు, శబ...బును-శబరీ=శబరి యనుబోయవనిత, పూజనంబును=పూజించుటయు (లేక, శబరి ననుగ్రహించుటయు), సుగ్రీ...బును-సుగ్రీవ=సుగ్రీవునితో, సమాగమంబును=స్నేహముఁ జేయుటయు, వాలివధంబును=వాలినిసంహరించుటయు, సీతాన్వేషణంబును-సీతా=సీతయొక్క (ను), అన్వేషణంబును=వెదకుటయు (లేక, వెదకించుటయు), సముద్రసేతుబంధనమును=సముద్రమున సేతువుం గట్టుటయు, లంకానిరోధంబును=లంకను ముట్టడించుటయు, భీమ...బునన్-భీమ=భయంకరమైన, సంగ్రామంబునన్=యుద్ధమునందు, భ్రాతృ...గాన్-భ్రాతృ = తమ్ములు, పుత్ర = కుమారులు, పౌత్ర=మనుమలు, బాంధవ=బంధువులు, హితజన=ఇష్టజనులు, ఆది=మొదలగువారితో, సహితంబుగాన్=కూడునట్లుగా, రావణహరణంబును=రావణునిసంహరించుటయు,విభీషణరాజ్యప్రదానంబును = విభీషణునికి లంకారాజ్య మొసంగుటయు, పుష్పకారోహణంబును = పుష్పకవిమానము నెక్కుటయు, మత్సమేతంబుగాన్ = నాతో కూడి, సాకేతపురగమనంబును = అయోధ్యా పట్టణమునకు వచ్చుటయు, రాజ్యాభిషేకంబును = పట్టాభిషేకముఁ జేసికొనుటయు మొదలుగాఁ గలకార్యంబులన్నియున్, నాచేత నాచరితంబులయ్యెన్ = నాచేత నాచరింపఁబడినవి. ఇష్టార్థంబులన్ = ఇష్టకార్యముల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నన్నిటిని నేనే చేసియున్నను, నిర్వికారుండు=ఏవికారములను లేనివాఁడును, అఖిలాత్మకుండు = సకలప్రపంచరూపుఁడును, ఐన, ఈరామునియందుఁన్, అజ్ఞానులచేతన్, ఆరోపింపఁబడుగావునన్ = ఆరోపణ చేయఁబడుచున్నది గాన (అనఁగా: ఈకార్యముల నన్నిటిని రాముఁడే చేసె నని జ్ఞానశూన్యు లగువారు తలంచుచున్నారు గావున ననుట.)

తా. నేను (మూలప్రకృతి) చేయుకార్యముల నీరామునియందు (పరబ్రహ్మము నందు) నారోపించునిధమును వివరించెదను వినుము. ఈరామునకు పుట్టుక గాని, కామక్రోధాదులతో సంబంధము గాని లేదు. శత్రువులుగాని, మిత్రులుగాని లేరు. హర్ష శోకములు లేవు. ఈవికారము లన్నియు నాచే (జ్ఞానముచే)ఁ గల్పింపఁబడినవి. ఇట్లున్నను అజ్ఞానులగువారు ఈరాముఁడే రఘువంశమున జనించి, విశ్వామిత్రునకుఁదోడ్పడి యమ్మహాత్ముని యజ్ఞమును గొనసాగించి, అహల్యాశాపమును దీర్చి శివుని విల్లువిఱచి నన్ను బెండ్లియాడెననియు, పరశురామునిభంగపఱిచి యయోధ్యకుఁజేరి యచ్చట కొంతకాలముండి లక్ష్మణునితోను నాతోను గూడి దండకారణ్యమును బ్రవేశించెననియుఁ జెప్పుచున్నారు. అచ్చట విరాధుఁడు మొదలగురాక్షసుల ననేకుల సంహరించి, మునుల కభయమిచ్చి, మాయచే బంగరులేడియై వచ్చినమారీచుని సంహరించె ననియు, మరలి యాశ్రమమునకు వచ్చునప్పటికి, మాయామయమగు రూపముతోనున్న నన్ను రావణుఁడు గొనిపోవఁగా నాకై బహువిధముల విలపించెననియు, నన్ను వెదకుచు నరణ్యములఁ దిరిగి తిరిగి జటాయు కబంధులకు మోక్ష మిచ్చి, శబరిచే పూజలఁగొని, వారు చెప్పినచొప్పున సుగ్రీవునితో మైత్రిఁ జేసెననియు భావించుచున్నారు. సుగ్రీవునకుఁ బ్రియంబుగా వాలినిఁ ద్రుంచి, వానరరాజ్యమును సంపాదించి యిచ్చి వానిసహాయముచే నన్ను వెదకించి తెలిసికొని లంకాపురమును నిరోధించి రావణుని సంహరించి, యారాక్షసరాజ్యమును విభీషణున కిచ్చెననియు, పుష్పకారూఢుఁడై నాతోఁగూడి యయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుఁ డయ్యె ననియుఁ దలంచుచున్నారు. ఈకార్యముల నన్నిటిని నే నాచరించితినిగాని రాముఁ డాచరింపలేదు. ఇట్లైనను భ్రాంతివలన నజ్ఞానులగువారు నిర్వికారుఁడై సర్వమయుఁడై యున్న యీరామునియందే వీనినెల్ల నారోపించుచున్నారు. పైన నిరూపింపఁబడి యున్నట్లు ఈతనిసాన్నిధ్యమువలన నే నీకార్యములనెల్ల నాచరించుచుండుట నెఱుంగలేక యిట్లు భ్రాంతి నొందుచున్నారు. కావున,

అవ. ఈక్రింది రెండుపద్యములచే రామతత్త్వస్వరూపవ్యాఖ్యానము నుపసంహరించుచున్నాఁడు.—

ఉ. రాముఁడు నిర్వికారుఁడు నిరామయుఁ డవ్యయుఁ డక్షరుండు ని
ష్కాముఁ డతీంద్రియుం డజుఁ డకర్తయభోక్తయసంగుఁడంతరా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
Jangamwadi Math ...

రాముఁడు నిర్వికల్పుఁడు నిరంజనుఁ డద్వయుఁడైనయాపరం
ధాముఁడు గాని చారుగుణధాముఁడు గాఁడు సమీరనందనా! 81

టీ. సమీరనందనా = వాయుపుత్రుఁడవగు నాంజనేయా! రాముఁడు, నిర్వికారుఁడు=వికారములు లేనివాఁడును, నిరామయుఁడు=శరీరము లేనివాఁడగుటచే రోగములు లేనివాఁడును, అవ్యయుఁడు=నాశములేనివాఁడును (లేక, స్త్రీపురుషాదిలింగభేదములు లేనివాఁడును), అక్షరుండు=నశింపనివాఁడును, నిష్కాముఁడు=కోరఁదగినది లేనివాఁడును (పరమానందమె ఆయనకు స్వరూప మగుటచేతను జనులచేఁ గోరఁబడునదియు నానందమే యగుటచేతను, పరబ్రహ్మము కోరవలసినపదార్థ మేదియు నుండదని భావము.), అతీంద్రియుండు = ఇంద్రియములకు గోచరముకానివాఁడును, అజుఁడు = ఉత్పత్తిలేనివాఁడును, అకర్త=యేకార్యమును జేయనివాఁడును, అభోక్త=ఏఫలమును అనుభవింపనివాఁడును, అసంగుఁడు=దేనితోను సంబంధపడనివాఁడును, అంతరారాముఁడు=సకలభూతములయందు అంతర్యామియై విహరించువాఁడును, నిర్వికల్పుఁడు=సంకల్పవికల్పములు లేనివాఁడును, నిరంజనుఁడు=మఱియొకదాని సహాయములేకయే స్వయముగఁ బ్రకాశించువాఁడును, అద్వయుఁడు=తనకంటె వేఱగు పదార్థము లేనివాఁడును, అయిన=అయినట్టి, ఆపరంధాముఁడుగాని=ఆపరమాత్ముఁడేకాని, చారు...గాఁడు-చారు=మనోహరములైన, గుణ=గుణములకు, ధాముఁడుగాఁడు=ఆధారభూతుఁడు కాఁడు. (అనఁగా: సగుణుఁడును శరీరవిశిష్టుఁడును కాఁడనుట.)

తా. ఓ ఆంజనేయా! వికారములు లేనివాఁడును, దేనితోను సంబంధములేనివాఁడును, అద్వితీయుఁడును, శరీరము మొదలగునవి లేనివాఁ డగుటచే రోగములు మొదలగునవి లేనివాఁడును, కామక్రోధాదులు లేనివాఁడును, ఇంద్రియములకు గోచరము కానివాఁడును, ఒకపనిని జేయుటగాని, దానిఫలము ననుభవించుటగాని లేనివాఁడును, అంతర్యామి యగువాఁడును, జాతిభేదములు వినాశము లేనివాఁడును, ప్రత్యక్షాదిప్రమాణములతో నక్కఱలేకయే స్వయముగఁ బ్రకాశించువాఁడునగు నాపరబ్రహ్మమీరాముఁడు. లోకు లనుకొనునట్లు శరీరాదియుక్తుఁడు కాఁడు. అని తెలిసికొనుము.

క. మాయాగుణానుగతుఁడై, పాయక నానావిధప్రపంచం బితఁడే
చేయు ననితోఁచు నేమియుఁ, జేయఁడసంగుండకర్తసిద్ధము వత్సా 82

టీ. వత్సా=బిడ్డా! మా...డై-మాయా=మాయయొక్క, గుణ=సత్త్వరజస్తమోగుణములను, అనుగతుఁడై=అనుసరించువాఁడై, పాయక=విడువక, నానా...చంబు-నానావిధ=అనేకవిధములైన, ప్రపంచంబు=లోకములను, ఇతఁడే=ఈరాముఁడే, చేయు నని = చేయుచున్నాఁడని (అనఁగా: సృష్టించుచున్నాఁడని), తోఁచుఁ, ఏమియుఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జేయఁడు=యథార్థస్థితిలో ఈరాముఁడేకార్యమును జేయువాఁడుకాఁడు, అసంగుఁడు=వాస్తవములో నాయనకు దేనితోను సంబంధములేదు. అకర్త = ఇట్లగుటచే నేమియుఁ జేయఁడు, సిద్ధము=ఈవిషయము సిద్ధాంతమైనది.

తా. ఓహనుమంతుఁడా! సత్త్వరజస్తమోగుణముల వికారమువలన (అనఁగా: సత్త్వరజస్తమోగుణములే మాయ కావున నదిచేయుచుండుకార్యములవలన (సర్వవ్యాపకుఁడగు నీరాముఁడు కర్తయైనట్లు తోఁచుచుండును. అగుణములయందు వ్యాపించియున్న పరమాత్మునిసహాయముచే నాగుణములే యిట్లు సృష్ట్యాదులను చేయుచున్నవని తెలిసికొనలేరక జను లిట్లు భ్రాంతి గాంచుచున్నారు. పరబ్రహ్మమాత్ర మేమియును జేయువాఁడు కాఁడనుట సిద్ధాంతము.

అవ. ఇట్లాపరమేశ్వరుఁడు సంక్షిప్తముగ సీతాకృతోపదేశరూపమున రామతత్త్వము నెఱింగించి పార్వతీదేవికిఁ గలిగినసంశయము నివారించి యాతత్త్వముననే విస్తరించి చెప్పు నుద్దేశముతో నాంజనేయకృత ప్రశ్న మిాక్రింద నభివర్ణించుచున్నాఁడు.—

వ. అనిన విని హనుమంతుండు సీతాదేవి కిట్లనియె. 83

టీ. అనినవిని=అని చెప్పఁగాని, హనుమంతుండు, సీతాదేవికిట్లనియెన్=సీతాదేవిని జూచి యాక్రిందివిధముగా ప్రశ్నఁజేసెను.

తా. ఓపార్వతీ! ఈవిధముగ సీతాదేవి శ్రీరామతత్త్వము నుపదేశించిన విని హనుమంతుఁడామెతో ని ట్లనియెను.

తే. రామచంద్రుఁడు తారకబ్రహ్మ మగుట
సత్య మగుఁ గాని యిమ్మహాసర్వమయుని
సులభముగఁ గాంచు పరమసుసూత్ర మెద్ది
నా కెఱింగింపవమ్మ లోకైకజనని! 84

టీ. లోకైకజనని-లోకైక=సకలలోకములకును ముఖ్యమైన, జనని=తల్లీ! (సీతాదేవీ!) రామచంద్రుండు, తారక బ్రహ్మమగుట=సంసారమును తరింపఁజేయఁగల పరబ్రహ్మస్వరూపుఁడై యుండుట, సత్యమగుఁగాని=యథార్థమే యగునుగాని, ఇమ్మహాసర్వమయునిన్=సకల ప్రపంచరూపుఁడగు నీసర్వవ్యాపకుని, సులభముగన్, కాంచు... త్రము-కాంచు=తెలిసికొనుటకు వీలగు, పరమ=శ్రేష్ఠమైన, సుసూత్రము=సుఖమగునుపాయము, ఎద్ది=ఏది, (కలదు) నా కెఱింగింపవమ్మ.

తా. ఓలోకమాతా సీతా! నీవాక్యములవలన రాముఁడు పరబ్రహ్మమనువృత్తాంతము బాగుగఁ దెలియవచ్చెనుగాని యనుభవసిద్ధముగ స్పష్టముగాలేదు. కావున దానిని స్పష్టముగాఁ జేసికొనుటకు దగినయుపాయము కలదేని దయచే నానతిమ్ము. అయుషా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యము మిగులఁ గష్టసాధ్యముగాక సులభముగ నుండవలయును. అట్లుండినఁగాని మమ్ముఁబోంట్లకు సాధ్యము కాదు గదా.

అవ. పైప్రశ్నమునకు సీతాదేవి చెప్పినయుత్తరము నభివర్ణించుచు నాత్మతత్త్వమును బ్రకటింప నుపక్రమించుచున్నాఁడు.—

వ. అనిన విని నవ్వుచు సీతాదేవి హనుమంతున కిట్లనియె. 85

టీ. అనిన విని, నవ్వుచున్, సీతాదేవి, హనుమంతునకున్ = హనుమంతునితో, ఇట్లనియెన్=ఈక్రిందివిధముగాఁ జెప్పెను.

తా. ఇట్లు హనుమంతుఁడు ప్రశ్నఁజేయఁగా విని ఆతని యజ్ఞానమునకు (అనఁగా: తనకంటె వేఱుగాని పరబ్రహ్మమును వేఱుగానున్నట్లు భావించుచుండుటకు) నాశ్చర్యపడి నవ్వి క్రమక్రమముగా నాతనిచిత్తమును నిర్మలముఁజేసి జీవబ్రహ్మైక్యము నుపదేశించునదియై సీతాదేవి యాతని కిట్లనియె.

తే. ప్రత్యగాత్మస్వరూపుఁ డైపరఁగుతనకు
రమణపరమాత్ముఁ డైనశ్రీరామునకును
సమర సైక్యానుసంధానసరణి యెద్ది
యదియ యోగంబు సదుపాయ మాంజనేయ! 86

టీ. ఆంజనేయ! ప్రత్యగాత్మస్వరూపుఁడై=జీవరూపుఁడై, పరఁగుతనకున్-పరఁగు=ఒప్పుచున్న, తనకున్, రమ...త్ముఁడు-రమణ=సర్వేశ్వరుండై, పరమాత్ముఁడు=పరబ్రహ్మరూపుఁడు, ఐనశ్రీరామునకున్, సమ...సరణి-సమరస = వేఱుపఱుపరాని (అనఁగా: స్వాభావికమైన), ఐక్య=భేదమును (అనఁగా: 'నేను' అనుపదమున కర్థమైనజీవుఁడును పరమాత్మయు నొక్కటియే యనువిషయమును), అనుసంధాన=ధ్యానించుటకు (అనఁగా: శరీరాభిమానము మొదలగుదోషములవలన కలుగు సంశయముల నివారించుకొనుచు జీవబ్రహ్మైక్యజ్ఞానమును మనసున దృఢము చేసికొనుటకు), సరణి=తగినమార్గము, ఎద్ది=ఏది, (కలదో) అదియ=ఆమార్గమే, యోగంబు = యోగమని చెప్పఁబడును. అదియ=అదే, సదుపాయము=పరమాత్ముని యథార్థరూపము నెఱుంగుటకుఁ జక్కనియుపాయము.

తా. ఓ ఆంజనేయా! వినుము. నీవు, పరబ్రహ్మము నాకంటె వేఱని తలంచుచుండుటచే, నమ్మహాత్మునిఁ దెలిసికొనుట కుపాయ మేదియని ప్రశ్నఁజేయుచున్నావు. యథార్థస్థితిలో నీకంటె (జీవునికంటె) రాముఁడు (బ్రహ్మము) వేఱు కాదు. కావున అనాదినుండియు వచ్చుచున్నభ్రాంతిచే వేఱువేఱుగాఁ గానవచ్చుచుండు జీవబ్రహ్మములిరువురు నొక్కటియే యని శాస్త్రసిద్ధాంతములచేతను, గురూపదేశముచేతను, యుక్తులచేతను నిశ్చయించుకొని యావిషయమును మనసునందు దృఢముఁ జేసికొనుటకై పలుమాఱు ధ్యానము మాత్రము చేయఁబడుచుండవలయునే కాని మఱి యేమియు నక్కఱ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లేదు. ఈ ధ్యానమున కనుకూలమగుమార్గ మేదికలదో అది యోగమని చెప్పఁబడును. ఈయోగ మొక్కటియే పరమాత్మని యథార్థస్వరూపము నెఱుంగుటకుఁ జక్కని యుపాయ మని తెలిసికొనుము.

## అభ్యాసాది యోగ నిర్ణయము.

అవ. సీతాదేవి నవ్వుటకుఁ గలకారణమును విశదము చేయుచు నాయమచేఁ జెప్పఁబడిన యుత్తరమును వివరించుచున్నాఁడు.—

వ. ఆయోగం బభ్యాసయోగంబు జ్ఞానయోగం బన ద్వివిధం బై యొప్పునం దభ్యాసయోగంబు ప్రాణాయామంబన విలసిల్లు నదియుఁ బ్రాకృతంబు వైకృతంబు కేవలకుంభకంబు నన ద్రివిధంబయ్యె నందుఁ బ్రాకృతంబు మంత్రయోగంబు వైకృతంబు లయయోగంబు కేవలకుంభకంబు హఠయోగం బీత్రివిధప్రాణాయామయోగులకు యమనియమాసనప్రాణాయామంబులు పూర్వాంగంబులు. ప్రత్యాహారధ్యానధారణాసమాధు లుత్తరాంగంబు లగు నందహింసాసత్యాస్తేయబ్రహ్మచర్యాపరిగ్రహంబులు యమంబులు. శౌచతపస్సంతోషస్వాధ్యాయేశ్వరప్రణిధానంబులు నియమంబులు వీరాసన స్వస్తికాసన పద్మాసన యోగాసన కూర్మాసన భద్రాసన సిద్ధాసన సింహాసనాదికంబులు చతురుత్తరాశీత్యాసనంబులగు నీమూఁడింటి నభ్యసించి యంతటఁ బ్రాణనిరోధంబు సేయం దగు నందు స్వభావనియత రేచకపూరకకుంభకక్రమంబులచేత నేకవింశతిసహస్రషట్ఛతాధికసంఖ్యాజపామంత్రానుష్ఠానంబు మంత్రయోగంబు ప్రతిదివసాభ్యస్తరేచకాదిత్రివిధానిలసంయమనపూర్వకంబుగాఁ బ్రాణవృత్తియం దపానంబు నపానవృత్తియందుఁ బ్రాణంబును లయంబుగావించుట లయయోగంబు. మూలబంధోడ్యాణబంధజాలంధరబంధపూర్వకంబుగా రేచకపూరకంబుల నుడిగించి ప్రాణాపానంబుల రెంటిని రేయింబగ లొకచందంబునఁ గుంభించుట హఠయోగం బివి త్రివిధప్రాణాయామంబులు. విషయంబులవలన నింద్రియంబుల మరలించుట ప్రత్యాహారంబు. సగుణనిర్గుణాత్మకవస్తుచింతనంబు ధ్యానంబు. మూలాధారాదిదేశంబులఁ జిత్తంబు నరికట్టుట ధారణాయోగంబు. నిర్మలనిశ్చలచిత్తవృత్తి నిర్గుణబ్రహ్మత్వంబు సంపాదించుట సవికల్పనిర్వికల్పాత్మకసమాధియోగం బీ యష్టాంగంబులు గలిగి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యభ్యాసయోగంబు ప్రకాశించు నదియ పరిపక్వచిత్తులకు యోగ్యం బతిదుర్లభం బిది యణిమాద్యష్టైశ్వర్యంబుల నొసంగుచు నాత్మజ్ఞానంబు ప్రకటంబుగాఁ జేయు మఱియుఁ బ్రవిమలచిత్తులకు జీవబ్రహ్మైక్యజ్ఞానమాత్రంబు నిచ్చు నతిసులభం బైనవిజ్ఞానయోగంబు రాజయోగం బనంబడు నీరెంటికి శ్రీరామచరణకమలభక్తి కారణంబు, దానికి వైరాగ్యంబు మూలంబు వినుము. 36

టీ. ఆయోగంబు=జీవబ్రహ్మైక్యజ్ఞానమును మనసున దృఢముఁ జేసికొనుట మార్గమని చెప్పఁబడినయోగము, అభ్యాసయోగంబు = అభ్యాసయోగము (మనసునకుఁ దగిన పరిపాకము లేనప్పుడు దానినిఁ గ్రమక్రమముగా నభ్యాసమువలన నిగ్రహించి పరిపక్వముఁజేయుంట కుపయోగించుయోగ మభ్యాసయోగము. పరిపక్వమైన పిదప దానిని జ్ఞానబలమువలనఁ బరమాత్మునితో నేకము సేయ నుపయోగింపఁబడుయోగము జ్ఞానయోగము అని తెలిసికొనవలయును.) జ్ఞానయోగంబు = జ్ఞానయోగము, అనన్ = అని, ద్వివిధంబై = రెండువిధములుగలదై, ఒప్పున్ = ఉన్నది. అందున్ = ఈ అభ్యాసజ్ఞానయోగములలో, అభ్యాసయోగంబు = అపరిపక్వచిత్తులకై చెప్పఁబడిన యభ్యాసయోగము, ప్రాణాయామంబనన్ = ప్రాణాయామ మను పేర (వాయువునుబంధించుట), విలసిల్లున్=ప్రకాశించుచున్నది. (వాయువును బంధించుటయే మనోనిగ్రహమునకుఁ బ్రధానోపాయము గావున నభ్యాసయోగమునకు ప్రాణాయామ మను పేరు కలిగినదని తెలిసికొనవలయును.) అదియున్=ఆ ప్రాణాయామము, ప్రాకృతంబున్ = స్వభావసిద్ధమైన ప్రాణాయామ మనియు, వైకృతంబు=వైకృతప్రాణాయామ మనియు (స్వభావము గాక ప్రయత్నమువలనఁ గలిగినప్రాణాయామ మనియు), కేవలకుంభకంబు = కుంభకప్రాణాయామ మనియు (బలాత్కారముగా వాయువును స్తంభించుటవలనఁ గలిగిన ప్రాణాయామ మనియు), అనన్, త్రివిధంబయ్యెన్ = మూఁడువిధములై యున్నది. అందున్=ఆ మూఁడువిధము లగుప్రాణాయామములలో, ప్రాకృతంబు = ప్రాకృతప్రాణాయామమనునది, మంత్రయోగంబు = అజపామంత్రము ననుష్ఠానము చేయుటయే స్వరూపముగాఁగల మంత్రయోగము. వైకృతంబు = వైకృతప్రాణాయామమనఁగా, లయయోగంబు=ప్రాణవాయువులలో ఒకదానిని మఱియొకదానియందు లయము చేయుటయే స్వరూపముగాఁగల లయయోగము. కేవలకుంభకంబు = కుంభకప్రాణాయామ మనఁగా, హఠయోగంబు=(వాయువును వెలికి రానీక బలాత్కారముగా లోన బంధించి బంధములచే నాభి మొదలగు బ్రహ్మరంధ్రమువఱకు నచ్చటచ్చట నరికట్టుచునుండుటయే స్వరూపముగాఁగల హఠయోగము, ఉడ్యాణబంధము మొదలగు బంధములనుగూర్చి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వెనుక వివరింపఁబడును.) బంధములచే నాభి మొదలగు బ్రహ్మరంధ్రమువఱకు నచ్చటచ్చట నరికట్టుచునుండుటయే స్వరూపముగాఁ గల హఠయోగము. ఈత్రివిధప్రాణాయామయోగులకున్ = మూఁడువిధములగు నీప్రాణాయామయోగము నభ్యసించువారికి, యమనియమాసనప్రాణాయామంబులు = యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము అనునవి, పూర్వాంగంబులు=యోగమునకుఁ బూర్వమె యభ్యసింపఁబడవలసినవి. ప్రత్యాహారధ్యానధారణసమాధులు = ప్రత్యాహారము, ధ్యానము, ధారణ, సమాధి అనునవి. ఉత్తరాంగంబులగున్ = యోగాభ్యాసమునకు ప్రారంభించిన పిదప నభ్యసింపఁబడవలసినవి అగుచున్నవి. అందున్=ఆయమనియమాదులలో, అహిం...బులు-అహింసా=పరుని హింసింపకుండుట, సత్య=సత్యముఁబల్కుట, అస్తేయ=పరధనమును హరింపకుండుటయు, బ్రహ్మచర్య = బ్రహ్మచర్యవ్రతమును, అపరిగ్రహంబులు=ఒకనియీవిని గ్రహింపకుండుటయు, యమంబులు=అనునివి యమము లనఁబడును. శౌచం...బులు - శౌచ = వెలుపల లోపల పరిశుద్ధముగ నుండుట, తపః = కృచ్ఛ్రము చాంద్రాయణము మొదలగు వ్రతముల నాచరించుట, సంతోష = తనకు భగవంతుఁ డిచ్చినదానికిఁ దృప్తిఁబడుట, స్వాధ్యాయ = వేదాధ్యయనముఁ జేయుట, ఈశ్వరప్రణిధానంబులు = ఈశ్వరధ్యానము, నియమంబులు=ఇవి నియమము లనఁబడును. వీరాసన, స్వస్తికాసన, పద్మాసన, యోగాసన, కూర్మాసన, భద్రాసన, సిద్ధాసన, సింహాసనాదికంబులు=వీరాసనము, స్వస్తికాసనము, పద్మాసనము, యోగాసనము, కూర్మాసనము, భద్రాసనము, సిద్ధాసనము, సింహాసనము మొదలగునవి (యోగము చేయునప్పుడు శరీరము నుంచుకొనవలసిన భేదములే యీ పేర్లతో వ్యవహరింపఁబడుచున్నవి), చతురుత్తరాశీత్యాసనంబులున్ = ఆసనములని చెప్పఁబడును. ఇవి ౮౪. ఈమూఁడింటన్ = ఈయమనియమాసనముల, అభ్యసించి=అలవరుచుకొని, అంతటన్=పిదప, ప్రాణనిరోధంబు=ప్రాణవాయువు నాటంకపఱుచుటయే స్వరూపముగాఁ గలప్రాణాయామమును (లేక, ప్రాణాయామమని పిలువఁబడుచున్న యోగమును), అందున్=ఆయోగమునందు, స్వభా...చేతన్-స్వభావనియత = మనుజులకు స్వాభావికముగా దైవముచే నియమింపఁబడియున్న, రేచక=వాయువును వెలుపలికివదలుట (నిశ్వాసము), పూరక=వాయువును లోనికిఁ బిల్చుట (ఉచ్ఛ్వాసము), కుంభక=వాయువును లోపలనిలుపుకొనుట (ఇది యుచ్ఛ్వాస, నిశ్శ్వాసములకు నడుమ నుండుస్థితి), (ఊర్ధ్వకుంభకము అధఃకుంభకము ఈరెండును కుంభకములలోని భేదములు.) వీనియొక్క విక్రమంబులచేతన్=వరుసలచే, ఏక...నంబు - ఏకవింశతిసహస్రషట్ఛతాధికసంఖ్య = ఇరువదియొక్క వేయునాఱునూఱుసంఖ్యగల, అజపామంత్రానుష్ఠానంబు = అజపాగాయత్రీమంత్రమును అనుష్ఠించుట (స్వభావసిద్ధములైన రేచక, పూరక, కుంభకములు, అనఁగా: నిశ్శ్వాసోచ్ఛ్వాసములు. స్వస్థుఁ డగువానికి దినమున కిరువదియొక్క-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వేల నాఱునూఱుమాఱులు తిరుగుచుండును. ఇవి "హంస" అను మంత్రమును జపించుచున్నవి యని యోగి భావింపవలయును. హంసమంత్రమునకు "అహం సః = నేనే బ్రహ్మను" అని యర్థము. ఈమంత్రమునకే అజపామంత్రమని పేరు. పైఁ జెప్పినవిధముగా భావించుటయే అజపామంత్రానుష్ఠానము. ఇదియే మంత్రయోగ మని తెలిసికొనవలయును.) మంత్రయోగంబు=మంత్రయోగ మనఁబడును. [ఇదియే ప్రాకృత (స్వాభావిక) ప్రాణాయామయోగము.] ప్రతి...బుగాన్ - ప్రతిదివస = ప్రతిదినమునందును, అభ్యస్త=అలవాటు చేయఁబడిన, రేచకాది=రేచకము మొదలగు, త్రివిధ = మూఁడు విధములైన, అనిలసంయమనపూర్వకంబుగాన్ = వాయునిరోధములే ప్రధానముగా (అనఁగా: వాయువును నిరోధించుటవలన), ప్రాణవృత్తియందున్ = ప్రాణవాయువు చేయునట్టి కార్యమునందు, అపానంబును = అపానవాయువును, అపానవృత్తియందున్ = అపానవాయువు చేయునట్టి కార్యమందు, ప్రాణంబును = ప్రాణవాయువును, (నాసికయందును గుదమునందును జనించువాయువులు ప్రాణాపానములు. యోగమువలన వాని స్థానములను మార్చుటయే లయయోగము.) లయంబుగావించుట = లీనమగునట్లుచేయుటయే, లయయోగంబు = లయయోగ మని చెప్పఁబడును. [ఇదియే వైకృత (అస్వాభావిక) ప్రాణాయామయోగము] మూలబంధోడ్యాణబంధజాలంధరబంధపూర్వకంబుగాన్ = మూలబంధము, ఉడ్యాణబంధము, జాలంధరబంధము అను బంధములమూలమున, రేచకపూరకంబులన్ = నిశ్వాసోచ్ఛ్వాసములను, ఉడిగించి = నశింపఁజేసి, ప్రాణాపానంబులన్-ప్రాణ = నిశ్శ్వాసరూపమగు ప్రాణవాయువును, అపానంబులన్ = ఉచ్ఛ్వాసరూప మగునపానవాయువును, రెంటిన్ = ఈరెంటిని, రేయింబగలొక్కచందంబునన్ = రాత్రింబగలు నొక్కటేవిధముగనే, కుంభించుట = [illegible]పలవాయువును స్తంభించుట, హఠయోగంబు = హఠయోగమని చెప్పఁబడును. (ఇదియే కేవలకుంభక ప్రాణాయామయోగము.) ఇవి త్రివిధప్రాణాయామంబులు = ఈ చెప్పఁబడిన మంత్రలయహఠయోగములే కేవలకుంభకము లని చెప్పఁబడిన మూఁడువిధములగు ప్రాణాయామయోగములు, లేక యోగమునకు పూర్వాంగ మని చెప్పఁబడిన ప్రాణాయామయోగములు, విషయంబులవలనన్ = శబ్దస్పర్శరూపరసగంధములనియెడువిషయములనుండి (అనఁగా: ఆవిషయములపైకిఁ బోనీక), ఇంద్రియంబులన్ =జ్ఞానేంద్రియములను (జ్ఞానేంద్రియముల సహాయములేనిది కర్మేంద్రియములు సంచరింపవు కావున జ్ఞానేంద్రియములను నిరోధించినచోఁ గర్మేంద్రియములు కూడ నిరుద్ధము లగును.), మరలించుట = త్రిప్పుట, ప్రత్యాహారంబు=ప్రత్యాహార మనఁబడును. (ఇది యోగముల కుత్తరాంగము లని చెప్పఁబడినవానిలో మొదటిది.) సగుణ...నంబు-సగుణ = గుణములతోఁ గూడినట్టిగాని, నిర్గుణాత్మక=గుణములేనట్టిగాని, [illegible] వస్తు=[illegible] వస్తువును, చింతనంబు=మనసున

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భావించుట (విష్ణ్వాదిరూపములతోఁ గాని శుద్ధస్వరూపముతోఁ గాని ఆపరమాత్మను ధ్యానించుట), ధ్యానంబు=ధ్యాన మనఁబడును. మూలా...బులన్ - మూలాధార = మూలాధారచక్రము, ఆది=మొదలగు, దేశంబులన్ = స్థలములయందు, చిత్తంబున్ = మనసును, అరికట్టుట=నిరోధించుట (లేక, నిలుపుట), ధారణయోగంబు=ధారణాయోగ మనఁబడును. నిర్మల...వృత్తిన్-నిర్మల = పరిశుద్ధమైనట్టియు, నిశ్చల=చలింపనట్టియు, చిత్తవృత్తిన్ = మనోవ్యాపారముచేత, నిర్గుణత్వంబున్ = త్రిగుణశూన్యమైన పరబ్రహ్మభావమును, సంపాదించుట = కలుగఁజేసికొనుట (అనఁగా: ధ్యానించువాఁడు ధ్యానము ధ్యానింపఁబడునది అను భేదములులేక యేకరూపముతో నిలుచుట), సవి...గంబు-సవికల్ప = భేదసహితమైనదియు, నిర్వికల్పాత్మక=భేదరహితమైనదియు (అను రూపములు గల), సమాధియోగంబు=సమాధియోగము అని చెప్పఁబడును. (సగుణపదార్థమును గాని, నిర్గుణపదార్థమును గాని ధ్యానింప నారంభించినప్పుడు యోగచిత్తమునకు ధ్యాతృధ్యానధ్యేయభేదములును బాహ్యము లగు మఱికొన్ని భేదములును గూడఁ దోఁచుచుండును. కావున ప్రథమావస్థయం దీసమాధికి సవికల్పసమాధియనియు పైభేదములన్నియుం దోఁపకుండు నట్టి యంత్యావస్థయందు నిర్వికల్పసమాధియనియుఁ బేరని తెలిసికొనవలయును.) ఇట్లు = ఈవిధముగా, అష్టాంగంబులు = శమాదు లగు నెనిమిదియవయవంబులును గలిగి, అభ్యాసయోగంబు = అభ్యాసయోగము, ప్రకాశించున్ = ఒప్పుచుండును. అది=అ అభ్యాసయోగము, అపరిపక్వచిత్తులకున్ = పరిశుద్ధము గాని మనసు గలవారికి, యోగ్యంబు = తగినది, అతిదుర్లభంబు = సాధించుటకు మిగుల నశక్యమైనది. ఇది = ఈ యభ్యాసయోగము, అణిమాద్యష్టైశ్వర్యంబులన్ = అణిమ మొదలైన యష్టసిద్ధులను, ఒసంగున్ = ఇచ్చును. ఆత్మజ్ఞానంబున్ = బ్రహ్మజ్ఞానమును, ప్రకటంబుగాఁజేయున్ = విస్తారముగాఁ జేయును (అనఁగా: దృఢముఁ జేయును.) మఱియున్, ప్రవిమలచిత్తులకున్ = నిర్మలమగు మనసు గలవారలకు, జీవ...బున్ - జీవ = 'నేను' అను పదమునకు అర్థమగుచున్న జీవునకును, బ్రహ్మ = సర్వేశ్వరుఁడగు పరమాత్మకును గల, ఐక్యజ్ఞానమాత్రంబున్ = అభేదమును తెలిసికొనుటను మాత్రమే, ఇచ్చున్, అతిసులభంబైన=సాధించుటకు మిగుల సులభమగు, విజ్ఞానయోగంబు = జ్ఞానయోగము, రాజయోగంబనంబడున్ = రాజయోగమని చెప్పఁబడును. (రాజయోగ మనఁగా: యోగములలో నుత్తమమైనది.) ఈరెంటికిన్ =ఈయభ్యాస జ్ఞానయోగములకు రెంటికిని, శ్రీరామచరణకమలభక్తి కారణంబు=రాముని పాదపద్మములయందలి భక్తియే హేతువు (అనఁగా: శ్రీరామభక్తివలన నీయోగములు సిద్ధించుననుట.) దానికిన్ = ఆ రామభక్తికి, వైరాగ్యంబు=ఇహపరలోకభోగములయం దిచ్ఛలేకుండుట, మూలంబు = కారణము, వినుము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఆయోగము అభ్యాసయోగమనియు, జ్ఞానయోగ మనియు రెండువిధములై యున్నది. అభ్యాసయోగమునకు ప్రాణాయామమనికూడ వ్యవహారము గలదు. ప్రాణాయామ మనఁగా వాయునిరోధము. ఈయభ్యాసయోగమునందు వాయునిరోధమే ప్రధానమగుటచే దీని కీపేరు వచ్చినది. ఆఅభ్యాసయోగము, లేక ప్రాణాయామయోగము, ప్రాకృతప్రాణాయామయోగ మనియు, వైకృతప్రాణాయామయోగ మనియు, కేవలకుంభకప్రాణాయామయోగ మనియు మూఁడువిధములై యున్నది. ఈ మూఁడిటిలో ప్రాకృతప్రాణాయామము మంత్రయోగమనియు, వైకృతప్రాణాయామము లయయోగ మనియు, కుంభకప్రాణాయామము హఠయోగ మనియుఁ జెప్పఁబడుచున్నవి.

ఈమూఁడువిధము లగుప్రాణాయామయోగములను, లేక అభ్యాసయోగములను అనుష్ఠించువారు యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము అనువానిని బూర్వమున నభ్యసింపవలయును. ప్రత్యాహారము, ధ్యానము, ధారణ, సమాధి యనువానిని పిదప నాచరింపవలయును. ఈచెప్పిన యష్టాంగములలో పరుల హింసింపకుండుట, సత్యమునే పలుకుట, దొంగలింపకుండుట, ఒకరిధనమును వారిచ్చినను గైకొనకుండుట అను గుణములు యమములనఁబడును. లోపల వెలుపల పరిశుద్ధముగ నుండుట, కృచ్ఛ్రము, చాంద్రాయణము మొదలగు తపముల నాచరించుట, తనకు భగవంతుఁ డిచ్చినదానితోఁ దృప్తిఁ జెందియుండుట, వేదాధ్యయనము నొనర్చుట, పరమేశ్వరుని యందలిభక్తి, లేక పరమేశ్వరుని ధ్యానించుట అనునివి నియమము లనంబడును. ప్రాణాయామముఁ జేయునప్పుడు వాయువు నెచ్చటెచ్చట నరికట్టవలయునో, ఎట్లెట్లు విడువవలయునో వానికన్నిటికి ననుకూలముగ నుండునట్లు చేతులు కాళ్లు మొదలగు నవయవముల నమర్చికొనుటయే యాసనమనఁబడును. ఆయాసనములు వీరాసనము, స్వస్తికాసనము, భద్రాసనము మొదలగు ననేకభేదములతో నెనుబదినాలుగు విధములై యున్నవి. ఇట్లీయమనియమాసనముల బాగుగ నభ్యసించిన పిదప ప్రాణాయామము నభ్యసింపవలయును. ప్రాణాయామ మనఁగా వాయువును నిరోధించుటయే. అదియే యభ్యాసయోగస్వరూపమనికూడ నిదివఱకే చెప్పియున్నాను. ఆప్రాణాయామము మూఁడువిధము లనికూడఁ దెలియఁజేసియున్నాను. అందు మంత్రయోగమని చెప్పఁబడు ప్రాకృతప్రాణాయామమును వివరించెద వినుము. లోకమునందలి ప్రతిభూతమును సాధారణముగ వెలుపలనుండి లోనికిని లోపలనుండి వెలికిని వాయువు నాకర్షించుచు విడుచుచు నున్నదికదా. వెలికి వచ్చువానిని నిశ్శ్వాసమనియు, లోనికిఁ బోవుదానిని యుచ్ఛ్వాసమనియుఁ జెప్పుచున్నాము. శాస్త్రమునందు వీనికే క్రమముగ రేచక పూరకము లనునామధేయములు గలవు. రేచకపూరకములు యభ్యాసమునఁ గొంతకాలము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాయువు లోన నిలుచుచున్నది. దానికే కుంభకమని పేరు. ఇట్లు స్వాభావికములై యున్న రేచకపూరకకుంభములలో హంస మత్రాంక్షరముల నిలిపి ధ్యానించుట మంత్రయోగము. ఇదియే ప్రాకృత ప్రాణాయామము. కుంభకములలో నూర్ధ్వకుంభక మనియు, అధః కుంభక మనియుం గూడ భేదములు గలవు. ఇక వైకృతప్రాణాయామ మనఁగా దినదినమును ప్రాణముల నిరోధించుట యభ్యాసముఁ జేసిచేసి ప్రాణమునం దపానమును, అపానమునందు ప్రాణమును (అనఁగా: ఉచ్ఛ్వాసములలో నొకదాని యందు మఱియొకదానిని) లయము గావించుట. ఇదియే లయయోగము. వాయువును బలాత్కారముగ లోపల నిలిపి రేచకపూరకముల సంపూర్ణముగ నశింపఁజేయుట కేవల కుంభకము. ఇదియే హఠయోగము. రేచకపూరకముల నశింపఁజేసి ప్రాణాపాన ముల (అనగా: నిశ్శ్వాసోచ్ఛ్వాసముల) బంధించుటకు మూలబంధము, ఉడ్యాణ బంధము, జాలంధరబంధము నను నుపాయములు కలవు. ఈ విధముగ అభ్యాసయోగ మునకు పూర్వాంగము లగుయమనియమాసనప్రాణాయామములు వివరింపఁబడెను. ఇఁక నుత్తరాంగంబుల వివరించెద వినుము.

శబ్దస్పర్శాది విషయముల ననుసరింపనీక శ్రోత్రాదీంద్రియముల నిర్బంధించుట ప్రత్యాహారము. సగుణరూపముగాఁగాని, నిర్గుణరూపముగాఁగాని పరమాత్ముని ధ్యానిం చుట ధ్యానమనఁబడును. మూలాధారము, స్వాధిష్ఠానము మొదలగు స్థలములయందు వాయుసహితముగ మనసును నిర్బంధించుట ధారణయనఁబడును. ధ్యానింపఁబడుచున్న వస్తువునందు చిత్తముఁజేర్చుట సమాధి. అది రెండువిధములు. ధ్యానించువాఁడు ధ్యానము ధ్యానింపఁబడునది అను భేదము లేసమాధియందుఁ గానఁబడునో, అది సవికల్పకసమాధి. ఏసమాధియందుఁ గానరాదో అది నిర్వికల్పకసమాధి. ఇట్లభ్యాస యోగమునకుఁ గల యష్టాంగములస్వరూపములను గ్రమముగ వివరించితిని. ఈయభ్యాస యోగము చిత్తపరిపాకము లేనివారికిఁ గావలయును. దీనిని సాధించుట మిగులఁ గష్టము. ఇది సాధింపఁబడియె నేని అణిమామహిమాదులగు నష్టసిద్ధుల నొసంగును. బ్రహ్మజ్ఞానమును బ్రకటించును. పరిశుద్ధమగు మనసుగలవారల కీయోగముతోఁ బనిలేదు. వారలు జ్ఞాన యోగమునే యాశ్రయించినఁ జాలును. ఆయోగమునకే రాజయోగమనికూడఁ బేరు గలదు. ఇది వారలకు బ్రహ్మజ్ఞానముమాత్ర మొసంగును. ఈ రెండుయోగములలో నేది సిద్ధింపవలయునన్నను శ్రీరామ పాదపద్మములయందు భక్తి యత్యావశ్యకము. ఆ భక్తియు వైరాగ్యము లేక గలుగనేరదు. ఈ జ్ఞానయోగమును వివరించెద వినుము.

అహింసాలక్షణము.

ఉత్సాహ. "ఈరు పేను నల్లి చీమ యీఁగ మొదలుజంతుల౯
గ్రూరసర్పవృశ్చికాదిగురువిషప్రదావళి౯

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఘోరమృగముల న్వధింపఁ గోర కునికి నాగమో
క్తోరుహింస సేయ రెండు నొప్పు నాయహింసకున్."

తా. "ఈరు పేను నల్లి ఈఁగ చీమ లోనగు స్వల్పజంతువులను, క్రూరము లయిన పాములు తేళ్ళు మండ్రగబ్బలు మొదలగు విషజంతువులను, భయంకరములయిన శరభములు సింహములు ఏనుఁగులు పులులు చిఱుతపులులు అడవిపందులు మొదలగు మృగములను చంపకయుండుటయు, వేదోక్తములగు యజ్ఞములయందు పశువుల జంపుట యును ఈరెండును అహింసయే."

## సత్యలక్షణము.

క. "ఉన్నది కన్నది విన్నది
యున్నట్లుగఁ బలుకుటయును నొరునకు నత్యా
పన్నత గలుగఁగఁ గల్యా
ణోన్నతి గలకల్లమాటయును సత్యమగున్."

తా. "ఉన్నసంగతి యున్నట్టుగను, చూచినసంగతి చూచినట్లుగను, విన్నసంగతి విన్నట్లుగను తప్పక చెప్పుటయును, ఒకనికి సంభవించిన ఆపద దప్పి మేలుగలుగుటకై యాడిన కల్లమాటయును సత్యమే యగును."

## అస్తేయలక్షణము.

క. "ప్రస్తుతిగ నెట్టిదళపర
వస్తువులం ద్రికరణముల వర్జించుట తా
నస్తేయ మనుచుఁ జెప్పుదు
రస్తమితాజ్ఞానతంత్రు లయినమునీంద్రుల్."

తా. "ఎట్టికష్టకాలము దయినను పరులసొమ్ము నపహరింప మనసునఁ దలఁపక అప హరింపుమని నోటఁ జెప్పక చేత ముట్టక యుండుటే అస్తేయము."

## బ్రహ్మచర్యలక్షణము.

క. "కాంతల నందఱి నామర
ణాంతకముగఁ బరిహరించు టది మే లొండే
నెంతయు నిజ భార్యావ్రత
సంతుష్టిని జెంద బ్రహ్మచర్యంబ యగున్."

తా. "స్త్రీసంపర్కంబు మరణించుదనుక లేకయైనను, ఋతుకాలములయందు తనభార్యం గలసి తవిదినొందుచున్నయునను బ్రహ్మచర్యము."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అపరిగ్రహలక్షణము.

ఆ. "దానపూర్వకంబుగా నెవ్వ రేమైన
నొసఁగ సంగ్రహింప కునికి సత్క్రి
తముగ శిష్యు లొసఁగుద్రవ్యంబుఁ గొనుట యా
ననఘ! తదపరిగ్రహంబు వత్స."

తా. "ధనధాన్యాదులను దానపూర్వకంబున నెవ్వరిచ్చినను పుచ్చుకొనక శిష్యు లిచ్చిన పుచ్చుకొనుట అపరిగ్రహము."

శౌచలక్షణము.

తే. "శౌచములు రెండు తెఱఁగులై చనుఁ బ్రసిద్ధి
మృత్తికాజలములచేత మెఱయుబాహ్య
మమలి నాభ్యంతరపుశౌచ మనఁగ భావ
శుద్ధి యని కద వచియింతు రిద్ధమతులు."

తా. "బాహ్యపరిశుద్ధియని అంతరపరిశుద్ధియని పరిశుద్ధి రెండువిధములు. వానిలోఁ మృత్తికచేతను జలముచేతను చేయఁబడునది బాహ్యపరిశుద్ధి. కామక్రోధలోభ మోహ మదమత్సరదంభములు మొదలయిన దుర్గుణముల సంఘముతోడను, ఆణవకార్మిక మాయిక మాయే యతిరోధానము లనెడుపంచమలములతోడను గూడక మనస్సు నిర్మలమైయుఁం డుటే అంతరపరిశుద్ధియని విజ్ఞానసంపన్నులగు పండితులు పలుకుదురు."

త్రివిధతపోలక్షణము.

శ్లో. "దేవ ద్విజ గురు ప్రాజ్ఞపూజనం శౌచమార్జవమ్,
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే.
అనుద్వేగకరం వాక్యం సత్యప్రియహితం చ యత్,
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే.
మనః ప్రసాదసౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః,
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే."

తా. "దేవతలను బ్రాహ్మణులను గురువులను పండితులను పూజించుట, బాహ్యపరి శుద్ధి, అణకువయు, బ్రహ్మచర్యవ్రతమును అహింసయుఁ గలిగియుండుట శరీరసంబంధ మైనతపస్సు; మనోవేదనగలుగఁజేయునవి గాక సత్యమై విశ్వాసంపై మేలుగలుగఁ జేయునవి దై యుండు మాటలాడుటయును, వేదమూలమంత్రములను పఠించుట యును, వాక్సంబంధమైన తపస్సు; మనస్సునకు సమాధానమును నిశ్చలనడవడియును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాఙ్నియమనమును, మనోనిగ్రహమును, మనశ్శుద్ధిగలిగియుండుటయును మానససంబంధమైనతపస్సు.”

క. మనమున వాక్కునఁ గాయం
బునఁ దలఁపులఁ బలుకులను బ్రబుద్ధత నుపవా
సనిరూఢి యిద్ధపూర్వో
క్తనియతిఁ బ్రచరించు టిదియ తప మగుఁ బేర్మిన్.

సంతోషలక్షణము.

క. ఆపదలను శోభనముల
నాఁపక చనఁ జూచుచును స్వయంస్వాగతవి
త్తాపత్తిని ముద మందుట
దీపితసంతోష మని కథింతురు ప్రాజ్ఞుల్.

తా. శుభాశుభకార్యములను నిలుపక తగిన కాలములయందే జరిపించుచు పేరాశ పడక తనకు లభించిన ద్రవ్యముతోడనే తృప్తిపొందుట సంతోషము.

స్వాధ్యాయలక్షణము.

తే. మఱియు స్వాధ్యాయమున మూలమంత్రపఠన
మది విచారింప వాచిక మని యుపాంశు
వనియు మానసికం బని యనఘ మూఁడు
తెఱఁగులై యుండుఁ దెలిపెదఁ దెలియ వినుము.

క. ఒరులు వినఁ గొనుట వాచిక
మొరులు వినక యుండఁ గొనుటయు నుపాంశువు న
క్షరవిరళముఁ గొని మది సం
స్మరియించుట మానసికము స్వాధ్యాయ మగున్.

తే. అందు వాచికజపమున కధికతర ము
పాంశుజప మయ్యుపాంశుజపమున కధిక
తరము మానసజప మగు దాని కధిక
తరము లేదని తెలియు మో ధర్మనిరత.

తా. స్వాధ్యాయము వాచికమని ఉపాంశువని మానసికమని మూఁడువిధములు. అందు అన్యునికి వినఁబడునట్లు పఠించుట వాచికము; అన్యునికి వినఁబడకుండునట్లు పఠించుట ఉపాంశువు; ప్రత్యక్షరమును విభజించి మనసునందే జపించుట మానసికము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈశ్వరప్రణిధానలక్షణము.

సీ. కరణంబు లఖిలోపకరణంబులును గాఁగఁ
బ్రాణంబు లుపచారభటులు గాఁగ
గంగాప్రముఖనాడికలు జలంబులు గాఁగ
షట్కమలములు పుష్పములు గాఁగ
జఠరాగ్నిహోత్ర ముజ్జ్వలధూపముం గాఁగఁ
బటుజీవకళలు దీపంబు గాఁగ
నందితానందంబు నైవేద్యముం గాఁగ
రవిశశిజ్యోతు లారతులు గాఁగ

తే. నంగదేవాలయమున సహస్రకమల
పీఠమున శాంతిజనకజోపేతుఁ డగుచుఁ
జెలఁగుపరమాత్ము రాము నర్చించుచుండఁ
దత్త్వవిదు లీశ్వరప్రణిధాన మండ్రు.

తా. జ్ఞానేంద్రియములును కర్మేంద్రియములును అంతరింద్రియములును పూజాపాత్రములుగాను, దశవిధప్రాణములు పనివాండ్రుగాను, గంగాయమునాసరస్వత్యాది నామములుగల ఇడ పింగళ సుషుమ్న మొదలగు నాడులు అభిషేకాదిజలములుగాను, ఆధారాదిషట్కమలములు పుష్పములుగాను, జఠరాగ్ని ధూపముగాను, చిత్కళలు దీపములుగాను, బ్రహ్మానందము నైవేద్యముగాను, సూర్యచంద్ర మండలజ్యోతు లారతులుగాను, శరీరమనెడు దేవాలయమందలి సహస్రారకమలమనెడి సింహాసనమున శాంతి యను సీతతోఁగూడిన పరబ్రహ్మమను శ్రీరాముని నెల్లప్పుడు పూజించుచుండుటయె యీశ్వరప్రణిధానమని బ్రహ్మవాదులయిన పెద్దలు పలుకుదురు.

యోగాసనముల లక్షణములు.

౧. వీరాసనము.

క. ఒకతొడపై నొకపాదము, నొకపాదముమీఁదఁదొడయును నిచి శరీరం
బకుటిలగతి నిల్పినఁద, క్కక యది వీరాసనంబుకై వడి యయ్యెన్.

తా. ఒకతొడమీఁద నొకపాదమును మఱియొకపాదముమీఁదఁ దక్కిన తొడయును చేర్చి శరీరము వంకరలేకుండ నిల్పినేని వీరాసనమగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ౨. స్వస్తికాసనము.

క. పిక్కలతొడలనడుములం
దొక్కటఁ బదతలము నిడి సమున్నతి నొడలిన్
నిక్కించిన నీయాసన
మక్కజముగ స్వస్తికాహ్వయం బగు జగతిన్.

తా. జంఘోరువులనడుమ పాదములఁ జొనిపి శరీరము చక్కఁగ నిక్కించె నేని స్వస్తికాసన మనుట.

## 3. పద్మాసనము.

శా. వామాంకంబున దక్షిణాంఘ్రియును దద్వామేతరాంకంబునన్
వామాంఘ్రిన్ ఘటియించి పశ్చిమదిశావ్యాప్తంబులౌ చేతులన్
నేమం బారఁగఁ గాల్ల యంగుళములం జేకొన్నఁ బద్మాసనం
బౌ ముక్కుంగొనఁ జూపుసుం జుబుకహృద్వ్యాసంగముం గల్గినన్.

తా. ఎడమతొడమీఁద కుడిపాదమును కుడితొడపై ఎడమపాదమును నిలిపి వెనుక ప్రక్కగ కుడిచేత నెడమతొడమీఁదనున్న కుడికాలి పెద్దవ్రేలును ఎడమచేత కుడితొడ మీఁదనున్న ఎడమకాలిపెద్దవ్రేలును పట్టుకొని ఱొమ్మున గడ్డముంచి భ్రూమధ్యమందు దృష్టి నిలిపె నేని పద్మాసనమగును.

## ౪. మతాంతరపద్మాసనము.

సీ. అది పద్మబంధంబె యగు నైన నుత్తాన
చరణంబు లూరుసంస్థములు గాఁగ
నూరుమధ్యంబున నుత్తానకరతల
ద్వయమును రాజదంతముల మొదట
హత్తియుండెడిరసనాగ్రంబుఁ దొంటిభా
తినయున్న చుబుకంబు దృష్టి గలిగి
మారుతం బల్లనఁ బూరించు చుండిన
నది పద్మ మగు మతాంతరమునందు
తే. మఱియు నిది మత్స్యమతము పద్మమునఁ బూర్వ
మట్ల యుండుచు సంస్ఫుటహస్తయుగ్మ
మున గుదాకుంచనముఁ జలదనిలపూరి
తము విసర్జనవిధియు ధ్యానమును వలయు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఎడమతొడపయిన కుడిపాదమును, కుడితొడపై నెడమపాదమును, వెలికిల నుంచి హస్తములు రెండుతొడలపయి వెలికిలనుంచి నాసాగ్రమందు లక్ష్యముంచి దంతమూలమున నాలుక హత్తించి వక్షమందు గడ్డంబుంచి మెల్లమెల్లగ వాయువును పూరించుచుండెనేని మతాంతరపద్మాసనమగును. మఱియు మునుపటివలె పద్మాసనమందుండి చుబుకంబు వక్షంబున హత్తించి చిత్తంబునందు ధ్యానంబుచేయుచు అపానమును ఊర్ధ్వముగా రేచించి కుండలీశక్తియుక్తముగ నిలిపి ప్రాణవాయువును విడువఁగా నధికజ్ఞానబోధ కలుగును. దీనిచేత నాడీద్వారమందు గాలి నిల్చును. మృతులగువారు ముక్తులగుదురు. ఇదే బద్ధపద్మాసనము. ఇదే ముక్తపద్మాసనము.

౫. యోగాసనము.

క. యోగపటజానుయుగసం
యోగంబునఁ బదతలంబు లుర్వి నిలిపి లో
నీఁగినకరముల నుండిన
యోగాసన మండ్రు దీని యోగవిధిజ్ఞుల్.

తా. హంసదండము మోకాళ్లక్రిందఁనుంచుకొని పాదముల నేలపయి నిలిపి తొడలనడుమ, చేతులఁ జొనిపి పిక్కఁబట్టుకొని ఆత్మావలోకనముఁ జేయుచుండెనేని యోగశాస్త్రవేదులు దీనిని యోగాసనమందురు.

౬. కూర్మాసనము.

క. వీడఁబడినగుల్ఫంబులఁ
గూడఁగ సంధించి పట్టి గుద మలపడఁగాఁ
బీడించినఁ గూర్మాసన
మీడితమతి నెఱుఁగుదురు యమీంద్రులు దీనిన్.

తా. ఆధారమునకు ఉభయపార్శ్వములయందు రెండుకాళ్లమడిమలు హత్తించి నిక్కి చక్కఁగా గూర్చుండెనేని కూర్మాసనము.

౭. ఉత్తానకూర్మాసనము.

తే. కుక్కుటాసనబంధంబుఁ గూర్చినట్టి
కరయుగంబుల మెల్లనఁ గనుదరంబు
బంధనముఁ జేసి వెలికిలఁబడినకూర్మ
మట్ల పడఁగ నుత్తానకూర్మాసనంబు.

తా. కుక్కుటాసనస్థుఁడైయుండి రెండుచేతులతో కంఠముపట్టుకొని కూర్మమువలె వెలికిలఁబడియుండెనేని యుత్తానకూర్మాసనము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ౮. భద్రాసనము.

తే. అండముల క్రిందినెలవులయందు నుభయ
పార్శ్వములు రాయ రెండుగుల్ఫములఁ బెట్టి
పార్ష్ణిపదములఁ గరములఁ బట్టి నిశ్చ
లాత్ముఁడై యుండెనేని భద్రాసనంబు.

తా. అండములకు క్రింది ప్రక్కలయందు చీలమండలనునిచి మడిమల రెంటిని రెండుచేతులఁబట్టి కదలకుండిన భద్రాసనమగును. ఈయాసనస్థుఁడగువాఁడు సర్వవిష ములను వ్యాధులను జయించును.

క. భాసురపద్మాసనసిద్ధాసనము గృహస్థవర్తనాతీతులకున్ (?).

తా. గృహస్థాశ్రమస్థులు పద్మాసనస్థులై యుండుట యుత్తమమైనను గృహస్థు లకు పద్మాసనమును తక్కినయాశ్రమస్థునకు సిద్ధాసనమును మేలనుట.

## ౯. సిద్ధాసనము.

శా. యోనిస్థానముఁ బార్ష్ణిభాగఘటనాయుక్తిన్ని బంధించుచున్
దాన న్మేఢ్రముమీఁద నోజ నొక పాదం బూన సిద్ధాసనం
బౌ నందింద్రియనిగ్రహంబును సుదేవస్థాణుభావంబు యో
గానందైకమనంబు భ్రూయుగళిమధ్యాలోకముం గల్గినన్.

తా. ఎడమకాలిమడమ మూలాధారమందు కుడికాలిమడమ లింగస్థానమం దుంచి శిరోగ్రీవభుజంబులఁ జక్కగా నిక్కించి భ్రూమధ్యావలోకనముఁ జేయుచుం డిన సిద్ధాసనమగును. దీనిచే నింద్రియనిగ్రహము శరీరపాటవము నిర్మలచిత్తవృత్తి గలుగును.

## ౧౦. మతాంతరసిద్ధాసనము.

క. వెండియును సవ్యగుల్ఫము,దండముపైఁ బెట్టి మీఁద దక్షిణగుల్ఫం
బుండఁగ నవక్రముగఁ గూర్చుండిన సిద్ధాసనంబయొాఁబకుమునా.

తా. లింగముమీఁద నెడమ మడమనుంచి దానిపై కుడిమడమనుంచి ముందువలె నాసాగ్రము నీక్షించుచుండిన నిది మతాంతరసిద్ధాసనమనుట. దీనిని వజ్రాసనమని ముక్తా సనమని గుల్ఫాసనమని బహువిధములఁ జెప్పుదురు, ఇది సకలాసనములలో మేలైనది. ముక్తిద్వారకవాటపాటనపటువైనది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧౧ సింహాసనము.

శా. అండాధస్థ్సలి నూరుపార్శ్వముల సవ్యాసవ్యగుల్భద్వయం
బొండొంటిం గ్రమహీనభంగి నిడి దోర్యుగ్మాంగుళుల్ జానులం
దుండ న్వే ప్రసరించి నిక్కి వివృతాస్యుం డైనసింహాసనం
బొండేమిం గనఁ బోక నాసికముఁ దా నొలిం బరీక్షింపఁగన్.

తా. అండములక్రింది సెలవులయందు తొడలవెనుక భాగములు సోఁకునట్లు కుడి యెడమమడమల మార్చియుంచి కుడియెడమ చేతులవ్రేళ్లను మోఁకాళ్లమీఁద సవ్యంబుగ వెడల్పుగనుంచి నిక్కికూర్చుండి నోరుదెఱచికొని భ్రూమధ్యమందలి చిద్బిందువును తిలకించుచున్న సింహాసనమనుట.

౧౨. కుక్కుటాసనము.

క. జలజాసనంబునం గరము లు జానూరువులమధ్యమునఁ జొనిపి ధరన్
నిలిపి గగనమున నంగం, బలవడ నిలువంగఁ గుక్కుటాసనమయ్యెన్.

తా. పద్మాసనమునసుండి మోఁకాళ్లతొడలసందుల చేతులను దూర్చి హస్తముల నేలనూని పైనెగసినట్లుండిన కుక్కుటాసనమగును.

౧౩. గోముఖాసనము.

క. వామదిశ పృష్ఠపార్శ్వము, ధామముగా దక్షగుల్భతలమును న ట్ల
వ్వామపుగుల్భమువలనిడ, గోముఖ మీయాసనంబు గోముఖ భాతిన్.

తా. ఎడమకాలిమడమ కుడిపీఁపుప్రక్కను కుడికాలిమడమ నెడమపీఁపువైపు గాను మోఁకాలిమీఁద మోఁకాలు గదియనుంచి యొడలు చక్కగ నిక్కించి భ్రూమధ్యావలోకనము చేయుచుండెనేని గోముఖాసనంబగును.

౧౪. ధనురాసనము.

క. మునుపాదాంగుష్ఠంబులు
దన చేతులు చెవులు దాఁక ధనువు దివియున
య్యనువున నెడమఁ గుడిఁ దివియ
ధనురాసన మండ్రు యోగతత్త్వవిధిజ్ఞుల్.

తా. పాదాంగుష్ఠముల రెంటిని రెండుచేతుల ధనురాకృతిగ వీఁపు వెనుక చెవులకు, సరిగాఁ బట్టియుండిన ధనురాసనమగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧౫. మయూరాసనము.

మహా స్రగ్ధర ధరణిన్ హస్తస్థలంబుల్దగులనిలుపుచున్దండముంబోలెఁదత్కూర్పరయుగ్మన్యస్తనాభీభవనతలయుగోద్భాసియై యున్న తాస్య స్థిరుఁడై యాకాశదేశస్థితి నిలిచినఁ దా శ్రీమయూరాసనం బాహరియించున్రోగదోషాయతనవిషసమూహంబుల న్రంహాయుక్తిన్.

తా. చేతుల నేలనూని మోఁచేతుల నాభియిరుప్రక్కలనుంచి ముఖము పైకెత్తి కాళ్లు చాఁచి నెమలితోఁకవలె పైకెత్తిన మయూరాసనమగును. దీనిచే నుదరగుల్మాది రోగములును సర్వపాపములును వేగముగా నశించును. జఠరాగ్ని ప్రజ్వరిల్లి విషమునయిన జీర్ణింపఁజేయును.

౧౬. కపాలాసనము.

సీ. ఊర్ధ్వసంస్థితనాభియును నధస్తాలువు
నూర్ధ్వభానుఁడు నధోయుక్తిశశియు
నూర్ధ్వపాదంబులు నొగి నధశ్శిరమును
గలయది విపరీతకరణసంజ్ఞ
గలకపాలాసనక్రమ మయ్యె గురువాక్య
మున నది సిద్ధించు జనుల కెలమి
నిత్యంబు నభ్యాసనిరతున కీకపా
లాసనం బఖిలరోగాళిఁ జెఱచు
తే. జఠరవహ్ని వర్ధిలఁ జేయు జగతి నట్టి
సాధకునకు నాహారంబు సంగ్రహింప
జను బహుళముగ నల్పభోజనముచేత
ననిలవేగంబు విడిపించు సతనితనువు.

తా. ఈయాసనము ప్రతిదినము యామమాత్రమభ్యాసము చేయుచుండిన మూఁడు నెలలకు పిదప వలీపలితవిరహితాంగుండును మృత్యుంజయుండునగును.

శ్లో. "నాభిస్థానే వసే దగ్ని ర్హృదయ స్థానే దివాకరః,
భ్రూమధ్యే వర్తతే చంద్ర శ్చంద్రాగ్రే చ వసే న్మనః."

తా. తలక్రిందుగ నిలిచి భ్రూమధ్యమునందలి చిద్బిందువును చూచుచుండెనేని కపాలాసనమనుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧౭ ముక్తాసనము.

క. పదగుల్ఫంబున గుదముం, గదియంగా నిల్పి యంకగతమై యుండం
బద మొకటి సంఘటించిన, నది ముక్తాసనమవక్రమగు మే నమఃరణ్.

తా. ఎడమకాలి మడమచే మూలాధారమును గప్పి కుడియడుగు నెడమతొడ మీఁద నుంచిన అది ముక్తాసనమగును.

౧౮. టిట్టిభాసనము.

క వెలికిలఁ జరణతలంబులు, దలమీఁదం జేర్చి ధరణితలమున నిలుపం
గలిగెడు నట్లుగఁ గరములు,నలపశ్చిమ మెత్తఁడిట్టిభాసనమయ్యెన్.

తా. పాదములు వెలికిలనుండ శిరస్సుపైఁ గదియించి చేతులతోఁ బూనికగా నిలిచి వెనుకటిభాగము పైకెత్తఁగాఁ డిట్టిభాసనమగును.

౧౯. పశ్చిమతానాసనము.

చ పదముల భూమి దండములభాతిగఁ జాఁచి కరాంగుళంబులన్
బదయుగళాగ్రము ల్బిగియఁబట్టి లలాటము జానుయుగ్మముం
బదిలముగా ఘటింప నిది పశ్చిమతానము దీనరోగము
ల్గదియవు పశ్చిమంబునను గాలియగున్ జఠరాగ్ని కార్శ్యముల్.

తా. నేలమీఁద రెండుకాళ్లు చక్కగాఁ జాచి రెండుకాళ్లబొటనవ్రేళ్లు రెండు చేతులఁ బట్టికొని మోఁకాళ్లమీఁద లలాట ముంచెనేని పశ్చిమతానాసనము. ఇందున వాయువు పశ్చిమమార్గముగా నడుచుటవలన జఠరాగ్ని ప్రజ్వరిల్లి కడుపుపల్చనై రోగములు నశించును.

౨౦. పూర్వతానాసనము.

తే. వరుస మోఁగాళ్లు నేల మోపంగ మడిచి
మడమలును బిఱుఁదులు గూర్చి మస్తకంబు
నడుముఁ గరకూర్పరంబుల నదిమి మోపి
నడు మెగయ నున్నఁ బూర్వతానం బటండ్రు.

తా. కాలివ్రేళ్లు మడిచి భూమిమీఁద నిల్పి మడమలును పిఱుఁదులును జేర్చి శిరస్సును జేతులతోడను నడుమును మోఁచేతులతోడను అదిమిపట్టుకొని నడుమును నిక్కించిన పూర్వతానాసన మగును.

౨౧. అర్ధకాసనము.

చ. పదతలము ల్ధరాతలముపైఁ గడుడగ్గఱ నిల్పి లోతొడల్
గదిసిన జంఘలు న్నటి లలాటము మోపినజానుయుగ్మమున్

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్రిదులక యుండుహస్తపరిపీడితజానువు గల్గియుండెనే
నిది యగు నర్భకాసన మహీనసుఖాస్పదమంద్రు సంయముల్.

తా. పిఱుదులు క్రింద మోపియైనను గొంతు గూర్చుండి మోకాళ్లను చేతులతో చుట్టి పట్టుకొనిన అర్భకాసనము. ఇది యత్యంత సుఖాస్పదము.

౨౨. కామదహనాసనము.

చ. అవనితలంబుఁ బొందఁగఁ బదాంగుళిమూలములోన నిల్పి జా
నువులు నభస్థ్సలంబునన నూల్కొనఁ బార్ష్ణియుగంబు యోనియుగ్
దవులఁగ యోగదండఘటనాస్థితి హస్తతలంబు లుండెనే
నవిరళ మైనకామదహనాసన మండ్రిది యోగతత్పరుల్.

తా. మునివ్రేళ్ల నేలమీఁద నిల్పి మోకాళ్లక్రింద నూనక పిఱుదులు మడమలనొరయునట్లుండి హంసదండములమీఁదఁ జేతుల నూని నిక్కి భ్రూమధ్యాలోకనము చేయుచున్న యోగశాస్త్రవేదులు కామదహనాసన మని పల్కుదురు.

ప్రాణాయామలక్షణము.

తే. ప్రణవపంచాక్షరాష్టాక్షరాదికముల
మాత్రగాఁ జేసి పూరకమాత్రలకును
రెట్టికుంభకమున నిల్పి రేచకంబు
నాడిశోధన మట్ల చేయంగవలయు.

తే. సోముదెస గాలిఁ గొనుచు సుషుమ్నఁ బట్టి
సూర్యుదెస వీడి క్రమ్మఱ సూర్యువలని
పింగళంబునఁ గొనిపట్టి పిదప నిగుడ
విడుపవలయు యథాశక్తి నుడుగ కెపుడు.

తా. ఓంకారము పంచాక్షరము అష్టాక్షరము మొదలగుమంత్రములలో ఒక్కమంత్రమును ఒక్కమాత్రగాఁజేసి పూరకమందు నిర్ణయములగు మాత్రలకంటె రెట్టిగా కుంభకమునందు నిలిపి రేచకమునందు పూరకమందలిమాత్రలలో సగము నిర్ణయించి సుషుమ్నా నాడియందలి వింతలఁ జూడవలయును. మఱి యెడమముక్కున ప్రాణవాయువును పూరించి సుషుమ్నయందు నిల్పి కుడిముక్కున విడిచి మరల కుడిముక్కున పూరించి సుషుమ్నయందు నిల్పి యెడమముక్కున విడుచుచు నీతీరున నెల్లప్పుడు యథాశక్తిగ ప్రాణాయామము చేయుచు నుండవలయును. ఈప్రాణాయామము ప్రాకృతమని వైకృతమని కుంభకమని త్రివిధము. అందు నేటిదినము సూర్యోదయము మొదలు రేపటి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సూర్యోదయమువఱకు మూలాధార కమలంబున గణపతికి ఆఱునూఱును, స్వాధిష్ఠాన కమలమున బ్రహ్మకు ఆఱువేలును, మణిపూరకకమలంబున విష్ణుదేవునకు ఆఱువేలును, అనాహతకమలంబున రుద్రునకు ఆఱువేలును, విశుద్ధకమలంబున నీశ్వరునకు సహస్రంబును, ఆగ్నేయకమలంబున సదాశివునకు సహస్రంబును, సహస్రారంబున గురువునకు సహస్రంబును, అజపాగాయత్రీమంత్రజపమును సమర్పించుటే ప్రాకృతప్రాణాయామము. రేచక పూరక కుంభక క్రమములచేత తొలుత అధస్సంచారముగల ప్రాణవాయువునందు ఊర్ధ్వసంచారముగల యపానమును, వెనుక అపానమందు ప్రాణమునుచేర్చుట వైకృతప్రాణాయామము. మూలబంధ ఉడ్యాణబంధ జాలంధరబంధముల గావించి రేచక పూరకములను నిలిపి ప్రాణాపానములను రెంటిని రేయింబవ లొక్కఁ్ఱక్కొగ నిలుపుట కుంభకప్రాణాయామము. రేచకమనఁగా ప్రాణవాయువును మూలాధారమునుండి బ్రహ్మరంధ్రపర్యంతము సుషుమ్నానాళద్వారముగ నుత్థాపనముచేయుట; పూరకమనఁగా: బ్రహ్మరంధ్రపర్యంతము రేచించిన వాయువును మరల సుషుమ్నానాళద్వారముగ మూలాధారమునఁ జేర్చుట. కుంభకమనఁగా రేచించిన వాయువును బ్రహ్మరంధ్రమందు మాత్రాసంఖ్యగ నిలుపుట. ఇదే యూర్ధ్వకుంభకము. పూరించిన వాయువును మాత్రాసంఖ్యగ మూలాధారమున నిలుపుట అధోకుంభకము.

### బంధత్రయవివరణము.

తే. గుహ్యమున వామపాదంబుఁ గూర్చి యితర
పాదమూలంబు నాభినిఁ బరగఁ జుబుక
మురమునను జేర్ప నివి బంధపరము లండ్రు
ఆర్యనుత వీనిఁ దెలియు మీ వాత్మయందు.

క. మడమను యోనిస్థానము, విడువక బంధించి యూర్ధ్వవీథికఁ పాసుఁగా
వడి నాకుంచనమునఁ గొని, పడ నాకర్షింప మూలబంధం బయ్యెన్.

తే. కృత్రిమము లేక నాభికిఁ గ్రిందు మీఁదు
బలిమి మై బంధనము సేయ వలయు దీనిఁ
బరమయోగీంద్రు లుడ్యాణబంధ మండ్రు
బంధములలోన నుత్తమం బండ్రు దీని.

తే. కంఠ మాకుంచనము చేసి కడు దృఢముగ
హృదయమునఁ జుబుకము నిల్ప నిదియ కాదె
భవ్యజాలంధరాభిఖ్యబంధ మూర్ధ్వ
భాగమున నున్న యమృతనిబంధకంబు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. అంఘ్రిమూలమున మూలాధారచక్రంబుఁ బీడించి ప్రాణంబు బిగియఁబట్టి అని శివయోగసార భాగవతాది గ్రంథములలో చెప్పఁబడియున్నది గనుక గుదగుహ్యములయందపానుని సంచార మగుటవలన నెడమమడమచేత గుదస్థానమును బంధించుటయే మూలబంధము. కుడిమడమచేత నాభిని బంధించుటే ఉడ్యాణబంధము. గడ్డము ఱొమ్మునందుంచుటే జాలంధరబంధము. ఈబంధత్రయమందు సుస్థిరులై హఠయోగసిద్ధిగల యోగీంద్రులు వార్ధక్యాది వ్యాధిమృత్యు భయములు లేక మోక్షసామ్రాజ్యపట్టభద్రులయి యుందురు. సత్యము.

## సమాధిలక్షణము.

సమాధి సవికల్పక మని నిర్వికల్పక మని ద్వివిధము. అందు సవికల్పకము దృశ్యానువిద్ధసవికల్పక మని శబ్దానువిద్ధసవికల్పక మని యిఱుతెఱంగులు కలది యగును. ఈరెండును నిర్వికల్ప మొక్కటియును గూడి మూఁడువిధము లయ్యెను. ఈమూఁడును బాహ్యాంతరభేదములచేత బాహ్యదృశ్యానువిద్ధ సవికల్పకసమాధి యని బాహ్యశబ్దానువిద్ధ సవికల్పకసమాధి యని బాహ్యనిర్వికల్పకసమాధి యని ఆంతరదృశ్యానువిద్ధ సవికల్పక సమాధి యని ఆంతరశబ్దానువిద్ధ సవికల్పకసమాధి యని ఆంతరనిర్వికల్పకసమాధి యని ఆఱువిధములు.

ఆ. ఎదుటఁ గానుపించు నెల్లచిదాభాస
కళలు తనకు వేఱు గా నటంచుఁ
దెలియు తెలివి నెపుడుఁ దెలియుట బాహ్యదృ
శ్యానువిద్ధ మనఁగ నలరు వత్స.

క. అంతర మగు ద్విదళంబున, వింతగఁ జూపట్టుకళల వీక్షించుచుఁ దా
సంతసమందుచు నుండుట, యంతర్దృశ్యానువిద్ధ మనఁబడు సుమతీ.

తే. బాహ్యమునఁ బెక్కుగాఁ వినఁబడెడిశబ్ద
తతులఁ దెలిసెడు దెలివియె తా నటంచుఁ
దెలిసి యానందరసమునఁ దేలుచుంట
బాహ్యశబ్దానువిద్ధమై పరగు వత్స.

క. అంతర్హృదయనభంబున,సంతత మొగిమ్రోయు ప్రణవశబ్దంబుల నా
ద్యంతమువినుతను దెలియుట,యంతర్దృశ్యానువిద్ధమనఁబడుఁబుత్రా

ఆ. బాహ్యదృశ్యశబ్దపటలంబుఁ గనునాత్మఁ
గనుట బాహ్యనిర్వికల్ప, మాంత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రస్థదృశ్యశబ్దరాశిఁ గన్గొనునాత్ముఁ
గనుట లోనినిర్వికల్ప మనఘ

మఱియొకవిధమగు ప్రాణాయామము. కుడిముక్కు ఇడ, ఇదే సూర్యనాడి. ఎడమ ముక్కు పింగళ, యిదే చంద్రనాడి. వీనియందు సంచరించు ప్రాణవాయువును బ్రహ్మ బీజమైన ప్రణవమందలి అకార ఉకార మకారములను మూఁటిని మూఁడుమాత్రలనుగాఁ జేసికొని వానిలో అకారముచేత సూర్యనాడిని పండ్రెండుమాత్రలకాలమును, మకారముచేత చంద్రనాడిని పదియాఱుమాత్రలకాలమును పూరించు ఉపకారముచేత రెండునాడులును చేర్చి పదిమాత్రలకాలము సుషుమ్నయందు కుంభించి పిదప నడి నాళంబుచేత క్రమంబుగా పూరించుట ప్రాణాయామము. ఇట్లు బాలకౌమారయౌవన వృద్ధనిష్కలనెడు పేళ్లుగలప్రాతఃకాలము మధ్యాహ్నకాలము సాయంకాలము అర్ధ రాత్రకాలము వీనియందు ప్రతిదినమును ప్రతివేళను ఇరువదిమార్లు తప్పక ప్రాణాయామము చేయుచుండెనేని వాయువు స్థిరపడి వెనుక కేవలకుంభకమునకు మార్గమగును. ఈ ప్రాణాయామలక్షణము లనేకవిధములుగ నుండును గావున గురూపదేశమునఁ దెలిసికొనవలయును.

## ప్రత్యాహారలక్షణము.

వర్ణరూప ధ్వనిరూపములయిన సకలశబ్దములను వినుట, మృదువు కఠినము ఉష్ణము శీతము మొదలగు స్పర్శములను తెలిసికొనుట, పొట్టి పొడుగు లావు సన్నము నలుపు తెలుపు ఎఱుపు ఆకుపచ్చ మిశ్రములని పదివిధములయిన రూపములఁ జూచుట, ఉప్పు పులుసు కారము తీపు చేదు ఒగరు అనుషడ్రసములను ఎఱుఁగుట, సుగంధ దుర్గంధ మిశ్రగంధములను మూరుకొనుట, సుశబ్దములను అపశబ్దములను పలుకుట, ఇచ్చుట, పుచ్చుకొనుట, లోనగుపనులను జేయుట, నడుచుట, ఎగురుట, పరుగెత్తుట, మొదలగు పనులను గావించుట, మలవిసర్జనము చేయుట, సురతాదులచేత నానందించుట, సంశయించుట, నిశ్చయించుట, చంచలించుట, అభిమానించుట అనుగుణములనుండి శ్రోత్రము త్వక్కు చక్షువు జిహ్వ ఘ్రాణము వాక్కు హస్తము పాదము పాయువు గుహ్యము అనెడు పదునాలుగింద్రియములను త్రిప్పుట ప్రత్యాహారము.

## ధ్యానలక్షణము.

క. మానసకమలమునందున, శ్రీనారాయణునిమూర్తిఁ జింతించుచు లో
ధ్యానము సేయుట సగుణ,ధ్యానంబనియండ్రు సుజను లమలవివేకా.

సీ. కమలాసనస్థుఁడై కాయంబు నిక్కించి
కరము లూరులఁ జేర్చి కనులు మూసి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేహేంద్రియప్రాణధీమనసాదికమెల్ల
దృశ్యమే గాను దద్దృక్కు నేను
దృశ్యమేఁ గాను దద్దృక్కు నేననువృత్తి
దృశ్యంబ కానఁ దద్దృక్కు నేన
యని విజాతిప్రత్యయనివృత్తిగా సజా
తిప్రత్యయప్రవృత్తిక్రమమున
తే నాత్మ దానైనయందాఁక నయ్యశేష
దృశ్యదృగ్వృత్తులను నిషేధించుకొనుచు
ననిశ మాత్మావలోకన మందుచుంట
నిర్గుణధ్యాన మనఁ జెల్లు నిర్మలాత్మ.

తా. ధ్యానము సగుణధ్యానము నిర్గుణధ్యానము అని రెండువిధములు. అందు హృదయపద్మమందు తటస్థలక్షణస్వరూపుఁడయిన విరాట్పురుషుని నిలిపి మనస్సుచేత సమస్తవస్తువులను గల్పించి షోడశోపచారములను చేసి ధ్యానించుటయే సగుణధ్యానము. పద్మాసనంబుననుండి శరీరంబు నిక్కించి హస్తంబులను తొడలపై నుంచి నేత్రములు మూసి స్థూల సూక్ష్మ కారణశరీరములును పదునాలుగింద్రియంబులును దశవిధ ప్రాణంబులును దృశ్యములు. ఆ దేహేంద్రియప్రాణంబులు నేఁగాను. వీనిని వీక్షించు సాక్షిని. సాక్షిని నేననెడు వృత్తియును దృశ్యమే గనుక ఆవృత్తిని జూచు సాక్షిని అని మాయాకల్పితములై విజాతీయములగు యుష్మత్ప్రతీతిప్రత్యయగోచరాదులనెడు బహిర్దృశ్యములను, సజాతీయములగు అస్మత్ప్రతీతిప్రత్యయగోచరాదులనెడి యంతర్దృశ్యములను, ఆదృశ్యములకు సాక్షిననెడు వృత్తిని నిషేధించుచు సత్యజ్ఞానానంద నిర్మలాఖండస్వరూపమై సర్వదృక్కగు పరబ్రహ్మము తా ననెడు ధార్ఢ్యము గలుగుదాక ఎల్లప్పుడు నిర్వికల్ప బ్రహ్మనిష్ఠ గలిగియుండుటే నిర్గుణధ్యానము.

## ధారణాలక్షణము.

మూలాధారము స్వాధిష్ఠానము మణిపూరకము అనాహతము విశుద్ధము ఆజ్ఞేయము సహస్రారము అనెడు కమలములయందు వానికి నధిదేవతలైన గణపతి బ్రహ్మ విష్ణు రుద్ర ఈశ్వర సదాశివ గురుచరణములను అక్కడక్కడ ధ్యానించునపుడు మనస్సును నిలుపుటే ధారణాయోగము. ప్రత్యగాత్మనైన నేనే పరమాత్మను. ఆ పరమాత్మయే ప్రత్యగాత్మ అని నిష్ఠచేయుచుండుటే సమాధి అని ఈవిధముగ అభ్యాసయోగము ఎనిమిదంగములు కలిగియుండును. అది చిత్తపరిపాకము లేనివారికి తగినది: మిక్కిలి కష్టతరమైనది. ఈ అభ్యాసయోగమును సాధక చేసినవారికి . అణిమాద్యష్టసిద్ధి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్వర్యముల నిచ్చును. బ్రహ్మజ్ఞానమును వృద్ధిఁబొందించును. చిత్తపరిపాకము గలవారికి జీవేశ్వరైక్యజ్ఞానము నిచ్చును. అతి సులభమైన జ్ఞానయోగమే రాజయోగమని చెప్పఁబడును. ఈయభ్యాసయోగ జ్ఞానయోగసిద్ధికి శ్రీరాముని పాదారవిందములయందు భక్తి గలిగియుండుటే కారణము అని తాత్పర్యము. ఈ తాత్పర్యమం దుదాహరింపఁబడిన పద్యములు శుకచరిత్రము శివయోగసారములయందలివని యెఱుఁగవలయును.

అష్టైశ్వర్యములవివరణము.

సీ. అణుజంతువులయందు నణువై చరించుట
యణిమాహ్వయైశ్వర్య మలఘుచరిత
యబ్జజాండాదిమహత్త్వముం డై యుంట
మహిమాఖ్యభూతి నిర్మలవిచార
బ్రహ్మాండమునకంటె భారమై యుండుట
గరిమాఖ్యసంపత్తి కలుషదూర
యమరాద్రిసదృశుఁడై యతిసూక్ష్మగతి నుంట
లఘిమావిభూతి సల్లలితహృదయ
తే. వాంఛితార్థావలంబనావాప్తి ప్రాప్తి
గగనగమనాదిసిద్ధి ప్రాకామ్య మర్క
శశిముఖ నియామకత్వ మీశత్వ మఖిల
జీవవశ్యప్రవృత్తివశిత్వ మనఘ.

తా. అణుప్రమాణములైన ప్రాణులయందు పరమాణుప్రమాణుఁడై యుండుట అణిమ. బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివ విరాట్పురుషాండములకంటె పెద్దవాఁడై యుండుట మహిమ. బ్రహ్మాద్యండములకంటె భారమైయుండుట గరిమ. మేరు వంతటి బరువు గలిగియుండి దూది లేశమువలె తేలికయై యుండుట లఘిమ. ఇట్టి పదార్థములను లభింపఁజేసికొనుట ప్రాప్తి. గగనగమనాదిసిద్ధి ప్రాకామ్యము. సూర్య చంద్ర మహేంద్ర ఉపేంద్ర అగ్ని ప్రముఖ దేవతలను పనులలో నియమించుట యాశత్వము. సకల జంతువులను వశముచేసికొనుట వశిత్వము.

శా. ప్రత్యక్షోపగమంబుఁ బావనము నభ్యాసంబు గావింపఁగా
నత్యంతోరుసుఖంబు ధర్మ మతిగుహ్యం బుత్తమం బాద్యమౌ
సత్యం బాగమసిద్ధ మాదిమునిరాట్సంస్తుత్యము న్వేద్యమౌ
నిత్యానందము రాజయోగము మహానిర్వాణమార్గం బగున్. 87

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ప్రత్యక్షావగమంబు-ప్రత్యక్ష = ప్రత్యక్షముగాఁ గానవచ్చు ప్రపంచమును, (అనఁగా : ప్రపంచభ్రాంతిని,) అవగమంబు=నశింపఁజేయునదియు, పావనమును = పరిశుద్ధమైనదియునగు, అభ్యాసంబుఁ గావింపఁగాన్=అభ్యాసము నాచరించిన ట్లైన, అక్షయ్యం...ఖంబు-అత్యంత=నశింపని, ఉరు = అధికమైన, సుఖంబు = చిత్తశాంతిని గలిగించునదియు, ధర్మము=పుణ్యరూపమైనదియు, అతిగుహ్యంబు = మిగుల రహస్యమైనదియు, ఉత్తమంబు=శ్రేష్ఠమైనదియు, ఆద్యమును = అనాదిసిద్ధమైనదియు, సత్యంబు = శాశ్వతమైనదియు, ఆగమసిద్ధము-ఆగమ=కామికము మొదలగు నిరువదియెనిమిది యాగమంబులందును, సిద్ధము=ప్రసిద్ధమైనదియు, ఆది మునిరాట్సంస్తుత్యమును-ఆదిముని = పురాతనలగు సనకాది మహామునులకు, రాట్ = ప్రభువులైన (లేక, గురువులైన) దక్షిణామూర్తి మొదలగువారలచే, సంస్తుత్యమును=స్తోత్రము చేయఁదగినదియు, వేద్యమును= మోక్షేచ్ఛగలవారిచే నవశ్యము తెలియఁబడఁతగినదియు, నిత్యానందము-నిత్య = ఎడతెగని, ఆనందము = బ్రహ్మరూపమగు పరమానందము నొసంగునదియు, ఐన రాజయోగము = యోగములలో నుత్తమమగు జ్ఞానయోగము అయిన, మహానిర్వాణమార్గంబు=ప్రసిద్ధమగు మోక్షమార్గమై, అగున్=సిద్ధించును. (ఈ రాజయోగమే మోక్షమునకు చక్కని త్రోవ.)

తా. ఈజ్ఞానయోగమునకే రాజయోగమని పేరు. ఇది మిగులఁ బరిశుద్ధమైనది. మోక్షేచ్ఛ గలవారిచే నవశ్యముఁ దెలియఁదగినది. అనాదిసిద్ధమై దక్షిణామూర్తి హయగ్రీవుఁడు మొదలగు జగద్గురువులచే స్తోత్రపూర్వకముగా నాదరింపఁబడుచుండినది. వేదములలోను ఆగమములలోను ప్రసిద్ధమై "ఇదియే సర్వయోగములలో శ్రేష్ఠతమమైనది సత్యమైనది ఆనందస్వరూపమైనది" అని కొనియాడఁబడుచుండునది. రహస్యములలో నెల్ల రహస్యతమమైనది. దీని నభ్యాసము చేయఁగా అవిద్యాప్రభావమువలనఁ దనకంటె వేఱుగాఁ గానవచ్చు నీ ప్రపంచము నశించును. (తనకంటె నన్యముగాఁ గానరాదు.) నిరతిశయమగు బ్రహ్మానందము (తానే బ్రహ్మమని తెలిసికొనుటవలనఁ గలుగు నానందము) కలుగును. ఈ రాజయోగమే మోక్షమునకు మార్గమని తెలిసికొనుము.

ఆ. రాజగుహ్యమైనరాజయోగంబును
శ్రద్ధధాను లగుచు జనము లెల్ల
సంశ్రయింప లేక సంసారవనధిలో
మునుఁగుచుండుదురు విమూఢు లగుచు. 88

టీ. జనములెల్లన్ = మనుష్యులందఱును, శ్రద్ధధానులగుచు = శ్రద్ధగలవారలై రాజగుహ్యమైన=రహస్యములలో నెల్ల రహస్యమును, రాజయోగంబున్ = ఈజ్ఞానయో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మును, సంశ్రయింపలేక = ఆశ్రయింపక, విమూఢులగుచున్ = అజ్ఞానులై, సంసార వనధిలోన్=సంసారసముద్రమున మునుఁగుచుండుదురు.

తా. ఇట్లు పరమరహస్యమగు నీరాజయోగమును సద్గురువుల యనుగ్రహము వలన నెఱింగి శ్రద్ధావంతులై యభ్యాసముచేసి కడతేర నిచ్ఛయింపక సంసారసముద్ర మున మునుఁగుచుఁ దేలుచు బాధ నొందుచున్నారు. ఈయోగ మెంత సులభమైనను వారు దాని నాశ్రయింప లేకున్నారు. వారి యజ్ఞానమున కేమందము ?

క. ఈరాజయోగమార్గం, బీరేడుజగంబులందు నెవ్వ రెఱుఁగ రా
త్మారామలసదపాంగా, పారకృపాయుక్తులైనభక్తులు దక్కన్. 89

టీ. ఈరాజయోగమార్గంబు=ఈజ్ఞానయోగపద్ధతిని, ఈరేడు జగంబులందున్ = పదునాలుగు లోకంబులందును, ఆత్మా...క్తులు-ఆత్మారామ = సర్వాంతర్యామియగు శ్రీరామునియొక్క, లసత్=ప్రకాశించుచున్న, అపాంగ=కడగంటి చూపులయొక్క, (అపాంగశబ్దమునకు నేత్రాంతమనియే యర్థమైనను లక్షణావృత్తిచే కడగంటిచూపని యర్థము చెప్పఁబడెను.) కృపాయుక్తులు = దయతోఁగూడిన, ఐనభక్తులు, తక్కన్ = తప్ప, ఎవ్వరెఱుఁగరు=ఎవ్వరును తెలిసికొనలేరు.

తా. ఈరాజయోగ మెంతరహస్యమైన దైనను అంతర్యామిస్వరూపుఁ డగు నీ రామునియందు భక్తికలిగి యీతని దయారసమునకుఁ బాత్రులై యుండువారలకుఁ గరతలామలకంబుగఁ దెలియును. ఇతరు లెవ్వరు నట్లు ఎఱుంగలేరు. కావున ఈ యోగము సిద్ధించుటకు భక్తి ప్రధానము.

అవ. ఇట్లు రాజయోగమును సామాన్యముగాఁ బ్రశంసించి విశేషముగ వివరించు టకై మొట్టమొదలు దానిని విభాగించుచున్నాఁడు:—

తే. రాజయోగంబు ముక్తికి రాజపథము
రాజగుహ్యంబు పరమంబు రాజవిద్య
యదియు మూఁడువిధంబుల నలరుచుండు
సాంఖ్య తారక స దమనస్కము లనంగ. 90

టీ. రాజయోగంబు = ఈజ్ఞానయోగము, ముక్తికిన్ = మోక్షమునకు, రాజ పథము=రాజమార్గమువంటిది, రాజగుహ్యంబు = మిగులరహస్యమైనది, పరమంబు=శ్రేష్ఠ మైనది, రాజవిద్య=సకలవిద్యలలో నుత్తమమైనది. అదియున్=ఆ రాజయోగముకూడ, సాంఖ్య...ములు-సాంఖ్య=సాంఖ్యయోగము, తారక=తారకయోగము, సత్ = శ్రేష్ఠ మైన, అమనస్కములు = అమనస్కయోగము, అనఁగన్=అన, మూఁడువిధంబులన్= మూఁడు భేదములుకలదియై, అలరుచుండున్=ఒప్పుచుండును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఈరాజయోగమే మోక్షమునకు రాజమార్గము. అది రహస్యము. సర్వోత్తమము. విద్యలలో నెల్ల శ్రేష్ఠతమ మైనది. సాంఖ్యము, తారకము, అమనస్కము అను భేదములు కలిగి యీరాజయోగము మూఁడువిధములై యొప్పుచున్నది.

అవ. ఈపైఁజెప్పిన మూఁడింటిని అభ్యసించుటవలనఁ గలుగు ప్రయోజనము వివరించుచు, సహేతుకముగా తారకయోగమును వివరింప నుపక్రమించుచున్నాఁడు:—

తే. తారకంబు మనశ్శుద్ధికారకంబు
సాంఖ్య మాత్మస్వరూపవిచారకంబు
అనుభవజ్ఞాన మమనస్క మట్లు గాన
నాద్య మెఱిఁగింతు మొదల నీవవధరింపు. 91

టీ. తారకంబు = తారకయోగమనునది, మన...కంబు-మనః = మనస్సుయొక్క, శుద్ధి=శుద్ధిని, కారకంబు=చేయునది, సాంఖ్యము = సాంఖ్యయోగము, ఆత్మస్వరూపవిచారకంబు-ఆత్మస్వరూప=జీవస్వరూపమును (లేక బ్రహ్మస్వరూపమును), విచారకంబు=విచారించునట్టిది, అమనస్కము=అమనస్కయోగము, అనుభవజ్ఞానము=అపరోక్షానుభవజ్ఞానమును కలిగించునది, అట్లుగావునన్ =అట్లగుటచేత, మొదలన్ =మొట్టమొదట, ఆద్యము=మొట్టమొదటిదైన తారకయోగమును, ఎఱిఁగింతున్ = తెల్పెదను, నీవు, అవధరింపుము=వినుము.

తా. పైన వర్ణింపఁబడిన మూఁడింటిలోఁ దారకయోగమువలనఁ జిత్తశుద్ధి కలుగును. సాంఖ్యయోగమువలన నాత్మతత్త్వము తేటపడును. అమనస్కయోగమువలన నపరోక్షానుభవము కలుగును. అన్నిటికంటె మొదటఁ జిత్తశుద్ధి కావలయును గావున దానికి సాధన మగుతారకయోగమును మొట్టమొదట వివరించుచున్నాను.

అవ. తారకయోగమునం దభిరుచిఁ గలిగించుటకై యర్థవాదము నుపక్రమించుచున్నాఁడు:—

ఉ. తారక ముద్భవాంబునిధితారక మంబుజసంభవాదిబృం
దారకసన్నుతం బఘవిదారక మంచితరాగరోషసం
హారకముం బ్రథానపరిహారక మాత్మసుఖానుభూతివి
స్తారక మాగమాంతసువిచారకమై తనరారు మారుతీ. 92

టీ. మారుతీ=ఆంజనేయా! తారకము=తారకయోగము, ఉద్భ...మును-ఉద్భవ=జన్మమనియెడు (లేక సంసార మనియెడు), అంబునిధి=సముద్రమును, తారకము=తరింపఁజేయునది, అంబు...బును-అంబుజసంభవాది=బ్రహ్మ మొదలగు, బృందారక=దేవతలచేత, సన్నుతంబు=స్తోత్రము చేయఁబడునది, అఘ...మును-అఘ = పాపమును, విదా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రకమును = ధ్వంసముచేయునది, అంచిత...మును-అంచిత=ఒప్పుచున్న, రాగ = కామ
మును, రోష=ద్వేషమును, సంహారకమును=పోఁగొట్టునది, ప్రధా...మును-ప్రధాన=
మాయను, పరిహారకమును = ధ్వంసముచేయునదియు, ఆత్మ...మును-ఆత్మసుఖ = బ్రహ్మా
నందముయొక్క, అనుభూతి = అనుభవమును, విస్తారకమును, = విస్తరింపఁజేయునది,
ఆగ...కమై-ఆగమ = వేదములయొక్క, అంతః = కడపటిభాగ మగుజ్ఞానకాండమును
(లేక, అచ్చట చెప్పఁబడు బ్రహ్మమును), సువిచారకమై=బాగుగవిచారించునదియై, తన
రారున్=ఒప్పుచుండును.

తా. ఓఆంజనేయా! ఈతారకయోగము సంసారసముద్రమును తరింపఁజేయు
నది. సకలపాపములను ధ్వంసముఁ జేయునది. బ్రహ్మ విష్ణువు మొదలగుసకలదేవతల
చేతను గొనియాడఁబడునది. అజ్ఞానము హరించి రాగద్వేషములు నడంచి యాత్మజ్ఞాన
మును విస్తరింపఁ జేయునది. అతిసూక్ష్మమగు వేదాంతార్థమును కరతలామలకముఁ
జేయునది.

క. తారకయోగము దెలియఁగ, నేరక వేదాంతవాక్యనికురుంబముచే
నూరక వాదించుచుఁ జెడు, వారికి మోక్షంబుగలదె వాయుకుమారా!

టీ. వాయుకుమారా=ఆంజనేయా! తారకయోగముఁ=తారకయోగము, తెలి
యఁగనేరక=తెలిసికొనలేక, వేదాం...ముచేన్-వేదాంతవాక్య = వేదాంతవాక్యముల
యొక్క, నికురుంబముచేన్ సమూహముచేత, ఊరక=నిరర్థకముగా, వాదించుచున్
=వాదముచేయుచు, చెడువారికిన్ = చెడిపోవుచున్నవారికి, మోక్షంబు గలదె=ముక్తి
యున్నదా?

తా. ఓవాయుపుత్రా! ఇట్లు తారకయోగము మహోపకారముఁ జేయునదియై
యుండ దీనిని తెలిసికొని యభ్యసింపలేక ఊరక కొన్ని వేదాంతవాక్యముల నేర్చు
కొని వాదములఁ జేయుచుండిన మోక్షము దొరకునా?

తే. రాజయోగంబుఁ బూని నిరంతరంబు
పట్టుగా నభ్యసింపంగఁ బ్రాలుమాలి
కొన్ని వేదాంతయుక్తులు గూడఁబెట్టి
పలుక నేర్చిన బ్రహ్మానుభవము గలదె? 94

టీ. రాజయోగంబు = రాజయోగమును, పూని = అవలంబించి, నిరంతరంబు =
ఎల్లప్పుడును, పట్టుగాన్ = ఉత్సాహముతో, అభ్యసింపంగన్ = అలవాటుచేయుటకు,
ప్రాలుమాలి, కొన్నివేదాంతయుక్తులు, కూడఁబెట్టి, పలుకనేర్చినన్ = నిరర్థకముగా
వాదముసేయుటకు తెలిసినంతమాత్రముననే, బ్రహ్మానుభవము కలదె?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. అపరోక్షబ్రహ్మానుభవము (నేనే పరబ్రహ్మ మని యనుభవపూర్వకముగఁ దెలిసికొనుట.) మోక్షమని చెప్పఁబడును. పూనికతో నీరాజయోగమును అభ్యాసముఁ జేయుటకు ప్రాలుమాలి వేదాంతయుక్తులను మాత్రము కొన్నిటిని గూర్చికొని మాటలాడ నేర్చినవారికందఱకును బ్రహ్మానుభవము (మోక్షము) కలుగునా? ఓపికతోఁ బ్రయత్నించి కార్యమును నిర్వహించినయెడల ఫలము కలుగును గాని మాటలతోఁ గలుగునా? కావున నీతారకయోగమును అవశ్యముగా నభ్యసింపవలయును.

సీ. దారుణగాఢాంధకారం బడంగునే వసుధపైఁ గృతదీపవార్తవలన
నాఁకొన్నమనుజునియాఁకలి దీఱునే ఘనసరసాన్నవర్ణనమువలన
నెఱిపేదవానిపేదఱికంబు వోవునే ద్రవ్యప్రభావకీర్తనమువలన
రోగపీడితుని బల్రోగంబు దీఱునే కలితౌషధప్రసంగంబువలన

తే. జండిపడి బుద్ధి లోవెలి నిండి మిగుల
దట్టమైనట్టియజ్ఞానతమము దెగునె
తర్కితవిచిత్రశబ్దబోధంబువలన
ఫలితయోగానుభవదృష్టివలనఁ గాక. 95

టీ. వసుధపైన్ = భూమిమీఁద, కృత...లనన్-కృత = చేయఁబడిన, దీప = దీపములనుగూర్చిన, వార్తలవలనన్ = ప్రసంగమువలన (అనఁగా: దీపవృత్తాంతమును చెప్పఁగానే), దారు...బు-దారుణ = భయంకరమైన, గాఢ = దట్టమైన, అంధకారంబు = చీఁకటి, అడంగునే = పోవునా? ఘన...లనన్-ఘన = శ్రేష్ఠమగు, సరస = రుచిగల, అన్న = అన్నమును, వర్ణనమువలనన్ = వర్ణించుటవలన, ఆఁకొ...కలి-ఆఁకొన్న = ఆఁకలికొనిన, మనుజుని = మనుష్యునియొక్క, ఆఁకలి, తీఱునె = పోవునా? ద్రవ్య...లనన్-ద్రవ్య = ధనముయొక్క, ప్రభావ = సామర్థ్యమును, కీర్తనమువలనన్ = చెప్పుటవలన, నెఱి...కంబు-నెఱిపేదవాని = మిక్కిలి బీదయైనవాని, పేదఱికంబు = బీదతనము, పోవునే = పోవునా? కలి...లనన్-కలిత = ఒప్పుచున్న, ఔషధ = ఔషధములయొక్క, ప్రసంగంబువలనన్ = వృత్తాంతమువలన (అనఁగా: ఔషధములను గూర్చి మాట్లాడుటచేత), రోగ...బు-రోగపీడితుని = రోగముచే బాధపడుచున్నవానియొక్క, బల్రోగంబు = అధికమైనరోగము, తీఱునే = పోవునా? జండిపడి = మొండియై, బుద్ధి = బుద్ధియందు, లోన్ = లోపలను, వెలిన్ = వెలుపలను, నిండి = మిగులదట్టమై, ఐనట్టియజ్ఞానతమము = ఐన యజ్ఞాన మనియెడుచీఁకటి, ఫలి...గాక-ఫలిత = ఒప్పుచున్న, యోగ = రాజయోగముయొక్క, అనుభవ = అనుభవముయొక్క (లేక, అనుభవమువలనఁ గలిగినదృష్టివలనఁగాక జ్ఞానమువలనఁదప్ప), తర్కి...లనన్-తర్కిత = వివాదింపఁబడిన (లేక, వాదింపఁబడిన),

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విచిత్ర = నానావిధములగు, శబ్ద=శబ్దములయొక్క, బోధంబువలనన్ = జ్ఞానమువలన (అనఁగా: వేదాంతవాక్యములను విచారించుటవలన), తెగునె = నశించునా ? (నశింపదనుట.)

తా. ఏఫలమైనను కార్యమును నిర్వహించినప్పుడే సిద్ధించునుగాని మాటలవలన సిద్ధింపదు. దీపమును వెలిఁగింపక, "ఈదీపము లిట్టివి. ఆదీపము లట్టివి. వానిప్రకాశము మిగుల నధికమైనది." అని యూరక మాటలు చెప్పుచుండిన చీఁకటి నశించునా? భోజనముఁబెట్టక "ఆహారలు మిగుల రుచి గలవి. ఈపిండివంటలు మిగుల మనోహరములైనవి" అని యాహారపదార్థములను గూర్చి ప్రశంసఁ జేయుచుండిన నాఁకలి తీఱునా? ధనము నొసంగినచో పేదఱికము బోవునుగాని అట్లుగాక "ధన మున్న యెడల నెన్నియో మహాకార్యముల సాధింపవచ్చును." అని ధనముయొక్క మాహాత్మ్యముఁ గొనియాడినమాత్రమున దరిద్రులు ధనవంతులగుదురా? ఔషధములను గూర్చియు వానిశక్తులను గూర్చియుఁ బ్రశంసించిన రోగములు కుదురునా? ఏవియును మాటలవలనఁ గానేరవు. శ్రమ కోర్చి కార్యముల సాధింపవలయును. అనాదినుండియుం బుద్ధియందు వ్యాపించి స్థిరమై యేయుపాయముచేతఁ గూడ నశింపని యీయజ్ఞానాంధకారము గూడ పైఁజెప్పినట్లే మాటలతోఁ దీఱునదికాదు. చిత్రచిత్రము లగువాదములతోఁ దీఱునదికాదు. శ్రమ కోర్వవలయును. తారకయోగము నభ్యసింపవలయును. మనసును శబ్దాదివిషయములనుండి మరల్పవలయును. అపరోక్షబ్రహ్మజ్ఞానమును జెందవలయును.

## యోగాభ్యాసఫలనిరూపణము.

క. యోగాభ్యాసమువలనస,దాగతిచిత్తేంద్రియములదర్పములడఁగున్
రాగద్వేషాదులుచను,బాగుగ నాత్మకుసుఖానుభవముంగలుగున్.

టీ. యోగాభ్యాసమువలనన్ = ఈరాజయోగము నభ్యసించుటవలన, సదా... ములు-సదాగతి=ప్రాణవాయువు, చిత్త=మనస్సు, ఇంద్రియముల=జ్ఞానేంద్రియకర్మేంద్రియములయొక్క, దర్పములు=గర్వములు (అనఁగా: విక్షేపమును కలిగించునట్టి స్వభావములు), అడంగున్ = నశించును. రాగద్వేషాదులు = కామము క్రోధము మొదలగునవి, చనున్ = పోవును. బాగుగన్ = చక్కఁగా, ఆత్మకున్ = తనకు (లేక జీవునకు), సుఖానుభవమున్=బ్రహ్మానందానుభవము, కలుగున్.

తా. ఈతారకయోగము నభ్యసించినయెడల మొట్టమొదట ప్రాణవాయువు స్వాధీనమగును. వాయువునకును మనస్సునకును సంబంధ ముండుటచేత వాయుజయముతోఁగూడ మనోజయము కలుగును. ఇంద్రియముల కన్నిటికి మనసే ప్రభువు కావున

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వెంటనే యింద్రియజయముకూడఁ జేకూరును. ఇట్లన్నియుం జయింపఁబడెనేని సంసారమునకు ముఖ్యకారణము లగుకామక్రోధములు నశించి జీవునకు బ్రహ్మానందసుఖము కలుగును.

అవ. ఇట్లు తారకయోగమును బ్రశంసించి దానివలనఁ గలుగుఫలమును విస్తరించి చెప్పుచు దానిని వివరింప నుపక్రమించుచున్నాఁడు:—

వ. అట్లు గావున యోగాభ్యాసంబు ముముక్షువున కవశ్యకర్తవ్యం బట్లగుట తత్ప్రకారం బెఱింగించెద సావధానచిత్తుండ వై వినుము. 97

టీ. అట్లుగావునన్ = యోగాభ్యాసము మిగుల నుపయోగకారి యగుటచేత, యోగాభ్యాసంబు = రాజయోగాభ్యాసము, ముముక్షువునకున్ = మోక్షేచ్ఛగలవానికి (డు), అవశ్యకర్తవ్యంబు = ముఖ్యముగ చేయవలసినది, అట్లగుటన్, తత్ప్రకారంబుఁ ఆరాజయోగాభ్యాసవిధమును (లేక, తారకయోగాభ్యాసవిధమును), ఎఱింగించెదన్ = చెప్పెదను. సావధానచిత్తుండవై = శ్రద్ధగలవాఁడవై (లేక, ఏకాగ్రచిత్తుఁడవై), వినుము.

తా. ఇట్లు అభివృద్ధికి మిగుల నాధార మగుటచే మోక్షేచ్ఛగలవారందఱు నీతారకయోగము నభ్యసించి తీరవలయును. కావున దీనిస్వరూపమును వివరించెద వినుము.

## యోగాభ్యాసులకు ముఖ్యము లగునాహారాదినియమములు.

అవ. ఈక్రిందిరెండుపద్యములచే యోగాభ్యాసమునకుఁ దగినయధికారుల నిరూపించుచున్నాఁడు:—

చ. వనరుచు నేమియుం దిననివానికి మిక్కిలి వెక్కసంబుగాఁ
దిని యెగఁబోయువానికిని దీఱనినిద్దుర యెల్లప్రొద్దుఁ బై
కొనఁ బడియుండువానికిని గొంకక రేపగ లొక్కరీతి మే
ల్కొని వసియించువానికి నగోచరము ల్వర యోగలక్ష్యముల్. 98

టీ. వర...ములు-వర = శ్రేష్ఠములగు, యోగ = తారకయోగముయొక్క, లక్ష్యములు=గురులు, వనరుచున్ = కృచ్ఛ్రచాంద్రాయణాదులచే శరీరమును శోషింపఁ జేయుచు, ఏమియుం దిననివానికిన్ = కొంచెమైనను ఆహారమును తీసికొనని వానికి, మిక్కిలి వెక్కసంబుగాన్=అధికముగా, తిని, ఎగఁబోయువానికిన్ = నిట్టూర్పులు సిగుడ్చువానికిని, తీఱనినిద్దుర=ఎప్పటికిని ముగియనినిదుర, ఎల్లప్రొద్దున్ = అన్నికాలములయందును; పైకొనన్ = క్రమ్ముచుండఁగా, పడియుండువానికిన్ =శయనించియుండు వానికిని, గొంకక = సంశయింపక (లేక, అలయక), రేపగ లొక్కరీతిన్ = రాత్రిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బగ లొక్కటే విధముగా, మేల్కొని వసియించువానికిన్ = నిదురింపకయే యుండు వానికిని, అగోచరములు=గోచరములు కానేరవు (ఇట్టివా రాజయోగమును సాధింపలే రనుట).

తా. మితిలేక భోజనము సేయువాఁడును, బొత్తిగ భోజనము సేయక నుపవాసము చేయువాఁడును, ఎప్పుడు నిదురించుస్వభావముకలవాఁడును, బొత్తిగ నిదురయే లేనివాఁడును ఈయోగము నభ్యసింప నేరరు.

క. యుక్తాహారవిహారుఁడు, యుక్తస్వప్నావబోధుఁడురుకర్మములన్ [మై.
యుక్తవిచేష్టుం డగుఘున,యుక్తున కగుఁ బరమరాజయోగము సుఖ

టీ. యుక్తా...రుఁడు-యుక్త = మితమగు, ఆహార = ఆహారము, విహారుఁడు = సంచారము గలవాఁడును, యుక్త...ధుఁడు-యుక్త=మితమగు, స్వప్న=నిదురయు, అవబోధుఁడు = జాగ్రతయుఁ గలవాఁడును, ఉరు...లన్-ఉరు = అధికములగు, కర్మములన్ = పనులయందు, యుక్తవిచేష్టుఁడు = మితమగువృత్తిగలవాఁడు (అనఁగా: తన పనులను జేయుటలో మితముగ శ్రమపడువాఁడు), అగుఘునయుక్తునకున్ = అయిన యోగనిష్ఠునకు, పర...గము-పరమ = శ్రేష్ఠమగు, రాజయోగము = తారకయోగము (లేక, తారకసాంఖ్యామనస్కరూపమగురాజయోగము), సుఖమై = ఆనందరూపమై, అగున్=సిద్ధించును.

తా. మఱియేమనిన, యోగాభ్యాసము సేయువానికి ఆహారము, నిదురయు, విహారంబును పరిమితములై యుండవలయును. అంత యధికములుగాఁ గాని మిగుల స్వల్పములుగాని యుండరాదు. వాఁ డేపనిని జేసినను తగినంతశ్రమను తీసికొనవలయును; గాని అధికముగ నాయాసపడఁగూడదు. ఇట్లన్ని విషయములయందును మితి గలిగి యుండుపురుషునకు యోగము సులభముగ సిద్ధించును.

## యో గ మ ఠ ల క్ష ణ ము.

అవ. యోగము నాచరించునప్పు డుండవలయునియమముల నీక్రిందిరెండుపద్యములచేఁ జెప్పుచున్నాఁడు:—

సీ. వితతమై విజనమై విమలమై సుఖమై పొ
సంగువివిక్తదేశమ్మునందు
సమభూమియందు నిశ్చలముగా మిట్టపల్లములు గాకుండఁ బేలవముగాఁగ
వరుసఁ గుశాజినవస్త్రంబు లనువుగాఁ
బఱచి యొప్పుగ వానిపైఁ దిరముగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బూని పద్మాసనాసీనుఁడై యామీఁదఁ
  గాయమధ్యమమును గళము శిరముఁ
తే. జక్కఁగా నిక్కి దృక్కులు ముక్కు చక్కిఁ
  జిక్కఁ దక్కించి తక్కినదిక్కుఁ గనక
  మిక్కిలి దశేంద్రియంబుల స్రుక్కఁ జేసి
  ఫలితముగ యోగ మభ్యసింపంగ వలయు. 100

టీ. వితతమై = విశాలమై, విజనమై = సందడిలేనిదై, విమలమై = పరిశుద్ధమై, సుఖమై=ఈఁగలు దోమలు మొదలగువాని బాధలేక సౌఖ్యము గలుగునట్లు చేయునదియై, పొసంగు=ఉన్న, వివిక్త=ఏకాంతమగు, దేశమ్మునందుఁ=స్థలమునందు, సమభూమియందు, నిశ్చలముగాఁ=స్థిరముగా, మిట్టుపల్లములుగాకుండఁ = ఒకపార్శ్వమున ఎత్తుగను మఱియొకపార్శ్వమున తగ్గుగ నుండకుండునట్లును, పేలవముగాఁగఁ = మృదువుగానుండునట్లును, వరుసఁ = క్రమముగా, కుశా...బులు-కుశ = దర్భాసనము, అజిన=కృష్ణాజినము, వస్త్రంబులు=వస్త్రము (వీనిని), అనువుగాఁ = చక్కఁగా, పఱచి, ఒప్పుగఁ, వానిపైఁ=ఆదర్భాసనాదులమీఁద, తిరముగఁ=స్థిరముగా, పూని=యత్నముతో, పద్మా...నుఁడై-పద్మాసనా=పద్మాసనమునందు, ఆసీనుఁడై=కూర్చుండి, ఆమీఁదఁ =తరువాత, కాయమధ్యమముఁ=నడుమును, గళముఁ=కంఠమును, శిరముఁ=తలను, చక్కఁగా నిక్కి=వక్రత లేకుండ నిక్కి, దృక్కులు=చూపులను, ముక్కుచక్కిఁ= =ముక్కువైపునకు, చిక్కఁ=ప్రసరించునట్లు, తక్కించి = కూర్చి, తక్కినదిక్కుఁ గనక=రెండవవైపునుజూడక, దశేంద్రియంబులఁ = జ్ఞాన కర్మేంద్రియములఁబదింటిని, మిక్కిలి, స్రుక్కఁజేసి = అడంచి (అనఁగా: వానివిషయములనుగూర్చి పోనీక నిలిపి), ఫలితముగఁ=సిద్ధియగునటుల, యోగము = రాజయోగమును, అభ్యసింపంగవలయుఁ= అభ్యాసము చేయవలయును.

తా. విశాలముగాను, నిర్మలముగాను, జలశూన్యముగాను, ఈఁగలు, దోమలు మొదలగు వానిబాధ లేనిదిగాను ప్రకాశించుచుండు రహస్యస్థలము నొకదానిని యోగాభ్యాసస్థలముగా నేర్పఱచుకొనవలయును. ఆప్రదేశము సమభూమియై యుండవలయును. అందుఁ గ్రమముగ దర్భాసనకృష్ణాజినవస్త్రముల నొకదానిపై నొకదానిఁ బఱచి యీయాసనమును సమముగ నమరింపవలయును. దానిపైఁ గూర్చుండి యోగాభ్యాసమున కారంభించునప్పుడు నడుము, మెడ, శిరస్సు అను వానిని జక్కఁగనిలిపి తన దృష్టులను నాసాగ్రమునందుఁ జేర్చి రెండవవైపునకు జరుపక నిలువవలయును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ. యతధీచిత్తమరుద్దశేంద్రియతనువ్యాపారుఁడై మౌనియై
హతకామాదివికారుఁడై గతభయుండై బ్రహ్మచారివ్రత
స్థితుఁడై శాంతమనస్కుఁడై స్వగురుమూర్తిప్రోక్తలక్ష్యార్థసం
గతి యామద్వయ మభ్యసింపఁ దగుయోగం బంచితోద్యోగుఁడై.

టీ. యత...రుఁడై - యత = నియమింపఁబడిన, ధీ = బుద్ధి, చిత్త = మనస్సు, మరుత్ = ప్రాణము, దశేంద్రియ = జ్ఞానేంద్రియకర్మేంద్రియములు తను = శరీరము, (వీనియొక్క,) వ్యాపారుఁడై = వృత్తులుగలవాఁడై, మౌనియై = మౌనముగలవాఁడై, హత...రుఁడై-హత=పోఁగొట్టఁబడిన, కామ=కామము, ఆది=మొదలగు, వికారుఁడై= వికారములుగలవాఁడై (కామక్రోధాదులను జయించి అనుట.), గతభయుండై=అధ్యాత్మికము మొదలగు తాపములవలనఁ గలుగు భయములేనివాఁడై, బ్రహ్మచారివ్రతస్థితుఁడై, బ్రహ్మచర్యవ్రతమును బూనినవాఁడై, శాంతమనస్కుఁడై=చిత్తశాంతిగలవాఁడై, స్వగు ...గతిన్-స్వగురుమూర్తి=తనకు గురువగుమహాత్మునిచే, ప్రోక్తం = ఉపదేశింపఁబడిన, లక్ష్య=గుఱియొక్క, అర్థ = విషయముతో (అనఁగా: తనగురువు తన్ను ధ్యానింపుమని చెప్పిన విషయముతో), సంగతిన్ = సంబంధము గలుగునట్లుగా, యోగంబు = ఆతారక యోగమును, అంచి...గుఁడై-అంచిత = ఒప్పుచున్న, ఉద్యోగుఁడై=ప్రయత్నముఁగల వాఁడై, యామద్వయము=రెండుజాములకాలము, అభ్యసింపఁదగున్.

తా. ఇట్లు మిగులనియమము గలిగి బుద్ధి (నిశ్చయించునంతఃకరణము), చిత్తము (సంశయించునంతఃకరణము), ప్రాణవాయువు, దశేంద్రియములు అనువానివృత్తుల నడంచి దానిమూలమున శరీరచాంచల్యమును నిలిపి మౌనవ్రతమును బూని కామక్రోధాది వికారములఁ దొలఁగించి చిత్తశాంతి గల్గి నిర్భయుఁడై బ్రహ్మచర్యమును బూని తనకు గురు వుపదేశించినలక్ష్యముపైఁ జిత్తమును నిలిపి రెండుజాములకాలము పూనికతో యోగాభ్యాసము నాచరింపవలయును.

క. మారుతి యీనియమంబులు
తారకసాంఖ్యామనస్కతత్పరులకు సా
ధారణము లగుచు వెలయుం
దారకయోగుల కతిప్రధానము లందున్. 102

టీ. మారుతి=ఆంజనేయా! ఈనియమంబులు = పైఁజెప్పఁబడిన అధికారిదేశము మొదలగునియమములు, తారకసాంఖ్యామనస్కతత్పరులకున్=తారక, సాంఖ్య, అమనస్కము లనుమూఁడువిధములగు రాజయోగము నాచరించువారలకుఁ గూడ, సాధారణములగుచున్=సమానములై, వెలయున్ = ఒప్పుచున్నవి. (తారక సాంఖ్యామనస్కములలో దేని నాచరించినను పైనియమముల నవలంబింపవలసినదే యనుట.) అందున్=

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆమూఁడువిధము లగుయోగముల నాచరించువారలలో, తారకయోగులకున్ = తారక యోగము నాచరించువారలకు, అతిప్రధానములు=మిగుల నావశ్యకములు (వారీనియమ ముల తప్పక నవలంబింపవలయు ననుట).

తా. ఓీఆంజనేయా! పైనఁ జెప్పియున్న ఆహారదేశకాలాదినియమములు తారక యోగము నభ్యసించువారలకుఁ గాని, సాంఖ్యయోగము నభ్యసించువారలకుఁగాని, అమ నస్కయోగము నభ్యసించువారలకుఁగాని యావశ్యకములే. ఇతరులవిషయ మెట్లున్నను తారకయోగము నభ్యసించువారుమాత్రము వీని నవశ్య మాదరింపవలయును.

## పంచముద్రాలక్షణము.

అవ. ఇట్లు నియమవిభాగమును జెప్పి తారకయోగమును వర్ణించువాఁడై మొట్ట మొదట నాదబిందుకళాసాక్షాత్కారమునకు ననుకూలము లగుటచేత యోగాంగములలో ప్రధానములని చెప్పఁదగినముద్రల నుద్దేశపూర్వకముగా వివరించుచున్నాఁడు.—

క. వరుసన్ ఖేచరి యన భూ,చరి యన మధ్యమయనంగ షణ్ముఖియనఁగా
వరశాంభవి యనఁ గల వీ, ధరలోపల ముద్రలైదు తారకమునకున్.

టీ. ఈధరలోపలన్=ఈభూమియందు, తారకమునకున్=తారకయోగమునకు, వరుసన్ = క్రమముగా, ఖేచరియనన్ = ఖేచరియనియు, భూచరియనన్ = భూచరి యనియు, మధ్యమయనఁగన్=మధ్యమయనియు, షణ్ముఖియనఁగాన్=షణ్ముఖియనియు, వరశాంభవి యనన్-వర=శ్రేష్ఠమగు, శాంభవియనన్=శాంభవియనియు, ముద్రలైదు= అయిదుముద్రలు (కలవు). (ఖేచరిమొదలగు నైదింటికిని ముద్రలని పేరు. వీనిలక్షణ ములు క్రమక్రమముగఁ జెప్పఁబడును.)

తా. తారకయోగ మనఁగా, నాదము బిందువు కళ అనువానిని ప్రత్యక్షముగ ననుభవించి పిదప వానికి లయస్థానమగు పరబ్రహ్మమునం దైక్యమగుటయే. ఈనాదబిందు కళలు సాధారణములైనయింద్రియవ్యాపారమునకు గోచరము లగునవి కావు; కావున వాని ననుభవించుటకై యనుకూలము లగునట్లు యింద్రియమనస్సుల నంతర్ముఖములఁ జేయుటకు ముద్రయనిపేరు. ఈముద్రలైదువిధములు. 1 ఖేచరి, 2 భూచరి, 3 మధ్యమ, 4 షణ్ముఖి, 5 శాంభవి యనునవి.

ఆ. సద్గురూపదేశసరణిచే నీయైదు
ముద్రలను విశేషముగ నెఱింగి
యభ్యసింపవలయు నటమీఁదఁ దారకం
బొందుఁ బ్రణవనాదబిందుకళల. 104

టీ. సద్గు... చేన్-సత్=శ్రేష్ఠుఁడగు, గురు=గురువుయొక్క, ఉపదేశసరణిచేన్= ఉపదేశమార్గముచేత (గురు వుపదేశించినట్లు), ఈయైదుముద్రలను = పైఁ జెప్పఁబడిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యయిదుముద్రలను, విశేషముగన్ =చక్కఁగా, ఎఱింగి= తెలిసికొని, అభ్యసింపవలయున్ =అభ్యాసము చేయవలయును. అటమీఁదన్ =ఇట్లభ్యాసము చేసినపిదప, ప్రణ... కలన్ -ప్రణవ=ఓంకారరూపములైన, నాద = దశవిధనాదముల యొక్కయు, బిందు= జ్ఞాత (సర్వమును తెలిసికొనుచుండునంతర్యామి), మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము (ఈనాలిగింటికిని అంతఃకరణమని పేరు.) వీనియొక్కయు, కళలన్ =సమష్టిజీవుఁడు(సర్వ ప్రపంచము నభిమానించుచు నవిద్యచే నావరింపఁబడియుండుచైతన్యము.) వ్యష్టిజీవుఁడు (తానున్నయొక్కశరీరమును మాత్రమే యభిమానించుచుండు జీవుఁడు.) వీరి యథార్థ స్వరూపములయొక్కయుం మూలమునన(అనఁగా: ఈనాదబిందుకళలను పరిశోధించుటచేత), తారకంబు=ఓంకారమున కర్థమగు శుద్ధపరబ్రహ్మము (లేక, పరబ్రహ్మమును), పొందున్ =చెందును. (సాధకుఁడే బ్రహ్మమగును, లేక బ్రహ్మసాక్షాత్కారము గలుగును అనుట.)

తా. గురూపదేశముచే నీయైదుముద్రలయొక్క స్వరూపమును బాగుగఁ దెలిసికొని యభ్యసింపవలయును. యోగమున కివియే ముఖ్యాంగములు. ఇట్లు అభ్యాసము చేసినయెడల మొట్టమొదట నాదబిందుకళలు గోచరములగును. వానిని విమర్శింపఁగా విమర్శింపఁగా పరబ్రహ్మము శేషించును. తనకును బ్రహ్మమునకును భేదము లేదనువిషయము స్పష్టమగును. శ్రద్ధాయుక్తుఁడై యీముద్రలలో నొక్కదాని నభ్యసించినను ఈఫలము కలుగుటలో సంశయము లేదు.

వ. అది యెట్లంటేని. 105

టీ. అదియెట్లంటేని=ఆబ్రహ్మప్రాప్తి యెట్లు కలుగు ననఁగా.

ఆ. కనులు మూసి యైనఁ గనువిచ్చి యైన భ్రూ
మధ్యమమునఁ జూపు మలఁచి నిలిపి
యూర్ధ్వముఖము గాఁగ నొనరఁ జూచిన నది
ఖేచరి యనుముద్ర కీశవర్య. 106

టీ. కీశవర్య=వానరశ్రేష్ఠుఁడవగు నోయాంజనేయా! కనులు మూసి యైనన్ , కనువిచ్చియైనన్ = బాగుగ కనులఁదెఱచికాని, భ్రూమధ్యమమునన్ = కనుబొమలనడిమి భాగమునందు, చూపున్ =దృష్టిని, మలఁచి=మరలించి (సామాన్యముగ నన్నివైపులకును ప్రసరించుదృష్టిని భ్రూమధ్యవైపునకుఁ ద్రిప్పి), నిలిపి=స్థిరముఁజేసి, ఊర్ధ్వముఖముగన్ =పైఁగా, ఒనరన్ =లెస్సగా, చూచినన్ =చూచినట్టయిన, అది=ఆచూపు, ఖేచరియను ముద్ర=ఖేచరిముద్ర (అగున్ ).

తా. కనులను సంపూర్ణముగా మూసికొనికాని బాగుగఁ దెఱచికొనికాని బొమల నడిమిభాగమున దృష్టినిలిపి పైభాగమునకుఁ జూచుట ఖేచరీముద్ర యని చెప్పఁబడును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దృష్టి భ్రూమధ్యమునకుఁ బ్రసరించుటయే కష్టము. కనులు తెఱచియున్నప్పు డొకవేళ ప్రసరించినను ప్రసరింపవచ్చునుగాని, మూసియున్నప్పు డెట్లు ప్రసరించును? అని సంశయించెదవేమో! బాహ్యదృష్టివిషయమున నిట్టిసంశయము కలుగవచ్చును కాని యంతర్దృష్టివిషయమునఁ గాదు. కనులు మూసి భ్రూమధ్యము జూచుట యనఁగా చూచుచున్నామని సంకల్పించుటయే కాని మఱి యేమియు కాదని తెలిసికొనవలయును.

క. లోచనములు గదలింపక, యాచార్యోక్తస్వనాసికాగ్రం బెపుడున్
గోచరముగఁ జూచిననది, భూచరియనుముద్రయగును బోధశరణ్యా.

టీ. బోధశరణ్యా-బోధ=జ్ఞానమే, శరణ్యా=రక్షకముగాఁ గలయోయాంజనేయా! (బ్రహ్మజ్ఞానమును గోరుచున్న హనుమంతుఁడా) లోచనములు = కన్నులను, కదలింపక= చలింపఁజేయక (రెప్ప లార్పక దృష్టినిఁ జెదరనీక), ఆచా...గ్రంబున్-ఆచార్యోక్త= గురువుచే నుపదేశింపఁబడిన, స్వనాసికాగ్రంబున్ = తనముక్కుకొనను, ఎపుడున్ = యోగాభ్యాసము చేయునంత కాలము, గోచరముగన్=కనఁబడునట్లుగా, చూచిన్= చూచినట్లయిన, అది=ఆచూపు, భూచరియనుముద్ర=భూచరియనెడుముద్ర, అగున్.

తా. ఓవివేకవంతుఁడా! కనులు కదలనీక ముక్కుకొనపై దృష్టిని నిలిపి చూచునట్టిముద్రకు భూచరిముద్ర యని పేరు.

ఆ. కనులు సగము మూసి ఘననాసికామధ్య
సీమయందుఁ జూపుఁ జెదరనీక
నిలిపి మీఁద నున్ననిటలంబు గాంచిన
మధ్యలక్ష్య మగుఁ గుమారతిలక! 108

టీ. కుమారతిలక=పుత్త్రరత్నమా! (సీతాదేవిచే హనుమంతుఁడు పుత్త్రునివలె బ్రేమింపఁబడుచుండుఁ గావున నిట్లు సంబోధింపఁబడియెను.) కనులు సగముమూసి=కన్నులను సగభాగము మూసి సగము తెఱచి, ఘన...దున్-ఘన=గొప్పదియగు, నాసికా= ముక్కుయొక్క, మధ్యసీమయందున్=నడుమ, చూపున్=దృష్టిని, చెదరనీక, నిలిపి, మీఁదనున్న=పైభాగమునందున్న, నిటలంబున్=భ్రూమధ్యమును, కాంచినన్=చూచినట్టయిన, మధ్యలక్ష్యమగున్=మధ్యమాముద్ర యగును.

తా. ఓ పుత్త్రరత్నమా! అట్లే కనులను సగము మూసి సగము తెఱచి ముక్కుయొక్క నడిమిభాగమునందు దృష్టిని నిలుపవలయును. అచ్చటనుండి పైభాగముననున్న భ్రూమధ్యమును గాంచవలయును. ఇట్లు చూచుటకు మధ్యమాముద్ర యని పేరు.

తే. కర్ణలోచననాసాయుగంబు మూసి
మలఁచి భ్రూమధ్యమునఁ జూపులను నిలిపి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిలిపి వరనాదబిందుచిత్కళలఁ గనుట
షణ్ముఖీముద్ర యండ్రు సజ్జనులు వత్స! 109

టీ. వత్స=కుమారా! సజ్జనులు = సత్పురుషులు, కర్ణ...గంబుల్-కర్ణ = చెవుల యొక్కయు, లోచన = నేత్రములయొక్కయు, నాసా = ముక్కులయొక్కయు, యుగంబుల్=జతలను, మూసి, మలఁచి=త్రిప్పి, భ్రూమధ్యమమునన్ = కనుబొమల నడుమ, చూపులను=దృష్టులను, మనము=మనస్సును, నిలిపి, వరనాదబిందుచిత్కళలన్ = శ్రేష్ఠములగు నాదబిందుకళల, కనుట = చూచుట, షణ్ముఖీముద్ర యండ్రు=షణ్ముఖీ ముద్రయని చెప్పుదురు.

తా. పుత్త్రకా! చెవులను గన్నులను ముక్కులను మూసి దృష్టిని మనసుతోఁ గూడ భ్రూమధ్యమునందు స్థిరముగ నిలిపి నాదబిందుకళల ననుభవించుటకు షణ్ముఖీ ముద్రయని పేరు. ఈముద్రయందే కాదు. అన్నిముద్రలయందును గూడ దృష్టి యే యేస్థలమునం దుండునో మనసుకూడ నాయాస్థలమునందే యుండవలయు ననుట నియమము.

క. అంతర్లక్ష్యము బహిరత్యంతవినిశ్చలసుదృష్టి యపగతపవన
స్వాంతవికారముగలయది,వింతయగుచునొప్పుశాంభవీముద్రయనన్.

టీ. అంతర్లక్ష్యము-అంతః=లోపల, లక్ష్యము=గుఱియు (అనఁగా: కనులు సంపూర్ణముగ మూసి మనసును, చూపును, నాదబిందుకళలయం దుంచుట. మనసు భావించుచున్న లక్ష్యమునందే చూపుకూడ నున్నట్లు తలంచుట, అనఁగా: తా నాలక్ష్యమును చూచుచున్నట్లు తలంచుట.), బహి...దృష్టి-బహిః=వెలుపల, అత్యంత=మిగుల, వినిశ్చల=చలింపని,సుదృష్టి=చక్కనిరూపును (బాహ్యమునందున్న పదార్థములలో నేదియో యొకదానిని ఱెప్ప వేయక చూచుచు మనసునుకూడ నచ్చటనే నిలుపుట. ఇది వెలిచూపనఁబడును. ఇంతకుముందు వివరింపఁబడియున్నది లోచూపు), అప...రము-అపగత= నశించిన, పవన=ప్రాణవాయువుయొక్కయు, స్వాంత=మనస్సుయొక్కయు, వికారము= వికారములను (నిశ్చలమగు ప్రాణవాయువు నిశ్చలమగు మనస్సు), కలయది = కలిగి యుండునది (లోచూపుగాని వెలిచూపుగాని స్వరూపముగాఁ గలిగి వాయువికారము లను వానితోఁగూడ చిత్తవికారములను ధ్వంసము చేయునది.), వింతయగుచున్ = ఆశ్చర్యకరమైనదగుచు, శాంభవీముద్రయనన్ = శాంభవీముద్రయను పేరు, ఒప్పున్ = ప్రకాశించును.

తా. ఒకపదార్థమునందు దృష్టినిలుపుట యనునియమము లేక కేవలము వెలుపలికిఁగాని లోపలికిఁగాని చూచుచు (వెలుపలికి చూచుట యనఁగా కనులు తెఱచి చూచుట, లోపలికి చూచుట యనఁగా కనులు మూసి చూచుట, మూసి చూచుట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యనుట కర్థము నిదివఱకే వివరించియున్నాము.) మనసు స్థిరము చేసి ప్రాణాయామాభ్యాసమువలన వాయువును బంధించి నాదబిందుకళల ననుభవింపవలయును. ఇట్టిచూపులకు శాంభవీముద్ర యని పేరు. వాయునిరోధము కూడ నీ శాంభవీముద్రయందు మాత్రమేకాక నన్నిముద్రలయందు నావశ్యకమే యని తెలిసికొనవలయును.

## సూర్యచంద్రమండల కళానిర్ణయము.

అవ. ఇట్లు పంచముద్రలయొక్క స్వరూపమును వివరించి యిదివఱకు సంక్షేపముగాఁ జెప్పఁబడియున్న ముద్రాభ్యాసఫలమును వివరించుచున్నాఁడు.—

మ. అమరేంద్రార్చితపూర్వవర్ణితనితాంతాంతర్బహిర్మధ్యల
  క్ష్యము లుద్యద్వరమండలత్రయకళాసందర్శనాభ్యాసయో
  గము లీ రెండును నాదబిందురుచిసాక్షాత్కారసద్ధేతుభూ
  తము లై యొప్పు నిరంతరం బలఘుతన్ ధ్యానంబు గావించినన్.

టీ. అమ...ములు-అమరేంద్రార్చిత = దేవేంద్రునిచేఁ బూజింపఁబడునట్టియు, పూర్వ = ఇంతకుముందు, వర్ణిత = వర్ణింపఁబడిన, నితాంత = అధికములైన, అంతః = లోచూపు, బహిః = వెలిచూపు, మధ్యలక్ష్యములు = నడిమిచూపు, ఈయవియు (అంతర్బహిర్మధ్యలక్ష్యరూపములైన పంచముద్రలును.), ఉద్య...ములు - ఉద్యత్ = ప్రకాశించుచున్న, వర=శ్రేష్ఠములైన, మండలత్రయ = సూర్యచంద్రాగ్నిమండలములయొక్క, కళ=చిత్కళలను, (ఈచిత్కళలు ౩౮. శ్లో. "ధూమ్రార్చి రుష్టా (?) జ్వలినీ విస్ఫులింగినీ, సుశ్రీస్వరూపా కపిలా హవ్యకవ్యవహా దశ" ఇవి పదియు నగ్నికళలు. శ్లో. "తపినీ తాపినీ ధూమ్రా మరీచి ర్జ్వాలినీ రుచిః, సుషుమ్నా భోగదా విశ్వా బోధినీ ధారిణీ క్షమా" ఇవి ౧౨ ను సూర్యకళలు. శ్లో. "అమృతా మానదా పూషా తుష్టిః పుష్టీ రతి ర్ధృతిః, శశినీ చంద్రికా కాంతి ర్జ్యోత్స్నా శ్రీః ప్రీతి రంగదా, పూర్ణా పూర్ణామృతా కామదాయిన్యః స్వరజాః కలాః" ఈ ౧౬ చంద్రకళలు. వీనిలక్షణములను త్రిపురార్ణవాదిగ్రంథములలో చూచుకొనవలయును.) సందర్శన = చూచుటకు కారణములైన అభ్యాసయోగములు = ఇంతకుముందు వివరింపఁబడియున్న యమనియమాదులును, ఈ రెండును=ముద్రలు యమనియమాదులు నను నీరెంటిని, నిరంతరంబు=సర్వకాలము, అలఘుతన్ = అధికముగా, ధ్యానంబు గావించినన్ = ధ్యానించినట్లయిన (అనఁగా: అభ్యసించిన), నాద...ములై-నాద = దశవిధనాదములయొక్కయు, బిందు = అంతఃకరణముయొక్కయు, రుచి = అంతఃకరణమునుండి ప్రతిఫలించి యున్న యాత్మచైతన్యముయొక్కయు, సాక్షాత్కార=చూపునకు (వానిని బ్రత్యక్షముఁ జేసికొనుటకు), సత్ = చక్కని, హేతుభూతములై=కారణములై, యొప్పు = ప్రకాశించును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. దేవతలచేతఁ గూడ వినుతింపఁ దగిన యోయాంజనేయా ! పై వివరింపఁబడిన ముద్రలలో ఖేచరి, శాంభవి, షణ్ముఖి అనునవి అంతర్లక్ష్యము (లోపలిచూపు కలవి). భూచరియును శాంభవియును బహిర్లక్ష్యములు (వెలుపల చూపుకలవి). మధ్యము మధ్య లక్ష్యము. (మధ్యలక్ష్య మనఁగా : సంపూర్ణ మగు వెలిచూపు గాక సంపూర్ణ మగు లోచూపు గాక నుండుమధ్యస్థమైన చూపు కలది.) ఇంతకుఁ బూర్వమే వివరింపఁబడి యున్న యమ నియమాదులు మనసును పరిశుద్ధము చేయఁగలిగినవి. మనసు పరిశుద్ధ మైననే కాని స్థిరమై సూర్యచంద్రఅగ్నిమండలములయందలి ముప్పదియెనిమిదిచిత్కళ లను జూడనేరదు. కావున మనశ్శుద్ధికై ప్రయత్నించుతారకయోగికి సూక్ష్మపదార్థములఁ జూచుటకై ముద్ర లెట్లావశ్యకములో అట్లే సూక్ష్మపదార్థములఁ జూచునప్పుడు మన స్సును నిశ్చలముగఁ జేయుటకై యమనియమాదిరూప మగునభ్యాసయోగము కూడ ముఖ్యమే. ఈరెంటిని శ్రద్ధాయుక్తుఁడై యలవాటు చేసినయెడల శీఘ్రకాలమున నాద బిందుకళాసాక్షాత్కారము కలుగును.

ఆ. నాదబిందుకళల నయమొప్పఁ జూచుచు
నింద్రియముల మనము నివుఱఁ జేసి
సత్కవీశ్వరుండు స్వప్రకాశాత్మచి
త్సుఖముఁ గాంచుఁ బరమసులభముగను. 112

టీ. సత్క....రుండు-సత్ =శ్రేష్ఠుఁడైన, కవీశ్వరుండు = విద్వాంసుఁడు (జ్ఞాని), ఇంద్రియములన్ = దశేంద్రియములను, మనమున్ = మనస్సును, ఇవుఱఁజేసి=నిశ్చల ములుగఁజేసి, నాదబిందుకళలన్ = నాదబిందుకళలను, నయమొప్పన్ = బాగుగ, చూచుచున్, స్వప్ర...మున్ - స్వప్రకాశ = స్వయంప్రకాశుఁడైన, ఆత్మ = జీవుని యొక్క, చిత్సుఖమున్=బ్రహ్మానందమును (జీవబ్రహ్మము లొక్కటియే యని తెలిసి కొనుటవలనఁ గలుగు నానందము), పరమసులభముగన్=మిగులసులభముగా, కాంచున్= చూచును.

తా. ఇట్లు నాదబిందుకళాసాక్షాత్కారము కలుగఁగానే మనసు అచ్చటిచిత్ర ములఁ జూచుచు, చూచుచు నితరవ్యాపారముల మాని యందే లీనమైపోవును. సాధకుఁ డగుజీవుఁడు వాస్తవముగ పరబ్రహ్మమునకంటె వేఱుకాకపోవుటచేతను అజ్ఞానముచే నావరింపఁబడియున్న మన సొక్కటియే భేదభ్రాంతికిఁ గారణ మగుటచేతను (ఆయోగి) అప్రయత్నముగనే పరబ్రహ్మమునందు లీనుఁ డగును.

చ. లలితనినాదబిందుకళలన్ గుఱిఁ జేసిన మానసేంద్రియం
బులు వెలిలోపలం దిరుగఁబోవక వానిని జూచుచుండ ని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్చల మగుదేహ మయ్యెడ విచారముచేఁ బరమాత్మతత్త్వముఁ
సులభముగా నెఱుంగఁబడు సుమ్మిది చక్కనిత్రోవ యారయన్.

టీ. లలిత...కళల్-లలిత = ఒప్పుచున్న, నినాద = దశవిధప్రణవనాదములను, బిందు = అంతఃకరణమును, కళల్ = చిత్కళలను, గుఱిఁజేసినన్ = లక్ష్యములుగాఁ జేసినచో (ముద్రలసహాయమున ఆ నాదబిందుకళలనే చూచుచుండినచో), మాన...బులు-మానస = మనస్సు, ఇంద్రియంబులు = దశేంద్రియములు, వెలిలోపలన్ = వెలుపలికిఁగాని లోపలికిఁగాని, తిరుగఁబోవక = సంచారముచేయఁబోక (బాహ్యము లగు శబ్దాదులనుగాని, అంతరములగు ప్రాణాదులనుగాని చూడక), వానిని = ఆనాదబిందుకళలనే, చూచుచుండన్=చూచుచునుండఁగా, అయ్యెడన్ = ఆసమయమున, దేహము, నిశ్చలమగున్ = చలింపనేరదు. విచారముచేన్ = బాగుగ విచారించి, పరమాత్మతత్త్వమున్ = పరమాత్మయొక్క యథార్థస్వరూపము, సులభముగాన్, ఎఱుంగఁబడు సుమ్ము=తెలిసికోనఁబడును సుమా!, ఆరయన్=విచారింపఁగా, ఇది = ఈ వర్ణింపఁబడినది, చక్కనిత్రోవ = మంచిమార్గము.

తా. నాదబిందుకళలను గుఱిఁజేసి చూచినయెడల మనసుగాని యింద్రియములుగాని లోపలను వెలుపలను సంచరింపక నా నాదబిందుకళలనే చూచుచు నిలిచియుండును. అప్పుడు శరీర మించుకయైనను చలింపదు. బాహ్యము లగుశీతోష్ణాదులవలనఁ గలుగు దుఃఖములుగాని ఆంతరము లగుమనోవ్యాధులు మొదలగువానివలనఁ గలుగు దుఃఖములుగాని ఆయోగిని బాధింపనేరవు. కావున మనస్సు నీవిధముగా నిశ్చలముచేసి శాస్త్రసహాయము చేతను గురూపదేశముచేతను స్వబుద్ధిచేతను పరమాత్మస్వరూపమును గూర్చి విచారించినయెడల నది స్పష్టమగును. జీవబ్రహ్మము లొక్కటియే యనువిషయము అనుభవపూర్వకముగ గోచర మగును. ముక్తి కలుగును. కావున నీ రాజయోగమునకంటె చక్కని ముక్తిమార్గము మఱేమియును లేదు.

అవ. అట్లు ఫలములతోఁగూడ యోగాభ్యాసప్రకారమును నిరూపించి దానియం దభిరుచి కలిగించుటకై యర్థవాదము నుపక్రమించుచున్నాఁడు:—

ఆ. నాదబిందుకళల నాదరింపనియోగి
యింద్రియములు మనము నిట్టునట్టుఁ
బరువు లిడఁగ వానిఁ బట్టఁ జాలక కుందు
నిట్టివాఁడు పరము నెట్టు గాంచు. 114

టీ. నాదబిందుకళలన్ = నాదబిందుకళలను, ఆదరింపనియోగి = అంగీకరింపకుండుయోగి (అనఁగా: వాని నభ్యాసము చేయనివాఁడు), ఇంద్రియములు, మనముఁ, ఇట్టు నట్టు పరువులిడఁగన్ = ఇటునటు పరుగులెత్తుచుండఁ, వానిన్ = ఆ ఇంద్రియమనస్సు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లను, పట్టఁజాలక = నిలిపికొననేరక, కుందుఁగ్ = ఆయాసపడుచుండును. ఇట్టివాఁడు, పరముఁగ్ = పరబ్రహ్మమును, ఎట్టుగాంచుఁగ్ = ఎట్లు చూడఁగలఁడు.

తా. ఇట్లు మహోపకారములగు నాదబిందుకళల నాశ్రయింపకుండినవాఁడు ఇంద్రియములను మనసును నిగ్రహింపఁజాలఁడు. అవి బాహ్యములైన శబ్దాదివిషయములఁ గూర్చి పరుగులిడుచుండఁ బట్టుకొననేరఁడు. ఇట్లు చిత్తశాంతియే లేనివాఁడు అతిసూక్ష్మ మగుపరమాత్మతత్త్వమునుగూర్చి విచారించుటయుం దానిని గ్రహించుటయు ననుభవించుటయు నెట్లు సంభవించును? ఎట్లు చూచినను వాఁడు నిరర్థకుఁడు కావలసినదియే.

సీ. గాలంబు లేనిచో జాలకాగ్రణిచేతఁ
బాఠీనజాలముల్ పట్టువడునె?
సరియురి లేనిచో శకునాంతకునిచేతఁ
జొక్కంపుఁబత్తులు చిక్కువడునె?
యోదంబు లేనిచో నొగి మావటీనిచే
గజరాజములు నరికట్టువడునె?
తగుకోల లేనిచో మృగయావినోదిచే
ఘోరమృగంబులు కొట్టువడునె?
తే. రాజితానందతారకరాజయోగ
పావనసమాధి లేనిచోఁ బరమశుష్క
తర్కవేదాంతవాదతత్పరులచేత
నింద్రియమనంబులు వినిగ్రహింపఁబడునె? 115

టీ. జాల...చేతఁగ్-జాలక = వలవేయువారిలో, అగ్రణిచేతఁగ్ = శ్రేష్ఠుఁడగువానిచేత (వలవేయుటలోఁ బురుషున కెంతనేర్పున్నను అనుట), గాలంబులేనిచోఁగ్ = గాలము లేక పోయిన యెడల, పాఠీనజాలములు = మత్స్యసమూహములు, పట్టువడునె=చిక్కునా? సరియురిలేనిచోఁగ్=తగిన ఉచ్చులేనియెడల, చొక్కంపుపత్తులు= అందమైనపత్తులు, శకునాంతకునిచేతఁగ్ = పక్షులవేఁటాడువానిచే, చిక్కువడునె = పట్టుకొనఁబడునా? మావటీనిచేఁగ్ = మావటివానిచేత, ఓదంబు = అంకుశము, లేనిచోఁగ్ = లేకుండినయెడల, ఒగిఁగ్=బాగుగ, గజరాజములు = ఏనుఁగులు, అరికట్టువడునె = నిర్బంధింపఁబడునా? మృగయావినోదిచేఁగ్ = వేఁటయం దాసక్తిగలవానిచే, తగుకోలలేనిచోఁగ్=తగినబాణము లేకుండినయెడల, ఘోరమృగంబులు = భయంకరములగుమృగములు, కొట్టవడునె=సంహరింపఁబడునా? రాజి...సమాధి-రాజిత=ప్రకాశించుచున్న, ఆనంద = ఆనందకరమైన, తారక = తారకము ... రాజ=శ్రేష్ఠమైన,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యోగ=యోగముయొక్క, పావన=పరిశుద్ధమైన, సమాధి = నిష్ఠ, లేనిచోన్ = లేక పోయినయెడల, పర...చేతన్-పరమ = మిగుల, శుష్క = నిరర్థకములైన (లేక, నిస్సారములైన), తర్క=తర్కశాస్త్రసంబంధమైనట్టియు, వేదాంత = వేదాంతశాస్త్రసంబంధమైనట్టియు, వాద = వాదములయందే, తత్పరులచేతన్ = ఆసక్తిగలవారిచేత, ఇంద్రియమనంబులు, వినిగ్రహింపఁబడునె = లోఁబఱుచుకొనఁబడునా?

తా. ఇంద్రియములను మనసును నిగ్రహించుటకు నీరాజయోగముతప్ప వేఱొక యుపాయమే లేదు. ఎన్ని వేదాంతయుక్తులను సంపాదించిన నెన్ని వాదములఁ జేసినను ప్రయోజనములేదు. తారకయోగమునే యాశ్రయించి తీరవలయును. అనాదినుండియు బహువిధము లగువాసనలచే నాక్రమింపఁబడియున్న చిత్తము మాటలతో స్వాధీనమగునా? చేపలఁ బట్టఁబోయినవాఁడు చక్కని గాలమును సంపాదించి జలమున వైవకున్న నామత్స్యములు చిక్కునా? దృఢమైనయురిని సంపాదింపక బోయవాఁడు పక్షులఁ జిక్కించుకొనఁగలుగునా? మావటివానియొద్ద వాఁడియగునంకుశము లేనియెడల మదగజంబులు మాటలచే స్వాధీనము లగునా? కానేరవు గదా. ఇట్లే యింద్రియములును మనసును గూడ నాదబిందుకళల నాశ్రయింపనివానికి స్వాధీనములు కానేరవు.

క. జన మంజనంబుఁ గైకొని
ఘనమగుధనమును నెఱుంగుకైవడిని నిరం
జనతారకయోగముఁ జే
కొని పరతత్త్వమును దెలియ గుఱివడునంతన్. 116

టీ. జనము=మనుష్యులు, అంజనంబున్ = కాటుకను, కైకొని = తీసికొని, ఘనమగు=అధికమగు, ధనమున్ = ద్రవ్యమును, ఎఱుంగుకైవడిన్ = తెలిసికొనునట్లు, నిరంజనతా...మున్-నిరంజన = రెండవదానితోఁ బనిలేక స్వయముగనే బ్రహ్మసాక్షాత్కారమును గలిగింపఁజాలు, తారకయోగమున్=తారకయోగమును (లేక, జ్ఞానయోగమును), చేకొని=స్వీకరించి, అంతన్=పిమ్మట, పరతత్త్వమున్=పరబ్రహ్మముయొక్క యథార్థస్వరూపమును, తెలియన్ = తెలిసికొనుటకు, గుఱివడున్ = ఇంద్రియమనంబులు నిశ్చలము లగును. (జ్ఞానయోగప్రభావమువలన నింద్రియములును మనస్సునుగుదిరి, పురుషునకు బ్రహ్మము నెఱుంగఁ గలసామర్థ్యము గలుగఁజేయునని భావము. మోక్షమునకు జ్ఞానమే ప్రధానసాధనము—శ్లో. "బోధోఽన్యసాధనేభ్యో హి సాక్షాన్మోక్షైకసాధనమ్, పాకస్య వహ్నివద్ జ్ఞానం వినా మోక్షో న సిద్ధ్యతి." "కర్మ మొద లగు నితరసాధనములు జ్ఞానమును కలిగించునే కాని మోక్షము నియ్యవు. మోక్షమునకుఁ బ్రత్యక్షసాధనము జ్ఞానమే. వీని కన్నిఁటికంటె నగ్నియే ప్రధానమైనట్లు మోక్షమున కీజ్ఞానమే ప్రధానము" అని యాత్మబోధ.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. లోకమున భూమిలో నిక్షేపింపఁబడినధనమును తెలిసికొనఁగోరువారు దానికి సాధన మగుధనాంజనమును సంపాదించునట్లు పరమాత్ముని యథార్థస్వరూపమును ఎఱుంగఁగోరువారు తారకయోగాభ్యాసమును దప్పక చేయవలయును. అట్లు చేసిన యెడలఁ బరమాత్ముని యథార్థరూపమును (అనఁగా: ఆయనకును తనకును భేదములే దను విషయమును) సులభముగఁ దెలిసికొనవచ్చును.

తే. పలలమును జూపి డేగను బట్టురీతి
నమృతసమనాదబిందుకళానుభూతి
సుఖము నొందించి మరిగించి చొక్కఁజేసి
యింద్రియమనంబులు వినిగ్రహింపవచ్చు. 117

టీ. పలలముఁ = మాంసమును, చూపి, డేగను, పట్టురీతిఁ = పట్టుకొనునట్లు, అమృ...ఖముఁ-అమృతసమ = అమృతముతో సమాన మగు, నాదబిందుకళ = నాద బిందుకళలయొక్క, అనుభూతి=అనుభవ మనియెడు, సుఖముఁ=సుఖమును, ఒందించి= పొందించి, మరిగించి=ఆసుఖమునం దాసక్తికలిగించి, చొక్కఁజేసి=పరవశము లగునట్లు చేసి, ఇంద్రియమనంబులఁ, వినిగ్రహింపవచ్చు=జయింపవచ్చును.

తా. మాంసమును జూపి దానిపై నాసచే వచ్చినడేగను ఎంతసులభముగాఁబట్టు కొనవచ్చునో ఈనాదబిందుకళలు జూపికూడ యింద్రియములను మనసును అంతసుల భముగా నిగ్రహింపవచ్చును. ఈనాదబిందుకళలు అమృతసమానములు. అమృతమును బానముఁ జేయఁ వాని కెంతకాలమునకైన నెట్లు తృప్తికలుగదో అట్లే నాదముల విను నప్పుడుకాని బిందుకళలను చూచునప్పుడుకాని మనసునకుఁ దృప్తి జనింపదు. కావున నామనస్సునకు వానినిఁజూపి యందు రుచిని కలిగించినయెడల నది (మనస్సు) యచ్చట నుండి చలింపక తన్మయ మగును. కొంతకాలమునకు శూన్యమై కూడ పోవును. అమన సుతోగూడ యింద్రియములును తన్మయత్వమును జెంది శూన్యములగును. ఇంతకంటె చక్కని మనోనిగ్రహోపాయ మేదికలదు.

ఆ. వేద మట్లు గాన నాదబిందుకళాను
భవముఁ దెలిపె మొదలఁ బండితులకుఁ
దత్ప్రకార మెల్లఁ దగ నెఱిఁగించెద
విస్తరించి తెలియ వినుము వత్స! 118

టీ. వత్స = బాలుఁడా! వేదము, మొదలఁ = మొట్టమొదట, పండితులకుఁ= జ్ఞానులగువారికి (లేక, మోక్షేచ్ఛగలవారికి), నాదబిందుకళానుభవముఁ = నాదబిందు కళలయొక్క యనుభవము, తెలిపెఁ=చెప్పెను. కానఁ =అట్లగుటచేత, అట్లు=వేదోక్త

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రకారముగా, తత్ప్రకారమెల్లన్ = ఆనాదబిందుకళలవిధము నంతయును, తగన్ = ఒప్పునట్లుగా, విస్తరించి=వివరించి, ఎఱిఁగించెదన్ = తెలియఁజేసెదను, తెలియవినుము =చక్కఁగ విని గ్రహింపుము.

తా. ఈకారణమువలన మోక్షేచ్ఛగలవారు మొట్టమొదట నాదబిందుకళల నభ్యసింపవలయు నని వేదము చెప్పుచున్నది. కావున యానాదబిందుకళల నీక్రింద వివరించెదను వినుము.

తే. సద్గురుప్రోక్తముద్రచే శ్రవణయుగము
మూసి యాలింపఁ బ్రణవంబు మ్రోయు మొదలఁ
జిణి యనుచు నంతటను జిణిజిణి యటంచు
మించి రెండవమాఱు ఘోషించు ననఘ! 119

టీ. అనఘ=పాపరహితుండ వగునోయాంజనేయా ! సద్గురుప్రోక్తముద్రచేన్ = గురు వుపదేశించినముద్రనాశ్రయించి, శ్రవణయుగమున్ = రెండుచెవులను, మూసి, ఆలింపన్=వినఁగా, మొదలన్=మొట్టమొదట, ప్రణవంబు=ఓంకారము, చిణియనుచున్ = చిణియనుచు, మ్రోయున్ = ధ్వనించును. అంతటన్ = పిదప, మించి = అధికముగ, రెండవమాఱు, చిణిచిణియటంచున్ = చిణిచిణి యనుచు (చిరిగజ్జెల మ్రోఁతవలె), ఘోషించున్=ధ్వనించును.

తా. గురు వుపదేశించినమార్గము ననుసరించి చెవుల మూసి వినినచో నోంకార నాదము 'చిణి' యని యొకమాఱును 'చిణి, చిణి' యని చిఱుగజ్జలమ్రోఁతవలె మఱి యొకమాఱును మ్రోఁగును. శరీరమునందుఁ బ్రాణవాయువుల సంచారమువలనఁ బుట్టు ధ్వనియే నాదమనియు నిది యోంకారరూపమున నుండుటచే నోంకారనాదమనిచెప్పఁ బడుననియు అదియే పదివిధములుగా వినవచ్చు ననియు తెలిసికోవలయును.

అవ. ఇట్లు నాదబిందుకళలప్రభావమును జెప్పి వానిస్వరూపముల నిరూపించు వాఁడై మొట్టమొదట దశవిధనాదముల వర్ణించుచున్నాఁడు:—

శా. కంటి న్నెమ్మది గంటి సద్గురుని నింకన్ మేనిలోఁ బువ్వులా
తింటన్ బూజ లొనర్తు నంచుఁ గర మర్థిన్ దేహి దా మున్నుగా
ఘంటానాదముఁ జేసెనో యనఁగ నోంకారంబు హృద్వీథియన్
మింటన్ మ్రోయుఁ దదారవంబుగతి నామీఁదన్ విజృంభించుచున్.

టీ. దేహి=జీవుఁడు, సద్గురునిన్=సద్గురుస్వరూపుఁ డగుపరబ్రహ్మమును, కంటిన్= చూచితిని, నెమ్మదిగంటిన్=చిత్తశాంతినిఁ బొందితిని. ఇఁకన్=ఇంక, మేనిలోపువ్వులా తింటన్=శరీరము నందున్న యాఱుకమలములచే (మూలాధారకమలము, స్వాధిష్ఠానకమలము,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మణిపూరకకమలము, అనాహతకమలము, విశుద్ధకమలము, ఆజ్ఞాకమలము ఈఆఱును షడాధారకమలము లనియుఁ షడాధారచక్రము లనియుఁ జెప్పఁబడుచున్నవి.) పూజ లొనర్తున్=పూజను చేసెదను, అంచున్=అని, కరము=మిక్కిలి, అర్థిన్ = ప్రీతితో, తాన్ = తాను, మున్నుగా = పూజనారంభించుటకుముందు, ఘంటానాదముఁజేసెనో యనఁగన్=ఘంటానాదము నొనరించెనోయనునట్లు, హృద్వీథి యన్మింటన్=హృదయ మనియెడునాకాశమున, ఓంకారంబు = ఓంకారము, తదారవంబుగతిన్ = ఆఘంటా నాదమువలె, ఆమీఁదన్=చిఱుగజ్జలధ్వని వినఁబడినపిదప, విజృంభించుచున్ = అభివృద్ధి యగుచు, మ్రోయున్=మ్రోఁగును.

తా. "నాకు సద్గురురూపుఁ డగుపరమాత్మునిదర్శనమైనది. ఇఁక నమ్మహాత్మునకు శరీర మునం దున్నయాఱుకమలములతోను బూజఁజేయవలయును." అని తలంచుచు జీవుఁడు మొట్టమొదట "ఆగమార్థం తు దేవానాం గమనార్థం తు రక్షసాం, కురు ఘంటారవం తత్ర దేవతాహ్వానలాంఛనమ్" అని ఘంటను వాయించెనో యనునట్లు హృదయాకాశ మునం దోంకారధ్వని మూఁడవమాఱు మ్రోయును.

స్రగ్ధర. కామక్రోధాద్యసద్రాక్షసగణవిజయాకాంక్షి యై ప్రత్యగాత్మ
శ్రీమన్నారాయణుం డంచితవిమలమహాచిత్తశంఖంబు నిండన్
క్షేమం బారంగఁ బూరించినగతి మొఱయుం జిత్కళాదర్శకం బై
భూమానందప్రదంబై స్ఫుటనిగమశిరోభూషణోంకార మంతన్.

టీ. అంతన్, ప్రత్య...ణుండు - ప్రత్యగాత్మ = జీవుఁడను, శ్రీమన్నారాయ ణుండు, కామ...క్షియై-కామక్రోధాది = కామము క్రోధము మొదలగు, అసత్ = దుష్టులైన, రాక్షసగణ = రాక్షససమూహముయొక్క, విజయ = విజయమును (రాక్షసుల జయించుటకు), ఆకాంక్షియై=కోరుచున్నవాఁడై, అంచి...బున్-అంచిత = ఒప్పుచున్న, విమల=పరిశుద్ధమైన, మహా = గొప్పదైన, చిత్త = మనస్సు అనియెడు, శంఖంబున్ = శంఖమును, నిండన్ = నిండునట్లుగా, క్షేమంబారంగన్ = క్షేమ మభివృద్ధియగునట్లు, పూరించినగతిన్ = ఊఁదెనో యనునట్లు, చిత్కళాదర్శకంబై-చిత్కళా=చిత్కళలను, దర్శకంబై = చూపునదియై, భూమానందప్రదంబై = బ్రహ్మానందము నొసంగునదియై, స్ఫుట...రము-స్ఫుట=ప్రసిద్ధమైనట్టియు, నిగమశిరః = వేదాంతములకు, భూషణ=అలం కారభూతమైనట్టియుం, ఓంకారము, అంతన్=పిదప, మొఱయున్=ధ్వనించును.

తా. జీవుఁ డనునారాయణమూర్తి కామక్రోధాదులనురాక్షసుల సంహరింప నెంచి వారితో యుద్ధము చేయువాఁడై మొట్టమొదట మన స్సనియెడుశంఖమును బూరించెనో యనునట్లు నాల్గవమాఱు ఓంకారము శంఖనాదమువలె మ్రోయును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆనాదమును వినునప్పుడు చిత్కళలు కానఁబడును. మనసునకు పరమానందము కలుగును. వేదములయందేమి యాగములయందేమి యీనాదము (దశవిధనాదములు) మిగుల ప్రశంసింపఁబడియున్నవి.

మ. నలువొప్పం దగుబ్రహ్మదండి నొకవీణాదండముం జేసి ష
డ్జలజాతంబుల మెట్లుగా నిలిపి పంచప్రాణముల్ తంతులై
యలరంగాఁ గొని ముక్తికామిని సహస్రారంబునం దుండి ని
చ్చలు వాయించె ననంగ నొప్పుఁ బ్రణవస్వానంబుదానంతటన్.

టీ. అంతటన్=తర్వాత, ముక్తికామిని = మోక్షమనియెడుస్త్రీ, నలువొప్పన్= సొంపుమీఱఁగా, తగు...డిన్=తగు=యుక్తమైన, బ్రహ్మదండిన్ = బ్రహ్మదండి యను పేరుచే వ్యవహరింపఁబడువెన్నెముకను, ఒకవీణాదండమున్ = ఒకవీణగా, చేసి, షడ్జలజాతంబులన్=షడాధారకమలములను, మెట్లుగానిలిపి = మెట్లనుగాపొందుపఱచి, పంచప్రాణములు = ప్రాణవాయువులైదును, తంత్రులై=తీఁగలై, అలరంగాన్ = ఒప్పుచుండఁగా, కొని = గ్రహించి, సహస్రారంబునందుండి = సహస్రారచక్రమునఁ దాను గూర్చుండి (ఈచక్రము శిరమునందు కలదని శాస్త్రము), నిచ్చలు=మిక్కిలి, వాయించె ననంగన్, తాన్=తాను, ప్రణవస్వానంబు=ఓంకారధ్వని, ఒప్పున్=ప్రకాశించును.

తా. వీపునందు పొడుగై వ్యాపించియున్నయెముకకు బ్రహ్మదండియని యోగశాస్త్రమునందుఁ బేరు. ఇడా, పింగళ, సుషుమ్న మొదలగు నాడులును మూలాధారము మొదలగు షడాధారచక్రములును (ఈనాడులనుగూర్చియు చక్రములను గూర్చియు గ్రంథముననే వివరింపఁబడును.) యీ బ్రహ్మదండి నాశ్రయించియున్న వనిచెప్పుదురు. మోక్ష మనియెడు స్త్రీ సహస్రారకమలమునందుఁ గూర్చుండి యీబ్రహ్మదండిని వీణగాను దాని నాశ్రయించియున్న షడాధారకమలములను మెట్లగాను ఇడాపింగళాది తంత్రులగానుచేసి వాయించెనేమో యన నాప్రణవనాదము వీణానాదరూపమై యైదవ మాఱు మ్రోయును.

తోటకవృత్తము.—

అమృతాంగన బోధమయాత్ముని శు, ద్ధమనఃపవనంబులు తాళముగా
నమరం గొని పాడుచునాడినయ, ట్లమలప్రణవారవమంతఁ దగున్.

టీ. అంతన్=అటుపిమ్మట, అమృతాంగన = ముక్తికాంత, బోధ...బులు-బోధమయ=జ్ఞానరూపుఁడైన, ఆత్ముని=జీవునియొక్క, శుద్ధ=నిర్మలమగు, మనఃపవనంబులు= మనస్సును, ప్రాణవాయువులను, తాళముగాన్, అమరంగొని = బాగుగ గ్రహించి, పాడుచున్, ఆడినయట్లు = ఆడుచున్నట్లో యనునట్లు, అమలప్రణవారవము-అమల=

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిర్మలమైన, ప్రణవ = ఓంకారముయొక్క, ఆరవము = ధ్వని, తగుక్ = ఒప్పును (తాళ నాదమువలె వినవచ్చు ననుట).

తా. మఱియుం ఆఱవమాఱు ఆప్రణవనాదము తాళనాదమువలె వినవచ్చును. అప్పుడు, జ్ఞానరూపుఁడగుజీవుని పరిశుద్ధమైనమనస్సును ప్రాణవాయువును తాళములనుగాఁ గైకొని పాడుచు ముక్తికాంత పరమానందముతోఁ బాడుచున్న జేమో యని తలంప వీ లగుచుండును.

సీ. సలలితేంద్రియగోపికలు వరప్రీతిచేఁ
    జను దెంచి తనుఁ బొంది సంతసింప
బ్రహ్మదండిలతావిభాస్వదాధారాది
    కపికావలి మహావికాస మొందఁ
బ్రస్ఫుటీకృతపటుస్ఫుటఁ గుండలీంద్రుఁ డ
    త్యానందకరముగా నాడుచుండఁ
బొందుగా భ్రూమిమధ్యబృందావనమ్మునఁ
    బ్రత్యక్షబోధగోపాలమూర్తి
తే. విమలమానసపవనహస్తముల చేతఁ
    దనసుషుమ్నామురళి లీలఁ దాల్చి మధుర
    గాన మొనరించె ననఁగ నోంకార మలఘు
    వేణునాదస్వరూపమై వెలయు నంత. 123

టీ. అంతక్=పిమ్మట, ప్రత్య...మూర్తి-ప్రత్యక్ష=తనకంటె వేఱుకాని, బోధ=జ్ఞానస్వరూపమగుపరబ్రహ్మమనియెడు, గోపాలమూర్తి = శ్రీకృష్ణుఁడు, భ్రూమ...మ్మునక్-భ్రూమధ్య=బొమలనడిమిభాగ మనియెడు, బృందావనమ్మునక్ = బృందావనము నందు, సల...గోపికలు-సలలిత=మిగులమనోహరములైన, ఇంద్రియ=ఇంద్రియములను, గోపికలు=గోపికాస్త్రీలు, వరప్రీతిచేక్=ప్రియుఁడనునసురాగముచేత (లేక, పరబ్రహ్మ మను భక్తిచేత వకారపకారములకు భేదము లేదు కావున పరప్రీతి యనుచోట వరప్రీతి అనికూడ నన్వయింపవచ్చును. ఇచ్చట ఇంద్రియములకు నాయకుఁడు పరబ్రహ్మమని యు గోపికలకు శ్రీకృష్ణమూర్తి యనియు తెలియునది.)చనుదెంచి=వచ్చి,(తనసమీపము నకువచ్చి యనుట.) తనుక్=తనను, పొంది=ఆశ్రయించి,సంతసింపక్=సంతోషించునట్లు గాను, బ్రహ్మ...వళీ-బ్రహ్మదండి=బ్రహ్మదండి యనిచెప్పఁబడు వెన్నెముక యనియెడు, లతా = తీఁగెయందు (లేక, వృక్షశాఖయందు), విభాస్వత్ = ప్రకాశించుచున్న, ఆధా రాదిక=మూలాధారము మొదలగుషట్చక్రము లనియెడు, పికావళి=కోకిలగుంపు, మహా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వికాసమొందన్ = మిగులసంతోషించుచుండఁగా, కుండలీంద్రుఁడు = కుండలియనుశక్తి ఆధారభూతుఁడుగనున్న సర్పరాజు, ప్రస్ఫు...టన్ - ప్రస్ఫుటీకృత = విచ్చఁబడిన, పటు=స్పష్టమైన, స్ఫటన్=పడగతో, అత్యానందకరముగాన్=మిగుల నానందముకలుగు నట్లుగా, ఆడుచుండన్,విమ... చేతన్-విమల=నిర్మలమగు, మానస=మనస్సు,పవన=ప్రాణ వాయువను, హస్తముల చేతన్=చేతులతో, పొందుగాన్=చక్కఁగా, తన...శిన్-తన= తనయొక్క, సుషుమ్నా=సుషుమ్నా నాడి యనెడు, మురళిన్=వేణువును, లీలన్=విలాస ముగా, తాల్చి=ధరించి, మధు..., మున్-మధుర=మనోహరమగు, గానమున్=గానమును, ఒనరించెననఁగన్=చేసెనోయనునట్లు, ఓంకారము, అల...మై-అలఘు=అధికమగు, వేణు నాదస్వరూపమై=వేణునాదమే యాకారముగాఁగలదై, వెలయున్=ప్రకాశించును.

తా. ఇంద్రియము లనియెడుగోపికలకు తన (జ్ఞానస్వరూపుఁ డైనకృష్ణుని యొక్క) సాన్నిధ్యముచే పరమానందమును గల్గించుచు బ్రహ్మదండి యనెడు వృక్ష శాఖ నాశ్రయించి యున్నమూలాధారము మొదలగుషట్చక్రముల నెడుకోయిలలు సంతసముతో మారుపల్కునట్లుచేయుచు మూలాధారచక్రమునందు అధఃకుండలియు శిరసునం దూర్ధ్వకుండలియుఁగలదని యోగులు చెప్పుదురు. వీనిని గూర్చికూడ ముందు ముందు వివరింపఁబడును. ఇచ్చటమాత్రము కుండలిశబ్దమునకు సర్పమని యర్థముకావు నను యోగులుకూడ నీకుండలులు సర్పస్వరూపములే యని చెప్పి యుండుట చేతను కుండలీంద్రుఁడు సర్పరాజు అని కవి చెప్పియున్నాఁడు.) ఊర్ధ్వకుండలి యధఃకుండ లియు ననునాగేంద్రునకు స్వయముగనే పడగవిప్పి యాడునంతప్రమోదమును జనింపఁ జేయుచు జ్ఞానరూపుఁడైన (అనఁగా: పరబ్రహ్మమును) శ్రీకృష్ణుఁడు భ్రూమధ్యభాగ మనెడుబృందావనమునఁజేరి ప్రాణము మనసు అనెడు రెండుచేతులతో సుషుమ్నానాడి యనువేణువును బట్టికొని గానము చేసెనో యనునట్లు ప్రణవనాదము పిదప వేణునాద రూపముతోఁ బ్రకాశించును.

సుగంధివృత్తము.—

క్రూరరాగరోషవైరికోటి నెల్లఁ ద్రుంపఁగాఁ
గోరి యాత్మరాముఁ డుండ ఘోరసంగరార్థమై
భూరిభేరికారవంబుఁ బోరుకొల్పినట్లు ఓం
కారనాద మొప్పు వింతగాఁ గుమార! యంతటన్. 124

టీ. కుమార=పుత్రా! అంతటన్ = తదనంతరము, ఆత్మరాముఁడు = అంతర్యామి యగు జీవుఁడు (లేక, పరబ్రహ్మము), క్రూర...నెల్లన్-క్రూర=భయంకరులగు, రాగ= కామము, రోష=క్రోధము మొదలగు, వైరి=శత్రువులయొక్క, కోటినెల్లన్=సమూ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హామునంతరయును, త్రుంపఁగాఁగోరి=సంహరింపఁదలంచి, ఘోర...ర్థమై-ఘోర=భయం కరమగు, సంగరార్థమై = యుద్ధముకొఱకై, ఉండఁగ్ = తగినసన్నాహముతో నుండఁగా, భూరి భేరీకారవంబున్-భూరి=అధికమగు, భేరికా = భేరియొక్క, ఆరవంబున్ =ధ్వనిని, బోరుకొల్పినట్టులు = కలిగించినట్లు, వింతగాన్ = విచిత్రముగా, ఓంకారనాదము = ఓం కారధ్వని, ఒప్పున్ = భేరీనాదసమానమై ప్రకాశించును.

తా. ఓపుత్రా! విమ్మట కామము రాగము (తన కున్నవానిని దానే యనుభ వింపవలయు ననునిచ్ఛ) ద్వేషము మొదలగు శత్రువుల సంహరింపఁ బ్రయత్నించుచు యథార్థమై అంతర్యామిరూపుఁ డగుజీవుఁడు మొట్టమొదటఁ బ్రస్థానభేరి (రాజులు యుద్ధమునకుఁ బోవునప్పుడు మ్రోయింపఁబడుభేరి) గంభీరముగ మ్రోయించునో యను నట్లు ఎనిమిదవమాఱు ప్రణవనాదము భేరీధ్వనిరూపముతో విజృంభించును.

మ. అమరేంద్రాదుల గెల్చుసొంపలరుమాయాకాంత నాడింపఁగా
నమలాత్ముం డగునల్లమాప్రభువరుం డాత్మీయవిద్యామృదం
గము వాయించె ననంగ నొప్పులలితోంకారస్వనం బంత హృ
ద్య మచింత్యం బతులం బవాచ్య మయి నిత్యానందమై మారుతీ!

టీ. మారుతీ=ఓఆంజనేయా! అంతన్ = విమ్మట, అమలాత్ముండగు = నిర్మలహృద యుఁడగు, అల్లమాప్రభువరుండు=అల్లమాప్రభురాయుఁడనఁబడు నీశ్వరుఁడు (ఈతనిని గూర్చి ప్రభులింగలీలయందుఁ జెప్పఁబడియున్నది. లేక, లక్ష్మీదేవికి నాయకుఁడగు నాపురుషోత్తముఁడు, ఇచ్చట అల్ల, మాప్రభువరుఁడు అని పదచ్ఛేదము.) అమరేం ద్రాదులన్=ఇంద్రుఁడు మొదలగుసమస్తదేవతలను, గెల్చు...కాంతన్-గెల్చు=గెలు వఁగలిగిన, సొంపు=సామర్థ్యముచే, అలరు=ప్రకాశించునట్టి, మాయాకాంతన్=మాయ యనెడు స్త్రీని, ఆడింపఁగాన్ = నృత్యముచేయించుటకై, ఆత్మీ...గమున్-ఆత్మీయ= తనదగు, విద్యా = జ్ఞానమనెడు, మృదంగమున్ = మద్దెలను, వాయించెననంగన్ = మ్రోయించెనోయనునట్లు, హృద్యము = మనోహరమై, అచింత్యంబు = తలఁపనశక్యమై, అతులంబు = ఉపమానములేనిదై, లలి...నంబు-లలిత = సుందరమైన, ఓంకారస్వ నంబు = ఓంకారధ్వని, అవాచ్యమై = ఇది యిట్టిదనిచెప్పుటకు నశక్యమైనదై, నిత్యా నందమై-నిత్య = శాశ్వతమగు, ఆనందమై = ఆనందమేరూపముగాఁగలదై, ఒప్పున్ = మృదంగనాదస్వరూపముతో ప్రకాశించును.

తా. ఓఆంజనేయా! వినుము. శైవశాస్త్రములయందు అల్లమాప్రభుఁడని పేర్కొనఁబడుచున్న పరమేశ్వరమూర్తి యొకఁడు కలఁడు. సర్వమూర్తులును బరబ్రహ్మ మయములే కావున "అల్లమాప్రభుఁడు" అనుపదమునకుఁ గూడ 'పరబ్రహ్మము' అనియే యర్థమగును. అపరబ్రహ్మము. దేవేంద్రుఁడు మొదలగుదేవతలనుగూడ బోఁటులచూెను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సామర్థ్యముగల మాయాశక్తిచే, నృత్యము చేయింపవలయు ననునిచ్ఛచే జ్ఞానమని యెడుమృదంగమును జేఁబూని వాయించుచున్నాఁడో యనునట్లు తొమ్మిదవమా త్రాప్రణవనాదము మృదంగనాదరూపముతో శ్రవణగోచరంబగును.

సీ. నిఖిలేంద్రియములను నీలకంఠంబు ల
    త్యంతసంతోషనృత్యములు సలుప
ధర్మామృతార్ద్రీకృతమనోవనీస్థలి
    శమముఖసుగుణసస్యము లిగుర్ప
సమరసానందనిర్ఝరముచేఁ దాపదా
    వానలం బెల్లఁ జల్లార్పఁబడఁగ
భ్రూమధ్యదేశనభోవీథిఁ జిత్కళా
    విద్యుల్లతాతతుల్ వెలయుచుండఁ
తే. దతచిదాకాశమధ్యసంగతసమగ్ర
రాజయోగసమాధిధారాధరంబు
మోదవర్షంబు గురియుచు మ్రోసె ననఁగఁ
బ్రణవదశమనినాద మొప్పారు నంత. 126

టీ. అంతర్=తదనంతరంబున, తత...రంబు-తత=విశాలమగు, చిదాకాశ=జ్ఞానమనియెడు నాకాశముయొక్క, మధ్య=నడుమ, సంగత=నిలిచియున్న, సమగ్ర=పరిపూర్ణమగు, రాజయోగ=జ్ఞానయోగముయొక్క, సమాధి=నిష్ఠయనియెడు, ధారాధరంబు=మేఘము, నిఖి...ములు-నిఖిల=సమస్తములగు, ఇంద్రియములు, అనునీలకంఠంబులు=అనియెడు నెమళ్లు, అత్యంత సంతోషనృత్యములు=పరమానందమువలన నధికములగు నృత్యములను, సలుపర్=చేయుచుండఁగా, ధర్మా...స్థలిర్-ధర్మ=ధర్మమనెడు, అమృత=జలముచే, ఆర్ద్రీకృత=తడుపఁబడిన, మనః=మనస్సనియెడు, అవనీస్థలిర్=భూమియందు, శమ...ములు-శమ=శమము, ముఖ=మొదలగు, సుగుణ=సద్గుణములనియెడు, సస్యములు=పంటలు, ఇగుర్పర్=చిగిరింపఁగా, సమ...చేర్-సమరసానంద=జీవబ్రహ్మము లొక్కటియే యనుజ్ఞానమువలన కలిగెడు బ్రహ్మానందమను, నిర్ఝరముచేర్=ప్రవాహముచేత, తాపదావానలంబెల్లర్ = తాపత్రయమనుదావాగ్ని యంతయుం, చల్లార్పఁబడఁగర్=నశింపఁజేయఁబడుచుండఁగా, భ్రూ...వీథిర్-భ్రూమధ్యదేశ = బొమలనడిమిభాగమనియెడు, నభోవీథిర్=ఆకాశమునందు, చిత్క...తులు-చిత్కళా=చిత్కళలనెడు (ఇవి వెనుక వివరింపఁబడును), విద్యుల్లతా=మెఱపుతీఁగెలయొక్క, తతులు=సమూహములు వెలయుచుండర్=ప్రకాశించుచుండఁగా, మోదవర్షంబు=ఆనందమనియెడు వర్షమును కురియుచుర్ [illegible] ప్రణ...దము-ప్రణవ=ఓం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కారముయొక్క, దశమ=పదియవదియగు, నినాదము=ధ్వని, ఒప్పారున్=మేఘధ్వనివలె ప్రకాశించును.

తా. ఇంద్రియము లనియెడుమయూరముల కపరిమితమగు నానందమునుఁ గలిగించి వానిచే మనోహరములగు నృత్యములఁ జేయించుచు ధర్మ మనియెడు జలముచే నంతకు మున్న తడిసి పదునైయున్న మనఃక్షేత్రమునందు సుగుణము లనియెడుపైరు చిగుర్చునట్లు చేయుచు ఆనందమనెడు జలప్రవాహముచే తాపత్రయమనియెడు దావాగ్నిని జల్లార్చుచు రాజయోగనిష్ఠ యనియెడుమేఘము భ్రూమధ్యస్థాన మనియెడు నాకాశమున నిల్చి (మేఘము చిదాకాశమునం దున్నదని మూలమునందుఁ జెప్పఁబడియున్నది. మెఱపులు మాత్రము భ్రూమధ్యాకాశమునందు కలవని చెప్పియున్నాఁడు. మేఘ మొకచోటను మెఱపులు మఱియొకచోట నుండుట సంభవింపదు. కావున "భ్రూమధ్యస్థానమనునాకాశమునందు నిలచి" అని చెప్పియున్నాను. వీనివలన మూలమునకు విరోధమురాదు. చిదాకాశ మనఁగా జ్ఞానమె కావున నది యెన్నిచోట్లనుండ వచ్చును కదా! చిత్కళ లనుమెఱపులతో రాజిల్లుచు బ్రహ్మానంద మనెడు వర్షమును గురియుచు ధ్వనిచేయుచున్నదో యనఁగ మేఘధ్వనిరూపమై ప్రణవనాదము పదియవమాఱు మ్రోఁగును.

వ. ఇట్లు చిణీనాదంబు చిణచిణీనాదంబు ఘంటానాదంబు శంఖనాదంబు వీణానాదంబు తాళనాదంబు వేణునాదంబు భేరీనాదంబు మృదంగనాదంబు మేఘనాదం బనం బరఁగు దశవిధప్రణవనాదంబుల శ్రీగురూపదేశపూర్వకంబుగా శ్రుతియుక్త్యనుభవంబులచేత నెఱుంగవలయు మఱియును. 127

టీ. ఇట్లు=ఈవిధముగా, చిణీనాదంబు=చిణియనుధ్వని, చిణిచిణీనాదంబు=చిరుగజ్జలవంటి మ్రోఁత, వీణానాదంబు=వీణాధ్వని, ఘంటానాదంబు=ఘంటాధ్వని, శంఖనాదంబు=శంఖధ్వని, తాళనాదంబు=తాళముయొక్కధ్వని, వేణునాదంబు=పిల్లనగ్రోవియొక్కధ్వని, భేరీనాదంబు=భేరియొక్కధ్వని, మృదంగనాదంబు=మద్దెలయొక్కధ్వని, మేఘనాదంబు=మేఘధ్వని, అనంబరఁగు=అనుపేర్లతోనొప్పు, దశవిధప్రణవనాదంబులన్=పదివిధములగు ఓంకారములను, శ్రీగురూపదేశపూర్వకంబుగాన్=గురుపుపదేశించినవిధముగా, శ్రుతి... చేతన్-శ్రుతి=వేదవాక్యములచేతను, యుక్తి=(వేదమునందుఁ జెప్పఁబడిన యర్థమును నిరూపించుచు నచట కలుగుసంశయముల నివారింపఁ జాలు) యుక్తులచేతను, అనుభవంబులచేతన్=స్వానుభవంబులచేతను, ఎఱుంగవలయున్=తెలిసికొనవలయును. మఱియున్=ఇదియును గాక.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఓయాంజనేయా! గురూపదేశక్రమమున వేదవాక్యములయొక్కయు యుక్తుల యొక్కయు సహాయముచే, 1 చిణీనాదము, 2 చిణిచిణీనాదము (చిరుగజ్జలమ్రోత వంటిది), 3 ఘంటానాదము, 4 శంఖనాదము, 5 వీణానాదము, 6 తాళనాదము, 7 వేణు నాదము, 8 భేరినాదము, 9 మృదంగనాదము, 10 మేఘనాదము నను పదితెఱంగులై ప్రణవనాదము రాజిల్లుచున్నదని నిశ్చయించుకొనవలయును. ముద్రాభ్యాసముచే వాని నన్నిటి ననుభవింపవలయును. ఇదియునుగాక.

అవ. ఇట్లు నాదభేదముల నిరూపించి యీక్రింద ప్రణవార్థమును వివరించి నాదానుభవఫలమును నిరూపించుచున్నాఁడు:—

తే. భూరినాదం బకారంబు పుణ్యపురుష!
విమలబిందువు లసదుకారము గపీంద్ర!
కళ మకార మీమూఁడును గలియఁ గూర్ప
ఘనతరోంకార మగు సదాగతికుమార! 128

టీ. పుణ్యపురుష=పుణ్యాత్మా! భూరినాదంబు-భూరి=గొప్పదగు, నాదంబు=పైన వివరింపఁబడిన పదివిధము లగునాదము, అకారంబు=ఓంకారమునకు అవయవమగు నకారము (అనఁగా: అకారార్థమగుట; అకారము, ఉకారము, మకారము అను మూఁడును ఓంకారమున కవయవములు.) కపీంద్ర=వానరశ్రేష్ఠా! విమల=నిర్మలమగు, బిందువు (అంతఃకరణము), లసత్=ప్రకాశించుచున్న, ఉకారము=ఓంకారావయవభూతమగు నుకారము (అనఁగా: ఉకారార్థము), సదాగతికుమార=వాయుపుత్రా! కళ=చిత్కళ, మకారము=ఓంకారమునకు అవయవమగు మకారము (అనఁగా: మకారార్థము.), ఈ మూఁడును, కలియఁగూర్పన్=చేర్పఁగా, ఘనతరోంకారమగున్-ఘనతర=ప్రసిద్ధమగు, ఓంకారమగున్ = ప్రణవమగును. (అనఁగా: అకారఉకారమకారములుగలసి ప్రణవ మగును. నాదబిందుకళలు దానియర్థము. అకారము, ఉకారము, మకారము అను మూఁడును ఓంకారముల కవయవములు.)

తా. ఓపుణ్యాత్మా! వానరశ్రేష్ఠా! వాయుకుమారా! ఓంకారమునకు అకారము ఉకారము మకారము అను మూఁడవయవములు కలవు. అందుఁ బైవర్ణింపఁబడియున్న దశవిధనాదములే అకారమున కర్థము. ఉకారమనఁగా బిందువు. చిత్కళలే మకారమున కర్థము. బిందుకళలనుగూర్చి క్రమక్రమముగ వివరింపఁబడును. ఈకారణమువలన ఓంకారమునకు నాదబిందుకళ లని యర్థ మేర్పడుచున్నది.

వనమయూరవృత్తము —

గౌరవయకారము నుకారము మకారం
బారయఁగఁ గూడి యొక ... రమునాదో...

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కార మనఁగా నిఖిలకారణము నై ఘం
టారవమురీతి హృదయాబ్జమున మ్రోయున్. 129

టీ. గౌరవ...ముక్-గౌరవ = ఘనమైన, అకారముక్, ఉకారమును, మకారంబు, అరయఁగక్=విచారింపఁగా, కూడి=ఈమూఁడువర్ణములు గలసి, ఒకయక్షరము=ఒకవర్ణమగు, అనాద్యోంకారము-అనాది = అనాదిసిద్ధమైన, ఓంకారము=ప్రణవము, అనఁగాక్=అయి, నిఖి...మునై-నిఖిల=సమస్తమునకు, కారణమునై=కారణభూతమై, ఘంటారవమురీతిక్=ఘంటాధ్వనివలె, హృదయాబ్జమునక్ = హృదయకమలమునందు, మ్రోయుక్=ధ్వనించును. (దశవిధనాదములను వినఁబడినపిదప చెవులుమూసినను మూయకుండినను గూడ నొకటేరీతిగ ప్రణవము ఘంటానాదమువలె మ్రోఁగుచునే యుండునని తెలిసికొనవలయును.)

తా. పైనవివరించినట్లుగా పదివిధములగు ప్రణవనాదముల వినినయోగి తుదకయోంకారము ఘంటానాదమువలె సర్వకాలములయందు నొకటేతీరుగ హృదయకమలమున మ్రోఁగుచుండును. ఈఘంటానాదము పైన వర్ణింపఁబడియున్న ఘంటానాదమువలె నశించునది కాదు. శంఖనాదము మొదలగురూపములతో మార్పుఁ జెందునదికాదు. పై వర్ణింపఁబడియున్న ఘంటానాదము ప్రణవావయవమైన అకారమునకు అర్థమగునది; ఇప్పుడు చెప్పఁబడిన ఘంటానాదము అవయవి (అకార, ఉకార, మకారములు చేరఁగా నేర్పడినది) యైన యోంకారమే స్వరూపముగాఁ గలది. కావున దశవిధనాదముల ననుభవించుటవలన, నాదబిందుకళాత్మకమైన యనాదిసిద్ధమగు నోంకారము సర్వకాలములయందును సాక్షాత్కరింపఁ గలయట్టిసామర్థ్యము సాధకునకుఁ గలుగును.

అవ. ఇట్లు నాదానుభవమువలని ప్రయోజనమును నిరూపించి దానియం దభిరుచి గలిగించుటకై యర్థవాదము నారంభించుచున్నాఁడు:—

క. హృదయసదనమునఁ బొదలెడి
సదమలనాదామృతంబు చవి గొన కున్నన్
మది గదలుచుఁ గుదురదు గలు
గదు మొదలిటిపదము ముదము గదుర దుదయమై. 130

టీ. హృదయసదనమునక్=హృదయ మనెడుగృహమునందు, పొద...న్నక్ - పొదలెడి=ఒప్పుచున్న, సత్=శ్రేష్ఠమైన, అమల = నిర్మలమైన, నాద=నాదమనియెడు (దశవిధనాదములకును బిదప చెవులుమూసినను తెఱచినను ఘంటానాదమువలె వినఁబడు ప్రణవ మనియెడు) అమృతమును, చవిగొనకున్నక్ = రుచి చూడకపోయినయెడల, మది=మనస్సు, కదలుచుక్ = చలించుచు, కుదురదు=స్థిరము కాదు. మొదటిపదము =

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అనాదిసిద్ధమైన మోక్షము, కలుగదు=లభింపదు. ముదము=బ్రహ్మానందము, ఉదయమై=పుట్టి, కదురదు=అభివృద్ధిఁ జెందదు.

తా. ఓపుత్త్రకా! పైన వివరింపఁబడినట్టియు అవయవియైనట్టియుఁ నాదబిందుకళాస్వరూపమైనట్టియుఁ ఓంకారము తెలిసికొనినను దెలిసికొనకున్ననుగూడ హృదయకమలమున నెప్పుడును మ్రోఁగుచునేయున్నది. నాదానుభవమువలనఁగాని దానియునికి తెలియరాదు. ఇట్లు ప్రయత్నపూర్వకముగ దానియునికిని దెలిసికొనకున్న మనసు నిశ్చలముకాదు. ఆఘంటానాదము అమృతమువలె మనసున కానందమును గలిగించును. అట్టి యానందము ననుభవించుటకును మరగకున్న మనసునకు శాంతి కలుగు టెట్లు? మనశ్శాంతిసాధ్యమైన మోక్షము దొరకు టెట్లు? కావున సర్వవిధములను నాదానుభవమునకై ప్రయత్నింపవలయును.

క. నాదం బంచితపరమా, హ్లాదము చిత్తప్రసాద మపగతగురుసం
వాదము గతభేదం బని, వేదంబులు పలుకు వేదవేదాంతజ్ఞా! 131

టీ. వేదవేదాంతజ్ఞా - వేద = వేదములను, వేదాంత = వేదాంతశాస్త్రమును (ఉపనిషత్తులను), జ్ఞా=తెలిసిన యో హనుమంతుఁడా! వేదంబులు=వేదములు, నాదంబు=ఈ ప్రణవనాదము, అంచి...దంబు-అంచిత = ఒప్పునట్లు చేయఁబడిన, పరమ = శ్రేష్ఠమగు, ఆహ్లాదము = సంతోషము గలది యనియుఁ (అనఁగా: సంతోషింపఁజేయునది యనియు), చిత్తప్రసాదము - చిత్త = మనసును, ప్రసాదము = నిర్మలముఁ జేయునది యనియుఁ, అప...దము-అపగత=పోయిన, గురు=అధిక మగు, సంవాదము=వివాదములు గలది యనియుఁ (అనఁగా: వివాదములు లేని దనియు, నాదము కల దనువిషయముఁ గూర్చి కాని అది చిత్తమును పరిశుద్ధముఁ జేయుఁ ననువిషయమునుగూర్చి కాని యేమతస్థులకుఁ గూడ వివాదములేదు. అందఱు నీవిషయము నేకవాక్యముగ నంగీకరించి యున్నారని భావము), గతభేదంబు=భేదములు లేని దనియుఁ (పదివిధములుగాఁ గానవచ్చుటయే కాని వాస్తవస్థితిలో నాదమునం దాభేదములు లే వని భావము), అని = ఈవిధముగా, పలుకుర్=చెప్పుచున్నవి.

తా. వేదవేదాంతముల నెఱింగిన యో యాంజనేయా! యీనాదము మిగుల నానందమును గలిగించునది యనియు, మనస్సును నిర్మలముఁ జేయునది యనియు, దీని కిట్టిసామర్థ్యము కల దనువిషయము నేమతస్థులు కాని యాక్షేపింప రనియు, పైని జూపఁబడియున్న పదిభేదములును మనోవైకల్యము ననుసరించి వచ్చినవేకాని యీ నాదమునకు (ఘంటానాదమునుగూర్చి 129-వ పద్యమునందుఁ జెప్పఁబడియున్నది.) వాస్తవస్థితిలో నాభేదము లేవియుఁ లేవనియుఁ వేదములు చెప్పుచున్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. ప్రణవనాదరసామృతపానరతుని
విమలనయనము లనిమిషత్వము వహింప
మనసు దేవాలయంబున మనికి మరగి
సలలితకళావిభూతిచే వెలయుచుండు. 132

టీ. ప్రణ...ములు-ప్రణవనాద = ఓంకారనాదమువలనఁ గలిగిన, రస=ఆనంద మనియెడు, అమృతపాన=అమృతమును పానము చేయుటయందు, రతుని = ఆసక్తి గల పురుషునియొక్క, విమలనయనములు = నిర్మలములగు కనులు, అనిమిషత్వమున్ = రెప్ప పాటులేకుండుటను (దేవతగానుండుటను అనికూడ రెండవయర్థము), వహింపన్ = ధరింపఁగా, మనసు = అతనిమనసు, దేవాలయంబునన్ = దేవగృహమునందు (పురుషుఁడు అమృతపానము చేయువాఁడు కావునను, కన్నులుకూడ ననిమిషత్వము కలవి కావునను ఆపురుషుని శరీరము దేవగృహము అని భావము.) మనికిని మరగి=ఉండుటయందు రుచి గలిగి, సల...తిచేన్-సలలిత = ఒప్పుచున్న, కళావిభూతిచేన్ = చిత్కళాసంపదచేత (తేజస్సమృద్ధితో అని రెండవయర్థము. దేవలోకమున నివసించుటచే దేవతలతో సమాన మయ్యె నని భావము.), వెలయుచుండున్=ప్రకాశించుచుండును.

తా. ప్రణవనాదామృతమును బానము సేయుపురుషుఁడు అమృతమును పానము చేసిన దేవతవంటివాఁడు అగును. వానికన్నులకుఁ గూడ నిమేషము (రెప్పపాటు) లేకుండును. ఇట్లనిమిషుఁ డగు నాపురుషునిమనస్సు దేవలోకమున నున్నట్లు పరమానంద మనుభవించుచు నత్యద్భుతము లగుకళలచే (ఇచ్చట కళలనఁగా విద్యలును చిత్కళలును) ప్రకాశించును. పురుషుఁడు దేవతయైనప్పుడు వానిశరీరము దేవలోక మనుటలో సంశయ మేమి ?

సీ. అనిమిషుం డజరుండు నమృతుండు పటుశక్తి
ధరుఁడు సిద్ధుండు విద్యాధరుండు
యోగీశ్వరుండు సాధ్యుం డింద్రుఁడును శుచి
సమవర్తియును బుణ్యజనుఁడు భువన
పతియును పరసదాగతియును సుకృతార్థుఁ
డభవుఁ డనంతుండు నఖిలమిత్రుఁ
డతికళాశాలి మహాబుధుండు కవీశ్వ
రుండును సుమనోగురుండు ఘనుఁడు
ఆ. హంసవాహనుండు నచ్యుతుండు శివుండు
పరమపురుషుఁ డగుచుఁ బరఁగు చుండుఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పవనతనయ! వినుము ప్రణవనాదామృత
పానతృప్తుఁ డైనపావనుండు. 133

టీ. పవనతనయ = ఆంజనేయా! వినుము, ప్రణ...డైన - ప్రణవనాద = ఓంకారనాద మనియెడు, అమృతపాన = అమృతమును పానముచేయుటచేత, తృప్తుఁడైన = తృప్తిఁజెందిన, పావనుండు = పరిశుద్ధుఁడు, అనిమిషుండు= దేవత యని యర్థము (రెప్పపాటులేనివాఁడని భావము). అజరుండు=ముసలితనము లేని దేవత యని యర్థము (నశింపనిస్వభావము గలవాఁడని భావము). అమృతుండు = మరణము లేని దేవత యని యర్థము (ముక్తుఁడని భావము). పటుశక్తిధరుఁడు-పటు = అధికమైన, శక్తి = సర్వజ్ఞత్వము మొదలగు సకలవిధములగుశక్తులను, ధరుఁడు=ధరించినవాఁడు (శక్తి యాయుధముగాఁ గలకుమారస్వామి యని యర్థము.) సిద్ధుండు=సిద్ధుఁ డను దేవజాతివాఁడు (ముక్తిసిద్ధినిఁ జెందినవాఁడని భావము). విద్యాధరుండు = విద్యాధరజాతివాఁడు (జ్ఞానముకలవాఁడని భావము). యోగీశ్వరుండు = సప్తఋషులలోనివాఁడు (యోగులలో నుత్తముఁడని భావము). సాధ్యుండు = సాధ్యజాతిలోనివాఁడు (బ్రహ్మజ్ఞానము సాధించినవాఁడని భావము). ఇంద్రుఁడు = దేవరాజగునింద్రుఁడు (పరబ్రహ్మము తానే యని యెఱింగినవాఁడు కావున సాక్షాత్పరమేశ్వరుఁడే యని భావము. 'ఇది పరమైశ్వర్యే' అనుధాతువునుండి ఇంద్రశబ్దము జనించెను. కావున దానికి పరమేశ్వరుఁడని యర్థము). శుచి = అగ్ని (పరిశుద్ధుఁడని భావము). సమవర్తియును = యముఁడు (సర్వభూతసముఁడై వర్తించువాఁడని భావము). పుణ్యజనుఁడు = నిరృతి (పుణ్యాత్ముఁ డని భావము). భువనపతియుం = జలమునకుఁ బతియగు వరుణుఁడు (లోకనాయకుఁ డని భావము). వరసదాగతియును-వర = శ్రేష్ఠులగు, సత్=సత్పురుషులకు, ఆగతియును=ఆశ్రయుఁ డగువాఁడు (వాయుదేవుఁడని యర్థము). సుకృ...డు-సుకృత=బాగుగ నొనరింపఁబడిన, అర్థుఁడు = యోగరూఢమగు (అనఁగా: మనోనిగ్రహరూప మగు కార్యముగలవాఁ డని భావము.) బాగుగ సంపాదింపఁబడిన కుబేరుఁడని యర్థము. అభవుఁడు = ఈశాన్యదిక్కున కధిపతియగు నీశ్వరుఁడు, జన్మరహితుఁ డని భావము. (ఇంద్రాదులనుగూర్చి క్రమముగఁ జెప్పుటవలన జ్ఞానయోగికిని దిక్పాలకులకు సామ్యముఁ జూపవలయునని కవికి నభిప్రాయమున్నట్లు తోఁచుచున్నది.) అనంతుఁడు = శేషుఁడు (సర్వవ్యాపకుఁ డని భావము.), అఖిలమిత్రుఁడు=సూర్యుఁడు (సర్వభూతములకును హితుఁడని భావము.), అతికళాశాలి= చంద్రుఁడు (విద్యావంతుఁడు, లేక, చిత్కళలఁ జూచువాఁడని భావము.), మహాబుధుండు = బుధగ్రహము (విద్వాంసుఁడని భావము.), కవీశ్వరుండు = శుక్రగ్రహము (జ్ఞానియని భావము.), సుమ... [illegible] ...దేవతలకు, గురుండు = ఆచార్యుఁ డగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బృహస్పతియని యర్థము. (చక్కని మనసుగలవారిలోఁ నుత్తముఁ డని భావము.) హంస వాహనుండు = హంసయే వాహనముగాఁ గలచతుర్ముఖుఁడు (భ్రాంతిని తొలఁగించి బ్రహ్మమును ప్రకటింపఁజాలు హంసమంత్రమును నాధారముగాఁ జేసికొనినవాఁడని భావము.), అచ్యుతుండు=విష్ణువు (నాశరహితుఁ డని భావము). శివుండు = త్రిమూర్తుల లోని రుద్రుఁడు (ఆనందస్వరూపుఁ డని భావము). పరమపురుషుఁడు = పరబ్రహ్మము, అగుచుక్, పరఁగుచుండుక్ = ప్రకాశించుచుండును.

తా. ఓ ఆంజనేయా! వినుము. ప్రణవనాద మనెడుసమృతమును పానముఁజేసి తృప్తిని జెందిన పరిశుద్ధుఁడు లోకోత్తరుం డగును. ముద్రాభ్యాసబలమువలన నాతనికి రెప్పపాటు కలుగదు. శరీరమునకంటె భిన్నుఁ డగుటచే జరామరణములతో నాతనికి సంబంధములేదు. పరబ్రహ్మమునకంటె వేఱుకానివాఁ డగుటచే (అనఁగా: అభేద జ్ఞానము కలవాఁ డగుటచే) సకలవిధము లగుసామర్థ్యములు నాతనియందే యుండును. మఱియు నాతఁడు మోక్షసిద్ధినొందినవాఁడును బ్రహ్మజ్ఞానము కలవాఁడును రాజయోగ మును జక్కఁగ నభ్యసించువాఁడును ఆ యోగసిద్ధినిఁ జెందినవాఁడు నై యుండును. పరబ్రహ్మమునకంటె భిన్నుఁడు కాకపోవుటచే నాతఁడే సర్వేశ్వరుఁడు. శత్రుమిత్రులు సుఖదుఃఖములు మొదలగువానియందు రాగద్వేషములు లేనివాఁడు. నిర్మలుఁడు పుణ్యమయుఁడు. సకలలోకముల వానివానికార్యములయందుఁ బ్రవర్తింపఁజేయు వాఁడు. సత్పురుషుల కాశ్రయణీయుఁడు. కృతార్థతను చెందినవాఁడు. పుట్టుక లేనివాఁడు. నాశనము లేనివాఁడు. సకలభూతములయందును మైత్రి కలవాఁడు కాంతిశాలి. విద్వాంసుఁడు. జ్ఞానవంతుఁడు. సద్గుణవంతు లని చెప్పఁదగినవారలలో నెల్ల నుత్తముఁడు. ప్రపంచమునకంతకును శ్రేష్ఠుఁడు. ఈతఁడు హంసమంత్రము నాధారముగాఁ జేసికొని మోక్షార్థమై ప్రయత్నించుచుండును. ఇట్లగుటచే వీని కెప్పటి కిని నాశము లేదు. పరమానందస్వరూప మగుమోక్షమే యాతని స్వరూప మగును. కావున ఆ పరబ్రహ్మమే యీ సాధకుఁడు. (సర్వజీవులును పరబ్రహ్మమునకంటె వేఱుకానివారేయైనను యేజీవుని యజ్ఞానము తొలఁగునో వానికిమాత్రమే యీ యభేదజ్ఞానము కలుగును. కావున వాఁడుమాత్రమే బ్రహ్మాభిన్నుఁ డయ్యెనని వ్యవహ రింపఁబడుచున్నాఁడు.) ఇట్టివాఁ డగుటచేత నాసాధకుఁడు అనిమిషుఁడును అజరుఁ డును అమృతుఁడును (దేవత) శక్తిధరుఁడును (కుమారస్వామియును) సిద్ధుఁడును విద్యా ధరుఁడును యోగియు సాధ్యుఁడును (ఇవి దేవతలలోనియొకజాతి) ఇంద్రుఁడును అగ్నియు యముఁడు పుణ్యజనుఁడును (నైరృతి) వరుణుఁడును వాయువు కుబేరుఁడు ఈశానుఁడు శేషుఁడు సూర్యుఁడు చంద్రుఁడు బుధుఁడు శుక్రుఁడు బృహస్పతియు మేఘుఁడును బ్రహ్మ విష్ణు రుద్రులును పరబ్రహ్మంబునై సకలదేవమయుఁడుగా నున్నాఁ డని చెప్పఁబడుచున్నాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## చిత్కళాసాక్షాత్కారము.

అవ. ఇట్లు నాదానుభవమును ప్రశంసించి కళలనుగూర్చి చెప్పుటకై ప్రతిజ్ఞ చేయుచున్నాఁడు.—

ఆ. ఆంజనేయ! యింక నంతర్బహిర్మధ్య
దృగ్విలోకితప్రదీప్తచిత్క
ళావిభూతి యెల్ల భావించి చెప్పెద
నాదరించి చూడు మాత్మయందు. 134

టీ. ఆంజనేయా!, ఇంకన్ = ఇప్పుడు, అంతః...యెల్లన్-అంతః = లోపలి, బహిః=వెలుపలి, మధ్య = నడిమి, దృక్ = దృష్టులచేత (అనఁగా: పంచముద్రలచేత,) విలోకిత = చూడఁబడిన, ప్రదీప్త = ప్రకాశించుచున్న, చిత్కళావిభూతియెల్లన్ = చిత్కళలసంపదనంతయును, భావించి=వివరించి, చెప్పెదన్, ఆత్మయందున్ = మనసునందు, ఆదరించి=గౌరవించి, చూడుము = విచారింపుము. (లేక అనుభవమునకుఁ దెచ్చికొనుము.)

తా. ఓఆంజనేయా! పైన నిరూపింపఁబడియున్న పంచముద్రల నభ్యసించి చూడఁగాఁ గానవచ్చునట్టిచిత్కళలను గూర్చి వివరించెదను. చక్కఁగాఁ దెలిసికొనుము.

అవ. ఆచిత్కళలు పుట్టుస్థానమును చెప్పుచున్నాఁడు:—

ఆ. కనులు రెండు గురునియనుమతిఁ గొని మూసి
బొమలనడిమిద్విదళకమలమునను
విమలదృష్టినిలిపి శమలలితాత్ముఁడై
చూడవలయు లక్ష్యశోభనముల. 135

టీ. కనులురెండున్=రెండునేత్రములను, గురునియనుమతిన్ = గురువుయొక్క యాజ్ఞను, కొని = పొంది, మూసి, బొమ...నన్-బొమలనడిమి=కనుబొమలకు మధ్య భాగమందున్న, ద్విదళకమలమునన్=రెండుదళములు గలయాజ్ఞాకమలమునందు, విమలదృష్టినిలిపి=పరిశుద్ధమగుచూపును నిలిపి, శమలలితాత్ముఁడై-శమ=శాంతిచేత, లలిత=మనోహరమైన, ఆత్ముఁడై = మనసుగలవాఁడై, లక్ష్య...ములన్ - లక్ష్య = గురులనియెడు (అనఁగా: చిత్కళలనియెడు), శోభనములన్=శుభకరపదార్థముల, చూడవలయున్.

తా. సాధకుఁ డగువాఁడు చిత్తశాంతి గల్గి గురూపదేశబలమువలన కనులనుమూసి (అనఁగా: అంతర్లక్ష్యముచే) భ్రూమధ్యముననున్న రెండుదళముల కమలమునందు మనసును చూపును నిలిపి చూచినయెడల చిత్కళాలక్ష్యము నచ్చటఁ గానవచ్చును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. మునుపుగ హృదయాకాశము
గనుపట్టుం జూపులగుచుఁ గన్నులవెంటం
జనునది మన మగుఁ గావునఁ
గనఁదగు నాకాశపంచకంబందుఁ దగన్. 136

టీ. మునుపుగన్ = అట్లు చూచునపుడు మొట్టమొదట, హృదయాకాశము = చిత్తాకాశము, కనుపట్టున్=కనఁబడును. చూపులగుచున్ = చూపెడియాకారముగాఁ గలిగి, కన్నులవెంటన్=నేత్రముల మూలమున, చనునది=పోవునట్టిది. (అనఁగాఁ జూపని చెప్పఁబడుచున్నది). మనమగున్=మనస్సేయగును. (అనఁగా: మనము చూపని వ్యవహరించునది మనస్సే కాని వేఱు కాదని భావము. ఈమనస్సునకే హృదయాకాశమని పేరు). కావునన్ = కాఁబట్టి, అందున్ = ఆచూపునందు (అనఁగా: ఆమనస్సునందు,) తగన్=ఒప్పునట్లుగా, ఆకాశపంచకంబు=క్రిందఁ జెప్పఁబోవు నైదువిధము లగు నాకాశములను, కనఁదగున్=చూడవలయును.

తా. అట్లు చూచునప్పుడు మొట్టమొదట హృదయాకాశము కానవచ్చును. నేత్రేంద్రియములమూలముగా వెలికిఁ బ్రసరించునట్టి చిత్తవృత్తియే హృదయాకాశమను పేరఁ బిలువఁబడుచున్నది. లోకమున దానికే "చూపు" అనువ్యవహారము కలదు. పైవిమర్శ ననుసరించి చూచిన హృదయాకాశ మనఁగాఁ జిత్తవృత్తియే కావున దానికిని మనసునకును భేదము కలుగదు. కావున ముద్ర నభ్యసించువానికి మొదటఁ గానఁబడునది మనస్సు. ఆమనసునందు అయిదువిధము లగు నాకాశములు గానవచ్చును.

వ. ఇట్లు తనలోచనంబులకుఁ గనుచూపుమేర గోచరంబైనహృదయాకాశంబునందుఁ గేవలనిరాకారం బైనగుణరహితాకాశంబు నిబిడనిష్ఠురనీరంధ్రగాఢాంధకారంబైనపరాకాశంబు ప్రళయకాలప్రజ్వలజ్జ్వాలాభీలదావానలాకారం బైనమహాకాశంబు వివిధవిచిత్రవితతాపరిమితద్యుతిభరితం బైనతత్త్వాకాశంబు ప్రచండమార్తాండమండలశతకోటిప్రభాభాసురం బైనసూర్యాకాశంబు నా పంచాకాశంబుల నవలోకింపవలయును. 137

టీ. ఇట్లు=ఈవిధముగా, కనుచూపుమేరన్=చూచినంతవఱకును, తనలోచనంబులకున్=తనకన్నులకు, గోచరంబైన=కానవచ్చిన, హృదయాకాశంబునందున్=మనస్సని యెడు నాకాశమునందు, కేవలనిరాకారంబైన=ఇది యిట్టిదని చెప్పరాని, గుణరహితాకాశంబు = స్వభావసిద్ధ మగుశబ్దగుణము లేని యాకాశమును, నిబి...బైన - నిబిడ = దట్టమైనట్టియు, నిష్ఠుర=భయంకర మైనట్టియు, నీరంధ్ర=ఎడము లేనట్టియు, గాఢాంధకారంబైన=అపరిమిత మగుచీఁకటియే స్వరూపముగాఁగల, పరాకాశంబును=పరాకాశ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మనఁబడునాకాశమును, ప్రళ...రంబు-ప్రళయ = ప్రళయకాలమునందు, ప్రజ్వలత్=మండుచున్న, జ్వాలా=జ్వాలలచే, ఆభీల=భయంకర మగు,దావానలాకారంబు=దావాగ్ని వంటిరూపముగలది, ఏనమహాకాశంబు = ఏనట్టిమహాకాశం బనునాకాశంబును, వివి...తంబు-వివిధ=అనేకవిధములై, విచిత్ర=చిత్రములై, వితత=వ్యాపించునవియై, అపరిమిత=మితిమీఱినవి యైయున్న, ద్యుతి=కాంతులచే, భరితంబు=నిండింపఁ బడినది, ఏనతత్త్వాకాశంబు = ఏనట్టితత్త్వాకాశ మనునాకాశంబును, ప్రచం...రంబు-ప్రచండ=తీవ్రము లగునట్టి, శతకోటిమార్తాండమండల = నూఱుకోట్లసంఖ్యగల సూర్యమండలములయొక్క, ప్రభా=కాంతులచేఁ భాసురంబు = ప్రకాశించుచున్నది, ఏనసూర్యాకాశంబు = ఏనట్టి సూర్యాకాశ మనియెడు నాకాశంబును, అనుపంచాకాశంబులన్=అను పేరుగలయైదాకాశములను, అవలోకింపవలయున్ = చూడవలయును. (ఇదియే వియన్మండలము) మఱియున్.

తా. అవి యేవనిన శబ్దగుణరహిత మగునాకాశము పరాకాశము మహాకాశము తత్త్వాకాశము సూర్యాకాశము ననునవియే. అందు శబ్దగుణరహిత మగునాకాశమునందు గుణము లేకపోవుట యొక్కటియేకాని యితరము లగురూపము భేదము లేవియును లేవు. పరాకాశ మనునది దట్టమై భయంకరమై యున్నయంధకారముచే వ్యాపింపఁబడి యుండును. మహాకాశ మనునది ప్రళయకాలమునందలియగ్నివలె నతిభయంకరముగా నుండును. తత్త్వాకాశమునందు లెక్కకు మిక్కిలిగ బహువిధము లగుకాంతులు తేజరిల్లు చుండును. అనేకకోట్లసంఖ్యగలసూర్యు లొక్కమాఱే యుదయించినట్లు సూర్యాకాశము రాజిల్లుచుండును. ఇట్టిరూపములతో నున్న యీయైదాకాశములను బాగుగఁ జూడ వలయును.

ఆ. ఆంజనేయ! విను తదాకాశపంచక
మధ్యమమున వెలుఁగుమహితకళల
చంద మెల్ల నీకు ముందుగా వినిపింతు
సందియములు మాని పొందు వాని. 138

టీ. ఆంజనేయ! వినుము. తదా...మునన్-తదాకాశపంచక=పైనఁజెప్పినయైదు ఆకాశములయొక్క, మధ్యమమునన్ = నడుమ (అనఁగా ఒకయాకాశము కనఁబడి రెండవయాకాశము కనఁబడుటకుఁ బూర్వము) వెలుఁగు...మెల్లన్-వెలుఁగు = ప్రకాశించునట్టి, మహిత=ఒప్పుచున్న, కళలచందమెల్లన్=చిత్కళలయొక్కవిధమునంతయు, నీకున్, ముందుగాన్, వినిపింతున్, వానిన్=ఆకళలను, సందియములుమాని = సంశయములఁ బోఁగొట్టుకొని, పొందు=అనుభవింపుము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఇట్లీయైదాకాశములఁ జూచునప్పుడు వానిమధ్యభాగమునందు చిత్కళలనేకవిధములుగఁ గానవచ్చును. ఓ ఆంజనేయా! వానిని వివరించెదను వినుము. ప్రత్యక్షముగఁ గనుఁగొనుము.

అవ. ఇట్లు సర్వచిత్కళలకును ఆధారములైన యాకాశముల నిరూపించి యందుఁ గానవచ్చు కళలను వర్ణించుచున్నాఁడు:—

సీ. మందాకినీసుధాసందోహదుగ్ధాబ్ధి
సౌందర్యలహరులచందమునను
మందారమల్లికాకుందారవిందోరు
చందనపుష్పరుక్చయముపగిది
నిందిరాసుందరీమందిరాంతర్మక
రందనిర్ఝరరుచిప్రతతిరీతి
నిందుభృన్నందిసంక్రందనకరిమృగేం
ద్రఫణీంద్రదీప్తిబృందములభాతి
తే. హారనీహారడిండీరశారదాభ్ర
హారకర్పూరతారకాకారకాంతి
కరణి నాకాశపంచగాంతరమునందు
మండితము లగుఁ జిత్కళామండలములు. 139

టీ. చిత్కళామండలములు = చిత్కళాసమూహములు, మందా...మునన్ - మందాకినీ = ఆకాశగంగయొక్క, సుధాసందోహ = అమృతసమూహముయొక్కయు, దుగ్ధాబ్ధి=క్షీరసముద్రముయొక్కయు, సౌందర్య=సుందరములైన, లహరులచందమునన్= అలలయట్లును, మందా...గిదిన్=మందార=కల్పవృక్షముయొక్కయు, మల్లికా=మల్లెతీఁగెయొక్కయు, కుంద=మొల్లతీఁగెయొక్కయు, అరవింద = తామరయొక్కయు, ఉరుచందన = చందనవృక్షముయొక్కయు, పుష్ప = పువ్వులయొక్క, రుక్చయము పగిదిన్ = కాంతిసమూహమువలెను, ఇంది...రీతిన్-ఇందిరాసుందరీమందిర=లక్ష్మీదేవికి గృహ మగుపద్మముయొక్క (పద్మములలో మిగుల నుత్తమ మైనదనియు, శ్రేష్ఠమగు మకరందము అమితముగాఁ గలదనియు సూచించుటకై యీవిశేషణ ముపయోగింపఁ బడెను. మహాత్ము లాదరించుపదార్థము లోకోత్తరమైయుండు ననిభావము.) అంతః = లోపలనున్న, మకరంద=తేనియయొక్క, నిర్ఝర = ప్రవాహముయొక్క, రుచిప్రతతి రీతిన్ = కాంతిసమూహమువలెను, ఇందు...భాతిన్ - ఇందుభృత్ = ఈశ్వరుని యొక్కయు, నంది = నందికేశ్వరునియొక్కయు, సంక్రందనకరి = ఇంద్రునిగజమగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నైరావతముయొక్కయు, మృగేంద్ర = సింహముయొక్కయు, ఫణీంద్ర = సర్పరాజగు శేషునియొక్కయు, దీప్తబృందములభాతిఁ = కాంతిసమూహములవలెను, హార...రణిఁ-హార = ముత్యాలహారముయొక్కయు, నీహార = మంచుయొక్కయు, డిండీర = నురుగుయొక్కయు, శారదాభ్ర = శరత్కాలమేఘముయొక్కయు, హీర = వజ్రరత్నముయొక్కయు, కర్పూర = పచ్చకర్పూరముయొక్కయు, తారకా = నక్షత్రములయొక్కయు, ఆకార = రూపములయొక్క, కాంతికరణిఁ = తేజస్సులవలెను, ఆకాశపంచకాంతరమునందుఁ = పైఁజెప్పఁబడిన యైదుఆకాశములనడుమ, మండితములగుఁ = ప్రకాశించును, (తెల్లనివై ప్రకాశించుననుట.) (ఇదియే తారకామండలము.)

తా. ఆయాకాశపంచకముయొక్క నడుమఁ గానఁబడుకళలు ఆకాశగంగయొక్కయు నమృతముయొక్కయు పాలసముద్రముయొక్కయు తరంగములవలె నతిస్వచ్ఛము లగుచుఁ బ్రకాశించును. కల్పవృక్షములు మల్లెలు మొల్లలు తామర శ్రీగంధమునను వృక్షములయందలి పుష్పములయొక్క కాంతులవలె రాజిల్లును. లక్ష్మీదేవికి నాశ్రయమగుటచే లోకోత్తరమై యున్నకమలమునందలి మకరందధారవలె మిగుల సానందకరములై స్వచ్ఛములై తనరారుచు. ఈశ్వరునియట్లు నందికేశ్వరునివలె నైరావతమురీతి సింహముక్రియ శేషునిభంగి శోభిల్లును. ముత్యములు మంచు నురుగు శరత్కాలమేఘములు వజ్రరత్నము కర్పూరము నక్షత్రములు వీనియట్లనేకవిధములగు నాకారములతో నొప్పుచుండును.

సీ. సద్యస్తమోనాశఖద్యోతమానస
        ద్విద్యుల్లతాప్రభావీథిపగిది
హృద్యక్షపావేద్యఖద్యోతసందోహ
        విద్యమానద్యుతివితతికరణి
ఘోరాంధకారకృద్భూరినీలసవారి
        వారివాహచ్ఛవివ్రజమురీతి
నీలవైడూర్యప్రవాళాబ్జరాగము
        క్తాఫలగోమేధికములభాతి
తే. శుద్ధమాణిక్యమరకతశోణరత్న
తప్తతపనీయరుచులచందమున హృదయ
మండితాకాశపంచకమధ్యమమునఁ
గానఁబడుచుండుఁ జిన్మయకళలు వత్స! 140

టీ. వత్స = పుత్రకా, చిన్మయకళలు = చిత్కళలు, హృద...మునఁ-హృదయ=హృదయ[illegible] (మనస్సనుట), [illegible] = జ్వాజ్వల్య[illegible], ఆకాశపంచక=ఐదా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాశములయొక్క, మధ్యమునన్ = నడుమ, సద్య...గిదిన్-సద్యః=తత్క్షణమే, తమో
నాశ = చీఁకటిని బోఁగొట్టినట్టియు, విద్యోతమాన=ఆకాశమునం బ్రకాశించుచున్న
ట్టియు, సత్ = శ్రేష్ఠమైనట్టియు, విద్యుల్లతా = మెఱపుతీఁగెలయొక్క, ప్రభావీథి
పగిదిన్=కాంతిసమూహమువలెను, హృ...రణిన్-హృద్య = మనోహరములైనట్టియు,
క్షపా=రాత్రులయందే, వేద్య=తెలియఁదగినట్టియు (మిడుఁగుఱుఁబురుగులకాంతి పగలు
కానరాదు కావున నిట్లు చెప్పఁబడెను) ఖద్యోత=మిడుఁగుఱుఁబురుగులయొక్క, సం
దోహ=సమూహమునందు, విద్యమాన=ఉన్న, ద్యుతివితతికరణిన్ = కాంతిసమూహము
వలెను, ఘోరా...రీతిన్-ఘోర = భయంకరమైన, అంధకారకృత్ = చీఁకటినిఁజేయు
చున్న, భూరి=అపరిమితములైన, నీల=నల్లనైన, సవారి=జలముతోఁగూడిన (ఇది హేతు
గర్భవిశేషణము. మేఘమునందు నీరున్నప్పుడు మిగుల నల్లగనుండును.) వారివాహ=మేఘ
ములయొక్క, ఛవి=కాంతులయొక్క, వ్రజమురీతిన్=సమూహమువలెను (ఈమూఁడు
పాదములచే విద్యున్మండలమేఘమండలములు చెప్పఁబడెను.) నీల...భాతిన్-నీల=ఇంద్ర
నీలముయొక్కయు (ఇది నల్లనిరత్నము): వైడూర్య = వైడూర్యరత్నముయొక్కయు
(ఇది పిల్లి కన్నులవలె నుండురత్నము), ప్రవాళ=పగడము యొక్కయు, అబ్జరాగ=పద్మ
రాగముయొక్కయు, ముక్తాఫల=ముత్యములయొక్కయు,గోమేధికముల=గోమేధికరత్న
ములయొక్కయు, భాతిన్=కాంతివలెను, శుద్ధ...మునన్-శుద్ధమాణిక్య=పరిశుద్ధమగు
మాణిక్యముయొక్కయు, మరకత=మరకతరత్నముయొక్కయు, (ఇదిఆకుపచ్చరత్నము)
శోణరత్న = కెంపులయొక్కయు, రుచులచందమునన్=కాంతులవలెను (దీనిచే జ్యోతి
ర్మండలము చెప్పఁబడెను). కానఁబడుచుండున్.

తా. మఱియు, నంధకారమును బోనాడుచు క్షణక్షణమునకు మేఘముచేఁ బరి
పూర్ణముగఁ గప్పఁబడిన యాకసమునందు మెఱయు మెఱపులవలెను, రాత్రులయందే
కాని ప్రకాశింపని మిడుఁగుఱుఁబురుగులయొక్క కాంతులవలెను, చీఁకటిఁ గ్రమ్ము
నట్లు చేయుచు జలసహితములై యాకసమంతయు వ్యాపించియున్న మేఘములరీతిగను
ఇంద్రనీలము వైడూర్యము పగడము పద్మరాగము ముత్యము గోమేధికము మొదలగు
రత్నములకైవడి మాణిక్యము మరకతము శ్రేష్ఠమగు సువర్ణము మొదలగువానిపోలికను
ఆచిత్కళలు పైఁ జెప్పఁబడిన యైదాకాశముల మధ్యభాగమునందును సాధకునకుఁ
గానవచ్చును.

శా. చండాంశుప్రభ లుట్టిపడ్డగతి భాస్వచ్చిత్కళాకోటులు
ద్దండస్ఫూర్తు లఖండఖండములునై తండోపతండంబులై
నిండారం గనుపట్టువెండియును హృన్నీరేజమధ్యాంచితా
ఖండాకాశపరంపరాంతరమునన్ గమ్యంబులై యంతటన్. 141

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. వెండియుఁ=మఱియును, హృన్నీ...మునఁ-హృన్నీరేజ = హృదయకమలముయొక్క (మనస్సుయొక్క), మధ్య=నడుమ, అంచిత=ఒప్పుచున్న, అఖండ=విచ్ఛేదములేని, ఆకాశపరంపరా = పైఁజెప్పఁబడిన పంచాకాశములవరుసయొక్క, అంతరమునఁ=మధ్యభాగమునందు, గమ్యంబులై = తోఁచుచున్నవియై, చండాంశుప్రభలు=సూర్యకాంతులు, ఉట్టిపడ్డగతిఁ=ఆకస్మికముగఁ దోఁచినట్లు, భాస్వ...టులు-భాస్వత్=ప్రకాశించుచున్న, చిత్కళాకోటులు = చిత్కళాసమూహములు, ఉద్దండస్ఫూర్తులఁ=అమితము లగుకాంతులచే, ఖండఖండములునై=విచ్ఛేదములు గలవి యగుచు (అనఁగా: ఒకదానికిని మఱియొకదానికిని నడుమ నవకాశ ముండునట్లు), తండోపతండంబులై=లెక్కకు మిక్కిలియై, నిండారఁ = సంపూర్ణముగ (సర్వవ్యాపకములై అనుట), కనపట్టుఁ=కానవచ్చును. (ఈపద్యమునందు కూడ జ్యోతిర్మండలమును గూర్చియే చెప్పఁబడె నని తెలిసికొనవలయును.) అంతటఁ=ఆపిదప.

తా. ఇంతమాత్రమే కాదు. ఆయాకాశపంచకములనడుమ సూర్యకిరణములు లెక్కకు మిక్కిలియై యాకస్మికముగ నుదయించి తమకాంతిచే దృష్టులను జెదరించుచు తండోపతండములుగ తాను జూచుచున్న యాకాశమునం దంతటను వెల్లివిరిసినట్లు గానఁబడును.

### జ్ఞానసూర్యోదయవర్ణనము

సీ. తరుణబోధారుణోదయదీప్తి నజ్ఞాన
గురుతమ మజ్ఞహృద్గుహల నడఁగ
ఫుల్లషడ్జలజాతములమీఁద నిక్క హం
సము త్రివేణీసంగమమున మెలఁగ
విమలేంద్రియేందీవరము లెల్ల ముకులింప
మన మనుశశి సుఖవనధి జాఱ
సలలితజ్ఞానవిజ్ఞానకోశంబు ల
న్యోన్యసంగతము లై యనఁగి పెనఁగ
తే. నాతతాజాండపిండాండజాతములను
బూని వెలిఁగించుఁ బటుతరస్ఫూర్తితోడ
ఘనతరాంతర్హృదాకాశమున వెలుంగు
మండితాఖండవిభ్రాజమండలంబు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ఘనత...మునన్-ఘనతర = శ్రేష్ఠమైన, అంతర్హృదాకాశమునన్=లోపల నుండు హృదయాకాశమునందు, వెలుం...లంబు-వెలుంగు=ప్రకాశించుచున్న, మండిత= ఒప్పుచున్న, అఖండ=సర్వవ్యాపక మైన, చిద్భానుమండలంబు=జ్ఞానమనియెడు సూర్య మండలము, తరు...దీప్తిన్-తరుణ=కోమల మైన, బోధ=జ్ఞానమనెడు, అరుణోదయ= అరుణోదయముయొక్క (ఇది సూర్యోదయమునకు ముందు కలుగును. అని సర్వలోక ప్రసిద్ధము), దీప్తి = కాంతిచేత, అజ్ఞానగురుతమము = అజ్ఞానమనియెడుగొప్పయంధ కారము, అజ్ఞహృద్గుహలన్ = అజ్ఞానులయొక్క హృదయము లనెడుగుహలయందు, అడంగన్ = దాఁగుచుండఁగా, ఫుల్ల...మీదన్-ఫుల్ల = వికసించిన, షడ్జలజాతముల మీఁదన్=షడాధారకమలములమీఁద, నిక్కి=నిలిచి (లేక, తలయెత్తి; అజ్ఞానకమలము నకుఁ బై నున్నసహస్రారకమలమునఁ జేరియనుట), హంస = హంసపక్షి, (ఓంకారము నకు హంస యనునొకయవయవము కలదు. అదియె జీవుఁడని కూడఁ జెప్పుదురు. ఆహంస కును హంసపక్షికినిఁ గవి యభేదాధ్యవసాయమును జేసినాఁడు.) త్రివేణీసంగమములన్- త్రివేణీ=ఇడా, పింగళా, సుషుమ్నానాడులకు (ఇవియే గంగాయమునాసరస్వతు లని యోగశాస్త్రజ్ఞులు చెప్పుదురు). సంగమమునన్ = చేరిక యగుభ్రూమధ్యమునందు, మెలఁగన్ = సంచరించుచుండఁగా, విమత...ములు-విమత = శత్రువులగు, ఇంద్రియ= ఇంద్రియము లనెడు, ఇందీవరములెల్లన్=కలువలన్నియుఁ, ముకుళింపన్, మనసనుశశి= మన స్సనియెడు చంద్రుఁడు, సుఖవనధిన్ = ఆనందమనుసముద్రమునందు, జాఱన్= పడఁగా (అస్తమింపఁగా), సల...బులు-సలలిత = మనోహరము లగు, జ్ఞాన=జ్ఞానమను నట్టియు (ఇది సామాన్య మగు తెలివి), విజ్ఞాన = అనుభవపూర్వకజ్ఞాన మనునట్టియు, కోకంబులు=చక్రవాకపక్షులు, అన్యోన్యసంగతములై=ఒకదానితో నొకటిచేరి, అనఁగి= లోఁబడి, పెనఁగన్ = క్రీడింపఁగా, ఆత...ములన్ - ఆతత = వ్యాపించియున్న, అజాండ = బ్రహ్మాండములయొక్కయు, పిండాండ = ఆబ్రహ్మాండములయందలి జనుల యొక్కయు, జాతములన్=సమూహములను, పటు...తోడన్-పటుతర=మిగుల నధిక మైన, స్ఫూర్తితోడన్ = స్వకీయమైన ప్రకాశముచే, పూనివెలిఁగించున్ = ప్రయత్న పూర్వకముగఁ బ్రకాశింపఁ జేయును.

తా. ఇట్లు బహువిధములగు కళలు కానఁబడినపిదప బ్రహ్మాండముల నన్నిఁటి నొక్కమాఱే వెలిఁగింపఁజాలు మహాప్రకాశముతో పైపర్వింపఁబడిన హృదయాకాశము యొక్క మధ్యభాగమున జ్ఞానసూర్యుఁ డుదయించును. ఇదియు నొక చిత్కళయే. ఈ సూర్యోదయమునకు కొంచెముఁ బూర్వమున, (అనఁగా : ఆప్రకాశము సంపూర్ణముగ వెలికిరాకమునుపే) అజ్ఞానమనియెడు గాఢాంధకారము విచ్చి బ్రహ్మజ్ఞానశూన్యుల హృదయములనెడు గుహలలోఁ డాఁగును. ప్రత్యక్షమునఁగూడ సూర్యోదయమునకుఁ


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఋూర్వము అరుణోదయముననే చీఁకటి విచ్చిపోవుటయు పర్వతగుహలలోఁ దప్ప నితర స్థలములం దెచట నది కానరాకపోవుటయుఁ గలదు కదా. మఱియుఁ జీవరూపుఁడగు హంస షడాధారకమలముమీఁద నెక్కి హంసపక్షివలె సంచరించుచుండును. కలువలవలె బోలె నింద్రియములన్నియు వానివాని వృత్తుల మాని ముకుళించును. మనస్సను చంద్రుఁడును ఆనందసముద్రమున మునిఁగి యస్తమించును. పరోక్షజ్ఞానము, అపరోక్ష జ్ఞానము ననెడు చక్రవాకములు (బ్రహ్మము కలఁడని తెలిసికొనుట పరోక్షజ్ఞానము; ఆబ్రహ్మము నేనే యని తెలిసికొనుట యపరోక్షజ్ఞానము) ఒకటితో నొకటి కలసి యానందించును. చక్రవాకములు రాత్రులయందెల్ల విరహతాపముచే బాధింపబడు చుండుననియు సూర్యోదయము కాఁగానే ఒకదానితో నొకటి చేరుననియు ప్రత్యక్ష ముగనే తెలియఁబడుచున్నదికదా. ఇట్లు జ్ఞానసూర్యోదయము కాఁగానే మనస్సును ఇంద్రియములును శాంతినొందును. అనుభవజ్ఞానము చేకూరును. అజ్ఞానము తొలఁగును.

ఆ. సకలకర్మములకు సాక్షియై స్వప్రకా
శతఁ దమోఘ్నుఁ డగుచుఁ జక్షురాది
కప్రవర్తకత్వగరిమ భాసిలుసత్స్వ
భావుఁ డగుచుఁ జిద్విభావసుండు. 143

టీ. చిద్విభావసుండు=జ్ఞానసూర్యుఁడు, సత్స్వ...గుచుఁన్ - సత్=త్రికాలముల యందును నాశములేక నిలుచునట్టి, స్వభావుఁడగుచుఁన్ = స్వభావముగలవాఁడగుచు, సకలకర్మములకుఁన్ = ఇంద్రియములను మనస్సును జేయు కర్మముల కన్నిటికిని సాక్షియై = సాక్షిరూపుఁడై (వాని నన్నిటిని దెలిసికొనుచు), స్వప్రకాశతఁన్ = పరుల సహాయములేక స్వతంత్రముగఁ బ్రకాశించువాఁడగుటచే, తమోఘ్నుఁడగుచుఁన్ = అజ్ఞానమును బోఁగొట్టువాఁడగుచు (చీఁకటిని బోఁగొట్టువాఁడని యర్థాంతరము. తనకు మఱియొకని ప్రకాశముతో నావశ్యకము లేదనుటచే నితర పదార్థములన్నియుఁ దన ప్రకాశముచేతనే ప్రకాశించుచున్నవని యర్థ మేర్పడుచున్నది. అజ్ఞాన మున్నయెడల వస్తువులు ప్రకాశించుట సంభవింపదు. కావున 'తమోఘ్నుఁడు' అని చెప్పఁబడి యున్నది.) చక్షు...గరిమఁన్ - చక్షురాదిక = నేత్రములు శ్రోత్రములు మొదలగు నింద్రియములను, ప్రవర్తకత్వగరిమఁన్ = ప్రవర్తింపఁజేయువాఁడను గౌరవముచే (కన్నులనుండిగాని చెవులనుండిగాని వెలుపలికిఁ బ్రసరించి విషయములఁ బ్రకాశింపఁ జేయు జ్ఞానమే పరబ్రహ్మము ఆయనయే జ్ఞానసూర్యుఁడు. వాస్తవస్థితిలో నాయనకంటె వేఱగు వస్తువే లేదుకదా) భాసిలుఁన్=ప్రకాశించును.

తా. ఆజ్ఞానసూర్యుఁడు సర్వకార్యములకును (అనఁగా : మనసుగాని యింద్రియ ములుగాని ఏయేకార్యములు చేసినను వానికెల్ల) సాక్షి యగుచు స్వయంప్రకా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్వరూపుఁడగుటచే నజ్ఞానాంధకారమును దొలఁగించుచు నేత్రములు మొదలగు నింద్రియముల నన్నిటిని వాని కార్యములయందుఁ బ్రవర్తింపఁజేయుచుఁ బ్రత్యక్ష సూర్యునివలెఁ బ్రకాశించును.

క. భ్రూమధ్యోదయశైలము
పై మొదలం దోఁచి యంతఁ బ్రవిమలహృదయ
వ్యోమారూఢుం డింద్రియ
తామరసానందకరుఁడు దానై వెలుఁగున్. 144

టీ. మొదలన్ = మొట్టమొదట, భ్రూ...ముపై-భ్రూమధ్య = భ్రూమధ్య మనెడు, ఉదయశైలముపైన్=ఉదయపర్వతముమీఁద, తోఁచి=ఉదయించి, అంతన్= తర్వాత, ప్రవి...ఢుండు-ప్రవిమల = నిర్మలమగు, హృదయ = హృదయాకాశమును, ఆరూఢుండు = అధిష్ఠించినవాఁడుగాను, (ఆక్రమించినవాఁడుగాను), ఇంద్రి...రుఁడు- ఇంద్రియ=ఇంద్రియములనెడు, తామరస=కమలములకు, ఆనందకరుఁడు = ఆనందమును కలిగించువాఁడుగాను, తానై=తానే, వెలుఁగున్=ప్రకాశించును.

తా. ఆజ్ఞానసూర్యుఁడు భ్రూమధ్యమనెడు నుదయపర్వతముపై మొట్టమొదట నుదయించును. ఇంద్రియములను పద్మములకు నానందమును కలిగించుచు నంతకంతకు హృదయాకాశమధ్యభాగము నధిష్ఠించును.

## మానసికస్నానవిధి.

సీ. అంతకు మున్నె నీ వపరోక్షవిజ్ఞాన
చక్షువుల్ దెఱచి యజ్ఞానమోహ
నాంగి తాదాత్మ్యరూపాలింగనము మాని
చయ్యనఁ దనువనుశయ్య డిగ్గి
చారువైరాగ్యవిజ్ఞానోపరతులచే
మానసస్నానకర్మములఁ దీర్చి
యనిశంబు బుద్ధీంద్రియప్రేరకుండెవ్వఁ
డాదేవసవితృమహాప్రకాశ
తే. మెలమి నేలంచు లోచనాంజలులచేత
ఘనతరానందబాష్పకార్యంబు లిచ్చి
మొదల సందేహమందేహముఖపరప్ర
ణాశ మొనరించి యంత నానంద మలర. 145

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. అంతకుమున్నె=ఆసూర్యోదయముకంటె కొంచెముముందుగానె, నీవు=జీవుఁడవైన నీవు, అప...వులు-అపరోక్షవిజ్ఞాన = జీవబ్రహ్మములొక్కటియే యను నపరోక్షజ్ఞానమనియెడు, చక్షువులు=నేత్రములను, దెఱచి (మేల్కని), అజ్ఞా...నము-అజ్ఞాన=అజ్ఞానమనియెడు, మోహనాంగి = స్త్రీయొక్క, (లేక, స్త్రీని), తాదాత్మ్యరూప=తాదాత్మ్యస్వరూపమైన, (ఎఱ్ఱఁగఁ గాలిన యినుపముద్దయందు అగ్నియుండుటచే కాల్చుట మొదలగు నగ్నిగుణము లాయినుమునకే యున్నట్లు భ్రాంతిచే భావింపఁబడుచున్నది. వాస్తవస్థితిలో నాగుణములకును ఇనుమునకును సంబంధమే లేదుకదా. ఇట్లు బొత్తిగ సంబంధములేని రెండుపదార్థముల నెడ తెగని సంబంధమునకే తాదాత్మ్యసంబంధమని పేరు. ప్రకృతము జీవావిద్యలకుఁగల సంబంధ మిట్టిదేకాని స్వభావసిద్ధమైనది కాదని తెలిసికొనవలయును.) ఆలింగనముఁ=కౌఁగిలిని, (లేక, కౌఁగిలించుకొనుటను), మాని=విడిచి, చయ్యనఁ=శీఘ్రముగ, తనువనుశయ్యడిగ్గి=శరీరమను పాన్పునుదిగి (శరీరాభిమానమును వదలి అనుట), చారు...లచేఁ-చారు = మనోహరములగు, వైరాగ్య = వైరాగ్యముచేతను, విజ్ఞాన = అనుభవజ్ఞానముచేతను, ఉపరతులచేఁ = చిత్తశాంతిచేతను, మాన...ములఁ-మానస = మానసికమైన (మనస్సునందుమాత్రమే సంకల్పపూర్వకముగఁ జేయఁదగిన) స్నానకర్మములఁ=స్నానమును, తీర్చి=ముగించి (వైరాగ్యజ్ఞానశాంతులచేఁ బరిశుద్ధుఁడవై అనుట), అనిశంబు = ఎల్లప్పుడును, బుద్ధిం...కుండు-బుద్ధీంద్రియ = బుద్ధిని ఇంద్రియములను, ప్రేరకుండు = ప్రేరేపించువాఁడు, ఎవ్వఁడు = ఎవ్వఁడుగలఁడో, ఆదేవ...శము-ఆదేవ=స్వయంప్రకాశస్వరూపుఁడైన, సవితృ = సూర్యునియొక్క (పరమాత్ముఁడను సూర్యునియొక్క), మహత్=గొప్పదియగు, ప్రకాశము = తేజస్సు (ఇది గాయత్రీమంత్రార్థము సవితృశబ్దమునకు సూర్యుఁడని యర్థముఁజెప్పి ఈమంత్రమును సూర్యపరముగ నన్వయింతురు. ఆశబ్దమునకే "సృష్టికర్త=పరబ్రహ్మము." అని యర్థముఁజెప్పి దీనినే పరబ్రహ్మపక్షమునందుఁగూడ నన్వయింతురు. ఇచ్చట జ్ఞానసూర్యుఁడని చెప్పుటచేత నీ రెండర్థములను సమన్వయించుకొనవలయును. విష్ణు రుద్రాది దేవపరములగు నర్థములు ఈమంత్రమున కనేకములుగలవు. తఱచుగా నవియన్నియుఁ సవితృశబ్దమునకుఁ జెప్పఁబడు సృష్టికర్తయను నర్థము నాశ్రయించియే వచ్చుచున్నవి. విశేషములు భాష్యమునందు చూచునది.) ఎలమిఁ = సంతోషపూర్వకముగ (ఈపదము కేవలము పాదపూరణార్థ ముపయోగింపఁబడె ననిన లెస్సగ నుండును.) నేనంచుఁ=నేనే యని తలంచుచు (అజ్ఞానసూర్యుఁడగు పరబ్రహ్మమునకు నాకును అనఁగా: జీవునకును, భేదము లేదని నిశ్చయించుకొని), లోచనాంజలులచేతఁ = నేత్రములనియెడు దోయిళ్లచే, ఘన...బులు-ఘనతర=అధికములగు, ఆనంద=ఆనందమువలనఁబుట్టిన, బాష్పక=కన్నీరు కల్గిన (కన్నీటిచేతనింపఁబడిన), అర్ఘ్యంబులు=అర్ఘ్యములను, ఇచ్చి, మొదలఁ=మొట్ట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మొదట, సందే...శము-సందేహ=సంశయములనెడు (పరబ్రహ్మము నెట్లుగుదును? అను మొదలగు సంశయములనెడు), మందేహాముఖవర = మందేహుఁడు మొదలగు అఱువది యాఱుకోటి రాక్షసవీరులయొక్క, ప్రణాశము=నాశనమును, ఒనరించి=చేసి (అర్ఘ్య ప్రదానమనఁగా గాయత్రీ మంత్రాభిమంత్రితమగు నాయుదకము సూర్యశత్రువులగు మందేహాదిరాక్షసులను ఒకద్వీపమునఁ బడవేయునని శ్రుతి చెప్పుచున్నది. ఈజ్ఞాన సూర్యునియందును గవి సూర్యధర్మముల నారోపించుచున్నాఁడు గావున నర్ఘ్యప్రదాన మునుగూర్చి కూడ చెప్పినాఁడు. ఈ అర్ఘ్యప్రదానమునం దానందబాష్పములే యుదక మనియు, అనుభవజ్ఞానమునకు విఘ్నకారకములగు సంశయములే మందేహాది రాక్షసు లనియుఁ జెప్పుటచే, జ్ఞానసూర్యోదయమువలన నానంద మధికమగుననియు, సంశయము దీఱుననియు తాత్పర్య మేర్పడుచున్నది.) అంతఁ=పిమ్మట, ఆనందము, అలరన్ = అభి వృద్ధియగుచుండఁగా.

తా. అట్లాసూర్యుఁ డాకాశమధ్యము నధిష్ఠించుటకుఁ బూర్వమే యపరోక్షజ్ఞాన మనెడు కన్నులఁ దెఱచి మేల్కాంచి యజ్ఞానమనియెడు భార్యతోఁ గ్రీడించుట మాని శరీరమనెడు శయనమునుండి డిగ్గి వైరాగ్యజ్ఞానము చిత్తశాంతి అను నిర్మలజలములచే మనోమయమగు స్నానము నాచరించి ఏసూర్యుఁడు బ్రహ్మము బుద్ధి యింద్రియములు మొదలగువాని ప్రేరేపించుచున్నాఁడో అట్టి స్వప్రకాశ స్వరూపుఁడగువాని (జ్ఞాన సూర్యుని) ప్రకాశమునకు నమస్కారము అని పలుకుచు కన్నులను దోయిళ్లయందు ఆనందబాష్పములను జలము నింపి యర్ఘ్య మొసంగుము. ఆయర్ఘ్యముచే సందేహము లనియెడు మందేహాదిరాక్షసుల నాశ మొనరింపుము (సూర్యునితో నుదయాస్తమయ కాలములయందు, మందేహాదులను పేరుగల అఱువదియాఱుకోట్ల రాక్షసులు యుద్ధము సేయుదురనియు, గాయత్రీమంత్రముచే నభిమంత్రితమగు నర్ఘ్యజలము వజ్రా యుధమై వారిద్వీపాంతరమున బడవైచి సూర్యునకు కల్గుబాధను తప్పించుననియు వేదము చెప్పుచున్నది. ఇట్లు అర్ఘ్యప్రధానమైన పిమ్మట సంతోషయుక్తుఁడవై.

క. మౌనజపము నిర్వృత్తి
ధ్యానముఁ గావించి యక్రియాత్మార్చనముం
బూని యొనరించి చిదఖం
డానందం బనుభవింపవయ్య! మహాత్మా! 146

టీ. మహాత్మా=గొప్పబుద్ధిగల యోంజనేయా, మౌనజపమున్-మౌన=మౌనమని యెడు, జపమున్,(గాయత్రీజపమును) నిర్వృ...నమున్-నిర్వృత్తి=అంతఃకరణవృత్తులు లేకుండుట యనియెడు, ధ్యానమున్, కావించి = చేసి, అక్రియాత్మార్చనమున్-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అక్రియా = నిష్క్రియుండగు (అనఁగా : కార్యములను జేయని, లేక, నిష్క్రియత్వ మనియెడు) ఆత్మార్చనమున్ = ఆత్మయొక్క (లేక, బ్రహ్మముయొక్క) పూజను, పూని=ప్రయత్నముతో (దేవతార్చనను), ఒనరించి=చేసి, చిద...దంబు-చిత్ =జ్ఞానము చేత, (లేక, బ్రహ్మముచేత, లేక, జ్ఞానస్వరూపమగు, లేక, బ్రహ్మమయమగు.) అఖండ= పరిపూర్ణమైన, ఆనందంబు = బ్రహ్మానందమును, అనుభవింపవయ్యా. (ఇదియే భోజనము సేయుట.)

తా. ఓ బుద్ధిమంతుఁడా ! పిమ్మట మానమనెడు గాయత్రీజపమును ముగించి మనస్సంతర్ముఖమగుట యనెడు దేవతాధ్యానము నాచరించి యింద్రియవ్యాపారములు లేకపోవుట యనెడు దేవతార్చనను దీర్చి బ్రహ్మానందమను నాహారమును భుజింపుము.

తే. అట్లఖండసుఖామృతావాప్తిఁ జెంది
చిత్తవిశ్రాంతితాంబూలసిద్ధిఁ గాంచి
మురిసి యసమానమూర్తివై ముక్తికాంత
తో వినోదింపవయ్య! వాతూలతనయ! 147

టీ. వాతూలతనయ=వాయుపుత్రుఁడవగు నాంజనేయా, అట్లు = పైఁజెప్పినవిధ ముగా, అఖం...వాప్తిన్-అఖండ=పరిపూర్ణమగు, సుఖ=బ్రహ్మానందమనియెడు, అమృతా వాప్తిన్=అమృతమును పొందుటను (లేక, అమృతలాభమును), చెంది=పొంది, (అనఁగా: భుజించి,) చిత్త...సిద్ధిన్-చిత్తవిశ్రాంతి = చిత్తశాంతియనెడు, తాంబూలసిద్ధిన్ = తాంబూలలాభమును, కాంచి=పొంది, మురిసి = సంతోషించి, అస...ర్తివై-అసమాన = సాటిలేని, మూర్తివై = స్వరూపముగలవాఁడవై, ముక్తికాంతతోన్ = ముక్తియనెడు స్త్రీతో, వినోదింపవయ్య=క్రీడింపవయ్యా !

తా. ఆంజనేయా ! యీవిధముగ బ్రహ్మానంద మనునమృతమును భుజించి చిత్త విశ్రాంతి యనెడుతాంబూలమును స్వీకరించి సాటిలేని యానందముతో ముక్తికాంతతోఁ గూడి విహరింపుము.

## జ్ఞానచంద్రోదయవర్ణనము.

సీ. కామాదిఖగములగజిబిజు లడఁగ దే
హాభిమానాదిత్యుఁ డస్తమింప
సలయవిక్షేపకషాయరసాస్వాద
ధీంద్రియాబ్జములు నిద్రించుచుండ
విలసదాత్మాకారవృత్తికైరవజాత
మింపొంది వికసింప నెలుకమఱపు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లనుచక్రయుగమున కతివియోగము గల్గ
ఖండవిజ్ఞాననక్షత్రతతుల
తే. తెలివి వెల్వెలఁబోవ నిర్మలమనశ్చ
కోరతృష్ణానలంబు చల్లాఱ నంత
ననితరముగ హృదాకాశమున వెలుంగు
మండితాఖండచిచ్చంద్రమండలంబు. 148

టీ. అంతఁన్=తర్వాత, కామా...జులు-కామాది = కామము మొదలగు, ఖగములు=పక్షులయొక్క, గజిబిజులు = సందడి, అడఁగన్ = నశింపఁగా, దేహాభిమానాదిత్యుఁడు=దేహాభిమాన మనెడుసూర్యుఁడు, అస్తమింపన్ = అస్తమానమును జెందఁగా, సలయ...ములు-సలయ = ఆవరణము, (స్వయంప్రకాశ మగు బ్రహ్మస్వరూపమును లేనిదానినిగాఁ దలంచుట), విక్షేప=విక్షేపము, (పరబ్రహ్మవైపునకుఁ బోవుట వదలి ప్రపంచాభిమానము కలిగియుండుట), కషాయ=పరబ్రహ్మమువైపునకుఁ గాని, ప్రపంచమువైపునకుఁ గాని తిరుగక చిత్తము స్తంభితమైయుండుట, రసాస్వాద=చిత్తము భూతరూపములతోఁ బరిణామమును జెంది యాశబ్దాదులయనుభవమే పరమానంద మని భావించుట, ధీం...ములు-ధీ=బుద్ధి, ఇంద్రియ=ఇంద్రియములు అనియెడు, అబ్జములు=కమలములు, నిద్రించుచుండన్ = ముకుళింపఁగా, విల...తము-విలసత్ = ప్రకాశించుచున్న, ఆత్మాకార=బ్రహ్మాకారరూపములగు, వృత్తి = చిత్తవృత్తులనియెడు, కైరవజాతము = కలువల సమూహము, ఇంపొంది=అందముగా, వికసింపన్ = వికసింపఁగాను, ఎఱుకమఱపులు = జ్ఞానాజ్ఞానములు, అనుచక్రయుగమునకున్ = అనియెడు చక్రవాకపక్షులజతకు, అతి వియోగముగల్గన్=మిగుల వియోగము గల్గఁగా, ఖండవిజ్ఞాన = భేదజ్ఞానమనెడు, నక్షత్రతతుల తెలివి = నక్షత్రములకాంతి, వెల్వెలఁబోవన్=నశింపఁగాను, నిర్మల...బు-నిర్మల=పరిశుద్ధమగు, మనః=మనస్సనెడు, చకోర = చకోరపక్షియొక్క, తృష్ణ = దప్పిక యనియెడు (ఆశ యనియెడు అని భావము.) అనలంబు = అగ్ని, చల్లాఱన్ = శాంతింపఁగాను, మండి...లంబు - మండిత = ప్రకాశించుచున్నట్టియు, అఖండ = సర్వవ్యాపకమైనట్టియు, చిత్=జ్ఞానరూప మైనట్టియు, చంద్రమండలంబు=చంద్రబింబము, హృదాకాశమునన్ = హృదయాకాశమునందు, అనితరముగన్=సాటిలేనిదిగా, వెలుంగున్ = ప్రకాశించును.

తా. పిదప నా హృదయాకాశమునందే వర్ణింప నశక్య మగుకాంతితో జ్ఞానచంద్రమండల ముదయించును. అప్పుడు కామక్రోధాదు లనెడు పక్షులయుద్రేకము నశించి పోవును. దేహాభిమానమనెడు సూర్యుఁడు సంపూర్ణముగ నస్తమించును. ఆవర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ణము విక్షేపము కషాయము రసాస్వాదము బుద్ధి యింద్రియములు అనునవి కమలముల యట్లు ముకుళించును. (అనఁగా: వ్యాపారరహితములై నిలుచును.) అంతర్ముఖము లైన చిత్తవృత్తులు కలువలవలె బాగుగ వికసించును. జ్ఞానాజ్ఞానము లనెడు చక్రవాకము లకు సంపూర్ణ మగు వియోగము కలుగును. భేదజ్ఞాన మనెడు నక్షత్రములు కాంతి శూన్యము లగును. నిర్మలచిత్తము చకోరపక్షియట్లు ఆ చంద్రునికిరణములచే ఆశ యను దాహమును చల్లార్చుకొనును. కావున నీ జ్ఞానచంద్రోదయమువలన దేహాభిమానము సంపూర్ణముగ నశించును. కామక్రోధాదులు బొత్తిగ నశించును. తనకును బ్రహ్మము నకును భేదము లేదనుజ్ఞానము దృఢమగును. అజ్ఞాన మనునది బొత్తిగనే కానరాదు. తాపత్రయము నశించును.

## ముక్తికాంతాసమాగమము.

వ. అయ్యవసరంబున సుషుమ్నాంతఃపురంబున నప్రమేయతురీయ శయ్యాతలంబున హంసయానయు దుర్నిరీక్షకళాభాసమానయు మూలాధారమంజీరయు స్వాధిష్ఠానకింకిణీసమన్విత మేఖలయు మణి పూరక కాంచీకలాపయు హృదయకీలితానాహతరత్నభూషితయుఁ గంఠవిభ్రాజితవిశుద్ధమంగళసూత్రాలంకృతయు భ్రూమధ్యప్రకాశ మానసదమలద్విదళలాలాటికాశోభితయు సూర్యచంద్రమండలతా టంకయుగళవిరాజితయు ధగద్ధగాయమానసౌదామనీలతాశరీరిణి యు శుద్ధసత్వదుకూలావృతయు సచ్చిదానందస్వరూపిణియు నైన ముక్తికాంతను యోగజ్ఞానకరంబుల గాఢాలింగనంబు చేసి నానావిధ ప్రణవనాదంబులనుకంకణమేఖలామంజీరశింజితగళరవమణితాద్యా రవంబులు చెలంగ విచారజనితజ్ఞానానందరసమధురాధరామృతం బనుభవించుచుఁ బరమశమం బనుచిఱుచెమట వొడమ నిర్నిద్రా ముద్రముద్రాలక్ష్యదృగ్వచనమనోభావనాజ్ఞానంబుల నేకరూపం బులుగావించి వితతాపరిమితానుపమితపరమోపరతిసుఖరసికుండవు సమాత్మరతుండవు సంస్పృష్టాత్యంతమర్మస్థానుండవు సందర్శితానంత కలామండలుండవు ప్రగళితబిందుండవు నై యానందింపుము. 149

టీ. అయ్యవసరంబునన్ = ఆసమయమునందు, సుషుమ్నాంతఃపురంబునన్ = సుషుమ్నానాడియనెడు నంతఃపురమునందు, అప్ర...బునన్-అప్రమేయ = ప్రమాణము లకు గోచరముగాని (చూచుటకుఁ గాని యూహించుటకుఁ గాని పోల్చుటకుఁ గాని వీలు లేని; ఎవ్వరిచేతను చెప్పఁబడుటకు వశము [illegible]), తురీయ = ఉన్మన్యవస్థ యనెడి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సుషుప్త్యవస్థ మూఁడవది. దానికి తర్వాత కలుగు నాల్గవయవస్థ కున్మన్యవస్థ యని పేరు. లేక, సంకల్పవికల్పములు లేకుండ మనసు నిశ్చలమై యుండుస్థితికి నున్మన్యవస్థ యని పేరు. శయ్యాతలంబునన్=శయనమునందు, హంసయానముల్ = హంసవలె మనోహరముగ నడచునది. (ఓంకారమున కవయవ మగుహంసయే యాధారముగాఁ గలది యనుట.) దుర్ని...యు-దుర్నిరీక్ష = చూచుట కశక్యమైన, కళా = చిత్కళలచే, (కాంతిచే,) భాసమానయున్=ప్రకాశించుచున్నదియును, మూలా...యున్-మూలాధార=మూలాధారకమలమే, మంజీరయున్ = అందియలుగాఁ గలదియు, స్వాధి...లయున్-స్వాధిష్ఠాన = స్వాధిష్ఠానకమల మనెడు, కింకిణీసమన్విత = చిఱుగజ్జలతోఁ గూడిన, మేఖలయున్=ఒడ్డాణము గలదియు, మణి...యున్-మణిపూరక = మణిపూరకకమల మనియెడు, కాంచీకలాపయున్=మొలనూలుగలదియు, హృద...యున్-హృదయ=వక్షస్థలమునందు, కీలిత = ఉంచఁబడిన, అనాహత = అనాహతకమల మనెడు, రత్నభూషితయున్=రత్నముచే నలంకరింపఁబడినదియు, కంఠ...తయున్-కంఠ = కంఠమునందు విభ్రాజిత=ప్రకాశించుచున్న, విశుద్ధ = విశుద్ధకమల మనెడి, మంగళసూత్ర = మంగళసూత్రముచే, అలంకృతయున్ = అలంకరింపఁబడినదియు, భ్రూమ...తయున్ - భ్రూమధ్య = బొమలనడిమిభాగమునందు, ప్రకాశమాన=ప్రకాశించుచున్న, సదమల = నిర్మలమైన, ద్విదళ = రెండుదళములు గల యాజ్ఞానకమల మనెడి, లలాటికా = రావిరేకతో, శోభితయున్ = ప్రకాశించుచున్నదియు, సూర్య...తయున్-సూర్యచంద్రమండల=సూర్యచంద్రబింబములనెడు, తాటంకయుగళ = కర్ణభూషణములజతచే, విరాజితయున్=ప్రకాశించుచున్నదియు, ధగ...యున్-ధగద్ధగాయమాన = మెఱయుచున్న, సౌదామనీలతా=మెఱపుఁదీఁగెవంటి, శరీరిణియున్=శరీరముగలదియు,శుద్ధ...యున్-శుద్ధసత్త్వ=నిర్మల మగుసత్త్వగుణ మనెడి, దుకూల=సన్ననివస్త్రముచే, ఆవృతయున్ = ఆవరింపఁబడియున్నదియై, సచ్చి...ణియున్ - సత్ = త్రికాలములయందు నేకరూపముతో నుండుట, చిత్=జ్ఞానము, ఆనంద=పరమానందము (ఇవియే), స్వరూపిణియున్=స్వరూపముగాఁ గలదియు, ఐనముక్తికాంతను = ఐనట్టి మోక్షమనెడుస్త్రీని, యోగ...లన్-యోగ = యోగ మనునట్టియు, జ్ఞాన=బ్రహ్మజ్ఞాన మనునట్టియు, కరంబులన్=హస్తములచేత, గాఢాలింగనంబుచేసి = బాగుగఁ గౌఁగిలించుకొని, నానా...బులు - నానావిధ = అనేకవిధములగు, ప్రణవనాదంబులు = ప్రణవధ్వనులు, అను...బులు - అను=అనెడి, కంకణ = కంకణముయొక్కయు, మేఖలా = ఒడ్డాణముయొక్కయు, మంజీర=అందియలయొక్కయు, శింజిత = ధ్వనులను (భూషణధ్వనికి శింజితమని పేరు). గళరవ=రతిసమయమున కంఠమునందు పుట్టుధ్వనియగు, మణిత=మణితధ్వనియు, ఆది = మొదలగు, ఆరవంబులు = ధ్వనులు, చెలంగన్ = అభివృద్ధియగుచుండఁగా, విచార...



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తంబుగ్-విచార = బ్రహ్మవిచారమువలన, జనిత=పుట్టిన, జ్ఞాన = జ్ఞానముయొక్కయు, ఆనందరస=బ్రహ్మానందముయొక్కరసముచేత, మధుర=తియ్యనైన, అధరామృతంబుగ్ = అధరమునందలి యమృతమును, అనుభవించుచుగ్, పరమశమంబు - పరమ = అధికమగు, శమంబు = శాంతి, అను=అనెడి, చిఱుచెమట, పొడమగ్ = పుట్టఁగా, నిర్ని...బులగ్-నిర్నిద్రా = సర్వకాలములయందును బ్రకాశించుచున్నట్టియు, అక్షుద్ర=అధికమైనట్టియు, ముద్రా = సత్యజ్ఞానానందరూపము నిత్యత్వము పరిశుద్ధత్వము అనుచిహ్నములచేత, లక్ష్య = ఊహింపఁదగినట్టియు, దృక్ = నేత్రముయొక్కయు, వచన = వాక్కుయొక్కయు, మనః = మనస్సుయొక్కయు, భావనా = కార్యములను, జ్ఞానంబులగ్ = ఆకార్యములయందు ప్రతిఫలించి విషయములఁ బ్రకాశింపఁ జేయుచున్న జ్ఞానశక్తిని, ఏకరూపముగావించి = ఒక్కటిగాఁ జేసి, (సర్వేంద్రియములును జేయు వ్యాపారములు వానియందు ప్రతిఫలించియున్న జ్ఞానమునకంటె వేఱుకావని నిశ్చయించుకొని) వితత = విస్తారమైనట్టియు, అపరిమిత = మితి లేనట్టియు, అనుపమిత = సాటిలేనట్టియు, పరమ=శ్రేష్ఠమైనట్టియు, ఉపరతి=చిత్తశాంతి యనియెడు (రతి యనియెడు అని భావము.) సుఖరసికుండవు = సుఖము ననుభవించువాఁడవును, సమరసాత్మరతుండవు=అధికుఁ డనియు స్వల్పుఁడనియు భేదములేనివాఁడవును, సంస్పృ...డవు - సంస్పృష్ట = తాఁకఁబడిన (గ్రహింపఁబడిన యని భావము.) అత్యంత = మిగులరహస్యమైన, స్థానుండవు = స్థానముకలవాఁడవును (పరబ్రహ్మముకలవాఁడవనిభావము.), సంద...డవు - సందర్శిత=చూపఁబడిన, అనంత=అపరిమితమైన, కలా=విద్యయొక్క (తేజస్సులయొక్క యని భావము. ఇచ్చట కలాశబ్దమునకు నొకపక్షమున కామశాస్త్రప్రసిద్ధము లగుబంధములనియు రెండవపక్షమునఁ జిత్కళలనియు నర్థము). మండలుండవు =సమూహము కలవాఁడవును, ప్రగ...డవై - ప్రగళిత=జాఱిన (అనఁగా: సంకల్పరహితమైన), బిందుండవై=బుద్ధిగలవాఁడవై, ఆనందింపుము=సుఖింపుము.

తా. ఇట్లు చంద్రోదయమైనప్పుడు నీవు సుషుమ్న యనెడు నంతఃపురమున చేరి యచ్చట తురీయావస్థ (మనోలయము) యనుశయనముపైఁ బరుండుము. అప్పుడు జీవరూపుఁ డని చెప్పఁబడిన హంసపక్షియే వాహనముగాఁ గలిగి (లేక, హంసపక్షివలె మందగమనము కలదియు), అపరిమితమై చూచుటకుఁగూడ నశక్యమైన దివ్యతేజస్సుగలదియు, మూలాధారచక్రము అనెడు నందియలతోను స్వాధిష్ఠాన మనెడు ఒడ్డాణముతోను మణిపూరకమను మొలనూలుతోను, హృదయమునం దనాహతమనెడుశ్రేష్ఠ మగురత్నముతోను, కంఠమునందు విశుద్ధచక్రమనెడు మంగళసూత్రముతోను, భ్రూమధ్యమునందు రెండుదళములుగల యాజ్ఞాచక్రమనెడు రావిరేకతోను ప్రకాశించునదియు, ప్రత్యక్షములగు సూర్యచంద్రమండలములే కర్ణభూషణములుగాఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గలదియు, మిగులఁ బ్రకాశించుచున్న మెఱపుతీవియవంటి దేహము కలదియుఁ, రజస్తమోగుణసంసర్గము లేనిశుద్ధసత్వ మనెడు శుభ్రవస్త్రమును ధరించినదియుఁ, సత్య జ్ఞానానందములే స్వరూపములుగాఁ గలదియుఁ అగుముక్తికాంత భార్యయై నినుఁ జేరును. నీవు రాజయోగము జ్ఞానము అనుహస్తములచే నాయువతిని గాఢాలింగనముఁ జేసి కొని దశవిధప్రణవనాదములే అందియలు మొదలగు భూషణముల నాదములుగాను కంఠధ్వని మణితము మొదలగు నితరధ్వనులు గాను వెలుంగ బ్రహ్మవిచారమువలన జనించినయపరోక్షానుభవమువలన కలిగినబ్రహ్మాండ మనెడు నధరామృతమును బానము సేయుచు రతిక్రీడలం దేలుము. అప్పుడు చిత్తశాంతియనెడి చెమ్మట యొడలెల్ల నాక్ర మించును. మఱియుఁ మిగుల జాగరూకుఁడవై శ్రేష్ఠములగు ముద్రాలక్ష్యములనువానిని జూచుదృష్టిని వాక్కును మనస్సును మనోగతములగువాసనలను జ్ఞానమును వీనినన్నింటి నొక్కటిగాఁ జేసి యాముక్తికాంతయొక్క మనస్సును నీమనస్సును ఒక్కటియై యొప్పార నధికమై సాటిలేనిదై యున్నచిత్తశాంతి యనెడు రతిసుఖము నీకు పరమా నందకర మగును. సర్వభూతములయందును పరబ్రహ్మరూపము సమానమయియె యున్న దనుట నీకు మిగులసంతసముఁ గలిగించును. ఏజీవులకుఁ గూడ లేనిసుఖము నీకు దొర కదుగదా! నీ కప్పుడు సకలమర్మములును (రహస్యములలో నెల్ల రహస్యమగుబ్రహ్మము మన్మథకళాస్థానము) గోచరము లగును. బహువిధము లగువిద్యలఁ (మన్మథశాస్త్రముల) జూప నవకాశము దొరకును. బుద్ధి లయమును జెందును. ఇట్లు చంద్రోదయసమయ మున పరమానందము ననుభవింపుము.

## మహాభోగిలక్షణము.

ఆ. ఆత్మరతిని మరగి యంతంత కుపరతి
సుఖములను జెలంగి సురుచిరాత్మ
సమరతులను బొంగి సంపూర్ణ కామత
రాజభోగి వగుము రాజయోగి! 150

టీ. రాజయోగి=రాజయోగమును ఆచరించుచున్న, యోఆంజనేయా!, ఆత్మ రతిన్-ఆత్మ=పరబ్రహ్మమునందు, రతిన్=ప్రీతిగలిగియుండుటకు, మరగి=అభ్యాసపడుచు కొని, అంతకంతకున్=అప్పటప్పటికి, ఉపరతిసుఖములన్ = చిత్తశాంతియనియెడుపర మానందముచేత, చెలంగి = సంతోషించి, (లేక, అభివృద్ధి నొంది), సురుచిర = మనో హరమగు, ఆత్మ జీవాత్మ పరమాత్మలయొక్క, సమరతులన్ = అభేదజ్ఞానరూపము లగు క్రీడలచేత, పొంగి=సంతోషించి, సంపూర్ణకామతన్-సంపూర్ణ=నిండిన, కామతన్ = కోర్కులు గలవాఁడ వగుటచేత ఆత్మయే పరమానందరూపుఁడు కావునను, ఆనందమున

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కంటె వేఱగు నితరవస్తువేదియుఁ గోరఁబడఁదగినది లేదుకావునను, ఆత్మయే, లేక, బ్రహ్మయే తానని యెఱింగినవానికిఁ గోర్కు లుండుటకే యవకాశము లేదని భావము. (రాజువలె సుఖము ననుభవించువాఁడవు). అగుము.

మహాభోగిలక్షణము:—

"క. సమభావన నెందు విరో,ధము వడయక కోర్కులెల్లఁ దా వీడ్కొని ప్రా
ప్తము ననుభవించు నెవ్వం, డమలమతీ యతఁడ పో మహాభోక్త ధరన్."

(జ్ఞానవాసిష్ఠము.)

తా. కావున నోయాంజనేయా! రాజయోగము నాచరించుచున్న నీవిధముగా చంద్రోదయసమయమునకు జీవబ్రహ్మైక్యజ్ఞానము దృఢపడ నాత్మస్వరూపమునంద తృప్తిఁ జెంది యప్పటప్పటికిఁ జిత్తశాంతి యధిక మగుచుండ సర్వభూతములయందును సమభావముఁ గలిగి కోర్కులేవియును లేనివాఁడవై రాజభోగివి కమ్ము. కోర్కు లెన్ని విధములుగా నున్నను సర్వజనులచేతను గోరఁబడునది యానందమొక్కటియే. ఆయానందమే నీకు స్వరూపము. ఇట్లుండ నీవు కోరవలసినపదార్థ మేది యుండును.

ఆ. ఫాలమునను దృష్టిపైఁ గుండలీంద్రుండు
మస్తకమునఁ జంద్రమండలంబు
నమర నమృతమయత హతధర్మకామార్థ
పరుఁడ వగుము త్రిపురహరుఁడ వగుచు. 151

టీ. ఫాలమునన్=భ్రూమధ్యమునందు, దృష్టి=కన్నును (చూపును అనిభావము). పైన్=ఆదృష్టికి పైఁగా, కుండలీంద్రుండు = శేషుఁడు (ప్రణవకుండలి యనుపేరు గల సర్పరాజు అని భావము). మస్తకమునన్ = శిరస్సుపై (సహస్రారమందు అని భావము). చంద్రమండలంబును = చంద్రబింబమును (జ్ఞానచంద్రమండలమును అని భావము.) అమరన్ = ప్రకాశించుచుండఁగా, త్రిపురహరుఁడ వగుచున్-త్రిపుర=త్రిపురాసురుల పురములను (జాగ్రత్స్వప్నసుషుప్తుల నని భావము), హరుఁడవగుచున్ = పోఁగొట్టిన వాఁడవై, (రుద్రునివంటివాఁడవై యనుట). అమృతమయతన్=మోక్షస్వరూపము గల వాఁడవనుటచేత, హత...డవు-హత=పోఁగొట్టఁబడిన, ధర్మకామార్థపరుఁడవు = ధర్మ కామార్థాదులుకలవాఁడవు, అగుము=కమ్ము.

తా. ఇట్లు చిత్కళలఁ జూచునప్పుడు నీదృష్టి (నేత్రము, చూపు) భ్రూమధ్యమునందుండును. ఊర్ధ్వకుండలి (సర్పము, కుండలియనెడిశక్తి) శిరమునందుండును. భ్రూమధ్యమున నుదయించిన దగుటచే శిరస్సుపైఁ జంద్రమండలముకూడ నిలచియుండును. ఇట్లు మూఁడవకన్ను సర్వభూషణము చంద్రుఁడు ... ప్రకాశించువాఁడ వగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టచేఁ బ్రత్యక్షముగ నీవు రుద్రుఁడవే యగుదువు. ఇంతయేకాదు, ఆయీశ్వరునివలె నీవును త్రిపురముల (శరీరత్రయమును, లేక, జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలను) ధ్వంసము చేసినవాఁడవే కదా! ఇట్లు రుద్రతుల్యుఁడవై మోక్షస్వరూపుఁడవే యగుటచేత ధర్మార్థ కామములఁ దిరస్కరించి వర్తింపుదువు.

చ. తొలుత ననాదికాలకృతదుష్కృతపుణ్యవిమిశ్రకర్మకో
టు లనుసమిచ్చయంబులఁ గడు న్భసితంబుగఁ జేయుచున్ సము
జ్జ్వలసదఖండచిద్వరసువర్ణమయామలదివ్యవహ్నిమం
డలము వెలుంగు నంతట విడంబితహృద్గగనాంతరంబులన్. 152

టీ. అంతటన్=అనంతరము, విడం...బులన్-విడంబిత = విశాలమైన, హృద్గగ నాంతరంబులన్ = హృదయాకాశమధ్యమందు, తొలుతన్ = ముందుగా, సము... లము-సముజ్జ్వల=మిక్కిలి తేజరిల్లుచున్న, సత్ = ప్రసిద్ధమైన, అఖండ = అపరిచ్ఛిన్న మైన (అనఁగా: సర్వవ్యాపకమైన), చిత్ = జ్ఞానస్వరూపమైన, వర=శ్రేష్ఠమైన, సువర్ణ మయ = బంగారువియు, అమల=నిర్మలమును, దివ్య = అప్రాకృతమైన, వహ్నిమండ లము=అగ్నిమండలము, అనా...టులు-అనాదికాల = ప్రపంచనిర్మాణసంకల్పకాలము నకుఁ బూర్వము, కృత = చేయఁబడిన, దుష్కృత = పాపముల నొసఁగెడు (అనఁగా దుఃఖమునిచ్చు, పుణ్య=పుణ్యముల నొసఁగెడు (అనఁగా: సుఖము నిచ్చు). విమిశ్ర = పుణ్యపాపములనొసఁగెడు (అనఁగా: కేవలము సుఖముగాని దుఃఖముగాని కాని మధ్య ఫలము నిచ్చు.) కర్మకోటులు = కర్మసముదాయములు, అనుసమిచ్చయంబులన్ - అను=అనునట్టి, సమిత్=ఇంధనములయొక్క (లేక, సమిధలయొక్క), చయంబులన్ = గుంపులను, కడున్=మిక్కిలి, భసితంబుగఁజేయుచున్=బూదిచేయుచు, వెలుంగున్ = ప్రకాశించును.

తా. ఇట్లు చంద్రమండలము కానవచ్చినపిదప జ్ఞానరూపమైనసువర్ణముతో సమాన మగుకాంతి కలిగి రాజిల్లునగ్నిమండలము లోచనగోచరం బగును. అది ప్రత్యక్షమైన తోడనే అనాదినుండియుఁ జేయఁబడుచు పలుమాఱు శరీరములఁ దాల్చి యనుభవింపఁ బడుచున్న సుఖదుఃఖమిశ్రఫలముల నిచ్చుపుణ్యపాపమిశ్రకర్మములు అగ్నియందు వేల్వఁబడిన సమిధలయట్లు భస్మమగును.

మ. ఉరురాగాదిగుణాజసంఘము ననాద్యోంకారమంత్రంబుచే
త రయం బార వధించి యాత్మవిషయేధ్మశ్రేణితోఁ గూడఁ జె
చ్చెర నానావిధవాసనాజ్యములతోఁ జిద్వహ్నిమధ్యంబునన్
వరుస న్వేల్చి సౌఖ్యసోమరసపానం బంతఁ గావింపవే. 153

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. అంతఁట=పిమ్మట, ఉరు...ఘముఁ-ఉరు = అధికములైన, రాగాదిగుణ = కామక్రోధాదిగుణము లనెడు, అజసంఘముఁ = మేఁకలను (యజ్ఞపశువులను), అనా...బుచేఁ-అనాది=పురాతన మైన, ఓంకారమంత్రంబుచేఁ = ఓంకార మనెడు మంత్రముచేత, రయంబారఁ = శీఘ్రముగ, వధించి=సంహరించి, ఆత్మ...ణితోఁ-ఆత్మ=మనసునకుసంబంధించిన, విషయ = శబ్దాదివిషయము లనెడు, ఇధ్మ = సమిధల యొక్క, శ్రేణితోఁ=సమూహముతో, కూడఁ, చెచ్చెరఁ = శీఘ్రముగ, నానా...లతోఁ-నానావిధ = అనేకవిధములైన, వాసనా = సంస్కారములనెడు, (పుణ్యకర్మములఁ జేయువానికిఁగాని పాపకర్మములఁ జేయువానికిఁ గాని ఆయావిషయములయందీవిసంకల్పములు మనసునెప్పటికిని విడిచి పోకుండును. ఇట్లు మనసున స్థిరములై యుండి దేశకాలానుగుణముగా కార్యములఁ జేయించువృత్తులకు వాసన లని పేరు. దేహవాసన శాస్త్రవాసన లోకవాసన అనుమూఁడును అందు ముఖ్యములు). ఆజ్యములతోఁ=నేతులతో, చిద్వ...బునఁ - చిత్ = జ్ఞానస్వరూపమైన, వహ్ని = అగ్నియొక్క, మధ్యంబునఁ = నడుమ, వరుసఁ = క్రమముగ, వ్రేలిచి = హోమముచేసి, సౌఖ్య=బ్రహ్మానందమనియెడు, సోమరస = సోమరసముయొక్క, పానంబుఁ = త్రాగుటను, కావింపవే=చేయుమా! (సోమయాజివి కమ్మనుట.)

తా. అప్పుడు నీవు చేయవలసినకార్య మొకటి గలదు. కామక్రోధలోభమోహాదులైనదుర్గుణము లనెడుయజ్ఞపశువుల నోంకారమంత్రముచే వధించి శబ్దస్పర్శాదివిషయము లనుసమిధలతోఁ జేర్చి శాస్త్రవాసన లోకవాసన మొదలగువాసనలే ఘృతధారలుగ నాయగ్నిమండలమున హోమముఁ గావింపుము. బ్రహ్మానంద మనుసోమరసమును బానముచేసి సోమయాజి వగుము.

తే. అమ్మహోజ్జ్వలసూర్యసోమాగ్నిమధ్య
సీమయం దంతఁ గనుపట్టు శీతధామ
చండధామానలాత్మకాఖండధామ
మండలాదిహిరణ్మయమండలంబు. 154

టీ. అంతఁ = తర్వాత, అమ్మ...యందుఁ-అమ్మహోజ్జ్వల=అప్రకాశమానములైన, సూర్య = సూర్యమండలముయొక్కయు, సోమ = చంద్రమండలముయొక్కయు, అగ్ని=అగ్నిమండలముయొక్కయు, మధ్యసీమయందుఁ=నడుమ, శీతధామ=చంద్రునియొక్కయు, చండధామ=సూర్యునియొక్కయు, అనల=అగ్నిహోత్రునియొక్కయు, ఆత్మక=స్వరూపముగల, అఖండధామ-అఖండ=అపరిమిత మైన, ధామ=కాంతి గలిగినట్టియు, మండల...దిత్యాద్ర్రిమండలములు ...స్థానముగనట్టియు, హిర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ణ్మయమండలంబు = హిరణ్మయమండలమను నొకదివ్యతేజస్సు, కనుపట్టుక్ = కానవచ్చును.

తా. ఇట్లీసూర్యచంద్రాగ్నిమండలములు కానవచ్చినపిదప నామండలముల కెల్ల నుత్పత్తిస్థాన మగుహిరణ్మయమండలము తోఁచును. అది సూర్యచంద్రాగ్నులకాంతుల కంటె నధిక మగుకాంతి గలిగి తేజరిల్లును.

సీ. మహనీయవైశాఖమధ్యాహ్నకాండసం
కలితమార్తాండమండలముపగిదిఁ
జారునిర్మలశరత్సమయరాకాసము
జ్జ్వలపూర్ణచంద్రమండలముపగిదిఁ
దప్తహేమాభిదీప్తజ్వాలికాజాల
విలయకాలాగ్నిమండలమురీతి
నీలతోయదమధ్యనిర్గతకమనీయ
వితతసౌదామనీలతికభాతిఁ
తే. బరగి నీవారశూకంబుకరణి సూక్ష్మ
మై విమలమై యవర్ణమై యప్రమేయ
మై యచింత్యప్రకాశ మై యలరు చుండుఁ
జండరుచుల హిరణ్మయమండలంబు. 155

టీ. మహ...గిదిక్-మహనీయ = తీవ్రమైన, వైశాఖ = వైశాఖమాసమునందలి, మధ్యాహ్నకాండ = మధ్యాహ్నసమయముతో, సంకలిత = కూడియున్న, మార్తాండమండలముపగిదిక్=సూర్యమండలమువలెను, చారు...భంగిక్-చారు=మనోహరమై, నిర్మల = పరిశుద్ధమైయున్న, శరత్సమయ = శరత్కాలమునందలి, రాకా = పూర్ణిమయందు, సముజ్జ్వల=ప్రకాశించుచున్న, పూర్ణచంద్రమండలముపగిదిక్=షోడశకలాపరిపూర్ణమాచంద్రబింబమువలెను, త ప్త...మండలమురీతిక్-తప్తహేమ = పుటము వేయఁబడినబంగారమువలె, అభిదీప్త=బాగుగఁ బ్రకాశించుచున్న, జ్వాలికా = జ్వాలలయొక్క, జాల = సమూహము గల, విలయకాల = ప్రళయకాలమునందలి, అగ్నిమండలమురీతిక్=అగ్నిమండలమువలెను, నీల...భాతిక్-నీల=నల్లనైన, తోయద=మేఘముయొక్క, మధ్య= నడుమనుండి, నిర్గత=వచ్చిన, కమనీయ = మనోహరమైన, వితత=విస్తారమైన, సౌదామనీలతికభాతిక్ = మెఱుపుతీవియవలెను, పరగి = ఒప్పి, నీవార శూకంబుకరణిక్ = వరిముంటివలె, సూక్ష్మమై=స్వల్పపరిమాణముగలదియై, విమలమై=నిర్మలమైనదై, అవర్ణమై= దీని కీవర్ణము కలదు అని చెప్పుటకు వీలులేనిదై, అప్రమేయమై = ప్రమాణములకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గోచరముకానిదై, అచింత్యప్రకాశమై=మనసుచేత నూహించుటకైన నలవికాని కాంతి కలదియై, చండరుచులన్=తీవ్రములైనకాంతులచే, హిరణ్మయమండలంబు = ఆహిరణ్మయమండలము, అలరుచుండున్=ప్రకాశించుచుండును.

తా. మఱియు వైశాఖమాసమునందలి మధ్యాహ్నకాలమున వెలుఁగుసూర్యమండలమువలెను నిర్మలమైనశరత్కాలమునందలి పున్నమనాఁటిపూర్ణచంద్రమండలమురీతిని పుటము వేయఁబడి మిగులఁ బ్రకాశించుసువర్ణమువలెఁ దనరారుజ్వాలలు గలిగి ప్రళయకాలమున నత్యుగ్రమై పెంపొందు నగ్నిమండలముకైవడి నీలవర్ణముకలిగి చీకటులఁ గ్రమ్మఁజేయుచు నాకసమున దట్టమైనిలచియున్న మేఘమునుండి నిర్గమించు మెఱుపువలె ఆహిరణ్మయమండలము ప్రకాశించును. దానిపరిమాణముమాత్రము వరిముల్లుభాతిని నతిసూక్ష్మము. దాని కీవర్ణముగల దని వర్ణించుటకుఁగాని దానిప్రకాశ మింతయని పరిమాణమును చెప్పుటకుఁ గాని ప్రత్యక్షము మొదలగు నేప్రమాణముచేతనైనను గోచరము చేసికొనుటకుఁ గాని శక్యము కాదు. ఈహిరణ్మయమండలము మిగుల నిర్మలమైనది అని మాత్రము చెప్పవచ్చును.

క. అది యాపోజ్యోతి యనం
గదలక ద్విదళమునఁ దనరుకళ యామీఁదన్
మొదలిటి వెలుఁగు వెలుఁగు న
ల్లదె యాత్మారామతత్త్వ మగు ననిలసుతా! 156

టీ. అనిలసుతా=ఓఆంజనేయా ! అది=ఆహిరణ్మయమండలము, ఆపోజ్యోతియనన్=అమృతజ్యోతియనుపేరుతో, కదలక=చలింపక, ద్విదళమునన్ = రెండుదళములుగలయాజ్ఞాకమలమునందు, తనరుకళ = ఒప్పుచున్నచిత్కళ, (ఈహిరణ్మయమండలముకానవచ్చినచో చిత్కళ ముగియును) ఆమీఁదన్ = ఆహిరణ్మయమండలమున కనంతరమున, మొదలిటివెలుఁగు = సర్వమునకుఁ గారణమగు ననాదిసిద్ధమైన ప్రకాశము, వెలుఁగున్=ప్రకాశించును. అల్లదె=ఆప్రకాశమే, ఆత్మా...త్వము-ఆత్మ = తనయందు, (లేక, తాను జీవుఁడు), ఆరామ = క్రీడించునట్టి (లేక, ఉద్యానముగాఁగల), (అంతర్యామియైయున్న పరబ్రహ్మముయొక్క) తత్త్వము=యథార్థస్వరూపము, అగున్.

తా. ఓ వాయుపుత్త్రుఁడా! ఈహిరణ్మయమండలమునకే ఆపోజ్యోతియని పేరున ఇది పూర్వము చెప్పఁబడియున్న వియన్మండల, నక్షత్రమండలాదులవలె శీఘ్రముననె నశింపక చిరకాలము భ్రూమధ్యమున నిలిచియుండును. ఇట్లు నిలిచియున్నంతమాత్రమున దీనిఁ బరమాత్మునిగా భావింపవలదు. అది కొంతకాలము నిలిచియుండి తుదకు నశించును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇదియును కళయే. దీనినాశమున కావల నేప్రకాశము జ్ఞాననేత్రమునకు గోచరమగునో అదియే శ్రీరామునియథార్థస్వరూప మని (బ్రహ్మమని) తెలిసికొనుము.

అవ. ఇట్లు చిత్కళల వర్ణించి అచిత్కళలు లయము నొందినస్థానమే పరమాత్మతత్త్వమని నిరూపించి దాని నీక్రింద వర్ణించుచున్నాఁడు.—

మత్తకోకిల.—

కోటిసూర్యులు కోటిచంద్రులు కోటికోటితటిల్లత
ల్సూటిగాఁ బరిపాటిగా నొకచోట నిల్చినరీతి న
మ్మేటివెల్గుఁ దగం ద్రికూటముమీఁదఁ జూడుము దృశ్యముల్
దాఁటి మాయను మాటిమాటికిఁదాల్మిచే నటు మీటుచున్. 157

టీ. అమ్మేటివెల్గున్ = అయపరిమితమగునాత్మప్రకాశమును, కోటిసూర్యులు = కోటిసంఖ్య గలసూర్యబింబములును, కోటిచంద్రులు = కోటి సంఖ్య గలచంద్రబింబములును, కోటికోటితటిల్లతల్ =కోటికోట్లసంఖ్యగలమెఱపుఁదీఁగెలును, సూటిగాన్=గుఱిగా, పరిపాటిగాన్=క్రమముగా, (లేక, అన్నియుంగలసి) ఒకచోట నిల్చినరీతిన్ = ఒక్కస్థలమునందున్నయట్లు, దృశ్యముల్ = చూడఁబడుచున్నపదార్థమును, దాఁటి = అతిక్రమించి, తాల్మిచేతన్ =ధైర్యముచేత, మాటిమాటికిన్ =పలుమాఱు, మాయన్ =మాయను (లేక, అజ్ఞానమును), అటమీటుచున్ = తొలఁగించుకొనుచు, త్రికూటముమీఁదన్ = భ్రూమధ్యభాగమున, తగన్ =ఒప్పునట్లుగా, చూడుము—(దానినే యాత్మస్వరూపముగా నెఱుఁగు మనుట.)

తా. ఆపరబ్రహ్మముయొక్క కాంతిని వర్ణించుట యశక్యము. ఐనను గొంత వర్ణించెదను వినుము. భ్రూమధ్యమునం దాకాంతి కానవచ్చునప్పుడు సూర్యుఁడును చంద్రుఁడును మెఱపులును అనేకకోట్ల సంఖ్యలు గలవియై తమతమసంపూర్ణకాంతులు వెల్లివిరియ నొక్కచోట నిలిచియున్నట్లు కానవచ్చును. ఇది యంత దివ్యతేజమైనను మాయావశంగతులై ప్రపంచభ్రాంతిగలిగి యుండువారలకు నంధకారప్రాయమై యుండును. కావున నో యాంజనేయా! నీవు నామరూపాత్మక మగు నీప్రపంచమునందలి యభిమానమును వదలి మాయను గెలిచి జీవాభిన్నమై యుండునాదివ్యతేజమును జ్ఞాననేత్రముచే వీక్షింపుము.

అవ. ఇట్లు పరబ్రహ్మమును గూర్చి సామాన్యముగా వర్ణించి తదీయస్వరూపస్వభావముల వివరించుచున్నాఁడు:—

వ. ఇట్లు భ్రూమధ్యవీథియందలి హృదయాకాశంబునం గనిపించువియన్మండల తమోమండల మేఘమండల విద్యున్మండల తారామండల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జ్యోతిర్మండల సూర్యమండల చంద్రమండల వహ్నిమండల హిర
ణ్మయమండలంబు లనుదశవిధమండలంబులును బూర్వోక్తదశవిధ
నాదంబులును వక్ష్యమాణబిందుకళాత్మకహంసతత్త్వంబును మహా
కాశమధ్యంబునంగనిపించుజీమూతంబులచందంబుననెవ్వనియందుఁ
దోఁచు ననిలాదిభూతచతుష్టయంబునఁ దత్కార్యంబున నంటని
మింటిపగిదినిన్నింటి నెవ్వాఁడంటకుండునాదిత్యుఁ డఖిలరూపంబులఁ
బ్రకాశింపం జేయుకైవడి నెవ్వఁడు చిన్మాత్రుండై యిన్నింటి వేర్వేఱ
విభజించియెఱుంగు నతండ యీబిందునాదకళాతీతస్వప్రకాశనిత్య
శుద్ధబుద్ధముక్తపరిపూర్ణసచ్చిదానందస్వరూపప్రత్యగభిన్న పరమా
త్మారాముం డగువిశుద్ధసత్వప్రధానయుఁబరమవైరాగ్యబోధోపరతి
స్వరూపిణియు బిందునాదకళాత్మకయుఁ గేవలబ్రహ్మాత్మైక్యవిద్యామ
యయునైన నన్నాశ్రయించి యద్వితీయాపరోక్షబ్రహ్మచైతన్యస్వ
రూపకుం డై నయీయాత్మారామునియం దాత్మాకారాకారితవృత్తి
గతచిదాభాసకుండవైననీవు ప్రచండాతపమధ్యనిక్షిప్తదీపకలికవిధం
బున జ్ఞానకర్మేంద్రియపవనమనోవృత్తివిలయపూర్వకంబుగానేకీభూ
తుండవై నివాతదీపంబుభంగి నిస్తరంగసముద్రంబుపోలిక విగతా
శేషవర్ణపాదపంబుచాడ్పున నీలపీతాదివర్ణశూన్యగగనంబుకరణి
స్వప్నజ్ఞానపునరుత్థానవిరహిత సుషుప్తిరీతి నిశ్చలుండవు నిశ్శేషుం
డవు నిశ్శబ్దుండవు నిర్వికల్పనిరాకార సుఖస్వరూపుండవు బాహ్యా
భ్యంతరములు మఱచి నిరుపమరాజయోగతురీయసమాధిం బొందు
మని యుపదేశించి వెండియు నిట్లనియె. 153

టీ. ఇట్లు=పైని నిరూపింపఁబడినవిధముగా, భ్రూమధ్యవీథియందలి హృదయా
కాశంబునక=భ్రూమధ్యమునందు కనఁబడుచిత్తాకాశమునందు, కని...బులు-కనిపించు
వియన్మండల=ఆకాశపంచకమండలంబును (మండలశబ్దమునకు సమూహ మని యర్థము.)
తమోమండల = అంధకారమండలంబును, మేఘమండల = మేఘమండలంబును, విద్యు
న్మండల = మెఱపులమండలంబును, తారామండల = నక్షత్రమండలంబును, జ్యోతి
ర్మండల=కాంతిమండలంబును, సూర్యమండల = సూర్యమండలంబును, చంద్రమండల =
చంద్రమండలంబును, వహ్నిమండల = అగ్నిమండలంబును, హిరణ్మయమండలంబులు =
హిరణ్మయమండలంబును, అను దశవిధమండలంబులు=అనెడు పది తెఱంగులైన మండలం
బులును, పూర్వోక్త దశవిధనాదంబులును=ఇంతకు ముందు వివరింపఁబడియున్న పది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాదము మొదలగు దశవిధ ప్రణవనాదములను, వక్ష్య...బును-వక్ష్యమాణ = ఇఁక మీఁద వివరింపఁబడఁబోవు, బిందుకోశాత్మక = బుద్ధియనెడు నావరణమే స్వరూపము గాఁగల, హంసతత్త్వంబును = జీవుని యథార్థస్వరూపమును, మహాకాశమధ్యంబునన్ = ప్రసిద్ధమగు నాకాశమునందు, కనిపించు జీమూతంబుల చందంబునన్ = కనఁబడుచున్న మేఘమువలె, ఎవ్వనియందున్=ఏపదార్థమునందు, తోఁచున్ = కనుపించుచుండునో, అని...యంబున్-అనిల=వాయువు, ఆది=మొదలగు, భూతచతుష్టయంబున్= నాలుగు భూతములను, తత్కార్యంబులన్=వానివలనఁబుట్టిన సర్వపదార్థములను, అంటని మింటి పగిదిన్=స్పృశింపని ఆకాశ మట్లు (అనఁగా : సర్వవ్యాపకమయ్యు నాకాశము ఇతర భూతములతోఁగాని వానినుండి పుట్టిన పదార్థములతోఁ గాని సంబంధింపనట్లు.) ఇన్నింటికిన్=ముందుఁజెప్పఁబడిన మండలాదుల నన్నింటిని, ఎవ్వండు = ఏవస్తువు, అంట కుండున్, ఆదిత్యుండు = సూర్యుఁడు, అఖిలరూపంబులన్ = సమస్తవిధములగు రూపములను, ప్రకాశింపఁజేయుకైవడిన్=ప్రకాశింపఁజేయునట్లు, ఎవ్వండు, చిన్మాత్రుండై= జ్ఞానమాత్రస్వరూపుఁడై, ఇన్నింటికిన్=ఈచెప్పఁబడినవానినన్నిటిని, వేర్వేఱన్=ప్రత్యేకముగా, విభజించి = విభాగముచేసి (ఇది దీనికంటె వేఱు, ఇది దీనికంటె వేఱు అని) ఎఱుంగున్=తెలిసికొనుచున్నాఁడో, ఆతండ=వాఁడే, ఈబిం...ముండు-ఈబిందునాద కళాతీత=పైఁ జెప్పఁబడిన నాదబిందు కళల నతిక్రమించి, స్వప్రకాశ = ఇతరులసహాయములేక తనంతఁ దానే ప్రకాశించుచు, నిత్య=నాశములేనివాఁడై, శుద్ధ=నిర్మలుఁడై, బుద్ధ=జ్ఞానరూపుఁడై (లేక, జ్ఞేయరూపుఁడై, జ్ఞేయ మనఁగా జ్ఞానముచే నెఱుంగఁబడఁదగినది), ముక్త=సంసారబంధ విరహితుఁడై, పరిపూర్ణ = సర్వవ్యాపకుఁడై, సత్ = దేశకాలములవలన భేదములేని యునికియు, చిత్ = ఇతరసాధనములతోఁ బనిలేకయే ప్రకాశించుచు, పరులఁ బ్రకాశింపఁజేయుచునుండు సామర్థ్యముగల జ్ఞానంబును, ఆనంద=సుఖంబును, స్వరూప = స్వరూపముగాఁ గలవాఁడై, ప్రత్యగభిన్న-ప్రత్యక్ = జీవునికంటె, అభిన్న=వేఱుకానివాఁడై, పరమ = శ్రేష్ఠుఁడైయున్న, ఆత్మారాముండు = అంతర్యామి, (పరబ్రహ్మము), అగున్=అవును, విశుద్ధ...నయున్-విశుద్ధసత్త్వ=నిర్మలమగు (అనఁగా : రజస్తమోగుణ సంస్పర్శలేని) సత్త్వగుణమే, (ప్రసిద్ధములగు సత్వరజస్తమోగుణములుకాక గుణసామ్యావస్థ యనునది, అనఁగా త్రిగుణములు నెక్కువ తక్కువలులేక సమానముగానుండు స్థితి యనునది, యొకటి కలదనియు అదియే శుద్ధసత్త్వమనియుఁ జెప్పుదురు. మఱి కొందఱు త్రిగుణముల లయస్థానమే శుద్ధ సత్వమందురు. ఎట్లున్నను "రజస్తమోగుణముల సంస్పర్శలేని సత్వగుణమునకు శుద్ధ సత్వమని పేరు." అను సిద్ధాంతమునకు భంగములేదు. అన్నియును సమానములుగా నున్నప్పు డొకదాని నొకటి యేమియుఁ జేయఁజాలవు. లయ సమయమున రజస్తమోగుణములు వికారము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లగుటచే, లేక, మాలిన్యములగుటచే, శుద్ధమగు తత్త్వమే శేషించును.) ప్రధానయుఁ = ముఖ్యస్వరూపముగాఁగలదియు, పర...ణియుఁ - పరమ = శ్రేష్ఠమగు, వైరాగ్య = వైరాగ్యము, బోధ = జ్ఞానము, ఉపరతి = చిత్తశాంతి (అనునవియే,) స్వరూపిణియుఁ = స్వరూపములు గాఁగలదియు, బిందునాదకళాత్మికయుఁ = నాదబిందుకళలే దేహముగాఁ గలదియు, కేవల...యయుఁ - కేవల = పరిపూర్ణమైన (లేక, అద్వితీయమైన,) బ్రహ్మ = పరబ్రహ్మమనఁబడు, ఆత్మ = జీవునకునుగల, ఐక్య=అభేదము, విద్యామయయుఁ = తెలిసికొనుట యను స్వరూపముగల బ్రహ్మజ్ఞానమే యాకారముగాఁగలదియు (మూలప్రకృతికిఁ జిత్ప్రకృతి యనియుఁ జిచ్ఛక్తియనియుఁ బేర్లుగలవు. ఈశక్తికి జ్ఞానమే యాకారము. వైరాగ్యము లౌకికజ్ఞానము చిత్తశాంతి అనునవికూడ జ్ఞానాకారములోని భేదములే యగుటచేత, లేక జ్ఞానమునకు సాధనములుగాను దానిచే సాధింపఁబడ తగినవిగాను ఉన్నవియే కావున, నవికూడ యాశక్తికి స్వరూపములేయగును. వాస్తవస్థితిలో నీప్రపంచమంతయు జ్ఞానముకంటె వేఱుకాదు. కావునను, ప్రపంచమే మాయ కావునను పైవర్ణింపఁబడిన నాదబిందుకళలన్నియునుగూడ ఆశక్తికి స్వరూపములే యగునని భావము.) ఐన = ఐనట్టి, నన్నాశ్రయించి (సీతాదేవి తానే మూలప్రకృతియని చెప్పిన విషయమును జ్ఞప్తికిఁ దెచ్చికొనవలయును), అద్వి...కుఁడు-అద్వితీయ = తనకంటె నితరమగు పదార్థములేనట్టియు, అపరోక్ష = ప్రత్యక్షమైనట్టియు, బ్రహ్మచైతన్య = సర్వవ్యాపకమైన జ్ఞానమే, స్వరూపకుండు = స్వరూపముగాఁ గలవాఁడు, ఐన యీ యాత్మారామునియందుఁ = అగు నీ రామునియందు, ఆత్మా...డవు - ఆత్మకారకారిత = పరబ్రహ్మరూపముతో నేర్పఱుపఁబడిన (మనోవృత్తి యేయేపదార్థమును గ్రహించునో ఆయారూపము గలది యగును. కావున పరబ్రహ్మసాక్షాత్కారమునకై ప్రసరించుచున్న చిత్తవృత్తి పరబ్రహ్మాకారము గలదియే యగు నని భావము.) వృత్తి = మనోవృత్తిని, గత = పొందియున్న, చిత్ = జ్ఞానముయొక్క, ఆభాసకుండవు = ప్రతిబింబస్వరూపుఁడవు. (మనస్సు జడము. దానివృత్తులు నట్టివే. ఆత్మజ్ఞానస్వరూపుఁడు, సర్వవ్యాపకుఁడు, కావున యీచిత్తవృత్తులయందుఁగూడ వ్యాపించి వానికి పదార్థములఁ బ్రకాశింపఁజేయుశక్తి నొసంగుచున్నాఁడు. వెలుపలనున్న ఘటాదిపదార్థములను గాని స్వస్వరూపమగుబ్రహ్మమును గాని గ్రహింపవలయు ననిన, పైన నిరూపింపఁబడినవిధముగా పరబ్రహ్మప్రకాశమే ఆచిత్తవృత్తిని ప్రకాశింపఁజేయవలయును. ఈకారణమువలన బ్రహ్మసాక్షాత్కారసమయమునందు "నేను బ్రహ్మము నెఱింగితిని." అని తలంచుట భ్రాంతి. బ్రహ్మము నెఱుంగువాఁడు (అనఁగా: నప్పటిచిత్తవృత్తినిఁ బ్రకాశింపఁజేయువాఁడు) కూడ బ్రహ్మమే యగును కదా. కావున భేద మేమియును లేదని భావము.) ఐన నీవు =

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఐనట్టి జీవస్వరూపుఁడవు నీవు, ప్ర...బున౯ - ప్రచండ = తీవ్రమైన, ఆతప = ఎండ యొక్క, మధ్య = నడుమ, నిక్షిప్త = ఉంచఁబడిన, దీపకళికవిధంబున౯ = దీపమువలె, జ్ఞాన...బుగా౯-జ్ఞాన=జ్ఞానరూపములైన, (లేక, జ్ఞానాశ్రయములైన), కర్మేంద్రియ= శ్రోత్రాదులైనట్టియు, కార్యములఁజేయు వాగాదిరూపములైనట్టియు, దశేంద్రియములయొక్కయు, పవన=ప్రాణములయొక్కయు, మనః = మనస్సుయొక్కయు, వృత్తి = వ్యాపారములయొక్క, విలయపూర్వకంబుగా౯=నాశముతోఁగూడ, ఏకీభూతుండవై= ఐక్యమునుజెంది, నివాతదీపంబుభంగి౯ - నివాత = గాలిలేని స్థలమునందలి, దీపంబుభంగి౯=దీపమువలెను, నిస్త...క౯-నిస్తరంగ = అలలులేని, సముద్రంబుపోలిక౯ = సముద్రమువలెను, విగ...ద్దున౯-విగత=పోయిన, అశేష=సమస్తమైన, పర్ణ = ఆకులు గల, పాదపంబుచాడ్పున౯ = చెట్టువలెను, నీల...రణి౯-నీల = నలుపు, పీత=పసుపు, ఆది=మొదలగు, వర్ణశూన్య = వర్ణములులేని, గగనంబుకరణి౯ = ఆకాశమువలెను, స్వప్నా...రీతి౯-స్వప్న = కలయు, అజ్ఞాన = ఏమియుఁ దెలియకుండుటయు, పునరుత్థాన=మరల మేల్కనుటయు, విరహిత=లేని, సుషుప్తిరీతి౯=సుషుప్తియవస్థయట్లును, నిశ్చలుఁడవు = చలనము లేనివాఁడవును, నిశ్శేషుండవు = రెండవపదార్థము లేనివాఁడవును, నిశ్శబ్దుండవు=శబ్దగుణము లేనివాఁడవును (పంచభూతములకంటె వేఱగువాఁడవు ననుట.) నిర్వి...వునై-నిర్వికల్ప = సంకల్పవికల్పములులేక, నిరాకార=ఆకారములేక, సుఖస్వరూపకుండవునై = కేవలము ఆనందమే స్వరూపముగాఁగలవాఁడవును నై, బాహ్యా...లు-బాహ్య = వెలుపలనున్నపదార్థములను, అభ్యంతరంబులు = లోపలనున్న పదార్థములను, మఱచి, నిరు...మాధి౯-నిరుపమ = సాటిలేని, రాజయోగ = తారకయోగరూపమైన, తురీయసమాధి౯=ఉన్మన్యవస్థ యనెడునిష్ఠను (ఉన్మన్యవస్థయనఁగా మనోలయము,) పొందుము, అని, ఉపదేశించి = చెప్పి, వెండియు౯ = మఱియు, ఇట్లనియె౯=ఇట్లు చెప్పెను.

తా. పదివిధములైన ప్రణవనాదములనుగూర్చియు వియన్మండల, తమోమండల, మేఘమండల, విద్యున్మండల, తారామండల, జ్యోతిర్మండల, సూర్యమండల, చంద్రమండల, వహ్నిమండల, హిరణ్మయమండలము లను పదివిధముల (ఈ మండలములను గూర్చి యాయాస్థలములందే వివరింపఁబడియున్నది.) విలసిల్లు కళలనుగూర్చియు నిదివఱకే చెప్పియున్నాము. వీని కన్నిటికి నాధార మగుపదార్థ మొక్కటి యుండవలయు ననియు, నది వీనికంటె వేఱుగా నుండవలయుననియు నెట్టివానికైనఁ దోఁపకమానదు. ఈ నాదములును, గళలును వచ్చుచుఁ బోవుచుండినను వాని కాధారభూత మగుపదార్థము చంచలము కానక్కఱ లే దనుటయుఁ బ్రత్యక్షసిద్ధమే. మనుష్యులు పశువులు మొదలగుపదార్థములు వచ్చుచుఁ బోవుచుండినను పుట్టుచు నశించుచుండినను వాని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాధార మగుభూమికి మార్పేమియుఁ గలుగ దనుట సర్వజనవిదితమేకదా. కావున నీ నాదబిందుకళ లుత్పత్తివినాశములు కలవి యైనను వీని కాధారభూత మగుపదార్థమున కు చలనము లేదు. మేఘములు వచ్చుచుఁ బోవుచుండినను వాని కాధారమయ్యు నేమార్పును జెందకుండు నాకసమువలె నేపదార్థము ఈ నాదబిందుకళల యుత్పత్తి వినాశములవల్ల మార్పుఁజెందక వీని కాధారభూతమగుచు నున్నదో అదియే పరబ్రహ్మము. మఱియు ఆకాశము సకలభూతభౌతికములయందును వ్యాపించియు, వానితో సంబంధపడకుండునట్లు యీబ్రహ్మముకూడ నీనాదబిందుకళలయందు వ్యాపించియు వీని వికారములతో సంబంధపడదు. ఆధార మగుపదార్థమునకు నాధేయపదార్థ (ఆధేయ మనఁగా ఒకవస్తువు నాధారము చేసికొనియుండునది. గృహమాధారము, దానియందు నివసించియున్నపురుషుఁడు ఆధేయుఁడు) గతవికారములతో సంబంధము కలుగుటకే వీలులేదు. పురుషుఁ డంగహీనుఁ డైన వాని కాధార మగుగృహముకూడ నంగహీనమగు ననుట ప్రత్యక్షవిరుద్ధముకదా. ఈపక్షము నంగీకరింపక నాధేయపదార్థమునకుఁ గల యుత్పత్తివినాశాదివికారము లన్నియు నాధారమునకుఁ గూడ కలవనిన నట్టియాధార మాధారమే కానేరదు. తాను పుట్టుటకంటెఁ బూర్వమునను వినాశమునకంటె నావలను గూడ స్థిరమై యొకపదార్థ ముండునేని తాను ఆపదార్థము నాశ్రయించి పుట్టవచ్చును, నశింపవచ్చును; గాని తనతోకూడ నుత్పత్తి నొందుచు నశించుచు నున్నపదార్థము నాశ్రయించియే తానుండుట సంభవింపనేరదు కదా! ఉత్పత్తివినాశము లనఁగా ఆవిర్భావ (కనఁబడుట) తిరోభావ (కనఁబడకుండుట) ములే యని యారంభముననే యుక్తియుక్తముగ నిరూపించియున్నాము. కావున నేయాధేయపదార్థమైనను పుట్ట వలయు నన్నను నశింపవలయు నన్నను దానియాధారము మాత్రము స్థిరముగానుండవల యును. త్రాటియందు సర్పభ్రాంతి కలిగినను తొలఁగినను త్రాడుమాత్రము వికారములు లేక స్థిరముగ నుండుటయు, అందు తోఁచినసర్పమునకు మాత్రమే యుత్పత్తివినాశము లతో సంబంధముండుటయుఁ బ్రత్యక్షముగఁ జూచుచునే యున్నాముకదా! కావున నీనాదాదుల కెన్నివికారము లున్నను వానియాధార మగుపరబ్రహ్మమునకు దేనితోను సంబంధము లేదు. ఇదియును గాక నాపరబ్రహ్మము జ్ఞానరూపముగుటచే నీనాదబిందు కళల నన్నిటిని బ్రత్యేకముగాఁ దెలిసికొనుచున్నాఁడు. సూర్యప్రకాశముచే సర్వపదార్థ ములును బ్రకాశించునట్లు ఈపరమేశ్వరునిశక్తిచేతనే యన్నియు వెలుఁగుచున్నవి చూచువారికిఁ జూడఁబడుపదార్థములయందలి వికారములు కలుఁగుననుట సంపూర్ణముగనే సంభవింపదుకదా. రోగినిఁ జూచుపురుషునికి రోగము కలుఁగునా? కావున సర్వసాక్షి యగుటచే నుత్పత్తివినాశములు కూడ నీయనకు గోచరములు కావలసినవియే. కావున నీయన నిత్యుఁడు. నిర్వికారుఁడు. సకలప్రపంచమున కాధారభూతుఁడు ముద్రా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భ్యాసపాటవమువలన గోచరములైననాదబిందుకళ లెట్టివో ప్రత్యక్షాదులవలన గోచరములగునీబాహ్యపదార్థములుకూడ నట్టివే. కావున నాదబిందుకళల కాధారభూతుఁడును వానివికారములతో సంబంధములేనివాఁడును వానికి సాక్షియు నగునీపరబ్రహ్మమే సర్వప్రపంచమున కాధారభూతుఁడును సర్వప్రపంచగతవికారములతో సంబంధింపనివాఁడును సర్వప్రపంచసాక్షియునై యున్నాఁడని తెలిసికొనవలయును. సర్వాధారుఁ డగుటచే సర్వవ్యాపియు, నిర్వికారుఁ డగుటచే పరిశుద్ధుఁడును, సకలబంధవిముక్తుఁడును, సర్వసాక్షి యగుటచే స్వప్రకాశస్వరూపుఁడును నాదబిందుకళలు మొదలగు సకలప్రపంచమునకంటె వేరైనవాఁడునై యీపరమేశ్వరుఁడు తనరారు చున్నాఁడు. ఈబ్రహ్మమే శ్రీరాముఁడు. సత్యజ్ఞానానందస్వరూపుఁడును, అంతర్యామియు నగు నీకునుఁ డిట్టివాఁడై నను సర్వజనులకును గోచరుఁడు కాఁడు. ఈమహాత్మునిస్వరూపము జీవునికంటె వేఱగునది కాదు. ఇట్లైనను ఈజ్ఞానమును సంపాదించుకొనుటకు నన్నాశ్రయింపవలయును. వైరాగ్యము జ్ఞానము చిత్తశాంతి అనునవియే నాయాకారము. నాదేహ మంశటను జీవబ్రహ్మైక్యజ్ఞానమునకంటె వేఱగుపదార్థమే లేదు. రజస్తమోగుణములలో సంబంధములేని నిర్మలత్త్వగుణమే నాకు ముఖ్యమైనది. ఇట్టి నన్నాశ్రయించిన (వైరాగ్యాదులనాశ్రయించిన) తత్త్వము సుఖముగ గోచరమగును. అది యెట్లనిన వినుము. ఈరామునికంటె నితర మగుపదార్థమేదియు లేదు. నీకంటె నాఘునునిరూపము వేఱుకాకపోవుటచే నీవు ఆయనను బ్రత్యక్షముఁ జేసికొనుట యనునదియే సంభవింపదు. తనరూపము తనకు ప్రత్యక్షము కాదనుటయు కలదా? కావున నీవిషయమునందు జ్ఞానమొక్కటియే కావలయు. "నేను వేఱు, రాముఁడు (బ్రహ్మము) వేఱు"అని భ్రాంతిచే భావించు చున్నావు; దానిని విడచి "మాకిరువురకును భేదము లేదు." అని తెలిసికొనుట మాత్రమే చాలును. అప్పు డంతర్ముఖ మైనచిత్తవృత్తియందుఁ బ్రతిబింబించియున్న బ్రహ్మప్రతిబింబ మగునీవు ఆపరబ్రహ్మమునందే యైక్యమగుదువు. అది యెట్లనిన వినుము. ఏవస్తువు నైనను చూచునప్పుడు గాని వినునప్పుడుకాని చిత్తవృత్తి యాయాయింద్రియములమూలమున వెలికివచ్చి యాయాపదార్థములతోఁ బరిణామమును జెందును. అది పంచభూతముల వలనఁ బుట్టినది కావున జడపదార్థము. స్వయముగాఁ బ్రకాశించుశక్తిగాని యితరపదార్థములంబ్రకాశింపఁజేయుశక్తిగాని దానికిలేదు. పరమాత్మజ్ఞానస్వరూపుఁడును సర్వవ్యాపకుఁడును గావున నాచిత్తవృత్తులయందుఁగూడఁ బ్రతిబింబించి వానిమూలమున బాహ్యపదార్థములను ప్రకాశింపఁ జేయును. 'ఇది ఘటము' అని బాహ్యపదార్థమును గూర్చినజ్ఞానము కలిగినప్పుడు చిత్తవృత్తియు దానియందలి యాత్మప్రతిబింబమును ఎట్లు నియతముగ నుండునో అట్లే 'ఇది బ్రహ్మము.' అని బ్రహ్మమును గూర్చినజ్ఞానము కలిగినప్పుడు కూడ చిత్తవృత్తియు నందలి బ్రహ్మప్రతిబింబమును అవశ్యముగ నుండును. జ్ఞాన మనఁగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్రహ్మప్రతిబింబసహితచిత్తవృత్తియేకాని వేఱొకటి గాదు. ఓహనుమంతుఁడా! ఇప్పుడు గ్రహింపుము. బ్రహ్మజ్ఞానరూపమై బ్రహ్మవఱకును వ్యాపించి బ్రహ్మాకారముతోఁ బరిణమించినచిత్తవృత్తియందలి బ్రహ్మప్రతిబింబమే నీవు. (జీవుఁడు). నీకును అపరబ్రహ్మమునకును భేదమేమికలుగును? పరబ్రహ్మము సర్వాధార మనియుఁ బ్రపంచమంతయు నాధేయమనియు భేదమును జెప్పితివి గదా యనెద వేమో! వినుము. సూక్ష్మమగుపరమాత్మతత్త్వము సుఖముగఁ దెలియుటకై లోకదృష్టి ననుసరించి మొట్టమొదట భేదము నంగీకరించితిని గాని వేఱేమియులేదు. పైన నిరూపింపఁబడినవిధముగా జ్ఞానము నాశ్రయించియే నామరూపాత్మక మగునీప్రపంచమంతయు నావిర్భావతిరోభావములఁ జెందుచున్నది. కావున నివియంతయు నాజ్ఞానమునకంటె వేఱు కానేరదు. స్వప్నమునందుఁ దోఁచుపదార్థములు జ్ఞానము నాశ్రయించి జనించుచు నశించుచు నుండుటచే నెట్లసత్యము లని చెప్పఁబడుచున్నవో అట్లే జాగ్రదవస్థయందలిపదార్థములు కూడ నసత్యములే కావున బ్రహ్మమునకంటె నితరమగుపదార్థము లేదనుట నిశ్చయము. ఇట్లు బ్రహ్మప్రతిబింబభూతుఁడవగునీవు ఎండయందలి దీపమువలె నాపరబ్రహ్మమునం దైక్యమగుదువు. అప్పుడు నీకుఁ గర్మేంద్రియములవలనఁగాని జ్ఞానేంద్రియములవలనఁగాని ప్రాణమనోవృత్తులవలనఁగాని చాంచల్యము కలుగదు. అవి యన్నియు నీకంటె ముందుగానే యాపరబ్రహ్మమునందు లీనములగును. కావున నీవు గాలి లేనిచోట నున్న దీపమువలె, తరంగము లేని సముద్రముభంగి, ఆకులు లేనివృక్షమట్లు, నలుపు పసుపు మొదలగువర్ణములు లేనియాకసమురీతి, స్వప్నములుగాని జాగ్రతగాని యజ్ఞానము గాని లేనిసుషుప్త్యవస్థపోలిక, చలనము లేనివాఁడవును రెండవపదార్థము లేనివాఁడవును శబ్దగుణరహితుఁడవును ఇదియిట్టిది అని తలంచుట కశక్యమైనదియు రూపమేమియులేనిదియు నగుపరమానందమే స్వస్వరూపముగలవాఁడవు నగుదువు. అట్లు బ్రహ్మైక్యముఁ జెంది వెలుపల లోపల యనుభేదములేక సర్వమును నీవయై తురీయమను పేరుగలరాజయోగనిష్ఠం బొంది సుఖింపుము. అని యిట్లు సీతాదేవి తత్త్వార్థము నుపదేశించి బిందుస్వరూపము నింతవఱకుఁ జెప్పకుండుటచే దానిని గూర్చి వివరించునదియై యిట్లనియె.

అవ. ఇట్లు రాజయోగనిష్ఠ నభివర్ణించి యాక్రింద బిందుస్వరూపమును వివరించుచు దానికిఁ గలహేతువును జెప్పుచున్నాఁడు:—

తే. అట్టిపూర్ణసమాధి మనోనిలముల
చలన ముడుగక కాని గోచరము గాదు
అవియు బిందువుచాంచల్య మడఁగ కున్న
నిశ్చలంబులు గావు నిశ్చితాత్మ! 159

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. వినిశ్చితాత్మ = మనోనిగ్రహము గలయోగియాంజనేయా, అట్టి...మాధి-అట్టి=పూర్వోక్తమైన, పూర్ణసమాధి = సంపూర్ణ మగుయోగనిష్ఠ, మనః = మనస్సుయొక్కయు, అనిలముల = ప్రాణవాయువులయొక్కయుం, చలనము = చాంచల్యము, ఉడుగక కాని=నశించిననేకాని, గోచరముకాదు, అవియున్ = ఆమనఃప్రాణములును, బిందు...ల్య-బిందువు = బుద్ధియొక్క, చాంచల్యము = కదలిక, అడఁగకున్నన్=విడువకపోయెనేని, నిశ్చలంబులుగావు=చలనము లేకయుండవు.

తా. ఆత్మజ్ఞానము గలయోగియాంజనేయా! మనస్సు ప్రాణవాయువు అనునవి కదలక నిలిచిననే కాని యాసంపూర్ణయోగనిష్ఠ సిద్ధింపదు. ఆమనఃప్రాణంబులును బిందువునకుఁ గలచాంచల్యము నశింపకుండినచో 'నిశ్చలంబులు కావు. కావున యోగి యగువాఁడు మొట్ట మొదట బిందురూపమును దెలిసికొని దానిని స్థిరముఁజేయఁబ్రయత్నింపవలయును. ఇట్లు చేసిన మనఃప్రాణములు స్థిరము లగును. యోగనిష్ఠవలనఁ గలుగు పరమానందము కూడ చేకూరును.

## హంసతత్త్వోపదేశము.

అవ. ఇట్లు బిందుస్వరూపము నెఱుంగుట యావశ్యక మని చెప్పి దానికంటెఁ బూర్వము హంసస్వరూపము నెఱింగించువాఁడై దానికి హేతువును నిరూపించుచున్నాఁడు:—

తే. అట్టిబిందువుచాంచల్య మడఁగ దెందు
హంసతత్త్వంబు నెఱుఁగక యట్లు గాన
దాని వివరింతు విను మది గానఁబడిన
గాలి బిందువు మనమును గదల కుండు. 160

టీ. అట్టి = పూర్వోక్తమైన, బిందువుచాంచల్యము = బుద్ధియొక్కచపలత్వము, హంసతత్త్వంబున్ = జీవునియథార్థస్వరూపమును, ఎఱుఁగక = తెలిసికొనక పోయిన, ఎందున్ = ఎప్పటికిని, అడఁగదు = నశింపదు, అట్లుగానన్=కావున, దానిన్ = ఆజీవతత్త్వమును, వివరింతున్=తెలియఁజేయుదును వినుము, అది గానఁబడినన్ = ఆస్వరూపము తెలిసినచో, గాలి=ప్రాణవాయువు, బిందువు = బుద్ధి, మనమును = మనస్సును కదలకుండున్=చలింపవు.

తా. పైన వివరింపఁబడిన కారణమువలన బిందుస్వరూపము నెఱుఁగుటయుం దానిని స్థిరముఁ జేయుటయు మిగుల నావశ్యము. అయినను హంసతత్త్వమును దెలిసికొనకపోయినయెడల నాబిందువు స్థిరము కానేరదు. కావున నాహంసతత్త్వము నెఱింగించెద వినుము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. కంజపుంజానుగతసౌఖ్యగతుల మెఱసి
యాతతబ్రహ్మసంస్థాన మగుచు లలిత
మానసానందకరమై సమత్వ మమర
సత్యరతి నొప్పు నీహంసచక్ర మనఘ! 161

టీ. అనఘ = పాపరహితుఁడా, ఈహంసచక్రము = ఈక్రింద వివరింపఁబడఁబోవుహంసచక్రము, కంజ...తులన్-కంజపుంజ = షడాధారకమలములను, అనుగత = అనుసరించుటచేతఁ గలిగిన, సౌఖ్యగతులన్ = సుఖములచే, మెఱసి=ప్రకాశించి, ఆత...నము-ఆతత-సర్వవ్యాపకమైన, బ్రహ్మ = పరబ్రహ్మమే, సంస్థానము = ఉనికిపట్టుగా గలది, అగుచున్, లలి...మై-లలిత = మనోహరమై, మానస = మనస్సునకు, ఆనందకరమై=ఆనందమును గలిగించునదియై, సమత్వము=భేదములు లేకుండుట (త్రికాలముల యందు నొకటేరీతిగ నుండుట), అమరన్ = ఒప్పుచుండఁగా, సత్యరతిన్-సత్య = పరబ్రహ్మముయొక్క, రతిన్=సంబంధముచే, ఒప్పున్=ప్రకాశించును.

తా. పాపరహితుఁడా! పరబ్రహ్మమున కాధారమై షడాధారచక్రముల ననుసరించి బహువిధములగుసుఖములఁ గలిగించుచు మనసునకు లోకసంబంధమైనట్టియు బ్రహ్మసంబంధమైనట్టియు నానందము నిచ్చుచు హంసకు విహారస్థానమగు నొక యష్టదళపద్మము హృదయస్థానమునఁ గలదు. ఆచక్రము హంసమునకంటె వేఱుకాదు. శిష్యులకు సుఖముగఁ దెలియుటకై హంసముకంటె నది వేఱనియు దీనియందు హంస విహరించుచున్నదనియు చెప్పఁబడుచున్నది గాని వేఱేమియు లేదు.

అవ. ఇట్లు హంసతత్త్వజ్ఞాన మావశ్యకమని చెప్పి దానివలనఁ బ్రయోజనమును నిరూపించుచున్నాఁడు:—

ఆ. వినుము పాలు నీళ్లు విభజింప నేర్చిన
పరమహంసపగిదిఁ బ్రవిదితాద్య
పరమహంసుఁడైన పరమహంసుఁ డసార
సారములను బంపఁ జాలు ననఘ. 162

టీ. అనఘ = పాపరహితుఁడా! వినుము, పాలునీళ్లు = పాలను-నీళ్లను, విభజింపన్=వేఱుచేయుటకు, నేర్చిన = సమర్థమైన, పరమహంసపగిదిన్=శ్రేష్ఠమగు హంసపక్షివలె, ప్రవి...సుఁడు-ప్రవిదిత = తెలియఁబడిన, ఆద్య = అనాదిసిద్ధమగు, పరమ = శ్రేష్ఠమైన, హంసుఁడు=పరబ్రహ్మస్వరూపము గలవాఁడు (జీవస్వరూపముగలవాఁడు), ఐనపరమహంసుఁడు=ఐనట్టి బ్రహ్మవేత్త (ఇచ్చట పరమహంసశబ్దముచే పరమహంసాశ్రమమును స్వీకరించిన సన్యాసి చెప్పఁబడలేదు), అసారసారములన్-అసార=నిస్సారమగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రపంచమును, సారములన్ = సారభూతుఁడగు పరబ్రహ్మమును, పంపఁజాలున్ = వేఱుపఱుప సమర్థుఁడగును.

తా. పరిశుద్ధహృదయముగల యోయాంజనేయా! లోకమునందు హంస నీటి నుండి పాల నెట్లు వేఱు చేయఁగలదో, అట్లే పరబ్రహ్మరూపమగు నీహంస నెఱింగిన మహాత్ముఁడు నిస్సారమగు ప్రపంచమునుండి సారభూతుఁడగు పరమాత్ముని వేఱుచేసి యెఱుంగఁగలఁడు.

తే. చటులసంసారదుఃఖనాశనకరంబు
హంసతత్త్వార్థవిజ్ఞాన మతిరహస్య
మట్లు గావునఁ జెప్పెద నవధరింపు
పరమభాగవతోత్తమ భక్తవరద. 163

టీ. పరమ...త్తమ-పరమ=శ్రేష్ఠులగు, భాగవత = భగవద్భక్తులలో, ఉత్తమ = ముఖ్యుఁడవగు నాంజనేయా! భక్తవరద-భక్త=భక్తులకు, వరద=వరముల నిచ్చువాఁడా! అతిరహస్యము=మిక్కిలి రహస్యమైన, హంస...నము-హంస=జీవస్వరూపమగు హంస యొక్క, తత్త్వ=యథార్థస్వరూపమును, అర్థ=విషయముయొక్క, విజ్ఞానము=తెలివి, చటు...రంబు-చటుల=దుస్సహమైన, సంసార=సంసారరూపమగు, దుఃఖ=దుఃఖమును, నాశనకరంబు=నశింపఁజేయునది, అట్లుగావునన్=కాఁబట్టి, చెప్పెదన్, అవధరింపుము= వినుము.

తా. భగవద్భక్తులలో శ్రేష్ఠుఁ డగునట్టియు శరణన్నవారిఁ గరుణించునట్టియు నోహనుమంతుఁడా! యీహంసతత్త్వము నెఱుంగుటవలన క్షణమాత్రముననే యతి తీవ్రమగు సంసారదుఃఖము నశించును. కావున నాహంసతత్త్వమును వివరించెద వినుము.

## శరీరగతములగు నిడాపింగళాదుల వివేచనము.

అవ. ఇట్లు సహేతుకముగాను స్తోత్రపూర్వకముగాను ఉపక్షేప (వస్తునిరూపణ కారంభించుట) సహితముగాను ప్రతిజ్ఞఁజేసి దానిని విస్తరించువాఁడై ఉపోద్ఘాతరూప ముగా దేహసన్నివేశము నభివర్ణించుచున్నాఁడు:—

వ. మాతృపితృభుక్తాన్నసంభూతరక్తశుక్లబిందుజనితంబై త్వఙ్మాంసరుధిర మజ్జాస్థిస్నాయువు లనుషట్కోశంబులు గలిగి యొప్పునీస్థూలశరీ రంబునందు డెబ్బదిరెండువేలనాడులు గల వందు గుదంబునకంటె రెండంగుళంబులమీఁదట లింగంబునకంటె రెండంగుళంబుల క్రిందట నధోముఖాగ్రంబై మూఁడుకోణంబులు దనర దేహమధ్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మస్థానంబున మూలాధారచక్రంబలరు నదిమొదలు సహస్రారంబు తుదగాఁ బృష్ఠభాగంబున వీణాదండంబుభంగిసమస్తనాడికామూలకందంబై మూలోర్ధ్వచ్ఛిన్నవంశాభంబై షడాధారసమన్వితంబై యుండు దీర్ఘాస్థిబ్రహ్మదండి యనం బరఁగు. నాబ్రహ్మదండి మూలాధారాగ్ర కోణస్థయై కుండలీనామపరాశక్తియుక్తయై ప్రాణాగ్నిబిందునాదనిలయయై సావిత్రీసరస్వతీనామికయై బ్రహ్మరంధ్రగతయై సుషుమ్నానాడి ప్రవర్తిల్లుఁ దద్వామదక్షిణపార్శ్వంబులయందాధారంబుమొదలుకొని నాసికాగ్రపర్యంతంబు వ్యాపించి నాడీచక్రసంస్యూతలై పితృయాన దేవయాన సంజ్ఞకలై చంద్రసూర్యమండలంబులంబొంది యిడాపింగళ లనునాడులొప్పుచుండు; నాడీమండలంబు నాశ్రయించి కుక్కుటాండంబువిధంబున నాడీచక్రం బమరు నానాడిక లన్నాడీచక్రసముదితలట్లుగావునగాంధారిహస్తిజిహ్వ యను నాడులు నేత్రాంతవ్యాపినులు పూషాలంపూషానాడులు కర్ణద్వయానుగతులు శుక్లాఖ్యనాడిభ్రూమధ్యంబునొందుఘ్రాణరంధ్రయుగ్మంబు శ్రోత్రరంధ్రయుగ్మంబు భ్రూమధ్యంబు దిగువం గలసి యుండునచ్చోట శృంగాటకంబు చతుష్పథం బని విలసిల్లు గంగాయమునాసరస్వతు లనువేళ్లు గలయిడాపింగళాసుషుమ్నలు గూడినభ్రూమధ్యస్థానంబుత్రికూటంబనఁ ద్రివేణీసంగమం బనఁ దగు వాక్ప్రసారిణియైన సరస్వతీనాడి జిహ్వాంతగామిని యగు విశ్వోదరీనాడి చతుర్విధాన్నంబుల భక్షించుచుఁ గంఠస్థయైనపయస్వినీనాడి క్షుత్తృష్ణలనొదవించుచు జలపానం బాచరించి మఱియు నాడీచక్రసముద్భూతలైనమూఁడునాడు లధోముఖలై యుండు నందు రక్తావ్హయనాడి శుక్లంబును సినీవాలీనాడి మూత్రంబును గుహూనాడి మలంబును బహిర్గతంబుగఁజేయు శంఖినీదామినీనాడులు భక్షితాన్నరసంబుల గ్రహించి కపాలకుహరంబు నొంది శిరంబున నమృతంబు గావించు నదియునుంగాకహృదయంబున నేకోత్తరశతనాడులు దనర్చునందొక్కనాడి యూర్ధ్వగామిని యగు నన్నాడిమార్గంబు మోక్షమార్గం బని వేదాంతంబులు పలుకు నిట్లు వివరించిచెప్పినవెల్ల ముఖ్యనాడులు వీనిలోనిడాపింగళాసుషుమ్నలు శ్రేష్ఠనాడు లందు బ్రహ్మనాడిసకలనాడికాశిరోమణి యగుని త్రెలుంగునం దిర్యగూర్ధ్వాధఃప్రసృతలై

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పరమసుషిరప్రధానలైన ద్విసప్తతిసహస్రనాడులయందుఁ జలనథా వనకంపనాకుంచనశోషణధర్మంబు లైనదశవిధప్రాణంబులు మెలంగు నందు హృదయస్థానంబున వసియించి ప్రాణుం డిడాపింగళాఖ్య నాడికారంధ్రద్వయంబువలన నుచ్ఛ్వాసరూపంబుచేత బాహ్యంబు నకు నిర్గమించి ద్వాదశాంగుళపర్యంతం బరుదెంచి యచ్చట నడంగు గుదస్థానంబునందుండి యపానుండు నిశ్శ్వాసరూపంబుచేతఁ బ్రాణు నకునధోముఖంబుగా నెదురు నడుచుచు నధోముఖనాడీత్రితయంబు వలన మలమూత్రశుక్లంబుల వెడలించుచుండుఁ గంఠదేశంబున వసించి యుదానుండు మనంబునందలి సంకల్పవికల్పంబుల జిహ్వా ద్యష్టస్థానంబులవలన శబ్దరూపంబుగాఁ బలికించుచు సుషుప్త్యవసరం బున సకలేంద్రియంబుల సంగ్రహించి, యుపశమింపఁజేయుచుఁ బ్రబోధసమయంబున వానినెల్ల నెప్పటిచోట్ల నుంచుచు మఱియు లోకాంతరగమనాగమనంబుల సమర్థుండై యొప్పుచు నగ్నిష్టోమమ యుండై సుషుమ్నారంధ్రంబు నాశ్రయించి బ్రహ్మరంధ్రంబున కుద్గ మించుచుండు సర్వశరీరంబున వ్యాపించి వ్యానుండు బాహ్యశీతోష్ణం బుల నభ్యంతరంబునకు నాంతరశీతోష్ణంబుల బాహ్యంబున కిచ్చుచు భక్షితాన్నరసంబు నంతటఁ బ్రసరింపఁ జేయుచుండు నాభిస్థానస్థితుఁ డగు సమానుండు జఠరానలంబుఁ బ్రజ్వలింపఁజేసి ప్రాణ్యుపభుక్త చతుర్విధాన్నంబులం బచనంబుచేసి యెల్ల నాడులకుం బంచిపెట్టు నా గుండుద్గారంబుఁ గూర్మం డున్మీలనంబుఁ గృకరుండు తుతంబు దేవ దత్తుఁడు విజృంభణంబు సర్వవ్యాపి యైనధనంజయుండు మృతంబైన విడువక దేహస్థౌల్యంబుఁబుట్టించుచుండు నిటులుదశవాయువులతోఁ గూడి దశేంద్రియాన్వితంబై కామరాగద్వేషాదివికారసహితంబై విషయసుఖగ్రహణంబుకొఱకు నధోముఖంబై శ్రవణేంద్రియంబు వలనఁ ద్వివిధశబ్దంబులఁ ద్వగింద్రియంబువలనఁ బంచవిధస్పర్శంబుల నేత్రేంద్రియంబువలన షడ్వర్ణంబుల జిహ్వేంద్రియంబువలనషడ్విధ రసంబుల ఘ్రాణేంద్రియంబువలనఁద్రివిధగంధంబుల ననుభవించుచు వెండియు వాక్పాణిపాదపాయూపస్థలతోడం గూడి వచనాదాన గమనవిసర్గానంతకర్మంబుల నొనర్చుచు మనంబు ప్రవర్తించుచుండు నమ్మనంబుఁ గరణంబుగాఁ గైకొని తత్పవనమనోగ్రస్థితయుఁ గర్త్రు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్వభోక్తృత్వాదిధర్మసమేతయునైనబుద్ధి విలసిల్లునదియె బిందువనం బరఁగు నది సర్వకార్యకారణాశ్రయయు నిఖిలవాసనావాసితయు నగుంగావున నమ్మానసమారుతేంద్రియశరీరంబులతోఁ గూడి విషయాభిముఖియై తచ్చాంచల్యంబువలనఁ దానుం జలించుచు బహిరంతర్విషయానుభవంబు చేయుచు సుషుప్తియం దజ్ఞానాకారం బగుచు జాగ్రత్స్వప్నంబులయందు బుధ్యాద్యాకారంబై తోఁచుచు ననాది కాలంబుననుండి ముక్తిపర్యంతం బనంతకర్మంబు లాచరించుచుఁ దత్ఫలంబులగు సుఖదుఃఖంబుల భుజించుచు నవిచారరూపిణియై నిరంతరపర్యటనశీలయై యుండు మఱియును. 163

టీ. మాతృ...తంబై-మాతృపితృ=తల్లిదండ్రులచేత, భుక్త=భుజింపఁబడిన, అన్న సంభూత=ఆహారమువలనఁబుట్టిన, రక్త=శోణితముయొక్కయు, శుక్ల=వీర్యముయొక్కయు, బిందు=బిందువులచేత, జనితంబైన = పుట్టినదియు, త్వఙ్మాం...వ్రులు-త్వక్ = చర్మము, మాంస=మాంసము, రుధిర=రక్తము, మజ్జా=కొవ్వు (ఇది యెముకలలోపల నుండునది), అస్థి=ఎముకలు, స్నాయువులు=నరములు, అనుషట్కోశంబులుకలిగి=అనెడు ఆఱుకోశములున్ను గలిగినట్టిదియునై, ఒప్పు నీస్థూలశరీరంబునందున్ =ప్రకాశించుచున్న యీస్థూల శరీరమున, డెబ్బదిరెండువేలనాడులు గలవు. అందున్ = ఆశరీరమునందు, గుదంబున కంటెన్ =గుదస్థానమునకంటె, రెండంగుళంబులమీఁదటన్ =రెండంగుళములపైఁగా, లింగంబునకంటెన్, రెండంగుళములక్రిందుగాను, అధోముఖాగ్రంబై=క్రిందివైపునకుఁదిరిగి, మూఁడుకోణంబులుతనరన్ =మూఁడుకోణములుకలిగి, దేహమధ్యమస్థానంబునన్ =దేహమధ్యభాగమునందు (అత్రికోణాకారమగు స్థానమునకే దేహమధ్యమని పేరు.), మూలాధారచక్రంబు=మూలాధారమను పేరుగల చక్రము, అలరున్ =ప్రకాశించుచుండును. అది మొదలుకొని, సహస్రారంబుతుదగాన్ =సహస్రారమువఱకు, పృష్ఠభాగంబునన్ = వెనుకభాగమునందు, వీణాదండంబుభంగిన్ = వీణవలె, సమస్తనాడికామూలకందంబై= అన్నినాడులకును ఆధారమై, మూలో...భంబై-మూల=మొదటను, ఊర్ధ్వ=పైభాగమునందును, ఛిన్న=తెగఁగొట్టఁబడిన, వంశాభంబై=వెదురుబొంగుతో సమానమై, షడాధారసమన్వితంబై-షడాధార=షడాధారచక్రములతో, సమన్వితంబై=కూడినదై, ఉండు దీర్ఘాస్థి=ఉన్నట్టిగొప్పయెముక (వెన్నెముక), బ్రహ్మదండియనంబరఁగున్ = బ్రహ్మదండి యను పేరుతో నొప్పుచుండును. ఆబ్ర...స్థయై-ఆబ్రహ్మదండి = ఆవెన్నెముకయొక్క, మూల=మొదటనున్న, ఆధార=మూలాధారచక్రముయొక్క, అగ్రకోణ=పైకోనయందు, స్థయై=ఉన్నదియై, కుండ... యై-కుండలీనామ=కుండలి యను పేరుగల, పరాశక్తియుక్తయై =శక్తితోఁగూడినదియై (ఒకసర్పము మూలాధారమునందు [illegible]చుకొని శిరసునందు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తోఁకనుంచుకొని యున్నదని ప్రసిద్ధిగలదు. వెన్నెముకయొక్క సన్నివేశము చూచుట కట్లే యుండునుగదా. మూలాధారమున కథఃకుండలియనియు శిరమున నూర్ధ్వకుండలి యనియుఁ బేరు). ప్రాణా...యై-ప్రాణ=ప్రాణవాయువులకును, అగ్ని=జఠరాగ్నికిని, బిందు=బుద్ధికిని, నాద=ప్రణవనాదములకును, నిలయమై = ఆధారమైనదియై, సావిత్రీ సరస్వతీనామికయై = సావిత్రి, సరస్వతి అను పేర్లుగలదియై, బ్రహ్మరంధ్రగతయై=బ్రహ్మ రంధ్రము నాశ్రయించినదియై, సుషుమ్నా నాడి=సుషుమ్నయను నొకనాడి, ప్రవర్తిల్లు= ఉండును. తద్వామ దక్షిణపార్శ్వంబులయందున్ = ఆనాడికి యెడమకుడిభాగముల యందు, ఆధారంబు మొదలుకొని=మూలాధారచక్రము మొదలు, నాసికాగ్రపర్యంతంబు= ముక్కుకొనవఱకు, వ్యాపించి, నాడీచక్రసంస్యూతలై=నాడీచక్రమునకు సంబంధించినవై, పితృయాన దేవయానల నెడు=పితృయానము దేవయానము అను (ఎడమ ముక్కునందలి యూపిరికి ఇడానాడి యని పేరు. ఆనాడీమూలమున యజ్ఞాదికర్మల నాచరించువారు నిర్గమింతురు. స్వర్గాదులయందు ఫలముల ననుభవించి భూలోకమునకు మఱలివత్తురు. కుడి ముక్కునందలి శ్వాసకు పింగళనాడి యని పేరు. ఉపాసకు లగువారు ఆనాడీమార్గమున నిర్గమించి చతుర్ముఖుని లోకముఁజేరి యచ్చట నపరోక్షజ్ఞానమును సంపాదించి యా చతుర్ముఖునితోఁగూడ ముక్తులగుదురు. భూలోకమునకు మఱలిరారు. ఈరెండు నాడుల కును క్రమముగా పితృయాన మనియు దేవయాన మనియు పేర్లుగలవు. వీనినే ధూమాది మార్గ మనియు నర్చిరాదిమార్గ మనియుంగూడఁ జెప్పుదురు.) సంజ్ఞికలై=పేర్లుగలవియై, చంద్రసూర్యమండలంబులంబొంది=చంద్రసూర్యమండలముల నాశ్రయించి, ఇడాపింగళ లను నాడు లొప్పుచుండున్, నాభిమండలంబునాశ్రయించి=నాభినాశ్రయించి, కుక్కు టాండంబువిధంబునన్=కోడిగ్రుడ్డువలె, నాడీచక్రంబమరున్ = సకలనాడులకు నాధార మగు నాడీచక్రముకలదు. ఆనాడికలు = ఆఇడాపింగళానాడులు, అన్నాడీచక్రసముది తలు=ఆనాడీచక్రమునుండిపుట్టినవి. అట్లుగావునన్=కాఁబట్టి, గాంధారి=గాంధారి, హస్తి జిహ్వ, అనునాడులు = అను పేర్లుగల రెండునాడులు, నేత్రాంతవ్యాపినులు=కండ్లకొన వరకు వ్యాపించియుండునవి (ఎడమకంటియందు గాంధారి కుడికంటియందు హస్తిజిహ్వ), పూషాలంపూషానాడులు=పూషాలంపూషలను పేర్లుగలనాడులు, కర్ణద్వయానుగతలు= చెవుల నాశ్రయించియుండును. శుక్లాఖ్యనాడి=శుక్లయను పేరుగలనాడి, భ్రూమధ్యంబు నొందున్=భ్రూమధ్యము నాశ్రయించియుండును. ఘ్రాణరంధ్రయుగ్మంబు=ఘ్రాణరంధ్ర ములురెండును, శ్రోత్రరంధ్రయుగ్మంబు = శ్రోత్రరంధ్రంబులురెండును భ్రూమధ్యంబు దిగువన్=బొమలక్రింది ప్రదేశమున,కలసియుండున్=చేరియుండును,అచ్చోటు=అకలసి యున్నస్థలము, శృంగాటకంబు=శృంగాటకము, చతుష్పథంబు=చతుష్పథము (నాలుగు త్రోవలు కలయుచోటు), అనన్ = అను పేర, విలసిల్లు = ప్రకాశించును. గంగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యమునా సరస్వతులు అను పేళ్లు, కల యిడాపింగళసుషుమ్నలు = కలిగిన (పూర్వోక్త యిడాపింగళా సుషుమ్నా నాడులు, కూడిన భ్రూమధ్యస్థానంబు = కలయుచున్నట్టిబొమల నడిమిప్రదేశము, త్రికూటంబనన్ = త్రికూటమనియు, త్రివేణీసంగమంబనన్ = త్రివేణీ సంగమ మనియు, తగున్ = చెప్పఁబడుచున్నది. వాక్ప్రసారిణి = మాట లాడుటకు శక్తిని గలిగించునది, ఐనసరస్వతీనాడి = ఐనట్టిసరస్వతి యనునాడి, జిహ్వాంతగామిని యగున్ = నాలుకయొక్క కొనను జెందియుండును. విశోదరీనాడి = విశోదరి యను పేరు గలనాడి, చతుర్విధాన్నంబులన్ - చతుర్విధ = నాలుగువిధములగు (భోజ్య, లేహ్య, చోష్య, పానీయములు చతుర్విధాహారములు) అన్నంబులన్ = ఆహారములను, భక్షించున్. కంఠస్థ = కంఠమునందుండునది, ఐనపయస్వినీనాడి = ఐనపయస్విని యను పేరు గలనాడి, క్షుత్తృష్ణలన్ = ఆఁకలిదప్పులను, ఒదవించుచున్ = కలుగఁజేయుచు, జలపానం బాచరించున్ = నీరు త్రావును, మఱియున్, నాడీచక్రసముద్భూతలు = నాడీచక్రమునుండిపుట్టినవి, ఐనమూఁడునాడులు, అధోముఖలైయుండున్ = క్రిందికి వ్యాపించి యుండును. అందున్ = ఆమూఁటిలో, రక్తాహ్వాయనాడి = రక్తాహ్వాయమను పేరుగలనాడి, శుక్లంబున్ = వీర్యంబును, సినీవాలినాడి = సినీవాలి యను పేరుగలనాడి, మూత్రంబున్ = మూత్రమును, కుహూనాడి = కుహూయను పేరుగలనాడి, మలంబున్ = మలమును, బహిర్గతంబుగఁజేయున్ = వెలికిఁగొట్టును. శంఖినీ దామినీనాడులు = శంఖిని, దామిని యను పేరుగలనాడులు, భక్షి...రసంబున్ - భక్షిత = భుజింపఁబడిన, అన్న = ఆహారముయొక్క, రసంబున్ = రసమును (శరీరమునం దన్నము పరిపాకమును జెందినపిదప ద్రవరూప మగును. దానికే యన్నరసమని పేరు), గ్రహించి = తీసికొని, కపాల కుహరంబున్ - కపాల = కపాలముయొక్క, కుహరంబున్ = రంధ్రమును, ఒంది = పొంది, శిరంబునన్ = శిరస్సునందు, అమృతంబున్ = అమృతమును, కావించున్ = చేయుచుండును. అదియునుంగాక, హృదయంబునన్ = అొమ్మునందు, ఏకోత్తరశత నాడులు = నూటఒక్కనాడులు, తనర్చున్ = ఉన్నవి. అందున్ = ఆనాడులలో, ఒక్క నాడి, ఊర్ధ్వగామినియగున్ - ఊర్ధ్వ = పైకి, గామినియగున్ = వ్యాపించునదియగును. అన్నాడీమార్గంబు = ఆనాడియొక్కమార్గము, మోక్షమార్గంబని = మోక్షమునకు మార్గ మని (ఆనాడిమార్గముగ నిర్గమించిన జీవుఁడు మోక్షమును జెందునని; ఇచ్చట మోక్ష మనఁగా దేవయానమార్గము నాశ్రయించి చతుర్ముఖునిలోకమునకుఁ బోయి కల్పాం తమునందు నాయనతోఁగూడ ముక్తినిఁజెందుటయే.) వేదాంతంబులు పలుకున్ = వేదాం తశాస్త్రములు చెప్పును. ఇట్లు వివరించి చెప్పినవెల్లన్, ముఖ్యనాడులు = నాడులలో ముఖ్యములగునవి. వీనిలోన్ = ఈముఖ్యనాడులలోఁగూడ, ఇడాపింగళాసుషుమ్నలు, శ్రేష్ఠనాడులు = శ్రేష్ఠతమములైనవి. అందున్ = ఆనాడులలో, బ్రహ్మనాడి = హృదయము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నం దున్న నూటయొక్కనాడులలోఁ బైకి ప్రసరించియున్నదని చెప్పఁబడియున్న మోక్షమార్గమగునాడి, సకలనాడికాశిరోమణియగున్ =అన్ని నాడులలోను శిరోరత్నము వంటిదై యున్నది. ఇత్తెఱఁగునన్ = ఈవిధముగా, తిర్య...లై = తిర్యక్ = అడ్డముగాను, ఊర్ధ్వ = పైఁగాను, అధః = క్రిందుగాను, ప్రసృతలై = వ్యాపించినవై, పరమ...నలు - పరమ = సూక్ష్ములైన, సుషిర = రంధ్రములే. ప్రధానలు = రూపములుగాఁగలవి, ఐన ద్విసప్తతిసహస్రనాడులయందున్ = ఐనట్టి డెబ్బదిరెండు వేల నాడులలో, చలన...బులు-చలన=కదలుట, ధావన = పరుగెత్తుట (లేక వ్యాపించుట), కంపన=వణఁకుట, ఆకుంచన = ముడుచుకొనుట, శోషణ=ఎండునట్లుచేయుట (అనఁగా: బడలికను చెందించుట, లేక చెందుట), ధర్మకంబులు = అనుధర్మములుగల, ఐనదశవిధ ప్రాణంబులు = ఐనట్టి పదిప్రాణవాపులలో, మెలఁగున్ = సంచరించు చుండును. అందున్ =ఆదశవిధప్రాణవాయువులలో, ప్రాణుఁడు=ప్రాణ మనియెడువాయువు, హృదయస్థానంబున వసియించి=వక్షస్థలమునందుండి, ఇడా...లన్-ఇడాపింగళాఖ్య=ఇడాపింగళలను పేర్లుగల, నాడికా = నాడులయొక్క, రంధ్రద్వయంబువలనన్ = రంధ్రములమార్గమున, ఉచ్ఛ్వాసరూపంబుచేతన్ = శ్వాసగా (ఉచ్ఛ్వాసనిశ్వాసశబ్దములను యథేచ్ఛముగా వాడుకొనుటగూడఁగలదు. నిశ్వాసశబ్దమునకు "వెలికివచ్చుగాలి" యనియు నుచ్ఛ్వాసశబ్దమునకు "లోనికిపోవుగాలి" యనియు నర్థమైనను ఇచ్చట నుచ్ఛ్వాసపదము నిశ్వాసార్థమున నుపయోగింపఁబడియున్నది కదా), నిర్గమించి=వెలుపలకువచ్చి, ద్వాదశాంగుళపర్యంతంబు=పన్నెండు అంగుళముల దూరమువఱకు, అరుదెంచి = వచ్చి, అచ్చటన్ = ఆస్థలమునందు, అడంగున్ = నశించిపోవును. గుదస్థానంబునందుండి, అపానుండు = అపానవాయువు, నిశ్వాసరూపంబుచేతన్ = నిశ్వాసరూపముతో, ప్రాణునకున్ = ప్రాణవాయువునకు, అధోముఖంబుగాన్ = క్రిందిభాగముగా, ఎదురు నడుచున్, అధోముఖనాడీత్రితయంబువలనన్ = నాడీచక్రమునుండి అధోముఖముగఁ బ్రసరించియున్నమూఁడు నాడులమార్గమున, మలమూత్రశుక్లంబులన్, వెడలించుచుండున్, కంఠదేశంబునన్=కంఠమునందు, వసియించి=నిలిచి యుండి, ఉదానుండు= ఉదానవాయువు, మనంబునందలిసంకల్పవికల్పంబులన్, జిహ్వాద్యష్టస్థానంబువలనన్= జిహ్వామొదలగు నెనిమిదిస్థానంబులమూలమున (జిహ్వ కంఠము దంతములు దవుడలు శిరస్సు నాసిక కొండనాలుక పెదవులు ఇవియే శబ్దములు పుట్టునట్టియష్టస్థానములు.), శబ్దరూపంబుగాన్ = పదరూపములుగా, పలికించుచు = చెప్పునట్లుచేయుచు, సుషుప్త్యవసరంబులన్ = సుషుప్తిసమయములయందు, సకలేంద్రియంబులన్ = సమస్తేంద్రియములను, సంగ్రహించి=తనలోనికిఁ దెచ్చుకొని, ఉపశమింపఁ జేయుచున్ = విశ్రమించునట్లుచేయుచు, ప్రబోధసమయంబునన్ = మరలమేల్కాంచినప్పుడు, వానినెల్లన్ =

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆయింద్రియములన్నిటిని, ఎప్పటిచోట్లనుంచుచున్, మఱియున్, లోకాంతరగమనాగమనంబులన్=పరలోకమునకుఁబోవుట అచ్చటనుండి మరలివచ్చుట అనువానియందు, సమర్థుండై = శక్తిగలవాఁడై, ఒప్పుచున్, అగ్నిష్టోమమయుండై = అగ్నిష్టోమయజ్ఞరూపుఁడై, సుషుమ్నారంధ్రంబున్=సుషుమ్నానాడియొక్క రంధ్రమును, ఆశ్రయించి, బ్రహ్మరంధ్రంబునన్ = సహస్రారచక్రమువఱకు, ఉద్గమించుచుండున్ = పైకిపోవుచుండును, వ్యానుండు = వ్యానవాయువు, సర్వశరీరంబునన్ = శరీరమునందంతయు, వ్యాపించి, బాహ్యశీతోష్ణంబులన్-బాహ్య = వెలుపలనుండు, శీత=చలి, ఉష్ణంబులన్=వేఁడి (వీసిని), అభ్యంతరంబునకున్ = లోనికిని, ఆంతరశీతోష్ణంబులన్=లోపల నుండు శీతోష్ణములను, బాహ్యంబునకున్ = వెలుపలికిని, ఇచ్చుచున్, భక్షితాన్నరసంబున్ = భుజింపఁబడిన యన్నరసమును, అంతటన్ = శరీరమునందంతటను, ప్రసరింపఁజేయుచుండున్ = వ్యాపించునట్లు చేయుచు నుండును. నాభిస్థానస్థితుండగు సమానుండు = నాభియందున్న సమానవాయువు, జఠరానలంబున్ = జఠరాగ్నిని, ప్రజ్వలింపఁజేసి, ప్రాణ్యు...బులన్-ప్రాణి=జీవులచేత, ఉపభుక్త=భుజింపఁబడిన, చతుర్విధాన్నంబులన్ = నాలుగువిధములైన యాహారములను, పచనంబుచేసి = పక్వములఁజేసి, ఎల్లనాడులకున్=సమస్తములగు నాడులకును, పంచిపెట్టు=పంచియిచ్చును. నాగుఁడు = నాగవాయువు, ఉద్గారంబుసు=తేనుపును, కూర్మండు=కూర్మవాయువు, ఉన్మీలనంబును = కనులు తెఱచుటను, కృకరుఁడు = కృకరవాయువు, క్షుతంబు = తుమ్ముటను, దేవదత్తుఁడు = దేవదత్తవాయువు, విజృంభణము=ఆవులింతను, సర్వవ్యాపియైన ధనంజయుఁడు=శరీరమునందంతయును వ్యాపించియున్న ధనంజయవాయువు, మృతంబైనన్ = మరణమును జెందినను, విడువక=ఈ శరీరమును విడువక, దేహస్థౌల్యంబున్ = శరీరమునకు వాపును, పుట్టించుచుండున్, ఇటులన్=ఈవిధముగా, దశవాయువులతోన్ = పదివాయువులతో, కూడి-దశేంద్రియాన్వితంబై = జ్ఞానేంద్రియములైదు కర్మేంద్రియములైదును గలసి పది యింద్రియములతోఁ గూడినదియై, కామ...తంబై-కామరాగద్వేషాదివికార=కామము రాగము ద్వేషము మొదలగువికారములతో (కామమనఁగా తనకు లేనిదానిని కావలయునని కోరుట; రాగ మనఁగా తన కున్నదానినే సర్వకాలములయందు ననుభవింపవలయునని కోరుచుండుట; ద్వేష మనఁగా తన కనిష్టమగు విషయమునందుండు నసూయ), సహితంబై=కూడినదియై, విషయ...కున్-విషయ = శబ్దాదివిషయములవలనఁ గలిగిన, సుఖ = ఆనందముయొక్క, గ్రహణంబుకొఱకున్ = గ్రహించుటకై, అధోముఖంబై, శ్రవణేంద్రియంబువలనన్ = చెవులవలన, ద్వివిధశబ్దంబులన్=రెండువిధము లగు శబ్దములను, (శబ్దము ధ్వనిరూపమనియు అక్షరరూపమనియు రెండువిధములై యున్నది.), త్వగింద్రియంబువలనన్=చర్మమువలన, పంచవిధస్పర్శంబులన్ = ఐదువిధములగు స్పర్శ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములను (చల్లదనము వేడిమి సమత్వము కాఠిన్యము మృదుత్వము అను నివి పంచవిధ స్పర్శములు), నేత్రేంద్రియంబువలనన్ = నేత్రమువలన, షడ్వర్ణంబులన్ = ఆఱురూప ములను (నలుపు పసుపు ఆకుపసుపు తెలుపు చెంగావి లేక, ఊదా చిత్రము అను నివి షడ్విధరూపములు), జిహ్వేంద్రియంబువలనన్ = నాలుకవలన, షడ్విధరసంబులన్ = ఆఱువిధము లగు రుచులను, ఘ్రాణేంద్రియంబువలనన్ = నాసికవలన, త్రివిధగంధం బులన్=మూఁడువిధము లగు వాసనలను (సుగంధము దుర్గంధము మిశ్రగంధము ఇవి త్రివిధగంధములు), అనుభవించుచున్, వెండియున్=మఱియు, వాక్పా...దన్-వాక్ =వాక్కుతోను, పాణి=హస్తములతోను, పాద=పాదములతోను, పాయు = పాయువు తోను, ఉపస్థలతోడన్, కూడి, వచ...బులన్-వచన = మాటలాడుట, ఆదాన = ఒక దానిని స్వీకరించుట, గమన=నడచుట, విసర్గ=మలవిసర్జనము చేయుట, ఆనంద = ఆనం దించుట, కర్మంబులన్=అను కార్యములు, ఒనర్చుచున్=చేయుచు, మనంబు=మనస్సు, ప్రవర్తించుచుండున్=సంచరించుచుండును. అమ్మనంబున్=ఆ మనస్సును, కరణంబుగాన్ =సాధనముగా, కైకొని=అంగీకరించి, తప్పు...తయున్-తత్=ఆ, పవన=ప్రాణమునకు, మనః=మనస్సునకును, అగ్రస్థితయున్ = పైభాగమునందు ఉన్నదియు, కర్తృత్వభోక్తృ త్వాది ధర్మసమేతయున్ = ఒకకార్యమును జేయుట దానిఫలము ననుభవించుట అను ధర్మములు గలదియు, ఏనబుద్ధి=ఏనట్టిబుద్ధి, విలసిల్లున్ = ప్రకాశించుచున్నది. అదియే= ఆ బుద్ధియే, బిందు వనం బరఁగున్ = బిందువని చెప్పఁబడుచున్నది. అది=ఆ బిందువు, సర్వ...యున్-సర్వ = సమస్తములైన, కార్య=కార్యములకును, కారణ = కారణము లకును, ఆశ్రయయున్ = ఆధారమైనదియు, నిఖి...యున్ - నిఖిల = సమస్తమైన, వాసనా=సంస్కారములచేత, వాసితయున్ = ఆశ్రయింపఁబడినదియు, అగున్ = అగు చున్నది. కావునన్=కాఁబట్టి, అమ్మ...తోన్-అమ్మానస = ఆమనస్సుతోను, మారుత= వాయువులతోను, ఇంద్రియ=దశేంద్రియములతోను, శరీరంబులతోన్=శరీరముతోను, విషయ=శబ్దాదివిషయములకు, అభిముఖియై=ఎదురై (అనఁగా: విషయముల గ్రహించు నదియై), తచ్చాంచల్యంబువలనన్ = ఆ విషయములు, లేక విషయముల గ్రహించునట్టి యింద్రియములు, లేక మనోవృత్తులు చలించుచుండుటచేత, తాను=ఆ బిందురూపమైన బుద్ధియును, చలించుచున్=కదలుచు, బహి...చున్-బహిః = వెలుపలనుండునట్టియు, అంతః=లోపలనుండునట్టియు, విషయ=విషయములయొక్క(ను), అనుభవంబు=అనుభవిం చుట చేయుచున్, సుషుప్తియందున్ = సుషుప్త్యవస్థలో, అజ్ఞానాకారంబగుచున్ = అజ్ఞానస్వరూపము గలదియై, జాగ్రత్స్వప్నంబులయందున్ = జాగ్రత్స్వప్నావస్థల యందు, బుద్ధ్యాద్యాకారంబై తోఁచుచును = బుద్ధి మొదలగు రూపములతో కనఁబడు చును, అనాదికాలంబుననుండి, ముక్తిపర్యంతంబున్=మోక్షము కలుగునంతవఱకు, అనంత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కర్మంబు లాచరించుచుఁ=మితిలేనికర్మలఁ జేయుచు, తత్ఫలంబులను=వానియొక్క ఫలములను, భుజించుచుఁ = అనుభవించుచు, అవిచారరూపిణియై = బ్రహ్మవిచారము లేక పోవుట అనునదియే స్వరూపముగాఁ గలదియై, నిరంతరపర్యటనశీలయై-నిరంతర = సర్వకాలములయందును, పర్యటన=సంచరించుచుండుటయె (అనఁగా: చరించుచుండుటయే), శీలయై=స్వభావముగాఁ గలదియై, ఉండుఁ, మఱియుఁ.

తా. తలిదండ్రులు భుజించిన యాహారరసమువలన నేర్పడు శోణితశుక్లబిందువులవలన నీదేహము జనించును. చర్మము మాంసము రక్తము మజ్జ (ఎముకలలోపలనుండు "మూలగ" యని వ్యవహరింపఁబడుచున్న క్రొవ్వు) యెముకలు నరములు అను నాఱు కోశములతో నిది యొప్పుచుండును. ఇట్టి యీ స్థూలశరీరమునందు డెబ్బదిరెండువేల నాడు లున్నవి. వానిస్థితి యెట్లనిన: గుదస్థానమునకంటె రెండంగుళములమీఁద లింగస్థానమునకంటె రెండంగుళములక్రిందనుండు ప్రదేశమునకు దేహమధ్య మని పేరు. అచట మూలాధార మను పేరుగల యొకచక్రము గలదు. అది త్రికోణాకారమై యుండును. దానియగ్రము క్రిందివైపునకుఁ దిరిగియుండును. అచ్చటనుండి బ్రహ్మరంధ్రమువఱకు వెనుకభాగమున వీణాదండ మను పేర నొకయెముక వ్యాపించియున్నది. అది మూలమునందును అగ్రమునందునుకూడ ఛేదింపఁబడిన వెదురుగొట్టమువలె నుండును. అదియే యీ చెప్పిననాడులకు నాధారము. దాని నాశ్రయించియే యీనాడు లన్నివైపులకును వ్యాపించుచున్నవి. షడాధారచక్రములును నిలచియున్నవి.

ఇక నాడులనుగూర్చి వినుము. అన్నిటిలోను ముఖ్యతమమగు సుషుమ్న యను నాడి పై వర్ణింపఁబడియున్న మూలాధారమునందలియంచు నాశ్రయించి బ్రహ్మదండి మూలమున నాసికాగ్రమువఱకు వ్యాపించియున్నది. ఆనాడినే సావిత్రియనియు, సరస్వతియనియుఁ జెప్పుదురు. ఊర్ధ్వకుండలియు నధఃకుండలియు ననుశక్తులను (సర్పాకారముతో కుండలి యను పేరుగల యొకశక్తి కలదనియు దాని కధోభాగమున పడగయు నూర్ధ్వభాగంబున పుచ్ఛంబునుం గలదనియు వానికిఁ గ్రమముగా నధఃకుండలి యూర్ధ్వకుండలి యని పేర్లు గలవనియు యోగులు చెప్పుదురు.) ప్రాణవాయువులును జఠరాగ్నియుఁ బిందునాదములును ఆ నాడియందే కలవు. ఈ సుషుమ్నానాడికి నెడమ భాగమునం దిడ యనునాడియు కుడిభాగమునఁ బింగళ యనునాడియుఁ గలవు. ఇవియు మూలాధారము మొదలు నాసికాగ్రమువఱకు వ్యాపించియుండును. వీనినుండియే నిశ్వాసము వచ్చును. ఎడమముక్కునుండి వచ్చునిశ్వాసము ఇడానాడినుండి వచ్చును. కుడిముక్కునుండి వచ్చునది పింగళానాడినుండి వచ్చును. ఈనాడులకుఁ గ్రమముగా పితృయానమనియు దేవయానమనియుఁ బేర్లు గలవు. వీనికే ధూమాదిమార్గమనియు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అర్చిరాదిమార్గమనియుఁ గూడ నందురు. యజ్ఞాదికర్మనిష్ఠులు ధూమాదిమార్గమునఁ బరలోకమునకుఁ బోవుదురు. కర్మఫలము ననుభవించి భూలోకమునకు మఱలివత్తురు. ఉపాసనలఁ జేసినవారు అర్చిరాదిమార్గమున (అనఁగాఁ: పింగళానాడీమూలమునఁ బరలోకమునకుఁ బోవుదురు. అచ్చటఁ జతుర్ముఖునితోడ ముక్తులగుదురు. కావున నీ రెండునాడులును బ్రధానములైనవి. ఇందు మొదటిది చంద్రమండలము నాశ్ర యించియున్నది. రెండవది సూర్యమండలము నాశ్రయించియున్నది. కావుననే వీనికిఁ గ్రమమున చంద్రనాడియనియు సూర్యనాడియనియుఁ బేర్లు. ఈ నాడులుకూడ మూలా ధారమునుండియే యూర్ధ్వముగా వ్యాపించియున్నను సుషుమ్నానాడివలె నచ్చటనే జనించినవి కావు. నాభినాశ్రయించి కోడిగ్రుడ్డువంటియాకారముతో నాడీచక్రమను పేర నొకచక్రము కలదు. డెబ్బదిరెండు వేలనాడులును అచక్రమునుండియే జనించు చున్నవి. పైఁజెప్పిన ఇడాపింగళానాడులు కూడ నిట్టివే.

మఱికొన్ని నాడులనుగూర్చి చెప్పెద వినుము. గాంధారి హస్తిజిహ్వా యను రెండు నాడులును నాడీచక్రమునుండి నేత్రములవఱకు వ్యాపించి దృష్టిని గలిగించుచున్నవి. పూష, యలంపూష యనునాడులు కర్ణములవఱకు వ్యాపించి వినునట్టిశక్తిని గలిగించును. శుక్లయనునాడి భ్రూమధ్యము నాశ్రయించియుండును. ఆభ్రూమధ్యమునకు క్రింది భాగము నాసికారంధ్రములు రెండును శ్రోత్రరంధ్రములు రెండును కలసి యొక్కటియై యుండును. అస్థలమునకు శృంగాటక మనియుఁ జతుష్పథ మనియు పేరు. ఇడాపింగళా నాడులకు గంగాయమునలని పేర్లుగలవు. సుషుమ్నానాడికి సరస్వతి యనిపేరుగల దని యిదివఱకే చెప్పియున్నాము. ఈమూఁడునాడులును భ్రూమధ్యమునఁగలయును. కావున నాస్థానమునకుఁ ద్రికూట మనియుఁ ద్రివేణీసంగమ మనియుఁ బేరు; మఱియు సరస్వతి యనునాడి నాడీచక్రమునుండి నాలుకకొనవఱకు వ్యాపించి మాటలాడించును. విశ్వోదరి యనునాడి యాహారమును భుజించును. పయస్విని యనునాడి కంఠమునం దుండి యాఁకలి దప్పులఁ గలిగించుచు జలపానము నాచరించును. ఇదియునుఁగాక యానాడీచక్రమునుండి క్రిందికి వ్యాపించునాడులు కొన్నిగలవు. అందు మూఁడు ప్రధానములు. వానిలో రక్తా హ్వయ. మనునాడి శుక్రశోణితములను సినీవాలినాడి మూత్రమును కుహూనాడి మల మును వదలించును. శంఖినీ దామినీ యనురెండునాడులు అన్నరసమును గొనిపోయి శిరసునందుఁ జేర్చి యచ్చట దాని నమృతముగాఁ జేయుచుండును. లంబికాయోగము నాచరించువారు ఆయమృతము జిహ్వకు సోకుటచేతనే జరామరణములు లేనివార లగుచున్నారు.

ఇవి యన్నియును గాక హృదయస్థానమునందు నూటయొక్కనాడులు గలవు. అం దొక్కనాడిమాత్రము బ్రహ్మరంధ్రమువఱకు వ్యాపించియుండును. దానికి బ్రహ్మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాడి యని పేరు. దానిమూలమునఁ బ్రాణత్యాగముఁ జేసినవారు మోక్షము నొందుదు రని వేదాంతశాస్త్రములయందుఁ బ్రసిద్ధమై యున్నది. ఈవిధముగా వర్ణింపఁబడియున్న నాడులు డెబ్బదిరెండువేలనాడులయందును బ్రధానములై యున్నవని తెలిసికొనవల యును. ఇవి గాక నూర్ధ్వముఖముగాను అధోముఖముగాను దిర్యఙ్ముఖముగాను బ్రసరించి యుండునాడు లెన్నియో గలవు. పైవివరింపఁబడి యున్న నాడులలోఁగూడ నిడాపింగళా సుషుమ్నలు ముఖ్యములు. మోక్షమార్గ మనిచెప్పఁబడియున్న బ్రహ్మనాడి యన్నినాడుల కును శిరోరత్నముఁవంటిదని తెలిసికొనవలయును.

ఈవిధముగాఁ బైకిని క్రిందికిని బ్రక్కలకును వ్యాపించి సూక్ష్మమగురంధ్రములే స్వరూపముగాఁ గల డెబ్బదిరెండువేల నాడులయందును బ్రాణాదిదశవిధవాయువులును సంచరించుచు కదలుట కదలించుట పరుగెత్తుట ముడుచుట చూచుట ఎందుసట్లుచేయుట అనుకార్యముల నాచరించుచున్నవి. ఆవాయువులలోఁ బ్రాణ మనువాయువు హృదయ స్థానమునం దుండి యిడాపింగళానాడులమూలమున పండ్రెండంగులములవఱకు వెలికిఁ బోవుచు వచ్చుచుండును (ఇదియే నిశ్వాసము). అపానవాయువు గుదస్థానమునందుండి యధోముఖముగ సంచరించుచు నచటనుండు నాడులమూలమున మలమూత్రశుక్లశోణిత ముల వెలివడఁజేయుచుండును. ఉదాన మనువాయువు కంఠదేశమునం దుండి సుషుమ్నా నాడి నాశ్రయించి బ్రహ్మరంధ్రమువఱకు నూర్ధ్వముఖముగా వ్యాపించుచుండును. మనసునందు పుట్టినసంకల్పవికల్పముల నాలుక దవుడలు మొదలగునవయవములచేఁ బలి కించును. సుషుప్త్యవస్థయందు ఇంద్రియముల నన్నిఁటిని తనకడకుఁ జేర్చి భద్రముగనుంచి మరల జాగ్రదవస్థరాగానే వానినన్నిఁటిని స్వస్థానములయందునిలుపును. జీవుఁడు దేహ మును విడచిపోవునప్పుడును మరల శరీరమునందుఁ బ్రవేశించునప్పుడు నీవాయువే యాధా రము. దీని కగ్నిష్టోమమే స్వరూపము. వ్యాన మనువాయువు సర్వశరీరమును వ్యాపించి వెలుపలి శీతోష్ణముల లోనికి నీడ్చుచు లోపలి శీతోష్ణముల వెలికిఁ దరుముచుండును. అన్నరసమును శరీరమున కంతకుఁ బంచియిచ్చుచుండును. సమాన మనువాయువు నాభి స్థానముననుండి జఠరాగ్నికి జ్వాలఁగలిగించి భుజించినయాహారమును బక్వముఁ జేసి దానిరసమును నాడుల కన్నిఁటికిని బంచి యిచ్చును. నాగ మనువాయువు త్రేనుపును గలి గించును. కూర్మ మనువాయువు కన్నులమూయునట్లుఁ దెఱచునట్లుఁజేయును. కృకర వాయువు తుమ్మునట్లుచేయును. దేవదత్తవాయువు వావులింతను గలిగించును. ధనంజయ మనువాయువు మృతమైనశరీరమును సహితము విడువక యుబ్బునట్లుఁ జేయును.

ఈచెప్పఁబడినదశవిధవాయువులతోను పదియింద్రియములతోను గూడి మనస్సు శ్రోత్రేంద్రియమువలన శబ్దమును గ్రహించును. నేత్రేంద్రియమువలన సకలవిధములగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రూపులను జూచుచు త్వగింద్రియమువలన స్పర్శలను గ్రహించుచు ఘ్రాణేంద్రియము వలన గంధము నాఘ్రాణించుచు జిహ్వేంద్రియమువలన రుచుల నాస్వాదించుచు నుండును. అదియే హృదయకమలము. విషయసుఖముల గ్రహించుటకై యది యధో ముఖముగానున్నది. కర్మేంద్రియములసహాయమువలన మాటలాడుట యిచ్చుట నడచుట విసర్జించుట యానందించుట యనుకార్యములనుగూడ నదియే చేయును. హృదయకమల మును స్థానముగాఁగైకొని బుద్ధిసంచరించుచుండును. అది ప్రాణవాయువునకును మనసు నకు నగ్రభాగమునందుండును. దానికే బిందు వని పేరు. సకలవిధములగువాసనలకును కార్యకారణములకును అదియే యాశ్రయము. సుషుప్త్యవస్థయం దది యజ్ఞానరూప మునుఁ జెందును. జాగ్రదవస్థయందు అంతఃకరణరూపమును జెందును; దానికి స్వభావ ముగఁ జలనములేదు. అయినను ప్రాణవాయువులయొక్కయు మనసుయొక్కయు కదలికచే నదియుఁ గదలినట్లుండును. అనాదికాలమునుండియు మోక్షము గలుగువఱకు బహువిధము లగుకర్మలనాచరించునదియు వానిఫలముల ననుభవించునదియు నాబిందువే. కర్తృత్వ, భోక్తృత్వములు అబిందువునకేకాని యాత్మకు లేవు. ఇదియునుఁగాక.

## నాదబిందుకళావివరణము.

అవ. ఇట్లు బిందువును వర్ణించి నాదబిందుకళలయథార్థస్వరూపమును జెప్పు చున్నాఁడు:—

క. ప్రతనుప్రాణమనోగ్ర, స్థితబుద్ధియె బిందు వందుఁ జెలఁగెడియాత్మ
ప్రతిబింబమెకళ పవనో,న్నతఘోషమెసుమ్ము ప్రణవనాదమువత్సా.

టీ. వత్సా=బిడ్డా! ప్రత...ద్ధియె-ప్రతను=స్థూల సూక్ష్మకారణము లనుభేదములు గల శరీరములయొక్కయు, ప్రాణ=దశవిధప్రాణవాయువులయొక్క, మనః = మనస్సు యొక్కయు, అగ్ర=పైభాగమునందు, స్థిత=ఉన్న, బుద్ధియె, బిందువు=బిందువనఁబడును. అందుఁ=దానియందు (అబుద్ధియందు), చెల...బింబమే-చెలఁగెడి = ప్రకాశించునట్టి, ఆత్మ=పరబ్రహ్మముయొక్క, ప్రతిబింబమె=బింబమే, కళ=చిత్కళయనఁబడును. పవనో ...మె-పవన = ప్రాణవాయువులయొక్క, ఉన్నత-అధికమైన, ఘోషమే = సంచార ధ్వనియే (అనఁగా: వాయువు నాడులయందు సంచరించుధ్వనియే), ప్రణవనాదము సుమ్ము=దశవిధప్రణవనాదము లనఁబడును సుమా! (వాయువు ధ్వనియే అన్ని తెఱంగుల వినవచ్చునని భావము.)

తా. ఓపుత్రా! అతిసూక్ష్మము లగుప్రాణవాయువులయొక్కయు మనసు యొక్కయు నగ్రముననుండుబుద్ధియే (జాగ్రదవస్థయందు బుద్ధియనియు సుషుప్త్యవస్థ యందు సర్వేంద్రియ లయస్థానమగుజ్ఞానమనియు వ్యవహరింపఁబడుచున్న పదార్థమే) బిందువనఁబడును. దానియందు ప్రతిఫలించియున్న పరమాత్మప్రతిబింబమే చిత్కళ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పైవివరింపఁబడియున్న నాడులయందు ప్రాణవాయువులు సంచరించుటవలనఁ గలుగు శబ్దమే ప్రణవనాదము. ఇట్లు వీనిస్వరూపముల బాగుగ నెఱుఁగుము.

క. ఆనాదబిందుకళలం, గానంబడుచుండువానిఁ గనుపురుషుఁడె ప్ర
జ్ఞానఘనుఁడైన రాముఁడు, నానావిధతత్త్వములకు నాథుఁడు పుత్రా.

టీ. పుత్రా=పుత్త్రుఁడా! ఆనాదబిందుకళలన్=పైనవివరింపఁబడిన నాదబిందు కళలయందు, కానంబడుచుండువానిన్ = కనఁబడుచుండుపదార్థముల నన్నిఁటిని, కనుపురుషుఁడె=సర్వసాక్షియై చూచుచున్నవాఁడే, ప్రజ్ఞా...డు-ప్రజ్ఞాన=జ్ఞానమే (లేక జ్ఞానము యొక్క), ఘనుఁడైన = ఘనీభావముఁ జెందినట్లున్న (లేక ముద్దయైన, ఉప్పురాతియందు ఎచ్చటఁ జూచినను లవణరసమునకంటె నితర మేదియుఁ లేనట్లు, ఆపరబ్రహ్మమునం దెచట జూచినను జ్ఞానముకంటె వేఱగు పదార్థము లేదని భావము), రాముఁడు = పరబ్రహ్మస్వరూపుఁడైనశ్రీరాముఁడు, నానా...ములకున్ - నానావిధ = అనేకవిధములైన, తత్త్వములకున్ = ప్రాణములు ఇంద్రియములు మొదలగు సకలపదార్థములకును, నాథుఁడు=ప్రభువైనవాఁడు.

తా. ఓకుమారా! ఈనాదబిందుకళలయందు నేవేవి కానవచ్చునో వాని నన్నిఁటిని చూచుచుండు సాక్షియే శ్రీరాముఁడు. జ్ఞానమే స్వరూపముగాఁ గలవాఁడు. స్థూలములును సూక్ష్మములు నగుభూతభౌతికముల కన్నిఁటికిని ప్రభు వగువాఁడు.

అవ. ఇట్లు ప్రసంగమువలన నాదబిందుకళలపరమార్థస్వరూపమునుగూర్చియుఁ బరమాత్మునిస్వభావమును గూర్చియుఁ జెప్పి తదుపసంహారపూర్వకముగాఁ బ్రకృతము నుపక్రమించుచున్నాఁడు:—

సీ. అట్టిశ్రీరామతత్త్వావభాసకళతోడ
నెనసినయాబిందు వెల్లప్రొద్దు
మార్తాండచంద్రాగ్నిమండలాన్వితసూక్ష్మ
చతురగ్రమునకు సరి నధోము
ఖంబుగా నున్నహృత్కమలంబుతో బహి
ర్ముఖమై స్వవిషయానుభూతిఁ దగిలి
మానక పవమానమానసేంద్రియదేహ
సంగతి నూరక సంచరించు
తే. నట్లు గావున దశనాడికాంతరస్థ
దశవిధేంద్రియపవనచిత్తముల నెల్ల
హంసతత్త్వానుభవమున నడఁచి నిలిపి
యచలముగఁ జేయు మంతట నాంజనేయ.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ఆంజనేయ, అట్టి...తోడన్-అట్టి = పూర్వోక్తమైన, శ్రీరామతత్త్వ = రాముని యథార్థస్వరూపమగు పరబ్రహ్మముయొక్క, ఆభాస=ప్రతిబింబమైన, కళతోడన్ =చిత్కళతో, ఎనసినయాబిందువు-ఎనసిన=కూడియున్న, ఆబిందువు=ఆబుద్ధి, ఎల్లప్రొద్దు = సర్వకాలమునందును, మార్తా...నకున్-మార్తాండ = సూర్యునియొక్కయు, చంద్ర = చంద్రునియొక్కయు, అగ్నిమండల = అగ్నియొక్కయు మండలముతో, అన్విత = కూడుకొనియున్న, సూక్ష్మచక్షుః=జ్ఞాననేత్రముయొక్క, అగ్రమునకున్=చివరకు(భ్రూమధ్యమునకు), సరిన్=సూటిగా, అధోముఖంబుగానున్న = క్రిందివైపునకుఁ దిరిగియున్న, హృత్కమలంబుతోన్ = హృదయకమలముతోఁ గూడ (మనస్సుతో హృదయకమలమను పేరఁ గమలాకారమై యధోముఖమగుమాంసపిండ మొకటి హృదయమునఁ బ్రత్యక్షముగనున్నది. అదియే మనసున కాధారమని యోగులు చెప్పుదురు), బహిర్ముఖమై = వెలుపలికివచ్చి (బాహ్యావృత్తి కలదియై యనుట), స్వవి...గిలి-స్వవిషయ = తనకు విషయము లగుశబ్దాదులను, అనుభూతిఁదగిలి=అనుభవించుటయందు మరగి, మానక = విడువక, పవ...పతిన్-పవమాన=ప్రాణవాయువులతోను, మానస=మనస్సుతోను, ఇంద్రియ = ఇంద్రియములతోను, దేహ = స్థూలసూక్ష్మశరీరములతోను (కారణశరీరము సర్వవృత్తులకును లయస్థానము గావున యీబిందువునకు (అనఁగా బుద్ధికి) ఆశరీరముతో సంబంధమున్నను చలనము గల్గుటకు వీలులేదు కావున నాశరీరమునుగూర్చి యిచట చెప్పఁబడలేదు.) సంగతిన్=సంబంధించి, ఊరకసంచరించున్=నిష్కారణముగ లోపలికిని వెలుపలికిని దిరుగుచుండును. కావునన్, దశ...నెల్లన్-దశనాడికా=ముఖ్యములైనపదినాడులయొక్కయు, అంతర=లోపల, స్థ=ఉన్న, దశవిధ = పదివిధము లగు, ఇంద్రియ=ఇంద్రియములు, పవన=ప్రాణవాయువులు, చిత్తములనెల్లన్=మనసు వీని నన్నింటిని, హంసతత్త్వానుభవమునన్ = అనుభవపూర్వకముగ జీవుని యథార్థస్వరూపమును దెలిసికొనుటచే, అడఁచి = నశింపఁజేసి, నిలిపి=నిశ్చలనమునుచేసి, అచలముగన్ = కొంచె మైనను కదలకుండునట్లుగ, చేయుము. అంతటన్=పిదప.

తా. ఓీఆంజనేయా! పరమాత్మప్రతిబింబమని చెప్పఁబడి యున్నకళతోఁ గూడి, యాబిందువు సర్వకాలములయందు భ్రూమధ్యమునకుఁ జక్కగఁ గ్రింద వక్షస్థలమునం దధోముఖముగా నున్నహృదయకమలముయొక్కయగ్రమున నిలచియుండును. ఆహృదయకమలమూలమున వెలికి వచ్చుచు సకలవిధము లగువిషయసుఖముల ననుభవించుచుఁ బ్రాణవాయువులతోను మనసుతోను ఇంద్రియములతోను గూడి సర్వదా సంచరించుచుండునే కాని యొక్కచో నిలువదు. అది నిలువకున్న మనఃప్రాణములు స్థిరము లగుటయుఁ దారకయోగనిష్ఠ కుదురుటయుఁ సంభవింపదు కదా! కావున హంసతత్త్వస్వరూపము నెఱింగి యాబిందువును స్థిరముగఁ జేయుము. ...మైన వర్ణింపఁబడి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యున్నపదినాడులలోను విహరించునింద్రియప్రాణమనంబుల నిశ్చలములఁ జేయుము.

అవ. హంసతత్త్వానుభవము నభివర్ణించుచున్నాఁడు:—

ఆ. ఇంద్రియముల నిగ్రహించి ప్రాణములతో
మానసమును గూర్చి వానితోడ
హంస యనఁగ నొప్పు నక్షరద్వయము. యో
జించి సంతతము భజింపవలయు. 168

టీ. ఇంద్రియములన్, నిగ్రహించి=జయించి, ప్రాణములతో=ప్రాణవాయువులతో, మానసమున్=మనస్సును, కూర్చి=చేర్చి, వానితోడన్=ఆప్రాణములతోను, మనసుతోను, హంసయనఁగన్=హంసయనెడు, ఒప్పునక్షరద్వయంబున్=ఒప్పుచున్న రెండక్షరములను, యోజించి=చేర్చి, సంతతము=ఎల్లప్పుడును, భజింపవలయున్=జపింపవలయును. అది ఎట్లంటేని=ఆజపించుట యెట్లనఁగా.

తా. మొట్టమొదట నింద్రియముల వానివానివృత్తులనుండి మరలించి వానితోఁ బ్రాణములఁ జేర్చి యందు మనసును సంధించి (అనఁగా: నన్నిఁటి నేకాగ్రముగఁ జేసి) యాప్రాణమనస్సులతోఁగూడ హం, స అను రెండక్షరములనుజేర్చి సర్వకాలములయందును సేవింపవలయును. (ధ్యానింపవలయును అనుట. ఇదియే హంసతత్త్వానుభవము. ఇదియే అజపాగాయత్రి.)

అవ. సంక్షేపముగాఁ జెప్పఁబడిన హంసతత్త్వానుభవమును (లేక హంసమంత్రజపప్రకారమును) విస్తరించుచున్నాఁడు:—

సీ. అనిశంబు పద్మాసనాసీనుఁడై చూపు
లమరంగ నాసికాగ్రమున నిలిపి
యింద్రియంబుల నెల్ల నిట్టట్టు వోసీక
మది చేతఁ దిరముగాఁ గుదియఁబట్టి
ప్రాణాదిదశవిధపవనంబులను వికా
రము లంటకుండఁ జొక్కముగ నునిచి
కామరాగాదిసంకల్పవర్ణనము గా
స్వాంతంబు సరసి నిశ్చలముఁ జేసి
తే. యనిలమానసములతోడ హంసమంత్ర
మమరఁ గూర్చి జపించుచు నంతమీఁద
హృదయనభమున బిందువు గదల కుండఁ
బెంపుగా నాదకళల వీక్షింపవలయు. 169

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. అనిశంబు=ఎల్లప్పుడు, పద్మాసనాసీనుఁడై=పద్మాసనమునఁగూర్చుండి,చూపులు, అమరంగన్=చక్కఁగ, నాసికాగ్రమునన్=ముక్కుకొనయందు, నిలిపి=ఉంచి, ఇంద్రియంబులనెల్లన్, ఇట్టట్టుపోనీక=చలింపనీక, మదిచేతన్=మనోబలముచేత, తిరముగాన్=నిశ్చలముగా (లేక దృఢముగా), కుదియఁబట్టి=నిర్బంధించి, ప్రాణా...లన్-ప్రాణాది=ప్రాణము మొదలగు, దశవిధపవనంబులన్=పదివిధములగు వాయువులను, వికారములు=మార్పులు, అంటకుండన్=కలుగకుండ, చొక్కముగనునిచి=బాగుగనిలిపి, కామ... ముగాన్-కామరాగాది=కామము రాగము మొదలగు, సంకల్పవర్జనముగాన్=సంకల్పములు లేకుండునట్లుగా, స్వాంతంబున్=మనసును, అరసి=విమర్శించి, నిశ్చలముచేసి=చలనము లేకుండఁజేసి, అనిలమానసములతోడన్-అనిల=ప్రాణవాయువులతోను, మానస=మనస్సుతోను, హంసమంత్రము=హంసయనెడు మంత్రమును, అమరన్=ఒప్పునట్లుగా, కూర్చి=చేసి, జపించుచున్=జపముచేయుచు, అంతమీఁదన్=తర్వాత, హృదయనభమునన్ = హృదయాకాశమునందు, బిందువు కదలకుండన్ = బుద్ధి చలింపకుండఁజేసి, పెంపుగాన్=దినదినమున కభివృద్ధి యగునట్లుగా, నాదకళలన్-నాద = దశవిధప్రణవనాదములను, కళలన్=చిత్కళలను, వీక్షింపవలయున్=చూడవలయును.

తా. సాధకుఁ డగువాఁడు పద్మాసనస్థితుఁడై కూర్చుండి దృష్టిని నాసికాగ్రముపై నిలిపి (లేక నాసికాగ్రమును జూచువానివలె దృష్టినిఁగదలక నిలిపి) ఇటునటు వీక్షింపక దశవిధేంద్రియములఁ జలింపనీక మనశ్శక్తిచే స్థిరములఁ గావించి యామనస్సునుగూడ కామము రాగము మొదలగు సంకల్పవికల్పములచేఁ జెదరకుండునట్లు ఏకాగ్రభావము నొందించి ప్రాణవాయువులకు వికారములు లేకుండునట్లుచేసి ఆమనఃప్రాణములతో హంసమంత్రమును గూర్చి జపింపవలయును. (అనఁగా: ప్రాణములోఁ జేర్చి హంసమంత్రమును జపించుచు మనసు నామంత్రాదిదేవతయందే నిలుపవలయును.) ఇదియే హంసతత్త్వానుభవము. ఇట్లు సర్వకాలములయందు నాచరించుచు హృదయాకాశమునందున్న బిందువు చలింపకుండునట్లుఁ జేయవలయును. హంసతత్త్వానుభవము కలుగఁగానే బిందువు తనంతఁదానే నిలుచును. అచట సాధకుఁ డాచరింపవలసిన ప్రయత్న మేదియును లేదు. ఇట్లాబిందువు స్థిరముకాఁగానే నాదకళలు గోచరము లగును: కావున నీహంసతత్త్వానుభవము రాజయోగికి ప్రథమకర్తవ్యము.

## హంసశబ్దార్థవిచారము.

అవ. ఇట్లు మంత్రము నెఱింగించి దానియర్థమును వివరించుచున్నాఁడు:—

ఆ. నాదబిందుకళల కాదిరై ద్రష్టయై
సర్వదృశ్యములకు సాక్షి యగుచుఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జిత్స్వరూప మైనశ్రీరామతత్త్వమా
నమల మగుహకార మాంజనేయ! 170

టీ. ఆంజనేయ! నాదబిందుకళలకున్-నాద = ప్రణవనాదములకు, బిందు=బుద్ధికి, కళలకున్=చిత్కళకు, ఆదియై=కారణభూతుఁడై, ద్రష్టయై=ఆనాదబిందుకళలను జూచువాఁడై, సర్వ...లకున్-సర్వ=సమస్తములైన, దృశ్యములకున్=ఈకనఁబడుపదార్థముల కన్నిఁటికిని, సాక్షియగుచున్=ప్రకాశకుఁడగుచు, చిత్స్వరూపము=జ్ఞానస్వరూపము, ఐనశ్రీరామతత్త్వము-ఐన=ఐనట్టి, శ్రీ=శోభాయుక్తుఁడైన, రామతత్త్వము=శ్రీరామునియొక్క యథార్థస్వరూపము (అనఁగా: బ్రహ్మము), అమలము=పరిశుద్ధము, అగుహకారమున్-అగు=ఐన, హకారమున్ = హకారమగును. (అనఁగా: పరబ్రహ్మస్వరూపము హకారార్థ మనుట.)

తా. ఓీఆంజనేయా! ఆహంసమంత్రమును జపించునప్పుడు దానికర్థమగు పదార్థమును భావించుచుండవలయును గావున దాని నెఱింగించెద వినుము. ఆమంత్రమునందు హకారము, సకారము, అనుస్వారము అనునివి కలవు. అందు నాదబిందుకళల కుత్పత్తిస్థానమైనట్టియు వానిని వేఱువేఱ దెలిసికొనునట్టియు, వానినే యననేల? సకలప్రపంచమునుఁ దనజ్ఞానశక్తిచేఁ బ్రకాశింపఁజేయునట్టియు నాశ్రీరాముఁడే (బ్రహ్మమే) హకారమున కర్థమైయున్నాఁడు.

తే. మహితదేహేంద్రియప్రాణమానసాది
దృశ్యరూపిణియును జడాత్మికయుఁ ద్రిగుణ
కలితయు ననాదియు మహావికారి యైన
ప్రకృతి యగును సకారంబు పరమపురుష. 171

టీ. పరమపురుష=పురుషశ్రేష్ఠా! ఆంజనేయా, మహి...ణియును-మహిత=ఒప్పుచున్న, దేహ=దేహము, ఇంద్రియ = ఇంద్రియములు, ప్రాణ=ప్రాణములు, మానసాది=మనస్సు మొదలైన, దృశ్య=దృశ్యములే (కనఁబడుప్రపంచమే), రూపిణియును=స్వరూపముగాఁ గలదియు, జడాత్మికయున్=చైతన్యశక్తిలేనిదియు, త్రిగుణకలితయున్=సత్వరజస్తమోగుణములతోఁ గూడినదియు, అనాదియున్=అనాదిసిద్ధమైనదియు, మహావికారి=లెక్కకుమిక్కిలియగు మార్పులుకలదియు, ఐనప్రకృతి=ఐనమాయాశక్తి, సకారంబు=సకారము, అగున్=అవును. (ప్రకృతియే సకారార్థమనుట.)

తా. పురుషరత్నమా! దేహము ఇంద్రియములు మనసు మొదలగుదృశ్యపదార్థములే స్వరూపముగాఁ గలిగినట్టియు, అచేతనమైనట్టియు, సత్వరజస్తమోగుణమయమైనట్టియు, నానావిధములగు వికారముల కాశ్రయమైనట్టియు మూలప్రకృతియే యీమంత్రమునందలి సకారమున కర్థము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఈక్రిందిపద్యమున ననుస్వారార్థనిర్ణయపూర్వకముగ పదార్థవివరణమును ముగించి వాక్యార్థమును వివరించుచున్నాఁడు:—

క. వినుమా పురుషప్రకృతుల
ఘనతాదాత్మ్యంబు మధ్యగతబిందువు గా
వున హంస యనఁగ జీవుం
డనిలమనోయుక్తుఁ డగుచు నతఁడు వెలుంగున్. 172

టీ. వినుము. అపు...బు - ఆపురుషప్రకృతుల = అమాయాబ్రహ్మములయొక్క, ఘన=అధికమైన, తాదాత్మ్యంబు=తాదాత్మ్యసంబంధము, మధ్యగతబిందువు=హకార సకారములకు నడుమనున్న యనుస్వారము. (అనఁగా: హంసమంత్రమునందలి హకార సకారములకు నడుమనున్న యనుస్వారమునకు మాయాబ్రహ్మలసంబంధమే యర్థమనుట.) కావునన్, హంసయనఁగన్ = హంసయనఁగా, జీవుండు = (హంసపదమునకు జీవుఁడర్థమనుట) మాయయనిన నవిద్యయనిన నొకప్రకృతియే కావునను దానిచే నావరింపఁబడియున్నబ్రహ్మమే జీవుఁడు కావునను ఇట్లుఁ జెప్పఁబడెను.) అతఁడు = ఆజీవుఁడు, అనిలమనోయుక్తుఁడగుచున్=ప్రాణములతోను మనసుతోను గూడినవాఁడై, వెలుఁగున్= ప్రకాశించును.

తా. ఆజీవబ్రహ్మల కనాదినుండియుఁ గలయభేదసంబంధమే యనుస్వారమున కర్థము. కావున హంసయను మంత్రమునకు జీవుఁడని సముదాయార్థము. మాయచే నావరింపఁబడియున్న బ్రహ్మమునే కదా జీవుఁడనుచున్నాము. ఆజీవుఁడే ప్రాణవాయువులతోను మనసుతోను గూడి విహరించుచుండును.

## { అష్టదళపద్మమున హంస తిరుగునప్పుడు గలిగెడు గుణవిశేషముల వివరము. }

అవ. ఈహంసను పక్షిరూపముగా వర్ణించుచున్నాఁడు:—

వ. ఇట్లు నిర్వికారుం డైనపురుషునకుఁ గేవలజడాత్మక యైనప్రకృతికిం బ్రత్యేకంబు గాఁ గర్తృత్వభోక్తృత్వాదిరూపసర్వసంసారంబు ఘటింప దట్లు గావున హకారస్వరూపకుం డైనయాత్ముం డాత్మశక్తి యైనసకారంబుతో నన్యోన్యతాదాత్మ్యధ్యానరూపంబునఁ గూడి హంసస్వరూపకుం డై నజీవుం డై నవద్వారపురంబునం బ్రవేశించి వివిధేంద్రియ ప్రాణమనోయుక్తుం డై పంజరాంతరంబున మెలంగు పులుంగు లెంగునం జిక్కి వెడల నుపాయంబు గానక నానావిధ భోగంబు లనుభవించుచుం గ్రీడించునట్టిహంసకు నగ్నిసోములు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పక్షంబు లోంకారంబు శిరంబు త్రినేత్రంబు ముఖంబు రుద్రరుద్రాణులు చరణంబులై యొప్పార భానుకోటిప్రతీకాశంబై కాష్ఠంబులయందు వహ్నియుఁ దిలలయందుఁ దైలంబు క్షీరంబులయందాజ్యంబు వ్యాపించి యున్నచందంబున బ్రహ్మాది స్తంబపర్యంత సర్వభూతంబులయందు హృదయకమలం బధిష్ఠించియుండు నందుఁ బూర్వదళంబునఁ బుణ్యమతియు నాగ్నేయదళంబునఁ నిద్రాలస్యాదులు యామ్యదళంబునఁ గ్రౌర్యశేముషియు నైరృతిదళంబునఁ బాపబుద్ధియుఁ బశ్చిమదళంబునఁ గ్రీడయు వాయవ్యదళంబున గమనాదిమనీషయు సౌమ్యదళంబున రతిప్రీతియు నీశాన్యదళంబున ద్రవ్యాదానంబు మధ్యంబున వైరాగ్యంబుఁ గేసరంబుల జాగ్రదవస్థయుఁ గర్ణికయందు స్వప్నంబు లింగంబున సుషుప్తియుఁ బొందుచుండు మఱియు నెప్పుడు పద్మత్యాగి యగు నప్పుడు నాదంబున విలీనం బగునది తురీయం బన్నాదం బాధారాది బ్రహ్మరంధ్రపర్యంతంబు శుద్ధస్ఫటికసంకాశం బై నిండియుండు నదియె పరమార్థతత్త్వరహస్యం బని యోగీశ్వరులచేతఁ జెప్పంబడు నట్లగుటం జేసి. 173

టీ. ఇట్లు=ఈవిధముగా, నిర్వికారుఁడు = మార్పులు లేనివాఁడు, ఐనపురుషనకున్=ఐనట్టి బ్రహ్మమునకును, కేవలజడాత్మిక - కేవల = సంపూర్ణముగా, జడాత్మిక = చైతన్యము లేనిది, ఐనప్రకృతికిన్=ఐనట్టి మాయకును, ప్రత్యేకంబుగాన్=వెవ్వేఱుగా, కర్తృత్వ...రంబు-కర్తృత్వ = ఒకదాని నాచరించుట, భోక్తృత్వ=దానిఫలము ననుభవించుట, ఆదిరూప=మొదలైన యాకారముగల, సర్వ = సమస్తమైన, సంసారంబు, ఘటింపదు=కలుగ నేరదు. అటుగావునన్=కాఁబట్టి, హకారస్వరూపకుండు = హకారమే స్వరూపముగాఁ గల (హకారమున కర్థమైన), ఐనయాత్ముండు = ఐనట్టి బ్రహ్మము, ఆత్మశక్తి = తనశక్తి (పరబ్రహ్మయొక్క శక్తియే ప్రకృతి యని మునుపే నిరూపించియున్నాము.) ఐనసకారంబుతోన్=ఐనట్టి సకారముతో, అన్యో...బునన్-అన్యోన్య=ఒకదానితో నొకదానికిఁగల, తాదాత్మ్య=తాదాత్మ్యమును (తాదాత్మ్య మనఁగా భ్రాంతిసిద్ధసంబంధమని మునుపే నిరూపించియున్నాము), ధ్యానంబునన్=ధ్యానించుట యను స్వరూపముతో, కూడి=చేరి (సంబంధపడి), (అనఁగా: పురుషునితో ప్రకృతియుఁ బ్రకృతితోఁ బురుషుండును చేరినట్లుతోఁచి) హంసస్వరూపకుండు = హంసమంత్రరూపుఁడు, ఐనజీవుఁడై=ఐనట్టి జీవుఁడుగా (మాయతో సంబంధించుటవలన బ్రహ్మమునకు జీవత్వము కలిగె నని భావము), నవద్వారపురంబునన్=తొమ్మిదిద్వారములుగల యీ దేహమందు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రవేశించి, వివి...భక్తుండు-వివిధ = అనేకము లైన, ఇంద్రియ = ఇంద్రియములతోను, ప్రాణ=ప్రాణవాయువులతోను, మనః=మనస్సుతోను, యుక్తుండై = కూడినవాఁడై, పంజ రాంతరంబునన్ =పంజరములోపల, మెలఁ...గునన్ -మెలఁగు=ఉన్న, పులుగు తెఱంగునన్ =పక్షివలె, చిక్కి, వెడలన్ = వెలికిఁబోవుటకు, ఉపాయంబు, కానక = తెలిసికొనలేక, నానావిధభోగంబులఁ-నానావిధ = అనేకవిధము లైన, భోగంబులు = పుణ్యపాపమిశ్ర కర్మములవలనఁ బుట్టిన సుఖదుఃఖ మిశ్రఫలముల యనుభవములను, అనుభవించుచున్, క్రీడించునట్టి హంసకున్ =క్రీడించుచున్న హంసకు (జీవునకు), అగ్నిసోములు = అగ్ని యును, చంద్రుడును, పక్షంబులు = ఱెక్కలు (ఈ జీవుని హంసపక్షిగా వర్ణించు చున్నాఁడు.), ఓంకారంబు=ప్రణవము, శిరంబు=శిరస్సు, త్రినేత్రంబు=జ్ఞాననేత్రమును, ముఖంబు=మొగము, రుద్రరుద్రాణులు-రుద్ర = ఈశ్వరుఁడును, రుద్రాణులు = పార్వతి యును, చరణంబులై=పాదంబులై, ఒప్పారన్ = ఒప్పుచుండఁగా, భానుకోటి = కోటి సూర్యులతో, ప్రతీకాశంబై=సమానుఁడై, కాష్ఠంబులయందున్, వహ్నియున్=అగ్ని యును, తిలలయందున్=నువ్వులయందు, తైలంబు=నూనెయు, క్షీరంబులయందున్ = పాలయందు, ఆజ్యంబు = ఘృతంబును, వ్యాపించియున్నచందంబునన్ = వ్యాపించి యున్నట్లు, బ్రహ్మాది...యందున్-బ్రహ్మాది = చతుర్ముఖుఁడు మొదలు, స్తంబపర్యంత= గడ్డిపోఁచవఱకుఁగల, సర్వభూతంబులయందున్ = సకలజంతువులయందును, హృదయ కమలంబు=హృదయపద్మమును, అధిష్ఠించియుండున్ = ఆశ్రయించియుండును (జీవుఁ డగు నీహంస లేనిచోటే లే దనుట). అందున్ = ఆ హృదయకమలమునందు, పూర్వ దళంబునన్ = తూర్పుదిక్కునందున్న రేకుపై నాహంస సంచరించునప్పుడు, పుణ్య మతియున్=పుణ్యములఁ జేయవలయు నను నిచ్ఛయు, ఆగ్నేయదళంబునన్ = అగ్ని దిక్కున నుండుదళమున సంచరించునప్పుడు, నిద్రాలస్యాదులు-నిద్ర = నిదురయును, ఆలస్య = సోమరితనమును, ఆదులు = ఆఁకలి దప్పి మొదలగునవియును, యామ్యదళం బునన్=దక్షిణపువైపుననున్న రేకునందు, క్రౌర్యశేముషియున్=క్రూరబుద్ధియు, నైరృతి దళంబునన్ = నైరృతిపార్శ్వముననున్న రేకునందు, పాపబుద్ధియున్ = పాపము చేయ వలయునను తలంపును, పశ్చిమదళంబునన్ = పడమటిరేకునందు, క్రీడయున్ = ఆట యందలి యిచ్ఛయు, వాయవ్యదళంబునన్ = వాయువుదిక్కుననున్న రేకునందు హంస తిరుగునప్పుడు, గమ...షయున్-గమన=నడచుట, ఆది=మొదలగువానియందలి, మనీ షయున్=బుద్ధియును, సౌమ్యదళంబునన్ = కుబేరునిదిక్కునం దున్న రేకునందు, రతి ప్రీతియున్=రతియందలి యిచ్ఛయు, ఈశాన్యదళంబునన్ = ఈశాన్యదిక్కునం దున్న రేకునందు, ద్రవ్యాదానంబున్-ద్రవ్య=ద్రవ్యమును, ఆదానంబున్ = ఇయ్యవలయునని (లేక తీసికొనవలయునని), మధ్యంబునన్=పద్మమయొక్క నడిమిభాగమునందు హంస

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిలిచియున్నప్పుడు, వైరాగ్యంబుల్=వైరాగ్యమును, కేసరంబులల్ = పద్మకేసరముల యందు, జాగ్రదవస్థయు, కర్ణికయందుల్=మిద్దెలయందు, స్వప్నంబు=స్వప్నావస్థయు, లింగంబునల్=తామరదుంపయందు, హంసయున్నప్పుడు, సుషుప్తియుల్=సుషుప్త్యవస్థ యును, పొందుచుండుల్ = కలుగుచుండును. మఱియుల్, ఎప్పుడు = ఏ సమయము నందు, పద్మత్యాగియగుల్=ఆ హంసపద్మమును విడుచునో, అప్పుడు = ఆసమయమున, నాదంబుల్=ప్రణవనాదమునందు (ప్రణవమునకు పరబ్రహ్మయర్థము కావునను సాక్షి యగుజీవునకు నాదమునందు నిలయముసంభవింపదు కావునను ఇచ్చట నాదశబ్దముచే పర బ్రహ్మమే చెప్పఁబడెనని యూహించునది.), విలీనంబులల్ = లయమునొందును. అది= అద్వైక్యము, తురీయంబు=తురీయావస్థ, అన్నాదంబు = ప్రణవార్థమగునాపరబ్రహ్మము, ఆధారాదిబ్రహ్మరంధ్రపర్యంతంబు = ఆధారము మొదలు బ్రహ్మరంధ్రమువఱకు, శుద్ధ... శంబై-శుద్ధ=నిర్మలమైన, స్ఫటిక = స్ఫటికరత్నముతో, సంకాశంబై = సమానమైనదై, నిండియుండుల్ = వ్యాపించియుండును. అదియే = ఆబ్రహ్మమే, పర...బని-పరమార్థ= సత్యమైన, తత్త్వ=స్వరూపముయొక్క (జీవస్వరూపముయొక్క), రహస్యంబని=గోప్య విషయమని (అనఁగా: నందఱకును తెలియశక్యముగుజీవయథార్థస్వరూపమని), యోగీశ్వ రులచేతల్=శ్రేష్ఠులగుయోగులచే, చెప్పంబడుల్ = పలుకఁబడుచున్నది (బ్రహ్మ సర్వ వ్యాపకుఁడే యైనను యొకదేశమునందే యున్నాఁడని చెప్పుట శిష్యులకు సుఖముగాఁ దెలియుటకొఱకనియెఱుంగునది). అట్లగుటంజేసి, కావున.

తా. పరబ్రహ్మము నిర్వికారుఁ డగుటచేతను మాయయుఁ జేతన మగుటచేతను కర్తృత్వ భోక్తృత్వాదిరూప మగునీసంసార మిం దెవ్వరికిని సంభవింపదు. సంసార మున్నదో యనుభవసిద్ధముగనున్నది. కావున నీమాయాబ్రహ్మల కేదియో సంబంధ మొకటి యుండితీరవలయును. ఆసంబంధముకూడ సత్యమైనచోఁ నెప్పటికిని నశింపదు. కావున ముక్తి యనునదియే లేకపోవలసివచ్చును. కావున నాసంబంధము తాదాత్మ్యసంబంధ ముగా నుండవలయును. సంయోగసంబంధ మనినయెడల పరమాత్మ సవికారుఁడు కావలసి వచ్చుటచేత నది యుక్తము కానేరదు. (సమవాయసంబంధము వేదాంత మతములోలేదు.) కావున నధ్యాసరూపమగు తాదాత్మ్యసంబంధమే యిచ్చటఁ జెప్పనొప్పియున్నది. మాయా బ్రహ్మలనాదు లగుటచే వారలకుఁ గలసంబంధముకూడ ననాదియే కావలసివచ్చుచున్నది. ఇట్టితాదాత్మ్యసంబంధముచే నాపరబ్రహ్మము మాయాసహితుఁడై శరీరమునఁ బ్రవేశించి సకలసంసారము ననుభవించుచు హంస (జీవుఁడు) యని పేర్కొనఁబడు చున్నాఁడు. ఆహంస పంజరమునందుఁ జిక్కినహంసపక్షివలె వెలికిఁ బోనేరక శరీరమునందే విహరించు చున్నది. ఆహంసకు చంద్రార్కులు రెక్కలు. ఓంకారము శిరస్సు, జ్ఞాననేత్రము ముఖము. ఈశ్వరుఁడును పార్వతియుఁ బాదములు. ఇట్టిరూపముతో నాధారాదిలలయందు తైలం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బును క్షీరమునందు ఘృతంబును వ్యాపించియున్నట్లు చతుర్ముఖబ్రహ్మము మొదలు గఱిక పోఁచవఱకుఁగలసర్వపదార్థములయందును వ్యాపించియున్నది. హృదయకమలము నాశ్ర యించి కోటిసూర్యులవలె వెలుఁగుచున్నది. ఆహృదయకమలమున నెనిమిదిదళములుగలవు. అందుఁ దూర్పున నున్నదళముపై నీహంస విహరించు చుండునేని మనసునందు పుణ్య కార్యవిషయములగు సంకల్పములు జనించును. ఆగ్నేయదిశయందలి దళమున నిద్రయు నాలస్యము మొదలగునవి కలుగును. దక్షిణదళంబున క్రూరబుద్ధియు నైరృతిదిశయందలి దళమున పాపవృత్తులు నుద్భవించును. పశ్చిమదళమున నాహంస విహరించునప్పుడు క్రీడ యందలి యభిరుచియు వాయవ్యదళమున నిలచి యున్నప్పుడు నడువవలయు ననుతలం పును ఉత్తరదళమున నున్నప్పుడు రతియందలి యిచ్ఛయు ఈశాన్యదళమున ధనధాన్యము నందలి సంకల్పమును సంభవించును. కమలమధ్యమునం దున్నప్పుడు వైరాగ్యము పుట్టును. కేసరములందునుఁ గర్ణికయందును తొడిమెయందును క్రమముగ జాగ్రత్స్వప్నసుషు ప్త్యవస్థ లనుభవింపఁబడును. ఇదియునుఁగాక నాహంస పద్మము నెప్పుడు విడుచునో యప్పుడు ప్రణవార్థమని యిదివఱకుఁ జెప్పఁబడియున్న ఘంటానాదమునందు లయము నొందును. ఆనాదము మూలాధారము మొదలు బ్రహ్మరంధ్రమువఱకు నేకవిధముగ వ్యాపించియున్నది. అదియే పరబ్రహ్మతత్త్వరహస్యమని యోగులు చెప్పుదురు. కావున.

## హంసాదిలయస్థానసూచనము.

క. దేశికనాథునిమహదుప,దేశమువలనన్ వివేకదృష్టివలనఁ ద
న్నాశస్థలము సుషుమ్నా,దేశంబని దానికీలుఁ దెలియఁగవలయున్.

టీ. దేశి...నన్-దేశికనాథుని = సద్గురునియొక్క, మహత్ = గొప్పదియగు, ఉపదేశమువలనన్=బోధవలనను, వివేకదృష్టివలనన్=జ్ఞానదృష్టివలనను, తన్నాశస్థలము =ఆజీవరూప మగుహంసయొక్క లయమునకు (అనఁగా: ఆహంస పరబ్రహ్మమునందు లీన మగుటకు) స్థానము. సుషుమ్నా దేశం బని=సుషుమ్నా నాడిమధ్యభాగమని (హృదయకమ లమునందు దహరాకాశమను పేర నొకయాకాశముకలదని శ్రుతులయందు చెప్పఁబడి యున్నది. యోగశాస్త్రమునందు సుషుమ్నా నాడిమధ్యభాగమే దహరమని చెప్పఁబడి యున్నది. ఆసుషుమ్నా నాడికూడ మూలాధారము మొదలు బ్రహ్మరంధ్రమువఱకు నున్నది కావున నెట్లుచెప్పినను విరోధము కలుగదని తెలిసికొనవలయును.), దానికీలు = దాని రహస్యమును, తెలియఁగ వలయున్=తెలిసికొనవలయును.

తా. ఆచార్యునియుపదేశము ననుసరించియు బహువిధము లగుయుక్తుల ననుస రించియుఁ జూచిన నాహంస లయము నొందుపట్టిస్థానము సుషుమ్నా నాడిమధ్యప్రదేశ మని తెలిసికొనవలయును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆ. సర్వభూతహృదయజలజాతములయందు
సమతఁ బవనమానసములతోడ
హంస యనుచుఁ బలుకునతఁడె నే నను కీలుఁ
దెలిసి తలఁప నదియుఁ బొలియు నంత. 175

టీ. అంతర్ = పిదప, సర్వ...యందుర్ - సర్వభూత = సమస్తప్రాణుల యొక్క, హృదయజలజాతములయందుర్ = హృదయకమలములయందు, లేక సుషుమ్నానాడీమధ్యభాగములయందు, సమతర్ = భేదములేకుండ, పవనమానసములతోడర్ - పవన = ప్రాణములతోను, మానసములతోడర్ = మనస్సుతోను కూడి, హంస యనుచుర్=హంసయని, పలుకునతఁడె = జపము సేయువాఁడె (బ్రహ్మాభిన్నుఁ డగు పురుషుఁడె), నేననుకీలు దెలిసి=నేను (జీవుఁడు) అనునట్టిమర్మమును గ్రహించి (అనఁగా బ్రహ్మమునకు జీవునకును భేదములేదని గ్రహించి), తలఁపర్ = ధ్యానింపఁగా, అదియుర్ = 'జీవుఁడు సుషుమ్నానాడిమధ్యమున పరబ్రహ్మముతో నైక్యమగుచున్నాఁడు. కొంతకాల మాయనతో వేఱుగనుండెను' అను మొదలగుభావనలు, పొలియుర్ = నశించి పోవును.

తా. సమస్తభూతములయొక్కయు హృదయకమలముల నాశ్రయించి 'హంస' యని పలుకుచు సంచరించువాఁడనే నేను. వానికిని నాకును భేదములేదు. అని మర్మము దెలిసికొని ధ్యానము చేసె నేని తాను వేఱు, హంసమంత్రాధిదేవత యగుజీవుఁడు వేఱు, తా నాజీవుని ధ్యానము చేయుచున్నాఁడు అను భేదము లన్నియు నశించును. జీవుఁడు బ్రహ్మమునందు లయ మగుచున్నాఁడు. సుషుమ్నానాడిమధ్యమునఁ దేలుచున్నాఁడు అనునట్టిభావనయే నశించును.

అవ. ఈవిధముగా మంత్రమును మంత్రార్థమును ప్రత్యక్షముగ నామంత్రార్థమును భావింపలేనివారికి నుపకారముగ నాహంసను పక్షిరూపముగ భావనచేయవచ్చునని యుపదేశించి యాధ్యానము తుద కెట్టిఫలము నొసంగునో దానినిఁ గూడ వివరించి యీక్రింద నుపసంహరించుచున్నాఁడు:—

ఆ. ఈరహస్య మెఱిఁగి యేకాగ్రచిత్తుఁడై
సంతతము భజింపఁ జాలు నేని
యనిలమానసములు హంసంబుతోఁగూడ
విలయ మొందు మొదలివెలుఁగునందు. 176

టీ. ఈరహస్యమెఱింగి = ఈవివరింపఁబడిన రహస్యవిషయమును దెలిసికొని, ఏకాగ్రచిత్తుఁడై=స్థిరమగుమనస్సుకలవాఁడై, సంతతమర్=సర్వకాలమునందును, భజింపఁ జాలు నేనిర్ = సేవింపనేర్చునేని, అనిలమానసములు = ప్రాణవాయువును మనస్సును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హంసంబుతోఁగూడన్ = హంసపక్షివలె వర్ణింపఁబడియున్న జీవునితోఁగూడ, మొదలి వెలుఁగునందున్ = అనాదిసిద్ధ మగుపరబ్రహ్మప్రకాశమునందు, విలయ మొందున్ = నశించును.

తా. ఈరహస్యవిషయమును గ్రహించి ఏకాగ్రమగుమనస్సుతో నెప్పుడును ధ్యానించు నేని వానిమనఃప్రాణములు జీవరూప మగుహంసతోఁ గూడ అనాదిసిద్ధమగు పరబ్రహ్మమునందు లీనము లగును. (అనఁగా మోక్షము కలుగును.)

## రేచక పూరక కుంభకముల వివరణము.

అవ. హంసమంత్రము ప్రాణవాయువుతోఁగూర్చి జపింపఁబడవలయునని చెప్పఁబడియున్నదికదా. దానివిధానము నీక్రింద వివరించువాఁడై మొట్టమొదట రేచక పూరక కుంభక స్వరూపములను జెప్పుచున్నాఁడు:—

సీ. హృదయగతప్రాణుఁ డేతెంచునాసికా
వివరంబువలనను వెలికి ద్వాద
శాంగుళపర్యంత మది రేచకం బగు
నరుదెంచునంతలో నర్ధసమయ
మచ్చోట లయ మగు నది బహిఃకుంభకం
బారీతి లోపలి కరుగునదియె
పూరకం బననొప్పుఁ బూరించునంతలో
నర్ధకాలంబు దా నడఁగు నచట
తే. నదియె యాంతరకుంభకం బనఁగఁ దనరుఁ
బొసఁగ నిబ్భంగి రేచకపూరకాది
గతులచే విహరించు నీగాలి వానిఁ
గలసి మదితోడ హంసంబు మెలఁగునపుడు. 177

టీ. హృదయగతప్రాణుఁడు = హృదయస్థానమునం దున్నప్రాణవాయువు, నాసి...వలనన్-నాసికా = ముక్కుయొక్క, వివరంబువలనన్ = ద్వారమునుండి, వెలికిన్ = వెలుపలికి, ద్వాదశాంగుళపర్యంతము = పండ్రెండంగుళములదూరమువఱకు, ఏతెంచున్ = వచ్చును, అది = అవచ్చుట, రేచకంబగున్ = రేచక మని చెప్పఁబడును. అరుదెంచునంతలోన్ = వచ్చినంతసమయములో, అర్ధసమయము = సగముకాలము (అనఁగా వచ్చుట కెంతకాలము పట్టునో దానిలో సగముకాలము.), అచ్చోటన్ = బయట, లయమగున్ = లీనుఁడై యుండును (అనఁగా: లోనికిఁ బోక నిలిచి యుండు ననుట). అది = అనిలచియుండుట, బహిఃకుంభకంబు = బహిఃకుంభకము (వెలుపల గలుగునట్టికుంభకము)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆరీతిన్ = ఆవిధముగా, లోపలికరుగునదియె = లోపలికిఁ బోవుటయే, పూరకంబన నొప్పున్=పూరకమని చెప్పఁబడును. పూరించునంతలోన్ = పూరించుటకు పట్టినంత కాలములో, అర్ధకాలంబు = సగముసమయము, అచటన్ = ఆస్థలమునందు (లోపల), తానడఁగున్ = కదలక నిలిచి యుండును, అదియె = ఆలోపల నిలుచుటయె, అంతర కుంభకం బనఁగఁదనరున్=అంతరకుంభక (లోపలజరుగు కుంభకము) మని చెప్పఁబడును. పొసఁగన్=అందముగా, ఇబ్భంగిన్ = ఈవిధముగా, రేచకపూరకాదిగతులచే = రేచకము పూరకము మొదలగువానిచే, ఈగాలి=ఈ ప్రాణవాయువు, విహరించు = తిరుగుచున్న, వానిన్ = ఆ రేచక పూరక కుంభకములను, కలసి, మదితోడన్ = మనసుతోఁ గూడి, హంసంబు=హంసమంత్రము (లేక హంస), మెలఁగునపుడు = సంచరించుచున్నప్పుడు (అనఁగా ఆ రేచక పూరక కుంభకములతోఁ గలసి మనసు తిరుగుచుంటయు, దానితోఁ గూడి హంసము సంచరించుటయు స్వాభావిక మనుట. ఉత్తరపద్యముతో నన్వయము).

తా. హృదయమునం దున్నప్రాణవాయువు నాసికనుండి పండ్రెండంగుళములు వెలికివచ్చును. అదియే రేచక మనఁబడును. వచ్చినకాలములో నర్ధభాగము వెలుపల నిలుచును. దానికి బహిఃకుంభక మని పేరు. ఇట్లే లోపలికిఁ జనుటకు పూరక మనియు నర్ధసమయములో నడంగియుండుటకు నాంతరకుంభక మనియుఁ బేరు. ఈవిధముగా సంచరించుచున్నగాలి నాశ్రయించి మనసు సంచరించును. దానితోఁగూడి హంసయు విహరించుచుండును.

తే. పూరకము నహంకారంబు పొందుపఱచి
కుంభకంబున బిందువుఁ గూర్చి యంత
రేచకమున సకారంబుఁ జూచి వానిఁ
దెలియు తెలివియె నే నని తెలియవలయు. 178

టీ. పూరకమునన్ = పైవివరింపఁబడిన పూరకమునందు, హకారంబు = హంసమంత్రమునందలి "హ" యను నక్షరమును, పొందుపఱిచి=చేర్చి (ఉన్నట్లు సంకల్పించి యనుట), కుంభకంబునన్ = కుంభకమునందు, బిందువున్ = హకారమునకు పార్శ్వమునను్న అనుస్వారమును, కూర్చి=చేర్చి, అంతన్ = పిదప, రేచకమునన్ =పైన వివరింపఁబడియున్న రేచకమునందు (నిశ్వాసమునందు), సకారంబున్ = హంస మంత్రమునందలి "స" యను వర్ణమును, చూచి=ఉన్నట్లు భావించి, వానిన్=ఆ రేచక పూరక కుంభకము లనువానితోఁ గూడి విహరించుమనస్సును ఆ రేచకాదులతోఁ జేర్పఁబడిన హంసమంత్రమును, తెలియు తెలివియె = తెలిసికొనుసట్టిజ్ఞానమేను (వీని నన్నిఁటిని) నే నని తెలియవలయున్ = జీవస్వరూపమని తెలిసికొనవలయును.

Sangamwadi Math Collection. Digitized by eGangotri

తా. హంసమంత్రము నీ ప్రాణవాయువుతోఁగూర్చి జపింపవలయును. ఎట్లనిన: పూరకమునందు హకారము కలదనియు అంతరకుంభకమునందు అనుస్వారము కలదనియు రేచకమునందు సకారము కలదనియు భావింపవలయును. ఇట్లు భావించి జపించునప్పుడు "ఆ జపమును దెలిసికొనుజ్ఞానమే నా యథార్థస్వరూపము" అని తెలిసికొనుచుండవలయును.

## షట్కమలములనిర్ణయము.

అవ. ఇట్లు మంత్రానుష్ఠానప్రకారమును వివరించి సాధకులకు నుపకారముగనుండుటకై దానిసంఖ్యను వివరించుచున్నాఁడు:—

తే. ఇట్లనిలమానసములతో నెనసి హంస
యాఱుకమలంబులందు నహర్నిశంబు
లీలచే నిరువదియొక్క వేలయాఱు
నూఱుమాఱులు విహరించు మేరతోడ. 179

టీ. ఇట్లు=ఈవిధముగా, హంస=హంసపక్షి, అనిలమానసములతోన్=వాయువుతోను, మనసుతోను, ఎనసి=కూడి, ఆఱుకమలంబులయందున్ = మూలాధారము మొదలగు నాఱుకమలములయందును, అహర్నిశంబు = రేయుంబవలు, లీలచేన్ = విలాసముతో, ఇరువదియొక్క వేల యాఱునూఱుమాఱులు, మేరతోడన్ = మితితో, విహరించున్ = తిరుగును. (మనుష్యునకు, లేక జంతువునకు, ఒకసూర్యోదయము మొదలు రెండవసూర్యోదయము లోపల ఇరువదియొక్క వేల యాఱునూఱుమాఱులు శ్వాసతిరుగును. ఇది స్వస్థుని విషయము. జాడ్యగ్రస్థుఁడై కాని పరుగెత్తుట మొదలగువానివలన నలసటఁగాని యున్నప్పుడు ఈపరిమితిని శ్వాససంచారము మించును. తగ్గుటమాత్ర మెప్పటికిని లేదు.)

తా. ఇట్లీహంస వాయువుతోఁగూడి యన్నికమలములయందును విహరించుచుండును. సూర్యోదయము మొదలు మరల సూర్యోదయమువఱకు నావిహారములసంఖ్యయిరువదియొక్క వేలు నాఱునూఱులై యున్నది. పురుషునకు దినమున కిరువదియొక్క వేల యాఱునూఱుమారులు శ్వాస తిరుగుచుండు ననియు దానితోఁగూర్చి హంసమంత్రమును జపింపవలసివచ్చుటచే నదియు నన్నిమాఱులు జపింపఁబడునదియే యగుననియు తెలిసికొనవలయును.

వ. అట్లు గావున గుదస్థానంబున వశషసవర్ణగంబై, చతుర్దళయుక్తంబై తప్తకాంచనపుష్పకసన్నిభంబై, మహీనిలయంబై, ఘ్రాణకారణంబై, మూలాధారచక్రంబు విలసిల్లు నందు వినాయకున కాఱునూఱు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లును లింగస్థానంబున బభమయరలవర్ణగంబై, షడ్దళసమన్వితంబై, రక్తవర్ణంబై, జలాలయంబై, రసనాకారణంబై, స్వాధిష్ఠానచక్రంబు రంజిల్లు, నందుఁ జతుర్ముఖున కాఱువేలును, నాభిస్థానంబున డఢణ తథదధనపఫవర్ణగం బై, దశదళోపేతం బై, తేజోనివాసం బై, పీతవర్ణంబై, నేత్రకారణంబై, మణిపూరచక్రంబు ప్రకాశించు; నందు శ్రీమహావిష్ణున కాఱువేలును; హృదయస్థానంబున కఖగఘఙ చఛజఝఞ టఠవర్ణగంబై, ద్వాదశదళోపేతంబై, శ్వేతవర్ణంబై, మరున్మందిరంబై, త్వగింద్రియ కారణంబై, యనాహతచక్రంబుదనరు; నందు రుద్రున కాఱువేలును; గంఠస్థానంబునం దకారాదిషోడశ స్వరగంబై, షోడశదళయుతంబై, నీలవర్ణంబై, గగనసదనంబై, శ్రోత్ర కారణంబై, విశుద్ధచక్రంబలరు; నందు జీవాత్మునకు సహస్రంబును, భ్రూమధ్యస్థానంబున హంక్షమ్మనువర్ణంబులుగలిగి, ద్విదళలలితంబై; మాణిక్యవర్ణంబై, యంతఃకరణభవనంబై యాజ్ఞాచక్రంబొప్పు; నందుఁబరమాత్మునకు సహస్రంబును; బ్రహ్మరంధ్రస్థానంబున నోంకార వర్ణగంబై, సహస్రదళశోభితంబై, కోటిసూర్యప్రకాశమానంబై, ధీవిలయస్థలంబై, సహస్రారచక్రం బలరారు;నందు శ్రీగురుస్వామికి సహస్రంబును, శ్రీమద్దేశికోక్తాసనముద్రాలక్ష్యమంత్ర ధ్యానక్రమ పూర్వకంబుగా సమర్పించుసద్గురుభక్తుండు జీవన్ముక్తుం డగున ట్లొప్పించు నప్పుడు. 1180

టీ. అట్లుగావునఁ=కాఁబట్టి, గుదస్థానంబునఁ, వశషసవర్ణగంబై=వ, శ, ష, స అనువర్ణములు గలదియై, చతుర్దళయుక్తంబై = నాలుగుదళములతోఁగూడి, తప్త... భంబై-తప్తకాంచన = పుటమువేయఁబడిన బంగారుయొక్క, పుష్ప = కమలముతో, సన్నిభంబై=సమానమై, మహీనిలయంబై=భూమి కాధారస్థానమై, ఘ్రాణాకారంబై= నాసికకు కారణమై, మూలాధారచక్రంబు = మూలాధారమనుచక్రము, విలసిల్లుఁ = ప్రకాశించుచుండును, అందుఁ = ఆమూలాధారచక్రమునందు, వినాయకునకు = విఘ్నేశ్వరునకు (విఘ్నేశ్వరుఁడు మూలాధారచక్రమునకు నధిష్ఠానదేవత యని యర్థము.) ఆఱునూఱులును = పైన వర్ణింపఁబడినహంస మంత్రజపములో ఆఱునూఱుమాఱు లొనర్చిన జపమును, లింగస్థానంబునఁ, బభమయ రలవర్ణగంబై = బ, భ, మ, య, ర, ల, అనునక్షరములతోఁ గూడినట్టియు, షడ్దళసమన్వితంబై = ఆఱురేకులతోఁ గూడి నట్టియు, రక్తవర్ణంబై = ఎఱ్ఱనిదై, జలాలయంబై=జలభూతములకాశ్రయమై, రసనా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కారణంబై = జిహ్వేంద్రియమునకుఁగారణమై, స్వాధిష్ఠానచక్రంబు=స్వాధిష్ఠాన మను పేరుగలచక్రము, రంజిల్లుఁ = ప్రకాశించును. అందుఁ = ఆస్వాధిష్ఠానచక్రమందు, చతుర్ముఖునకుఁ=దానియధిదేవతయైనబ్రహ్మకు, ఆఱువేలును=ఆఱువేలజపంబును, నాభి స్థానంబుఁ = నాభియందు, డఢణతథదధనపఫవర్ణగంబై=ఢ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ అనునక్షరములు గలదియై, దశదళోపేతంబై = పదిరేకులతోఁ గూడి, తేజో నివాసంబై = అగ్నిభూతమున కాశ్రయమై, పీతవర్ణంబై = పచ్చనివర్ణము గలదియై, నేత్రకారణంబై = నేత్రేంద్రియమునకు హేతువై, మణిపూరకచక్రంబు = మణిపూరక మను పేరు గలచక్రము, ప్రకాశించుఁ = ప్రకాశించును. అందుఁ = ఆమణిపూరక చక్రమునందు, శ్రీమహావిష్ణునకుఁ = అధిదేవతయై యున్న విష్ణువునకు, ఆఱువేలును =ఆఱువేలజపంబును, హృదయస్థానంబునఁ = వక్షస్థలమునందు, క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ వర్ణగంబై = క,ఖ,గ,ఘ,ఙ,చ,ఛ,జ,ఝ,ఞ,ట,ఠ అను నక్షరములుగలది యై, ద్వాదశదళోపేతంబై = పండ్రెండుదళములతోఁ గూడినదియై, శ్వేతవర్ణంబై = తెల్లనివర్ణము గలదియై, మరున్మందిరంబై=వాయుభూతమునకు ఆధారమై, త్వగింద్రియ కారణంబై = త్వగింద్రియమునకుఁ గారణమై, అనాహతచక్రంబు = అనాహత మను పేరుగలచక్రము, తనరుఁ = ఒప్పును. అందుఁ = ఆచక్రమునందు, రుద్రునకుఁ=అధి దేవతయైన యీశ్వరునకు, ఆఱువేలును = ఆఱువేలజపంబును, కంఠస్థానమందుఁ=కంఠ మునందు, అకారాదిషోడశస్వరగంబయి = అకారము మొదలు పదియాఱువర్ణములు గలదియై, షోడశదళయుతంబై = పదియాఱుదళములతోఁ గూడినదియై, నీలవర్ణంబయి= నల్లనివర్ణముగలదియై, గగనసదనంబయి = ఆకాశభూతములకు నాధారమై, శ్రోత్రకా రణంబయి = శ్రోత్రేంద్రియమునకుఁ గారణమై, విశుద్ధచక్రంబు = విశుద్ధ మను పేరు గలచక్రము, అలరుఁ = ఒప్పుచున్నది. అందుఁ = ఆవిశుద్ధచక్రమునందు, జీవాత్మ నకుఁ = అధిష్ఠానదేవతయై యున్నజీవునకు, సహస్రంబును = పదినూఱులును, భ్రూ మధ్యస్థానంబునఁ=బొమల నడిమిభాగమున, హంక్షమ్మను వర్ణంబులు గలిగి = హం, క్షం అను రెండక్షరములతోఁ గూడి, ద్విదళలలితంబై = రెండు దళములతోఁ బ్రకా శించు, మాణిక్యవర్ణంబై = మాణిక్యమువంటి వర్ణముగలదియై, అంతఃకరణభవనం బయి = అంతఃకరణమునకు నివాసస్థానమై, ఆజ్ఞాచక్రంబు = ఆజ్ఞ యనుపేరు గల చక్రము, ఒప్పుఁ = ప్రకాశించును. అందుఁ = ఆయాజ్ఞాచక్రమునందు, పర మాత్మునకుఁ = అధిష్ఠానదేవత యైన పరబ్రహ్మమునకు, సహస్రంబును = పదినూఱుల జపమును, బ్రహ్మరంధ్రస్థానంబునఁ = శిరస్సునందు, ఓంకారవర్ణగంబయి = ఓం కారమనువర్ణముగలదియై, సహస్రదళశోభితంబయి = సహస్రదళములతోఁ గూడి, కోటిసూర్యప్రకాశమానంబయి = కోటిసూర్యులయట్లు కాంతిగలిగి, ధీవిలయస్థలంబై=

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బుద్ధిలయమునొందుటకు స్థానమై, సహస్రారచక్రంబు = సహస్రారమనుచక్రము, అల రారుఁ = ఒప్పుచుండును. అందుఁ = ఆసహస్రారచక్రమునందు, శ్రీగురుస్వామికిఁ = గురువునకు (నిత్యసిద్ధుఁడగుపరబ్రహ్మమే గురుశబ్దముతోఁ జెప్పఁబడును.), సహస్ర జపంబును, శ్రీమ...గాఁ-శ్రీమత్ = బ్రహ్మవిద్యాసంపన్నుఁడైన, దేశిక=సద్గురువుచేత, ఉక్త=చెప్పఁబడిన, ఆసన = యోగాసనము మొదలగునాసనములు, ముద్రా లక్ష్య=ముద్ర, మంత్ర = మంత్రము, ధ్యానక్రమపూర్వకంబుగాఁ = వీనిని ధ్యానించుటయే ప్రధానముగా (అనఁగా: తన కుపదేశ మిచ్చినగురువు ఏయాసనమును చెప్పునో దాని నభ్యసించి, యేముద్రను చెప్పునో దానిని జూచుచు, ఏమంత్రమును జెప్పునో దాని నుపాసించుచు, సము...డు-సమర్పించు = ఇచ్చునట్టి (అనఁగా: అట్లు సంకల్పించునట్టి), సత్ = శ్రేష్ఠుఁడైన, గురు = గురువుయొక్క, భక్తుఁడు, జీవన్ముక్తుండు = బ్రతికియే మోక్షముఁ జెందువాఁడు, అగుఁ = అవును. అట్లు = ఆవిధముగా, ఒప్పించునప్పుడు = జపమును ఆయా దేవతలకు సమర్పించునప్పుడు.

తా. ఈశ్వాస షడాధారచక్రములయందు విహరించుచుండును గావున నేయే చక్రము నాశ్రయించి యెంతెంతజపము జరుగునో దానినిగూర్చి చెప్పెద వినుము. గుదస్థానమునందు వ,శ,ష,స అను నాల్గక్షరములతోఁ గూడిన నాలుగుదళములు కలదియుఁ బుటము వేసినబంగారముతో సమాన మగు కాంతి గలదియు పృథ్వీభూతమునకాధారమైనదియు ఘ్రాణేంద్రియమునకుఁ గారణ మైనదియు నగుమూలాధార మను నొక చక్రము కలదు. దాని కధిదేవత విఘ్నేశ్వరుఁడు. ఆచక్రమునందు ఆఱునూఱు మాఱులు జపము జరుగును. ఆవినాయకున కది యర్పింపఁబడును; ఇట్లే లింగస్థానమున స్వాధిష్ఠాన మనుమఱియొక చక్రము కలదు. బ,భ,మ,య,ర,ల, అను వర్ణములతోఁ గూడినయాఱుదళములు కలిగి రక్తవర్ణముతో నాచక్రము రంజిల్లుచుండును. అది జలభూతమున కాధారము. జిహ్వేంద్రియమునకుఁ గారణము. దానికధిదేవత బ్రహ్మ. ఆ చక్రమునందు జరుగునాఱువేలజపము ఆబ్రహ్మకు సమర్పింపఁబడును. నాభియందు మణిపూరకచక్రము కలదు. అది పచ్చనివర్ణము కలిగి అగ్నిభూతమునకు నివాసస్థానమై నేత్రేంద్రియమునకుఁ గారణమై డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ అనుబీజాక్షరములతోఁగూడినపదిదళములు గలదియై యొప్పుచుండును. దాని కధిదేవత విష్ణువు. ఆయన కాఱువేలజపము సమర్పింపఁబడును. హృదయస్థానమునం దనాహత మనుచక్రము కలదు. అది తెల్లనిది. వాయుభూతమునకు నివాసమైనది. త్వగింద్రియమునకుఁ గారణమైనది. క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ అనుపండ్రెండక్షరములతోఁ గూడినపండ్రెండుదళములు దానికిఁ గలవు. దానికి రుద్రుఁ డధిదేవత. ఆయనకుఁ గూడ జపములో నాఱువేలు సమర్పింపఁబడును. కంఠస్థానమునందు విశుద్ధమను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చక్రముఁ బ్రకాశించుచున్నది. అకారము మొదలగు పదియాఱచ్చులతోఁ గూడిన పది యాఱుదళములతోను నీలవర్ణముతోను అది రాజిల్లును. ఆకాశమునకు నివాసస్థానమై శ్రోత్రమునకుఁ గారణభూతమై యున్నయాచక్రమునకు జీవుఁ డధిదేవత. యాతని కొక సహస్ర మచట నర్పింపఁబడును. భ్రూమధ్యస్థానమునందు హం, క్షం అనునక్షరము లతోఁగూడినరెండుదళములతో నొప్పునాజ్ఞాచక్రము గలదు. అది మనసునకు నివాస స్థానము. మాణిక్యవర్ణము. దానియధిదేవత పరబ్రహ్మము. ఆయనకు నొక్కసహస్ర మర్పిం పఁబడును. బ్రహ్మరంధ్రమునందు కోటిసూర్యప్రకాశమై ఓంకార మనుబీజముతోఁ గూడినసహస్రదళములతో నొప్పుచు సహస్రార మనుపేరుగలకమలము కలదు. సుషు ప్తియందు బుద్ధి మొదలగునవి లయ మగుస్థాన మదియే. దానికి గురు వధిదేవత. ఆయన కొకసహస్ర మర్పింపఁబడును. (అనఁగా: సర్వకాలములయందును వాయుసంచార మును గమనించుచు నాయాసంఖ్యలు ముగియఁగానే యాయాదేవతల కర్పించినటుగా భావింపవలయు నని తెలిసికొనుము. ఈవిధముగా సద్గురు వుపదేశించిన ముద్రలు లక్ష్యము జపము వీనిని ధ్యానించుచు నీహంసమంత్రము ననుష్ఠింపవలయును. ఈవిధ ముగా నర్పణ సేయునప్పుడు నింకొకవిశేషము గావచ్చును.

క. కుడియెడమనాడులందుఁ
నడుచు న్వాయువులు వాని నడపడి వెలి లోఁ
బొడగనుచు నెపుడు మెలఁగుఁ
నడిమినడక నంటి నెమ్మనంబు కుమారా. 181

టీ. కుమారా = పుత్రా! వాయువులు = ప్రాణవాయువులు, కుడియెడమనాడు లందుఁ = కుడిభాగమునందును ఎడమభాగమునందును నున్నపింగళేడానాడులయందు, నడుచుఁ = సంచరించుచుండును. నెమ్మనంబు=మనస్సు, వానినడువడిఁ =వానిసంచార మును, వెలిఁ =వెలుపలను, లోఁ =లోపలను, పొడగనుచుఁ =చూచుచు, ఎపుడు=ఎల్ల ప్పుడు, నడిమినడకనంటి = ఆరెండునాడులకు మధ్యనున్నసుషుమ్నానాడి నాశ్రయించి, మెలఁగుఁ =సంచరించుచుండును.

తా. ఓపుత్రా ! నీవు హంసమంత్రానుష్ఠానము చేయునప్పుడును అజపము నాయాదేవతలకు సమర్పించునప్పుడును ప్రాణవాయువు కుడి, యెడమభాగములయం దున్నయిడా, పింగళానాడులమూలమున సంచరించుచుండును. మనస్సుమాత్రము నడుమ నున్న సుషుమ్నానాడియందు నిలచి వానినిఁ జూచుచుండును.

హంసస్థానసూచనము.

క. ఆరెంటికిని విలక్షణ, మై రాజిల్లెడుసుషుమ్నయం దమలాజ్ఞాం
భోరుహమున హంసుం డా, తారాముఁడు సర్వసాక్షియై వెల్గు సుతా!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. సుతా = పుత్రా! ఆరెంటికిన్ =ఆమనః ప్రాణములరెంటికిని, విలక్షణమై= వేఱై, రాజిల్లెడు=ప్రకాశించుచున్న, సుషుమ్నయందు=సుషుమ్నయందున్నట్టి, అమ... మునన్-అమల=నిర్మలమైన, అజ్ఞాంభోరుహమునన్ = ఆజ్ఞాచక్రమునందు, హంసుండు= జీవుఁడు (లేక పరబ్రహ్మము), ఆత్మారాముఁడు=అంతర్యామిస్వరూపుఁడై, సర్వసాక్షియై= సకల ప్రపంచమునకును సాక్షియై (అనఁగా: తన స్వరూపభూతమగు జ్ఞానముచే సర్వము నెఱుంగువాఁడై), వెల్గున్=ప్రకాశించును.

తా. ఓపుత్రా! ఆప్రాణమనస్సులకంటె వేఱై సుషుమ్నానాడియందున్న యాజ్ఞా చక్రమునసుందు పరమాత్మ సర్వమును గనుఁగొనుచుండును. ప్రాణవాయువులు సంచ రించుచుండుటయు, సుషుమ్న నాశ్రయించి మనస్సు వానిం జూచుచుండుటయుఁగూడ నాబ్రహ్మమునకు గోచర మగుచుండును.

ఆ. అచలహంసరూప మెచట సంభవ మగు
నెచట సంచరించు నెచట నడఁగు
నదియె సూ సుషుమ్న యదియె పో ద్విదళాబ్జ
మదియ సూక్ష్మదృష్టి నరయు మనఘ! 183

టీ. అనఘ=పాపరహితుఁడా, అచ...పము-అచల = నిశ్చలమైన, హంస=పైన వర్ణింపఁబడినహంసపక్షియొక్క, రూపము=స్వరూపము, ఎచటన్=ఏస్థలమునందు, సంభవ మగున్=పుట్టునో, ఎచటన్=ఏస్థలమునందు, సంచరించున్=తిరుగునో, ఎచటనడఁగున్= ఎచ్చట నశించునో, సుషుమ్న=సుషుమ్నానాడి, అదియేసూ=అస్థలమేసుమా, ద్విదళాబ్జము =రెండుదళములుగల యాజ్ఞాచక్రముకూడ, అదియెపో=అస్థలమేసుమా, సూక్ష్మదృష్టిన్= జ్ఞాననేత్రముచే, అది యరయుము=దానిని విచారింపుము. (ఇట్లు చెప్పుటవలన నీయాజ్ఞా చక్రంబును దీనితోఁగూడఁ జెప్పఁబడియుండుటచే మూలాధారాది సమస్తచక్రములు సుషుమ్నానాడియు అనునవి యన్నియు కల్పితములని తోఁచుచున్నది. శారీరకములే (అనఁగా: నాయారూపములో శరీరమునందున్న వే) యైనచో నిట్లు చెప్పుట సంభవింపదు గదా.)

తా. హంసయును బరబ్రహ్మమే యనియు మాయవలనఁదక్క నాహంసమున కును బ్రహ్మమునకును భేదమేమియు లేదనియు నిదివఱకే చెప్పియున్నాము. కావున బాగుగ విచారించిన పైవర్ణింపఁబడినసర్వసాక్షియగు పరబ్రహ్మమే హంస. ఆహంస జీవ రూపముతో నెచటఁ గానవచ్చునో బ్రహ్మస్వరూపసాక్షాత్కారము గలిగినపిదప నెచట నశించునో నాశమునకుఁ బూర్వమెచట విహరించునో అదియే సుషుమ్నానాడి. అదియే యాజ్ఞాచక్రము. ఈవిషయము నతిసూక్ష్మమగు దృష్టిచేఁ దెలిసికొనుము. (అదియే బ్రహ్మమని తోఁచుచున్నది.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇట్లు సూక్ష్మతమమగు పరబ్రహ్మతత్త్వము నుపదేశించి దీనిని దెలిసికొనం గోరు ముముక్షువులకుఁ దారకయోగ మవశ్యకర్తవ్యమను విషయమును సయుక్తికముగా నిరూపించుచున్నాఁడు:—

చ. అది యతిసూక్ష్మదృష్టియు దృగాద్యవసానపదంబు ధీమన
స్సదనము స్వప్రకాశము నసంగము నిర్విషయంబు గాన న
ప్పదమున హంసనాదములభంగుల గూర్పఁ దదంతరంబునం
దుదయము నొంది చిత్కళ మహోన్నతి వాని నడంచు నెంతయున్.

టీ. అది=అస్థానము, అతిసూక్ష్మదృష్టియున్=మిగులసూక్ష్మమైన జ్ఞానమే స్వరూపముగాఁగలదియు, దృగా...బును-దృగాది=నేత్రము మొదలగు నింద్రియములయొక్క (లేక ద్రష్టృత్వము మొదలగుధర్మములయొక్క), అవసానపదంబును=లయస్థానమును (ఇంద్రియము లన్నియుఁ నచట లీనమగుటచే దానిని కనుఁగొన నేరవనియుఁ ఆపదార్థము మఱియొకదానినిఁ జూచుటయుఁగూడ సంభవింపదు), ధీ...మును-ధీ=బుద్ధికిని, మనః=మనస్సునకును, సదనమును=స్థానమును (అనఁగా: దాని నాశ్రయించియే బుద్ధి మొదలగునవి ప్రవర్తించుచున్నవనుట), స్వప్రకాశమును = మఱియొకదాని సహాయములేకయే స్వయముగ ప్రకాశించునదియు, అసంగమును=దేనితో సంబంధపడనిదియు, నిర్విషయంబును=గోచరముకాఁదగిన రెండవపదార్థములేనిదియు, కానన్=ఐ యున్నది కావున, అప్పదమునన్=అస్థలమునందు, హంస...లన్-హంసనాదముల=పూర్వము వర్ణింపఁబడిన దశవిధప్రణవనాదములయొక్కయు హంసపక్షియొక్కయుఁ, భంగులన్=రీతులను (ఇచట హంసము కలదు నాదములు కలవు అనిభావించి), కూర్పన్ = చేర్పఁగా (నిర్మలమగు పైవర్ణింపఁబడిన బ్రహ్మపదార్థము నెఱుంగ లేనప్పుడు బ్రహ్మాభిన్నములుగాఁ గానవచ్చుచున్న నీనాదహంసలనే ధ్యానించుచున్నప్పుడు), తదంతరంబునన్=అహంసనాదముల నడుమ, చిత్కళ=పూర్వము వర్ణింపఁబడిన చిత్కళ (అనఁగా: బ్రహ్మకు స్వరూపభూతమైన జ్ఞానము, బుద్ధియందున్న బ్రహ్మప్రతిబింబమే కళయని చెప్పఁబడియున్నది), ఉదయమునొంది=పుట్టి, మహోన్నతిన్=అధికమగునభివృద్ధిచే, వానిన్=అహంసనాదములను, ఎంతయున్=సంపూర్ణముగా, అడంచున్=పరబ్రహ్మమునందు లీన మగునట్లు చేయును. (పిదపఁ దానును స్వస్వరూపముతో నిలుచునని గ్రహింపవలయును.)

తా. అసుషుమ్న, లేక పరబ్రహ్మము మిగులసూక్ష్మమైనది. జ్ఞానరూపమైనది. చూచువాఁడు జూడఁబడునది చూపు అను భేదములు నశించినఁగాని తెలియవచ్చునది కాదు. మనస్సు బుద్ధి మొదలగువానికెల్ల నాధారమైనది. (అనఁగా: వానినిఁగూడ దన కాంతిచేఁ బ్రకాశింపఁ జేయునది.) ఇతరసహాయముతోఁ బనిలేక స్వయముగఁ బ్రకాశించునది. దేనితోను సంబంధపడనిది. వానిస్థితిలో వానికంటె రెండవపదార్థము లేకపోవుట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేత దానికి గోచరమగు విషయమే లేదు. ఇట్టి యాబ్రహ్మతత్త్వము నెఱుఁగుట యశక్యము. గావున నచ్చట నాదబిందువుల నారోపించి ముద్రాభ్యాసపాటవమువలనఁ జూడ నారంభించినచో వానికి నడుమఁ జిత్కళ యుదయించును. చిత్కళ యనఁగా బిందువునందుఁ బ్రతిబింబించియున్న బ్రహ్మప్రతిబింబమే యని యిదివఱకే చెప్పియున్నాము కదా! ఆబ్రహ్మతేజస్సు కానరాఁగానే నాదబిందువు లడఁగిపోవును.

ఆ భూరిహంసనాదపూర్వోత్తరారణి
జనితచిత్కళాగ్ని ఘనత మెఱసి
స్వాదివస్తువులను స్వస్వరూపంబుగాఁ
జేయకున్నె పైని జేరునపుడు. 185

టీ. భూరి...కళాగ్ని-భూరి=అధికమైన, హంస=హంసమనునట్టియు, నాద=నాదమనునట్టియు, పూర్వోత్తరారణి=రెండుఅరణులనుండియు (అరణి యనఁగా యజ్ఞాదులయందు అగ్నిని మథించుదారువు, పూర్వారణి యనఁగా క్రిందనుంపఁబడునది), జనిత=పుట్టిన, చిత్కళా=చిత్కళయనెడు, అగ్ని, ఘనత మెఱసి=అధికమై, స్వాదివస్తువులన్-స్వ=తాను, ఆది=మొదలైన, వస్తువులన్=సకలపదార్థములను, పైనిన్=మీఁద, చేరునపుడు, స్వస్వరూపంబుగాఁ జేయకున్నె=తనస్వరూపము గలవిగాఁ జేయదా? (అనఁగా అరణులయందుఁ బుట్టునగ్ని తానాక్రమించియున్న అరణులనుగూడ తనయట్లే అగ్నిమయములనుగాఁ జేసి తనయందు లయము నొందించునట్లు ఈచిత్కళగూడ హంసనాదమువలనఁబుట్టి తుదకు వానిని తనలోఁ జేర్చికొని స్వస్వరూపముతో (బ్రహ్మస్వరూపముతో) నిలుచు నని భావము.)

తా. అరణులయందుఁ బుట్టినయగ్ని తా నభివృద్ధియైనప్పుడు సకలపదార్థములను స్వస్వరూపముగాఁ జేయునట్లు ఈచిత్కళయను నగ్నికూడ నాదబిందువులను నరణులయందుఁ బుట్టి యభివృద్ధిఁ జెంది సర్వపదార్థములను స్వస్వరూపముగాఁ జేయును. అపరబ్రహ్మతేజస్సునందే తుదకు నాదబిందువులు కలయును. ఇందు సందియములేదు.

## బిందునాదకళాప్రకారాంతరసూచనము.

అవ. శైవమతానుసారముగ నాదబిందుకళాస్వరూపము నభివర్ణించుచున్నాఁడు:—

క. అంగము నిర్మలబిందువు, లింగము నాదంబు పరమలింగాంగమహా
సంగ మెమంగళకళయని,లింగాంగులు దెలియుదురుచలింపనియుక్తిన్.

టీ. అంగము=ప్రణవాంగమైనజీవుఁడు, (ప్రణవము ప్రపంచస్వరూపమే కావున ప్రపంచాంతర్భూతుఁడగుజీవుఁడు కూడ దానియవయవమేయని భావము.) నిర్మల=పరిశుద్ధమైన, బిందువు=బిందువని చెప్పఁబడును, లింగము=ఆబిందువునందు ప్రతిబింబించియున్న పరమేశ్వరుని ప్రకాశము, నాదంబు=నాదము అని చెప్పఁబడును. పర...

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గమే-పరమ=శ్రేష్ఠమైన, లింగ = పైవర్ణింపఁబడిన పరమేశ్వరునిప్రకాశముయొక్కయు, అంగ=అంగస్వరూపుఁడైన జీవునియొక్కయు, మహాసంగమే=పరిపూర్ణమగునైక్యమే, మంగళకళయని = శుభకరమైనకళయని, లింగాంగులు=పైఁ జెప్పినలింగాంగజ్ఞానము గలవారు (అనఁగా: బ్రహ్మవేత్తలు; శైవమతస్థుఁ డనికూడ నొకయర్థము స్ఫురించుచున్నది. వారిమతమునందు స్థూలసూక్ష్మకారణశరీరములఁ గ్రమముగ నభిమానించుచున్న విశ్వతైజసప్రాజ్ఞులకు నిష్టలింగ ప్రాణలింగ భావలింగములను వ్యవహారములుకలవు. సర్వశరీరముల నభిమానించుజీవున కాత్మలింగ మనియు శుద్ధపరబ్రహ్మమునకు మహాలింగమనియు పేర్లు. ఆత్మలింగమునందు ఇష్టలింగ ప్రాణలింగ భావలింగముల నేకముజేసి (అనఁగా: ఆత్మలింగమునకంటె వారు ముప్వురును వేఱుకారని తెలిసికొని)అయాత్మలింగమునుగూడ మహాలింగమునందు (అనఁగా: శుద్ధపరబ్రహ్మమునందు)ఁ జేర్పవలయు ననియు (అనఁగా: నాత్మలింగమహాలింగములకు భేద మెప్పటికిని లేదని తెలిసికొనవలయుననియు) వారి సిద్ధాంతము. ఈరహస్యము నెఱుఁగలేనివారికి నుపకారమొనర్చుటకై యుపాసనార్థము లింగధారణము వారిమతమున నేర్పడినది.) చలింపనియు క్తిక్ = స్థిరమగుజ్ఞానముచే, తెలియుదురు=తెలిసికొనుచున్నారు.

తా. శైవులు (లేక బ్రహ్మజ్ఞానులు) జీవుఁడు బిందువనియు బ్రహ్మము నాదమనియు స్వతస్సిద్ధమగు జీవబ్రహ్మైక్యమే కళ యనియుఁ జెప్పుదురు. శరీరము బిందువనియు ధరింపఁబడుప్రాణలింగము (లేక జీవరూపుఁడగు నాత్మలింగమున కభిన్నుఁడగు మహాలింగము) (పరమాత్మ) నాదమనియు యీయాత్మలింగమహాలింగములకుఁ గలయభేదమే కళ యనియు శైవులు చెప్పుదురు. (అని మఱియొక యర్థము.)

ఆ. అట్లు గావునఁ గళహంసనాదంబుల
రూప మడఁచి తనదురూపుఁ జేసి
తాను తాన యైన తత్త్వంబునం దైక్య
మొందు బయలు బయల నొందినట్లు. 187

టీ. అట్లుగావునన్=పైనిరూపించినహేతువువలన (బిందువని చెప్పఁబడియున్న బుద్ధియందు ప్రతిబింబించియున్న పరబ్రహ్మమే కళ యగుటవలన), కళ=చిత్కళ, హంస నాదంబులరూపమున్ = హంసపక్షిరూపముగవర్ణింపఁబడియున్న జీవునియొక్కయు దశ విధములగు ప్రణవనాదములయొక్కయురూపము, అడఁచి=నశింపఁజేసి, తనదురూపుఁజేసి= తనస్వరూపమునందైక్యముచేసికొని, తానుతానయైనతత్త్వంబునందున్=తాను (ఆచిత్కళ) తనరూపమునకంటె వేఱుకాని పరబ్రహ్మమునందు, బయలుబయలనొందినట్లు = ఘటాకాశము మహాకాశమునన లీనమైనట్లు, ఐక్యమొందున్=అభేదముగఁ గలసిపోవును. (బ్రహ్మమై నిలుచునని యర్థము.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఇట్లనాదిసిద్ధ మగుజీవబ్రహ్మైక్యమే కళ గావున నది నాదబిందువుల నశింపఁజేసి తనయందుఁ జేర్చికొని ఘటాకాశము మహాకాశమున లీనమైనట్లు తనకంటె నభిన్నుఁడగుపరమాత్మునియం దైక్యమగును.

మ. కలహంసాన్వితనాదబిందు కళలైక్యంబెప్డు డౌ నప్పుడు
జ్జ్వలకర్పూరశిఖిప్రణాశముగతిన్ సర్వేంద్రియోపేతకా
నిలచిత్తంబులు శూన్యమై చనఁగఁ దా నిర్వాతదీపోపమా
చలసచ్చిత్సుఖవిగ్రహాత్ముఁ డలరున్ సంపూర్ణుఁడై యంతటన్. 183

టీ. కల...శలు - మనోహర మైన, హంస = హంసపక్షి యని జెప్పఁబడిన జీవునితో, అన్విత = కూడిన, నాదబిందుకళలు = ప్రణవనాదములును బుద్ధియు జిత్కళయు, ఐక్యంబెప్పుడౌన్ = ఏసమయమునఁ దనతో (బ్రహ్మతో), నేకీభవించునో, అప్పుడు=ఆసమయమున, ఉజ్జ్వల...గతిన్ - ఉజ్జ్వల=ప్రకాశించుచున్న, కర్పూరశిఖి =కర్పూరదీపముయొక్క, ప్రణాశముగతిన్=నాశనమువలె (అనఁగా: కర్పూరదీపమును గర్పూరమును గూడ నొకమాటె నశించినట్లు, సర్వే...బులు-సర్వేంద్రియ = సమస్తేంద్రియములతో, ఉపేతక = కూడిన, (ఇచ్చట స్వార్థమందు కప్రత్యయము.) అనిల = వాయువులును, చిత్తంబులు = మనస్సును, శూన్యమైచనఁగన్ = స్వరూపసహితము లై పోఁగా, తాన్ = తాను, నిర్వా...త్ముఁడు-నిర్వాత=గాలి లేనిచోటనున్న, దీపోపమ=దీపముతో సమానమైనట్టియు, అచల=నిశ్చలమైనట్టియు, సత్ = సత్తామాత్రమైనట్టియు, చిత్ =జ్ఞానరూపమైనట్టియు, సుఖ = ఆనందమైనట్టియు, విగ్రహాత్ముఁడు = రూపముగల (అనఁగా: ప్రపంచవిలక్షణుఁ డైనపరబ్రహ్మము. (ఈప్రపంచము అసత్య, అజ్ఞాన దుఃఖ రూపమైనది. బ్రహ్మము సత్యజ్ఞానసుఖరూపుఁడైనవాఁడు. కావున బ్రపంచమునకంటె బ్రహ్మవేఱు. విలక్షణపదమునకు వే అనియే యర్థమని తెలిసికొనవలయును) అంతటన్ =సర్వదేశములయందును, సంపూర్ణుఁడువి=కొఱఁత లేక వ్యాపించియున్నవాఁడై (అనఁగా: నద్వితీయుఁడై), అలరున్ = ప్రకాశించును.

తా. ఈవిధముగా హంసయు నాదబిందుకళలును దనలో నైక్యముఁ జెందఁగానే యాపరబ్రహ్మము ఇంద్రియప్రాణమనస్సులు అగ్నియందుఁ గలసినకర్పూరము వలె రూపరహితములు కాఁగానే యాసత్యజ్ఞానానందస్వరూపుఁ డగుపరమాత్ముఁడు గాలిలేనిచోట నున్నదీపముకైవడి నిశ్చలుఁడై యద్వితీయుఁడై ప్రకాశించును.

## అమనస్కనిరూపణము.

వ. ఇట్లు హంసనాదబిందుకళలతో సకలేంద్రియసమన్వితమనఃప్రాణంబు లెప్పుడు విలయంబగు నప్పుడయ్యవస్థ తురీయం బనియు నున్మని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యనియు సహజామనస్కం బనియుఁ జెప్పనొప్పు నట్టిపూర్ణనిర్వికల్ప
సమాధియం దద్వితీయాపరోక్షస్వయంప్రకాశమానాఖండ సచ్చిదా
నందస్వరూపపరమాత్మారామ చైతన్యమాత్రుండవై యుండు మని
యుపదేశించి వెండియు నిట్లనియె. 189

టీ. ఇట్లు = ఈవిధముగా, హంస...తోన్-హంస = హంసపక్షిగా వర్ణింపఁబడి యున్న జీవునితోడను, నాదబిందుకళలతోన్ = ప్రణవనాదబుద్ధిచిత్కళలతోడను, సక...లు-సకలేంద్రియ=సర్వేంద్రియములతోడను, సమన్విత=కూడిన, మనః = మనస్సును, ప్రాణంబులు=ప్రాణమును, ఎప్పుడువిలయంబగున్ = ఎప్పుడు పరబ్రహ్మమునందు లీనము లగునో, అప్పుడయ్యవస్థ = అప్పుడు ఆచిత్తాదిలయావస్థ, తురీయం బనియున్ = తురీయావస్థయనియు (ఈతురీయావస్థ రెండువిధములు. అందు స్వభావసిద్ధముగానే ప్రతి దినమును ప్రతిజీవునకును సుషుప్త్యవస్థకుఁ బిదప నంతకంటె మిగుల సుఖకరమై లభించు చుండు నది యొకటి. తారకయోగవిచారమునందుఁ జెప్పఁబడినరీతిగ మనసు మొదలగునవి పరబ్రహ్మమునందు లీనమైనపుడు శాశ్వతసుఖములు గలిగించుచు జీవబ్రహ్మైక్యానుసంధానాభ్యాసపాటవమువలనఁ గలుగునది మఱియొకటి), ఉన్మనియనియున్=ఉన్మన్యవస్థయనియు, సహజామనస్కంబనియున్ = స్వభావసిద్ధమైన యమనస్కమనియు, చెప్పనొప్పున్ = చెప్పఁబడుచున్నది. అట్టి...దున్-అట్టి = అటువంటి, పూర్ణ = కొఱఁతలేనట్టియు, నిర్వికల్ప = ధ్యానించువాఁడు, ధ్యానింపఁబడునది, ధ్యానము అను మొదలగు భేదములు లేనట్టియు, సమాధియందున్ = నిష్ఠయందు, అద్వి...వై-అద్వితీయ=రెండవవాఁడు లేనట్టియు, అపరోక్ష=ప్రత్యక్షమైనట్టియు, స్వయంప్రకాశమాన = మఱియొకదానిసహాయము లేక తనంతఁ దానే ప్రకాశించునట్టియు (ఇచ్చట ప్రకాశమనఁగా జ్ఞానమే ప్రకాశించుట అనఁగా తెలిసికొనుటయే), అఖండ = విభాగములు లేనట్టియు, సచ్చిదానందస్వరూప = సత్యజ్ఞానానందస్వరూపమైన, పరమ=శ్రేష్ఠమైన, ఆత్మారామ = అంతర్యామియైన, చైతన్యమాత్రుండవై=జ్ఞానమే స్వరూపముగాఁ గలవాఁడవై, ఉండుము అని ఉపదేశించి=ఉండుము అని బోధించి, వెండియున్=మఱియు, ఇట్లనియెన్=ఈక్రిందివిధముగాఁ జెప్పెను.

తా. ఈవిధముగా ప్రాణేంద్రియసహితముగ మనస్సెప్పుడు పరబ్రహ్మమునందు లీనమగునో ఆస్థితికి తురీయావస్థయనియు, నున్మన్యవస్థయనియు, సహజామనస్కమనియుఁ పేర్లు. ఇవియే నిర్వికల్పసమాధి యనఁబడును. ఇట్టి సమాధియందు నిలిచి సర్వపరిపూర్ణుండును అద్వితీయుఁడును జీవునికంటె నభిన్నుఁడును స్వప్రకాశస్వరూపుఁడును అంతర్యామియు నగుశ్రీరామునితో నభిన్నుఁడ వై యుండుము. మోక్షమును జెందుము. అని యుపదేశించి యాసీతాదేవి మఱియు నిట్లనియె.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇట్లు సవిస్తరముగ రాజయోగము నెఱింగించి మరల దానినే సంక్షేపించి చెప్పుచున్నాఁడు:—

సీ. పరమహంసంబు రేపగలు చింతింపంగ
బిందు వింతండుఁ గంపింపకుండ
దశవిధప్రణవనాదము లాలకింపంగఁ
దుదను ఘంటానాద మొదవి మ్రోయు
బహులక్షలక్ష్యముల్ పరికించి చూడంగ
సురుచిరంబై స్వయంజ్యోతి యొప్పు
యామద్వయంబు యోగారూఢుఁడై వాని
ధ్యానింపఁ దన్మయత్వంబు గలుగు
తే. నట్టియున్మనియందు మనోనిలములు
వివిధవిషయేంద్రియములతో విలయ మొందు
నిదియె సూ సర్వవేదాంతవిదితపరమ
రాజయోగంబు దేవతారాజి వినుత! 190

టీ. దేవతారాజివినుత = దేవతాసమూహములచే స్తోత్రములు చేయఁబడుచున్న సద్గుణములు గలయాంజనేయా, పర...సంబున్-పరమ = శ్రేష్ఠమైన, హంసంబున్ = హంసపక్షి యని చెప్పఁబడి యున్న జీవునిఁగూర్చి, రేపగలు = రేయుంబవలు, చింతింపంగన్=ఆలోచన సేయఁగా (ఈజీవునకును బ్రహ్మమునకును భేదములేదని ధ్యానింపఁగా), బిందువు=బుద్ధి, ఇంతండున్=ఇటునటు, కంపింపకుండున్ = కదలనేరదు, దశ...ములు-దశవిధ=పదివిధము లగు, ప్రణవనాదములు = ఓంకారనాదములు, ఆలకింపంగన్=వినుచుండఁగా, తుదన్ = అంతమునందు, ఘంటానాదము = ఘంటానాదరూప మగునోంకారధ్వని, ఒదవి మ్రోయున్=పుట్టి మ్రోఁగును, బహులక్షలక్ష్యములు-బహు = అనేకములైన, లక్ష = లక్షసంఖ్యలు గల, లక్ష్యములు=గుఱులు (చిత్కళలు), పరికించి = విమర్శపూర్వకముగా, చూడంగన్=చూచుచుండఁగ, సురుచిరంబై=మిగులఁ బ్రకాశించుచు, స్వయంజ్యోతి=స్వప్రకాశస్వరూపమగు పరబ్రహ్మము, ఒప్పున్=ప్రకాశించును. (కానవచ్చుననుట. ఇచ్చట కానఁబడుట యనఁగా నేత్రములకు గోచరమగుట కాదు. పరబ్రహ్మ ఇంద్రియములకు గోచర మగువాఁడు కాఁడుగదా. మఱియు, హంసనాద బిందుకళలు నశించినప్పుడుగాని పరబ్రహ్మము కానరాఁ డని చెప్పఁబడియుండుటచే పరబ్రహ్మము కానవచ్చునప్పటికి దానిని చూచుటకు మనస్సే యుండదుకదా! నాదాదులతోపాటు మనసు కూడ లీనమగు నని చూపింపఁబడియే యున్నదికదా! కావున పర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్రహ్మము కానవచ్చుననుట యనఁగా స్వస్వరూపముతో నిలుచుటయే కాని మఱే మియుఁగాదు. అని తెలిసికొనవలయును. వాస్తవస్థితిలో సర్వసాక్షి యగుబ్రహ్మమును తెలిసికొనునది మఱియొకటి కలదనుటయే సంభవింపదు. సర్వసాక్షికి మఱియొకసాక్షి కలఁడనిన వానికి మఱియొకసాక్షి వానికి మఱియొకసాక్షి యని లెక్కకు మిక్కిలిగ సాక్షుల నంగీకరింపవలసివచ్చుటచే ననవస్థాదోషమువచ్చును.) యామద్వయంబు=రెండు జాములకాలము, యోగారూఢుఁడై-యోగ = తారకయోగమును, ఆరూఢుఁడై=ఆరం భించినవాఁడై, వానిన్ = ఆనాదబిందుకళలను (వానికి ఫలము లగునిశ్చలబుద్ధిఘంటా నాదపరబ్రహ్మములను), ధ్యానింపన్ = ధ్యానించినచో, తన్మయత్వంబు = ఆబ్రహ్మమే తానగుట, కలుగన్. అట్టియున్మనియందున్ = ఇట్లువివరింపఁబడినయున్మన్యవస్థయందు, మనోనిలములు = మనఃప్రాణములు, వివి...తోన్-వివిధ = బహువిధములైన, విషయ = శబ్దాదివిషయములతోను, ఇంద్రియములతోన్ = ఇంద్రియములతోను, విలయమొం దున్=నశించును, సర్వ...గంబు-సర్వ = సమస్తమైన, వేదాంత = వేదాంతములయందు, విదిత=తెలియఁజేయఁబడిన, పరమ=శ్రేష్ఠమైన, రాజయోగంబు = రాజయోగము, ఇది యసూ=ఇదియే సుమా!

తా. దేవతలచేఁగూడ స్తోత్రముచేయఁబడఁదగిన గుణములుగలయోయాంజనేయా! యీరాజయోగమును సంక్షేపముగాఁ జెప్పెద వినుము. రేయిపగలు పైన వర్ణించినవిధ ముగా నజపాగాయత్రి ననుష్ఠించిన బిందువు చలింపక నిలుచును. పలువిధములగునాద ముల వినుచుండినఁ దుదకు ఘంటానాదము మ్రోఁగును. బహువిధము లగుకళలవీక్షించిన నంతమునకు పరబ్రహ్మము నెఱుంగును. ఇట్లు యోగసిద్ధినిఁ గాంచి నిష్ఠతో రెండు జాము లభ్యసించినయెడల సాధకుఁడు తన్మయుఁ డగును. ఆతన్మయత్వమునకే యున్మ న్యవస్థ యనిపేరు. ఆయవస్థయందు యింద్రియప్రాణవిషయములతోఁగూడి మనస్సు లయమునొందును. అప్పు డప్రయత్నముగనే సర్వపరిపూర్ణ మగుస్వస్వరూపము శేషిం చును. ఇదియే రాజయోగము సర్వవేదాంతశాస్త్రములును దీనినే వినుతించుచున్నవి.

{ అధికారితారతమ్యమున యోగసిద్ధియగుటకుఁ గాలనిర్ణయముఁ దెలుపుట. }

అవ. ఈవిధముగా తారకయోగస్వరూపమును దానివలన ననాయాసముగ మోక్షము సిద్ధించుటయును నిరూపించి యుపసంహరించుచు తత్సిద్ధికి కాలనియమమును జెప్పుచున్నాఁడు:—

వ. ఇవ్విధంబునఁ బ్రతిదివసంబు యామద్వయనియమంబు దప్పక యభ్య సించిన నిర్మలనిశ్చలచిత్తవృత్తి గలపురుషునకు షణ్మాసంబులకు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మందప్రజ్ఞునకు సంవత్సరంబునకుఁ గేవలమూఢాత్మునకు ద్వాదశ
వర్షంబులకుఁ బరమసూక్ష్మతారకయోగసిద్ధి యగునని యోగశాస్త్రం
బుల వినంబడు దివ్యజ్ఞాన విజ్ఞానసంపన్నుం డైన యాచార్యునిసాన్ని
ధ్యంబున వసియించి స్థానాంగభావాత్మశుశ్రూషలు గావించుచు
నిరంతరంబు సేవించు మహానుభావునకు నిరంతరాయంబుగా శీఘ్ర
కాలంబున నిర్గుణబ్రహ్మసాక్షాత్కారం బగు, సందేహింపవలదు. 191

టీ. ఇవ్విధంబునన్=ఈవిధముగా, ప్రతిదివసంబు=ప్రతిదినము, యా...బున్-యామద్వయ = రెండుజాములకాలము, నియమంబున్=నిష్కర్షను, తప్పక=విడువక, అభ్యసించినన్=ఈ తారకయోగము నలవాటు చేసినయెడల, నిర్మ...నకున్-నిర్మల=పరిశుద్ధమైన, నిశ్చల=కదలని, చిత్తవృత్తిగల = మనోవ్యాపారముగల, పురుషునకున్, షణ్మాసంబులకున్ = ఆఱునెలలకును, మందప్రజ్ఞునకున్ = అల్పబుద్ధిగలవానికి, సంవత్సరంబునకున్ = పండ్రెండుమాసములకును, కేవలమూఢాత్మునకున్=మిగులఁ మూఢుఁడైన వానికిని, ద్వాదశవర్షంబులకున్ = పండ్రెండుసంవత్సరములకును, పరమ...నని - పరమసూక్ష్మ=మిగుల సూక్ష్మమగు, తారకయోగ=తారకయోగము, సిద్ధియగునని = సిద్ధించునని, యోగశాస్త్రంబులన్=యోగశాస్త్రములయందు, వినంబడున్, దివ్య...డు-దివ్య=శ్రేష్ఠమైన, జ్ఞాన=బ్రహ్మ మొకటి కలదను పరోక్షజ్ఞానముతోను, విజ్ఞాన = బ్రహ్మమే నేనని యనుభవపూర్వకమగు నపరోక్షజ్ఞానముతోను, సంపన్నుండు = కూడినవాఁడు, ఐన యాచార్యునిసాన్నిధ్యంబునన్ = ఐనట్టి సద్గురువునొద్ద, వసియించి = ఉండి, స్థానాంగభావాత్మశుశ్రూషలు=అంగశుశ్రూష భావశుశ్రూష ఆత్మశుశ్రూష అనియెడు చతుర్విధశుశ్రూషలును (స్థానశుశ్రూష యనఁగా: గురువునకుఁ గల గృహక్షేత్రాదులను విచారించుట; అంగశుశ్రూష యనఁగా: నా గురువునకు అభ్యంజనము అలంకారము మొదలగునవి చేయుట; భావశుశ్రూష యనఁగా: ఆ గురువునే పరబ్రహ్మముగా భావించి ధ్యానించుట; ఆత్మశుశ్రూష యనఁగా గురువు కోరినదానిని, లేక గురువునకు నావశ్యక మగుదానిని తనశక్తిగలయంతవఱకు సంపాదించి తెచ్చియిచ్చుట.) కావించుచున్=చేయుచు, నిరంతరంబు=సర్వకాలములయందును, సేవిం...నకున్-సేవించు=సేవచేయునట్టి, మహానుభావునకున్ = మహాత్మునకు, నిరంతరాయంబుగాన్ = విఘ్నము లేకుండ, శీఘ్రకాలంబునన్=త్వరలో, నిర్గు...గున్-నిర్గుణ=సత్త్వరజస్తమోగుణములు లేనట్టి, బ్రహ్మ=పరబ్రహ్మముయొక్క, సాక్షాత్కారంబు = ప్రత్యక్షానుభవము (అనఁగా: బ్రహ్మమే తా నను ననుభవము.) అగున్=అగును, సందేహంబువలదు = సందేహము లేదు.

తా. ఈవిధముగా దినమునకు రెండుజాములకాలము యోగాభ్యాసమును జేయు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చుండిన పరిశుద్ధ మగుమనస్సుగలవానికి నాలుమాసములకు యోగసిద్ధి గలుగును. కొంత మందబుద్ధిగలవానికి సంవత్సరమునకును మిగులమూఢుఁ డగువానికి పండ్రెండుసంవత్సరములకును యోగసిద్ధి గలుగును. ఇది యోగశాస్త్రసమ్మతము. అనుభవపూర్వక మగు బ్రహ్మజ్ఞానము గలగురువు నాశ్రయించి యమ్మహాత్ముని సేవించుచు స్థాన, భావ, అంగ, శుశ్రూషలు చేయుచు భక్తియుక్తుఁడై యుండు మహాత్మునికి షణ్మాసములకంటెఁ బూర్వముననే యోగసిద్ధి కలుగుటకూడ కలదు. గురుభక్తులకు నిర్విఘ్నముగఁ దత్సిద్ధి కలుగును.

అవ. తారకయోగవ్యాఖ్యానమును ముగించి సాంఖ్యయోగవ్యాఖ్యానమున కుపోద్ఘాతముగాఁ గవి పార్వతి ప్రశ్నము నభివర్ణించుచున్నాఁడు:—

మ. అని బోధించిన నాంజనేయుఁ డు తురీయానందముంబొంది చ
య్యన సీతాలలనాశిరోమణికి సాష్టాంగ ప్రణామంబు చే
సె నటంచుఁ బరమేశ్వరుండు కృపచే శ్రీపార్వతీదేవికిన్
వినుపింప న్విని రాముఁ డేమనియె నావృత్తాంతముం జెప్పవే. 192

టీ. అని బోధించినన్=ఇట్లు బోధింపఁగా, ఆంజనేయుఁడు, తురీయానందమున్=తురీయావస్థయందు గలుగు బ్రహ్మానందమును, పొంది, చయ్యనన్ = తక్షణమే, సీతాలలనాశిరోమణికిన్ = నారీరత్నమగు సీతాదేవికి, సాష్టాంగ...బు-సాష్టాంగ = అష్టాంగయుక్తమగు, శ్లో. 'ఉరసా శిరసా దృష్ట్యా మనసా వచసా తథా, పద్భ్యాం కరాభ్యాం కర్ణాభ్యాం ప్రణామోఽష్టాంగఉచ్యతే.' 1 వక్షస్థలము, 2 లలాటము, 3 హస్తములు, 4 పాదములు, 5 చెవులు ఈ అవయవములు నేలకుసోకునట్లు నమస్కరించుటయు, 6 నేత్రములతో భక్తియుక్తముగఁ జూచుటయు, 7 మనసుతోఁ జక్కగ ధ్యానించుటయు, 8 వాక్కుతో "నమస్కారము" అని చెప్పుటయు, నీ వ్యాపారములతోఁ గూడి చేయఁబడు నమస్కారము సాష్టాంగనమస్కార మనఁబడును. ప్రణామంబు = నమస్కారము, చేసెన్, అటంచున్=అని, కృపచేన్ = దయతో, పరమేశ్వరుండు = ఈశ్వరుఁడు, శ్రీ పార్వతీదేవికిన్, వినుపింపన్=చెప్పఁగా, విని, రాముఁ డేమనియెన్= పిదప రాముఁ డేమని చెప్పెను? ఆవృత్తాంతమున్ = ఆవిషయమును, చెప్పవే = ఓ పరమేశ్వరా! నాపై దయచే నానతిమ్ము, అని యడుగుటయున్=అని పార్వతీదేవి ప్రశ్న చేయఁగానే (ఈశ్వరుఁడు రెండవయాశ్వాసమునందలివిషయమును సమాధానముగాఁ జెప్పుచున్నాఁడని శేషము.)

తా. ఈవిధముగా సీతాదేవి హనుమంతునకుఁ దారకయోగము నుపదేశింపఁగానే యామహాత్ముఁడును బరమనిష్ఠతో దాని నభ్యసించి తురీయావస్థయందలి బ్రహ్మానందము ననుభవించి యత్యంతభక్తితో సీతాదేవికి నమస్కరించెను. అని పరమేశ్వరుఁడు సర్వ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మును బోధింపఁగానే యప్పార్వతియుఁ బిదప రాముఁ డేమి చెప్పెను? దానిఁ గరుణతో నానతీయవలయునని ప్రశ్నించెను.

అవ. 193, 194, 195 పద్యములు మహాదేవాచార్యుని సంబోధనలు, ఆశ్వాసాంతమునం దిట్టిపద్యముల వ్రాసి కృతిపతిని సంబోధించుట యాంధ్రకవుల సంప్రదాయము.

చ. పరమదయాసముద్ర! గుణభద్ర! కరాంచితబోధముద్ర! భా
స్కరశతకోటిధామ! జితకామ! బుధాంబుధిసోమ! విస్ఫుర
న్నిరతిశయప్రభావ! ఘననిర్మలభావ! మహార్ద్రభావ! శం
కరహరిధాతృరూప! చిదఖండకలాప! జగత్ప్రదీపకా! 193

టీ. పరమ...ద్ర-పరమ = అధికమైన, దయా=దయకు, సముద్ర = సముద్రమువంటివాఁడా, గుణభద్ర = సద్గుణములచే మనోహరుఁడగువాఁడా, కరాం...ద్ర-కర=హస్తమునందు, అంచిత=ఒప్పుచున్న, బోధముద్ర = జ్ఞానముద్ర కలవాఁడా, (అంగుష్ఠతర్జనీసంయోగమునకు జ్ఞానముద్ర యని పేరు), భాస్క...ధామ-భాస్కరశతకోటి = శతకోటిసంఖ్య గల సూర్యులతో సమానమగు, ధామ = కాంతికలవాఁడా, జితకామ = జయించిన కామక్రోధాదులు గలవాఁడా, బుధాం...సోమ - బుధ = విద్వాంసులనియెడు, అంబుధి=సముద్రమునకు, సోమ = చంద్రునివంటివాఁడా, (విద్వాంసు లితనిని జూచి సంతోషింతురనుట.) విస్ఫు...భావ - విస్ఫురత్ = ప్రకాశించుచున్న, నిరతిశయ = తనకంటె నధికమైనది మఱి యొకటి లేని (అనఁగా: సర్వాధికమైన), ప్రభావ=సామర్థ్యము కలవాఁడా, ఘన నిర్మలభావ-ఘన = శ్రేష్ఠమైనట్టియు, నిర్మల=పరిశుద్ధమైనట్టియు, భావ = మనస్సుగలవాఁడా, మ...వ-మహా = మిగుల, ఆర్ద్ర=మృదువగు, భావ = మనస్సుగలవాఁడా, శంకరహరిధాతృరూప = రుద్రబ్రహ్మవిష్ణురూపా! చిదఖండకలాప-చిత్ =జ్ఞానమే (బ్రహ్మమే,) అఖండ = అధికమైన, కలాప=భూషణముగాఁ గలవాఁడా! జగత్ప్రదీపకా-జగత్ = లోకమును, ప్రదీపకా=ప్రకాశింపఁజేయువాఁడా!

క. జగదింద్రజాలకల్పక!, సగుణాగుణరూప! పరమ సత్యాలాపా!
నిగమాగమాంతవినుతా!, త్రిగుణాతీతస్వభావ! ధీనుతభావా! 194

టీ. జగ...క-జగత్ = ప్రపంచ మనియెడు, ఇంద్రజాల = ఇంద్రజాలమును, కల్పక=ఏర్పఱిచినవాఁడా, సగుణాగుణరూప = సగుణనిర్గుణస్వరూపా, పర...లాపా - పరమ=శ్రేష్ఠమైన, సత్య = యథార్థమైన, ఆలాపా = సంభాషణము గలవాఁడా! నిగ...నుతా-నిగమ = వేదములయొక్కయు, ఆగమ = శాస్త్రములయొక్కయు, అంత=

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అంతములయందు, వినుతా = స్తోత్రములు చేయఁబడుచున్నవాఁడా! త్రిగు...వ - త్రిగుణ=సత్త్వరజస్తమోగుణములను, అతీత = అతిక్రమించిన, స్వభావ = స్వభావము కలవాఁడా! ధీనుతభావా-ధీ=జ్ఞానముచేత, నుత=స్తోత్రము చేయఁదగిన, భావా=మనస్సు గలవాఁడా.

మాలిని:—

కలుషచయవిరామా! ఖండితాశేషకామా!
సులభసుఖవిచారా! సూరిచేతోవిహారా!
విలయజననదూరా! విశ్వరూపావికారా!
సలలితశుభకీర్తీ! సచ్చిదానందమూర్తీ! 195

టీ. కలు...రామా - కలుష = పాపముయొక్క, చయ = సమూహమునకు, విరామా=నశింపఁజేయువాఁడా! ఖండితాశేషకామా - ఖండిత = జయింపఁబడిన, అశేష కామా=సకలవిధంబులగు కామములను గలవాఁడా! సులభసుఖవిచారా-సులభ = అనాయాసముగా లభించిన, సుఖవిచారా = బ్రహ్మానందవిచారము గలవాఁడా! సూరిచేతోవిహారా - సూరి=విద్వాంసులయొక్క, చేతః=మనస్సులందు, విహారా = విహరించునట్టి వాఁడా! విలయజననదూరా-విలయ = నాశమును, జనన = పుట్టుకయు, దూర = లేని వాఁడా! విశ్వరూప = సకలప్రపంచరూపుఁడ వైనవాఁడా! అవికార=నిర్వికారుఁడా! సలలితశుభకీర్తీ-సలలిత = మనోహరమగు, శుభ=మంగళకరమగు, కీర్తీ=కీర్తి గలవాఁడా! సచ్చిదానందమూర్తీ = సత్యజ్ఞానానందస్వరూపుఁడా! (ఇవి యన్నియును గృతిపతి యగు మహాదేవగురువర్యుని సంబోధనములు. ఇట్టివాఁడ వగు నో మహాదేవాచార్యా, యీ సీతారామాంజనేయసంవాదము నాకర్ణింపుమని శేషము.)

గద్య. ఇది శ్రీమన్నారాయణమహాదేవ గురుకరుణాకటాక్షవీక్షణవిమలీకృతనిజహృదయకమలకర్ణికాంతస్సందర్శితాఖండ సచ్చిదానందరసైకస్ఫూర్తిషట్చక్ర సీతారామమూర్తి పరశురామపంతుల లింగమూర్తిగురుమూర్తిప్రణీతంబైన శ్రీసీతారామాంజనేయసంవాదం బను యోగశాస్త్రంబునందుఁ దారకయోగానుభవవిచారం బను నది ప్రథమాశ్వాసము.

టీ. ఇది, శ్రీ...మూర్తి-శ్రీమత్ = బ్రహ్మజ్ఞానయుక్తులగు, నారాయణ=నారాయణుఁ డను పేరు గలిగినట్టియు, మహాదేవగురు = మహాదేవుఁ డను పేరు గల గురువుల యొక్క, కరుణ = దయాయుక్తమైన, కటాక్షవీక్షణ = కడగంటిచూపుచేత, విమలీకృత=శుభ్రము చేయఁబడిన, నిజ=స్వకీయమైన, హృదయకమల = హృదయకమలము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యొక్క, కర్ణికాంత=లోపల, సందర్శిత=చూపఁబడిన, అఖండ=పరిపూర్ణమైన, సచ్చిదానందరస = సత్యజ్ఞానానందస్వరూపుఁ డగు పరమాత్మయొక్క, రస=ఆనందముయొక్క, ఏక=ముఖ్యమైన, స్ఫూర్తి = ప్రకాశము గలిగినట్టి, షట్చక్ర = షడాధారచక్రముల యందు విహరించుచున్న, సీతా = సీతాదేవితోఁ గూడిన (మాయాసహితుఁడగు), రామమూర్తి = రాముఁడే స్వరూపముగాఁగల, పర...మైన - పరశురామపంతుల = పరశురామపంతులు అను గృహనామముగల, లింగమూర్తి గురుమూర్తి = లింగమూర్తి గురుమూర్తి యను పేరుగల కవిచే, ప్రణీతంబైన = రచియింపఁబడిన, శ్రీ...దంబును - శ్రీ = శోభాయుక్తయైన, సీతా=సీతాదేవియొక్కయు, రామ = రామునియొక్కయు, ఆంజనేయ = హనుమంతునియొక్కయు, సంవాదంబు = సంవాదరూపమగు (లేక సీతారామాంజనేయసంవాద మను పేరుగలది.) అనుయోగశాస్త్రంబునందు = ఐన యోగశాస్త్రమందు, తార...నది-తారకయోగ = అక్షిపురుషునిగూర్చిన (లేక ప్రణవమును గూర్చిన) యోగముయొక్క, అనుభవ=అనుభవముయొక్క, విచారంబనునది = విచార మను పేరుగల, ప్రథమాశ్వాసము.

తా. ఈగ్రంథమును రచించిన కవీంద్రుఁడు లింగమూర్తి గురుమూర్తి యను పేరు గలవాఁడు, పరశురామపంతులకులమునందుఁ బుట్టినవాఁడు, అణిమాద్యష్టైశ్వర్యములతో నొప్పుమహాత్ములు, నారాయణ మహాదేవాచార్యు లను నిరువురు నీయనకు గురువులు. వారి యనుగ్రహముచే స్వానుభవపూర్వకముగ జీవబ్రహ్మైక్యజ్ఞానము గలవాఁడై యీకవి సీతారామాంజనేయసంవాదరూప మగు (యోగమాయ, పరబ్రహ్మ, జీవసంవాదరూపమగు) నీ గ్రంథమును రచించెను. ఇందు ప్రణవార్థధ్యానరూప మైన తారకయోగమును వర్ణించునట్టి ప్రథమాశ్వాసము ముగిసెను.

ఇట్లు వెన్నెలకంటి సుందరరామశర్మచే వివరింపఁబడిన సీతారామాంజనేయ సంవాద తాత్పర్యమునందు ప్రథమాశ్వాసము ముగిసెను.

ప్రథమాశ్వాసము సంపూర్ణము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీ ర స్తు.

# శ్రీసీతారామాంజనేయసంవాదము

## ద్వితీయాశ్వాసము.

అవ. రెండవయాశ్వాసమును బ్రారంభింపఁబోవుచు కవి యాంధ్ర కవుల యాచారము ననుసరించి కృతిపతిని సంబోధించుచున్నాఁడు:—



దత్తాత్రేయగురు
ప్రాదుర్భూతాపరోక్షపరమజ్ఞాన
శ్రీదయిత! మహాదేవ ! మ
హాదేవాచార్య! వినమితామరవర్యా! 1

టీ. శ్రీద...దయిత-శ్రీ=శోభాయుక్తుఁడైన, దత్తాత్రేయ=దత్తాత్రేయుఁడనెడు పేరుగల, గురు = ఆచార్యునివలన, ప్రాదుర్భూత = పుట్టిన, అపరోక్ష = ప్రత్యక్షమైన (అనఁగా: జీవునకును బ్రహ్మమునకును భేదము.), పరమ = అత్యుత్తమమైన, జ్ఞాన=జ్ఞానమనెడు (బ్రహ్మజ్ఞానమనెడు), శ్రీ=సంపదకు, దయిత=ప్రియుఁడా! (ఆశ్రయభూతుఁడైనవాఁడా!) మహాదేవ=అధికమగుకాంతిగలవాఁడా! (దివ్ జిగీషావ్యవహారద్యుతిస్తుతిమోదమద స్వప్నకాంతిగతిషు అనుధాతుపాఠమువలన దివ్ ధాతువునకు కాంతి యని యర్థము కలదు.) మహాదేవాచార్య=నాకు గురువగు నోమహాదేవయతీంద్రా! వినమిత=నమ్రులైన, అమరవర్యా = దేవతాశ్రేష్ఠులుకలవాఁడా!

తా. దత్తాత్రేయుఁ డను పేరుగల యాచార్యుని యనుగ్రహమువలన నపరోక్షబ్రహ్మజ్ఞానమును సంపాదించి ప్రత్యక్షపరబ్రహ్మరూపుఁడవై వెలుఁగొందు చున్నట్టియుం దేవతలచే నమస్కరింపఁబడునట్టియు నో మహాదేవాచార్యా!

అవ. ప్రథమాశ్వాసాంతమునఁ జేయఁబడినపార్వతీప్రశ్నమునకు నుత్తర ముపక్రమించుచున్నాఁడు:—

వ. అవధరింపుము శ్రీమహాదేవుం డమ్మహాదేవి కిట్లనియె. 2

టీ. అవధరింపుము = వినుము. మహాదేవుఁడు = ఈశ్వరుఁడు, అమ్మహాదేవికి = ప్రథమాశ్వాసాంతమునందుఁ జూపఁబడిన విధముగా ప్రశ్న జేసినపార్వతీదేవికి, ఇట్లని యెన్ = ఈ క్రింద రాఁబోవువిధముగా నుత్తరము చెప్పెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఈరెండవయాశ్వాసమునందుఁ జెప్పఁబోవువిషయమును దయతో నాకర్ణింపుము. అట్లు తారకయోగమును దెల్పఁగనె పార్వతీదేవి పరమేశ్వరుని రాముఁడుపదేశించిన విషయ మేమని ప్రశ్నఁజేసి యుండెనుగదా? దాని కీశ్వరుఁ డుత్తర మిట్లుచెప్పెను.

అవ. ఈయుత్తరమును వివరించుచున్నాఁడు:—

క. శ్రీరాముఁ డపుడు శ్రీసీ
తారామముఖంబుఁ జూచి తలయూఁచి మహా
కారుణ్యకటాక్షముచే
మారుతవరసుతునిఁ గాంచి మందస్మితుఁ డై. 3

టీ. అపుడు=సీతయుపదేశించినపిదప, శ్రీరాముఁడు=శ్రీరాముఁడు, శ్రీ...బున్-శ్రీ=శోభాయుక్తురాలైన, సీతారామ=నారీరత్న మగుసీతాదేవియొక్క, ముఖంబున్=చూచి, తలయూఁచి=నీవు చెప్పినది మేలుగ నున్నది. అని యంగీకరించి, మహా...చేన్-మహాకారుణ్య = అధికమగుదయతోఁ గూడిన, కటాక్షముచేన్=క్రీగంటిచూపుతో, మారుతవరసుతునిన్=వాయుదేవునిపుత్రుఁ డగునాంజనేయుని, కాంచి = చూచి, మందస్మితుఁడై = చిఱునగవు నగుచు.

తా. ఓపార్వతీ! అట్లు తనయాజ్ఞచే హనుమంతునకు తారకయోగము నుపదేశించిన సీతాదేవిని జూచి మెచ్చుకొని యాశ్రీరాముఁడు హనుమంతునిదెస దృష్టి సారించి చిఱునగవుతో.

అవ. సాంఖ్యయోగంబుఁ జెప్పుటకుఁ బ్రతిజ్ఞఁ జేయుచున్నాఁడు:—

తే. తెలిసెనయ్యా! సీతాదేవి దెలియఁజెప్పఁ
గలితతారకయోగప్రకార మెల్ల
నింక నీపయిఁ గరుణచే నెఱుకపఱుతు
సాంఖ్యయోగంబు విను మాప్రసంగ మనఘ! 4

టీ. అనఘ = పాపరహితుఁడా! సీతాదేవి, తెలియఁజెప్పన్ = బాగుగ బోధింపఁగా, కలి...ల్లన్ - కలిత = ఒప్పుచున్న, తారకయోగ = తారకయోగముయొక్క, ప్రకారమెల్లన్=విధాన మంతయును, తెలిసెనయ్యా=చక్కఁగ బోధపడెను. ఇంకన్ = తరువాత, నీపయిఁగరుణచేన్=నీపైనిదయచేత, సాంఖ్యయోగంబున్ = సాంఖ్యయోగమును, ఎఱుకపఱుతున్=తెలియఁజేయుదును, ఆప్రసంగమున్ = ఆవివరమును, వినుము.

తా. సీతాదేవి వివరముగఁ జెప్పిన తారకయోగ మంతయును జక్కఁగ నీకుఁ దెలిసెను గదా ? నీపై దయచే నిప్పుడు నేను సాంఖ్యయోగమును వివరింపఁబోవుచున్నాను. వినుము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. సాంఖ్యామనస్కంబు లుపనిషదర్థప్రతిపాదకంబు లందుఁ దొలుత సాంఖ్యంబు తేటపడ వివరించెద నిశ్చలచిత్తుండ వై విను మని యిట్లనియె. 5

టీ. సాంఖ్యామనస్కంబులు = ఆత్మస్వరూపమును విచారము సేయునది యని చెప్పఁబడిన సాంఖ్యయోగమును; అనుభవజ్ఞానమని చెప్పఁబడిన యమనస్కయోగమును ఈరెండును, ఉప...బులు-ఉపనిషదర్థ = ఉపనిషత్తులయొక్క యర్థమును, ప్రతిపాద కంబులు = తెలియఁజేయునవి, అందుఁ, తొలుతఁ = మొట్టమొదట, సాంఖ్యంబు= సాంఖ్యయోగమును, తేటపడఁ=స్పష్ట మగునట్లుగా, వివరించెదఁ, నిశ్చలచిత్తుండవై= ఏకాగ్రచిత్తముతో, వినుమని, ఇట్లనియెఁ.

తా. ఓహనుమంతుఁడా! సాంఖ్యామనస్కయోగములు రెండును ఉపనిషత్ తాత్పర్యమును వివరించునవి. అందు సాంఖ్యయోగమును మొట్టమొదట వివరించెదను. సావధానచిత్తుండవై వినుము అని చెప్పి ఈక్రిందివిధముగా వివరింప నుపక్రమించుచున్నాఁడు.

## పరబ్రహ్మ స్వరూపనిర్ణయము.

అవ. ఈయోగమునందు బ్రహ్మస్వరూపమును వివరించుటయే ప్రధానము గావున నధ్యారోపాపవాదన్యాయము ననుసరించి దాని ప్రకటించువాఁడై మొట్టమొదట శుద్ధ బ్రహ్మస్వరూపమును దెలియఁజేయుచున్నాఁడు:—

సీ. ఏకమై పరమై విశోకమై సత్యమలోకమై వ్యాపకాలోక మగుచు
జ్ఞానమై జగదధిష్ఠానమై ముక్తినిదానమై మాయావిహీన మగుచు
నందమై కేవలానందమై సంతతాస్పందమై శ్రుతిపద్మకంద మగుచు
సారమై చిదచిదాకారమై యతినిర్వికారమై విగతసంసార మగుచు
తే. జిలుఁగుమెలసులకలఁకలు గలిగికొనుచు
మెలఁగుప్రకృతినిఁ దగులక మిగిలి వెలుఁగు
వెలుఁగు వెలుఁగంగఁ జేయుచుఁ గలయవెలుఁగుఁ
బరమపరిపూర్ణనిర్గుణ బ్రహ్మ మనఘ! 6

టీ. అనఘ = పరిశుద్ధుఁడ వగునాంజనేయా! పర...హ్మము-పరమ = శ్రేష్ఠమైన, పరిపూర్ణ=సర్వవ్యాపకమైన, నిర్గుణ = సత్త్వాదిగుణములులేని, బ్రహ్మము=పరబ్రహ్మము, ఏకమై=తనకంటె రెండవపదార్థము లేనిదై [అనఁగా: సజాతీయవిజాతీయస్వగత భేదములులేనిదై: ఒకవృక్షమునకు మఱియొకవృక్షముతోఁ గలుగు భేదము సజాతీయ భేదము. వృక్షత్వ మనుజాతి రెంటియందును సమానమే కదా. అవృక్షమునకే రాతితోఁ గలభేదము విజాతీయభేదము. వృక్షమునం దున్న వృక్షత్వజాతికంటె పాషాణ


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మునం దున్నపాషాణత్వజాతి వేఱుకదా. ఆవృక్షమునందే యున్నపత్రపుష్పాదులలోఁ బరస్పరము గలభేదము స్వగతభేదము. పత్రత్వజాతికంటె పుష్పత్వజాతి వేఱు కావున వానికి పరస్పరము భేదముకలదు. అయినను వృక్ష మనుపదము కివి యన్నియు నర్థమే కావున నీభేదము స్వగత (తనయందేయున్న) భేదము] పరమై = ప్రపంచమున కంటె వేఱై, విశోకమై = దుఃఖము లేనిదై (పరమానందరూపమై), సత్యము=నాశము లేనిదై, అలోకమై = చూచువాఁడు చూడఁబడునది చూపు అను మొదలగు త్రిపుటులు లేనిదై (కర్త కారణము కార్యము; జ్ఞాత జ్ఞేయను జ్ఞానము; ద్రష్ట దృశ్యము దర్శనము; చేయువాఁడు చేయుసాధనము నేత ; తెలిసికొనువాఁడు తెలిసికొనఁబడు నది తెలివి; చూచువాఁడు చూడఁబడునది చూపు అను నీతొమ్మిదియుఁ కలసి ప్రపంచ మగు నని కొందఱు చెప్పుదురు. మఱికొందఱు 1. ప్రపంచప్రాణములు, 2. పంచ కర్మేంద్రియములు, 3. పంచజ్ఞానేంద్రియములు, 4. మనోబుద్ధ్యహంకారచిత్తము లనెడు నాలుగువిధములగు నంతఃకరణములు, 5. పుణ్య, పాప, మిశ్రరూపము లైన (లేక అగామిసంచితప్రారబ్ధరూపము లైన) మూఁడువిధము లగుకర్మములు, 6. జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు, 7. పంచభూతములు, 8. స్థూలశరీరము, 9. వీని కన్నిటి కిని కారణమైనయజ్ఞానము. ఈతొమ్మిదియుఁ గలసి ప్రపంచ మగునందురు. ఎట్లన్నను: ఈసర్వప్రపంచముతోను అపరబ్రహ్మమునకు సంబంధము లేదనుట ముఖ్యాంశము) వ్యాపకా...చుఁ-వ్యాపక=అంతట నిండిన, ఆలోకమగుచుఁ = (జ్ఞానమను) ప్రకాశమే స్వరూపముగాఁ గలదై, జ్ఞానమై = చేతస్వరూపమై, జగదధిష్ఠానమై = ఈప్రపంచమునకంతయుఁ నాధారమై (ప్రపంచము కలదనితోఁచుట భ్రాంతి. రజ్జుసర్పభ్రాంతి యందు రజ్జువాధారమైనట్లు జగద్భ్రాంతియందుకూడ బ్రహ్మమాధారము), ముక్తికి నిదానమై = మోక్షమునకు నాదికారణమై (బ్రహ్మజ్ఞానమువలననే కాని మోక్షము కలుగదు. కావున నిట్లు చెప్పఁబడెను,) మాయావిహీనమగుచుఁ = మాయాసంబంధము లేనిదై, అందమై=పరమానందరూప మగుటచే మనోహరమై, కేవలానందమై-కేవల = దుఃఖస్పర్శలేక నిర్మల మగు, ఆనందమై = సర్వాధిక మగునానందమే రూపముగాఁ గలదియై, సంతతాస్పందమై - సంతత = సర్వకాలమందును, అస్పందమై = నిశ్చలమై, శ్రుతిపద్మకందమగుచుఁ - శ్రుతి=వేదమనెడు, పద్మ = కమలమునకు, కందమగుచుఁ = ఉత్పత్తిస్థాన మగుగడ్డయై (ఈబ్రహ్మము నాధారము చేసికొనియే వేదములు ప్రవర్తించుచున్నవని భావము.), సారమై = విచారింపఁగా సర్వజంతువులయందును సారాంశముగ నిలుచునదియై (విచారించిన బ్రహ్మమునకంటె వేఱగువస్తువు లే దనుట) చిద చిదాకారమై=చేతనాచేతనరూపమై, అతినిర్వికారమై=పుట్టుక మొదలగు సమస్తవిధము లగువికారములును లేనిదై, నిగమ ... సంసారమగుచుఁ =

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంసారముగలదిరైై (సంసారమనఁగా నహంకారము - అది లేనిదై యనుట.), జిలు...ననుచున్-జిలుగు=ఇవి యిట్టి వనిచెప్పుటకు వీలులేని, మెలసుల=సంబంధములుగల, కలకలు=బహువిధము లగువికారములు, కలుగుకొనుచున్=పొందుచు, మెలఁగుప్రకృతిన్-మెలఁగు = సంచరించునట్టి, ప్రకృతిన్ = మాయను, తగులక = ఆశ్రయింపక, మిగిలి...గున్-మిగిలి=ఆమాయకంటె వేఱై, వెలుఁగు = ప్రకాశించునట్టి, వెలుఁగున్= చిచ్ఛక్తిని (ఇది బ్రహ్మకు స్వస్వరూపమే), వెలుఁగంగఁజేయుచున్ = ప్రకాశించునట్లు చేయుచును (అనఁగా స్వప్రకాశుఁడగుచును), కలయవెలుఁగున్ = సంపూర్ణముగ ప్రకాశించును.

తా. ఆంజనేయా! వినుము. సృష్టికిపూర్వము పరబ్రహ్మమొక్కటియే కలదు. సృష్టియనిన నామరూపములు ప్రకాశించుటయే యనియు బ్రహ్మమొక్కఁడే బహువిధములుగ (అనఁగా : బహునామరూపములతో నున్నట్లు) తోఁచుచున్నాఁడనియు నిదివఱకే చెప్పియున్నాను. ఈవిషయమునే వివరించెదను. జగత్ కారణ మగునాపరబ్రహ్మము సజాతీయ విజాతీయ స్వగతభేదములు లేనిది, ఎట్లుచూచినను త్రికాలములయందును దానికంటె వేఱగు రెండవపదార్థము లేదు. మఱియు అసత్యజడదుఃఖరూపమగు ప్రపంచమునకంటె నది భిన్నము సత్యస్వరూపమైనది, దుఃఖము లేనిది, అవయవములు లేని దగుటచేత సంకోచవికాసములు లేనిది. ఇట్లు చెప్పుటచే బ్రహ్మమునకంటె వేఱుగ బ్రపంచమున్నదని తలంపవలదు. "ప్రపంచమునకంటె వేఱు" అనఁగా "బ్రహ్మమునకుఁగల ధర్మములు ప్రపంచధర్మములకంటె వేఱు" అనుట. ఈగుఱుతులవలన బ్రహ్మమును నిర్ణయింపవచ్చునని ఇట్లు చెప్పితిమి. ఆపరబ్రహ్మముయొక్క ప్రకాశమే యంతటను వ్యాపించియున్నది.ఆబ్రహ్మము జ్ఞానరూపము.ప్రపంచమును సృజించును. పెంచును. నశింపఁజేయును. సృష్టిప్రళయములు నామరూపముల యావిర్భావతిరోభావములే యనియు ప్రపంచ మనునది బ్రహ్మభిన్నముగాఁదోఁచుట భ్రాంతియే యనియు మొట్టమొదటనే నిరూపింపఁబడినది. ఆధారములేక భ్రాంతి పుట్టదు గావున ఈ ప్రపంచభ్రాంతికి నధిష్ఠానము బ్రహ్మ. (అనఁగా : బ్రహ్మనుజూచి ప్రపంచమని తలఁచుచున్నారని తెలిసికొనవలయును). ఈభ్రాంతి తొలఁగుటయే ముక్తి కావున దానికి నీబ్రహ్మమే (అనఁగా : బ్రహ్మజ్ఞానమే) ముఖ్యసాధనము. కొందఱు బ్రహ్మమునందు మాయకలదు అందురు. అదియు యుక్తముకాదు. బ్రహ్మము ప్రకాశస్వరూపుఁడు. మాయ తమోరూపిణి. సూర్యునికిని చీఁకటికిని సంబంధములేనట్లు బ్రహ్మ మాయలకు సంబంధములేదు. ఆయన మిగుల మనోహరుఁడు. పరమానందరూపుఁడు. నిశ్చలుఁడు. శ్రుతులనియు నాయననుగూర్చియే బోధించును. కర్మలు మొదలగు ననేకవిషయములనుగూర్చి వేదము చెప్పుచున్నను దాని తాత్పర్యమును విచారించిన పరబ్రహ్మమును గూర్చియే చెప్పునది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యగును. బ్రహ్మము నెఱుంగలేనివారలకుఁ జిత్తశుద్ధి గలుగుటకై కర్మాదులు చెప్పఁబడి యున్నవి. కాని వేఱుకాదు. సర్వప్రపంచములందును సారభూతమైన దిదియే. సర్వ వ్యాపకమగుటచే జ్ఞానాజ్ఞానములు (అనఁగా : చేతనాచేతనములు రెండును బ్రహ్మము యొక్క స్వరూపములే) సాక్షియగుటచే నీయనకుఁ బ్రపంచవికారము లేవియునంటవు. ఈకారణములవల్లనే సంసారసంబంధములగు సుఖదుఃఖములతో నీయనకు సంబంధము లేదు. ప్రకృతము మనము తలంచునట్లు ఈయన సుఖికాఁడు, దుఃఖికాఁడు. మఱియు బహువిధములగు నల్లికల నల్లుకొని ప్రపంచరూపముతోనున్న మాయతో సంబంధింపక దానినిఁ బ్రకాశింపఁజేయుచున్న చిచ్ఛక్తిని (అనఁగా : జీవుని బ్రకాశింపఁజేయుచు సర్వపరిపూర్ణుండై యాబ్రహ్మమే ప్రకాశించుచున్నాఁడు.)

క. నిష్కారణము నిరీహము
నిష్కంపము నిష్క్రియంబు నిష్కల్మషముౘ్
నిష్కళము నిష్కళంకము
నైష్కర్మ్యప్రాప్యనిర్గుణబ్రహ్మ మగున్. 7

టీ. నైష్క...హ్మము-నైష్కర్మ్య = ఫలేచ్ఛలేక కర్మలఁ జేయునట్టి నిష్ఠచేత (లేక శాస్త్రోక్తముగాఁ జేయఁబడిన సన్న్యాసముచేత), ప్రాప్య = పొందఁదగిన, నిర్గుణ = సత్త్వాదిగుణరహితుఁడైన, బ్రహ్మము, నిష్కారణము = కారణములేనిదియు (అనఁగా : బ్రహ్మ మొకదానినుండి పుట్టలేదనుట),నిరీహము=మనస్సులేనందున కోర్కులులేనిదియు, నిష్కంపము = సర్వవ్యాపియగుటచేఁ జలనములేనిదియు, నిష్క్రియంబు = ఇంద్రియాదులు లేనిదగుటచేఁ గార్యములఁ జేయనిదియు, నిష్కల్మషము = (సర్వసాక్షియగుటచే నెట్టి మాలిన్యములతోను, అనఁగా పరమాణ్వాదిపరిమాణములతో నుండుట కర్మసంబంధముచే సుఖదుఃఖాదుల ననుభవించుట మాయాసంబంధముఁ గలిగియుండుట. అను మొదలగు) మాలిన్యములతో సంబంధములేనిదియు, నిష్కళము = చిత్కళలకంటె వేఱైనదియు (లేక 'కలాతు షోడశో భాగః' అను నిఘంటువువలన కలాశబ్దమునకు పదియాఱవపాలు అని యర్థము. కావున లక్షణావృత్తిచే నిష్కళ మనఁగా విభాగములు లేని యఖండస్వరూపమైనదియు అని కూడ నర్థము చెప్పవచ్చును), నిష్కళంకము = మాయ లేనిదియు, అగుౘ్=అగుచున్నది.

తా. మఱియు నాపరబ్రహ్మమునకు సత్త్వరజస్తమోగుణములుగాని చేష్టలుగాని కామక్రోధాదులుగాని, మఱియు నేవిధమగు దోషములుగాని విభాగములుకాని మాయగాని యేవిధమగు చాంచల్యముగాని లేవు. అది యొకదానివలని నొకప్పుడు పుట్టినది కాదు. భూతభవిష్యద్వర్తమానములయందు నొకటేవిధముగ నుండునది. కర్మాభిమాన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మును వదలి జ్ఞానమును సంపాదించినచో నట్టిపురుషున కది దొరకును. భేదబుద్ధి యున్నంతకాలము దాని నెఱుంగుట యశక్యము.

క. హానాదానవిహీన, జ్ఞానాజ్ఞానాతిరిక్తసత్యానంద
జ్ఞానప్రధానతజ్జని, దానాధిష్ఠాన మానిధాన మదీనా. 8

టీ. అదీనా=ధైర్యశాలివగు నోయాంజనేయా, అనిధానము = బ్రహ్మరూపమైన యానిక్షేపము, హా...నుష్ఠానము-హాన = విడచుటగాని, ఆదాన = స్వీకరించుటగాని, విహీన = లేనిదియు (ఆబ్రహ్మము సర్వప్రపంచమయము కావున పరిత్యజించుటకుఁగాని యంగీకరించుటకుఁగాని దానికంటె రెండవదియగు పదార్థమే లేదనిభావము.) జ్ఞానాజ్ఞాన=జ్ఞానమునకంటెను అజ్ఞానమునకంటెను(ఇచ్చట జ్ఞానాజ్ఞాన శబ్దములచే బ్రహ్మ ప్రతిబింబసహితములై వెలికివచ్చి విషయములఁ బ్రకాశింపఁజేయునట్టియు అట్లు చేయునట్టియుఁ చిత్తవృత్తులు చెప్పఁబడెనని తెలిసికొనవలయును.) అతిరిక్త = వేఱైనట్టిదియు, సత్య = సర్వకాలములయందును సర్వదేశములందు నొకటేరీతిగ నుండుట, ఆనంద = ఆనందము, జ్ఞాన=చైతన్యము, ప్రధాన=ముఖ్యముగాఁగలదియు, తజ్జ= ఆమూలప్రకృతి వలనఁబుట్టిన అవ్యక్త మహదహంకారాది సర్వప్రపంచమునకును, నిదాన=మూలకారణమైన జ్ఞానశక్తికి, అధిష్ఠానము = ఆధారమైనదియునై యున్నది. (ఈప్రపంచమునందు నామరూపములకంటె నితరమగు పదార్థములేదు కావునను, ఆ నామరూపములకు తత్తద్విషయకమైన జ్ఞానమునకంటె నితరమగు స్వరూపము లేకపోవుటచేతను, సర్వప్రపంచమునకును జ్ఞానమే మూలకారణమని చెప్పఁబడెను. త్రాటియందుఁ జూచు పాము యొక్క నామరూపములకు నప్పటి భ్రాంతిజ్ఞానమునకంటె భిన్నమగుస్వరూపములేనట్లు బ్రహ్మయందు తోఁచు జగమునకుఁగూడ జ్ఞానమునకంటె నన్యమగు స్వరూపములేదని తెలిసికొనవలయును. భ్రాంతి జ్ఞానముకూడ జ్ఞానమే. భ్రాంతి యనునది మనోవికారము. కావున దానివలన జ్ఞానమునకు మార్పుగలుగదు.)

తా. ఓధైర్యశాలీ! అపరబ్రహ్మము సర్వమయమగుటచే "ప్రపంచములో నీ పదార్థము బ్రహ్మముకాదు, ఈపదార్థము బ్రహ్మము" అని తిరస్కారమునకుఁగాని యంగీకారమునకుఁగాని విషయ మగునదికాదు. లోకమున వ్యవహారమునందున్న జ్ఞానాజ్ఞానములకంటె నదివేఱు. నిత్యవిజ్ఞానస్వరూపుఁడగు నాబ్రహ్మముయొక్క ప్రకాశముచేఁ బ్రకాశించుచుఁ జిత్తవృత్తులు బాహ్యాంతరవిషయములఁ బ్రకాశింపఁజేయుచుండునుఅప్పు డాచిత్తవృత్తులను మనము జ్ఞానము లనుచున్నాము. ఆచిత్తవృత్తులు జనింపనప్పుడు నిత్యవిజ్ఞానరూపుఁ డట్లేయున్నను విషయములు బ్రకాశించుట లేదని మనకు దోఁచుచున్నది. అస్థితిని యజ్ఞానమనుచున్నాము. ఇవి రెండును బ్రహ్మముకాదు. ఆయన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిత్యవిజ్ఞానరూపుఁడు ఆనందరూపుఁడు సత్యస్వరూపుఁడు. ప్రకృతివలనఁ బుట్టినదని చెప్పఁబడుచున్న ప్రపంచమునకు చిచ్ఛక్తియే మూలకారణము. సమస్త ప్రపంచమును భ్రాంతివలననే తోఁచుచున్నది కావున దానికి జ్ఞానమే స్వరూపము. ఎండమావులయందు తోఁచునీటికి భ్రాంతిజ్ఞానముఁన కంటె నితరమగు స్వరూపము లేదను ప్రత్యక్షసిద్ధమేకదా. ఇట్లు ప్రపంచమూలకారణమని సిద్ధాంతమైన జ్ఞానశక్తికిఁగూడ నిత్య విజ్ఞానస్వరూపుఁడగుటచే నాబ్రహ్మమే యాధారభూతుఁడు.

క. ప్రస్థానత్రయవేద్యుఁ డ,వస్థాత్రయసాక్షి సర్వవస్తుస్తోమాం
తస్థుం డస్థిరవిశ్వభ,వస్థిత్యంతాదిమూర్తి వాయుకుమారా! 9

టీ. వాయుకుమారా=అంజనేయా! ప్రస్థా...ద్యుఁడు-ప్రస్థానత్రయ=ఉపనిషద్గీతా బ్రహ్మసూత్రములవలన, వేద్యుఁడు = తెలియఁదగినవాఁడును, అవస్థాత్రయసాక్షి-అవస్థాత్రయ=జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలకు, సాక్షి = సాక్షియును (ఆయవస్థలయందున్న విషయములఁ బ్రకాశింపఁజేయువాఁడును),సర్వ...స్థుండు-సర్వ=సమస్తమైన, వస్తు=వస్తువులయొక్క, స్తోమ=సమూహముయొక్క, అంతస్థుండు = లోపల నున్నవాఁడును, అస్థి...మూర్తి-అస్థిర = (యథార్థమును విచారించిన) శూన్యమగు, విశ్వ = ప్రపంచముయొక్క, భవ=ఉత్పత్తికిని,స్థితి=ఉనికికిని, అంత = నాశనమునకును, ఆదిమూర్తి=కారణమైన స్వరూపముగలవాఁడును, (ప్రక్కపద్యముతో సంబంధము).

తా. వాయుపుత్రా! ఉపనిషత్తులు గీతలు బ్రహ్మసూత్రములు మఱియు నితరములగు శాస్త్రములన్నియు నాబ్రహ్మమునుగూర్చియే చెప్పును. జాగ్రత్త స్వప్నము సుషుప్తి యనుమూఁడవస్థలును అపరబ్రహ్మముచేతనే (అనఁగా: నిత్యజ్ఞానముచేతనే) మనము తెలిసికొనుచున్నాము. ఆపరమాత్ముఁడే ప్రపంచమునందలి సర్వపదార్థములయందు నేకరూపముతో నున్నాఁడు. యథార్థస్థితిలో శూన్యమైనను ఈప్రపంచము పుట్టినట్లును నిలిచి యున్నట్లును నశించినట్లును తోఁచుటకు నాబ్రహ్మమే కారణము (అనఁగా: శూన్యమయ్యును సర్పము త్రాటియందు ఉత్పత్తిస్థితి వినాశములతోఁ దోఁచిన ట్లీప్రపంచము బ్రహ్మమునందుఁ దోఁచుచున్నదనుట.)

పంచచామరము. ఇలాజలానలానిలాంబరేందుభానుమండలో
జ్జ్వలాఖిలావిలామలాత్మజాలకాంతరస్థచం
చలాచలావిలాసశూన్యసంతతాపరోక్షచి
త్కళాకలాపలాలితప్రకాశకుం డతం డగున్. 10

టీ. అతండు=అయినఆబ్రహ్మము, ఇలా...కుండు-ఇలా = భూమియొక్కయు, జల=ఉదకముయొక్కయు, అనల=అగ్నియొక్కయు, అనిల = వాయువుయొక్కయు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అంబర = ఆకాశముయొక్కయు, ఇందు = చంద్రునియొక్కయు, భాను = సూర్యుని యొక్కయు,మండల=మండలమనునట్టియు, ఉజ్జ్వల=ప్రకాశించుచున్న, అఖిల=సమస్తమైన, అఖిల = అపరిశుద్ధ (పాప) జీవులయొక్కయు, అమల = నిర్మలమైన (పరిశుద్ధ) జీవులయొక్కయు, ఆత్మ = అంతర్యామియగునట్టియు (ఇచ్చట నంతర్యామియనఁగా: ప్రత్యగాత్మ. పైనవ్రాయఁబడిన జీవపదమునకు జంతువనియర్థము. ఇదివఱకు చెప్పఁబడిన పంచభూతములును చంద్రసూర్యులును ఇప్పుడు చెప్పఁబడినజీవుఁడును కలిసి యెనిమిదియు పరమేశ్వరుని మూర్తులు), జాలక=సోరణగండ్లయొక్క, అంకరస్థ = లోపలనున్నట్టియు, చంచల=చలించునట్లు గానవచ్చునట్టియు, అచల=స్వభావముగా చంచలము కానట్టియు, అవిలాస=ప్రకాశింపకుండుట యనుధర్మముతో, శూన్య = రహితమైన (అనఁగా: చిత్తవృత్తులు జ్ఞానసహాయముచేతనే బాహ్యవస్తువులను ప్రకాశింపఁజేయుచున్నవి గావున అజ్ఞానము ప్రతివానికిని స్పష్టముగనే తెలియుచున్నదని భావము.),సంతత=సర్వవ్యాపకమైన, అపరోక్షచిత్=అపరోక్షజ్ఞానమనెడు, (అపరోక్ష మనఁగా: ప్రత్యక్షము 'అహం బ్రహ్మాస్మి' అనుజ్ఞాన మపరోక్షజ్ఞానము.) (కళా=కళలయొక్క లేక కాంతులయొక్క,) కలాప=సమూహముయొక్క (జ్ఞానమునందు భేదము లేకపోయినను చిత్తవృత్తులభేదము ననుసరించి మూఢులచే భేదములు కల్పింపఁబడుచున్నవి. బాహ్యవస్తువులఁ దెలిసికొను సమయమునందువలెనే "అహంబ్రహ్మాస్మి" అని స్వస్వరూపము నెఱుంగునప్పుడుకూడ భేదములుకల్పింపఁబడుచున్నవి. కావున "కలాకలాప" అని కవిప్రయోగించియున్నాఁడు), లాలిత=మనోహరమైన, ప్రకాశకుఁడు = ప్రకాశముగలిగించువాఁడు (అనఁగా: కాంతి సమూహమును ప్రకాశింపఁజేయువాఁడు; "అహంబ్రహ్మాస్మి" అని చిత్తవృత్తికలిగినప్పుడు సాధకునకు "చిత్తవృత్తి బాహ్యవస్తువులను ప్రకాశింపఁజేసినట్లు పరబ్రహ్మమును ప్రకాశింపఁజేయునా? లేక ఆపరబ్రహ్మమే చిత్తవృత్తిని ప్రకాశింపఁజేయునా? సర్వసాక్షి యగుపరబ్రహ్మమును చిత్తవృత్తి ప్రకాశింపఁజేయుట సంభవింపదు; ప్రకాశింపఁజేయదని చెప్పినయెడల "అహంబ్రహ్మాస్మి" అని చిత్తవృత్తి జనించుటకే వీలులేదు. కావున నిందలినిశ్చయ మెట్లు? అని సంశయము కలుగును. చిత్తవృత్తికి రెండవదానిని ప్రకాశింపఁజేయగలసామర్థ్యము నిచ్చినదికూడ పరబ్రహ్మప్రకాశమే. కావున "పరబ్రహ్మము చిత్తవృత్తిని ప్రకాశింపఁజేయునేకాని చిత్తవృత్తి పరబ్రహ్మమును ప్రకాశింపఁజేయ నేరదు. అనుటయే సిద్ధాంత మనిభావము.) అగును.

తా. పృథివ్యాపస్తేజోవాయ్వాకాశములు పుణ్యపాపమిశ్రకర్మవశగతులై దేవస్థావరమనుష్యదేహములం దున్నజీవులను సోరణగండ్లయం దాబ్రహ్మమే యున్నాఁడు. "భూమియను మొదలగు వ్యవహారము లన్నియు పరబ్రహ్మకుఁగల మాయా యుపాధులను బట్టి వచ్చినవే కాని వేఱుకాదు. మఱియు నాయన నిత్యప్రకాశస్వరూపుఁడై

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యున్నను చిత్తవృత్తులయందుఁ బ్రతిఫలించి జ్ఞానమని సర్వలోకప్రసిద్ధముగ వ్యవహరింపఁబడు చున్నను చంచలుఁడుగాఁ గానవచ్చుచున్నాఁడు. అది మనభ్రాంతియే కాని యాయనస్వరూపము కాదు. ఆమహాత్ముఁడు నిశ్చలుఁడు "అహం బ్రహ్మాస్మి" అను జ్ఞానముఁ బరబ్రహ్మముఁ బ్రకాశింపఁజేయుచున్నట్లు కానవచ్చుచున్నయది. కావున మనము వ్యవహరించుచుండు జ్ఞానము పరబ్రహ్మము కాదు అని సంశయింపవలదు. "అహంబ్రహ్మాస్మి" యనునదికూడఁ జిత్తవృత్తియే. దానియందును పరబ్రహ్మప్రకాశము కలదు. అప్పుడును నాకు 'అహం బ్రహ్మాస్మి' అనుజ్ఞానము కలిగినది అను తెలివికూడఁ గలుగుచున్నది. ఇది సాక్షిలేకున్న సంభవింపదు కదా! జ్ఞానములు రెండు కలవనుటకు వీలులేదు. కావునను సాక్షికూడ జ్ఞానస్వరూపుఁడే కావునను "అహం బ్రహ్మాస్మి" యను చిత్తవృత్తియందలి జ్ఞానమునకును సాక్షిభూతముగానున్న జ్ఞానమునకును భేదముకలుగదు. కావున సర్వప్రకాశక మగుజ్ఞానమే పరబ్రహ్మ మని తెలిసికొనుము.

క. ఆద్యుం డపరిచ్ఛేద్యుఁ డ, విద్యాధ్వాంతద్యుమణిసువిద్యాసద్యో
వేద్యుఁడు గర్కశతర్కా, భేద్యుం డనవద్యుఁ డగునభేదాత్ముఁ డజా!

టీ. అజా = జన్మరహితుఁ డగుపరబ్రహ్మమే స్వరూపముగాఁ గలయోయాంజనేయా! బ్రహ్మభేదము సర్వజీవులకు సాధారణమైనను ప్రస్తుత సందర్భము ననుసరించి యాంజనేయుని సంబోధించిరేకాని యాంజనేయునకుఁ దప్ప మఱియెవ్వరికిని యీయభేదములేదను నభిప్రాయమువలన కాదు. ఆద్యుండు=(ఆబ్రహ్మము) సృష్టి, స్థితి, సంహారము, తిరోధానము (కనఁబడకుండునట్లుచేయుట, లేక కనఁబడకపోవుట), అనుగ్రహము (సర్వభూతములును నిలుచుటకు నాధారమొసంగుట) అను నీయైదుకార్యములకును కారణభూతుఁడును బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వరసదాశివులను సృష్టికర్తలే స్వరూపముగాగలిగి వారలకుఁగూడ కారణభూతుఁడై యున్నవాఁడును.) అపరిచ్ఛేద్యుఁడు = ఇంతయనిపరిమాణమునుగల్పించుటకు శక్యముకానివాఁడును, అవిద్యాధ్వాంతద్యుమణి-అవిద్యా=అజ్ఞానమనెడు, ధ్వాంత=చీఁకటికి, ద్యుమణి=సూర్యునివంటివాఁడును (ఈయనను దెలిసికొనిన నజ్ఞానమునశించుననుట), సువిద్యా=చక్కనిజ్ఞానముచేత, సద్యః=తత్క్షణమే (స్వస్వరూపముకంటె వేఱుకానివాఁడు అగుటచే "నాకు సంసారముతో సంబంధము లేదు."అనుజ్ఞానము కలిగినవెంటనే), వేద్యుఁడు= తెలియఁదగినవాఁడును, కర్క...దు-కర్కశ=కఠినములైన, తర్క=తర్కములచే, అభేద్యుండు=భేదింపరానివాఁడును, (శ్లో. "యత్నే నానుమితోఽప్యర్థః కుశలై రనుమాతృభిః, అభియుక్తతరై శ్చాన్యై రన్యథైవోపపాద్యతే. నైషాతర్కేణ మతిరపనేయా - తర్కాప్రతిష్ఠానాత్" = "ఎంతసమర్థులైనవారు అనుమానముచేసినను ఈపరమాత్మతత్త్వమును యథార్థముగా తెలిసికొననేరరు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్రహ్మనుగుఱించిన విరుద్ధాభిప్రాయములు తర్కముచేఁ దొలంగును. బ్రహ్మవిషయమగు తర్కము ప్రవర్తింపదు" అను మొదలగు ప్రమాణముల ననుసరించిచూచిన కేవల తర్కవాదములచే పరబ్రహ్మము తెలియఁబడ దనుటయే సిద్ధాంతమని భావము.) అనవద్యుఁడు= ఏ విధములగు దోషములును లేనివాఁడును, అభేదాత్ముఁడు = జీవునితో అభేదము లేక పోవుటయే స్వరూపముగాఁ గలవాఁడును (లేక సాధ్యము సాధనము సాధకుఁడు మొదలగు భేదములు లేకపోవుటయే అనఁగా, సర్వపరిపూర్ణుఁ డగుటయే, యాకారముగాఁ గలవాఁడును), అగుక్.

తా. ఉత్పత్తివినాశములు లేనిపరబ్రహ్మస్వరూపుఁడ వగు నోయాంజనేయ! ఆబ్రహ్మమున కాద్యంతములు లేవు. ఆయన "ఇచ్చట నున్నాఁడు ఇచ్చట లేఁడు" అని చెప్పుటకు వీలు లేనివాఁడు (అనఁగా: సర్వపదార్థములయందు నొకటేవిధముగా సర్వకాలములయందు సర్వదేశములయందు నొకటే రీతిగా వ్యాపించియున్నాఁడు.) ఆయన నెఱిఁగిన నజ్ఞానము సూర్యసాన్నిధ్యమునఁ జీఁకటివలె ధ్వంసమగును. జ్ఞానముకలిగిన యుత్తరక్షణంబుననె యాయన గోచరుం డగును. అజ్ఞానమును సంపాదింపకముం దెన్ని తర్కములచే నెంతయత్నముతో విచారించినను ఆయన తెలియంబడువాఁడు కాఁడు. అద్వితీయస్వరూపుఁడు.

క. భూతానుభూతమిథ్యా, భూతద్వైతమయపంచభూతోత్థజగ
జ్జాతానుస్యూతాజా,ద్వైతాత్ముఁ డతండువాయుతనయ!మహాత్మా!

టీ. మహాత్మా-మహత్ =గొప్పది యైన, ఆత్మా=బుద్ధిగలవాఁడా, వాయుతనయ= వాయుపుత్త్రుఁడ వగునాంజనేయా, అతండు = ఆపరబ్రహ్మము, భూ...త్ముఁడు-భూత= సకలజంతువులచేతను, అనుభూత=అనుభవింపఁబడుచుండియుఁ, మిథ్యాభూత = యథార్థములుకాకుండియు నజ్ఞానమువలనఁదోఁచుచుండుటచే త్రికాలములయందునసత్యములని చెప్పఁదగిన, ద్వైతమయ = భేదరూపములైన (లేక పంచీకృత, అపంచీకృతములనెడు రెండువిధములగు భేదములుగలిగిన), పంచభూత=పంచభూతములనుండి, ఉత్థ = పుట్టిన, జగత్ =ప్రపంచములయొక్క, జాత = సమూహములయందు, అనుస్యూత = వ్యాపించి యున్నవాఁడును, శ్లో. "అస్తి భాతి ప్రియం రూపం నామచే త్యంశపంచగం, ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతోద్వయం" "ఉండుట, ప్రకాశించుట, ప్రేమింపఁబడుట, రూపము, నామము అనునీయైదంశములును ఎల్లవారికి ననుభవములో నున్నవి. ("అందు మొదటిమూఁడంశములును సత్యజ్ఞానానందస్వరూపుఁ డగుపరమాత్మనిరూపములు. తక్కిన రెండంశములును ప్రపంచముయొక్కరూపములు" (అనుప్రమాణమును బట్టి పరబ్రహ్మము తన సత్య (ఉండుట) జ్ఞాన (ప్రకాశించుట; జ్ఞానమునకంటె నితరమగుప్రకాశము లేనేలేదు.) ఆనంద (ప్రేమింపఁబడుట, సర్వజనులచేతను ప్రేమింపఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బడునది యానందమేకాని మఱేమియుం గాదు. రూపములతో ప్రపంచమునందు వ్యాపించియున్నాఁడని తెలియవచ్చుచున్నది యని భావము.) అజ=పుట్టుకలేనట్టియు, (లేక ప్రపంచరూపిణియైయున్నతనశక్తితో, "అజామేకాం" అను శ్రుతి మాయకు నజ యని పేరుగలదని చెప్పుచున్నది.) అద్వైత=భేదములేనట్టియుం, ఆత్ముఁడు=స్వరూపము గలవాఁడు, (రెండవయర్థమున బ్రహ్మమునకును దచ్ఛక్తియగు మాయకును భేదము లేదని భావము) అగును.

తా. ఓవాయుపుత్రా! సూక్ష్మబుద్ధిగలవాఁడా! వినుము. ఈప్రపంచమునందు సూక్ష్మస్థూలభేదములు లేక పరస్పరభేదములుగల పంచభూతములును మన కనుభవమునం దున్నవికదా! అవి యజ్ఞానమున్నప్పుడే తోఁచును. గావున త్రికాలములయందు నసత్యములే యగును. అజ్ఞానము (అనఁగా: నజ్ఞానకార్యములగు నహంకారంబులు) విజృంభింప సుషుప్తియందు నివికానకుండుటయే దీనికి (భూతములు త్రికాలములయందు నసత్యములు అనుటకు) ప్రత్యక్షదృష్టాంతము. శుక్తియందు రజతమువలె నజ్ఞాన మున్నప్పుడు మాత్రము తోఁచుచు నాయజ్ఞానము లేనప్పుడు తోఁపకనుండునట్టివస్తువులు ఆభాసమాత్రము తోఁచుటయేతప్ప యథార్థముగా లేనివేయని చెప్పుటలో సంశయ మేమికలదు! అట్టిపంచభూతములవలనఁ బుట్టినదియగుటచేఁ బ్రపంచముకూడ మిథ్యయే. ఈప్రపంచమునందు నామరూపములకంటె ఇతరమగుపదార్థము లేదని ఇదివఱకె చెప్పియున్నానుగదా! అట్టిప్రపంచమునందుఁగూడ నీపరబ్రహ్మము వ్యాపించియున్నాఁడు. అదియుఁ బ్రత్యక్షమే. మన కనుభవమునం దున్న ఉనికి ప్రకాశము ఆనందము "ఈప్రపంచమున్నది. ప్రకాశించుచున్నది. దీనివలన మనకాసుఖము గలుగుచున్నది." అనువ్యవహారము బ్రహ్మరూపములే. సత్యజ్ఞానానందస్వరూపుఁడగుటచేతను భ్రాంతిచేఁ బ్రపంచరూపుఁడై తోఁచుచుండుటచేతను ఆబ్రహ్మముయొక్కరూపములు ప్రపంచమునకేయున్నట్లుతోఁచుచున్నవి. ఆయన ఉత్పత్తిస్థితిప్రళయములు లేనివాఁడు. ప్రపంచకారణమని చెప్పఁబడు మాయకంటె వేఱు కాఁడు.

## భావాభావపదార్థనిర్ణయము.

క. భావాభావమయావి, ర్భావతిరోభావరహితభావుం డన్యా
భావస్వభావుఁ డతులవి,భావసుపావకసుధాంశుభా ప్రదుఁ డరయన్.

టీ. అరయన్=విచారింపఁగా (ఆబ్రహ్మము), భావా...వుండు-భావ=ద్రవ్యాది భావపదార్థము లనునట్టియు(లేక ఉండుట యనునట్టియు),అభావ=ప్రాగభావము మొదలగు నభావము లనునట్టియుం (లేక లేమి యనునట్టియుం), మయ=స్వరూపముగల, ఆవిర్భావ=ఉత్పత్తియుం (లేక ప్రకాశించుటయు), తిరోభావ=నాశమును (లేక ప్రకాశింపకుండు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టయు), రహిత = లేని, భావుండు = ఉనికిగలవాఁడును, (న్యాయశాస్త్రప్రసిద్ధములగు ద్రవ్యములు గుణములు కర్మలు జాతిభేదము నిత్యసంబంధము అనునవి భావములు.) వస్తువుపుట్టుటకు పూర్వమునందును నశించుటకు పిదపను గలుగు నభావములు రెండు. ఒక వస్తువు మఱియొకవస్తువు కాదను నభావంబును, ఒకవస్తువు బొత్తుగనే లేదనుభావంబును—ఈనాలుగు నభావపదార్థములు. వీనికిఁ గ్రమముగ ప్రాగభావ ప్రధ్వంసాభావ అత్యంతాభావ అన్యోన్యాభావములని పేరు. ఇవియన్నియు నభావములే కావున నభావరూపమగు పదార్థ మొక్కటియేయని యెన్నఁబడుచున్నది. ప్రపంచమునం దంతటను ఈద్రవ్యాది సప్తకమునకంటె భిన్నమగుపదార్థము లేదని వారి (వైశేషికుల) సిద్ధాంతము. వేదాంత మతమునందు సర్వదేశ, సర్వకాల, సర్వవస్తువులయం దుండుట భావమనియు, అట్లు లేకుండుట యభావమనియు చెప్పఁబడియున్నది. మొదటిపక్షమున నీబ్రహ్మము భావ రూపముగాఁగాని యభావరూపముగాఁగాని యుండువాఁడు కాఁడనిభావము. రెండవపక్షమున ఉండుట భావము లేకుండుట యభావము. ఈరెంటికిని ప్రకాశించుట ప్రకాశింపకుండుట యనియే యర్థము. కావున నీబ్రహ్మమున కట్టి యావిర్భావ తిరోభావములు లేవనుట (అనఁగా: సర్వకాలములయందు నొకటేవిధముగ ప్రకాశించుచు సత్తనికాని అసత్తనికాని (అనఁగా: కలదనిగాని లేదనిగాని) చెప్పుటకు వీలులేనివాఁడై యున్నాఁడు. బుద్ధికి గోచరమగు దానిని కలదనియు కానిదాని లేదనియు చెప్పుచున్నాము. ఈపర బ్రహ్మము బుద్ధికిఁగూడ సాక్షిగావున దానికి గోచరుఁడుకాఁడు. బుద్ధివృత్తి కంతర్ముఖమగు శక్తికలదు గావున గోచరుఁడు కాకను పోఁడు. కావున నాయన నేశబ్దముతోఁగూడ చెప్పుటకు వీలులేదనిభావము.) అన్యాభావస్వభావుఁడు=తనకంటె రెండవదిలేకుండుటయే స్వభావముగాఁగలవాఁడు (అద్వితీయుఁడు), అతు...డు-అతుల=లోకోత్తరతేజోరూపులైన, విభావసు=సూర్యునకును, పావక = అగ్నికిని, సుధాంశు = చంద్రునకును, భా= కాంతిని, ప్రదుండు=ఇచ్చువాఁడు.

తా. బాగుగఁ బ్రయత్నపూర్వకముగ విచారించినచో "ఉన్నవి" అని చెప్పఁబడు పదార్థములును "లేవు" అని చెప్పఁబడు పదార్థములనుగూడ నాబ్రహ్మమే. మన యింద్రియములకు గోచరమగువానిని "గలవి" అనియు నట్లుకానివానిని "లేవు" అనియుఁ జెప్పుచున్నాము. ఇంద్రియములకు సాక్షియగు బ్రహ్మవిషయమున నిం దేవిధముగాఁ గూడఁ జెప్పుటకు వీలు లేదు కదా! మఱియు, నావిర్భావ తిరోభావరూపములైన యుత్పత్తివినాశములు (అనఁగా: "పుట్టుక" యనిన యావిర్భావము; "నాశము" అనినఁ దిరోభావము. ఇవిరెండును లేనివస్తువు క్రొత్తగాఁ బుట్టుటకాని నశించుటకాని యెన్నటికిని గలుగదు) ఆయనకు లేవు. ఆయనకంటె నితరమగునది యెద్దియును లేదు. ఏకత్వమే యాయనకు స్వభావము. ప్రకాశరూపుఁ డగుటచే నాయన నాశ్రయిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చియే సూర్యచంద్రాగ్నులు ప్రకాశించుచున్నారు. లోకమును బ్రకాశింపఁ జేయు చున్నారు.

క. ఆప్తసుషుప్తవిలుప్తా, లిప్తవ్యాప్తప్రదీప్తలింగరహితసం
ప్రాప్తాప్రాప్తవిహీన,జ్ఞప్తియె సర్వప్రపంచసాక్షి మహాత్మా. 14

టీ. మహాత్మా=గొప్పబుద్ధిగలయోయాంజనేయా! ఆప్త...ప్తియె-ఆప్త=పొందఁబడిన (అనఁగా: అందఱికి ననుభవములోనున్న), సుషుప్తి = సుషుప్త్యవస్థయందు, అవిలుప్త=నశింపనిదియు, (మనస్సే సర్వవిషయములను గ్రహించుచున్నది యనియు అంతకంటె నితరమగు పదార్థమేదియును ఆమనస్సునకు మననశక్తిని గలిగించుటలేదనియుఁ దలంచుచున్నారు. సంకల్పవికల్పములే మనస్సునకు స్వరూపమనుట నిర్వివాదాంశము. సుషుప్తియందాసంకల్పవికల్పములులేవు గావున మనస్సు లేదు. అయినను నిదురనుండి మేల్కాంచినవాఁడు "నేనింతవఱకు సుఖముగనిదురించితిని" అని స్మరించుచున్నాఁడు. ఈస్మృతికి ననుభవసంస్కారము కారణమై యుండవలయునుకదా, కావున మనస్సు మొదలగునవి నశించినప్పుడేజ్ఞానము సుషుప్తిసుఖమును దెలిసికొనియెనో అదియే బ్రహ్మము అనిభావము.) అలిప్త=దేనితోను సంబంధపడనిదియు (తెలిసికొనునట్టి పదార్థము తెలియఁబడువానితో సంబంధించుననుట విరుద్ధముకదా, యని భావము), వ్యాప్త=సర్వవ్యాపకమైనదియు, ప్రదీప్త=మిగులఁ బ్రకాశించునదియు, లింగరహిత=సూక్ష్మశరీరము; లేక గుఱుతు లేనిదియు (అనఁగా: సూక్ష్మశరీరమునకు అవస్థయగు స్వాప్నావస్థలేనిదియు, లేక తనకుసాధించుటకు తగినగుఱుతులేనిదియు అనుట), సంప్రాప్త=వచ్చుట (లేక పుట్టుట), అప్రాప్త=రాకుండుట (లేక నశించుట), విహీన=లేనట్టియు (లేక కర్మవశగతమై పలుమాఱువచ్చుచుఁ బోవుచుండు స్వభావముగల స్థూలశరీరము; అనఁగా: దానికి సంబంధించిన జాగ్రదవస్థ లేనిదియు. పైనిరూపింపఁబడిన మనోవ్యతిరిక్తజ్ఞానము సుషుప్త్యవస్థయందెట్లు సర్వేంద్రియ లయమైనను స్వతంత్రముగ నాయవస్థయందలి యజ్ఞానమును దెలిసికొనియెనో అట్లే సర్వేంద్రియవ్యాపారములుగల జాగ్రదవస్థయందును మనోవ్యాపారములు మాత్రమేకల స్వాప్నావస్థయందును సకలవిషయముల స్వతంత్రముగానే గ్రహించుచున్నది. ఇంద్రియములు మొదలగునవి ఆసర్వవ్యాపకమగు జ్ఞానముయొక్క సహాయమువలననే విషయముల గ్రహించునుగాని వేఱేమియుఁకాదు. కావున జాగ్రదాద్యవస్థలెట్లు మాఱినను ఆజ్ఞానమునకు మాత్రము మార్పుకలుగదని భావము.), జ్ఞప్తియే=అయినట్టి జ్ఞానమే, సర్వప్రపంచసాక్షి = భూతభవిష్యద్వర్తమానకాలములయందలి ప్రపంచమునకంతయుఁను సాక్షియైనపరబ్రహ్మము (జాగ్రదాదులవలన జ్ఞానమునకు మార్పేమియులేదు గావునను జ్ఞానమనిన ప్రపంచముయొక్కస్థితినిఁ దెలిసికొనుచుండినట్లే యుత్పత్తివినాశములనుగూడ తెలిసికొనవలసినదగుట [illegible] అది (జ్ఞానము) నిత్యమైయుండి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తీరవలయు ననిభావము. "ప్రజ్ఞానంబ్రహ్మ" అను శ్రుతిజ్ఞానమే బ్రహ్మయని చెప్పు చున్నది. "మాసాబ్దయుగకల్పేషు గతాగమ్యే ష్వనేకధా, నోదేతి నాస్తమే త్యేకా సంవి దేషా స్వయంప్రభా" "ఒకదివసమునందలి జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలయందు జ్ఞాన మె ట్లేకరూపమైయుండునో అట్లే మాసమునందును సంవత్సరయుగకల్పములయం దునుకూడ నది [జ్ఞానము] యేకరూపముతో నుండును. భవిష్యన్మాసాదులయందువలెనే భూతమాసాదులయందు కూడ నుండును. కావున నీజ్ఞానము నిత్యము. జ్ఞానమును దెలిసి కొనుటకు మఱియొకజ్ఞానము కలదనుట విరుద్ధము కావున నది స్వప్రకాశము" అని పంచదశి చెప్పుచున్నది.

తా. ఓసూక్ష్మబుద్ధిగల యాంజనేయా! సర్వానుభవసిద్ధమైన సుషుప్త్యవస్థయందు సర్వేంద్రియములును మనసుతోఁగూడ లయమునొందినప్పుడు గలసర్వాభావము నొక జ్ఞానము తెలిసికొనుచుండునట్లు మన యనుభవములోనున్నది. దీనికి నిదురనుండి మేల్కొనిన వాఁడు నిద్రయందలి చిత్తాభావమును స్మరించుటయే దృష్టాంతము. అనుభవము లేక స్మృతికలుగదు కదా! కావున నయ్యనుభవమునకుఁ గారణమగుజ్ఞాన మెద్దియో యదియే బ్రహ్మము. అది సర్వసాక్షి యగుటచే దృశ్యములగు పదార్థములతో సంబంధింపదు. చూచునది చూడఁబడువానికంటె వేఱుగా నుండితీరవలయుననుట నియమముకదా! ఈ విధముగనే యాబ్రహ్మమునకు స్వప్నజాగ్రదవస్థలతోఁగూడ సంబంధములేదు. ఇంద్రి యాదులు లేనప్పుడుకూడ సర్వమును గ్రహింపఁగలజ్ఞాన మొకటియున్నదని సిద్ధాంత మయ్యెను. కావున నింద్రియాదు లున్నపుడుకూడ నాజ్ఞానమే సర్వమును గ్రహించు చున్నదని సిద్ధాంతముచేయుట మిగుల యుక్తియుక్తమై యుండును. వేఱువేఱు లక్షణ ముల నిరూపించుటకు వీలు లేనప్పుడు "జ్ఞానములు రెండు లేక ననేకములు కలవు" అని చెప్పుటకంటె విరోధము వేఱొకటి యుండునా? కావున జ్ఞానమొక్కటియే తనశక్తిచే నింద్రియచిత్తంబులఁబ్రకాశింపఁజేయుచు నితర సహాయములేక స్వయముగా ప్రకాశించు చున్నది. ఆజ్ఞానమే బ్రహ్మము. దానికి నుత్పత్తియు వినాశంబునులేవు. స్థూలసూక్ష్మ కారణశరీరంబులతో సంబంధములేదు. అది నిర్గుణమగుటచేతను యద్వితీయ మగుట చేతను దాని ననుమానప్రమాణముచే నూహించుటకు గుఱుతు లేవియును లేవు.

అప. బ్రహ్మమునకంటె నితరమగుపదార్థము లేదంటిరి కదా! మన యనుభవములో సంసారి యగుజీవుఁడు బ్రహ్మమునకంటె విరుద్ధలక్షణములు గలవాఁడుగాను ఈకారణము వలననే యాయనకంటె వేఱుగాను కానవచ్చుచున్నాఁడు. మాయకును ఆబ్రహ్మమున కును భేదములేదంటిరి కావున మీతో జన్యమగుప్రపంచము ఆయనకంటె వేఱుకాక పోవచ్చునుగాని జీవుఁడుమాత్ర మట్లగుటకు వీలులేదు. ఇతఁడు చేతనస్వరూపుఁడు కావున మాయాకార్యము కానేరఁడు. పరబ్రహ్మముయొక్క రూపభేదమే యాతఁడనుట సంభ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వింపదు. ఇతఁడు, సంసారి, సుఖి, దుఃఖి ఆబ్రహ్మము నిర్వికారుండు కదా! వీరిరువురికి నైక్య మెట్లు కుదురును? అనినఁ జెప్పుచున్నాఁడు:—

క. వ్యక్తం బవ్యక్తాది, వ్యక్తావ్యక్తాతిరిక్తమగు బ్రహ్మము దాఁ
బ్రాక్తనుకృతభాక్తనుయుత,భోక్తనుసతతంబుసాక్షిపోలికఁజూచున్.

టీ. అవ్య...ము-అవ్యక్తాది=అవ్యక్తమను ప్రకృతియేకారణముగాఁగల, వ్యక్త=స్థూల మగుటచే స్పష్టమైనట్టియు, అవ్యక్త = సూక్ష్మ మగుటచే నస్పష్టమైనట్టియు పంచభూతమహదహంకారాదులకంటె, అతిరిక్త=వేఱు, అగు,బ్రహ్మము = అయినట్టిబ్రహ్మము, వ్యక్తంబు = స్పష్టముగనున్నది. (జ్ఞానులకు సుఖముగఁ దెలియవచ్చుననుట) తాన్ = ఆబ్రహ్మము స్వయముగా, ప్రాక్త...క్తను-ప్రాక్ = మునుపటి, తను = శరీరమునందు, కృత = చేయఁబడినకర్మలను, భాక్ = పొందిన, తను = ప్రస్తుతశరీరముతో, యుత = కూడిన, భోక్తను = సుఖదుఃఖములను అనుభవించు (అనఁగా "నాకు సుఖదుఃఖములు కలవు" అని యభిమానించు) జీవుని, సతతంబు = ఎల్లప్పుడును, సాక్షిపోలికన్ = సాక్షియట్లు (ఆజీవుఁడు యథార్థస్థితిలో తనకంటె వేఱుకాకున్నను కల్పితభేదము కలదు కావున నాభేదము నాశ్రయించి జీవోపాధియగునంతఃకరణములకుఁ గలుగుసుఖదుఃఖానుభవములను చూచు ననియు "ఈసుఖాదు లంతఃకరణములకుఁ గలుగుచున్నవి." అనియుఁ దెలిసికొనలేకపోవుటచే జీవుఁడు తాను సుఖియనియు బ్రహ్మసాక్షియనియు తలంచు ననియును భావము) చూచున్.

తా. ఈప్రపంచము మాయవలనఁ బుట్టినది. సూక్ష్మస్థూలభేదములతో నున్నది. కావున నొకయంశమున నింద్రియములకు గోచరమగుచు మఱియొక యంశమున నట్లుగాకయున్నది. బ్రహ్మమునకంటెఁ బ్రపంచము వేఱుకాదు కాని బ్రహ్మము మాత్రము ఆభాసమాత్ర మగుప్రపంచమునకంటె వేఱు. భ్రాంతివలన త్రాటియందుఁ బాము తోఁచినప్పుడు ఆత్రాడుకంటె దానియందుఁ దోఁచినపాము వేఱుకాదు; కాని భ్రాంతిసిద్ధమగు పాములకంటె త్రాడు వేఱనుటకు సంశయము లేదు కదా! మఱియు బ్రహ్మము సాక్షియగుటచేఁ బ్రపంచముకంటె వేఱుగానుండియే తీరవలయును. ద్రష్టయు దృశ్యంబు నొక్కటి యగుట సంభవింపదుకదా! ఈవిషయము (అనఁగా: "బ్రహ్మము ప్రపంచమునకంటె వేఱుగా నున్నాఁడు" అనువిషయము) మనకుఁ బ్రత్యక్షానుభవమునందే యున్నది. ఈసర్వప్రపంచమును మనము తెలిసికొనుచుండుటయే దీనికి దృష్టాంతము. జీవుఁడును బ్రహ్మముయొక్క రూపభేదమే. అయినను అవిద్యావిజృంభణమునకు (అనఁగా: అవిద్యావరణమునకు) లోఁబడినవాఁడు కావున శరీరాదులయందు "నేను" అను నభిమానము గలిగియున్నాఁడు. అంతఃకరణాదులకుఁ గలుగుసుఖదుఃఖములను దనవానిగా భావించుచున్నాఁడు. ఈ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కారణమువలన శరీరాభిమానయుక్తుఁడై కర్మలను జేయుచు సుఖదుఃఖాభిమాన యుక్తుఁడై యాకర్మఫలముల ననుభవించుచు (అనఁగా "నేనే కర్మలఁ జేయుచున్నాను. వానిఫలముల ననుభవించుచున్నాను" అని యభిమానించుచు) శుద్ధ బ్రహ్మమును దన కంటె వేఱుగాను తనను సాక్షియై చూచుచుండువానినిగాను తలంచుచున్నాఁడు. ఇట్లు అవిద్యాకల్పిత భేదమువలన జీవబ్రహ్మములు భిన్నులుగాఁ దోఁచుచున్నారే కాని యథార్థస్థితిలో వారిరువురు నొక్కటియే.

అవ. పై జెప్పినవిషయము ననుభవసిద్ధముగ నిరూపించుచున్నాఁడు:—

తే. జాగ్రదాదివినిగ్రహానుగ్రహాప్ర
 తిగ్రహాసమగ్రజాగరూకాగ్రహోగ్ర
 విగ్రహాత్యగ్రసాభాసవిశ్వహేతు
 ధీప్రకాశకుఁ డతఁడె సందేహ మేల. 16

టీ. జాగ్రదా...కుఁడు - జాగ్రదాది = జాగ్రత మొదలగు మూఁడవస్థల యొక్క, వినిగ్రహ=నాశమునందును, అనుగ్రహ = ఉత్పత్తియందును, ప్రతిగ్రహ = స్థితియందును, సమగ్రజాగరూక = మిగులజాగ్రతగలిగి (అనఁగా: సత్వమయమైన), ఆగ్రహ = క్రోధరూపరజోగుణమయ మైన, ఉగ్ర = భయంకరమగు తమోగుణమయ మైన, విగ్రహ=స్వరూపముగలిగి (నట్టియు), అత్యగ్ర=సర్వాధికమై (నట్టియు), సాభా స-స=మూలప్రకృతియొక్క (హంసమంత్రార్థమును వివరించునప్పుడు సకారమునకు ప్రకృతి యని యర్థము చెప్పఁబడియున్నది.) ఆభాస=ప్రతిబింబమైన [లేక పరిణామ మైన, లేక, సాభాస=స్వ (బ్రహ్మ) ప్రతిబింబముతోఁగూడిన,] విశ్వ=ప్రపంచమునకు (అనఁగా: ప్రపంచసృష్టిస్థితిలయములకు, లేక ప్రపంచరూపిణియగు మాయకు అనఁగా: మాయాకార్యమునకు), హేతు=కారణమైన, ధీ=బుద్ధిని (అనఁగా మహత్తత్త్వమును "బుద్ధేర్జాగరణం స్వప్నం సుషుప్తిరితి వృత్తయః" అను ప్రమాణముచే నవస్థాత్రయరూప మగు ప్రపంచమునకు బుద్ధియేకారణము. లేక సృష్టిసంకల్ప మని చెప్పఁబడు చిచ్ఛక్తిని), ప్రకాశకుఁడు=ప్రకాశింపఁజేయువాఁడు, అతండె = ఆబ్రహ్మమే, సందేహమేల.

తా. జాగ్రదాద్యవస్థల మూఁటిని దెలియనివార లెవ్వరును లేరు. ఆయవస్థలు పుట్టుటకును నిలుచుటకును నశించుటకును బుద్ధియే కారణము. మఱియు జ్ఞానరూప మగుటచే జాగ్రదవస్థ సత్త్వమయము. మనోమాత్రమువలనఁ బుట్టునది యగుటచే స్వప్నావస్థ రజోగుణమయము. అజ్ఞానరూపమగుటచే సుషుప్త్యవస్థ తమోగుణమయము. బుద్ధియుఁ ద్రిగుణరూపిణి కావున నీయవస్థలకు నదియే కారణము. మనయనుభవ ములో నున్నంతవఱకు మాయ. (అనఁగా: బుద్ధియని చెప్పవచ్చును.) ప్రపంచమునకుఁ గూడ పైనిరూపింపఁబడిన యవస్థలకంటె నితరమగురూపము లేనందున నీబుద్ధియేప్రపంచ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కారణ మని కూడ ననవచ్చును. దీనియందు ప్రతిబింబించిన (అనఁగా: బాహ్య విషయముల నాంతరవిషయములఁ బ్రకాశింపఁజేయుచున్న; దీని వృత్తులయందుఁ బ్రతిబింబించిన బ్రహ్మమె జీవుఁ డనఁబడుచున్నాఁడు. అట్టి బ్రహ్మప్రతిబింబముతోఁ గూడిన) చిత్తవృత్తిని మనము జ్ఞానమనుచున్నాము. ఆజ్ఞానముచే విషయములు గ్రహింపఁబడుచున్న వనువిషయముకూడ మనసునకు గోచరమగుచునే యున్నదనుట యనుభవసిద్ధము. "నేనా గానమును వింటిని" అను మొదలగు వ్యవహారము లీవిషయమున దృష్టాంతములు. "గానమును వింటిని" అనఁగా: శ్రోత్రరూప మగు బుద్ధివృత్తిచే (శ్రోత్రేంద్రియమూలమునఁ బ్రసరించినజ్ఞానముచే) గానము ప్రకాశింపఁజేయఁబడినది. అనుటయే కదా! కావున నేపదార్థమునకు నీబుద్ధి వృత్తులు (జ్ఞానములు) గోచరములగుచున్నవో ఆపదార్థములు పరబ్రహ్మము అని నిశ్చయించుకొనుము. ఇంతయనుభవసిద్ధమగువిషయమున సంశయ మేటికి?

అవ. పై నిరూపింపఁబడిన యనుభవమునే వివరించుచున్నాఁడను:—

ఆ. ఇదియు నదియు నట్టి దిట్టి దింతంతని
పలుకరాని దెద్ది బ్రహ్మ మదియె
యిదియు నదియు నట్టి దిట్టి దింతంతని
యరయు తెలివి యదియె యవియు నదియె. 17

టీ. ఇదియుఁ = ఎదుట ప్రత్యక్ష మగుచున్నది యనికాని, అదియుఁ = పరోక్షమని (అనఁగా ప్రపంచ మని కాని ప్రపంచమున కతీత మని) కాని, అట్టిది = గుణరహితమైన దని కాని (లేక నిరూపించుట శక్యమైన దనికాని), ఇట్టిది= గుణసహిత మైనదని కాని (లేక నిరూపించుటకు నశక్యమైన దనికాని), ఇంత = మనచే పరిమితి చెప్పఁదగినదనికాని, అంత = పరిమితి చెప్పఁదగదనికాని, అని, పలుకరానిదెద్ది = దేనినిఁగూర్చి చెప్పుటకు వీలులేదో, అదియే = అదే, బ్రహ్మము = పరబ్రహ్మము (అనఁగా: పరబ్రహ్మ మింద్రియములకుఁ గాని మనస్సునకుఁ గాని గోచరము కాని దగుటచే నాయననుగూర్చి యేమియుఁ జెప్పుటకు వీలు లేదని భావము.), ఇదియుఁ = ఈప్రపంచము కానవచ్చుచున్నది. అదియుఁ = ఆబ్రహ్మము కానవచ్చుటలేదు, అట్టిది = ఆపరబ్రహ్మము నిర్వికారమైనది, ఇట్టిది = ఈప్రపంచము సవికారమైనది, ఇంత=ఈప్రపంచమునకు పరిమితి చెప్పఁగలము, అంత=ఆబ్రహ్మమునకు పరిమితి చెప్ప నేరము. అని, అరయుఁ=విచారించునట్టి, తెలివి=జ్ఞానముకూడ, అదియే = ఆ పరబ్రహ్మమే, అవియుఁ=ప్రత్యక్షమని చెప్పఁబడుచున్న ప్రపంచంబును ప్రత్యక్షము కాదని చెప్పఁబడుచున్న పరాత్పరుఁడును కూడ, అదియే=ఆపరబ్రహ్మమే.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఇట్లు చెప్పినను "ఆబ్రహ్మ మెట్టిది" అని నిరూపించుటకు వీలు లేకున్నది యని యనియెదవేమో వినుము. నీకంటె నది భిన్నమై సర్వవ్యాపకముగాక యేదియో యొక ప్రదేశమున మాత్ర ముండునదియై యుండునేని యప్పుడు కనఁబడుచున్నదని కాని కనఁబడుట లేదనికాని ఇంత పరిమాణముగలదియనికాని చెప్పఁబడవచ్చును. గుణములుకాని పనులుకాని జాతికాని కలదైనచో నేదియైన నొకవిశేషము నాశ్రయించి "అది ఇట్టిది, ఇట్టిది కాదు" అని చెప్పవచ్చును. లోకమునజరుగు వ్యవహారములన్నియుఁ గుణ క్రియాజాతుల నాశ్రయించినవే కదా. ఈబ్రహ్మ మట్టిది కాదు. దానికంటె భిన్నమగు వస్తువేలేదు. కావున దానిని నిరూపించువారెవ్వరు? దాని నెట్లును నిరూపించుటకు వీలులేకున్నను నొకవిధముగాఁ దెలిసికొనవచ్చును. అది యాత్మయే యగుట యొక ప్రబలసాధనము. ఈ ప్రపంచమునందలి పదార్థముల నన్నింటిని మనము ప్రత్యేకముగా విభాగించి "ఇది ఇట్టిది. అది యట్టిది. ఇది కానవచ్చుచున్నది. అది కానవచ్చుటలేదు. దీనిప్రమాణ మింత దానిప్రమాణ మంత" అని తెలిసికొనుచున్నాము. ఈకార్యమింద్రియములచేతఁగాని మనసుచేతఁగాని కాదనియుఁ సుషుప్త్యవస్థయందు నెవ్వఁడు సర్వాభావము నెఱుఁగుచున్నాఁడో వాఁడే జాగ్రత్స్వప్నములయందుఁగూడఁ జిత్తేంద్రియములమూలమున సర్వముఁ బ్రకాశింపఁజేయుచున్నాఁడనియుఁ నింతకుముందే నిరూపించియున్నాను. కావున నేజ్ఞానరూపుఁడు సర్వప్రపంచమును విభాగించి యెఱుఁగుచున్నాఁడో వాఁడే బ్రహ్మము. వాఁడే నీవు."నేను" అనుపదమున కర్థమును విచారించిన "జ్ఞానము" అనియె యేర్పడును. జ్ఞానభిన్నములగు సర్వపదార్థములును జడములె కావున "నేను" అను పదమునకు నాపదార్థములలో నేదియైన నర్థమైనచో మనకుఁ బ్రత్యక్షానుభవములోనున్న చేతనత్వమే యభావము కావలసివచ్చును. ఇట్లు చెప్పుటవలన బ్రహ్మమునకంటెఁ బ్రపంచముకూడా వేఱు కావలయునందువేమో వినుము. పైన (15-వ పద్యమునందు) నిరూపింపఁబడినట్లు ప్రపంచబ్రహ్మలకు కల్పితభేదంబును వాస్తవమగు నభేదంబును కలదు. కావున జ్ఞాన జ్ఞేయరూపమగు భేదము కానవచ్చినను పరమార్థస్థితిలో బ్రహ్మమునకంటెఁ బ్రపంచము వేఱుకాదు. త్రాటియందుఁ దోఁచు పామునకు భ్రాంతిజ్ఞానమునకంటె భిన్నమగుస్వరూపము లేనట్లు ప్రపంచమునకుఁగూడ (భ్రాంతి) జ్ఞానమునకంటె భిన్నమగుస్వరూపము లేదు.

అవ. ఇట్లు బ్రహ్మస్వరూపమును నిర్ణయించి సృష్టిక్రమమును జెప్పుచున్నాఁడు:—

తే. అట్టిపరిపూర్ణతత్త్వమైనట్టినేను
బూర్వకల్పాంతమున నీయపూర్వవిశ్వ
జననమునకంటె ముందు నిరంజనుఁడ నగుచు
నద్వయుఁడనై వెలుంగుదు నాంజనేయ! 18

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ఆంజనేయ ! అట్టి... నేను-అట్టి=పైన వర్ణింపఁబడినట్టి, పరిపూర్ణ = సర్వవ్యాపకమైన, తత్త్వమైనట్టి నేను = పరమార్థమైన నేను (రాముఁడు), పూ...నన్-పూర్వ=మునుపటి, కల్ప=ప్రళయముయొక్క, అంతమునన్ = కడపట, ఈ...టన్-ఈ=ప్రస్తుతమునందున్న, అపూర్వ=నూతనమగు, విశ్వ=ప్రపంచముయొక్క, జననమునకంటెన్=పుట్టుటకంటె (అనఁగా : ఇంతకుముందున్న ప్రపంచము నశించినపిదప ప్రస్తుత ప్రపంచము జనింపకముందు), మును=ముందు, నిరంజనుండగుచున్ = ఏవిధమగు కల్మషము లేనివాఁడనగుచు(లేక స్వప్రకాశుఁడనగుచు), అద్వయుఁడనై=ఏకస్వరూపుఁడనై, వెలుంగుదున్=ప్రకాశించుచుందును.

తా. ఓ యాంజనేయా ! యిట్లు నిర్వికారుఁడనైయున్న నాయందుఁ బ్రపంచము జనించినవిధమును వినుము. ఈప్రపంచ మనాది కావున "మొట్టమొదటిసృష్టి" యని యొక్కటిలేదు. ప్రతికల్పమునకును దుదియందు ఈజగము నశించుటయు మరలఁ బుట్టుటయుఁ గలదు. కావున వర్తమానకల్పమునందలి ప్రపంచముయొక్క యుత్పత్తిని గూర్చి చెప్పెదను. దీనివలననే సర్వము నూహించుకొనుము. సృష్టికిఁ బూర్వమున నేను (శ్రీరాముఁడు) శుద్ధస్వరూపముతోఁ బ్రకాశించుచుందును.

## మాయాస్వరూపనిర్ణయము.

తే. అట్టి నాయం దనాదిగా నాత్మశక్తి
యలరు నవ్యక్తమయి జగదాది యగుచుఁ
గలితమృత్తికయం దున్న కలశశక్తి
యేర్పడక కుంభహేతువై యెనసినట్లు. 19

టీ. అట్టినాయందున్=అటువంటినాయందు, కలి...యందున్-కలిత = ఒప్పుచున్న, మృత్తికయందున్=మట్టియందు, ఉన్న...శక్తి-ఉన్న=ఉండునట్టి, కలశశక్తి=కుండయగునట్టిశక్తి, ఏర్పడక = ప్రత్యేకముగా తెలిసికొనుటకు శక్యముగాక, కుంభహేతువై=కుండకు కారణమై, ఎనసినట్లు = ఉన్నట్లు, అనాదిగాన్ = మొదలులేకుండ, అవ్యక్తమై=విభజించుటకు వీలుగానిదై, జగదాదియగుచున్=ప్రపంచమునకు (అనఁగాఁ బ్రపంచోత్పత్తికి) కారణమగుచు, ఆత్మశక్తి-ఆత్మ=నాయొక్క, శక్తి, అలరున్=ప్రకాశించుచున్నది.

తా. నే నెప్పటికిని నిర్వికారుండనే యైనను భ్రాంతివలన నాకుఁ బ్రపంచసంబంధము కలదని తలంచుచున్నావు. కావున నీకు స్పష్టముగాఁ దెలియఁజేయుటకై 'సృష్టికిఁ బూర్వమున నిర్వికారుండనై యుందును' అని చెప్పితిని. దీనివలన క్షోభము నొందకుము. సృష్టిక్రమమును వినుము. ఈసృష్టికి మాయయేకారణము. అదియు ననాదియే, కుండగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నేర్పడునట్టి సామర్థ్యము మట్టియందేయుండి మట్టికంటె వేఱుగాకయున్నట్లదియును నాకంటె వేఱుగాక నాయందేయున్నది.

సీ. వటబీజమున మహావటమహీరుహశక్తి
యుజ్జ్వలవహ్నియం దుష్ణశక్తి
యింద్రజాలకునియం దెపుడు మాయాశక్తి
కలితోపలములందుఁ గఠినశక్తి
సలిలజాతమునందు సలలితద్రవశక్తి
పవనంబునం దతిస్పందశక్తి
పౌరిశుక్లశోణితంబులయందుఁదనుశక్తి
తగుశరీరములఁ జైతన్యశక్తి
తే. దనరి యవ్యక్తమగుచుఁ దత్తన్నిదాన
మై యధిష్ఠానమునకంటె ననితరంబు
నగుపగిది నొప్పు నాయందు నాత్మశక్తి
యేర్పడక యన్యమై విశ్వహేతు వగుచు. 20

టీ. వటబీజమునన్=మఱ్ఱివిత్తనమందు, మహా...శక్తి-మహాత్=గొప్పదైన, వట మహీరుహ=మఱ్ఱిచెట్టును కలుగచేయు, శక్తి = సామర్థ్యమును, ఉజ్జ్వ...యందున్-ఉజ్జ్వల=జ్వలించుచుండు, వహ్నియందున్=అగ్నియందు, ఉష్ణ=వేడిగానుండు, శక్తి= సామర్థ్యమును, ఇంద్రజాలకునియందున్=ఇంద్రజాలముఁ జేయువానియందు, ఎపుడు= సర్వకాలములయందును, మాయాశక్తి-మాయా=ఒకపదార్థమును మఱియొకపదార్థముగాఁ గనుపఱుపఁగల, శక్తి=సామర్థ్యమును, కలి...లందున్-కలిత = ఒప్పుచున్న, ఉపలము లందున్=రాళ్లయందు, కఠినశక్తి=కఠినముగా నుండునట్టి సామర్థ్యమును, సలిలజాతము నందున్ = నీటియందు, సలలితద్రవశక్తి-సలలిత = స్వభావసిద్ధమైన (సాంసిద్ధికమైన), ద్రవశక్తి=పలుచగానుండు సామర్థ్యమును, పవనంబునందున్=వాయువునందు, అతి... శక్తి-అతి=మిగుల, స్పంద=చలించు, శక్తి=సామర్థ్యమును, పౌరిన్=మిగుల, శుక్లశోణి తంబులయందున్=శుక్లశోణితములందు, తనుశక్తి=శరీరమును కలిగించు సామర్థ్యమును, తగు...లన్-తగు=ఒప్పిదములైన, శరీరములన్=శరీరములయందు, చైతన్యశక్తి=చేష్టలు చేయునట్టి సామర్థ్యమును, తనరి=ఒప్పి, అవ్యక్తమగుచున్ = విభాగించుటకు వీలులేక, తత్తన్నిదానమై=ఆయాకార్యములకు కారణమై, అధిష్ఠానమునకంటెన్=తన కాధారము లైన వటబీజాదులకంటె, అనితరంబగుపగిదిన్=వేఱుగానట్లు, నాయందున్, ఆత్మశక్తి= ప్రపంచనిర్మాణహేతువగు మూలప్రకృతి, ఏర్పడక = నాకంటె వేఱని నిరూపించు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టకు శక్యముకానిదై, అన్యమై = వేఱుగాతోఁచుచు, విశ్వహేతువగుచున్ = ప్రపంచమునకుఁ గారణమై (ప్రపంచసృష్టిచే బ్రహ్మమునకంటె వేఱుగా నున్నట్లు కానవచ్చునదియై యనుట), ఒప్పున్ =అలరారుచున్నది.

తా. మఱ్ఱివిత్తనమునందు మిగుల గొప్పదియగు మఱ్ఱిచెట్టును గలిగించు శక్తి కలదు. అగ్నియందు వేడిగానుండునట్టి సామర్థ్యముకలదు. ఇంద్రజాలము నేయువాని యందు సభికుల మోసగించునట్టి శక్తికలదు. రాళ్లయందు కఠినముగానుండు శక్తికలదు. నీటియందు పలుచగానుండు సామర్థ్యముకలదు. వాయువునందుఁ జలించునట్టి శక్తికలదు. శుక్రశోణితములయందు శరీరమునుఁ గలిగించు శక్తియున్నది. శరీరములందు చేష్టల జేయుఁ సామర్థ్యముకలదు. ఈ శక్తులన్నియు నీ స్థలములయాదుండుట యనుభవ సిద్ధమేకదా. ఇవి తమకాశ్రయభూతములగు వటబీజాదులకంటె వేఱుగాఁ గానవచ్చుట లేదు. అట్లున్నను వటవృక్షమును బుట్టించుట మొదలగు కార్యములను జేయుచునే యున్నవికదా! వటబీజాదులకంటె వేఱుగాఁ గానరాకుండుటచే వీనికిని వటబీజాదుల కును భేదము లేదనవలయును. కార్యములవలన భేదము కల దనవలయును కదా! ఇట్లు ఆ మాయాశక్తియుఁ నాయందున్నది. నాకంటె వేఱనికాని వేఱు కాదనికాని చెప్పఁబడు టకు వీలులేకున్నది. ప్రపంచమును బుట్టించుచున్నది.

అవ. పరబ్రహ్మమునందు మాయ యొకటి కలదనుట విరుద్ధముకదా! ఆయన యద్వితీయుఁ డని చెప్పియున్నారు. దానికి విరోధము వచ్చును కదా? యనిన సమా ధానముఁ జెప్పుచున్నాఁడు:—

సీ. సత్తుగా దాత్మవిజ్ఞానంబుచే నెం దభావమై బాధింపఁబడుటవలన
నెలమి నసత్తు గా దేనజ్ఞుఁడ నటంచు నజ్ఞానభూతమైయలరు చునికి
సదసత్తు గాదు విచారింపలే దట్టి ద్రవ్యంబు గడు విరుద్ధంబు గాన
నిరవయవముగాదునిఖిలజగత్స్వరూపముచేతమిగుల నేర్పడుటవలన
తే. సావయవమును గాదు దృశ్యము సుషుప్తి
యం దడంగినఁ దాను శూన్యంబు గామి
నొనర నుభయాత్మకముగా దయుక్తమగుట
నాంజనేయ మదీయమాయాతమంబు. 21

టీ. ఆంజనేయ, మదీయమాయాతమంబు-మదీయ = నాసంబంధమైన, మాయా= 'మాయ' యనెడు, తమంబు = చీఁకటి (చీఁకటివలె ఆవరించునది కావున), ఆత్మవిజ్ఞా నంబుచేన్ =బ్రహ్మానుభవముచేత, ఎందున్ =ఎచ్చటను, అభావమయి = లేనిదై, బాధింపఁ బడుటవలనన్ = నశింపఁజేయఁబడుటవలన [వినాశము రెండువిధములు, ప్రత్యక్షములగు పదార్థముల విఱిచి కాని కాల్చి కాని మఱియు నేకార్యముచేత నైనఁ గాని నశింపఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జేయుట మొదటిది. దీనికి 'ధ్వంస' మని పేరు. భ్రాంతిచే నొకవస్తువును మఱియొక వస్తువుగా గ్రహించి పిదప జ్ఞానముచే నిజస్వభావమును గ్రహించుటచే భ్రాంతి సిద్ధమైన వస్తువునకు కలుగునాశనము రెండవది. దీనికి 'బాధ' యని పేరు. బ్రహ్మజ్ఞానమువలన మాయకుఁ గలుగునాశన మిట్టిదియే (అనఁగా 'బాధయే') అని తెలిసికొనవలెను.] సత్తుగాదు=యథార్థముగా నున్నదనుటకు వీలు లేదు. (యథార్థ మగు వస్తువుకు 'బాధ' లేదు గదా), ఎలమిన్=ప్రీతితో, ఏనజ్ఞుఁడనటంచున్ = నేను 'అజ్ఞాని'ని అను వ్యవహారము లోకమున నుంచుటచే, అజ్ఞానభూతమై=అజ్ఞానస్వరూపముతో, అలరుచునికిన్=ఉండుట వలన, అసత్తుగాదు=లేదని చెప్పుటకును వీలులేదు [శూన్యమునకు భావ (కలపను) వ్యవహారము లేదుకదా], విచారింపన్=సదసత్తుగాదు-సత్=ఉన్నదనియు (లేక ఉండియు), అసత్=లేనిదియు (లేక, లేదు), కాదు=అని చెప్పుటకు వీలు లేదు, అట్టిద్రవ్యంబు = ఉండియు లేనట్టిపదార్థము, కడువిరుద్ధంబుగానన్ = ప్రపంచమునకు మిగుల విరుద్ధ మగుటచే, లేదు=ఎచ్చటనుండదు, నిఖిల... చేతన్-నిఖిల = సమస్తమైన, జగత్ = ప్రపంచముయొక్క, స్వరూపముచేతన్ = ఆకారముతో, మిగుల నేర్పడుటవలనన్ = విశేషముగా నుండుటచేత (నానావిధము లగుప్రపంచమే స్వరూపముగా గలిగియుండుటచేత), నిరవయవముగాదు=అవయవములు లేనిదని చెప్పుటకును శక్యముకాదు, దృశ్యము =కనఁబడునట్టి యీ సకలపదార్థము, సుషుప్తియం దడఁగినన్ = సుషుప్త్యవస్థయందు నశింపఁగా, తాను శూన్యంబుగామిన్ = ప్రపంచరూపమగుటచే తానును నశింపవలసి యుండినను అట్లు నశింపకపోవుటచేత, సావయవమును గాదు = అవయవసహిత మైనదనియు చెప్పుటకు వీలులేదు, ఒనరన్=ప్రత్యక్షము ననుసరించి, అయుక్తమగుటన్ = యుక్తిశూన్య మగుటచేత, ఉభయాత్మకము = అవయవములతోఁ గూడియుఁ గూడక, కాదు=ఉన్నదని చెప్పుటకును వీలులేదు.

తా. ఓయాంజనేయా! పరబ్రహ్మ మద్వితీయుఁడే. మాయవలన నాయనకు ద్వైత మేర్పడదు. మాయ బ్రహ్మమునకంటె వేఱుగా నున్నట్లు తోఁచుటయే కాని వాస్తవ స్థితిలో నట్లు లేదని ఇదివఱకే చెప్పియున్నారు. ఇదియునుగాక రెండువస్తువులు వేఱు వేఱుగా నున్నవనిన రెండును స్వతంత్రములై యుండవలయును. "ఉనికి" యనునది యొక్కటియే కాని భిన్నము కాదు. ఉనికిలు రెండు కల వనుట యెట్లును యుక్తియుక్తము కానేరదు [దీనినిఁగూర్చి వివరము బ్రహ్మగీత అధ్యాయము అయిదు శ్లో. ఒకటి మొ..ముప్పది వ. ఇదియునుగాక భేద మనఁగా నేదియో తెలిసికొనవలసినప్పుడు మొట్టమొదట పదార్థములు 2 కల వనుట తెలియవలయును. పదార్థములు రెండు కల వనుటను తెలిసికొనుటకంటె ముందుగ "భేద మనఁగా నిది" యని తెలిసికొనవలయును. ఇట్లు భేదము తెలియకమునుపు పదార్థము . ద్వైతమును గూర్చియు బదార్థద్వైతము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తెలియకమునుపు భేదమునుగూర్చియు తెలిసికొనుటకు వీలులేదు. కావున నన్యోన్యాశ్రయదోషము (ఒకదాని నొకటి యాశ్రయించియుండుట యను దోషము) వచ్చును. ఈ దోషమువలన భేద మనునది యొకటి కల దనుటయే సిద్ధింపదు. (ఇది యటుండ మాయ స్వతంత్ర కాదనుట స్పష్టమే కదా! జ్ఞానము (బ్రహ్మము) లేనిది మాయ ప్రపంచము ప్రకాశింపదు కదా! ఉనికి బ్రహ్మమే కావునను రెండవయునికి యుండదు కావునను మాయ యనునది బ్రహ్మకంటె వే ఱనుటకే వీలులేదు. ఇది యిట్లున్నను ప్రపంచమునందలి "నేను అజ్ఞానిని" అను ననుభవమును బట్టి యజ్ఞానులను గ్రమముగ నుద్ధరించుతలంపున మాయ యొకటి కల దని యంగీకరించుటయే కాని వాస్తవములో మాయయే లేదు. ఎవ్వనినైనను ప్రస్తుత మున్న స్థితినుండి మార్చి మానసిక మగు నున్నత స్థితికిఁ దేవలయునన్నచో మొట్టమొదట వాని ప్రస్తుతస్థితి నవలంబించియే బోధ సేయవలయును. అట్లు సేయకుండిన వానిమనసు వికల మై యెన్నటికిని జక్కఁబడదు. యథార్థజ్ఞానము పరిపూర్ణముగాఁ గలిగి మనసు తగినంత యున్నతస్థితికి వచ్చినప్పుడు సర్వమును వానికే తెలియును కావున యజ్ఞానుల (అనఁగా "మా కజ్ఞానము కలదు" అని తలంచు జీవుల) నుద్ధరించుటకై యిట్లు చెప్పుచున్నారు. ఇట్లు కాక వాస్తవముగానే మాయ యనునది కలదనిన ననేకవిరోధములు వచ్చును. మొట్టమొదట దానిని నిరూపించుటకే వీలులేదు. ఎట్లనిన మాయ యనఁగా నజ్ఞానమని చెప్పియే యున్నాను. అజ్ఞానము జ్ఞానము కలిగినతోడనే నశించును. ఇచ్చట మఱియొకవిశేషము కలదు. లోకమున ధ్వంసమనియు బాధయనియు నాశము రెండువిధములు. అందు సత్యములగు (వ్యావహారికసత్యములగు) పదార్థములలో బ్రహ్మ మొక్కటియే తప్ప పారమార్థికసత్యము వేఱొకటి లేదు. పదార్థములకు ధ్వంసనాశంబును త్రికాలములందు నసత్యములై భ్రాంతివలనఁ దోఁచుపదార్థములకు బాధయుఁ గలుగుచున్నదనుట ప్రత్యక్షము. ఇం దీమాయకు జ్ఞానమువలనఁ గలుగునాశము బాధయే కాని ధ్వంసముకాదు అనుట స్పష్టమే. కుండను పగులఁగొట్టిన యట్లజ్ఞానమును బగులఁగొట్టవలెఁ గదా! దీనివలన "మాయ కలదు" అనుటకే వీలు లేదు. "నాకు అజ్ఞానము కలదు" అని యాబాలగోపాలముగ సర్వప్రపంచమునకు నజ్ఞానానుభవము కలదు. కావున "మాయ లేదు" అనుటకును వీలులేదు. "మాయ యుండియు లేనిది" యని చెప్పుద మనిన నది సంభవింపదు. అట్టి పదార్థము నెచ్చటనైన నెవ్వరైనఁ జూచియున్నారా? ఇవియునుగాక "కలదు" అనఁబడినపదార్థము సావయవముగాఁ (అవయవములతోఁ గూడినదిగా) గాని నిరవయవముగాఁ (అవయవములు లేనిదిగా) గాని యుండవలయు. మాయనుగూర్చి ఈవిషయములలో నొక్కదానినైనను నిరూపించుటకు వీలులేదు. సుషుప్త్యవస్థయందు సర్వప్రపంచమును లయము నొందినను మాయ (అజ్ఞానము) నశింపదు. ఒకదినమునందలి సుషుప్త్యవస్థయం దెట్లో యట్లే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భూతభవిష్య త్సుషుప్త్యవస్థలయందుఁగూడ నశింపదు. కావున నిత్యము కావలయును. సావయవపదార్థములు నిత్యములు కావనుట ప్రత్యక్షసిద్ధము కావున మాయ సావయవము కాదు" అని చెప్పవలయును. ఈ ప్రపంచమునకు భ్రాంతిజ్ఞానమునకంటె (అజ్ఞానము కంటె నితర మగుస్వరూపము లేదని చెప్పియున్నాను కదా ? అజ్ఞానమే మాయ కావునఁ బ్రపంచమునందుఁ గానఁబడుభాగములు (అవయవములు) మాయకే యుండవలయును. కావున "మాయ నిరవయవము" అనుటకుఁగూడ వీలులేదు. ఇదివఱకు చూపిన యుక్తి ననుసరించియే "మాయ సావయవమును నిరవయవమును గూడ నై యున్నది" యను టకు వీలులేదు. కావున నీమాయ యనిర్వచనీయము. "ఇట్టిది" యని నిర్ణయించుటకు శక్యము కాని దయ్యు ననుభవమున మాత్ర ముండునది.] తోఁచుటయే కాని దీనికిఁ బ్రత్యేకమగు రూపములేదు. కావున దీనివలన బ్రహ్మమునకు భేద మేర్పడదు.

తే. అరయ నాయున్కికంటె వేఱైనయున్కి
లేదు గాన మద్భిన్నంబు గా దవిద్య
ప్రకృతి యజ్ఞాన మని పల్కఁ బడుటవలనఁ
గాదు మదభిన్నమును నాయనాదిమాయ. 22

టీ. అవిద్య=ఆమాయ, అరయన్ = విచారింపఁగా, నాయున్కికంటెన్ = నా సంబంధమైన సత్తకంటె, వేఱైనయున్కిలేదు = వేఱైనసత్తలేదు, (ఉనికికి స్వరూప మొక్కటియే కావున రెండుసత్తలు కల వని చెప్పుటకుఁ దగిన యాధారములేదు. అట్లు చెప్పిన నా రెంటికినిఁ గల పరస్పరభేదమును జూపవలసివచ్చును. దానిని జూపుట కెట్లును వీలుకాదు. కావున రెండవసత్త లేదనియే సిద్ధాంతమని తెలిసికొనవలయును.) కానన్ = కాఁబట్టి, మద్భిన్నంబుగాదు = నాకంటె వేఱని చెప్పుటకు వీలులేదు. (బ్రహ్మసత్తకంటె మాయాసత్త వేఱుగా నుండుటకు వీలులేదని భావము.) నాయనాదిమాయ=నా సంబంధ మగు ఆద్యంతములు లేని యామాయ, ప్రకృతి=అసత్యము జడత్వము దుఃఖము ఇవియే స్వరూపముగాఁ గల ప్రపంచమున కుపాదానకారణ మనియు అచేతన మనియు మాయ యనియు, అజ్ఞానమని = జ్ఞానస్వరూపమైనది కాదనియు, పల్కఁబడుటవలనన్ = వ్యవహరింపఁబడుచుండుటచేత, మదభిన్నమునుగాదు = నేనే యనుటకును వీలులేదు. (నేను జ్ఞానస్వరూపుఁడను, మాయ యజ్ఞానస్వరూపిణి, కావున మా కిరువురకు నైక్యము సంభవింప దని భావము.)

తా. మఱియొకవిశేషము నా యఁనికికంటె వేఱైనయునికి లేదు. కావున మాయ నాకంటె వేఱుకాదు. ఇదియును [అనఁగా "బ్రహ్మమాయ లొక్కటియే" అను విష యముకూడ సిద్ధాంతమై నిలువదు. దానిని మాయ యనుచున్నారు. "యామాసా మాయా" = "ఏది లేదో అది మాయ" అను వ్యుత్పత్తి ననుసరించి చూచిన నది లేనిది;

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నేను ఉండువాఁడను. (బ్రహ్మము ఉండునది.) మఱియు నది యసత్య జడదుఃఖరూప మగు ప్రపంచమున కుపాదానకారణ మగుటచే నసత్యజడదుఃఖరూప మైనది. నేను సత్య జ్ఞానానందరూపుఁడను; అది యజ్ఞానము (లేక అచేతనము). నేను జ్ఞానరూపుఁడను) లేక చేతనుఁడను) కావున నాకును బ్రహ్మమునకును] మాయకును ఐక్యము సంభవింపదు.

క. భిన్నాభిన్నము గాదని, యెన్నంగా నేల ప్రకృతి యిట్లగుట సుసం
పన్ను లనిర్వాచ్యం బని, మున్న గణించిరి సమస్తముం దెలిసి సుతా.

టీ. సుతా=పుత్రా! ప్రకృతి=ఈ మాయ, భిన్నా...గాదని - భిన్న = నాకంటె వేఱై, అభిన్నముగాదని = వేఱుకానిదైకూడ నున్నదని చెప్పుటకు వీలుకాదని, ఎన్నంగా నేల = మఱియొకమాఱు చెప్పనేటికి (ఇది సిద్ధాంతమే యనుట), ఇట్లగుటన్ = ఈవిధముగా నెట్లు చెప్పుటకు వీలు లేని దగుటచేత, సుసంపన్నులు = చక్కని జ్ఞానము కలవారు. సమస్తముం దెలిసి = ఈ చెప్పఁబడిన సర్వవిషయముల నెఱింగి, అనిర్వాచ్యంబని= అనిర్వచనీయమని (ఇది యిట్టిదని చెప్పుటకు వీలులేనిదని), మున్ను=పూర్వమున, గణించిరి=సిద్ధాంతముఁ జేసిరి.

తా. పుత్రా! ఆమాయ నాకంటె వేఱనుటకును వేఱుకాదనుటకును గూడ శక్యము కాదని చెప్పియున్నాను. భిన్నాభిన్నము (వేఱయ్యుఁ గాకుండునది) కూడ కానేరదని మఱియొకమాఱు చెప్పవలయునా? ఈవిధముగా మాయనుగూర్చి ఏనిర్ణయమును గూడఁ జేయుటకు వీలుకాకపోవుటవలన బుద్ధిమంతులగువారు "మాయ యనిర్వచనీయను" అని చెప్పియున్నారు. అనిర్వచనీయ మనఁగా నిరూపించుటకు వీలులేనిది యని కదా యర్థము. యథార్థముగ నున్న పదార్థమును నిరూపించుటకు వీలేల కలుగదు? కావున లోకమునను సరించి చెప్పుటయే కాని మాయ యనునది త్రికాలముల యందును లేదు.

అవతారిక. ఇట్లు మాయాస్వరూపమును జెప్పి సారాంశమును సంగ్రహించుచున్నాఁడు:—

తే. అనుభవజ్ఞానదృష్టిచే నరయఁ దుచ్ఛ
మొగి ననిర్వచనీయమాయుక్తిదృష్టి
చేత లౌకికమయదృష్టిచే ననంత
మగుఁ దలంప మదీయమాయాతమంబు. 24

టీ. మదీ...తమంబు-మదీయ = నాసంబంధమైన, మాయా=మాయ యనెడు, తమంబు=అంధకారము, అరయన్ = విచారింపఁగా, అనుభవజ్ఞానదృష్టిచేన్ = బ్రహ్మానుభవజ్ఞాన మనెడుమాపుతోఁ జూచిన (అనఁగా: ప్రతిబంధత్రయము లేక స్థిరమగు జ్ఞానముచే విచారించిన), తుచ్ఛము=సంపూర్ణముగ లేనిది (లేక నీచమైనదగును). ఒగిన్ =

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లెస్సగా, యుక్తిదృష్టిచేతన్=తర్క మనెడు చూపుతోఁ జూచిన, అనిర్వచనీయమౌన్ ఇది యిట్టిదని నిర్ణయించుటకు నశక్యమైనదగును. లౌకికమయదృష్టిచేన్ = సామాన్య మగు లోకదృష్టిచేఁ జూచిన, తలంపన్=భావించుటకు, అనంతమగున్ = ఆద్యంతములు లేక యంతట నిండినదగును. (ఎచ్చటఁ జూచినను మాయకంటె వేఱగు పదార్థమే కనఁ బడదని భావము.)

తా. "పరబ్రహ్మామే నేను" అను నపరోక్షజ్ఞానముచేఁ జూచునేని ఈ మాయ బొత్తిగఁ గానరాదు. యుక్తులచేఁ జూచెనేని "ఇట్టిది" యని నిరూపించుటకు శక్యము కాదు. అనుభవమునకంటెను యుక్తులకంటెను వేఱుగఁ బదార్థములస్థితిని నిర్ణయించుటకుఁ దగిన ప్రబలసాధన మేదియును లేదు. పరమార్థస్థితిని తెల్పునది యగుటచే ననుభవ మనిన నపరోక్షబ్రహ్మానుభవమే కాని వేఱు కాదనుటయుం స్పష్టమే. ఇట్టి యనుభవ యుక్తులచే నీ మాయ సిద్ధాంతము చేయ శక్యముకాదు. ఇఁక నేమనిన: లోకదృష్టిననుస రించి మంత్రము అపరిమితమై కానవచ్చును. ఇంతమాత్రమువలన "మాయ కలదు" అని చెప్పుటకు వీలులేదుకదా! ఇట్లైనను "నేను ప్రపంచమును జూచుచున్నానే, ఇది యభావరూప మనిన నెట్లు?" అనువారలకుఁ జిత్తశుద్ధిని గలిగించి తత్వమును బోధించు టకై "మాయ యనిర్వచనీయరూపముతో నున్నది" యని చెప్పవలసివచ్చినది.

అవ. ఇట్లు సామాన్యముగా చెప్పి యనుభవపూర్వకముగా నా మాయయొక్క స్వరూపమును దెలుపుచున్నాఁడు:—

సీ. త్రాడు భుజంగమై స్థాణువు పురుషుఁడై
రాజిల్లుశుక్తిక రజత మగుచు
మరుమరీచికలు నిర్మలసలిలంబు లై
తొడరి మి న్నసిత మై తోఁచుపగిది
నద్వయామలసచ్చిదానందమయుఁడ నై
తగు నేను మిగుల నెద్దానివలనఁ
దొలుత నసజ్జడదుఃఖాత్మకము లైన
జగము లై కనుపింతు జనుల కెల్ల
తే. దృఢతరాద్వైతవిజ్ఞానదృష్టి చేతఁ
బండితులు పూర్ణనిర్గుణబ్రహ్మమయుఁడ
నైనను గాంచినంత నెయ్యది యభావ
మగు నదియ సూ మదీయమాయాతమంబు. 25

టీ. త్రాడు, భుజంగమై = సర్పముగాను, స్థాణువు = స్తంభము, పురుషుఁడై = మనుష్యుఁడుగాను, రాజిల్లుశుక్తిక = ప్రకాశించుచున్న ముత్తెపుచిప్ప, రజతమగుచు =


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వెండిగాను, మరుమరీచికలు=ఎండమావులు, నిర్మలసలిలంబులై = పరిశుద్ధజలములుగాను, తొడరి=పూనికతో, మిన్ను = ఆకాశము, అసితమై=నలుపై, తోఁచుపగిది = భ్రాంతి వలనఁ గానవచ్చునట్లు, అద్వ...డనై-అద్వయ = రెండవపదార్థము లేక (అనఁగా: నేక స్వరూపుఁడనై), అమల=నిర్మలుఁడనై, సత్ = సత్తాస్వరూపుఁడనై, చిత్ = జ్ఞానస్వరూపుఁడనై, ఆనందమయుఁడనై=సుఖస్వరూపుఁడనై, తగునేను=ఒప్పుచున్న నేను, మిగులన్ =అధికముగ, ఎద్దానివలనన్=ఏ పదార్థముయొక్క ప్రభావముచే, తొలుతన్ = మొట్ట మొదట (అజ్ఞానదశయందు), జనులకెల్లన్=జీవుల కందఱకును, అస...లైన-అసత్ = అసత్యము, జడ=అజ్ఞానము, దుఃఖ=దుఃఖము అనునవి, ఆత్మకములైన=స్వరూపములుగాఁ గలిగియున్న, జగములై = ప్రపంచరూపముగా, కనిపింతున్ = కానఁబడుచున్నానో, పండితులు=జ్ఞానవంతులగువారు, దృఢ...చేతన్-దృఢతర=స్థిరమైన, అద్వైత = అభేద రూపమగు, విజ్ఞానదృష్టిచేతన్=అనుభవజ్ఞాన మనెడుచూపుతో, పూర్ణ...డన్-పూర్ణ= సర్వపరిపూర్ణుఁడ నైనట్టియు, నిర్గుణ=గుణరహితుఁడనైనట్టియుఁ, పరబ్రహ్మమయుఁడన్= పరబ్రహ్మరూపుఁడనైనట్టియు, ఐన, నన్నున్=నన్ను, కాంచినంతన్ = చూచినతోడనే ("నేనే బ్రహ్మమును" అని తెలిసికొనినతోడనే, ఎయ్యది=ఏపదార్థము, అభావమగున్= లేని దగునో, మదీ...తమంబు-మదీయ = నాసంబంధమైన, మాయ = మాయయనెడు, తమంబు=అంధకారము, అదియసూ=ఆపదార్థమే సుమా.

తా. స్తంభము పురుషుఁడుగాను త్రాడు సర్పముగాను ముత్యపుచిప్ప వెండిగాను ఎండమావులు జలములుగాను ఏవర్ణములును లేనియాకాశము నల్లనిది గాను గానవచ్చి నట్లు నేను (పరబ్రహ్మము) అద్వితీయుఁడనయ్యు నిర్మలుఁడనయ్యు సత్యజ్ఞానానంద స్వరూపుఁడ నయ్యు భేదయుక్తమై అసత్యరూపమై జడమై దుఃఖరూపమైయున్న ప్రపంచముగాఁ దోఁచుచుండుట యనుభవసిద్ధము. ప్రపంచమనఁగా నామరూపములు మాత్రమేకాని మఱేమియుం లేదని ఇదివఱకే చెప్పియున్నాను. ఇట్లొకవిధముగానున్న నేను విరుద్ధ మగుమఱియొకవిధముగఁ దోఁచుటకుఁ గారణమెద్దియో! ఏది అభేదజ్ఞానము కలుగఁగానే యభావరూపమై (త్రికాలములయందును బొత్తిగ లేనిదై) కానరాదో అదియే మాయ (అజ్ఞానము) యని తెలిసికొనుము.

వ. అది మఱియు సర్వభూతసుషుప్తిసమష్టిరూపంబు సమస్తప్రపంచవాస
నామయంబు సత్వరజస్తమోగుణాత్మకంబు స్వాంతర్గుప్తానంతకోటిజీ
వసంఘాతంబుఁ గేవలజడంబు మోహాత్మకంబు సకలజగదుపాదాన
కారణంబు నవిద్యావ్యక్తతమస్సుషుప్తిప్రకృతిప్రళయప్రధానమా
యాజ్ఞానాదిశబ్దవాచ్యంబు నై యొప్పుచుండు నని వెండియు. 26

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. అది = ఆపదార్థము (ప్రకృతి), మఱియున్, సర్వ...బును - సర్వభూత= సర్వభూతములకు అనుభవములోనున్న, సుషుప్తిసమష్టి = సుషుప్తిసముదాయమే, (లేక సామాన్యమే. ప్రతిజంతువునకును ప్రత్యేకముగా ననుభవములో నున్నసుషుప్తికి వ్యష్టి సుషుప్తి యని పేరు. సర్వప్రపంచమును ఏకశరీరముగాఁ గైకొని వ్యవహరింతు మేని యప్పటిసుషుప్తికి సమష్టిసుషుప్తి యని పేరు. దీనిని సుషుప్తిసామాన్య మనికూడ వ్యవహరింపవచ్చును. ఇట్లొకసుషుప్తినేకాక జాగ్రత్స్వప్నములను ప్రాణాదులను గూడ ప్రత్యేకపదార్థములను గూర్చి మాటలాడునప్పుడు వ్యష్టి యనియు సర్వప్రపంచము నేకశరీరముగాఁ గొని మాటలాడునప్పుడు సమష్టియనియుఁ వ్యవహరించుచున్నారు.) రూపంబును=స్వరూపముగాఁగలదియుఁ (ఇంద్రియములు మనస్సు మొదలగునవన్నియుఁ సుషుప్త్యవస్థయందు లీనమగుచున్నవి. కావున నదియే వీనికి కారణము), సమ...బును- సమస్తప్రపంచ=నానావిధ మగునీప్రపంచమేరూపముగాఁగల, వాసనా = సంస్కారము లతో (ఒకసృష్టియందున్న ప్రపంచమువలెనే రెండవసృష్టియందున్న ప్రపంచముకూడ జనించునని "ధాతా యథా పూర్వ మకల్పయత్" అనుశ్రుతి చెప్పుచున్నది. దాని ననుసరించి చూచిన మొదటిసృష్టియం దున్నప్రపంచము లయమైనపిదప తత్కారణ మగు ప్రకృతియందు ఆప్రపంచరూప మగుసంస్కారము నిలిచి యుండవలయునని యేర్పడుచున్నది. కార్యములు తమకారణములయందే లయము నొందును గాని మఱి యొకచోట లయమునొంద వని తెలిసికొనవలయును.) మయంబును = నిండినదియును, సత్వరజస్తమోగుణాత్మకంబును = సత్వరజస్తమోగుణములే ఆకారముగాఁ గలదియును (సత్వరజస్తమోగుణములే ప్రకృతి యనియుఁ దానిని మనము సుషుప్తి యని చెప్పుచు ననుభవించుచున్నామనియుఁ భావము.) స్వాం...బును-స్వాంతః = తనలోపల, గుప్త= దాచఁబడిన, అనంతకోటి=అపరిమితములైన, జీవ = జంతువులయొక్క, సంఘాతంబును= సమూహముగలదియు, కేవలజడంబును=సంపూర్ణముగ జడమైనదియుఁ (అనఁగా: నచేతన మైనదియుఁ), మోహాత్మకంబును = భ్రమరూపమైనదియు (సుషుప్తియని చెప్పుటవలన సుషుప్త్యవస్థమాత్రమే ప్రకృతియఁను జాగ్రదాదులు ప్రకృతి కాదనియుఁ తలంతు రేమో యని మరల మోహాత్మకమని చెప్పఁబడియున్నది.) సక...బును - సకలజగత్ = సర్వప్రపంచమునకును, ఉపాదానకారణంబును=మట్టి కుండకు కారణమైనట్లు ప్రపంచ మున కుపాదానకారణమైనదియును (భ్రాంతియె ప్రకృతి రూపమని చెప్పి "అదియే ప్రపంచమున కుపాదానకారణము, అనఁగా: "ప్రపంచవికారమైనది" అనుటవలన ప్రపంచపదార్థము కాదనియుఁ భ్రాంతిజ్ఞానమే యనియుఁ నేర్పడుచున్నది. ఎండమావులు నీరుగాఁ గనఁబడినప్పుడు ఆనీటికి భ్రాంతిజ్ఞానమునకంటె నితరమగురూపము లేదనుట ప్రత్యక్షసిద్ధ మగువిషయము కావున వైసిద్ధాంతమునందు దోషము లేదు. అవిద్యావ్యక్త

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తమ స్సుషుప్తి ప్రకృతి ప్రళయ, ప్రధాన మాయాఽజ్ఞానాదిశబ్దవాచ్యంబు నై=అవిద్య, అవ్యక్తము, తమస్సు, సుషుప్తి, ప్రకృతి, ప్రళయు, ప్రధానము, మాయ, అజ్ఞానము అను మొదలగు శబ్దములచే వ్యవహరింపఁబడుచున్నదై, ఒప్పుచుండునని = ప్రకాశించుచుండు నని చెప్పి, వెండియుఁ = మఱియును (ఈక్రిందివిధముగాఁ జెప్పఁబోవుచున్నాఁ డని శేషము)·

తా. ప్రతిజంతువునకును సుషుప్త్యవస్థ యనుభవములోనున్నది. మన మొక్కొక జంతువునుగూర్చి ప్రత్యేకముగాఁ జెప్పునప్పు డాసుషుప్తికి వ్యష్టిసుషుప్తియని పేరు. సర్వ ప్రపంచము నొక్కటిగాఁ గాని వ్యవహరించునప్పుడు దానికి సమష్టిసుషుప్తియని పేరు. ఈసమష్టిసుషుప్తియే పైనఁ జెప్పఁబడియున్నమాయకు స్వరూపము. ఈప్రపంచ మనాది యని యిదివఱకే చెప్పియున్నాను. ఇది పూర్వకల్పంబునం దెట్లుండెనో యుత్తరకల్ప మునందుఁ గూడ నట్లే యుండును. కావున నీప్రపంచసంబంధంబు లైనసంస్కారములు దానికిఁ గారణమగువస్తువునం దె యుండును. సుషుప్త్యవస్థయందు నింద్రియములు మనసు మొదలగుప్రపంచమంతయుఁ లీనమగుచున్నది. కార్యములు తమ యుపాదానకారణము నందుఁ దప్ప మఱి యెచ్చటను లయమును జెంద వనుట నియమముకదా! కావున సుషుప్త్యవస్థారూపిణి యగుమాయయే ప్రపంచసంస్కారముల కెల్ల నాశ్రయము. దాని యాకారము సత్త్వరజస్తమోగుణములే. ఈసమస్తజీవులును దానియందే యున్నారు. "సత్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః = సత్వరజస్తమోగుణములులేని జంతు వొక్కటైననులేదు." అనువాక్యమునను సరించి చూచిన సత్వరజస్తమోగుణాత్మకమైన ప్రకృతియే యీప్రపంచ మని స్పష్ట మగుచున్నది. బ్రహ్మస్వరూప నిరూపణమువలనఁ బ్రపంచ మజ్ఞానకార్య మని యిదివఱకే స్పష్టము చేయఁబడి యుండుటచేఁ నాయజ్ఞా నమునకు సత్త్వరజస్తమోగుణమువలె యాకారమనుటయును పైవాక్యమువలననే దృఢ మగుచున్నది. మఱియుఁ బ్రహ్మప్రకాశములేక ప్రకాశింపదుకావున నది జడపదార్థము. "సుషుప్తియే మాయ" యనుటవలన జాగ్రదాద్యవస్థలు మాయకానేర వని భ్రాంతి నొందకుము. సుషుప్తియేమాయ యనఁగా సుషుప్త్యవస్థవలె నుండునది యని మాత్రమె యర్థము. జాగ్రదవస్థయందుఁ గూడఁ దత్వము తెలియుటయే లేదు కదా! కావున భ్రాంతియే దాని యథార్థస్వరూపము. నేను (బ్రహ్మము) సత్యజ్ఞానానందస్వరూపుఁడను కావునఁ బ్రపంచమునకు నుపాదానకారణమును గానేరదు. కావున నసత్యజడదుఃఖరూపిణి యగు మాయయే దీనికి నుపాదానకారణము. అవిద్య యనినను అవ్యక్త మనినను తమ స్సనినను సుషుప్తి యనినను మాయయనినను ప్రకృతి యనినను ప్రళయ మనినను ప్రధాన మనినను అజ్ఞాన మనినను ఒక్కటియే. ఇవియే కాక నీమాయకు మఱియు ననేకనామ ధేయములతో వ్యవహారము కలదు. ఓ పార్వతీ! శ్రీరాముఁ డీవిధముగాఁ నాంజనేయు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నకు మాయాస్వరూపమును నిర్ణయించి చెప్పి సృష్టినిగూర్చి ఈక్రిందివిధముగా నుప దేశించెను.

అవ. సృష్టికిఁ గారణభూత మగుమాయాకార్యమును జెప్పుచున్నాఁడు:—

తే. ఆదిమధ్యాంతశూన్య యైనట్టిప్రకృతి
యాదిమధ్యాంతములు గల్గినట్లఁ దోఁచి
యాదిమధ్యాంతరహితాద్వయాత్మునకును
నాదిమధ్యాంతములు గల్గ నావరించె. 27

టీ. ఆది...ప్రకృతి-ఆది = మొదటను, మధ్య=నడుమను, అంత=తుదియందును (అనఁగా: సృష్టి స్థితి ప్రళయకాలములయం దనుట,) శూన్యయైనట్టి=లేనట్టి, (సత్యజ్ఞానా నందస్వరూపుఁ డగుపరబ్రహ్మమునకు అసత్య, జడ, దుఃఖరూపిణి యగు ప్రకృతిలో సంబంధ ముండుటకు వీలు లేదు కావునను, జడపదార్థము స్వతంత్రముగా నుండుటకును వీలు లేదు కావునను, ఆప్రకృతి త్రికాలముల యందును లేని దనియే చెప్పఁబడు చున్నది.) ప్రకృతి=మాయ, ఆదిమధ్యాంతములన్ = సృష్టిస్థితి ప్రళయములయందు, కల్గినట్లతోఁచి = ఉన్నట్లుకనఁబడుచు (నిత్యయైనట్లు కనఁబడుచు), ఆది...కున్ - ఆది మధ్యాంతరహిత = ఉత్పత్తిస్థితి ప్రళయములు లేక సర్వకాలములయందు నిత్యుఁడగు నట్టియు, అద్వయ=అద్వితీయుఁడగునట్టియు (అనఁగా: తనకంటె మాయయొకటి వేఱుగా నున్నదని చెప్పుటకు వీలు లేనట్టియు), ఆత్మునకున్ = స్వస్వరూపుఁడగుపరబ్రహ్మమునకు, ఆదిమధ్యాంతములు = ఉత్పత్తిస్థితి ప్రళయములు, కల్గన్ = కలుగునట్లుగా (అనఁగా: ఉత్పత్తిస్థితి ప్రళయములుగల ప్రపంచరూపముతోఁ దోఁచునట్లుగా), ఆవరించెన్ = కప్పెను. (అనఁగా: భ్రాంతిచే పాము త్రాఁడై తోఁచునట్లు తనశక్తిచే తనకుఁ దానే ప్రపంచరూపముతోఁ దోఁచుచున్నాఁ డనిభావము. ఎట్లైనను దనకంటెఁ దాను వేఱు కాఁడు కావునను, పైనఁ జూపిన యుక్తిప్రకారము మాయ శూన్యమని చెప్పఁబడి యుండుటచేతను "ఆబ్రహ్మము నిత్యసిద్ధుఁడు, శుద్ధుఁడు, నిత్యముక్తుఁడు" అని చెప్పఁ బడుచున్నాఁడు. మఱియు పై నిరూపించినశక్తి (ఆశక్తి యెన్నిరూపములతో మార్పు నొందినను మనకు గోచర మగునట్టి పరిణామము మనస్సేకావున ఈశక్తిని మనస్సని వ్యవహరింపవచ్చును.) యందలి (అనఁగా: మనయనుభవములో నున్నమనస్సునందలి) రజస్తమోగుణములును సత్వంబును గూడ లయించె నేని అనఁగా నాప్రకృతి విజృం భించుట మానెనేని యప్పుడు తనకుఁ దానే ముక్తుఁడైనట్లు దోఁచును. శక్తి విజృంభించు చున్నకాలమున తనకుఁ దానే ప్రపంచరూపుఁడై తోఁచునప్పుడు చిత్తశుద్ధికరము లను నభిప్రాయముతో చేయఁబడు కర్మలవలన నాగుణములు నశించును.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. పైనిరూపణమువలన మాయ యనునది మొదటఁగాని నడుమఁ గాని తుది యందుఁ గాని వాస్తవముగా లేదనియు నూరక తోఁచుచు మాత్రమే యున్నదనియు స్పష్టమైనది కదా! ఇట్లుండియు నది సర్వకాలములయందును వాస్తవముగానే యున్నట్లు తోఁచి ఆదిమధ్యాంతశూన్యుఁడ నైనట్టియు నద్వితీయుఁడ నైనట్టియు నాకు (బ్రహ్మ మునకు) నాదిమధ్యాంతములు కల వని తోఁచునట్లు చేయుచు నన్నావరించినది.

అవ. ఇట్లు ప్రపంచమున కాదికారణ మగుమాయావరణమును జెప్పి యా మాయను విభాగించుచున్నాఁడు:—

క. కవియన్మూలప్రకృతియు,ద్వివిధయగునుమాయయనవిద్యయనగనా
ద్యవిమలసత్త్వాత్మికయగు,నవిమలసత్త్వప్రధాన యగునన్యతగన్.

టీ. కవియన్ = ఈవిధముగా ఆవరించునప్పుడు, మూలప్రకృతియున్=పైజెప్పఁబడిన మూలప్రకృతి, మాయయనన్ = మాయ యనియు, అవిద్యయనఁగన్=అవిద్య యనియు, ద్వివిధయగున్=రెండువిధము లైనదిగా నుండును. (ఈమాయావిద్యాశబ్దములు మూలప్రకృతివాచకములే యైనను ప్రధానముగా దాని భేదములనుగూర్చియే చెప్పనని తెలిసికొనవలయును.) ఆద్య = అందు మొదటి దగుమాయ, విమలసత్త్వాత్మికయగున్- విమల=నిర్మలమైన (అనఁగా రజస్తమోగుణములతో సంబంధము లేని, లేక సర్వగుణముల కును లయస్థానమైన), సత్త్వ=సత్త్వగుణమే(లేక చిద్రూపమే),ఆత్మికయగున్=స్వరూపము గాఁగలదియైయున్నది. అన్య=రెండవది యగునవిద్య, తగన్ = ఒప్పునట్లుగా, అవిమలసత్త్వప్రధాన-అవిమల = అపరిశుద్ధ మైన (అనఁగా రజస్తమోగుణసంసర్గగల, లేక త్రిగుణవిజృంభణరూపమైన), సత్త్వ = సత్త్వగుణమే (లేక స్వభావమే), ప్రధాన = ముఖ్యముగాఁగలది (తదాకారమైనది), అగున్.

తా. ఆప్రకృతియు మాయ యనియు నవిద్య యనియు రెండువిధములై యున్నది. అందు రజస్తమోగుణములసంబంధము లేనిపరిశుద్ధసత్త్వగుణమే (లేక త్రిగుణముల లయస్థాన మగుస్థితియే) ప్రధానస్వరూపముగఁ గలది మాయ యనఁబడును. రజస్తమోగుణసంబంధము కల యపరిశుద్ధసత్త్వగుణమే ప్రధానస్వరూపముగాఁ గలది యవిద్య యనంబడును. కావున ప్రకృతి న న్నావరించినప్పుడు నా కీమాయావిద్యల వలన రెండువిధములగు నావరణములును గలిగెను.

## ఈశ్వరవిచారఘట్టము.

అవ. ఇఁక సృష్టిని గ్రమముగ వివరించువాఁడై మొట్టమొదట సమష్ట్యభిమాని యగునీశ్వరుని యుత్పత్తిని దెలుపుచున్నాఁడు:—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. అమలసత్త్వప్రధాన యైనట్టిమాయ
యందు దాని కధిష్ఠాన మైననేను
బ్రతిఫలించితి మేఘసంగత జలముల
మించి యాకాశ మమర బింబించినట్లు 29

టీ. అమలసత్త్వప్రధాన యైనట్టిమాయయందుఁ = శుద్ధసత్త్వరూపిణి యగు నామాయయందు (అనఁగా నామాయ నన్నావరించినప్పుడు), దానికిఁ = ఆమాయకు, అధిష్ఠానమైననేను = ఆధారమైయుండిన నేను (రాముఁడు, అనఁగా బ్రహ్మము.), ఆకాశము, మేఘసంగతజలములఁ=తానే (ఆకాశమే) ఆధారముగాఁ గలిగియున్న మేఘోదకములయందు (మేఘమునకును దానియం దున్ననీటికిని ఆకాశమే యాధారము. అట్టిమేఘస్థితోదకమునందు), మించి = అధికముగా (లేక ఆనీరుండినభాగమునకంటె మిగుల విశాలమై యుండియును), అమరఁ = చక్కఁగా, బింబించినట్లు = ప్రతిఫలించిన విధమున, ప్రతిఫలించితిఁ = (మాయయందు) ప్రతిబింబించితిని. (ఆకాశము తన యం దున్ననీటిలో తానే ప్రతిబింబించినట్లు నేనును తనయం దున్నమాయలో తానే ప్రతిబింబించితిని.)

తా. ఆరెండావరణములలో మాయావరణమువలన గలిగిన కార్యమును వినుము. ఆకాశము నిర్మల మయ్యును దేనితోను సంబంధపడని దయ్యును దనయందే నిలిచి యున్న మేఘములయందలి నీటిలోఁ బ్రతిబింబించిన విధమున నేనును (బ్రహ్మయును) నాయందే నిలిచి యున్నమాయయందుఁ బ్రతిబింబించితిని.

క. మాయాప్రతిబింబంబును
మాయాధిష్ఠానపరము మాయయుఁ గూడఁ
మాయావి యైనయీశుఁ డ
మాయికుఁ డగునతఁడు బ్రహ్మమయుఁ డై యుండన్. 30

టీ. మాయా...బంబును-మాయా = (పైఁజెప్పఁబడినవిధముగా) మాయయందు ప్రతిబింబించిన, ప్రతిబింబంబును=బ్రహ్మప్రతిబింబమును, మాయాధిష్ఠానపరము-మాయా = మాయకు, అధిష్ఠాన = ఆధారభూత మైన, పరము = పరబ్రహ్మము, మాయయుఁ = ఆయీశ్వరు (బ్రహ్మప్రతిబింబము) న కుపాధి యగుశుద్ధసత్త్వప్రధానయును, కూడఁ= కలసి, మాయావియైన = మాయకలవా రని వ్యవహరింపఁబడుచున్న, ఈశుఁడు = ఈశ్వరుఁడు, అగుఁ, ("మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరం" అనుశ్రుతి యిందుకుప్రమాణము.) అతఁడు = ఆయీశ్వరుఁడు, బ్రహ్మమయుఁడై=బ్రహ్మరూపుఁడై, ఉండుటఁ =ఉండుటచేత, అమాయికుఁడగుఁ=(యథార్థముగ విచారించిన)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాయాసంబంధము లేనివాఁ డగును. (మాయ శుద్ధసత్త్వరూపిణి కావున నందు గుణ విజృంభణము లేకపోవుటచేత నందలిప్రతిబింబమునకు, లేక దాని యాధారమునకు భ్రాంతి లే దని భావము.)

తా. ఇట్లు ప్రతిబింబించుటవలన మాయయు నందలిప్రతిబింబంబును దానికా ధార మగుశుద్ధచైతన్యంబును గలసి యీశ్వరశబ్దముచే వ్యవహరింపఁబడుచున్నవి. ఆయీశ్వరుఁడే మాయ కధిపతి యనియు మాయను బ్రేరేపించువాఁ డనియుఁ జెప్పఁ బడుచున్నాఁడు. ఆమాయ శుద్ధసత్త్వప్రధాన కావున నాయీశ్వరునకు దానివలన నుప ద్రవమేమియు లేదు. జీవునివలె నాయీశ్వరుఁడు మాయకు లోఁబడఁడు. బ్రహ్మరూ పుఁడైయే యుండును.

క. ఆయీశ్వరుండ నే నా
మాయయె సీతావధూటి మదిఁ దలఁప మహా
మాయుఁడనయ్యు వశీకృత
మాయుఁడనై యవతరింతు మహి నిట్లనఘా. 31

టీ. అనఘా = పాపరహితుఁడా! ఆయీశ్వరుండన్ = పైఁజెప్పినయీశ్వరుఁడను, నేన్ = నేను, ఆమాయయే = పైఁజెప్పినమాయ, సీతావధూటి = సీతయే, మదిన్ = మన స్సునందు, తలంపన్ = విచారింపఁగా, మహామాయుఁడనయ్యున్ = అపరిమిత మగు మాయ గలవాఁడనయ్యును, వశీకృతమాయుఁడనై = ఆమాయను లోఁబఱచుకొనినఁ వాఁడనై (అనఁగా దానివలన నేవికారమును జెందక), (యథార్థస్థితిలో దానియం దే వికారములు లేవు.) మహిన్ =భూమియందు, ఇట్లు=ప్రస్తుతరామావతారమువలె, అవత రింతున్ = పుట్టుచుందును.

తా. ఓజ్ఞానవంతుఁడా! ఆంజనేయా! పైఁజెప్పఁబడినయీశ్వరుఁడను నేను (శ్రీరాముఁడు) "నన్నావరించెను" అని చెప్పఁబడి యున్నమాయయే యీసీత. నేను మాయావినయ్యును ఆమాయకు లోఁబడక దానిని లోఁబఱచుకొని యీవిధముగా లోకోపకారార్థమై భూలోకమున నవతరించు చుందును.

వ. ఇట్లుశుద్ధసత్త్వప్రధానమాయోపాధికుండును సర్వేశ్వరుండు నైన నేను వశీకృతమాయుండ నగుటం జేసి జగంబులు సృజియించితద్రక్షణంబు కొఱకుఁ దొల్లి మత్స్యకూర్మవరాహనారసింహవామనపరశురామా వతారంబులు ధరియించి దుష్టనిగ్రహశిష్టానుగ్రహంబులం గావించి యిప్పుడు శ్రీరామరూపంబుచే నవతరించి రావణకుంభకర్ణాది రాక్ష సుల సంహరించి భూభారంబు నివారించితి నింక నిటమీఁదట బల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రామకృష్ణబుద్ధకల్కిరూపంబుల నే నవతరింపఁగలవాఁడ నాచరిత్రం
బులు లోకత్రయపవిత్రంబులు భవలతాలవిత్రంబులై యొప్పునని
చెప్పి వెండియు. 32

టీ. ఇట్లు=ఈవిధముగా, శుద్ధ...కుండుఁ‌డ్-శుద్ధ=నిర్మలమైన, సత్త్వప్రధాన = సత్త్వగుణమే ప్రధానముగాఁ గల, మాయ=మాయయే, ఉపాధికుండుఁ‌డ్ = ఉపాధిగాఁ గలిగినట్టియు, సర్వేశ్వరుండుఁ‌డ్ = సకలప్రపంచమునకును ప్రభువైనట్టియు, ఐన నేను, వశీకృతమాయుఁడఁ‌డ్ = మాయను స్వాధీనపఱచుకొనినవాఁడను, అగుటంజేసి = అయియుండుటచేత, జగంబులుసృజించి = జగత్తులఁబుట్టించి, తద్రక్షణంబుకొఱకుఁ‌డ్ = దానిని రక్షించుటకొఱకై, తొల్లి=పూర్వమున, మత్స్యకూర్మవరాహనారసింహవామన పరశురామావతారంబులు=మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, పరశురామ రూపములను, ధరించి = తాల్చి, దుష్ట...లఁ‌డ్-దుష్టనిగ్రహ=దుష్ట సంహారమును, శిష్టానుగ్రహంబులఁ‌డ్ = శిష్టరక్షణంబును, కావించితిఁ‌డ్ = చేసితిని, ఇప్పుడు, శ్రీరామరూపంబుచేఁ‌డ్ =శ్రీరామరూపముతో, అవతరించి=పుట్టి, రావణకుంభకర్ణాదిరాక్షసులఁ‌డ్=రావణుఁడు, కుంభకర్ణుఁడు మొదలగు రాక్షసులను, సంహరించి, భూభారంబు - భూ = భూమియొక్క, భారంబు=భారమును, నివారించితిఁ‌డ్ = పోఁగొట్టితిని. ఇఁక నిటమీఁదటఁ‌డ్ = ఇంకనిపై, బలరామకృష్ణబుద్ధకల్కిరూపంబులఁ‌డ్ = బలరామకృష్ణబుద్ధకల్కిరూపములతో, ఏనవతరింపంగలవాఁడఁ‌డ్ = నేను అవతరింపఁబోయెదను. నాచరిత్రంబులు = నానడవడులు, లోకత్రయపవిత్రంబులు - లోకత్రయ = మూఁడులోకములను (అనఁగా వర్ణించువారిని గాని వినువారిని గాని ప్రశ్నఁజేయువారిని గాని), పవిత్రంబులు = పవిత్రముఁజేయు సామర్థ్యముగలవి. భవలతాలవిత్రంబులై-భవ = సంసారమనెడు, లతా=తీఁగెకు, లవిత్రంబులై = కొడవలివంటివియునై, ఒప్పుఁ‌డ్=ప్రకాశించును, అనిచెప్పి, వెండియుఁ‌డ్=మఱియును.

తా. ఈవిధముగా శుద్ధసత్త్వప్రధానయగుమాయావరణమునకుఁ జిక్కి యీశ్వరుఁడ నైననాకు నామాయ స్వాధీనయైయున్నది. కావున దానిసహాయమువలన సమస్తలోకమును సృజించితిని. దుష్టులవలన నాప్రపంచమునకుఁ గలుగుబాధను దొలఁగించి రక్షించుటకై పూర్వకాలంబున నాయాయవసరముల ననుసరించి మత్స్యకూర్మ వరాహ నృసింహ వామన పరశురామరూపముల దాల్చితిని. ప్రస్తుతము రామరూపమున జనించి దుష్టులగురావణకుంభకర్ణాదుల వధించి భూభారమును దొలఁగించితిని. ఇఁకమీఁద కృష్ణబలరామబుద్ధకల్కిరూపములఁ దాల్పఁబోయెదను. ఆయాయవతారములయందలి నాచరిత్రలు వినినంతమాత్రముచే మూఁడులోకములఁ బవిత్రములఁ గావించును. సం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సారబంధమును ద్రెంచును. ఓపార్వతీ! రాముఁ డిట్లు తనతత్త్వము నెఱింగించి ప్రకృ తానుగుణముగా నిట్లనియె.

చ. గురుఁడు హిరణ్యగర్భుఁ డని కొందఱు కొందఱెలన్మహావిరా
ట్పురుషుఁడటంచుఁగొందఱు ఋభుప్రభుఁడంచుముకుందుఁడంచుఁ
గొం,దఱుశివుఁడంచుఁగొందఱువినాయకుఁడంచునుగొందఱుంబరా
పరవరు నన్నెఱుంగక యుపాస్తి యొనర్తురు రజ్ఞులై తగన్. 33

టీ. ఇలన్ = భూమియందు, కొందఱు = కొందఱుజీవులు (అవిద్యయందు ప్రతిబింబించుటచే అచ్చటి గుణవిజృంభణమువలన తనకుఁ దానే సంసారిగాఁ దోఁచునట్టి బ్రహ్మప్రతిబింబము జీవుఁడు), పరాపరవరున్-పరా = పరాప్రకృతికంటెను (పైఁజెప్పిన జీవునికే పరాప్రకృతి యనిపేరు), అపర = అపరాప్రకృతికంటెను (జీవుఁడు తప్పఁ దక్కిన ప్రపంచమంతయుఁ నపరాప్రకృతి), వరున్ = శ్రేష్ఠుఁడనగు, నన్నున్, అజ్ఞులై = అజ్ఞానవంతులై (అజ్ఞానమనఁగా: నవిద్యయే కావున దానికి లోఁబడినవారై), ఎఱుంగక = తెలిసికొననేరక, గురుఁడు=బృహస్పతియని, కొందఱు = మఱికొందఱు, హిరణ్యగర్భుఁడని = చతుర్ముఖబ్రహ్మయని, కొందఱు = మఱికొందఱు, మహావిరాట్పురుషుఁడటంచున్=విరాట్పురుషుఁడని (ప్రపంచమంతయు నేకశరీరముగాఁ గొని మాటలాడునప్పుడు దానికి విరాట్పురుషుఁడని వ్యవహారము కలదు), కొందఱు = మఱికొందఱు, ఋ...డంచున్-ఋభు=దేవతలకు, ప్రభుఁడంచున్ = అధిపతియగు నింద్రుఁడనియు, ముకుందుఁడంచున్=విష్ణువనియు, కొందఱు=మఱికొందఱు, శివుఁడంచున్ = శివుఁడని, కొందఱు=మఱికొందఱు, వినాయకుఁడంచున్=విఘ్నేశ్వరుఁడని, తగన్=ఒప్పునట్లుగా, ఉపాస్తియొనర్తురు=పూజింతురు. [తనకును నాకును (బ్రహ్మకును) భేదము కలదను తలంపుతో పూజను చేయుదురు.]

తా. ఇట్లు నేను (బ్రహ్మము) మాయయందుఁ బ్రతిబింబించిన ఈశ్వరుఁడని పిలువఁబడుచున్నను మాయయనునది పై నిరూపణననుసరించి యథార్థముకాదు. కావున (నేను) నిర్వికారుఁడను. సర్వమయుఁడను. ఇట్టి నన్నుఁ దెలిసికొనలేక యజ్ఞానులగువారు "తాము వేఱు నేను వేఱు" అను నభిప్రాయముతో (నన్ను) నుపాసనఁ జేయుచున్నారు. ఒకవిధముగా కాదు. వారియిచ్ఛ వచ్చినట్లు కొందఱు బృహస్పతి యనియు కొందఱు చతుర్ముఖుం డనియుఁ కొందఱు విరాట్పురుషుఁ డనియుఁ మఱికొంద ఱింద్రుఁడనియు వేఱొకకొందఱు విష్ణువనియుఁ శివుఁడనియుఁ వినాయకుఁడనియు నిట్లనేక లనేకవిధములుగా నుపాసన చేయుచున్నారు. నాకంటె వేఱగుపదార్థ మేదియును లేదు. కావున నెవ్వ రెట్లు భావించినను నేనే (బ్రహ్మమే) యగుచున్నాను. వారితలంపుల కెన్ని భేదములున్నను పరమార్థమున నేనొక్కఁడనే.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## విశ్వమునకు నుపాదాననిమిత్తకారణములు.

అవ. మాయను వర్ణించునప్పు డది ప్రపంచమున కుపాదానకారణమని చెప్పఁబడియున్నది. ఇట్లు చెప్పుటచే నీశ్వరుఁడు ప్రపంచమునకు నిమిత్తకారణము మాత్రమే కావలసివచ్చుచున్నాఁడు. ఇదియే సిద్ధాంతమైనచో "అస్తిభాతి ప్రియంరూపం నామ చేత్యంశపంచకం, ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతోద్వయం" అను ప్రమాణము ననుసరించి సిద్ధాంతముచేయఁబడియున్న "ప్రపంచమునందు బ్రహ్మరూపము లగు నస్తి భాతి ప్రియములు కానవచ్చుచున్నవి. కావున ప్రపంచబ్రహ్మలకు భేదములేదు" అను విషయమునకు విరోధము వచ్చును. ఉపాదానకారణమునకును కార్యమునకును భేదము లేకుండునుగాని నిమిత్తకారణమునకును కార్యమునకు నట్లుండ వలసిన యావశ్యకత లేదు కదా. కావున నీ క్రిందిపద్యముతో నీ సంశయమును నివారించుచున్నాఁడు:—

ఆ. వినుము నేను విశ్వమునకు నుపాదాన
కారణము నిమిత్తకారణంబు
నగుచు నూర్ణనాభిపగిది నొప్పుదు నింకఁ
గార్యములును నేన కపివరేణ్య! 34

టీ. కపివరేణ్య=వానరశ్రేష్ఠా ! వినుము, నేను, విశ్వమునకున్=ప్రపంచమునకు, ఉపాదానకారణమును=(మట్టికుండ కుపాదానకారణమైనట్లు) ఉపాదానకారణముగాను (ప్రపంచము బ్రహ్మమునందు భ్రాంతిచేఁ గానవచ్చును. భ్రాంతిచేఁ దోఁచు పదార్థములకు భ్రాంతికంటె వేఱుగుస్వస్వరూపములేదు. భ్రాంతి యనఁగా నవిద్యయే కావున నది ప్రపంచమున కుపాదానకారణమని యింతకుముందుఁ జెప్పియున్నాము. ఎండమావుల యందుఁ దోఁచు నీళ్లు ఎండమావులకంటె వేఱుకానట్లు బ్రహ్మమునందుఁ దోఁచు జగము బ్రహ్మమునకంటె వేఱుకాదు గావున నాబ్రహ్మముకూడ ప్రపంచమున కుపాదానకారణమే యని యిచ్చట చెప్పఁబడె నని తెలిసికొనవలయును), నిమిత్తకారణంబును = (కుండకు కుమ్మరివాఁడు కారణమైనట్లు) నిమిత్తకారణముగాను (మాయ జడము గావున దానిని ప్రేరేపించుబ్రహ్మ నిమిత్తకారణమగును), అగుచున్=ఐ, ఊర్ణనాభిపగిదిన్=సాలెపురుగు వలె, ఒప్పుదున్ = ఉన్నాను. (ఆపురుగు తననుండి వచ్చు దారమును తానే యల్లును గాన నాయల్లిక కుపాదానకారణము నిమిత్తకారణముకూడ నగును.) ఇంకన్ = మఱియు, కార్యములును = మాయవలనఁ బుట్టిన ప్రపంచముకూడ, నేనే-(ఉపాదాన కారణ మగు మట్టికంటె కుండ వేఱుకానట్లు నాకంటె ప్రపంచము వేఱు కాదనుట.)

తా. ఓ వానరశ్రేష్ఠా ! యీశ్వరుఁడు ప్రపంచమునకు నుపాదానకారణము కాకపోవు నను సంశయము నీకు వలదు. మాయకును నాకును బ్రహ్మమునకును భేదము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కలదని చెప్పుటకే యవకాశము లేదని యిదివఱకే చెప్పియున్నాను కదా. ఎండమావు లందుఁ దోఁచు జలముతో శుద్ధజలమునకు భేదము కలుగనివిధమున త్రికాలములయందు నసత్యమై నాయం దూరక తోఁచుచున్న మాయతో నాకు భేదము కలుగదు. కావున నేనే ప్రపంచమున కుపాదానకారణభూతుఁడను. ఉపాదానకారణ మచేతనమైన యెడల దానినుండి కార్యము నుత్పత్తిచేయుటకై చేతనమగు నిమిత్తకారణము వఱి యొకటి కావలసివచ్చును. నేను (బ్రహ్మము) చేతనస్వరూపుఁడనే యగుటచేత నీ ప్రపంచమునకు వేఱొక నిమిత్తకారణముతోఁ బని లేదు. కావున నీప్రపంచమునకు నిమిత్తకారణభూతుఁడను కూడ నేనే. ఉపాదానకారణ మగుటచే కార్యరూపమగు నీ ప్రపంచముగూడ నేనే. ఉపాదానకారణమునకును గార్యమునకును భేద మెచ్చటను లేదు కదా.

వ. ఇట్లు సర్వేశ్వరుండ నైననాకు నవ్యాకృతంబు మహానందమయకో శంబు నగు, సమస్తభూతసమష్ట్యజ్ఞానంబు కారణశరీరంబు, మహా సుషుప్తియవస్థ,బ్రహ్మాదిస్తంబపర్యంతంబు లైనసకలభూతంబు లవయ వంబులు,జగదుత్పత్తిస్థితిలయంబులు వ్యాపారంబులు, వేదశాస్త్రం బులు నిశ్శ్వాసంబు లై యొప్పునని చెప్పి వెండియు నిట్లనియె. 35

టీ. ఇట్లు=ఈవిధముగా, సర్వేశ్వరుండనైన నాకున్ = సర్వమునకు ప్రభువునైన నాకు, అవ్యాకృతంబు = నామరూపములు లేనట్టియు, మహానందమయకోశంబును = సమష్ట్యానందమయకోశంబును (సుషుప్తియందుఁ దోఁచు నానంద మానందమయకోశము. ఒకజీవునకు తోఁచునది వ్యష్ట్యానందమయకోశము. సర్వప్రపంచము నేకశరీరముగాఁ గొనినప్పుడు చెప్పఁదగిన యానందమయకోశము సమష్ట్యానందమయకోశము), అగు... నంబు-అగు = ఐనట్టి, సమస్తభూత = సర్వభూతములయొక్క, (ప్రపంచముయొక్క), సమష్ట్యజ్ఞానంబు = సర్వజీవులకుఁగల యజ్ఞానము, కారణశరీరంబు = (నాకు) కారణ శరీరము. (జీవభ్రాంతి కజ్ఞానము కారణ మగుటచేతను జ్ఞానముచే నశించుఁ గావునను కారణశరీరమని చెప్పఁబడును. శీర్యతే ఇతి శరీరం = నశించును గావున శరీరము. అని యుత్పత్తి) మహాసుషుప్తి = సమష్టిసుషుప్తి (ఇది యిదివఱకే వివరింపఁబడియున్నది), అవస్థ = జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు (క్రమముగ స్థూలసూక్ష్మశరీర కారణములకు సంబంధించినవి కావున నీ యీశ్వరునకుఁగల సమష్టి యజ్ఞాన కారణ శరీరరూపమునకు సంబంధించిన యవస్థ సమష్టిసుషుప్తియని తెలిసికొనవలయును) బ్రహ్మా...బులు- బ్రహ్మాది=బ్రహ్మము మొదలు, స్తంబపర్యంతంబులు = గడ్డిపోఁచవఱకుఁ గలవి, ఐన సకల భూతంబులు = ఐనట్టి సర్వజంతువులును, అవయవంబులు = అవయవములవంటివి (సకల ప్రపంచము నొక శరీరముగాఁ గొనినచో నందలి ప్రాణు లవయవము లగుటలో సంశ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యము లేదని భావము.) జగదుత్పత్తి స్థితిలయంబులు = ప్రపంచసృష్టి స్థితి లయములే, వ్యాపారంబులు = పనులు, వేదశాస్త్రంబులు-వేద = చతుర్వేదములును, శాస్త్రంబులు = వ్యాకరణాది సర్వశాస్త్రములును, నిశ్వాసంబులై=నిట్టూర్పులవంటివై, ఒప్పుఁ=ఉన్నవి, అని చెప్పి వెండియు నిట్లనియె = మఱియు నీ క్రిందివిధముగా చెప్పఁబోవుచున్నాఁడు.

తా. ఈవిధముగా సర్వమయుఁడనై సర్వనియామకుఁడనైయున్న నాకు నామ రూపములు లేనట్టియు సమష్ట్యానందమయకోశరూప మైనట్టియు (సుషుప్త్యవస్థయం దనుభవింపఁబడు నానంద మానందమయకోశమనఁబడును. అది యొక్కజంతువునుగూర్చి మాటలాడునప్పుడు వ్యష్ట్యానందమయకోశమనియుఁ బ్రపంచమునంతయు నేక శరీర ముగాఁగొని మాటలాడునప్పుడు సమష్ట్యానందమయకోశమనియుఁ జెప్పఁబడును. ఇట్లే వ్యష్టిసమష్టిపదములఁ బ్రయోగించిన స్థలములం దంతట నూహించుకొనునది), సమష్ట్యజ్ఞానమే కారణశరీరము. సమష్టిసుషుప్తియే యవస్థ. సర్వభూతములు నవయవములు. సర్వవేదములును నిశ్వాసములునై యున్నవి. ఓ పార్వతీ ! ఇట్లు సంక్షేపముగా నీశ్వర రూపమును జెప్పి దానినే వివరించుచున్నాఁడు.

## జీ వ ని ర్ణ య ము.

అవ. ఇట్లు మాయావరణమువలనఁ గలిగిన కార్యమును నిరూపించి రెండవదియగు నవిద్యచేతఁ గలిగిన యావరణమువలన నైనకార్యమును నిరూపించుచున్నాఁడు:—

తే. మలినసత్త్వప్రధాన యౌ నలయవిద్య
దానియందు నధిష్ఠాన మైన నేను
బ్రతిఫలించితిఁ గలశసంగతజలముల
సాభ్రనక్షత్రఖచ్ఛాయచందమునను. 35

టీ. అలయవిద్య = పైఁ జెప్పఁబడినయవిద్య (మాయయనియు నవిద్యయనియు ప్రకృతి రెండువిధములని యిదివఱకే నిరూపింపఁబడియున్నది.) మలినసత్త్వప్రధాన = అపరిశుద్ధమగు (అనఁగా : రజోగుణసంసర్గ గల) సత్త్వగుణమే స్వరూపముగాఁగలది, ఔఁ = అగును, దానియందుఁ = ఆయవిద్యయందు, అధిష్ఠానమైననేను = దాని కాధారభూతుఁడ నైనట్టి నేను (మాయావిద్యలు రెండును ప్రకృతియే కావున దాని కాధార మగుపరబ్రహ్మమే అవిద్యకుఁగూడ నాధార మని తెలిసికొనవలయును.), కలశ సంగతజలములఁ =కుండయం దున్ననీటిలో, సాభ్రనక్షత్రఖచ్ఛాయచందమునఁ = మేఘ ములతోను నక్షత్రములతోను గూడినయాకాశము ప్రతిబింబించినట్లు, ప్రతిఫలించితిఁ =ప్రతిబింబించితిని, "కార్యోపాధి రయం జీవః కారణోపాధి రీశ్వరః" అనువాక్యమును బట్టి యిచ్చటఁ జూపఁబడినదృష్టాంతము నన్వయించుకొనవలయును. (ఎట్లనఁగా మేఘము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లందున్న జలములు కలశమునం దున్నజలములకు కారణ మనుట స్పష్టముకదా. మేఘోదకమందును కలశోదకమందును గూడ నాకాశము ప్రతిబింబించును. ఈకారణకార్యరూపము లగురెండుదకములకును ఆకాశమే యాధారము. అవకాశ మిచ్చునదియే యాకాశము కదా. ఇట్లే బ్రహ్మము కూడ కార్యకారణరూపిణు లగునవిద్యామాయలకు నాధారమై యుండియుండును వానియందుఁ బ్రతిబింబించి క్రమముగ జీవేశ్వరసంజ్ఞలను బొందుచున్నాఁ డని భావము.)

తా. ఆకాశము సర్వాధార మనుట స్పష్టము. అది యసంగ మయ్యు మేఘగతజలములందుఁ బ్రతిబింబించి యుండియు మరల మేఘజలమునుండియే యుత్పన్నమై ఘటమం దునుపఁబడి యున్నజలమునందు మేఘనక్షత్రాదులతోఁ గూడఁ బ్రతిబింబించును. ఇట్లే నేనును కారణభూత మగుమాయకును గూడ నాధారభూతుఁడ నయ్యు మాయయందుఁ బ్రతిబింబించి యుండియు మరల నవిద్యయందుఁ గూడఁ బ్రతిబింబించితిని. ఆకాశ మెన్ని మాఱులు ప్రతిబింబించినను అసంగమె యగునట్లు నేనును (బ్రహ్మయును) ఎన్నిమాఱులు ప్రతిబింబించినను అసంగుఁడనే. అవిద్య యనిన సత్త్వప్రధాన యని యిదివఱకే చెప్పియున్నాను. నామరూపములే ప్రపంచము కావున నామరూపాత్మకములగు త్రిగుణములు ప్రకాశింపక లీనమై యుండునవస్థ మాయయనియుఁ ప్రకాశింప నారంభించినస్థితి యవిద్యయనియు నీ కారణమువలన మాయ యవిద్యకుఁ గారణ మగుననియుఁ దెలిసికొనవలయును.

క. జీవుం డగునాతఁ డవిద్యావశుఁడై స్థూలసూక్ష్మతనువాసనలన్
భావించుచు సేవించుచుఁ, గేవలమూఢప్రవృత్తిఁ గ్రీడించు మెయిన్.

టీ. అతఁడు = ఆబ్రహ్మప్రతిబింబము, జీవుండగు = జీవుఁడని చెప్పఁబడుచున్నాఁడు. అవిద్యావశుఁడై=తనకుపాధియగు నవిద్యకు లోఁబడి (అనఁగా: గుణముల యొక్క వికారములవలన తనకుఁ దానే ప్రపంచరూపముగఁ దోఁచును ; గుణముల విజృంభణమే యవిద్య యనియుఁ వికారశూన్యములై యవి సమముగ శుద్ధములుగ నొకదానితో నొకటి చేరనివిగ నుండుటయే మాయ యనియుఁ తెలిసికొనవలయును. మూఁడుగుణములును సమానముగా నున్నప్పుడు అం దత్యుత్తమ మగుసత్త్వగుణమే మిగులఁ బ్రకాశించును. కావున "మాయ శుద్ధసత్త్వప్రధాన" అని చెప్పఁబడినది), స్థూలసూక్ష్మతనువాసనలన్ = స్థూలసూక్ష్మశరీరజన్య సంస్కారములచేత (అనఁగా: ననాది యగు దేహాభిమానముచేత), భావించుచున్ = ఆశరీరములే తానుగాఁ దలంచుచు, సేవించుచున్ = ఇంద్రియాదులచే బాహ్యవిషయముల గ్రహించి శరీరమనంబులకు సౌఖ్యముఁ గలిగించి అది తనకే కలిగెనని తలంపుతో సంతసించుచు దుఃఖము కలుగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నట్లున్న నది తనకే కలుగునని భయముతో (దానిని) నివారింపఁజూచుచు (ఇదియే జీవుఁడు దేహమునకుఁ జేయుసేవ), కేవల మూఢప్రవృత్తిమెయిన్ = సంపూర్ణముగ మూఢునివలె కార్యములఁజేయుచు, క్రీడించున్ = విహరించుచుండును. (ఆజీవుఁడు పరమాత్మయే యగుటచేత నిది యాతనికిఁ గ్రీడయగునే కాని బంధము కానేర దని భావము. "న నిరోధో న చోత్పత్తిః న వంధ్యో న చ శాసనం, న ముముక్షా న ముక్తి శ్చ ఇత్యేషా పరమార్థతా" "ప్రళయము, సృష్టి, ప్రభువు, ఆజ్ఞాపించుట, మోక్షేచ్ఛ, ముక్తి అనునివి యన్నియు పరమార్థస్థితిలో లేవు." అను నుపనిషద్వాక్యముచే నుత్పత్తి ప్రళయాదులవలెనే బంధముకూడ వ్యావహారికమేకాని పారమార్థికము కాదని తెలియఁజేయఁబడుచున్నది. ముక్తి పారమార్థికము కాకున్న బంధ మెట్లు పారమార్థిక మగును.)

తా. అట్లు ప్రతిబింబించి నేనే జీవుఁడ నని చెప్పఁబడుచున్నాను. ఆయవిద్య మలినసత్త్వప్రధానము కావున దానిచే నాకు వికారములు గలిగినట్లు తోఁచుచున్నది. (అనఁగా: స్వయముగనే తోఁచుచున్నది.) దానికి నేను వశగతుఁడనైతిని. ఇట్లా యవిద్యనుఁ జిక్కి సూక్ష్మస్థూలసంస్కారముల నొంది యాస్థూలసూక్ష్మదేహములయం దభిమానము గలిగి యవియే యాత్మగాఁ దలంచుచు వానిచే సేవించుచు నజ్ఞానివలె సంచరించుచున్నాను.

ఆ. అతఁడు ప్రాజ్ఞుఁ డనఁగ నానందమయుఁ డనఁ
బారమార్థికుఁ డనఁ బరఁగు చుండు
వ్యష్టికారణాంగవశుఁ డై సుషుప్తిసు
ఖానుభూతి మరగి యనిలతనయ! 39

టీ. అనిలతనయ = వాయుపుత్రా ! అతఁడు=ఆజీవుఁడు, వ్యష్టికారణాంగవశుఁడై=వ్యష్టికారణశరీరములగు (జీవులకు ప్రత్యేకముగ కారణశరీరమగు) నవిద్యకు స్వాధీనుఁడై, సుషుప్తిసుఖానుభూతిన్ - సుషుప్తి = సుషుప్త్యవస్థయందలి, సుఖ = సౌఖ్యము యొక్క, అనుభూతిన్ = అనుభవమునందు, మరగి = ప్రీతిగలవాఁడై, (ఈశ్వరుని కారణశరీరమునకు సమష్టి సుషుప్తియే రూప మని చెప్పఁబడెను. కావున జీవకారణ శరీరమునకు వ్యష్టి సుషుప్తియే రూప మని తెలిసికొనవలయును.) ప్రాజ్ఞుఁడనఁగన్ = ప్రాజ్ఞుఁడను పేరుతోను (స్వప్రకాశుఁ డగుటచే నీపేరు వచ్చినది), ఆనందమయుఁ డనన్ = ఆనందమయుఁడను పేరుతోను (ఆకారణశరీరముయొక్క యవస్థయు సుషుప్తియే కావున నందలి యానందము ననుభవించువాఁడగుటచే నీపేరు గలిగినది.), పారమార్థికుఁడనన్ = పారమార్థికుఁ డను పేరుతోను (పారమార్థికుఁ డనఁగా నిత్యుఁడు, సుషుప్త్యవస్థయం దెట్లో అట్లే జాగ్రత్స్వప్నములయందు కూడ నుండి ఆయవస్థలకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మార్పు కలిగినపుడు స్వస్వరూపమునకు మార్పు లేక యుండువాఁ డగుటచే నీపేరు వచ్చినది), పరగుచుండుర్ = వ్యవహరింపఁబడుచున్నాఁడు.

తా. ఓయాంజనేయా! ఆజీవునకు వ్యష్ట్యజ్ఞానము (అనఁగా నవిద్య) కారణశరీరము. వ్యష్టిసుషుప్తియె యవస్థ. ఆసుషుప్తియందలి యానందము ననుభవించువాఁడు కావున నానందమయుఁ డనియు, స్వప్రకాశమున కెప్పటికిని హాని లేకపోవుటచేఁ బ్రాజ్ఞుఁడనియు నాతఁడు పిలువంబడుచున్నాఁడు. సుషుప్త్యవస్థయందలి యానందమే యానందమయాకాశమనియు సమష్ట్యానందమయాకాశమే యీశ్వరుని యానందమయాకాశమనియు నావలకే చెప్పియున్నాను. కావున వ్యష్ట్యానందమయాకాశము జీవుని యానందమయాకాశ మని యిచ్చట తెలిసికొనవలయును. మఱియు నాతఁడు సుషుప్త్యవస్థయందువలెనే జాగ్రత్స్వప్నములయందుఁ గూడ సాక్షియై యున్నాఁడు. కావునను అవస్థలకు మార్పులు (అనఁగా: నుత్పత్తివినాశములు) కలిగినను స్వయముగ మార్పులం జెందఁడు. కావునను బారమార్థికుఁ డనునామధేయముతోఁ గూడ వ్యవహరింపఁబడుచున్నాఁడు.

వ. ఇట్లవిద్యయు నవిద్యాప్రతిబింబంబుఁ దదధిష్ఠానచైతన్యంబుం గూడి జీవుం డనం బరఁగు నాజీవున కానందమయకోశసంజ్ఞికంబైన వ్యష్ట్యజ్ఞానంబు కారణశరీరంబు సుషుప్తి యవస్థ యగు నారెంటియందు నభిమానంబు గలయతండు ప్రాజ్ఞుం డన నొప్పునతని కింతమాత్రంబుచేత జీవత్వంబు పర్యాప్తంబు గామింజేసి తదీయాదృష్టసహాయపూర్వకసూక్ష్మశరీరసృష్టిప్రకారంబు చెప్పెద విను మని యిట్లనియె. 39

టీ. ఇట్లు = పైఁజెప్పఁబడినరీతిగా, అవిద్యయుర్ = మలినసత్త్వప్రధాన యగు నాకార్యోపాధియు, అవిద్యాప్రతిబింబంబును = అందలి బ్రహ్మప్రతిబింబమును, తదధిష్ఠానచైతన్యంబును = దాని కాధారభూత మగుబ్రహ్మమును, కూడి = కలసి, జీవుండనం బరఁగుర్ = జీవుఁడని చెప్పఁబడును. ఆజీవునకుర్, ఆనందమయకోశసంజ్ఞికంబైన = ఆనందమయకోశ మను పేరుగల (సుషుప్తియందు ఇంద్రియాదులు నశింపఁగా నిలచియుండి సౌఖ్య మొసంగునది యజ్ఞానమే కావుననే దాని కానందమయకోశ మని పేరు. కోశ మనఁగా నాచ్ఛాదనము ఆయజ్ఞానము ఆనందరూపముతో జీవేశ్వరుల నాచ్ఛాదించును గావున వారల కది యానందమయకోశము). వ్యష్ట్యజ్ఞానంబు = ప్రత్యేకాజ్ఞానము, కారణశరీరంబు = కారణశరీర మగును, సుషుప్త్యవస్థయగుర్ = వ్యష్టిసుషుప్తియే యాశరీరమునకు సంబంధించినయవస్థ, ఆరెంటియందుర్ = పైఁ జెప్పినశరీరమందును, అవస్థయందును, అభిమానంబుగలయతండు = "నేను" అను నభిమానము గలవాఁడు (జీవుఁడు),

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రాజ్ఞుండనఁగొప్పుక్ = ప్రాజ్ఞుఁ డను పేర ప్రకాశించుచున్నాఁడు. అతనికిన్ = అప్రా జ్ఞునకు, ఇంతమాత్రంబుచేతక్=ఒక కారణశరీరము కలిగినంతమాత్రమున, జీవత్వంబు = జీవధర్మము, ("ప్రాణానాం ధారణా జ్జీవః" అను వాక్యముచేఁ బ్రాణవాయువుల ధరించుటయే జీవధర్మము. కారణశరీరమునందు ప్రాణములు లేవు. కావున నింతమాత్ర ముతో జీవత్వము పరిపూర్ణము కాదు.) పర్యాప్తంబు = సంపూర్ణము, కామింజేసి = కాకపోవుటచేత, తదీ...రంబు - తదీయ = ఆజీవసంబంధమైన, అదృష్ట = కర్మ యొక్క, (కర్మమను ప్రపంచమునకును ఆది యిప్పుడనియుఁ నంత మిప్పుడనియుఁ చెప్ప టకు వీలు లేదు. కావున సృష్టినిగుఱించి విచారింపవలసివచ్చినప్పుడు "మొట్టమొదటి సృష్టి యెట్లు జరిగెను" అని విచారించుటకు వీలు లేదు. "ప్రస్తుతప్రపంచము పూర్వ కల్పాంతరమున మరల నెట్లుత్పన్నమయ్యెను." అని మాత్రమే విచారింపవలయును. ఈ విషయము కూడ ప్రకరణారంభమున గ్రంథకర్తచే వివరింపఁబడెను. కావున ప్రస్తుతమున నున్నజీవులకుఁ గలసూక్ష్మ, స్థూలశరీరములు మొదలగునవి పూర్వసృష్టి యందు వారొనర్చియున్నకర్మలను బట్టియే జనించును. అని భావము.) సహాయపూర్వక = సహాయముతోఁగూడిన, సూక్ష్మశరీరసృష్టిప్రకారంబు = సూక్ష్మశరీరోత్పత్తియొక్క విధమును, చెప్పెదక్ = వినుము. అని, ఇట్లు, అనియెన్ = ఈక్రిందివిధముగా చెప్ప నారంభించెను.

తా. ఈవిధముగా మలినసత్త్వప్రధాన యగునవిద్యయు దానియందలి నా (బ్రహ్మ) ప్రతిబింబంబును వాని కన్నింటికి నాధారభూతమైన శుద్ధచైతన్యంబును గలసి జీవుఁడని వ్యవహరింపఁబడుచున్నవి. ఆజీవునికి నానందమయకోశ మనఁబడు చున్న వ్యష్టిజ్ఞానమె కారణశరీరము. వ్యష్టిసుషుప్తియే యవస్థ. ఈరెంటియందును నభిమానము గలయాతనికి (లేక గలిగినప్పుడు) ప్రాజ్ఞుండని పేరు. "ప్రాణానాం ధారణా జ్జీవః" అను మొదలగు ప్రమాణములవలనఁ బ్రాణముల కధికారి యగునంత వఱకు నాజీవునిజీవత్వంబు పరిపూర్ణము కాదు. కావున పిదప సూక్ష్మప్రపంచసృష్టి కలిగెను. ప్రపంచ మనాది యని చెప్పితిని కదా! ఆకారణమునకు నీసూక్ష్మసృష్టి కలుగుటకు నాజీవుల యదృష్టమే. (అనఁగా పూర్వకర్మలె) సహాయములు. ఈజీవత్వ మనాది కావున దేహాభిమానమువలనఁ బూర్వకల్పమున (వారిచే) నొనర్పఁబడి సంచిత ములై యున్నకర్మముల ఫలముల నొసంగుస్థితికి రాఁగానే యుత్తరకల్ప మారంభమై క్రమక్రమముగ సూక్ష్మస్థూలసృష్టులు కలుగుచుండును. ఓగౌరీ! ఇట్లు సూక్ష్మసృష్టికిఁ గారణము నిరూపించి దత్ప్రకారము నెఱింగించువాఁడై రామచంద్రుఁ డాంజనేయు నితో ని ట్లనియె.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## సూక్ష్మశరీరసృష్టిప్రకారము.

అవ. సూక్ష్మసృష్టిప్రకారమును సవిమర్శనముగ వివరించుచున్నాఁడు:—

తే. అమలసత్త్వప్రధాన మాయాసమన్వి
తేశ్వరుఁడ నగునేను సృష్టీచ్ఛచేతఁ
బూని వీక్షించితిఁ దమఃప్రధానమాయ
నఖిలచేతనకర్మ సహాయముగను. 40

టీ. అమల...డన్ - అమలసత్త్వప్రధానమాయా=అమలసత్త్వప్రధానమైన మాయతో, సమన్విత=కూడిన, ఈశ్వరుఁడన్ = ఈశ్వరుఁడను, అగునేను = అయినట్టి నేను (బ్రహ్మము), సృష్టీచ్ఛచేతన్ = ప్రపంచమును సృజింపవలయు ననుతలంపుచే (మాయయందు ప్రతిబింబించుటయే సంకల్ప మని తెలిసికొనవలయును), తమఃప్రధానమాయన్ = తమోగుణమే ముఖ్యముగాఁ గలిగినమాయను, (అనఁగా: అవిద్యను, మలినసత్త్వ మనినను తమ స్సనినను కొంచెమించుమించుగా నొక్కటియే. పేనఁబడిన దారమువలె సత్త్వాదిగుణము లొకదాని నొకటి యెప్పటికిని విడువవు. మాయయందున్న గుణము లొకదాని నొకటి తిరస్కరింపనేరవు. అవిద్యయం దున్నవి తిరస్కరించును. అని తెలిసికొనవలయును.) అఖి...గన్-అఖిలచేతన = సమస్తజీవులయొక్క, కర్మ = (పూర్వసృష్టినుండి వచ్చి మాయయందు వాసనారూపముతో నున్న) కర్మలకు, సహాయముగన్ = సహాయముఁ జేయుటకై (అనఁగా : కర్మానురూపము లగుబహువిధ భోగ పదార్థములను నిర్మించుటకై తోఁచునట్లుఁజేయుటకై), పూనివీక్షించితిన్ = ప్రయత్న పూర్వకముగఁ జూచితిని.

తా. ఇఁక నాసూక్ష్మసృష్టి యైనరీతిం జెల్పెద వినుము. పూర్వకల్పమున జీవులచే సంచితము లైయున్నకర్మలు ఫలోన్ముఖములు కాఁగానే మాయావరణమునందుఁ బ్రతి బింబించి స్వతంత్రుఁడనై యీశ్వరశబ్దవాచ్యుఁడనై యున్న నాకు సృజింపవలయు నను సంకల్పము కలిగెను. సృజించుట యనఁగా నామరూపములఁ బ్రకాశింపఁజేయుట యనియే యర్థము కాని నాకంటె వేఱుగా నొక్కదానిని గల్పించుటయని యర్థము కాదని యిదివఱకె చెప్పియున్నాము. కావున నేను స్వయముగానే యనేకనామరూప ముల కలవాఁడను కావలయు నను నిచ్ఛ నాకు జనించెను. ఆయిచ్ఛ పరిపూర్ణమగుటకు మలినసత్త్వప్రధాన యగుమాయను (అవిద్యను) బ్రేరేపించితిని. దానిసహాయములేక కర్మలుమాత్ర మేకార్యమును (అనఁగాఁ బ్రపంచసృష్టిని) సాధింపనేరవుకదా.

వ. ఇట్లు చూచిననాతమఃప్రధానసమష్ట్యజ్ఞానావచ్ఛిన్నచైతన్యంబువలన శబ్దగుణాకాశంబు నయ్యాకాశావచ్ఛిన్నచైతన్యంబువలన స్పర్శ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గుణ కానిలంబు నయ్యనిలావచ్ఛిన్న చైతన్యంబువలన రూపగుణ కాన లంబు నయ్యనలావచ్ఛిన్న చైతన్యంబువలన రసగుణకజలంబు నజ్జలా వచ్ఛిన్న చైతన్యంబువలన గంధగుణకపృథివియుం బుట్టె నివి యపంచీ కృతసూక్ష్మభూతంబు లనియుఁ బంచతన్మాత్ర లనియుం జెప్పంబడు నీభూతపంచక ప్రత్యేకసత్త్వగుణార్ధంబులవలనఁ గ్రమంబున దిగ్వా తార్క ప్రచేతోశ్వినీదేవతాసమన్విత శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణం బులు జనియించె మిగిలినసత్త్వార్ధసమష్టివలనఁ జంద్రవాచస్పతిరుద్ర క్షేత్రజ్ఞదేవతాయుక్తమనోబుద్ధ్యహంకారచిత్తంబులునుసంభవించె నవ్వియదాదిపంచకరజోగుణార్ధంబువలన వరుసందోడన వహ్నీంద్రో పేంద్రమృత్యుప్రజాపతి దేవతాసమేతవాక్పాణిపాదపాయూపస్థలు జన్మించెఁ దక్కినరజోగుణార్ధసమష్టివలన విశిష్టవిశ్వకర్తృవిశ్వయో న్యజజయదేవతాకప్రాణాపానవ్యానోదానసమానంబు లుద్భవించె నివ్విధంబున నుత్పన్నంబు లైనజ్ఞానేంద్రియపంచకంబు నంతఃకరణ చతుష్టయంబుఁ గర్మేంద్రియపంచకంబుఁ బ్రాణాదిపంచకంబుం గూడియే కోనవింశత్యవయవంబుల లింగశరీరంబు గలిగె నీసూక్ష్మదేహంబు వృక్ష వనంబులభంగి నొక్కటి వ్యష్టి యనియు సర్వంబు సమష్టి యనియుం జెప్పనొప్పు. వీనికి వ్యష్టిసమష్టిస్వప్నంబు లవస్థలగు నీవ్యష్టి సూక్ష్మాంగస్వప్నంబులయం దాప్రాజ్ఞుం డభిమాని యై ప్రాతిభాసి కుండు స్వప్నకల్పితుండుఁ దైజసుండనం బ్రవర్తిల్లు నాసమష్టి సూక్ష్మ కాయస్వప్నవిశిష్టుండ నై యీశ్వరుండ నయిననేను హిరణ్యా గర్భుఁడు సూత్రాత్మకుండుఁ బ్రాణుం డన సర్వజీవోపాస్యుండనై యుండుదు నిది సూక్ష్మసృష్టి తెఱం గింక స్థూలప్రపంచప్రకారంబు వినుపించెద విను మని యి ట్లనియె. 41

టీ. ఇట్లుచూచినన్ = ఈవిధముగానే నవిద్యను వీక్షింపఁగానే, అత...లన్- అతమఃప్రధాన=పైఁజెప్పఁబడిన తమోగుణప్రధాన యగు (అనఁగా మలినసత్త్వప్రధాన యగు), సమష్ట్యజ్ఞాన = సమష్ట్యజ్ఞానరూపిణి యగునవిద్యచే (సమష్టివ్యష్టులనుగూర్చి బాగుగ నిదివఱకే వివరింపఁబడియున్నది.), అవచ్ఛిన్న=ఆవరింపఁబడిన (అనఁగా దాని యందు ప్రతిబింబించియున్న), చైతన్యంబువలనన్ = బ్రహ్మమువలన, శబ్దగుణాకాశం బును=శబ్దమే గుణముగాఁగల యాకాశభూతంబును, అయ్యా...లన్-అయ్యాకాశ= అట్లు జనించినయాకాశభూతముచే, అవచ్ఛిన్న = ఆవరింపఁబడియున్న (పరబ్రహ్మ సర్వవ్యాపకుఁడుకావున నాకాశమువలె క్రొత్తగా నుత్పత్తి యగుపదార్థములయందు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కూడ వ్యాపించుచుండును. మనము శ్రోత్రగా నొకబావి త్రవ్వినచో దానియందు కూడ నీయాకాశము నిండియే యుండునుకదా ! (ఇదియే ఇట్లు వ్యాపించు చుండుటయే) యిచ్చట నవచ్ఛిన్నపదముచే వ్యవహరింపఁబడుచున్నది), చైతన్యంబువలన్ = పరబ్రహ్మమునుండి, స్పర్శగుణకానిలంబును = స్పర్శయే గుణముగాఁ గలవాయుభూతంబును, అయ్యు...నన్-అయ్యనిల = ఆవాయుభూతముచేత, అవచ్ఛిన్న=ఆవరింపఁబడిన (అనఁగా దానియందు వ్యాపించిన), చైతన్యంబువలన్ = పరమాత్మనుండి, రూప...బును-రూపగుణక = రూపమేగుణముగాఁగల, అనలంబును = అగ్నిభూతంబును, అయ్యనలావచ్ఛిన్నచైతన్యంబువలన్ =ఆయగ్నిచేనావరింపఁబడినపరబ్రహ్మమువలన, రసగు... జలంబును-రసగుణక = రుచియే గుణముగాఁగల (మధురరసముగల జలమునందుఁ గాన వచ్చునితరరసములు పృథివీసంబంధమువలన వచ్చెనని తెలిసికొనవలయును), జలంబును = జలభూతంబును, అజ్జ...లన్-అజ్జల=ఆజలభూతముచే, అవచ్ఛిన్న = ఆవరింపఁబడిన, చైతన్యంబువలన్ =పరబ్రహ్మమువలన, గంధ...యుర్ - గంధగుణక = గంధమే గుణముగాఁ గల (ఈచెప్పఁబడిన గుణములు ఆయాభూతములకుఁ గలవిశేషగుణములే యనియుఁ నాకాశాదిగ క్రమమున శబ్దము శబ్దస్పర్శములును శబ్దస్పర్శరూపములును శబ్దస్పర్శరూపరసములును శబ్దస్పర్శరూపరసగంధములును భూతగుణము లని గ్రహింపవలయును.), పృథివియున్ = పృథ్వీభూతంబును, పుట్టెన్ = సృష్టియయ్యెను. ఇవి = ఈపంచభూతములును, అప...బులు - అపంచీకృత = పంచీకరణముచేయఁబడని (పంచీకరణప్రకారము దిగువ గ్రంథమునందే వివరింపఁబడును), సూక్ష్మభూతములు = ఇంద్రియములకు గోచరము కానిభూతములు (ఆకాశాదులకు భూతములని సంకేతనామము), అనియున్, పంచతన్మాత్రలనియున్ = పంచతన్మాత్ర లని (తన్మాత్ర=అదియే); అనఁగా: రెండవపదార్థముతో సంసర్గ లేనిది, చెప్పంబడున్ =చెప్పఁబడుచున్నది. ఈ...వలన్-ఈభూతపంచక = పైఁ జెప్పినపంచసూక్ష్మభూతములయొక్క, ప్రత్యేక = వ్యష్టియైన, సత్త్వగుణార్థంబువలన్ =సత్త్వగుణముతోఁ గూడినయర్ధభాగమువలన (ఈభూతములు మలినసత్త్వప్రధానావచ్ఛిన్నచైతన్యమునుండి పుట్టినవి కావున వీనియందు సత్త్వరజస్తమోగుణభాగములుండును. ప్రత్యేకముగలసత్త్వగుణము వ్యష్టిసత్త్వగుణ మనియు పంచభూతములయందు మొత్తముగానున్న సత్త్వగుణము సమష్టిసత్త్వగుణ మనియుఁ జెప్పఁబడును. అందు వ్యష్టిసత్త్వగుణము లందలి యర్ధభాగములవలన), క్రమంబునన్ = వరుసగా, దిగ్వా...బులు-దిక్ =దిక్కులు, వాత = వాయువు, అర్క = సూర్యుఁడు, ప్రచేతః=వరుణుఁడు, అశ్వినీదేవతా=అశ్వినులు అనునధిదేవతలతో, సమన్విత = కూడిన, శ్రోత్ర=చెవి, త్వక్ =చర్మము, చక్షుః=నేత్రములు, జిహ్వా=నాలుక, ఘ్రాణంబులు = నాసిక అనునింద్రియములు (ఈయింద్రియములు, క్రమముగా శబ్దస్పర్శరూపరసగంధములను గ్రహించునవి. ఏభూతమువలనఁ బుట్టినయింద్రియ మాభూతముయొక్క గుణము నే గ్రహించు నని తెలిసికొనవలయును), జనియించెన్ =పుట్టెను. మిగిలిన...వలన్-మిగిలిన = తక్కిన, సత్వార్థ = సత్త్వగుణయుక్తార్థభాగములయొక్క, సమష్టివలన్ = సముదాయమునుండి, చంద్ర...చిత్తంబులు-చంద్ర=చంద్రుఁడు, వాచస్పతి = బృహ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్పతి, రుద్ర=ఈశ్వరుఁడు, క్షేత్రజ్ఞ=క్షేత్రజ్ఞుఁడు (జీవుఁడు), దేవతాయుక్త=అను నధిదేవతలతోఁగూడిన, మనః=మనస్సు, బుద్ధి, అహంకార=అహంకారము, చిత్తంబులును=చిత్తము అనునవి (ఈనాల్గింటికి అంతఃకరణ మని పేరు. సంకల్పించుట నిశ్చయించుట అభిమానించుట సందేహించుట అను వ్యాపారభేదములవలన పదార్థ మొక్కటియేయైనను దానికి మనస్సు మొదలగు పేర్లతో వ్యవహారము గలుఁగుచున్నది.), సంభవించెన్=పుట్టినవి, అవ్వి...వలనన్-అవ్వియదాదిపంచక = ఆకాశాదిపంచభూతములయొక్క, రజోగుణార్ధంబువలనన్ = రజోగుణసంబంధ మగునర్ధభాగమువలన, వరుసన్=క్రమముగా, తోడన=వెంటనే, వహ్నీం...లు - వహ్ని=అగ్ని, ఇంద్ర = ఇంద్రుఁడు, ఉపేంద్ర=విష్ణువు, మృత్యు=మృత్యుదేవత, ప్రజాపతి=చతుర్ముఖుఁడు; దేవతాసమేత = అనునధిదేవతలతోఁగూడిన, వాక్=వాక్కు, పాణి = హస్తములు, పాద=పాదములు, పాయుః=గుదము, ఉపస్థలు=గుహ్యము అను కర్మేంద్రియములు, జన్మించెన్ = పుట్టెను. (ఏయే భూతమువలన నేయే యింద్రియము జనించెనో ఆయాభూతమువలననే దానిదాని యధిదేవత కూడ జనించె నని తెలిసికొనవలయును. ప్రతీంద్రియమునకును తనకృత్యము నాచరింపఁగలసామర్థ్య మధిదేవతవలననే కలుగును.) తక్కిన...లన్ - తక్కిన = మిగిలియున్న, రజోగుణ=రజోగుణమయమగు, అర్ధ=అర్ధభాగములయొక్క, సమష్టివలనన్ = సముదాయమువలన (ఇట్లు చెప్పుటచే కర్మేంద్రియములు వ్యష్టివలన జనించెనని తెలిసికొనవలయును) విశిష్ట, విశ్వకర్తృవిశ్వయోన్యజజయదేవతాక,ప్రాణాపానవ్యానోదానసమానంబులు=విశిష్టుఁడు విశ్వకర్త విశ్వయోని అజుఁడు జయుఁడు అనునధిదేవతలుగల (అనఁగా నధిదేవలతతోఁ గూడిన)ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము అనుపంచప్రాణములు(వాయు వొకటియేయైనను వృత్తిభేదమువలన నామభేదముకలిగెను. పంచప్రాణవృత్తులు ప్రథమాశ్వాసములో వివరింపఁబడియున్నవి.),ఉద్భవించెన్=పుట్టెను. ఇవ్విధంబునన్=ఈవిధముగా,ఉత్పన్నంబులైన=పుట్టిన, జ్ఞానేంద్రియపంచకంబును=శ్రోత్రాదులగు నైదు జ్ఞానేంద్రియములును, అంతఃకరణచతుష్టయంబును=మనస్సు మొదలగు నాలుగంతఃకరణములును, కర్మేంద్రియపంచకంబును=వాక్కు మొదలగు నైదుకర్మేంద్రియములును (జ్ఞానేంద్రియములనఁగా తెలుసుకొనునింద్రియములు; కర్మేంద్రియములనఁగా జ్ఞానశూన్యములై పనులనుమాత్రము చేయునవి), ప్రాణాదిపంచకంబునుగూడి =ప్రాణాదిపంచవాయువులునుకలిసి, ఏకోన...బులన్-ఏకోనవింశతి = పందొమ్మిదియైన, అవయవంబులన్=అంగములతో నొప్పుచు (వీనినే తత్త్వములని చెప్పుదురు.), లింగశరీరంబు గలిగెన్=సూక్ష్మశరీరము పుట్టెను. ఈసూక్ష్మదేహంబు = ఈసూక్ష్మశరీరము, వృక్షవనములభంగిన్=ఒకవృక్షము అనేకవృక్షములతోఁ గూడిన యరణ్యము వీనివలె, ఒక్కటి వ్యష్టియనియున్=ఒక్కపదార్థము వ్యష్టి యనియు, సర్వంబు=ప్రపంచమందున్న పదార్థము లన్నియుఁగలిసి (సూక్ష్మశరీరములన్నియు), సమష్టియనియున్=సమష్టి యనియు, చెప్పంబడున్=వ్యవహరింపఁబడును. (ఒకవృక్షమునుజూచి "ఇదివృక్షము" అనియును అనేకవృక్షములను జూచి "ఇదివనము" అనియును ఎట్లు వ్యవహారము కలదో అట్లే ఒక్కపదార్థమునకు వ్యష్టియనియు ననేకపదార్థములసముదాయమునకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సమష్టియనియు వ్యవహారము కలదు. దీని నెఱింగి తగినస్థలములం దెల్ల వ్యవహరించుకొనవలయును.) వీనికిన్ = ఈవ్యష్టి సమష్టి సూక్ష్మశరీరములకుఁ గ్రమముగ, వ్యష్టిసమష్టిస్వప్నములు, అవస్థలగున్ = అవస్థలగుచున్నవి. (సూక్ష్మశరీరమునకు స్వప్నావస్థ గల దని యిదివఱకే వివరించియున్నాము.) ఈవ్యష్టిసూక్ష్మాంగస్వప్నంబులయందున్ = ఈవ్యష్టిసూక్ష్మశరీరమునందును వ్యష్టిస్వప్నావస్థయందును, ఆప్రాజ్ఞుఁడు (అనఁగా వ్యష్టి కారణశరీరము నభిమానించుచున్నజీవుఁడు) అభిమానియై = అభిమానముగలవాఁడై, ప్రాతిభాసికుండు = ప్రాతిభాసికుఁడనియు [ప్రతిభాస మనఁగా ప్రపంచరూపముతోఁ బరిణమించుచున్న చిత్తవృత్తి; అదియున్నప్పుడు (అనఁగా మనస్సు వ్యవహారముచేయు నట్టి జాగ్రత్స్వప్నావస్థలయందు) మాత్ర ముండువాఁడు కావున నాజీవుఁడు ప్రాతిభాసికుఁ డగును. సూక్ష్మశరీరమునందు అంతఃకరణమే ప్రధానావయవముగావున జీవునకు తదనుగుణముగానే పేరు కలిగినది.] స్వప్నకల్పితుండు = (స్వప్న మనఁగా నజ్ఞానము నిద్ర; దానిచే కల్పింపఁబడినవాఁడుకావున) స్వప్నకల్పితుఁడనియు, తైజసుండు = (తేజోరూప మగునంతఃకరణమున ప్రతిబింబించియుండువాఁడు కావున) తైజసుఁడనియు, అనన్, ప్రవర్తిల్లున్ = వ్యవహరింపఁబడుచున్నాఁడు. ఆసమష్టిసూక్ష్మకాయస్వప్నవిశిష్టుండనై = పైఁజెప్పిన సూక్ష్మశరీరములయొక్క సమష్టితోను స్వప్నావస్థలయొక్కసమష్టితోను కూడినవాఁడనై, ఈశ్వరుండైన నేను, హిరణ్య గర్భుండు = (హిరణ్య మనఁగా జ్ఞానము. దానిచే ప్రకాశించువాఁడను కావున) హిరణ్యగర్భుండననియు, సూత్రాత్మకుండు = (మణులయందు దారమువలె సర్వభూతముల యందును వ్యాపించి యున్నవాఁడను కావున) సూత్రాత్మకుఁడననియు, ప్రాణుండు అనన్ = (ప్రాణములకు ప్రేరకుఁడనై యింద్రియాదులచే సర్వకార్యములఁ జేయించుచు స్థూలశరీరమును చలింపఁజేయుచున్నాను గావున) ప్రాణుఁడననియు, సర్వజీవోపాస్యుండనై-సర్వజీవ = సమస్తజీవులచే, ఉపాస్యుండనై = సేవింపఁబడువాఁడనై, ఉండుదున్ = ఉన్నాను. ఇది = ఈచెప్పినది, సూక్ష్మసృష్టి తెఱఁగు = సూక్ష్మప్రపంచ సృష్టిప్రకారము, ఇంకన్ = ఇఁకమీఁద, స్థూలప్రపంచప్రకారంబు = స్థూలప్రపంచము సృష్టియైనవిధమును, వినుపించెదన్ = చెప్పెదను, వినుము.

తా. ఇట్లు ప్రేరేపింపఁగానే తమోగుణప్రధానయగు నామాయచే నావరింపఁబడియున్న బ్రహ్మమునుండి యాకాశము (అనఁగా నాకాశ నామరూపములు) గలిగెను. (అభివ్యక్తము లయ్యెను) ఆయాకాశమునకు శబ్దము గుణము. పిదప నాయాకాశముచే (అనఁగా నాయాకాశనామరూపములచే) నావరింపఁబడిన బ్రహ్మమునుండి స్పర్శగుణము కలవాయువును, దానిచే నాపరింపఁబడిన చైతన్యమునుండి రూపగుణము కలయగ్నియు, దానినుండి (అనఁగా దానిచే నావరింపఁబడిన బ్రహ్మమునుండి) రసగుణముగల జలంబులును, వానినుండి గంధగుణముగల పృథివియు జనించెను. జనించుట యనఁగా నంతకుఁ బూర్వ మప్రకాశములైయున్న నామరూపము లభివ్యక్తము లగుటయె. ఇట్లు జనించిన వైదును భూతములు. ఇవి సూక్ష్మములగుటచే నపంచీకృతభూతములనియుఁ పంచతన్మాత్రలనియుఁ జెప్పఁబడుచున్నవి. ఆయవిద్యయందు లేక మాయయందు తమోగుణము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాత్రమె సృష్ట్యర్థము ప్రధానమైనను సత్త్వాదిగుణములు మూఁడును కలవు గావున పైఁజెప్పఁబడిన పంచభూతములయందును సత్త్వాదిగుణాంశములు మూఁడును కలవు. అందు పంచభూతములును గలసిన మొత్తమునకు సమష్టి యనియు ప్రత్యేకభూతములకు వ్యష్టియనియుఁ బూర్వమువలెను వ్యవహారమని తెలిసికొనవలయును. దీనివలన నీభూతములయందు సత్వగుణాంశవ్యష్టియు సత్త్వగుణాంశసమష్టియు రజోగుణాంశవ్యష్టియు రజోగుణాంశసమష్టియు నేర్పడునుకదా! ఇందు సత్త్వగుణాంశవ్యష్టివలన శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబు లను జ్ఞానేంద్రియము లైదును తమయధిదేవతలగు దిశలు వాయువు సూర్యుఁడు వరుణుఁడు అశ్వినులు అనువారలతోఁ గలసి క్రమముగ (అనఁగా "ఆకాశమునుండి శ్రోత్రము దిశలు" అను వరుసగ) జనించినవి. సత్త్వాంశసమష్టివలన నంతఃకరణము జనించెను. అది యొక్కటి యయినను మనోబుద్ధి చిత్తాహంకారములను నాలుగు భేదములు కలిగి యున్నది. కావునఁ జంద్రుఁడు బృహస్పతి జీవుఁడు రుద్రుఁడు అనువా రంతఃకరణమున కధిదేవతలు. ఈయధిదేవతలుకూడ నంతఃకరణముతోఁ గలసి సత్త్వాంశసమష్టివలననే జనించిరి. సంకల్పించునప్పుడు మనస్సనియు నిశ్చయించునప్పుడు బుద్ధియనియు సంశయించునప్పుడు చిత్తమనియు నభిమానించునప్పు డహంకారమనియు నొక్క యంతఃకరణమునే వ్యవహరించుచున్నారని తెలిసికొనుము. ఇఁక రజోగుణాంశవ్యష్టివలన వాక్పాణిపాదపాయూపస్థలను కర్మేంద్రియములును వానికధిదేవతలగు అగ్ని యింద్రుఁడు విష్ణువు మృత్యుదేవత చతుర్ముఖుఁ డనువారలును క్రమముగ జనించిరి. రజోగుణాంశసమష్టివలన ప్రాణవాయువు కలిగెను. అదియుఁ వృత్తిభేదములవలన ప్రాణాపానవ్యానోదానసమానములను నైదువిధములైయున్నది. కావున దానికిని వసిష్ఠుఁడు విశ్వకర్మ విశ్వయోని అజుఁడు జయుఁడు నను నేవు రధిదేవతలు గలరు." ప్రాణమునకు వసిష్ఠుఁడు అను మొదలగునది వారలక్రమము. (ఈయధిదేవతలుకూడ ప్రాణముతోకలసి రజోగుణాంశసమష్టివలననే జనించిరి. ఇట్లు జనించిన జ్ఞానేంద్రియము లైదును గర్మేంద్రియములైదును బ్రాణములైదును అంతఃకరణములు నాల్గును:గలసి పందొమ్మిదియు సూక్ష్మశరీరమున కవయవములు. ఈసూక్ష్మశరీరముకూడ వృక్షవనములయట్లు ప్రత్యేకమై వ్యష్టిసూక్ష్మశరీరమనియు సముదాయరూపమై సమష్టిసూక్ష్మశరీరమనియుఁ జెప్పఁబడును. ఈసూక్ష్మశరీరమునకు స్వప్నమవస్థ. అదియు సమష్టివ్యష్టి భేదములచే రెండువిధములైయుండును. అందు వ్యష్టిసూక్ష్మస్వప్నముల నభిమానించి ప్రాజ్ఞుఁడు ప్రాతిభాసికుం డనియు స్వప్నకల్పితుం డనియుఁ,తైజసుఁ డనియుఁ బిలువఁబడుచున్నాఁడు. ఈశ్వరుఁడ నగు నేనును సమష్టిసూక్ష్మస్వప్నముల నభిమానించి హిరణ్యగర్భుఁడనియు ప్రాణుఁడనియు సూత్రాత్మ యనియుఁ బిలువఁబడుచున్నాను. జీవు లందఱు బ్రహ్మవిష్ణ్వాదిరూపములతో సూక్ష్మశరీరవిశిష్టుఁడ నగు నన్నే యుపాసించుచున్నారు. ఓపార్వతీ ఇట్లు రాముఁడు సూక్ష్మసృష్టిని వివరించి స్థూలసృష్టినిఁ జెప్ప నిట్లని యుపక్రమించెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## సూక్ష్మశరీరపంచీకరణచక్రము.

| అపంచీకృత పంచసూక్ష్మభూతములు. | | ఆకాశము. | వాయువు. | అగ్ని. | జలము. | పృథివి. | సత్వరజస్సూక్ష్మ భూతములు. |
|---|---|---|---|---|---|---|---|
| సత్వసూక్ష్మ పంచభూతములు. | సత్వసమష్టిసూక్ష్మ పంచభూతములు. | | మనస్సు. చంద్రుఁడు. | బుద్ధి. బృహస్పతి. | చిత్తము. జీవుఁడు. | అహంకారము. రుద్రుఁడు. | అంతఃకరణములు. అధిదేవతలు. |
| | సత్వవ్యష్టిసూక్ష్మ పంచభూతములు. | శ్రోత్రము. దిక్కులు. | త్వక్కు. వాయువు. | చక్షువు. అర్కుఁడు. | జిహ్వ. వరుణుఁడు. | ఘ్రాణము. అశ్వినులు. | జ్ఞానేంద్రియములు. అధిదేవతలు. |
| రజస్సూక్ష్మ పంచభూతములు. | రజస్సమష్టిసూక్ష్మ పంచభూతములు. | సమానము. జయుఁడు. | వ్యానము. విశ్వయోని. | ఉదానము. అజుఁడు. | ప్రాణము. విశిష్టుఁడు. | అపానము. విశ్వకర్మ. | పంచప్రాణములు. అధిదేవతలు. |
| | రజోవ్యష్టిసూక్ష్మ పంచభూతములు. | వాక్కు. వహ్ని. | పాణి. ఇంద్రుఁడు. | పాదము. విష్ణువు. | గుహ్యము. బ్రహ్మ. | పాయువు. మృత్యువు. | కర్మేంద్రియములు. అధిదేవతలు. |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**జీవసూక్ష్మదేహతత్త్వాదులే యీశ్వరసూక్ష్మదేహతత్త్వములు**

సీ. తతతమోగుణకభూతములనైదింటిని
    గ్రమమున రెండుభాగములఁ జేసి
తొలుతఁ బంచార్ధాంశములఁ బూని వేర్వేఱఁ
    దునియలు నాల్గుగా ననువు పఱచి
ముఖ్యార్థము లశేషభూతఖండచతుష్ట
    యముల నొండొంటి నెయ్యమునఁ గూర్పఁ
బంచీకృతంబులై పటుతరస్థూలంబు
    లై యభివ్యక్తంబు లయ్యె నొకట
తే. వాయునందన విను మింక వానివలన
నఖిలజగములు నానాచరాచరములు
బహువిధాన్నంబులును ఘటపటగృహాది
సకలదృశ్యపదార్థము లుద్భవించె. 42

టీ. వాయునందన=వాయుపుత్త్రుఁడా! వినుము, తత...లైదింటన్-తత=విస్తారములైన, తమోగుణక=మలినసత్త్వప్రధానయందలి తమోగుణాంశమువలనఁ బుట్టిన, భూతములనైదింటిన్=పంచభూతములను (సత్త్వరజోగుణాంశములవలనఁ బుట్టినభూతములనుండి సూక్ష్మసృష్టి యయ్యె నని పైన చెప్పఁబడినది.) తమోగుణాంశమువలనఁ బుట్టినభూతమువలన స్థూలసృష్టికలిగినవిధము నిప్పుడు చెప్పుచున్నాఁడు. క్రమమునన్=వరుసగ, రెండుభాగములుచేసి = ఒక్కదానిని రెండుగా విభాగించి, తొలుతన్ = మొట్టమొదట, పంచార్ధాంశములన్ = అయిదుభూతములయందు నొక్కొక్కయర్ధభాగమును, పూని=గ్రహించి, వేర్వేఱన్=ప్రత్యేకముగా, తునియలు నాల్గుగాన్=నాలుగుభాగములుగా (అనఁగా నాకాశభూతమును రెండుగా), విభాగించి యందొకభాగమును అట్లేయుంచి రెండవభాగమును నాల్గుగా నొనర్పవలయును. ఇట్లే సర్వభూతముల గావింపవలెను. అనువుపఱచి = చేసి, ముఖ్యార్థములన్ = అందే నిలుపఁబడియున్న యర్ధభాగములలో, శేషభూ...ములన్-శేష = మిగిలిన (అనఁగా మన మేభూతమును పంచీకరణము చేయఁదలంచితిమో దానికంటె నితరములగు), భూత=భూతములయొక్క, ఖండచతుష్టయములన్ = నాలుగుభాగములను (అనఁగా నొక్కొక్కభూతమునందలి యొక్కొక్కయష్టమాంశమును), ఒండొంటిన్ = ఒకదానితో నొకదానిని (అనఁగా ఆభూతమునందు నిలచియున్నసగముభాగము తక్కినభూతములయందలి యష్టమాంశములు నాలుగు. వీని నన్నిఁటిని), నెయ్యమునన్ = చక్కఁగా, కూర్పన్ = చేర్పఁగా


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(అనఁగా ఆకాశమును రెండుభాగములుచేసి యందొకదాని నట్లేయుంచి రెండవదానిని మరల నాలుగుభాగములు చేయవలయును. ఇట్లే తక్కిన నాలుగుభూతములను గూడ గావింపవలయును. అప్పుడు ప్రతిభూతమునకును అర్థాంశమొక్కటియు అష్టమాంశములు నాలుగును నేర్పడును. ఇట్లు చేసినపిదప నొక్కొక్కభూతముగాఁ గైకొని దాని యందలి యష్టమాంశముల నాల్గింటిని తక్కిననాలుగుభూతములయర్థాంశములతోడను చేర్పవలయును. ఆకాశభూతమునందలి యష్టమాంశములనాల్గింటిని క్రమముగ వాయ్వగ్ని జల పృథివీ భూతములయర్థాంశములతోఁ జేర్పవలయును. ఇట్లె వాయుభూతములోని యష్టమాంశముల నాకాశాగ్నిజలపృథివీభూతముల యర్థభాగములతోఁ జేర్పవలయును. ఇట్లే సర్వభూతములను విభాగించిన ప్రతిభూతమునందును తన యర్థభాగమొక్కటియుఁ దక్కిన నాలుగుభూతములయొక్కయు నాలుగుయష్టమాంశములను జేరును. అప్పు డొక్కొకటియు పంచభూతాత్మకమగును; ఇదియే పంచీకరణము) పంచీకృతంబులై = పంచీకరణముచేయఁబడినవై, ఒకటన్=ఒక్కటిగా (లేక ఒకటితో నొకటి కలియుటచేత), పటుతర...వై - పటుతర = మిక్కిలి, స్థూలంబులై = పెద్దవియై (ఇంద్రియగోచరములై అనుట), అభివ్యక్తంబులయ్యెన్=ప్రకటములయ్యెను; ఇంకన్ =తర్వాత, వానివలనన్ = అపంచీకృతమహాభూతములవలన, అఖిలజగములను = సకల విధము లగుప్రపంచములను, నానా...లును-నానా=అనేకభేదములు గల, చర = జంగమములును (సంచరించునవి), అచరములును = స్థావరములును (సంచరింపనివృక్షాదులు), బహువిధాన్నంబులును = నానావిధము లగు ఆహారపదార్థములును, ఘట...లును-ఘట= కుండలు, పట=వస్త్రములు, గృహ = ఇండ్లు, ఆది=మొదలగు, సకల = సమస్తములైన, దృశ్య = కనఁబడునట్టి, పదార్థములును = వస్తువులును, సంభవించెన్ = పుట్టెను. (స్థూల సృష్టియయ్యె ననుట.)

తా. ఓీఆంజనేయా ! అపంచీకృతభూతములలోని సత్త్వరజోగుణాంశముల వలనఁ గలిగినసూక్ష్మసృష్టిని వివరించితిని కదా! ఇఁక స్థూలసృష్టిని వినుము. అపంచభూతములలోని తమోగుణాంశములఁ బ్రత్యేకముగ రెండుభాగములఁ జేయవలయును. అందొక్కొక్కభాగము నట్లే యుంచి తక్కినభాగములను బ్రత్యేకముగ నాల్గుగా భాగింపవలయును. ఇట్లు చేసినఁ బ్రతిభూతమునందు నొకయర్థభాగంబును నాల్గష్టమాంశంబులు నేర్పడును. పిదప ప్రతిభూతమునందునుఁ గలయర్థభాగముల నట్లే యుంచి యష్టమాంశములనాల్గిటిని గ్రమముగ నితరభూతములలోఁ జేర్చుచుండవలయును. ఇట్లు చేసిననాకాశమునందు తనలోని యర్థభాగంబును వాయుభూతములోని యష్టమాంశమొకటియుఁ దేజోభూతములోనియష్టమాంశ మొకటియు జలభూతములోనియష్ట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాంశ మొకటియుం పృథ్వీభూతములోనియష్టమాంశ మొకటియుఁ గలసి నాల్గష్టమాంశంబులును ఉండును. ఇట్లే సర్వభూతములందును దమలోని యర్ధభాగంబులును ఇతర భూతములలోని యష్టమాంశంబులు నాల్గును గలయుచుండును. ఇట్లన్నియుఁ గలసియే యున్నను యెచ్చుతెచ్చుట దేనిదేనిభాగ మధికమైయుండునో యాయాస్థలమున నా యావ్యవహారము (అనఁగా 'ఇదియాకాశము, ఇదిభూమి' అను మొదలగువ్యవహారము) ప్రవర్తించుచున్నది. ఒక్కొకభూతము ఐదేసిభాగములుగాఁ జేయఁబడియుండుటవలన దీనికిఁ బంచీకరణమని పేరు. ఈపంచీకరణమువలననే (అనఁగా నొకదానియం దొకటి కలయుంటచేతనే) సూక్ష్మభూతములు స్థూలములై యింద్రియగోచరములైనవి. ఈస్థూల భూతములవలననే సకలవిధములగు స్థావరజంగమములును సమస్తజంతువులును ఘటాది పదార్థములును మొదలగుదృశ్యము లన్నియుం (అనఁగా నింద్రియగోచరములగు పదార్థములన్నియు) జనించెను.

| ఆత్మ. | స్థూలశరీరపంచీకరణచక్రము. | | | |
|---|---|---|---|---|
| ఆకాశము అంతఃకరణము. | మనస్సు. | బుద్ధి. | చిత్తము. | అహంకారము. |
| సమానవాయువు | వాయువు. వ్యానవాయువు. | ఉదాన వాయువు. | ప్రాణవాయువు. | అపాన వాయువు. |
| శ్రోత్రేంద్రియము. | త్వగింద్రియము | తేజస్సు. చక్షురింద్రియము. | రసనేంద్రియము. | ఘ్రాణేంద్రియము. |
| శబ్దము. | స్పర్శము. | రూపము. | (జలము.) రసము. | గంధము. |
| వాగింద్రియము. | పాణీంద్రియము. | పాదేంద్రియము. | ఉపస్థేంద్రియము. | పృథివి. పాయ్వింద్రియము. |

జీవస్థూలదేహతత్త్వాధిదేవతలే యీశ్వరస్థూలదేహతత్త్వములు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# బ్రహ్మప్రణవచక్రము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| అకారఉకారమకార అర్ధమాత్రా న్యోన్యమేళనవిభాగములు. | అకారము, అవిద్యాపాదము, స్థూలదేహము, జాగ్రత్త, విశ్వుఁడు, విరాట్టు, ఓత, బ్రహ్మము, సద్విద్యాముఖము, సన్మాత్రము, నాకారము, ఏకత్వ, అనాదికము. | అకారమునందు అకారము | అకారమునందు ఉకారము | అకారమునందు మకారము | అకారమునందు అర్ధమాత్రము |
| అవిద్యావిద్యానందతురీయపాదా న్యోన్యమేళనవిభాగములు. | | అవిద్యాపాదమున అవిద్యాపాదము | అవిద్యాపాదమున విద్యాపాదము | అవిద్యాపాదమున ఆనందపాదము | అవిద్యాపాదమున తురీయపాదము |
| స్థూలాది దేహచతుష్టయాన్యోన్య మేళనవిభాగములు. | | స్థూలదేహమున స్థూలదేహము | స్థూలదేహమున సూక్ష్మదేహము | స్థూలదేహమున కారణదేహము | స్థూలదేహమున మహాకారణదేహము |
| అవస్థాచతుష్టయాన్యోన్యమేళన విభాగములు. | | జాగ్రత్తలో జాగ్రత్త | జాగ్రత్తలో స్వప్నము | జాగ్రత్తలో సుషుప్తి | జాగ్రత్తలో తురీయము |
| జీవచతుష్టయాన్యోన్యమేళన విభాగములు. | | విశ్వునిలో విశ్వుఁడు | విశ్వునిలో తైజసుఁడు | విశ్వునిలో ప్రాజ్ఞుఁడు | విశ్వునిలో ప్రత్యగాత్ముఁడు |
| ఈశ్వరచతుష్టయాన్యోన్యమేళన విభాగములు. | | విరాట్టులో విరాట్టు | విరాట్టులో హిరణ్యగర్భుఁడు | విరాట్టులో అవ్యాకృతుఁడు | విరాట్టులో పరమాత్మ |
| జీవేశ్వరచతుష్టయైక్యచైతన్యచతుష్ట యాన్యోన్యమేళనవిభాగములు. | | ఓతలో ఓత | ఓతలో అనుజ్ఞాత | ఓతలో అనుజ్ఞైకరసుఁడు | ఓతలో అవికల్పుఁడు |

| | | | | |
|---|---|---|---|---|
| అకార ఉకార మకార అర్ధమాత్రా న్యోన్యమేళనవిభాగములు. | మకారమునందు అకారము | మకారమునందు ఉకారము | మకారమునందు మకారము | మకారమునందు అర్ధమాత్రము |
| అవిద్యావిద్యానందతురీయపాదా న్యోన్యమేళనవిభాగములు. | ఆనందపాదమున అవిద్యాపాదము | ఆనందపాదమున విద్యాపాదము | ఆనందపాదమున ఆనందపాదము | ఆనందపాదమున తురీయపాదము |
| స్థూలాదిదేహచతుష్టయాన్యోన్య మేళనవిభాగములు. | కారణదేహమున స్థూలదేహము | కారణదేహమున సూక్ష్మదేహము | కారణదేహమున కారణదేహము | కారణదేహమున మహాకారణదేహము |
| అవస్థాచతుష్టయాన్యోన్యమేళన విభాగములు. | సుషుప్తిలో జాగ్రత్త | సుషుప్తిలో స్వప్నము | సుషుప్తిలో సుషుప్తి | సుషుప్తిలో తురీయము |
| జీవచతుష్టయాన్యోన్యమేళన విభాగములు. | ప్రాజ్ఞునిలో విశ్వుఁడు | ప్రాజ్ఞునిలో తైజసుఁడు | ప్రాజ్ఞునిలో ప్రాజ్ఞుఁడు | ప్రాజ్ఞునిలో కూటస్థుఁడు |
| ఈశ్వరచతుష్టయాన్యోన్యమేళన విభాగములు. | అవ్యాకృతునిలో విరాట్టు | అవ్యాకృతునిలో హిరణ్యగర్భుఁడు | అవ్యాకృతునిలో అవ్యాకృతుఁడు | అవ్యాకృతునిలో పరమాత్మ |
| జీవేశ్వరచతుష్టయైక్యమైన తన్మయచతుష్ట యాన్యోన్యమేళనవిభాగములు. | అనుజ్ఞైకరసునిలో ఓత | అనుజ్ఞైకరసునిలో అనుజ్ఞాత | అనుజ్ఞైకరసునిలో అనుజ్ఞైకరసుఁడు | అనుజ్ఞైకరసునిలో అవికల్పుఁడు |

మకారము, ఆనందపాదము, కారణదేహము, సుషుప్తి,
ప్రాజ్ఞుఁడు, అవ్యాకృతుఁడు, అనుజ్ఞైకరసుఁడు ఈ యేడు ద్వితీయము;
[illegible]

# బ్రహ్మప్రణవచక్రము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| అకారఉకారమకారఅర్ధమాత్రా న్యోన్యమేళనవిభాగములు. | ఉకారము, విద్యాపాదము, సూక్ష్మదేహము, స్వప్నము, తైజసుఁడు, హిరణ్యగర్భుఁడు, అనుజ్ఞాతలిఙ్గ యనుం జెలియవలెను, నా ను దేవమునము, జలలి త్రిస్ర్రమము, మ కారము, మ హ్రిస్తేత, దండము, | ఉకారమునందు అకారము | ఉకారమునందు ఉకారము | ఉకారమునందు మకారము | ఉకారమునందు అర్ధమాత్రము |
| అవిద్యావిద్యానందతురీయపాదా న్యోన్యమేళనవిభాగములు. | | విద్యాపాదమున అవిద్యాపాదము | విద్యాపాదమున విద్యాపాదము | విద్యాపాదమున ఆనందపాదము | విద్యాపాదమున తురీయపాదము |
| స్థూలాది దేహచతుష్టయాన్యోన్య మేళనవిభాగములు. | | సూక్ష్మదేహమున స్థూలదేహము | సూక్ష్మదేహమున సూక్ష్మదేహము | సూక్ష్మదేహమున కారణదేహము | సూక్ష్మదేహమున మహాకారణదేహము |
| అవస్థాచతుష్టయాన్యోన్యమేళన విభాగములు. | | స్వప్నములో జాగ్రత్త | స్వప్నములో స్వప్నము | స్వప్నములో సుషుప్తి | స్వప్నములో తురీయము |
| జీవచతుష్టయాన్యోన్యమేళన విభాగములు. | | తైజసునిలో విశ్వుఁడు | తైజసునిలో తైజసుఁడు | తైజసునిలో ప్రాజ్ఞుఁడు | తైజసునిలో ప్రత్యగాత్మ |
| ఈశ్వరచతుష్టయాన్యోన్యమేళన విభాగములు. | | హిరణ్యగర్భునిలో విరాట్టు | హిరణ్యగర్భునిలో హిరణ్యగర్భుఁడు | హిరణ్యగర్భునిలో అవ్యాకృతుఁడు | హిరణ్యగర్భునిలో పరమాత్మ |
| జీవేశ్వరచతుష్టయైక్యమైతన్యచతుష్ట యాన్యోన్యమేళనవిభాగములు. | | అనుజ్ఞాతలో ఓత | అనుజ్ఞాతలో అనుజ్ఞాత | అనుజ్ఞాతలో అనుజ్ఞైకరసుఁడు | అనుజ్ఞాతలో అవికల్పుఁడు |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అకారఉకారమకారఅర్ధమాత్రా న్యోన్య మేళనవిభాగములు. | అర్ధమాత్రము-తురియపాదము-మహాకారణదేహము-తురీయావస్థ-కూటస్థుఁడు-పరమాత్మ - అవికల్పుఁడు-ఇవియన్నియుఁ జేరిన చోమ మహేశ్వరపీఠము,తత్పురుషముఖము: వాయుతత్త్వము-వకారము-శాంతికళ-అర్ధచంద్రాకారము | అర్ధమాత్రమునందు అకారము | అర్ధమాత్రమునందు ఉకారము | అర్ధమాత్రమునందు మకారము | పైఁజెప్పినవెల్లగూడి సదాశివపీఠము-ఈశానముఖము-ఆకాశతత్త్వము-యకారము-శాంత్యతీతకళ-బిందురూపము-ఇదివఱకు శక్తితత్త్వములు. | అర్ధమాత్రమునందు అర్ధమాత్రము |
| అవిద్యావిద్యానందతురీయపాదాన్యోన్య మేళనవిభాగములు. | | తురీయపాదమునన్దు అవిద్యాపాదము | తురీయపాదమున విద్యాపాదము | తురీయపాదమున ఆనందపాదము | | తురీయపాదమున తురీయపాదము |
| స్థూలాది దేహచతుష్టయాన్యోన్య మేళనవిభాగములు. | | మహాకారణ దేహమున స్థూలదేహము | మహాకారణ దేహమున సూక్ష్మశరీరము | మహాకారణ దేహమున కారణశరీరము | | మహాకారణ శరీరమున మహాకారణ శరీరము |
| అవస్థాచతుష్టయాన్యోన్య మేళన విభాగములు. | | తురీయమున జాగ్రత్త | తురీయమున స్వప్నము | తురీయమున సుషుప్తి | | తురీయమున తురీయము |
| జీవచతుష్టయాన్యోన్య మేళన విభాగములు. | | కూటస్థునిలో విశ్వుఁడు | కూటస్థునిలో తైజసుఁడు | కూటస్థునిలో ప్రాజ్ఞుఁడు | | కూటస్థునిలో కూటస్థుఁడు |
| ఈశ్వరచతుష్టయాన్యోన్య మేళన విభాగములు. | | పరమాత్మలో విరాట్టు | పరమాత్మలో హిరణ్యగర్భుఁడు | పరమాత్మలో అవ్యాకృతుఁడు | | పరమాత్మలో పరమాత్మ |
| జీవేశ్వరచతుష్టయైక్యచైతన్యచతుష్టయాన్యోన్య మేళనవిభాగములు. | | అవికల్పునిలో ఓత | అవికల్పునిలో అనుజ్ఞాత | అవికల్పునిలో అనుజ్ఞైకరసుఁడు | | అవికల్పునిలో అవికల్పుఁడు |

ఇది శివతత్త్వము. శివతత్త్వమును శక్తితత్త్వములను మీఱినదే నిర్గుణపరబ్రహ్మము. అది-నిష్కళము-నిరీహము-నిష్ప్రపంచము నిర్మలము-నిరంజనము-నిర్వికారము-నిరాలంబము-నిర్ముక్తము -నిత్యము-బుద్ధము- కేవలము-అఖండము-అప్రమేయము - ఆద్యంతవిహీనము-పరాత్పరము-అపరోక్షము-స్వయంజ్యోతి-సర్వవ్యాపకము-నిరతిశయానందము. ఓమ్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# బ్రహ్మాండ పంచీకరణచక్రమునందు, స్థూలశరీరనిర్ణయము.

అద్వితీయపరబ్రహ్మమువలన అవ్యక్తమును, దానివలన మహత్తత్వమును, అందున మహదహంకారమును, దానివలన పంచతన్మాత్రలును, వానివలన పంచభూతములును, వానివలన చతుర్దశభువనములును అదిబాగుగఁ దెలియుటకై కలిగినవి. ఈబ్రహ్మాండపంచీకరణచక్రము తెలుపఁబడుచున్నది. స్థూలజగత్సృష్టికి ముందు పంచభూతములు ప్రకృత్యవచ్ఛిన్నములై యున్నవి.

## పంచతన్మాత్రలు.

| శబ్దము. | స్పర్శము. | రూపము. | రసము. | గంధము. |
|---|---|---|---|---|
| సత్వగుణాకాశము. | సత్వగుణవాయువు. | సత్వగుణాగ్ని. | సత్వగుణజలము. | సత్వగుణపృథివి. |
| రజోగుణాకాశము. | రజోగుణవాయువు. | రజోగుణాగ్ని. | రజోగుణజలము. | రజోగుణపృథివి. |
| తమోగుణాకాశము. | తమోగుణవాయువు. | తమోగుణాగ్ని. | తమోగుణజలము. | తమోగుణపృథివి. |
| తమోగుణాకాశార్ధభాగమంతఃకరణచతుష్టయ గోళకమయినవి. | | | | |
| శేషార్ధము ౪ శకలములై తమోగుణాని లాగ్ని జలభూతములఁ గలసి మానసాదిస్థానములయినవి. | తమోగుణాకాశార్ధభాగ చతుశ్శకలములలోఁ ప్రథమశకలము తామసవాయువులోఁ జేరి మనోగోళకమయ్యెను. | తమోగుణాకాశార్ధభాగ చతుశ్శకలములలోఁ ద్వితీయశకలము తామసాగ్నియందుఁగలసి బుద్ధిగోళకమయ్యెను. | తమోగుణాకాశార్ధభాగ చతుశ్శకలములలోఁ 3 శకలము తామసజలమందుఁగలసి చిత్తగోళకమాయెను. | తమోగుణాకాశార్ధభాగ చతుశ్శకలములలోఁ ౪ శకలము తామసపృథివిలోఁగలసి అహంకారస్థానమాయెను. |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| | | | | |
|---|---|---|---|---|
| తమోగుణానిలార్ధ భాగ చతుశ్శకలములయందు ప్రథమశకలము తామసాకాశము లోఁజేరి సమానవాయుగోళకమయ్యెను. | తమోగుణా నిలార్ధభాగము వ్యానగోళకమయ్యెను.<br>శేషార్ధము ౪ శకలములై తమోగుణాకాశాగ్ని జల భూములఁగలసిసమానోదానాపానప్రాణగోళకములయ్యెను. | తమోగుణానిలార్ధభాగ చతుశ్శకలములలో ౨ శకలము తామసాగ్నియందుఁ గలసి ఉదానవాయుగోళకమయ్యెను. | తమోగుణానిలార్ధభాగ చతుశ్శకలములలో తృతీయశకలము తామసజలమందుఁ గలసి ప్రాణవాయుగోళకమయ్యెను. | తమోగుణా నిలార్ధభాగ చతుశ్శకలములలో చతుర్థశకలము తామసపృథివియందుఁ గలసి అపానగోళకమయ్యెను. |
| తమోగుణానలార్ధభాగ చతుశ్శకలములలో ౧ శకలము తామసాకాశమునఁగలసి శ్రోత్రగోళకమయ్యెను. | తమోగుణా నలార్ధభాగ చతుశ్శకలములలో ౨ శకలము తమోగుణానిలమునఁ గలసి స్పర్శగోళకమయ్యెను. | తమోగుణానలార్ధభాగము చక్షుర్గోళకమయ్యెను.<br>శేషార్ధము చతుశ్శకలములై తమోగుణాకాశానిలజలభూములయందుగలసి శ్రోత్రత్వగ్జిహ్వాఘ్రాణగోళకములైనవి. | తమోగుణానలార్ధభాగ చతుశ్శకలములలో 3 శకలము తామసజలమునఁగలసి జిహ్వాగోళకమయ్యెను.<br>తమోగుణజలార్ధభాగంబు రసగోళకంబయ్యెను. | తమోగుణజలార్ధభాగ చతుశ్శకలములలో ౪ శకలము తామసపృథివిని గలసి ఘ్రాణగోళకమయ్యెను.<br>తమోగుణజలార్ధభాగ చతుశ్శకలములలో ౪ శకలము తమోగుణపృథివిని గలసి గంధగోళకమయ్యెను. |
| తమోగుణ జలార్ధభాగ చతుశ్శకలములలో ౧ శకలము తామసాకాశమునఁ జేరి శబ్దగోళకమయ్యెను. | తమోగుణజలార్ధభాగ చతుశ్శకలములలో ౨ శకలము తమోగుణవాయువు నందుఁ గలసి స్పర్శగోళకమయ్యెను. | తమోగుణ జలార్ధభాగ చతుశ్శకలములలో 3 శకలము తమోగుణాగ్నిలోఁజేరి రూపగోళకమయ్యెను. | శేషార్ధము చతుశ్శకలములై ఆకాశవాయురగ్నిభూములయందుఁగలసి శబ్దస్పర్శరూపగంధగోళకములయ్యెను. | తమోగుణధరార్ధభాగము వాయుగోళకమయ్యెను. |
| తమోగుణధరార్ధభాగ చతుశ్శకలములలో ౧ శకలము తమోగుణాకాశమునఁ గలసి వాగ్గోళకమయ్యెను. | తమోగుణధరార్ధభాగ చతుశ్శకలములలో ౨ శకలము తమోగుణానిలమునఁ గలసి పాణిగోళకమయ్యెను. | తమోగుణధరార్ధభాగ చతుశ్శకలములలో 3 శకలములు లఘుతమోగుణా నిలములోఁ జేరి పాదగోళకమయ్యెను. | తమోగుణ ధరార్ధభాగ చతుశ్శకలములలో ౪ శకలము తమోగుణజలములోఁ జేరి గుహ్యగోళకమయ్యెను. | తక్కినది నాలుగుతునకలై ఆకాశవాయ్వగ్ని జలములఁ గూడి వాక్పాణి పాదగుహ్యగోళకములయినవి. |


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# బ్రహ్మాండ పంచీకరణచక్రమునందు, సూక్ష్మశరీరనిర్ణయము.

| సత్వగుణాకాశము. | సత్వగుణవాయువు. | సత్వగుణాగ్ని. | సత్వగుణజలము. | సత్వగుణపృథివి. |
|---|---|---|---|---|
| రజోగుణాకాశము. | రజోగుణ వాయువు. | రజోగుణాగ్ని. | రజోగుణజలము. | రజోగుణపృథివి. |
| సత్వగుణాకాశాదిపంచభూతార్ధ సమష్ట్యంశ మేకీభవించి ప్రత్యగాత్మాధిదేవత తోఁగూడి తమోగుణాకాశాది పంచభూతార్ధసమష్ట్యంశము చేఁగల్గిన అంతఃకరణగోళకమందుండి జీవుడను పేరుచేత సర్వేంద్రియప్రాణ భృత్త్వము నొనర్చుచున్నాఁడు. | సత్వగుణాకాశార్ధభాగసమష్ట్యంశములో ౧శకలము వలనఁ గల్గినమనస్సు చంద్రాధిదేవతతోఁజేరి తామసగుణాకాశార్ధభాగ చతుశ్శకలములలో ౧ శకలము తామస వాయువులోఁజేరి కల్గినమనోగోళమందు నిల్చి సంకల్పించుచున్నది. | సత్వ...ములో ౨శకలము త...లోఁగలసి కలిగిన బుద్ధి బృహస్పత్యధిదేవతతోఁ జేరి తామసగుణాకాశార్ధ భాగములో ౨ శకలముతామసాగ్నియందుఁగలసి కలిగినబుద్ధిగోళకమందునిల్చి మనస్సందలిసంకల్పమును దృఢపఱుచుచున్నది. | సత్వ...ములోమూఁడవ శకలము సత్వగుణజలములోఁ జేరికలిగిన చిత్తముక్షేత్రజ్ఞాధిదేవతతోఁగూడి తామసగుణాకాశార్ధభాగ చతుష్కములో మూఁడవశకలము తామసజలమందుఁ జేరి కలిగిన చిత్తగోళమందు నిల్చి ఆలోచన చేయుచున్నది. | సత్వ...ములో ౪ శకలముసత్వగుణపృథివిలోఁ గలసి కలిగినఅహంకారము రుద్రాధిదేవతతోఁజేరి తమోగుణార్ధభాగ ౪ శ్శకలములలో౪శకలముతామసగుణపృథివిలోఁజేరిపుట్టినయహంకార గోళమందునిల్చి అన్తఃకరణనియామక కార్యములను జేయుచున్నది. |
| రజోగుణానిలార్ధభాగసమష్ట్యంశములో౧భాగమురజోగుణాకాశమునఁ జేరికల్గిన సమానము జయాధిదేవతతోఁ జేరి తమోగుణానిలార్ధచతుర్భాగములలో నొకభాగము తమోగుణాకాశమున చేరికల్గిన సమానవాయుస్థానమందునిల్చి జఠరాగ్ని వెలిగించి భక్షితాన్నరస మెల్ల నాడు... | రజోగుణానిలార్ధభాగ సమష్ట్యంశమువలనఁ గలిగిన వ్యానవాయువు విశ్వయోన్యధిదేవతతోఁగూడి భక్షితాన్నరసమును శరీరమునం దంతట వ్యాపింపఁ జేయుచుండును. | రజో...లో ౨ మురజోగుణాగ్నిలోఁ జేరి కలిగినయుదానమజాధిదేవతతో జేరి తమోగుణానిలార్ధ చతు...లలో ౨ భాగము తామసాగ్నిలోఁజేరి ఉదానగోళమందునిల్చి జిహ్వాద్యష్టస్థానములందు శబ్దరూపముగఁ బలికించుచు సుషుప్తియందు సర్వేంద్రియములను అవిద్యయందుఁ జేర్చి ప్రబోధవేళ వానివాని నెల... | రజో...ములో మూఁడవశకలము రజోగుణజలములోఁ గలసి కలిగిన ప్రాణము విశిష్టాధిదేవతతోఁ గూడి తమోగుణానిలార్ధ భాగచతుష్కములో 3 శకలము తమోజలమునఁజేరి కలిగిన ప్రాణగోళమందు నిల్చి ఉచ్ఛ్వాసము చేత వెలుపలికి వచ్చుచుండును. | రజో...ములో౪శకలము రజోగుణ పృథివి యందు గలసి కలిగిన అపానుండు శ్వక ర్తయనునధిష్ఠాన దేవతతోఁగూడ తమోగుణార్ధభాగ ౪ శ్శకలములో ౪ శకలము తామసపృథివియందుఁ గలసి కలిగినఅపానగోళమన్దు నిల్చి నిశ్శ్వాసము చేత ప్రాణుండు బాహ్యమునకు నిర్గమింపఁ జేసినహంసను లోపలికి ప్రవే... |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| | | | | |
|---|---|---|---|---|
| సత్వ...లో రెండవశకలము సత్వగుణాకాశమునఁజేరి కల్గినశ్రోత్రేంద్రియము దిగధిదేవతతోఁగూడి తామసానలార్ధభాగములో ౧ భాగము తామసాకాశమందుఁజేరి కల్గినశ్రోత్రగోళమందునిల్చి శబ్దమును గ్రహించునది యగుచున్నది. | సర్వగుణా సలార్ధభాగములో నొకశకలము సత్వగుణవాయువునందుఁ జేరికలిగిన త్వగింద్రియము వాయ్వధిదేవతతోఁగూడి తామసాగ్న్యర్ధభాగములోఁ దామసవాయువులోఁ జేరికలిగిన త్వగింద్రియగోళకమందు నిల్చి శీతోష్ణాదిస్పర్శములను గ్రహించుచున్నది. | సత్వగుణానలార్ధభాగవ్యష్టిచేతఁ బుట్టినచక్షుస్సు సూర్యాధిదేవతతోఁగూడి తమోగుణాగ్న్యర్ధ- భాగమువలనఁ గలిగిన చక్షుర్గోళమందునిల్చి రూపగ్రాహియగుచున్నది. | సత్వగుణానలార్ధ భాగతృతీయ శకలము సత్వగుణ జలమందుఁగలసి కలిగినరసనేంద్రియము వరుణాధిదేవతతోఁగూడి తామసానలార్ధభాగములో ౩ శకలము తామసజలమందుఁజేరి కలిగినరసనగోళమందునిల్చి షడ్విధరసగ్రాహి యగుచున్నది. | సత్వగుణానలార్ధ భాగ౪ శకలము సత్వగుణపృథివిలోఁ గలసి కలిగిన ఘ్రాణేంద్రియము అశ్వీన్యధిదేవతతోఁ గూడి తామసానలార్ధభాగములో౪ శకలము తామసపృథివియందుఁ గలసి కలిగిన ఘ్రాణగోళమందునిల్చి గంధగ్రాహి యగుచున్నది. |
| సత్వగుణాకాశమున బుట్టినది శబ్దము. | సత్వగుణ వాయువునందుఁ గలిగినది స్పర్శము. | సత్వగుణాగ్నియందుఁ గలిగినదిరూపము. | సత్వగుణజలమందుఁ గలిగినది రసము. | సత్వగుణపృథివివలనఁ గలిగినది గంధతన్మాత్రము. |
| రజోగుణపృథివ్యర్ధభాగములో౧భాగము రజోగుణాకాశమందుఁ గలసి కల్గినవాగింద్రియము వహ్నినామకాధిదేవతతోఁగూడి తమోగుణపృథివ్యర్ధభాగములో ౧ శకలము తామసాకాశమునఁ జేరికల్గినవాగ్గోళమందు నిల్చి శబ్దించుచున్నది. | రజో...లో ౧ శకలము రజోగుణానిలమందుఁజేరికలిగిన పాణీంద్రియమింద్రాధిదేవతతోఁగూడి తమోగుణపృథివ్యర్ధభాగములో ౧ శకలము తామసవాయువునందుఁ జేరికలిగిన పాణిగోళకమందునిల్చి దానప్రతిగ్రహములఁ జేయుచున్నది. | రజో...లో రెండవ శకలము రజోగుణానలమందుఁ జేరి కలిగినపాదేంద్రియము విష్ణ్వధిదేవతతోఁగూడితమోగుణపృథివ్యర్ధభాగములో ౩ శకలము తామసాగ్నియందుఁ గలసి కలిగిన పాదగోళమందునిల్చి గమనక్రియను గలిగించుచున్నది. | రజో...లో౪ రజోగుణజలమందు గలసి కలిగినగుహ్యేంద్రియము బ్రహ్మాధిదేవతతోఁగూడి తమోగుణపృథివ్యర్ధభాగములో ౪ శకలము తామసజలమందుఁగలసి కలిగినగుహ్యగోళమందునిల్చి సురతానందము నొందుచున్నది. | రజోగుణభూమ్యర్ధ భాగమువలనఁ గలిగినపాయురింద్రియము మృత్యువునధిదేవతతోఁగూడి తామసగుణభూమ్యర్ధభాగమువలనఁ బుట్టిన పాయుగోళమందు నిల్చి మలవిసర్జనము చేయుచున్నది. |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ఈశ్వరశరీరవివేచనము.

అవ. అట్లు స్థూలసృష్టిని సామాన్యముగఁ జెప్పి దానిని వివరించుచు నం దభిమానము గలజీవేశ్వరులనామముల నెఱింగించుచున్నాఁడు:—

వ. ఇట్లు గగనార్ధంబున వాయుతేజోజలభూభాగంబుల ననిలార్ధంబున నాకాశానలసలిలేలాంశంబులఁ బావకార్ధంబున నభస్సమీరతోయ దరణిఖండంబుల నీరార్ధంబున వియన్మరుత్కృశానుధాత్రీశకలంబుల ధరార్ధంబున వ్యోమపవనాగ్న్యుదకంబుల తునియల జీవాదృష్ట సహాయంబునం గూర్చిన క్రమంబుచేత శబ్దగుణకంబైనయాకాశంబు శబ్దస్పర్శగుణకంబైన పవమానంబు శబ్దస్పర్శరూపగుణకంబైన దహనంబు శబ్దస్పర్శరూపరసగుణకంబైనయంబువులు శబ్దస్పర్శరూపరస గంధసమేతంబైన ధరణియుఁ బంచీకృతంబులై మహాస్థూలంబులై యభివ్యక్తంబులయ్యెనిమ్మహాభూతంబులవలన నతలవితలసుతలరసాతలతలాతలమహాతలపాతాళభూలోకభువర్లోకస్వర్లోకజనలోకతపోలోకసత్యలోకంబు లనుచతుర్దశభువనంబులుఁ దత్తల్లోకోచిత జరాయుజాండజస్వేదజోద్భిజ్జరూపచతుర్విధభూతగ్రామంబులుఁదత్తత్ప్రాణియోగ్యాన్నపానాదికంబులు ఘటపటాది సర్వపదార్థంబులు సంభవించె నంతవట్టునుం గూడి స్థూలప్రపంచంబగు దీనికి వ్యష్టిసమష్ట్యాత్మకంబైనజాగరం బవస్థ యగు నం దొక్కొక్కవ్యష్టి స్థూల శరీరజాగరంబులయందాలింగదేహోపాధికుండైనతైజసుండభిమానంబు చేసి చిదాభాసుం డన వ్యావహారకుం డన విశ్వుం డనవొప్పు హిరణ్యగర్భుండ నయిననేను సమష్టిస్థూలగ్రహజాగ్రద్విశిష్టుండ నయి వైరాజసుం డన వైశ్వానరుం డన విరాట్పురుషుం డన సకల జగదారాధ్యుండ నయి ప్రకాశించుచుండుదు మఱియును. 43

టీ. ఇట్లు = ఈవిధముగా, గగనార్ధంబునన్ = ఆకాశమునందు నిలుపఁబడియున్న యర్ధభాగమున, వాయు తేజో జల భూభాగంబులన్ = వాయ్వగ్నిజల పృథివీభాగంబులను, అనిలార్ధంబునన్ = వాయువునందు నిలిచియున్న యర్ధభాగమునందు, ఆకాశానలసలిలేలాంశంబులన్ = ఆకాశాగ్ని జల భూముల యష్టమాంశంబులను, పావకార్ధంబునన్ = అగ్నిభూతమునందు నిలిచియున్న యర్ధభాగము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నందు, నభ...బులన్-నభః=ఆకాశముయొక్కయు, సమీర = వాయువుయొక్కయు, తోయ=ఉదకముయొక్కయు, ధరణి=భూమియొక్కయు, ఖండంబులన్ = అష్టమాంశములను, నీరార్ధంబునన్ = జలమునందు నిలచియున్న యర్ధభాగమునందు, వియ...బులన్-వియత్=ఆకాశముయొక్కయు, మరుత్ = వాయువుయొక్కయు, కృశాను = అగ్నియొక్కయు, ధాత్రీ = భూమియొక్కయు, శకలంబులన్ = అష్టమాంశములను, ధరార్ధంబునన్ = భూమియందు నిలచియున్న యర్ధభాగమునందు, వ్యోమ...యలన్-వ్యోమ=ఆకాశముయొక్కయు, పవన=వాయువుయొక్కయు,అగ్ని=అగ్నియొక్కయు, ఉదకంబుల=జలములయొక్కయు, తునియలన్=అష్టమాంశములును,|జీవ=జీవులయొక్క, అదృష్ట = పూర్వకల్పాంతమున జేయఁబడి ప్రస్తుతకల్పమున ననుభవమునకు రానున్న కర్మలయొక్క, సహాయంబునన్=సహాయముచేత, కూర్చిన క్రమంబుచేతన్ = కూర్చిన వరుసచే,శబ్దగుణకంబైన=శబ్దగుణముగల, ఆకాశంబును=ఆకాశము, శబ్దస్పర్శగుణకంబైన= శబ్దస్పర్శగుణములుగల, పవమానంబును=వాయువు, శబ్దస్పర్శరూపగుణకంబైన=శబ్దస్పర్శరూపగుణములుగల, దహనంబును=అగ్నియు, శబ్దస్పర్శరూపరసగుణకంబైన = శబ్దస్పర్శరూపరసగుణములుగల, అంబువులును=జలము, శబ్దస్పర్శరూపరసగంధసమేతంబైన = శబ్దస్పర్శరూపరసగంధములతోఁగూడిన, ధరణియుం = భూమియును, పంచీకృతంబులై= పంచీకరణముచేయఁబడి, మహాస్థూలంబులై=మిగుల పెద్దవియై, అభివ్యక్తంబులయ్యెన్= ఇంద్రియములకు గోచరములయ్యెను, ఇమ్మహాభూతంబులవలనన్ = ఈ పంచీకృతభూతములవలన, అతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళ, భూలోక, భువర్లోక, స్వర్లోక, మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోకంబులు, అను చతుర్దశభువనంబులు=అను పదునాలుగు లోకములును (ఇందు పాతాళమువఱకుఁ గల లోకము లేడును అధోలోకములనియు తక్కినవి యూర్ధ్వలోకములనియుం చెప్పఁబడును). తత్త...లును-తత్తల్లోకోచిత=ఆయాలోకములకు తగిన, జరాయుజ = మావివలనఁ బుట్టునట్టియు, (మనుష్యాదులు జరాయుజములు,) అండజ = గ్రుడ్డువలనఁ బుట్టునట్టియు, స్వేదజ=చెమ్మటవలనఁబుట్టునట్టియు (పేను మొదలగునవి) ఉద్భిజ్జరూప = భూమిని పెల్లగించుకొని పుట్టునట్టి స్వభావములుగల, చతుర్విధ = నాలుగువిధములైన, భూతగ్రామంబులును=జంతుసమూహములును, తత్త...లును-తత్తత్ప్రాణియోగ్య = ఆయాజంతువులకు తగిన, అన్నపానాదికంబులును=ఆహారము ఉదకము మొదలగునవియు, ఘటపటాది సర్వపదార్థంబులును = ఘటములు పటములు మొదలగు సకలవిధములగు వస్తువులును, సంభవించెన్=పుట్టెను. ఇంతవట్టునుంగూడి=ఇదియంతయుఁ గలసి, స్థూలప్రపంచంబగున్ = స్థూలప్రపంచమని చెప్పఁబడును. దీనికిన్=ఈస్థూలప్రపంచమునకు, వ్యష్టిసమష్ట్యాత్మకంబైన=వ్యష్టిసమష్టిభేదములుగల, జాగరంబు=జాగ్రత, అవస్థయగున్=అవస్థయైయున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అందున్ = ఆవ్యష్టిసమష్టులలో, ఒక్కొక్కవ్యష్టి స్థూలశరీరజాగరంబులయందున్ = ఒక్కొక్కస్థూలశరీరమునందును దానికి సంబంధించిన వ్యష్టి జాగ్రదవస్థయందును, ఆ లింగదేహోపాధికుండైన = ఆసూక్ష్మశరీర ముపాధిగాఁగల, తైజసుం డభిమానంబుచేసి = తైజసుండను జీవుఁ డభిమానించి, చిదాభాసుండనన్ = చిత్తుయొక్క (అనఁగా: పరబ్రహ్మముయొక్క) లక్షణములు లేకున్నను చిద్రూపముతోఁ దోఁచువాఁడు గాన, చిదాభాసుఁడనియు, (ఆభాస మనఁగా: లేనిది యున్నట్లుదోఁచుట) వ్యావహారికుం డనన్ = సకల వ్యవహారములను నిర్వహించును గావున వ్యావహారికుఁడనియు, విశ్వుం డనన్=తనశరీరమునందేకాక సకల ప్రపంచమునందుకూడ "మమ" యను నభిమానము కలిగియుండువాఁడు గావున) విశ్వుఁడనియు, ఒప్పున్=ప్రకాశించును. హిరణ్యగర్భుఁడనైన నేను=సమష్టిసూక్ష్మశరీరముననుండి హిరణ్యగర్భుఁడను పేరుగల నేను, సమష్టిస్థూలవిగ్రహ జాగ్రద్విశిష్టుండనై=సమష్టిస్థూల శరీరమునందును సమష్టిజాగ్రదవస్థయందును అభిమానము కలిగినవాఁడనై, వైరాజసుండనన్ = విశేషముగఁ బ్రకాశించుచున్నాను గావున వైరాజసుండననియు, వైశ్వానరుండనన్ = సకలజీవుల నభిమానించుచున్నాను గావున వైశ్వానరుండననియు, (విశ్వేచ తే నరాశ్చ విశ్వానరాః, విశ్వానరాణాం అయం వైశ్వానరః) విరాట్పురుషుఁడనన్ = బహువిధములఁ దోఁచుచున్నాను గావున విరాట్పురుషుఁడ ననియు, (వివిధంరాజత ఇతి విరాట్, విరాట్చాసౌపురుషశ్చ) సకల జగదారాధ్యుండనై=సకలప్రపంచముచేతను పూజింపఁబడుచున్న వాఁడనై, ప్రకాశించు చుండుదున్, మఱియున్.

తా. పైఁ జెప్పినవిధముగా నాకాశమునందలి యర్ధభాగమున వాయు తేజోజల భూముల యష్టమాంశంబులును వాయువర్ధంబున నాకాశ తేజోంబల భూముల యష్టమాంశంబులును నిట్లు ప్రతిభూతమునందును ఒక్క యర్ధభాగము తనదియుఁ రెండవ యర్ధభాగమునకుఁ దక్కిన నాల్గుభూతములలోని యష్టమాంశంబులును గలియఁగాఁ బంచీకరణమయ్యెను. దీనికిని జీవుల కర్మలు ఫలోన్ముఖము లగుటయే కారణము. దీనివల ననే భూతములు (అనఁగా: శబ్దగుణముగల యాకాశము శబ్దస్పర్శగుణములుగల వాయువు శబ్దస్పర్శరూప గుణములుగల యగ్ని శబ్దస్పర్శరూపరస గుణములుగల జలము శబ్దస్పర్శరూపరసగంధములుగల పృథ్వియును) దృశ్యంబు లయ్యెను. మహాభూతము లయ్యెను. ఈ మహాభూతములవలననే అతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళములను నధోలోకములును భూలోక, భువర్లోక, స్వర్లోక, మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోకము లనునూర్ధ్వలోకములును ఆయాలోకములయందలి చతుర్విధ జంతుజాలంబులును వానికిఁదగిన యాహారంబులును ఘటపటాదిప దార్థంబులును జనించినవి. ఇదియంతయుఁ స్థూలప్రపంచము. దీనికిని సమష్టి వ్యష్టి భేదములు కలవు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఒక్కని శరీరము వ్యష్టి; ప్రపంచమంతయు సమష్టి. దీనికి జాగ్రతయేయవస్థ. అదియు సమష్టి వ్యష్టి భేదములు కలదియే. అందు సమష్టిస్థూల జాగ్రదవస్థలతోఁగూడిన నేను (ఈశ్వరుఁడు) వైరాజసుఁడనియు వైశ్వానరుఁడనియు విరాట్పురుషుఁడనియుఁ బిలువఁ బడుచున్నాను. వ్యష్టిస్థూలజాగ్రతల నభిమానించి జీవుఁడునుఁ జిదాభాసుఁడనియు వ్యావహారికుఁడనియు విశ్వుఁడనియుఁ బిలువఁబడుచు నన్ను దనకంటె వేఱుగా భావించుచు నుపాసన చేయుచున్నాఁడు.

అవ. ఉపాసనార్థమై సమష్టిస్థూలప్రపంచాభిమాని యగు విరాట్పురుషుని యాకారమును జెప్పుచున్నాఁడు:—

చ. ధరణిపదంబులున్ దివి తతం బగుమస్తక మంతరిక్షమున్
సురుచిరనాభి చండకరసోములు లోచనము ల్దిశల్ శ్రుతుల్
వరదహనుండు నెమ్మొగము వాయువు ప్రాణములు న్మహావిరా
ట్పురుషుఁడనైన నాకుఁ గపిపుంగవ విశ్వశరీరి నాటచేన్. 44

టీ. కపిపుంగవ=వానరశ్రేష్ఠా! విశ్వశరీరినాటచేన్ = ప్రపంచమే శరీరముగాఁ గలవాఁడనగుటచేత, మహావిరాట్పురుషుఁడన్ = విరాట్పురుషుఁడను పేరుతో వ్యవహరింపఁబడుచున్నవాఁడను, ఐననాకున్ = ఐనట్టినాకు, ధరణిపదంబులును = భూమిపాదములును, దివి = ఆకాశము (లేక సత్యలోకము; దీనినే ద్యులోకమనికూడ నందురు.) తతంబు = విశాలము, అగుమస్తకము=అగునట్టిశిరస్సు, సురుచిరనాభి=ప్రకాశమైననాభిస్థానము, అంతరిక్షమును = ఆకాశము, (పంచభూతములలో నొకటి) లోచనములు = నేత్రములు, చండకరసోములు=సూర్యచంద్రులు, దిశల్ =దిక్కులు, శ్రుతులు=చెవులు, నెమ్మొగము=నోరు, వరదహనుండు=శ్రేష్ఠమైన యగ్నిహోత్రుఁడు, వాయువు=వాయుదేవుఁడు, ప్రాణములును=పంచప్రాణములు.

తా. ఓవానరశ్రేష్ఠా! విరాట్పురుషుఁడ నైననేను ప్రపంచరూపుఁడ నగుటచే నాకు భూమిపాదంబులు, ద్యులోకము, శిరస్సు, అంతరిక్షము (అనఁగా: భూమికిని ద్యులోకమునకును నడుమనుండు భాగము), నాభిప్రదేశము, చంద్రసూర్యులు నేత్రములు, దిక్కులు శ్రోత్రములు, అగ్ని ముఖము (లేక నోరు), వాయుదేవుఁడు పంచప్రాణములు. [ఈ మహాభూతములవలన జ్ఞానకర్మేంద్రియములును ప్రాణములు నంతఃకరణంబులును జనించినవి. ఇచ్చట సూక్ష్మభూతములవలన జనించిన కర్మేంద్రియాదులు ఆశక్తిగల (అనఁగా: మాటలాడుట మొదలగు శక్తులుగల) సూక్ష్మపదార్థము లనియు స్థూలభూతములవలన జనించిన యింద్రియాదులు ఆసూక్ష్మపదార్థముల కాశ్రయములగు నేత్రశ్రోత్రాదిగోళకము లనియు నెఱుంగునది.]

సుగంధివృత్తము.—

ధారుణీసురుల్ముఖంబు ధాత్రిపు ల్భుజంబు లో
నూరి వైశ్యు లూరువు ల్సుశూద్రు లంఘ్రులున్మహా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భూరుహౌషధీలతాళి భూరిరోమములు వి రా
ట్పూరుషుండ నైననాకు బోధశుద్ధమానసా. 45

టీ. బోధశుద్ధమానసా-బోధ=జ్ఞానముచేత, శుద్ధ=పవిత్రమైన, మానస = మనస్సు గలవాఁడా!, ఓసూరి=ఓ విద్వాంసుఁడా ! విరాట్పూరుషుండనైననాకుఁ = విరాట్పురుషుఁడనై యున్న నాకు, ధారుణీసురులు=బ్రాహ్మణులు, ముఖంబు=ముఖము, ధాత్రిపులు=క్షత్రియులు, భుజంబులు=బాహువులు, వైశ్యులు, ఊరువులు=తొడలు, సుశూద్రులు=శ్రేష్ఠులగు శూద్రజాతివారు, అంఘ్రులు = పాదములు, మహా...ళి-మహాభూరుహ = గొప్పవృక్షములు, ఓషధి=మూలికలు, లతా = తీఁగెలు, ఆళి = వీనిసమూహము, భూరి రోమములు=అధికములగు వెండ్రుకలు.

తా. నిర్మలజ్ఞానము గల యో విద్వాంసుఁడా! విరాట్పురుషుఁడ నైన నాకు ముఖము బ్రాహ్మణులు, బాహువులు క్షత్రియులు, ఊరువులు వైశ్యులు, పాదములు శూద్రులు, వృక్షములు నోషధులును తీవియలును రోమములు.

వనమయూరము —

శైలములు శల్యములు సన్నదులు నాడీ
జాలములు వార్ధులు పిచండము త్రిసంధ్యా
కాలములు చేలములు కాలజలదాళు
ల్వాలములు విశ్వతనువర్తి నగునాకున్. 46

టీ. విశ్వతనువర్తినగునాకుఁ = ప్రపంచరూప మగు శరీరమునందున్న (లేక సర్వ శరీరములయందున్న) నాకు, శైలములు=పర్వతములు, శల్యములు=ఎముకలు, సన్నదులు =శ్రేష్ఠములగు నదులు, నాడీజాలములు = నరములు, వార్ధులు = సముద్రములు, పిచండము=గర్భము, త్రిసంధ్యాకాలములు = ప్రాతర్మధ్యాహ్నసాయంకాలములు, చేలములు = వస్త్రములు, కాలజలదాళులు = నల్లనిమేఘములు, వాలములు=శిరోజములు.

తా. మఱియు నేను ప్రపంచరూపుఁడ నగుటచే పర్వతములు నాకు ఎముకలు, నదులు నాడులు, (నరములు) సముద్రములు కుక్షి. ప్రాతర్మధ్యాహ్నసంధ్యాకాలములు వస్త్రములు. మేఘసమూహములు కేశములు. (వృక్షములు మొదలగునవి రోమము లని ఇదివఱకుఁ జెప్పఁబడియున్నవి. ఇప్పుడు మేఘములు కేశములని చెప్పఁబడియున్నవి. మొదట చెప్పినది శరీరమునందలి రోమములనుగూర్చి యనియు, నిప్పుడు చెప్పినది శిరోజములనుగూర్చి యనియుఁ దెలిసికొనునది.)

శా. ఆధారం బిల యై జలంబు మణిపూరాంభోజ మై వహ్ని యై
స్వాధిష్ఠాన మనాహతం బనిల మై చంచద్విశుద్ధంబు ఖం
బై ధీమానసరూపకప్రకృతి యాజ్ఞాబ్జాత మై యొప్పు స
ర్వాధారోన్నత విశ్వమూర్తి నగునాకాదిత్యసంపూజితా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ఆదిత్యసంపూజితా - ఆదిత్య = దేవతలచేత, సంపూజిత = పూజింపఁబడిన వాఁడా! సర్వా...మూర్తిన్-సర్వ=సమస్తమునకు, ఆధార=ఆధారమైనట్టియు, ఉన్నత= ఉత్తమమైనట్టియు, విశ్వమూర్తినగునాకున్ = ప్రపంచశరీరముగల, ఆధారంబు=ఆధార చక్రము, ఇలయై=భూమియై, జలంబు=ఉదకము, మణిపూరాంభోజమై = మణిపూరక కమలమై, స్వాధిష్ఠానము = స్వాధిష్ఠానకమలము, వహ్నియై = అగ్నిహోత్రమై, అనా హతంబు=అనాహతచక్రము, అనిలమై=వాయుదేవుఁడై, చంచద్విశుద్ధంబు=ప్రకాశించు చున్న విశుద్ధచక్రము, ఖంబై=ఆకాశమై, ధీమా...కృతి-ధీ = బుద్ధి, మానస=మనస్సు అనునట్టి, రూపక = రూపముగల, ప్రకృతి = మాయ, ఆజ్ఞాబ్జాతమై = ఆజ్ఞాకమలమై, ఒప్పున్=ప్రకాశించును.

తా. దేవతలచే వినుతింపఁబడుచున్న యాంజనేయా! సకలప్రపంచమున కాధారభూతుఁడ నైనట్టియు స్వరూపభూతుఁడ నైనట్టియు నాకు భూమి మూలా ధారకమలము. వహ్ని స్వాధిష్ఠానకమలము. జలము మణిపూరకకమలము. వాయు వనాహతకమలము. ఆకాశము విశుద్ధకమలము. మనోబుద్ధిరూపిణి యగు ప్రకృతి యాజ్ఞా కమలము.

క. మేరు వగు బ్రహ్మదండియె
యారయఁగా దక్షిణోత్తరాయణములు సొం
పార నిడాపింగళ లో
సూరి పరమపదము వరసుషుమ్న కుమారా! 48

టీ. కుమారా = పుత్రా (లేక, కుత్సితు లగు కామక్రోధాద్యభ్యంతరశత్రువు లను బాహ్యశత్రువులను గూడ జయించిన), ఓసూరి = ఓ బ్రహ్మజ్ఞాని, బ్రహ్మదండియే= బ్రహ్మదండి యనుపేరు గల వెన్నెముకయే, మేరువగున్ = మేరుపర్వతమై యున్నది, సొంపారన్=అందముగా, ఆరయఁగాన్=విచారింపఁగా, ఇడాపింగళలు = ఇడాపింగళా నాడులు, దక్షిణోత్తరాయణములు = క్రమముగా దక్షిణాయనోత్తరాయణములు, వరసుషుమ్న = శ్రేష్ఠమగు సుషుమ్నానాడి, పరమపదము = కైవల్యము, అగున్=అయి యున్నది.

తా. ఓ జ్ఞాని! పుత్రా! మేరువు నాకు బ్రహ్మదండి (వెన్నెముక). దక్షిణాయన మిడానాడి. ఉత్తరాయణము పింగళానాడి. మోక్షము సుషుమ్నానాడి.

సీ. అతలంబు పదములు వితలంబు గుల్ఫముల్
సుతలంబు జంఘిక ల్సుజననివహ
నుత! రసాతలము జానువులు దారుణమహా
తల మూరువులు తలాతలము కటియు


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాగలోకము మహానాభ్యధోభాగంబు
భూర్భువస్స్వర్లోకములును నాభి
జఠరవక్షంబులు సరి మహర్లోకంబు
కంఠంబు సుజనలోకంబు ముఖము
తే. మఱి తపోలోక మరయ భ్రూమధ్యమంబు
సత్యలోకంబు విపులమస్తకము సుమ్ము
విశ్వరూపధరుండ నై వెలయునాకు
జలనిధిగభీర! వీరకేసరికుమార! 49

టీ. సుజననివహనుత = సత్పురుషసమూహముచే స్తోత్రము చేయఁబడుచున్న ట్టియు, జలనిధిగభీర-జలనిధి = సముద్రమువలె, గభీర=గాంభీర్యముగలవాఁడా! వీరకేసరి కుమార=పరాక్రమవంతుఁ డగు కేసరి యను వానరునకుఁ బుత్రుఁడా, విశ్వరూపధరుఁడ నై=ప్రపంచమే స్వరూపముగా ధరించి, వెలయునాకున్ = ప్రకాశించుచున్న నాకు, అతలంబు = అతలలోకము, పదములు = పాదములు, వితలంబు = వితలలోకము, గుల్భములు=చీలమండలు, సుతలంబు=సుతలలోకము, జంఘికలు=పిక్కలు, రసాతలము=రసాతలలోకము, జానువులు = మోఁకాళ్లు, దారుణమహాతలము = ఘోరమైన మహాతల లోకము, ఊరువులు=తొడలు, తలాతలము = తలాతలలోకము, కటియున్ = పిఱుఁదులును, నాగలోకము=పాతాళలోకము, మహానాభ్యధోభాగంబు=నాభికి క్రిందిభాగము, భూర్భువస్వర్లోకములును = భూలోకము, భువర్లోకము, సువర్లోకము క్రమముగ, నాభి జఠరవక్షంబులు-నాభి = నాభిస్థానము, జఠర=కుక్షి, వక్షంబులు = వక్షస్స్థలము అను నవయవములు, సరి, మహర్లోకంబును = మహర్లోకము, కంఠంబు = కంఠము, సుజన లోకంబు=శ్రేష్ఠమగు జనలోకము, ముఖము, మఱి=ఇదియునుగాక, అరయన్ = విచారింపఁగా, తపోలోకము, భ్రూమధ్యంబు = బొమలనడిమిభాగము, సత్యలోకంబు, విపుల మస్తకముసుమ్ము = విశాలమగు శిరస్సుసుమీ!

తా. సముద్రునివలె మిగుల గాంభీర్యము గలిగినట్టియుఁ గేసరి యను వానరునకుఁ బుత్రుఁడ వైనట్టియు నాంజనేయా! విరాట్పురుషుఁడనై యున్న నాకు అతలలోకము పాదము. వితలలోకము చీలమండలు. సుతలలోకము పిక్కలు. సత్పురుషులచే నభివర్ణింపఁ బడిన రసాతలలోకము మోఁకాళ్లు. మహాతలలోకము తొడలు. తలాతలలోకము కటి ప్రదేశము. పాతాళలోకము వస్తి (పొత్తికడుపు). భూలోకము నాభి. భువర్లోకము గర్భము. సువర్లోకము వక్షస్థలము. మహర్లోకము కంఠము. జనలోకము ముఖము (నోరు). తపోలోకము భ్రూమధ్యప్రదేశము. సత్యలోకము శిరస్సు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇట్లు ప్రపంచసృష్టిని దెల్పి యధ్యారోపమును ముగించి జీవేశ్వరైక్య ప్రతిపాదనపూర్వకంబుగా నపవాదంబు నుపక్రమించుచున్నాఁడు:—

వ. ఇట్లు సర్వాధిష్ఠానంబు సర్వపరిపూర్ణంబు నామరూపగుణధర్మకర్మవికారరహితాఖండసచ్చిదానందపరబ్రహ్మంబు నైననేను సమష్టికారణసూక్ష్మస్థూలశరీరోపాధివిశిష్టత్వంబువలన నవ్యాకృతుండన హిరణ్యగర్భుండన విరాట్పురుషుండన సకలజీవోపాస్యుండనై ప్రకాశింపుదు. మఱియు వ్యష్టికారణసూక్ష్మస్థూలదేహోపాధితాదాత్మ్యాభిమానంబువలనఁ బ్రాజ్ఞుండనఁ దైజసుండన విశ్వుండన సుషుప్తిస్వప్నజాగ్రదవస్థల ననుభవించుచు నజ్ఞానవశుండనై జీవుండన నీశ్వరోపాసకుండనై ప్రవర్తించినచందమునం దోఁపుదు నీజీవేశ్వరతత్త్వంబు లవిద్యాకల్పితంబు లయ్యవిద్య శశవిషాణవన్ధ్యాపుత్రగగనారవిందంబులభంగి నాయందు నన్నెఱింగిన నభావం బగునట్లు గావున నింక జీవేశ్వరైక్యం బుపదేశించెద సావధానచిత్తుండవై యాకర్ణింపుమని యాత్మారాముం డాంజనేయున కిట్లనియె. 50

టీ. ఇట్లు = ఇవ్విధముగా, సర్వ = సమస్తమునకును, అధిష్ఠానంబును = ఆధారమైనట్టియు, సర్వపరిపూర్ణంబును=అంతట నిండినట్టియు, నామ...బును-నామ = పేర్లు, రూప=రూపములు, గుణ=గుణములు, ధర్మ = స్వభావములు, కర్మ=క్రియలు, వికార = అనువికారములు, రహిత=లేని, అఖండ=విభాగములు లేని, సచ్చిదానంద = సత్యజ్ఞానానందరూపమైనట్టి, పరబ్రహ్మంబును=పరబ్రహ్మమును, ఐన నేను = ఐనట్టి నేను, సమ...వలనన్-సమష్టి=సముదాయరూపములైన, కారణ=కారణశరీర మనునట్టియు, సూక్ష్మ=సూక్ష్మశరీర మనునట్టియు, స్థూలశరీర=స్థూలశరీర మనునట్టియు, ఉపాధి=ఉపాధులతో, విశిష్టత్వంబువలనన్ = కూడియుండుటచేత, అవ్యాకృతుండనన్ = అవ్యాకృతుఁడననియు, హిరణ్యగర్భుఁడనన్ = హిరణ్యగర్భుఁడ ననియు, విరాట్పురుషుఁడ ననియు, సకలజీవోపాస్యుఁడనై = సర్వజీవులచే నుపాసింపఁబడువాఁడనై, ప్రకాశింపుదున్, మఱియున్, వ్యష్టి...లన్ - వ్యష్టి = భిన్నభిన్నరూపములైన, కారణ=కారణశరీరము లనునట్టియు, సూక్ష్మ = సూక్ష్మశరీరము లనునట్టియు, స్థూలదేహ = స్థూలశరీరము లనునట్టియు, ఉపాధి=ఉపాధులయందు, తాదాత్మ్యాభిమానంబువలనన్ = అవియే నేనను నభేదాభిమానమువలన, ప్రాజ్ఞుండనన్=ప్రాజ్ఞుండ ననియు, తైజసుండనన్ = తైజసుండ ననియు, విశ్వుండనన్=విశ్వుండ ననియు, సుషుప్తిస్వప్నజాగ్రదవస్థలన్ - సుషుప్తి =

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సుషుప్తి యనునట్టియు, స్వప్న=స్వప్న మనునట్టియు, జాగ్రదవస్థలన్ = జాగ్రత యను నట్టి యవస్థలను, అనుభవించుచున్, అజ్ఞానవశుండనై = అజ్ఞానమునకు లోఁబడి, జీవుం డనన్=జీవుఁ డను పేరుతో, ఈశ్వరోపాసకుండనై = ఈశ్వరు నుపాసనఁ జేయుచు, ప్రవర్తించినచందంబునన్ = ఉన్నట్లుగా, తోఁపుదున్=తోఁచుచున్నాను. ఈ జీవితే శ్వర తత్త్వంబులు=ఈ జీవేశ్వరుల రూపములు, అవిద్యాకల్పితంబులు=అవిద్యచే కల్పింపఁ బడినవి, అయ్యవిద్య=ఆ యవిద్య, శశవి...భంగిన్-శశ=కుందేటియొక్క,విషాణ=కొమ్ము, వంధ్యాపుత్ర=గొడ్రాలికొడుకు, గగనారవిందంబులభంగిన్=ఆకాశపుష్పము, వీనివలె, నాయందున్=పరబ్రహ్మస్వరూపుఁడ నైన నాయందు, నన్నెఱంగినన్ = నా స్వరూప మును దెలిసికొనినచో, అభావంబగున్ = శూన్యమగును, అట్లుగావునన్ = కాఁబట్టి, ఇంకన్=ఇఁకమీఁద, జీవేశ్వరైక్యంబు-జీవ = జీవునకును, ఈశ్వర = ఈశ్వరునకును గల, ఐక్యంబు=అభేదమును, ఉపదేశించెదన్ = బోధించెదను, సావధానచిత్తుండవై = జాగ రూకతో, ఆకర్ణింపుము = వినుము. అని, ఆత్మారాముఁడు = అంతర్యామిస్వరూపుఁ డగు శ్రీరాముఁడు, ఆంజనేయునకున్, ఇట్లనియెన్.

తా. ఇట్లు బాగుగ విమర్శించినచో సర్వమునకు నాధారభూతుఁడనై సర్వవ్యాప కుఁడనై నామము రూపము గుణములు ధర్మాధర్మములు (లేక స్వభావములు) పనులు వికారములు మొదలగునవి లేనివాఁడనై యున్న నేనే ప్రపంచరూపుఁడనై యున్నాను. అందును సమష్టికారణసూక్ష్మస్థూలదేహో (ప్రపంచము) పాధులతోఁ గూడి యవ్యాకృత హిరణ్యగర్భ విరాట్పురుష నామములతో వ్యవహరింపఁబడుచు జీవులకు నుపాసనాయోగ్యుఁడనై యున్నాను. జీవులు నన్నుఁ దమకంటె వేఱని తలంచి విష్ణు రుద్రాదిరూపములతో నుపాసించు చున్నారు. జీవు లనిన మాత్ర మెవరు? నేనే. వ్యష్టికారణసూక్ష్మస్థూలదేహో (ప్రపంచో) పాధులతోఁగూడి వానియం దాత్మాభి మానము కలిగి ప్రాజ్ఞతైజసవిశ్వనామములతోఁ బిలువంబడుచు జీవుఁడనై యాయవస్థల నుపాధించుచున్నట్లు తోఁచుచున్నాను. నాకు సుషుప్తి స్వప్నజాగ్రతల యనుభవము కూడఁ గల దని లోకమునకుఁ దోఁచుచున్నది. ఇట్లు నే నొక్కఁడనయ్యు జీవేశ్వర ప్రపంచరూపములతోఁ దోఁచునట్లు చెప్పినది. యజ్ఞానము (అవిద్య) కావున నాయజ్ఞా నము జ్ఞానము (పరబ్రహ్మతత్త్వము నెఱుంగుట) కలుగఁగానే నశించును. (అనఁగా: బాధనొందును. త్రికాలములయందును శూన్యములై యున్నవానికే కాని బాధలేదని ఇదివఱకే జెప్పియున్నాను.) కావున నీయవిద్యకాని ప్రపంచజీవేశ్వరరూపములుకాని యెప్పటికిని లేవు. ఆవిషయమును స్పష్టముచేయుటకై ప్రస్తుతస్థితిని నాశ్రయించి ప్రపంచసృష్టిని (అనఁగా ప్రపంచజీవేశ్వరులు కల రనియు వారు నాకంటె వేఱు కారనియుఁ) చెప్పితిని. ఇదియే యధ్యారోపము (లేనిదాని నున్నయట్లు భావించి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యారోపించిచెప్పుట) అనఁబడును. ఇఁక నపవాదమును (వాస్తవ ప్రపంచజీవేశ్వరా భావము) ఆశ్రయించి తత్త్వమును వివరించెద. (అజ్ఞానాదు లెప్పటికి లేనివే కావున "ఈప్రపంచ మసత్యము" అని వేఱొకమాట చెప్ప నక్కఱలేదు. ఇఁక నే మనిన: జీవుఁడు బ్రహ్మకంటె వేఱుగాఁ గానవచ్చుచున్నాఁడు. కావున వారి కిరువురకును అనఁగా జీవేశ్వరుల కిరువురకు) గల యైక్యమును వినుము. ఓ పార్వతీ! ఇట్లు ప్రతిజ్ఞఁ జేసి రామచంద్రుఁ డాంజనేయునితో నీక్రిందివిధముగాఁ జెప్పెను.

## జీవేశ్వరైక్య విచారఘట్టము.

అవ. జీవేశ్వరైక్యమును నిరూపించుటకై మొదట దృష్టాంతమును వివరించు చున్నాఁడు:—

క. కలశాంబుదములఁ దద్గత
జలములఁ గడఁద్రోయ నాకసము ప్రతిబింబం
బులు లేమి నొకటి యై యి
మ్ములనుండ నఖండ మై యమూర్తం బగుటన్. 51

టీ. కలశాంబుదములన్-కలశ=ఘటమును, అంబుదములన్ = మేఘమును, తద్గత జలములన్ = వానియందున్ననీటిని, కడఁద్రోయన్ = తీసివేయఁగా, ప్రతిబింబంబులు లేమిన్=ప్రతిబింబములు లేకపోవుటచేత, ఆకసము = ఆకాశము, అమూర్తంబగుటన్ = స్వయముగా రూపము లేనిది కావున (లేక శరీరములేనిది కావున), అఖండమై = భేద ములులేనిదై (ఏకమైయనుట), ఒకటియై, ఇమ్ములనుండున్ = చక్కఁగానుండును (కల శోదకమునందు ప్రతిబింబించిన యాకాశమువలె జీవుఁడును మేఘోదకమునందలి యాకాశప్రతిబింబమువలె నీశ్వరుఁడును యున్నాఁడని చెప్పఁబడియున్నది. రెండును ఆకాశప్రతిబింబములే కావున వానికి పరస్పరభేదము లెట్లు కలుగునో ఉపాధులు లేక పోయిన నాకాశమంతయు నెట్లేకరూపమో అట్లే యుపాధు లున్నసమయమునందు కూడ సర్వము నేకరూపమే. జీవేశ్వరుల విషయమునకూడ నిట్లే యూహింపవలయు నని ఈశ్లోకమున సూచించియున్నాఁడు. ఉపాధుల పరిత్యజించుట యనఁగా లేదని భావించు టయే యని తెలిసికొనవలయును).

తా. మేఘంబులును దానియందలిజలంబును ఘటంబును దానియందలి జలంబు లును (కారణకార్యములు) లేనిచో నాకాశ మారెంటియందును బ్రతిబింబింపదు కదా! (అప్పుడు ప్రతిబింబములు లేకపోవుటచే నాయాకాశ మంతయు నొక్కటియే యగును. ఆకాశమునకు భాగములు గాని యాకారము గాని లేదు కదా!)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. పైదృష్టాంతమును దార్ష్టాంతికమునందు సంయోజనఁ జేయుచున్నాఁడు:—

క. ఆవిధమునఁదనువులమా, యావిద్యలఁదొలఁగఁద్రోయనంతటిలోనన్
జీవేశ్వరులు వెలుంగమిఁ, గేవలతత్త్వంబు వెలుఁగుఁ గీశాధీశా. 52

టీ. కీశాధీశా=వానరశ్రేష్ఠా! ఆవిధమునన్ = పైనఁజెప్పినవిధముగా, తనువులన్= (వ్యష్టిసమష్టి భేదములుగల) కారణ, సూక్ష్మ, స్థూలదేహములను, మాయావిద్యలన్ = జీవేశ్వరోపాధులైన మాయావిద్యలను, తొలఁగఁద్రోయన్ = పరిత్యజించిన యెడల (అనఁగా యథార్థముగా నామాయావిద్యలు అభావరూపములే కావున విచారదృష్టిచే వానిని పోఁగొట్టినయెడల), అంతటిలోనన్ = తత్క్షణమే లేక యెచ్చటఁ జూచినను, జీవేశ్వరులన్ = జీవేశ్వరరూపములు, వెలుఁగమిన్ = కానరాక పోవుటచేత, కేవల తత్త్వంబు-కేవల=పరిశుద్ధమైన, తత్త్వంబు=బ్రహ్మము, వెలుంగున్=ప్రకాశించును.

తా॥ ఓవానరశ్రేష్ఠా ! పైదృష్టాంతమునందువలెనే దార్ష్టాంతికమునందును సమష్టి వ్యష్టిశరీరమును కార్యకారణరూపము లగు నవిద్యామాయలను సంపూర్ణముగ లేనిదే యగుటచే నందలి జీవేశ్వరప్రతిబింబములు గూడ నెప్పుడును లేవు. ప్రతిబింబశూన్య మగు శుద్ధాకాశమువలెనే పరబ్రహ్మము కూడ నిర్వికారుఁడై సర్వపరిపూర్ణుఁడై యపరి చ్ఛిన్నుఁడై ప్రకాశించుచున్నాఁడు. ప్రపంచము స్పష్టముగాఁ గానవచ్చుచున్నది గదా. దీని నెట్లు త్రోసివేయనగును? ఎట్లా బ్రహ్మమును సాక్షాత్కరింపనగును. అని సంశ యింపవలదు. విచారదృష్టిచే భ్రాంతివలనఁ దోఁచుచున్నసర్పము నభావముగాఁ జూచి త్రాటిని గ్రహించునట్లు భ్రాంతివలనఁ దోఁచుజగమును (కారణ స్థూల సూక్ష్మవ్యష్టి సమష్టిశరీరమాయావిద్యలను) అభావముగాఁ జూచి జీవేశ్వరప్రతిబింబశూన్యమైన బ్రహ్మ మును గ్రహింపవచ్చును.

వ. అది యెట్లంటేని. 53

క. కలశజలప్రతిబింబం, బులకు విలక్షణ మసంగము నమూర్తంబై
యలరుఘటాకాశము తద్జ్ఞులకు మహాకాశమదియె సుమి వివరింపన్.

టీ. కలశజలప్రతిబింబంబులకున్-కలశ=కుండకంటెను, జల=అందలినీటికంటెను, ప్రతిబింబములకున్=ఆనీటియందలి యాకాశప్రతిబింబమునకంటెను, విలక్షణము=వేఱై నదియు, అసంగము = (ఆఘటముతోఁగాని నీటితోఁగాని ప్రతిబింబముతోఁగాని సంబం ధములేనిదియు, అమూర్తంబై=శరీరము లేనిదియు నై, ఘటాకాశము=ఘటమునందున్న యాకాశము (అనఁగా ఘటమునందలి జలమునకు నవకాశమిచ్చుచున్న యాకాశము.),

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అలరుక్ = ఒప్పుచున్నది. వివరింపక్ = బాగుగవిచారించినచో, తద్జ్ఞులకుక్ = జ్ఞానవంతులగువారికి, అదియె = ఆఘటాకాశమే, మహాకాశమునుమీ = సర్వపరిపూర్ణాకాశమైయున్నది. (మహాకాశమునకును దానికిని భేదమేమియును లేదనుట.)

తా. ఈవిషయమును వివరించెదను వినుము. ఘటమునకంటెను దానియందలి జలమునకంటెను అందలి ప్రతిబింబమునకంటెను వేఱుగ ఘటాకాశ మొక్కటి కలదు. ఆకాశము లేనిది ఘటముగాని ఘటమునందు జలముగాని జలమునందుఁ బ్రతిబింబముకాని యుండుటకు వీలులేదు. ఆకాశమే యవకాశమనుట ప్రసిద్ధికదా! బాగుగ విచారించినచో నాఘటాకాశమే తత్త్వవేత్తలకు మహాకాశము. ఆ ఘటాకాశ మహాకాశములకు భేదమే లేదు సుమా!

తే. క్రమముతో స్థూలసూక్ష్మకారణములకును
సుకరజాగరణస్వప్నసుప్తులకును
బ్రభువు లగువిశ్వతైజసప్రాజ్ఞులకు వి
లక్షణుం డగు నాత్ముండు సాక్షి యగుచు. 55

టీ. క్రమముతోక్ = వరుసగా, స్థూలసూక్ష్మకారణములక్ = వ్యష్టిస్థూలసూక్ష్మకారణశరీరములకును, సుక...కుక్ - సుకర = సుస్వభావసిద్ధములైన, జాగరణ = వ్యష్టిజాగ్రదవస్థ, స్వప్న = వ్యష్టిస్వప్నావస్థ, సుప్తులకుక్ = వ్యష్టిసుషుప్త్యవస్థ, వీనికిని, ప్రభువులగు విశ్వతైజసప్రాజ్ఞులకుక్ = ఈశరీరములకును అవస్థలకును యజమానులైన విశ్వతైజసప్రాజ్ఞులను జీవులకును, ఆత్ముండు = పరబ్రహ్మము, సాక్షియగుచుక్ = ద్రష్టయై వీరలకంటె వేఱుగనుండి వీరలఁ జూచుచు, విలక్షణుండగుక్ = వీనితో సంబంధపడక వేఱుగనున్నాఁడు. (చూచువానికిని చూడఁబడువానికిని సంబంధము కలుగుట విరుద్ధముకదా యని భావము.)

తా. పై దృష్టాంతమునందు నిరూపింపఁబడిన మహాకాశమువలె నిచ్చటను వ్యష్టిస్థూలసూక్ష్మకారణశరీరములకంటెను వానియందున్న జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థారూపమైనట్టియు సత్వరజస్తమోగుణాత్మక మైనట్టియు నవిద్యకంటెను వానియం దభిమానము గలిగియున్న విశ్వతైజసప్రాజ్ఞులను జీవులకంటెను వేఱై, యీ వ్యష్టిప్రపంచమునకంతయు సాక్షియై కూటస్థుఁ డున్నాఁడు. ఆయనయే యాత్మ.

తే. అతఁడు కూటస్థుఁడనఁ బ్రత్యగాత్ముఁ డనఁగ
నక్షరుం డనఁ బురుషుఁ డనంగ సాక్షి
యనఁగ విలసిల్లుఁ దాఁ బరమాత్ముఁ డగుచు
ప్రకృతిపురుషుల నంటక పరమపురుష!. 56

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. పరమపురుష=పురుషశ్రేష్ఠా! అతఁడు=పైన వర్ణింపఁబడినయాత్మ, కూటస్థుఁడనఁ = పర్వతశిఖరమువలె నిర్వికారుఁడై చాంచల్యములేక యుండువాఁడు కావున కూటస్థుఁడనియు, ప్రత్యగాత్ముఁడనఁగ = అంతర్యామి కావున ప్రత్యగాత్మయనియు, అక్షరుండనఁ=నాశరహితుఁడు కావున నక్షరుఁడనియు, పురుషుండనఁగ = శరీరమునందు (లేక అష్టపురములయందు) సంచరించువాఁడు కావున పురుషుఁడనియుఁ, సాక్షియనఁగ=తనజ్ఞానశక్తిచే సర్వమును బ్రకాశింపఁజేయువాఁడు కావున సాక్షియనియు, తాఁ=తాను, ప్రకృతిపురుషులఁ=అవిద్యాజీవులను (తో), అంటక = సంబంధపడక, పరమాత్ముఁడగుచుఁ=సత్యజ్ఞానానందరూపుఁడై, విలసిల్లుఁ=ప్రకాశించును.

తా. పురుషశ్రేష్ఠా! నిర్వికారుఁడగుటచేఁ గూటస్థుఁ డనియు నింద్రియములకు గోచరుఁడుగాక లోపల నుండువాఁడగుటచేఁ బ్రత్యగాత్ముఁడనియు నాశరహితుఁడగుటచే నక్షరుఁడనియు శరీరములయందు లేక నష్టపురములయందు నుండువాఁడగుటచేఁ బురుషుఁ డనియు, జ్ఞానరూపుఁడై సర్వము దెలిసికొనువాఁడగుటచే సాక్షియనియుఁ బిలువఁబడు చున్నాఁడు. అతఁడే పరబ్రహ్మము. దృష్టాంతమునందుఁ జూపఁబడిన ఘటాకాశమహాకాశములకు భేదములేన ట్లాతనికిని బరబ్రహ్మమునకును భేదములేదు.

## అష్టపురములవివరణము.

శ్లో. జ్ఞానేంద్రియాణి ఖలు పంచ తథాపరాణి కర్మేంద్రియాణి మనఆదిచతుష్టయంచ,
ప్రాణాదిపంచకమథో వియదాదికం చ కామశ్చ కర్మ చ తమఃపున రష్టధాపూః.

తా. 1.(ఐదు) జ్ఞానేంద్రియములు, 2.(ఐదు) కర్మేంద్రియములు, 3. (నాలుగు) అంతఃకరణములు, 4. (ఐదు) ప్రాణములు, 5. (ఐదు) భూతములు, 6. కామము, 7. కర్మ, 8. అజ్ఞానము. ఇవి యష్టపురములు.

క. జలదజలప్రతిబింబం, బులకు విలక్షణ మసంగము నమూర్తం బై
యలరు మహాకాశము కే,వలమై నలమై కవిప్రవరభావజ్ఞా! 57

టీ. కవిప్రవరభావజ్ఞా=కవిప్రవరజ్ఞానులలో శ్రేష్ఠులగువారియొక్క, భావజ్ఞా = అభిప్రాయముల నెఱింగిన హనుమంతుఁడా, జలదజలప్రతిబింబంబులకుఁ-జలదజల = మేఘమునందున్న నీటికిని, ప్రతిబింబంబులకుఁ = ఆనీటియందలి ప్రతిబింబమునకును, విలక్షణము=వేఱై, అసంగమును=ఆ మేఘముతోఁగాని యందలి జలముతోఁగాని అందలి ప్రతిబింబముతోఁగాని సంబంధపడనిదై, అమూర్తంబై=ఆకారములేనిదై, కేవలమై=ఏకస్వరూపమై, నలమై = సర్వవ్యాపకమై, మహాకాశము = ఆకాశభూతము, అలరుఁ = ప్రకాశించుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. జ్ఞానులలోఁ శ్రేష్ఠుఁడగువాఁడా (లేక శ్రేష్ఠులగువారి యభిప్రాయముల నెఱింగినవాఁడా) కలశమునందువలెనే మేఘమునందునుగూడ నా మేఘమునకంటెను వేఱై వానికన్నిటి కాధారమై యాకాశము వెలుంగుచున్నది కదా. అది మహాకాశమే.

క. జీవసమష్టితనుత్రిత, యావస్థాత్రితయములకు నఖిలాత్మకమా
యావిప్రాణవిరాట్పురు, షావలికి న్సాక్షి యై పరాత్ముం డొప్పున్. 58

టీ. జీవ...లకున్-జీవసమష్టి = జీవసముదాయముయొక్క, తనుత్రితయ=స్థూలసూక్ష్మకారణశరీరములకును (అనఁగా: సమష్టి స్థూలసూక్ష్మ కారణశరీరములకును), అవస్థాత్రితయములకున్ = సమష్టిజాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలకును, అఖి...లికిన్-అఖిలాత్మక=సమష్టిరూపులైన, మాయావి=సమష్టికారణశరీరాభిమానియగు నవ్యాకృతుఁడను నీశ్వరునకును, ప్రాణ = సమష్టి సూక్ష్మదేహాభిమానియగు ప్రాణుఁడను నీశ్వరునకును, విరాట్పురుష=సమష్టి స్థూలశరీరాభిమానియగు విరాట్పురుషునకును, ఆవలికిన్ = వీని సముదాయమునకును, సాక్షియై = ద్రష్టయై (అనఁగా వీనికంటె వేఱై వీనిని జూచుచు), పరమాత్ముండు=పరబ్రహ్మము, ఒప్పున్ = ప్రకాశించుచున్నాఁడు. (వ్యష్ట్యవచ్ఛిన్న బ్రహ్మమునకు నాత్మయనియుఁ సమష్ట్యవచ్ఛిన్నబ్రహ్మమునకు పరమాత్మయనియుఁ వ్యవహారము.)

తా. పైదృష్టాంతమునందు నిరూపించిన మహాకాశమువలెనే సమష్టిస్థూలసూక్ష్మకారణ శరీరములకంటెను అందలి సమష్టి జాగ్రత్స్వప్న సుషుప్తులకంటెను (అనఁగా సత్త్వరజస్తమోగుణాత్మకయగు మాయకంటెను అందలి ప్రతిబింబములైన విరాట్పురుష హిరణ్యగర్భ అవ్యాకృతులకంటెను) వేఱై వానికెల్ల సాక్షియై పరమాత్ముండు ప్రకాశించుచున్నాఁడు.

తే. అతఁడు పరమాత్ముఁ డనఁగ బ్రహ్మంబనంగ
నలఘుపరిపూర్ణచైతన్య మనఁగ నొప్పు
నిర్వికల్పుం డసంగుండు నిర్వికారుఁ
డద్వితీయుఁ డనంతుఁడై యాంజనేయ! 59

టీ. ఆంజనేయ, అతఁడు = అయీశ్వరసాక్షి, నిర్వికల్పుండు = సంకల్పవికల్పములులేనివాఁడు (లేక విభాగించుటకు వీలుకానివాఁడై), అసంగుండు = దేనితోను సంబంధపడనివాఁడై, నిర్వికారుఁడు = పుట్టుక మొదలగువికారములు లేనివాఁడై, అద్వితీయుఁడు = తనకంటె నితర మగుపదార్థము లేనివాఁడై, అనంతుఁడై = నాశము లేనివాఁడై, పరమాత్ముండనఁగన్ = సర్వవ్యాపకుఁ డగునాత్మ, కావున పరమాత్మయనియు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్రహ్మంబనఁగన్ = తనకంటె రెండవపదార్థములేక యుండువాఁడు కావున బ్రహ్మమనియు, అల...నఁగన్-అలఘు = మిక్కుటముగా, పరిపూర్ణ = నిండిన, చైతన్యమనఁగన్=జ్ఞానరూపుఁడనియు, ఒప్పున్=చెప్పఁబడుచు ప్రకాశించును.

తా. ఓ ఆంజనేయా! ఆపరబ్రహ్మమునకంటె వేఱగుపదార్థమే లేదు. ఆయనకు నాదిమధ్యాంతములు లేవు. ఆయనను ఇట్టివాఁడు అని నిరూపించుటకు శక్యముకాదు. ఆయన దేనితోను సంబంధపడువాఁడు కాఁడు. ఆయనకే పరమాత్ముఁడనియు బ్రహ్మమనియు సర్వవ్యాపకశుద్ధచైతన్యమనియుఁ బేర్లు. ఈశ్వరసాక్షి యని చెప్పఁబడినవాఁడాపరబ్రహ్మమే.

సీ. కలశమేఘములఁ దద్గతజలంబులఁ దదీ
యప్రతిబింబద్వయంబు నొకటఁ
గడకుఁ ద్రోచినఘటాకాశమహాకాశ
ములకు నేకత్వంబు గలిగినట్లు
వ్యష్టిసమష్టిదేహములను ధీమాయ
లను జీవపరమేశులను విచార
దృష్టిచేఁ గని నిషేధించినయెడఁ బ్రత్య
గాత్మున కప్పరమాత్మునకును
తే. సమరసైక్యంబు ఘటియించు సత్యమనుచు
నిఖలవేదాంతశాస్త్రముల్ నిశ్చయించు
గురువు లిట్లుపదేశింపుదురు బుధులకు
ననఘ యిదియె మదీయదివ్యాశయంబు. 60

టీ. అనఘ = పాపరహితుఁడవగు ఆంజనేయా! కలశమేఘములన్ - కలశ = ఘటమును, మేఘములన్ = మేఘమును, తద్గతజలంబులన్ = వానియందున్ననీటిని, తదీ...యంబున్ - తదీయ = ఆనీటియందున్న, ప్రతిబింబ = ప్రతిబింబముయొక్క, ద్వయంబున్ = రెంటిని, ఒకటన్ = మొత్తముగా, కడకుఁద్రోచినన్ = తొలఁగించినయెడల, ఘటాకా...ములకున్ - ఘటాకాశ = ఘటజలప్రతిబింబములకు మూటికిని సంబంధింపక ఘటమునందున్న యాకాశమునకును, మహాకాశములకున్ = మేఘజలబింబములకు సంబంధింపక యున్నసర్వవ్యాపకాకాశములకును, ఏకత్వంబుగల్గినట్లు = ఐక్యము సంభవించినవిధమున, వ్యష్టిసమష్టిదేహములన్-వ్యష్టి = ప్రత్యేకములైనట్టియు, సమష్టి = సముదాయరూపములైనట్టియు, దేహములన్ = స్థూలసూక్ష్మకారణశరీరములను, ధీమాయలన్ = వాని నాశ్రయించి యున్నబుద్ధి (అవిద్య) మాయలను, జీవపర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మేఘులన్ = అందు ప్రతిబింబించియున్న జీవేశ్వరులను, విచారదృష్టిచేన్ = జ్ఞానము చేత, కని=చూచి (విమర్శించి), నిషేధించినయెడన్=త్రోసివేసినయెడల, ప్రత్యగాత్మునకున్ = జీవసాక్షి యని చెప్పఁబడియున్న కూటస్థునకును, అప్పరమాత్మునకున్ = ఈశ్వరసాక్షి యని చెప్పఁబడియున్న పరబ్రహ్మమునకును, సమరసైక్యంబు = పరిపూర్ణ మగునేకత్వము, ఘటియించున్ = సంభవించును. (ప్రత్యగాత్మ పరమాత్మలకు భేదము లే దనువిషయము తెలియవచ్చు ననుట.) సత్యమనుచున్=ఇది నిశ్చయము అని, నిఖిల వేదాంతశాస్త్రములు=సమస్తము లగువేదాంతశాస్త్రములును, నిశ్చయించున్ = సిద్ధాంతముఁజేయును. బుధులకున్=జ్ఞానులగుశిష్యులకు, గురువులు, ఇట్లు=ఈవిధముగానే, ఉపదేశింపుదురు=బోధింతురు. మదీయదివ్యాశయంబు-మదీయ = నాసంబంధమైన, దివ్య = శుభమైన, ఆశయంబు=అభిప్రాయము, ఇదియే=ఇదే.

తా. ఓదోషరహితుఁడా! ఇఁక జీవేశ్వరైక్యమును గూర్చి వివరమును వినుము. కలశంబును మేఘంబును వానియందలి జలంబును అందలి ప్రతిబింబములను త్రోసివేసిన ఘటాదుల కాధారమగుఘటాకాశమునకును మేఘాదుల కాధారమగు మేఘాకాశమునకును ఎట్లు భేదము సిద్ధించునో (అనఁగా స్వతస్సిద్ధమగునభేదము స్పష్టముగఁ దెలియవచ్చునో) అట్లే వ్యష్టిసమష్టులను (అనఁగా వ్యష్టిసమష్టిప్రపంచములను) అవిద్యామాయలను అందలి బ్రహ్మప్రతిబింబములగు జీవేశ్వరులను దత్త్వజ్ఞానదృష్టిచే నిషేధించినయెడల వ్యష్టిసాక్షి యగుకూటస్థునకును సమష్టిసాక్షి యగుపరబ్రహ్మమునకును గల స్వతస్సిద్ధమగునైక్యము బయలుపడును. వాస్తవస్థితిలో మాయావిద్యలును దత్కార్యము లగు వ్యష్టిసమష్టులును దత్ప్రతిబింబము లగునీశ్వరజీవులును అసత్యములే కదా! ఇదియే జీవేశ్వరైక్యము. సద్గురువులు తగినయధికారము గలశిష్యులకు దీనినే యుపదేశింతురు. నాకుఁగల పరిపూర్ణాభిప్రాయ మిదియే.

అవ. ఇట్లు సవిమర్శముగ జీవేశ్వరైక్యమును వివరించి యుపసంహరించుచున్నాఁడు:—

సీ. పరఁగ శరావకుంభకనామరూపముల్
త్రోచి మన్నొకటిగాఁ జూచుపగిది
ఘటతటాకముల నొక్కట నిషేధించి త
ద్గతజల మొకటిగాఁ గాంచుకరణి
దీపప్రదీపవర్తియుగ మ్మడంచి త
త్తేజంబు నొకటిగాఁ దెలియుభాతిఁ
గలశగృహంబులఁ గడ నుంచి వానిలోఁ
గలమింట నొకటిగాఁ దలఁచురీతిఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. బాధ్యజీవేశ్వరత్రయోపాధియుగముఁ
బ్రాకటవివేకదృష్టి నిరాకరించి
తనరుపరిపూర్ణ శుద్ధచైతన్య మొకటి
గా విలోకింపలయు మేధావి యనఘ. 61

టీ. అనఘ=ఆంజనేయా! పరఁగన్=బాగుగా, శరా...ముల్-శరావ=మూఁకుడు యొక్కయు, కుంభక = కుండయొక్కయు, నామ=పేరును, రూపముల్ = రూపములును, త్రోచి = తొలఁగించి, మన్ను = దానియందలిమంటిని, ఒకటిగాన్ = అభిన్నముగా, చూచుపగిదిన్ = చూచునట్లును, ఘట...ములన్-ఘట = కుండను, తటాకములన్ = చెఱువులను, ఒక్కటి నిషేధించి = ఒక్కమాఱే తొలఁగించి, తద్గతజలములన్=వానియందున్ననీటిని, ఒకటిగాన్ = అభిన్నముగా, కాంచు కరణిన్ = చూచునట్లును, దీప...గము-దీప=దీపముయొక్కయు, ప్రదీప=దానినుండి వెలిఁగించిన రెండవ దీపముయొక్కయు, వర్తియుగమున్=రెండువత్తులను, అడంచి=త్రోసివేసి, తత్తేజంబున్ -తత్ = ఆదీపప్రదీపములయందలి, తేజంబున్ = అగ్నిని (లేక కాంతిని), ఒకటిగా, తెలియంభాతిన్ = అభిన్నముగా తెలిసికొనునట్లును, కలశగృహంబులన్ = ఘటమును గృహమును, కడనుంచి = విడచి, వానిలోఁగలమింటిన్ = ఆఘటగృహములలోనున్న యాకాశమును, ఒకటిగాఁ దలఁచురీతిన్ = అభిన్నముగాఁ దలంచునట్లు, బాధ్య...గమున్-బాధ్య = యథార్థజ్ఞానముచేఁ దొలఁగింపవలసిన (భ్రాంతిజ్ఞానముచేఁ దోఁచిన వస్తువును యథార్థజ్ఞానముచే నశింపఁజేయుంట బాధయని యిదివఱకేవివరించియున్నాము) జీవ = (విశ్వ, తైజస, ప్రాజ్ఞులను) జీవులయొక్కయు, ఈశ్వర = (అవ్యాకృత, ప్రాణ విరాట్పురుష లను) ఈశ్వరులయొక్కయు, త్రయ = త్రికమను (అనఁగా ముగ్గురు జీవులను ముగ్గురుఈశ్వరులను), ఉపాధి=వారి కుపాధు లగుస్థూలసూక్ష్మకారణశరీరముల యొక్క, యుగ్మమున్ = జతను (అనఁగా వ్యష్టిసమష్టిదేహములను), ప్రాకటవివేక దృష్టిన్-ప్రాకట = అధికమైన, వివేకదృష్టిన్ = బ్రహ్మజ్ఞాన మనెడుచూపుతో, నిరాకరించి = తిరస్కరించి, తన...ము-తనరు = ఒప్పుచున్న, పరిపూర్ణశుద్ధచైతన్యము = సర్వ పరిపూర్ణ మగునిర్మలబ్రహ్మమును, మేధావి=బుద్ధిమంతుఁడు, ఒకటిగాన్ = అభిన్నమైన దానినిగా, విలోకింపవలయున్ = చూడవలయును (తెలిసికొనవలయు ననుట. ఇట్లు చెప్పుటవలన బ్రహ్మజ్ఞాని యగువానికి జీవేశ్వరప్రపంచాదులు బొత్తిగనే కానరా వని యర్థముచేసికొనఁగూడదు. వాని కవి గానవచ్చినను అందు జీవేశ్వరాదిభావన తొలఁగి నిర్గుణబ్రహ్మభావన కలుగునని మాత్రమే గ్రహించునది. "బాధ్య" అను పదముచే నీవిషయము మూలమున స్పష్టము చేయఁబడియే యున్నది).

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. కామాదిదోషములు లేని యోయాంజనేయా! పైఁజెప్పినవిధముగా వ్యష్టి సమష్ట్యుపాధుల వివేకదృష్టిచే నిరాకరించి పిదప నందలిప్రతిబింబములు రెండు నొక్కటియే యని తెలిసికొనవలయును. నామరూపములు వేఱైనంతమాత్రమునఁ బదార్థములకు భేదము లేదు. కుండ, ముంత మూఁకుడు మొదలగువానికి నామరూపములలో భేదమున్నను పదార్థమును బట్టి చూచిన (అనఁగా నవి యన్నియు మృత్తికయే యని చూచిన) భేదమేమియు లేదు కదా! కొంచెము వివేకముతో విచారించిన మృణ్మయ పాత్రము లన్నియు మృత్తికయే యని తెలిసికొనవచ్చును. ఇట్లే కుండలయందును చెఱువుయందు నున్న నీటిని ఒకటిగాఁ దెలిసికొనవచ్చును. ఆనీటికి కుండలో నుండుట చెఱువులో నుండుట యని యుపాధిభేదము మాత్రమే తప్ప స్వరూపభేద మేమియు లేదు కదా! ఇట్లే రెండు దీపము లున్నప్పుడు ఆదీపములకు నుపాధు లగువత్తులను నిరాకరించి యారెండుదీపములను తేజస్సే యనియు ఘటము నందును గృహమునందు నున్న యాకాశమొక్కటియే యనియుఁ దెలిసికొనవచ్చును. లోకమున మన మిట్లే చేయుచున్నాము. ప్రకృతజీవేశ్వరప్రతిబింబముల విషయమునందును పైసందర్భముల యందువలెనే వ్యష్టిసమష్ట్యుపాధులను జ్ఞానదృష్టిచేఁ దొలఁగించి (అనఁగా యథార్థస్థితిలో నవి సంపూర్ణముగ లేనివే కావున జ్ఞానముచే వానిని బాధించి) యప్పుడు ప్రతిబింబములేలేవు కావున బుద్ధిమంతుఁడగువాఁడు పరబ్రహ్మమునకు వికార మెప్పటికిని లేదనియు నాయన సర్వపరిపూర్ణుం డనియుఁ దెలిసికొనవలయును.

అవ. ఇట్లు సర్వము నుపదేశించి మహావాక్యార్థమును వివరించుచున్నాఁడు:—

## తత్త్వమసి యనుసామవేదమహావాక్యార్థనిర్ణయము.

వ. ఇట్లు వ్యష్టిశరీరావస్థాత్రితయంబు విశ్వతైజసప్రాజ్ఞనామకంబు నైన జీవచైతన్యంబుఁ గించిద్జ్ఞత్వకర్తృత్వభోక్తృత్వాదిగుణంబులుం గూడి త్వంపదవాచ్యార్థంబు దేహత్రయవిలక్షణంబు నవస్థాత్రయసాక్షియుఁ బంచకోశవ్యతిరిక్తంబు సచ్చిదానందస్వరూపంబు నైన కూటస్థచైతన్యమాత్రంబు త్వంపదలక్ష్యార్థంబు సమష్టిశరీరావస్థాత్రయాత్మిక యైనమాయయు వైశ్వానరహిరణ్యగర్భావ్యాకృతనామకంబైన మాయాప్రతిబింబేశ్వరచైతన్యంబు సర్వజ్ఞత్వసర్వేశ్వరత్వసర్వాంతర్యామిత్వాదిగుణంబులుంగూడి తత్పదవాచ్యార్థంబు దేశకృతకాలకృతవస్తుకృతపరిచ్ఛేదశూన్యంబు స్వజాతీయవిజాతీయస్వగతభేదరహితంబు సత్యజ్ఞానానందస్వరూపంబు నైనపరిపూర్ణాద్వితీయబ్రహ్మచైతన్యమాత్రంబు తత్పదలక్ష్యార్థం బగు విరుద్ధధర్మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కంబు లైనవాచ్యార్థంబులతో లక్ష్యార్థంబుల కైక్యంబు సంభవింపదు గావున నొక్కదేశంబునన నొక్కకాలంబున నొక్కరూపంబున నున్న పురుషుని వేఱొక్కదేశంబున మఱియొక్కకాలంబున గొండొకరూపంబుచేనుండం గనుంగొని తద్దేశతత్కాలతదవస్థావిశేషంబుల నేతద్దేశైతత్కాలైతదవస్థావిశేషంబులగణించి లక్షింపక లక్ష్యభూతుండైనయతం డితం డని యొక్కనిఁగా నెఱింగిన తెఱంగున జహదజహల్లక్షణచేత మాయికంబు లైనయుభయవాచ్యార్థంబుల నిషేధించి ద్వివిధలక్ష్యార్థచైతన్యంబుల కైక్యంబు దెలియు మిదియ యసిపదార్థం బిదియె జీవేశ్వరైక్యజ్ఞానం బిదియే మహావాక్యార్థం బింక జీవబ్రహ్మైక్యం బుపదేశించెద నాకర్ణింపు మని మఱియు నిట్లనియె. 62

టీ. ఇట్టు=ఈవిధముగా, వ్యష్టి...బును-వ్యష్టి = ప్రత్యేకములైన, శరీర = స్థూలసూక్ష్మకారణశరీరములయొక్కయు, అవస్థాత్రితయంబును = జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలయొక్కయుం త్రితయము, విశ్వతైజసప్రాజ్ఞనామకంబైన=విశ్వతైజసప్రాజ్ఞులను పేర్లుగల, జీవచైతన్యంబును = జీవుఁడును, కించి...లును-కించిద్జ్ఞత్వ = స్వల్పముగ విషయములను దెలిసికొనుట, కర్తృత్వ=కార్యములఁ జేయుట, భోక్తృత్వ=వాని ఫలము ననుభవించుట, ఆది=మొదలగు, గుణంబులును = గుణములును, కూడి=చేరి, త్వం పదవాచ్యార్థంబు=త్వం అనుపదమునకు సామాన్యముగఁ జెప్పఁదగిన యర్థము (లోకమున "త్వం = నీవు అనుపదమునకు కించిద్జ్ఞత్వాదిగుణములు గలిగినట్టియుం వ్యష్టిశరీరావస్థలయం దభిమానముకలిగినట్టియు జీవుఁడు" అని యర్థముచెప్పుచున్నారు). దేహత్రయవిలక్షణంబునను = స్థూలసూక్ష్మకారణములకంటె వేఱైనదియు, అవస్థాత్రయసాక్షియుఁ = జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలఁ జూచునదియు, పంచకోశవ్యతిరిక్తంబును = శరీరత్రయరూపము లైన అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములనునైదుకోశములకంటె వేఱైనదియు (చర్మమాంసాదులతోఁ గూడినస్థూలశరీర మన్నమయకోశము; ప్రాణకర్మేంద్రియములు ప్రాణమయకోశము; మనస్సుజ్ఞానేంద్రియము కలసి మనోమయకోశము; బుద్ధిజ్ఞానేంద్రియములు విజ్ఞానమయకోశము; ఈప్రాణమయాదిమూఁడుకోశములు కలసి సూక్ష్మశరీరము. సుషుప్తియందలి యానంద మానందమయకోశము. అదియే కారణ శరీరము), సచ్చిదానందస్వరూపంబునైన సత్యజ్ఞానానంద స్వరూపమైనదియు నగు, కూటస్థచైతన్యమాత్రంబు=జీవసాక్షి యని చెప్పఁబడియున్న యాత్మమాత్రమే త్వంపదలక్ష్యార్థంబు="త్వం" అనుపదమునకు విమర్శపూర్వక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముగ నిర్ణయింపఁదగిన యర్థము. (బాగుగ విచారించిచూచిన త్వం పదమునకు "కూట స్థుఁడు" అనియే యర్థ మేర్పడును గాని జీవుఁ డని యేర్పడదు. (సమ...త్మిక-సమష్టి= సముదాయరూపములైన, శరీర = దేహములయొక్కయు, అవస్థాత్రయ = అవస్థల యొక్కయు, త్రయమే, ఆత్మిక = స్వరూపముగాఁ గలది, ఐనమాయయున్ = ఐనట్టి మాయయును, వైశ్వానరహిరణ్యగర్భావ్యాకృతనామకంబు = వైశ్వానరుఁ డనియు హిరణ్యగర్భుఁ డనియు అవ్యాకృతుఁ డనియు పేర్లుగలది, ఐన మాయాప్రతిబింబేశ్వర ...బును-ఐన=ఐనట్టియు, మాయా=మాయయందు, ప్రతిబింబ=ప్రతిబింబించిన, ఈశ్వర =ఈశ్వరుఁడును, చైతన్యంబును = బ్రహ్మప్రతిబింబమును, సర్వ...లును-సర్వజ్ఞత్వ=సకల మును దెలిసికొనఁ గలుగుట, సర్వేశ్వరత్వ=సకలమును నియమింపఁ గలుగుట, సర్వాంత ర్యామిత్వ = సర్వప్రపంచమునకును అంతర్యామియై యుండుట, ఆదిగుణంబులును=అను మొదలగు నీశ్వరగుణములును, కూడి=కలసి, తత్పదవాచ్యార్థంబు = "తత్ = అది" అను పదమునకు సామాన్యముగఁ జెప్పఁదగినయర్థము. (లోకమున నుపాసకులు మొదలగు "తత్ =అది" అనుపదమునకు సర్వజ్ఞత్వాదిగుణయుక్తుఁ డగుపరమేశ్వరుని నర్థముగాఁ జెప్పుచున్నారు.) దేశకృత కాలకృత వస్తుకృత పరిచ్ఛేదశూన్యంబును = దేశముచేఁగాని కాలముచేఁగాని పదార్థములచేఁగాని యేర్పఱుపఁబడు భేదములేనిదియు(అనఁగా సర్వదేశ కాలవస్తువులయందు వ్యాపించియుండునదియు), స్వజాతీయవిజాతీయస్వగత భేదరహితం బును=తనజాతివలనఁగాని యితరజాతివలనఁగాని తనయందే యున్నయవయవములవలనఁ గాని గలుగు భేదములు లేనిదియు, సత్యజ్ఞానానందస్వరూపంబును= సత్యజ్ఞానానందములు స్వరూపముగాఁ గలదియు, ఐన...త్రంబు- ఐనట్టి=ఐన, పరిపూర్ణ=నిండిన, అద్వితీయ= రెండవది లేని, బ్రహ్మచైతన్యమాత్రంబు=పరబ్రహ్మరూప మగువిజ్ఞానము మాత్రమే, తత్ప దలక్ష్యార్థంబగున్ = "తత్" అను పదమునకు లక్ష్యార్థము. (అనఁగా విచారించి నిర్ణ యింపఁదగినయర్థమై యున్నది. బాగుగ విచారించిన తత్పదమునకు పరబ్రహ్మమే యర్థ మగును గాని యీశ్వరుఁడు కానేరఁడు.) విరుద్ధ=ఐక్య మగుటకు వీలుకాని, ధర్మంబు లైన = కించిద్జ్ఞత్వసర్వజ్ఞత్వాదిధర్మములుగల, వాచ్యార్థంబులతోన్ = జీవేశ్వరులతో, లక్ష్యార్థంబులకున్ = కూటస్థపరమాత్మలకు (అనఁగా త్వంపదవాచ్యార్థ మగుజీవునితో తత్పదలక్ష్యార్థ మగుబ్రహ్మమునకుఁగాని తత్పదవాచ్యార్థమగునీశ్వరునితో త్వంపద లక్ష్యార్థ మగుకూటస్థునకుఁగాని, (ఐక్యంబు=అభేదము, సంభవింపదు=కలుగదు, కావునన్ =కాఁబట్టి, ఒక్కదేశంబునన్ =ఒక్కచోట, ఒక్కకాలంబునన్ = ఒక్కసమయమున, ఒక్కరూపంబుననున్నపురుషునిన్ =ఒకవిధముగానున్నమనుష్యుని, వేఱొక్కదేశంబునన్ =మఱియొక స్థలమున, మఱియొక్కకాలంబునన్ = మఱియొకసమయమున, కొండొక రూపంబుచేన్ = వేఱొకరూపముతో, ఉండంగనుంగొని = ఉండఁగాఁ జూచి, తద్దే...

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బులన్-తద్దేశ=అప్పటిస్థలమును, తత్కాల=అప్పటిసమయమును, తదవస్థావిశేషంబులన్ =అప్పటి స్థితిభేదములను, ఏత...బులన్-ఏతద్దేశ=ప్రస్తుతస్థలముయొక్క, ఏతత్కాల =ప్రస్తుత సమయముయొక్క, ఏతదవస్థా=ప్రస్తుతస్థితులయొక్క, విశేషంబులన్ = భేదములను, గణించి=విచారించియు, లక్షింపక = ప్రధానముగాఁజేసికొనక, లక్ష్యభూతుండైన=ప్రధానుఁడైన, అతండితండని=ఆపురుషుఁడే వీఁడని, ఒకనిగాన్ = అభిన్నునిగా, ఎఱిఁగిన తెఱంగునన్ = తెలిసికొనినట్లు, జహదజహల్లక్షణచేతన్ = జహదజహల్లక్షణా వృత్తిచే (వాచ్యార్థంబులు సంబంధించినప్పుడు దాని కనుగుణముగా నొకయర్థము నూహించి వాక్యమును సమన్వయించుటకు లక్షణావృత్తి యని పేరు. అది జహల్లక్షణ యనియు నజహల్లక్షణయనియు జహదజహల్లక్షణయనియు మూఁడువిధములు. అందు వాచ్యార్థమును సంపూర్ణముగ వదలి యన్యార్థము నూహించుట జహల్లక్షణ. దానిని కొంచెమైనను వదలక యూహించుట యజహల్లక్షణ. విడిచియు విడువకయూహించుట జహదజహల్లక్షణ. ఈమూఁడవలక్షణ వేదాంతశాస్త్రమునందుతక్క మఱియెచ్చటఁ గానరాదు), మాయికంబులు = మాయాసంబంధములు, ఐన...బులన్-ఐన = అయినట్టి, ఉభయ=తత్త్వంపదములయొక్క, వాచ్యార్థంబులన్ = వాచ్యార్థములను, నిషేధించి=జ్ఞానదృష్టిచే తొలఁగించి, ద్వివిధ...కున్-ద్వివిధ = రెండువిధములైన, లక్ష్యార్థ = త్వం తత్పదలక్ష్యార్థములగు, చైతన్యంబులకున్=కూటస్థ శుద్ధచైతన్యములకు, ఐక్యంబు=అభేదమును, తెలియుము=తెలిసికొనుము. ఇదియ=ఇదే, అసిపదార్థంబు=అసి, అను మూఁడవ పదముయొక్కయర్థము. ("తత్త్వమసి = ఆశుద్ధచైతన్యము కూటస్థరూపుఁడవగు నీవే యై యున్నావు". అనుమహావాక్యముయొక్క అర్థము వివరింపఁబడెను.) ఇదియే జీవేశ్వరైక్యజ్ఞానంబు = జీవేశ్వరులయభేదమును గ్రహించుట యన్న నిదియే. ఇదియే మహావాక్యార్థంబు = మహావాక్యమున కిదియే యర్థము. ఇఁకన్ = ఇఁక, జీవబ్రహ్మైక్యంబు = జీవునకును బ్రహ్మకును గలయభేదమును, ఉపదేశించెదను = బోధించెదను ఆకర్ణింపుము=వినుము. అని, మఱియున్, ఇట్లనియె.

తా. వేదములయం దీవిషయము మహావాక్యముల మూలమున వివరింపఁబడి యున్నది. ఆమహావాక్యము నాలుగు అన్నియు సమానార్థములే యగుటచేత ఛాందోగ్యోపనిషత్తునందలి "తత్వమసి" = "నీవే ఆఈశ్వరుఁడవై యున్నాఁడవు" అనునొకమహావాక్యముయొక్క యర్థమును వివరించెదను. ఆమహావాక్యమునందలి "త్వం" = "నీవు" అనుపదముచే సామాన్యముగా వ్యష్టిస్థూలసూక్ష్మకారణశరీరములును వ్యష్టిజాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలును విశ్వతైజసప్రాజ్ఞులును భ్రాంతివలన నున్నట్లు తలంపఁబడు చున్న కించిద్జ్ఞత్వాది గుణంబులును (అనగా వ్యష్టి దేహములే) తానుగాఁ దలం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చుచు జాగ్రదాదుల ననుభవించుచు గించిద్జ్ఞుఁడ ననుకొనుచు నుండువిశ్వతైజసప్రాజ్ఞ భేదములు గలజీవుఁడు చెప్పఁబడుచున్నాఁడు. ఈయర్థము (అనఁగా "త్వం" "జీవుఁడు" అను నర్థము) భ్రాంతులయనుభవమునుబట్టి చెప్పఁబడునదియే కాని విచారదృష్టిచేఁ జూచిన సిద్ధాంతమగునది కాదు. అట్టి యర్థమునకే వాచ్యార్థమని పేరు. బాగుగ విచారించినచో నీదేహములు కాని యవస్థలు కాని కించిద్జ్ఞత్వాదిగుణములుకాని యథార్థములుకాక కేవలము భ్రాంతి సిద్ధములే. కావున నీదేహముల కంటె వేఱై యవస్థలకు సాక్షియై పంచకోశములకు (ఈకోశములు క్రమముగ గ్రంథముననే వివరింపఁబడును) నతీతుఁడై సత్యజ్ఞానానందస్వరూపుఁడై యున్నకూటస్థుఁడె యాత్వంపదమున కర్థము. ఇట్లు నిర్ణయింపఁబడిన (లేక ఊహింపఁబడిన) యర్థమునకు లక్ష్యార్థ మని పేరు. త్వంపదమును గూర్చి వివరించిన విధముననే "తత్" = "ఆఈశ్వరుఁడు" అనుపదమునకుఁగూడ సమష్టి స్థూలసూక్ష్మకారణ శరీరంబులును సమష్టిజాగ్రత్స్వప్నసుషుప్తులును వాని నభిమానించువిరాట్పురుషహిరణ్యగర్భావ్యాకృతులును వారికి (లేక అభేదములు గల ఈశ్వరునకు) నున్నవని తలంపఁబడు చున్న సర్వజ్ఞత్వాదిగుణంబులును వాచ్యార్థము.

వీనితో సంబంధింపక నిర్గుణమై సర్వదేశసర్వకాలసర్వావస్థలయం దొక్కరీతిగ వ్యాపించి యద్వితీయమై యున్నపరబ్రహ్మమే లక్ష్యార్థము. అసి=అయియున్నాఁడవు అనుపదమునకు "పైఁజెప్పినరెండర్థములు నొక్కటియే" యనుటయే యర్థమని స్పష్టముగనే తెలియుచున్నది.

ఇచ్చట నొకవిశేషము కలదు. ఒకవాక్యము నన్వయింపవలసినప్పుడు శక్తినిఁగాని లక్షణనుగాని యాశ్రయింపవలయును. శక్తియనఁగా పదములకుఁ గలస్వతస్సిద్ధమైన యర్థము లక్షణ యనఁగా కేవలము శక్తి నాశ్రయించిన దాత్పర్యమునకు హాని కలుగునేని యప్పుడు శక్య మగు శక్తిచే బోధింపఁబడిన పదార్థమునకు సంబంధించిన మఱియొకదానిని దాత్పర్య మనుకూలముగ దెచ్చి కాని యర్థము చెప్పుట. అందును శక్యమును సంపూర్ణముగ వదలుటయు, వదలకుండుటయుఁ గూడ కలదు. ఇట్టిలక్షణలకుఁ గ్రమముగ జహల్లక్షణ యనియు నజహల్లక్షణ యనియుఁ బేర్లు. ప్రస్తుతవాక్యము నన్వయించుట కీరెండులక్షణములును బనికిరావు.ఎట్లనిన: ఇచ్చట శక్యములు (శక్తిచేఁ దెలియఁజేయఁ బడునవి.) వాచ్యార్థములే! అవి పరస్పరవిరుద్ధములు. కావున ఈపదార్థము (ఐక్యము)అన్వయింపదు. విరుద్ధముల కైక్యము కుదురదుకదా! ఈకారణమువలన ప్రస్తుత వాక్యము నన్వయించునప్పుడు శక్తి నాశ్రయించుటకు వీలులేదు. ఇఁక లక్షణ నాశ్రయింత మన్నను జహల్లక్షణ పనికిరాదు. వాచ్యార్థముల సంపూర్ణముగ వదలినచో నైక్యము స్వతస్సిద్ధమే కావునను, జీవేశ్వరులే యప్పుడు లేరు. కావునను వాక్యమే నిర


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్థకమగును. జీవేశ్వరులే లేకున్న "జీవేశ్వరైక్యము" అనునది ఎచ్చటనుండి వచ్చును? అజహల్లక్షణయును పనికిరాదు. వాచ్యార్థముల సంపూర్ణముగ విడువనిచో నైక్యము కుదురదని మొదటనే చెప్పియున్నానుకదా! కావున నీవాక్యమును (మహావాక్యముల సమన్వయించుటకై) వేదాంతశాస్త్రమున "శక్యమును విడిచియు విడువకుండుట" యను నదియే స్వరూపము గాఁగల మూఁడవలక్షణను "జహదజహల్లక్షణ" యను పేరుతో నంగీకరించి యున్నారు. ఇదియును లోకానుభవమునకు విరుద్ధము కాదు. ఒకపురుషుని నొక కాలమున నొకస్థలమున నొక వేషముతోఁ జూచినవాఁడు మఱియొక కాలమున మఱియొక దేశమున మఱియొక వేషముతో నాపురుషునే చూచి "వాఁడే వీఁడు" అని గుఱుతించుచున్నాఁడు. ఇది ప్రత్యక్షమే కదా! ఇచ్చట "వాఁడే వీఁడు, వాఁడును వీఁడును ఒక్కటియే" అనువాక్యమును సమన్వయించుట ఎట్లు? "వాఁడు" అనఁగా: మొట్ట మొదటఁ జూడఁబడిన దేశకాలాదులతోఁ గూడినవాఁడు. "వీఁడు" అనఁగా: ప్రస్తుత దేశకాలములతోఁ గూడినవాఁడు, ఇప్పుడు వాచ్యార్థములైన పూర్వప్రస్తుత దేశకాల యుక్తపురుషులకు నైక్యము జహదజహల్లక్షణలచేఁ గాని శక్తిచేఁ గాని కుదురదు. కావున దేశకాలములకు సంపూర్ణముగఁ ద్రోసివేయక వివేకదృష్టితోమాత్రము తొలఁగించి లక్ష్యార్థమగుపురుషులకు నైక్యము చెప్పుచున్నారు. ఇట్లే ప్రస్తుతవాక్యమునందును వాచ్యార్థముల సంపూర్ణముగఁ ద్రోసివేయక వివేకదృష్టిచేమాత్రము తొలఁగించి లక్ష్యార్థము లగుకూటస్థబ్రహ్మలకు జహదజహల్లక్షణచే నైక్యము చెప్పవలయును. ఇదియే మహావాక్యార్థము. ఓయాంజనేయా! జీవేశ్వరైక్యమును గూర్చి వేద మీవిధముగ "అహం బ్రహ్మాఽస్మి"="నేనే (కూటస్థుఁడనే) బ్రహ్మము నైయున్నాను" "అయమాత్మా బ్రహ్మ" = "ఈయాత్మయే (జీవుఁడే కూటస్థుఁడే) బ్రహ్మము" "ప్రజ్ఞానం బ్రహ్మ" = "జ్ఞానరూపుఁడగుజీవుఁడే (కూటస్థుఁడే) బ్రహ్మము" అను మహావాక్యములచేతఁ గూడ జీవేశ్వరైక్యమును బ్రకటించుచున్నదియని తెలిసికొనుము. ఇఁకమీఁద జీవబ్రహ్మైక్యమును దెల్పెదను. ఓగౌరీ! శ్రీరాముఁ డీవిధముగ సమస్తమును వివరించి జీవబ్రహ్మైక్యమునుం గూర్చి యాంజనేయునితో నిట్లనియె.

## జీవబ్రహ్మైక్యవిచారము.

సీ. గగనరజ్జుస్థాణుమృగతృష్ణికాశుక్తి
　　తతులాదిమధ్యమాంతములయందు
స్వస్వభావములచే వసియించి యన్నియు
　　వరుసతో నజ్ఞానవశమువలన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీలతాహిమనుష్యనీరరౌప్యంబులై
కనుపట్టి వివరించి కాంచునెడలఁ
గల్పితరూపముల్ గడుమిథ్య లై పోవఁ
దత్త్వంబు లైనచందమున నాత్మఁ
తే. డయ్యు నతఁడు ననాత్మవిద్యాత్మశక్తి
వలన జీవుఁడై తోఁచి కేవలనిజస్వ
రూపము నెఱుంగుచోఁ బూర్వరూప ముడిగి
యద్వయానందమూర్తియై యలరు ననఘ! 63

టీ. అనఘ = దోషరహితుఁడ వగునాంజనేయా! గగ...తతులు-గగన = ఆకాశము, రజ్జు=త్రాడు, స్థాణు = స్తంభము, మృగతృష్ణికా=ఎండమావులు, శుక్తి = ముత్యపుచిప్ప, తతులు = వీనిసమూహములు, ఆది...యందున్-ఆది= మొదటను, మధ్యమ = నడుమను, అంతములయందున్ = తుదను (అనఁగా: ఉత్పత్తిస్థితినాశములయందు), స్వస్వభావములచేన్ = తమస్వరూపములతో, వసియించి = ఉండి, అన్నియున్ = ఈపైఁ జెప్పినగగనాదు లన్నియును, వరుసతోన్=క్రమముగా, అజ్ఞానవశమువలనన్-అజ్ఞాన = భ్రాంతికి, వశమువలనన్ = లోఁబడియుండుటచేత (అనఁగా: పురుషునికి (ద్రష్టకు) భ్రాంతికలుగుటవలన), నీ...లై-నీలత = నలుపు, అహి=సర్పము, మనుష్య = మనుష్యుఁడు, నీర = నీరు, రౌప్యంబులై = వెండియునై (అనఁగా: ఆకాశము నల్లనిదిగాను త్రాడు సర్పముగాను స్తంభము పురుషుఁడుగాను, ఎండమావులు జలముగాను, శుక్తి రజతముగాను), కనుపట్టి = కనఁబడి, వివరించి = బాగుగ విమర్శించి, కాంచునెడలన్ = చూచిన ట్లైన, కల్పి...ముల్-కల్పిత = అజ్ఞానముచేఁ గల్పింపఁబడిన, రూపముల్ = నలుపు సర్పమువలె అగురూపములు, కడు = మిక్కిలి, మిథ్యలై = ఆభాసమాత్రములై (అనఁగా: ఉన్నట్లు దోఁచుచు లేనివై), పోవన్ = పోఁగా, తత్త్వంబులైనచందమునన్ = ఆయాకాశాదులు స్వస్వరూపములతో నిలుచునట్లు, ఆత్మఁడు=పరబ్రహ్మము, ఆత్మఁడయ్యున్ = ఎల్లప్పుడును స్వభావరూపముతో నుండువాఁడే యైనను, అనా...లనన్ - అనాది = ఆది లేని, అవిద్యా = అవిద్యయనెడు, ఆత్మ = తనయొక్క, శక్తివలనన్ = శక్తిచేత, జీవుఁడై తోఁచి=అవిద్యాప్రతిబింబ మగుజీవుఁడుగా తనకుఁదానే తోఁచి, కేవలనిజస్వరూపమున్-కేవల = నిర్మలమైన (లేక ఏక మైన), నిజస్వరూపమున్ = స్వస్వరూపమును, ఎఱుఁగుచోన్ = తెలిసికొనినప్పుడు, పూర్వరూపముడిగి = వెనుకటి భ్రాంతిసిద్ధరూపమును మాని, అద్వ...యై=అద్వయ = రెండవది లేని, ఆనందమూర్తియై = పరమానందమే రూపముగాఁ గలవాఁడై, అలరున్ = ఒప్పును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఓ దోషరహితుఁడా! ఇదివఱకుఁ జేసినవివరణమువలననే జీవేశ్వరులవలె జీవబ్రహ్మలుకూడ భిన్నులు కారని స్పష్టము చేయఁబడియే యున్నది. అయినను అచ్చట అవిద్యామాయలును వానివలనఁ గలిగిన వ్యష్టిసమష్టులును కల వనియు వానిని జ్ఞానముచే బాధింపవలయు ననియు నిప్పుడు ప్రతిబింబములు లేవు (అనఁగా: తోఁచు టయే కాని యథార్థస్థితిలో లేవు) కావున జీవేశ్వరు లొక్కటియేయనియుఁ దెలిసి కొనవలయు నని చెప్పియున్నాను. ఇప్పుడు ప్రపంచసృష్టియే యసత్యము కావున ప్రతిబింబములు కలుగనే లేదని చెప్పుచున్నా నని తెలిసికొనవలయును. అది యెట్లనిన: ఆకసము త్రాడు స్తంభము ఎండమావులు ముత్తెపుచిప్ప అనునవి త్రికాలములయందును స్వస్వరూపముతో నున్నవే కాని యేమార్పులను యథార్థస్థితిలోఁ జెందవు. ఇట్లుండియు నజ్ఞానమువలన (లేక భ్రాంతివలన) నాకాశము నల్లపడిగాను త్రాడు పాముగాను స్తంభము పురుషుఁడుగాను ఎండమావులు నీరుగాను ముత్యపుచిప్ప వెండిగాను తోఁచును. ఈనలుపు పాము మొదలగునవి యెప్పటికిని లే వనుటయు ఆకాశము త్రాడు మొదలగు నవి ఎప్పటికిని స్వస్వరూపముతోనే యున్నవనుటయు జ్ఞానమువలన నలుపు మొదలగుభ్రాంతి తొలఁగి యాకాశాదులతత్త్వము తెలియఁబడిన మరల నానలుపు పాము మొదలగునవి గానరా వనుటయు శూన్యములే యగు ననుటయు లోకానుభవమువలన నెల్లరకు స్పష్టమే. ఈవిధముగనె పరబ్రహ్మముకూడ సర్వకాలములయందు స్వస్వరూపముతోనే యున్నాఁడు. ఆకాశాదులయందు నీలత్వాదులు లేనట్లాయనయందు జీవత్వాదులు లేవు. భ్రాంతివలన (అనఁగా: ననాది యని చెప్పఁబడి యున్న మాయాశక్తివలన, లేక యవిద్యవలన) నాయనయం దిది (జీవత్వము) యారోపింపఁబడుచున్నది. కావున నాభ్రాంతి తొలఁగఁగనె భ్రాంతికల్పిత మగుజీవత్వము శూన్యమగును. అప్పుడు బ్రహ్మమునకంటె వే ఱగుజీవుఁడె యుండఁడు. సర్వము నొక్కటియే యని తెలిసికొనవలయును.

వ. ఇవ్విధంబున రజ్జ్వజ్ఞానంబువలన రజ్జువునందు భుజంగం బారోపితం బయి యాప్తవాక్యములచేతఁ దత్సర్పభ్రాంతివినాశం బగు చుండ రజ్జువు రజ్జు వైనతెఱంగున నఖండసచ్చిదానందస్వరూపుం డాత్మాజ్ఞానంబువలనఁ దనకుఁ దాన జీవుం డయి తోఁచి యనంతరంబున శ్రీగురువాక్యంబుచేత నీవు జీవుండవు గావు. పరిపూర్ణచైతన్యమాత్రుండవని యెప్పుడు బోధితుం డగు నప్పు డాతండు దేహేంద్రియప్రాణమనోబుద్ధిచిత్తాహంకారాత్మభ్రాంతి నివర్తించుచుండఁ బ్రత్యగభిన్నాద్వితీయబ్రహ్మచైతన్యమాత్రుం డగు నిదిజీవబ్రహ్మైక్యంబింకనోంకారస్వరూపం బెఱింగించెద వినుమని యిట్లనియె.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ఇవ్విధంబునన్ = ఇట్లు, రజ్జ్వజ్ఞానంబువలనన్ = రజ్జువనుజ్ఞానము లేకపోవుటచే, రజ్జువునందున్=ఆత్రాటియందు, భుజంగంబు=సర్పము, ఆరోపితం బయి = ఆరోపింపఁబడి, ఆప్తవాక్యములచేతన్ = హితులమాటలచే, 'తత్సర్పభ్రాంతి = సర్పమనెడు భ్రాంతి, వినాశం బగుచుండన్ = నశింపఁగా, రజ్జువు రజ్జు వైనతెఱంగునన్ = త్రాడు త్రాడే యైనట్లు (అనఁగా: స్వస్వరూపముతో నిలచినట్లు), అఖం...డు-అఖండ=భేదములు లేని, సచ్చిదానందస్వరూపుండు = సత్యజ్ఞానానందస్వరూపుఁ డగుపరబ్రహ్మము, ఆత్మాజ్ఞానంబువలనన్=తనయం దున్నయజ్ఞానమువలన, తనకున్, తాన = తానే, జీవుండై తోఁచి=జీవరూపముతో కానఁబడి, అనంతరంబునన్ = తరువాత, శ్రీ...చేతన్-శ్రీ=జ్ఞానసంపన్నుఁడైన, గురు=సద్గురువుయొక్క, వాక్యంబుచేతన్=ఉపదేశముచే, నీవు జీవుండవుగావు=ఈజీవస్వరూపము నీకు యథార్థ మైనదికాదు. పరిపూర్ణచైతన్యమాత్రుండవని=సర్వపరిపూర్ణ మగుపరబ్రహ్మరూపమే నీ దని, ఎప్పుడు = ఏసమయమున, బోధితుం డగున్=బోధింపఁబడునో, అప్పుడు=ఆసమయమున, అతండు=ఆయాత్మ, దేహం... భ్రాంతి-దేహ=దేహమునందును, ఇంద్రియ=ఇంద్రియములందును, ప్రాణ = ప్రాణములందును, మనః=మనస్సునందును, బుద్ధి=బుద్ధియందును, చిత్త = చిత్తమునందును, అహంకార = అహంకారమునందును గల, ఆత్మ = నే ననెడి (అనఁగా: శరీరాదులే నేననెడి), భ్రాంతి=భ్రమ (లేక అజ్ఞానము), నివర్తించుచుండన్ = నశింపఁగా, ప్రత్య...డగున్-ప్రత్యక్ = కూటస్థునకంటె, అభిన్న=వేఱుకాని, అద్వితీయ = రెండవది లేని, బ్రహ్మచైతన్యమాత్రుండగున్=జ్ఞానరూపుఁ డగు పరబ్రహ్మమేయగును. ఇది జీవ బ్రహ్మైక్యంబు= ఇదియే జీవునకును బ్రహ్మమునకును గల యభేదము. (అనఁగా: యిట్లు జీవబ్రహ్మైక్యమును దెలిసికొనవలయుననుట.) ఇంకన్=ఇఁకమీఁద, ఓంకారస్వరూపంబు=ప్రణవముయొక్క-తత్త్వమును, ఎఱిఁగించెదన్=తెలియఁజేసెదను. విను మని, ఇట్లు, అనియెన్.

తా. ఈవిధమున భ్రాంతివలన త్రాడు పామైతోఁచి యాప్తుఁ డగుపురుషుని వాక్యమువలన (అనఁగా "ఇది పాముకాదు త్రాడు" అనువాక్యమువలన) భ్రాంతి తొలఁగఁగానే యాత్రాడు త్రాడై స్వస్వరూపముతో నిలుచును. అట్లే అనాది యగు నవిద్యవలన నాత్మ తనకుతానే జీవుఁడై తోఁచుచున్నాఁడు. తనకంటె నన్య మగుపదార్థమే లేదు కావున నవిద్యకుఁ గూడఁ దానే యాధారభూతుఁడు కావలయును. దానిచేఁ దానే తిరస్కరింపఁబడవలయును. మరల దానే (బ్రహ్మయే) దానిని జయింపవలయును కదా! ఇ ట్లగుటచే "బ్రహ్మము తనకుఁ దానే జీవుఁడై తోఁచెను" అనుటవలన దోష మేమియునులేదు. అవిద్య యనునది సత్యబ్రహ్మమునకు వాస్తవ మగుతిరస్కారమును గలిగించునది యగు నేని యిట్లు చెప్పుట దోష మగును కాని ఇట్లుచెప్పుట లోకాను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భవము ననుసరించి శిష్యులఁ గ్రమక్రమంబుగా నుద్ధరించుటకై చెప్పఁబడినదే కాని వేఱు కాదు కదా. ప్రకృతము తనకుఁదానే జీవుఁడై తోఁచిన భ్రమము సద్గురువాక్యముల వలన [అనఁగా "నీవు జీవుఁడవు కావున సర్వపరిపూర్ణజ్ఞానస్వరూపుఁడవు(బ్రహ్మస్వరూపుఁడవు) "అది భ్రాంతివలన నిట్లు తోఁచుటయే కాని యిందు వాస్తవమేమియు లేదు" అనువాక్యముల వలన] భ్రాంతి తొలంగఁగానే యంతకుమునుపు "దేహేంద్రియప్రాణబుద్ధిమనోహంకారములె తాను" అని తలంచుచుండుటను మాని స్వస్వరూపమాత్రుఁడై నిలుచును. అజ్ఞానస్థితి ననుసరించియే గురుశిష్యభేదము చెప్పఁబడెనని తెలిసికొనవలయును. "చోద్యం వా పరిహారో వా క్రియతాం ద్వైతభాషయా" "భేదము నాశ్రయించియే పూర్వపక్షములును సిద్ధాంతములును చేయఁబడవలయును" అను మొదలగుప్రమాణముల వలన భేదము నాశ్రయింపనియెడల మాటలాడుటకే వీలులేదు. కర్మలును జన్మయు చిత్తశుద్ధియు బంధంబును మోక్షంబును సర్వము నవిద్యాకల్పిత మగు నభిమానమువలనఁ గలిగినదియే కాని వేఱుకాదు. కావున జీవబ్రహ్మ లెప్పటికిని భిన్నులు కారు. ఓగారీ! ఈవిధముగా జీవబ్రహ్మైక్యము నుపదేశించి యుపాసనార్థమై యోంకారస్వరూపమును దెలుపు వాఁడై రామచంద్రుఁ డాంజనేయున కిట్లనియె.

## ఓంకారస్వరూపనిరూపణము.

సీ. ఘనతరదేహజాగ్రద్విశ్వవైరాజ
సు లకారమాత్రమా సుగుణధుర్య!
తనువిగ్రహస్వప్నతైజససూత్రాత్మ
కులు నుకారార్థ మా లలితచరిత!
పృథులకారణసుషుప్తిప్రాజ్ఞసర్వేశ్వ
రుల్మకారార్థ మా రుచిరవర్ణ!
సంతతపరిపూర్ణసచ్చిదానందాత్మ
తత్త్వ మోంకార మా సత్త్వమూర్తి!
తే. యట్లు గావున వర్ణత్రయాత్మకం బ
నాత్మరూపక మైనవాచ్యార్థ మగుటఁ
గాను బ్రణవస్వరూపుఁడ నే నటంచుఁ
దెలిసి భావింపవలయు నిర్మలవిచార! ౬౫

టీ. సుగుణధుర్య = సద్గుణవంతులలో శ్రేష్ఠుఁడా! ఘన...సులు-ఘనతరదేహ = స్పష్టముగఁ గానవచ్చునట్టివ్యష్టిసమష్ట్యాత్మక మగు స్థూలదేహము, జాగ్రత్ = వ్యష్టిసమ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ష్ట్యాత్మక మగుజాగ్రదవస్థ, విశ్వ = వ్యష్టిస్థూలజాగ్రదభిమాని యగువిశ్వుఁ డనుజీవుఁడు, వైరాజసులు = సమష్టిస్థూలజాగ్రదభిమాని యగువిరాట్పురుషుఁ డను నీశ్వరుఁడు, అను వీరందఱు, అకారమాత్రమార్ = ప్రణవావయవమైన అకారమునకు అర్థ మగును. తను...లును-తనువిగ్రహ = వ్యష్టిసమష్ట్యాత్మకసూక్ష్మశరీరము, స్వప్న = వ్యష్టిసమష్ట్యాత్మకస్వప్నావస్థ, తైజస = వ్యష్టిసూక్ష్మస్వప్నాభిమాని యగుతైజసుఁ డనుజీవుఁడు, సూత్రాత్మకులును = సమష్టిసూక్ష్మస్వప్నాభిమాని యగుసూత్రాత్ముఁడను నీశ్వరుఁడును గలసి, ఉకారార్థమా=ప్రణవావయవ మగునుకారమున కర్థమగును. రుచిరవర్ణ = మనోహర మగుశరీరకాంతిగలవాఁడా! పృథు...రులు-పృథుల = అధిక మైన, కారణ=వ్యష్టిసమష్ట్యాత్మక కారణశరీరము, సుషుప్తి = వ్యష్టిసమష్ట్యాత్మకసుషుప్త్యవస్థ, ప్రాజ్ఞసర్వేశ్వరులు = వ్యష్టికారణసుషుప్త్యభిమాని యగుప్రాజ్ఞుఁడనుజీవుఁడు, సమష్టికారణసుషుప్త్యభిమాని యగునవ్యాకృతుఁ డనునీశ్వరుఁడును, మకారార్థమార్ = ప్రణవావయవ మగుమకారమున కర్థ మగును. సత్యమూర్తీ = సత్యవాది, సంత...ము-సంతత=ఎల్లప్పుడును, పరిపూర్ణ = నిండియున్న, సత్ = సత్యస్వరూపమైనట్టియు, చిత్ =జ్ఞానస్వరూపమైనట్టియు, ఆనంద = పరమానందస్వరూప మైనట్టియు, ఆత్మతత్త్వము=ఆత్మయొక్క యథార్థ స్వరూపము, ఓంకారమార్ = ఓంకారమున కర్థమగును. (అర్ధమాత్రకు పరబ్రహ్మమని యర్థ మనుట. ఈయర్ధమాత్ర మకారముపై నున్నదని తెలిసికొనవలయును.) అట్లు కావునర్, వర్ణత్రయాత్మకంబు = అకార ఉకార మకారరూపమైనట్టి ప్రణవముయొక్క యర్థము, అనాత్మరూపకమైన=అనాత్మయే (బ్రహ్మముకాని ప్రపంచము) స్వరూపముగాఁగల, వాచ్యార్థ మగుటర్ = చెప్పఁదగినయర్థము మాత్రమే యై యుండుటచేత, కాను=నే నావాచ్యార్థ రూపుఁడను కానేరను, ప్రణవస్వరూపుఁడర్ = సర్వభేదవినిర్ముక్త మగునోంకారమే స్వరూపముగాఁ గలవాఁడనే, నేనటంచుర్ = నేను అని (ఆ ఓంకారమునకు లక్ష్యార్థమగుపరబ్రహ్మమునకును నాకును భేదములేదనిరి.) తెలిసి = గ్రహించి, భావింపవలయు = ధ్యానము చేయవలయు. శ్లో. "అష్టాంగం చ చతుష్పాదం త్రిస్థానం పంచదైవతం, ఓమి త్యేవం న జానాతి బ్రాహ్మణో న భవే త్స హి".

తా. చక్కనిజ్ఞానముగలిగి సద్గుణములచేనొప్పుచు శుద్ధసత్త్వమయుండవై నిర్దోష మగుచర్యగల వానరశ్రేష్ఠా! సమష్టివ్యష్టిస్థూలశరీరములును సమష్టివ్యష్టిజాగ్రదవస్థలును విరాట్పురుషవిశ్వులును గలసి యోంకారములోనియకారమున కర్థము. ఇట్లే వ్యష్టిసమష్టి సూక్ష్మదేహస్వప్నావస్థలును వాని నభిమానించుతైజసహిరణ్యగర్భులును గలసి యోంకారములోని యకారమున కర్థము. సమష్టివ్యష్టికారణశరీరసుషుప్త్యవస్థలును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాని నభిమానించు సర్వేశ్వరప్రాజ్ఞులును గలసి యోంకారమునందలి మకారమున కర్థము. అ ఉ మ అను మూఁడక్షరములును గలసి యోంకార మయ్యెను [అ! ఉ! ఓ (అద్గుణః) ఓ+మ్=ఓం] ఇప్పుడు చెప్పఁబడినవి యా యకారాదుల వాచ్యార్థములు. సర్వవ్యాపకుఁడై సత్యజ్ఞానానందస్వరూపుఁడై యున్నపరబ్రహ్మమే యోంకారమునకు లక్ష్యార్థము ఈవిషయము నెఱింగి వాచ్యార్థములు భ్రాంతికల్పితము లగుటచే నసత్య ములు. కావున "ఆవాచ్యార్థములు నేనుకాను" అనియుం "లక్ష్యార్థమగుబ్రహ్మమె నేను" అనియుం నిశ్చయించుకొనవలయును. మనోదార్ఢ్యము కలుగుటకై పూర్వోక్తనిశ్చయ పూర్వకముగా నాయోంకారమును జపింపవలయును.

అవ. పైఁ జెప్పినయర్థమునే వివరించుచున్నాఁడు:—

వ. ఇట్లు దేహత్రయావస్థాత్రయతాపత్రయసుఖత్రయకర్మత్రయకర్తృ త్రయబుద్ధిత్రయశ్రద్ధాత్రయ ధృతిత్రయగుణత్రయశక్తిత్రయకాల త్రయ లోకత్రయ దేహత్రయ మూర్తిత్రయ వృత్తిత్రయ స్థాన త్రయజీవత్రయేశ్వరత్రయవిరక్తిత్రయ భక్తిత్రయ దీక్షాత్రయ నేత్రత్రయలక్ష్యత్రయ జ్ఞానత్రయ మండలత్రయ ముక్తిత్రయా త్మకంబయిన వర్ణత్రయం బారోపితం బయినవాచ్యార్థంబు గావున నేతత్సర్వంబుం గ్రమంబున నకారంబున నకారంబు నుకారంబున నుకారంబు మకారంబున మకారంబు నోంకారంబునం బ్రవిలాపంబు నొందించి యంతటఁ దత్ప్రవిలాపంబును విశ్వాధిష్ఠానంబుఁ బరి పూర్ణంబు దురీయంబునక్షరంబు లక్ష్యార్థంబు నయినశుద్ధోంకార మాత్రంబుగా నవలోకించి నిరంతరంబు దత్స్వరూపమాత్రుండ వై ప్రకాశింపుము. 66

టీ. ఇట్లు = ఈవిధముగా, దేహత్రయ = స్థూలసూక్ష్మకారణము లనుమూఁడు దేహములును, అవస్థాత్రయ = జాగ్రత్స్వప్నసుషుప్తు లనుమూఁడవస్థలును, తాపత్రయ = ఆధ్యాత్మిక ఆధిదైవిక ఆధిభౌతికములను త్రివిధతాపములును, సుఖత్రయ = విష యానందవాసనానందబ్రహ్మానందము లనుత్రివిధానందములును, (శబ్దాదులవలనఁ గలుగు నానందము విషయానందము. మనస్సునందలి తలంపువలనఁ గలుగునానందము వాస నానందము. బ్రహ్మజ్ఞానమువలనఁ గలుగునానందము బ్రహ్మానందము.) కర్మత్రయ = పుణ్యపాప మిశ్రములను త్రివిధకర్మలును, కర్తృత్రయ = జీవేశ్వరకూటస్థు లనుత్రివిధకర్తలును (జీవుఁడు స్వయముగ నాచరించువాఁడు. ఈశ్వరుఁ డట్లా చరింపఁ జేయువాఁడు. కూటస్థుఁడు తన సన్నిధానమాత్రమున సర్వమును బ్రవర్తింపఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేయునట్టివాఁడు), బుద్ధిత్రయ = సాత్త్వికరాజసతామసబుద్ధులు మూఁడును, శ్రద్ధాత్రయ = సాత్త్వికరాజసతామసశ్రద్ధలు మూఁడును, ధృతిత్రయ = సత్త్వరజస్తమోధృతులు (ధైర్యములు) మూఁడును, గుణత్రయ = సత్త్వరజస్తమోగుణములు మూఁడును, శక్తిత్రయ=ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులు మూఁడును, కాలత్రయ=భూతభవిష్యద్వర్తమానకాలములు మూఁడును, లోకత్రయ = స్వర్గమర్త్యపాతాళలోకములును, దేవత్రయ=వసురుద్రాదిత్యులును, మూర్తిత్రయ=బ్రహ్మవిష్ణుమహేశ్వరులును, వృత్తిత్రయ=శాంతఘోరమూఢవృత్తులును, (ఇవి క్రమముగా సత్త్వరజస్తమోగుణములవృత్తులు.) స్థానత్రయ=నాభిహృదయభ్రూమధ్యములును, జీవత్రయ = విశ్వతైజసప్రాజ్ఞులును, ఈశ్వరత్రయ = అవ్యాకృతహిరణ్యగర్భవిరాట్పురుషులును, విరక్తిత్రయ = ఐహికాముష్మికమిశ్ర వైరాగ్యములును, భక్తిత్రయ = బాహ్యభక్తి, అనన్యభక్తి, ఏకాంతభక్తులును, దీక్షాత్రయ=దృగ్వాక్స్పర్శదీక్షలును, (గురువు తనదృష్టిని శిష్యునినేత్రములయం దునిచి దానిమూలమున వానికల్మషములఁ దొలంగించుట దృగ్దీక్ష. ఉపదేశరూపమున వానిమనస్సును నిర్మలముఁ జేయుట వాగ్దీక్ష. హస్తస్పర్శమువలన బరిశుద్ధునిఁ జేయుట స్పర్శదీక్ష. ఈదీక్షలే యిప్పుడు వినోదార్థముగ నుపయోగింపఁబడు నాకర్షిణీవిద్య.) నేత్రత్రయ=జ్ఞాననేత్రముతోఁ గలసి మూఁడునేత్రములును (లేక భ్రూమధ్యమును మూఁడవ నేత్రముగా గ్రహింతురు గావున దానితోఁ గూడ మూఁడు నేత్రములును), లక్ష్యత్రయ=అంతరమధ్యబాహ్యలక్ష్యములును, జ్ఞానత్రయ=సంజ్ఞానవిజ్ఞానప్రజ్ఞానములును, (పరోక్షాపరోక్షజ్ఞానములకును పరజీవునకు నివి క్రమముగా పేర్లు.) మండలత్రయ = సూర్యచంద్రాగ్నిమండలములును, ముక్తిత్రయ = జీవన్ముక్తివిదేహముక్తిక్రమముక్తులును (జీవబ్రహ్మైక్యజ్ఞానము కలవాఁడు ప్రారబ్ధకర్మము ననుభవించుటకై శరీరమునందు నిలిచినంతకాలము ననుభవించునట్టిస్థితి జీవన్ముక్తి. పిదప కలుగునఖండైక్యము విదేహముక్తి. ఉపాసకులు బ్రహ్మలోకమునకుఁ జని యచట కొంతకాల ముండి పరిశుద్ధులై యాబ్రహ్మతోకూడ ముక్తినిఁ జెందుదురు. ఇది క్రమముక్తి. ఆత్మకంబైన = స్వరూపముగాఁ గల, వర్ణత్రయంబు=అకార ఉకార మకారములు (అనఁగా వాని కర్థమని చెప్పఁబడియున్న దేహాదులు), ఆరోపితంబైన=యథార్థమైనదిగాక కేవల మారోపితము మాత్రమే యైన, వాచ్యార్థంబుగావునన్=వాచ్యార్థము కాఁబట్టి (అనఁగా నా యర్థము సామాన్యముగఁ జెప్పఁదగినదే కాని విచారము చేసిన యథార్థము కాదు గావున), ఏతత్సర్వంబున్ = ఈవాచ్యార్థము నంతయును, క్రమంబునన్=వరుసగా, అకారంబునన్=అకారమునందు, అకారంబున్=అకారార్థమును, ఉకారంబునన్=ఉకారమునందు, ఉకారంబున్=ఉకారార్థమును, మకారంబునన్=మకారమునందు, మకారంబున్=మకారార్థమును, ఓంకారంబునన్ = ఓంకార మని చెప్పఁబడు నర్ధమాత్రయం దీస్వరమును, ప్రవిలాపంబు


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నొందించి=చేర్చి, అంతటన్=పిదప, తత్ప్రవిలాపంబున్=ఆచేరికను, విశ్వాధిష్ఠానంబును=సమస్తప్రపంచమున కాధార మైనట్టియు, పరిపూర్ణంబును=సర్వపరిపూర్ణ మైనట్టియు, తురీయంబును=తురీయావస్థాస్వరూప మైనట్టియు (ఉన్మన్యవస్థారూప మైనట్టియు, ఏక ప్రణవమునకు నాలుగుపాదములు కలవని చెప్పఁబడియున్నది. కావున శుద్ధబ్రహ్మమయ మగునానాల్గవపాదమే స్వరూపముగాఁ గలిగినట్టియు), అక్షరంబులు=నాశరహిత మైన ట్టియు, లక్ష్యార్థంబును=పైఁజెప్పిన ఓంకారమునకు లక్ష్యార్థభూత మైనట్టియు, ఐన... బుగాన్ - ఐన, శుద్ధ=నిర్మలమైన, ఓంకారమాత్రంబుగాన్ = అర్ధమాత్ర తురీయాతు రీయము వికల్పావికల్పము అని చెప్పఁదగిన ప్రణవముగా, అవలోకించి=చూచి, నిరంత రంబు=ఎల్లప్పుడు, తత్స్వరూపమాత్రుండవై=ఆబ్రహ్మమే యై, ప్రకాశింపుము.

తా. ఇంతమాత్రమే కాదు. లోకమునందుఁ గలత్రిపుటు లన్నియు నోంకారము నందలి మూఁడక్షరములకు వాచ్యార్థములగును. ఆయాయుపాధులయం దున్నబ్రహ్మమే యాయాయక్షరములకు లక్ష్యార్థ మగును. స్థూలసూక్ష్మకారణశరీరములును జాగ్రత్స్వప్న సుషుప్తులును ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికతాపములును విషయానంద వాసనానంద బ్రహ్మానందములును పుణ్యాపాపమిశ్రకర్మలును జీవేశ్వరకూటస్థకర్తలును సాత్త్వికరాజసతా మసబుద్ధులును సాత్త్వికరాజసతామసశ్రద్ధలును సాత్త్వికరాజసతామసధృతులును సత్త్వరజ స్తమోగుణములును ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులును భూతభవిష్యద్వర్తమానకాలములును స్వర్గమర్త్యపాతాళలోకములును వసురుద్రాదిత్యులును బ్రహ్మవిష్ణుమహేశ్వరులును శాంతఘోరమూఢవృత్తులును నాభిహృదయభ్రూమధ్యస్థానములును విశ్వతైజసప్రాజ్ఞు లును ఈశ్వరహిరణ్యగర్భవిరాట్పురుషులును ఐహికాముష్మిక మిశ్రవైరాగ్యములును బాహ్యానన్యైకాంతభక్తులును దృగ్వాక్స్పర్శదీక్షలును జ్ఞాననేత్రముతోఁ గూడినమూఁడు నేత్రములును అంతర్మధ్యబాహ్యలక్ష్యములును సంజ్ఞానవిజ్ఞానప్రజ్ఞానములును సూర్య చంద్రాగ్నిమండలంబులును జీవన్ముక్తి విదేహముక్తిక్రమముక్తులును మఱియుఁ గల త్రిపుటు లన్నియును నోంకారమునందలియక్షరముల కర్థములే. ఇవి భ్రాంతిచే నాఱక యారోపింపఁబడిన వాచ్యార్థములే కావున వీనిని జ్ఞానదృష్టిచే నిషేధింపవలయును. లక్ష్యార్థమగుబ్రహ్మమును స్వీకరింపవలయును. అప్పుడు మూఁడక్షరములకును అర్థ మొక టియే (బ్రహ్మమే) యగును. కావున నుపాసన చేయుకాలమున నకారార్థ మగుసర్వ ప్రపంచమును (అనఁగా: ఆప్రపంచోపాధియందు బ్రహ్మమును) అకారమునందును ఉకారార్థము నుకారమునందును మకారార్థము మకారమునందును యాయకారోకార మకారముల (అనఁగా వానియర్థముల) నోంకారమునందును జేర్పవలయును. (అనఁగా నాయోంకారము శుద్ధనిర్గుణబ్రహ్మమే యని తెలిసికొనవలయును) ఇట్లు తెలిసికొని జీవ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్రహ్మ లొక్కటియే కావున "ఆయోంకారమే నేను" అని యుపాసన చేయవలయును. ఇట్లు చేసి చిత్తదార్ఢ్యమును సంపాదించి యపరోక్షబ్రహ్మజ్ఞానమును జెంది కృతార్థుఁడవు కమ్ము.

మ. అని బోధించిన నాంజనేయుఁ డపుఁ డాత్మారామునిం జూచి యో
యనఘా యేవరయుక్తిచే నొకట వాచ్యార్థంబుఁ బోఁ ద్రోచినం
తనె లక్ష్యార్థము చూడఁ గావలయు నందం బొప్ప నాయుక్తి హె
చ్చినకూర్మి న్వినుపింపు భక్తవరదా! శ్రీరామ! సీతాపతీ! 67

టీ. అనిబోధించినన్ = అని చెప్పఁగా, ఆంజనేయుండు, అపుడు, ఆత్మారామునిన్ = అంతర్యామిస్వరూపుఁ డగు శ్రీరాముని, చూచి, ఓ యనఘా = ఓపాపరహితుఁడా! ఏవరయుక్తిచేన్ = శ్రేష్ఠ మగునేమార్గముచే, ఒకటన్ = ఒక్కమాటే, వాచ్యార్థంబున్ = సామాన్యముగాఁ జెప్పఁదగినయర్థమును, పోఁద్రోచినంతనే=తొలఁగింపఁగానే, లక్ష్యార్థము = ఊహచే నిర్ణయింపఁదగిన బ్రహ్మరూప మగునర్థము, చూడఁగావలయున్ = చూడవలెనో, అందంబొప్పన్ = చక్కఁగా, ఆయుక్తి = ఆపద్ధతిని, హెచ్చినకూర్మిన్ = అధికమగుదయతో, భక్తవరదా = భక్తులకోర్కుల నొసంగునట్టియు, సీతాపతీ = సీతాదేవికి భర్తయైనట్టియు, శ్రీరామా! పరబ్రహ్మస్వరూపుఁడవగు నోరామా! వినుపింపుము.

తా. ఓగారీ! ఈవిధముగ శ్రీరాముఁడు సర్వము నుపదేశింపఁగానే యాంజనేయుఁ డిట్లనియె. భక్తులయెడఁ గరుణ గల శ్రీరామా! సీతావల్లభా! వాచ్యార్థములఁ దొలఁగించి లక్ష్యార్థముల నైక్యము నొందించి యభేదజ్ఞానమును సంపాదించుటకుఁ దగినయుక్తి యెయ్యది? ప్రత్యక్షముగఁ గానవచ్చుచున్న వాక్యార్థముల నూఱక లేదనినంతమాత్రమున నెట్లు పోవును? ఈవిషయమును దయతో నాకు నుపదేశింపవలయును.

క. అని తనపదపద్మములకు
ఘనభక్తిని వందనములు గావించుమహా
త్ముని హనుమంతుని గని యి
ట్లనియెన్ శ్రీరామచంద్రుఁ డానందమునన్. 68

టీ. అని యిట్లు ప్రార్థించి, తనపదపద్మములకున్ = తనపాదకమలములకు, ఘనభక్తిన్=అపరిమిత మగుభక్తితో, వందనములు = నమస్కారములను, కావించు = చేయుచున్న, మహాత్మునిన్ = మహానుభావుఁడైన, హనుమంతునిన్ = ఆంజనేయుని, శ్రీరామచంద్రుఁడు = రామమూర్తి, కని = చూచి, ఆనందమునన్=సంతోషముతో, ఇట్లనియెన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. అని యిట్లు ప్రార్థించుచు నాసూత్మబుద్ధి గలయాంజనేయుఁడు శ్రీరాముని పాదపద్మములకు సాష్టాంగనమస్కారము గావించెను. ఇట్లతివినయశాలి యగునాతనిఁ జూచి ప్రీతితో శ్రీరాముఁ డిట్లనియె.

## పంచకోశములవివేచనము.

అవ. ఈవిధముగాఁ బ్రశ్నమును జెప్పి ఇదివఱకు నిరూపింపఁబడి యున్నజీవ బ్రహ్మైక్యమునే మఱియొకవిధముగా నిరూపించువాఁడై శ్రీరాముని యుత్తరమును జెప్పుచున్నాఁడు:—

సీ. అన్నజసంభూత మన్నవర్ధిత మగు
 తను వన్నమయకోశ మనఁగనొప్పుఁ
ఘ్రాణకర్మేంద్రియపంచకంబులు గూడి
 విను ప్రాణమయకోశ మనఁగఁ దనరుఁ
జ్ఞానేంద్రియోపేతమానసచిత్తంబు
 లును మనోమయకోశ మనఁగఁ జెల్లు
శబ్దాదివిషయపంచకసమన్వితబుద్ధి
 విజ్ఞానమయ మన వెలయుచుండు
తే. మోహజప్రియమోదప్రమోదవృత్తి
 సంయుతోరుసమస్తదృశ్యప్రపంచ
 కారణానాద్యవిద్యాంధకారపటల
 మంచితానందమయకోశ మనఁగఁ దనరు. 69

టీ. వినుము. అన్న...తము-అన్న = ఆహారపదార్థములనుండి, జ = పుట్టినశుక్ర శోణితములనుండి, సంభూతము=పుట్టినదియు, అన్నవర్ధితము-అన్న=ఆహారపదార్థములచే, వర్ధితము=వృద్ధిఁబొందింపఁబడినదియు, అగు తనువు = ఐనస్థూలశరీరము, అన్నమయకోశ మనఁగన్ =అన్నమయకోశమను పేరుతో (అన్నమయకోశ మనఁగా అన్నముచేఁ గల్పింపఁబడిన యావరణము), ఒప్పున్ = ప్రకాశించును, ప్రాణ...బులు-ప్రాణ = ప్రాణ వాయువులయొక్కయు, కర్మేంద్రియ = కర్మేంద్రియములయొక్కయు, పంచకంబులు= ఐదులు, కూడి = కలసి, ప్రాణమయకోశమనఁగన్ = ప్రాణమయకోశ మను పేరుతో (ప్రాణములచేఁ గల్పింపఁబడిన యావరణము. కర్మేంద్రియములకు ప్రాణములే ప్రేరకములుకావున నీకోశమున నవియే ప్రధానములు. ఇట్లే తక్కినమూఁడుకోశములయొక్క యుత్పత్తిని గ్రహించునది), తనరున్ =ఒప్పును. జ్ఞానేం...బులు-జ్ఞానేంద్రియ=జ్ఞానేంద్రియములతో, ఉపేత = కూడిన, మానస చిత్తంబులు=మనస్సును చిత్తమును (అంతః

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కరణము మనోబుద్ధు లనురెండుభేదములు కలవి అనుపక్ష మొకటి కలదు. అందు చిత్త మునకు మనస్సునందును అహంకారమునకు బుద్ధియందు నంతర్భావము కావున నిచ్చట నాపక్ష మవలంబించి మనసుతోఁగూడ చిత్తమును జేర్చినాఁడు), మనోమయకోశమనఁ గన్ = మనోమయకోశమను పేరుతో, చెల్లున్ = వ్యవహరింపఁ బడుచున్నది. శబ్దా ...బుద్ధి-శబ్దాది = శబ్దము మొదలగు, విషయ = విషయములయొక్క (ఇంద్రియగోచ రము లగును కావున వీనికి విషయము లని పేరు), పంచక = ఐదింటితో, సమన్విత= కూడిన, బుద్ధి, విజ్ఞానమయమునన్ = విజ్ఞానమయకోశ మను పేరుతో (విజ్ఞాన మని బుద్ధికి పేరుకలదు.) వెలయుచుండున్ = వ్యవహరింపఁబడుచుండును, మోహ...లము- మోహజ=అజ్ఞానమువలనఁ బుట్టినట్టియు, ప్రియ=ఇష్టవస్తుదర్శన మాత్రముచేఁ గలుగు, సంతోషము, ప్రమోద = అది తనకు దొరకినప్పుడు గలుగుసంతోషము, ప్రమోద = దానినిఁ దా ననుభవించునప్పుడు గలుగు సంతోషము, వృత్తి=అనువృత్తులతో, సంయుత =కూడినదియు, ఉరు=విస్తారమైనట్టియు, సమస్త=నిశ్శేషమైనట్టియు, దృశ్య=ఇంద్రియ గోచరమైనట్టియు, ప్రపంచ=ప్రపంచమునకు, కారణ = కారణభూతమైన, అనాది = ఆది లేనట్టియు, అవిద్య=అజ్ఞానరూపమైన, అంధకార = చీఁకటియొక్క, పటలము = సమూహము, అంచితానందమయకోశము = శ్రేష్ఠ మగునానందమయకోశము (ఇచ్చట ప్రియమోదాదివృత్తులే ప్రధానములు గావున దీని కానందమయకోశ మని పేరు గలి గెను.), అనఁగన్ = అను పేరుతో, తనరున్ = ఒప్పును.

తా. ఓయాంజనేయా! నీ వడిగినప్రశ్నమున కుత్తరమును వివరించి చెప్పెదను వినుము. అన్నమువలనఁబుట్టి అన్నముచే నభివృద్ధిఁజెందుచు నున్న యాస్థూలశరీరము అన్నమయకోశ మనఁబడును. పంచప్రాణములును గర్మేంద్రియములునుగూడి ప్రాణ మయకోశ మనఁబడును. మనసు చిత్తము జ్ఞానేంద్రియములును గూడి మనోమయకోశ మనఁబడును. శబ్దాదివిషయములైదును బుద్ధియుఁ (లేక జ్ఞానేంద్రియములును బుద్ధియుఁ) గూడి విజ్ఞానమయకోశ మనఁబడును. అజ్ఞానమువలనఁ బుట్టినదియుఁ బ్రియమోద ప్రమోదరూప మైనట్టియు నీ కనంబడు చున్న సర్వప్రపంచమునకును గారణ మైన ట్టియు ననాది యైనట్టియు అజ్ఞానము ఆనందమయకోశ మనఁబడును. ఇందేదియుఁ బ్రహ్మము కాదు.

## పంచకోశాదిక మనాత్మ యని నిరూపించుట.

అవ. బ్రహ్మము పంచకోశవ్యతిరిక్తుఁ డని నిరూపించుటకై పూర్వపక్షమున నను వాదము చేయుచున్నారు:—

సీ. మహనీయకలితాన్నమయకోశ మగునాత్మఁ
డని పల్కుదురు కొంద అజ్ఞు లగుచు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మహితేంద్రియప్రాణమయకోశ మగునాత్ముఁ
డని పల్కుదురు కొంద అజ్ఞు లగుచు
మంజులతరమనోమయకోశ మగునాత్ముఁ
డని పల్కుదురు కొంద అజ్ఞు లగుచు
మానితవిజ్ఞానమయకోశ మగునాత్ముఁ
డని పల్కుదురు కొంద అజ్ఞు లగుచు
తే. సుప్తియం దేమి దోఁపనిశూన్యతత్త్వ
మాత్ముఁ డని పల్కుదురు కొంద అజ్ఞు లగుచు
రూఢి నానందమయకోశరూపుఁ డగుమ
హాత్ముఁ డని పల్కుదురు కొంద అజ్ఞు లగుచు. 70

టీ. కొందఱు=కొంతమంది (విరోచనసిద్ధాంతమునవలంబించిన లోకాయతులు), అజ్ఞులగుచున్=మూఢులై, మహ...శము-మహనీయ=శ్రేష్ఠమైనట్టియు, కలిత=ఒప్పుచున్నట్టియు, అన్నమయకోశము=స్థూలశరీరమే, ఆత్ముఁడగునని=పరమాత్మయని(తానని), పల్కుదురు=చెప్పుదురు. కొందఱు = కొంతమంది (లోకాయతులలో నొకతెగవారు), అజ్ఞులగుచున్, మహి...శము-మహిత = ఒప్పుచున్న, ఇంద్రియ = కర్మేంద్రియములతోను, ప్రాణమయ=ప్రాణములతోనుగూడిన, కోశము = (ప్రాణమయ) కోశము, ఆత్ముఁడగునని=పరమాత్మ యని పల్కుదురు. కొందఱు (లోకాయతులలో మఱియొక తెగవారు),అజ్ఞులగుచున్, మంజు...శము-మంజులతర=మనోహరమైన, మనోమయకోశము =మనోమయమను పేరుగలకోశమే, ఆత్ముఁడగునని, పల్కుదురు, కొందఱు (బౌద్ధులు), అజ్ఞులగుచున్, మాని...శము-మానితవిజ్ఞానమయకోశము = విజ్ఞానమయమను పేరుగల కోశమే, ఆత్ముఁడగునని, పల్కుదురు, కొందఱు (బౌద్ధులలో నొకతెగవారు), అజ్ఞులగుచున్, సుప్తియందున్ = సుషుప్త్యవస్థయందు, ఏమితోఁపని శూన్యతత్త్వము = ఉన్నదనికాని లేదనికాని నిర్ణయించుటకు వీలుకానిశూన్యమే, ఆత్ముండని పల్కుదురు, కొందఱు, అజ్ఞులగుచున్, రూఢిన్=నిశ్చయముగా, మహాత్ముఁడు = సర్వవ్యాపకుఁడైన యాపరమాత్మ, ఆనందమయకోశరూపుఁ డగునని = ఆనందమయకోశమే స్వరూపముగాఁ గలవాఁడని, పల్కుదురు.

తా. కొందఱు (చార్వాకమతస్థులు. ఇదియే విరోచనుని మతము) అన్నమయకోశమే బ్రహ్మము అని చెప్పుదురు. మఱికొందఱు (చార్వాకమతములోఁ గొంత విరుద్ధాభిప్రాయముగలవారు) ఇంద్రియములే యాత్మయనియు మనస్సే యాత్మయనియు ప్రాణము లాత్మయనియుఁ ననుచున్నారు. మఱికొందఱు (బౌద్ధులు) విజ్ఞానమయకోశమే యాత్మయందురు. వేఱొకకొందఱు (బౌద్ధులలో మఱియొక తెగవారు)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సుషుప్త్యవస్థయం దందఱిచేత ననుభవింపఁబడుచున్న శూన్యస్థితియే యాత్మయని పల్కుదురు. వెండియుం గొంద అవిద్యయే (లేక ప్రకృతియే) యాత్మ యందురు. (వీరు నిరీశ్వరసాంఖ్యులు కావచ్చును) వీరందఱు నజ్ఞానులే. సర్వద్రష్టయగు నాత్మను సర్వరూపునిగ (ప్రపంచరూపునిగ) భావించుట యజ్ఞానమే కదా!

క. పరమాణు వనుచు మధ్యమ
పరిమాణుం డనుచు విభుఁడు పరుఁ డనుచును ని
ద్ధరఁ గొందఱు వాదింతురు
పరిపూర్ణాత్ముఁ డని యెఱుఁగుప్రాజ్ఞత లేమిన్. 71

టీ. ఇద్ధరన్=ఈభూమియందు, కొందఱు=కొన్నిమతములవారు (జైనమతస్థులలో నొకతెగవారు), పరిపూర్ణాత్ముఁడని = సర్వపరిపూర్ణస్వరూపుఁడే బ్రహ్మయని, ఎఱుంగు ప్రాజ్ఞత=తెలిసికొనఁగలవిజ్ఞానము, లేమిన్ = లేకపోవుటచేత, పరమాణువనుచున్=పరమాణువువలె మిగులసూక్ష్మ మగుప్రమాణము గలవాఁ డనియు, మధ్యమపరిమాణుండనుచున్ = ఏయేశరీరమందు నివసించియుండునో ఆయా (ఇట్లుచెప్పువారు జైనులు) శరీరముతో సమానమగుపరిమాణము గలవాఁ డనియు, విభుఁడు = సర్వశరీరములతో (ఆకారము గల లేక కార్యముచేయఁగల ప్రతిపదార్థముతో) సంబంధించియున్నాఁడనియు, (ఇట్లు చెప్పువారు వైశేషికులును నైయాయికులును), పరుఁడనుచున్ = ఇట్టివాఁడని చెప్పుటకు వీలుకానివాఁడనియు (లేక ప్రధానమునకంటె వేఱగుపురుషుఁడనియు) (ఇట్లు చెప్పువారు సాంఖ్యులు), వాదింతురు=వాదముచేయుదురు.

తా. కొందఱు (జైనమతస్థులలో కొందఱు) బ్రహ్మము అణుపరిమాణము కలవాఁడందురు. మఱికొందఱు (జైనులు) శరీరముతో సమాన మగుపరిమాణము కలవాఁడని యందురు. వేఱొకకొందఱు సర్వశరీరములతోను (లేక కార్యము చేయఁగలప్రతిపదార్థముతోను) సంబంధించి యాపదార్థమునకంటె వేఱై యున్నాఁడని చెప్పుదురు (వీరు వైశేషికులు నైయాయికులును). వెండియుఁ గొందఱు (సాంఖ్యులు) బ్రహ్మమున్నాఁడనియె నిరూపించుటకు వీలు లేదనియుఁ (లేక ప్రధానమునకంటె వేఱైయున్నపురుషుఁడె బ్రహ్మమనియుఁ) జెప్పుచున్నారు. ఆ బ్రహ్మయు జీవేశ్వర ప్రపంచరూపముతో నున్నాఁడనియు సర్వవ్యాపకుఁ డనియుఁ దెలిసికొనలేక నజ్ఞానముచే నందఱు ని ట్లనుచున్నారు.

తే. మఱియుఁ జిద్రూపుఁ డనుచుఁ గొందఱు గణింతు
రలఘు విదచిత్స్వరూపకుం డండ్రు గొంద
ఱరసి సద్రూపుఁ డనుచుఁ గొందఱు వచింతు
రాత్మ నెఱుఁగక నిజవిమోహాంధులగుచు. 72

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ఆత్మ = పరబ్రహ్మయొక్క యథార్థస్వరూపమును, ఎఱుఁగక = తెలిసికొనలేక, నిజవిమోహాంధులగుచున్-నిజ = తనకుఁగల, విమోహ = జ్ఞానముచే, అంధులగుచున్ = గ్రుడ్డివాఁరై, మఱియున్ =ఇంకను, కొందఱు = కొన్నిమతములవారు (మీమాంసకులు), చిద్రూపుఁడనుచున్ = (పరమాత్మ) జ్ఞానమాత్రుఁ (లేక, చేతనరూపుఁ) డని, గణింతురు = చెప్పుదురు. కొందఱు (విశిష్టాద్వైతులు), అల ..కుండు-అలఘు =విస్తారమైన, చిత్ = జ్ఞానము, అచిత్ =అజ్ఞానము, స్వరూపకుండు = స్వరూపముగాఁ గలవాఁడు, అం డ్రు=అని చెప్పుదురు. కొందఱు (వేదాంతులు తప్ప తక్కినయాస్తికులు), అరసి = విచారించి, సద్రూపుఁడనుచున్ = ఉత్పత్తిస్థితి ప్రళయావస్థలయందు నశింపనియునికియే స్వరూపముగాఁ గలవాఁడని, వచింతురు=చెప్పుదురు.

తా. మఱియు నాపరబ్రహ్మముయొక్క సర్వాత్మకత్వమును తెలిసికొనలేక కొందఱు "ఆయన జ్ఞానమాత్రరూపుఁడే" యనియు, మఱికొందఱు "బ్రహ్మము చిదచిద్విశిష్టుఁడు" అనియు, వేఱొకకొందఱు "బ్రహ్మము భావరూపుఁడు" అనియుఁ జెప్పుదురు. అజ్ఞానాంధకారముచే సత్యమును గనుఁగొనలేక యున్నారు.

అవ. ఇట్లు పూర్వపక్షముల వివరించి వేదాంతమతముచే సిద్ధాంతము చేయువారై ప్రతిజ్ఞ చేయుచున్నారు:—

క. కావున సచ్చిత్సుఖమయ, భావాతీతాద్వయాత్మ పరతత్త్వము సం
భావించి తెలియఁజెప్పెదఁ, గేవలమతిచే గ్రహింపు కీశాధీశా. 73

టీ. కీశాధీశా=వానరశ్రేష్ఠా, కావునన్ =ఈవిధముగా ననేకు లనేకవిధములుగా నాత్మనుగూర్చిచెప్పుదురు గావున, సచ్చిత్సు ..త్త్వమున్-సత్ =ఉనికి, చిత్ =జ్ఞానము, సుఖమయ = ఆనందము రూపములుగాఁ గలవాఁడును, భావ=తలంపులను, అతీత = అతిక్రమించినట్టి ("సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" "ఆనందో బ్రహ్మ" "ఉనికి జ్ఞానము ఆనందము అనునవి పరబ్రహ్మరూపములు ఆయనకు నాశము లేదు." అను శ్రుతులు లోకమున ననుభవసిద్ధములుగా నున్నసత్యజ్ఞానానందములను బట్టి పరబ్రహ్మరూపము నూహింపవలయు ననిమాత్రమే చెప్పుచున్న వని తెలిసికొనవలయును.), అద్వయాత్మక =తనకంటె రెండవపదార్థములేని, పరతత్త్వమున్ = పరబ్రహ్మయొక్కయథార్థతత్త్వమును, సంభావించి = బాగుగ నూహించి, తెలియఁజెప్పెదన్ = తెలియునట్లు బోధించెదను, కేవలమతిచేన్ =సావధానమగుబుద్ధిచే, గ్రహింపుము = తెలిసికొనుము.

తా. ఓవానరశ్రేష్ఠా! బ్రహ్మస్వరూపస్వభావములను గూర్చి యిన్నిసంశయములుకలవు కావున నిప్పుడు సయుక్తికముగ నీవిషయమును సిద్ధాంతము చేసెదను. సావధానచిత్తముతో గ్రహింపుము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. అందు మొట్టమొదట "పంచకోశములును బ్రహ్మము కాదు" అను విషయమును వివరించుచున్నారు:—

మహాస్రగ్ధర.—

ఘటము న్వీక్షించువాఁ డేగతిని ఘటముఁ దాఁ గాక వేఱైనభంగిం
బటుదేహద్రష్టనై చిత్పరమసుఖమయబ్రహ్మమైనట్టినే నె
న్నటికిన్ దృశ్యంబు మాయానగరసమమసన్నామరూపాత్మకంబున్
గుటిలావిద్యాకృతం బాకులద మగుతనూకోశముం గాను వత్సా.

టీ. వత్సా=బాలుఁడా! ఘటమున్=కుండను, వీక్షించువాఁడు = చూచువాఁడు, ఏగతిన్=ఏవిధముగా, ఘటము = కుండ, తాఁగాకన్ = తానుగాక, వేఱైనభంగిన్ = వేఱుగానున్నాఁడో, పటుదేహద్రష్టనై-పటు = అధికమైన, దేహ = స్థూలసూక్ష్మకారణదేహములకు, ద్రష్టనై=చూచువాఁడనై, చిత్ప...ము-చిత్=జ్ఞానము, పరమ=అధికమైన, సుఖమయ = ఆనందము స్వరూపముగాఁ గలిగిన, బ్రహ్మము = పరబ్రహ్మస్వరూపుఁడను, ఐనట్టినేనెన్నటికిన్ = ఐననేనెప్పటికిని, దృశ్యంబును = కనఁబడునదియు, మాయానగరసమమును = ఇంద్రజాలముచే నిర్మింపఁబడిన పట్టణముతో సమానమైనదియు, అసన్నా...బును-అసత్=శూన్యములైన, నామ = పేర్లు, రూప = రూపములు, ఆత్మకంబును = ఆకారముగాఁ గలదియు, కుటిలా...బును-కుటిల=కుత్సితమైన, అవిద్యా=అజ్ఞానముచే, కృతంబును = చేయఁబడినదియు, ఆకులదము = వ్యాకులతను గలిగించు నదియు నగు, తనూకోశమును=స్థూలశరీరమును, కాను = (నేను) కాను.

తా. ఓపుత్త్రా! లోకమున ఘటమును జూచువాఁడు ఆఘటమునకంటె వేఱగును గాని యాఘటమే కాదు కదా! ఇట్లే నేనును (ఆత్మయును=తానును) జ్ఞానరూపుఁడనై "ఇది నాస్థూలశరీరము" అని ఈస్థూలశరీరమును దెలిసికొనుచున్నాను. దీనికి "నాకు కాలు నొచ్చుచున్నది. నాచేతిని జూడుము" అనుమొదలగులోకవ్యవహారములే ప్రమాణముకదా. ఇట్లగుటచేత నీసత్యము లగు నామరూపములె యాకారముగఁ గలదియు నజ్ఞానముచేఁ గల్పింపఁబడినదియు నాకు (ఆత్మకు = తనకు) దృశ్య మైనదియు నింద్రజాలవిద్యచేఁ గల్పింపంబడిన పురముతో సమాన మైనదియు నగునీ స్థూలదేహము (అన్నమయకోశము) ఎప్పటికిని నేను (ఆత్మ=తాను) కానేరదు.

మ. సమతన్ మేను నెఱుంగుచందమున నీసర్వేంద్రియప్రాణచి
త్తమనోహంకృతులం గనుంగొనుచుఁ జైతన్యంబు నై యొప్పునే
ను మరుత్పుత్త్ర! తదింద్రియాదికము నెందుం గాను నా కింక ల
క్ష్యము లౌవానిజనిప్రణాశములు జాగ్రత్సుప్తులందారయన్. 75


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. మరుత్పుత్ర=వాయుకుమారా! సమతన్=సమానముగా, మేనున్ = స్థూల దేహమును, ఎఱుంగుచందమునన్ = తెలిసికొనునట్లే, ఈస . . తులన్-ఈ = ఈకనఁబడు, సర్వ=సమస్తమైన, ఇంద్రియ = జ్ఞానకర్మేంద్రియములను, ప్రాణ = దశవిధప్రాణ వాయువులను, చిత్త=చిత్తమును, మనః=మనస్సును, అహంకృతులన్ = అహంకారమును (సూక్ష్మశరీరమును), కనుంగొనుచున్=చూచుచు, చైతన్యంబునై = జ్ఞానమాత్రుఁడనై, ఒప్పునేను=ఉన్న నేను, తదింద్రియాదికమును = ఆయింద్రియాదిరూపములుకలవాఁడను, ఎందున్ గాను=ఎట్లుచూచినను కానేరను, నాకున్, అరయన్=విచారింపఁగా, ఇంకన్= ఇంక, వానిజనిప్రణాశములు = ఆయింద్రియాదులయొక్క యుత్పత్తివినాశనులు, జాగ్రత్సుప్తులయందున్ = మేలుకొనునప్పుడును నిదురపోవునప్పుడును, లక్ష్యముల్ = కానవచ్చుచుండును. (అనఁగా మేలుకొనినప్పు డింద్రియాదులు వ్యవహరించుటయు నిదురించినప్పు డట్టి వ్యవహారము లేక నశించుటయు నాకుఁ గానవచ్చుచున్నది. (ఆయింద్రియాదులు నేనేయైనయెడల వానితో నుత్పత్తివినాశములను జెందవలసినవాఁడనే కదా యనుట.)

తా. వాయుపుత్రా! పైఁజెప్పినట్లే ఇంద్రియప్రాణమనోహంకారములుకూడ నేను (ఆత్మ=తాను) కాను. ఏలయనఁగా: స్థూలశరీరమెట్లు గోచరమగుచున్నదో అట్లే ఇంద్రియాదులుకూడ గోచరము లగుచున్నవి. దీనికి "నామనసు స్వస్థముగా లేదు" అనుమొదలగు వ్యవహారములు ప్రమాణము. ఇదియునుగాక యింద్రియాదులు (జాగ్రదవస్థలయందుఁ బుట్టును (అనఁగా నావిర్భావమును జెందును) సుషుప్త్యవస్థయందు నశించును (అనఁగాఁ దిరోభావమును జెందును). నేనే (ఆత్మయే) ఇంద్రియాదులైనచో వానితోఁగూడ నుత్పత్తివినాశముల నొందవలయును గదా. అట్లు చెందుదు ననినచో సాక్షి లేఁడు. లోకానుభవమును బట్టి చైతన్యరూపుఁడ నగు నేను అవస్థాత్రయమునకును సాక్షినై యున్నాను కదా! ఇట్లుండుటచే నేనే (ఆత్మయే) ఇంద్రియాదులు అనుట సంభవింపదు. ద్రష్టృదృశ్యములకు నైక్య మెన్నటికిని గలుగదు కదా!

సీ. నామందిరం బిది నాసువర్ణం బిది
నాతల్ప మిది యని నరుఁడు దాను
దన్మందిరసువర్ణతల్పంబులకు విల
క్షణసాక్షి యై యవి గానిపగిది
నాశరీరం బిది నాయింద్రియము లివి
నాప్రాణ మిది యిది నామనంబు
నాయహంకృతి యిది నాబుద్ధి యిది యని
బహువిధదృశ్యరూపముల నెల్ల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. నాయవి యటంచుఁ దెలిసి నిర్ణయము సేయ
నేను దత్తచ్ఛరీరాదినిఖిలవస్తు
సంఘమునకు విలక్షణసాక్షి నగుదుఁ
గాని యం దెద్దియును గాను వానరేంద్ర! 76

టీ. వానరేంద్ర = వానరశ్రేష్ఠా! నరుఁడు = మనుష్యుఁడు, నామందిరంబిది = ఇది నాయిల్లు, నాసువర్ణంబిది = ఇది సాధనము, నాతల్పమిదియని = ఇది నాభార్య యని, తాను = స్వయముగా, తన్మందిరసువర్ణతల్పంబులకున్ = ఆగృహధనాదులకంటె, విల ..క్షియై-విలక్షణ = వేఱైన, సాక్షియై = ద్రష్టయై, అవిగానిపగిదిన్ = ఆగృహాదులు కానియట్లు, నాశరీరంబిది = ఇది నాస్థూలశరీరము, ఇవి నాయింద్రియములు, ఇది నాప్రాణము, ఇది నామనంబు, ఇది నాయహంకృతి = ఇది నాయహంకారము, నాబుద్ధియిది యని = ఇది నాబుద్ధి యని, బహు... నెల్లన్ - బహువిధ=అనేకవిధము లైన, దృశ్యరూపములనెల్లన్ = చూడఁబడునట్టియాకారముల నన్నిఁటిని, నాయవి యటంచున్ = నావి యనుచు, తెలిసి=జ్ఞానముచే గ్రహించి, నిర్ణయము= నిశ్చయము, చేయుఁనేను = చేయుచున్నట్టినేను, తత్త...నకున్ - తత్తత్ = ఆయా, శరీరాది = స్థూలశరీరము మొదలగు, నిఖిలవస్తు = సకలపదార్థములయొక్క, సంఘమునకున్ = సమూహమునకు, విలక్షణసాక్షినగుదుఁ గాని=వేఱైనద్రష్టనే యగుదునుగాని, అందున్= ఆసమూహములో, ఎద్దియునుగాను = ఏపదార్థముగాను. (ఈశరీరాదులలో నేదియు నాస్వరూపము కాదనుట.)

తా. ఓవానరశ్రేష్ఠా! లోకమునఁ బ్రతిమనుష్యుఁడును "ఇది నాయిల్లు, ఇది సాధనము, ఇది నాభార్య" అని వ్యవహరించుచున్నాఁడు కదా! ఈవ్యవహారమువలననే ఇంటికంటె వేఱు ధనమునకంటె వేఱు భార్యకంటె వేఱు అనువిషయమును స్పష్టమగు చున్నది. ఇందు వివాద మేమియు లేదు కదా? ఇట్లే నేనును "ఇది నాస్థూలదేహము, ఇది నాయింద్రియములు, ఇది నా మనస్సు, ఇది నాబుద్ధి, ఇది నాయహంకారము" అని తెలిసికొనుచున్నాను. కావున నీశరీరాదులకంటె నేను (ఆత్మ) వేఱు కావలయును గాని వీనిలో నేదియు కానేరదు.

అవ. లోకమునందున్న "నేను" అనువ్యవహారమును బట్టి "పంచకోశము ఆత్మ కాఁడు" (చేతనస్వరూపుఁడు శ్రీరాముఁడు కాఁడు) అని సాధించియున్నారు. అస్మచ్ఛబ్దమునకు నర్థమేది యనిన సమాధానముఁ జెప్పుచున్నాఁడు:—

తే బుద్ధ్యహంకారములతోడిపొందు గలిగి
నేను నే నను వాఁడను నేను జుమ్ము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నేను నే ననువాఁడను నే నటంచుఁ
దెలియఁబడువృత్తి నెఱిఁగెడితెలివి నేను. 77

టీ. బుద్ధ్యహంకార...గలిగి - బుద్ధి = బుద్ధితోను, అహంకారములతోడి = అహంకారముతోను, పొందుగలిగి = సంబంధముఁ జెంది, నేను నే ననువాఁడను నేను జుమ్మ = "నేను నేను" అని వ్యవహారము చేయువాఁడను నేనే సుమా!, నేను నేనను వాఁడను నేనటంచుర్ = "నేను నేను" అనువాఁడను "నేనే" యని, తెలియఁబడు వృత్తిర్ = తెలిసికొనునట్టి చిత్తవృత్తిని, ఎఱిఁగెడితెలివి = తెలిసికొనుజ్ఞానముకూడ, నేను.

తా. "నేను" అనుశబ్దమునకు నచేతనము లగుశరీరాదు లర్థములు కావు. దీనికి "నాశరీరము" అను మొదలగు వ్యవహారములే ప్రమాణములు. అస్మచ్ఛబ్దమునకు దేహాదులే యర్థ మైనచో "నేను దేహము" అను వ్యవహారము కలుగవలయును గాని నా దేహము అనువ్యవహార ముండుటకు వీలులేదు కావున "నేను" అను పదమునకు సర్వద్రష్ట యగు చైతన్యరూపుఁడే (పరబ్రహ్మరూప ఆత్మారాముఁడే) యర్థము. అజ్ఞానరూపుఁడ నగు నేనే (శ్రీరాముఁడనే) బుద్ధితోను అహంకారముతోను సంబంధపడి(ఇదియు నవిద్యామాయలతో సంబంధమువలెనె భ్రాంతికల్పితమే యని తెలిసికొనునది) "నేను నేను" అనుచున్నాను. ఇట్లు కావున నస్మచ్ఛబ్దార్థ మగుచున్నాను. మఱియుం బుద్ధ్యహంకారములతో సంబంధపడిన (అనఁగా "నేను" అను బుధ్యహంకారవృత్తియందుఁ బ్రతిబింబించిన) చైతన్యమునకుఁ గూడ సాక్షి నగుటచే "నేను, నేను అనువాఁడను నేను" అని తెలిసికొనువాఁడను (జ్ఞానరూపుఁడను) కూడ నేనే.

సీ. శ్రవణేంద్రియంబుచే వివిధశబ్దంబుల
నేర్పఱించి యెఱుంగు నెఱుక నేను
స్పర్శేంద్రియంబుచే స్పర్శగుణంబుల
నేర్పఱించి యెఱుంగు నెఱుక నేను
నేత్రేంద్రియంబుచే నిఖిలరూపంబుల
నేర్పఱించి యెఱుంగు నెఱుక నేను
రసనేంద్రియంబుచే రసముల నన్నింటి
నేర్పఱించి యెఱుంగు నెఱుక నేను
తే. ఘ్రాణకరణంబుచే సర్వగంధములను
నేర్పఱించి యెఱింగెడియెఱుక నేను
ఘనమనముచేత నఖిలసంకల్పములను
నేర్పఱించి యెఱింగెడియెఱుక నేను. 78

Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. శ్రవణేంద్రియంబుచేఁ=చెవులచే, వివిధశబ్దంబులఁ=సమస్తవిధములగుశబ్దములను (ధ్వనిరూపమును వర్ణరూపము నగుశబ్దమును), ఏర్పఱించి=విభాగించి, ఎఱుంగు నెఱుక నేను=తెలిసికొనునట్టి తెలివిని నేను, స్పర్శేంద్రియంబుచేఁ=స్పర్శమునుగ్రహించు నట్టి త్వగింద్రియముచే, స్పర్శగుణంబులఁ = శీతోష్ణానుష్ణాశీతములను మూఁడువిధము లగుస్పర్శలను, ఏర్పఱించి, ఎఱుంగు నెఱుక నేను, నేత్రేంద్రియంబుచేఁ=నేత్రములచే, నిఖిలరూపంబులఁ = శుక్ల కృష్ణాదిసమస్తవిధరూపములను, ఏర్పఱించి, ఎఱుంగు నెఱుక నేను, రసనేంద్రియంబులఁ=నాలుకచే, రసములనన్నిటిఁ=ఉప్పు, పులుసు మొదలగు షడ్రసములను, ఏర్పఱించి, ఎఱుంగు నెఱుక నేను, ఘ్రాణకరణంబుచేఁ=నాసిక యనెడి నింద్రియముచేత, ("కరణం సాధకతమ క్షేత్రగాత్రేంద్రియే ష్వపి" అని అమరము.) సర్వగంధములఁ=సురభి అసురభి మిశ్రము అను మూఁడువిధములగు వాసనలను, ఏర్పఱించి, ఎఱింగెడియెఱుక నేను, ఘనముచేతఁ=మనస్సుచేత, అఖిలసంకల్పములఁ= సర్వవిధములగు తలంపులను (చిత్తవృత్తులను), ఏర్పఱించి, ఎఱింగెడియెఱుక నేను.

తా. మఱియు శ్రవణేంద్రియముచే శబ్దముల నన్నిఁటినిఁ బ్రత్యేకముగాఁ దెలిసికొనుఁవాఁడను నేనే. త్వగింద్రియముచే సర్వస్పర్శలఁ బ్రత్యేకముగాఁ దెలిసికొను జ్ఞానస్వరూపుఁడను నేనే. మఱియు నేత్రేంద్రియముచే సర్వరూపముల నెఱుంగుచు జిహ్వేంద్రియముచే రుచులను ఘ్రాణేంద్రియముచే గంధమును బ్రత్యేకముగాఁ దెలిసికొనుచు శబ్దాదివిషయములను గూర్చి కలుగుసంకల్పముల నెల్లను మనస్సుచేఁ బ్రత్యేకముగ విభాగించి తెలిసికొనుచు నుండువాఁడను నేనే (బ్రహ్మమే) జ్ఞానరూపుఁడనగు నాయొక్క ప్రకాశము నాశ్రయించియే మనసు మొదలగు సర్వపదార్థములును బ్రవర్తించుచున్నవి. నన్నాశ్రయించిన ప్రభావమువలననే మనస్సు మనస్సయినది (అనఁగా సంకల్పించు సామర్థ్యముగలదియైనది). జ్ఞానేంద్రియములును జ్ఞానేంద్రియములయినవి (అనఁగా విషయముల గ్రహించుసామర్థ్యముకలవి యైనవి)."శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనః"="ఆబ్రహ్మము చెవికిఁ జెవి మనసునకు మనసు" అను మొదలగుశ్రుతి యీ విషయమునే స్పష్టము చేయుచున్నది.

క. పలుకుల దానాదానంబుల గమనాగమనములను మూత్రపురీషం
 బుల రాకడపోకడలను, దెలియు తెలివి నేనుసర్వదృక్కునగుటచేన్.

టీ. సర్వదృక్కునగుటచేఁ=సర్వసాక్షినై యుండుటచేత, పలుకులఁ = మాట్లాడుటను, దానాదానంబులఁ=ఇచ్చి పుచ్చుకొనుటలను, గమనాగమనములఁ=రాకపోకలను, మూత్రపురీషంబుల రాకడపోకడలఁ =, మూత్రపురీషములు వచ్చుటను రాకుండుటను, తెలియు తెలివి నేను= తెలిసికొనునట్టి జ్ఞానము నేనే.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఇదియును గాక కర్మేంద్రియములు చేయుపనులగు సంభాషణలు ఇచ్చి పుచ్చుకొనుటలు రాకపోకలు మూత్రపురీషోత్సర్జనములు ఆనందము అనుదానికిఁ గూడ నేనే సాక్షిని. జ్ఞానేంద్రియములవలెఁ గర్మేంద్రియములును నేనే "వాచోహవాక్ = ఆబ్రహ్మము వాక్కునకు వాక్కు" అనుట శ్రుతికర్మేంద్రియములుఁ గూడ బ్రహ్మమే యగుచున్నది.

క. సర్వోపాధిస్థుఁడ నై,సర్వవ్యాపారములు వెసం జేయుచుఁ ద
త్సర్వము నంటక వెలిఁగెడు, సర్వాత్ముఁడ నేన సుమ్ము సజ్జనతిలకా.

టీ. సజ్జనతిలకా=సత్పురుషులలోశ్రేష్ఠుఁడా, సర్వో...డనై=సర్వ=సమస్తములగు, ఉపాధి=శరీరేంద్రియప్రాణాద్యుపాధులయందు, స్థుఁడనై=ఉన్నవాఁడనై, సర్వవ్యాపారములు = ఆయాయుపాధులచే నాచరింపఁగలిగినసమస్తకార్యములను, వెసన్ = బాగుగ, చేయుచున్, తత్సర్వమున్=ఆయుపాధిసమూహమంతటిని (తోను), అంటక=సంబంధపడక, వెలిఁగెడుసర్వాత్ముఁడన్=ప్రకాశించుచున్నట్టి సర్వమయుఁడను, నేను సుమ్ము = నేనే సుమా.

తా. ఓసత్పురుషశ్రేష్ఠా! ఈజ్ఞానకర్మేంద్రియాదులయందుండి యాయాయింద్రియములు చేయుకార్యములనెల్లఁ జేయుచు నసంగుఁడ నై ఆయింద్రియములతోఁ గాని వానివ్యాపారములతోఁగాని అట్టివ్యాపారములవలనఁ గలుగు ఫలములతోఁగాని సంబంధింపక యనియన్నియు నేనే యై యున్నాను.

అవ. ఇట్లు పంచకోశము ఆత్మకాఁడనియు పంచకోశములకు సాక్షియుఁ బంచకోశ స్వరూపుఁడునై యున్నాఁ డనియుం జెప్పి యాత్మస్వరూపమును గూర్చినవాదములను నిరాకరించి ఈక్రిందిపద్యములోఁ బరిమాణమును గూర్చినవాదములను నిరాకరించుచున్నాఁడు:—

క. అపరిచ్ఛిన్నావ్యయని,త్యపరంజ్యోతిర్మయుండ నై శశిహుతభు
క్తపనాదుల వెలిఁగించుచు,నెపుడంతటనొక్కరీతి నేను వెలుఁగుదున్.

టీ. అప...డనై-అపరిచ్ఛిన్న=విభాగములు లేనట్టియు, అవ్యయ = నాశరహితమైనట్టియుం (లేక తరుగనట్టియుం), నిత్య=త్రికాలములయందు నేకరూపములో నుండునట్టియు, పరంజ్యోతిర్మయుఁడనై = జ్ఞానరూపమైన పరమప్రకాశమే స్వరూపముగాఁ గలవాఁడనై, శశి...దులన్-శశి=చంద్రుఁడు, హుతభుక్=అగ్నిహోత్రుఁడు, తపన=సూర్యుఁడు, ఆదులన్=మొదలగు తేజోమయపదార్థములను, వెలిఁగించుచు=ప్రకాశింపఁ జేయుచు (అనఁగా వానికి ప్రకాశము నిచ్చుచు, "య దాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలం, యచ్చంద్రమసి య చ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకం"), ఎప్పుడున్=ఎల్లప్పుడును, అంతటన్, ఒక్కరీతిన్=ఒక్కటేవిధముగా, వెలుఁగుదున్=ప్రకాశించుచున్నాను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఇంతమాత్రమే కాదు. పరిమాణమునుగూర్చి యనేకు లనేకవిధములుగాఁ దలంచుచున్నారు. కాని వాస్తవస్థితిలో నాకుఁ (బ్రహ్మకుఁ) బరిమాణములు లేవు. నేను సర్వవ్యాపకుఁడను "ఈదేశమునం దున్నాఁడు. ఆ దేశమునందు లేఁడు. ఈకాలమునం దున్నాఁడు. ఆకాలమునందు లేఁడు. ఈ వస్తువునం దున్నాఁడు. ఆ వస్తువునందు లేఁడు" అను భేదములు నాకు లేవు. నేను నాశరహితుఁడను. వృద్ధిక్షయములు లేక యొకరూపముతో నుండువాఁడను. ప్రకాశస్వరూపుఁడను. నాప్రకాశమువలననే సూర్యచంద్రాదులు దినము ప్రకాశించుచున్నారు. ఇట్లు సర్వప్రపంచమును బ్రకాశింపఁజేయుచు నేను (జ్ఞానము) ప్రకాశించుచున్నాను.

అవ. "నీవు (బ్రహ్మము) సర్వోపాధులయందు నుంటివేని నీకు బహువిధము లగు భేదము లుండవలసివచ్చును కదా" యనిన నట్లు కాదని చెప్పుచున్నాఁడు:—

క. ఔపాధికనామంబులు, రూపంబులు లేవు నాకు రూఢిగ సకల
వ్యాపారముఁ గనుసర్వ,వ్యాపకచిన్మయుఁడ నేను వాయుతనూజా!

టీ. వాయుతనూజా=ఆంజనేయా! ఔ...బులు-ఔపాధిక=ఉపాధిసంబంధములైన (ఉపాధులవలన వచ్చిన), నామంబులు=పేరుగాని, రూపంబులు=రూపములుగాని, నాకు లేవు, నేను, సకలవ్యాపారమున్ = సర్వపదార్థములచేఁ జేయఁబడుపనులను, కను...యుఁడన్-కను = చూచునట్టియు, సర్వ=సమస్తప్రపంచమును, వ్యాపక=వ్యాపించినట్టియు, చిన్మయుండన్=జ్ఞానమే స్వరూపముగాఁ గలవాఁడను.

తా. సర్వప్రపంచోపాధులయం దున్నను నాకు నుపాధిసంబంధము లగు నామరూపములు లేవు. సర్వవ్యాపక మగునాకాశము సర్వపదార్థములయందు నుండియు వానితో సంబంధింపనట్లు నేనును సర్వవ్యాపకుఁడ నగుటచే నాకాశము ఘటపటాదులయం దున్నట్లు సర్వోపాధులయందు నుండుటయే కాని మఱేమియు లేదు. కావున నేను వానితో సంబంధింప నక్కఱలేదు. వాని నామరూపములతో నాకు సంబంధము కలుగ నక్కఱలేదు. ఇదియునుగాక నేను ఆ యుపాధులకు సాక్షిని గదా! సాక్షియగువానికిని వానిచేఁ (సాక్షిచే) జూడఁబడువానికిని సంబంధము (అనఁగా నైక్యము; సాక్షియు వానిచే, జూడంబడుపదార్థంబు నొక్కటి యనుట) కలుగనేరదు కదా.

సీ. ఏను శరీరంబుగా నింద్రియంబులు
గాను బ్రాణమ్ములు గాను మనము
గాను జిత్తంబును గా నహంకారంబు
గాను శూన్యంబును గాను బుద్ధి
గాను దీర్ఘంబును గాను కుబ్జంబును
గాను స్థూలమును సూక్ష్మమును గాను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గానతిక్రృష్ణర_క్తశ్వేతపీతవ
  ర్ణములును బంచభూతములు గాను
తే. గాను గా ననువాఁడను గాను వినుము
  కాను గా ననువానిని గాంచువాఁడఁ
  గాంచువానిని సతతంబుఁ గాంచువాఁడ
  నౌను గా ననువికృతులు లేనివాఁడ. 83

టీ. వినుము, ఏను=నేను, శరీరంబుగాను = దేహమును గాను, ఇంద్రియంబులు = జ్ఞానేంద్రియ కర్మేంద్రియరూపుఁడను కాను, ప్రాణమ్ములుగాను = పంచప్రాణరూపుఁడను కాను, మనముగాను=మనస్సును కాను, చిత్తంబు గాను = సందేహరూప మగుచిత్తమును కాను, అహంకారంబును గాను=అహంకారస్వరూపుఁడను కాను, శూన్యంబును గాను = శూన్యరూపుఁడను కాను, బుద్ధి గాను=నిశ్చయాత్మ యగుబుద్ధి కాను, దీర్ఘంబును గాను= దీర్ఘపరిమాణము కలవాఁడను (పొడవరి) కాను, కుబ్జంబును గాను = హ్రస్వపరిమాణము కలవాఁడను (పొట్టివాఁడను) కాను, స్థూలమును సూక్ష్మమును గాను=లావుగాని సన్నము గాని కాను, అతి...గాను-అతి = మిగుల, కృష్ణ=నలుపు, ర_క్త=ఎఱుపు, శ్వేత=తెలుపు, పీత=పసుపు, వర్ణములు గాను=అనువర్ణములు స్వరూపముగాఁ గలవాఁడను కాను, పంచ భూతములు గాను = ఆకాశాది పంచభూతస్వరూపుఁడను కాను, కాను గాననువాఁడను గాను="కాను కాను" అని చెప్పుచున్నాఁడని తలంపఁబడువాఁడు నేను కాను. ("నేతి నేతి" "ఈప్రపంచము నేను కాను" అని నిషేధించునది చిత్తవృ_త్తియేకాని పర బ్రహ్మము కాదనుట స్పష్టమే కదా.) కాను గాననువానిని గాంచువాఁడఁక్=అట్లు "నే నీప్రపంచములో నేపదార్థమును కాను" అని చెప్పువానిని (చిత్తవృ_త్తిని) సాక్షినై చూచుచుండువాఁడనే నేను, కాంచువానిని సతతంబు గాంచువాఁడఁక్ = నేను దీనినిఁ జూచుచున్నాను? అని యభిమానము గల పురుషుని (చి_త్తవృ_త్తియందు ప్రతిబింబిం చిన చిదాభాసమునే) గూడ సాక్షినై యెల్లప్పుడును చూచుచుండువాఁడను నేను, ఔను గా నను వికృతులు లేనివాఁడఁక్=ఇట్లయినను "ఈ పదార్థము నేను, ఇది నేను కాను" అను వికారములు లేని సర్వవ్యాపకుఁడను, (బ్రహ్మము పరిపూర్ణ మగుటచే నాయనకు భిన్నమగుపదార్థమే లే దనుట స్పష్టము. "నేతి నేతి" అను మొదలగుశ్రుతు లచే భేదాభిమానము కలవారి ననుగ్రహించుటకై (అనఁగా శుద్ధపరబ్రహ్మమును వారికి తెలియఁజేయుటకై) మొట్టమొదట సర్వవస్తునిషేధము చెప్పఁబడెననియు, బ్రహ్మతత్త్వ జ్ఞానానంతరమున హేయోపాదేయపరిత్యాగమును (అనఁగా: పరమాత్మ యద్వితీయత్వ మునుఁగూర్చి బోధించుటయనియు తెలియవలయును.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. మఱియుఁ శరీరము ఇంద్రియంబులు ప్రాణంబులు మనస్సు చిత్తము అహంకారము బుద్ధి యనునవి యుపాధులే కాని నాస్వరూపములు కావు వీనికంటె వేఱగునవి యనుభవమునఁ గానవచ్చుట లేదు. కావున నన్ను శూన్యరూపునిగ భావింప వలదు. సాక్షి, లేక సాక్ష్యము (దృశ్యము-ప్రపంచము) ప్రకాశింపదు. కావున నేను (బ్రహ్మము) శూన్యరూపుఁడను కానేరను. మఱియుఁ పొడవుగా నుండుట పొట్టిగా నుండుట లావుగా నుండుట సన్నముగా నుండుట మొదలగుధర్మములు (అనఁగాఁ బరిమాణభేదములు) నాకు లేవు. సర్వవ్యాపకుఁడ నగుటచే నాకు నేపరి మాణము నుండుటకు వీలు లేదుకదా. నలుపు ఎఱుపు తెలుపు పసుపు వర్ణములు నాకు లేవు. ఇంక యేల? సర్వప్రపంచంబును పంచభూతాత్మకంబు. అది యంతయు నేను కాను. ఇట్లు చెప్పుటవలన "నేను ప్రపంచమును కాను" అని చెప్పువాఁడను నేనని (బ్రహ్మమని) తలంపవలదు. ఏపదార్థము నైనను నిషేధించునదియుఁ స్వీకరించు నదియుఁ (అనఁగా కానని చెప్పునదియుఁ ఔనని చెప్పునదియు) సంకల్పమే కాని మఱి యొక్కటి కాదు. ఆసంకల్పము కూడ నాప్రకాశముచేతనే పని చేయుచున్నదియుఁ నాకు గోచరమగునదియుఁ కావుననే నది (సంకల్పరూపుఁడను) కాను. సంకల్పము తనకుఁ దెలియుచున్నదనుట యనుభవసిద్ధముకదా. మఱియొకవిశేషము. ఆసంకల్పము మన సునకు (అనఁగా: మనసునందున్న నేప్రకాశమునకు ఆత్మప్రకాశము యొక్క సాహా య్యము లేక మనసు మొదలగునవి దమకార్యములు చేయవని ఇదివఱకే వివరించియుఁ న్నాము) గోచర మగుచుండుట యనుభవసిద్ధము కావున నాసంకల్పసాక్షి యగు మనోవచ్ఛిన్నచైతన్యము (ఇతఁడే జీవుఁడనఁబడును) నేనే. అవి నాయంశమేకదా, మఱియు "నాసంకల్పము మనసునకు లేక నాకు గోచరమగుచున్నది" అను ననుభ వముకూడ కలదు. దానినిఁబట్టి చూచిన నాజీవునకుఁగూడ సాక్షిని నేనే. ఓయూంజ నేనూ! అఖండ జ్ఞానస్వరూపుండనై సర్వోపాధులయందును వ్యాపించియుండుటచే శబ్దాదివిషయములయం దుండి ఇంద్రియములయందున్న చైతన్యమునకు ఇంద్రియా వచ్ఛిన్న చైతన్యమునకు గోచరుండనగుచు ఇంద్రియములయందుండి సంకల్పమునకును దానియందుండి మనసునకును దానియందుండి శుద్ధచైతన్యమునకును ఇదియె కూటస్థ చైతన్యము) గోచరుఁడ నైనట్లు నాకు తోఁచుచున్నను వాస్తవస్థితిలో ప్రపంచము భ్రాంతిసిద్ధముకావున దానికి భ్రాంతిజ్ఞానమునకంటె (అనఁగా: జ్ఞానముకంటె భ్రాంతి యనునది తమోగుణయుక్తమగు నంతఃకరణధర్మమే కాని జ్ఞానధర్మముకాదు కావున శుద్ధజ్ఞానమనినను భ్రాంతిజ్ఞానమనినను ఒక్కటియే.) నితరస్వరూపము లే దనుటయు జ్ఞానమే నాస్వరూపమనుటయుఁ నిదివఱకే స్పష్టమై యున్నది కదా! కావున యథార్థ


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముగ నీయుపాధులు కూడ నాకంటె వేఱుకావున యిట్లుకూడ చెప్పుటకు వీలులేదు. నాకంటె రెండవదిగాఁ గానఁబడుప్రపంచము యథార్థమైనదగునేని "ఇది నాకంటె వేఱు" అని కాని "ఇది వేఱుకాదు" అనికాని చెప్పవచ్చును. ఇచ్చట నీప్రపంచము బొత్తుగనే త్రికాలములయందును లేదు. కావున నెట్లు చెప్పుటకును వీలులేదు. కావున "అగుదును కాను" అను వికారములు కూడ నాకు లేవు.

చ. అచలచరేంద్ర దీపము ఘటాదిపదార్థముల న్వెలుంగఁజే
యుచును వెలుంగురీతిని సముజ్జ్వలమానసచక్షురాదిదృ
శ్యచయము నెల్ల నాత్మవిషయంబులయందుఁ జరించునట్లు చూ
చుచు మఱి యేను సాక్షి నగుచు న్విలసిల్లుదు నిర్వికారతన్. 84

టీ. అచలచరేంద్ర-అచల=పరబ్రహ్మమునందు, చల = సంచరించుచున్న బ్రహ్మవిద్వరిష్ఠులలో (స్వయముగాఁ గాని, పరులమూలమునఁ గాని చలింపక నిర్వికల్పసమాధియం దుండువాఁడు బ్రహ్మవిద్వరిష్ఠుఁడు), ఇంద్ర=శ్రేష్ఠుఁడవగు నాంజనేయా! దీపము, ఘటాదిపదార్థములన్ = ఘటము మొదలగు సమస్తవస్తువులను, వెలుంగఁజేయుచున్ = ప్రకాశించునట్లుచేయుచు, వెలుంగురీతిన్=తాను ను బ్రకాశించునట్లు, సము... నెల్లన్-సముజ్జ్వల=ప్రకాశించునదిగాఁ గనఁబడుచున్న, మానస = మనస్సు, చక్షుః=నేత్రములు, ఆది= మొదలైన, దృశ్య = చూడఁదగిన (సాక్షిచే ప్రకాశింపచేయఁదగిన) పదార్థముల యొక్క, చయము నెల్లన్=సమూహమునంతయు, ఆత్మవిషయంబులందున్ = వానివాని విషయములయందు, చరించునట్లు = ప్రవర్తించు నట్లుగా, చూచుచున్=ప్రకాశింపఁజేయుచు (లేక చేయుచు), మఱి=మఱియు, ఏను=నేను, సాక్షినగుచున్=ఆయింద్రియాదులకును వాని ప్రవర్తనములకును గూడ సాక్షినగుచు, నిర్వికారతన్=వికారములేవియు లేనివాఁడనై, విలసిల్లుదున్=ప్రకాశించుచుందును.

తా. బ్రహ్మవిద్వరిష్ఠులలో శ్రేష్ఠుఁడవగు ఆంజనేయా, లోకమున దీప మెట్లు దీపమునకంటె వేఱైయున్నఘటాదులఁ బ్రకాశింపఁజేయుచుఁ దాను ను బ్రకాశించుచు నాఘటాదుల వికారములతో సంబంధపడక యున్నదో అట్లే నేను ను బ్రహ్మంబును నాకంటె నితరమై యున్నట్లు తోఁచుచున్నను మనోనేత్రాదులు దమతమవిషయములనుగూర్చి పరువులిడుచుండ వానిని బ్రకాశింపఁజేయుచు (అనఁగాఁ దెలిసికొనుచు) జ్ఞానమే ప్రకాశమని ఇదివఱకే స్పష్టము చేయఁబడియున్నది. ఆమనశ్శ్రోత్రాదుల వికారములతో సంబంధింపక నిర్వికారుండనై ప్రకాశించుచున్నాను.

మత్తకోకిల. భాను తేజము నాశ్రయించి స్వభావకర్మములందు నీ
మానవు ల్వ్యవహరించునట్లనడి మత్ప్రకాశము నంటి ధీ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మానసేంద్రియము లస్వకీయసమస్తకార్యములం దొగిఁ
మానకం జరియించు నెం దభిమానపూర్వకవృత్తులన్. 85

టీ. ఈ మానవులు=ఈ మనుష్యులు, భానుతేజమున్ = సూర్యునిప్రకాశమును, ఆశ్రయించి = ఆధారముగాఁ జేసికొని, స్వభావకర్మములందున్ = తనకు స్వభావసిద్ధములైన బహువిధకార్యములయందు, విహరించుకైవడిన్=సంచరించునట్లు (అనఁగా: తమ తమకార్యముల నాచరించుచుండునట్లు), మత్ప్రకాశమున్ - మత్ = నాయొక్క, ప్రకాశమున్=జ్ఞానరూపమగు ప్రకాశమును, అంటి = ఆశ్రయించి, ధీ...ములు-ధీ = బుద్ధి, మానస=సంకల్పరూపమగు మనస్సు, ఇంద్రియములు=జ్ఞానకర్మేంద్రియములు, స్వకీ...లందున్-స్వకీయ = తమతమ, సమస్త=సర్వవిధములైన, కార్యములందున్ = పనుల యందు, ఒగిన్=బాగుగ, మానకన్=విడువక, ఎందున్ = ఆయావిషయములయందు, అభిమానపూర్వకవృత్తులన్=అభిమానసహితము లగు వ్యాపారములతో, చరియించున్= సంచరించుచున్నవి.

తా. అయిన నొక్కవిశేషము కలదు. నేనెట్లు మనోనేత్రాదులం జూచుచున్నానో అట్లే మనోనేత్రాదులును దమవిషయము లగుశబ్దాదులఁ జూచుచున్నవి. సూర్యుని తేజస్సు నాశ్రయించి మనుష్యులు తమతమకార్యములయం దెట్లు ప్రవర్తించుచున్నారో అట్లే యవియు నాప్రకాశము నాశ్రయించి ప్రవర్తించుచున్నవి. సూర్యునకు మనుష్యులవికారములతో సంబంధము లేనట్లు నాకును మనోనేత్రాదులవికారములతో సంబంధము లేదు. ఇదియుఁ బూర్వముననే నిరూపింపఁబడియున్నది. ఇఁక విశేషమేమనిన:—సాక్షి నగుటచే దృశ్యములగు మనోనేత్రాదులవికారములు నన్నెట్లంటవో అట్లే సాక్షులగు మనోనేత్రాదులకుఁగూడ ప్రపంచవికారము లంటకూడదు. ఇదియును గాక నా మనోనేత్రాదులమూలమున విషయముల గ్రహించునదికూడ నేనేకదా. ఇట్లయినను ప్రపంచమున 'ఇది పరుష మగుశబ్దము దీనివలనను బాధ కలుగుచున్నది. దీనిని నే నోర్వలేను' అను మొదలగువ్యవహారములు కలవు. ఈ వ్యవహారములవలన శబ్దాదిజనితవికారములు మనసు మొదలగువాని నంటియున్నట్లు తెలియవచ్చుచున్నది. ఒకసాక్షికి దృశ్యవికారము లంటకుండిన మఱియొకసాక్షికి నవి యంటుట యెట్లు? అనుసంశయ మొకటిపైఁ జూపిన ప్రపంచానుభవమువలనఁ గలుగుచున్నది. దీనికిఁ దగినసమాధాన మిది వఱకే చెప్పఁబడియున్నది. అనాద్యవిద్యావశమున నంతఃకరణోపాధియం దున్నచైతన్యమే తనకుఁ దాను భోక్తయై విషయముల ననుభవించువాఁడై జీవుఁడై తోఁచి తాను వీనికి విషయములను సాక్షియనియు తనకు వీనివికారము లంటవనియు నెఱుంగక ఇవి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నావి యని యభిమానించుచున్నాఁడు. ఈ యభిమానమువలన వానివికారములతోఁ దనకు సంబంధమున్నట్లు తలంచుచున్నాఁడు. ఇదియే మనసు మొదలగువానికి విషయ వికారములతో (లేక ప్రపంచవికారములతో) సంబంధ మున్నట్లు లోకమున వ్యవహ రింపఁబడుటకుఁ గారణము. శుద్ధచైతన్యస్వరూపుఁడ నగుటచే నాకు నట్టి మమకారము ప్రపంచాభిమానములేదు. కావున యథార్థస్థితిలో తద్వికారములతో నాకుఁగాని నా కంటె నభిన్నము లగు మనోనేత్రాద్యవచ్ఛిన్నచైతన్యములకుఁ గాని సంబంధము లేదు.

తే. ఎఱుకమఱుపుల నెఱిఁగెడియెఱుక నేను
విధినిషేధములను గాంచువిభుఁడ నేను
దర్క్యములనెల్లఁ దర్కించుతత్త్వ మేను
నేను నే నని వివరించునేత నేను. 86

టీ. ఎఱుకమఱుపులన్ = జ్ఞానాజ్ఞానములను (ఇచ్చట జ్ఞానమనఁగా ప్రమాణమని వ్యవహరింపఁబడుప్రత్యక్షాదిరూపజ్ఞానమనియు : దాని యభావ మజ్ఞాన మనియు తెలిసికొనవలయును.) ఎఱిఁగెడిఎఱుకన్ = తెలిసికొనునట్టి నిత్యజ్ఞానస్వరూపుఁడను, నేను, విధి...ములన్-విధి = ఈకార్యము చేయవలయును అని నియమింపఁబడినవిధిని, నిషేధ ములన్ = "ఇది చేయరాదు" అనిశాస్త్రమునందు చేయఁబడిన నిషేధమును, కాంచు... డన్-కాంచు = తెలిసికొనునట్టి, విభుఁడన్ = సర్వవ్యాపకుఁడను (లేక సర్వశక్తుఁడను), నేను, తర్క్యములనెల్లన్ = విచారింపవలసినవాని నెల్లను, తర్కించుతత్త్వము-తర్కించు = విచారించునట్టి, తత్త్వము = సూక్ష్మపదార్థము, ఏను = నేను, నేనునేననివివరించునేతన్ = "నేను నేను" అని చెప్పుసర్వాంతర్యామి నేను. (అహం శబ్దమునకు బ్రహ్మమే ముఖ్యార్థ మనుట.)

తా. మఱియు తెలివి యనినను మఱపు అనినను జిత్తవృత్తులే కావున వానికి సాక్షియగువాఁడను నేను. "ఇది చేయఁదగినపని. ఇది చేయరానిపని" అని తెలిసికొను సర్వజ్ఞుఁడను నేనే. విచారింపఁదగినవిషయముల నెల్ల విచారించి నిర్ణయించువాఁడను నేనే. అస్మచ్ఛబ్దమున కర్థమగుచుఁ బ్రతిపురుషునిచేతను "నేను నేను" అని వ్యవహరింపఁబడు చుండువాఁడను నేనే.

అవ. ఇట్లు పరబ్రహ్మముయొక్క స్వరూపస్వభావముల వివరించి లోకవ్యవహార మజ్ఞానకృత మని చెప్పుచున్నాఁడు:—

క. నేననిన నన్ను మూర్ఖుఁడు, మే నని వీక్షించుఁగాన మేల్కని సత్యే
జ్ఞానానందమయుని నిన్నజ్ఞానముచే నెఱుఁగలేఁడు సద్గుణశాలీ. 87

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. సద్గుణశాలీ-సద్గుణ=శ్రేష్ఠములైనజ్ఞానవైరాగ్యాదిగుణములతో, శాలీ = కూడి యున్నహనుమంతుఁడా! మూర్ఖుఁడు=తెలివి లేనివాఁడు, నేననిన్ = "నేను" అనఁగా, మేనని వీక్షించుగాన్ = "శరీర" మని తలంచును గావున (అహంశబ్దార్థము శరీరమే యని భావించును కావున), మేల్కని=జాగ్రత్తతో, నన్నున్=నాయథార్థస్వరూపమును (అనఁగా: అహంశబ్దార్థమును), సత్యజ్ఞానానందమయునిగాన్=సత్యజ్ఞానానందస్వరూపుఁడగు బరబ్రహ్మమునుగా, జ్ఞానముచేన్ = వివేకముచేత, ఎఱుఁగవలయున్ = గ్రహింపవలయును.

తా. నేను అనిన శరీరము అని లోకమున వ్యవహార మున్నది. ఇది భ్రాంతిసిద్ధమైనది. జ్ఞానశూన్యులగువారు (అనఁగా: అవిద్యయందుఁ బ్రతిబింబించి యున్నజీవుఁడు) తమయథార్థస్వరూపమును నెఱుంగలేక యిట్లు వ్యవహరించుచున్నారు కావున వివేకదృష్టిచే సత్యజ్ఞానానందస్వరూపుఁడై నిర్వికారుఁడై యున్ననన్నే [సర్వస్వరూపమునే, అనఁగా: బ్రహ్మమునే ("నేను" అనుపదమునకు) అస్మచ్ఛబ్దమునకు] నర్థముగాఁ దెలిసికొనవలయును.

N. B. "నేను" అనుపదమునకు శరీరాహంకారబ్రహ్మలర్థము. అందు శరీరాహంకారములు వాచ్యార్థము (లేక గౌణార్థము; అనఁగా కేవలము వ్యవహారసిద్ధమై విచారించిచూచిన నభావరూపము అగునర్థము) బ్రహ్మము ముఖ్యార్థము.

క. నే నని నఁదనువునకు నభిమానమునకు నర్థ మగుఁ బ్రమాదమువలనం
గాన నివి రెండనర్థము, తా నేనన నేన కేవలాత్ముఁడ ననఘా. 88

టీ. అనఘా=దోషరహితుఁడా! అంజనేయా! ప్రమాదమువలనన్ = అవివేకముచేఁజూచిన (అనఁగా: బాగుగ విచారింపకపోయిన), నేననినన్ = "నేను" అని చెప్పినచో, తనువునకున్ = శరీరమునకును, అభిమానమునకున్ = అహంకారమునకును, అర్థమగున్=అర్థమగును. (అనఁగా: లోకమున సామాన్యముగ శరీరాహంకారములు రెండే అహంశబ్దార్థములుగాఁ జెప్పఁబడుచున్నవనుట.) కానన్ = కాఁబట్టి (ప్రమాదముచే సంభవించుటవలన), అవిరెండు = ఈరెండర్థములును, అనర్థములౌన్ = యథార్థములు కానేరవు. నేనన్="నేను" అనుపదమునకు, కేవలాత్ముఁడన్-కేవల = అద్వితీయుఁడ నైన, ఆత్ముఁడన్=ప్రత్యగాత్మస్వరూపుఁడ నైన, నేన=నేనే (బ్రహ్మమే).

తా. "నేను" అనుపదమునకు విచారశూన్యముగాఁ జూచిన "శరీరము"అనియు, "అహంకారము" అనియుఁ నర్థమగును. ఓదోషరహితుఁడా! అవిచారసిద్ధములగుటచే నీరెండును అస్మచ్ఛబ్దమునకు యుక్తములగునర్థములు కావు. ఆశబ్దమునకు నిర్వికారుఁడనగు నేనే ముఖ్యార్థము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. నానానూనుని నని న,న్నే నే నన నిన్ను నన్ను నే నన ననినన్
నే నను నే నన్నా నా, నేనను నన్నెన్ని నన్ను నిను నే ననవా. 89

టీ. అన్నా=ఓయాంజనేయా! నన్నే=పరబ్రహ్మమునగు నన్నే, నానానూనునిన్-నానా=అంతట, అనూనునిన్=నిండియుండువానినిగా, అని=నిశ్చయించి, నేను-అనను= చెప్పియుండలేదా? నిన్నున్ = ప్రత్యగాత్మస్వరూపుఁడవుగాఁ దోఁచుచున్న నిన్ను, నన్నని=పరబ్రహ్మరూపుఁడనైన నన్నుగా నిశ్చయించి (అనఁగా: జీవబ్రహ్మ లొక్కటియే యని నిశ్చయించి), నేను, అనను, నన్ను=బ్రహ్మస్వరూపుఁడనగు నన్ను, ఏనను=అవిద్యా కల్పితములగు సర్వపదార్థములయందు "ఇది నేనే" అని యభిమానించు వానినిగా (కూటస్థునిగా, లేక జీవునిగ), నేనన్నా నా=చెప్పితినా (అనఁగా: అహంశబ్దార్థమంటివా) నీవు, నేననునన్నున్ = "నేను నేను" అని వ్యవహరింపఁబడుచున్నట్టియు పంచకోశాది విలక్షణుఁడనైనట్టియు నాయొక్క యథార్థస్వరూపమును, ఎన్ని=తెలిసికొని, (మనుష్యుఁడు అని శేషము.) నన్నున్, నిన్నున్=త్వంపదలక్ష్యార్థమగు జీవసాక్షియైన నిన్నుగా, నేనను=అహంశబ్దార్థమును నిర్ణయించి చెప్పుము.

తా. ఓయాంజనేయా! ఇదివఱకే నేను (పరబ్రహ్మము సర్వవ్యాపకుఁడ) ననియు జీవబ్రహ్మ లొక్కటియె యనియు అవిద్యాప్రతిబింబరూపుఁడైనట్టియు భోక్తయని యభిమానించుచున్నట్టియు (అనఁగా: కించిద్ జ్ఞత్వాదిగుణములతోఁ గూడినట్టియు జీవుఁడు అస్మచ్ఛబ్దార్థము కాదనియు బ్రహ్మరూపుఁడగుతటస్థుఁడై యాశబ్దమున కర్థ మనియు స్పష్టము చేసి యున్నాను.) కావున నీవు వివేకవంతులై యస్మచ్ఛబ్దమునకుఁ బంచకోశము లర్థము కావనియు వానికంటె వేఱై జీవసాక్షినైయున్న నేనే (కూటస్థుఁడే) యర్థమనియు నిశ్చయించుకొనుము. త్వం అనుపదమునకుఁ గూడ బాగుగ విచారించిన నిదియే (ఈకూటస్థతత్త్వమే) యర్థమగును. ఇట్లు 'త్వమహం' శబ్దార్థముల నిర్ణయించి తెలిసికొని యఖండైక్యము ననుభవింపుము.

క. మేనుమనము మానము మును,నే నను మానమ్ముమాని నేమమ్ము నన
న్నే నే నని నమ్మిన నీ,మాన మనూనానుమాన మైమను నెమ్మిన్.

టీ. మును=పూర్వము, మేను = శరీరము (స్థూలశరీరము), మనము = మనస్సు (సూక్ష్మశరీరమున మనస్సే ప్రధానము గావున నిట్లు చెప్పఁబడెను. కావున నిచ్చట సూక్ష్మ శరీర మనియే యర్థము), మానము = అహంకారము (ఇది కారణశరీరము), నేననుమా నమ్ము=ఇవియే "నేను (ఆత్మ)" అనునభిప్రాయమును, మాని=వదలి, నేమమ్మునన్=నియమమున, నన్నే=సత్యజ్ఞానానందస్వరూపుఁడనగు నన్నే, నెమ్మిన్ = సంతోషముతో నేనని నమ్మినన్=అహంశబ్దార్థమునుగా విశ్వసించినచో, నీమానము = నీజ్ఞానము [మానమనఁగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రమాణము. అపరోక్షబ్రహ్మజ్ఞానము లేక మును పా ప్రమాణము (జ్ఞానము) సంశయ యుక్తమై యుండును] అనూనానుమానమై-అనూన = పరిపూర్ణమైన నిర్దోషమై, అను మానమై=అనుమానప్రమాణమై (ఊహరై), మనుక్ = అభివృద్ధిఁ జెందును. దేహాభి మాన మున్నంతకాలము పరోక్షజ్ఞానమున్నను అపరోక్షజ్ఞానము దొరకక సంశయము కలుగుచుండును. ఆయభిమానమును వదలినచో నాసంశయములు తీఱును. మొట్ట మొదట తనకుఁ గలిగియున్న పరోక్షజ్ఞానరూపమగు ననుమానమున నప్పుడు దోషములు గానరావు.

తా. మఱియు నీస్థూల సూక్ష్మశరీరములే యస్మచ్ఛబ్దార్థమని యభిమానించుట యనర్థదాయకము. బ్రహ్మ మొకఁడున్నాఁడనియుఁ ఆబ్రహ్మమునకు జీవునకు భేదము లే దనియుఁ సామాన్యముగాఁ దెలిసినను దేహాభిమాన మున్నంతకాలము ఆవిషయమున (బ్రహ్మమే జీవుఁడనువిషయమున) గలుగు సంశయములకు మిఱియుండదు. కావున నా యభిమానమును వదలి "అస్మచ్ఛబ్దార్థము బ్రహ్మయే" అని సంపూర్ణ విశ్వాసముతో నిశ్చయించుకొనుము. అప్పుడు అపరోక్షబ్రహ్మానుభవము కలుగును. సంశయ ములుతీఱును. కావున బాగుగ విచారించి యస్మచ్ఛబ్దార్థమును నిర్ణయించుకొనుము.

అవ. అట్లైన లోకవ్యవహారమునను గతి యేమి యనిన చెప్పుచున్నాఁడు:—

క. మన మే పనిఁ జేసిననది, మన మే చేసితి మటంచు మదిఁ దోఁచు సనా
తనమై ద్యోతన మై చేతన మై తగుమనకుఁ గల్పితం బిది యనఘా.

టీ. అనఘా = నిర్దోషివగునాంజనేయా! మనము = సత్వరజస్తమోగుణయుక్త మైనమనస్సు, ఏపనిఁ=ఏవిధమగు సంకల్పమును, చేసినఁ=చేసినప్పటికిని, అది=ఆపనిని, మన మే చేసితిమటంచుఁ=మనమే చేసినామని (అనఁగా: అహం శబ్దార్థమగు కూటస్థుఁడే చేసెనని), మదిఁ=మనస్సునందు, తోఁచుఁ, సనాతనమై=అనాదిసిద్ధమైన (సిద్ధులమై), ద్యోతనమై = సర్వమును బ్రకాశింపఁజేయునదియై (చేయువారమై), చేతనమై=జ్ఞాన స్వరూపమై, తగుమనకుఁ=ఒప్పునట్టిమనకు, ఇది=ఈకర్తృత్వము, కల్పితంబు=అవిద్యచే కల్పింపఁబడినది గాని స్వభావసిద్ధమైనది కాదు.

తా. ఓదోషరహితుఁడా! లోకవ్యవహారమంతయుఁ నజ్ఞాన కల్పితము. "నేను" అనుపదముయొక్క యర్థంబునకుఁగాని "నీవు" అను పదముయొక్క యర్థమునకుఁగాని ఈవ్యవహారముతో (అనఁగాఁ గర్తృత్వభోక్తృత్వములతో) సంబంధములేదు. కర్తయుఁ మనస్సే. భోక్తయుఁ మనస్సే. మనసు చేయుఁకార్యముల కన్నిటికిని అస్మద్యుష్మచ్ఛబ్దార్థ ములే [అనఁగా: సమష్టిమనస్సు చేయుఁకార్యములకు నీశ్వరుఁడును వ్యష్టిమనస్సు చేయు కార్యములకు జీవుఁడును కర్తలుగాఁ దోఁచుచున్నారు. వాస్తవస్థితిలో నిం దొక్కఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డును కర్త కాఁడు. అస్మద్యుష్మచ్ఛబ్దార్థము లొక్కటియే (బ్రహ్మమే) కావున నది యనాది సర్వసాక్షి జ్ఞానస్వరూపము ప్రపంచమునకు భ్రాంతియే (జ్ఞానము) స్వరూపము కావున బ్రహ్మాభిన్నముగ ప్రపంచములేదు. ఇట్లగుటచే నొకపక్షమున మనసుకాని దాని కార్యములు కాని యొత్తుగానే లేవు. మఱియొకపక్షమున కర్తృత్వాదులకు సాక్షియగుటచే నవి (కర్తృత్వాదులు యేవియును బ్రహ్మమునంటవు.) మనసునకే కర్తృత్వభోక్తృత్వములు కలవనుటయు ననుభవసిద్ధమే. కూటస్థునిఁ దెలిసికొనకుండు సమయమునందే కదా "నేను కర్తను, నేను భోక్తను" అనునభిమానము కలుగుచున్నది. దీనిని బట్టిచూచిన బుద్ధియందుఁ బ్రతిబింబించిన చైతన్యమునే కర్తగాఁ దలంచుచున్నారనుట స్పష్టమగుచున్నది కదా. కావున నస్మద్యుష్మచ్ఛబ్దార్థములు (బ్రహ్మము) కర్తయును భోక్తయును గావు.]

అవ. ఇట్లు బ్రహ్మస్వరూపము నుపదేశించి దాని ననుభవసిద్ధముగా నిరూపించుచున్నాఁడు:—

ఉ. నమ్ము మనమ్ములో ననుదినమ్ము వెలుంగుచిదాత్మసత్ప్రభా
సమ్ము నిజమ్ము నేను నిధనమ్మును సంజననమ్ము రూపవ
ర్ణమ్ములు గర్తృకార్యకరణమ్ములు వర్ణగుణాశ్రమాభిమా
నమ్ములు నాకు లేవను ఘనమ్మగునావచనమ్ము నెమ్మదిన్. 92

టీ. మనమ్ములోన్=మనస్సునందు, అనుదినమ్ము = ప్రతిదినమునను (లేక ఎల్లప్పుడును), వెలుం...నమ్ము-వెలుంగు = ప్రకాశించుచున్న, చిదాత్మ = జ్ఞానస్వరూపుఁడగు కూటస్థునియొక్క, సత్ =సత్తారూపమైన (లేక శ్రేష్ఠమైన), ప్రభాసమ్ము=తేజస్సు, నేను నిజమ్ము=నిశ్చయము. నమ్ము. (అందఱకు ననుభవసిద్ధమై యున్నజ్ఞానము పరబ్రహ్మమనుట, మనస్సు సర్వవిషయముల గ్రహించుచున్నదని సర్వజనులు తలంచుచున్నారుకదా. భూతములవలనఁ బుట్టినదగుటచే జడము కావున దానికి విషయముల గ్రహించుసామర్థ్యము నొసంగుటకై యవశ్యముగ చేతనసహాయము కావలయును. అట్లు సహాయము చేయుచున్న చేతనమునే లోకులు జ్ఞానపదముతోఁ జెప్పుచున్నారు. అదియే బ్రహ్మము.) నిధనమ్మును = నాశంబును, సంజననమ్మును = పుట్టుకయును, రూప...మ్ములును-రూప = ఆకారములు, వర్ణమ్ములును = నీలపీతాదివర్ణములును (లేక బ్రాహ్మణాదిజాతులును), కర్తృకార్యకరణమ్ములును-కర్తృ = చేయువాఁడై యుండుట (కర్తృత్వ మనుపర్థమున కర్తృపద ముపయోగింపఁబడియున్నది. దీనినిభావప్రధాననిర్దేశమందురు), కార్య=ఒకకర్తచేఁ జేయఁబడుట (లేక నొకదానినిఁ జేయుట), కరణమ్ములును = ఒక కర్తకు సాధనమగుట (లేక ఒక సాధనమును గలిగియుండుటయును), వర్ణ...లును-వర్ణ = జాతులును, గుణ= సత్త్వాదిగుణమ్ములును, ఆశ్రమ = బ్రహ్మచర్యాద్యాశ్రమములును, అభిమానమ్ములును =

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈవర్ణాదులయందలి యభిమానంబును, నాకులేవు, అను = అనునట్టి, ఘనమ్మగునావచ నమ్మున్ = సర్వోత్తమమైననామాటను, నెమ్మదిన్ = మనస్సునందు, నమ్ముము = నిజమని నిశ్చయించుకొనుము.

తా. ఇట్లు కర్తయుం భోక్తయుం గాని బ్రహ్మమే ఇట్లనుభవమునకు వచ్చునని యెదవేమో వినుము. ఈయనుభవము క్రొత్తగా రానక్కఱలేదు. సర్వజనులును ఆబ్రహ్మమును స్వస్వరూపముగా ననుభవించుచున్నారు "నేను తెలిసికొనుచున్నాను" అను ననుభవమే యావిషయమునఁ బ్రమాణము. లోకమున నందఱు "మనస్సే సర్వమునుం దెలిసికొనుచున్నది" యని తలంచుచున్నారు. కాని యామనస్సు పంచభూతాత్మకమైనది యగుటచే జడము. 'దానియందున్నయాప్రకాశమే సర్వమును దెలిసికొనునని ఇదివఱకే స్పష్టము చేసి యున్నాను కదా! కావున "సర్వప్రకాశకమై నేను దీనిని తెలిసికొనుచున్నాను" అను వ్యవహారములచే నన్నచ్ఛపదార్థములుగ ననుభవింపఁబడుచున్న జ్ఞానమె బ్రహ్మమని నిశ్చయించుకొనుము. ఇంతకంటె నధికముగ ననుభవమేది కావలయును. మఱియుం బాగుగ విచారించిన నాబ్రహ్మమునకు (స్వస్వరూపమునకు) పొడుగుగా నుండుట మొదలగు రూపములు కాని నలుపు తెలుపు మొదలగు వర్ణములు కాని జాతిబ్రహ్మచర్యాద్యాశ్రమములు కాని లేవనుటయు నట్లె యనుభవసిద్ధము. జ్ఞానమునకు నిందేదియుం నుండుటకు వీలు లేదు కదా. జ్ఞానము ఈవిషయములను సాక్షి యగుటయుం దీనికి (జ్ఞానమున కివి లేవనుటకు) రెండవకారణము "నేను బ్రాహ్మణుఁడను ఎఱ్ఱనివాఁడను పొట్టివాఁడను బ్రహ్మచారిని" అను మొదలగు వ్యవహారముల వలన పైఁ జెప్పినరూపాదు లన్నియుం స్వస్వరూపమునకు నున్నట్లే వ్యవహరింపఁబడుచున్నవి కదా యనియెదవేమో ఇది భ్రాంతియని ఇదివఱకే చెప్పియున్నాను. "సాక్షియే యాత్మ" యనుటయం దెట్లు విరోధములేదో అట్లె "సాక్షికి దృశ్యములగురూపాదులతో సంబంధ ముండదు" అనుటలోఁ గూడ విరోధము లేదు కదా. కావున లేనిరూపాదిసంబంధ మున్నట్లు తోఁచుట భ్రాంతి యగుటలో సంశయమేమి? ఇట్లగుటచేత వాస్తవస్థితిలో నాయాత్మకు పైఁజెప్పినరూపాదులయం దభిమానము లేదు. అచైతన్యము జన్మవినాశములు కలది కాదు. దృశ్యపదార్థములజన్మవినాశములఁ జూచుసాక్షి యగుటచే దానికి జన్మవినాశము లుండు ననుట సంభవింపదు కదా. ఎట్లు విచారించినను ఆశుద్ధచైతన్యమే నీవు (త్వంపదార్థము) అదియే యహంపదార్థము. ఈవాక్యములను దృఢముగ నమ్ముము.

అవ. "జ్ఞానమే బ్రహ్మము" అని సిద్ధాంత మేమి? లోకానుభవమును బట్టి జడపదార్థమే బ్రహ్మము కాకూడదా? చార్వాకాదిమతస్థులు కొందఱు జడము లగు


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భూతముల నుండియె చైతన్యశక్తి యుద్భవించు ననుచున్నారు కదా. అనిన నట్లు కాదని సమాధానమును జెప్పుచున్నాఁడు:—

చ. అరుచి జనింప నిం పగుమహావిషయేచ్ఛలు మాని మానిత
స్ఫురదభిమానమానసవచోఘనకాయనివాసవాసనం
బొరయకు మేను నే ననెడిబుద్ధిని దోఁచుటచేతఁ జేతనే
తరమును గాను గానఁ బరతత్త్వమె విశ్వ మభావభావనన్. 93

టీ. విశ్వము = ప్రపంచము, అభావభావనన్-అభావ=లేదనెడు, భావనన్ = తలంపుతో, అరుచి = వైరాగ్యము, జనింపన్ = పుట్టఁగా, ఇంప...చ్ఛలు-ఇంపగు = ఇంతవఱకు నిష్టముగా నున్న, మహత్ = గొప్పవియైన, విషయేచ్ఛలు = శబ్దాదివిషయములయందలి యాసలను, మాని=వదలి, మాని...వాసనన్-మానిత = స్తోత్రము చేయఁదగిన, స్ఫురత్ = ప్రకాశించుచున్న, అభిమాన = అహంకారమువలనఁ బుట్టినట్టియు, మానస=మనస్సునకును, వచః=వాక్కునకును, ఘనకాయ = స్థూలశరీరమునకును (స్థూలసూక్ష్మశరీరములకనుట), నివాస = ఉనికిపట్టైన, వాసనన్ = ఇచ్ఛను (వాసనయనఁగా ఇచ్ఛలవలన జనించి మనసున నిలచి యున్నసంస్కారముగాని సామాన్యమగుకామము కాదని తెలిసికొనవలయును), పొరయకుము=పొందవలదు, ఏను = కూటస్థుఁడనైననేనే, నేను పరబ్రహ్మమును, అనెడిబుద్ధిన్ = అను తెలివిచేత, కానన్ = విచారింపఁగా, చేతనేతరమునుగాను = చైతన్యమునకంటె నితరమగు జడమును కాను, తోఁచుటచేతన్= "నేను నేను" అని జడవినాశకాలమైన సుషుప్త్యవస్థయందుకూడ స్ఫురించుచుండుటచేత (ఆయవస్థయందు నేను అనువ్యవహారము లేకున్నను దానియర్థమగు బ్రహ్మము కలదు గావున నిట్లు చెప్పఁబడెను), పరతత్త్వమే = పరాత్పరుఁడని చెప్పఁబడుచున్న పరబ్రహ్మమే నేను.

తా. ఈవిషయమున నించుక యైనను సంశయింపకుము. స్థూలసూక్ష్మశరీరములాత్మయని యభిమానింపకుము. అనాద్యవిద్యావశమున ననాదికాలమునుండియు దేహాత్మభ్రాంతివచ్చుచుండెనుకావున, నీకునది (దేహాత్మభ్రాంతి) "అహం బ్రహ్మాస్మి" యను జ్ఞానమునకు ప్రతిబంధమును గలిగించుచున్నది. ఇది యహంకారమువలన నింత దృఢముగా నేర్పడుచున్నది. ఆయహంకారంబును బాంచభౌతికము కావున శబ్దాదుల నభిమానించుచున్నది. ఈయభిమానమే జన్మపరంపరకుఁ గారణ మగుచున్నది. కర్మలం జేయించుచున్నది. సర్వకర్మలను శబ్దాద్యనుభవార్థములే కదా. కావున మొట్టమొదట నాయహంకారమును జయింపుము. దానికి వైరాగ్యము ముఖ్యసాధనము. పైన నిరూపించినట్లు ప్రపంచము సంపూర్ణముగా నభావరూపమే కావున నీవైరాగ్యము గలుగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టయు దుర్ఘటము కాదు. ప్రపంచయథార్థస్థితినిగూర్చి కొంత విచారించినఁ జాలును. అప్పుడు మొట్టమొదటనుండియు సుఖకరములుగా నున్నశబ్దాదులు దుఃఖకరములగును. ఆశబ్దాదులయందుఁ దోఁచుచున్నయానంద మంతయు స్వాభావికము కా, దనియు బ్రహ్మానందలేశమే యనియుఁ జెప్పితిని కదా. అప్పుడు క్రమక్రమముగ నాశబ్దాదుల యందలి యభిమానము తొలఁగును. దానిచేఁ గర్మలు నశించును. అప్పుడు పునర్జన్మము కలుగదు. లోకమున "ఈధనము నాది" అను మొదలగు వ్యవహారము పైవిషయమున (అనఁగా నహంకారమే జన్మమును కలిగించు ననువిషయమున, అహంకారమే విషయమున నభిమానించునప్పుడు మమకారరూపముతో పరిణమించును కావున నాయహంకారమమ కారములకు భేదములేదు) ప్రమాణము. దేహ మెప్పటికిని ఆత్మ కానేర దనుటలో సంశయము కొంచె మైనను లేదు. "నేను" అనుపదమునకు నర్థమును విచారించిన సమయ మున సర్వము స్పష్టము చేయఁబడియే యున్నది. అయినను మఱియొక యుక్తిని వినుము. సుషుప్త్యవస్థయందు సర్వము లీనమయ్యెను కదా. అప్పటిసర్వాభావమును జూచునది జ్ఞానమా (చేతనమా) లేక యచేతనమా? అచేతనము చూడనేరదు. చేతన మైన నాఅచే తనములవలనఁ బుట్టిన దైనయెడల వాని లయకాలమున వానితోఁగూడ లయము నొంద వలయును గాని స్వతంత్రమైయుండదు, కావున నాసర్వాభావమును జూచునది స్వతంత్ర చేతనమై యుండకతప్పదు. ఇఁక సుషుప్త్యవస్థయం దేస్వతంత్రచేతనము సర్వాభావము నెఱుఁగుచున్నదో జాగ్రదాదులయందుఁగూడ నదియే సర్వము నెఱుంగుచున్న దనువిష యము నెవ్వండును భంగము చేయఁజాలఁడు. నిదురించి మేల్కొనినపిదప "నేను సుఖ ముగ నిదురించితిని" అని సర్వాభావమును తాను కనఁగొనినట్లు చేయువ్యవహారమే పైవిషయమునఁ జాలినంత ప్రామాణ్యము నొసంగుచున్నది. ఇఁక విచారింపుము. "నేను" అనఁగా నెవ్వఁడగును. నిస్సంశయముగఁ బైఁజెప్పఁబడినస్వతంత్రమే యగును. కావున నోయాంజనేయా! నేను (ఆత్మ) జడ మని యెన్నఁటికిని దలంపకుము.

చ. ఇరవుగ నెన్న నెన్నఁ డొకయించుక లేకయ యున్నయున్నతిం
బొరలువికారకారణ మబోధము దీనితెఱంగు రంగుగా
నెఱిఁగి శమించి మించి పరమేశ్వరభావముఁ బొంది బొంది తా
మఱచినధీరధీరుచిరమార్గుఁడు మోక్షముఁ జేరుఁ జేరువన్. 94

టీ. ఇరవుగన్=బాగుగా, ఎన్నన్, ఎన్నఁడు = ఎప్పుడు, ఒకయించుక లేకయ= కొంచెమైనను వస్తుస్వరూపములేకయే (అనఁగా కనఁబడకయే), ఉన్నయున్నతిన్=ఉన్న రీతిగనే, పొరలు...ణము-పొరలు = అభివృద్ధిఁజెందుచున్న, వికార=ఉత్పత్తివినాశాది వికారములయొక్క, కారణము = హేతువు (అనఁగా ఈవికారములు వస్తువులుగాకున్నను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉన్నట్లు గానవచ్చుటకుఁ గలహేతువు), అబోధము=అజ్ఞానమే (భ్రాంతివలన నీవికారములఁ జూచుచున్నారనుట), దీనితెఱంగుల్ = ఈయజ్ఞానముయొక్క లోపమును రంగుగాల్=చక్కఁగా, ఎఱింగి=తెలిసికొని, శమించి=శాంతి నొంది, మించి=అభివృద్ధిఁ గాంచి, పరమేశ్వరభావముఁబొంది=పరబ్రహ్మత్వమును జెందిన, ("అహం బ్రహ్మాస్మి" అను జ్ఞానముగలిగి), బొందిల్ = శరీరమును, తాల్=తాను, మఱ...ర్గుఁడు-మఱచిన, ధీర=స్థిరమైన, ధీ = జ్ఞానముచే, రుచిర = మనోహరమైన, మార్గుఁడు=మార్గము కలవాఁడు, చేరువల్ = సమీపమున (అనఁగా కరతలామలకముగ, లేక అప్రయత్నముగ), మోక్షముల్=స్వతస్సిద్ధమై యున్నముక్తిని, చేరుల్=పొందును.

తా. ఇట్లైనచో లేనివికారము లేల తోఁపవలయు నందువేమో వినుము. దీనికంతయు నజ్ఞానమే కారణ మని ఇదివఱకే చెప్పియున్నాను. కావున నీవిషయమును స్పష్టముగఁ దెలిసికొనుము. ఎండమావులయందు నీరులేని దయ్యు నున్నట్లు తోఁచినవిధమున నద్వితీయుఁడగుబ్రహ్మమునందు ఈప్రపంచము తోఁచుచున్నది. ఈవిషయమును జక్కఁగ నెఱింగి నాకును బ్రహ్మమునకును భేదము లేదు. ప్రపంచము శూన్యము. నేను అద్వితీయుఁడను అనుజ్ఞానమును దృఢముఁ జేసికొనవలయును. అప్పుడు ఈశరీరము వాస్తవస్థితిలో శూన్యరూపమే కావున దీనియం దాత్మాభిమానము కలుగదు. ఇట్లు దేహాభిమానమును బరిపూర్ణముగ వదలి సంశయములు మాని "పరబ్రహ్మమద్వితీయము" అని చూచు మహాత్ముఁడు సమీపముననే (అనఁగాఁ దానున్నచోటనే) ముక్తినిఁ జెందును. తెలిసికొనలేకపోవుటయేకాని యాత్మ యెప్పుడును ముక్తుఁడె కదా.

ప్రబోధచంద్రోదయమున "శ్లో. శాంతేఽనంతమహిమ్ని నిర్మలచిదానందే తరంగావళీ, నిర్ముక్తేఽమృతసాగరాంభసి మనాఙ్మగ్నోఽపి నాచామతి, నిస్సారే మృగతృష్ణికార్ణవజలే భ్రాన్తోఽపి మూఢః పిబ, త్యాచామ త్యనుమోదతేఽభిరమతే మజ్జత్యథోన్మద్యతి." "శాంతమై యపరిమితప్రభావముకలదై శుద్ధమై జ్ఞానానందరూపమై నిశ్చలమైయున్న మోక్షమనెడు సముద్రజలమున సంపూర్ణముగ మునింగి యుండియు దానిజలముల నించుకయైన నాస్వాదింపరు. నిస్సారమై యెండమావులయందారకల్పింపఁబడినదై యున్న జలమున (అనఁగా శూన్యమయ్యు నున్నట్లు తోఁచుచున్న సంసారమున నున్నట్లు అజ్ఞానముచే తలఁచుచుండియు దానిని ఎండమావులలోనినీటినిఁ) బానముఁ జేయుచున్నాఁడు. ఆచమనము చేయుచున్నాఁడు. దానిరుచికి మెచ్చుకొనుచున్నాఁడు. అంతకంటె నధికమైనది లేదని దానియం దభిమానముగలిగియున్నాఁడు. దానియందే మునుఁగుచుఁ దేలుచున్నాఁడు. ఇది యేటి చిత్రము!" అను పద్యముచే నీవిషయముఁ జిత్రముగఁ గవి వర్ణించియున్నాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇట్లు పరమేశ్వరుఁడు సర్వమును వివరించి రామోపదిష్టదృగ్దృశ్యవివేకము నిట్లని చెప్పుచున్నాఁడు:—

వ. అని యుపదేశించి వెండియు నాత్మస్వరూపం బతిస్పష్టంబుగా నెఱుంగుకొఱకు నింక నొక్కపరమరహస్యంబుఁ జెప్పెద సావధాన చిత్తుండ వై యాకర్ణింపు మని యి ట్లనియె. 95

టీ. అని యుపదేశించి = ఈవిధముగా బోధించి, వెండియున్ = మఱియు, ఆత్మస్వరూపంబు = కూటస్థునియథార్థ స్వరూపము, అతిస్పష్టంబుగాన్ = మిగులవిశదముగా, ఎఱుఁగుకొఱకున్ = తెలిసికొనుటకై, ఇంకన్ = ఇఁకపై, ఒక్కపరమరహస్యంబున్ = అతిరహస్యమగునొకవిషయము, చెప్పెదన్, సావధానచిత్తుండవై = మిగులశ్రద్ధతో, ఆకర్ణింపుమని=వినుమని, ఇట్లనియెన్ = ఈరీతిగ చెప్పఁబోవుచున్నాఁడు.

తా. ఓపార్వతీ! శ్రీరామచంద్రుఁ డీవిధముగాఁ దనయథార్థస్వరూపమును ఆంజనేయునకు వివరించిచెప్పి మరల సుఖతరముగఁ దెలియఁ జేయువాఁడై యీక్రిందివిధముగఁ జెప్ప నుపక్రమించుచున్నాఁడు.

## దృగ్దృశ్యవివేకము.

సీ. కలితశబ్దశ్రోత్రఘనమనోహంకృతుల్
దృశ్యముల్ వీనికి దృక్కు నేను
స్పర్శత్వగింద్రియాంచన్మనోహంకృతుల్
దృశ్యముల్ వీనికి దృక్కు నేను
సలలితరూపలోచనమనోహంకృతుల్
దృశ్యముల్ వీనికి దృక్కు నేను
గమనీయరసరసజ్ఞామనోహంకృతుల్
దృశ్యముల్ వీనికి దృక్కు నేను
తే. అతిసురభినాసికామనోహంకృతులును
దృశ్యములు గాన వీనికి దృక్కు నేను
బహువిధాంతర్బహిస్థ ప్రపంచ మెల్ల
దృశ్య మట్లౌటఁ బరిపూర్ణదృక్కు నేను. 96

టీ. కలిత...కృతులు-కలిత=ఒప్పుచున్న, శబ్ద=శబ్దమనువిషయము, శ్రోత్ర=దానిని గ్రహించునట్టి శ్రోత్రేంద్రియము, ఘన=గొప్పదియగు, మనః=ఆయింద్రియమూలమున ప్రత్యక్షజ్ఞానరూపముతో వెలుపలికి ప్రసరించునట్టిమనస్సును, అహంకృతులు = 'నేను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శబ్దమునువింటిని' అనిపలుకు నహంకారంబును, దృశ్యముల్=చూడఁబడునవి (శబ్దమును శ్రోత్రము గ్రహించును. మనోవృత్తి యాశ్రోత్రేంద్రియముద్వారా వెలుపలికి ప్రస రించినప్పుడే కాని యాప్రత్యక్షముకలుగదు. మఱియు నప్పు డహంకారము 'నేను శబ్ద మును వింటిని' అని యభిమానించును. ఈచెప్పఁబడినవిషయ మంతయును తనకు గోచర మగుచున్నదనుట సర్వజనులకును ప్రత్యక్షము. "నే నిప్పుడు వినుచున్నాను" అని యొక పురుషుఁడు భాషించునప్పుడు అది (అనఁగా ఆస్థితి) స్వయముగా నెఱుంగుచునేయు న్నాఁడు కదా. ఇట్లే రూపస్పర్శరసాదిప్రత్యక్షములయందుకూడ నానావిషయముల నానాయింద్రియములు గ్రహించుటయు, వానిమూలమున మనోవృత్తియు వెలికి నిర్గమించుచుండుటయు అవియన్నియు తనకార్యములుగా నహంకారమభిమానించు చుండుటయు నైజము. (ఈవిషయమునంతయును స్వయముగా నెఱుంగుటకూడ నైజమే యని గ్రహించునది.) వీనికిన్ = ఈ శబ్దశ్రోత్రమనోఽహంకారములకు, నేను = కూట స్థుఁడ నైన నేను, దృక్కున్ = సాక్షినై యున్నాను. (తా నసఁగా కూటస్థుఁడే కాని వేఱొకఁడు కాఁడుగదా!) స్పర్శ...తులు-స్పర్శ=శీతోష్ణాదిరూపమగు స్పర్శము, త్వగిం ద్రియ = దానిని గ్రహించెడు త్వగింద్రియము, అంచత్ = ఒప్పుచున్న, మనోహం కృతులు=అచ్చట సహాయముచేయు మనోవృత్తి దానిని స్వకార్యముగా నభిమానించు అహంకారము, దృశ్యములు, వీనికిన్, నేనున్, దృక్కున్, సలలితరూపలోచనమనోహం కృతుల్, దృశ్యము లీవ్వనికి దృక్కు నేను, కమనీయ = మనోహరమైన, రస = రుచి, రసజ్ఞా=నాలుక, మనోహంకృతులు = మనస్సు అహంకారము, దృశ్యములు = (స్వయ ముగా గ్రహించు నసఁగా కూటస్థుఁడే గ్రహించుననుటయే), నేను, వీనికిన్, దృక్కున్, అతి...తులు - అతిసురభి = మిక్కిలి సుగంధము, నాసికా = ఘ్రాణేంద్రియము, మనోహంకృతులు = మనోహంకారములును, దృశ్యములు, కానన్ =చూడఁబడునవియే కావున, వీనికిన్, నేను, దృక్కున్, అట్లగుటన్ = ఈవిధముగా సర్వసాక్షినై యుండు టచే, బహు...మెల్లన్ - బహువిధ = అనేకవిధములైన (అనఁగా జ్ఞాతృ), జ్ఞాన, జ్ఞేయ రూపములైన), అంతర్బహిస్థ = లోపల వెలుపలనున్న, ప్రపంచమెల్లన్ = మనో బుద్ధ్యాదిరూప మైనట్టియు శబ్దస్పర్శాదిరూపమైనట్టి ప్రపంచమంతయును, దృశ్యము, అట్లౌటన్ = కావున, నేను, పరిపూర్ణ దృక్కున్-పరిపూర్ణ = సర్వపరిపూర్ణుఁడ నైన, దృక్కున్=సాక్షిని.

తా. శబ్దస్పర్శరూపరసగంధములను పంచవిషయములును వానిని గ్రహించుటకు సాధనము లైన జ్ఞానేంద్రియము లైదును ఆ యింద్రియములతో సంబంధించి (అనఁగా వానిగుండ వెలికి వ్యాపించి విషయములం బ్రకాశింపఁజేయుచున్న మనంబును ఆ మనము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నందు "నాది" యను నభిమానము గలిగియున్న యహంకారంబును మఱియుఁ లోపల వెలుపలఁ గల సర్వపదార్థములును దృశ్యములు) అనఁగా నాచేఁ బ్రకాశింపఁజేయ తెలిసికొనఁబడుచున్నవి. నేను (జ్ఞానరూపమగు బ్రహ్మము) వీని కన్నింటికిని సాక్షిని [అనఁగాఁ బ్రకాశింపఁజేయఁ (తెలిసికొను) బడువాఁడు] కావున నాకును వీనికిని సంబంధము లేదు.

అవ. పైఁ జెప్పిన విషయము ననుభవపూర్వకముగా సిద్ధాంతము చేయుచున్నాఁడు:—

సీ. శబ్దాదివిషయపంచకము దృశ్యం బగు
  శ్రవణాదికరణపంచకమునకును
శ్రవణాదికరణపంచకము దృశ్యం బగుఁ
  దతమనోబుద్ధ్యహంకృతుల కరయఁ
దతమనోబుద్ధ్యహంకృతులు దృశ్యం బగుఁ
  బరిపూర్ణదృఙ్మయబ్రహ్మమునకుఁ
బరిపూర్ణదృఙ్మయబ్రహ్మంబు నగునాకు
  దృశ్యత్వ మెందుఁ జింతింప లేదు
తే. గాన నిరతిశయస్వప్రకాశనిర్వి
కారనిర్విషయావ్యయాకాశకల్ప
కల్పనాతీతసచ్చిత్సుఖస్వరూప
సురుచిరాఖండశుద్ధవస్తువును నేను. 97

టీ. అరయన్=విచారింపఁగా, శ్రవ...నకున్-శ్రవణ=చెవి, ఆది = మొదలుగాఁగల, కరణ=జ్ఞానేంద్రియములయొక్క, పంచకమునకున్=ఐదింటికి, శబ్దాదివిషయపంచకము, శబ్ద=శబ్దము, ఆది = మొదలుగాఁగల, విషయపంచకము = ఐదువిషయములును, దృశ్యంబగున్ = చూడఁదగిన వగును (అనఁగా జ్ఞానేంద్రియములు శబ్దాదులను జూచు ననుట), తత...తులకున్-తత = విస్తారములైన, మనోబుద్ధ్యహంకృతులకున్ = మనోబుద్ధ్యహంకారములకు, శ్రవణాదికరణపంచకము=చెవి మొదలగుజ్ఞానేంద్రియము లైదును, దృశ్యంబగున్ = చూడఁదగిన వగును (అనఁగా నంతఃకరణము జ్ఞానేంద్రియముంజూచు ననుట), పరి...నకున్-పరిపూర్ణ=సర్వవ్యాపకుఁడైన, దృఙ్మయ=సర్వసాక్షియైన, బ్రహ్మమునకున్ = పరమాత్మకు, తత...తులు-తత = విస్తారమైన, మనోబుద్ధ్యహంకృతులు= మనోబుద్ధ్యహంకారములు, దృశ్యంబగున్=చూడఁదగిన వగును (సర్వసాక్షి యీయంతఃకరణమును జూచు ననుట), పరిపూర్ణదృఙ్మయబ్రహ్మంబునగు నాకున్=సర్వవ్యాపకుఁడను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సర్వసాక్షిని, పరబ్రహ్మస్వరూపుఁడ నైన నాకు, ఎందుక్=ఎచ్చటను, చింతింపక్=విచారింపఁగా, దృశ్యత్వము=ఒకదానిచే జూడఁబడుటయనుస్థితి, లేదు. (అనఁగా బ్రహ్మమునకు ద్రష్ట యెవ్వఁడును లేఁడనుట. శబ్దాదులకు ద్రష్ట కలఁడనువిషయము అనుభవసిద్ధము. జ్ఞానస్వరూపుఁడగు పరమాత్మునకుఁగూడ మఱియొకద్రష్ట కలఁడనుటయన్నదో ప్రత్యక్ష విరుద్ధము. జ్ఞానమును జూచుటకు మఱియొకజ్ఞానము కలదనుట యసంభవము. దృశ్యమగు జ్ఞానమునకును ద్రష్ట యగుజ్ఞానమునకును భేదమును నిరూపించుటయే మొట్టమొదట నశక్యము. రెండును జ్ఞానములే కదా. ఈ యంశమునుగూర్చి వివరణమును గోరువారు నాచే వివరింపఁబడిన బ్రహ్మగీత 3 అ. 11. శ్లోచూ.) కానక్=కాఁబట్టి, నేను, నిరతి...పును-నిరతిశయ=(నాకంటె) నధికమగు వస్తువులేని (అనఁగా సర్వాధిక మైనట్టియు), స్వప్రకాశ=రెండవసాక్షితో నవసరములేక స్వయముగానే ప్రకాశించునట్టియు, నిర్వికార=ఉత్పత్తి మొదలగువికారములు లేనట్టియు, నిర్విషయ=నేనే సర్వమయుఁడ నగుట చేత దృశ్యము లని చెప్పఁబడుచు (నాకంటె) భిన్నములగుపదార్థములు లేనట్టియు, అవ్యయ = నాశరహిత మైనట్టియు, ఆకాశకల్ప = ఆకాశముతో సమాన మైనట్టియు (అనఁగా భిన్నములని తలంపఁబడుచున్న సర్వపదార్థములతో సంబంధపడియుండియు వాని వికారముల నంటనట్టియు), కల్పనాతీత-కల్పనా = "ఇతఁ డిట్టివాఁడు" అని నిర్ణయించుటను (లేక తర్కములచే వికల్పముచేయుటను), అతీత=అనుక్రమించినట్టియు (అనఁగా నిర్ణయించుటకు కాని వికల్పములచేయుటకుఁ గాని వీలులేనట్టియు), సత్=ఉనికియు, చిత్=జ్ఞానంబును, సుఖస్వరూపముగాఁ గలిగినట్టియు, సురుచిర = మనోహర మైనట్టియు, అఖండ = పరిచ్ఛేదములు (విభాగములు) లేనట్టియు, శుద్ధవస్తువును=నిర్మలమగు పరబ్రహ్మవస్తువును, నేను.

తా. అది యెట్లనిన వినుము. శబ్దస్పర్శరూపరసగంధముల శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములు క్రమముగ గ్రహించుచున్నవనుట యనుభవసిద్ధ మగుటచే నీవిషయమును గూర్చి ప్రత్యేకముగాఁ జెప్పనక్కఱలేదు. "నేను కంటితో చూచుచున్నాను" అను మొదలగువ్యవహారము లీవిషయమునఁ బ్రబలప్రమాణంబులు కదా. కావున నింద్రియాదుల ద్రష్టనుగూర్చి కొంత వివరింపవలయును. స్వానుభవమునుబట్టి కొంచెము జాగ్రత్తతో విచారించినఁ దనయింద్రియములు చేయు విషయగ్రహణము తనకుఁ దెలియుచున్నదనుట యెవ్వఁడును నిరాకరింపఁజాలఁడు. "నాకంటికి నెదుటఁ దెలుపు కానవచ్చుచున్నది. కన్ను తెలుపును గ్రహించుచున్నదనుటను నేనెఱుంగుదును" అను వ్యవహారము నైవిషయమునఁ బ్రబలప్రమాణము. ఈ ప్రమాణమువలన నింద్రియములకు నస్మచ్ఛబ్దవాచ్యుం డైన యొకద్రష్ట కలఁడని స్పష్టమగుచున్నది. లోకమున సామాన్యముగ "నేను" అనుపదమునకు నంతఃకరణోపాధియందుఁ బ్రతిబింబించినజీవునిఁ గాని యా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యంతఃకరణముచే నూరక యూవరింపఁబడి మాత్రమై యున్నచైతన్యమునుగాని యర్థముగాఁ జెప్పుచున్నారు. కావున ఇంద్రియములకు ద్రష్ట యంతఃకరణమె. దీనికిని ఈ యంతఃకరణమునకును మఱియొక ద్రష్ట కలఁ డనుటయు ననుభవవిరుద్ధము కాదు. ఎవ్వం డైనను తనయందుఁ బుట్టుసంకల్పము తనకు తెలియదని చెప్పఁగలఁడా "నా మనసు స్వస్థముగ లేదు. మనసునందు కలఁక కల దనుట నే నెఱుంగుదును" అను మొదలగు వ్యవహారములు నీ విషయమునం బ్రమాణములు. సంకల్పమె కదా మనస్సు. అంతఃకరణమంతయు నొక్కటియే కావున మనసునకు సాక్షియున్న నంతఃకరణమునకు సాక్షియున్నట్లే కావున మనసునకు నెవ్వఁడు సాక్షియై యున్నాఁడో వాఁడే నేను (బ్రహ్మము).

నాకు సాక్షి యెవ్వఁడును లేఁడు. ఎట్లు తర్కించినను దాని (నాకు సాక్షి కల దనుటను) నెవ్వఁడును నిర్ణయింపఁజాలఁడు. నేను స్వప్రకాశుఁడను (రెండవసాక్షితోఁ బనిలేకయే స్వయముగఁ బ్రకాశించువాఁడను) నాకంటె నధికమగు పదార్థ మెద్దియును లేదు. అట్టిపదార్థ ముండిననే కదా నన్నుఁ బ్రకాశింపఁ జేయవలయును. మఱియు దృశ్యము లనుపదార్థము లొకప్పుడు కానవచ్చుచు మఱియొకప్పుడు కానరాకపోవుచు (అనఁగా నావిర్భావతిరోభావములఁ జెందుచు; ఈ ఆవిర్భావతిరోభావములే యుత్పత్తివినాశనము లని యిదివఱకే చెప్పియున్నాము) నుండును. సాక్షికి నవి (ఉత్పత్తివినాశములు) యెన్నటికిని గలుగఁగూడదుకదా. కావున నాకుం గూడ మఱియొకసాక్షి యుండినచో నుత్పత్తివినాశము లుండి తీరవలయును. మనోవాంఛాదు లన్నియుం సుషుప్తిసమయమున నశించినను నేను (సంకల్పసాక్షి యగుబ్రహ్మము) నశింపక వానివినాశమును జూచుచున్నాను. జాగ్రదవస్థలయందవి మరల నుత్పత్తి యగుచుండ "నే నేకరూపముతో నుండి చూచుచున్నాను. నేను సుఖముగ నిదురించితిని. అప్పుడు నాకేమియుం దెలియకుండెను" అను వ్యవహార మీవిషయమునఁ బ్రమాణమని ఇదివఱకే చెప్పియున్నానుకదా. ఇఁకఁ జూడుము. ఉత్పత్తివినాశసాక్షినగునా కుత్పత్తివినాశము లెట్లు కలుగును? కావున నేను నాశరహితుఁడ నగుటచే నాకు సాక్షి లేఁడు.

మఱియు క్షోభము లేకపోవుటచేతనే ఇతరవికాసములు ఉండుట వృద్ధిఁబొందుట నశించుట మొదలగునవియును లేవు. ఆకాశమువలె నీదృశ్యప్రపంచముతో సంబంధపడి యున్నను దీనికి సాక్షి నగుటచే దీనివికారములు నన్ను బాధింపవు. నేను సుఖిని అను మొదలగు ననుభవములు భ్రాంతిసిద్ధములు కాని వాస్తవములు కావని ఇదివఱకే నిరూపించియున్నాను కదా. ఇట్లయిన నీకు సాక్షి లేకపోయిన నీవు (రాముఁడు బ్రహ్మము)


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కలవో లేవో నిశ్చయమెట్లు అనియెదవేమో వినుము. నేను (రాముఁడు బ్రహ్మము) స్వప్రకాశుఁడ నగుటచే నాయునికిని నేనే తెలిసికొందును గాని ఇతం డిట్టివాఁడు అని ఇతరుఁ డెవ్వఁడును నిర్ణయింపలేఁడు. నేను సత్యజ్ఞానానందరూపుఁడను. ఎప్పుడు నొక్క విధముగాఁ బ్రకాశించువాఁడను. నిర్మలుండను.

మఱియొక్కవిశేషము బాగుగఁ దెలిసికొనుటకై (అనఁగా లోకానుభవానుసారముగా విభాగించి యెఱుఁగుటకై) దృశ్యము వేఱు దృక్కు వేఱు అని చెప్పితినిగాని వాస్తవస్థితిలో నాస్వరూపమునకు ఖండములే లేవు. నే నద్వితీయుండను. ఇట్లయిన సిద్ధాంతమునకు విరోధము వచ్చును. నీవు బ్రహ్మము జ్ఞానరూపుఁడ వగుటచే నీకు విషయములగుపదార్థము లవశ్యముగా నుండి తీరవలయును కదా యనియెదవేమో అది యొక నియమము కాదు. ఇదివఱకు చేసిననిరూపణ ననుసరించి ప్రపంచము నాకంటె వేఱు కాదని తెలిసికొనియున్నావు. ఇదియును గాక జ్ఞేయములు లే కున్నను జ్ఞానము జ్ఞానమే కాని వేఱుకానేరదు. భ్రాంతివలన నిప్పుడు లేనిపదార్థము లున్నట్లు తోఁచుచున్నవి. కావున నాస్వరూపము (జ్ఞానరూపమగు బ్రహ్మము. ఈమిథ్యాపదార్థములకు సాక్షిగాఁ దోఁచుచున్నది. ఇంతయేకాని యీప్రపంచమునకు జ్ఞానమో స్వరూపమే. కావున నివి నాకంటె వేఱు కానేరదు. వేఱు కాకపోయిన దృశ్యంబును కానేరదు. ఈకారణము వలన నాయందు సాక్షిత్వ ధర్మంబును ఉండనేరదు.

అవ. ఇట్లు తనసర్వపరిపూర్ణత్వమును విషయరహితజ్ఞానమాత్రరూపత్వమును బ్రకటించి మరలఁ బ్రకృతము (అనఁగా దృశ్యము వేఱు దృక్కు వేఱు అనుపద్ధతి ననుసరించి) తన మఱియొకసాక్షి లేఁడను విషయమును యుక్తిసిద్ధముగ. నిరూపించుచున్నాఁడు:—

వ. అట్టిదృగ్వస్తువు నైననాకు దృశ్యత్వంబు గలుగ దెట్లనిన వినుము. దృక్కును, సంవిత్తును, జిత్తును, జ్ఞప్తియు, జ్ఞానంబును, బోధంబును, చైతన్యంబును నను నివి ఘట కుంభ. కలశశబ్దంబులభంగిఁ బర్యాయనామంబు లట్లగుట దృక్కు నైనన న్నవలోకించునది దృగన్యం బనిన దీపభాస్యంబు లై జడంబు లైనఘటాదులు భాసకం బైనదీపంబు బ్రకాశింపం జేయ నేరనిపగిది నాచేతఁ బ్రకాశ్యంబులై యచేతనంబు లైనయహంకారమనోనేత్రరూపాదికంబులు ప్రకాశకం బైనమత్స్వరూపంబుం దెలియనోపవు. దృగంతరంబనిన నాదృగంతరంబు స్వల్పప్రభారూపంబై నప్రదీపంబనల్ప తేజోవంతుం డగుభానుమంతుని వెలిఁగింప లేనిచందంబున నికృష్టంబై యెఱుంగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సమర్థంబుగాదు. సమానంబై తేజరిల్లం జేయుననిన రత్నంబు స్వస దృశరత్నాంతరంబును భాసిల్లం జేయ క్షమంబు గానిపోలిక మత్స మంబై విలసిల్లంజేయ శక్తంబుగా దదియునుంగాక వేదాంతంబుల యందుఁ జైతన్యద్వయం బనుక్తం బది య ట్లుండనిమ్ము సముత్కృష్టం బై కాంచు ననిన నదియు మఱియొక దృగంతరంబునకు దృశ్యంబు గావలయు న ట్లయిన దానిం గనుంగొనుదృగంతరాంతరం బింకొక్కటి యనిన నిత్తెఱంగున నసంఖ్యాతదృగంతరాంగీకారంబు దోఁచునందువలన ననవస్థాదోషంబు ప్రాప్తం బగు నట్లు గాక కొన్ని దృగంతరంబుల నూహించి యొక్కటి నిలిపి ఇటమీఁద దీనికి ద్రష్ట లేఁడనిననన్నింటికిం గలుగ నితని కెట్లు లేకుండు గలం డనిన వానికి వ్యభిచారంబు వచ్చు నివ్విధంబు గాక మొదటిదృగంతరంబు నిరతిశయం బనిన నెయ్యది సర్వకారణం బై నిష్కారణం బై తనకంటె నితరం బైనసర్వంబును సాధనంబు లేకయ తాన వీక్షించు నదియె నేను గావున స్వప్రకాశపరిపూర్ణదృఙ్మయబ్రహ్మంబు నగుదు నని యుపదేశించి మఱియు నిట్లనియె. 98

టీ. అట్టిదృగ్వస్తువునైననాకున్-అట్టి = పైనఁజెప్పిన, దృగ్వస్తువునైననాకున్ = సాక్షిరూపుఁడనైననాకు, దృశ్యత్వంబుగలుగదు=చూడఁబడుట యనుస్థితి సంభవింపదు. (అనఁగా బ్రహ్మమునకు సాక్షి లేఁ డనుట.) ఎట్లనినన్, వినుము, దృక్కును = "దృక్" అనుపదంబును, సంవిత్తును = "సంవిత్" అనుపదంబును, చిత్తును = "చిత్" అను పదంబును, జ్ఞప్తియున్="జ్ఞప్తి" యను పదంబును, జ్ఞానంబును = "జ్ఞాన" మనుపదంబును, బోధంబును = "బోధ" మనుపదంబును, చైతన్యంబును = "చైతన్య" మనుపదంబును, అనునివి=ఈపదములు, ఘట...భంగిన్-ఘట = "ఘట" మనుపదంబును, కుంభ = "కుంభ" మనుపదంబును, కలశ = "కలశ" మనుపదంబును, శబ్దంబులభంగిన్ = ఈపదములయట్లు, పర్యాయనామంబులు = ఒకపదార్థము నెప్పు పేర్లు, (అనఁగా ఘటాదిపదము లెట్లొకఘటమునే చెప్పునో దృగాదిపదములు కూడ నట్లే పరబ్రహ్మమును చెప్పుననుట.) అట్లగుటన్=ఈకారణమువలన, దృక్కునైననన్ను = స్వసాక్షినైననన్ను, అవలోకించునది = చూచునని చెప్పఁబడునది, దృగన్యంబనినన్ = దృశ్యమే యనినచో (అనఁగా దృశ్యము లగు శబ్దాదిపదార్థములే తమకు సాక్షి నగునన్నుఁ జూచు ననినచో) దీపభాస్యంబులై=దీపముచే ప్రకాశింపఁజేయఁదగియున్నట్టియు, జడంబులైన=స్వయముగా ప్రకాశించునట్టి స్వభావము లేని, ఘటాదులు = ఘటాదిపదార్థములు, భాసకంబైన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దీపంబున్ = తమ్ముఁ బ్రకాశింపఁజేయుదీపమును, ప్రకాశింపఁజేయనేరనిపగిదిన్ = (స్వయముగ) ప్రకాశింపఁజేయలేనట్లు, నాచేతంబ్రకాశ్యంబులై = నాచే ప్రకాశింపఁ జేయఁదగినవై, అచేతనంబులైన=జడములైన, అహం...బులు-అహంకార = అహంకారము, మనః=మనస్సు, నేత్ర=నేత్రము, రూప = ఆనేత్రముచే గ్రహింపఁబడురూపము, (విషయేంద్రియమనోహంకారములకుఁ గలపరస్పరసంబంధము [illegible]5-వ పద్యములో వివరింపఁబడియున్నది.) ఆదికంబులు = మొదలైనవి (ఆదిపదమువలన సర్వవిషయ సర్వేంద్రియములను వానితో సంబంధము గలమనోఽహంకారములనుగూడ గ్రహించునది). ప్రకాశకంబైన=తమ్ముఁ బ్రకాశింపఁజేయునట్టి, మత్స్వరూపంబున్ = నారూపమును, తెలియనోపవు = తెలిసికొనఁజాలవు (అనఁగా ప్రకాశింపఁజేయలేవు.) (జ్ఞానమే ప్రకాశ మని యిదివఱకే చెప్పియున్నాము). దృగంతరంబనినన్ = మఱియొకదృక్కు-నన్ను ప్రకాశింపఁజేయుఁ నని చెప్పినచో, స్వల్పప్రభారూపంబు = స్వల్పమైనకాంతియే స్వరూపముగాఁ గలది, ఐనప్రదీపంబు = ఐనచిన్నదీపము, అనల్పతేజోవంతుండగు=అపరిమితమగుప్రకాశముగల, భానుమంతుని వెలిఁగింపలేనిచందంబునన్ =సూర్యునిఁ బ్రకాశింపఁజేయలేనట్లు, నికృష్టంబై = నన్నుఁ బ్రకాశింపఁజేయునని చెప్పఁబడిన రెండవదృక్కు- నాకంటె నల్పప్రకాశము గలదైనయెడల, ఎఱుంగసమర్థంబుగాదు = నన్నుప్రకాశింపఁజేయఁజాలదు. సమానంబై తేజరిల్లంజేయుననినన్ = రెండవసాక్షి నాతో సమానమగుప్రకాశముగలదై నన్ను ప్రకాశింపఁ జేయుననిన, రత్నంబు, స్వసదృశరత్నాంతరంబున్ = తనతోసమానమగు కాంతిగల రెండవరత్నమును, భాసిల్లంజేయన్=ప్రకాశింపఁ జేయుఁటకు, క్షమంబుగానిపోలికన్ = సమర్థము కానట్లు, మత్సమంబై=నాతోసమానమై (యున్నరెండవసాక్షి), విలసిల్లంజేయశక్తంబుగాదు = నన్ను ప్రకాశింపఁజేయనేరదు. అదియునుంగాక = ఇంతమాత్రమేకాక, వేదాంతంబులయందున్ =వేదాంతశాస్త్రములలో, చైతన్యద్వయంబు=రెండుచైతన్యములు (కలవని), అనుక్తంబు=చెప్పఁబడియుండలేదు. అదియటుండనిమ్ము = ఆవిషయ ముండనిమ్ము ("యుక్తి ననుసరించియే విచారింతము" అని భావము). సముత్కృష్టంబై = నాకంటె నధికమై, కాంచుననినన్ =రెండవసాక్షి నన్ను ప్రకాశింపఁజేయునని చెప్పినచో, అదియున్ = సాక్షియును, మఱియొక దృగంతరంబునకున్ = దానికంటె నధికమగుప్రకాశముగల మఱియొకసాక్షికి, దృశ్యంబుగావలయున్ = గోచరము కావలసివచ్చును, అట్లయినన్ = అట్లు చెప్పినచో (రెండవసాక్షికి ద్రష్టయగుమూఁడవసాక్షి గలఁడనినచో), దానిన్ = ఆమూఁడవసాక్షిని, కనుంగొను...రంబు-కనుంగొను=చూచునట్టి, దృగంతరాంతరంబు= మఱియొకసాక్షి (కావలసివచ్చును), ఇంకన్ = మఱియు, ఒక్కటియనినన్ =దానినిఁ జూచుటకై మఱియొకసాక్షి గావలసివచ్చును అనినచోఁ, ఇత్తెఱంగునన్ = ఈవిధ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముగా, అసం...రంబు-అసంఖ్యాత = లెక్కకు మిక్కిలియైన, దృగంతర = సాక్షుల యొక్క, అంగీకారంబు=ఒప్పుదల, తోఁచుఁ = కావలసివచ్చును. (అనఁగా లెక్కకు మిక్కిలియగు సాక్షుల నొప్పుకొనవలసి వచ్చుననుట.) అందువలనఁ=ఆకారణమువలన, అనవస్థాదోషంబు="అనవస్థ" (అంతము లేక పోవుట) యనుదోషము, ప్రాప్తంబగుఁ= వచ్చును. అట్లుగాక = అట్లు లెక్కకు మిక్కిలి యగుసాక్షుల నంగీకరింపక, కొన్నిదృ దృగంతరంబులఁ = కొన్నిసాక్షులను, ఊహించి = కలవసి నిర్ణయించి, ఒక్కటి నిలిపి = ఒకసాక్షియొద్ద నిలచి, ఇటమీఁదఁ = ఇఁకమీఁద, దీనికిఁ = ప్రస్తుత సాక్షికి, ద్రష్టలేఁడనినఁ = మఱియొకసాక్షి లేఁడని చెప్పినచో, అన్నింటికిఁగలుగఁ= ఇంతవఱకు నున్నసాక్షులకన్నిటికిని సాక్షియుండ, వీనికెట్టులేకుండుఁ = ప్రస్తుత సాక్షికిమాత్రము సాక్షి యెటు లేకపోవును, కలండనినఁ=దీనికిఁగూడ సాక్షియున్నాఁ డనినచో, వానికిఁ = ఆసాక్షికిఁగూఁడ (అనఁగా ప్రస్తుత మేసాక్షికి రెండవసాక్షి లేఁడని చెప్పియున్నామో అసాక్షికిఁగూఁడ), వ్యభిచారంబువచ్చుఁ = నిషేధము కలు గును. ఇవ్విధంబుగాక=ఇట్లుచెప్పక, మొదటిదృగంతరంబు = మొట్టమొదటిసాక్షి, నిరతి శయంబనినఁ = అతిశయములేనివాఁడు (అనఁగా తనకంటె నన్యమగుసాక్షి యాత నికి లేఁడు) (స్వప్రకాశుఁడు) అనినచో, ఎయ్యది=ఏసాక్షి, సర్వకారణంబై=సమస్తము నకును కారణభూతుఁడై, నిష్కారణంబై = తనకుఁ గారణము లేనివాఁడై, తనకంటె నితరంబైన సర్వంబుఁ = తనకంటె వేఱుగాఁ గనబడు సమస్తపదార్థములను, సాధనంబు లేక = రెండవసాధనములతోఁ బనిలేక (అనఁగా స్వస్వరూపములతో మాత్రమే), తాను వీక్షించు = స్వయముగాఁ బ్రకాశింపఁజేయునట్టి, అదియె=ఆ మొదటిసాక్షియే, నేను గావునఁ=నేను కాఁబట్టి, స్వప్ర...హ్మంబు-స్వప్రకాశ = తనంతఁ దానే ప్రకాశించు నట్టియు, పరిపూర్ణ = సర్వవ్యాపక మైనట్టియు, దృఙ్మయ = జ్ఞానస్వరూప మైనట్టియు, బ్రహ్మంబుఁ = పరబ్రహ్మమును, అగుదుఁ = ఐయున్నాను, అని యుపదేశించి = అని బోధించి, మఱియు నిట్లనియెఁ=మఱియు నీక్రిందివిధముగాఁ జెప్పఁబోవుచున్నాఁడు.

తా. ఓ యాంజనేయా ! ఈ ప్రపంచమునకంతయును నేను సాక్షి నగుదును; గాని నాకు సాక్షి లేఁడు అని ఇదివఱకు చెప్పియున్నాను. దానిని నిరూపించెదను వినుము. దృక్కు సవిత్ చిత్ జ్ఞప్తి జ్ఞానము బోధము చైతన్యము అను పదములన్నియు ఘట కుంభాదిశబ్దములవలె నాకుఁ బర్యాయనామములు. కావున నీపదములలో దేనినిఁ గైకొని వ్యవహరించిన నొక్కటియే. ఇఁక యుక్తిని వినుము. నాకు (జ్ఞానమునకు) మఱియొక సాక్షి కలఁ డనిన, వాఁడు చేతనుఁడా? యచేతనుఁడా? అచేతనుఁడైనచో జ్ఞానమును బ్రకాశింపఁ జేయఁజాలఁడు. దీపముచే బ్రకాశింపఁ జేయఁబడు పదార్థములు (ప్రకాశ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శూన్యములగు పదార్థములు) దీపమును బ్రకాశింపఁజేయఁజాలవు కదా. కంటిచే (లేక జ్ఞానేంద్రియములచే) గ్రహింపఁబడువిషయముల నాజ్ఞానేంద్రియములు గ్రహింపఁజాలవుకదా. ఇట్లుగాక నాకంటె నితరుం డగుచేతనుఁ డొక్కఁడు కలఁడని చెప్పినచో నది వేదాంతశాస్త్రమునకు విరుద్ధము. యుక్తికింగూడ సరిపడదు. ఎట్లనిన: ఒకజ్ఞానమును మఱియొకజ్ఞానము ప్రకాశింపఁజేయు ననిన నా రెండవజ్ఞానము (ద్రష్ట యగు జ్ఞానము) మొదటిజ్ఞానమునకంటె (దృశ్యమగు జ్ఞానమునకంటె) నధికమా? సమమా? లేక యల్పమా? అల్పమే యనినచో దీపము తనకంటె నధికకాంతి గల సూర్యునిం బ్రకాశింపఁ జేయఁజాలనట్లు ఆద్రష్ట్రుజ్ఞానము దృశ్యజ్ఞానమును బ్రకాశింపఁజేయఁజాలదు. సమ మనినచో ఒకరత్నము తనతో సమానమైన కాంతిగల మఱియొకరత్నమును బ్రకాశింపఁజేయునట్లు మొదటిజ్ఞానమును (అనఁగా దృశ్యజ్ఞానమును) బ్రకాశింపఁజేయఁజాలదు. అధికమనినచో దానికంటె నధికమగు మఱియొకజ్ఞానము దానికిఁ (ఆ రెండవ జ్ఞానమునకు) గూడ సాక్షియై యుండవలసివచ్చును. ఈ పక్షమును ఖండించుట కవకాశ మేదియును లేదు. ఇట్లు (అనఁగా రెండవజ్ఞానమునకుఁగూడ మఱియొకసాక్షి కలండని) చెప్పినచో "నామూఁడవజ్ఞానమునకుఁగూడ మఱియొకసాక్షి కలఁడు. ఆ నాల్గవ జ్ఞానమునకుఁగూడ మఱియొకసాక్షి కలఁడు. దానికిని మఱియొకసాక్షి దానికిని మఱియొకసాక్షి" అని లెక్కకు మిక్కిలి యగుసాక్షుల నంగీకరింపవలసివచ్చును. ఇదియే యనవస్థాదోషము (ఎప్పటికిని ముగియకుండుట యనుదోషము). ఇట్లు బహువిధములగు దోషములు కలుగుటచే నీపక్షము జ్ఞానమునకు మఱియొకజ్ఞానము సాక్షి కావలయును. అనుపక్షము సరియైనదికాదు. అనవస్థాదోషము నెట్లును దొలఁగించుటకు వీలులేదు. కాని సాక్షులవఱకు నంగీకరించి యిచ్చట నిలిపి వీనికి సాక్షిలేదు అని చెప్పుటకు వీలు లేదు. అట్లు చెప్పిన వ్యభిచారదోషము వచ్చును. వాదముకొఱకై యాశ్రయింపఁబడిన నియమమునకు భంగముకలిగెనేని యది వ్యభిచారదోష మనఁబడును. ఇచ్చట వాదము కొఱకై సాక్షి ప్రతిపదార్థమునకు నుండితీరవలయును. సాక్షిలేనిది యేపదార్థమైనను నిశ్చయింపఁబడదు; అనునియమ మాశ్రయింపఁబడియున్నది. అనవస్థాపరిహారమునకు నై కొన్నిసాక్షుల నంగీకరించి యొక్కనికి మాత్రము సాక్షి లేఁడనినఁ బైనియమమునకు భంగమువచ్చుననుట స్పష్టమేకదా. కావున నెట్లును జెప్పుటకు వీలులేదు. సంకల్పసాక్షి యగు జ్ఞానమే నిరతిశయ (తనకంటె నధికమగు రెండవపదార్థములు లేనిది) యనియు స్వప్రకాశ (స్వయముగఁ బ్రకాశించునది) యనియుఁ జెప్పితీరవలయును. అజ్ఞానమే నేను (రాముఁడు-బ్రహ్మము) కదా! కావున నేను పరిపూర్ణుఁడను. సర్వసాక్షిని. ఓ పార్వతీ! ఈవిధముగాఁ దనతత్త్వము నెఱింగించి సారాంశమును వివరించువాఁడై శ్రీరాముఁ డాంజనేయునితో నిట్లనియె.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇట్లు దృగ్దృశ్యముల నెఱింగించి సర్వము నుపసంహరించుచున్నాఁడు:—

తే. తెలియఁబడుచున్న విశ్వంబు దృశ్య మంచుఁ
దెలివి నై సర్వమును గాంచుదృక్కు నేను
మిగుల నాకంటె నన్య మేమియును లేదు
సత్య మిది సర్వవేదాంతసంగ్రహంబు. 99

టీ. తెలియఁబడుచున్న = జ్ఞానమునకు గోచరమగుచున్న, విశ్వంబు = ప్రపంచము, దృశ్యమంచున్ = దృశ్యమని ఈ ప్రపంచమునందు తెలిసినభాగము కొంతయు తెలియనిభాగము కొంతయుఁగూడ కలదు. అందఱును సర్వజ్ఞులు కారుగదా. ఇట్లగుట చేత "తెలియఁబడునది దృశ్యము" అనిన తెలియఁబడనిది దృశ్యమునకంటె వేఱు కావచ్చుననియు దానివలన దృక్కగు బ్రహ్మము సర్వసాక్షియనుట సంభవింపదనియు సంశయముతోఁచును. కాని ఇట్టిసంశయ మక్కఱలేదు. "ఇది తెలియును. ఇది తెలియదు" అను రెండువిషయములను పురుషుఁడు స్వయముగా నెఱుంగుచునే యున్నాఁడు. (అనఁగా పురుషుని యథార్థస్వరూప మగుబ్రహ్మము తెలిసికొనుచున్నాఁడు. చిత్తవృత్తికి గోచరమగుదానిని తెలియఁబడినదానినిగాను, గోచరముకానిదానిని తెలియఁబడనిదానినిగాను మనము వ్యవహరించుచున్నాము. కావున నీయుభయరూపమగు ప్రపంచము పరబ్రహ్మమునకు గోచర మగుచునే యున్నదని నిశ్చయించుకొనవలయును.) తెలివినై=జ్ఞానరూపుఁడ నైన నేను, సర్వమున్ = ఈ సమస్తప్రపంచమును (అనఁగా జ్ఞాతాజ్ఞాతరూపమగు నుభయవిధప్రపంచమును), కాంచు = చూచునట్టి, దృక్కు = సాక్షిని, మిగులనాకంటెన్=నాకంటె నధికమగు, అన్య మేదియును లేదు. (సర్వకారణభూతుఁడ నగుటచే యథార్థమును విచారించిన దృశ్యమగు ప్రపంచముకూడ నేనే) ఇది = ఈ విషయము, సత్యము = నిజము, సర్వవేదాంతసంగ్రహంబు = సమస్తవేదాంతసిద్ధాంత సంగ్రహము.

తా. "ఈ ప్రపంచము నాచే నెఱుంగఁబడుచున్నది. ఇది దృశ్యము" అని జ్ఞానరూపుఁడనై నేను తెలిసికొనుచున్నాను. పైన నిరూపించినయుక్తుల ననుభవముల ననుసరించి ఈవిషయము స్పష్టమైయే యున్నది. మఱియుఁ నీ దృశ్యపదార్థములుకూడ నాకంటె వేఱుకావనియుఁ గూడ నిరూపించియున్నాను. కావున నాకంటె వేఱైన దేదియు లేదు. ఇది యథార్థము. సర్వవేదాంతములును జెప్పువిషయ మిది.

క. జీవత్రితయతనుత్రిత, యావస్థాత్రితయమునకు నతిరిక్తుఁడుఁ ద
ద్భావాభావజ్ఞుఁడు నగు, కేవలచిన్మయుఁడ నేను కీశాధీశా! 100

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. కీశాధీశా = వానరశ్రేష్ఠా ! నేను, జీవ...లకున్-జీవత్రితయ = విశ్వతైజస ప్రాజ్ఞు లను ముప్వుర జీవులకంటెను, తనుత్రితయ=వానిచే నభిమానింపఁబడు వ్యష్టిస్థూల సూక్ష్మకారణశరీరములకంటెను, అవస్థాత్రితయమునకున్ = జాగ్రత్స్వప్నసుషుప్త్యవ స్థలకంటెను, అతిరిక్తుండును = వేఱైనవాఁడును, తద్భావా...డును-తత్ = ఆజీవాదుల యొక్క, భావ=ఉనికిని, అభావ=లేమిని (అనఁగా ఆవిర్భావతిరోభావములను), జ్ఞుఁడును = తెలిసికొనువాఁడును, అగు...యుఁడన్ - అగు = అయినట్టి, కేవల = పరిశుద్ధుఁడైన (ఏక స్వతంత్రుఁడైన), చిన్మయుఁడన్=జ్ఞానమాత్రరూపుఁడను.

తా. ఓ యాంజనేయా ! నాకంటె నితర మగునది యథార్థస్థితిలో లేదున్నను సాంఖ్యయోగావలంబులగువారు ప్రపంచమునుండి నన్ను వేఱుగాఁ జేసి తెలిసికొనువారు కావున వారికి దృగ్దృశ్యజ్ఞాన మావశ్యకము. భ్రాంతులై సర్వత్ర భేదమును జూచు చుండువారల కభేదమును మొట్టమొదటనే గ్రహించుట యశక్యముకదా. కావున స్థూలసూక్ష్మకారణశరీరములకును అందలి జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలకును వీనియందెల్ల నభిమానముగల విశ్వతైజసప్రాజ్ఞులకును సాక్షియై సర్వము నెవ్వం డెఱుంగుచున్నాఁడో వాఁడే బ్రహ్మమని మొదట దెలిసికొనవలయును. ఇట్లు జీవసాక్షి నగు నన్నెఱింగిన నీశ్వరసాక్షి యగు బ్రహ్మమునుగూడ నెఱింగినట్లే యగును. నేనే బ్రహ్మమని ఇదివఱకే చెప్పితినిగదా. కావున నా స్వరూపము జ్ఞానమే యని తెలిసికొనుము. మొట్టమొదట విభాగపూర్వకముగ జ్ఞానము కలిగినపిదప నవిభాగముగాను తదనంతరము అది పరిశుద్ధము (అనఁగా నిర్విశేషను భేదము త్రికాలములయందును లేకుండుట)గాను జ్ఞానము కలు గును. ఇదియే చక్కని యుపాయము. "ద్రష్టా త్వమేవ సకలస్య న దృశ్యమేత దిత్యా కలయ్య తదను త్వదనన్యభూతం, వ్యాకృశ్య దృశ్య మపి తాం ధియమ ప్యపాస్య సంవి త్సుఖైకరసికా సముపాసతే త్వాం" "బ్రహ్మానందానుభవరసికు లగువారు మొట్టమొదట నిన్ను (కృష్ణుని) ప్రపంచమునకు ద్రష్టగాను ఆప్రపంచమునకంటె భిన్నునిగాను భావించి పిదప నీవును ప్రపంచము నొక్కటియే యని విచారించి తదనంతరము నీవు నిర్విశేషుఁడ వనియు నెట్లును నిరూపించుటకు వీలులేనివాఁడ వనియుఁ దెలిసికొని సేవింతురు" అని మహాత్ము లీవిషయమునుగూర్చి చెప్పియున్నారు.

అవ. పైనఁ జెప్పినవిషయమునే మఱియొకవిధముగా నిరూపించుచున్నాఁడు:—

సీ. భూతపంచకమును బుద్ధ్యహంకారంబు
లవ్యక్తమును నింద్రియములు పదియు
నొక్కటి విషయపంచకమును జేతనే
చ్ఛాద్వేషసుఖదుఃఖసంఘధృతులు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్షరము క్షేత్రం బన గడు నొప్పు నిది యప
రాప్రకృతి యనఁగఁ బ్రకృతి యనఁగ
నలరు నీప్రకృతితోఁ గలసి వర్తించు చి
దాభాసుఁ డక్షరుఁ డాత్ముఁ డనఁగఁ

తే. బరఁగు క్షేత్రజ్ఞుఁ డనఁ బరాప్రకృతి నాఁగఁ
బురుషుఁ డనఁగ నీరెంటికిఁ బొందు గలుగ
నొనరఁ గనుఁగొను నేఁ బురుషోత్తముఁ డనఁ
బరుఁ డనఁగ వెల్గుచుండుదుఁ బవనతనయ! 101

టీ. పవనతనయ = ఆంజనేయా! భూతపంచకమును = ఆకాశాది పంచభూతములును, బుద్ధ్యహంకారంబులు = బుద్ధి అహంకారము, అవ్యక్తమును = వీనికి కారణమగు నవిద్య, పదియుఁ=జ్ఞానేంద్రియకర్మేంద్రియములుపదియును, ఒక్కటి = అంతఃకరణమొక్కటియుఁ గలసి, ఇంద్రియములు = పదునొకం డింద్రియములును, విషయపంచకమును=శబ్దాదివిషయములైదును, చేత...ధృతులు-చేతన=ప్రాణము (లేక, చిత్తవృత్తి), ఇచ్ఛ=కామము, ద్వేష=క్రోధము, సుఖదుఃఖ = సుఖము దుఃఖము, సంఘ=వీనియొక్క సముదాయమును, ధృతులు=ధైర్యంబును, క్షరము=క్షర మనియు (నాశముకలది గావున క్షరము), క్షేత్రంబునఁ = క్షేత్ర మనియు (పరబ్రహ్మ మఱియొకవిధముగాఁ దోఁచు విపరీతకల్పనలకు, లేక సృష్టి కాధారము గావున క్షేత్రము; భూమియందు పైరు పండినట్లు దీనియందును ప్రపంచరూపసస్యము ఫలించును), కడుఁ = మిక్కిలి, ఒప్పుఁ = చెప్పఁబడుచు ప్రకాశించును. ఇది = ఈక్షేత్రమే, అపరాప్రకృతియనఁగ = అపరాప్రకృతి యని (అపరమనఁగా యల్పదేశమున నుండునది "పాదోఽస్య విశ్వాభూతాని" అని శ్రుతి; లేక తుచ్ఛమైనది), ప్రకృతియనఁగఁ=మాయ యనియును (లేక ఉపాదానకారణ మనియు), అలరుఁ=ఒప్పుచుండును. ఈప్రకృతితోఁ = ఈక్షేత్రముతో, కలసి = కూడి, వర్తించుచిదాభాసుఁడు = ఉన్నట్టిబ్రహ్మప్రతిబింబము, అక్షరుండు = నాశరహితుఁడు కావున నక్షరుఁ డనియుఁ, ఆత్ముఁడనఁగఁ = సర్వవ్యాపకుఁడు కావున నాత్మయనియు, పరాప్రకృతినాఁగఁ = పరాప్రకృతియనియు (అపరాప్రకృతి కంటె శ్రేష్ఠుఁడు గావున జీవుని కీపేరు కలిగెను), పురుషుఁడనఁ = శరీరములయందు వ్యాపించియుండువాఁడగుటచే పురుషుఁడనియు, క్షేత్రజ్ఞుఁడనఁ = క్షేత్రమును దెలిసికొనుచుండువాఁడు కావున (అనఁగాఁ ప్రకాశింపఁజేయుచుండువాఁడు కావున క్షేత్రజ్ఞుఁ డనియు), పరగుఁ = ఒప్పుచున్నది. ఈరెంటికిఁ = ఈక్షేత్రక్షేత్రజ్ఞులకు, పొందు గలుగఁ = సంబంధముకలుగుచుండఁగా, ఒనరఁగనుఁగొనునేను = బాగుగచూచుచున్న

 CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నేను, పురుషోత్తముఁడనర్ = క్షరాక్షరపురుషులకంటె శ్రేష్ఠుఁడగుటచేత పురుషోత్తముఁడనుపేర, పరుఁడనఁగర్ = పరమాత్మయనుపేర, వెల్గుచుండుదుర్ = ప్రకాశించుచుండును.

తా. ఓయాంజనేయా! మఱియొకవిషయమును వినుము. నాయథార్థస్వరూపము స్పష్టముగఁ దెలియవచ్చును. పంచభూతములును బుద్ధియు నహంకారంబును జ్ఞానేంద్రియ కర్మేంద్రియములును అవ్యక్తంబును (ఇదియే యవిద్య) అంతఃకరణంబును చేష్టయును (ఇదియే క్రియాశక్తి) యిచ్ఛయు ద్వేషంబును సుఖంబును దుఃఖంబును దేహాది సముదాయంబును ధైర్యంబును (లేక శరీరాదులు దృఢములై నిలచుటకుఁ దగిన యాధారశక్తియు) గలసి క్షేత్రమనఁబడును. ఇది సర్వవికారములకు నాధార మగుటవలన దీని కీపేరు కలిగెను. వినాశము కలవి యగుటచేత క్షరమనియుఁ దుచ్ఛమైన ప్రకృతి యగుటచేత నపరాప్రకృతి యనియు సర్వవికారములకు నుపాదానకారణ మగు మాయయే స్వరూపముగాఁ గలది కావునఁ బ్రకృతి యనియు దీనినే వ్యవహరించుచున్నాము. ఈక్షేత్రములో సంబంధపడి యున్నచిదాభాసుఁడే (జీవుఁడని పిలువఁబడుచున్న బ్రహ్మప్రతిబింబమే) క్షేత్రజ్ఞుఁడు. పైఁ జెప్పినక్షేత్రమును దెలిసికొనువాఁ డగుటచే నీతని కీపేరుకలిగినది. మఱియు సర్వవ్యాపకుఁ డగుటచేత నాత్మయనియు శ్రేష్ఠుఁ డగుటచేతఁ బరాప్రకృతి "మాయాభాసేన జీవేశౌ కరోతీతి శ్రుతౌ శ్రుతం" "మాయ బ్రహ్మప్రతిబింబములచే జీవేశ్వరులఁ గల్పించుచున్నది. అని వేదములు చెప్పుచున్నవి" అను మొదలగు ప్రమాణములవలన జీవుఁడు కూడ మాయాకార్య మగుటచే మాయయే కావున "జీవుఁడు పరాప్రకృతి" యని చెప్పఁబడుచున్నాఁడు అనియు పురము లని చెప్పఁబడు శరీరములయం దుండువాఁ డగుటచేఁ బురుషుఁ డనియుఁ వానినే పిలుచుచున్నాము. నేను (బ్రహ్మము) ఈరెంటికంటెను వేఱగువాఁడను. ఈప్రకృతిపురుషులకు నున్న యన్యోన్యసంబంధమును జూచుసాక్షిని. ఇట్లు ప్రకృతిపురుషులకంటె వేఱగుటచేఁ బరుఁడనియుఁ బురుషోత్తముఁ డనియు (పైనఁ జెప్పఁబడినక్షరాక్షరములు పురుషులని చెప్పఁబడుచున్నవి. ఈపురుషులకంటె నధికుఁడు కావున బ్రహ్మము పురుషోత్తముఁడు) చెప్పఁబడుచున్నాను.

అవ. ఇట్లు క్షరాక్షరవిభాగమును జెప్పి దానిఫలమును నిరూపించుచున్నాఁడు:—

క. నే ననుచు నక్షరుం డజ్ఞానముచే క్షరము నెఱుఁగుచందంబున వి
జ్ఞానముచే నప్పురుషుని, నే నని వీక్షింతు వేఱు నిజముగ లేమిన్.

టీ. అక్షరుండు=అక్షరుఁ డని చెప్పఁబడినకూటస్థుఁడు (జీవసాక్షి), అజ్ఞానముచేఁ=నిజము నెఱుంగమిచేత, క్షరముర్=క్షేత్రమును, నేననుచుర్ = "నేను" అనుచు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(అనఁగా: తానే క్షేత్రమని తలంచుచు), ఎఱుఁగుచందంబునన్ = తెలిసికొనుచు న్నట్లు (అనఁగా: నభిమానించుచున్నట్లు), విజ్ఞానముచేన్ = అనుభవపూర్వకమగు పరిశుద్ధజ్ఞానముచే, అప్పురుషునిన్ = ఆకూటస్థుని, వేఱు = భేదము (నాకును కూటస్థు నకును భేదము), నిజముగన్=యథార్థముగా, లేమిన్=లేకపోవుటచే, నేనని వీక్షింతున్ = "నేనే" యని తెలిసికొనుచుందును.

తా. లోకమునఁ బ్రతిపురుషుఁడును శరీరమునే యస్మచ్ఛబ్దార్థమునుగా భావించు చున్నాఁ డనుట ప్రత్యక్షసిద్ధము. పురుషుఁ డనఁగా పైఁజెప్పఁబడిన యక్షరపురు షుఁడే కాని యన్యుఁడు కాఁ డనుటయుఁ శరీరము క్షర మనుటయుఁ స్పష్టమైన విష యమే కదా! కావున "అక్షరుఁడు క్షరము నాత్మఁగా భావించుచున్నాఁడు" అని చెప్పవలయును. ఇట్లు భావించుట భ్రాంతి (అజ్ఞానము) అనుటలో సంశయము లేదు. యథార్థస్థితిలోఁ దాను నాశరహితుఁ డై యుండి సాక్షియై యుండి తనకు దృశ్యమై నాశముకలదై యున్నపదార్థాంతరము నాత్మఁగాఁ దలంచుట భ్రాంతి కాక మఱి యేమగును? ఈవిధముగా నజ్ఞానమువలన నక్షరుఁడగు జీవుఁడు క్షరమగు శరీరము నెట్లాత్మఁగా భావించుచున్నాఁడో అట్లే నేనును (క్షరాక్షరసాక్షియగు బ్రహ్మంబును) ఆయక్షరపురుషుని విజ్ఞానదృష్టిచే నాత్మఁగా భావించుచున్నాను; వాస్తవస్థితిలో నాకు నాతనికిని భేదము కలుగదు కదా! నేనును జ్ఞానరూపుఁడను, క్షరసాక్షియగుటచే నాతఁడును జ్ఞానరూపుఁడు. జ్ఞానములు రెండు లేవనియు వానికిఁ బరస్పరభేదము సంభవింప దనియు నిదివఱకే నిరూపించియున్నాను. ఇచ్చట నొక యపూర్వవిషయ మును గ్రహింపవలయును. మనసు జడమగుటచేతను నాచేఁ బ్రకాశింపఁజేయఁబడునది యగుటచేతను జీవబ్రహ్మైక్యమును గ్రహింపఁజాలదు. కావున దానిని గ్రహించువాఁ డును నేనే. మనోవృత్తి యంతర్ముఖముగాఁ బ్రవర్తించి దానిని (జీవబ్రహ్మైక్యమును) గ్రహించినట్లు తోఁచినను అది (అగ్రహించుట) వృత్త్యవచ్ఛిన్నచైతన్యముచేతనే చేయఁ బడుచున్నది. కావున నాకంటె నన్యమైన దిం దేదియుఁ లేదు కదా! కావున "గ్రహిం చుట" యను కార్యమంతయుఁ నాదియే కాని మఱియొకనిది యెన్నటికినిఁ గాఁ జాలదు.

అవ. తనకును అక్షరపురుషునకును భేదము లేదనువిషయమును అనుభవపూర్వక ముగా నిరూపించుచున్నాఁడు:—

తే. పరుఁడ నగునాకు నక్షరపురుషునకును
భేద మేమియు లేదు కన్నెట్టి చూడఁ
గలదె వేఱెంచు కయిన లోకమున ముఖ్య
బింబమునకును దత్ప్రతిబింబమునకు. 103

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. పరుఁడనఁగు నాకున్ = క్షరాక్షరపురుషులకంటె వేఱగుటచేత పరమాత్ముఁడని చెప్పఁబడు నాకును, అక్షరపురుషునకున్ = అక్షరుఁడని చెప్పఁబడియున్న కూటస్థునకును, కన్పెట్టిచూడన్ = విచారించి చూచినచో, భేదము, ఏమియులేదు = కొంచెమైనను లేదు. (అనఁగా కూటస్థుఁడును నేనును ఒక్కటియే యనుట.) లోకమునన్ = జగత్తునందు, ముఖ్యబింబమునకున్ = ముఖ్యమైనబింబమునకును (ఏవస్తువు ప్రతిబింబించునో ఆముఖ్యవస్తువు బింబ మనఁబడును. దర్పణాదులయందుఁ దోఁచురూపము ప్రతిబింబ మనఁబడును), తత్ప్రతిబింబమునకున్ = ఆవస్తువుయొక్క ప్రతిబింబమునకును, వేఱు = భేదము, ఇంతైనఁగలదే=కొంచెమైన నున్నదా! (లేదనుట.)

తా. ఎట్లు చూచినను ఆయక్షరపురుషునకును నాకును (బ్రహ్మమునకును) భేదము కలుగదు. ఎట్లనిన, ఆయక్షరుఁడు నాప్రతిబింబమని చెప్పియున్నాను; బింబప్రతిబింబములకు భేదము లేదనుటయు ననుభవసిద్ధ మగుటచే నిర్వివాదాంశము. కావున మాకిరువురకు భేద మెప్పటికిని లేదు.

తే. ఘటము వోలిసినఁ దద్ఘటాకాశ మాక
సమునఁ జెందినకరణి విజ్ఞానదృష్టి
క్షరము నెడఁబాసి నిర్మలాక్షరుఁడు నన్ను
బొంది క్రమ్మఱఁ బొరయండు పూర్వసంజ్ఞ. 104

టీ. ఘటము వోలిసినన్ = ఘటము నశించినప్పుడు, తద్ఘటాకాశము = ఆఘటమునందున్నయాకాశము, ఆకసమునన్=మహాకాశమునందు, చెందినకరణిన్ = చేరినట్లు, విజ్ఞానదృష్టిన్ = జ్ఞానదృష్టిచేత, క్షరమున్=క్షర మని చెప్పఁబడినదేహాదులను, ఎడఁబాసి=విడిచి(అనఁగా: దేహాదుల నభిమానించుట మాని), నిర్మలాక్షరుఁడు = పరిశుద్ధుఁడైనకూటస్థుఁడు, నన్నున్ = పరమాత్మరూపుఁడనైననన్ను, పొంది, క్రమ్మఱన్ = మరల, పూర్వసంజ్ఞన్ = మునుపటియక్షరనామమును, పొరయఁడు = చెందఁడు [పరమాత్మయే యగును కాని జీవాదినామములచే వ్యవహారయోగ్యుఁడు కానేరఁడు. అజ్ఞాన మనాదియే యైనను జ్ఞానముచే నశించును. నశించినపిదప మఱియొకమాఱు పుట్టుననుట యసంభవము. ఏపదార్థవిషయ మెట్లున్నను అజ్ఞానముమాత్ర మొకమాఱు నశించిన రెండవమాఱు పుట్టునది కాదు. ఒకవిషయ మెన్నిదినములనుండి తెలియకుండినను ఒకమాఱు హితబోధ మొదలగువానివలన దెలిసెనేని మరల నెప్పటికి (అవిషయము) తెలియకుండునది కానేరదు కదా. మఱపనఁగా జ్ఞప్తిలేకపోవుటయే కాని తెలియకపోవుట కాదు. కావున జ్ఞానమువలన బ్రహ్మైక్యము కలిగినపిదప మరల నజ్ఞానము జనింపదు. అజ్ఞానకార్యములగు జీవాదినామము ... ]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. కావున జ్ఞానదృష్టిచే నాయక్షరపురుషుఁడు క్షరమును విడచి తనకు బింబభూతుఁ డగునన్నే యాత్మగాఁ దెలిసికొనవలయును. ఇట్లు తెలిసికొనెనేని ఘటము నశించినప్పుడు ఘటాకాశము మహాకాశమునఁ గలసినవిధమున నద్దమును తీసివేసిన నందలి ముఖప్రతిబింబము బింబభూత మగుముఖమునఁ గలసినవిధంబున నాయక్షరుఁడు నన్నుఁ జెందును. అజ్ఞాన మొక్కమాఱు నశించిన రెండవమాఱు పుట్టునది కాకపోవుటచే నాయక్షరునకు నాత్మబ్రహ్మైక్యజ్ఞానము కలిగినపిదప జీవత్వాదు (జీవాదివ్యవహారము) లెన్నటికిని గలుగవు.

వ. ఇట్లు పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులును మనోబుద్ధ్యహంకారములును వీనికిఁ గారణంబైనయవ్యక్తంబును శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణవాక్పాణిపాదపాయూపస్థ లనుదశేంద్రియములును శబ్దస్పర్శరూపరసగంధంబు లనుపంచవిషయంబులుంగూడి యిరువదినాలుగుతత్త్వంబులగుఁగొందఱు వాగాదికర్మేంద్రియపంచకంబును శ్రోత్రాదిజ్ఞానేంద్రియపంచకంబును శబ్దాదివిషయపంచకంబును బ్రాణాదివాయుపంచకంబును మానసాద్యంతఃకరణచతుష్టయంబును గూడియిరువదినాలుగుతత్త్వంబులని చెప్పుదు రీచతుర్వింశతితత్త్వంబులను శరీరత్రయంబనియుఁ బంచకోశంబులనియుఁ బండితులు గణింతు రిది మదీయాపరాకృతి. యిది క్షేత్రంబు క్షరంబు ప్రకృతి యనాత్మదృశ్యం బసత్తు జడంబు దుఃఖాత్మకంబు సంసారం బన నొప్పు దప్తాయఃపిండంబుతోఁ గూడి ప్రకాశించుకృశానునిచందంబున మిథ్యాతాదాత్మ్యాధ్యాసంబుచేతదీనితో నెనసి ప్రవర్తించుమదంశభూతుండై నజీవుండుపంచవింశకుం డితం డస్మదీయపరాప్రకృతి క్షేత్రజ్ఞుండక్షరుఁడుపురుషుం డాత్ముఁడు ద్రష్ట సద్రూపకుఁడు చేతనుం డానందమయుండు సంసారియనం దేజరిల్లుచుండు నది యెట్లనినఁ బూర్వోక్తతత్త్వంబులలోఁ బ్రథానావయవంబు సర్వకార్యకారణాశ్రయంబు సకలవాసనామయంబనాద్యనిర్వచనీయాజ్ఞానకల్పితంబు నైనబుద్ధ్యహంకారాత్మకాంతఃకరణవృత్తివిశేషంబునందు జలఘటంబునం దాదిత్యప్రతిబింబంబును దర్పణంబునందు ముఖాభాసంబుం దోఁచినవిధంబున నస్మచ్ఛాయ ప్రతిఫలించి తదుపాధికుండై కరణభోజ్యజ్ఞానప్రమాణశబ్దవాచ్యంబైనస్థూలగోళకోపహితజ్ఞానకర్మేంద్రియ ప్రాణపంచకసమన్వితమనశ్చిత్తాత్మకాంతఃకరణవృత్తివిశేష సాధనంబుచేతఁ గార్యభోగజ్ఞేయ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రమేయశబ్దవాచ్యంబు లైనశబ్దాదివిషయంబుల ననుభవించుచుఁ గర్తయు భోక్తయు జ్ఞాతయుఁ బ్రమాతయు శ్రోతయు స్ప్రష్టయు ద్రష్టయు రసయితయు ఘ్రాతయు వక్తయు దాతయు గంతయు విసర్జయితయు నానందయితయు బ్రాణియుమంతయు దేహియు జీవుఁడు ననం బ్రసిద్ధుండై సమధికశరీరజాగ్రదవస్థాభిమాని యై విశ్వుండన సూక్ష్మదేహ స్వప్నావస్థాభిమాని యై తైజసుం డనఁ గారణాంగసుషుప్త్యవస్థాభిమాని యై ప్రాజ్ఞుఁ డన విలసిల్లి నిఖిలవాసనాసమేతుండై యయస్కాంతసాన్నిధ్యంబువలన నయస్సు చలించెడు తెఱంగున సూర్యాలోకంబు నాశ్రయించి స్వస్వవ్యాపారంబులం బ్రవర్తించుజనంబుభంగి సర్వాధిష్ఠానభూతుండుఁ బ్రధానపురుషేశ్వరుండుఁ బురాణపురుషోత్తమాఖ్యుండుఁ దనకు ముఖ్యబింబభూతుండు షడ్వింశకుండుఁ బరుండుఁ బరమాత్ముఁడు నైననాసన్నిధానంబు వలన నస్మదీయతేజంబు సంశ్రయించియు నన్నెఱుంగక తన్ను నామరూపాత్మకునింగాఁ దలంచి సంసృతిచక్రంబునం బరిభ్రమించుచుండు నిట్లనాద్యనంతకాలంబుఁ బ్రవర్తించుచుండి యెట్టకేలకు ననేకజన్మార్జితపుణ్యపుంజపరిపాకవిశేషంబువలన మదనుగ్రహంబువలనఁ బరిశుద్ధహృదయుండు సాధనచతుష్టయసంపద్విశిష్టుండు నై సద్గురుచరణంబు శరణంబు నొంది తత్ప్రసాదలబ్ధాత్మానాత్మవివేకజ్ఞానసహితుండై యక్షరుండు గాయాద్యహంకృత్యంతం బైనక్షరం బంతయుఁ దానుగా నని నిరాకరించి కలశజలనాశానంతరంబున నుపసూర్యకంబు మార్తాండునిం జెందినకైవడి ముకురవియోగంబగుచుండ వదనాభాసంబు ప్రధానాననంబునఁ గలసినరీతి మఠఘటకుడ్యకుసూలస్తంభపటాద్యఖిలమూర్తద్రవ్యంబుల వేర్వేఱ విభజించిన నశేషవస్తునిషేధావధిభూతంబున మూర్తంబు నగుతదవచ్ఛిన్నాకాశంబు మహాకాశంబైనపగిదిఁ దనుత్రయవిలక్షణుండు నవస్థాత్రయసాక్షీయుఁ బంచకోశవ్యతిరిక్తుండు నై యఖండాద్వితీయ సచ్చిదానందస్వరూపపరిపూర్ణపరబ్రహ్మతత్త్వమాత్రుం డగుక్షరాక్షరాతీత పురుషోత్తమతత్త్వంబేనని చెప్పి మఱియు నిట్లనియె. 105

టీ. ఇట్లు = ఈవిధముగా, పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులును = భూమి మొదలైన పంచభూతములును, మనోబుద్ధ్యహంకారంబులును = మనస్సు ... సంకల్పాత్మకమైన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మనంబును, బుద్ధి = నిశ్చయాత్మక మైనబుద్ధియును, అహంకారంబులును = గర్వరూప మైన అహంకారంబును, వీనికిఁ = ఈమనోబుద్ధ్యహంకారములకు, కారణంబైన, అవ్య క్తంబు = మాయయును (లేక మలినసత్త్వప్రధానయును), శ్రోత్ర...స్థలు-శ్రోత్ర= చెవియును, త్వక్=త్వగింద్రియంబును, చక్షుః=నేత్రంబులును, జిహ్వ=నాలుకయును, ఘ్రాణము=నాసికయును (ఇవియైదును జ్ఞానేంద్రియములు), వాక్=వాగింద్రియంబును, పాణి=హస్తములును, పాదము=పాదములును, పాయు=గుదంబును, ఉపస్థ=గుహ్యంబును (ఇవి యైదును కర్మేంద్రియములు), అనుదశేంద్రియంబులు = అనుపదియింద్రియంబు లును, శబ్ద...బులు-శబ్ద=శబ్దంబును, స్పర్శ=శీతోష్ణాది భేదములు గలస్పర్శమును, రూప= తెలుపు మొదలగు భేదములు గలరూపంబును, రస=ఆఱువిధములగురుచులును, గంధంబులు =వాసనలును (ఇవి యైదును విషయములు), అను పంచవిషయంబులుగూడి=ఈ చెప్పఁబడిన విషయములతోఁ గూడ నన్నియును గలసి, ఇరువదినాలుగుతత్త్వంబులగుఁ, కొందఱు, వాగాదికర్మేంద్రియపంచకంబును=వాక్కు మొదలగుకర్మేంద్రియము లైదును, శ్రోత్రాది జ్ఞానేంద్రియపంచకంబును=చెవి మొదలగుజ్ఞానేంద్రియము లైదును, శబ్దాదివిషయపంచ కంబును=శబ్దము మొదలగువిషయము లైదును, ప్రాణాదివాయుపంచకంబును = ప్రాణము మొదలగువాయువు లైదును, మానసాద్యంతఃకరణచతుష్టయంబునుగూడి=మనసు మొదలగు నంతఃకరణములు నాల్గును గూడి, ఇరువదినాలుగు తత్త్వంబులని చెప్పుదురు. ఈచతు ర్వింశతి తత్త్వంబులఁ = ఈ యిరువదినాలుగుతత్త్వంబులను, శరీరత్రయంబనియుఁ= స్థూలసూక్ష్మకారణ శరీరములనియు, పంచకోశంబులనియుఁ=అన్నమయము మొదలగు పంచకోశములనియు, పండితులుగణింతురు=జ్ఞానులగువారు చెప్పుచున్నారు. ఇది = ఈ చెప్పఁబడినది, మదీయాపరాప్రకృతి = నాసంబంధమైన పరాప్రకృతి, ఇది=ఈ చెప్పఁ బడిన పరాప్రకృతి, క్షేత్రంబును=క్షేత్రమనియును, క్షరంబును=నశించునదిగావున క్షరం బనియును, ప్రకృతి = ప్రపంచమున కుపాదానకారణము కావున ప్రకృతియనియును, అనాత్మ=ఆత్మకంటె వేఱు కావున ననాత్మయనియును, దృశ్యంబు=ద్రష్టచేఁ జూడఁబడు నది కావున దృశ్యమనియును, అసత్తు=జ్ఞానముచే నశించునది కావున శూన్యమనియును, జడంబు=స్వయముగాఁ బ్రకాశింపలేదు కావున జడమనియును, దుఃఖాత్మకంబు=దుఃఖ మయమైనదనియును, సంసారంబు=జీవునిఁద్రిప్పునది కావున సంసారమనియును, అనఁ= అని యీపేర్లతో, ఒప్పుఁ = వ్యవహరింపఁబడుచున్నది. తప్తాయః పిండంబులోఁ = కాలిన యినుపముద్దతో, కూడి = సంబంధపడి, ప్రకాశించు కృశానుని చందంబునఁ = ప్రకాశించునట్టి యగ్నివలె, మిథ్యా...చేతఁ-మిథ్యా = అసత్యమైన (లేక ఉన్నట్లు తోఁచునట్టి), తాదాత్మ్యధ్యానంబుచేతఁ=అదియే నేను అనెడుతలంపుతో, దీనితోఁ= ఈ పరాప్రకృతితో, ఎనసి = కలసి, ప్రవ...వుండు-ప్రవర్తించు = సంచరించుచున్న,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మత్ = నాయొక్క (బ్రహ్మముయొక్క), అంశ = భాగముచేత, భూతుండైన = పుట్టిన (లేక భాగమైన), జీవుఁడు... పంచవింశకుండు = ఇరువదియైదవతత్త్వము, ఇతండు = ఈజీవుఁడు, అస్మ... ప్రకృతి-అస్మదీయ = నాసంబంధమైన, పరాప్రకృతి = పరాప్రకృతియగును. (పరాప్రకృతి యనఁగా నుత్తమమైన ప్రకృతి). క్షేత్రజ్ఞుండు = క్షేత్రమును తెలిసికొను వాఁడు కావున క్షేత్రజ్ఞుఁడు, అక్షరుండు = నశింపఁడు కావున నక్షరుఁడు, పురుషుఁడు = శరీరములయందు వ్యాపించియున్నాఁడు కావున పురుషుఁడు, ఆత్ముండు = సర్వమును ధరించుచున్నాఁడు కావున నాత్ముఁడు, ద్రష్ట = సర్వమును జూచువాఁడు, సద్రూపకుఁడు = బ్రహ్మాంశమగుటచే నాశరహితుఁడు, చేతనుండు = జ్ఞానరూపుఁడు, ఆనందమయుండు = ఆనందరూపుఁడు, సంసారి = సంసారముకలవాఁడు (అవిద్యకు లోఁబడినవాఁడు కావున సంసారి), అనన్ = అను పేర్లతో, తేజరిల్లుచుండున్ = ప్రకాశించుచుండు, అదియెట్లనినన్ = అది యేలాగనిన, పూర్వోక్తతత్త్వంబులలోన్ = ఇదివఱకు చెప్పఁబడియున్న తత్త్వంబులలో, ప్రధానావయవంబును = ముఖ్యమైనదియు, సర్వ...బును-సర్వ = సమస్తమైన, కార్య = కార్యములకును, కారణ = కారణములకును, ఆశ్రయంబును = ఆధారమైనదియును, సకల వాసనామయంబును = అనేకవిధములగు కర్మవాసనలతోఁ గూడినదియు, అనా...నైన-అనాది = మొదలులేనట్టియు, అనిర్వచనీయ = ఇట్టిదని చెప్పరానట్టియు, అజ్ఞాన = అజ్ఞానముచేత (మాయచేత), కల్పితంబులైన = ఏర్పఱుపఁబడినట్టియు, బుద్ధ్య...నందు-బుద్ధి = నిశ్చయంబును, అహంకార = అభిమానంబును, ఆత్మక = స్వరూపముగాఁగలిగినట్టియు, అంతఃకరణ = అంతఃకరణముయొక్క, వృత్తివిశేషంబునందున్ = నిర్మలవృత్తియందు, జలఘటంబునందున్ = నీటికుండయందు, ఆదిత్యప్రతిబింబంబును = సూర్యునియొక్క ప్రతిబింబంబును, దర్పణంబునందున్ = అద్దమునందు, ముఖాభాసంబును = ముఖముయొక్క ప్రతిబింబంబును, తోఁచినవిధంబునన్ = కనఁబడునట్లు, అస్మచ్ఛాయ ప్రతిఫలించిన = నాచ్ఛాయ ప్రతిఫలింపఁగా, తదుపాధికుండై = ఆయంతఃకరణవృత్తియే యుపాధిగాఁగలవాఁడై, కరణ...బైన-కరణ = సాధనమనెడు, భోజ్య = అనుభవింపఁజేయు పదార్థమనెడు, జ్ఞాన = జ్ఞానమనెడు (జ్ఞానమనఁగాఁ దెలిసికొనుసాధనము), ప్రమాణ = ప్రత్యక్షాది ప్రమాణములనెడు, శబ్ద = శబ్దములతో, వాచ్యంబైన = చెప్పఁదగినట్టియు, స్థూల...చేతన్-స్థూల = బాగుగఁ గానవచ్చుచున్న, గోళక = కన్నులు చెవులు మొదలగు నింద్రియస్థానంబులయందు, ఉపహిత = నిలచియున్న, జ్ఞానకర్మేంద్రియ = జ్ఞానేంద్రియకర్మేంద్రియములయొక్క, ప్రాణపంచక = ప్రాణములయొక్క పంచకముతో, సమన్విత = కూడినట్టియు, మనః = సంకల్పముతో, చిత్త = సంశయము (ఈవృత్తులుగల యంతఃకరణావస్థలకుఁ గ్రమంబుగ మనస్సనియుఁ జిత్తమనియుఁ బేర్లు. ఇచ్చట నుత్తర సందర్భమననుసరించి మనశ్చిత్తపదములకు సంకల్పసంశయములనియే చెప్పియున్నాము.),

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆత్మక = స్వరూపముగాఁగల, అంతఃకరణవృత్తి = అంతఃకరణవృత్తులనెడు, విశేషసాధనంబులచేతన్ = ప్రత్యేకసాధనములతో (జ్ఞానేంద్రియములు విషయముల గ్రహించు సామర్థ్యముగలిగియున్నను శబ్దాదిరూపములతో వెలికివచ్చు చిత్తవృత్తిసహాయములేక స్వయముగ నవ్విషయముల గ్రహింపఁజాలవు కావున విషయగ్రహణమునం దింద్రియములు సామాన్యసాధనములు; చిత్తవృత్తులు విశేషసాధనములు అని తెలిసికొనవలయును.), కార్య=కార్యములనెడు (కార్యమనఁగా నొకదానివలనఁ బుట్టునది), భోగ = సుఖము (లేక అనుభవింపఁదగినది) అనెడు, జ్ఞేయ = తెలియఁబడఁదగినదియనెడు, ప్రమేయ = ప్రమాణములచే నిర్ణయింపఁదగినది యనెడు, శబ్దవాచ్యంబులైన = శబ్దములతోఁ జెప్పఁబడుచున్న, శబ్దాదివిషయంబులన్ = శబ్దము మొదలగు విషయముల నైదింటిని, అనుభవించుచున్, కర్తయున్ = చేయువాఁడు, భోక్తయున్ = అనుభవించువాఁడు, జ్ఞాతయున్ = తెలిసికొనువాఁడు, ప్రమాతయున్ = ప్రమాణములచే గ్రహించువాఁడు, శ్రోతయున్=వినువాఁడు, స్ప్రష్టయున్=తాఁకువాఁడు, ద్రష్టయున్=చూచువాఁడు, రసయితయున్=రుచిఁజూచువాఁడు, ఘ్రాతయున్, మూర్కొనువాఁడు, వక్తయున్=చెప్పువాఁడు, దాతయున్=ఇచ్చువాఁడు, గంతయున్=పోవువాఁడు, విసర్జయితయున్=మలాదులను విసర్జించువాఁడు, ఆనందయితయున్=ఆనందించువాఁడు, ప్రాణియున్ = ప్రాణముగలవాఁడు, మంతయున్ = తలంచువాఁడు (లేక సంకల్పించువాఁడు), దేహియున్=దేహముకలవాఁడు, జీవుఁడును=జీవుఁడు (అనఁగా: ప్రాణములను బోషించువాఁడు), అనన్=అను పేర్లతో, ప్రసిద్ధుండై = ప్రసిద్ధిచెంది (లేక సర్వజనులకును స్పష్టముగఁ దెలియుచు), సమ...నియై-సమధికశరీర=స్థూలశరీరమునందును, జాగ్రదవస్థా = జాగ్రదవస్థయందును, అభిమానియై = అభిమానము కలవాఁడై, విశ్వుండనన్=విశ్వుఁడనియుం, సూక్ష్మ...నియై-సూక్ష్మదేహ=సూక్ష్మశరీరమునందును, స్వప్నావస్థా=స్వప్నావస్థయందును, అభిమానియై=అభిమానము గలవాఁడై, తైజసుఁడనన్=తైజసుఁ డనియును, కార...నియై-కారణాంగ=కారణశరీరమునందును, సుషుప్త్యవస్థా = సుషుప్త్యవస్థయందును, అభిమానియై="నేను" అనునభిమానము గలవాఁడై, ప్రాజ్ఞుండనన్=ప్రాజ్ఞుఁడనియు, విలసిల్లి=ప్రకాశించి, నిఖిలవాసనాసమేతుండై = సకలవిధములగుకర్మవాసనలతోఁగూడి, అయస్కాంతసాన్నిధ్యంబువలనన్ = అయస్కాంతరత్నము సమీపమునందుండుట వలన, అయస్సుచలించెడు తెఱంగునన్=ఇనుముకదలునట్లు, సూర్యలోకంబు నాశ్రయించి = సూర్యనికాంతి నాధారముగాఁజేసికొని, స్వస్వవ్యాపారంబులన్ = తమతమపనుల యందు, ప్రవర్తించుజనంబుభంగిన్ = ప్రవర్తించు మనుష్యులవలె, సర్వాధిష్ఠానభూతుండును = సమస్తప్రపంచములకును ఆధారమైనవాఁడును, ప్రధానపురుషేశ్వరుండును - ప్రధాన=మాయకును, పురుష = జీవునకును, ఈశ్వరుండును = ప్రభువైనవాఁడును (లేక


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నియామకుఁడైనవాఁడును), పురాణ...డును-పురాణపురుష = క్షరాక్షరు లనెడుననాది పురుషులకంటె (లేక అనాదిపురుషుఁడను), ఉత్తమాఖ్యుండును = శ్రేష్ఠుఁడని ప్రసిద్ధికలవాఁడును (లేక శ్రేష్ఠమగు పేరుకలవాఁడును), తనకున్ = తనకు (జీవునకు), ముఖ్య బింబభూతుండును=ముఖ్యమగు బింబమైనవాఁడును (ఏది ప్రతిబింబించునో అది బింబమనఁబడును. అద్దమునందు ముఖమును జూచుకొనునప్పుడు మనముఖము బింబము, అద్దములోఁ గానవచ్చుముఖము ప్రతిబింబము.), షడ్వింశకుండును=ఇరువదియాఱవతత్త్వమైనవాఁడును, పరుండును = సర్వప్రపంచవిలక్షణుఁడును, పరమాత్ముండును, ఐన నాసన్నిధానంబువలన = పరమాత్మస్వరూపుఁడనైన నేను సమీపమునందుండుటవలన, అస్మదీయ తేజంబున్=నాసంబంధమైన తేజస్సును, సంశ్రయించియున్ = ఆశ్రయించి యుండియును, నన్నెఱుఁగక = నా (శ్రీరామునియొక్క, అనఁగా పరబ్రహ్మయొక్క) యథార్థస్వరూపమును దెలిసికొనక, తన్నున్ = తనను (జీవుని), నామరూపాత్మకునింగాన్ = నామరూపమయమగు ప్రపంచమే స్వరూపముగాఁ గలవానినిగా, తలంచి, సంసృతిచక్రంబునన్ =సంసారచక్రమునందు, పరిభ్రమించుచుండున్=తిరుగుచుండును. ఇట్లనాద్యంతకాలంబు ప్రవర్తించుచుండి = ఈవిధముగా నపరిమితకాలము నుండియు సంచరించుచుండి, ఎట్టకేలకున్=ఎట్లో యొకట్లు, అనేక...వలనన్-అనేక జన్మ=బహుజన్మలయందు, ఆర్జిత=సంపాదింపఁబడిన, పుణ్యపుంజ = పుణ్యసమూహముయొక్క, పరిపాక=ఫలముయొక్క, విశేషంబువలనన్=ఆధిక్యమువలనను, మదనుగ్రహంబులవలనన్ =నాయొక్క (పరబ్రహ్మముయొక్క) కృపవలనను, (భగవత్కృప యనఁగా వేదాంతవాక్యశ్రవణాదులయందుఁ బూర్వజన్మ కర్మలసహాయమువలనఁ గలుగుశ్రద్ధ. సద్గురుదర్శనమువలనఁ గలుగు నొకానొకమార్పు. ఈవిషయమున "ప్రసాదో నామ రుద్రస్య కర్మసామ్యేన దేహినాం, దేశకాలాలోకనాజ్జాతో విశిష్టాతిశయః సురాః." అని సూతసంహిత.) పరిశుద్ధహృదయుండును = నిర్మలచిత్తముకలవాఁడును, సాధన...డునై-సాధనచతుష్టయ = నిత్యానిత్యవస్తువివేకము (బ్రహ్మనిత్యము ప్రపంచ మనిత్యము అని తెలిసికొనుట), వైరాగ్యము=శమాదిషట్కసంపత్తి (బాహ్యేంద్రియములను అంతఃకరణమును జయించి చిత్తశాంతినొందుట, శీతోష్ణాదులను సహించుట, వేదాంతవాక్యములయందు శ్రద్ధ నమ్మకము అనునివి శమాదులు), మోక్షేచ్ఛ అను నీనాలుగు సాధనములయొక్కయు, సంపత్ = సమృద్ధితో, విశిష్టుండునై=కూడియున్నవాఁడు నగుచు, సద్గురు=సద్గురువుయొక్క, చరణంబు=పాదంబును, శరణంబునొంది=రక్షణంబుగా నాశ్రయించి, తత్ప్ర...తుండై-తత్ = ఆచార్యులయొక్క, ప్రసాద = అనుగ్రహముచేత, లబ్ధ=పొందఁబడిన, ఆత్మ=బ్రహ్మవిషయమైనట్టియు, అనాత్మ=ప్రపంచవిషయమైనట్టియు వివేక=వివేచనతో, కూడిన, జ్ఞాన...అపరోక్ష (నేనే బ్రహ్మమనెడు) జ్ఞానముతో, సహి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తుండై=కూడినవాఁడై, అక్షరుండు = జీవుఁడు, కాయాద్యహంకృత్యంతం బైన=మాయ మొదలు అహంకారము వఱకుఁగల, క్షరంబంతయుఁన్ = క్షేత్ర మంతయును, తాను గానని=నేను గానని, నిరాకరించి=జ్ఞానముచేఁ ద్రోఁచివేసి, కలశజలనాశానంతరంబునన్ =కుండయు నీరును నశించినపిదప, ఉపసూర్యకంబు = సూర్యప్రతిబింబము, మార్తాండు నిం జెందినకైవడిన్ = సూర్యునిలో నైక్యమైనవిధమున, ముకురవియోగంబగుచున్=అద్దమునుదీసివేసినప్పుడు,వదనాభాసంబు=ముఖముయొక్క ప్రతిబింబము,ప్రధానాననంబునన్ =ముఖ్య మగు (బింబ మైన) ముఖమును, కలసినరీతిన్=చేరినట్లు, మఠ...బులన్-మఠ =గృహము, ఘట=కుండ, కుడ్య = గోడ, కుసూల=బొట్ట, స్తంభ=స్తంభము, పట=గుడ్డ, ఆది=మొదలైన, అఖిల=సమస్తమైన, మూర్త=ఆకారముగల, ద్రవ్యంబులన్=పదార్థములను, వేర్వేఱవిభజించినన్ = ప్రత్యేకముగాఁ జేసినయెడల, అశేష...బును-అశేషవస్తు =సమస్తపదార్థములను, నిషేధ=నిషేధింపఁగా, అవధీభూతంబును=శేషించినదియు, అమూర్తంబునగు=ఆకారము లేనిదియు నైన,తదవచ్ఛిన్నాకాశంబు=అగృహాదులయందలి యాకాశము, మహాకాశంబై నపగిదిన్=మహాభూతముగానున్న యాకాశమే యైనట్లు, తనుత్రయ విలక్షణుండును = స్థూలము మొదలగు మూఁడుశరీరములకు వేఱయినవాఁడును, అవస్థాత్రయసాక్షియున్=జాగ్రత్త మొదలగు మూఁడవస్థలకును ద్రష్టయైనవాఁడును, పంచకోశవ్యతిరిక్తుండునై = అన్నమయము మొదలగుకోశము లైదింటికంటె వేఱయిన వాఁడు నగుచు, అఖం...డగున్-అఖండ=భేదములు లేనట్టియు, అద్వితీయ=తనకంటె నితర మగుపదార్థము లేనట్టియు, సచ్చిదానందస్వరూప = సత్యజ్ఞానానందస్వరూపుఁడై నట్టియు, పరిపూర్ణ=సర్వవ్యాపకుఁ డైనట్టియు, పర=లోకాతీతుఁ డైనట్టియు, బ్రహ్మతత్త్వమాత్రుండగున్=బ్రహ్మరూపుఁడే యగును, అట్టి... త్త్వంబు-అట్టి=జీవుఁ డేరూపమును జెందునో అటువంటి, క్షర=ప్రకృతికంటెను, అక్షర = జీవునికంటెను, అతీత=వేఱయిన, పురుషోత్తమతత్త్వంబు = పురుషోత్తముఁ డని చెప్పఁబడుస్వరూపము. ఏననిచెప్పి= నేనే సుమా అని చెప్పి, మఱియుఁ, నిట్లనియెన్.

తా. లోకమున దేహాదు లన్నియు నిరువదినాల్గుతత్త్వములతోఁ గూడియున్నవి యనుట ప్రత్యక్షము. భూతములైదును, అంతఃకరణములు నాల్గును, జ్ఞానేంద్రియకర్మేంద్రియములు కలసి యింద్రియములు పదియును, శబ్దాదివిషయము లైదును గలసి యిరువదినాలుగుతత్త్వంబు లగుచున్నవి. మఱికొందఱు పదియింద్రియములును వాయువు లైదును, మనోబుద్ధిచిత్తాహంకారములు నాల్గును గలసి యిరువది నాల్గుతత్త్వము లను చున్నారు. ఎవ్వ రెట్లు చెప్పినను జ్ఞానవంతు లగువా రీయిరువదినాల్గు తత్త్వములనే స్థూలసూక్ష్మకారణశరీరము లనియు అన్నమయాదిపంచకోశము లనియుఁ జెప్పుచున్నారు. ఇదియే నాయపరాప్రకృతి లోకమునఁ బ్రకృతియనియు క్షేత్రమనియు క్షరమనియు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ననాత్మయనియు జడమనియు దృశ్యమనియు సంసార మనియు అసత్తనియు దుఃఖరూప మనియు దీనినే పేర్కొనుచున్నారు.

అగ్ని కాలినయినుపముద్దయం దుండుటవలన "ఇనుము కాలుచున్నది. దానిపై చేతినుంచిన కాల్చును" అను మొదలగు వ్యవహారములు కలుగుచున్నవి. ఈవ్యవహారము తాదాత్మ్యమువలన (అనఁగా నినుపముద్దయే యగ్నియని తలంచుట వలనఁ)గలుగుచున్నది. అట్లుగాకున్న ఇనుమునకు మండు సామర్థ్యము కాని ఇతరపదార్థములఁ గాల్చుసామర్థ్యము కాని స్వయముగఁ గలదా! లేదు. కావున నీతాదాత్మ్యము (అభేదము) అసత్యమనుటలో సంశయము లేదు. కాని యీ యసత్యతాదాత్మ్యమువలననే లోకవ్యవహారము ప్రవర్తించుచున్నది. ఇట్లె పైన నిరూపింపఁబడిన క్షేత్రములకును నాకుఁ బ్రతిబింబమైన క్షేత్రజ్ఞులకును (ఈతఁడే జీవుఁడు) వాస్తవమగుసంబంధములేదు. ఆతఁడు నిర్వికారుఁడగుటచే నెప్పటికిని కూటస్థుఁడే అయినను తాదాత్మ్యమువలన క్షేత్రక్షేత్రజ్ఞులొక్కటియే యని తలంపఁబడుచున్నాఁడు. తలంపఁబడుచున్నాఁడనుట యేల! తానే తలంచుచున్నాఁడు తనకంటె నితరుఁడగుచేతనుఁడు బొత్తిగనే లేఁడు కదా! ఇట్టిమిథ్యాతాదాత్మ్యము కల నాప్రతిబింబ మిరువదియైదవతత్త్వము. ఈతఁడే నాపరాప్రకృతి. క్షేత్రజ్ఞుఁ డనియు నాత్మ యనియుఁ జేతనుఁడనియు, ద్రష్టయనియు, నానందమయుఁడనియు, నక్షరుఁడనియుఁ, బురుషుఁడనియు, సద్రూపుఁడనియు,సంసారి యనియు నీతఁడే లోకమున వ్యవహరింపఁబడుచున్నాఁడు.

ఈవ్యవహారము కలిగిన తెఱంగు వినుము. అంతఃకరణ మొక్కటియే యనియు వృత్తిభేదమువలన మనోబుద్ధిచిత్తఅహంకారములను పేర్లతో వ్యవహరింపఁబడుచున్న దనియు నిదివఱకే స్పష్టమైయున్నది. ఈయంతఃకరణము క్షేత్రమని నిరూపింపఁబడియున్న యిరువదినాలుగు తత్త్వములలో మిగుల ప్రధానమైన దనుట నిర్వివాదాంశము. కార్యకారణరూప మగుసర్వప్రపంచము సంకల్పాధీనము (మనసుచేతనే కల్పింపఁబడినది) కావునను, లేక వాసనామయము కావునను, లేక జీవసృష్టప్రపంచము కేవలము మనోమయమైనదియే కావునను, దాని (ఈప్రపంచమున) కంతయు మనస్సే (అంతఃకరణమే) యాశ్రయభూతమగును. మఱియు జన్మపరంపరలకుఁ గారణములగుకర్మలు వాసనారూపములై యిందే నిలిచియుండును. కావున నీయంతఃకరణమే ప్రకృతి యనియు, మాయ యనియు, నవిద్య యనియుఁ జెప్ప నొప్పియున్నది. ఇదియు నవిద్యాకల్పితమే యైనను ఇతరములన్నిటికంటె మిగులఁ బ్రభావము కలది. స్థూలాకారమును జెంది యనుభవయోగ్యముగాఁ బరిణమించిన మాయయొక్క స్వరూప మిదియేయని చెప్పవచ్చును. దీనియందున్న నాలుగువృత్తిభేదములలో నిశ్చయరూప మైనవృత్తియు నభిమానరూపమైనవృత్తియుఁ దక్కినవానికంటెఁ బ్రధానములు. నిశ్చయాభిమానములు లేక యే కా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్యము కాని జరుగ దనుట యనుభవసిద్ధమగువిషయ మేకదా. "నే నీ పనిని జేయఁ దలఁచి తిని" అను నిశ్చయంబును "దీనిని చేయువాఁడను నేనే" అనునభిమానంబును లేక యే పురుషుఁడు నేకార్యమునందును బ్రవర్తింపఁడుకదా! కావున నంతఃకరణము నీవృత్తులు రెండును గలబుద్ధ్యహంకారములు ప్రధానములు. విషయానుభవమునందు వీరికి సాధనము లగుటచే సంకల్పసంశయరూపము లగుతక్కినరెండువృత్తులును (అనఁగా: నావృత్తులుగల మనశ్చిత్తములు రెండును) అప్రధానములు. పైన నిరూపింపఁబడినబుద్ధ్యహంకారముల యందు జలఘటమున సర్వప్రకాశకమగుసూర్యబింబము (లేక, సర్వవ్యాపక మగునాకాశము) ప్రతిబింబించినట్లు నేను (బ్రహ్మము) ప్రతిబింబించియున్నాను. ఆప్రతిబింబమున కదియే (బుద్ధ్యహంకారరూపాంతఃకరణమే) యుపాధి యయ్యెను. ఇట్లు సోపాధికుండై యాప్రతిబింబము (జీవుఁడు) పదియింద్రియములతోడను, పంచప్రాణములతోడను గూడి చరించుచున్న మనశ్చిత్తరూపాప్రధానాంతఃకరణము సాధనముగాఁ బైకొని శబ్దాది విషయముల ననుభవించుచున్నాఁడు. ఇంద్రియాదులకు స్థూలగోళకములతో (అనఁగా: పైకిఁ గానవచ్చుచున్నకన్నులు చెవులు మొదలగుచర్మమాంసాదిరూపగోళకములతో) సంబంధముండుటయు మనశ్చిత్తముల కట్టిసంబంధము లేకుండుటయు స్పష్టమే కావున నింద్రియాదులకంటె నంతఃకరణము వేఱని చెప్పవలయును. అయినను దర్శనస్పర్శనాది కాలములయం దామనశ్చిత్తములు ఆయాయింద్రియములతోఁ గలయుచుండును. అట్లు కలసిననేకాని విషయగ్రహణము కలుగదు. స్వాభావికముగా చేతనశక్తి దేనికిని లేదు. కావున బుద్ధ్యహంకారములయందుఁ బ్రతిబింబించిన పరబ్రహ్మచ్ఛాయయే మనశ్చిత్తరూపము లగు మనోవృత్తులతోఁ గలసి ఇంద్రియములతో సంబంధపడకపోయిన నాయింద్రియములకు విషయగ్రహణసామర్థ్యముకలుగదు. విషయములతో (విషయముల యం దున్నచైతన్యముతో) సంబంధపడకున్న (అనఁగా: నింద్రియములద్వారా విషయములతో నేకీభవింపకున్న) నావిషయములును ప్రకాశింపవు. కావున మనశ్చిత్తము లింద్రియములతోఁ గూడి యున్నవనుట నిస్సంశయము. ఏపదార్థంబును చేతనసహాయములేక యేకార్యంబును జేయఁజాలదు. కావున నేనామముతో వ్యవహరించినను ఆయాపదార్థముచే నావరింపఁబడి యున్నచైతన్యము నే వ్యవహరించినట్లని తెలిసికొన వలయును.

ఈమనశ్చిత్తరూపాంతఃకరణవృత్తులకే సాధనము లగుటచేఁ గరణము లనియు విషయముల ననుభవింపఁజేయునవి యగుటచే భోజ్యము లనియు, జ్ఞానసాధనము లగుటచే జ్ఞానములనియు ప్రత్యక్షాదిరూపములచే (విషయముల గ్రహించునవి కావున బ్రమాణము లనియుఁ బేర్లు. (ఇట్లే విషయములకుఁగూడ సాధింపఁబడఁదగినవి (అనఁగా: తెలిసికొనఁ బడఁదగినవి) యగుటచేఁ గార్యము లన్నియు ననుభవింపఁబడునవి యగుటచే భోగము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లనియుఁ దెలిసికొనఁబడఁదగినవి యగుటచే జ్ఞేయములనియు ప్రమాణగమ్యము లైనవి యగుటచేఁ బ్రమేయము లనియుఁ బేర్లు. ఇట్లు ఆజీవుఁడే మనశ్చిత్తములమూలమున సర్వేంద్రియములతో సంబంధపడి సర్వవిషయముల గ్రహించుచున్నాఁడు. కావున కరణకార్యసంబంధముచేఁ గర్తయనియు భోజ్యభోగసంబంధముచే భోక్త (అనుభవించువాఁడు) యనియు జ్ఞానిజ్ఞేయసంబంధముచే జ్ఞాత(తెలిసికొనువాఁడు) యనియుఁ బ్రమాణప్రమేయసంబంధముచేఁ బ్రమాత (ప్రమాణములచే విషయముల నిర్ణయించువాఁడు) యనియు, శ్రోత్రాదిజ్ఞానేంద్రియసంబంధముచేఁ గ్రమముగ వినువాఁడును, దాఁకువాఁడును, జూచువాఁడును, రుచిఁజూచువాఁడును, మూర్కొనువాఁడుననియు, ఈకర్మేంద్రియముల సంబంధముచేఁ గ్రమముగ మాటలాడువాఁడు నిచ్చి పుచ్చుకొనువాఁడు నడచువాఁడు మలమూత్రములు విసర్జించువాఁడు విషయసుఖమున ననుభవించువాఁడు ననియుఁ బ్రాణసంబంధముచేఁ బ్రాణియనియు, మనస్సంబంధముచే మంత (సంకల్పించువాఁడు) యనియు దేహసంబంధముచే దేహియనియు, ప్రాణాదులధరించుచుండుటచే జీవుఁడనియు వ్యవహరింపఁబడుచున్నాఁడు, మఱియు స్థూలశరీరమునందును జాగ్రదవస్థయందును అభిమానము గలిగియుండుటచేత లేక (కలిగియున్నప్పుడు అనఁగా: జాగ్రదవస్థ విజృంభించుచున్నసమయమున) నాతఁడొక్కఁడయ్యును విశ్వుఁడనియు సూక్ష్మశరీరమునందును స్వప్నావస్థయందును అభిమానము గలిగియున్నప్పుడు (అనఁగా: స్వప్నావస్థ యనుభవింపఁబడుచున్నసమయమున) తైజసుఁడనియుఁ గారణ శరీరమునందును సుషుప్త్యవస్థయందును అభిమానము గలిగియున్నప్పుడు (అనఁగా: గాఢనిద్రాసమయమున) ప్రాజ్ఞుఁడనియుఁ బిలువంబడుచున్నాఁడు.

ఇట్టి ఈ జీవుఁడు మనసునందున్న కర్మవాసనల నన్నిఁటిని దనయందే యున్న వానినిగా భావించుచు ప్రపంచమువలె తాను నామరూపమయుఁడే యని తలంచుచు సంసారచక్రమునఁ బరిభ్రమించుచున్నాఁడు (అనఁగా సంసారము తనకు బాధకమనియుఁ దాను కర్మకు వశుఁడనియు జన్మములఁ బొందుచున్నాఁడనియు, నాజన్మములయందలి సుఖదుఃఖములఁ దానే యనుభవించుచున్నాఁడనియుఁ దలంచుచున్నాఁడు.) వాస్తవస్థితిలో వానికి సంసార మంటనేరదు. ద్రష్టయగువానిని దృశ్యము బాధింపనేరదు కదా! మఱియు నాతఁడు స్వయముగా నాకుఁ బ్రతిబింబభూతుఁ డయ్యును దానచేతనమువలె నుండువాఁడగుటచేత నయస్కాంతసాన్నిధ్యమున నినుము చలించునట్లు నాసాన్నిధ్యమునఁ (పరబ్రహ్మముయొక్క సాన్నిధ్యమువలన) జలించువాఁ డయ్యును యథార్థస్థితిలోఁ దాను స్వతంత్రశక్తి కలవాఁడే కావున సూర్యప్రకాశము నాశ్రయించి జనులు తమతమకార్యములందుఁ బ్రవర్తించునట్లు నాప్రకాశము నాశ్రయించి తన కార్యములందుఁ (అనఁగా: [illegible] కార్యములందుఁ) బ్రవర్తించు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాఁడయ్యును నన్నుఁ దెలిసికొనలేకున్నాఁడు. నేను మాత్రము వానికి దూరముగా లేను. క్షరాక్షరపురుషు లిరువురును నా కభిన్నులై నాయందే నిలిచి యున్నారు. వీరిరువురును భ్రాంతిసిద్ధులే యగుటచేతను ఆధారము లేనిభ్రాంతి కలుగదు కావునను ఆరోపితమగుపదార్థ మసత్యమయినను ఆధారమగుపదార్థము సత్త్వమై యుండి తీర వలయును. కావునను సత్యజ్ఞానానందస్వరూపుఁడ నగునేనే ఈప్రపంచమునకు నధిష్ఠాన భూతుఁడనై యున్నాను. ఈసర్వమును బ్రేరేపించుచు దీనికి నధిపతి నైయున్నాను. ప్రకృతిపురుషాత్మక మైనప్రపంచమునకు నతిరిక్తుండ నై దేనితోను సంబంధపడక యుండియు సర్వవ్యాపకుఁడనై సర్వమును స్వరూపముగానే కలిగియున్నాను. ఇదియం తయుఁ గాక యద్దమునందుఁ బ్రతిబింబించియున్నముఖ ప్రతిబింబమునకు ప్రధానముఖ మెట్లు బింబభూతమై ప్రతిబింబమునకంటె వేఱు కాక యున్నదో అట్లే క్షరము లందుఁ బ్రతిబింబించి యున్న యక్షరపురుషునికంటె నేను వేఱు కాక యున్నాను. ఇట్లన్నివిధములఁ దనకంటె వేఱుకాకున్నను ఆజీవుఁడు నన్ను స్వస్వరూపభూతునిగాఁ దెలిసికొనలేక భ్రాంతిసిద్ధమగుసంసారమునఁ బొరలుచున్నాఁడు. పురుషోత్తముఁడని వ్యవహరింపఁబడుచు క్షరాక్షరపురుషులకంటె నతిరిక్తుఁడ నై యున్న నేను ఇరువది యాఱవతత్త్వము.

ప్రకృత మాజీవుఁడు అనాదికాలమునుండియు పైన వర్ణింపఁబడి యున్నవిధ ముగా భ్రాంతినొందియే యున్నాఁడు. లెక్కకు మిక్కిలి యగుజన్మముల స్వీకరించు చునేయున్నాఁడు. కొంతకాలమునకు నాయాజన్మములయందుఁ జేయఁబడి పరిపాకము నకువచ్చిన పుణ్యకర్మలప్రభావముచేతను నా (పరమేశునియొక్క) యనుగ్రహముచేతను (గురూపదేశగ్రహణమునకుఁ దగినట్లు చిత్తము పరిపాకమున నుండుటయే పరమేశ్వ రానుగ్రహమునకు రూపము. దృష్టిదీక్షాదివిధానముచే మనసునందలి మాలిన్యము తొలఁ గుటయే భగవదనుగ్రహస్వరూప మని కొందఱు చెప్పుదురు.) ఆజీవునకు చిత్తశుద్ధి కలుగును. "అతఁ డెప్పుడును సిద్ధుఁడే యైనను భ్రాంతివలన నపరిశుద్ధుఁడుగా తన్ను తానే భావించుచున్నాఁడు కావున నపరిశుద్ధుఁడయ్యెను" కావున మనస్సు శుద్ధి జెందఁగానే యాజీవుఁడు తనయథార్థస్థితిని గూర్చి తలంప నారంభించును. మొట్ట మొదట స్వానుభవానుసారముగాఁ బ్రపంచ మనిత్య మనియుఁ బరమేశ్వరుఁడు నిత్యుఁ డనియు నిశ్చయించుకొనును. (ఇదియే నిత్యానిత్యవస్తువివేకము.) పిదప ననిత్యములం దాశ తగ దని ఇహపరలోకభోగములయందు విరక్తుఁడగును. (ఇదియే. ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము.) అనంతరమున వైరాగ్యప్రభావములచే నింద్రియములుకాని మన స్సుకాని బాహ్యవిషయములపైఁ బ్రసరింపవు. కావున బాహ్యేంద్రియనిగ్రహం బును మనోనిగ్రహంబును చిత్తశాంతిని ఓర్పును సంపాదించుకొనును. తర్వాత వేదాంత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాక్యముల వినవలయు ననియు గురువుల సేవింపవలయు ననియు శ్రద్ధ జనించి వారి యుపదేశమునందుఁ దృప్తినిఁ గలిగించును. (ఇదియే శమాదిషట్కసంపత్తి.) ఇట్లు సర్వమును కుదిరి వేదాంతవాక్యశ్రవణమువలన సామాన్యముగాఁ దనకును నాకును (బ్రహ్మమునకును) భేదములేదని తెలిసికొని తర్వాత నామభేదమననుభవపూర్వకముగా నెఱుఁగుటకై త్వరపడును. (ఇదియే ముముక్షుత్వము.) ఈవర్ణింపఁబడినదే సాధనచతుష్టయము. ఇట్లు సాధనచతుష్టయసంపత్తి గలిగి పూర్ణాధికారియై సద్గురువు నాశ్రయించును. ఆమహాత్ముని యనుగ్రహమువలనఁ దాను శరీరములకంటెను బంచకోశములకంటెను వేఱనియు జాగ్రదాద్యవస్థలకు సాక్షి యనియు నిదివఱకు భావించుచుండినట్లు దేహాదిరూపుఁడు కాఁ డనియుఁ దెలిసికొని స్వాభావికమైన నారూపమును జెందును. "నారూపమును జెందుట" యనఁగా "వేఱుగా నుండి నన్ను కలిసికొనుట" కాదు. ఇఁక నేమనిన జలఘటము నశించినప్పు డచ్చటిసూర్యప్రతిబింబము స్వాభావికముగాఁ దనకంటె వేఱుకానిసూర్యునిఁ జెందినట్లు అద్దము తొలఁగింపఁబడఁగానే యందలి ముఖప్రతిబింబము ముఖమునుబొందినట్లు మొదటినుండియు నాకుఁ బ్రతిబింబమై నాకంటె భిన్నుఁడు కాకుండి వివేకదృష్టివలన క్షరము తొలంగఁగానే నాతో నభిన్నుఁడై నిలుచుటయే; లేక తనయథార్థస్వరూపమును దెలిసికొనుటయే. ఇట్లుచెప్పుటకును వీలు లేదు. రెండుపదార్థములుండిన నప్పు డొకపదార్థము మఱియొకదానిలోఁ బ్రతిబింబించును. ప్రస్తుత మట్లులేదు. ఈప్రపంచమంతయు నాయం దారోపింపఁబడినదే కావునఁ ద్రాటియం దారోపింపఁబడినసర్పము త్రాటికంటె వేఱుకానట్లు యథార్థస్థితిలో నాకంటె వేఱు కాదు కదా! కావున "జీవుఁడు నాకుఁ బ్రతిబింబము" అనుటయే సంభవింపదు. కావున ఘటము గృహము మొదలగువానియందుఁ బ్రవేశించియున్న యాకాశమాకాశప్రతిబింబము కాకున్నను ఉపాధిభేదముచే మహాకాశమునకంటె భిన్నముగా వ్యవహరింపఁబడుచునుండి ఘటాదులు నశించినపిదప మహాకాశమునందే కలసినట్లు నాయందుఁ గలయుటయే జీవబ్రహ్మైక్యము. ఇట్లు జీవుఁడు నాతో నైక్యమునొంది ముక్తుఁడగును.

వ. అని యుపదేశించి యోపార్వతీ రాముఁడు మఱియు నిట్లనియె.

సామాన్యసృష్టి యనియు విశేషసృష్టి యనియు సృష్టి రెండువిధములు. ప్రపంచమునఁ గానవచ్చు స్త్రీపురుషపశుపక్ష్యాదుల సృష్టి సామాన్యసృష్టి, స్త్రీత్వము పురుషత్వము మొదలగునవి సమానముగానే యున్నను "ఈస్త్రీ నాసోదరి, ఈస్త్రీ నాతల్లి, ఈపురుషుఁడు నావాఁడు, వీఁడు నీవాఁడు, ఈపశువు ఈచిలుక నాది, ఇది నీది వానిది" అను మొదలగువ్యవహారములు మన కనుభవములో నున్నవి. వీనికన్నిఁటికిని గారణము విశేషసృష్టి [illegible] ధర్మము సామాన్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మనియుం, ప్రత్యేకవస్తువు, లేక ప్రత్యేకసంఘము నాశ్రయించి యుండుధర్మము విశేష మనియుఁ జెప్పఁబడును. ఒకనిబంధువు దూరదేశమున మృతిజెందినను అవిషయము తనకుఁ దెలియకుండునంతకాలము దుఃఖము కలుగదు. వాస్తవస్థితిలో మృతిఁజెందకుండి నను శత్రువులు మొదలగువారు "నీబంధువు మృతిఁజెందెను" అని చెప్పరేని దుఃఖము కలు గును. ఈఅనుభవమువలన సామాన్యసృష్టి కెట్టిమార్పులు కలిగినను విశేషసృష్టికి మార్పు కలుగకుండుటయుం సామాన్యసృష్టికి మార్పు లేకున్నను విశేషసృష్టికి మార్పు కలుగుటయుం ననుభవసిద్ధములై యున్నవి. ఈభేదమువలన సామాన్యవిశేషసృష్టులు పరస్పరభిన్నము లయి యుండు. సామాన్యసృష్టి ఈశ్వరకృతమై సమష్టిరూపమై ప్రపంచమున కంతయుం సంబంధించియుండును. విశేషసృష్టి జీవకృతమై వ్యష్టిరూపమై మనసు నాశ్రయించి యుండును.

## సాక్షిత్వమననము.

ఆ. పంచవిషయములను బంచేంద్రియములచేఁ
గాంచుతెలివి నేను కపివరేణ్య
పంచకోశములను బంచభూతంబుల
నెంచి చూచునట్టి యెఱుక నేను. 107

టీ. కపివరేణ్య=వానరశ్రేష్ఠుఁడ వైనయాంజనేయా! పంచవిషయములన్=శబ్దము మొదలగు నైదువిషయములను, పంచేంద్రియములచేన్ = శ్రోత్రము మొదలగు నైదు యింద్రియములమూలమున, కాంచుతెలివి=చూచునట్టి జ్ఞానమును, నేను, (శ్రీరాముఁడు, లేక పరబ్రహ్మము,) పంచకోశములన్ = అన్నమయము మొదలగునైదుకోశములను, పంచభూతంబులన్ = ఆకాశము మొదలగు నైదుభూతములను, ఎంచి = విభాగించి, చూచునట్టి=తెలిసికొనునట్టి, ఎఱుక=జ్ఞానమును, నేను.

తా. ఓవానరశ్రేష్ఠా! శబ్దాదివిషయముల శ్రోత్రాదీంద్రియములు గ్రహించు చున్న వనుట యనుభవములో నున్నది. వాస్తవస్థితిలో నీశ్రోత్రాదు లచేతనములు కావున నేనే (బ్రహ్మమే) వానిమూలముగా విషయముల గ్రహించుచున్నాను. మఱియుఁ బంచకోశములకు పంచభూతములను బ్రత్యేకముగా విభజించి "ఇది యన్నమయకోశము ఇది యానందమయకోశము. ఇది యాకాశము" అని తెలిసికొనునట్టివాఁడను నేనే.

లయవిభాతి.—

తెలిసె నిది నాకిపుడు తెలియ దది లెస్సగను
దెలియ వివరింపుదును దెలిసెద నటంచున్


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బలికితిని బలుక నిఁకఁ బలికెద నటంచు మదిఁ
దలఁపను దలంచితిని దలఁచెద నటంచున్
వెలుపలను లోపలను దెలియఁ బడువృత్తులను
దెలియుచు వెలుంగులను వెలుఁగు లగుచుండన్
గలయ వెలిఁగించుతొలివెలుఁగు సుమి నేను ననుఁ
దెలియుము వివేకదశఁ గలమనముచేతన్. 108

టీ. తెలిసెనిదినాకిపుడు=ఈవిషయము నాకిప్పుడు తెలిసెను, అది=అవిషయము, లెస్సఁగన్=బాగుగా, తెలియదు, తెలియన్=తెలియునట్లుగా, వివరింపుదున్=వివరించి చెప్పెదను. తెలిసెదనటంచున్=తెలిసికొందును అనుచు, పలికితిన్=చెప్పితిని, ఇఁకన్=ఇఁక మీఁద, పలుకన్=చెప్పను, పలికెదనటంచున్=చెప్పెదను అనుచును, మదిఁదలఁపన్=మనసునం దీవిషయము నాలోచింపలేదు, తలంచితిన్=ఆలోచించితిని, తలఁచెదన్=ఇఁకమీఁద నాలోచించెదను, అటంచున్=అనుచును, వెలుపలన్=మనసునందును (బహిర్ముఖముగానుపుట్టునట్టి,) తెలియఁబడువృత్తులన్ = జ్ఞానగోచరము లగు చిత్తవృత్తులను (మనస్సునందేసంకల్పము జనించినను "మనకీసంకల్పము గలిగెను" అని మనకుఁ దెలియుచుండుట ప్రత్యక్షము,) తెలియుచున్=తెలిసికొనుచు, వెలుఁగులన్=సూర్యచంద్రాదులను (లేక జ్ఞానములనఁబడు చిత్తవృత్తులను,) వెలుఁగులగుచుండన్ = ప్రకాశరూపములగునట్లుగా, కలయన్=సంపూర్ణముగా, వెలిఁగించు తొలివెలుంగు=ప్రకాశింపఁజేయునట్టి యనాదిప్రకాశము, నేనుసుమీ=నేనే సుమీ, ననున్=నన్ను, వివేకదశగలమనముచేన్=వివేచనాశక్తి గలమనస్సుతో, తెలిసికొనుము.

తా. "ఇది నాకిపుడు తెలిసెను. ఇది నాకు చక్కఁగా తెలియదు. దీనిని నీకు స్పష్టముగాఁ దెలియఁజేసెదను. నేను దీనిని తెలిసికొనియెదను" అనియును "దీనిని నేను చెప్పితిని. మఱియొకమాఱు చెప్పను. ఇఁకమీఁదఁ జెప్పెదను. నే నిట్లగునని తలంపలేదు. తలంచితిని. ఇఁకపైఁ దలఁచెదను" అనియు వెలుపల నున్నవిషయములను గూర్చియు లోపలనున్న విషయములనుగూర్చియు చిత్తవృత్తు లనేకవిధములుగానుదయించుచుఁ దనకు గోచరములగుచు నున్నవి. ఇది యనుభవసిద్ధమే కదా. మనసునఁ బుట్టుసంకల్పములన్నియు మనకుఁ దెలియుచునే యున్నవనుట నిర్వివాదాంశము. అట్లాసంకల్పములెవ్వనికిఁ దెలియుచున్నవో వాఁడనే నేను. అచిత్తవృత్తులనే మనము జ్ఞానములని పిలుచుచున్నామనియు నవియే ప్రకాశము లనఁబడు ననియు నిదివఱకే స్పష్టమైయున్నది. జడములగునాచిత్తవృత్తుల కిట్టిస్థితి (అనఁగా జ్ఞానాదిపదములచే వ్యవహరింప బడఁదగినస్థితి) కలుగుట నావలననె, నాప్రకాశమే ఆచిత్తవృత్తులయందుఁ బ్రతిఫలించి వానికట్టిసామర్థ్యము గలి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గించుచున్నది. సర్వమును బ్రకాశింపఁజేయు నాదిప్రకాశము నేనే యని జ్ఞానదృష్టిచేఁ దెలిసికొనుము.

మ. నతదేవా! వెలిలోపదార్థముల నానాఛిద్రభాండోదర
స్థితదీపం బెఱిఁగించుచందమున హృద్ధీప్రాణసర్వేంద్రియా
న్వితదేహస్థుఁడ నైననే ననిశమున్ నిర్హేతుకాజ్ఞానక
ల్పితబాహ్యాంతరనామరూపతతులన్ లీలన్వెలింగింపుదున్. 109

టీ. నతదేవా = దేవతలకుఁ గూడ నమస్కారయోగ్యుఁడ వగునాంజనేయా! నానా...పంబు-నానా=అనేకములైన, ఛిద్ర=రంధ్రములు గల, భాండ=కుండయొక్క, ఉదర=గర్భమునందు, స్థిత=ఉన్న, దీపంబు = దీపము, వెలిలోపదార్థముల = వెలుపల లోపలనున్న పదార్థములను, ఎఱిఁగించుచందమునన్ = తెలియఁజేయువిధమున, హృద్ధ...స్థుఁడన్-హృత్ = మనస్సుతోను, ధీ = బుద్ధితోను, ప్రాణ=ప్రాణములతోను, సర్వేంద్రియ=జ్ఞానకర్మేంద్రియములతోను, అన్విత=కూడిన, దేహస్థుఁడన్=శరీరమునం దున్న వాఁడును, ఐన నేను=ఐనట్టి నేను, అనిశమున్=ఎల్లప్పుడును, నిర్హేతు...తులన్-నిర్హేతుక=కారణములేని, అజ్ఞాన=అజ్ఞానముచేత (ప్రస్తుత మనుభవములో నున్నయజ్ఞానము వచ్చుటకుఁ గారణమే లేదనుట), కల్పిత=కల్పింపఁబడిన, (అనఁగా: ఉన్నట్లు తోపింపఁబడిన) బాహ్యాంతర=వెలుపలను లోపలనున్న, నామరూపతతులన్=బహువిధము లగునామరూపములను ప్రపంచమును, లీలన్ = విలాసముతో, వెలింగింపుదున్ = ప్రకాశింపఁజేయుచున్నాను.

తా. దేవతలచేఁ గూడ స్తోత్రముచేయఁబడు చున్నయాంజనేయా! అన్నివైపులను రంధ్రములు గలఘటమునం దున్నదీపము వెలుపల లోపలనున్నసర్వపదార్థములను బ్రకాశింపఁజేయునట్లు నేను ప్రాణబుద్ధీంద్రియాదులతోఁ గూడినదేహమునం దుండి లోపల వెలుపల నున్నవిషయములను బ్రకాశింపఁజేయుచున్నాను.

ఉ. తమ్ము నెఱుంగ లేవు విహితమ్ముగ దేహము ప్రాణపంక్తి చి
త్తమ్ము దశేంద్రియమ్ము లుచితమ్ముగ నన్యముఁ గాన లేమి స
త్యమ్మగు నోకపీంద్ర! సతతమ్మును వానిఁ దదీయకార్యజా
తమ్మును నేను గాంతు నన్వృతమ్ముగ నన్ను బుతమ్ముగాఁ దగన్. 110

టీ. ఓకపీంద్రా=ఓవానరశ్రేష్ఠా! దేహము = శరీరము, ప్రాణపంక్తి=పంచప్రాణములు, చిత్తమ్ము=మనస్సు, దశేంద్రియములు=జ్ఞానకర్మేంద్రియములును, విహితమ్ముగన్=చక్కఁగా, తమ్ము = తమస్వరూపములను, ఎఱుంగలేవు = తెలిసికొనలేవు, (అట్లు వానిని అవియే తెలిసుకొనలేనప్పుడు,) ఉచితమ్ముగన్=చక్కఁగా, అన్యమున్=తమకంటె వేఱగు పదార్థములను, కానలేమి=చూడలే వనుట, సత్యము = నిశ్చయము, అగున్ = అగును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సతతమ్=ఎల్లప్పుడు, వానిన్=ఆదేహాదిపదార్థములను, తదీయకార్యజాతమ్మున్=ఆదేహాదులు చేయునట్టి కార్యములను, నేను, అనృతముగన్ = అసత్యముగాను, (అనఁగా: ఈదేహాదు లన్నియుం నసత్యములనియుం) తగన్=ఒప్పునటుల, నన్ను = పరబ్రహ్మమైన నన్ను, ఋతమ్ముగాన్ = సత్యస్వరూపునిఁగాను (అనఁగా: బ్రహ్మ సత్యమనియును), కాంతున్=తెలిసికొనుచుందును.

తా. ఓవానరశ్రేష్ఠా! మనస్సుప్రాణములు దేహము మొదలగునవి తమస్వస్వరూపమును తాము తెలిసికొనలేవు. ఇట్టివి ఇతరపదార్థములఁ దెలిసికొనలే వనుట నిర్వివాదాంశమేకదా. కావున నేనే సర్వమును గ్రహించుచున్నాను. ఈదేహాదులును వానికార్యములు నసత్యములనియుం నేను సత్త్వస్వరూపుఁడ ననియు స్వయముగా నెఱుంగుచున్నాను. నేను స్వప్రకాశుఁడను.

శా. ధీచేతోవిషయాత్మకంబు లగుజ్ఞాతృజ్ఞానవిజ్ఞేయముల్
సూచించుం దగఁ దల్లయోదయముల న్సుప్తిప్రబోధంబు లే
నాచిత్రంబుల వానిఁ జేయునిజమాయన్ సాక్షినై చూచుచున్
రోచిష్ణుత్వముచే వసింతు సదసద్రూపాతిరిక్తంబుగాన్. 111

టీ. జ్ఞాతృజ్ఞానవిజ్ఞేయములు-జ్ఞాతృ = తెలిసికొనువాఁడు, జ్ఞాన = తెలివి, విజ్ఞేయములు = తెలియఁబడునవి, ఈమూఁడును, ధీచేతో...బులు-ధీ = బుద్ధి, చేతః = మనస్సు, విషయ = శబ్దాదులే, ఆత్మకంబులు = స్వరూపముగాఁ గలవి, అగున్ = ఐయున్నవి, తగన్ = ఒప్పునట్లుగా, తల్లయోదయముల్ - తత్ = ఆజ్ఞాతృజ్ఞానజ్ఞేయములయొక్క, లయ = నాశమును, ఉదయముల్ = పుట్టుకలను, సుషుప్తిప్రబోధంబులు = సుషుప్తి జాగ్రదవస్థలు, సూచించున్ = తెలియఁజేయుచున్నవి (జ్ఞాతృజ్ఞానజ్ఞేయంబులు సుషుప్త్యవస్థయందు లేవనుటయుం జాగ్రదవస్థయందు మాత్రమే కలవనుటయు ప్రత్యక్షసిద్ధ మయియున్నది. కావున నవి యనిత్యములు) ఏను = నేను, ఆచిత్రంబులన్=ఆయాశ్చర్యములను, వానిన్-ఆజ్ఞాత్రాదులను, చేయునిజమాయన్-చేయు = చేయునట్టి (అనఁగా: కల్పించునట్టి, నిజ=స్వకీయమైన, మాయన్ = మాయాశక్తిని, సాక్షినై=ద్రష్టనై, చూచుచున్, రోచిష్ణుత్వముచేన్=ప్రకాశస్వరూపముతో, సద...బుగాన్-సత్ = ఉన్నవి యనియు, అసత్ = లేని వనియుఁ జెప్పఁబడుచున్న రూప = రూపములు గలపదార్థములకంటె, అతిరిక్తంబుగాన్ = వేఱుగా, వసింతున్ = ఉందును.

తా. లోకమున తెలిసికొనువాఁడు, తెలివి, తెలిసికొనఁబడునది అనునవి యనుభవములో నున్న ... బుద్ధి ... శబ్దాదులు నైయున్నవి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మఱియు నివి సుషుప్త్యవస్థయందు లయమునొందుచు జాగ్రదవస్థయందు మరల నుత్ప త్తియగుచు నున్నవి. వీని నన్నిటిని మాయ కల్పించుచున్నది. నేను స్వప్రకాశుండనై వీనినెల్లను (అనఁగా: మాయను జాగ్రత్సుషుప్తులను జ్ఞాతృజ్ఞానజ్ఞేయములను ప్రకాశింపఁ జేయుచు సాక్షినై యున్నాను.

క. మత్సాన్నిధ్యమువలనన, చిత్సాహంకారపవనచిత్తేంద్రియముల్
వత్సా! చలియించును రం,గత్సదయస్కాంతసూచికలచందమునన్.

టీ. వత్సా!=ఓబాలుఁడా! మత్సా...వలనన్-మత్=నాయొక్క, సాన్నిధ్యంబు వలనన్ = సన్నిధానమువలన, (అనఁగా: నేను సమీపమున నుండుటవలన) అచిత్సా... ములు-అచిత్ = జ్ఞానము (లేక మాయ), సాహంకార = అహంకారముతోఁగూడిన, పవన = పంచప్రాణములు, చిత్త = మనస్సు, ఇంద్రియములు = జ్ఞానకర్మేంద్రియములు, సురం...మునన్-సురంగత్=ఒప్పుచున్నట్టియు, సత్=శ్రేష్ఠమైనట్టియు, అయస్కాంత =అయస్కాంతముతో సంబంధపడియున్న, సూచికలచందమునన్ = సూదులవలెనే, చలియించున్=కదలును. (అనఁగాఁ దమతమకార్యములయందు ప్రవర్తించుచుండును.)

తా. ఓపుత్త్రా! నాసన్నిధానమువలననే (అనఁగా: నేను స్వయముగా నేకార్యమును జేయనివాఁడనైనను నాసమీపమునం దుండుటవలనమాత్రమే) అయస్కాంత సన్నిధానమునఁ జలించుసూదులయట్లు చిదాభాసునితోఁగూడినయహంకారప్రాణచిత్త జ్ఞానకర్మేంద్రియములు వానివానికార్యములందుఁ బ్రవర్తించుచున్నవి; కాని స్వయముగా కాదు. నాప్రకాశము లేక యివి యేమియుఁ జేయ నేరవు.

క. తప్తాయఃపిండాంత, ర్వ్యాప్తానలమండలంబువడువున మాయా
గుప్తబ్రహ్మాండసము,ద్దీప్తచిదాత్మకుఁడ నేను ధీరవరేణ్యా! 113

టీ. ధీరవరేణ్యా-ధీర=పండితులలో, వరేణ్యా=శ్రేష్ఠుఁడా! తప్తా...వునన్-తప్త =కాలిన, అయఃపిండ = ఇనుపముద్దయొక్క, అంతః = లోపల, వ్యాప్త = వ్యాపించి, యున్న, అనలమండలంబువడువునన్ = అగ్నివలె, నేను, మాయా...కుఁడన్-మాయా= మాయచే, గుప్త=రక్షింపఁబడిన, బ్రహ్మాండ = ప్రపంచమునందు, సముద్దీప్త=ప్రకాశించు చున్న, చిదాత్మకుఁడన్=జ్ఞానస్వరూపకుఁడను.

తా. జ్ఞానవంతులలో శ్రేష్ఠుండ వగునోయాంజనేయా! జడరూపమగు నీ ప్రపం చమునకు జ్ఞాన మున్నట్లు తోఁచుచున్నది. ప్రపంచమే జ్ఞానరూపమనియుఁ దోఁచు చున్నది. కాలినయినుమునుగూర్చి దానియం దున్నయగ్నినిఁ దెలిసికొనలేనికారణము వలన "ఇనుము కాలుచున్నది" అను మొదలగువ్యవహారములు కలిగినట్లు జ్ఞానరూపుఁడ నగు నేను సర్వవ్యాపకుఁడనై యున్నానని తెలిసికొనలేనికారణము "ప్రపంచము జ్ఞాన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రూపమైనది” అనువ్యవహారము కలుగుచున్నది. కావున లోకమున ననుభవములోనున్న జ్ఞానము నాస్వరూపమే కాని వేఱొక్కటి కాదు.

సీ. ధరణీజలానలమరుదంబరాంతరా
విష్టాఖిలాధారద్రష్ట నేను
ఆదిత్యచంద్రగ్రహర్క్షతారాతటి
త్సంవ్యాప్తదివ్యతేజంబు నేను
అమరమానవతిర్యగాది చేతనధీప్ర
కాశమానజ్ఞానఘనుఁడ నేను
బ్రహ్మాదిదేవతాప్రార్థనీయానంత
కల్యాణగుణకవిగ్రహుఁడ నేను
తే. కార్యరూపంబు లైనజగంబులకును
స్ఫురదుపాదానకారణంబును నిమిత్త
కారణము నైననిర్మలాకారసత్త్వ
పరమమాయాసమన్వితేశ్వరుఁడ నేను. 114

టీ. నేను, ధర...ద్రష్టర్-ధరణీ=భూమియొక్కయు, జల = నీటియొక్కయు' అనల = అగ్నిహోత్రునియొక్కయు, మరుత్ = వాయువుయొక్కయు, అంబర = ఆకాశముయొక్కయు, అంతర = లోపల, ఆవిష్ట = ప్రవేశించినట్టియు, అఖిలాధార ద్రష్టర్=సకలమునకాధారభూతుఁడునైనట్టియు సాక్షిని నేను, ఆది...జంబు-ఆదిత్యచంద్ర=సూర్యచంద్రులయందును, గ్రహ = అంగారకాదిసర్వగ్రహములయందును, ఋక్ష = నక్షత్రములయందును, తారా = అశ్విన్యాదు లగుసిరువదియేడుతారలయందును, తటిత్ = మెఱుపులయందును, సంవ్యాప్త = వ్యాపించియున్న, దివ్య = అద్భుతమైన, తేజంబుర్=కాంతిని, నేను, అమర...డర్-అమర = దేవతలు, మానవ = మనుష్యులు, తిర్యక్=పశుపక్షిజాతులు, ఆది=మొదలైన, చేతన=ప్రాణులయొక్క, (లేక, జ్ఞానము గలవారియొక్క,) ధీ = బుద్ధియందు, ప్రకాశమాన = ప్రకాశించుచున్న, జ్ఞానఘనుఁడర్=జ్ఞానమయుఁడనునట్లు చెప్పుటచేత, (పరబ్రహ్మము ప్రపంచమునందంతటఁ దనజ్ఞానరూపముతో వ్యాపించియేయున్నాఁడనియుఁ జేతనములయందుమాత్రము మనసు మొదలగునవి యుండుటచేఁ బ్రకాశించుచున్నదనియు నచేతనములయం దవి లేకపోవుటచేఁ బ్రకాశింపఁడనియు భావము. నేను, బ్రహ్మా...హుఁడర్-బ్రహ్మాది = బ్రహ్మ మొదలగు, దేవతా=దేవతలచేత,ప్రార్థనీయ=కొనియాడఁదగినట్టియు, అనంత=అమితము లైనట్టియు, కల్యాణగుణక [illegible] లైనట్టియు [illegible], విగ్రహుఁడర్ = శరీరము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కలవాఁడను, నేను, కార్య...లకున్ - కార్యరూపంబులైన = కార్యములైన, అనఁగా: మాయవలనఁ బుట్టి తోఁచుచున్న, జగంబులకున్ = ప్రపంచములకు, స్ఫుర...బును_స్ఫురత్=ప్రకాశించుచున్న, ఉపాదానకారణంబును=మట్టి కుండ యైనట్లు కార్యరూపముతోఁ బరిణమించునట్టి కారణము, నిమిత్తకారణంబున = కుమ్మరివాఁడు కుండకుఁ గారణ మైనట్లు కార్యమునకుఁ గర్త యగునట్టికారణము, ఐన=ఐనట్టి, నిర్మ...రుఁడన్-నిర్మలాకారసత్త్వ = రజస్తమోగుణములతో సంబంధము లేక నిర్మలమైయున్న సత్త్వగుణమే, పరమ=ప్రధానముగాఁగలిగిన, మాయాసమన్విత = మూలప్రకృతితోఁగూడిన, ఈశ్వరుఁడన్=ఈశ్వరుఁడను.

తా. అది యెట్లనిన; నేను పంచభూతములకు నాధారభూతుఁడనై వానివలనఁ గలుగు సర్వప్రపంచమును జూచుచున్నాఁడను. సూర్యుఁడు చంద్రుఁడు అంగారకాది గ్రహములు అశ్విన్యాదినక్షత్రములు ఇతరమగు సామాన్యనక్షత్రసమూహము మొదలగు జ్యోతులయందు నిలిచి సర్వసాక్షియై యున్న ప్రకాశము నాయదియే. మఱియు దేవమనుష్యపశుపక్ష్యాదిప్రాణులబుద్ధులను బ్రకాశింపఁజేయు (అనఁగా: వానిని స్వకార్యములయందుఁ బ్రవర్తింపఁజేయు) వాఁడను నేనే. నన్ను సమస్తకల్యాణగుణసమన్వితునిఁగా భావించి బ్రహ్మాదిదేవత లుపాసన చేయుచున్నారు. కార్యములు (అనఁగా సృజింపఁబడినవి) ఐన ఈప్రపంచమున కుపాదానకారణంబును నిమిత్తకారణంబునగుచు నమరసత్త్వప్రధానయగు మాయతోఁ గూడి "ఈశ్వరుఁడు" అని వ్యవహరింపఁబడువాఁడను గూడ నేనే.

తే. వేదశాస్త్రాగమములచే వేదితవ్య
మైనవస్తువు నేను మహాత్మకులకు
జపతపోదానయజ్ఞసంచయముచేత
వరసమారాధనీయదైవంబు నేను. 115

టీ. వేదశాస్త్రాగమములచేన్-వేద = చతుర్వేదములచేతను, శాస్త్ర=షట్శాస్త్రములచేతను, ఆగమములచేన్ = వాతూలము మొదలగు నిరువదియెనిమిదియాగమములచేతను (లేక, శైవవైష్ణవాద్యాగమములచేతను), వేదితవ్యమైన=తెలియఁదగిన, వస్తువు నేను=తాత్పర్యము నేను (అనఁగా వేదాదులన్నియు నన్నుగూర్చియే చెప్పుచున్నవనుట), మహాత్మకులకున్ = మహానుభావులకు, జప...చేతన్ - జప = మంత్రానుష్ఠానముల యొక్కయు, తపః=కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతములయొక్కయు, దాన=దానముల యొక్కయు, యజ్ఞ=యజ్ఞములయొక్కయు, సంచయముచేతన్=సమూహములచేత, వర...వంబున్-వర=శ్రేష్ఠముగా, సమారాధనీయ=పూజింపఁదగిన, దైవంబున్=దేవతను, నేను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. వేదములును శాస్త్రములును ఆగమములును నన్నుగూర్చియే చెప్పుచున్నవి. బుద్ధిమంతులగువారు ఆవేదాదులభేదములను బాటింపక బాగుగా విమర్శించి వాని పరిపూర్ణాభిప్రాయము నట్లే గ్రహించుచున్నారు. తపంబులు దానంబులు యజ్ఞంబులు జపంబులు మొదలగునవి యేయేదేవతలనుగూర్చి యాచరింపఁబడినను నన్నుగూర్చి యాచరింపఁబడినవే యగును. మాయా సహితుఁడనగు నన్నే బహురూపములతో ననేకు లుపాసన చేయుచున్నారని ఇదివఱకే చెప్పియున్నాను కదా.

భ గ వ ద్గీ త.

"యేఽప్యన్యదేవతా భక్తా యజంతే శ్రద్ధయాఽన్వితాః,
తేఽపి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకమ్".

(భగ ౯-అ. ౨౩-శ్లో.)

తా. "ఓ యర్జునా! ఇతరదేవతలయందు భక్తిగలిగి అనఁగా: సర్వదేవమయుఁడ పరబ్రహ్మరూపుఁడ నాత్మాభిన్నుఁడనగునన్ను దెలిసికొనలేక రుద్రవిష్ణ్వాదిదేవతలు నాకంటే వేఱని తలంచుచు వారియందు భక్తిగలిగి యెవ్వరు సేవించుచున్నారో వారు నన్ను సేవించువారే అయినను "నన్ను (కృష్ణుని బ్రహ్మమును) సేవించుచున్నాము" అని మాత్రము వారు తెలిసికొనలేరు. "నాస్వరూపము నెఱింగి యుపాసించువారలకును వీరలకు నింతకంటే భేదమేమియు లేదు" అని గీతాచార్యుఁడగు శ్రీకృష్ణుఁ డానతిచ్చియున్నాఁడు.

తే. అనఘ! సాకారుఁడను గాను విను సమష్టి
ఘనతనుద్వయతాదాత్మ్యమునకుఁ జొరమి
సరినిరాకారుఁడనుగాను సాక్షి నగుచుఁ
గారణశరీర మేననుకలఁక లేమి. 116

టీ. అనఘ=పాపరహితుఁడవగు నాంజనేయ! వినుము. సాక్షినగుచుఁ = సకలమునకుద్రష్టనై, సమష్టి...నకుం-సమష్టి = సముదాయరూపంబులైన, ఘనతనుద్వయ = స్థూలసూక్ష్మదేహములయొక్క, తాదాత్మ్యమునకుఁ=అభేదమునకు (అనఁగా నాశరీరములు నేను కాకపోవుటవలన), సాకారుఁడనుగాను = రూపముతోఁగూడినవాఁడను కాను, అభివ్యక్తములు కాక నామరూపములు సృష్టికిఁ బూర్వము పరబ్రహ్మమునందు నిలచియుండెను. "అవి సూక్ష్మసృష్టియందే మొట్టమొదట నభివ్యక్తము లయ్యెను; కావున సూక్ష్మశరీరము గాని దానికిఁ బిదప జనించినస్థూలశరీరము. కాని యేపురుషునకుండునో వాఁడే సాకారుఁడగును" అని తెలిసికొనవలయును. సరి=ఈస్థూలసూక్ష్మశరీరములతోసమానమగు కారణశరీరము. ఏననుకలఁక లేమిచే=నేననుభ్రమ లేకపోవుటచేత,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిరాకారుఁడనుగాను = రూపములేనివాఁడనుకాను, (కారణశరీర మనఁగా: మాయయే. అదియే నామరూపముల నభివ్యక్తములఁజేసినది. ఇట్లు చేసినను స్వయముగా నామరూపము లుండవలసిన పనియేమియులేదు. గావున బ్రహ్మము మాయయే యైనచో నాయన సాకారుఁడు కానేరఁడు. ప్రకృతము బ్రహ్మ మాయ కాఁడు. నామరూపములును ఆయనయందే అడఁగియుండినది కావున నాబ్రహ్మము నిరాకారుఁడు ,కూడాఁ గానేరఁడని తెలిసికొనవలయును).

తా. ఓపాపరహితుఁడ! నాకు రూపము కలదనికాని లేదనికాని చెప్పుటకు వీలు లేదు. వీలయనిన: నేత్రములకు గోచరము లగుచున్న పదార్థములను గూర్చియే "వీనికి రూపము కలదు. వీనికి రూపము లేదు" అనువ్యవహారము కలుగుచున్నది. బ్రహ్మము నేత్రములకు గోచరము కాఁడు; కావున నిట్టివ్యవహారములు కలుగుటకే వీలులేదు. అదియట్లుండ నామరూపములు సృష్టికి పూర్వము ప్రకాశింపక బ్రహ్మమునందే లీనములై యుండెను. అవి ప్రకాశించుట కారంభము సూక్ష్మసృష్టియే కావున సూక్ష్మస్థూలశరీరము లెవ్వనికుండునో వాఁడే సాకారుఁడగును. ఈబ్రహ్మము సూక్ష్మస్థూలశరీరములకు సాక్షియే కావున నాశరీరములకంటే వేఱు కాని ఆశరీరములతో సంబంధము కలవాఁడు కానేరఁడు. కావున బ్రహ్మమునకు రూపములేదు. మఱియు నామరూపములు ప్రకాశింపనిసమయమున సర్వము నిరాకారమైయే యుండె నని యిదివఱకే చెప్పియున్నాను. కారణములు కార్యమునకంటెఁ బూర్వమున నుండి తీరవలసియుండుటచేతను ఈ నామరూపములు ప్రకాశించుటకు మాయయే కారణ మగుటచేతను నామరూపములు ప్రకాశింపనిసమయమున మాయకలదు. ఈకారణమువలన నది నిరాకారము పరబ్రహ్మము,ఆమాయకుఁగూడ సాక్షియగుటచే దానితో సంబంధపడువాఁడు కానేరఁడు (అనఁగా: బ్రహ్మము మాయ కానేరఁడు) ద్రష్టయగువాఁడు దృశ్యమగునా! కావున నాకు (బ్రహ్మమునకు) నిరాకారత్వంబును లేదు. మాయ ప్రపంచరూపముతోఁ బరిణమించును. కావున దానికి నామరూపప్రకాశానంతరమున సూక్ష్మస్థూలాకారములు కలుగును. ఈ కారణములవలన దానిగూర్చి సృష్ట్యనంతరమున సాకారత్వవ్యవహారంబును సృష్టికిఁ బూర్వమున నిరాకారత్వవ్యవహారంబును గలుగుచున్నది. నేను (బ్రహ్మము) ఎప్పటికిని సాక్షినే (అనఁగా: సాకారత్వవ్యవహారమునకును నిరాకారత్వవ్యవహారమునకును గూడ సాక్షినే) కావున నన్నుగూర్చి ఈ వ్యవహారములలో నేదియుఁ బ్రవర్తింపనేరదు.

తే. అఖిలభూతములందు నే నఖిలభూత
ములును నాయందుఁ గలుగంగ బొరయ నెందు
వాని నివియు న న్నంటవు వానరేంద్ర
సమత నొప్పారుగగనంబుచందమునను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. వానరేంద్ర=వానరశ్రేష్ఠా! సమతన్=సర్వసామాన్యముగా (లేక, అంతటను) ఒప్పు... మునన్-ఒప్పారు=ప్రకాశించుచున్న, గగనంబుచందమునన్=ఆకాశమువలె, అఖిలభూతములందున్ = సమస్తవస్తువులయందు, ఏను=నేనును, అఖిలభూతములును= సమస్తపదార్థములును, నాయందున్=నాలోపలను, కలుగంగన్=ఉండఁగా, ఎందున్= ఎప్పటికిని, వానిన్=ఆపదార్థములను, పొరయన్=పొందను (అనఁగా: వానితో నేను సంబంధపడను), అవియున్=ఆపదార్థములును, నన్నంటవు=నాతో సంబంధపడవు.

తా. ఓవానరశ్రేష్ఠా! మఱియొకవిశేషము. నేను సర్వభూతములయందు నున్నాను. నాపై నారోపింపఁబడిన వగుటచే సర్వభూతంబులును నాయందున్నవి. అయినను ఆకాశము సర్వపదార్థములయందు నుండియు వాని నంటనియట్లు నే నాభూతముల నంటను. సర్వపదార్థములును దమయందున్న యాకాశము నంటనట్లు (అనఁగా: నాయాకాశము నను నేవికారమును గలిగింపలేనట్లు,) ఆభూతములు నన్నంటవు.

అవ. ఇది మిగులఁ జిత్రముగ నున్నది. నీకును (రాములకును బ్రహ్మమునకును) సర్వభూతములకును సంబంధము కలిగియు లేదనుట యెట్లు సంభవించును? అనిన సదృష్టాంతముగా సమాధానమును జెప్పుచున్నాఁడు:—

క. మృగతృష్ణికల నెఱింగినఁ
దగ జలము లభావ మగువిధమునఁ దెలివిచే
సగుణుఁ డగునన్ను దెలిసిన
జగములు నాయందు లేవు సత్యం బనఘా. 118

టీ. అనఘా=పాపరహితుఁడా ! తగన్=ఒప్పునట్లుగా, మృగతృష్ణికలన్=ఎండమావులను, ఎఱింగినన్=తెలిసికొనిన, జలములు=అందు భ్రాంతివలనఁ దోఁచునీరు, అభావమగువిధమునన్=లేకపోవునట్లు, తెలివిచేన్=జ్ఞానముచేత, అగుణుఁడగునన్నున్=గుణశూన్యుండ నైననన్ను, తెలిసినన్=తెలిసికొనినయెడల, జగములు=ప్రపంచములు (నామరూపములు), నాయందున్, లేవు, సత్యంబు=నిశ్చయము.

తా. ఓదోషరహితుఁడ ! పైనఁ జెప్పినవిషయమునం దేమియు సంశయములేదు. ఎండమావులయందు జలభ్రాంతి కలిగినపురుషునకు "ఇవి యెండమావులు కాని జలము కాదు" అనుజ్ఞానము కలుగు నేని యచ్చట జలములే త్రికాలములయందు లేని వైనట్లు అవిద్యావశమున నన్నుఁ బ్రపంచరూపునిగాఁ దలంచువానికి "ఇది ప్రపంచము కాదు. పరబ్రహ్మమే మనయజ్ఞానమువలన నిట్లు కానవచ్చుచున్నది" అను యథార్థజ్ఞానము కలుగునేని భ్రాంతిసిద్ధమగు నీప్రపంచము త్రికాలములయందును లేనిదే యగును. కావున వాస్తవస్థితిలో నాయందు భూతములును లేవు. నేను భూతములయందును లేదు. "నాకంటె (బ్రహ్మమునకంటె) భూతములు వేఱుగా నున్నవి" అనులోకవ్యవహారము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాశ్రయించి "బ్రహ్మమునకు భూతములతో సంబంధము లేదు" అని తెలియఁజేయుటకై యాకాశదృష్టాంతముచేఁ బైవిషయమును (114-వ పద్యంబునందు చెప్పంబడిన విషయమును) నిరూపించితిని కాని యథార్థస్థితిలో నాకంటే నితర మగునదియే లేదు. ఇది యథార్థము.

అవ. ఇట్లైన ప్రపంచమున కాధారము నీవగుదువోకావో నిశ్చయ మెట్లు ప్రపంచము నిన్ను (బ్రహ్మమును) ఆశ్రయించి యున్నదనుటకు నిదర్శనమేమి? అనినఁ జెప్పుచున్నాఁడు:—

చ. అనృత మచేతనం బసుఖ మైనజగంబు ఋతంబుఁ జేతనం
బును సుఖ మై విమూఢులకు భోగముగాఁ గనుపట్టు టెల్ల న
న్నెనయుటచేతఁ జుమ్మిది కపీంద్ర ఘృతాన్వితదుగ్ధపూరముల్
ఘనమధురంబు లై వెలయుకైవడి భక్తజనానురంజనా. 119

టీ. భక్తజనానురంజనా-భక్తజన=భక్తులను, అనురంజనా = సంతోషింపఁజేయునట్టి, కపీంద్ర=వానరశ్రేష్ఠా! ఘృత...ములు-ఘృత=నేతితో, అన్విత=కూడిన, దుగ్ధపూరములు = పాలు, ఘనమధురంబులై=మిగుల మాధుర్యము కలవియై, వెలయుకైవడిన్ = ఉన్నట్లు, ఇది=ఈకనఁబడుచున్న, అనృతము = అసత్యమైనట్టియు, అచేతనంబు = జ్ఞానశూన్యమైనట్టియు, అసుఖము = దుఃఖరూపమైనట్టియు, ఐనజగంబు = ప్రపంచము, విమూఢులకున్ = అజ్ఞానులకు, ఋతంబును=సత్యరూపమై, చేతనంబును = జ్ఞానవంతమై, సుఖమై=ఆనందరూపమైయున్నట్లు, భోగముగాన్ = అనుభవింపఁదగినదై (ఆనందరూపముతో కనఁబడిననే కాని యనుభవించుటకు శక్యము గాదు), కనుపట్టుటెల్లన్=కనబడుచుండుటయంతయు, నన్నున్ = పరబ్రహ్మరూపుఁడ నైన (అనఁగా: సత్యజ్ఞానానందస్వరూపుండ నైన నన్ను), ఎనయుటచేతంజుమ్మ=ఆశ్రయించుటచేతనే సుమా.

తా. భక్తజనులయభీష్టమును సిద్ధిఁజెందించు నోయాంజనేయా! భ్రాంతివలనఁ బ్రపంచము నాకంటె వేఱని చూచువారలు కూడఁ గొంచెము విచారించినచో "ఈప్రపంచము నన్నే (బ్రహ్మమునే) యాశ్రయించి యున్నది" యనియే గ్రహింతురు. దీనికి ననుమానప్రమాణ మాధారము. ఎట్లనిన: ఈప్రపంచము అసత్యమనియుఁ జ్ఞానశూన్యమనియుఁ దుఃఖరూప మనియుఁ ననుభవశాలుర కందఱకును దెలియును. దీనియందలిప్రతిపదార్థంబును బ్రత్యక్షముగా నశించుచుండుటయుఁ మనకంటె నధికకాలముండుపదార్థములకు వాయువు మొదలగువానికిఁ గూడ నవయవము లుండుటచే మనము చూచినపదార్థములవలెనే (అనఁగా: మనము చూడఁగా నశించినపదార్థములవలెనే యవియుఁ వాయువు మొదలగునవియు) నశించు ననుట సిద్ధాంతమై యుండు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టయుం "ప్రపంచము అసత్యము" అని దృఢముగా నిరూపించుచున్నవి. అవయవములు కలపదార్థములకు వృద్ధిక్షయములును సంకోచ వికాసములు నుండుటచే నాశముకూడ కలదనుట సిద్ధాంతము. నూతనావయవములు చేరుట వృద్ధియనియు నున్నఅవయవములు విడిచిపోవుట క్షయమనియుఁ జెప్పఁబడును. అవయవములకు నిట్టిస్వభావ (చేరుట విడుచుట యనుస్వభావ) ముండుటచే నవి (అవయవములు) తా మాశ్రయించి యున్న పదార్థము నొకప్పుడు సంపూర్ణముగ వదలినను వదలవచ్చును. ఇదియే నాశమని చెప్పఁబడును. ధ్వంస మైనను బాధ యైనను అవయవ వినాశమే. ఈరెంటికిని కారణములు వేఱువేఱు. అయినను స్వరూప మొక్కటి యగుటలో విరోధము లేదు కదా! "ఒక మనుష్యుఁడు మృతిఁజెందును. అప్పుడు వాని అవయవములు వానిని విడిచి పోలేదు. కావున నిది నాశముకాకూడదు కదా" యని యనియెదవేమో వినుము. అవయవ వియోగము లేని దెవ్వనికి? శరీరమునకే కదా? ఆశరీరము దహన మగునంతవఱకు నశింప దనుటయుం, అప్పుడు దానియవయవము దానిని సంపూర్ణముగా విడచిపోవు ననుటయు నిర్వివాదాంశమే. కావున మృతియుం వినాశమే. అప్పుడు పంచప్రాణములును మనస్సును నేత్రాదిగోళకములయం దుండి పనిచేయుంఇంద్రియములును అను ముఖ్యావయవములు తొలఁగి పోయినవి. మిగిలిన యవయవము లుండినను లేకున్న నొక్కటియే, కావున సర్వావయవములు నశింపకున్నను ముఖ్యావయవములు నశించుటవలన "మృతినాశము" అని చెప్పఁబడుచున్నది. ఈ కారణమువలన ప్రపంచమంతయు నవయవములు కదేల కావున నసత్య మైనది.

దీనిని తెలిసికొనువాఁడు మఱియొక్కఁ డున్నట్లు స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నది. కావున నిది పరునిచేఁ బ్రకాశింపఁజేయంబడవలసినదియే (స్వయముగాజ్ఞానము లేనిదే) కాని జ్ఞానరూపమైనదియుఁ గా దనుట నిర్వివాదాంశము.

ఇది దుఃఖరూప మనుట యనుభవసిద్ధమే, సుఖముగాఁ గానవచ్చుప్రతివిషయము నంతమున దుఃఖమే యగుట నందఱకు ననుభవములోనే యున్నది.

ఈవిధముగా నీప్రపంచ మసత్యజడదుఃఖరూప మైనను సత్యజ్ఞానసుఖరూపముగా నవివేకులకుఁ దోఁచుచున్నది. వివేకుల యనుభవమున కైనను అవివేకుల యనుభవమున కైనను కారణ మొకటియుండియే తీరవలయును. కారణము సత్యమా కాదా! యని కూడ మనము విచారింపనక్కఱలేదు. కార్యము సత్యమైనచోఁ గారణము సత్యమగును అసత్యమైనచో నసత్యమగును. నేను (బ్రహ్మము) సత్యరూపుఁడనయ్యు నసత్యరూపమగు ప్రపంచమునకుఁ గారణభూతుండనై యున్నాననుట పరిపూర్ణముగ వేఱగు విషయము. యథార్థస్థితిలో ప్రపంచము త్రికాలములయందును లేదుకదా! కార్యము సద్రూపమైనచోఁ గారణమునుగూర్చి విచారింపవలయును. కాని మొదటనే లేనిదైనచో దానికి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గారణమే యుండవలసిన పనిలేదు. కావున నేవిచారంబును జేయనక్కఱలేదు కదా. అది యట్లుండనిమ్ము. ప్రకృతమున నీప్రపంచము సత్యజ్ఞానానందరూపముతోఁ దోఁచుటకు నేది యైన నొకకారణముండి తీరవలయును. ఈజగంబునకు సత్యజ్ఞానానంద రూపము విరుద్ధము కావున నట్టిపదార్థముతో (సత్యజ్ఞానానంద రూపమైన పదార్థముతో) దీని కవశ్యము సంబంధ మెవ్విధముగా నైన నుండితీరవలయును. నాకంటె వేఱుగా సత్యజ్ఞానానందరూప మగుపదార్థము లేదని ఇదివఱకే యనేకయుక్తులతో నిరూపించియున్నాను. కావున నీప్రపంచ మేదియో యొకవిధముగా నాతోడనే (బ్రహ్మముతోనే) సంబంధపడియున్నది. ఈకారణమువలననే నారూపములగు నునికి ప్రకాశము ఆనందము ననునవి భ్రాంతివలన దీనికి స్వయముగానే యున్నట్లుతోఁచుచున్నవి. రుచి నేతికి సంబంధించినదే యైనను ఆనెయ్యి పాలయం దున్నప్పు డారుచి పాలకే స్వయముగా నున్నట్లు భ్రాంతివలనఁ దోఁచును. పచ్చిపాలనుండి వెన్నను దీసిన నాపాలు రుచిలేక యుండుటయే ఇందుకుఁ బ్రబలదృష్టాంతము. ఇట్లే ప్రపంచమునుండి నన్ను విభాగింపలేని యజ్ఞానులకు నారూపములైన సత్యజ్ఞానానందములే ప్రపంచమునకు స్వరూపము లని తోఁచును. నన్ను బ్రత్యేకముగా విభాగింపఁగల మహాత్ముల కట్లుతోపదు. ఈప్రబలానుమానమువలన "ప్రపంచస్థ సత్యజ్ఞానాదికమన్యమదీయం స్వకీయత్వే నవనీత రహితఘృతాదా వివ అనుభవవిరోధాత్" ప్రపంచమునందుండు సత్యత్వాదులు అన్యపదార్థమునకు సంబంధించినవే స్వయముగా కలవియే యనిన వెన్న లేని పాలయందు మాధుర్యము లేనట్లు బ్రహ్మమును దేనినుండి విభాగించిన మహాత్ముల కట్టియనుభవము (ప్రపంచము సత్యాది రూపమే యను ననుభవము) లేదు. కావున ననుభవవిరోధము వచ్చును. "అన్యదీయ సత్యత్వాదిమదన్వత్యబంధి నవనీతయుక్తక్షీరవత్" మఱియొక పదార్థమునం దున్న సత్యత్వాదులు దేనికిగలవో అది మొదటిపదార్థము సత్యత్వాదులు గలపదార్థము నాశ్రయించియే యుండును. వెన్న నాశ్రయించిన పా లీవిషయమున దృష్టాంతము. "తస్మాత్ జగత్ బ్రహ్మణ స్సంబధ్యతే" కావున ప్రపంచము పరబ్రహ్మముతో సంబంధించియేయున్నది. అను ననుమానముచే పైవిషయము దృఢముఁ జేయుచున్నారు. కావున భ్రాంతులకు "ఈప్రపంచమునందు నే నున్నట్లును ఈప్రపంచము నాయం దున్నట్లును దోఁచుటలో సంశయము లేదు. ఇట్టి కల్పితసంబంధ ముండుటయే యిట్లు తోఁచుటకుఁ గారణమని తెలిసికొనవలయును.

అవ. ఇట్లజ్ఞానుల యనుభవమునకుఁ గల్పితకారణము గలదని చెప్పి జ్ఞానుల యనుభవమునుగూర్చి చెప్పుచున్నాఁడు:—

క జ్ఞానుల కఖండసత్య, జ్ఞానానందస్వరూపసాక్షి నగుచు వి
జ్ఞానముచేఁ దెలియంబడి, నే నె సాక్షాత్కరింతు నిక్కం బనఘా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ఓ అనఘా=పాపరహితుఁడా! జ్ఞానులకుఁ=పరోక్షబ్రహ్మజ్ఞానము గలవారికి, అఖం...గుచుఁ-అఖండ = అపరిచ్ఛిన్నుఁడైనట్టియు, సత్య=సత్యస్వరూపుఁడైనట్టియు, జ్ఞాన=జ్ఞానరూపుఁడైనట్టియు, సాక్షినగుచుఁ = ద్రష్టనై, విజ్ఞానముచేత=వారు సంపాదించిన యనుభవజ్ఞానముచే, తెలియంబడి = తెలిసికొనఁబడి (అనఁగా: జ్ఞాత జ్ఞానము జ్ఞేయము అను త్రిపుటితో స్వస్వరూపమునకంటె భిన్నుండను గాఁ గనఁబడి తర్వాత స్వస్వరూపమునకంటె వేఱు కాక జ్ఞానియే నేనై, సాక్షాత్కరింతుఁ=ప్రత్యక్ష మయ్యెదను, నిక్కము=సత్యము.

తా. ఓ దోషరహితుఁడా! భ్రాంతుల యనుభవమునకుఁ గల్పితకారణము కలదని చెప్పితిని గదా! ఇఁక జ్ఞానవంతు లగువారు విచారదృష్టిచే నన్ను ప్రపంచమునుండి విభాగింతురు. కూటస్థునికంటె నభిన్నరూపునిగాఁ దెలిసికొందురు. వారికి నీప్రపంచ మంతయుఁ బ్రపంచరూపముతోఁ గానరాదు. నాస్వరూపముతోఁ గానవచ్చును. నేనేయై తోఁచును. వాస్తవస్థితిలో నాకంటె నన్యముగాఁ బ్రపంచమే వారికిఁ దోఁపదు.

తే. అట్లు గావున ననఘ మహాత్ము లెల్ల
సచ్చిదానందమయునిఁ గా సర్వకర్తృ
కరణకార్యములకు సాక్షిగాఁగ నన్ను
దెలిసి యనవరతంబు చింతింపవలయు. 121

టీ. అనఘ = కామక్రోధాదులులేనివాఁడా!, అట్లుగావునఁ=పైఁ జెప్పినరీతిగా సర్వమును నేనే కావున, మహాత్ములెల్లఁ=సూక్ష్మబుద్ధికలవా రందఱు, నన్నుఁ, సచ్చిదానందమయునిగఁ=సత్యజ్ఞానానందస్వరూపునిగాను, సర్వకర్తృ...ములకుఁ - సర్వ = సమస్తము లైన, కర్తృ=కర్తలకును (అనఁగాఁ జేయువాఁడు తెలిసికొనువాఁడు మొదలగు కార్యకర్తలకును) కరణ = వారికి సాధనములగు చిత్తేంద్రియాదులకును, కార్యములకుఁ=ఆసాధనములచే సాధింపఁదగిన దర్శనస్పర్శనాది కార్యములకును, సాక్షిగాఁగఁ= ద్రష్టనని (అనఁగా: వీని కన్నిటికంటె వేఱని అహంశబ్దార్థమగువస్తువనఁగాఁ దాను (ఆత్మ) ప్రస్తుతము సర్వప్రసిద్ధముగాఁ గానవచ్చుచున్న కర్తృకరణకార్యములకంటె వేఱు], తెలిసి, అనవరతంబు=ఎల్లప్పుడును, చింతింపవలయుఁ=ధ్యానముచేయవలయును.

తా. ఓ. దోషరహితుఁడా! ఇదియే సిద్ధాంత మగుటవలన జ్ఞాను లందఱును "నేను బ్రహ్మము. సత్యజ్ఞానానందరూపుఁడను. చేయువాఁడు చేయఁబడునది నేఁత అనువానికిని సాక్షిని" అని బాగుగాఁ దెలిసికొని నన్ను స్వస్వరూపునిఁగా నెల్లప్పుడు ధ్యానముచేసి చిత్తదార్ఢ్యము నొందవలయును. దానిచే ననాద్యవిద్య నశించును. ముక్తి కలుగును.

శ్లో. "భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః,
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే." (ఉపనిషత్తు)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. "సర్వప్రపంచరూపుఁ డగుబ్రహ్మమును దెలిసికొనఁగానే యవిద్య (యిదియే హృదయగ్రంథి) నశించును. సంశయములు తొలంగును. పునర్జన్మహేతువులగుకర్మలు క్షయము నొందును" అని వేద మీవిషయమును నొక్కి వక్కాణించుచున్నది.

క. అన విని హనుమంతుఁడు రా
మునిదివ్యపదారవిందములకుఁ ఘనవం
దనమాచరించి పలికెన్
వినయము భక్తియును దృఢవివేకము మెఱయన్. 122

టీ. అనవిని = అని చెప్పఁగా నాలకించి, హనుమంతుఁడు,| రాము...లకున్ - రామని=శ్రీరామునియొక్క, దివ్య=శ్రేష్ఠములయిన, పదారవిందములకున్=పాదకమలములకు, ఘనవందనమాచరించి=సాష్టాంగనమస్కారముఁ జేసి, వినయమున్ = అడఁకువయును, భక్తియున్, దృఢవివేకమున్=నిశ్చలమైన జ్ఞానంబును, మెఱయన్ = ప్రకాశించుచుండఁగా, పలికెన్=యిట్లని ప్రశ్న చేసెను.

తా. ఓపార్వతీ! అంత నాంజనేయుఁ డీవిధముగాఁ దనకు సర్వార్థము నుపదేశించిన రాముని జూచి భక్తిజ్ఞానము లుప్పొంగ నీక్రిందివిధముగాఁ బ్రశ్నఁ జేయ నారంభించెను.

అవ. ఇట్లు ప్రతిజ్ఞఁజేసి పరమేశ్వరుఁడు పార్వతికి నాంజనేయప్రశ్నమును వివరించి చెప్పుచున్నాఁడు:—

ఉ. ఏనియమంబులుం గలిగి యేసమయంబున నెవ్విధంబున
న్మౌనముపూనియో యదియు మానియొ మంత్రముతంత్ర మెద్దియో
నీనయరూప మారయఁగ నిర్గుణమో సగుణంబొ నెమ్మదిన్
ధ్యానము సేయఁగా వలయు నన్నియుఁ బ్రేమ నెఱుంగఁ జెప్పవే.

టీ. ఏనియమంబులుంగలిగి = ఏయాచారముల నవలంబించి, ఏసమయంబునన్ = ఎప్పుడు, ఎవ్విధంబునన్ = ఏరూపముగా, మౌనముపూనియో = మౌనవ్రతము నవలంబించియో (వాఙ్మౌనము అక్షమౌనము కాష్ఠమౌన మని మౌనము మూఁడువిధములు. మాటలాడకుండుట, ఇంద్రియముల నిర్బంధించుట, చేగాలు కదలింపకఁ గూర్చుండుట, అనునవి క్రమముగా వీనిలక్షణములు), అదియుమానియో = ఆ మౌనవ్రతమునుఁగూడ విడచియో, మంత్రము, తంత్రము, ఎద్దియో = ఏదికలదో, నీనయరూపమారయఁగన్ = నీ యథార్థస్వరూపము విచారింపఁగా, నిర్గుణమో = సత్వరజస్తమోగుణములులేనిదో, సగుణంబో = లేక అగుణములు కలదో, నెమ్మదిన్ = మనసునందు, ధ్యానము సేయఁగా వలయున్ = ఏవిధముగా ధ్యానముచేయఁగావలయునో, అన్నియున్ = సర్వవిషయములను, ప్రేమతోన్ = ప్రీతితో, ఎఱుంగ జెప్పవే = తెలియ నుపదేశింపుము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఓరామభద్రా! నాపైఁ గరుణకల్గి నాప్రశ్నముల కుత్తరమును జెప్పుము. నిన్ను స్వస్వరూపభూతునిగాఁ దలఁచుటకు నియమములేవి? కాల మేది? చేయవలసిన విధమేది? త్రివిధమానములలో దేనినైన నాశ్రయింపవలయునా? లేదా? మంత్రమేది? యనుష్ఠానముఁ జేయునప్పుఁ డాశ్రయింపవలసినరీతి యేది? నీరూపమును సగుణముగా ధ్యానింపవలయునా? నిర్గుణముఁగా ధ్యానింపవలయునా? వీని కన్నిటికిఁ జక్కని యుత్తరములనిచ్చి నన్నుఁ గృతార్థుఁజేయుము.

అవ. పరమేశ్వరుఁడు రాముని యుత్తరము నభివర్ణించువాఁడై యాంజనేయుని యజ్ఞానమును దెలుపుచుఁ బ్రతిజ్ఞ నభివర్ణించుచున్నాఁడు:—

క. అనినఁ జిఱునవ్వునవ్వుచు
మనమున దేహాత్మబుద్ధి మల్లడిగొన ని
ట్లనియెడు నాహనుమంతునిఁ
గనుఁగొని రాముండు పలికెఁ గౌతుక మలరన్. 124

టీ. అనినన్=అని యిట్లు ప్రశ్నఁజేయఁగానే, చిఱునవ్వునవ్వుచున్, మనమున=మనస్సునందు, దేహాత్మబుద్ధి=దేహమే యాత్మయనెడుతలంపు, మల్లడిగొనన్=అభివృద్ధి యగుచుండుటచేత, ఇట్లనియెడు నాహనుమంతునిన్=పైని వర్ణించినవిధముగాఁ బ్రశ్నఁ జేసినయా యాంజనేయుని, కనుఁగొని=చూచి, రాముండు, కౌతుకమలరన్=సంతోష ముతో, పలికెన్.

తా. ఈవిధముగా నాంజనేయుఁడు తా నెట్లుపదేశించినను దేహాభిమానమును విడువలేక పైవిధముగాఁ దన్నుఁ బ్రశ్నింపఁగానే రాముఁడు నవ్వి ఈక్రిందివిధముగా నుత్తరముఁ జెప్పుట కారంభించెను.

అవ. ఇట్లు తన్నుఁ బ్రశ్నచేసిన యాంజనేయునకు 'బ్రహ్మము నాత్మఁగా ధ్యానించువానికి దేశకాలాదినియమము లక్కఱలేదు' అను విషయమును యుక్తి పూర్వకముగా నిరూపించుచున్నాఁడు:—

ఉ. వానరనాథ దేహమును వాయువు లింద్రియపంక్తి చిత్తమున్
మానసబుద్ధు లే ననుచు మానము పూనినమానవాళికిన్
మానము దేశకాలనియమంబులు మంత్రము తంత్రముల్విధుల్
వానిని జూచుసాక్షి ననువానికి గల్గునె తద్వికారముల్. 125

టీ. వానరనాథ=వానరశ్రేష్ఠా! దేహమును = స్థూలశరీరంబును, వాయువులు = ప్రాణవాయువులును, ఇంద్రియపంక్తి=జ్ఞానకర్మేంద్రియములును, చిత్తమున్ = చిత్తం బును, (ఇది అంతఃకరణముయొక్క నాల్గవవృత్తి) మానసబుద్ధులు = మనో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బుద్ధులను, వీననుచుఁ = "నేను (అనఁగా నస్మచ్ఛబ్దార్థము), అని, మానము=అభిమానము, పూనినమానవాళికిఁ =పూనిన=అవలంబించియున్న, మానవాళికిఁ = పురుషునకు, మానము=త్రివిధ మానములును, దేశకాలనియమంబులు = "ఈస్థలమున నాచరింపవలయును, ఈకాలమున నాచరింపవలయును" అను నిష్కర్షయును, మంత్రము=ధ్యానము చేయవలసిన మంత్రంబును, తంత్రములు=ఆచరింపవలసిన క్రియాభేదములను, విధులు=అప్పు డవలంబింపవలసినయాచారములను ఉండును. వానిఁ =ఆదేశకాలాదులను (లేక దేహప్రాణాదులను), చూచుసాక్షి ననువానికిఁ =చూచునట్టిద్రష్టయే నేనని (అనఁగా: నస్మచ్ఛబ్దార్థమని తెలిసికొనినవానికి), తద్వికారములు = ఆదేశకాలాదివికారములు, కల్గునే=ఉండునా? (ఉండవనుట.)

తా. ఓయాంజనేయా! నీవిప్పటికిని దత్త్వమును దెలిసికొనలే కున్నావు. శరీరప్రాణమనోబుద్ధిచిత్తాహంకారములే యాత్మ యనియుఁ దనకంటె నీశ్వరుఁడు బ్రహ్మవిష్ణ్వాదిరూపములతో వేఱుగా నున్నాఁడనియుఁ దా నుపాసకుఁడనియుఁ దలఁచు నజ్ఞానికి దేశకాలాదినియమములు కావలయును. ఆనియమముల నవలంబింపకపోయిన స్వభ్రాంతి ననుసరించి తానే నరకాదిబాధల ననుభవించువాఁ డని తలంచుచు శ్రమ నొందును. అట్లుకాక "ఈదేహాదులఁ జూచుసాక్షిని గాని నే నీదేహాదులు కాదు' అని వివేకదృష్టిచే విభాగించి యెఱింగినవానికి నీదేశకాలాదినియమము లక్కఱలేదు. వానివలన (అనఁగా: వాని నాశ్రయింపకుండుటవలనఁ గలుగునరకబాధలు భ్రాంతి లేకపోవుటచే వానిని బాధింపవు. వాని నాశ్రయించుటవలనఁ గలుగుచిత్తశుద్ధ్యాదులను జిత్తసాక్షియగుటచే వానికి నుపకరింపవు. సుఖదుఃఖముల ననుభవించునది క్షరమే గాని యక్షరపురుషుఁడు గాఁడు కదా. ఈసుఖదుఃఖాదులు మాయాకార్యము లగు నభిమానాదులు విజృంభించుజాగ్రదవస్థయందే కానవచ్చుచు వానివిజృంభణము లేని సుషుప్త్యవస్థయందుఁ గానరాకపోవుటచే. నవియు మాయాకార్యము లగుదేహాదుల నాశ్రయించినవే యనుటకు సంశయములేదుకదా. కావున బ్రహ్మమును స్వాభిన్నునిఁగాఁ జూచువానికి దేనితోను బనిలేదు. సాక్షికి సాక్ష్యవికారము లంటవు. కావునఁ దన్నివర్తనోపాయముఁ గాని తత్ప్రవర్తనోపాయముగాని చేయ నక్కఱలేదు.

## ఆరూఢునిలక్షణము.

అవ. ఇట్లు సామాన్యముగా నిరూపించి దానినే విశేషముగా వివరించువాఁడై మొట్టమొదట తా నిదివఱకు చేసినబోధను సంగ్రహించి చెప్పుచున్నాఁడు:—

శా. ఆత్మానాత్మలు రెండు వస్తువులు లక్ష్యంబు ల్గదా యం దనా
త్మాత్మభ్రాంతి యనాదినుండి సహజం బై యుండఁగా నిప్పు డీ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాత్మజ్ఞప్తి వటంచుఁ జెప్పితిఁక నన్యం బేమియు న్లేదు శు
ద్ధాత్మప్రత్యగభిన్నపూర్ణపరమాత్మారామునిం దక్కఁగన్. 126

టీ. ఆత్మానాత్మలు-ఆత్మ = సత్యజ్ఞానానందస్వరూపుం డగుపరబ్రహ్మ మనునట్టియు, అనాత్మలు = అనృతజడదుఃఖరూపిణి యగుప్రకృతి యనునట్టియు, రెండువస్తువులు=రెండుపదార్థములును, లక్ష్యంబులుగదా=తెలిసికొనఁదగినవిగదా, అందున్ = ఆరెంటిలో, అనాత్మాత్మభ్రాంతి-అనాత్మ=ప్రకృతియే, ఆత్మ=ఆత్మయనెడు, భ్రాంతి=భ్రమ, అనాదినుండి = చాలకాలమునుండియు, సహజంబై యుండఁగన్ = స్వభావసిద్ధమై యుండఁగా, ఇప్పుడు, ఈవు = నీవు (త్వంపదార్థము), ఆత్మజ్ఞప్తివి = ఆత్మయని చెప్పఁబడుచున్న జ్ఞానమే స్వరూపముగాఁగలవాఁడవు, అటంచున్=అని, చెప్పితిన్, ఇఁకన్=ఇఁక (ఇట్లు గావున), శుద్ధా...మునిన్-శుద్ధ = నిర్మలమైన, ఆత్మ=కూటస్థునకును (లేక ఈశ్వరసాక్షియగు బ్రహ్మమునకును), ప్రత్యక్=జీవునకును (లేక జీవసాక్షి యగుకూటస్థునకును), అభిన్న=వేఱుకాని, పూర్ణ = సర్వపరిపూర్ణుఁడైన, పరమ=శ్రేష్ఠుఁడైన, ఆత్మారామునిన్=అంతర్యామిస్వరూపుని, తక్కఁగన్ = తప్ప, అన్యంబు = ఇతరపదార్థము, ఏమియును లేదు=ఏమాత్రము లేదు (సర్వము పరబ్రహ్మమే యనుట).

తా. ప్రపంచమంతయు భ్రాంతులదృష్టి ననుసరించి ఆత్మయు ననాత్మయు నని రెండువిధములుగా విభాగింపఁబడియున్నది. (జ్ఞాన మనఁగా: నీరెంటి యథార్థస్వరూపమును దెలిసికొనుటయేకదా. అజ్ఞానమువలన ననాత్మ నాత్మనుగా భ్రాంతిచే గ్రహించుచుండుట యనాదికాలమునుండి కలదు. నేనిదివఱకే సర్వమును యుక్తియుక్తముగా విభాగించి "జ్ఞానరూపుఁడగు నాత్మయే నీవు" అని చెప్పియున్నాను. భ్రాంతిసిద్ధమగుటచే నీప్రపంచమునకు (త్రాటియందలి పామునకువలె భ్రాంతి) జ్ఞానమునకంటె వేఱగురూపము లేకుండుటవలన జ్ఞానరూపుఁడగు నాత్మకంటె వేఱైనపదార్థము లేదనియు నిరూపించియున్నాను.

క. అసమానసమగ్రతురీయసమాధినిఁ బొందు మింద్రియమనోబుద్ధి
శ్వసనగ్రసనాభ్యసనవ్యసనము వెస నుడిగి సమరసాత్ముఁడవగుచున్.

టీ. ఇంద్రి...నము-ఇంద్రియ = ఇంద్రియములయొక్కయు, మనః = మనస్సుయొక్కయు, బుద్ధి=బుద్ధియొక్కయు, శ్వసన=ప్రాణములయొక్కయు, గ్రసన=నిగ్రహమును, అభ్యసన=అభ్యసించుటయనెడు, వ్యసనము = శ్రమను, వెసన్ = శీఘ్రముగా, ఉడిగి=వదలి, సమరసా...గుచున్-సమరస = ఏకమైన (అనఁగా: బ్రహ్మాభిన్నుండైన), ఆత్ముఁడవగుచున్=కూటస్థుఁడవై, అస...ధిన్-అసమాన=సాటిలేని, సమగ్ర = సంపూర్ణమైన, తురీయసమాధిన్=నిర్వికల్పసమాధిని, పొందుము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఓ యాంజనేయ ! ఈజ్ఞానమును దృఢముఁజేసికొని పరిపూర్ణనిర్వికల్పసమాధిని జెందుము. మనోబుద్ధీంద్రియప్రాణము నిగ్రహింప శ్రమ నొందవలదు. వాస్తవస్థితిలో మనోబుద్ధ్యాదులును నీకంటె నన్యములు కానేరవుకదా ! భ్రాంతులదృష్టి ననుసరించి చూచిన మనోబుద్ధ్యాదులకు సాక్షివగుటచే నవి (మనోబుద్ధ్యాదులు) నిగ్రహింపఁబడినను నిగ్రహింపఁబడకున్నను వానివలన హానిలేదు. వివేకులదృష్టి ననుసరించిన నవి (ఆ మనోబుద్ధ్యాదులు) బొత్తుగనే లేవు. "కావున నెట్లు చూచినను మనోబుద్ధ్యాదులు నిగ్రహింపఁబడినను నిగ్రహింపఁబడకున్నను నిర్వికల్పసమాధికి భంగమును గలిగింపంజాలవు. "నేను సర్వసాక్షిని" అనికాని "నేను సర్వాత్మకుండను" అని కాని ధ్యానముజేయుట నిర్వికల్పసమాధి యనఁబడును. ఈద్వివిధమగు సమాధికిని బాగుగ విచారించినచో మనోబుద్ధ్యాదు లెట్లును భంగమును కలిగింపంజాలవు.

అవ. పైఁ జెప్పినవిషయమునే వివరించుచు త్వం పదార్థమునుగూర్చి మఱియొకమాఱు వివరించుచున్నాఁడు:—

క. మాయామయజాయాసుత, కాయేంద్రియమానసాధికపరిత్యాగో
పాయజ్ఞేయామేయ, ధ్యేయాత్ముఁడ వీవు గురువిధేయాత్మవరా.

టీ. గురు...వరా-గురు=గురువులకు, విధేయ=అనుకూలమైన, ఆత్మ=మనస్సుగలవారలలో, వరా=శ్రేష్ఠుఁడా ! ఈవు=నీవు, మాయా...డవు-మాయామయ = మాయాస్వరూపులైన, జాయా=భార్య, సుత = పుత్రుఁడు, కాయ = శరీరము, ఇంద్రియ = ఇంద్రియములు, మానసాదిక=మనస్సు మొదలగువానిని, పరిత్యాగోపాయ = నావియని యభిమానింపక విడుచుట యనునుపాయముచే, జ్ఞేయ= తెలియఁదగినట్టియు (నేతి నేతి యను మహావాక్యముననుసరించి సర్వమును నిషేధింపఁగా మిగిలి లక్ష్యమగునట్టియు), అమేయ=ప్రమాణములకు గోచరము కానట్టియు, ధ్యేయాత్ముఁడవు = అభేదముగా ధ్యానింపఁదగినట్టియుఁ బరబ్రహ్మంబవు.

తా. గురుజనులకు విధేయులగువారలలో శ్రేష్ఠుఁడా ! భార్య పుత్త్రులు దేహము ఇంద్రియములు మనస్సు మొదలగునవి యన్నియును మాయామయములే (అనఁగా: నవిద్యాకల్పితములే) కావున వానియం దాత్మాభిమానము చేయఁజనదు. ఇట్లు వాని నభిమానింపకుండుటయే నీయథార్థస్వరూపమును (అనఁగా: సాక్షియగు కూటస్థుని తత్త్వమును తెలిసికొనుట కుపాయము. "నేతి నేతి = ఇది కాదు ఇది కాదు" అను మహావాక్యమువలన నన్నిటిని (అనఁగా: శరీర మంతయును త్రోసివేయఁగా మిగిలిన యభిమాన పరిత్యాగసమయమున నీస్వరూపము (కూటస్థుని యథార్థస్వరూపము) సుస్పష్టమగును. అప్పుడు కూటస్థజీవులకును తన్మూలమున జీవబ్రహ్మలకును భేదము లేదని ధ్యానించుటకు వీలుకలుగును. వాస్తవస్థితిలో నీవు శరీరముతో సంబంధపడువాఁడవు కావు కదా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. ఏదేశమున నైన నేకాలమున నైన
        నేమి సేయుచునైన నెట్టులైన
నఖిలవికారంబు లావిద్యకంబులు
        నే నవికారుండ నిష్ప్రపంచ
నిర్వికల్పాఖండనిశ్చలనిర్మలా
        వ్యయసచ్చిదానందమయనిరీహ
పరిపూర్ణనిర్గుణప్రత్యగాత్మాభిన్న
        పరమాత్ముఁడ నటంచుఁ బరమనిష్ఠ
తే. సంతతంబును దనుఁ గాంచుసజ్జనునకు
మంత్రతంత్రంబు లేల కర్మంబు లేల
జపతపోవ్రతదానయజ్ఞంబు లేల
నామవర్ణాశ్రమాభిమానంబు లేల. 129

టీ. ఏదేశముననైనన్=ఏస్థలమునందైనను, ఏకాలముననైనన్ = ఏసమయమందైనను, ఏమి సేయుచునైనన్, ఎట్టులైనన్ = ఏవిధముగానైనను, అఖిలవికారంబులు = కనఁబడుచున్న సకలవికారములును, ఆవిద్యకంబులు = అవిద్యవలనఁ గలిగినవి, నేను, అవికారుండన్=వికారములులేనివాఁడను, నిష్ప్ర...త్ముఁడన్-నిష్ప్రపంచ=లోకాతీతుఁడనైనట్టియు, నిర్వికల్ప = సంకల్ప వికల్పములు లేనట్టియు (లేక ఇట్టి దట్టి దన రానట్టియు), అఖండ=పరిచ్ఛేదములు లేనట్టియు, నిశ్చల = చలింపనట్టియు, నిర్మల = పరిశుద్ధమైనట్టియు, అవ్యయ = నాశరహితుఁడనైనట్టియు, సత్ = సత్ స్వరూపుఁడనైనట్టియు, చిత్=జ్ఞానస్వరూపుఁడనైనట్టియు, ఆనందమయ = ఆనందరూపుఁడనైనట్టియు, నిరీహ=చేష్టలు లేనట్టియు (లేక కోర్కులు లేనట్టియు), పరిపూర్ణ = సర్వవ్యాపకుఁడనైనట్టియు, నిర్గుణ = గుణములులేనట్టియు, ప్రత్యగాత్మ = జీవసాక్షియగు కూటస్థునకు, అభిన్న=వేఱుగానట్టియు, పరమాత్ముండన్ = పరబ్రహ్మరూపుఁడను, అటంచున్ = అని, పరమనిష్ఠన్ = మిగుల నేకాగ్రతతో, సతతంబున్ = ఎల్లప్పుడును, తనుగాంచుసజ్జనునకున్ = తన్నుఁ దాఁ జూచుకొనుచుండు మహాత్మునకు, మంత్రతంత్రంబులు-మంత్ర = ఓంకారము మొదలగు మంత్రములును, తంత్రంబులు=శాస్త్రములును (లేక అనేకవిధములగు విధులును), ఏల=ఎందులకు, కర్మంబులేల = కర్మలెందులకు, జపం...బులు-జప = మంత్రానుష్ఠానములును, తపః = కృచ్ఛ్రచాంద్రాయణాదులును, వ్రత = ఏకాదశీ శివరాత్ర్యాది వ్రతములును, దాన=బహువిధములగు దానములును, యజ్ఞంబులు=వైశ్వదేవాది పాకయజ్ఞములును అగ్నిష్టోమాది హవిర్యజ్ఞములును, ఏల=ఎందులకు, నామం...బులు-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నామ=పేరులయందుఁగాని, వర్ణ=జాతులయందుఁగాని, ఆశ్రమ= ఆశ్రమములయందుఁగాని, అభిమానంబును=ఇవి నావి యను నభిమానము, ఏల = ఎందులకు (అనఁగా : ఈ యభిమానముల నవలంబించి చేయఁబడవలసిన కార్యములు వారికేమియుఁ లేవు. ఈ యభిమానములు కలిగియుండిన సాధ్యసాధన సాధకభేదములు గలకర్మలుచేయఁబడును) ముక్తి (అనఁగా : స్వతస్సిద్ధమగు జీవబ్రహ్మైక్యము కర్మసాధ్యముకాదు కావున దానిని సాధించుటకు వర్ణాద్యభిమానములు పనికిరావు.

తా. కావున నిట్టికూటస్థతత్త్వము నెఱింగి యాకూటస్థునికంటె యభిన్నుఁడై నట్టియు (సర్వపరిపూర్ణుఁ డైనట్టియు సత్యజ్ఞానానందరూపుఁ డైనట్టియుఁ నిశ్చలుఁడై నట్టియు (నాశరహితుఁడైనట్టియు "ఇట్టివాఁడు" అని నిరూపింపఁబడుటకు వీలులేనట్టియు ప్రపంచమున కతిరిక్తుఁడైనట్టియు "వీఁడువాఁడు" అనుభేదములు లేనట్టియుఁ సాటిలే నట్టియు నాయద్వితీయపరబ్రహ్మతత్త్వము నే నేను. నాకు వికారము లంటవు. సర్వవికారములును అవిద్యాకల్పితమువలె యగుటచేత వాస్తవములు కావు. అని యావిధమున నే మహాత్ముఁడు సర్వదేశసర్వకాలసర్వావస్థలయందు నాత్మావలోకమును జేయుచుండునో వానికి మంత్రములతో నేమిపని? విధులేల? బహువిధకర్మములెందులకు? జపంబులుగాని తపస్సులుగాని దానములుగాని యజ్ఞములుగాని యేమిటికి ? "నేను బ్రాహ్మణుఁడను బ్రహ్మచారిని" అని వర్ణాశ్రమాభిమాన మేమిపనిచేయును? వీనితో యోగారూఢుఁడగు మహాత్ముఁడు (అనఁగా: బ్రహ్మాత్మైక్యనిష్ఠకలవాఁడు) సాధింపఁదగినకార్యము లేవియుఁ లేవు. మఱియొకవిశేషము. వర్ణాశ్రమాభిమానము లుండినఁ గాని తత్తదుచితకర్మలనాచరించుటకు వీలులేదు. కావున నన్నింటికంటె మునుపు వర్ణాశ్రమాభిమానమును విడప కర్మలను తర్వాత సకలవిధము లగుమంత్రాదులకు (అనఁగా: "ఈమంత్రాదుల ననుష్ఠించిననేకాని సిద్ధి కలుగదు" అనునభిప్రాయంబును) సంపూర్ణముగ వదలివేయవలయును. ఇట్లు చెప్ప నేటికి పరిపూర్ణజ్ఞానము కలిగినయెడల వానియంత నవియే విడచిపోవును. భ్రాంతిచే నూరక క్షరాక్షరపురుషులకు సంబంధము కలవని తలఁచుటయే కాని వాస్తవస్థితిలో నది (అసంబంధము) యెప్పటికిని లేదుకదా.

తే. వాయుసుత సర్వవాసనావాసితంబు
సూక్ష్మదేహంబు జడ మగు సుమ్ము దాని
నంటక వెలుంగు చుండు చిదాత్ముఁ డచ్చి
దాత్ముఁ డగువానివికృతు లెట్లంటు ననఘ. 130

టీ. అనఘ = దోషరహితుఁడ వైన, వాయుసుత = వాయుపుత్త్రుఁడా, సూక్ష్మదేహంబు=సూక్ష్మదేహము, సర్వవాసనావాసితంబు-సర్వ=సమస్తవిధములైన, వాసనా=కర్మవాసనలచేత, అవాసితంబు=నివసింపఁబడియున్నది జడము=అచేతనమయినది (అనఁగా:

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్రహ్మప్రకాశము లేక ప్రకాశింపనిది), అగుసుమ్ము=అయియున్నదిసుమా, చిదాత్ముఁడు=జ్ఞానస్వరూపుఁడగుపరమాత్మ, దానిన్ = ఆసూక్ష్మశరీరముతో, అంటక = సంబంధపడక, వెలుంగుచుండున్ = ప్రకాశించుచుండును (దానికి సాక్షియగుటచే దానితో సంబంధపడకుండును), అచ్చిదాత్ముఁడగువానిన్ = అట్లు జ్ఞానరూపముతో సాక్షియైయున్న పరబ్రహ్మమును, వికృతులు=వికారములు, ఎట్లంటున్ = ఎట్లు స్పృశింపఁగలవు (మంత్ర తంత్రములు వర్ణాశ్రమాభిమానములు మొదలగు వికారములు ఆత్మ కెప్పటికిని లేనేలేవని భావము).

తా. ఓదోషరహితుఁడా! సకలకర్మవాసనలును సూక్ష్మదేహమును (అనఁగా : నందు ప్రధానావయవ మగునంతఃకరణమును) ఆశ్రయించియే యున్నవి. ఆయంతఃకరణము కూడ బ్రహ్మప్రకాశము లేక ప్రకాశింపదు. కావున నచేతనమే ఆత్మజ్ఞానరూపుఁడగుటచే నాసూక్ష్మశరీరమునకు (మనసునకు) సాక్షియై మాత్రమే యున్నాఁడు. చూడఁబడు పదార్థముయొక్క వికారములు చూచువాని నంటు ననుట విరోధము. కావున నీయంతః కరణమునందలి వాసనలు సాక్షి నేమియు బాధింపఁజాలవు. కావున నాత్మ యెప్పటికిని నిర్వికారుఁడే.

సీ. ఘటగతనానావికారము లత్ప్రకా
        శకసూర్యు నంటనిచందమునను
దేహేంద్రియప్రాణధీమనోఽహంకార
        తద్ధర్మతతులు తద్భాసకుండు
సాక్షియై యొప్పారుసచ్చిదానందమ
        యాత్ముని బొరయ వయ్యాత్ముఁ డగుచు
వెలుఁగుపండితున కెవ్విధమునఁ గల్గు వ
        ర్ణాశ్రమాచారాదులరసి చూడఁ
ఆ. గర్త గాఁడు గానఁ గరణకార్యములును
    భోక్త గాఁడు గాన భోజ్యభోగ
    ములును లేవు సర్వమును గల్గదతనికి
    సర్వరూపుఁ డగుట సాధువర్య. 131

టీ. సాధువర్య=సజ్జనులలో శ్రేష్ఠుఁడా! ఘటగతనానావికారములు-ఘట=కుండను, గత = ఆశ్రయించియున్న, నానా = అనేకవిధములైన, వికారములు = నలుపు వర్తులత్వము మొదలగువికారములు, తత్ప్రకాశకసూర్యున్-తత్ =ఆఘటమును, ప్రకాశక= ప్రకాశింపఁజేయుచున్న, సూర్యున్ = సూర్యుని, అంటనిచందంబునన్ = చెందనట్లు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేహేం...తులు - దేహ=స్థూలసూక్ష్మకారణశరీరము, ఇంద్రియ=జ్ఞానకర్మేంద్రియములను, ప్రాణ=పంచప్రాణములను, ధీ=బుద్ధియును, మనః = మనస్సును, అహంకార=అభిమానంబును, తత్ =ఆదేహాదులయొక్క, ధర్మ=ధర్మము లైన యాఁకలిదప్పి మొదలగు వానియొక్క, తతులు = సమూహములు, తద్భాసకుండు-తత్ = ఆదేహాదులను, భాసకుండు=ప్రకాశింపఁజేయునట్టివాఁడును, సాక్షియై = వానినిజూచువాఁడునై, ఒప్పారు ...త్మునిన్-ఒప్పారు = ప్రకాశించుచున్న, సత్ = సత్స్వరూపుఁడును, చిత్ = జ్ఞానస్వరూపుఁడును, ఆనందమయ = ఆనందస్వరూపుఁడును అయిన, ఆత్మునిన్ = కూటస్థుని, పొరయవు = పొందవు. అరసిచూడన్ = విచారింపఁగా, అయ్యాత్ముఁడగుచున్ = అట్టి కూటస్థుఁడై, వెలుఁగుపండితునకున్ = ప్రకాశించుచున్న బ్రహ్మజ్ఞానికి, వర్ణా...దులు-వర్ణ=బ్రాహ్మణాదిజాతులు, ఆశ్రమ = బ్రహ్మచర్యాద్యాశ్రమములు, ఆచార = ఆవర్ణాశ్రమములకుఁ దగినయాచారములును, ఆదులు = మొదలగునవి, ఎవ్విధమునన్ = ఎట్లు కల్గున్, అరసిచూడన్ = ఆలోచింపఁగా, కర్తగాఁడు గానన్ =ఆబ్రహ్మజ్ఞాని బ్రహ్మమే యగుటచేత నేమియును చేయఁడు కావున, కర...ములును-కరణ = సాధనములుకాని, కార్యములును = సాధ్యములుఁకాని, భోక్త గాఁడుగానన్ = అనుభవించువాఁడు కాఁడు కావున, భోజ్య...ములును-భోజ్య = అనుభవింపఁదగినవికాని, భోగములును = అనుభవములుకాని, లేవు, సర్వరూపుఁడగుటన్ =సర్వమయుఁడగుటచేత, అతనికిన్ = ఆబ్రహ్మజ్ఞానికి, సర్వమును=ఏదియును, కల్గదు=ఉండదు. (తనకంటె భిన్నమగుపదార్థములేదు. కావున నాబ్రహ్మజ్ఞానికి నభిమానింపఁదగినవస్తు వేదియును లేదు. వికారములు కూడ నాతనికంటె వేఱు కావు. కావున నవికూడ వాని నంటవు.)

తా. ఓసత్పురుషశ్రేష్ఠా ! సూర్యుఁడు ఘటమును బ్రకాశింపఁజేయుఁ చున్నయట్లే ఆయాత్మయుఁ సూక్ష్మదేహమును బ్రకాశింపఁజేయుచున్నాఁడు. ఘటమునందలి వికారములు వర్ణము మొదలగునవి ఆసూర్యుని సంక్రమింపనియట్లే యీసూక్ష్మాదిశరీర ప్రాణాంతఃకరణాదులయందలి వికారములు ఆఁకలి దప్పి కుంటితనము మూఢత్వము మొదలైనవి యాయాత్ముని నంటవు. కావున యథార్థస్థితి నెఱింగి దేహాత్మాభిమానమును వదలి నిశ్చలపరిపూర్ణబ్రహ్మమే తా నని తెలిసికొనినజ్ఞానికి నీవికారములతో సంబంధమెట్లు కలుగఁగలదు. కలుగనేరదు. మఱియుఁ నాపండితుఁడు (బ్రహ్మము) వాస్తవముగఁ గర్త (దేనినైననుఁ జేయువాఁడు) కాఁడు. కావున కరణములగు చిత్తేంద్రియాదులు కాని కార్యములు కాని యాతనికి లేవు. భోక్త (అనుభవించువాఁడు) కాఁడు. కావున భోజ్యములు (ఇవియుఁ జిత్తేంద్రియాదులే పనినిఁజేయుటకు సాధనము లగుటచేఁ గరణములనియు, క్రియాఫలము ననుభవింపఁజేయునవి యగుటచే భోజ్యము లనియుఁ వీనికే పేరు.) భోగంబులు నీతనికిఁ [illegible] కర్తయైనను భోక్తయైనను [illegible] కార్యముల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కంటెను భోజ్యభోగములకంటెను వేఱై తీరవలయును. ప్రకృత మాత్మ జ్ఞానరూపుఁడగుటచేతను బ్రపంచము భ్రాంతిసిద్ధమగుటచే దానికి (భ్రాంతికి) జ్ఞానమునకంటె నితర మగుస్వరూపము లేకపోవుటచేతను సర్వము నాత్మయే. కావున నీయాత్మ యేపదార్థమున కంటెను భిన్నుఁడైయుండుటకు వీలులేదు. కావున నీయనకు (బ్రహ్మమునకు బ్రహ్మము నాత్మఁగా నెఱింగిన విద్వాంసునకు) దేనితోను సంబంధ మున్నదనుటకు నవకాశములేదు. తనకంటె భిన్నమైనపదార్థ మొకటి యుండిననేకాని (అనఁగా: రెండుపదార్థము లుండిననేకాని) సంబంధమనునది సిద్ధింపదు కదా.

క. జ్ఞాని యనఁగ వేఱొక్కఁడె, నేన సుమీ తెలియనాతనికినాకును సు
జ్ఞానముచేఁ బరికించినఁ, గానఁబడదు భేద మెందుఁ గవినుతచరితా.

టీ. కవినుతచరితా - కవి=బ్రహ్మజ్ఞానులచేత, నుత = స్తోత్రముచేయఁబడుచున్న, చరితా=చరిత్రగలవాఁడా!, జ్ఞానియనఁగన్ = బ్రహ్మజ్ఞానియనిన, వేఱొక్కఁడే=మఱియొక్కఁడా (అనఁగా: నాకంటె భిన్నుఁడా), తెలియన్ =తెలిసినట్లయిన, నేన సుమీ= నేనే సుమా! సుజ్ఞానముచేన్=చక్కని జ్ఞానముచే, పరికించినన్ =విచారించినచో, ఆతనికిన్ =ఆబ్రహ్మజ్ఞానికిని, నాకున్, ఎందున్ =ఎచ్చటను (అనఁగా: కొంచమైనను భేదము కానఁబడదు).

తా. స్తోత్రము చేయఁదగినసద్గుణములు కలయాంజనేయా! వాస్తవస్థితిని విచారించిన జ్ఞాని యనిన వేఱు నే ననిన వేఱు నగునా? వివేకదృష్టిచే విచారించిన నాకు నాతనికి నించుక యైనను భేదము కానరాదు. జ్ఞానియే యననేల? యజ్ఞానికిని నాకును మాత్రము భేదము కలదు. భ్రాంతిచే నట్లు భావించుటయే కాని వేఱేమియు లేదు కదా.

క. జ్ఞానికి నేను బరోక్షుఁడఁ, గాను బరోక్షుండు నాకు గాఁడతఁడిది సు
జ్ఞానం బజ్ఞున కిది మదిఁ, గానఁబడదు తన్ను నన్ను గానమి ననఘా!

టీ. అనఘా=దోషరహితుఁడా! నేనున్, జ్ఞానికిన్ = బ్రహ్మజ్ఞానికి, పరోక్షుఁడఁ గాను=వేఱుగా నున్నవాఁడనుకాను, అతఁడు=ఆబ్రహ్మజ్ఞానియు, నాకున్, పరోక్షుండు గాఁడు, ఇది=ఈవిషయము, సుజ్ఞానంబు = బ్రహ్మజ్ఞాన మనఁబడుచున్నది. తన్నున్ =ఆ జ్ఞాని యైనతనను (జీవుని), నన్నున్ =జ్ఞానరూపుఁడ నైననన్నుఁగా, కానమిన్ = తెలిసికొనక పోవుటచేత, ఇది=ఈబ్రహ్మజ్ఞానము, అజ్ఞునకు = అజ్ఞాని యనువానికి, మదిన్ = మనస్సునందు, కానఁబడదు = గోచరము కాదు. (తెలిసికొనినను తెలిసికొనకున్నను బ్రహ్మ మొకటేవిధముగ నున్నాఁడు. బంధమోక్షములకు అజ్ఞానజ్ఞానంబులు మాత్రమే కారణములు అని భావము.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఓదోషరహితుఁడా! జ్ఞానికి నేను కాని నాకు జ్ఞాని కాని పరోక్షులము (వేఱుగవారము) కాము. ఇదియే (ఇట్టియ భేదమే) యనుభవజ్ఞానము. అజ్ఞానికి నిది కలుగదు. యథార్థస్థితిలో నభేదమేమైనను వానికి వివేకహీనతచే గోచరము కాదు. వాఁడు తనస్వరూపమునుగూర్చియు (జీవునియథార్థస్వరూపమును గూర్చియు) నాస్వరూపమును గూర్చియుఁ (యీశ్వరుని యథార్థస్వరూపమును గూర్చియు) విమర్శింపనేరఁడుకదా.

అవ. ఈవిధముగ "జ్ఞానికి దేశకాలనియమము లక్కఱలేదు" అని చెప్పి "బ్రహ్మరూపము సగుణమా? నిర్గుణమా?" అను ప్రశ్నమున కుత్తరమును జెప్పుచున్నాఁడు:—

క. త్రిగుణాత్మిక యగుప్రకృతిం
దగిలినచో సగుణుఁ డండ్రు దాని విడుచుచో
నగుణుఁ డని యండ్రు నన్నతి
సుగుణులు నీరెండు గాను జుమ్మవి లేమిన్. 134

టీ. అతిసుగుణులు = మిగుల శాంతశమదమాదిసద్గుణములుగలవారలు, నన్నున్ = త్రిగుణాత్మిక = సత్త్వరజస్తమోగుణరూపిణి, అగుప్రకృతిన్ = ఐనట్టిమాయను, తగిలినచోన్ = స్పృశించినచో, సగుణుఁడండ్రు = గుణములతోఁ గూడియున్నవాఁడనని చెప్పుదురు. దానిన్ = ఆమాయను, విడుచుచోన్ = విడచియుంటినేని, అగుణుఁడనియండ్రు = నిర్గుణుఁడనని చెప్పుదురు. అవిలేమిన్ = ఆగుణములు బొత్తుగనే త్రికాలములయందును లేకపోవుటచేత, ఈరెండు = పైచెప్పినరెండును, కానుజుమ్ము = నేను కానుసుమా! (గుణములు మొట్టమొదట యథార్థము లగునేని నేను తత్సంబంధముచేతను, తత్సంబంధము లేకపోవుటచేతను సగుణుఁడనుగాను, నిర్గుణుఁడనుగాను కావచ్చును. గుణములే యథార్థములు కావు. కావున నే నిం దేదియును గానని భావము.)

తా. ఇక నారూపమును గూర్చినవివరణ మేమి యనిన: భ్రాంతు లగువారు నన్నుఁ ద్రిగుణరూపిణి యగుప్రకృతితోఁ గూడినవానినిగాఁ దలంచి "సగుణుఁడు" అనియును "ఆప్రకృతి నాకంటె (బ్రహ్మమునకంటె) వేఱుగా నున్నది" యనియుఁ "ఆప్రకృతితో నేను సంబంధపడకున్నాను" అనియుఁ దలంచి "నిర్గుణుఁడు" అనియుఁ జెప్పుచున్నారు. యథార్థస్థితిలో నాకు నీరెండుధర్మములును లేవు. వాస్తవస్థితిలో ప్రకృతి గుణంబులు ననునవి నాకంటె భిన్నముగ లేవు కదా.

లయగ్రాహి.—

భృంగములయందును బతంగములయందును వి
హంగములయందును గురంగములయందున్
సింగములయందును బ్లవంగములయందును దు
రంగములయందును భుజంగములయం దే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాంగు లగుదేవమునిపుంగవనరాదిఘన
జంగములయందును నజంగమములందుఁ
సంగమును భంగము గలుంగక యొకభంగిని వె
లుంగు నను నే నని కనుంగొనుము వత్సా!. 135

టీ. వత్సా=పుత్రా! భృంగములయందుఁ = తుమ్మెదలయందును, పతంగములయందుఁ=మిడతలయందును, విహంగములయందుఁ = పక్షులయందును, కురంగములయందుఁ = లేళ్లయందును, సింగములయందుఁ = సింహములయందును, ప్లవంగములయందుఁ=కోఁతులయందును, తురంగములయందును=గుఱ్ఱములయందును, భుజంగములయందుఁ = సర్పములయందును, ఏకాంగులు = జ్ఞాననిష్ఠులై ఏకాంతవాసులైన (లేక ఏకాంతభక్తిగలవారు), అగు...లందుఁ-అగు = ఐనట్టి, దేవ=దేవతలు, మునిపుంగవ= నారదుఁడు మొదలగు దేవఋషులు, వసిష్ఠుఁడు మొదలగు బ్రహ్మర్షులు, నర=మనుష్యులు, ఆది=మొదలగు, ఘన = శ్రేష్ఠులైన, జంగమములందు = సంచరించుభూతములయందును, అజంగమములందు = సంచరింపని పర్వతాదులయందును, సంగముఁ = సంబంధంబును, భంగముఁ=సంబంధము లేకుండుటయును, కలుంగక = చెందక, ఒకభంగిఁ = ఒకవిధముగా (అనఁగా ఈసర్వపదార్థముల నంటియుఁ నంటక సర్వకాలములయందు నొక్కవిధముగా), వెలుంగుననుఁ=ప్రకాశించుచున్న నన్ను (పరబ్రహ్మమును), నేనని=అస్మచ్ఛబ్దార్థమని (జీవుఁ డని), కనుంగొనుము=తెలిసికొనుము.

తా. ఓపుత్రా! నేను సర్వవ్యాపకుఁడను. దేనితోను సంబంధముగాని వియోగము కాని చెందువాఁడనుకాను. ఏకరూపముతోఁ బ్రకాశించువాఁడను. తుమ్మెదలు మిడతలు పక్షులు లేళ్లు సింహములు వానరములు గుఱ్ఱములు సర్పములు వీనియందును జ్ఞానముగాని భక్తిగాని కలిగియుండుటకుఁ దగినసామర్థ్యము కల దేవమునిమనుష్యాదులు అను తిర్యగ్రూపము లైనట్టియుఁ నట్లు కానట్టియుఁ ద్వివిధజంగమపదార్థములయందును స్థావరపదార్థములయందు నొక్కరీతిగ వెలుంగుచున్నాను. ఆపదార్థములతో సంయోగవియోగములు నాకు లేవు. కావున నారూపము సగుణ మని కాని నిర్గుణ మని కాని నిరూపించుటకు వీలు లేదు.

అవ. "దేహాభిమాన మనర్థదాయకము" అను విషయమును నిరూపించుచున్నాఁడు:—

తే. తనువు తా నసుదృష్టియె ధనువు కర్త
కనిశము గుణత్రయమ్ముతో నెనసి యున్న
యమ్మన మె యమ్ము దానికాయమ్ము లతిన
యమ్మలై ... దుర్విషయమ్ము లనఘ! 136

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. అనఘ = దోషరహితుఁడా! కర్తకున్ = నేనుచేయువాఁడను అని యభిమానించువానికి, తనువు = శరీరము, తాననుదృష్టియె = ఆత్మయనెడునభిమానమే, ధనువు= ధనుస్సు, అనిశమున్ =ఎల్లప్పుడును, గుణత్రయముతోన్=సత్వరజస్తమోగుణములతో, ఎనసియుంన్న=సంబంధపడియున్న, ఆమ్మనమే = ఆమనస్సే, అమ్ము = బాణము, దానికిన్ =ఆబాణమునకు, అతినయమ్ములై=మిగుల రమణీయములై, తోఁచుదుర్విషయమ్ములు=తోఁన వచ్చుచున్నశబ్దాదులు, ఆయమ్ములు=లక్ష్యములు.

తా. ఓదోషరహితుఁడా! దేహాభిమానయుక్తమైనమనస్సు సర్వానర్థములకును మూలకారణము "నేను కర్తను భోక్తను" అని యభిమానించువానికి దేహాత్మభావనయే ధనుస్సు. సత్వరజస్తమోగుణములతోఁ గూడియున్నమనస్సే బాణము. దుఃఖరూపములయ్యు సుఖమయములై తోఁచుచున్న శబ్దాదులే లక్ష్యములు. కావున దేహాత్మాభిమానము గలకర్త త్రిగుణములతో సంబంధించు మనస్సునకంటెఁ దాను వేఱని తెలిసికొనలేక భ్రాంతుఁడై దుఃఖరూపము లగుశబ్దాదుల సుఖరూపముగాఁ దలంచుచు వానినను భవించుటయందే మరగి అదియే సర్వమని తలంచుచు నాత్మయొక్క యథార్థస్వరూపమును గూర్చి విచారించుటకుఁ గొంచెమైనను బ్రయత్నింపఁడు. ఇట్టివానికి బ్రహ్మజ్ఞానమెట్లు కలుఁగును? కలుగనేరదు. కావున నన్నిటికంటె మొదలు దేహాభిమానమును విడువవలయును.

అవ. శరీరాభిమానత్యాగమున కుపాయముఁ జెప్పుచున్నాఁడు:—

క. మానస మఖిలంబులకుఁ బ్ర
ధానంబు ప్రధానమే ప్రధానము మదికిన్
దాని విడిచినను గను మది
తానవముం బొంది యంతఁ దా నవిసి చెడున్. 137

టీ. మానసము = మనస్సు, అఖిలంబునకున్ = సమస్తమునకును, ప్రధానంబు= ముఖ్యమైనది (అనఁగా మనస్సు వలననే సర్వమును బ్రవర్తించుచున్నది), మదికిన్= ఆమనస్సునకు, ప్రధానమే = సత్వరజస్తమోగుణరూపిణి యగుమాయయే, ప్రధానము= ముఖ్యమైనది (అనఁగా, బ్రధానము నాశ్రయించియే మనసు సంచరించుచున్నది). దానిన్ = ఆమాయను, విడిచి, ననున్=పరబ్రహ్మస్వరూపుఁడ నగునన్ను, కనుము=ఆత్మగా తెలిసికొనుము. (మనసు నంతర్ముఖముఁ జేయుము) అది = ఆమనస్సు, అంతన్ = పిదప, తానవమున్ = సూక్ష్మభావమును, పొంది, తాను, అవిసిచెడున్ = శిథిలమై నశించును. (బ్రహ్మమునందు మాయ లేదు కావున నాధారము లేకపోవుటచే మనసు నశించును.)

తా. సర్వమునకును మనస్సే ప్రధానమైయున్నది. మనోజయంబుచే సర్వజయంబు కలుగును; ఆమనస్సునకు త్రిగుణరూపిణి యగుమాయ ముఖ్యము. త్రిగుణములను విడచి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మనస్సుండదు. మనస్సంతయుఁ ద్రిగుణమయ సంకల్పరూపమే యనుట నిర్వివాదాంశము కదా! కావునఁ ద్రిగుణముల (అనఁగాఁ ద్రిగుణమయసంకల్పముల) జయించిన (అనఁగా "నేను సంకల్పించువాఁడను కాను. సంకల్పమునకు సాక్షిని" అని దృఢనిశ్చయము చేసికొనినచో) మనోజయము కలుగును. ఈదృఢనిశ్చయము కలుగుట కష్టముకాదు. నీవు (త్వంపదార్థము) భ్రాంతిచే మనస్సు మొదలగువానియందాత్మాభిమానము కలిగియుండుటయే కాని వాస్తవస్థితిలో నాకంటె (బ్రహ్మమునకంటె) వేఱు కావు కదా. కావున ఈవిషయము నెఱింగి ధ్యానించిన నామనస్సు లేక, దేహాభిమానము) క్రమక్రమముగా సూక్ష్మమై యభ్యాసపాటవము కలుగుకొలఁది సంపూర్ణముగా క్షీణించును. చక్కని యపరోక్షానుభవము కలుగును. ముక్తియుం హస్తగత మగును.

ఆ. ప్రకృతి వికృతి దాని ప్రకృతి యెఱింగి యో
సుకృతి! నన్నుఁ గనుము ప్రకృతమునను
నాత్మ నెఱుఁగనప్పు డాప్రకృతియె యప
కృతి యొనర్చు చుండు నెపుడు గడఁగి. 138

టీ. ఓసుకృతి=ఓపుణ్యాత్ముఁడా! ప్రకృతి = మాయ, వికృతి = వికారమే (ఈ కనఁబడు భేదము లన్నియును మాయయె), దాని ప్రకృతి=దానిస్వభావము, ఎఱిఁగి= తెలిసికొని, ప్రకృతమునన్ = ప్రస్తుతకాలమున (లేక తెలిసికొనవలసిన), నన్ను = పరబ్రహ్మస్వరూపుఁడ నైననన్ను, కనుము = తెలిసికొనుము. ఆత్మన్ = ఆత్మస్వరూపమును, ఎఱుఁగనప్పుడు = తెలిసికొనునప్పుడు, ఆ ప్రకృతియె=ఆమాయయే, ఎపుడు=ఎప్పుడును, కడఁగి=ప్రయత్నపూర్వకముగా, అపకృతి = అపకారమును, ఒనర్చుచుండున్=చేయుచుండును.

తా. ఓ పుణ్యాత్ముఁడా! మాయ యనఁగా వికారసమూహమే. ఈవిషయము నెఱింగి యామాయను విడువుము. "నేను మాయకు సాక్షిని కావున నీమాయ నన్నంటదు" అని దృఢనిశ్చయము కలిగి నన్నే (బ్రహ్మమునే) నీయథార్థస్వరూపభూతునిగాఁ జూడుము. ఇట్లు విమర్శపూర్వకముగాఁ దత్త్వమును గ్రహించుటకు నామాయయే సర్వకాలములయందును భంగము కలిగించుచుండును.

క. ఖంబు సుమీ మది విషయసు
ఖంబు సుమీ త్రిజగదభిముఖంబు సుమీ దుః
ఖంబు సుమీ యది తద్వ్యము
ఖంబు సుమీ నిరతిశయసుఖంబు కపీంద్రా! 139

టీ. కపీంద్రా = వానరశ్రేష్ఠా! మది=మనస్సు, ఖంబుసుమీ - ఆకాశమువంటిది సుమా! (అనఁగా స్వతస్సిద్ధశూన్యమైనది) అది=ఆమనస్సు, విషయసుఖంబుసుమీ = శబ్దాది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విషయముల ననుభవించుటయే స్వరూపముగాఁగలది (అనఁగా బ్రహ్మానందరూపమైనది కాదు), త్రిజగదభిముఖంబుసుమీ=మూఁడులోకములకు నెదురై యుండునది (అనఁగా: బహిర్ముఖమైనది), త్రిజగత్, అభిముఖంబుసుమీ, దుఃఖంబుసుమీ = దుఃఖరూపమైనది సుమా (సుఖమనఁగా బ్రహ్మానంద మొక్కటియే కావున విషయసుఖరూపమైనమనస్సు దుఃఖరూపమైనదే), నిరతిశయసుఖంబు = పరిపూర్ణమైన ఆనందము (అనఁగా బ్రహ్మానందము), తద్విముఖంబుసుమీ=అమనస్సునకు వ్యతిరిక్తముగా నున్నదిసుమా. (అమనస్సు బహిర్ముఖము కావున సర్వాంతరుఁడైన బ్రహ్మము దానికిఁ గానఁబడఁడు.)

తా. మఱియుఁ నోవాసరశ్రేష్ఠా! మనోజయము కష్టసాధ్యముకాదు. ఏలయనిన: మొదట మనస్సుయొక్క స్వరూపమే యభావము. అన్నియుఁ నజ్ఞానకల్పితములే కాని వాస్తవములు కావని ఇదివఱకే చెప్పియున్నాను కదా. "శూన్యమైన ననుభవమునకు వచ్చుటయెట్లు!"అని యనియెదవేమో వినుము. భ్రాంతిచే "నేను విషయముల ననుభవించుచున్నాను". అని తలంచుచు నాసంకల్పమును మనస్సనియుఁ దానికిని దనకును భేదములేదనియుఁ దలంచుచున్నారు; కాని సర్వము నవిద్యాకల్పితమే యగుటచే నభావరూపమే కదా. మఱియుఁ నీమనస్సు బహిర్ముఖ మైనదియే. కావున నాత్మస్వరూపమును జూడనేరదు. కావున నాత్మను బ్రమాణములచే నెఱుంగుటకు వీలులేదు. తన ప్రకాశముచేత దానే ప్రకాశించును కాని బ్రహ్మము పరప్రకాశముచేఁ బ్రకాశించు వాఁడు కాఁడు. ఈకారణములవలన మనసును సుఖముగా జయింపనగును. "నేను మనసునకు సాక్షిని" అను భావనయైనను "మనసు బొత్తుగనే లేదు" అను భావనయైనను దీనికి (అనఁగా మనోజయమునకుఁ) జాలును. ఈమనోజయ మత్యంతావశ్యకము. అది లేక బ్రహ్మానందము కలుగనేరదు. దుఃఖరూపములగు విషయములనే సుఖరూపములుగా భావించుచు నాత్మానాత్మ వివేకము లేనివానికి బ్రహ్మానందము కలుగదు కదా. "అహం బ్రహ్మాస్మి" యనునదికూడ చిత్తవృత్తియే యనుటకు సంశయము లేదు. అయినను వాస్తవస్థితినిబట్టిచూచిన నట్టి చిత్తవృత్తియుఁ భేదము నాశ్రయించి వచ్చినదియే కదా! వేలికొన తన్నుఁ దాను స్పృశింపనేరనియట్లు చిత్తము తనకంటె వేఱుకాని పరమాత్మను తెలిసికొనలేదనుట నిర్వివాదాంశము.

క. విను వినువీథి తెఱంగున
ఘనఘన మై విభువు సర్వగత మై తగుచే
తనుఁ దనుఁదను తనువునఁ గని
మనుమనుజుని బ్రతుకు బ్రతుకు మారుతతనయా! 140

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. మారుతతనయా = వాయుపుత్రా! వినుము. విభువు = పరమాత్మ, వినువీథి తెఱంగునన్=ఆకాశమువలె, ఘనఘనమయి=దట్టమై, సర్వగతమయి = అన్నిపదార్థములయందును వ్యాపించినదియై, తగున్ = ఒప్పుచున్నది, చేతనున్ = అజ్ఞానస్వరూపుఁడగు పరబ్రహ్మమును, తనున్=తననుగా (జీవునిఁగా), తనువునన్ = జ్ఞానమయశరీరమునందు, కని=చూచి, మను...బ్రతుకు-మను = బ్రతుకునట్టి, మనుజుని = మనుష్యునియొక్క, బ్రతుకు=జీవనమే, బ్రతుకు=జీవనము.

తా. ఓవాయుపుత్రా! మఱియొకవిషయమును వినుము. పరబ్రహ్మము ఆకాశమువలె సర్వద్రవ్యములతోఁగూడి మిగుల దట్టమై సర్వవ్యాపకుఁడై యున్నాఁడు. అట్టి యాజ్ఞానస్వరూపు నాత్మాభిన్నునిఁగా జ్ఞానమయశరీరమున (అనఁగా ననుభవజ్ఞానముచేఁ) జూచుచు జీవన్ముక్తుఁడై బ్రతుకు మనుష్యుని బ్రతుకే బ్రతుకు. తక్కినవారలు నిరర్థకజీవనులు.

క. సారాసారవిచార వి,శారదుఁ డగుసుకృతి వికృతిజనికృతితతికిన్
శారదనీరదసారవి,దూరవియత్తలముభంగిఁ దొలఁగి వెలుంగున్.

టీ. సార...దుఁడు-సార=సారభూతమయినట్టియు, అసార = నిస్సారమైనట్టియు బ్రహ్మప్రపంచములను గూర్చి, విచార = విచారించుటయందు, విశారదుఁడు = నేర్పరి, అగుసుకృతి=అయిన పుణ్యాత్ముఁడు, వికృతి...తికిన్-వికృతి = వికారములయొక్కయు (లేక వికృతి యని చెప్పఁబడుచున్న మాయవలన), జని = పుట్టిన, కృతి = కార్యములయొక్క (అనఁగా మనోబుద్ధ్యాదులయొక్క), తతికిన్ = సమూహమునకు, శారద...భంగిన్-శారద=శరత్కాల సంబంధమైన, నీరద=మేఘములయొక్క, వార = సమూహమునకంటె, విదూర = దూరమైన (అనఁగా మేఘములులేని), వియత్తలముభంగిన్ = ఆకాశమువలె, తొలఁగి=ప్రత్యేకమై, వెలుంగున్ = ప్రకాశించును (ఇచ్చట "శారదనీరద" అను మొదలగు నుపమానవాక్యముచే, పరబ్రహ్మ మెప్పటికి నాకాశమువలె నసంగుఁడైయే యున్నాఁడనియు అజ్ఞానదశయందుఁ బ్రపంచము బ్రహ్మసాక్షాత్కారమును నిరోధించును గాని జ్ఞానదశయం దట్లు చేయదనియు స్పష్టము చేయఁబడినది).

తా. "ఇది (బ్రహ్మము) సారభూతమైనది, ఇది (ప్రపంచము) నిస్సారమైనది" అని బాగుగ విచారించి తెలిసికొనిన మహాత్ముఁడు శరత్కాలమేఘములతో సహితము సంబంధములేక ప్రకాశించు నాకసమువలె మాయతోను దానినుండి పుట్టిన మనోబుద్ధిచిత్తాహంకారాదులతోను సంబంధములేక సర్వవ్యతిరిక్తుఁడై ప్రకాశించును. పరోక్షజ్ఞాన మున్నప్పటికిని అపరోక్షజ్ఞానము దృఢమగునంతవఱకు మాయ కొంత కొంత ప్రతిబంధమును కలిగించుచునేయుండును. కావున ... వలన క్రమ క్రమ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముగా జ్ఞానమును దృఢము జేసికొనవలయును. అప్పుడు శరత్కాలమునందలి మేఘములు స్వచ్ఛములగుటచే నాకాశము నావరించియు దానికి నప్రత్యక్షత్వమును గలిగింపనట్లు మాయయున్నను బ్రహ్మమున కప్రత్యక్షత్వమును గలిగింపదు. జీవన్ముక్తియందు ప్రారబ్ధకర్మ మనుభవింపంబడవలసి యుండుటచేత నవిద్య (లేక మాయ), సంపూర్ణముగ నశించుటకు వీలులేదు. "నేను కర్తను నేను భోక్తను" అను నభిమాన మెంత లేకున్నను ఫలానుభవము భేదములేక గలుగనేరదు కదా. కావున "మాయయున్నను జీవన్ముక్తికి ప్రతిబంధములేదు. అపరోక్షానుభవమునకు హానిలేదు. వివేకప్రభావమువలన నామాయ బ్రహ్మమున కప్రత్యక్షమును గలిగింపఁజాలదు" అని మాత్రమే నొక్కి చెప్పవచ్చును. "నేను సర్వసాక్షిని"అనుచుండ మాయయుండిననేమి? తొలఁగిన నేమి సాక్షికి సాక్ష్యము యొక్కవికారము లంటుట యసంభవము కదా.

క. పరమై సురుచిరమై సుఖకరమై తగుమానసాదికరణావళి స
త్పరమా పరమాదరమా, స్థిరమోదాకరసదాత్మధీరతి గలుగున్.142

టీ. స్థిర...ధీరతి-స్థిర=శాశ్వతమైన, మోదాకర = బ్రహ్మానందమునకు స్థానమగు, సత్ =సత్యస్వరూపుఁడే (లేక బ్రహ్మమే), ఆత్మ=తాననెడు, ధీ=జ్ఞానమునందు(యొక్క), రతి=అసక్తి (లేక కూడిక), కలుగన్ = జనించెనేని, మాన...వళి-మానస = మనస్సు, ఆది = మొదలగు, కరణావళి = ఇంద్రియసమూహము, పరమై = జ్ఞానవంతమగుటచేఁ గొనియాడఁదగినదియై, సురుచిరమై = పూర్వమువలె బాధించునది కాకుండుటచే మనోహరమై, సుఖకరమై = బ్రహ్మానందము ననుభవింపఁజేయుచుండుటచే సంపూర్ణసుఖమును గలిగించునదియై, తగున్ =ఒప్పును. (ఏలయనఁగా), సత్పరమా-సత్ = బ్రహ్మమునకంటె, పరమా = ఆయింద్రియపంక్తివేఱా (కాదనుట)? ఆ యింద్రియపంక్తి బ్రహ్మమునకంటె వేఱే యనినచో నది మాయనకంటె శ్రేష్ఠమైనదా? పరమాదరమా-పరమా = జ్ఞానరూపముగాఁ గనఁబడుచుండుటచేతను, అంతర్ముఖమై పరబ్రహ్మమును దెలిసికొనునట్లు తోఁచుచుండుటచేతను, ఆయింద్రియపంక్తి బ్రహ్మమునకంటె వేఱేయనినచో నది మాయనకంటె శ్రేష్ఠమయినదా? దరమా = అల్పమైనదా (శ్రేష్ఠమైనదనినచో నది బ్రహ్మమును బ్రకాశింపఁజేయునని చెప్పవలయును. అట్లు చెప్పిన ననవస్థాదోషము వచ్చు నని ఇది వఱకే చెప్పియున్నాము. అట్లు కాక యింద్రియసమూహము బ్రహ్మమునకంటె తక్కువ (అనఁగా నల్పప్రకాశము కలది) యనినచో నది బ్రహ్మమును బ్రకాశింపఁజేయుననుట భ్రాంతి యగును. కావున బ్రహ్మప్రకాశమే ఇంద్రియప్రకాశ మనియు ఉపాధివశమువలన నల్పముగాఁ గానవచ్చుచున్నదనియు ఇంద్రియబ్రహ్మ లొక్కటియె యనియు చెప్పవచ్చును.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. "శాశ్వతుఁడును, ఆనందరూపుఁడును అగుబ్రహ్మమే నేను" అను నపరోక్ష జ్ఞానము దృఢమగునేని యప్పుడు మనసు మొదలగు ఇంద్రియసమూహము అంతర్ముఖ మగుటచేఁ బ్రశంసాయోగ్యమై తనయందున్నప్రకాశము బ్రహ్మప్రకాశమే యను జ్ఞానము కలదగుటచేఁ బూర్వమునకంటె నధికముగాఁబ్రకాశించునది బ్రహ్మానందమును అనుభవింపఁజేయునది యగుటచేఁ బూర్వమువలె (అనఁగా విషయాభిముఖమై యున్న ప్పటివలెఁ గాకఁ బరమానందకరమై) ప్రకాశించును. వాస్తవస్థితిలో నీయింద్రియ సమూహము బ్రహ్మమునకంటె వేఱు కానేరదు. "ఈయింద్రియసమూహము బ్రహ్మ మునకంటె వేఱే" యనిన నప్పుడు రెండుప్రశ్నలు వేయవలసియున్నవి. ఏవియనిన: ఆయింద్రియసమూహము బ్రహ్మమునకంటె నధికమైనదా? యల్పమైనదా? అధికమనిన; ననవస్థాదోషమువచ్చు నని ఇదివఱకే నిరూపించియున్నాను. అల్ప మనిన: నాయింద్రి యములు భౌతికములగుటచే నందుఁ బ్రతిఫలించిన బ్రహ్మప్రకాశము అల్పముగఁ గాన వచ్చుచున్నదనియు, వాస్తవస్థితిలో నాయింద్రియసమూహమునకును (అనఁగా అందలి ప్రకాశమునకును) బ్రహ్మమునకును భేదములేదనియుఁ జెప్పవచ్చును. కావున నింద్రియ సమూహమునకును బ్రహ్మమునకును భేదము కల దని సాధించుటకు నేయుక్తియును లేదు. భేదమనునదియే భ్రాంతికల్పితము. భేదమును దెలిసికొనవలయు ననిన మొట్ట మొదట రెండువస్తువులను గూర్చి తెలియవలెను. రెండువస్తువులను గూర్చి తెలియవలె ననిన మొట్టమొదట భేదమును తెలిసికొనవలయును. రెండువస్తువు లున్న వని తెలిసినసే కాని "ఈరెంటికి నీభేదము కలదు" అని తెలియదు. "ఈరెంటికిని భేదము కలదు" అని తెలిసినదే కాని "ఇవి వేఱువేఱువస్తువులు" అని తెలియదు. ఇది యనుభవసిద్ధమే కదా! కావున భేదమును నిర్ణయింపవలయు ననిన నన్యోన్యాశ్రయ దోషము (రెండు పదార్థము లొకదాని నొకటి యాశ్రయించియుండుట యన్యోన్యాశ్రయదోషము) వచ్చుటచే నది (భేదము) భ్రాంతికల్పితమే కాని వాస్తవమైనది కాదని యేర్పడు చున్నది. వాస్తవ మైనదానిని నిర్ణయించునప్పుడు ఇట్టిదోషములు రావు కదా. కావున భేదమనునది యెప్పటికిని లేదని తెలిసికొనవలయును.

క. తరమా పరమానందే,తరమా జగమనుచుఁ జూడ ధర మూఢునకొ
పరమార్థము దెలియుటదు,ష్కరమాగురుకరుణవడయుసర్వజ్ఞునకున్.

టీ. ధరన్ = భూమియందు, మూఢునకున్ = జ్ఞానశూన్యుఁడగువానికి, జగము= ప్రపంచము, పరమానందేతరమా-పరమానంద = పరమానందరూపుఁ డగుపరబ్రహ్మమున కంటె, ఇతరమా = వేఱుకాదా? అనుచున్ = అని, చూడన్ = విచారించుటకు (లేక, తెలిసికొనుటకు), తరమా = శక్యమా (కాదనుట)? గురుకరుణ = సద్గురుని యనుగ్రహ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మును, పడయు...నకుర్ -పడయుఁ=పొందిన, సర్వజ్ఞునకుర్ = జ్ఞానికి, అచరమార్థము= అయథార్థస్థితిని (అనఁగా బ్రహ్మప్రపంచము లొక్కటియె యనుయథార్థస్థితిని), తెలియుట=తెలిసికొనుట, (దుష్కరమా=కష్టమా?) కాదు.

తా. "ఈజగత్తు పరమానందరూపుఁ డగు బ్రహ్మమునకంటె వేఱు కాదు. అని తెలిసికొనుట యజ్ఞానికి శక్యము కాదు. కావున వాఁడు సదా ప్రపంచబ్రహ్మల వేఱు వేఱుగనే చూచుచుండును. భ్రాంతి నొందుచుండును. గురుకరుణను బడసిన మహాత్ము నకు నాపరమార్థము దెలియుట యతిసులభము. కావున యధికారి యగు వాఁడు పరమార్థజ్ఞానమునకై సద్గురువు నుపాసింపవలయును.

వ. అని యివ్విధంబున నుపదేశించి హనుమంతునితో శ్రీరామ చంద్రుండు మఱియును. 144

టీ. అని యివ్విధంబునర్ =అని యీప్రకారముగా, ఉపదేశించి=ఆత్మానుభవము నకు దేశకాలనియమములు లేవనిచెప్పి, హనుమంతునితోన్, శ్రీరామచంద్రుఁడు, మఱియును.

తా. ఓ గౌరీ! ఆరూఢునివిషయమునుగూర్చియుఁ సద్గురువు నుపాసించుట యావశ్యక మనుటయును గూర్చియుఁ శ్రీరామచంద్రుఁడు ఆంజనేయుల కుపదేశించి శిష్యుని తెఱంగు వివరించువాఁడై మఱియు నిట్లనియె.

అవ. పరమేశ్వరుఁడు మఱియుఁ నీక్రిందివిధముగా శ్రీరాముని యుపదేశము (ఆరూఢునిగూర్చిన యుపదేశము) నుపసంహరించుచున్నాఁడు:—

ఉ. మాయను మిథ్యగాఁ దెలియుమా యనుఁ దత్కృత మెల్లఁ గల్లసు
మ్మా! యను మేను నే ననకుమా యను సాక్షిని నీవు చూచుకొ
మ్మా! యను జూడఁగా నితరమా? యను నే నని నిశ్చయించుకొ
మ్మా! యనుఁగాక పో నితరమా? యనుమానముమానుమా! యనున్.

టీ. మాయర్ =మాయను, మిథ్యగార్ =ఉన్నట్లు తోఁచుచు యథార్థముగా లేని దానినిఁ గా, తెలియుమా = తెలిసికొనుము. అనున్ =అని చెప్పును. తత్కృతమెల్లన్- తత్ =ఆమాయచేత, కృతమెల్లన్ =కల్పింపఁబడిన యీప్రపంచ మంతయు, కల్లసుమ్మా= అసత్యముసుమా, అనుర్ =అనిచెప్పును. మేను నేననకుమా = శరీరము నాత్మగాఁ దలంప వలదు, అనున్, నీవు, సాక్షిని = శరీరేంద్రియాదులకు ద్రష్ట యగుకూటస్థుని, చూచుకొమ్మా=అంతర్ముఖ మైనమనస్సుతో విచారించుకొనుము. అనున్, చూడఁగార్ = అట్లు విచారింపఁగా, ఇతరమా=కూటస్థునికంటె నీవు, వేఱా, అనున్, నేనని నిశ్చయించుకొమ్మా= అట్లగుటచేత ఆసాక్షి యగుకూటస్థుఁడె ఆత్మ యని నిశ్చయించుకొనుము. అనున్,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాకపోన్=ఆసాక్షి నీవు కాకపోవుటకు, ఇతరమా=ఆ సాక్షికంటె నీవు వేఱా (రెండు జ్ఞానములు కలవనిన వానిలో నొకదానికంటె మిాఱి యొకదానికి భేదము నిర్ణయించు టకు వీలు లేదు కావున జ్ఞాన మొక్కటియె యని చెప్పుట యుక్తియుక్తము. ఈకారణ ములవలన జ్ఞానస్వరూపుఁ డగుసాక్షికంటె జ్ఞానరూపుఁడ వగునీవు వేఱు కానేరవు.)! అను మానము=సంశయమును, మానుమా=విడువుమా! అనున్=అని యుపదేశించును.

తా. ఓపార్వతీ! మఱియు నాశ్రీరాముఁడు "ఓ ఆంజనేయ! మాయ యసత్య మని తెలిసికొనుము" అనియు "అది చేయుకార్యము లన్నియుఁ నసత్యములే సుమా" యనియు "శరీరము నాత్మగ భావింపవలదు" అనియు "నీవు శరీరాదులకు సాక్షివికాని శరీరాదిరూపుఁడవు కావు. ఈవిషయమును అనుభవపూర్వకముగఁ దెలిసికొనుము" అనియు "ఇట్లు సాక్షిని గ్రహించినవానికంటె నీవు వేఱుగానున్నావా చూచుకొనుము" అనియు "ఆసాక్షిని ఆత్మగా నిశ్చయించుకొనుము" అనియు "నీవు సాక్షివికాకపోవ టకు నేహేతువును లేదు కావున సంశయములను విడువుము" అనియు నుపదేశించి యాతని సంశయముల నెల్లఁ దీర్చెను.

### ఆరురుక్షునిలక్షణము.

వ. అని వెండియు నిట్లనియె నిది యారూఢునిప్రకారం బింక నారురు క్షునిమార్గంబు వివరించెద. 146

టీ. అని=ఇట్లు చెప్పి, వెండియున్=మరల, ఇట్లనియెన్ = యీాక్రిందివిధముగా చెప్ప నారంభించెను. ఇది = ఇంతవఱకు చెప్పినయనుభవము, ఆరూఢునిప్రకారంబు = బ్రహ్మానుభవశుద్ధి కలిగినవానివిధము, ఇంకన్=ఇఁకమీాఁద, ఆరురుక్షునిమార్గంబు = క్రమ క్రమముగా జ్ఞానభూమికల నవలంబించి బ్రహ్మానుభవసిద్ధినిఁ బొందఁదలఁచినవానియొక్క పద్ధతిని, వివరించెదన్=చెప్పెదను.

తా. ఓగౌరీ! ఇట్లు యోగారూఢుఁ డగుమహాత్మునివిధమును వివరించి సంశయ ములనెల్లఁ దీర్చి యారురుక్షునివిధమును (యోగసిద్ధి నొందవలసిన పురుషుని ప్రకార మును; అనఁగా నెట్టివాఁడు యోగసిద్ధి నొందునో యావిషయమును) జెప్పఁ బ్రతిజ్ఞఁ జేసెను.

### తత్త్వోపదేశార్హుం డగునారురుక్షుని లక్షణము.

అవ. శ్రీరాముఁడు ఆరురుక్షునివిధము యోగసిద్ధిని గోరువాఁ డెట్లుండవలయునో దానిని జెప్పువాఁడై మొదట "ఎట్టివానికి తత్త్వజ్ఞానము నుపదేశింపవలయును" అను విషయమును వివరించుచున్నాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సర్వత్రప్రాససీసము:—

అస్తోకసద్గురూపా స్తిచే సతతవి
ధ్వ స్త కాముండు నిర స్తమోహుఁ
డ స్తంగ తాశుం డపా స్తలోభుండు స
న్య స్తరోషుండు వి స్ర స్తమదుఁడు
గ్ర స్తనిస్తు త్యేంద్రియస్తోముఁ డశ్రాంత
విస్తారితవిధిప్రశస్తుఁ డగుచు
స్వ స్తిస్వమ స్తకన్య స్తనిజాచార్య
హస్తాబ్జవిదితచిద్వస్తు తత్త్వుఁ

తే. డమితశమదమముఖగుణసముదయయుత
సుముఖసమరసవిమలహృత్కమలుఁ డఖిల
విషమవిషసమసకలుషవిషయవిముఖుఁ
డైన మేధావి త త్త్వబోధార్హుఁ డనఘ!. 147

టీ. అనఘ = పాపరహితుఁడా! అస్తోక... స్తిచేఁ -అస్తోక = అధికమైన, సద్గురూపా స్తిచేఁ = గురుచరణసేవచేత, సతత = ఎల్లప్పుడును, విధ్వ స్త=పోఁగొట్టఁబడిన, కాముఁడు = కామము గలవాఁడును, నిర స్త మోహుఁడు - నిర స్త = నిరాకరింపఁబడిన, మోహుఁడు = అజ్ఞానము గలవాఁడు, అ స్తంగతాశుండు = నశింపఁ జేయఁబడిన యాశగలవాఁడును, (కామ మనఁగా సామాన్య మగునిచ్ఛ; ఆశ యనఁగా నమితమగు నభిలాష. ని. "ఆశాధిగతి తృష్ణయోః") అపా స్తలోభుండు - అపా స్త = తొలఁగింపఁబడిన, లోభుండు = లోభము గలవాఁడు, సన్య స్తరోషుండు = విడువఁబడినక్రోధము గలవాఁడు, వి స్ర స్తమదుండు - వి స్ర స్త = జారిన, మదుండు = మదము గలవాఁడు, గ్ర స్త...ముఁడు - గ్ర స్త = లోఁబఱచుకొనఁబడిన, నిస్తుత్య=నీచమైన, ఇంద్రియ = జ్ఞానేంద్రియ కర్మేంద్రియములయొక్క, స్తోముఁడు = సమూహము గలవాఁడు అశ్రాం...స్తుఁడు-అశ్రాంత=ఎల్లప్పుడును, విస్తారిత=అభివృద్ధిఁ జేయఁబడిన, విధి=యజ్ఞదానతపోరూపము లైనకర్మలచేత, ప్రశస్తుఁడు=కొనియాడఁదగినవాఁడు, అగుచుఁ=అయి, స్వ స్తి...త్త్వుఁడు-స్వ స్తి=మంగళకరమైనట్టియు, స్వమ స్తక=తనశిరమునందు, న్య స్త=ఉంచఁబడినట్టియు, నిజాచార్య=సద్గురువుయొక్క, హస్తాబ్జ=కరకమలప్రభావము చేత, విదిత=తెలియఁబడిన, చిద్వస్తు=జ్ఞానస్వరూపుఁ డగుపరమాత్మునియొక్క, తత్త్వుఁడు=యథార్థస్వరూపముగలవాఁడు, అమిత...లుఁడు-అమిత=అపరిమితము లైనట్టియు, శమదమముఖ=శమము దమము మొదలుగాఁ గలిగినట్టియు, సుగుణసముదయయుత=సద్గుణ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సమూహములతోఁగూడిన, సుముఖ=ప్రసన్నమైన, సమరస = సమబుద్ధితోఁ గూడిన, విమల = నిర్మలమైన, హృత్కమలుఁడు = హృదయకమలము గలవాఁడు, అఖిల... ముఖుఁడు-అఖిల = సమస్తములైన, విషమ=విరుద్ధములైనట్టియు, విషసమ=విషముతో సమానములై పరిణామకాలమున దుఃఖమును గలిగించునట్టియు, సకలుష=మాలిన్యముతోఁ గూడినట్టియు, విషయ=శబ్దాదివిషయములకు, విముఖుఁడు = అభిముఖము కానివాఁడు, ఐన మేధావి=అయినట్టిబుద్ధిమంతుఁడు, తత్త్వబోధార్హుండు=బ్రహ్మోపదేశమునకుఁ దగిన వాఁడు, అగున్.

తా. ఓదోషరహితుఁడా! సద్గురు నుపాసించుచు ఆయుపాసన బలమువలన కామాదిశత్రువులను సర్వేంద్రియములనుజయించి వేదోక్తవివిధకర్మల నాచరించి నిర్మలచిత్తుఁడై గురుకరుణచే హస్తమస్తకసంయోగమువలన క్షరమునుండి యక్షరపురుషుని వేఱు చేయఁగలసామర్థ్యముకలవాఁడై శాంతి దాంతి మొదలగుసుగుణములచేఁ బ్రసన్నమగు హృదయము గలిగి సర్వసమభావముతో వర్తించుచు నాత్మానుభవవిరుద్ధములును మొదట నంత దుఃఖకరములు కాకున్నను విషమువలె పరిణామసమయమున మిగుల దుఃఖము గలిగించునట్టిశబ్దాదులపై నాశలేక పరమవైరాగ్యసంపన్నుఁడై యుండువివేకి "తత్త్వమసి"= "ఆబ్రహ్మమే నీవు" అను యథార్థస్థితి నుపదేశింపఁదగును.

## సాధకునిలక్షణము.

అవ. ఇట్లు ఉపదేశమున కర్హుఁడగువాని స్వరూపమును జెప్పి సాధనాప్రకారమును వివరించుచు సాధకుని స్వరూపము నిరూపించుచున్నాఁడు:—

సర్వతఃప్రాససీసము:—

మేధావి మొదలఁ దా సాధూక్తశాస్త్రాది
సాధనాసాధితబోధుఁడై స
దా ధీంద్రియముల నిరోధించి మనములో
శోధించి కామసుక్రోధముఖవి
రోధియూథంబుల వేధించి బాధించి
బాధయోగ్యాఖిలోపాధులను ని
షేధించి సర్వనిషేధావధీభూత
సాధిభూతాధిదైవాధియజ్ఞ
తే. బోధమయనిరుపాధికాగాధలసద
బాధకానందవిమలపాథోధి యగుచు
వ్యాధుల మహాధుల జయించునట్టిఘనస
మాధిసుఖలోలుఁ డగువాఁడె సాధకుండు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. మేధావి = బుద్ధిమంతుఁ డగువాఁడగు, మొదలన్ = మొదట, తాన్ = తాను, సాధూ...ధుఁడై-సాధు = సత్పురుషులచేత, ఉక్త=ఉపదేశింపఁబడిన, శాస్త్ర = వేదాంతశాస్త్రము, ఆది=మొదలైన, సాధన = సాధనములచేత, ఆసాధిత = పరిపూర్ణముగా సాధింపఁబడిన, బోధుఁడై = బ్రహ్మజ్ఞానముగలవాఁడై, సదాధీం...ముల-సదా = ఎల్లప్పుడును, ధీంద్రియములన్ = బుద్ధిని ఇంద్రియములను, నిరోధించి = నిర్బంధించి (నిశ్చలములఁ జేసి), మనములోశోధించి=మనస్సునందు విమర్శించి, కామ...బులన్ - కామ=కామము, సక్రోధ=అరిషడ్వర్గములో మొదట గణింపఁదగిన క్రోధము, ముఖ = మొదలైన, విరోధియూథంబులన్ = అంతరశత్రుసమూహమును, వేధించి = ఖండించి, బాధించి = ధ్వంసముఁజేసి, బాధ...ధులన్ - బాధించుటకు (అనఁగా: నున్నట్లు తోఁచుచుండినను లేనివిగా నిశ్చయించుటకు), యోగ్య = తగిన, అఖిల=సమస్తమైన, ఉపాధులన్=ప్రపంచమనెడు నుపాధులను, నిషేధించి = జ్ఞానదృష్టిచేఁ దొలఁగించి, సర్వ...గుచున్-సర్వ = సమస్తమైన (పదార్థములను), నిషేధ = నిషేధించినపిదప, అవధీభూత = మిగిలిన, సాధిభూత = శబ్దస్పర్శరూప రసగంధములతోఁ గూడినట్టియు, అధిదైవ=ఇంద్రియాధిదేవత లగుదిక్కులు వాయువు మొదలగువానితోఁ గూడినట్టియు, అధియజ్ఞ = శరీరముల నాశ్రయించియున్న శ్రోత్రత్వగాదీంద్రియములతోఁ గూడినట్టియు, బోధమయ = జ్ఞానరూపుఁ డైనట్టియు, నిరుపాధిక = ఉపాధులవలనఁ గలుగు భేద మేమియు లేనట్టియు, అగాధ = గంభీరుఁడైనట్టియు, లసత్=ప్రకాశించుచున్నట్టియు, అబాధక = బాధ లేనట్టియు, ఆనన్ద=బ్రహ్మానందమనే, విమల = నిర్మలమైన, పాథోధియగుచున్ = సముద్రమై (అనఁగా బ్రహ్మానందరూపుఁడై), వ్యాధులన్=శరీర సంబంధము లగుజ్వరాదులను, మహాధులన్=అంతకంటెఁ దీవ్రములైన మనోవ్యధను, జయించునట్టి = నశింపఁ జేయునట్టి (లేక తిరస్కరించునట్టి), ఘన...వాఁడె-ఘన=అధికమైన, సమాధి = నిర్వికల్పసమాధియందలి, సుఖ = ఆనందానుభవమునందు, లోలుఁడగున్=ఆసక్తిగలవాఁడు (ఓల లాడువాఁడు) అగును. వాఁడె=అట్టివాఁడె, సాధకుండు= బ్రహ్మానుభవమును (లేక సాంఖ్యయోగమును) సాధించువాఁడు.

తా. బుద్ధిమంతుఁ డగువాఁ డీవిధముగా సద్గురుని యనుగ్రహమును బడసి యమ్మహాత్మునిచే నుపదేశింపఁబడినవాక్యములవలనను శాస్త్రసహాయమువలనను చక్కనిజ్ఞానమును సంపాదించి పిదప స్వానుభవమునకునై ప్రయత్నింపవలయును. జ్ఞానము కలిగినను అది దృఢమగుటకై కొంత ప్రయత్న మావశ్యకము. ఆప్రయత్న మెట్లు సేయవలయు ననిన మొట్టమొదట మనస్సును దానిసాహాయ్యముచే నింద్రియములను నిగ్రహింపవలయును. పిదప మనసును వివేకముచే నిర్మలము చేసి కామక్రోధాదివిరోధుల ధ్వంసముచేయవలయును. ఇట్లు సంపూర్ణ మగు చిత్తశాంతిని సంపాదించి క్రమక్రమముగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నుపాధుల నన్నింటి "నేతి నేతి" = "ఇదికాదు ఇదికాదు" అనుమహావాక్యముచే నిషేధించి యట్లు నిషేధింపఁగా శేషించిన బ్రహ్మము నాత్మగాఁ దెలిసికొనవలయును. ప్రపంచ మంతయు బ్రహ్మమున కుపాధి. ఈయుపాధి నాశ్రయించియే, "ప్రపంచమునఁ గలభేదము లాత్మకుఁ గలవు" అని భ్రాంతి నొందుచున్నాఁడు. ఇట్లు కాక మొట్టమొదట "నీయుపాధులు బ్రహ్మము కాదు" అని నిశ్చయించి యానిశ్చయము వలన "బ్రహ్మము ఏకరూపము. ఉపాధిభేదములతో నాయనకు సంబంధము కలుగదు" అని నిశ్చయించుకొనవలయును. శబ్దాదివిషయములతోను ఇంద్రియాదిదేవతలతోను ఇంద్రియములతోను (అనఁగాః సకలవిధ మగు స్థూలసూక్ష్మప్రపంచములతో) నా బ్రహ్మము కలసియేయున్నది. వాస్తవస్థితిలో నీప్రపంచ మజ్ఞానకల్పితముకావున జ్ఞానముచే బాధింపఁబడును. ఇట్టిని త్రికాలములయందు నసత్యములే యని ఇదివఱకే చెప్పియున్నాను. ఈకారణమువలన నుపాధుల నాశ్రయించి యున్నవికారములను పరబ్రహ్మము నంటు ననుటయే యసంభవము. మఱియు బ్రహ్మము జ్ఞానరూపుఁ డగుటచే నాయనకు దృశ్యగతవికారము లేవియు బొత్తుగ నంటవు ఇట్లగుటచే "బ్రహ్మమున కుపాధికలదు. వికారము లాయననుస్పృశింపవు" అనుటకంటెను "బ్రహ్మమున కుపాధియే లేదు. ఆయన యెప్పటికిని నిర్వికారుఁడే" యనుట యుక్తముగ నుండును. ఉపాధు లెప్పటికిని యసత్యములే కదా! ఈవిధముగ బ్రహ్మమును నిర్ణయించి యతిగంభీరుఁ డైనట్టియు ప్రకాశమానుఁ డైనట్టియు (జ్ఞానరూపుం డైనట్టియు) నిత్యుండగుటచే నెప్పటికిని బాధ నొందనట్టియు నానందరూపుఁ డైనట్టియుం నాబ్రహ్మమునకంటెఁ దాను వేఱు కాఁ డని నిశ్చయించుకొనవలయును. ఇట్లు నిశ్చయించుకొని సకలవిధములగుశారీరమానసికతాపముల ధ్వంసము చేయుఁనట్టి నిర్వికల్పసమాధి నాశ్రయింపవలయును. అదియే స్వానుభవము. ఇట్టియనుభవము కలవాఁడె సాధకుఁడు. వానికే జీవన్ముక్తి దొరకును. కృతార్థత కలుగును.

సర్వతఃప్రాససీసము.—

శ్రీసదాచార్యనుశాసనాభిజ్ఞుఁ డ
 జ్ఞాసనాసీనుఁ డజ్ఞాసనాది
వాసనా రాయణోపాసనామ్నాయాంత
 వాసనావాసితోల్లాసహృదయుఁ
డై సనాతసనిరాభాసనానార్థావ
 భాసకానందసత్తావసమాన
ధీసాక్షివరచిదాభాసైక్యసంతతా
 భ్యాసనిజ్ఞానాసుఁ డగుచు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. గాసువీసంబుకై సుదతీసుతార్థ
దాసదాసీజనములపై నాసఁ జేసి
మోసపోవక దోసము ల్మోసికొనక
వాసుదేవాత్ముఁడై చిద్విలాసుఁ డగుచు. 149

టీ. శ్రీసదా...జ్ఞుఁడు-శ్రీ = శోభాయుక్తుఁడైన, సదాచార్య = సద్గురువు యొక్క, అనుశాసన = ఆజ్ఞను (లేక ఉపదేశమును), అభిజ్ఞుఁడు=బాగుగా గ్రహించిన పురుషుఁడు, అబ్జాసనాసీనుఁడు = పద్మాసనమునఁ గూర్చుండి, అబ్జాస...యుఁడు-అబ్జాసన=బ్రహ్మదేవుఁడు, ఆది=మొదలైనదేవతలకు, వాస=నివాసభూతులైన, నారాయణ= పరబ్రహ్మముయొక్క, ఉపాసనా = ఉపాసనచేతను, ఆమ్నాయాంతవాసనా=వేదాంత శాస్త్రజ్ఞానముచేతఁ గలిగినసంస్కారములచేతను, అవాసిత = నివసింపఁబడిన, ఉల్లాస= సంతోషముగల, హృదయుఁడై=మనసుగలవాఁడై, సనా...సుఁడు-సనాతన=అనాదియై నట్టియు, నిరాభాస = ఛాయారహితుఁ డైనట్టియు, నానా = పలువిధములైన, అర్థ= విషయములను, అవభాసక = ప్రకాశింపఁజేయునట్టియు, ఆనంద = ఆనందరూపుఁ డై నట్టియు, సత్య = సత్యస్వరూపుఁ డైనట్టియు, అసమాన = సాటిలేనట్టియు, ధీ=బుద్ధికి, సాక్షి=ద్రష్టయైనట్టియు, కూటస్థునితో, వర=శ్రేష్ఠుఁడైన, చిదాభాస = జీవునకుఁగల, ఐక్య = స్వభావసిద్ధ మగు నేకార్థ్యమును (అనఁగా: నేకత్వధ్యానమును), సంతత= ఎల్లప్పుడును, అభ్యాస = అభ్యసించుటవలన, వివర్జిత = పోఁగొట్టఁబడిన, ఆయాసుఁ డగుచుఁ=సంసారదుఃఖముగలవాఁడై, కాసువీసంబుపై=ధనమువైనను, సుదతీ...పైఁ- సుదతీ=స్త్రీలు, సుత = పుత్రులు, అర్థ = స్వలాభము, దాస = దాసులు, దాసీ=దాసీలు, జనములపైఁ = బంధువులు మొదలైనవారిపై, ఆశఁజేసి = అభిలాష నుంచుకొని, మోసపోవకఁ = ఆత్మజ్ఞానశూన్యుఁడై చెడక, దోసములు = భార్యాపుత్రాదులకొఱకై ధనార్జనాదులయందు వివిధము లగుపాపములను, మోసికొనకఁ = ఛేయక, వాసు దేవాత్ముఁడై = బ్రహ్మరూపుఁడై, చిద్విలాసుఁడగుచుఁ = జ్ఞానరూపముతోఁ బ్రకా శించుచు.

సర్వతఃప్రాససీసము:—

శిష్టవరేణ్యనిర్దిష్టోపదిష్టార్థదిష్టవిశిష్టసంతుష్టుఁ డగుచుఁ
గష్టమై మూఢసంజుష్టమై త్రిగుణసంశ్లిష్టమైపరమనికృష్ట మగుచు
దుష్టమై పరఁగునీవ్యష్టిసమష్టిరూపాష్టప్రకృతిమయదృష్టజగము
భ్రష్టంబుగాఁ గడునష్టంబుగా నాత్మదృష్టిచేఁ గని యవశిష్టుఁ డగుచు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. విష్టపస్రష్టయై తదస్పృష్టుఁ డగుచు
ద్రష్టయై నిత్యనిర్మలోత్కృష్టుఁ డై వి
చేష్టుఁ డగుతన్ను గాంచి విస్పష్టముగ న
భీష్ట ఫలసిద్ధిఁ బొందు సంతుష్టుఁ డగుచు. 150

టీ. శిష్టవ...గుచుఁ - శిష్టవరేణ్య=సద్గురుశ్రేష్ఠునిచే, నిర్దిష్ట = నిర్ణయింపఁబడి, ఉపదిష్ట = వివరముగా నుపదేశింపఁబడిన, అర్థ = మోక్షరూప మగువిషయముయొక్క, దిష్ట=దర్శనముచేత (అనఁగాఁ బ్రాప్తిచేత), విశిష్ట = అధికముగా, సంతుష్టుఁ డగుచుఁ = సంతోషించినవాఁడై, నష్టమయి = దుఃఖకరమై, మూఢసంజుష్టమయి = అజ్ఞానులచే నాశ్రయింపఁబడినదై (లేక యాత్మరూపముగా నభిమానింపంబడినదై), త్రిగుణసంశ్లిష్టమై = సత్త్వరజస్తమోగుణములతోఁ జేరినదియై, పరమ నికృష్ట మగుచుఁ = మిగుల నింద్యమై, దుష్టమై=సర్వదోషములకు నాకరమై, పర...ముఁ - పరఁగు=ఒప్పుచున్న, ఈ, వ్యష్టి = అనేకము లైనట్టియు, సమష్టి = సముదాయకమైనట్టియు, రూప=రూపములు గలది యైన, అష్టప్రకృతిమయ = పంచభూత మనోబుద్ధ్యహంకారరూపమైన, దృష్ట = చూడఁబడుచున్న, జగముఁ ప్రపంచమును, భ్రష్టంబుగాఁ = నశించు దానినిగా, కడునష్టంబుగాఁ=మిగుల మిథ్యగా, ఆత్మదృష్టిచేఁ = బ్రహ్మజ్ఞానముచేత, కని = గ్రహించి, అవశిష్టుఁడగుచుఁ = ఈప్రపంచమునకంటెఁ దాను వేఱై, విష్టపస్రష్టయై=త్రిలోకములకును సృష్టికర్తయై, తదస్పృష్టుఁడగుచుఁ=ఆప్రపంచములతోఁ గాని సృష్టిరూపకార్యముతోఁ గాని సంబంధపడక, ద్రష్టయై=సాక్షియై, నిత్యనిర్మలోత్కృష్టుఁడై=శాశ్వతుఁడై పరిశుద్ధుఁడై సర్వాధికుఁడై, నిత్య, నిర్మల, ఉత్కృష్టుఁడై, విచేష్టుఁడై=ఏమియుఁజేయనివాఁడై, అగుతన్నుఁ=ఉన్నతనను, విస్పష్టముగఁ=బాగుగ, కాంచి=తెలిసికొని, సంతుష్టుఁడగుచుఁ = ఆనందించుచు, అభీష్టఫలసిద్ధిఁ = కోరిన మోక్షరూపమగుఫలమును, పొందుఁ=పొందును.

తా. ఇట్లు సదాచార్యునియుపదేశమువలన సర్వము నెఱింగి పద్మాసనమునఁ గూర్చుండి బ్రహ్మాదిదేవతలకు నివాసభూతుఁడై నారాయణుని (పరబ్రహ్మమును)ఉపాసన చేయుచు వేదాంతజ్ఞానమువలనఁ గలిగినసంస్కారముచే నంతకంత కుప్పొంగుచున్న హృదయముకలవాఁడై యాసాధకుఁడు అనాదియు ప్రతిబింబరహితుండును సర్వప్రకాశకుండును బుద్ధివృత్తులకు సాక్షియు నగుపరబ్రహ్మమే సత్యజ్ఞానానందరూపుఁడే తానని స్వభావసిద్ధమైన జీవబ్రహ్మైక్యమును నిర్వికల్పసమాధిచే సర్వకాల సర్వావస్థలయందు నభ్యసించు చుండుటవలన హృదయమునందలి వికారములనెల్ల ధ్వంసము చేసికొనును. అప్పు డాతనికి దారేషణ పుత్రేషణ ధనేషణములు కలుగవు. కామక్రోధాదులు విజృం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భింపవు. ప్రతికియున్నంతకాల మన్నియుం వచ్చుచు పోవుచు నుండినను పూర్వమువలె సాధకుని మోసపుచ్చ నేరవు. రాగద్వేషయుక్తము లగుకర్మలఁ జేయింపనేరవు. కావున నేవికారముచేతను బాధింపఁ బడక వాఁడు పరబ్రహ్మరూపుఁడై జ్ఞానప్రకాశ మాత్రుఁడైయుండును. మఱియుఁ "గురువెట్టి మోక్షమును సంపాదింపవలయునని యనేక విధములుగా నుపదేశించిరో అట్టి మోక్షము నాకు దొరకెను కృతార్థుండ నైతిని" అని మిగుల సంతోషించును. ఈసంతోషమువలన సమాధియందు మనసు మిగుల స్థిరమై మఱింత యుత్సాహమును కలిగించును. దుఃఖరూపమై త్రిగుణయుక్తమై ఆకాశాది పంచభూతములను మనోబుద్ధ్యహంకారములను స్వరూపములుగాఁగలిగి మిగుల నీచమై బహువిధదోషదుష్టమై యున్న వ్యష్టిసమష్ట్యాత్మక ప్రపంచమును ఆత్మగా నెన్నటికిని భావింపఁడు. ఇది యజ్ఞానుల కాత్మగా తోఁచునుగాని జ్ఞానికి తోఁపదుకదా. యథార్థ స్థితి నెఱింగినవాఁడు కావున "ఈప్రపంచము అభావరూపమైనది. భ్రాంతివలన నున్నట్లు కానవచ్చుటయే కాని దీనికి యథార్థస్వరూప మేదియుం లేదు" అని బ్రహ్మజ్ఞానదృష్టిచే నిశ్చయించుకొని యాసాధకుఁడు "నే నీప్రపంచమునకు సాక్షిని. వాస్తవస్థితి ననుసరించి నాకంటె నతిరిక్తమగుపదార్థము లేదు" అని తెలిసికొనును. "ఈ సర్వప్రపంచమును నేనే సృజించితిని. ఐనను సాక్షినగుటచే నాకు దీనితో సంబంధము లేదు. నేను నిర్మలుఁడను. నాకు నాశములేదు. నేనేమియుఁ జేయువాఁడను కాను అని నిర్ణ యించుకొని సంపూర్ణస్వానుభవము కలిగి జీవన్ముక్తుఁ డగును.

సర్వతఃప్రాససీసము:—

దాంతుఁడై సకలవేదాంతతాత్పర్యప
        ర్యాలోచనై కాశయంబుచేతఁ
జేతనాచేతనవ్రాతసంయుతపంచ
        భూతాత్మకద్వైతజాత మెల్ల
మెల్లనఁ దనయంద మిథ్యగా భావించి
        నిరుపమానందాంబునిధి మునింగి
నింగిభంగి నెసంగి నిరవయవాత్ముఁడై
        కారణకార్యవికారరహిత

తే. హితనిరీహనిరామయనిర్వికల్ప
కల్పనాతీతసచ్చిత్సుఖస్వభావ
భావనాభావశూన్యచిద్బ్రహ్మమగుచు
సంతసించుచు నుండును సజ్జనవరుండు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. సజ్జనవరుండు=సత్పురుషశ్రేష్ఠుఁడు, దాంతుఁడై=ఇంద్రియమనోనిగ్రహములతోఁ గూడినవాఁడై, సకల...చేతన్ - సకలవేదాంత = సర్వవేదాంతములయొక్క, తాత్పర్య=తాత్పర్యమును, పర్యాలోచన = విచారించుటయందు, ఏకాశయంబుచేతన్= ముఖ్యమైన (అనఁగ అత్యాసక్తమైన) మనస్సుతో, చేతనా... మెల్లన్-చేతనాచేతన వ్రాతసంయుత = చేతనజడసమూహములతోఁ గూడినట్టియు, పంచభూతాత్మక = పంచభూతమయ మైనట్టియు, ద్వైతజాత మెల్లన్ = ప్రపంచము నంతయు, మెల్లనన్ = క్రమక్రమముగా (అనఁగా జ్ఞానదార్ఢ్యము కలఁగుకొలఁది), తనయంద = బ్రహ్మరూపమునందే, మిథ్యగా భావించి=అభావముగాఁ జూచి (అనఁగా: శుక్తియందుఁ దోఁచునట్టి రజతము నభావముగాఁ జూచినట్లు చూచి), నిరు...ధిన్ - నిరుపమ = సాటిలేని, ఆనంద=బ్రహ్మానంద మనెడు, అంబునిధిన్ = సముద్రమునందు, మునింగి, నింగిభంగిన్= ఆకాశమువలె, నిరవయవాత్ముండై = అవయవములు లేక సర్వపరిపూర్ణస్వరూపుఁడై, ఎసంగి = అభివృద్ధిఁజెంది, కార...గుచు-కారణ = కారణస్వరూపమైనట్టియు, కార్య= ప్రపంచరూపమైనట్టియు, వికార=వికారములు, రహిత = లేనట్టియు, హిత=సుఖకరుఁడైనట్టియు, నిరీహ=కామాదులు లేనట్టియు, నిరామయ=వ్యాధులులేనట్టియు, నిర్వికల్ప =సంకల్పవికల్పములు లేనట్టియు, కల్పనాతీత=ఇట్టివాఁ డని చెప్పుటకు వీలులేనట్టియు, సత్ =సత్యస్వరూపుఁడైనట్టియు, చిత్ =జ్ఞానస్వరూపుఁడైనట్టియును, సుఖ=ఆనందరూపుఁడైనట్టియు, స్వభావ=స్వభావముగ గలిగినట్టియు, భావనా=తలంపు, భావ్య=తలంపఁదగినది యనువికారములు, శూన్య=లేనట్టియు, చిద్బ్రహ్మమగుచున్=సంపూర్ణవిజ్ఞానస్వరూపుఁడగుబ్రహ్మమై, సంతసించుచు నుండున్.

తా. ఇట్లు ప్రపంచము కలదనియుఁ దాను దానికి సాక్షి యనియు నిశ్చయించి సమాధినిష్ఠను సలుపుకొలఁది క్రమక్రమముగ నాదృష్టి తొలఁగి మఱియొకవిశేష మేర్పడును. వేదాంతశాస్త్రముయొక్క తాత్పర్యము క్రమక్రమముగ విశదమగును. విచారించుకొలఁది చేతనజడస్వరూప మగు నీపంచభూతాత్మకప్రపంచ మంతయు భ్రాంతిసిద్ధమగుటచే నసత్య మని తోఁచును. ఇట్లుతోఁచి తానే సర్వమయుఁడై యుండినట్లు దృఢమగుటచే సర్వపరిపూర్ణ మగుతనయానందరూపము స్పష్టముగా ప్రకాశించును. ఆకాశమువలెఁ దాను సర్వవ్యాపకుఁ డగుటయు నవయవములు లేనివాఁ డగుటయు స్పష్టమగును. ఇట్లు సర్వము స్పష్టము కాఁగానే "నేను సాక్షిని సృష్టికర్తను. ఈప్రపంచము నాకు దృశ్యము, కార్యము" అను వికారములు లేక సంకల్పశూన్యుఁడై దోషరహితుఁడై "ఈతఁ డిట్టివాఁడు" అని నిర్ణయించుటకు వీలులేనివాఁడై చేష్టలు లేక కేవలము సత్యజ్ఞానానందములే స్వభావములుగాఁ గలిగి తలంపు తలంపఁబడఁదగినది యను భేదములు లేక ఏకస్వరూపముతోఁ బ్రకాశించు పరబ్రహ్మమే తానై తానే పరబ్రహ్మమై బ్రహ్మజ్ఞాని ప్రకాశించుచుండును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సర్వతః ప్రాససీసము:—

డెందంబు నింద్రియబృందంబు నొకటి ని
ష్పందంబుఁ గావించి క్రిందుపఱిచి
యందంబుగ మనోరవిందంబునకు మూల
కందంబు నొచిదానందజలధి
నందంబు బిందు వమందంబుగా నొందు
చందంబునం బొంద మందు లెల్ల
నిందించినను నభినందించినను మేలుఁ
జెందించినను గీడుఁ జెందునప్పు

తే. డెందుఁ దగులక విందుగా నందుకొనుచు
సందియంబులసందడి డిందఁ జేసి
కందు లేని మనీషి సనందనాది
వందనీయుండ నైన నాయందుఁ గలదు. 152

టీ. కందులేనిమనీషి = దోషములేని బ్రహ్మజ్ఞాని, డెందంబున్ = మనస్సును, ఇంద్రియబృందంబులున్=ఇంద్రియసమూహమును, ఒకటిన్=ఒకమాటె, నిష్పందంబు గావించి = నిశ్చలముఁజేసి, క్రిందుపఱిచి = అడఁచి, అందంబుగన్ = మనోహరముగా, మనోరవిందంబునకున్=మనస్సను కమలమునకు, మూలకందంబునా = మూలాధారమైన, చిదానందజలధిన్-చిత్=అపరోక్షబ్రహ్మజ్ఞానమువలనఁ గలిగిన (లేక జ్ఞానరూపుఁడైన), ఆనంద=ఆనందమనెడు (లేక ఆనందరూపుఁడైన బ్రహ్మయనెడు), జలధిన్=జలాశయము నందు, అందంబు = సొగసైన, బిందువు=బుద్ధి, అమందంబుగాన్ = దృఢముగా, ఒందు చందంబునన్=కలియునట్లు, పొందన్=చేరియుండఁగా (అనఁగా బుద్ధి బ్రహ్మానందమున మునిఁగి మరల వెలికి రాకుండుటచే), మందులెల్లన్ = మూఢులందఱును (అనఁగా బ్రహ్మజ్ఞానములేని సంసారులందఱును), నిందించినన్=తననుతిట్టినను, అభినందించినన్ = స్తోత్రముచేసినను, మేలుఁజెందినన్=మేలుచేసినను, కీడుఁ జెందునప్పుడు=కీడు వచ్చినప్పుడును (అనఁగాఁ దనకు వారు కీడుచేసినను), ఎందుఁదగులక = దేనియందును రాగద్వేషములు లేక, విందుగా నందుకొనుచున్ = నిశ్చలత్వముచే (లేక యాదరముచే) ననుభవించుచు, సందియంబుసందడిన్=సంశయపరంపరను, డిందఁజేసి = నశింపఁజేసి, సనందనాది వందనీయుండన్ = సనందనాదిమహామునులచే స్తోత్రము చేయఁదగినవాఁడను, ఐన నాయందున్=ఐనట్టి పరబ్రహ్మరూపుఁడనైన నాయందు, కలయున్=కలసిపోవును.

తా. ఈవిధముగ మొదట దృగ్దృశ్యభేదము నవలంబించి బ్రహ్మరూపమును నిర్ణయించి స్వానుభవముచే దృఢముచేసికొని పిదప శాస్త్రాదులసహాయముచే దృశ్యముకూడ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాత్మయేయని నిర్ణయించి యంతట నాయభిప్రాయమునుగూడ వదలి సర్వము పర బ్రహ్మమేయని నిర్ణయించి మనస్సునందుఁగాని ఇంద్రియములందుఁగాని కొంచెమైనను చాంచల్యము లేనివాఁడై యున్న జ్ఞాని మనస్సునకు నాధారభూతమైన(అనఁగా సంకల్పమునకు నుత్పత్తిస్థానమైన) బ్రహ్మానందసముద్రమునందు (సర్వసంకల్పములును బ్రహ్మమునుండియే జనించును. మరల నచ్చటనే యడంగును) బుద్ధిని పునరుత్థానము లేకుండ ముంచివేయును. అల్పములగు విషయానందముల మరగియున్నంతమాత్రముననే బుద్ధి ఇటు నటు చలింపక నా యానందములయందే నిలిచియుండును. ఇట్టిబుద్ధి పరమానంద రూపుఁడగు పరబ్రహ్మమునందు నిలుచుటకు మరగినచో నిఁక నీవలకు వచ్చునా ? ఈవిధముగ బ్రహ్మజ్ఞాని పరమానందానుభవమున మునింగి సర్వము దానయై "దీనిని విడువ వలయును. దీనిని స్వీకరింపవలయును" అను భేదము లేనివాఁడై యుండుటవలనఁ బరులు మూఢులై తనకు మేలుచేసినను కీడుచేసినను తనను నిందించినను భూషించినను వానిచేఁ గలుగు హర్షశోకముల నొందఁడు. ఏది ఎట్లు వచ్చినను అందు రాగద్వేషయుక్తుండు కానేరఁడు. ఇట్లు నిర్దోషియై సిద్ధుఁడైయున్న బ్రహ్మజ్ఞాని సనకసనందనాది వినుతుండ నగు నాతో (బ్రహ్మముతో) నైక్యమునొందును. ఇట్టి పరిపూర్ణసమాధి (లేక జ్ఞానము) దొరకినవానికిఁ గర్తవ్యము లేదు.

అవ. ఈవిధముగ నారూఢుని విషయంబును ఆరురుక్షుని విషయంబును నిరూపించి పర్యవసానమును జెప్పుచున్నాఁడు:—

క. కావున నీవును పావన
భావనచే నింద్రియముల భంజించి మనీ
షావిల మడంచి యనిశము
భావింపుము నన్ను విజనపదగుఁడవగుచున్. 153

టీ. కావునన్ = కాఁబట్టి, నీవును, పావనభావనచేన్-పావన = పరిశుద్ధమైన (అనఁగా బ్రహ్మమే నే నను), భావనచేన్=తలంపుచేత, ఇంద్రియములన్ = జ్ఞానకర్మేంద్రియములను, భంజించి=జయించి, మనీ...లము-మనీషా = బుద్ధియందలి, ఆవిలము = దోషమును, అడంచి = నశింపఁజేసి, అనిశము = ఎల్లప్పుడును, విజనపదగుఁడవగుచున్ = ఏకాంతప్రదేశముననుండి, నన్నున్=బ్రహ్మస్వరూపుఁడనైన నన్ను, భావింపుము=నిన్నుగా (జీవునిఁగా) ధ్యానింపుము.

తా. ఓయాంజనేయా ! నీవును పైనఁ జెప్పిన యారురుక్షునివలెనే తగిన యధికారము గలిగి నన్ను (రాముని) ఆశ్రయించి యుపదేశమును బొందితివి కాని యభ్యాసము (అనఁగా నిర్వికల్పసమాధ్యభ్యాసము) లేకపోవుటచే దేహాత్మాభిమానమును వదల నేరకున్నావు. మనస్సును ఇంద్రియములును మోసపుచ్చుచున్నవి. కావున చక్కని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వివేకముచే నింద్రియముల జయించి మనసునందలి మాలిన్యము నణంచి ఏకాంతవాసుండవై నన్ను (బ్రహ్మమును) సర్వకాలములయందును ఆత్మరూపునిగా ధ్యానింపుము. క్రమముగ దేహాభిమానము వదలిపోవును. అపరోక్షజ్ఞానము దృఢమగును. ముక్తి కరస్థితమగును.

అవ. ఇట్లు కర్తవ్యము నుపదేశించి జ్ఞానదార్ఢ్యమునకై మఱియొకవిధముగఁ దన రూపమును నిరూపించుచున్నాఁడు:—

ఆ. ఆంజనేయ ! సచ్చిదానందమయుని గా
నన్ను గాంచు తెఱఁగు విన్నవింతు
నమలమనముచేత నవధరింపుము నీదు
సకలసంశయములు సమసిపోవు. 154

టీ. ఆంజనేయ, నన్నున్ = పరబ్రహ్మరూపుఁడైననన్ను, సచ్చిదానందమయునిగాన్ = సత్యజ్ఞానానందస్వరూపునిగా, కాంచుతెఱఁగున్ = తెలిసికొనుపద్ధతిని, విన్నవింతున్=వివరించెదను. అమలమనముచేతన్ = నిర్మల మగుమనస్సుతో, అవధరింపుము= వినుము. నీదుసకల సంశయములు=నీకుఁ గలసందేహము లన్నియును, సమసిపోవున్ = నశించును.

తా. ఓయాంజనేయ! పూర్వమునకంటె విస్పష్టముగ నారూపము నెఱిఁగించెదను వినుము. నిర్మల మగు మనస్సు కలవాఁడవై విమర్శింపుము. అట్లు విమర్శించిన సత్యజ్ఞానానందరూపముతో సమాధిసమయమున నన్ను వీక్షింప నగును.

## సద్రూపలక్షణము.

అవ. తనకుఁ గల సత్యజ్ఞానానందరూపములను క్రమముగ విభాగించి చూపువాఁడై మొట్టమొదట సత్యస్వరూపమును వివరించుచున్నాఁడు:—

పంచచామరము —

అనాదికాల మాదిగా ననంతదేహవర్ణగో
త్రనామరూపసౌఖ్యదుఃఖధర్మపాపకోటులున్
వినాశ మొందుచుండఁ జూని వీనిఁ జూచుచుందునే
ననాది నొట సత్స్వరూపుఁ డంద్రు నన్ను మారుతీ!. 155

టీ. మారుతీ=ఆంజనేయ, అనాదికాలమాదిగాన్ = అనాదికాలమునుండియు, అనంత...లును-అనంతదేహ = లెక్కకు మిక్కిలి యగుదేహములయొక్కయు, వర్ణ = బ్రాహ్మణాదిజాతులయొక్కయు, గోత్ర = వాసిష్ఠభారద్వాజాదిగోత్రములయొక్కయు, నామ=రామకృష్ణాదినామములయొక్కయు, రూప = మనుష్యపశుపక్ష్యాదిరూపములయొ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్కయు (లేక నీలపీతాదిరూపములయొక్కయు), సౌఖ్య=సుఖములయొక్కయు, దుఃఖ=దుఃఖములయొక్కయు, ధర్మ=పుణ్యములయొక్కయు, పాప=పాపములయొక్కయు, కోటులున్=సమూహములు, వినాశమొందుచుండన్=నశించుచుండఁగా, నేన్=పరబ్రహ్మమునైననేను, అనాదినాటన్ = అనాదికాలమునుండియు నొకటే విధముగాఁ బ్రకాశించుచుండువాఁడనగుటచే, పూని = ప్రయత్నపూర్వకముగా, వీనిఁజూచుచుండుదున్ = ఈదేహాదులనన్నిఁటిని (అనఁగా వీనియుత్పత్తివిభాగములను సాక్షినై) చూచుచున్నను, నన్నున్, సత్స్వరూపుఁడండ్రు = నశింపనివాఁడనని చెప్పుదురు (చూడఁబడునవి నశించినను చూపునకు నాశముగలుగదు. లేదా చూడఁబడు పదార్థములయొక్క యుత్పత్తి వినాశనములుకూడ చూపుచేఁ జూడఁబడుచునే యుండును కావున వానితోఁబాటు చూపునకుఁగూడ నాశము గలుగు నని చెప్పుటకు వీలు లేదుకదా! అట్లె జ్ఞానరూపుఁడగుసాక్షికిఁ గూడ నాశము లేదని భావము).

తా. ఓవాయుపుత్త్రా! నాకు సత్యము జ్ఞానము ఆనందము అను స్వరూపములు గలవు. అందు సత్యస్వరూపము నాశ్రయించి నన్ను "సత్పదార్థము" అనుచున్నారు. దీనకిఁ గారణ మేమి యనిన: నాకాద్యంతములు లేవు. ఏలయనిన: దేహములు పేరులు రూపములు కులములు పాపపుణ్యములు సుఖదుఃఖములు ఎంతకాలమునుండి వచ్చుచున్నవో చెప్పుటకు నవకాశ మేదియైన కలదా? సృష్టి యనాది యగుటచే నేయవకాశమును లేదుకదా. మఱియుం సాక్షి లేకపోయిన నీచెప్పఁబడిన దేహాదులలో నేదియుఁ బ్రకాశింపదు కదా. ఇవియును గాక నీదేహాదు లుత్పత్తివినాశములు కలవి కావున సాక్షి కట్టియుత్పత్తివినాశము లుండకూడదు. కావున నేను (జ్ఞానస్వరూపుఁడగు నేను) సర్వసాక్షినగుటచే నెప్పటికిని నశింపను. సాక్షియగువాఁడు నశింపఁగూడదని సయుక్తికముగ ఇదివఱకే నిరూపించి యున్నాను కదా. కావున నేను (బ్రహ్మము) సద్రూపుఁడను. ఈకారణమువలన లోకంబును శాస్త్రంబులును నన్ను సద్రూపుఁ డని చెప్పుచున్నవి.

పంచచామరము.—

ఖగంబులున్ దురంగపన్నగంబులున్ వనంబులున్
మృగంబులు న్నగంబులున్ మహీధరాదికంబులున్
జగంబులున్ లయంబు నొంద సాక్షినై సమస్తమున్
దగంగఁ జూచు చుండుదున్ సదాసదాత్మకుం డనన్. 156

టీ. ఖగంబులును=పక్షులును, తురం...గంబులున్-తురంగ = గుఱ్ఱములు, పన్నగంబులును=సర్పములును, వనంబులున్ = అరణ్యములును, మృగంబులున్ = మృగము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లును, నగంబులున్ = వృక్షంబులును, మహీధరాదికంబులున్ = కొండలు మొదలగునవియును, జగంబులున్ = మఱియుఁ గలసర్వలోకంబులకు, లయంబునొందన్ = నశించుచుండఁగా, సదా...త్మకుండన్ - సదా = ఎల్లప్పుడును, సదాత్మకుండనన్ = సద్రూపుఁడనఁబడుచు, సాక్షినై=ద్రష్టనై, సమస్తమున్=పైచెప్పినయన్నిటిని, తగంగన్ = ఒప్పునట్లుగా, చూచుచుండుదున్.

తా. ఇట్లు అందఱును బ్రశంసింప సద్రూపుఁడనై జ్ఞానరూపుఁడ నగుటచే సర్వసాక్షినై పక్షులు మృగములు సర్పములు పర్వతములు వృక్షములు అశ్వములు అరణ్యములు మొదలగునవియు, ఇట్లననేల? సర్వప్రపంచమును నశించుచున్నను ఉత్పత్తినొందుచున్నను వానితోఁగూడ నుత్పత్తివినాశముల నొందక నన్నిటిని జూచుచుందును.

అవ. ఈవిషయమున సర్వానుభవసిద్ధమైనమఱియొకస్థితిని వర్ణించి చెప్పుచున్నాఁడు:—

సీ. దేహేంద్రియప్రాణధీమనోహంకార
చిత్తము ల్తమతమచేష్ట లుడిగి
యలఘుసుషుప్తియం దజ్ఞానమున లయ
మొందినవేళ నే నుంటఁ జేసి
యేమియు లేదని యెఱుఁగుదు వానియ
భావ మంతయును స్వభావమునను
గావున విను తదభావానుభావము
స్మరియింతు మేల్కాన్నసమయమునను
తే. వరుసతో నిట్లు జాగరస్వప్నసుప్తు
లనుదినం బేఁగుదెంచుచు నరుగుచుండ
నేకరూపుఁడ నై వాని నెపుడుఁ గనుచు
నునికివలనను సద్రూపుఁడను గపీంద్ర!. 157

టీ. కపీంద్ర=వానరశ్రేష్ఠ, వినుము. దేహేంద్రి...ములు - దేహ = శరీరము, ఇంద్రియ=జ్ఞానకర్మేంద్రియములు, ప్రాణ=పంచప్రాణములు, ధీ=బుద్ధి, మనః=మనస్సు, అహంకార = అహంకారము, చిత్తములు = చిత్తము (సంశయాత్మక మగునంతఃకరణము), తమతమచేష్టలుడిగి=తమకార్యములను దెలిపి, అలఘుసుషుప్తియందున్ = అధికమైనసుషుప్త్యవస్థయందు, అజ్ఞానమునన్ = వానికిఁ గారణభూతమగునవిద్యయందు, లయమొందువేళన్ = లీనములైనప్పుడు, నేనుంటఁజేసి = నేను నిలిచియుండుటవలన, స్వభావమునన్ = స్వభావముగా (లేక యథార్థముగా, లేక యితరసాధనములతో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పనిలేక స్వయముగా), ఏమియుంలేదని = ఇంద్రియాదులలో నేదియుం నిప్పుడులేదని, వానియభావమంతయున్ =ఆయింద్రియాదుల యభావమును, ఎఱుంగుదున్ = తెలిసి కొనుచుందును, కావునన్ =కాఁబట్టి, మేల్కాన్నసమయమునన్ = మరల జాగ్రదవస్థ గలిగినప్పుడు, తదభావానుభవమున్ = ఆయింద్రియంబుల యభావము ననుభవించుటను (అనఁగా: సుషుప్త్యవస్థలయం దనుభవింపఁబడిన శూన్యభావమును), స్మరియింతున్ = "నాకు నిదురలో నేమియుఁ దెలియలేదు" అని స్మరణకుఁ దెచ్చికొందును, పరుసతోన్ = క్రమముగ, ఇట్లు=ఈవిధముగా, జాగరస్వప్నసుప్తులు = జాగ్రత్త స్వప్నము సుషుప్తి అను మూఁడవస్థలు, అనుదినంబు=ప్రతిదినమును, ఏఁగుదెంచుచున్ =వచ్చుచు, అరుగుచుండన్ = నశించుచుండఁగా, ఏకరూపుఁడనై = ఏకస్వరూపుఁడనై (అనఁగా భేద మేమియును లేక), వానిన్ = ఆజాగ్రదాద్యవస్థలను, ఎపుడున్, కనుచున్ = చూచుచు, ఉనికివలనన్ =ఉండుటచేత, సద్రూపుండన్ =నాశముఁ జెందని స్వరూపము కలవాఁడను.

తా. ఓవానరశ్రేష్ఠా! మఱియొకవిషయమును వినుము. లోకమున నెల్లవారికిని నిదురనుండి మేల్కానిన పిదప "నాకు నిదురయం దేమియుఁ దెలియలేదు" అని స్మరించుట యనుభవసిద్ధమై యున్నది కదా. పూర్వమున ననుభవింపని విషయము స్మరణకు రా దనుటయుం లోకమునఁ బ్రత్యక్షసిద్ధమే. కావున నీస్మృతికి ననుభవ మెట్లు కలిగెనో కొంచెము విచారింతము. నిదురయందు రెండవస్థ లనుభవింపఁబడుచున్నవి. అందు స్వప్నావస్థయందు బాహ్యేంద్రియములు లేకున్నను మనస్సు కలదు. కావున దానిని గూర్చి మన మంతగా నిప్పుడు విచారింప వలసినదిలేదు. సుషుప్త్యవస్థయం దామనస్సు కూడ నశించుననుటయుం సామాన్యముగ నందఱు మనస్సునే సాక్షినిగాఁ దలంచుచున్నారనుటయుం స్పష్టమే. కావున నాయవస్థయం దున్నసర్వాభావము ననుభవించువాఁడు (చూచువాఁడు) ఎవ్వఁడు, అతఁడే సర్వసాక్షి. అతఁడే నేను (బ్రహ్మము). ఈవిధముగా మనస్సులేనప్పుడుకూడ సాక్షి యొక్కఁడున్నాఁ డనుట సిద్ధాంతమగుటచే మనఃప్రచారము గలజాగ్రదాదులయందుఁగూడ నాతఁడే సాక్షిగ నున్నాఁ డనుట నిస్సంశయ మగుసిద్ధాంతము. ఉత్పత్తివినాశములు కలవానిని (మనస్సు మొదలగు వానిని) సాక్షులనుగాఁ జెప్పుట యసంభవము. "ఇది ఇప్పుడు పుట్టుచున్నది. ఇప్పుడు నశించుచున్నది" అని తెలిసికొనువాఁ డొకఁడు లేకున్న "ఈవస్తువున కుత్పత్తి వినాశములు కలవు" అనుట తెలియఁబడదుకదా. కావున నిర్వికారుఁడ నగు నేనే (బ్రహ్మమే) సర్వావస్థలయందును సాక్షినై యుందును. ఇట్లుండుట నాకు స్వభావమే కాని క్రియ కాదు. నేను జ్ఞానస్వరూపుఁడను కావున సర్వపదార్థములును నన్నాశ్రయించి ప్రకాశించుచున్నవి. కాని నాకు నిని ప్రకాశించుటలయందు నను సంకల్పముగాని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దానిని గూర్చినప్రయత్నము కాని లేదు. ఏదియైన నొకకార్యము జరుగునప్పుడు ఆ కార్యమునకుఁ బూర్వమున సంకల్పము గాని ప్రయత్నము గాని జనింపవలయును. కావునఁ గర్తకును కార్యమునకును నడుమ సంకల్పాదులలో నేదియైననొకటి యుండ వలయును. ఇచ్చట నట్లేవియు లేదనుట యనుభవసిద్ధము. భ్రాంతివలన నొకవేళ జాగ్రత్స్వప్నములయం దాసంకల్పాదు లున్నట్లు తోఁచినను సుషుప్త్యవస్థయం దవి లేవనుట నిర్వివాద మైనవిషయమే. కావున నాకుఁ గర్తృత్వములేదు. పైచెప్పిన సంకల్పాదుల కెవ్వఁ డాశ్రయభూతుడగునో వాఁడే కర్తయనుట యనుభవసిద్ధమైన విషయము. ఈవిధముగ నేను స్వభావముచేతనే జాగ్రదాద్యవస్థలు వచ్చుచుఁ బోవుచు నున్నను వానియందలిసర్వపదార్థములను సాక్షినై గ్రహించుచు నొక్కదినము నందు వలెనే వారములయందును పక్షములయందును మాసములయందును సంవత్సరములయం దును ఏకరూపముతో నున్నాను. భవిష్యత్కాలమునందువలెనే భూతకాలమునందు నున్నాను. ఇట్టివాఁడ నగుటచేత నాకు నాద్యంతములు లేవు. కావున నేను సద్రూపుఁడ నగుదు నని తెలిసికొనుము.

ఆ. జాగరంబునందు స్వప్నసుషుప్తులు
స్వప్నమున సుషుప్తిజాగరములు
సమసుషుప్తియందు స్వప్నజాగరములు
గలుగ నేను వీనిఁ గాంతు నెపుడు. 158

టీ. జాగరంబునందున్ = జాగ్రదవస్థయందు, స్వప్నసుషుప్తులు = స్వప్నసుషుప్త్యవస్థలను, స్వప్నమునన్=స్వప్నావస్థలయందు, సుషుప్తిజాగరములు = సుషుప్తిజాగ్రదవస్థలను, సమసుషుప్తియందున్ = సరి యగుసుషుప్త్యవస్థయందు, స్వప్నజాగరములు=స్వప్నజాగ్రదవస్థలను, కలుగన్ = జనించుచుండఁగా, ఎపుడు = ఎల్లప్పుడు, వీనిన్=ఈయవస్థాభేదములను, ఏను = సాక్షి నగు నేను, కాంతున్ = చూచుచుందును. (సత్వరజస్తమోగుణములే జాగ్రత్స్వప్నసుషుప్తులనియు నామూఁడుగుణములవలెనే యీయవస్థలుకూడ నొకదానితో నొకటి సంబంధపడియే యుండుననియుఁ దెలిసికొన వలయును.)

తా. సత్వరజస్తమోగుణములసాంకర్యమువలన సత్వరూప మగుజాగ్రదవస్థ యందు రజస్తమోరూపములైన స్వప్నసుషుప్తులును రజోరూపమైన స్వప్నావస్థయందు సత్వతమోరూపములయిన జాగ్రత్సుషుప్తులును తమోరూపమైన సుషుప్త్యవస్థయందు సత్వరజోరూపములైన జాగ్రత్స్వప్నములును గలుగుచుండును. ఈవిధముగా నొక్కొక యవస్థయందె మనోవికాసంబును దానియభావంబును ఇంద్రియప్రచారంబును తదభావం బును గలుగుచున్నను నేను సర్వకాలయందు నగుటచే వానినెల్ల సాక్షినై ప్రకాశింపం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జేయుచున్నాను. (అనఁగాఁ దెలిసికొనుచున్నాను.) ఇట్లు సర్వప్రపంచసాక్షినగుటచే ప్రపంచోత్పత్తివినాశములతో నాకు నుత్పత్తివినాశములు కలుగవు. సర్వకాలముల యందు నేకరూపుఁడనై యుందును. కావున సద్రూపుఁడను.

సీ. భువి నవస్థాత్రయంబున నేకరూపత
నొకదివసంబునం దున్నయట్లు
వినుమతీతాగామిదినవారపక్షమా
సాబ్దయుగప్రకల్పాంతములను
నొక్కచందంబున నుండుదు గావున
సద్రూపుఁడను వినిశ్చయము సుమ్ము
అది గాక బాధయోగ్యము లైనదేహేంద్రి
యప్రాణధీమనోహంకృతులును
తే. నేను గా నని భావింప నిఖిలదృశ్య
చయనిషేధావధీభూతసర్వబాధ
వర్జితాశేషసాక్షి నై వఱలు చునికి
వలన సత్యస్వరూపుఁడ నలఘుచరిత. 159

టీ. అలఘుచరిత=శ్రేష్ఠమగుచారిత్రగల ఆంజనేయ, వినుము, భువిన్ = భూమి యందు, అవస్థాత్రయంబునన్=జాగ్రదాద్యవస్థల మూఁడింటియందును, ఏక రూపతన్ =ఒకటే విధముగా, ఒకదివసంబునందున్నయట్లు=ఒకదినమునందున్నట్లె, అతీ...ములన్- అతీత=గడిచినట్టియు, ఆగామి=రాఁబోవునట్టియు, దిన = దినములయందును, వార = వారములయందును, పక్ష=పక్షములయందును, మాస=మాసములయందును, అబ్ద=సంవత్స రములయందును, యుగ=యుగములయందును, ప్రకల్పాంతములన్ = బ్రహ్మకల్పముల యందును, ఒక్క చందంబునన్=ఒకటే విధముగా, ఉండుదున్, కావునన్=కాఁబట్టి, సద్రూపుఁడన్ = నేను నాశనము లేనిస్వరూపము గలవాఁడను, వినిశ్చయముసుమ్ము=ఇది నిశ్చయముసుమ్మా, అదిగాక = మఱియును, బాధయోగ్యములైన = మిథ్య లని త్రోసి వేయుట కుచితము లైన, దేహేం...లును-దేహ = దేహములు, ఇంద్రియ=ఇంద్రియ ములు, ప్రాణ=ప్రాణములు, ధీ = బుద్ధి, మనః=మనస్సు, అహంకృతులును=అహంకారము, నేను గాననిభావింపన్ = అస్మచ్ఛబ్దార్థములు కా వని తలంపఁగ, నిఖిల...సాక్షినై- నిఖిల = సమస్తమైన, దృశ్యచయ = దృశ్యపదార్థములను, నిషేధ = నిషేధింపఁగా, అనధీభూత = మిగిలినట్టియు, సర్వ = సమస్తవిధములైన, బాధ = బాధలచే, వర్జిత = విడువఁబడినట్టియు (అనఁగా నెప్పటికిని బాధింపఁబడనట్టియు), అశేషసాక్షినై =

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సకలమునకును సాక్షినైనట్టియు స్వరూపముగలవాఁడనై, తెలిలుచుర్ = ఒప్పుచు, ఉనికి వలనర్ = ఉండుటచేత, సత్యస్వరూపుఁడర్ = నాశములేని స్వరూపముగలవాఁడను (అనఁగా: నాకెప్పటికిని నాశము లేదు).

తా. ఓగుణవంతుఁడా! జాగ్రత్స్వప్నసుషుప్తులు ప్రతిదినమునం దొక్కమాఱు పోవుచున్నవి. వానికి మూటికిని ఉత్పత్తివినాశము లున్నను నేనేకరూపుఁడనై చూచుచున్నాను. ఇట్లే గడచిన దినవారమాసవంవత్సరకల్పాదులయందును భవిష్యద్వారాదులయందును జాగ్రదాద్యవస్థలు వచ్చుచునే యుండును. పోవుచునే యుండును. నేనును వానికి సాక్షినైయే యుండును. ఇట్లు అనాదికాలమునుండియు అనంతకల్పములవఱకును ఏకస్వరూపముతోనుండును. కావున నేను సత్యస్వరూపుఁడను. ఇదియునుగాక విచారణయందు దేహాదిపదార్థముల నన్నిటిని "ఇది దృశ్యము కావున నేను దీనికంటె వేఱు" అని నిషేధింపఁగా కట్టకడకు నాస్వరూప మొక్కటియే మిగులును. కావున దేహాదులు బాధితములు. నేను అబాధితుఁడను. బాధయనఁగ జ్ఞానముచే రచింపఁబడునాశ కావునను బాధితములు భ్రాంతిసిద్ధములే. కావునను నేనట్టివాఁడను కాకపోవుటచేతను (నేను) నిత్యరూపుఁడనే. ఈకారణములవలన నన్ను సద్రూపునిగా నెఱింగి యుపాసింపుము.

## పంచప్రళయములవివరణము.

వ. మఱియు లఘ్వక్షరోచ్చారణమాత్ర కాలంబు నిమేషం,బట్టినిమేషంబులు పదునెనిమిది యైనఁ గాష్ఠ, యవి ముప్పది యైనఁ గళ, యవి యన్నియైనన్ క్షణం,బవి పండ్రెండు ముహూర్తం, బమ్ముహూర్తంబులు ముప్పది యైన నహోరాత్రంబులు గడచు, నయ్యహోరాత్రంబులందు శరీరేంద్రియ ప్రాణాంతఃకరణంబులు స్వస్వవ్యాపారంబులఁ జాలించి తమకుఁ గారణం బైనసుషుప్తిరూపావిద్యాంధకారమ్మునందు లయంబు నొందు,నప్పుడు జాగ్రత్స్వప్నాత్మకం బగునఖిలప్రపంచంబు వాసనారూపమాత్రం బై పల్లవపత్రపుష్పశలాటుఫలమూలశాఖోపశాఖాత్మకం బయినవటంబు తదీయబీజంబునందు,నానావిధవర్ణరక్తంబయినమయూరంబుతదీయాండాంతర్జలంబునందునున్నచందంబున నుండు, నిది నిత్యప్రళయం బన నొప్పు, నయ్యహోరాత్రపంచదశకంబు పక్షం బయ్యె, శుక్లకృష్ణాఖ్యపక్షద్వయంబు మాసం, బిది పితృదేవతల కొక్కదినం బగు నమ్మాసద్వయంబు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఋతువు, ఋతుత్రయం బయనంబు, దక్షిణోత్తరసంజ్ఞి కాయవద్వ
యంబు హాయనం, బదివేల్పులకొక్కదినం బగుఁ, దద్దివసవారషష్ఠి
మాసక్రమంబుచేత ద్వాదశసహస్రవత్సరంబు లైనఁ గృతత్రేతా
ద్వాపరకలియుగంబులు నాలుగుం జను, నయ్యుగచతుష్టయంబును
మహాయుగం బని చెప్పుదు, రవి డెబ్బది యొక్కటిరైన మన్వంతరంబు
చెల్లు, నమ్మన్వంతరంబులు పదునాలుగు చనిన నలువకు నొక్కపగ
లగు, నదిచతుర్యుగసహస్రపరిమితం, బాపగటిలోఁ జతుర్దశమన్వప్ర
ళయంబులునసేకయుగాంతరప్రళయంబులుఁ బ్రవర్తించు, నవియు
నైమిత్తికప్రళయంబు లవాంతరప్రళయంబు లనం బ్రసిద్ధంబులగు,
నందనంతభూతజాతంబులు నశించు, నయ్యహరవసానంబున ద్రుహి
ణుండునిద్రించు, నతనినిద్రయవ్యక్తంబనందగు, నందుబ్రహ్మాండంబు
నంగలసర్వప్రాణివ్యవహారం బుపరతంబగు, నత్తఱిమహాభూతంబులు
మాత్రంబు శేషించు, నది దైనందినప్రళయంబన విలసిల్లు, నయ్య
జున కహఃపరిమాణం, బంతియ రేయియగు, నట్టిదినసంఖ్యాక్ర
మంబుచేత శతాబ్దంబులు చనినశతానందుండు నాకంబుఁ జెందు,
నయ్యెడ మృత్యువు సమస్తజీవుల నొక్కపెట్టం బరిమార్చు,
రుద్రుండు చిచ్చుకన్ను దెఱచి చూచు, నాదిత్యుండు పండ్రెండు
మూర్తులు గైకొని ప్రకాశించు, నవ్వేళ ప్రజ్వలజ్జ్వాలాభీలం బగు
మహానలంబు జనియించి, విశ్వవిశ్వంబు భస్మీభూతంబుగాఁ జేయు,
సప్తమారుతంబు లొక్కపెట్ట విసరు, నవ మేఘంబు లుప్పతిల్లి
యమోఘంబులై నూఱుదివ్యవర్షంబులు మహావర్షంబు వర్షించు,
నందువలన సప్తసముద్రంబులుం గలసి యేకార్ణవం బై మహా
మహీమండలంబు నాక్రమించు, నంతట ధరణీచక్రంబమ్మహాసలిల
మధ్యంబున మహోదకంబుల స్వల్పలోష్టపిండంబువిధంబున విరిసి
చెడుఁ, దప్తాయఃపిండంబొకతోయకణంబుం బీల్చినకైవడి బడ
బాగ్ని విజృంభించి యమ్మహాంభోరాశిఁ బానంబుసేయు, దీపంబు
గాలి యార్చినభంగి నమ్మహాతేజోమండలంబును మహావాయువు
దెగటార్చు, నమ్మహాజంఝూసమీరంబు నిరాధేయం బగుటం జేసి
యంతరిక్షంబునం గలయం దిరిగి యందు సుషుప్తియందుఁ బ్రాణుల
పోలికప్రగ్గడమై [illegible] బయినసంక్రక్రమంబయినసంకల్పంబు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ్రింగినతెఱంగున నయ్యాకాశంబు మహామనంబు గ్రసించుఁ, బంచతన్మాత్రసహితం బయిన యమ్మహామానసంబు నిద్రాసమయంబుఁ గబళించుచాడ్పున నహంకారంబుఁ గబళించు, నయ్యహంకృతి మహాబుద్ధి మెసంగు, నమ్మహాబుద్ధియే మహత్తత్త్వం బని చెప్పనొప్పు, నమ్మహాతత్త్వంబు నవ్యక్తంబు తనయందు విలీనంబు గావించి యడంచుకొను, నది మాయావిద్యావ్యక్తతమస్సుషుప్తిప్రకృత్యానందాదిశబ్దవాచ్యం బయినప్రధానం బదియే బ్రహ్మప్రళయంబగు, నయ్యనాద్యనిర్వచనీయాజ్ఞానంబు సద్గురూక్తజీవేశ్వరైక్యజ్ఞానానుభవసమయంబున నభావంబగు, నదియే మహాప్రళయం బగు, నిట్టినిత్యనైమిత్తికదైనందినకల్పాంతమహాప్రళయంబులయం దేనొక్కటిచేత బాధింపంబడక సాక్షినై వానినన్నిటిం జూచుచు భూతభవిష్యద్వర్తమానకాలంబులయం దేకరూపంబుగా నుండుటం జేసి సద్రూపకుండ నగుదు నని యుపదేశించి వెండియు నిట్లనియె. 160

టీ. మఱియుఁ, లఘ్వక్షరోచ్చారణమాత్రకాలంబు = దీర్ఘాదులు లేనియక్షరమును ఉచ్చరించునంతకాలము, నిమేషంబు=నిముసమగును, అట్టినిమేషంబులు=అనిముసములు, పదునెనిమిది యైనఁ, కాష్ఠ = ఒకకాష్ఠయగును, అవి = ఆకాష్ఠలు, ముప్పది యైనఁ, కళ=కళయగును, అవి=ఆకళలు, అన్ని యైనఁ=ముప్పదియైనయెడల, క్షణంబు=ఒకక్షణమగును, అవి = ఆక్షణములు, పండ్రెండు, ముహూర్తంబు = ఒకముహూర్తమగును, అమ్ముహూర్తంబులు, ముప్పదియైన, అహోరాత్రంబులుగడచుఁ=ఒకపగలును ఒకరాత్రియును (అనఁగా: నొకదినము గడచిపోవును), అయ్యహోరాత్రంబులందుఁ= ఆదినములయందు, శరీర...బులు-శరీర=శరీరములు, ఇంద్రియ = జ్ఞానకర్మేంద్రియములు, ప్రాణ=పంచప్రాణములు, అంతఃకరణంబులు=మనస్సు, స్వస్వవ్యాపారంబులఁజాలించి= తమకార్యములమాని, తమకుఁ, కారణంబైన, సుషు...నందుఁ-సుషుప్తిరూప = సుషుప్త్యవస్థయే స్వరూపముగాఁ గల, అవిద్యా=అవిద్యయనెడు, అంధకారంబునఁ=చీఁకటియందు, లయంబునొందుఁ = లీనమలగును. అప్పుడు, జాగ్రత్స్వప్నాత్మకంబగు = జాగ్రత్స్వప్నావస్థారూపమైన, అఖిలప్రపంచంబు=సమస్తప్రపంచము, వాసనారూపమాత్రంబై = సంస్కారరూపముతో మాత్రమే, పల్లవ...కంబు-పల్లవ = చిగురుటాకు, పత్ర=ముదిరినయాకులు, పుష్ప=పువ్వులు, శలాటు=కాయలు, ఫల=పండ్లు, మూల=వేళ్లు, శాఖ=కొమ్మలు, ఉపశాఖ=చిటుగొమ్మలు, ఇవియే, ఆత్మకంబు = స్వరూపముగాఁ గలది,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఐనవటంబు=ఐనమఱ్ఱిమ్రాను, తదీయబీజంబునందుఁ=దానివిత్తనమునందును, నానా...బైన-నానావిధ=అనేకవిధములగు, వర్ణ=నీలపీతాదివర్ణములతో, యుక్తంబైన = కూడిన, మయూరంబు=నెమలి, తదీయాండాంతర్జలంబునందు-తదీయ=ఆనెమలియొక్క (అనఁగా: నెమలికి జన్మకారణ మైన), అండ = గ్రుడ్డుయొక్క, అంతః = లోపలనున్న, జలంబునందుఁ=నీటియందును, ఉన్నచందంబునఁ = ఉన్నట్లు, ఉండుఁ, ఇది నిత్యప్రళయంబననొప్పుఁ=దీనికి నిత్యప్రళయమని పేరు, అయ్య...తంబు-అయ్యహోరాత్ర=ఆదినములయొక్క, పంచదశకంబు=పదునేను (దినంబులు), పక్షంబయ్యెఁ = ఒకపక్షమగును, శుక్లకృష్ణాఖ్యపక్షద్వయంబు = శుక్లపక్షము కృష్ణపక్షము అని చెప్పఁబడు రెండుపక్షములును గలసి, మాసంబు = ఒకనెల యగును, ఇది=ఈనెల, పితృదేవతలకుఁ, ఒక్కదినంబగుఁ=ఒకదినంబగును, ఆమ్మాసద్వయంబు, ఋతువు=ఆమాసములు రెండు గలసిన నొక్క ఋతువగును, ఋతుత్రయంబయనంబు=మూఁడు ఋతువు లొక్కయయనము, దక్షిణోత్తరసంజ్ఞికాయనద్వయంబు = దక్షిణాయనము ఉత్తరాయణము అనురెండయనములు, హాయనంబు=ఒక్కసంవత్సరం బగును, అది=ఆసంవత్సరము, వేల్పులకుఁ = దేవతలకు, ఒక్కదినంబగుఁ = ఒకదిన మగును, తద్దివస...చేతఁ-తత్ = సంవత్సరాత్మక మైన, దివస=దినము, వార=ఏడుదినములు గలసినవారము, పక్ష = పదునేనుదినములు (అనఁగా: పదునేనుదినములు కలసి యొకపక్షము), మాస=అట్టిపక్షములు రెండు (అనఁగా: ముప్పది దినములు కలసి యొకమాసము), క్రమంబుచేతఁ=అని యీవరుసగా, ద్వాదశసహస్రవత్సరంబులైన = పండ్రెండువేలు దేవసంవత్సరంబు లైనచో, కృత...బులు-కృత=కృతయుగము, త్రేతా=త్రేతాయుగము, ద్వాపర = ద్వాపరయుగము, కలియుగంబు= కలియుగము, నాలుగుఁ=ఈనాలుగుయుగములును, చనుఁ=ఒక్కమాఱు గడచిపోవును, అయ్యుగచతుష్టయంబుఁ = ఆనాలుగుయుగము లొక్కమాఱు తిరుగుకాలము, మహాయుగమని చెప్పుదురు = మహాయుగమందురు, అవి డెబ్బదియొక్కటియైనఁ=ఆమహాయుగము డెబ్బదియొక్కమాఱులు తిరిగినచో, మన్వంతరంబులుచెల్లుఁ = ఒక్కొక్క మన్వంతరమగుచు వచ్చును, అమ్మన్వంతరంబులు, పదునాల్గుచనినఁ = పదునాల్గు గడచినచో, నలువకుఁ=బ్రహ్మదేవునకు, ఒక్కపగలగుఁ, అది = ఆపగలు, చతు...తంబు-చతుర్యుగ=మహాయుగములయొక్క, సహస్ర=వేయిచే, పరిమితంబు=లెక్కింపఁబడినది. (అనఁగా: వేయుమహాయుగములు బ్రహ్మకుఁ బగలు అగును.) ఆపగటిలోఁ, చతుర్దశమనుప్రళయంబులును=పదునాలుగుమనుప్రళయములు (అనఁగా మన్వంతరములు ముగియునప్పుడుకలుగుప్రళయములు పదునాల్గును), అనేకయుగాంతరప్రళయంబును - అనేక=లెక్కకు మిక్కిలియగు (లేక నాల్గువేలు), యుగాంతర=ఒక్కొక్కయుగము ముగియునప్పుడుకలుగు, ప్రళయంబులును, ప్రవర్తించుఁ=సంభవించును, అవియుఁ = ఆప్రళ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యము లన్నియును, నైమిత్తిక ప్రళయములు (అనఁగా: మన్వంతరము ముగియుట యుగము ముగియుట అను మొదలగు కారణములచేఁ గలుగు ప్రళయములు), అవాంతర ప్రళయంబులనన్ =అవాంతరప్రళయములు (అనఁగా నడుమవచ్చి పోవుప్రళయములు), అని, ప్రసిద్ధంబులగున్ = వ్యవహరింపఁ బడుచుండును. అందున్ = ఆయవాంతర ప్రళయములయందు, అనంతభూతజాలంబులు = లెక్కలేని మిక్కిలియగుజంతువులు, నశించున్, అయ్యహరవసానంబునన్ =ఆబ్రహ్మదేవునిపగలు ముగిసినపిదప, ద్రుహిణుఁడు= బ్రహ్మ, నిద్రించున్ = నిదురఁబోవును, ఆతనినిద్ర=ఆబ్రహ్మదేవునినిద్ర; అవ్యక్తంబనం దగున్=అవ్యక్త మని చెప్పంబడుచున్నది, అందున్ = ఆయవ్యక్తమునందు, సర్వప్రాణి వ్యవహారంబు = సమస్తప్రాణులయొక్క చేష్టలును, ఉపగతంబగున్ = నశించును. అత్తతిన్ =ఆసమయమునందు, మహాభూతంబులుమాత్రంబు=ఆకాశాదిపంచభూతములు మాత్రము, శేషించున్ = మిగిలి యుండును. అది దైనందినప్రళయంబన విలసిల్లున్ = బ్రహ్మ నిదురించునప్పుడు గలుగు ప్రళయమునకు దైనందినప్రళయ మని (అనఁగా: ప్రతిబ్రహ్మదినమందును గలుగు ప్రళయ మని పేరు), అయ్యజునకున్ = ఆబ్రహ్మ దేవునకు, అహః పరిమాణంబంతయు = పగటిపరిమాణ మెంతయో యంతయే, రేయి యగున్ =రాత్రిపరిమాణమగును (అనఁగా: రాత్రియును వేయుమహాయుగము లే), అట్టి దినసంఖ్యాక్రమంబుచేతన్ =ఇట్లు రెండువేలమహాయుగముల పరిమాణము గలదినముల సంఖ్యననుసరించి, శతాబ్దంబులు=నూఱుసంవత్సరములు, చనినన్ =గడచినయెడల, శతా నందుండు=బ్రహ్మ, నాకంబున్ =స్వర్గమును (లేక మోక్షమును), చెందున్ =పొందును, ఆయ్యెడన్ =అప్పుడు, మృత్యువు, సమస్తజీవులన్ = సర్వప్రాణులను, ఒక్కపెట్టన్ = ఒక్కమాటే, పరిమార్చున్ = నశింపంజేయును, రుద్రుఁడు = ఈశ్వరుఁడు, చిచ్చు కన్నుఁ దెఱచి=మూఁడవకంటిని దెఱచి, చూచున్, ఆదిత్యుండు=సూర్యుఁడు,పండ్రెండు మూర్తులుగైకొని=ద్వాదశరూపములతో (అనఁగా: ద్వాదశాదిత్యులును), ప్రకాశించున్ =ప్రకాశింతురు, అవ్వేళన్ = ఆసమయమునందు, ప్రజ్వా...లాభీలంబగు-ప్రజ్వాలత్ = మండుచున్న, జ్వాలా=మంటలచే, ఆభీలంబగు=భయంకర మైన, మహాతలంబు=గొప్ప యగ్ని, జనియించి = పుట్టి, విశ్వవిశ్వంబున్ = సకలప్రపంచమును, భస్మీభూతంబుగాఁ జేయును=బూడిదగాఁజేయును, సప్తమారుతంబులు=సప్తవాయువులును, ఒక్కపెట్టన్ = ఒక్కటై, విసరున్ =వీచును, నవమేఘంబులు=తొమ్మిదిమేఘములును, ఉప్పతిల్లి=ఒకటిగాఁ జేరి, విజృంభించి, అమోఘంబులై=మిగులపూన్కితో, నూఱుదివ్యవర్షంబులు = నూఱు దేవసంవత్సరములకాలము, మహావర్షంబువర్షించున్ =వాన కురియును, అందువలనన్ = ఆవానవలన, సప్తసముద్రంబులును=సముద్రము లేడును, కలసి, ఏకార్ణవంబై=ఒక్కటై, మహామహీమండలంబున్ = అధికమగుభూమి నంతయును, ఆక్రమించున్, అంతటన్ =

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పిదప, ధరణీచక్రంబు=భూమి, అమ్మహాసలిలమధ్యంబునన్=తనకంటె నెన్నియోరెట్లధిక ముగా నున్న జలములో, బహూదకంబులన్ = అధిక మగునీటిలో, స్వల్పలోష్టపిండంబు విధంబునన్=చిన్న మట్టిపెళ్లవలె, విరిసి చెడున్=కరిగినశించిపోవును, తత్తోయకణంబుల=కాలినఇనుపముద్ద, ఒకతోయకణంబున్=ఒకనీటిబొట్టును, పీల్చినకైవడిన్=పీల్చినట్లు, బడబాగ్ని = సముద్రమునం దున్నబడబానలము, విజృంభించి = అభివృద్ధియై, అమ్మహా భోరాశిన్ = ఆమహాసముద్రమును, పానంబు సేయున్ = పీల్చివేయును, దీపంబున్ = చిన్నదీపమును, గాలినూర్చినభంగిన్ = పెద్దగాలియార్చి వేసినట్లు, అమ్మహాతేజోమండ లంబున్=అయధికమైనయగ్నిని, మహావాయువు దెగటార్చున్=వాయుభూతమునశింపఁ జేయును, అమ్మహాజంఝూసమీరంబు = ఆమహావాయువు, నిరాధేయంబగుటం జేసి = ఆధారము లేని దగుటవలన, అంతరిక్షంబున్ = ఆకాశమునందు, కలయందిరిగి = అంత టను సంచరించి, అందున్ = ఆయాకాశమునందే, సుషుప్తియందున్ = సుషుప్త్య వస్థయందు, ప్రాణులపోలికన్ = ప్రాణవాయువులు నశించినట్లే, మ్రగ్గున్ = అడఁగి పోవును, శబ్దరూపంబైనసింగిన్ = శబ్దరూపమైనయాకాశమును, శ్రోత్రరూపం బైన సంకల్పంబు=శ్రోత్రేంద్రియరూపంబైనమనోవృత్తి, మ్రింగిన తెఱంగునన్=నశింపఁజేసిన యట్లు, అయ్యాకాశంబున్=ఆయాకాశమును, మహామనంబు=సమష్టిరూపమైనమనస్సు, గ్రసించున్=మ్రింగును, పంచతన్మాత్రసహితంబైన=ఆకాశాదిపంచసూక్ష్మభూతములతోఁ గూడిన, అమ్మహామానసంబు = ఆమహామనస్సును, నిద్రాసమయంబు = నిద్రాకాలము, కబళించుచాడ్పునన్ = లయము చేసికొనునట్లు, అహంకారంబు = మహదహంకారము, కబళించున్=నశింపఁజేయును, అయ్యహంకృతిన్ = ఆయహంకారమును, మహాబుద్ధి మెసంగున్=మహాబుద్ధి మ్రింగును, అమ్మహాబుద్ధియే, మహత్తత్త్వంబని = మహత్తత్త్వ మను పేరుతో, చెప్పనొప్పున్=చెప్పఁబడుచున్నది, అమ్మహాతత్త్వంబున్=ఆమహాబుద్ధిని, అవ్యక్తంబు=మాయ, తనయందున్ = తనలో, విలీనంబు గావించి = లయముంజేసి, అడంచికొనున్, అది=ఆఅవ్యక్తము, మాయా...నంబు-మాయా = మాయ, అవిద్యా= అవిద్య, అవ్యక్త=అవ్యక్తము, తమః = తమస్సు, సుషుప్తి = సుషుప్తి, ప్రకృతి=ప్రకృతి, ఆనంద = ఆనందము, ఆది = మొదలైన, శబ్ద=శబ్దములచే, వాచ్యంబైన = చెప్పందగిన, ప్రధానంబు=ప్రధానము (జగత్కారణమని చెప్పఁడినమాయ), అదియే = ఇప్పుడు చెప్పఁ బడినప్రళయమే. బ్రహ్మప్రళయంబనన్=బ్రహ్మప్రళయమని చెప్పఁబడును,అయ్యా...నంబు- అయ్యనాది=ఆయనాదియైనట్టియు,అనిర్వచనీయ=ఇట్టిదని చెప్పరానట్టియు, అజ్ఞానంబు =అజ్ఞానము (లేక మాయ), సద్గు...బునన్-సద్గురు=సద్గురువుచేత, ఉక్త=ఉపదేశింపఁ బడిన, జీవ=జీవుఁడనియు, ఈశ్వర=పరమేశ్వరుఁడనియు, ఐక్యజ్ఞాన=కలయైక్యమును తెలిసికొని, అనుభవ=దాని ననుభవించుటచే ... కాలమునందు, అభావంబగున్=లేక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పోవును. అదియే మహాప్రళయంబగుగ్=ఈ చెప్పంబడిన యజ్ఞానవినాశమే మహాప్రళయ మని చెప్పంబడును. ఇట్టి...యందు-ఇట్టి=ఇట్లు నిరూపింపఁబడిన, నిత్య=ప్రళయము నందును, నైమిత్తిక=నైమిత్తికప్రళయమునందును, దైనందిన=దైనందినప్రళయమునందును, కల్పాంత=బ్రహ్మకల్పము (అనఁగా బ్రహ్మయొక్క యాయుంవు ముగిసినపిదపఁ గలుగు బ్రహ్మ ప్రళయమునందును), మహాప్రళయంబులయందుగ్=భ్రాంతితొలఁగినపిదపఁ గలుగు మహా ప్రళయమునందును, ఏను=నేను, ఒక్కటిచేతఁగ్=ఒక్కొకదానిచేతనైనను, బాధింపఁబడక =నాశముఁ జెందక, సాక్షినై=ద్రష్టనై, వానినన్నింటిం జూచుచుగ్=ఆప్రళయముల నన్నిఁటినిఁ జూచుచు, భూత...యందుగ్-భూత=గడచినట్టియు, భవిష్యత్=రాఁబోవు నట్టియు, వర్తమాన=వచ్చియున్నట్టియు, కాలంబులయందుగ్ = సమయములయందు, ఏకరూపంబుగాగ్=ఒకటే విధముగా (అనగా మార్పునొందక), ఉండుటంజేసి=ఉండుట వలన, సద్రూపకుఁడనగుదుగ్=సద్రూపుండనై యున్నాను, అనియుంపదేశించి=అని చెప్పి, వెండియుంగ్=మఱియును, ఇట్లనియెగ్ = ఈక్రిందివిధముగాఁ జెప్పఁబోవుచున్నాఁడు.

తా. ఇదియునుగాక నిత్యప్రళయము నైమిత్తికప్రళయము దైనందినప్రళ యము బ్రహ్మప్రళయము మహాప్రళయము అని యైదుప్రళయములు కలవు. అవి యేవి యనిన: దీర్ఘాదులు లేక లఘువగు నక్షరము నుచ్చరించునంతకాలము నిమిషము. అవి పదునెనిమిదియొక్క కాష్ఠ. ముప్పదికాష్ఠ లొకకల. ముప్పదికల లొకక్షణము. పండ్రెండుక్షణము లొకముహూర్తము. ముప్పదిముహూర్తము లొకయహోరాత్రము (అనఁగా నొకదినము). దినమున నొకమాఱు జాగ్రత్స్వప్నసుషుప్తులు కలుగుచుండును కదా. అందు సుషుప్త్యవస్థ యజ్ఞానము (అనఁగా: సర్వకారణమగు మాయ) దాని యందు జాగ్రత్స్వప్నరూపమైన ప్రపంచము లయము నొందును; ఇది ప్రతిదినమును వచ్చు ప్రళయము కావున నిత్యప్రళయ మనఁబడును. మఱియు, పదునైదుదినము లొకపక్షము. రెండుపక్షము లొకమాసము. రెండుమాసము లొకఋతువు. మూఁడు ఋతువు లొకఅయనము. దక్షిణాయనమనియు ఉత్తరాయణమనియు నయనములు రెండు. ఇవి రెండును గలసి యొక సంవత్సరము. ఇందు మనుష్యమాసము పితరుల కొక దినము. మనుష్యుల సంవత్సరము దేవతల కొకదినము. ఈ దినపరిమాణము ననుసరించి పక్షమాసక్రమములచే పండ్రెండువేలసంవత్సరములు గడచిన చతుర్యుగములు నొక్క మాఱు కడచును. దీనికి (అనఁగా చతుర్యుగసమూహమునకు) మహాయుగమని పేరు. ఇట్టి మహాయుగములు డెబ్బదియొకటి గడచిన నొక మన్వంతరమగును. ఇట్టి మన్వంతర ములు పదునాలుగు గడచిన బ్రహ్మకు నొక్కపగలు. దానికి వేయు మహాయుగములు ప్రమాణము. ఈపగటియందు పదునాలుగు మన్వంతర ప్రళయములును అనేకములగు యుగప్రళయములును గలుగుచుండును. ఆప్రళయములయందు లెక్కకు మిక్కిలి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యగు భూతములు నశించుచుండును. ఇవి నైమిత్తిక ప్రళయములనియు నవాంతర ప్రళయములనియుఁ జెప్పఁబడును. ఇట్లు పగలు ముగిసినపిదప బ్రహ్మదేవుఁడు రాత్రి కాలమున నిదురఁబోవును. ఆనిదురయే యవ్యక్త మనఁబడును. ఆయవ్యక్తమున సకల ప్రపంచంబును లీనమగును. ఇది బ్రహ్మదేవుని ప్రతిదినమునందును వచ్చునది కావున దీనికి దైనందినప్రళయమని పేరు. పగటివలె రాత్రియు బ్రహ్మదేవునకు వేయు మహా యుగముల ప్రమాణముగలదియే. ఈదినప్రమాణము ననుసరించి పక్షమాసాది క్రమమున నూఱుసంవత్సరములు గడచిన యాచతుర్ముఖుఁడు ముక్తిఁజెందును. అప్పుడు సర్వభూతప్రళయము కలుగును. ఎట్లనిన ద్వాదశాదిత్యులు నొక్కమాఱు చెలరేఁగి ప్రచండాతపముచే భూమినెల్లఁ గాల్తురు. పిదప నవమేఘములును నొక్కటై విజృంభించి నూఱు దివ్యసంవత్సరము లేకధారగా వర్షించును. దానిచే సప్తసముద్రము లుప్పొంగి యేకమై భూమినంతయును ముంచును. ఎండగాయునప్పుడే సర్వజంతువులు ధ్వంసమగును. పిదప నాభూమి మహాసముద్రములలో మునిఁగి బహూదకంబులయం దొక చిన్నమట్టిపెళ్లవలెఁ గరఁగి నాశమగును. ఇట్లు పృథివీభూతము నశింపఁగానే యున్నతస్థితిలోనున్న జలభూతమును అగ్నిభూతము నశింపఁజేయును. అగ్నిభూతము విజృంభింపఁగానే తప్తలోహంబున నొక్క నీటిబిందువు నశించినట్లు ఆజలభూతమంతయు నొక్కనిమిషమున నశించును. అంత వాయుభూతము విజృంభించి గాలిదీపము నార్చిన ట్లాయగ్ని నార్పివేయును. తర్వాత నా వాయువుకూడ నిరాధారమగుటచేత నటునిటు తిరిగి నిశ్వాసవాయు వాకసమున నడఁగునట్లు సుప్త్యవస్థయందు ప్రాణవాయువులీనమగునట్లు ఆకాశభూతమున లయమునొందును. శబ్దమును మనోవృత్తిరూప (మనోరూప) మగు చెవి గ్రహించి తనలో నైక్యముఁ జేసుకొనునట్లు మహామనస్సు (సమష్టి మనస్సు) శబ్దరూపమగు నాకాశమును తనలోలయముఁజేసికొనును. సుషుప్తియందు మనస్సు (వ్యష్టిమనస్సు) లయమగునట్లు ఆమహామనస్సు మహదహంకారమున లయమునొందును. ఆ మహదహంకారము మహాబుద్ధియం దడఁగును. ఈమహాబుద్ధియే మహత్తత్త్వ మనంబడును. ఇదియే సమష్టిబుద్ధి. ఈబుద్ధి నజ్ఞానము తనలోనడంచుకొనును. ఇదియే మాయ. జగత్కారణము. ఇట్లు మాయావిశేషముగా సర్వంబును లయమగుట బ్రహ్మప్రళయ మనఁబడును. సద్గురు కరుణచే బ్రహ్మజ్ఞానము కలిగినప్పుడు ఆయజ్ఞాన మభావరూపమగును. అదియే మహాప్రళయము. ఓయాంజనేయ ! ఇట్లు వర్ణింపఁబడిన ఈఅయిదుప్రళయములచేతను గూడ నాకు బాధలేదు. నేనెచ్చటను దేనిచేతను నశింపఁజేయఁబడువాఁడను కాను. కావున నాశము లేకపోవుటచే నేను సద్రూపుఁడను.

## చిద్రూపలక్షణము.

అవ, ఈవిధముగా శ్రీరాముఁడు తన సద్రూపమును యుక్తియుక్తముగా నిరూపించి చిద్రూపమును నిరూపించుచున్నాఁడు:—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. ఇది ఘటం బిది పటం బిది గృహం బిది కుడ్య
మిది యరణ్యము శైల మిది యటంచు
నిది భూమి యిది జలం బితఁడు వైశ్వానరుం
డిది గాలి యాకసం బిది యటంచు
నితఁడు దివాకరుం డితఁడు నిశాకరుం
డివి తారలు గ్రహంబు లివి యటంచు
నివి యచేతనములౌ నివి చేతనము లంచు
నితఁ డాతఁ డతఁ డీతఁ డే నటంచు
తే. నరయ నాకంటె భిన్నంబులై జడంబు
లైనబాహ్యపదార్థసంహతుల నెల్ల
సాధనము లేక యెఱిఁగెడిసాక్షి నగుట
నేను జిద్రూపకుఁడ సుమ్ము వానరేంద్ర! 161

టీ. వానరేంద్ర = వానరశ్రేష్ఠా! ఇది ఘటంబు = ఇది కుండ, ఇదిపటంబు=ఇది గుడ్డ, ఇదిగృహంబు = ఇదియిల్లు, ఇదికుడ్యము=ఇది గోడ, ఇదియరణ్యము=ఇది యడవి, ఇదిశైలము=ఇదికొండ, అంచున్=అనియు, ఇదిభూమి, ఇదిజలంబు = ఇదినీరు, ఇతఁడు వైశ్వానరుండు = వీఁడు అగ్ని, ఇది గాలి, ఇదియాకసంబు=ఇది యాకాశము, అటంచున్=అనియు, ఇతఁడు దివాకరుఁడు=వీఁడు సూర్యుఁడు, ఇతఁడు నిశాకరుండు=వీఁడు చంద్రుఁడు, ఇవి తారలు=ఇవి నక్షత్రములు, గ్రహంబు లివి = ఇవి నవగ్రహములు, అటంచున్ = అనియును, ఇవి యచేతనములు = ఇవి జ్ఞానశూన్యములు, ఔన్= అయియున్నవి, ఇవిచేతనములంచున్=ఇవిజ్ఞానవంతములు అనియు, ఇతఁడాతఁడు=వీఁడు వాఁడు, అతఁడితఁడు = ఆపురుషుఁ డీపురుషుఁడు, ఏనటంచున్ = నేను అనియు, అరయన్=విచారింపఁగా, నాకంటె భిన్నంబులై = నాకంటె వేఱై, జడంబులైన=జ్ఞానశూన్యము లైన, బాహ్యపదార్థసంహతులనెల్లన్ = వెలుపల నుండు సమస్తపదార్థములను, సాధనము లేక = తెలిసికొనుటకు వేఱొకసాధనముతోఁ బనిలేక, ఎఱిఁగెడిసాక్షి నగుటన్ = తెలిసికొనునట్టిస్వతంత్రసాక్షి నగుటచే, నేను చిద్రూపకుండసుమ్ము=చిద్రూపుఁడను (అనఁగా జ్ఞానరూపుఁడను సుమా).

తా. ఓవానరశ్రేష్ఠా! మఱియొకవిశేషమును వివరించెదను. దానినిగూడ సావధానచిత్తుఁడవై యాకర్ణించి నారూపము నుపాసింపుము. నేను జ్ఞానరూపుఁడను. కావున జనులు నన్ను చిద్రూపుఁ డందురు. నేనే బాహ్యవిషయముల నన్నిటినిఁ బ్రకాశింపఁ జేయుచున్నాను. తేజోవంతంబు లని చెప్పఁబడు నక్షత్రాదులు కూడ నాప్రకాశము వలననే ప్రకాశించుచున్నది. "ఇది కుండ, ఇది వస్త్రము, ఇది ఇల్లు, ఇది గోడ" అని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భౌతికపదార్థములను ప్రతివాఁడును దనకంటె భిన్నముగ నెఱుంగుచున్నాఁడు. “ఇది భూమి, ఇదినీరు, ఇదియగ్ని, ఇదివాయువు, ఇదియాకాశము” అని భూతములనుగూడ తనకంటె భిన్నములుగ నెఱుంగుచున్నాఁడు. “వీఁడు సూర్యుఁడు, వీఁడుచంద్రుఁడు, ఇవి నక్షత్రములు, ఇవి గ్రహములు” అని తేజోమయపదార్థములనుగూడఁ దనకంటె భిన్నములనుగాఁ దెలిసికొనుచున్నాఁడు. “ఇవి చేతనములు, ఇవి యచేతనములు” అని చేతనాచేతనముల నన్నిఁటినిగూడఁ దనకంటె భిన్నములనుగా గ్రహించుచున్నాఁడు. “వీఁడువాఁడు, వాఁడువీఁడు,వీఁడు నేను” అని తచ్ఛబ్దఏతచ్ఛబ్దఅస్మచ్ఛబ్దములయర్థమును గూడఁ దనకంటె నన్యములుగ నిరూపించుచున్నాఁడు. ఈలోకానుభవబలముచే సర్వపదార్థములును నాకంటె భిన్నములు. నాచేఁ బ్రకాశింపఁజేయఁబడునవి. అస్మచ్ఛబ్దమునకు ముఖ్యార్థమును నేనెయైనను లోకులు దానికహంకారమునే యర్థమునుగాఁ దలంచుచున్నారు; కావునను ఆయహంకారము నాకు దృశ్యమగుటవలనను “వీఁడు నేను” అనువ్యవహారముకూడ నాకు గోచరమగుచున్నది. వాస్తవస్థితిలో నాకు వేఱొకసాక్షి లేనందున నన్నుఁగూర్చి “వీఁడు” అనుపరోక్షనిర్దేశమే కలుగుటకు వీలు లేదు కదా. మఱియు వీనిని బ్రకాశింపఁజేయుటకై నాకు నితరసాధనములతోఁ బనిలేదు. నాకు గూడ సాధనసంబంధములేక సాధనాంగీకారము కలదనిన ననవస్థాదోషము వచ్చును. ఎట్లనిన: నేను సాధనముల నంగీకరింతునేని అదియు (అనఁగా ఆసాధనాంగీకారము) నొక్కపనియే. కావున దానిని సాధించుటకుఁగూడ మఱికొన్ని సాధనముల నంగీకరింపవలయును. అదియుఁ బనియే కావున దానిని సాధించుటకుఁ గూడ మఱికొన్నింటి నంగీకరింపవలయును. అదియుఁ బనియే కావున దానికై మఱికొన్నిసాధనంబులను దానికై మఱికొన్నింటిని యిట్లు లెక్కలేనిమాఱులు సాధనాంగీకారముల నొనర్పవలయును. ఈసిద్ధాంతము (అనఁగా “నాకు బ్రహ్మమునకుఁగూడ నితరపదార్థములఁ బ్రకాశింపఁజేయుటకై ఇతర సాధనములు కావలయును” అనుసిద్ధాంతము)అనవస్థాదోషదుష్టమగుటచే నంగీకరింపఁదగినది కాదు. “ఇట్టైన నీచేఁ బ్రకాశనరూపకార్య మెట్లు చేయఁబడునో” అనియెదవేమో వినుము. లోకమునఁ గార్యముల సాధించుటకు సాధనాంగీకారము తప్ప వేఱొక యుపాయము లేకపోలేదు. ప్రభువుఅగువాఁడు తనసన్నిధానమాత్రముచేతనే సర్వవ్యవహారములను సాధించుట యనుభవసిద్ధమైయే యున్నది కదా. నేనునట్టే సన్నిధానమాత్రమున సర్వప్రపంచమును బ్రకాశింపఁజేయుచు స్వకార్యములయందుఁ బ్రవర్తింపంజేయుచున్నాను. ఈయభిప్రాయముచేతనే పూర్వమున “బ్రహ్మజ్ఞాని (లేక బ్రహ్మము) కర్త కాఁడు” అని చెప్పియున్నాను. ప్రకృతము సాధనాంతరములతోఁ బనిలేక సర్వమును బ్రకాశింపఁజేయుసాక్షినైయున్నాను. కావున నేను చిద్రూపుఁడను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. బాహ్యపదార్థముల నీవే (బ్రహ్మమే) ప్రకాశింపఁజేయుచున్న వనుట యేల? ఇంద్రియములు మొదలగువానిని బ్రకాశింపఁజేయవచ్చును. "వీఁడు నేను" అను వ్యవహారము శరీరమును గూర్చియే ప్రవర్తింపవచ్చును. కావున దానినిఁ గూడ మనస్సు ప్రకాశింపఁజేయవచ్చును కదా" యనిన నట్లు గాదని సయుక్తికముగ ననుభవనిదర్శన పూర్వకముగ సమాధానముఁ జెప్పుచున్నాఁడు:—

సీ. ఇది శరీరం బిది యింద్రియదశకంబు
    లివి పంచవిషయంబు లిదియ ప్రాణ
మిది మనం బిది చిత్త మిది యహంకారంబు
    నిది బుద్ధి యిది విద్య యిది యవిద్య
యిది కామ మిది క్రోధ మిది లోభ మిది మోహ
    మిది మహామత్సర మిది మదంబు
నిది జాగరము స్వప్న మిది సుషుప్తి తురీయ
    మిది యిది యనుచు నాయెదురఁ దోఁచు

తే. నాంతరపదార్థముల నెల్ల ననవరతము
సాధనం బేమియును లేక సాక్షి నగుచు
నే నెఱుంగుదుఁ గావున నిత్యవిమల
చిత్స్వరూపుఁడ నగుచు రాజితవిచార! 162

టీ. రాజితవిచార-రాజిత = ఒప్పుచున్న, విచార = తత్వవిచారముకల యాంజనేయా! ఇదిశరీరంబు=ఇది శరీరము, ఇది యింద్రియదశకంబు = ఇవి పది యింద్రియములు, ఇవి పంచ విషయంబులు = శబ్దాదిపంచవిషయములు, ఇదియ ప్రాణము = ఇది ప్రాణవాయువు (వృత్తి భేదములవలనఁ బ్రాణాపానాది నామభేదములుకల ప్రాణవాయువు), ఇది మనంబు=ఇది మనస్సు, ఇది చిత్తము, ఇది యహంకారము, ఇది బుద్ధి ఇది విద్య=ఇది జ్ఞానము, ఇది యవిద్య=ఇది యజ్ఞానము, ఇది కామము, ఇది క్రోధము, ఇది లాభము, ఇది మోహము, ఇది మహామత్సరము=ఇది యధికమగు (అనఁగా కామాదులలో నగ్రగణ్యమగు) మాత్సర్యము, ఇది మదంబు, ఇది జాగరము=ఇది జాగ్రదవస్థ, ఇది స్వప్నము=ఇది స్వప్నావస్థ, ఇది సుషుప్తి = ఇది సుషుప్త్యవస్థ, ఇది తురీయము = ఇది తుర్యావస్థ, అనుచున్=అని, నాయెదురన్=నాకు నభిముఖముగా, తోఁచునాంతరపదార్థములనెల్లన్=తోఁచునట్టి లోపలిపదార్థముల నన్నిటిని, అనవరతమున్ = ఎల్లప్పుడును, సాధనం బేమియును లేక= తెలిసికొనుటకు సాధనాంతరముతోఁ బనిలేకయె, సాక్షి నగుచున్ = ద్రష్టనై, నే నెఱుంగుదుఁగావున్ = నేను తెలిసికొనుచున్నాను కాఁబట్టి,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిత్య...పుఁడర్ - నిత్య = శాశ్వతమైనట్టియు, విమల = పరిశుద్ధమైనట్టియు, చిత్స్వరూపుఁడర్ = జ్ఞానమే స్వరూపముగాఁ గలవాఁడను, అగుచుర్ = ఐ యున్నాను.

తా. చక్కని వివేకముగల యాంజనేయ! నేను బాహ్యపదార్థముల నెట్లు ప్రకాశింపఁజేయుచున్నానో అట్లే యాంతరపదార్థములనుగూడ ప్రకాశింపఁజేయుచున్నాను. లోకమునఁ బ్రతిపురుషుఁడును "ఇది శరీరము. ఇవి ఇంద్రియములు. ఇవి శబ్దాదులు. ఇవి ప్రాణములు" అని స్థూలసూక్ష్మశరీరములయందలి సామాన్యతత్త్వములఁ (లేక బాహ్యతత్త్వముల, అనఁగా: మనోగోచరములగు తత్త్వములఁ) దనకంటె భిన్నములనుగాఁ దెలిసికొనుచున్నాఁడు. "ఇది మనస్సు. ఇది చిత్తము. ఇది బుద్ధి. ఇది యహంకారము" అని యంతఃకరణమునుగూడ తనకంటె నన్యముగ నెఱుంగుచున్నాఁడు. "ఇది జ్ఞానము ఇది యజ్ఞానము" అని జ్ఞానాజ్ఞానములనుగూడఁ దనకంటె నన్యములను గ్రహించుచున్నాఁడు. "ఇది కామము. ఇది క్రోధము. ఇది లోభము. ఇది మోహము. ఇది మత్సరము. ఇది మదము" అని రజోగుణజన్యములైన కామాదివృత్తులనెల్లఁ దనకంటె వేఱుగ గ్రహించుచున్నాఁడు. "ఇది జాగ్రత్త. ఇది స్వప్నము. ఇది సుషుప్తి ఇది తురీయము" అని యింద్రియాది ప్రకాశకాలంబును మనోమాత్రప్రకాశకాలంబును సర్వాభావకాలంబును జీవబ్రహ్మైక్య కాలంబునుఁ దనకంటె భిన్నములనుగా వివేచన చేయుచున్నాఁడు. ఈయనుభవమువలన సర్వపదార్థములను నాకే (బ్రహ్మమునకే) గోచరములగుచున్నవనుటయు "ఇంద్రియములు మొదలయినవియే బాహ్యపదార్థములఁ బ్రకాశింపఁజేయును (అనఁగాఁ దెలిసికొనును.) అనుట భ్రాంతియే యనుటయు స్పష్టమగుచున్నది. కావున నేనే ఇతర సాధనములతోఁ బనిలేక సర్వము గ్రహించుచున్నాను. కావునఁ జిద్రూపుఁడను.

## ఆనందలక్షణము.

అవ. ఈవిధముగ సచ్చిద్రూపముల వివరించి యానందరూపమును దెలియఁజేయుచున్నాఁడు:—

శా. వరుసం బ్రాప్తములైనదుఃఖములఁ బోవం జూచుచు న్నూరిసు
స్థిరసౌఖ్యోన్నతిఁ జెంది యుండుటకు నై చింతింపుదుం గాని నేఁ
బరమప్రేమరసాస్పదుండ నగు నర్ భావింప నట్లౌటచేఁ
బరమానందమయాత్ముఁడం జుమి జగత్ప్రాణాత్మజా! నిత్యమున్.

టీ. జగత్ప్రాణాత్మజా = వాయుపుత్త్రా! భావింపర్ = విచారింపఁగా, నిత్యమున్ = ఎల్లప్పుడును, వరుసర్ = క్రమముగా, ప్రాప్తములు = వచ్చినవి, ఐనదుఃఖములర్ = అయినట్టిదుఃఖములను, పోవంజూచుచుర్ = నశించుచుండఁగా చూచుచు (లేక ద్వేషించుచు)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భూరి...న్నతిన్-భూరి = అధికమైనట్టియు, సుస్థిర = శాశ్వతమైనట్టియు, సౌఖ్యోన్నతిన్ = ఆనందాధిక్యమును, చెందియుండుటకునై=కలిగియుండుటకు, చింతింపుదుంగాన్ =ఆలోచించుచుందును గావున, నేన్=నేను (ఆత్మ), పరమ...దుండన్-పరమ=అధికమైన, ప్రేమరస=ఆనందమునకు, ఆస్పదుండన్=స్థానమైనవాఁడను, అగుదున్=ఐయున్నాను. అట్లౌటచేన్ = అట్లుగావున, పరమానందమయాత్ముఁడంజుమి = ఆనందమే స్వరూపముగాఁ గలవాఁడను సుమా.

తా. ఓ వాయుపుత్త్రా! ఇంతమాత్రమేకాదు. ఆనందముకూడ నాస్వరూపమే. అందఱును (అనఁగా వేఱువేఱుగఁ గానవచ్చుచున్న వారందఱును) తన్నే (తమయాత్మనే) యన్నిటికంటె నధికముగ భ్రమించుచున్నారు. లోకమునఁ బ్రతివాఁడును దుఃఖమును ద్వేషించుచుఁ దనకు నెప్పుడును సుఖము కావలయు ననియే కోరుచునుండుటయే యీవిషయమున ప్రబలప్రమాణము. ఆత్మయందు భ్రమ లేకపోయిన నాత్మకుఁ గలుగు దుఃఖముల ద్వేషించుట సంభవింపదుకదా. ఏది ప్రేమింపఁబడునో అది యానందమే; లేకయానందమయమే" యనుట యనుభవసిద్ధము. ఎవ్వఁడేపదార్థమును గోరినను దానివలనఁ గలుగునానందము ననుభవింపవలయు ననియే కదా. ఈ యనుభవమువలన "ప్రేమింపఁబడునది యెల్ల నానందమయమే" యనుట సిద్ధాంతమైనది. ఇట్లగుటచేతఁ బ్రపంచమునందున్న సర్వపదార్థములకంటె నత్యధికముగఁ బ్రేమింపఁబడుచుండుటచే నే నానందరూపుఁడను.

తే. వివిధదుఃఖాత్మకము లైనవిషయతతులు
తొడరి యత్యంతసుఖములై తోఁచుటెల్ల
నతులితానందమయుఁడ నైనట్టినాదు
సలలితాభాసమాత్రంబువలనఁ జువ్వె. 164

టీ. వివిధ...ములు-వివిధ = బహువిధములైన, దుఃఖాత్మకములు = దుఃఖములే స్వరూపముగాఁగలవి (ఇంద్రియముల తేజమును నశింపఁజేయుట, ఆర్జనరక్షణములయందుఁ గష్టమును కలిగించుట, యనుభవకాలమున మిగుల స్వల్పములై యుండుట, యెంత యనుభవించినను దృప్తిని జెందనీక మనసును నిరంతరము బాధించుట మొదలగుదుఃఖములే స్వరూపముగాఁగలవి), ఐనవిషయతతులు = ఐనట్టిశబ్దాదులు, తొడరి=అధికమై, అత్యంతసుఖములై = మిగుల సుఖమును గలిగించునవిగా, తోఁచుటెల్లన్ = తోఁచుట యంతయు, అతు...యుఁడన్-అతులిత=సాటిలేని, ఆనందమయుఁడన్ = ఆనందమే స్వరూపముగాఁగలవాఁడను,ఐన...వలనన్-ఐనట్టి=ఐయున్న,నాదు=నాయొక్క, సలలిత=మనోహరమైన, ఆభాసమాత్రంబువలనన్=ప్రతిబింబమాత్రమువలననే, చువ్వె=సుమా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. మఱియొకనిదర్శనము వినుము. లోకమునందు సుఖము లని భావింపఁబడుచు సర్వజనులచేఁ గోరఁబడుచు నున్నశబ్దాదులు చక్కఁగా విచారించినచో దుఃఖరూపములే యగు ననుట విద్వదనుభవసిద్ధంబు. ఇట్లుండియును ఆవిషయములు సుఖరూపములై తోఁచుచుండుట యానందమయుఁడ నగు నాసంబంధమువలననే. ఈవిషయమున సంశయ మేమియుం లేదు. అల్ప మైనను అధిక మైనను ఉపాధిభేదములే కాని యానంద మొక్కటియేకదా? రెండానందములు కలవనిన నావిషయమును నిరూపించుటకుఁ దగినయుక్తి యేదియు లేదు. కావున నేనొక్కఁడనే యానందరూపుఁడను. నాసంబంధమువలననే దుఃఖరూప మగుప్రపంచము సుఖరూపమై తోఁచుచున్నది.

తే. దుఃఖ మాగంతుకం బయి తోఁచుచుండు
సుఖము స్వాభావికము నాకు సూరివర్య
యట్లు గావున నిరతిశయాప్రమేయ
నిరుపమానందమయుఁడను నేను బుత్ర. 165

టీ. సూరివర్య = జ్ఞానులలో శ్రేష్ఠుఁడా, పుత్ర=కుమారా! నాకున్=(జీవునకు) దేహికి, దుఃఖము, ఆగంతుకంబై = అప్పుడప్పుడు వచ్చుచుఁ బోవుచు నుండునదిగా, తోఁచుచుండున్, సుఖము, స్వాభావికము = స్వభావసిద్ధమైనది. అట్లుగావునన్=కాఁబట్టి, నేను=ఆత్మస్వరూపుఁడనైన నేను, నిర...యుఁడన్ - నిరతిశయ = అన్నిటికంటె నధిక మైనట్టియు, అప్రమేయ=ప్రమాణమునకు గోచరము కానట్టియుం, నిరుపమ=సాటి లేనట్టియు, ఆనంద=ఆనందమే, మయుఁడన్=స్వరూపముగాఁ గలవాఁడను.

తా. విద్వచ్ఛ్రేష్ఠ! పుత్రా! మఱియొకయనుభవమును జూడుము. లోకమున నొక్కొకనికి దుఃఖమువచ్చినఁ గొంతకాలము మాత్రమే యుండి నశించుచుండుట యనుభవములో నున్నది. ఈయనుభవమువలన "ఆత్మకు సుఖము స్వభావసిద్ధము" అనియు "దుఃఖము ఆగంతుకము" అనియు అనఁగా "నడుమ నడుమ వచ్చుచుఁ బోవుచు దుఃఖము నించుక యావరించు నది" యనియు సిద్ధాంత మగుచున్నది. కావున ప్రమాణగమ్యము కానట్టియు తనకంటె నధికమైన పదార్థము లేనట్టియు సాటిలేనట్టియు పరిపూర్ణానందమే నాకు (ఆత్మకు) స్వరూపము. స్వరూపభిన్న మగుపదార్థము సహజమై (స్వాభావికమై) యుండుటకు వీలు లేదు. "ఏది దేనికి స్వభావసిద్ధమై యుండునో అది దానికి స్వరూపమై యెడతెగనిసంబంధము కలధర్మమై యుండవలెను" అనుట నియమముకదా? ఈయానందము నాకు ధర్మమగుటకు వీలులేదు. అప్పుడు నాకు పరిచ్ఛేదము (అనఁగా నొకచోట లేకుండుట) కలుగును. ఇది సమ్మతముకాదు. నాకంటే రెండవది యగువస్తువుండుటకు వీలులేదని ఇదివఱకే నిరూపించి యున్నాను. "అసంగో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్యాయం పురుషః"="ఈబ్రహ్మము దేనితోను సంబంధపడువాఁడు కాఁడు" అనుశ్రుతియు నీవిషయమునే స్పష్టము చేయుచున్నది. కావున నే నానందరూపుఁడను. ఈవిధముగ నాకు సత్యము జ్ఞానము ఆనందము అను నవియే స్వరూపము లని తెలిసికొని లోకమునఁ బ్రత్యక్షసిద్ధములైన యుపాధివశమున నల్పములై కానవచ్చు సత్యాదులను బట్టి నిరతిశయసత్యాదుల నూహించి వానినే నన్నుఁగా నెఱింగి వివేకబలముచేఁ బ్రపంచము నెల్ల (ఉపాధుల నెల్ల) నిషేధించి యభేదముగ నుపాసింపుము.

## అఖండలక్షణము.

అవ. ఇట్లు తనసచ్చిదానందరూపమును సయుక్తికముగ వివరించి యుపాసనామార్గమును (లేక ధ్యానమార్గమును) దెల్పి పర్యవసానమును జేయుచుఁ దనసర్వవ్యాపకత్వము నెఱింగించుచున్నాఁడు:—

వ. ఇట్లు కాలత్రయాబాధ్యత్వంబువలనను స్వారోపితాశేషపదార్థభాసకత్వంబువలనను, బరమప్రేమరసాస్పదత్వంబువలనను, సచ్చిదానందస్వరూపకుండనయిన నేను మణికనకరజతతామ్రలోహకాంస్యమృణ్మయఘటంబులలోపల వెలుపల నంటక నాకాశంబు వ్యాపించియున్న చందంబున వియత్పవన తేజోజల భూదేవమానవతిర్యక్స్థావరాది చరాచరంబులయందు బాహ్యాభ్యంతరంబుల నసంగుండనై నిండియుండుటంజేసి నాకు దేశకృతపరిచ్ఛేదంబు లేదనాద్యనిర్వచనీయ మాయాకల్పిత భూతవర్తమాన భవిష్యత్సమయములయం దేకరూపత్వంబుచేత సాక్షినై యుండియు వానినెల్ల నెల్లప్పుడు దృశ్యంబుగా నెఱుంగుటవలనఁ గాలకృతపరిచ్ఛేదంబు గలుగదు మఱియు వృక్షంబునకు వృక్షాంతరంబు సజాతీయంబయి శిలాదికంబు విజాతీయంబయి పత్రపుష్పఫలాదికంబులు స్వగతంబులై యొప్పిన కైవడి నీయనాత్మప్రపంచంబసద్రూపంబగుటవలన నిరవయవంబు వ్యాపకంబు నసంగంబునై నగగనంబునకు నభావరూపంబ స్వభావంబగుటవలనను శశవిషాణాం బెద్దియుం గానిపగిది సజాతీయ విజాతీయ స్వగతంబులుగానేర వట్లగుట వస్తుకృతపరిచ్ఛేదంబు శూన్యంబగు నివ్విధంబునఁ ద్రివిధపరిచ్ఛేదరహితత్వంబువలన నద్వితీయ పరిపూర్ణ ప్రత్యగభిన్నపరబ్రహ్మచైతన్యంబగుదు నని వెండియు ని ట్లనియె.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ఇట్లు=ఈవిధముగా, కాలత్రయాబాధ్యత్వంబువలనను = భూతభవిష్యద్వర్త మానకాలములయం దొక్కరీతిగా నుండుటచేతను, స్వారో...నను-స్వారోపిత=తనయం దారోపింపఁబడిన, అశేష = సమస్తమైన, పదార్థ = పదార్థములను, భాసకత్వంబు వలనను=ప్రకాశింపఁ జేయుచుండుటవలనను, పరమ...నను-పరమ = అధికమైన, ప్రేమ రస = ఆనందరసమునకు, ఆస్పదత్వంబువలనను = ఆధారభూతుఁడై యుండుటచేతను, సచ్చిదానందస్వరూపకుండనైన నేను = సత్యజ్ఞానానందస్వరూపుఁడనైనట్టి నేను, మణి...పలన్-మణి=మణిమయ మైనట్టియు, కనక=సువర్ణమయ మైనట్టియు,రజత=రజతమయ మైనట్టియు, తామ్ర = తామ్రమయ మైనట్టియు, లోహ = అయోమయ మైనట్టియు, కాంస్య=కంచుతోఁజేయంబడినట్టియు, మృత్=మట్టితో, మయ = చేయఁబడినట్టియు, ఘటంబుల=పాత్రలయొక్క, లోపలవెలుపలన్, అంటక = సంబంధింపక, ఆకాశంబు= ఆకాశము, వ్యాపించియున్నచందంబునన్=వ్యాపించియున్నట్లు, వియ...యందున్ - వియత్ = ఆకాశము, పవన = వాయువు, తేజః = అగ్ని, జల = జలము, భూ = భూమి, దేవ = దేవతలు, మానవ=మనుష్యులు, తిర్యక్ = పశుపక్ష్యాదులు, స్థావర= స్థావరము లైనపర్వతములు మొదలగునవి, ఆది=మొదలైన, చరాచరంబులయందున్ = ప్రపంచములందు, బాహ్యాభ్యంతరంబులన్ = లోపలను వెలుపలను, అసంగుండనై= సంబంధము లేనివాఁడనై, నిండియుండుటం జేసి = వ్యాపించి యుండుటవలన, నాకున్, దేశ...దంబు-దేశ=స్థలములచేత, కృత=చేయఁబడిన, పరిచ్ఛేదంబు=భేదము ("ఇచ్చట నున్నాను అచ్చటలేను." అను భేదవ్యవహారము), లేదు. అనా...యందున్ - అనాది= ఆద్యంతములు లేనట్టియు, అనిర్వచనీయము='ఇది యిట్టిది' అని నిరూపింపరానట్టియు, మాయా=మాయచేత, కల్పిత=కల్పింపఁబడినట్టి, భూత = గడచినట్టియు, వర్తమాన = జరుగుచున్నట్టియు, భవిష్యత్ = జరుగఁబోవునట్టియు, సమయంబులయందున్ = కాలములయందు, ఏకరూపత్వంబుచేతన్ = ఒకటే రూపముతో, సాక్షినై = ద్రష్టనై ఉండియున్, వానినెల్లన్ = ఆకాలముల నన్నిఁటిని, ఎల్లప్పుడున్ = ఎప్పుడును, దృశ్యంబుగా నెఱుంగుటవలనన్ = దృశ్యముగా చూచుచుండుటవలన, కాలకృతపరి చ్ఛేదంబుగలుగదు = కాలముచే చేయఁబడిన, భేదముగలుగదు (అనఁగా: ఈకాలము నందునున్నాఁడు, ఆకాలమునందు లేఁడు అను భేదములేదు), మఱియున్ = ఇదియునుం గాక, వృక్షంబునకున్=ఒకచెట్టుకు, వృక్షాంతరంబు = మఱియొకచెట్టు, సజాతీయంబై= సమానజాతి గలదై, శిలాదికంబు = ఱాయి మొదలగునవి, విజాతీయంబై = విరుద్ధజాతి గలవై, పత్ర...బులు-పత్ర=ఆకులు, పుష్ప = పువ్వులు, ఫల = పండ్లు, ఆదికంబులు = మొదలగునవి, స్వగతంబులై=తనలోనేయుండి, ఒప్పినకైవడిన్=భేదమును కలిగించుచు నున్నట్లు, ఈ...ప్రపంచంబు = ఈయనాత్మయైనజగత్తు, అసద్రూపంబగుటవలనన్ =

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లేని దగుటచేతను, నిరవయవంబును=అవయవంబులు లేనిదియు, వ్యాపకంబును = సర్వవ్యాపకమైనదియు, అసంగంబు = దేనితోను సంబంధింపనిదియు, ఐనగగనంబునకున్ = అయినట్టి ఆకాశమునకు, అభావరూపంబు = శూన్యముగా నుండుటయే, స్వభావంబగుటవలనన్ =స్వరూపము కావునను, శశవిషాణంబు=కుందేటి కొమ్ము,' ఎద్దియుంగానిపగిదిన్ = ఉన్నదియు లేనిదియు గానట్లు, సజా...బులు-సజాతీయ = (భూతములు) సమానజాతి కలవి గాని, విజాతీయ=విరుద్ధజాతిగలవి కాని, స్వగతంబులు = తనయందే యున్నవి కాని, కానేరవు=కావు (అనఁగా : సజాతీయ, విజాతీయ, స్వగత భేదములను నాకు (బ్రహ్మకుఁ) గలిగింపనేరవు), అట్లగుటవలనన్ = అట్లుగావున, వస్తుకృతపరిచ్ఛేదంబు శూన్యంబగున్ = వస్తువులచేఁ జేయఁబడిన భేదము (అనఁగా: ఈవస్తువునందున్నాఁడు, ఆవస్తువునందు లేఁడు, అను భేదము లేదు), ఇవ్విధంబునన్ = ఈవిధముగా, త్రివిధపరిచ్ఛేదరహితత్వంబువలనన్ = దేశవస్తుకాలపరిచ్ఛేదములు లేకుండుటవలన, అద్వితీ...య్యంబున్-అద్వితీయ = రెండవది లేనట్టియు, పరిపూర్ణ = సర్వవ్యాపకుఁ డైనట్టియు, ప్రత్యగభిన్న = కూటస్థునికంటె వేఱు కానట్టియు, పరబ్రహ్మచైతన్యంబున్ = పరబ్రహ్మమైనరూపమే స్వరూపముగాఁ గలవాఁడను, అగుదునని=అయియున్నానని, వెండియున్ =మఱియును, ఇట్లనియెన్=ఈ క్రిందివిధముగా చెప్పెను.

తా. ఈవిధముగాఁ ద్రికాలములయందును నాశములేనివాఁడ నగుటచేత సద్రూపుఁడనై సర్వవస్తువులఁ బ్రకాశింపఁజేయుచుండుటచేఁ జిద్రూపుఁడనై యందఱిచేతను సర్వాధికముగఁ బ్రేమింపఁబడుచుండుటచేత నానందరూపుఁడనై యుండి పరిచ్ఛేదశూన్యుఁడనగుటచేత సర్వవ్యాపకుఁడను గూడనైయున్నాను. దేశకృతపరిచ్ఛేద మనియుఁ గాలకృతపరిచ్ఛేద మనియు వస్తుకృతపరిచ్ఛేద మనియు పరిచ్ఛేదములు మూఁడు విధములు. అందు ఒకదేశముననుండి మఱియొకదేశమున లేకపోవుట దేశకృతపరిచ్ఛేదము. ఒకకాలముననుండి మఱియొకకాలమున లేకపోవుట కాలకృతపరిచ్ఛేదము. తనకంటె భిన్నముగు పదార్థము వేఱొకటియుండుట వస్తుకృతపరిచ్ఛేదము. ఈమూఁడుపరిచ్ఛేదములలో నొక్కటైన నుండునేని యది సర్వవ్యాపకము కానేరదు. నాకీమూఁడునులేవు. ఎట్లనిన—మణిసువర్ణరజితతామ్రలోహమృణ్మయాదు లగు సర్వవిధములైన అనఁగా: నెక్కుపతక్కువలుగల ఘటాదులయందు లోపల వెలుపల వ్యాపించి వానితో సంబంధమేమియుంలేక సర్వవ్యాపకమైయుండునాకాశమువలెఁ బంచభూతములయందును దశాకార్యములగు దేవ మనుష్యమృగాదులయందును (అనఁగా : న్యూనాధికభావములు గల సర్వపదార్థములయందును) నేను వ్యాపించియున్నాను. ఈ చెప్పఁబడినవే ప్రపంచము కావున సర్వదేశములయందు నున్నవాఁడ నగుటచే నాకు దేశకృతపరిచ్ఛేదము లేదు. ఉత్పత్తివినాశములకుఁ గూడ సాక్షి నగుటచే నేను సర్వకాలములయందు నున్నాను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కావునఁ గాలకృతపరిచ్ఛేదము లేదు. సజాతీయమనియు విజాతీయమనియు స్వగతమనియు వస్తుపరిచ్ఛేదము మూఁడువిధములు. అందు ఒకవృక్షమునకు మఱియొక్క వృక్షమునుండి గలుగుపరిచ్ఛేదము (అనఁగా: "ఆవృక్షమునకంటె నీవృక్షము వేఱు" అను వ్యవహారమునకుఁ గారణమగుపరిచ్ఛేదము) (భేదము) సజాతీయవస్తుకృతపరిచ్ఛేదము. ఇట్లే వృక్షమునకు ఱాయి మొదలగువానివలనఁ గలుగుపరిచ్ఛేదము విజాతీయ వస్తుకృతపరిచ్ఛేదము. ఆవృక్షమునకే తనయవయవములైన పత్రపుష్పఫలశాఖాదులవలనఁ గలుగుపరిచ్ఛేదము. స్వగతవస్తుకృతపరిచ్ఛేదము, "సజాతీయ మనఁగా తనజాతి గలరెండవవస్తువు. విజాతీయ మనఁగా విరుద్ధజాతి గలరెండవవస్తువు. స్వగత మనఁగాఁ దనలోనేయుండియు భిన్నముగ వ్యవహరింపఁబడువస్తువు" అని తెలిసికొనవలయును. ఈమూఁడువిధము లగువస్తుపరిచ్ఛేదములలో నొక్కటియైనను నాకుఁ గలుగదు. భ్రాంతివలనఁ బ్రపంచము నాకంటె వేఱుగా నున్నట్లు తోఁచుచున్నది. కాని వాస్తవముగ విచారించిన నది లేనేలేదు. "ఆకాశభూతము నిరవయవము (అవయవములులేనిది) దేనితోను సంబంధించునది కాదు. సర్వవ్యాపకము. ఇట్లగుటచే నది యసద్రూపము కానేరదు. అవయవములుండుటచేఁ దక్కిన నాల్గుభూతములును నశించునవియైనను దీనికి నాశము కలుగదు. కావున బ్రహ్మమునకుఁ దీనితో విజాతీయపరిచ్ఛేదము రావలయును" అనియందువేమో అది సరికాదు. ఆకాశ మెట్టిదైనను దానికి నభావమే స్వరూపము. ఇది యనుభవసిద్ధమే. కావున వంధ్యాపుత్రునివలె మృగతృష్ణికాజలమువలె నిది బ్రహ్మమున కేవిధమగువస్తుపరిచ్ఛేదమును జేయఁజాలదు. "జలము రెండువిధములు. శుద్ధజల మొక్కటి. మృగతృష్ణికాజల మొక్కటి. కమలము రెండువిధములు. సరస్సునందుఁ బుట్టునది యొక్కటి. యాకాశమునందుఁ బుట్టునదియొక్కటి" అని వ్యవహరించుట పరిహాసాస్పద మగుననుటకు సందియము లేదు కదా. ఈవిధముగా నాకుఁ ద్రివిధపరిచ్ఛేదములును లేకుండుటచే నేను అద్వితీయుఁడను. (సర్వవ్యాపకుఁడను. కూటస్థునికంటె వేఱుకాని శుద్ధపరబ్రహ్మంబును.) ఓపార్వతీ! ఈవిధముగాఁ దనయపరిచ్ఛిన్నత్వమును దెల్పి సర్వాత్మకునిగ ధ్యానింపు మని ఉపదేశించి శ్రీరాముఁడు హనుమంతునితో నీక్రిందివిధమున జెప్పెను.

అవ. ఇట్లు సర్వము నుపదేశించి సాంఖ్యయోగము నుపసంహరించుచున్నాఁడు:—

ఆ. ఏ నఖండసచ్చిదానందమయుఁడనై
యిట్లు వెలుఁగుచునికి నెఱిఁగి నన్ను
నేనటంచుఁ దెలియు నిపుణులు మత్స్వరూ
పాత్ము లగుచు ముక్తు లగుదు రనఘ. 167

టీ. అనఘ = దోషరహితుఁడా, ఏను, అఖండసచ్చిదానందమయుఁడనై = సర్వపరిపూర్ణసత్యజ్ఞానానందస్వరూపుఁడనై, ఇట్లు = పైన వివరించినవిధముగా, వెలుఁగుచుఁ =

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రకాశించుచు, ఉనికిన్ = ఉండుటను, ఎఱింగి = తెలిసికొని, నన్నున్ = బ్రహ్మ స్వరూపుఁడనైననన్ను, నేనటంచుఁదెలియునిపుణులు = అస్మచ్ఛబ్దార్థమని తెలిసికొను విద్వాంసులు, మత్స్వ...లగుచున్-మత్ = నాయొక్క, స్వరూప = రూపమే, ఆత్మ లగుచున్=స్వరూపముగాఁ గలవారై (నేనే వారై), ముక్తు లగుదురు = మోక్షము చెందుదురు.

తా. ఓదోషరహితుఁడా! ఈవిధముగా నేను (బ్రహ్మము) సర్వపరిపూర్ణ సచ్చిదానంద స్వరూపుఁడ నగుటఁ "దెలిసికొని" నేనే (ఆబ్రహ్మమే) నేను (అస్మచ్ఛబ్దార్థము) అని యపరోక్షజ్ఞానప్రభావముచే గ్రహించువారు నన్నుఁ బొందుదురు. ముక్తిని జెందుదురు.

అవ. ఇట్లు పరమేశ్వరుఁడు పార్వతీదేవికి సర్వము నెఱింగించి శ్రీరాముఁడాంజనేయున కొనర్చినపరమోపదేశమును జెప్పుచున్నాఁడు:—

సీ. అని యిట్లు బోధించి యానందమయుఁ డగు
  శ్రీరాఘవుఁడు నిజశ్రీపదార
విందంబులకు భక్తి వందనంబులు సేయు
  హనుమంతుఁ గనుఁగొని యప్పు డతని
శిర మనుపూర్వాద్రిశిఖరంబుపై స్వక
  రార్కమండలము డాయంగఁ జేర్చి
తనరునీహస్తమస్తకయోగ మిప్పుడే
  తెలివి యొఱుంగు నా తెలివి నీవు
తే. తెలివి నీవని దెలుపఁగాఁ దెలియు నెద్ది
యదియె నీ వను వెలుఁగుచే ననిలసుతుని
ధీగతానాద్యవిద్యాంధతిమిర మెల్లఁ
బాపి కేవలతత్త్వరూపంబుఁ జూపె. 168

టీ. అని, ఇట్లు = ఈవిధముగా, బోధించి = ఉపదేశించి, ఆనందమయుఁడు= ఆనందరూపుఁడు, ఐనశ్రీరామమూర్తి = ఐనట్టిరాముఁడు, నిజశ్రీపదార...లకున్-నిజ=తనయొక్క, శ్రీ = శోభాయుక్తమైన, పదారవిందంబులకున్ = పాదపద్మములకు, భక్తిన్=భక్తితో, వందనంబులు = నమస్కారములు, చేయుహనుమంతున్ = చేయునట్టి ఆంజనేయుని, కనుఁగొని=చూచి, అప్పుడు = ఆసమయమున, అతని...బుపైన్-అతని= ఆహనుమంతునియొక్క, శిరమను = శిరస్సుఅనియెడు, పూర్వాద్రి = పూర్వపర్వతము యొక్క, శిఖరంబుపైన్ = శిఖరముమీఁద, స్వకరార్కమండలమున్-స్వ=తనయొక్క,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కర=హస్తమనెడు, అర్కమండలముఁ=సూర్యమండలమును, డాయంగఁజేర్చి = కలుగ్న
కొనునట్లుగాఁ జేర్చి (శిరముపై చేతినుంచి), తన...గము-తనరు = ఒప్పుచున్న, ఈహ
స్తమస్తకయోగము = ఈహస్తమస్తకసంయోగము, ఏ తెలివియెఱుంగుఁ = ఏజ్ఞానమ
దెలిసికొనుచున్నదో, ఆతెలివినీవు = ఆజ్ఞానమేనీవు, తెలివినీవని = "జ్ఞానమునీవు" అని,
తెలుపఁగాఁ = తెలియఁజేయఁగా, తెలియునెద్ది = ఏది తెలిసికొనుచున్నదో, అవిద్య
నీవనువెలుఁగుచేఁ="ఆజ్ఞానమేనీవు" అనుప్రకాశముచే (బ్రహ్మప్రకాశముచే), అని...
ల్లఁ-అనిలసుతుని = ఆంజనేయునియొక్క, ధీ = బుద్ధిని, గత = పొందియున్న, అనాది
=అనాదిరైయెన, అవిద్య=మాయయనెడు, అంధతిమిర మెల్లఁ=గాఢాంధకార మంతయు,
పాపి = తొలఁగించి, కేవలతత్త్వరూపంబుఁ-కేవల = నిర్మలమైన, తత్త్వ = యథా
ర్థమైన (లేక బ్రహ్మముయొక్క), రూపంబుఁ=రూపమును, చూపెఁ=చూపించెను.

తా. ఓగౌరీ! ఇట్లు శ్రీరామచంద్రుఁ డతివిశదముగా నాత్మతత్త్వమునుఁ దన కుపదేశింపఁగానే యాతకంటె నతిస్పష్టముగ నెఱుంగఁగోరి హస్తమస్తకసంయోగము ననుభవింపఁగోరి యాయభిప్రాయమును సూచించుచు నాంజనేయుఁ డారాముని పద ములకు సాష్టాంగమాచరించెను. శ్రీరాముఁడు నాయభిప్రాయము నెఱింగి కరుణార్ద్రుఁడై యాతనిశిరమున దనహస్తముఁజేర్చి "ఓయాంజనేయా! బాగుగ గురుతింపుము. ఈ హస్తమస్తక సంయోగమునే తెలివిచే నెఱుంగుచున్నావో, ఆ తెలివియే నీయథార్థస్వరూ పము అనుమాటను ఏ తెలివిచే నెఱుంగుచున్నానో అదియే నీయథార్థస్వరూపము. అదియే నాయథార్థస్వరూపము. మనకిరువురకు భేదము లేదు అని విస్పష్టముగ నుప దేశించి వ్రేలితోఁ జూపినయట్లు కూటస్థునిజూపి యాతనియజ్ఞానము నెల్లను ధ్వంసము గావించెను. ఇట్లు హనుమంతునిశిరంబను నుదయాచలముపై రామహస్తంబనుసూర్యుఁ డుదయించి యజ్ఞానమను నంధకారమును ధ్వంసము చేసెను.

వ. ఆసమయంబున. 169

చ. అటఁ బొడఁగాంచె మారుతిహృదంబురుహాంతరబింబితస్ఫుర
చ్చటులపునః పునశ్చలదసద్విషయస్పృశదింద్రియాన్వితో
త్కటపటుధీప్రవృత్తినిహితజ్ఞకళాగ్రనివేశముఁ విశం
కటనిజభాప్రకాశితజగద్వ్రజకోశము స్వప్రకాశమున్. 170

టీ. అటఁ=అచ్చట, మారుతి=ఆంజనేయుఁడు, హృదం...శముఁ-హృత్ = హృదయమనెడు, అంబురుహ = కమలముయొక్క, అంతర = లోపల, బింబిత = ప్రతి బింబించినట్టియు, స్ఫురత్ =ప్రకాశించుచున్నట్టియు, చటుల=అధికమైనట్టియు, పునః పునః=మాటిమాటికి, చలత్ = చలించుచున్న, అసత్ = శూన్యములైన, విషయ=శబ్దాది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విషయములను, స్పృశత్=స్పృశించుచున్న, ఇంద్రియ=ఇంద్రియములతో, అన్విత=కూడియున్న (అనఁగా: ఇంద్రియములమూలమున వెలికివచ్చుచున్న), ఉత్కట=లెక్కకు మిక్కిలియైన, పటు=స్ఫుటమైన, ధీప్రవృత్తి=బుద్ధి వృత్తులయందు, నిహిత = ఉంచఁబడిన (ప్రతిబింబించియున్న), జ్ఞకళా=జ్ఞానకళయొక్క చిదాభాసునియొక్క, అగ్ర=మీఁద సాక్షియై, నివేశమున్=ఉన్నట్టియును, విశంకట...కోశమున్-విశంకట=విశాలమైన, నిజ=స్వకీయమైన, భా=కాంతిచేత, ప్రకాశిత=ప్రకాశింపఁజేయఁబడిన, జగత్=ప్రపంచముయొక్క, వ్రజ = సమూహ మనెడు, కోశమున్ = ఆవరణము (అనఁగా: బ్రహ్మాండము, లేక బ్రహ్మాండములు కలిగినట్టియు), స్వప్రకాశమున్=స్వయంప్రకాశమును (బ్రహ్మమును), పొడఁగాంచెన్=చూచెను.

తా. ఓ పార్వతీ ! పిదప నాకర్ణింపుము. ఈవిధముగా శ్రీరాముఁడు స్వప్రకాశమును జూపఁగనే యది యాంజనేయునకు గోచరమయ్యెను. హృదయకమలమున నిలిచి లేక బ్రతిబింబించి సర్వాధికముగఁ బ్రకాశించుచు బాహ్యవిషయములపై కుఱుకుచు నింద్రియములమూలమున మాటిమాటికి సంచరించుచు నున్నమనోవృత్తులయం దుండు చిదాభాసునకు సాక్షియై త్రిభువనముల నేకరూపములతోఁ బ్రకాశింపఁజేయుచు నున్నపరబ్రహ్మము గోచరుఁ డయ్యెను.

ఆ. అట్టితన్నుఁ గాంచి యానందమూర్తియై
చిత్రరూప మట్లు చేష్ట లుడిగి
తనువు మఱచి కొంతతడ వూరకుండె నా
యాంజనేయుఁ డోహిమాద్రితనయ! 171

టీ. ఓహిమాద్రితనయ = ఓపార్వతీ, ఆంజనేయుఁడు, అట్టితన్నుగాంచి = అట్లు పరమానందస్వరూపుఁ డగునాత్మను జూచి, ఆనందమూర్తియై = ఆనందమయుఁండై, చిత్రరూపమట్లు = చిత్తరువునందు లిఖింపఁబడిన ప్రతిమవలె, చేష్టలుడిగి = ఇంద్రియవ్యాపారములను వదలి, తనువుమఱచి = శరీరమును మఱచి, కొంతతడవు = కొంత సేపు, ఊరకుండెన్.

తా. ఓపార్వతీ! ఈవిధముగ నాయాంజనేయుఁడు తన యథార్థస్వరూపమును జూచి పరమానందమయుఁడై శరీరమును మఱచి చిత్తరువునందు లిఖించినప్రతిమవలె నేమియుం జేయక నాయాంజనేయుఁడు కొంత సే పూరకుండెను.

తే. లిప్తమాత్రం బవిద్యావిలిప్తమాత్ర
మైనఘనుని లెన్న లేరు బ్రహ్మాదు లనఁగ
క్షణము సర్వజగద్విలక్షణముఁ బొందు
ఘని సులి... 172

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. లిప్తమాత్రంబు=ఒకనిమిషమైన ("నిమేషాలిప్తమాత్రా" అని విశ్వప్రకాశిక), అవి...ఘనున్-అవిద్యా=అవిద్యచేత, అవిలిప్తమాత్రమైన = స్పృశింపఁబడకుండ మాత్రమే యున్న (జయించియుండ నక్కఱలేదనుట), ఘనున్ = మహాత్ముని, బ్రహ్మదులు=బ్రహ్మమొదలగుదేవతలు, ఎన్నలేరు=స్తోత్రము చేయనేరరు, అనఁగన్ = అని చెప్పఁగా, క్షణము = క్షణకాలము (అనఁగా: పదునెనిమిదినిమిషములు కాష్ఠ, ముప్పది కాష్ఠలు కళ, ముప్పదికళలు క్షణము ఇంతకాలము), సర్వ...ణము-సర్వజగత్ = సర్వప్రపంచమునకంటె, విలక్షణమున్ = వేఱగు బ్రహ్మతత్త్వమును, పొందువానిన్=ఆశ్రయించినవానిని (అనఁగా: బ్రహ్మరూపుఁడై నిర్వికల్పసమాధియందున్నవానిని), వివానికైనన్=ఎవ్వనికైనను, నుతియింపన్=స్తోత్రము చేయుటకు, తరమె=శక్యమా.

తా. అవిద్యాసంబంధములేక నొక్కలిప్తయైన నుండిన మహాత్ముని బ్రహ్మాదులు కూడ స్తోత్రము చేయలేరు. ఇట్లుండ రెండుగడియలకాలము బ్రహ్మానుభవము నొంది సర్వమును మఱచిన యాహనుమంతు నెవ్వఁడు వినుతింపఁగలఁడు.

తే. అట్టివిజ్ఞానయోగసమాధి నొంది
యనుపమానందమూర్తియై యాంజనేయుఁ
డెట్టకేలకు మేల్కని యెదుర నున్న
రామచంద్రునిఁ జూచి సంభ్రమముతోడ. 173

టీ. ఆంజనేయుఁడు, అట్టివి...మాధిన్-అట్టి = పూర్వోక్తమైన, విజ్ఞాన=అనుభవజ్ఞాన మనియెడు, యోగ = యోగముచేత కలిగిన, సమాధిన్ = నిర్వికల్పసమాధిని, ఒంది = పొంది, అనుప...ర్తియై-అనుపమ=సాటిలేని, ఆనందమూర్తియై = ఆనందమే స్వరూపముగాఁ గలవాఁడై, ఎట్టకేలకున్=అతికష్టముతో, మేల్కని = బాహ్యావృత్తికి మనసుమ్రద్రిప్పి, ఎదురనున్నరామచంద్రునిఁ జూచి, సంభ్రమముతోడన్=త్వరతో.

క. మూఢత్వ ముడిగి యోగా
రూఢుం డై భక్తి పొదల మ్రొక్కిన నపుడా
ప్రౌఢమతిఁ జూచి రాముఁడు
గాఢాలింగనము చేసె గారవ మలరన్. 174

టీ. మూఢత్వముడిగి=అజ్ఞానమును విడచి, యోగారూఢుండై = అపరోక్షానుభవమును ఆశ్రయించి, భక్తి, పొదలన్ = అభివృద్ధి యగుచుండఁగా, మ్రొక్కినన్ = నమస్కరింపఁగా, అపుడు=ఆసమయమందు, రాముఁడు, ఆప్రౌఢమతిఁజూచి = అజ్ఞానసంపన్నునింజూచి, గారవమలరన్ = గౌరవముతో, గాఢాలింగనముచేసెన్=ఆలింగనము చేసెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఈవిధముగఁ గొంతసేపు అపరోక్షానుభవము (అనఁగా: నిర్వికల్పసమాధి నొంది పరమానందము ననుభవించుచుండి కొంతసేపటి కెట్లో బాహ్యావృత్తికిఁ దిరిగి మేల్కాంచి యాంజనేయుఁడు తన యెదుట నున్న శ్రీరామునకు సాష్టాంగముగ నమస్కరించెను. ఈవిధముగ నజ్ఞానమును బాసి యోగసిద్ధినొంది తనకు భక్తియుక్తుఁడై నమస్కరించుచున్నయాతని నా శ్రీరాముఁడును గౌరవపూర్వకముగ వాత్సల్యయుక్తముగ గాఢాలింగనముఁ జేసికొనియెను.

అవ. ఇట్లు పార్వతీపరమేశ్వరసంవాద రూపమున సాంఖ్యయోగమును వివరించి కవి దాని నుపసంహరించుచున్నాఁడు:—

వ. ఇట్లు గారవంబుఁ జేసిన నయ్యాంజనేయుం డప్పరమేశ్వరున కనేక
విధపూజానమస్కారస్తోత్రంబులుం గావించె ననిన విని పార్వతీదేవి
యఁటమీఁద శ్రీరామస్వామి యేమి యుపదేశించె నని శ్రీమహా
దేవు నడుగుటయును. 175

టీ. ఇట్లు గారవంబు చేసినన్ = ఇట్లు గౌరవింపఁగా, అయ్యాంజనేయుండు, అప్పరమేశ్వరునకున్ = ఆశ్రీరామునకు, అనే...బులు-అనేకవిధ = అనేకవిధములైన, పూజా = పూజలను, నమస్కార = నమస్కారములను, స్తోత్రంబులు = స్తోత్రములను, కావించెన్=చేసెను, అనినన్=అని చెప్పఁగా, విని, పార్వతీదేవి, అటమీఁదన్=పిమ్మట, శ్రీరామస్వామి = రాముఁడు, ఏమి యుపదేశించెనని, శ్రీమహాదేవున్ = ఈశ్వరుని, అడుగుటయున్=అడుగఁగా.

తా. ఈవిధముగ రామచంద్రుఁడు తన్ను గౌరవింపఁగానే యాంజనేయుఁడును ఆశ్రీరాముని బహువిధ పూజానమస్కార స్తోత్రాదులచే నభినందించి (అనఁగాఁ బార్వతియు "పిదప శ్రీరాముఁ డేమి యుపదేశించెను" అని) పరమేశ్వరునిఁ బ్రశ్న చేసెను.

అవ. 176-177-178 పద్యములను కృతిపతి సంబోధనలు:—

చ. కలుషవిదూర! నిర్గతవికార! సురాంబుజసూర! సూరిహృ
జ్జలజవిహార! చారుసుఖసాగర! విశ్వశరీర! భూరిని
ర్మలగుణవార! వారిధిసమానగభీర! సుమేరుధీర! స
న్నలినభవాభవాచ్యుతమనఃకలితాత్మవిచారకారణా! 176

టీ. కలుషవిదూర-కలుష=పాపములకు, విదూర=దూరమైనవాఁడ, నిర్గతవికార=వికారములేనివాఁడ, సురాంబుజసూర-సుర=దేవతలనెడు, అంబుజ=కమలములకు, సూర=సూర్యునివంటివాఁడా, సూరి...హార-సూరి=విద్వాంసులయొక్క, హృజ్జలజ = హృదయ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కమలములయందు, విహార=విహరించెడువాఁడా, చారుసుఖసాగర-చారు=మనోహరమైన, సుఖ=బ్రహ్మానందమునకు, సాగర=సముద్రమువంటివాఁడా, విశ్వశరీర=ప్రపంచస్వరూపా! భూరి...తార-భూరి=అధికమైనట్టియు, నిర్మల=పరిశుద్ధమైనట్టియు, గుణ = గుణముల యొక్క, వార=సమూహముగలవాఁడా, వారిధిసమానగభీర = సముద్రునితో సమానమైనగాంభీర్యము గలవాఁడ, సుమేరుధీర = మేరుపర్వతముతో సమానమైన ధైర్యముగల వాఁడా, సన్నలిన...కారణా - సత్ = శ్రేష్ఠమైనట్టియు, నలినభవ = బ్రహ్మదేవుని యొక్కయు, అభవ = ఈశ్వరునియొక్కయు, అచ్యుత = విష్ణువుయొక్కయు, మనః కలిత=మనస్సునందున్న, ఆత్మవిచార=బ్రహ్మవిచారమునకు, కారణ = కారణభూతుఁడైన వాఁడా, (అనఁగా : బ్రహ్మాదులకు సహితము జ్ఞానప్రదుఁడా !).

క. సర్వేశ్వర! సర్వోత్తమ, సర్వవ్యాపారసాక్షీ! సర్వాధారా!
సర్వజ్ఞ! సర్వతోముఖ, సర్వాధిష్ఠానభూత సర్వాకారా! 177

టీ. సర్వేశ్వర = సమస్తమునకు ప్రభువా, సర్వోత్తమ-సర్వ = సమస్తమునకంటె, ఉత్తమ=శ్రేష్ఠుఁడా, సర్వవ్యాపారసాక్షి=సర్వకార్యములకును (అనఁగా : నింద్రియమనో వ్యాపారములకు), సాక్షియగువాఁడా ! సర్వాధారా = సర్వమునకు నాధారభూతుఁడా, సర్వజ్ఞ=సర్వమునుఁ దెలిసికొనువాఁడా, సర్వతోముఖ = సర్వవ్యాపకుఁడా, సర్వాధిష్ఠానభూత=భ్రాంతిసిద్ధమగు నీసమస్తమునకు నాధారభూతుఁడా, సర్వప్రపంచమే స్వరూపముగాఁగలవాఁడా.

మాలినీ.—

ప్రణమితమునిజాలా! భాసురానంతలీలా
ప్రణుతనిఖిలదేవా! భవ్యదివ్యప్రభావా!
ప్రణవజపనిధానా! బ్రహ్మవిద్యానిధానా!
గుణనిధి! జగదీశా! కోటిసూర్యప్రకాశా! 178

టీ. ప్రణమితమునిజాలా-ప్రణమిత = నమస్కరించుచున్న (లేక నమ్రులుగాఁ జేయఁబడిన), మునిజాలా = ఋషిసమూహముగలవాఁడా ! ఋషులందఱు నీమహాదేవా చార్యులకు నమస్కరింతురనుట, భాసురానంతలీలా-భాసుర=ప్రకాశించుచున్న, అనంత= అపరిమితములైన, లీలా = విలాసములు (లేక చేష్టలుగలవాఁడా), ప్రణుత నిఖిలదేవా- ప్రణుత=స్తోత్రము చేయఁబడిన, నిఖిలదేవా=సమస్తదేవతలును గలవాఁడా, (అనఁగా: భేదబుద్ధిలేక, సర్వదేవతలయందు నేకభావముగలవాఁడా), భవ్యదివ్యప్రభావా-భవ్య = శుభకరమైనట్టియు, దివ్య = శ్రేష్ఠమైనట్టియు, ప్రభావా = సామర్థ్యముగలవాఁడా, ప్రణవజపనిధానా-ప్రణవజప = ఓంకారజపమునకు, నిధానా = స్థానభూతుఁడా, బ్రహ్మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విద్యానిధానా=బ్రహ్మజ్ఞానమునకు నాశ్రయభూతుఁడా, గుణనిధి=సమస్త కళ్యాణగుణ శాలీ, జగదీశా=ప్రపంచమునకు ప్రభువైనవాఁడా, కోటిసూర్యప్రకాశా=కోటిసూర్యుల వలె ప్రకాశించువాఁడా.

గద్య. ఇది శ్రీమన్నారాయణమహాదేవగురుకరుణాకటాక్ష వీక్షణవిమలీకృత నిజహృదయ కమలకర్ణికాంత స్సందర్శితాఖండ సచ్చిదానంద రసైక స్ఫూర్తిషట్చక్ర సీతారామమూర్తి పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి ప్రణీతంబైన శ్రీసీతారామాంజనేయ సంవాదం బను యోగశాస్త్రంబునందు సాంఖ్యయోగానుభవ విచారం బనునది ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

ఈగద్యకు అర్థము ప్రథమాశ్వాసాంతమందలి గద్యకువలెను.

ఇట్లు వెన్నెలకంటి సుందరరామశర్మచే వివరింపఁబడిన శ్రీసీతారామాంజనేయ సంవాదతాత్పర్యమునందు ద్వితీయాశ్వాసము ముగిసెను.

ద్వితీయాశ్వాసము సంపూర్ణము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీ ర స్తు.

# శ్రీసీతారామాంజనేయసంవాదము

## తృ తీ యా శ్వా స ము.



అవ. ఇట్లు సాంఖ్యయోగమును వివరించి యమనస్కయోగమును నిరూపించువాఁడై కవి మొట్టమొదట నాంధ్రకవులయాచారము ననుసరించి కృతిపతిని సంబోధించుచున్నాఁడు:—



యోగీశ్వరదత్తా
త్రేయపదాంబుజవిధేయ ధీరనికాయ
ధ్యేయా ఘనసచ్చిత్సుఖ
కాయ మహాదేవదేశికప్రభురాయా. 1

టీ. శ్రీయోగీశ్వరదత్తాత్రేయపదాంబుజవిధేయ-శ్రీ = అణిమమహిమ మున్నగు నష్టైశ్వర్యములుగల, యోగి = బ్రహ్మవేత్తలకు, ఈశ్వర = ప్రభువగు, దత్తాత్రేయ = దత్తాత్రేయమహామునియొక్క, పదాంబుజ = పాదపద్మములకు, విధేయ = విధేయుఁడవైనవాఁడా, ధీరనికాయధ్యేయా-ధీరనికాయ = బ్రహ్మవేత్తలసమూహముచేత, ధ్యేయా =ధ్యానముచేయఁదగినవాఁడా, ఘనసచ్చిత్సుఖకాయ-ఘన = అఖండమైన, సత్ = త్రికాలాబాధ్యమైన, చిత్ = జ్ఞానస్వరూపమైన, సుఖ = ఆనందమయమైన, కాయ= దేహముగలవాఁడా, మహాదేవదేశికప్రభురాయా-మహాదేవ = మహాదేవయను పేరుగల దేశికప్రభు=ఆచార్యవర్యులలో, రాయా=శ్రేష్ఠుఁడా.

తా. బ్రహ్మజ్ఞానసంపన్నుఁ డగుదత్తాత్రేయయోగీంద్రునకు శిష్యుండవును సత్పురుష సమూహములచే స్తోత్రముచేయఁదగినవాఁడవును సచ్చిదానందరూపుఁడవును అగు మహాదేవ దేశికేంద్రా!

అవ. ఇట్లు సంబోధించి పరమేశ్వరోత్తరరూపవాక్యముతో నమనస్కమును విస్తరింప నుపక్రమించుచున్నాఁడు:—

వ. అథపరింపుము శ్రీమహాదేవుం డమహాదేవికిట్లనియె నట్లాంజనేయుండు పరమసాంఖ్యరాజయోగసమాధివలన మేల్కని బ్రహ్మే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నంద భరితాంతఃకరణుండై తనముందరనున్న శ్రీసీతారామగురునిం
గనుంగొని యనేకసాష్టాంగదండప్రణామంబు లాచరించి నిటలతట
ఘటితాంజలిపుటుండై యిట్లని వినుతించె. 2

టీ. అవధరింపుము=వినుము, శ్రీమహాదేవుఁడు = ఈశ్వరుఁడు, అమ్మహాదేవికిన్ = ఆపార్వతీదేవికి, ఇట్లనియెన్ = ఈవిధముగాఁ జెప్పెను. అట్లు = పైనిఁజెప్పినవిధముగా, ఆంజనేయుఁడు, పర...లనన్-పరమ-శ్రేష్ఠమైన, సాంఖ్య = సాంఖ్య మనుపేరుగల, రాజయోగ=రాజయోగముయొక్క, సమాధివలనన్ = నిష్ఠనుండి (అనఁగా: నిర్వికల్పసమాధినుండి), మేల్కని = జాగ్రత్త వహించి, బ్రహ్మ...ణుండై-బ్రహ్మానంద=బ్రహ్మానందముచేత, భరిత = నిండిన, అంతఃకరణుండై = మనస్సుకలవాఁడై, తనముందరనున్న = తనయెదుటనున్న, శ్రీసీతా...రునిన్-శ్రీ = శోభాయుక్తుఁడైన, సీతా = చిచ్ఛక్తిస్వరూపిణియైన సీతాదేవితోఁగూడిన, రామగురునిన్=శ్రీరాముఁడను గురువును, కనుంగొని=చూచి, అనేక...బులు-అనేక=లెక్కకు మిక్కిలి యైనట్టియు, సాష్టాంగ=కరచరణాద్యష్టాంగములతోఁగూడినట్టియు, దండప్రణామంబులు = నమస్కారములను; ఆచరించి=చేసి, నిటల...డై-నిటలతట = భ్రూమధ్యప్రదేశమునందు, ఘటిత=ఉంచఁబడిన, అంజలిపుటుండై = నమస్కారముకలవాఁడై (అనఁగా: నమస్కరించుచు,) ఇట్లని వినుతించెన్=ఈవిధముగా స్తోత్రము చేసెను.

తా. ఈ మూఁడవయాశ్వాసమునందలి విషయమును వినుము. "ద్వితీయాశ్వాసమునఁ జూపింపఁబడిన రీతిగా పార్వతీదేవి సాంఖ్యయోగోపదేశమైనపిదప రాముఁడు దేని నుపదేశించెను?" అని ప్రశ్నచేయఁగానే పరమేశ్వరుఁ డిట్లు సమాధానమును చెప్పెను. ఓపార్వతీ! వినుము. అట్లు సాంఖ్యయోగోపదేశము కాఁగానే యాంజనేయుఁడు నిర్వికల్పసమాధినిఁ జెందెను. కొంతసేపటికి మేల్కని యెదుట నున్న సీతారామగురువుల భక్తిపూర్వకముగా నమస్కరించెను. నిటలంబున చేమోడ్పుఁ గదియించెను. ఈక్రింద వివరింపఁబోవువిధముగా వినుతించెను.

### ఆంజనేయుఁడు శ్రీరాముని వినుతించుదండకము.

అవ. ఇట్లు ప్రతిజ్ఞఁ జేసి హనుమంతుఁ డొనర్చిన స్తోత్రమును వివరించుచున్నాఁడు:—

దం. శ్రీరామరామా త్రిలోకాభిరామా పరంధామ నిష్కామ సంపూర్ణ
కామా బుధేంద్రాంతరంగాబ్ధిసోమా లసద్దివ్యనామా విరాజద్గుణ
స్తోమ యుష్మత్ప్రకాశస్వరూపంబవాచ్యం బచింత్యం బనంతం బసం
గం బఖండం బబాధ్యం బబోధ్యం బసాధ్యం బఛేద్యం బవిచ్ఛేద్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాద్యంతశూన్యం బజంబప్రమేయం బవిజ్ఞేయమధ్యేయ మద్వంద్వ
మవ్యక్తమగ్రాహ్యమథ్యాత్మ మేకం బరూపం బనాఖ్యం బరక్తం
బశుక్లం బకృష్ణం బపీతం బపీనం బసూక్ష్మం బదీర్ఘం బహ్రస్వం
బబాహ్యాంతరం బక్షరం బవ్యయంబింద్రియాగోచరం బప్రతర్క్యం
బనిర్దేశ్య మాద్యం బదృశ్యం బకంపం బలక్ష్యం బలిప్తం బశబ్దం
బసంస్పర్శఘ్రాతం బరూపంబ సుస్వాదుగంధం బవాఙ్మానసప్రాప్యమై
పూర్ణమై నిత్యమై సత్యమై శుద్ధమై బుద్ధమై ముక్తమై శాంతమై కేవ
లంబై నిరాకారమై సచ్చిదానందరూపాత్మచైతన్యమై సర్వభూతో
రుదేహేంద్రియప్రాణహృద్బుద్ధ్యహంకారచిత్తాది దృశ్యప్రపంచంబు
నాదిత్యుఁడీవిశ్వమెల్లన్ వెలింగింపఁగాఁజేయురీతిం బ్రకాశింపఁగాఁ
జేయఁగా సాక్షివై యాకసం బేకమై సర్వభాండంబులం దంతటన్
లోపలన్ వెల్పల న్నిండి యున్నట్టు లాకాశవాయ్వగ్ని వార్భూమి
నానావిధాశేషభూతంబులందంతటన్ నిర్విలిప్తుండవై యుండి కర్తృ
త్వభోక్తృత్వ మంతృత్వ భర్తృత్వ హర్తృత్వము ల్నామరూప
క్రియోపాధి వర్ణాశ్రమంబు ల్గుణంబు ల్వివేకావివేకంబులున్
శోకమోహంబులున్ లేక యీస్థూలసూక్ష్మాదులన్ జాగరస్వప్నసు
ప్త్యాదులన్ బంచభూతంబులన్ బంచకోశంబులన్ జూచుచున్ నిర్వి
కారుండవై నిర్వికల్పుండవై నిర్విచేష్టుండవై నిష్ప్రపంచుండవై
నిర్విశేషుండవై నిర్గుణబ్రహ్మమాత్రుండవై యొప్పునీదివ్యతత్త్వంబు
నీసత్కృపా సంభృతాంచత్కటాక్షంబుచేతం గనుంగొంటి దేవా
నమస్తే నమస్తే నమస్తే నమః. 3

టీ. శ్రీరామరామ-శ్రీబ్రహ్మవిద్యారూపిణి యైనలక్ష్మీదేవితో, రామ = క్రీడించు నట్టి, రామ = శ్రీరామ, త్రిలోకాభిరామ = మూఁడు లోకములకు [అనఁగా: భూర్భువస్సువర్లోకములకు, విషయములు భూలోకమనియు, నింద్రియములు, భువర్లోకమనియు, దేవతలు, (ఇంద్రియాధిదేవతలు) సువర్లోకమనియుఁ జెప్పఁబడును]అభిరామ = మనోహరుఁడ (సర్వలోకములును, పరబ్రహ్మమును బ్రేమించుచున్నవియని భావము) పరంధామ-పరం = పరాప్రకృతుల కతిరిక్తమైన, ధామ = స్థానము లేక తేజస్సుకల వాఁడా, నిష్కామ = కామము, లేక, కామాదిశత్రువులు లేనివాఁడా, సంపూర్ణకామా=కోరఁదగినవిషయము లేనివాఁడా! తానే యానందరూపుఁడు కావునఁ దనకుఁ గావలసిన దొద్దియు లేదనుట. (ఇది నిష్కామత్వమునకు హేతువు). బుధేంద్ర''

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్తోమ - బుధేంద్ర = విద్వాంసులయొక్క, అంతరంగ = మనస్సులనెడు, అబ్ధి = సముద్రమునకు, సోమా = చంద్రుని వంటివాఁడా, లసద్దివ్యనామా - లసత్ = ప్రకాశించుచున్న, దివ్య = శ్రేష్ఠమైన, నామ = పేరుకలవాఁడా, విరాజద్గుణస్తోమ - విరాజత్ = ప్రకాశించుచున్న, గుణ = శాంతిదాంత్యాదికళ్యాణగుణములయొక్క, స్తోమ = సమూహము గలవాఁడా! యుష్మత్ప్రకాశస్వరూపంబు = నీజ్ఞానరూపము, అవాచ్యంబు = చెప్పుటకు శక్యము కానిది. అచింత్యంబు = మనసుచే ధ్యానించుటకు నలవి కానిది, అనంతంబు = అంతము (నాశము, లేక, తుది) లేనిది, అసంగంబు = దేనితోను సంబంధింపనిది, అఖండంబు = సర్వవ్యాపకమైనది (పరిచ్ఛేదములు లేనిది.) అబాధ్యంబు = కాలాదులచేఁ గాని జ్ఞానముచేఁ గాని నశింపనిది. అబోధ్యంబు = బుద్ధికి గోచరము కాకుండుటచే తెలిసికొనుట కశక్యమయినది (యథార్థస్థితిలో బ్రహ్మమునకంటె భిన్నమగుపదార్థము లేదు. కావున "బ్రహ్మమును తెలిసికొనుచున్నాను" అనుటయే సంభవింపదు). అసాధ్యంబు = ప్రమాణములచేఁగాని యుక్తులచేఁగాని సాధించుటకువీలులేనిది (అనఁగా నిత్యసిద్ధమైనది), అభేద్యంబు = తనకంటె (ఆత్మకంటె) వేఱైయున్నదని భేదించుటకు వీలులేనిది, అవిచ్ఛేదము=పరిచ్ఛేదములు లేనిది, (లేక శస్త్రాదులచే భేదించుటకు వీలులేనిది.) ఆద్యంతశూన్యంబు=మొదలు తుదయునుసది (లేక, యంతట నిండియుండునది), అజంబు=ఉత్పత్తి లేనిది, అప్రమేయంబు = ప్రమాణములకు గోచరము కానిది, అవిజ్ఞేయము=జ్ఞానమునకు గోచరము కానిది, (లేక, "ఇట్టిది యని ఏదియో యొక ప్రకారముగ తెలిసికొనుటకు" వీలులేనిది), అధ్యేయము = ధ్యానమున కగమ్యమైనది [వేఱొకధ్యాత (ధ్యానము చేయువాఁడు) లేఁడు, కావున బ్రహ్మమును ధ్యానించుట సంభవింపదు.] అద్వంద్వము=తనకంటె భిన్నమగునది, లేక, సాటిలేనిది, అవ్యక్తము = ప్రపంచభ్రాంతిచే స్పష్టము కానిది, అగ్రాహ్యము = ఇంద్రియములచే గ్రహించుట కశక్యమైనది. "పరాంచిఖా నివ్యతృణత్స్వయంభూ స్తస్మాపరాఙ్ పశ్యతి నాంతరాత్మన్"="పరమేశ్వరుఁ డింద్రియముల బహిర్ముఖముగఁ గావించెను. కావునఁ బురుషుఁడు బహిర్ముఖముగా చూచునుగాని యంతరాత్మను జూడనేరఁడు" అను శ్రుతి ఈ విషయంబున ప్రమాణము, లేక కర్మాదులచే గ్రహించుట వీలులేనిది ["న కర్మణా న ప్రజయా న ధనేన"="కర్మ సంతానము ధనము మొదలగునవి బ్రహ్మమును (మోక్షమును) సాధింపనేరవు." అను శ్రుతి ఇందుకు ప్రమాణము], అధ్యాత్మము = ఆత్మకు సంబంధించినది (అనఁగా ఆత్మయే యనుట) ఏకంబు = అద్వితీయమైనది (అనఁగా: స్వజాతీయాది భేదములు లేనిది), అరూపంబు = రూపగుణములేనిది, అనాఖ్యంబు = పేరులేనిది, అరక్తంబు=ఎఱుపు కానిది, అశుక్లంబు = తెల్లనిది కానిది, అకృష్ణంబు=నల్లనిది కానిది, అపీతంబు=పచ్చనిది కానిది, అపీనంబు=బలిసినది కానిది, అసూక్ష్మంబు=సన్ననిది కానిది,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అదీర్ఘంబు=పొడవైనది కానిది, అహ్రస్వంబు = పొట్టిదికానిది, అబాహ్యాంతరంబు= లోపల వెలుపల లేనిది, అక్షరంబు=నాశరహితమైనది, లేక కూటస్థరూపమైనది, అవ్యయంబు=నాశరహితమైనది (లేక, క్షీణించుస్వభావము లేనిది,) ఇంద్రియాగోచరంబు = ఇంద్రియములకు గోచరముకానిది, అప్రతర్క్యంబు = విచారించుటకువీలులేనిది, అనిర్దేశ్యము="ఇట్టిది"అని నిరూపించి చూపుటకు వీలులేనిది, ఆద్యంబు = అనాదిసిద్ధమైనది, అదృశ్యంబు=సర్వసాక్షి యగుటచే దేనికిని దృశ్యముకానిది, అకంపంబు=చాంచల్యము లేనిది, అలక్ష్యంబు = లక్షణావృత్తిచే గుఱుతించుట కశక్యమైనది, (లేక అతివ్యాప్తి అవ్యాప్తి అసంభవము అనుదోషములు లేకుండునట్లు లక్షణముచెప్పుటకు వీలు లేనిది ("ఇది ఈపదార్థము" అని గుఱుతించుటకు వీలు గలుగఁజేయుచిహ్నము లక్షణ మనియు అట్టిచిహ్నముచే నిర్ణయింపఁబడుపదార్థము లక్ష్య మనియుఁ జెప్పఁబడును. లక్షణము లక్ష్యమందుమాత్రమే యుండక లక్ష్యములు కానిపదార్థములయందు కూడా నున్నయెడల నతివ్యాప్తి దోషదుష్ట మనియు లక్ష్యము లగుపదార్థములయందే కొన్ని చోట్ల లేకుండిన అవ్యాప్తి దోషదుష్టమనియు, లక్ష్యములయందంతటను బొత్తుగనే లేకుండిన నసంభవదోషదుష్టమనియుఁ జెప్పఁబడును. "కొమ్ములుండుట గోవునకు లక్షణము" అని చెప్పిన నతివ్యాప్తిదోషము వచ్చును. ఇచ్చట లక్ష్యము లైనగోవులయందు "కొమ్ములుండుట" యనులక్షణమున్నను వానికంటె వే ఱగు మహిషాదులయందు కూడా నది కలదుగదా. ఇట్లే ఎఱ్ఱగానుండుట యావునకు లక్షణము అనినయెడల తెల్లయావులయం దీలక్షణము లేకుండుటచే నవ్యాప్తి "గిట్టలు చీలకుండునది యావు" అనచో నాలక్షణ మావులయందు బొత్తుగనే లేదు, కావున నసంభవదోషము వచ్చునని తెలిసికొనవలయును. అలిప్తంబు = దేనితోను సంబంధపడక దేనివికారముల నంటక నుండునది, అశబ్దంబు = శబ్దగుణము లేనిది, అసంస్పర్శభూతంబు = స్పర్శగుణము లేనిది లేక కానిది, అరూపంబు = రూపగుణము, లేక నాకారము లేనిది, అనుస్వాదుగంధంబు = రసగంధములు లేనిది, అవాఙ్మానసప్రాప్యమై = వాక్కునకును మనస్సునకు నగోచరమై, పూర్ణమై=అంత టనిండినదై, నిత్యమై=శాశ్వతమై, సత్యమై = సత్తాస్వరూపము గలదియై, శుద్ధమై=నిర్మలమై, బుద్ధమై=జ్ఞానరూపమై, లేక జ్ఞానముచేఁ దెలియఁదగినదై, ముక్తమై = ప్రకృతిసంబంధము లేనిదై, శాంతమై = సంక్షోభము లేనిదై, కేవలంబై=అద్వితీయమై, లేక నిరాకారమై, నిరాకారమై = అవయవములు లేనిదై సచ్చి...న్యమై సత్=సత్యము, చిత్=జ్ఞానము, ఆనంద = ఆనందము, రూప = రూపములు గల, ఆత్మ=కూటస్థరూప మైన, చైతన్యమై=జ్ఞానమై, సర్వ...చంబుగ్ - సర్వభూత=సమస్తభూతములయొక్క, ఉరుదేహ=స్థూలాది దేహములు, ఇంద్రియ=ఇంద్రియములు, ప్రాణ = ప్రాణములు, హృత్ = మనస్సు బుద్ధి, అహంకార = అహంకారము,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చిత్త=చిత్తము, ఆది = మొదలయిన, దృశ్య = దృశ్యమైన, ప్రపంచంబున్ = జగత్తును, ఆదిత్యుండు = సూర్యుఁడు, ఈవిశ్వమెల్లన్ = ఈప్రపంచ మంతయుం, వెలిఁగింపఁగాఁ జేయుంరీతిన్ = ప్రకాశింపఁజేయుచున్నట్లు, ప్రకాశింపఁగాఁజేయఁగాన్=ప్రకాశింపఁజేయుచుండఁగ, సాక్షివై = ద్రష్టవై, ఆకసంబేకమై = ఆకాశ మొక్కటియై, సర్వ...లందంతటన్-సర్వ = సమస్తములైన, భాండంబులందంతటన్ = ఘటములయందంతటను, లోపలన్ వెల్పలన్ నిండియున్నట్టులు, ఆకా...లందున్-ఆకాశ = ఆకాశమునందును, వాయు=వాయువునందును, అగ్ని=అగ్నియందును, వాః=జలమునందును, భూమి=భూమియందును, నానావిధ=అనేకవిధములైన, అశేష=మిగులు లేని, భూతంబులందున్ = జంతువులయందును, అంతటన్, నిర్లిప్తుండవై యుండి = సంబంధము లేనివాఁడవైయుండి, కర్తృ...ములు-కర్తృత్వ = ఒకదానినిజేయువాఁడుగానుండుట, భోక్తృత్వ=ఒకదాని ననుభవించువాఁడుగానుండుట, మంతృత్వ = సంకల్పించువాఁడుగా నుండుట, భర్తృత్వ = పోషించువాఁడుగానుండుట, హర్తృత్వములు = సంహరించువాఁడుగా నుండుట యనునవి, నామ...బులు - నామ = పేరు, రూప=ఆకారములు, క్రియ=పనులు, ఉపాధి=ఆవరణములు, వర్ణ = బ్రాహ్మణాదిజాతులు, ఆశ్రమంబులు = బ్రహ్మచర్యాద్యాశ్రమములు, గుణంబులు = సత్వరజస్తమోగుణములు, వివేకావివేకంబులు = జ్ఞానాజ్ఞానములు, శోక మోహంబులును = దుఃఖము అజ్ఞానమును, లేక = లేనివాఁడవై, ఈస్థూలసూక్ష్మాదులన్ = స్థూలసూక్ష్మశరీరములను, జాగరస్వప్నసుప్త్యాదులన్ = జాగ్రత్స్వప్నసుషుప్తులను, పంచభూతంబులన్ = ఆకాశాదిభూతములను, పంచకోశంబులన్ = అన్నమయాదికోశములను, చూచుచున్, నిర్వికారుండవై=వికారము లేనివాఁడవై, నిర్వ్యాపారుండవై = కార్యములు లేనివాఁడవై, నిష్ప్రపంచుండవై=ప్రపంచము లేనివాఁడవై, నిర్విశేషుండవై = విశేషములు, (అనఁగా: ధర్మములు లేనివాఁడవై, నిర్గుణబ్రహ్మమాత్రుండవై=గుణశూన్యుఁడగు బ్రహ్మవేత్తవై, ఒప్పునీ...తత్త్వంబున్-ఒప్పు = ప్రకాశించుచున్న, నీ = నీయొక్క, దివ్య = శ్రేష్ఠమైన, తత్త్వంబున్ = యథార్థస్వరూపమును, నీ...చేతన్-నీ=నీయొక్క,సత్ =శ్రేష్ఠమైన, కృపా=కరుణతో, సంభృత = నిండిన, అంచత్ = ఒప్పుచున్న, కటాక్షంబుచేతన్ = కడగంటిచూపుతో, కనుఁగొంటిన్=చూచితిని, దేవా=ఓమహాత్మా! తే=నీకు, నమః=నమస్కారము.

తా. బ్రహ్మవిద్యాస్వరూపిణి యగుసీతాదేవితో క్రీడించునట్టియు భూర్భువస్సువర్లోకములకు (అనఁగా సర్వేంద్రియములకును) సురనరపశుపక్ష్యాదులకును మనోహరుండవైనట్టియుం క్షరాక్షరపురుషులకంటె నతిరిక్త మగుస్థానముగలిగినట్టియు (లేక యుత్తమప్రకాశము గలిగినట్టియు) స్వయముగా నానందస్వరూపుఁడ వగుటచేతను సర్వజను లానందమునే కోరుచుండుటచేతను స్వయముగాఁ గోరఁదగిన యర్థము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లేకపోవుటచేత కోర్కులే లేనట్టియు జ్ఞానులమనస్సులను చంద్రుడు సముద్రము నుప్పొంగంజేయునట్లుల్లసింపం జేయునట్టియు నో శ్రీరామా నీనామ మతిపవిత్రము. నీకుఁగల సద్గుణము లత్యధికములు. నీదగు జ్ఞానస్వరూపము వాక్కునకుఁ గాని మనస్సునకుఁగాని గోచరమగునది (అనఁగా "ఇట్టిది" అని చెప్పుటకుఁగాని యూహించుటకుఁ గాని వీలు) కానిది. తుద మొదలు విభాగములుగల పదార్థములనుగూర్చి మాత్రమే లోకమున వ్యవహారములు జరుగుచున్నవి. నీస్వరూపమునకు నట్లు అద్యంతములు గాని విభాగములు గాని లేవు. కావున నెట్టివ్యవహారంబును దానినిగూర్చి (నీయథార్థస్వరూపమునుఁగూర్చి) ప్రవర్తింపవు. మఱియు నీస్వరూపము దేనితోను నేవిధమయినట్టియు సంబంధము కలదికాదు. సత్యస్వరూప మగుటచేఁ బ్రపంచమువలె బాధనొందునది కాదు. అద్వితీయ మగుటచేఁ దెలియఁబడఁదగినది (తనకంటె నన్యుం డగుపుషునిచే నెఱుంగఁబడునది) కాదు, నిత్యశుద్ధ మగుటచేఁ బ్రమాణములచే సాధింపఁదగినది కాదు. నిరాకార మగుటచే ముద్గరాదులచే భేదింపఁబడుటకుఁ గాని ఖడ్గాదులచే జీల్పంబడుటకుఁ గాని శక్యముకానిది. సర్వవ్యాపకమైనది. ఉత్పత్తిలేనిది. కారణ మగు రెండవపదార్థ ముండుటకే వీలులేకపోవుటయు అట్లున్న యెడల జడత్వంబును ప్రపంచమునకు సాక్షి లేకపోవలసివచ్చుటయును అనవస్థాదోషంబును గలుగుటయు హేతువులు. ప్రమాణము ప్రమాత ప్రమేయము అను త్రిపుటి భ్రాంతిసిద్ధమే యగుటవలన వాస్తవస్థితిలో విచారించినఁ బ్రమాణములకు గోచరముకానిది. పయిన నిరూపించిన కారణములవలననే జ్ఞానముచేఁ దెలిసికొనుటకుఁగాని ధ్యానము నాశ్రయించి ధ్యానించుటకుఁగాని తరముకానిది. సాటిలేనిది. ప్రపంచభ్రాంతియుండుటచే స్పష్టము కానిది స్వభావముగా నెట్లున్నను స్పష్టముగాఁ దెలియఁబడనిది. కర్మాదులచే గ్రహింపరానిది. స్వస్వరూపభూతమైనది అద్వితీయమైనది. నామరూపములు లేనిది. ఎఱుపు తెలుపు నలుపు పసుపు మొదలగు వర్ణములుకాని లావు సన్నము పొడవు కుఱుచఁదనము మొదలగు నవయవసంస్థానభేదములు కాని లోపల వెలుపలయను విభాగములు కాని లేనిది. నాశముకాని క్రమక్రమముగా క్షీణించు స్వభావముకాని లేనిది. ఇంద్రియములకుఁ గాని యూహకు (అనఁగా చిత్తమునకు, ఇది సంశయాత్మక మగు చిత్తవృత్తి) బుద్ధికిఁ గాని గోచరముకానిది. విచారనిర్ణయములకు నశక్యమైనది. అనాదియైనది. తా నెద్దాని చేతను జూడంబడక నన్నిటినిఁ జూచునది. చాంచల్యము లేనిది "ఇట్టిది బ్రహ్మస్వరూపము" అని లక్షణము చెప్పుటకు వీలులేనిది. సర్వప్రపంచమునందును వ్యాపించి యున్నను ఏవికారములతోను సంబంధములేనిది. శబ్దస్పర్శరూపరసగంధములను భూతగుణములు లేనిది. మఱియు వాక్కునకును మనస్సునకును గోచరము కానిదయ్యును త్రికాలములయందును సత్తాస్వరూపముతో (సత్యస్వరూపముతో) నుండి ఎట్టికలితియును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లేక నిర్మలమై జ్ఞానమాత్రగమ్యమై ప్రకృతితోఁగలియక నాకారములు లేక సత్యజ్ఞానానందమాత్రమై నీప్రకాశరూపము సూర్యుఁడు సర్వప్రపంచంబును ప్రకాశింపఁజేయు నట్లు శరీరప్రాణమనోబుద్ధ్యహంకారచిత్తాదు లగుసర్వదృశ్యపదార్థములను బ్రకాశింపఁ జేయుచున్నది. (తెలిసికొనుచున్నది.) ప్రకాశమే జ్ఞానమని ఇదివఱకే పెక్కుమాఱులు నిరూపించియున్నాము. ఇట్లు నీస్వరూపము సర్వప్రకాశకమయినది యగుటచేత నీవు సర్వసాక్షివి. సాక్షివగుటయేకాదు. ఆకాశ మొక్కటే యయ్యును సర్వపదార్థముల యొక్కయుం లోపలను వెలుపలను వానితో (ఆపదార్థములతో) కొంచెమైనను సంబంధింపకయే నిండియున్నట్లు నీవును పంచభూతములయందును వానివలనఁ బుట్టిన సర్వ పదార్థములయందును సంబంధరహితుఁడవయి నిండియేయున్నావు. వాస్తవస్థితిలో నీకును జీవులకును భేదమేలేదుకదా. ఇట్లైనను కర్తృత్వాదులును స్రష్టృత్వాదులును జ్ఞానాజ్ఞానాదులును నామము రూపము కర్మ వర్ణాశ్రమములు మొదలగు నుపాధులును శోక మోహములును నీకు లేవు. ఇవి యన్నియుం జీవునకు నున్నట్లు తోఁచుచున్నను అది (అట్లు తలంచుట) భ్రాంతియేకదా! కావున నీకు వికారములుగాని సంకల్పవికల్పములు లేక కల్పనాభేదములుకాని చేష్టలుకాని ప్రపంచముతో సంబంధములేక సంకోచవికాస ములుకాని ఇంతయేల? ఏవిధములగు ధర్మములుగాని లేవు. స్థూలాదిశరీరములను జాగ్రదాద్యవస్థలను ఆకాశాది భూతములను అన్నమయాదికోశములను ఇవి నాకు తెలిసినవి. ఇవి నాకు తెలియవు. అని జ్ఞానాజ్ఞానరూపములలో నేదియోయొకవిధముగాఁ బ్రకాశింపఁజేయుచున్నావు. చిత్తవృత్తి దేనిపైఁ బ్రసరించునో అది తెలియఁబడిన పదార్థ మనియుం దేనిపైఁ బ్రసరింపదో అది తెలియఁబడనిపదార్థమనియుం వ్యవహరింపంబడు చుండుట లోకానుభవసిద్ధము కావున జ్ఞాన (త) రూపముతో పదార్థములు ప్రకాశించి నను అజ్ఞాన (త) రూపముతోఁ బ్రకాశించిన నీదృష్టికి (అనఁగా "నీవు సాక్షివి" అనుటకు) నాటంక మేమియుం రాదు. దేశపరిచ్ఛేదముగల (అనఁగా సర్వవ్యాపకముకాని) చిత్తవృత్తి ప్రసరింపలేకపోయినను సర్వవ్యాపకుఁడ వగునీ కట్టి విఘ్న మేమియుం కలుగ నక్కఱలేదుకదా! ఇట్లుండినను లోకులు భ్రాంతిచేఁ దమ (చిత్తవృత్తి ప్రసరింపలేక పోవుటవలనఁ గలిగిన) యజ్ఞానమును నీయందు (ఆత్మయందు) ఆరోపించుచుందురు. నీప్రకాశము చిత్తవృత్తిమూలముననే యభివ్యక్తము కావలసియుండుటచేత ఆ చిత్త వృత్తి ప్రసరింపలేనిచోట నీప్రకాశముకూడ ప్రసరింపలే దని భ్రాంతివలనఁ దోఁచు చున్నది. ఇది యథార్థము కానేరదు కదా! ఓ నిర్గుణబ్రహ్మరూపా! మీకరుణాకటాక్షమువలన నేను నీయథార్థస్వరూపము నెఱుంగఁగలిగితిని. ఓ స్వప్రకాశస్వరూపా! నీకు ముమ్మాఱు నమస్కారము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇంద్రవజ్రము:—

విశ్వాంతరావాసక విశ్వమూర్తీ! విశ్వజ్ఞ విశ్వోదర విశ్వవంద్యా
విశ్వాక్ష విశ్వాతిగ విశ్వసాక్షీ! విశ్వాది విశ్వేశ్వర విశ్వరూపా! 4

టీ. విశ్వాంతరావాసక-విశ్వ = ప్రపంచముయొక్క, అంతర = లోపల, ఆవాసక = నివసించువాఁడ, విశ్వమూర్తీ=ప్రపంచమే యాకారముగఁ గలవాఁడ, విశ్వజ్ఞ = సర్వమును దెలిసికొనువాఁడ, విశ్వోదర-విశ్వ = ప్రపంచము, ఉదర=గర్భగోళమునందుఁ గలవాఁడ, విశ్వవంద్యా = ప్రపంచముచే నమస్కరింపఁబడువాఁడ, విశ్వాక్ష = సర్వరూపుఁడ వగుటచే ననేకసంఖ్యగలనేత్రములతో (అనఁగా: నేత్రాదిసర్వావయవములతో నొప్పువాఁడ) విశ్వాతిగ = ప్రపంచము నతిక్రమించి వెలుంగువాఁడ, విశ్వసాక్షీ = ప్రపంచమునకు (లేక సర్వమునకు సాక్షిభూతుఁడవై యుండువాఁడ), విశ్వాది=ప్రపంచమునకు నాదికారణభూతుఁడ, విశ్వేశ్వర=ప్రపంచమునకు నియామకుఁడ, విశ్వరూపా = ప్రపంచమే యాకారముగాఁ గలవాఁడ (విరాట్పురుషుఁడ).

తా. మఱియుం నీవు ప్రపంచమునం దంతయుం ప్రపంచమునకంటె వేఱుగా నివసించుచున్నావు. అట్లున్నను ప్రపంచము నీకు స్వరూపభూతమయ్యే యున్నది. ప్రపంచాధ్యాసమున కాధారము నీవేకదా. సర్వసాక్షివయ్యును సర్వజనులచే స్తోత్రము చేయఁబడుచు (అనఁగా ఆత్మరూపుఁడవని తెలియక)భిన్నుఁడవనుతలంపుతో నుపాసింపఁబడుచునున్నావు. వాస్తవస్థితిలో జీవుఁడుకూడ సాక్షియే కావున వానికంటె భిన్నుఁడగుదైవము ప్రత్యేకముగా లేఁడు కదా. ఈప్రపంచమునంతయుం కుక్షియందుంచుకొని ప్రోచుచున్నావు. ఈప్రపంచమునకు కారణభూతుఁడవు. ప్రభువవు. విరాట్పురుషుఁడవు.

ఉపేంద్రవజ్రము:—

నిరీశ నిష్కారణ నిర్వికల్పా, నిరీహ నిర్వాణద నిర్వికారా
నిరామయా నిర్గుణ నిర్విశేషా, నిరంతరానంద వినిశ్చితాత్మా. 5

టీ. నిరీశ=మఱియొకనియామకుని లోఁబడనివాఁడ, నిష్కారణ=ఎప్పటికి (నొకటే రీతిగా నుండువాఁడ వగుటచే వేఱొకకారణము లేనివాఁడు) నిర్వికల్పా = సంకల్పవికల్పములులేనివాఁడ, నిరీహ = కామములు లేనివాఁడ, నిర్వాణద=మోక్షము నొసంగువాఁడ, నిర్వికారా=ఉత్పత్తి మొదలగువికారములులేనివాఁడ, నిరామయా = వ్యాధులు (లేక దోషములులేనివాఁడ), నిర్గుణ = గుణములు లేనివాఁడ, నిర్విశేషా = భేదములు (లేక ధర్మములు లేనివాఁడ); నిరం...తాత్మా-నిరంతర = న్యూనాధిక భేదములు లేని, ఆనంద = పరమానందముచే (పరమానందమునుబట్టి), వినిశ్చిత = నిశ్చయింపఁబడిన, ఆత్మా=స్వరూపముగలవాఁడ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. నీకు మఱియొక ప్రభువు కాని కారణము కాని కల్పనా భేదములు అనఁగా "ఇతఁ డిట్టివాఁడు ఇట్టివాఁడు కాఁడు" అనువ్యవహారములుకాని చేష్టలుకాని వికారములుకాని వ్యాధులు మొదలయినవికాని గుణములుకాని ఇంత యేల ఏవిధములగు ధర్మములు గాని లేవు. నీవే మోక్షము నొసంగువాఁడవు. పరమానందస్వరూపుఁడ వగుటచే మహాత్ములు లౌకికానందమునుబట్టి నీస్వరూపమును నిర్ణయింతురు.

పృథ్వీవృత్తము.—

చరాచరకృతప్రపంచమయసర్వసంసారభృ
త్క్షరాక్షరవిలక్షణాగతవికారచిల్లక్షణా
పరాపరసనాతనా పరమపావనోద్యోతనా
పురాణపురుషోత్తమాపురుషపూర్ణవిద్వత్తమా. 6

టీ. చరా...క్షణా-చర = జంగమరూపమైనట్టియు, అచర = స్థావరరూపమైనట్టియు, కృత=మాయాకార్యమైనట్టియు, ప్రపంచమయ=ప్రపంచమేస్వరూపముగాఁగల, సర్వసంసార=సంసారమునంతయు, భృత్ =ధరించిన, క్షర=దేహాదిక్షరములకంటెను, అక్షర = కూటస్థునికంటెను (ఈకూటస్థుఁడే సంసారి. క్షరమే సంసారము), విలక్షణా = వేఱగువాఁడు, గతవి...క్షణా-గత=పోయిన, వికార=జన్మాదివికారములుగల (అనఁగా నిర్వికారమైన), చిత్ =జ్ఞానమే, లక్షణా=రూపముగాఁ గలవాఁడ, పరా...తనా-పరా =ప్రకృతికంటె :కూటస్థునికంటె, అపర = అపరాప్రకృతికంటె శరీరాదులకంటె, లేక మాయకంటె, సనాతన = అనాదియగువాఁడ, పర...తనా-పరమ=మిగుల, పావన = పరిశుద్ధమైనవాఁడ, ఉద్యోతనా = సర్వమును బ్రకాశింపఁజేయువాఁడ, పురాణపురుషోత్తమా-పురాణపురుష = అనాదులగు క్షరాక్షరపురుషులకంటె, ఉత్తమా=శ్రేష్ఠుఁడ, పురుషపూర్ణవిద్వత్తమా-పురుష=కూటస్థునితత్త్వమును, పూర్ణ=సర్వపరిపూర్ణమైన బ్రహ్మతత్త్వమును, విద్వత్తమా=తెలిసినవారలలో శ్రేష్ఠుఁడ (బ్రహ్మ యద్వితీయుండు కావున నాయన తన్నుఁ దానే తెలిసికొనవలయును. కాన మఱియొకనిచేఁ దెలియఁబడదని భావము.)

తా. స్థావరజంగమరూపమైనప్రపంచమే సంసారము క్షరము. దానిని ధరించు సంసారియే జీవుఁడు. ఇతఁడే కూటస్థుండు. భ్రాంతిచే సంసారము కలవాఁడుగా భావింపఁబడుచున్నాఁడు, వీరిరువురికంటె నీవు భిన్నుఁడవు. నిర్వికారమైనజ్ఞానమే (అనఁగా సంకోచవికాసాదులు లేనిజ్ఞానమే) నీస్వరూపము. ఈక్షరాక్షరములు రెండును నీయందే కల్పింపఁబడినవి; కావున నీవు వీనికంటె ననాదివి నిర్మలుఁడవు. సర్వప్రకాశకుఁడవు. పురాణ పురుషోత్తముఁడవు. స్వస్వరూపజ్ఞుఁడవు. (అనఁగా నిన్ను నీవే తెలిసికొందువు. వాస్తవస్థితిలో నీకంటె నన్యుఁడు లేఁడు కదా).

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భుజంగప్రయాతము.—

పరంధామ! దివ్యప్రభావాభిరామా!
పరాకాశ! సంపూర్ణభవ్యప్రకాశా!
పరానంద! దేవాధిపా! విశ్వతుందా!
పరానందసచ్చిత్స్వభావాత్మరూపా! 7

టీ. పరంధామ-పరం = సర్వోత్తమమైన ముక్తియే, ధామా = స్థానముగాఁ గల వాఁడ (లేక సర్వోత్తమమైన ప్రకాశముకలవాఁడ), దివ్య...రామా-దివ్యశ్రేష్ఠమైన, ప్రభావ=సామర్థ్యముచేత, అభిరామ = మనోహరుఁడ, పరాకాశ = చిదాకాశస్వరూపుఁడ, సంపూర్ణ=సర్వవ్యాపకమైన, భవ్య=శ్రేష్ఠమైన, ప్రకాశా = సర్వప్రకాశముగలవాఁడా, పరానంద=పరమానందమున కాశ్రయుఁడ, దేవాధిపా = సకలదేవతలకు (లేక సకలేంద్రియములకు నధీశ్వరా), విశ్వతుందా-విశ్వ=సర్వప్రపంచము, తుందా=గర్భమునందుగలవాఁడా, పరానందసచ్చిత్స్వభావాత్మరూపా=సచ్చిదానందస్వరూప.

తా. నీప్రకాశము (లేక నీస్థానము మోక్షము) సర్వోత్తమమైనది. నీప్రభావమునకు మితిలేదు. సర్వజనమనోహరుఁడవు. చిదాకాశరూపుఁడవు. సర్వవ్యాపకమైన స్వప్రకాశము కలవాఁడవు. పరమానందమున కాధారభూతుఁడవు. సర్వేంద్రియములను బ్రవర్తింపఁజేయుచుండుటచే వాని కధీశ్వరుఁడవు. ప్రపంచమును గర్భమునందుంచుకొనినవాఁడవు. సచ్చిదానందస్వరూపుఁడవు.

క. మాయాప్రతిబింబేశ్వర
మాయామయదివ్యదేహ మాయాతీతా
మాయావి మాయమాయా
మాయారహితాత్మతత్త్వమయ జయరామా. 8

టీ. మాయాప్రతిబింబేశ్వర-మాయాప్రతిబింబ=మాయయందు ప్రతిబింబించిన, ఈశ్వర=ఈశ్వరుఁడ, మాయా... దేహ-మాయామయ=మాయారూపమైన, దివ్యదేహ=శ్రేష్ఠమైన శరీరముగలవాఁడ, మాయాతీతా=మాయ నతిక్రమించినవాఁడ, మాయావి=మాయగలవాఁడ, మాయమాయా=మాయను నశింపఁజేయువాఁడ, మాయా...రామా-మాయా=మాయచే, రహిత=శూన్యమైన, ఆత్మతత్త్వమయ=జీవుని యథార్థస్వరూపమే స్వరూపముగాఁగల, జయరామా=శ్రీరామా!

తా. ఓ శ్రీరామా! మాయయందుఁ బ్రతిబింబించినవాఁడని చెప్పంబడు నీశ్వరుఁడు నీవే. నీశరీరము మాయామయమైనది. నీవు మాయ నతిక్రమించినవాఁడవు, మాయావంతుఁడవు. (అనగా మాయచే సర్వవ్యవహారముల జరిపించువాఁడవు). మాయను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సళింపఁజేసి జ్ఞానమును బ్రకాశింపఁజేయుదువు. యథార్థస్థితిలో నీయందు మాయ బొత్తుగనే లేదు.

క. భూతకర! భూతభావన, భూతభరణ! భూతహరణ! భూతావాసా!
భూతేశ్వర!భూతాశ్రయ!భూతాత్మక!భూతసాక్షి! భూతాత్మ!హరీ.

టీ. భూతకర=పంచభూతములను సృజించినవాఁడ, భూతభావన=జీవసమూహములచే ధ్యానింపఁబడువాఁడ, జీవసమూహములను తనస్వరూపమును ధ్యానించునట్లు చేయువాఁడ, భూతభరణ = పంచభూతాత్మక ప్రపంచమును రక్షించువాఁడ, భూతహరణ = తమోగుణము నాశ్రయించి భూతముల సంహరించువాఁడ, భూతావాసా = భూతములయందు అంతర్యామిరూపుఁడవై నివసించువాఁడ, భూతేశ్వర=సమస్తభూతములను స్వకార్యములయందుఁ బ్రేరేపించుచు ప్రభువైయుండువాఁడ, భూతాశ్రయ=సర్వభూతములకు నధిష్ఠానభూతుండ వైనవాఁడ, భూతాత్మక=సర్వభూతములే స్వరూపముగాఁగలవాఁడ, భూతసాక్షి=భూతములకు సాక్షియగువాఁడ, భూతాత్మ=నీవే భూతములైయున్నవాఁడ, హరీ=నారాయణ (లేక) సంసారనాశక.

తా. ఓనారాయణా ! నీవు జీవునిచే స్వస్వరూపములు ధ్యానింపఁ జేయుదువు. సర్వజంతువులను సృజింతువు. పెంతువు. సంహరింతువు. ఆభూతములయం దాత్మరూపముతో నివసింతువు. మఱియు సకలభూతములకు నధిపతివై యాధారభూతుండవై సాక్షివై యున్నాఁడవు. సర్వభూతములును నీవు, నీవే సర్వభూతములు.

స్రగ్విణి.—

యోగయోగాంగసంయుక్త! యోగప్రియా!
యోగముద్రాన్వితా! యోగనిద్రాంచితా!
యోగలక్ష్యావనా! యోగసిద్ధిప్రదా!
యోగమాయాశ్రయా! యోగయోగీశ్వరా! 10

టీ. యోగ...యుక్త-యోగ = మంత్రలయ హఠ రాజయోగాదియోగములతోను, యోగ = ఆయోగములయొక్క (లేక, అందు ముఖ్యమయినరాజయోగము యొక్క), అంగ=అవయవము లగుయమనియమాదులతో, సంయుక్త = కూడుకొనినవాఁడా, యోగప్రియా = ఆరాజయోగమునందు ఇష్టముఁగలవాఁడా, యోగముద్రాన్వితా=జీవబ్రహ్మైక్యమును దెలుపుయోగముద్రతోఁ (అంగుష్ఠతర్జనిసంయోగము యోగముద్ర) గూడినవాఁడా, యోగనిద్రాంచితా-యోగనిద్ర = నిర్వికల్పసమాధి యనెడు నిష్ప్రపంచస్థితిచే, అంచిత=ఒప్పుచున్నవాఁడ, యోగ...వనా-యోగ=యోగముచేత, లక్ష్య = గుఱుతింపందగిన (లేకధ్యానము చేయఁదగిన జీవేశ్వరులను,) అవనా=రక్షించు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాఁడ, యోగసిద్ధిప్రదా-యోగ = యోగములయొక్క, సిద్ధి = సిద్ధిని, ప్రదా=ఇచ్చు వాఁడా, యోగ...శ్రయా-యోగమాయా = సర్వప్రపంచమును సృజించినమాయకు, ఆశ్రయా=నివాసభూత మైనవాఁడ, యోగయోగీశ్వరా-యోగ=బ్రహ్మనిష్ఠతోఁ గూడిన, యోగి=సనకాదిమహామునులకు, ఈశ్వరా=ప్రభువైనవాఁడా.

తా. యోగములును యోగాంగములును నీయందేయున్నవి. యోగముల నాసక్తితో నీవే యాచరింతువు. యోగముద్రచే జీవబ్రహ్మైక్యమును బ్రకటింతువు. నిర్వికల్ప సమాధిచే నొప్పుచుందువు. నీకంటె నన్యు లెవ్వరును సంపూర్ణముగనే లేరు కదా మఱియు యోగముచే ధ్యానింపందగిన జీవేశ్వరులను రక్షించువాఁడవును యోగసిద్ధి నొసంగువాఁడవును నీవే. యోగమాయకు నాధారభూతుఁడవును సర్వయోగులలో నుత్తముఁడవును నీవే.

వసంతతిలకము.—

వేదాగమావిషయవిగ్రహ! వేదవేద్యా!
వేదాంగ! వేదనుత! వేదవివేకశీలా!
వేదాదివి! వేదమయ! వేదగ! వేదజిహ్వా!
వేదాంతతత్త్వసువివేచనవేదితవ్యా! 11

టీ. వేదా...విగ్రహ-వేద=వేదములకును, ఆగమ=ఇరువదియెనిమిది యాగమములకును, అవిషయ = విషయముకాని (అనఁగా: ఆ వేదాదులచే నిరూపింపఁబడుటకశక్యమయిన, విగ్రహ=స్వరూపముగలవాఁడ,) వేదవేద్యా-వేద=వేదములచే, వేద్యా=తెలియఁదగినవాఁడా (అనఁగా లక్షణావృత్తిచే నెఱుంగఁదగినవాఁడ, వేదములు లక్షణావృత్తిచే నైనను బ్రహ్మమును నిరూపింపఁగలవు. ఇతరశాస్త్రములట్లును నిరూపింప లేవనుట.) వేదాంగ = వేదములే అవయవములుగా (లేక) విశ్వాసముగాఁ గలవాఁడ, వేదనుత = వేదముచే అనేకవిధములుగా (అనఁగా బ్రహ్మవిష్ణ్వాది రూప భేదములచే) స్తోత్రము చేయఁబడువాఁడ, వేదవివేకశీలా-వేద = వేదవిషయమయిన (అనఁగా వేదార్థ విషయమైన, వివేక=జ్ఞానమే, శీలా = స్వభావముగాఁ గలవాఁడా, వేదాది = వేదములకాది కారణభూతుఁడ (లేక) ప్రణవరూపుఁడ, వేదమయ=వేదములే యాకారముగాఁ గలవాఁడ, వేదగ-వేద=వేదములను, గ = పొందినవాఁడా "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి = ఉపనిషత్తులచేత మాత్రమే ప్రతిపాదింపఁబడు నాపురుషునిగూర్చి నిన్నుఁ బ్రశ్న జేసెదను" అను ప్రమాణము ననుసరించి వేద మొక్కటియే బ్రహ్మమును ప్రతిపాదించినది. కావున "వేదగ" యని చెప్పఁబడినది. వేదజిహ్వా-వేద = వేదములతోఁ గూడిన, జిహ్వా=నాలుక గలవాఁడా! అనఁగా వేదముల లోకహితార్థమై యుపదేశించినవాఁడ, వేదాన్తతత్త్వ...దితవ్యా-వేదాన్త = వేదాంత శాస్త్రమునందలి, తత్త్వ =

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యథార్థరూపముయొక్క, సువివేచన = చక్కని విమర్శచే, వేదితవ్యా = తెలిసికొనం దగినవాఁడ.

తా. నీ స్వరూపముగూర్చి వేదములుగాని యాగమములుగాని విమర్శించి చెప్ప నేరవు. అట్లైనను (అనఁగా అభిధానవృత్తిచే "గౌః=ఆవు" అని ప్రత్యక్ష పదములతో విషయముల నిర్ణయించుట యభిధావృత్తి) జెప్పలేకున్నను నిన్నుఁ దెలిసికొనుటకు వేద ములకంటె నితర సాధనములు లేవు. అవి మాత్రమే నిన్ను లక్షణావృత్తిచే వాక్యము లందుఁ బ్రయోగింపఁబడిన పదముల యర్థమువలనఁ దాత్పర్యము కుదురనప్పుడు అందలి పదముల ననుసరించి వేఱొకయర్థము నూహించుట లక్షణావృత్తి) నైనను గొంతవఱకు జెప్పఁగలవుగాని ఇతరములగు నాగమాదులు బొత్తుగనే చెప్ప నేరవుకదా! ఆవేదములు నీకు నవయవభూతములే. బహు దేవతలనుగూర్చి చెప్పునవియైనను ఆయారూపములతో నిన్నే స్తోత్రము చేయుచున్నవియే అద్వితీయుఁడ వగుటచేత .వేదముల సహాయమువలన నీ స్వరూపము నెఱుంగువాఁడవు కూడ నీవే. మఱియు నా వేదములకు నీవే సృష్టికర్తవు. ఆవేదములును నీకంటె వేఱుకావు. వేదములచేఁ బ్రతిపాదింపఁబడువాఁడవును వాని నుపదేశించి లోకహితము నాచరించువాఁడవును నీవే. నీస్వరూపము వేదాంతశాస్త్రమును విమర్శించుటవలనంగాని విస్పష్టముకాదు.

క. శాస్త్రాగమపరికల్పక, శాస్త్రాచార్యోపదేశసారార్థజ్ఞా
శాస్త్రాగమార్థతత్పర, శాస్త్రార్థవిచారగమ్య శాస్త్రప్రవరా. 12

టీ. శాస్త్రాగమపరికల్పక-శాస్త్ర = శాస్త్రములను, ఆగమ=శైవాద్యాగమములను; పరికల్పక=కల్పించినవాఁడ, శాస్త్రా...ర్థజ్ఞా-శాస్త్ర=శాస్త్రములయొక్కయు, ఆచార్య= సద్గురువులయొక్కయు, ఉపదేశ = ఉపదేశవాక్యములయొక్కయు, సార = సారాంశ మయిన, అర్థ=జీవబ్రహ్మైక్యవిషయమును, జ్ఞా=తెలిసినవాఁడ, శాస్త్రాగ...త్పర-శాస్త్ర= శాస్త్రములయొక్క, ఆగమ=ఆగమములయొక్కయు,అర్థ=విషయమగు జీవబ్రహ్మైక్యము నందే, తత్పర=ఆసక్తిగలవాఁడ, శాస్త్రార్థవిచారగమ్య-శాస్త్ర=శాస్త్రములయొక్క, అర్థ= అర్థములను, విచార = విచారించుటచేత, గమ్య = తెలియఁదగినవాఁడ, శాస్త్రప్రవరా- శాస్త్ర=శాస్త్రములయందు, ప్రవరా=శ్రేష్ఠుఁడా (అనఁగా సమర్థుఁడా.)

తా. శాస్త్రములను ఆగమములను కల్పించినవాఁడవును వాని నుపదేశించు నాచార్యులబోధలయందలి సారాంశము నెఱుంగువాఁడవును వానియర్థము నాసక్తితో విమర్శింపవలయు ననునిచ్ఛ కలవాఁడవును అట్లు విమర్శించువాఁడవును ఆవిమర్శవలన దెలియఁబడువాఁడవును నీవే. ఆశాస్త్రములును నీవే. శాస్త్రాభ్యాసమునందు సిద్ధినొందిన వాఁడవును నీవే.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. విద్యానిధి! విద్యాప్రద, విద్యావిద్యాతిరిక్త! విద్యావేద్యా!
విద్యాపతి! విద్యామయ, విద్యాసందానితాత్మ! విద్యాసారా! 13

టీ. విద్యానిధి...విద్యా = విద్యలకు, (లేక జ్ఞానమునకు,) నిధి = ఆధారభూతుఁడ, విద్యాప్రద-విద్య=జ్ఞానమును, ప్రద=ఇచ్చువాఁడా, విద్యా...రిక్త-విద్యా=జ్ఞానమునకును, అవిద్యా=అజ్ఞానమునకును, అతిరిక్త = వేఱైనవాఁడ, విద్యావేద్యా-విద్యా=జ్ఞానముచేమాత్రమే, వేద్యా=తెలియందగినవాఁడ, విద్యాపతి=జ్ఞానమునకు ప్రభువా, విద్యామయ=జ్ఞానరూప, విద్యా...తాత్మ-విద్యా=జ్ఞానముచే (లేక వేదవిద్యచే) సందానిత = బద్ధమైన (అనఁగా: నేర్పఱచఁబడిన) ఆత్మ = దేహము గలవాఁడ, విద్యాసారా-విద్యా=సర్వవిద్యలకును, సారా=సారభూతమైనవాఁడ.

తా. సమస్తవిద్యలకు (లేక జ్ఞానమునకు) నాశ్రయమై దాతవై దానిచే నెఱుఁగఁదగినయంశంబవై వానికి ప్రభువవై సారాంశంబవై యున్నావు. అవిద్యయే నీవు. నీశరీరము దానిచేతనే నిర్మింపఁబడియున్నది. ఇట్లైనను యథార్థస్థితియే నీవు విద్యావిద్యలకంటె భిన్నుఁడవు.

మానిని.—

యజ్ఞవిధాయక! యజ్ఞనియామక! యజ్ఞఫలాశ్రయ! యజ్ఞకరా!
యజ్ఞఫలావన! యజ్ఞఫలాశన! యజ్ఞఫలప్రద! యజ్ఞధరా!
యజ్ఞవిధిప్రియ! యజ్ఞసమర్చిత! యజ్ఞసుసాధన! యజ్ఞపతీ!
యజ్ఞశరీరక! యజ్ఞరహస్యక! యజ్ఞపరాయణ! యజ్ఞమయా! 14

టీ. యజ్ఞవిధాయక = "యజ్ఞమును జేయవలయును" అని విధించువాఁడ, యజ్ఞనియామక=యజ్ఞమును నియమించువాఁడా, యజ్ఞఫలాశ్రయ = యజ్ఞఫలమునకు (యజ్ఞములకును వాని ఫలభూతము లగుస్వర్గాదులకును) ఆధారమయినవాఁడ, యజ్ఞకరా=యజ్ఞమును చేయువాఁడ, యజ్ఞఫలావన = యజ్ఞములను దానిఫలములను రక్షించువాఁడ, యజ్ఞఫలాశన=యజ్ఞఫలమును అనుభవించువాఁడ, యజ్ఞఫలప్రద=యజ్ఞఫలముల నొసంగువాఁడ, యజ్ఞధరా = యజ్ఞమును ధరించువాఁడ (అగ్నితో యజ్ఞకర్త్రాధార మగువాఁడ, యజ్ఞవిధిప్రియ = యజ్ఞమును జేయుటవలన సంతసించువాఁడ, యజ్ఞసమర్చిత=యజ్ఞముచే బూజింపంబడువాఁడ, యజ్ఞసుసాధన=యజ్ఞసాధనములగు స్రుక్స్రువాదులు స్వరూపముగాఁ గలవాఁడ, యజ్ఞపతీ = యజ్ఞమునకు ప్రభువా, యజ్ఞశరీరక=యజ్ఞమేశరీరముగాఁగలవాఁడ, యజ్ఞరహస్యక=యజ్ఞములోని రహస్యార్థమైనవాఁడ, యజ్ఞపరాయణ-యజ్ఞమే, పర = శ్రేష్ఠమైన, అయన = స్థానముగాఁ గలవాఁడ, యజ్ఞమయా=యజ్ఞస్వరూప.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఇట్లే యజ్ఞంబును యజ్ఞమును విధించినవాఁడవును నియమించువాఁడవును అనఁగా 'దీని నవశ్యము చేయవలయును. ఇట్టి దేశమున నిట్టికాలమున దీనిఁ జేయవలయును. ఇట్లు చేయవలయును' అని నిర్ణయించువాఁడవును అట్లు సేయువాఁడవును దాని ఫలమునకు నాశ్రయుండవును దానిని, దానివలనఁ గలుగుఫలమును సురక్షితముగాఁ బ్రోచువాఁడవును తత్ఫలము ననుభవించువాఁడవును ఆయజ్ఞము నొనర్చుటవలన సంతసించు దేవతయును దాని ధరించు అగ్నిహోతృఁడవును దానిచేఁ బూజింపఁ బడువాఁడవును తత్సాధనములగు స్రుక్స్రువాదులును నీవే. ఆయజ్ఞము నీకు శరీరభూతమే. అదియే నీకుఁ బరమగతి. దానియందలిరహస్యార్థము గూడ నీవే.

క. మంత్రప్రభావదర్శక, మంత్రప్రియ,సకలమంత్రమంత్రార్థజ్ఞా
మంత్రార్థగమ్య మంత్రీ, మంత్రాధిష్ఠానదేవమయ మంత్రాత్మా. 15

టీ. మంత్ర...దర్శక - మంత్ర=మంత్రములయొక్క, ప్రభావ=శక్తిని, దర్శక =చూపువాఁడ, మంత్రప్రియ = మంత్రములయందు ఇష్టముగలవాఁడ, సకలమంత్రమంత్రార్థజ్ఞా = సకలమైనమంత్రములను మంత్రార్థమును తెలిసినవాఁడ, మంత్రార్థగమ్యా= మంత్రార్థముచేఁ దెలియఁదగినవాఁడ, మంత్రీ=మంత్రానుష్ఠానము చేయువాఁడ, మంత్రాధిష్ఠానదేవమయ = మంత్రముచే నుపాసింపఁబడు దేవతలే యాకారముగాఁ గలవాఁడ. మంత్రాత్మా=మంత్రస్వరూప.

తా. మంత్రంబును దాని ననుష్ఠించువాఁడును తత్ప్రభావము నెఱింగించువాఁడును తదనుష్ఠానముచే పూజింపఁబడువాఁడును (దేవతయును) తదర్థము నెఱింగినవిద్వాంసుఁడును దానిచే సూచింపఁబడు పరమార్థంబును తదధిష్ఠానదేవతలును నీవే.

క. జపకల్పక! జపతల్పక! జపకోట్యారాధనీయ! జపతత్త్వజ్ఞా!
జపజప్యజాపకాత్మక!, జపయజ్ఞఫలస్వరూప! జపలక్ష్యాత్మా! 19

టీ. జపకల్పక-జప=జపమును, కల్పక = ఏర్పఱిచినవాఁడ, జపతల్పక = జపమే పాన్పుగాఁ గలవాఁడ, జపకోట్యారాధనీయ-జపకోటి = అనేకజపములతో, ఆరాధనీయ=సేవింపందగినవాఁడ, జపతత్త్వజ్ఞా = జపమునందలి యథార్థతత్త్వమును, దెలిసినవాఁడ; జప...కాత్మక-జప = జపము, జప్య = జపింపఁ దగిన దేవత, జాపక = జపించువాఁడు, ఆత్మక = స్వరూపముగాఁ గలవాఁడ, జపయజ్ఞఫలస్వరూప-జపయజ్ఞ = జపయజ్ఞముయొక్క, ఫలస్వరూప = ఫలమే స్వరూపముగాఁగలవాఁడ, జపలక్ష్యాత్మా = సర్వజనులకును లక్ష్యభూతమైనవాఁడ (ఏ దేవతనుంగూర్చి జపముచేసినను పరబ్రహ్మమునుగూర్చి చేసినట్లే, యని భావము.

తా. 'జపము చేయవలయును' అని విధించినవాఁడును దానిచే నారాధింపఁదగిన దేవతయును దానియథార్థతత్త్వము నెఱింగినవిద్వాంసుఁడును నీవే. ఆజపము నీకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శయనమువంటిది. మఱియు జపము సేయుటయును జపింపఁదగినమంత్రంబును జపించు పురుషుండును జపఫలంబును దానికి గుఱి సేయఁదగిన దేవతలును నీవే.

క. ధ్యానప్రియ! సంతతహృ,ద్ధ్యానధ్యేయాత్మరూపతత్త్వ! ధ్యాతృ
ధ్యానధ్యేయాధ్యాత్మ, ధ్యానపరాయణ! సమస్తతత్త్వాతీతా. 17

టీ. ధ్యానప్రియ = ధ్యానమునం దిష్టముగలవాఁడ, సంత...పతత్త్వ-సంతత = ఎల్లప్పుడును, హృత్ =హృదయమునందు, ధ్యాన=నిదిధ్యాసనము చేయుటచేత, ధ్యేయ= ధ్యానింపఁదగిన లేక తెలిసికొనఁదగిన, ఆత్మరూపతత్త్వ...బ్రహ్మరూపమైన యథార్థ తత్త్వముకలవాఁడ, ధ్యాతృ = ధ్యానము చేయువాఁడ, ధ్యాన...ధ్యాత్మ - ధ్యాన =ధ్యానము, ధ్యేయ = ధ్యానము చేయఁదగినపదార్థము, అధ్యాత్మ=శరీరముగాఁగలవాఁడ, ధ్యానపరాయణ-ధ్యానపర=ధ్యాన మను శ్రేష్ఠమగు, అయన=స్థానముగలవాఁడ, సమస్త తత్త్వాతీతా-సమస్తతత్త్వ=సర్వతత్త్వములకును అనఁగా దేహేంద్రియాదుల కన్నిఁటికిని, అతీతా=వ్యతిరిక్తమైనవాఁడా.

తా. ధ్యానముచే సంతోషించుదేవతయును సర్వకాలములయందును ధ్యానింపఁ దగినస్వరూపము గలవాఁడవును ధ్యానించుకర్తయును ధ్యానంబును ధ్యానింపఁదగిన పదార్థంబును నీవే. నీకు శ్రేష్ఠమగు నాశ్రయము ధ్యానమే, ఇట్లుండియును నీవు అన్నితత్త్వముల అతిక్రమించియున్నావు.

క. పూజావిధానదర్శక!, పూజాతద్వస్తుపూజ్యపూజకరూపా!
పూజాఫలప్రదాయక!, పూజాప్రియ! పూజనీయ! పూజావిషయా!

టీ. పూజా...దర్శక - పూజావిధాన = పూజచేయవలసిన క్రమమును, దర్శక= చూపువాఁడ, పూజా...రూపా-పూజా = పూజయు, తద్వస్తు=దానికి ఉపయోగించు పదార్థములును, పూజ్య=పూజింపఁదగిన దేవతయును, పూజక = పూజచేయువాఁడును, రూప = స్వరూపముగాఁగలవాఁడ, పూజాఫలప్రదాయక-పూజాఫల = పూజకుఁ దగిన ఫలమును, ప్రదాయక=ఇచ్చువాఁడ, పూజాప్రియ=పూజయందు (అనఁగా: పూజ చేయుటయందు లేక చేయించుకొనుటయందు ఇష్టము గలవాఁడ), పూజనీయ=పూజింపఁ దగినవాఁడ, పూజావిషయా-పూజా=పూజకు, అవిషయా=గోచరము కానివాఁడ, (జీవ బ్రహ్మలకు భేదము లేకపోవుటచే పూజ్యాపూజా భేదము లేదని తాత్పర్యము.

తా. పూజను చేయవలసినవిధిని జూపునట్టి యాచార్యుఁడును పూజయును దానికి సాధనము లగుపదార్థంబులును దానిచే నారాధింపఁదగినదైవంబును దానిఁజేయువాఁ డును దానిఫలము నిచ్చువాఁడును దానిచే సంతసించువాఁడును నీవే. ఎవ్వని పూజించినను నిన్నే పూజించినట్లగును. యథార్థస్థితిలో నీవు పూజకు విషయ మగువాఁడవు కావు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. నామప్రియ! నారాయణ,నామక! విశ్వాద్యనంతనామార్థజ్ఞా!
నామప్రభావదర్శక!, నామాదివికారరహిత! నతవిబుధహితా! 19

టీ. నామప్రియ = నామస్మరణయందు, (లేక నామస్మరణ చేయించుకొనుట యందు) ఇష్టముకలవాఁడ, నారాయణనామక = నారాయణుఁ డను పేరుకలవాఁడ, విశ్వాద్యనంతనామార్థజ్ఞా = "విశ్వం విష్ణు ర్వషట్కారః" అను మొదలగు ననేకనామములయొక్కయర్థమునుఁ దెలిసికొనినవాఁడ, నామప్రభావదర్శక = నామస్మరణము వలనఁ గలుగుశక్తినిజూపువాఁడ, నామాదివికారరహిత=నామము మొదలయినవికారములు లేనివాఁడ, నతవిబుధహితా-నత=నమస్కరించిన, విబుధ=దేవతలకు, హిత=క్షేమకరుఁడా!

తా. శరణాగతు లగు దేవతలకు (లేక విద్వాంసులకు) మేలు సేయునట్టియో శ్రీరామా! నామస్మరణ చేయుటయందును జేయించుకొనుటయందును ఇష్టముకలవాఁడును 'విశ్వ విష్ణు' అను మొదలగు నామములయర్థము నెఱింగినవిద్వాంసుఁడును నామ ప్రభావమును జూపువాఁడవును నీవే. నామము మొదలగు వికారము లేవియుఁ లేని వాఁడవైనను నారాయణనామముచే నీవే లోకమున వ్యవహరింపఁబడుచున్నావు.

క. గురుశిష్యభావకల్పక!, గురుశిష్యాచారధర్మగుణపరిపాలా!
గురుశిష్యరూపధారీ!, గురుశిష్యైక్యావబోధగుణగురుమూర్తీ! 20

టీ. గురుశిష్యభావకల్పక-గురుశిష్య = గురువు అనియుఁ శిష్యుఁడనియు, భావ = అభిప్రాయమును, కల్పక = కల్పించువాఁడ, గురు...పాలా-గురుశిష్య = గురుశిష్యుల యొక్క, ఆచార = ఆచారములను, ధర్మ=ధర్మములను, గుణ = శాంత్యాదిగుణములను, పరిపాలా=రక్షించువాఁడ, గురుశిష్యరూపధారీ = గురుశిష్యరూపమును ధరించినవాఁడా, గురుశిష్య=గురుశిష్యులకుఁగల, ఐక్యావబోధ = ఏకత్వమును తెలియుటయే, గుణ = స్వభావగుణముగాఁగలవాఁడ, గురుమూర్తీ = గురుస్వరూపము (లేక, గౌరవనీయమగు ప్రపంచమయశరీరము) గలవాఁడా.

తా. 'ఇతఁడు గురువు ఇతఁడు శిష్యుఁడు' అనుసంకల్పములను కల్పించినవాఁడవును ఆగురుశిష్యులయాచారములను ధర్మములను గుణములను రక్షించునాయకుఁడవును నీవే. గురుశిష్యు లిరువురును వానియైక్యము నెఱుంగువాఁడవును నీవే. నీరూపము మిగుల గౌరవనీయమైనది పూజనీయమయినది.

విద్యున్మాలావృత్తము.—

ధర్మారాధ్యా ధర్మాధ్యక్షా!, ధర్మీ! ధర్మాత్మా! ధర్మజ్ఞా!
ధర్మాధారా! ధర్మాకారా! ధర్మాధర్మాత్యంతాభావా! 21

టీ. ధర్మారాధ్యా-ధర్మ = ధర్మముచే, ఆరాధ్యా = సేవింపఁదగినవాఁడ, ధర్మాధ్యక్షా-ధర్మ=ధర్మమునకు, అధ్యక్షా=అధిపతీ, ధర్మీ = ధర్మశీలుఁడా, ధర్మాత్మా = ధర్మమే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆకారముగాఁగలవాఁడ (లేక ధర్మమే మనస్సుగాఁగలవాఁడా), ధర్మజ్ఞా=ధర్మము నెఱిఁగినవాఁడ, ధర్మాధారా = ధర్మమునకు ఆధారభూతుఁడైనవాఁడ, ధర్మాకారా = ధర్మస్వరూపముగాఁగలవాఁడ, ధర్మాధర్మాత్యంతాభావా - ధర్మ = ధర్మముయొక్కయు, అధర్మ=అధర్మముయొక్కయు, అత్యంతాభావా = లేమికలవాఁడ, (అనఁగా: ధర్మాధర్మములు లేనివాఁడ).

తా. ధర్మముచే బూజింపఁదగిన దేవతయును దానికి ప్రభు వగుపరమేశ్వరుఁడును దాని నాచరించుపురుషుండును దానియం దిష్టముగల మహాత్ముఁడును దానియాథార్థ్యము నెఱింగినవిద్వాంసుఁడును దాని కాధార మగువాఁడును నీవే. ఆధర్మమే నీయాకారము. ఇట్లైనను యథార్థస్థితిలో నీయందు ధర్మాధర్మములు లేవు. నీవు ధర్మాధర్మములలో నొక్కటియుఁ గా నేరవు.

సుకాంతివృత్తము:—

ధనార్జనా! ధనప్రియా! ధనాధిపా! ధనంజయా!. 22

టీ. ధనార్జనా=ధనమును సంపాదించువాఁడ! (లేక ధనమును సంపాదించుటయే స్వరూపముగాఁ గలవాఁడ.) ధనప్రియా = ధనమునం దాసక్తిగలవాఁడ, ధనాధిపా=ధనమున కధీశ్వరుఁడా, ధనంజయ = ధనమును జయించి తెచ్చువాఁడ.

తా. ధనమును సంపాదించుట యనునదియే నీరూపము. మఱియు ధనమునం దిష్టము కలిగినట్టియు దానికి నధిపతియైనట్టియు దానిని సాధించి తెచ్చునట్టియు పురుషుఁడవు నీవే.

ఉపజాతివృత్తము:—

కామాది! కామాదివికారశూన్యా!
సమస్తకామప్రద! సత్యకామా!
కామఘ్న! కామప్రియ! కామ కామీ!
క్షమారమాకాముక! కామరూపీ! 23

టీ. కామాది-కామ = కామములకు, ఆది = కారణభూతుఁడ, కామాదివికారశూన్యా=కామము మొదలగువికారములు లేనివాఁడ, సమస్తకామప్రద=భక్తులకుఁగోరిన కోర్కులనిచ్చువాఁడ, సత్యకామా=కోరినట్లు సర్వకార్యముల సిద్ధింపఁజేయంగల సామర్థ్యముకలవాఁడ, కామఘ్న=కామవేగమును జయించువాఁడ, కామప్రియ=కోరుటయం దిచ్ఛగలవాఁడ, కామ=కోరికయే స్వరూపముగాఁ గలవాఁడ, కామీ=కోర్కెగలవాఁడ, క్షమారమాకాముకా-క్షమా = శాంతియనెడు, రమా=లక్ష్మికి, కాముక=భర్తయగువాఁడ, కామరూపీ=స్వేచ్ఛాధీనమగు రూపము గలవాఁడ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. మఱియు కామమునకుఁ గారణభూతమైన మనంబును కామాదివికారములు లేని నిర్గుణపరబ్రహ్మంబును కోరినకోర్కులనొసంగు బహువిధదేవతలును నీవే. నీ కామమునకు (సంకల్పమునకు) నెందును విఘ్నము లేదు. కామమును జయించునట్టి యోగంబును లేకయోగియును దానియందిష్టముగలభోగియును నీవే. కామమే నీస్వరూపము. శాంతి (కామాదులులేకుండుట) యను లక్ష్మికి భర్తవును కామము నాశ్రయించినవాఁడవును నీవే. యథార్థస్థితిలో నీ కేదియుఁ లేకున్నను భ్రాంతినిబట్టి అన్నియుఁ గలవు కదా. మఱియు నీరూపము స్వేచ్ఛాధీన మైనది, ఎవ్వ రెట్లు ధ్యానించిన వారి కట్లు ప్రత్యక్ష మగుదువు.

విభూతివృత్తము:—

మోక్షలక్షణేక్షణా! మోక్షధర్మరక్షణా!
మోక్షసౌఖ్యదాయకా! మోక్షరాజ్యనాయకా! 24

టీ. మోక్షలక్షణేక్షణా-మోక్ష = మోక్షమే, లక్షణ=గుఱుతుగాఁగల, ఈక్షణా= అనుగ్రహదృష్టిగలవాఁడ, మోక్షధర్మరక్షణా-మోక్ష=మోక్షమునకు సంబంధించిన, ధర్మ =ధర్మములను, రక్షణా=రక్షించువాఁడ, మోక్షసౌఖ్యదాయకా=మోక్షసుఖమును ఇచ్చు వాఁడా, మోక్షరాజ్యనాయకా=మోక్ష మనురాజ్యమున కధీశ్వరుఁడా.

తా. నీదృష్టి భక్తులకు మోక్షము నొసంగును. లేక నీదృష్టికి మోక్షమే స్వరూపము. మోక్షధర్మమును రక్షించు ప్రభువు నీవే. మోక్షసౌఖ్యము నొసంగువాఁడవును మోక్షరాజ్యమున కధిపతియును నీవే.

క. లక్ష్మీకర! లక్ష్మీధర!, లక్ష్మీముఖకుముదచంద్ర! లక్ష్మీనాథా!
లక్ష్మీనివాస! విద్యా!లక్ష్మీప్రదసత్కటాక్షలవ! లక్ష్మీశా!. 25

టీ. లక్ష్మీకర-లక్ష్మీ=సంపత్తును, కర = కలిగించువాఁడ, లక్ష్మీధర=లక్ష్మిని వక్షస్థలమునఁ దాల్చువాఁడ, లక్ష్మీముఖకుముదచంద్ర-లక్ష్మీముఖ=లక్ష్మీదేవియొక్క ముఖమనెడు, కుముద = కలువకు, చంద్ర = చంద్రునివంటివాఁడ, లక్ష్మీనాథా = లక్ష్మీనాయక, లక్ష్మీనివాస=లక్ష్మికి (లేక కాంతికి నివాసభూతుఁడగువాఁడ,) విద్యా...లవ-విద్యా = జ్ఞానమనెడు, లక్ష్మీ=సంపదను (లేక జ్ఞానమును సంపదను,) ప్రద = ఇచ్చునట్టి, సత్ =శ్రేష్ఠమయిన, కటాక్ష = కడగంటిచూపుయొక్క, లవ = లేశము గలవాఁడ, (శ్రీరాముని కరుణాలేశముచే బ్రహ్మజ్ఞానంబును సంపదయును గలుగునని భావము.) లక్ష్మీశా=లక్ష్మీదేవికి ప్రభువైనవాఁడ (లేక కాంతికి అధీశ్వరుఁడ; అనఁగా కోటిసూర్యప్రకాశుఁడ.)

తా. సంపద నొసంగునట్టియుఁ లక్ష్మిని ధరించినట్టియుఁ లక్ష్మీముఖ మనెడు కలువకుఁ జంద్రునివంటియుఁ (అనఁగా: లక్ష్మీదేవికి నానందమును గలిగించునట్టియుఁ లక్ష్మీనాయకుఁడవు నీవే. మఱియు నీవు లక్ష్మియందును లక్ష్మి నీయందును నివసించుచుండును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీకరుణాకటాక్షలేశము దొరకిన బ్రహ్మజ్ఞానంబును మహత్సమృద్ధియు కలుగును. కోటి సూర్యప్రకాశుఁడవు.

మందాక్రాంతవృత్తము:—

సర్వాధారా! సగుణవిగుణా! సర్వభూతాధివాసా!
సర్వాధ్యక్షా! సకలవరదా! సర్వవాగీశ్వరేశా!
సర్వవ్యాపీ! సదయహృదయా! సర్వసర్వాంతరాత్మా!
సర్వాతీతా! సమరసమయా! సచ్చిదానందరూపా! 26

టీ. సర్వాధారా-సర్వ = సమస్తములకును, ఆధారా = ఆధారభూతుఁడ, సగుణవిగుణా = సత్వరజస్తమోగుణములతోఁ గూడియు, వానితో సంబంధింపక పోవుటచేతఁ గూడియుండనివాఁడ, సర్వ...వాసా-సర్వభూత = సమస్తజంతువులకును (లేక, సమస్తజీవులును), అధివాసా = నివాసస్థానముగాఁగలవాఁడా (లేక, నివాసస్థానమగువాఁడ,) సర్వాధ్యక్షా=సర్వమునకు నధీశ్వరా, సకలవరదా=శత్రుమిత్రులను భేదము, (లేక, సర్వజనులయందు ననుగ్రహదృష్టి కలవాఁడ,) సర్వ...రేశా-సర్వవాక్ = సర్వశబ్దరూపమగునోంకారమునకు, ఈశ్వర = ప్రభువులైన బ్రహ్మవిష్ణ్వాదులకు, ఈశా = ప్రభువైన వాఁడ, సర్వవ్యాపీ = సర్వవ్యాపకుఁడ, సదయహృదయ-సదయ = దయాయుక్తమైన, హృదయ = మనస్సుకలవాఁడ, సర్వసర్వాంతరాత్మా-సర్వ = సకలవిధములైన, సర్వ = సమస్తప్రపంచములకును, అంతరాత్మా = అంతర్యామిస్వరూపుఁడ, సర్వాతీతా = సర్వమును అతిక్రమించినవాఁడ, సమరసమయా = ఐక్యమే స్వరూపముగాఁ గలవాఁడ, సచ్చిదానందరూపా-సత్ = సత్యము, చిత్ = జ్ఞానము, ఆనంద=ఆనందము, రూపా = స్వరూపముగాఁ గలవాఁడ.

తా. నీవు సకలప్రపంచమునకు నాధారభూతుఁడవు. యథార్థస్థితిలో గుణములు లేనివాఁడ వైనను గుణములు కలవానివలెఁ దోఁచుచుందువు. భ్రాంతిసిద్ధములుకాని స్వాభావికములు కాని యేవియైనను నీస్వరూపములే కదా! సర్వభూతములును నీయందు నివసించును. నీవును సర్వభూతములయందు నివసింతువు. సర్వమునకు నధీశ్వరుఁడవును కోరినకోర్కుల నొసంగువాఁడవును నీవే. ఓంకారమునకు నధిదేవత లగుబ్రహ్మవిష్ణురుద్రులకు నీవే నాయకుఁడవు. ఈసర్వపదార్థములయందును నీవేకరూపముతో వ్యాపించియున్నావు. నీహృదయము మిగుల కరుణావంత మైనది. నీవే సమస్తభూతములందు నంతర్యామిరూపుఁడవై యున్నావు. భూతములలో నెన్ని భేదములున్నను నీకుమాత్రము భేదములేదు. ఇట్లున్నను నీవు సర్వప్రపంచమునకంటె నన్యుఁడవు. ఏకస్వరూపుఁడవు. సత్యజ్ఞానానందములే నీ స్వరూపములు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీసదశకము:—

ప్రకటపరాపరప్రకృతిమంతుండవు
మఱియు వశీకృతమాయుఁడవును
సర్వజ్ఞుఁడవు సర్వశక్తియుక్తుండవు
సర్వకర్తవు సర్వజనకుఁడవును
సర్వరక్షకుఁడవు సర్వసంహర్తవు
సర్వేశ్వరుండవు సర్వగుఁడవు
సర్వగురుండవు సర్వతోముఖుఁడవు
సర్వసాక్షివి సర్వసముఁడవగుచు

తే. నిర్వికల్పనిరంజననిర్వికార
నిర్గుణబ్రహ్మమై యొప్పునిను భజింతు
సంతతంబాత్మమయత సాక్షాత్కరింపు
రామ! రాఘవ! శ్రీరామ! రామ! రామ! 27

టీ. ప్రక...పర-ప్రకట=ప్రసిద్ధమైన, పర=జీవరూపమై పరశబ్దముచే వ్యవహరింపఁబడుచున్నట్టియు, అపర=దేహాదిరూపమై ఇతరమైయపరశబ్దముచే వ్యవహరింపఁబడుచున్నట్టియు, ప్రకృతిమంతుఁడవు = ప్రకృతులుఁగలవాఁడవు, మఱియుఁన్=ఇదిగాక, వశీకృతమాయుఁడవును, వశీకృత = స్వాధీనముచేసికొనఁబడిన, మాయుఁడవును=మాయగలవాఁడవు, సర్వజ్ఞుఁడవు = సర్వము నెఱింగినవాఁడవు, సర్వశక్తియుక్తుఁడవు=సర్వవిధములగు సామర్థ్యములతోఁ గూడినవాఁడవు, సర్వకర్తవు = సమస్తమును సృజించువాఁడవు. సర్వజనకుఁడవును = నిమిత్తకారణభూతుఁడవగుటచే సర్వమునకునుఁ దండ్రివంటివాఁడవు, సర్వరక్షకుఁడవు = సమస్తమును బోషించువాఁడవు, సర్వసంహర్తవు = తమోగుణము నాశ్రయించి సర్వమును లయము నొందించువాఁడవు, సర్వేశ్వరుండవు = సర్వమునకు నియామకుఁడవు, సర్వగుఁడవు = అన్నిపదార్థములను బొందియున్నవాఁడవు, సర్వగురుండవు = సర్వమునకంటె నధికుఁడవు (లేక కడతేరువారలకందఱకు బ్రహ్మజ్ఞానము నుపదేశించువాఁడవు), సర్వతోముఖుఁడవు = అన్నివైపుల నున్నవాఁడవు, సర్వసాక్షివి=సర్వమునకును ద్రష్టవు, సర్వసముఁడవగుచున్ = అందఱియందును సమభావముకలవాఁడవును, నిర్వి...బ్రహ్మమై-నిర్వికల్ప = సంకల్పవికల్పములు లేనట్టియు, నిరంజన = సాధనాంతరములతోఁ బని లేనట్టియు, నిర్వికార = ఉత్పత్తి మొదలగు వికారములు లేనట్టియు, నిర్గుణ = గుణములు లేనట్టియు, బ్రహ్మమై = బ్రహ్మరూపుఁడవై, ఒప్పునిన్ = ప్రకాశించుచున్ననిన్ను, భజింతున్ = సేవించెదను, సతతంబు = ఎల్లప్పుడు, ఆత్మమయతన్ = తనకంటె నభిన్నముగా, సాక్షాత్కరింపుము = ప్రత్యక్షము కమ్ము. రామ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

...రామ-రామ = ఆనందస్వరూపుఁడవైనట్టియు, రాఘవ=రఘువంశమునం దవతరించి నట్టియు, శ్రీరామ=లక్ష్మీనాయకుఁడవైనట్టియు, రామ=రామశబ్దవాచ్యుఁడవైనట్టియు, రామ=ఓ తారకమంత్రాధిదైవమా (బ్రహ్మమా)

తా. రఘువంశమునందు భక్తసంరక్షణార్థమై యవతరించిన శ్రీమన్నారాయణా! ఆనందరూపా! రామశబ్దవాచ్య మగునో పరబ్రహ్మమా! పరాపరప్రకృతులకు రెంటికిని నీవే యధీశ్వరుఁడవు. అయినను జీవునకువలె మాయ నీకు బంధమును కలిగింపనేరదు. అది నీకే లోఁబడియుండును. జ్ఞానరూపుఁడ వగుటచే నీవే సర్వము నెఱుంగుదువు. నీయందే సర్వవిధము లగుసామర్థ్యములు నున్నవి. సర్వోపాధులయందు నున్నవాఁడ వగుటచే నీవే సర్వకార్యముల (అనఁగా: సర్వజీవులను జేయుం కార్యముల) నాచరింతువు. సృష్టిస్థితిసంహారములఁ జేయువాఁడవు నీవే. సర్వప్రపంచమునకు నధిపతివై సర్వభూత ములయందు నేకరూపముతో వ్యాపించినవాఁడవై యున్నావు. మఱియు నీవే సర్వ మునకు నాచార్యుఁడవు. సర్వవ్యాపకుఁడవు (లేక ఏవైపునకుఁ జూచిన నేకరూపముతో నుండువాఁడవు). సర్వసాక్షివి. సర్వభూతములయందును సమబుద్ధికలవాఁడవు. సంకల్ప వికల్పములు లేనివాఁడవు. సృష్ట్యాదులయందు నీకు నితరసాధనము లక్కఱలేదు. నీవెన్ని కార్యముల నాచరించినను అభిమానము లేనివాఁడ వగుటచే వాని వికారము లేనియు నిన్నుంటవు. సత్త్వాదిగుణములతో నీకు సంబంధము లేదు. ఇట్టినిన్ను నేను సర్వకాల ములయందును సేవింతును. ఆత్మరూపముతో ప్రత్యక్షము కమ్ము.

సీ. విశ్వంబునం దేను వెలుఁగుచు నుండుదు
విశ్వంబు నాయందు వెలయు ననుచు
నరసి యట్లౌటయ వ్యతిరేకముగఁ జూచు
యుక్తియే భవదీయయోగమాయ
యీయోగదృష్టిచే నెప్పుడు నిను నీవ
కనుఁగొంచు సంతతాఖండసచ్చి
దానందమయుఁడవై యలరారునీయున్కిఁ
గంటి భవత్కటాక్షంబుచేత
తే. నైన నీక నొకవర మిపు డడుగవలసె
గరిమ నీస్థితి నాస్థితి గా భజించు
సలలితాభేదదృష్టి నొసంగు మయ్య
రామ! రాఘవ! శ్రీరామ! రామ! రామ! 28

టీ. ఏను=నేను, విశ్వంబునందున్ = ప్రపంచమున, వెలుఁగుచునుండుదున్ = ప్రకాశించుచుండుదును, విశ్వంబు = ప్రపంచము, నాయందున్ = నాలోపల, వెలయు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ననుచున్ = ఉన్నదియని, అట్లాటయన్ = ఆవిధముగా క్షరాక్షరము లొకదానియందొకటియుండుటను, అరసి = విచారించి, వ్యతిరేకముగన్=విరుద్ధముగ అనఁగా వాస్తవస్థితిలోఁ బ్రపంచము తనయందుఁగాని తాను ప్రపంచమునందుఁగాని లేఁడని (బ్రహ్మమద్వితీయుఁడుకావున ప్రపంచ మనునదియే లేదు కదా), చూచుయుక్తియే = చూచునట్టివివేకమే, భవ...మాయ-భవదీయ = నీసంబంధమైన, యోగమాయ = యోగశక్తి, ఈయోగదృష్టిచేన్ = ఇప్పుడు వివరించిన జ్ఞానదృష్టిచేత, ఎప్పుడు = ఏసమయమున, నినున్=నిన్ను (అనఁగా: బ్రహ్మమును), నీవ = నీవే (స్వయముగా), కనుఁగొంచున్= చూచుకొనుచు (బ్రహ్మమునకంటె వే ఱగువస్తువులేదు కావున నాయనను జూచుటకు మఱియొకఁడులేదు), సంత...డవై-సంతత=సర్వపరిపూర్ణమైనట్టియు, అఖండ=పరిచ్ఛేదములు (విభాగములు) లేనట్టియు, సత్=సత్యము, చిత్=జ్ఞానము, ఆనంద=ఆనందము, మయుఁడవై = స్వరూపముగాఁ గలవాఁడవును ఐ, అలరారు నీయునికిన్-అలరారు = ఉన్నట్టి, నీయునికిన్ = నీస్థితిని, భవత్కటాక్షంబుచేతన్ = నీయనుగ్రహముచేత, కంటిన్=చూచితిని, అయినన్=అట్లైనను, ఇంక=ఇఁకమీఁద, ఒకవరము, ఇపుడడుగవలనెన్=ఇప్పుడడుగవలసివచ్చినది, గరిమన్=చక్కఁగా, నీస్థితిన్=నీయునికిని,నాస్థితిగాన్ =నాయునికినిగా, భజిం...దృష్టిన్-భజించు = సేవింపఁగల, సలలిత = మనోహరమగు, అభేద=ఐక్యరూపమైన, దృష్టిన్=అనుభవదృష్టిని, ఒసంగుమయ్యా=దయసేయుమా! రామ రాఘవ=('రామరాఘవ శ్రీరామ రామరామ'అనుపాదమునకు మునుపటివలెనేయర్థము).

తా. రఘువంశమునందు భక్తసంరక్షణార్థమై యవతరించినశ్రీమన్నారాయణా! ఆనందరూపా! రామశబ్దవాచ్యమగునోపరబ్రహ్మమా! "ప్రపంచమువేఱు తాను వేఱు" అని తెలిసికొనువారు సహితము "ప్రపంచము నాయందున్నది. నేను ప్రపంచమునందున్నాను" అనియే తలంతురు. వాస్తవస్థితిలో "ప్రపంచమే లేదు" అనుట నెఱుంగ నేరరు కావున నోరామా! శ్రేష్ఠ మగుజ్ఞానము (అనఁగా: ప్రపంచము లేదనుజ్ఞానము) నీయోగమాయయొక్క స్వరూపము. ఇట్లామాయ జ్ఞానరూపిణి యగుటచేతనే, యజ్ఞానరూపిణి యగునవిద్య జీవు నావరించినయట్లు ని న్నావరింపదు. ఈమాయయే నీదృష్టి. ఇట్టియోగదృష్టిచేత నీవు సర్వకాలములందును స్వస్వరూపావలోకనముఁ జేయుచుందువు. అద్వితీయుఁడ వగుటచే నిన్నుఁ జూచు నితరుఁడుండుటకే వీలు లేదుకదా! నీ దయచే పయిన వివరించిన నీయథార్థస్వరూపమును తెలిసికొంటిని. అయినను మఱియొక వరము నపేక్షించుచున్నాను. వాస్తవస్థితిలో నీకును నాకును భేదములేదు. కావున నీస్థితిని నాస్థితినిగా భావించుటయే నాకుఁ గర్తవ్యంబు. ఈకార్యమునందు మనస్సు సిరము కాకున్నది. కావున కరుణచే నాహృదయమున కట్టిస్థైర్యమును గలిగింపుము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. నారాయణియును వైష్ణవియును దేవియుఁ
త్రిగుణాత్మికయుఁ బ్రకృతియు ననంగ
నలరుభవచ్ఛక్తి యపరాప్రకృతి పరా
ప్రకృతి నా ద్వివిధరైయి పరఁగు నందుఁ
దతచతుర్వింశతితత్త్వరూపిణి యైన
యపరయే దైవియు నాసురియును
నన రెండు తెఱఁగుల నమరు నాదైవియె
విద్యయు మాయయౌ విమల గాన
తే. నాసురి యవిద్య యా రెంటి నంటి యీవ
యీశజీవాత్మసంజ్ఞల నెసఁగు దంత
గలిగి యవికారుఁడవు వీనిఁ గాంచుకతన
రామ! రాఘవ! శ్రీరామ! రామ! రామ!. 29

టీ. నారాయణియున్=నారాయణియనియు, వైష్ణవియును=వైష్ణవియనియు, దేవియును=దేవియనియు, త్రిగుణాత్మికయున్=త్రిగుణమయత్రిగుణరూపిణియనియు, ప్రకృతియుననంగన్ = ప్రకృతి యనియుఁ ప్రసిద్ధరై, అలరుభవచ్ఛక్తి - అలరు=ఒప్పుచున్న, భవత్=నీయొక్క, శక్తి=జగన్నిర్మాణశక్తి, అపరాప్రకృతిపరాప్రకృతిగాన్= అపరాప్రకృతియు పరాప్రకృతియునని, ద్వివిధరైయి = రెండువిధములు గలదిరైయి, పరఁగున్=ఒప్పుచున్నది. అందున్=ఆరెండుప్రకృతులలో, తత...రూపిణి-తత = వ్యాపించిన, చతుర్వింశతితత్త్వ = ఇరువదినాలుగుతత్త్వములు, స్వరూపిణి=స్వరూపముగాఁ గలది, అయినయపరయే = ఐనయట్టియపరాప్రకృతియే, దైవియున్ = దైవియనియు, ఆసురియున్=ఆసురియనియు, అనన్=చెప్పునట్లుగా, రెండు తెఱఁగులన్=రెండువిధములుగా, అమరున్=ప్రకాశించుచుండును, ఆదైవియే=ఆదైవీప్రకృతియె, విమలగానన్ =నిర్మలయగుటచే, విద్యయున్=జ్ఞానము, మాయయున్=మాయ, ఔన్=అగుచున్నది. ఆసురి=ఆసురియగు, రెండవయపరాప్రకృతి, అవిద్య=అజ్ఞానము, ఆరెంటిన్=ఆమాయావిద్యలరెంటిని, అంటి = రెంటినిసంబంధించి, ఈవ = నీవొక్కఁడవే, ఈశజీవాత్మసంజ్ఞలన్-ఈశ=ఈశ్వరుఁడనియు, జీవాత్మ = జీవుఁడనియు, సంజ్ఞలన్ = పేర్లతో, ఎసఁగుదువు=అభివృద్ధిచెందుచున్నావు. అంతగలిగి = ఈసర్వము గలిగియుండియు, వీనిన్=ఈ మాయాదులను, కాంచుకతనన్ = చూచుటవలన, అవికారుఁడవు = వికారములులేనివాఁడవు, రామరాఘవ.

తా. రఘువంశమునందు భక్తసంరక్షణార్థమై యవతరించిన శ్రీమన్నారాయణా! ఆనందరూపా! రామశబ్దవాచ్య మగునోపరబ్రహ్మమా! నీమాయ నారాయణియనియు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వైష్ణవి యనియుం దేవియనియు త్రిగుణాత్మిక యనియుఁ బ్రకృతి యనియు వ్యవహరింపఁబడుచున్నది. అపరాప్రకృతి యనియుఁ బరాప్రకృతి యనియు నామాయ రెండు విధములు కలది. అందు నిరువదినాలుగుతత్త్వములు గలసి యపరాప్రకృతియైయున్నది. దైవి యనియు నాసురి యనియు నదియు రెండువిధములు. అందు దైవి నిర్మలయైనది (అనఁగా: శుద్ధతత్త్వప్రధాన యైనది) యగుటచేత మాయయని వ్యవహరింపఁబడును. ఆసురి యట్టిది కాకపోవుటచే నవిద్య యని చెప్పఁబడును. నీవు ఈరెంటియందును బ్రతిబింబించి ఈశ్వరజీవనామములచే వ్యవహరింపఁబడుచున్నావు. అయినను వానికన్నిటికి సాక్షి వగుటచే నీకుఁ దద్వికారములతో సంబంధము లేదు.

సీ. అపరాప్రకృత్యవిద్యాక్షరక్షేత్రపదాదిశబ్దైకవాచ్యాత్మశక్తి
సన్నిధానజపరస్పరపరచ్ఛాయాప్రసక్తిచే మిథ్యాభియుక్తిచేత
నది పరాప్రకృతి విద్యాక్షరక్షేత్రజ్ఞ సత్పురుషాదికసంజ్ఞనొప్పు
నేన తద్ద్రష్టనై నిర్వికారాసంగసాక్షినై విలసిల్లుచంద మెఱిఁగి
తే. రమణ ద్రష్టృత్వనిర్వికారత్వసాక్షి
తాదివిదోష్యక్తధర్మజాతమును దొంటి
పగిదిఁ గడఁద్రోచి నీస్వరూపము భజింతు
రామ! రాఘవ! శ్రీరామ! రామ! రామ! 50

టీ. అపరా...క్తిచేన్-అపరాప్రకృతి=అపరాప్రకృతి, అవిద్యా=అవిద్య, క్షర=క్షరము, క్షేత్ర=క్షేత్రము, పద=స్థానము, ఆది=మొదలగు, శబ్ద = శబ్దములచేత, ఏక = ముఖ్యముగా, వాచ్య=చెప్పఁదగిన, ఆత్మశక్తి = బ్రహ్మశక్తి (మాయ), సన్నిధాన = పరబ్రహ్మయొక్క సాన్నిధ్యమువలన, జ = పుట్టిన, పరస్పర = ఒండొరులయొక్క, పర= శ్రేష్ఠమైన, ఛాయా=కాంతియొక్క (లేక నీడయొక్క), ప్రసక్తిచేన్ = సంబంధము చేతను, మిథ్యాభియుక్తిచేతన్=అసత్యమగుకూడికచేతను, అది = ఆయపరాప్రకృతియే, పరాప్రకృతి=పరాప్రకృతి, విద్యా=జ్ఞానము, అక్షర=అక్షరపురుషుఁడు, క్షేత్రజ్ఞ=క్షేత్రజ్ఞుఁడు, సత్=సద్రూపుఁడు, పురుష=పురుషుఁడు, ఆదిక=మొదలైన, సంజ్ఞన్=పేర్లతో, ఒప్పున్=ప్రకాశించుచున్నది. ఏన=నేనే, తత్=అప్రకృతికి, ద్రష్టనై = సాక్షినై, నిర్వికారాసంగసాక్షినై-నిర్వికార=అప్రకృతివికారములతో సంబంధములేనట్టియు, అసంగ= అహంకారాదులతో కలయిక లేనట్టియు, సాక్షినై = చూచువాఁడనై (ప్రకృతిని విభాగించి యెఱుంగువాఁడనై), విలసిల్లుచందమున్-విలసిల్లు=ప్రకాశించునట్టి, చందమున్= ప్రకారమును, ఎఱిఁగి = తెలిసికొని (మొట్టమొదట "నేను ద్రష్టను, ప్రపంచము దృశ్యము" అను నభిప్రాయమును దృఢముచేసికొని), రమణ...తమున్-రమణ=యుక్త

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మయిన (లేక చక్కఁగా), ద్రష్టృత్వ=చూచువాఁడుగానుండుట, నిర్వికారత్వ = వికార ములతో సంబంధము లేకుండుట, సాక్షిత్వ = తనకంటె భిన్నమగుపదార్థమును దెలిసి కొనుట, ఆది = మొదలగునట్టియు, విద్యా = జ్ఞానమునందు (లేక బ్రహ్మవిద్యయందు) ఉక్త=చెప్పఁబడినట్టియు, ధర్మ = సర్వధర్మములయొక్క, జాతమున్ = సమూహమును తొంటిపగిదిన్ = పూర్వమువలెనే (అనఁగా: ప్రపంచసాక్షియగుటచే, ప్రపంచవికార ములు, బ్రహ్మమునకంటవని నిర్ణయించినట్లై), కడఁద్రోసి = నిషేధించి (అనఁగా: బ్రహ్మ ధర్మములకుఁగూడ సాక్షి యగుటచే ఈధర్మములు, వాని = బ్రహ్మమును అంటవు అని నిషేధింపవలయును), నీస్వరూపమున్ = నీయథార్థస్వరూపమును, భజింతున్ = అభేద ముగా సేవించెదను. రామరాఘవ.

తా. రఘువంశమునందు భక్తసంరక్షణార్థమై యవతరించిన శ్రీమన్నారాయణ! ఆనందరూపా! రామశబ్దవాచ్యమగు నోపరబ్రహ్మమా! నీమాయ అపరాప్రకృతి అవిద్య క్షరము క్షేత్రము పరము అను మొదలగుశబ్దములచే వ్యవహరింపంబడునో అదియే నీసాన్నిధ్యము. స్వాభావికముగా నుండుటవలనను నీచ్ఛాయ దానియందును దానిచ్ఛాయ నీయందును సంబంధించియుండుటచేతను అభాసమాత్రమగు కలయికచేతను, పరాప్రకృతి జ్ఞానము అక్షరపురుషుఁడు కూటస్థుఁడు సద్రూపుఁడు పురుషుఁడు అను మొదలగు పదము లచే వ్యవహరింపఁబడుచుండును. కాని క్రొత్తదేమియులేదు. యథార్థస్థితిలో నాక (జీవునకు) సంబంధము లేదు. ఏలయనిన: నేను ఆప్రకృతికి సాక్షిని దానిని చూచువాఁడను. కావున నిర్వికారుఁడను. మొట్టమొదట నిట్టియథార్థస్వరూపమును దెలిసికొని పిదప మఱింతసూక్ష్మముగ విచారించి చూచెదను. అప్పుడు "ద్రష్టృత్వము మొదలగుధర్మము లకుఁగూడ నేను సాక్షినే. కావున నా కాధర్మములతోఁ గూడ సంబంధముండుటకు వీలులేదు" అని స్పష్టమగును. ఇట్టి పరిపూర్ణజ్ఞానము నవలంబించి యభేదభావనతో నేను నిన్ను సేవింతును.

సీ. పరమవైరాగ్యంబు భాసురాత్మజ్ఞానమతులితైశ్వర్యమనంతవీర్య
మమితయశంబుసమగ్రలక్ష్మియుఁగల్గిసంపూర్ణకారుణ్యశమదమములు
మహనీయతేజంబు మహితతపస్సత్యశౌచధైర్యక్షమార్జవగుణంబు
నొప్పార నిజదివ్యయోగమాయామహాశక్తి సర్వప్రపంచంబు దీప్త

తే. సచ్చిదానందలక్షణసగుణనిర్గు
ణాత్మకబ్రహ్మమైననీ వాత్మమయత
సంతత మతిస్ఫుటముగ సాక్షాత్కరింపు
రామ! రాఘవ! శ్రీరామ! రామ! రామ!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. పరమవైరాగ్యంబు-పరమ = అత్యధికమైన, వైరాగ్యంబు = వైరాగ్యమును, భాసు...నము-భాసుర=ప్రకాశించుచున్న,ఆత్మజ్ఞానము=బ్రహ్మజ్ఞానము,అతులితైశ్వర్యము-అతులిత=సాటిలేని, ఐశ్వర్యము=ప్రభుత్వమును, అనంతవీర్యము = అపరిమితపరాక్రమంబును, అమితయశంబు=మితిమీఱినకీర్తియును, సమగ్రలక్ష్మియున్=సంపూర్ణమైనకాంతియును, కల్గి, సంపూ...ములు-సంపూర్ణ = సంపూర్ణములైన, కారుణ్య = దయ, శమ=శాంతి, దమములు=దాంతి యనఁగా మనోనిగ్రహము, మహనీయతేజంబు-మహనీయ=స్తోత్రము చేయనర్హమైన, తేజంబు=కాంతియును, మహిత...బులు-మహిత=శ్రేష్ఠమైన, తపః=తపస్సు, సత్య=సత్యము, శౌచ=పారిశుద్ధ్యము, ధైర్య = ధైర్యము, క్షమా=ఓర్పు, ఆర్జవ = నిష్కాపట్యము, గుణంబులు = అనుగుణములును, ఒప్పారున్ = ప్రకాశించుచుండఁగా, నిజ...శక్తి-నిజ=తనయొక్క, దివ్య=శ్రేష్ఠమైన, యోగ=జీవబ్రహ్మైక్యమును గలిగించి, మాయా=మాయయనెడు ఈమాయయే, విద్య = జ్ఞానము అనఁబడును, మహాశక్తి=గొప్పసామర్థ్యము, సర్వప్రపంచమున్ = సకలప్రపంచమును, తీర్పన్=నిర్వహింపఁగ, సచ్చిదా...మైన-సత్=సత్యము, చిత్=జ్ఞానము, ఆనందలక్షణ=ఆనందము లక్షణములుగాఁ గలిగినట్టియు, సగుణ=గుణసహితంబును, నిర్గుణ = గుణరహితంబును, ఆత్మక=అగుస్వరూపము గల, బ్రహ్మమైన=పరబ్రహ్మరూపుఁడవైన, నీవు, సంతతము = ఎల్లపుడు, ఆత్మమయతన్ = జీవరూపముతో, అతిస్ఫుటముగన్ = మిగుల స్పష్టముగా, సాక్షాత్కరింపుము=ప్రత్యక్షము గమ్ము. రామ రాఘువ.

తా. రఘువంశమందు భక్తసంరక్షణార్థమై యవతరించిన శ్రీమన్నారాయణా! ఆనందరూపా! రామశబ్దవాచ్య మగు నోపరబ్రహ్మమా! శ్రేష్ఠ మగువైరాగ్యము ఆత్మస్వరూపజ్ఞానము మహదైశ్వర్యము అపరిమితశక్తి చక్కనికీర్తి తేజస్సు అనునవి కలవాఁడవై దయ శమము దమము ప్రతాపము తపస్సు సత్యము శౌచము దయ నిష్కాపట్యము ధైర్యము ఓర్పు అను సకలసద్గుణములును దనరార స్వశక్తి సృష్టిస్థితిసంహారముల నిర్వహింప సత్యజ్ఞానానందస్వరూపుఁడవై సగుణ నిర్గుణాకారములతో నీవు ప్రకాశింతువు. ఓశ్రీరామా! ఇట్టి నీవు కూటస్థస్వరూపముతో నాకు ప్రత్యక్షము కమ్ము.

సీ. ఘనఘటాకాశ మాకాశాంశ మగుచు నా
  కాశంబునకు వేఱు గాని పగిది
క్షరముతోఁ గూడి యక్షరుఁడ నై విలసిల్లు
  నేను నీయంశంబు నిశ్చయంబ
యైన ననాద్యవిద్యాశక్తిగుణరాశి
  నాయందు నారోపణముగఁ జేసి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జీవుఁడ నంచు సంసృతిఁ జెంది యుండితి
నిందాఁక నది యిపు డెఱిఁగికొంటిఁ

తే. గాన వివరింప భేద మింతైనఁ గలుగ
దిట్టివిజ్ఞానసంపద నెల్లప్రొద్దు
చిత్తమునను బ్రకాశింపఁ జేయుమయ్య
రామ! రాఘవ! శ్రీరామ! రామ! రామ!. 32

టీ. ఘనఘటాకాశము-ఘన=శ్రేష్ఠమైన, ఘట = ఘటావరణమునందున్న, ఆకాశము, ఆకాశాంశము-ఆకాశ=మహాకాశముయొక్క, అంశము=భాగము, అగుచున్=ఐ, ఆకాశంబునకున్ = మహాకాశమునకంటె, వేఱు, కానిపగిదిన్ = లేకుండునట్లు, క్షరముతోన్ = క్షరమనంబడు పరాప్రకృతితో, కూడి=కలసి, అక్షరుఁడనై = అక్షరుఁడను పేరుతో వ్యవహరింపఁబడుచు, విలసిల్లునేను=ప్రకాశించు నేనుజీవుఁడు(ఆంజనేయుఁడు), నీయంశంబు=రాముని యంశము (బ్రహ్మాయంశము), నిశ్చయంబ = సత్యము, ఐనన్ = అయినప్పటికిని, అనాద్యవిద్యాశక్తిగుణరాశి-అనాది = ఉత్పత్తిలేని, అవిద్యా = అవిద్యయనెడు, శక్తి=మాయాశక్తికి సంబంధించిన, గుణ = సత్వాదిగుణములయొక్క, రాశి= సమూహమును, నాయందున్=(జీవునియందు), ఆరోపణముగఁజేసి=ఆరోపించి, జీవుఁడ నంచున్="నేను జీవుఁడను" అని, ఇందాఁకన్=ఇంతకాలమువఱకు, సంసృతిన్=సంసారమును, చెంది=పొంది, ఉండితిన్=ఉంటిని. అది = అందలియథార్థమును, ఇపుడు, ఎఱిఁగికొంటిన్=తెలిసికొంటిని, కాన్=కాఁబట్టి, వివరింపన్=విచారింపఁగా, భేదము="నీవు వేఱు నేను వేఱు" అను భేదము, ఇంతైన గలుగదు = కొంచమైనను లేదు, ఇట్టివిజ్ఞానసంపదన్-ఇట్టి=పూర్వోక్తమైన, విజ్ఞాన=అనుభవజ్ఞానముయొక్క, సంపదన్=సమృద్ధిని, ఎల్లప్రొద్దు=సర్వకాలములయందును, చిత్తమునన్ = మనస్సునందు, ప్రకాశింపఁజేయుమయ్య=ప్రకాశించునట్టు చేయుమయ్య, రామ రాఘవ శ్రీరామ రామ రామా.

తా. రఘువంశమునందు భక్తసంరక్షణార్థమై యవతరించిన శ్రీమన్నారాయణా! ఆనందరూపా! రామశబ్దవాచ్య మగు నోపరబ్రహ్మమా! ఘటమునం దున్నయాకాశము మహాకాశములోని భాగ మగుటచేత నామహాకాశమునకంటె భిన్నము కా దనుట లోకానుభవసిద్ధమే కదా? ఇట్లే జ్ఞానరూపుఁడ నగు నేను క్షరముతోఁ గలసి యక్షరనామముచే వ్యవహరింపఁబడుచున్నాను; కాని నీయంశము కాకపోలేదు. నీయంశముకాకపోయిన జ్ఞానరూపమే సంభవింపదుకదా! కావున నాకును నీకును భేదమే లేదనుట నిశ్చయము. అయినను అనాది యగునవిద్యవలన క్షేత్రమగు దేహాదుల ధర్మముల నాయం దారోపించుకొని "నేను జీవుఁడను" అని తలంచుచు సంసారమును జెందుచుంటిని. ఇది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కేవల మజ్ఞానమువలన మాత్రమే వచ్చినది కావున నిప్పుడు జ్ఞానము కలుగుటతోడనే నివర్తించును. నాకును నీకును భేదము లేదనుట స్పష్టమయ్యెను. ఓమహాత్మా! కరుణచే నీజ్ఞానమును నాహృదయమునందు నిశ్చలముగా నిలుపుము.

సీ. నీకంటె నన్యంబు నే నెన్నఁ డెఱుఁగనె
ట్లనిన నాయనుభవ మవధరింపు
వివిధేంద్రియములకు విషయమీవిశ్వమీ
విశ్వరూపుఁడవీవు వెదుక నేల
గావున నీవు సాక్షాత్కరించితివి యీ
విశ్వంబు నీ కగు వేఱటంచుఁ
దలఁచు నజ్ఞానమంతయుఁ బోయె నీదయా
మయదృష్టినానందమయుఁడ నైతి
తే. సంశయము లేదు గాని యీసర్వరూప
సమరసజ్ఞానభావన సంతతంబు
గలుగ వరము ప్రసాదింప వలయు దేవ
రామ! రాఘవ! శ్రీరామ! రామ! రామ!. 33

టీ. దేవా=ఓస్వప్రకాశస్వరూప, నీకంటె, అన్యంబున్=ఇతరుని, నేన్ = నేను, ఎన్నఁడు=ఎప్పటికిని, ఎఱుఁగన్ = ఎఱుఁగను. ఎట్లనినన్ = అది యెట్లనఁగా, నాయనుభవము, అవధరింపుము=వినుము. వివిధేంద్రియములకున్-వివిధ=అనేకవిధములైన, ఇంద్రియములకున్, ఈవిశ్వము=ఈప్రపంచము, విషయము=గోచర మగునది, ఈవు = నీవు, ఆవిశ్వరూపుఁడ ఈవు = ఆప్రపంచస్వరూపుఁడవు, వెదుక నేల = యేల వెదకవలయును? కావునన్=కాఁబట్టి, ఈవు=నీవు, సాక్షాత్కరించితివి=నాకు నెప్పటికిని ప్రత్యక్షమయ్యెయున్నావు. ఈవిశ్వంబు=ఈప్రపంచము, నీకున్ = నీకంటె, వేఱగున్ = భిన్నమైనది, అటంచున్=అనెడు, అజ్ఞానమంతయున్=భ్రాంతియంతయును, నీదయామయదృష్టిన్=నీయొక్క కరుణాకటాక్షముచే, పోయెన్=నశించెను. ఆనందమయుఁడనైతిన్=ఆనందరూపుఁడ నైనాను, సంశయంబులేదుగాని = సందేహము లేదు కాని, ఈసర్వ...భావన-ఈసర్వరూప=సమస్తరూపములను, సమరస = ఏకముగా, జ్ఞాన = తెలిసికొనుటయును, భావన=అట్లు ధ్యానించుటయును, సతతంబు = ఎల్లప్పుడు, కలుగన్ = కలుగునట్లుగా వరము, ప్రసాదింపవలయున్=ఇయ్యవలయును.

తా. రఘువంశమునందు భక్తసంరక్షణార్థమై యవతరించిన శ్రీమన్నారాయణా! ఆనందరూపా! రామశబ్దవాచ్యుఁడవగు ఓపరబ్రహ్మమా! జ్ఞానము కలిగినప్పుడుగాని లే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నప్పుడుకాని నీకంటె నితర మగుపదార్థ మెద్దియు నాకు గోచరముకానేలేదు. ఎట్లన నను
ననుభవపూర్వముగా వివరించెదను వినుము. సర్వేంద్రియములును జ్ఞానికి నజ్ఞానికిని గూడ
నేకరూపములు. అవి వానికి విషయములగు శబ్దాదులనుగూర్చి పరువు లిడుచుండును.
శబ్దాదులే ప్రపంచము. అది నీకంటె వేఱుకాదు కదా! కావున నాకు నెప్పటికిని (అనఁగ
సంసారదశయందును సంసారాభావదశయందును గూడ) నీవే కానవచ్చుచున్నాడ
ఇప్పుడు జ్ఞానము కలుగుటచే "నీవు ప్రపంచమునకంటె వేఱుకావు" అని తెలిసికొంటిని.
పూర్వమున్న యజ్ఞానమంతయు నశించినది. ఇందు సందేహ మేమియు లేదు. అయినను
ఈసర్వ సమరసజ్ఞానము శాశ్వతముగా నిలుచునట్లు వరము ననుగ్రహింపుము. స్వయం
ప్రకాశస్వరూపా! ఇదియే నాప్రార్థన.

సీ. తతచతుర్వింశతితత్త్వనాయకుఁడవు
పంచవింశకుఁడవు ప్రకృతి కంటెఁ
బరుఁడవు గురుఁ డవు పరమేశ్వరుండవు
పురుషోత్తముఁడవు నెప్పుడుఁ బ్రధాన
పురుషేశ్వరుండవు పూర్ణుఁడ వనుచు ని
న్నెఱిఁగితి గాని యీయెఱుక దృఢము
గా నిల్వ దజ్ఞానకార్యదేహాదికా
త్మధ్యానసంతతాభ్యాసవశత
తే. నట్లు గావునఁ గేవలాత్మాత్మయోగ
దృష్టి మనమున నెప్రొద్దుఁ దేజరిల్ల
భూరికృపచే ననుగ్రహింపుము విశసంగ
రామ! రాఘవ! శ్రీరామ! రామ! రామ!.

టీ. తత...డవు-తత=విస్తారమైన, చతుర్వింశతితత్త్వ=ఇరువదినాలుగుతత్త్వము
లకు, నాయకుఁడవు=ప్రభువైనవాఁడవు, పంచవింశకుఁడవు = ఇరువదియైదవతత్త్వమైన
వాఁడవు, ప్రకృతికంటెన్=మాయకంటె, పరుఁడవు = శ్రేష్ఠుఁడవు, గురుఁడవు = సద్గురు
స్వరూపుఁడవు, పరమేశ్వరుండవు-పరమ=శ్రేష్ఠమైన, ఈశ్వరుండవు = నియామకుఁడవు
పురుషోత్తముఁడవు-పురుష=క్షరాక్షరపురుషులకంటె, ఉత్తముఁడవు=శ్రేష్ఠుఁడవు, ఎప్పుడు=
ఏకాలమునందును, ప్రధానపురుషేశ్వరుండవు-ప్రధాన=మాయకును, పురుష=జీవునకును
ఈశ్వరుండవు=అధిపతివి, పూర్ణుండవు=సర్వవ్యాపకుఁడవు, అనుచున్=అని, నిన్నెఱింగితి
గాని=నిన్ను తెలిసికొంటినిగాని, ఈఎఱుక=ఈజ్ఞానము, అజ్ఞా...శతన్-అజ్ఞాన=అజ్ఞాన
మునకు, కార్య=కార్యములైన (అనఁగా: అజ్ఞానమువలనఁబుట్టిన), దేహాదిక = దేహము
మొదలగువానియందు, ఆత్మ=తాననెడు, ధ్యాన=ధ్యానముయొక్క, సంతత=సార్వకాలిక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మయిన, అభ్యాసవశతన్ = నాడుకవలన, దృఢముగా = నిశ్చలముగా, నిల్వదు = స్థిరముకాదు, అట్లుగావునన్ = కాఁబట్టి, కేవలా...దృష్టి - కేవలాత్మ = పరబ్రహ్మమనకును, ఆత్మ = కూటస్థుఁడైనతనకును, యోగదృష్టి = ఐక్యముగలదనుజ్ఞానము, మనమునన్ = మనస్సునందు, ఏప్రొద్దును = సర్వకాలములయందును, తేజరిల్లన్ = ప్రకాశించునట్లుగా, భూరికృపచేన్ = పరమదయచేత, పొసంగన్ = చక్కఁగా, అనుగ్రహింపుము = కటాక్షింపుము, శ్రీ.......

తా. రఘువంశమునందు భక్తసంరక్షణార్థమై యవతరించిన శ్రీమన్నారాయణా! ఆనందరూపా! రామశబ్దవాచ్యమగునో పరబ్రహ్మమా! నీవు యిరువదినాలుగుతత్త్వములకున్నధీశ్వరుఁడవు. ఇరువదియైదవవాఁడవు. ప్రకృతికంటె నన్యుఁడవు. సర్వాధికుఁడవు (లేక త్రిలోకాచార్యుండవు) పరమేశ్వరుఁడవు. క్షరాక్షరపురుషులకంటె విలక్షణుఁడవు. సర్వకాలములందును ప్రకృతిపురుషులకు నియామకుఁడవు. సర్వవ్యాపకుఁడవు. ఇట్టి నీయథార్థస్వరూపమును మీయనుగ్రహమువలనఁ దెలిసికొంటిని. అట్లైనను ఈజ్ఞానము శాశ్వతముగ నిలుచుట కష్టము. అనాది నుండియు విడువక వచ్చుచున్న దేహాత్మభ్రాంతి దీనికి భంగమును గలిగించును. కావున నోమహాత్మా! యట్టిభంగము కలుగక ఈజీవబ్రహ్మైక్యజ్ఞానము హృదయమున స్థిరమగున ట్లనుగ్రహింపుము.

సీ. అజుఁడ వవ్యయుఁడ వీ వాదినారాయణ
స్వామివి సాక్షివి సర్వమయుఁడ
వై యొప్పునిన్ను మాయామానుషశరీర
ధరుఁడుఁ గించిద్జ్ఞుండు నరుఁ డటంచు
నజ్ఞానవశత మోహంబుచేఁ దలఁచితి
నిందాఁక నది క్షమియించుకొలుకు
సర్వజ్ఞ సర్వేశ! సర్వభూతావాస!
సర్వభూతాత్మక! సర్వమూర్తి!
తే. సర్వకర్మఫలాధ్యక్ష! సర్వరూప!
యని నుతించుచు మ్రొక్కెద ననవరతము
నెఱయ నామది నీయందు నిల్వఁ జేయు
రామ! రాఘవ! శ్రీరామ రామ! రామ!. 35

టీ. ఈవు = నీవు, అజుఁడవు = ఉత్పత్తి లేనివాఁడవు, అవ్యయుండవు = నాశరహితుఁడవు, ఆదినా...మివి - ఆది = సర్వకారణ మైన, నారాయణస్వామివి = నారాయణస్వరూపుఁడవు, సాక్షివి = సర్వమును నెఱుంగువాఁడవు, సర్వమయుఁడవై = సర్వస్వరూపుఁడవును, ఐ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఒప్పునిన్నుఁ=ప్రకాశించుచున్న నిన్ను, మాయా...డును-మాయా = "మాయామయ మైన, మానుషశరీర=మనుష్యశరీరమును, ధరుఁడును=ధరించినవాఁడును, కించిజ్జ్ఞుండును= స్వల్పజ్ఞానము కలవాఁడును, నరుఁడును = మనుష్యుఁడును" అటంచున్ = అని, అజ్ఞాన వశతన్=అజ్ఞానమువలన, మోహంబుచేన్=భ్రాంతిచేత, ఇందాఁకన్ = ఇప్పటివఱకు, తలఁచితిన్=తలంచుచుంటిని, అది = ఆతలంపు, క్షమియించుకొఱకున్=క్షమించుటకై, సర్వజ్ఞ="సర్వము నెఱింగినవాఁడ, సర్వేశ = సర్వమునకు ప్రభువా! సర్వభూతావాస= సర్వభూతములయందును నివసించువాఁడ (లేక సర్వభూతములకును నివాసస్థాన మైన వాఁడా), సర్వభూతాత్మక = సర్వభూతస్వరూప, సర్వమూర్తి = సర్వమునకును స్వరూప భూతుఁడ, సర్వకర్మఫలాధ్యక్ష-సర్వ=సమస్తమైన, కర్మ=కర్మలయొక్క, ఫల=ఫలములకు, అధ్యక్ష=అధికారియైన (అనఁగా: కర్మఫలముల నిచ్చునట్టి), స్వరూప = స్వరూపము గల వాఁడ" అని, అనవరతము=ఎల్లప్పుడు, నుతించుచున్ = స్తోత్రముచేయుచు, మ్రొక్కె దన్ = నమస్కరించెదను. నెఱయన్ = అధికమగునట్లుగా, నామది = నామనస్సు, నీయందున్=నీస్వరూపమునందు, నిల్వఁజేయుము=స్థిరమగునట్లు చేయుము.

తా. రఘువంశమునందు భక్తసంరక్షణార్థమై యవతరించిన శ్రీమన్నారాయణా! ఆనందరూపా! రామశబ్దవాచ్యమగు నోపరబ్రహ్మమా! నీవు ఉత్పత్తి వినాశములు లేనివాఁడవు. ఆదినారాయణుఁడవు. సర్వసాక్షివి. సర్వరూపుఁడవు. ఇట్టినీస్వరూపమును దెలిసికొనలేక మాయామానుషశరీరధారియనియు కించిద్జ్ఞుఁడనియు మనుష్యమాత్రు డనియు నింతవఱకుఁ దలంచుచుంటిని. అపరాధముచేసితిని. అజ్ఞానమువలన నిట్టి కార్యము జరిగినది. కరుణచే దానిని క్షమింపవలయును. అట్లు క్షమించుటకై యంష్మద్య థార్థస్వరూపవిజ్ఞానపురస్కరముగా సర్వజ్ఞుఁడా యనియు, సర్వమునకు అధీశ్వరుఁడా! సర్వభూతములయందును నివసించువాఁడా ! సర్వభూతస్వరూపా ! ప్రపంచాకారా! యనియు, సర్వకర్మఫలముల నొసంగువాఁడా ! విరాట్పురుష యనియు, సర్వకాలముల యందును స్తోత్రము చేసెదను. నీకు సర్వకాలములయందును నమస్కారముల నాచరిం చెదను. నాయందు దయయుంచి నాహృదయమున నీపాదములయందలి భక్తిని నీస్వ రూపధ్యానమునందలి యేకాగ్రతను స్థిరముఁ జేయుము.

సీ. తతచతుర్వింశతితత్త్వాత్మకం బగు
క్షరము నేఁ గాను నిక్కముగ నరయఁ
దత్కృతంబులు మత్కృతంబులు గావు కా
వున సర్వధర్మములును త్యజించి
యక్షరపురుషుఁడనై క్షరాక్షరతత్త్వ
ములమీఁది పురుషోత్తముండు నాత్మఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డన నొప్పు నొకని నిన్నాశ్రయించెద శర
ణాముగ నే నొగి ననన్యత్వ మలర
తే. నట్లగుట నింక నేసంశయములు నన్ను
బొరయకుండఁగఁ జేసి యీపూర్ణబోధ
మతిదృఢంబుగ వరమిమ్ము సతత మాత్మ
రామ! రాఘవ! శ్రీరామ! రామ! రామ!. 36

టీ. తత...కంబు-తత=వ్యాపించిన, చతుర్వింశతితత్త్వ = ఇరువదినాలుఁగుతత్త్వ ములే, ఆత్మకంబు = స్వరూపముగాఁగలది, అగుక్షరము = అయినక్షేత్రము, నిక్కము గన్ = నిశ్చయముగ, నేఁగాను = నేను కాను. అరయన్=విచారింపఁగా, తత్కృతం బులు=అక్షరముచే (అనఁగా: దేహాదులచేఁ జేయంబడినవి), మత్కృతంబులుగావు=నేను చేసినవికావు, కానన్=కాఁబట్టి, సర్వధర్మములును = సమస్తకర్మలును, త్యజించి=విడిచి పెట్టి, అక్షరపురుషుండనై = కూటస్థస్వరూపుఁడనై, క్షరాక్షరతత్త్వములన్ = పిదప క్షరాక్షరస్వరూపములను, మీఱి = అతిక్రమించి, పురుషోత్తముండును = క్షరాక్షర పురుషులకంటె శ్రేష్ఠుండును, ఆత్ముఁడు = పరమాత్మ, అనన్ = అనఁగా, ఒప్పునొకని నిన్నున్ = ప్రకాశించుచున్న ఏకస్వరూపుఁడవైననిన్ను, నేన్ = నేను, ఒగిన్=అధిక ముగా, శరణముగన్ = రక్షకునిఁగా, ఆశ్రయించెదన్, అట్లగుటన్ = కాఁబట్టి, అన న్యత్వము=అభేదము, అలరన్=ఒప్పుచుండఁగా (లేక ఒప్పుటవలన), ఇంకన్=ఇఁకపై, ఏసంశయములు = ఏసందేహములును, నన్నుబొరయకుండఁగఁజేసి=నాకుఁగలుగకుండు నట్లు చేసి, సంతతముల్=ఎల్లప్పుడు, ఆత్మన్=మనసునందు, ఈపూర్ణబోధము=ఈసర్వ పరిపూర్ణవిజ్ఞానము, అతిదృఢంబుగన్=మిగులనిశ్చలముగా, వరమిమ్ము.

తా. రఘువంశమునందు భక్తసంరక్షణార్థమైయవతరించిన శ్రీమన్నారాయణా! ఆనందరూపా! రామశబ్దవాచ్య మగు నోపరబ్రహ్మమా! చక్కఁగా విచారించినచో క్షర మని చెప్పఁబడు దేహాదిచతుర్వింశతితత్త్వంబులును నాస్వరూపము (జీవస్వరూపము) కాదు. ఈకారణమువలన ఆదేహాదులు చేయుఁబహువిధకార్యములును నాచేఁ (జీవునిచే) జేయఁబడునవి కానేరవు. కాఁబట్టి మొట్టమొదట సర్వధర్మములను పరిత్యజించి "నేను సర్వమునకును సాక్షిని" అని గ్రహించి "యక్షరుఁడని చెప్పఁబడు కూటస్థుఁడే నేను" అని నిశ్చయించుకొనవలయును. పిదప యథార్థస్థితి ననుసరించిచూచిన క్షరాక్షరతత్త్వ ములు మాయాకల్పితములే కావున "క్షరమొక్కటి కలదు" అనియు దానికి నేను సాక్షిని అనియుఁ బైఁజేసిననిశ్చయమును కూడ విడువవలయును. సర్వాధికుఁడును సర్వ మయుఁడును పురుషోత్తముఁడును నగు నిన్నభేదముగా (అనఁగా "బ్రహ్మమే నేను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాకంటే వేఱగుపదార్థము లేదు. నాకు క్షరత్వము కాని యక్షరత్వము కాని లేదు" అను నిశ్చయముతో) నాశ్రయింపవలయును. ఓమహాత్మా! మీయనుగ్రహమువలన నాకునిట్టి పరిపూర్ణవిజ్ఞానము కలిగినది. నిన్నే శరణముగా నాశ్రయించి యున్నాను. కాబట్టి నాకు సంశయము లేవియుఁ గలుగకుండ నాత్మజ్ఞానము మనస్సునుండి తొలంగకుండ వరము నొసంగుము.

అవ. ఇట్లు పరమేశ్వరుఁ డాంజనేయుఁ డొనర్చిన స్తోత్రమును విస్తరించి శ్రీరాముఁ డొనర్చిన యుపదేశమును వివరించువాఁడై ప్రస్తుతము నుపసంహరించు చున్నాఁడు:—

వ. అని యిట్లఖండపాండిత్యంబుచేతఁ బెక్కుభంగుల వినుతించుహను
మంతుని సాదరంబుగాఁ గరుణాకటాక్షవీక్షణంబుచేతఁ గనుంగొని
భూరి ప్రేమధాముండుఁ బరంధాముండు నైనయాత్మారాముం
డి ట్లనియె. 37

టీ. అని, ఇట్లు = ఈవిధముగా, అఖం... చేతన్-అఖండ=అడ్డము లేని, పాండిత్యంబుచేతన్=జ్ఞానముచే, పెక్కుభంగులన్ = అనేకవిధములుగా, వినుతించుహనుమంతునిన్ = స్తోత్రముచేయుచునట్టి ఆంజనేయుని, సాదరంబుగాన్ = ప్రీతిపూర్వకముగా, కరుణాకటాక్షవీక్షణంబుచేతన్ = దయాయుక్తమగు కడగంటిచూపుతో, కనుంగొని = చూచి, భూరి... ముండు-భూరి = అధికమైన, ప్రేమ=ప్రేమకు, ధాముండును = ఆధారభూతుఁడైనవాఁడును, పరంధాముండునునైన = మోక్షమే స్థానముగాఁ గలవాఁడును, ఐన, ఆత్మారాముఁడు = అంతర్యామియైన శ్రీరాముఁడు, ఇట్లనియెన్ = ఈవిధముగా చెప్పెను.

తా. ఓపార్వతీ! పయినవివరించినవిధముగా సంపూర్ణవిజ్ఞానముతో ననేకవిధములుగాఁ దన్ను వినుతించుచున్న యాంజనేయుని గనుంగొని యాపరంధాముఁ డగునాత్మారాముఁడు కరుణ వెలయ నీక్రిందివిధంబుగా నుపదేశింప నారంభించెను.

## శ్రీరాముఁ డాంజనేయుని కమనస్కయోగంబు దెలుపుట.

అవ. ఇట్లు స్తోత్రము నుపసంహారము చేసి రామోపదిష్ట మగునమనస్కయోగమును వర్ణించువాఁడై మొట్టమొదట ప్రతిజ్ఞావిధమును దెలుపుచున్నాఁడు:—

తే. సంతసము మీఱఁ జిత్తవిశ్రాంతికొఱకు
సలత మాత్మసమాధిఁ గోరితివి గానఁ
గడఁగి యమనస్కరాజయోగంబు నీకుఁ
దెలియఁ జెప్పెద వినుము సద్దిహామ్మఁడగ. 38

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. సంతసమువిూఱన్ = సంతోష మధికమగుచుండఁగా, చిత్తవిశ్రాంతికొఱకున్ = చిత్తము శాంతినొందుటకై, సతతము=ఎల్లప్పుడును, ఆత్మసమాధిన్ = నిర్వికల్ప సమాధిని, కోరితివిగాన్ = కోరి యున్నావు గావున (మనస్సు బ్రహ్మమునందు నిశ్చలముగా నిలుచునట్లు చేయవలయునని యాంజనేయుఁడు ప్రార్థించెను. అట్టినిశ్చలత్వము నిర్వికల్పసమాధియందుఁ గాని కుదురదు. కావున నాంజనేయుఁడు సమాధినే కోరినట్లని తెలిసికొనునది.), కడఁగి=ప్రయత్నపూర్వకముగా, నీకు, అమనస్కరాజయోగంబు =అమనస్కమను పేరు గలరాజయోగమును, తెలియన్ = చక్కఁగాఁ దెలియునట్లు, చెప్పెదన్, సందేహముడిగి=సంశయము మాని, వినుము.

తా. ఓహనుమంతుఁడా! నీవు చిత్తవిశ్రాంతికై సమాధిని గోరితివికదా. కావున దానిని వివరించెదను. ఆసమాధికి అమనస్కయోగమని పేరు. దానిని సంశయమువిడిచి సావధానచిత్తుండవై యాకర్ణింపుము.

అవ. ఇట్లు శ్రీరాముఁడు ప్రతిజ్ఞఁ జేసి ఆయోగమునం దభిరుచి గలిగించుటకై వాదము నుపక్రమించుచున్నాఁడు:—

చ. అలయక సప్తవారిధుల నావలి కీవలి కొక్కరీతిగాఁ
గలయఁగ నీఁదవచ్చును నగంబుల నచ్చనగండ్లుగాఁ గరం
బులఁ గొని యాడవచ్చు నభముం గబళింపఁగవచ్చుగాని యి
య్యిల నమనస్కయోగము గ్రహింపఁగరాదు దలంప నేరికిన్ 39

టీ. అలయక=అలుపులేక, సప్తవారిధులన్ = ఏడుసముద్రములను, ఆవలికిన్= ఆవలితీరమునకును, ఈవలికిన్=ఈవలితీరమునకును, ఒక్కరీతిగాన్ = ఒకటేవిధముగా, కలయఁగన్=కలయునట్లు, ఈఁదవచ్చున్=ఈఁదుటకైనను సాధ్యమగును, నగంబులన్= సప్తకులపర్వతములను, అచ్చనగండ్లుగాన్ = అచ్చనకాయలుగా, కరంబులన్=హస్తములతో, కొని=గ్రహించి, ఆడవచ్చున్ = ఆడుటకైనను సాధ్యమగును, నభమున్ = ఆకసమును, కబళింపఁగవచ్చున్=మ్రింగుటకునుసాధ్యమగును, కాని=అయినను, ఇయ్యిలన్= ఈభూమియందు, తలంపన్=విచారింపఁగా, ఏరికిన్ = ఎవ్వరికైనను, అమనస్కయోగమున్=అమనస్కరాజయోగమును, గ్రహింపఁగరాదు=గ్రహించుటకు శక్యముకాదు.

తా. ఓయాంజనేయ! యీయమనస్కయోగమును గ్రహించుట మిగులఁ గష్టసాధ్యము. కొంచమైన నాయాసము నొందక సప్తసముద్రముల నీవలిదరినుండి యావలి దరివఱకు నీఁదిన నీదవచ్చును. కులపర్వతముల నచ్చనగాయలుగాఁ జేసి యాడవచ్చును. ఆకాశమునైనను మ్రింగవచ్చును. కాని యీయోగమును మాత్రము పరిశుద్ధచిత్తులు కానివారలు గ్రహింపనే లేరు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భూతిలకవృత్తము:—

కావున నయ్యమనస్కయోగము గాఢదుర్లభ మారయన్
కేవలతత్త్వవిచారముంబరికింపనేరనివారికిన్
భావమునందు ననాత్మ నాత్ముని బాగుగా విభజించుమే
ధావికి నిత్యసుఖంబుగా విశదంబుగా సులభం బగున్. 40

టీ. కావునన్ = కాఁబట్టి, అయ్యమనస్కయోగము = ఆయమనస్క రాజయోగము, అరయన్=విచారింపఁగా, కేవలతత్త్వవిచారమున్-కేవల=ఏకమైన, తత్త్వవిచారమున్=పరమాత్మతత్త్వముయొక్క తత్త్వస్వరూపమును, పరికింపనేరనివారికిన్ = విచారింపనేరనివానికి, గాఢదుర్లభము= సంపూర్ణముగా పొందరానిది, భావమునందున్= మనస్సునందు, అనాత్మన్ = అనాత్మయగు (శరీరాదులను), ఆత్మునిన్=ఆత్మయగుజీవుని, బాగుగాన్=లెస్సఁగా, విభ...వికిన్-విభజించు=తెలిసికొనునట్టి, మేధావికిన్=బుద్ధిమంతునకు, నిత్య...బుగాన్-నిత్య=శాశ్వతమైన, సుఖంబుగాన్ = ఆనందకరము అయినదిగా, విశదంబుగాన్=స్పష్టముగా, సులభంబగున్=సుఖముగా పొందఁదగినది యగును.

తా. ఈకారణమువలన తత్త్వవిమర్శన జేయలేనియజ్ఞానులకు నాయమనస్కయోగము మిగుల దుర్లభము. ఆత్మానాత్మల విభాగింపఁగలమహాత్ములకు నన్ననో మిగుల నానందకరమై స్పష్టమై సులభమై యొప్పును.

తోదకవృత్తము:—

చెలువుగఁ బువ్వులు జీటుటకంటెన్
బొలుపుగఁ గన్గవ మూయుటకంటెన్
నలు వగునీయమనస్కపదంబే
సులభము సౌఖ్యము సూక్ష్మము వత్సా. 41

టీ. వత్సా=పుత్త్రుఁడా! చెలువుగన్=మనోహరముగ, పువ్వులుచీటుటకంటెన్= పూలను చీల్చుటకంటెను, పొలుపుగన్=చక్కఁగా, కన్గవన్ = కన్నులను, మూయుటకంటెన్, నలువగు=సులభమైన (లేక మనోహరమైన), ఈయమనస్కపదంబే=ఈయమనస్కయోగమే, సులభము=సుఖముగా నాచరింపఁదగినది. సౌఖ్యము = ఆయాసకరము కానిది, సూక్ష్మము=తెలియుటకు మిగుల సూక్ష్మమైనది.

తా. ఓపుత్త్రా! ఆత్మానాత్మవివేకము గలబుద్ధిమంతునకు పూలను చీల్చుటకంటెను కన్నులను మూయుటకంటెను యీయమనస్కరాజయోగమును గ్రహించుటయే మిగుల సులభము ఆనందకరము సూక్ష్మము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తోటకవృత్తము:—

అమృతంబు సుఖంబుగ నానినయ
ట్లమనస్కముఁ బూని యహర్నిశముఁ
సమతం దనుఁ గన్గొనుసజ్జను న
య్యమృతాంగన చేకొను నందముగాన్. 42

టీ. అమృతంబు = అమృతమును, సుఖంబుగన్ = సౌఖ్యముగ, ఆనినయట్లు = పానముచేసినవిధమున, అమనస్కముఁ=అమనస్కరాజయోగమును, పూని=ప్రయత్న పూర్వకముగా, అహర్నిశముఁ=రేయింబగలు, సమతన్=ఒకటేవిధముగా, తనున్=తన యథార్థస్వరూపమును, కన్గొనుసజ్జనున్ = చూచుసట్టిమహాత్ముని, అయ్యమృతాంగన = ఆమోక్షకాంత, అందముగాన్=మనోహరముగా, చేకొనున్=కయికొనును.

తా. ఇట్టి యమనస్కయోగమును గ్రహించి అమృతపానముఁ జేసినట్లు సర్వకాలములందు నాత్మావలోకమువలనఁ బరమానందము ననుభవించుపుణ్యాత్ముని మోక్షలక్ష్మి చేకొనును.

సీ. పాలు చాలఁగఁ గ్రోలఁ జాలునే తగ నాల
పొదుఁగులఁ బిఱుఁదులు పొదలుచున్న
లోపలిరస మాన నోపునే యిలఁ గోతి
నారికేళఫలంబుఁ జేరి కన్న
సొంపార రతులచే సుఖయింపనేర్చునే
షండుండు మఱి రంభసరసనున్నఁ
దనమోముసొగసుఁ గన్గొనునె పుట్టంధుండు
మించుటద్దంబు చే నుంచుకొన్న
తే. గలుగునే నిత్యనిర్మలాఖండసుఖము
నలఘుతారకసాంఖ్యయోగాశ్రితులకుఁ
దత్తదుచితోరుధర్మలబ్ధతలపగిది
విలసదమనస్కయోగాప్తివలనఁ గాక. 43

టీ. ఆలపొదుఁగులన్-ఆల = ఆవులయొక్క, పొదుఁగులన్=పొదుఁగులయందు, పిఱుఁదులు=పిఱుఁదులను పేరుగల పురుగులు, పొదలుచున్నన్=ఉన్నప్పటికిని, తగన్= ఒప్పునట్లుగా, పాలు=పాలు, చాలఁగన్=అధికముగా, క్రోలఁజాలునె= పానము చేయ సమర్థములగునా? ఇలన్ = భూమియందు, కోఁతి, నారికేళఫలంబున్ = టెంకాయను, చేరి=పొంది, కన్న=చూచినప్పటికిని (అనఁగా సంపాదించినప్పటికిని), లోపలిరసము= ఆటెంకాయయందున్న మాధుర్యమును, ఓపునే=అనుభవింప సమర్థమగునా? మఱి=

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మఱియు, షండుండు=నపుంసకుఁడు, రంభసరసనున్నన్ = రంభయొక్క పార్శ్వమునందు నున్నను, సొంపారన్=మనోహరముగా, రతులచేన్ = రతిక్రీడచే, సుఖియింపనేర్చునే= సుఖమునొందఁగలుగునా? పుట్టంధుఁడు = పుట్టుగ్రుడ్డి, మించుటద్దంబు = పెద్దయద్దము చేనుంచుకొన్నన్ = చేతియందు నుంచుకొన్నను, తనమోముసొగసున్ = తనముఖము యొక్క యందమును, కన్గొనునె = చూడఁగలఁడా? తత్త...గిదిన్-తత్తత్ = ఆయా యోగములకు, ఉచిత=తగిన, ఉరు=అధికములైన, ధర్మ = ధర్మములయొక్క, లబ్ధికి పగిదిన్=పొందుటవలనవలె (అనఁగా: దేనికిఁ దగినధర్మమును సంపాదించినఁగాని యది దొరకనట్లు) అలఘు...లకు-అలఘు=అధికములైన, తారక=తారకము, సాంఖ్యయోగ= సాంఖ్యము అనునట్టి యోగములను, ఆశ్రితులకున్=ఆశ్రయించినవారికి, నిత్య...ఖము- నిత్య=శాశ్వతమైనట్టియు, నిర్మల=పరిశుద్ధమైనట్టి, అఖండ = అపరిచ్ఛిన్నమైనట్టియు సుఖము=బ్రహ్మానందము, విల...గాక-విలసత్=ప్రకాశించుచున్న, అమనస్కయోగ= అమనస్కయోగముయొక్క, ఆస్తివలనఁ గాక = పొందుటవలనఁ గాక, కలుగునే= దొరకునా?

తా. ఆవులపొదుఁగులయందేయున్నను పిఱుఁదులు లోపలిపాలను త్రాగలేనట్లు, టెంకాయను పట్టుకొనియే యున్నను మర్కట మందలి రసమును పానము సేయనేరని భంగి, రంభ తనపార్శ్వమునం దున్నను లేక తానురంభపార్శ్వమున నున్నను నపుంసకుఁడు రతిసుఖము ననుభవింపలేనికైవడి, నిలువుటద్దమును జేత నుంచుకొనినను పుట్టంధుఁడు తనముఖమును దాఁ జూడలేనిమాడ్కి సాంఖ్యతారకయోగముల నవలంబించినవా[రు] మోక్షరూప మగుపరమానందమును బొందంజాలరు. అమనస్కయోగము నాశ్రయించి[న] వారికి మాత్రమే యాయానందము దొరకును. ఏసాధనమువలన నేఫలము కలుగవల[సి] యుండునో యాసాధనమువలననే యాఫలము కలుగును గాని మఱియొకదానిచేఁ గా[ని] ముఖ్యమగు సాధనము లేక తక్కిన వన్నియు నున్నప్పుడు కాని కలుగనేరదు కదా!

అవ. ఇట్లు ఫలనిదర్శనపూర్వకముగా నమనస్కయోగమునం దభిరుచిని క[లి]గించి దానిస్వరూపమును నిరూపించుచు మఱికొంత ప్రశంసించుచున్నాఁడు:—

తరల. స్ఫురితతారకసాంఖ్యము ల్విను పూర్వపక్షము లుత్తమం
బరయఁగా నమనస్కయోగ మనాద్యముం గడు హృద్యముం
బరమగుహ్యము రాజయోగము బ్రహ్మవిద్యసుహృన్మనో
హారము గేవలనిర్వికల్పసమాధి సుమ్మిది మారుతీ! 44

టీ. మారుతీ=ఆంజనేయ! వినుము, స్ఫురి...ములు-స్ఫురిత = ప్రకాశించుచుఁ డఁగా, తారకసాంఖ్యములు = తారకసాంఖ్యయోగములు, పూర్వపక్షములు = సిద్ధాం[త]మైనవికావు. (అనఁగా; మనోనిగ్రహార్థంబును భ్రాంతు లగువానిఁ గ్రమముగా,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రించుటకై వారి భేదదృష్టి నాశ్రయించియుఁ జెప్పఁబడినవేకాని యథార్థస్థితిని జెప్పు నవి కావు.) అరయఁగాన్ = విచారింపఁగా, అమనస్కయోగము = అమనస్కమను యోగము, ఉత్తమంబు=సాంఖ్యతారకములకంటె శ్రేష్ఠమైనది, ఇది=ఈ అమనస్కము, అనాద్యమను=అనాదిసిద్ధమయినది, కడున్ = మిక్కిలి, హృద్యమను = మనోహరమై నది, పరమగుహ్యము=మిగులరహస్యమైనది, రాజయోగము = యోగములలో నుత్తమ మైనది, బ్రహ్మవిద్య=బ్రహ్మజ్ఞానరూపమైనది, సుహృన్మనోహరము-సహృత్ = విద్వాం సులకు, మనోహరము=రమ్యమైనది. (అనఁగా: జ్ఞానులగువా రన్నిటిని విడచి యీయమ నస్కము నే యాశ్రయింతు రనుట.) కేవల...సుమ్ము-కేవల = ముఖ్యమయిన, నిర్వికల్ప =సంకల్పవికల్పములులేని, సమాధిసుమ్ము=యోగము ఐయున్నది సుమా.

తా. ఓయాంజనేయా! ఇదివఱకుపదేశించిన తారకసాంఖ్యయోగములు పూర్వ పక్షములు శబ్దాదులపైఁ బరువులిడుమనస్సును నిలుపుట మొదలగుదానికై చెప్పఁబడినవే కాని సిద్ధాంతములుకావు. ఈయమనస్కయోగము అనాదిసిద్ధ మయినది. మిగుల రహ స్యమైనది. మనోహరమైనది, ఇదియే నిర్వికల్పసమాధియోగములలో నుత్తనుమయినది.

క్రౌంచపదవృత్తము:—

సారపదార్థం బారయుచుం దా సకలనిగమములు చదివిన నైనన్
జారువిశిష్టాచారఘనుండై జపములు తపములు సలిపిన నైనన్
స్ఫారసమస్తోదారసుతీర్థాచరణము లనిశము జరిపిన నైనన్
గారవముం జేకూఱఁగ నీయోగజపరమసుఖము గలుగదు వత్సా.

టీ. వత్సా=ఓపుత్రా, సారపదార్థంబు-సార =శ్రేష్ఠమగు, పద = మోక్షస్థానము యొక్క, అర్థంబు=విషయమును, అరయుచున్ = విచారించుచు, తాన్=తాను, సకల నిగమములు=సమస్తశాస్త్రములును, చదివిననైనన్ = చదివినప్పటికిని, చారు...నుండై చారు = మనోహరమైనట్టియు, విశిష్ట = సత్పురుషులచే నాశ్రయింపంబడునట్టియు, ఆచార=సదాచారముచేత, ఘనుండై = అధికుఁడై, జపములు = జపములను, తపములు= తపస్సులును, సలిపిననైనన్ = చేసినప్పటికిని, స్ఫార...ములు-స్ఫార = విస్తార మైన ట్టియు, సమస్త=సమగ్రమైనట్టియు, ఉదార = అధిక మైనట్టియు, లేక ఉత్తమమయి నట్టియు, సుతీర్థాచరణములు=తీర్థయాత్రలును, అనిశము=ఎల్లప్పుడు, జరిపిననైనన్ = చేసినప్పటికిని, గారవమున్ = గౌరవము, చేకూఱఁగన్ = కలుగునట్లుగా, ఈయోగ జపరమసుఖము-ఈయోగజ = ఈఅమనస్కయోగమువలనఁగలిగిన, పరమ = నిరతిశయ మైన, సుఖము=ఆనందము, కలుగదు = సంభవింపదు.

తా. ఓపుత్రా ! 'వేదశాస్త్రములకు సార మెద్ది?' అని విచారించుచు సర్వ శాస్త్రములఁ జదివినప్పటికిని మనోహరములగు శిష్టాచారములు గలిగి జపతపముల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాచరించినను, సమస్తము లగుమహాతీర్థముల నెల్లప్పుడును సేవించినను యీయమనస్క యోగసుఖము దొరకునది కాదు. వివేకముచే సంపాదింపవలయును.

తే. అట్లు గావునఁ బరమరహస్య మైన
విలసదమనస్కయోగంబు విస్తరించి
నీకెఱింగింతు విమలవివేకయుక్త
సూక్ష్మదృష్టిని గను మతిసుకరముగను. 46

టీ. అట్లుగావునన్=కాఁబట్టి, పరమరహస్యమైన=మిగుల రహస్యమగు, విల...గంబు-విలసత్=ప్రకాశించుచున్న, అమనస్కయోగంబు = అమనస్కమను రాజయోగంబు, విస్తరించి=స్పష్టముచేసి, నీకున్, ఎఱిఁగింతున్ = తెలియఁజేయుదును. విమ...దృష్టిన్-విమల=నిర్మలమైన, వివేకయుక్త = జ్ఞానయుక్త మైన, సూక్ష్మదృష్టిన్=సూక్ష్మదృష్టిచే, అతిసుకరముగన్ = మిగుల సులభముగా, కనుము, = చూడుము (లేక తెలిసికొనుము).

తా. కావున నత్యుత్తమ మగునాయమనస్కయోగమును నీకు వివరించి చెప్పెదను. నిర్మలమగు జ్ఞానముతోఁ గూడినసూక్ష్మదృష్టిచే గ్రహింపుము.

అవ. ఇట్లభిరుచిని జనింపఁజేసి యమనస్కయోగమును వివరించువాఁడై మొట్టమొదట మనస్సుయొక్క స్వరూపమును, ప్రభావమును నిరూపించుచున్నాఁడు:—

పంచచామరము.—

మనంబె స్థూలసూక్ష్మముల్ప్రమాతృమానమేయముల్
మనంబె కామరాగరోషమత్సరాదివృత్తులున్
మనంబె సర్వధర్మముల్ మనంబె బంధమోక్షముల్
మనంబె దృశ్య మంతయుం గ్రమంబుచే నెఱింగినన్. 47

టీ. స్థూల...ములు - స్థూల = స్థూలప్రపంచము, సూక్ష్మములు = సూక్ష్మప్రపంచము, ప్రమా...ములు-ప్రమాతృ=ప్రమాణముచే నొకవిషయమును నిర్ణయించువాఁడు, మాన=ఒకవిషయమును నిర్ణయించుటకు సాధనములైన ప్రత్యక్షాదిప్రమాణములు, మేయములు=ఆప్రమాణములచే నిర్ణయింపఁ దగినవస్తువులు, మనంబే = మనస్సే, కామ...లును-కామ = కామము, రాగ = రాగము (అనఁగా: తన కున్నవాని ననుభవింపవలయు నను నిచ్ఛ), రోష = క్రోధము, మత్సర = మాత్సర్యము, ఆది=మొదలయిన, వృత్తులున్ = వ్యాపారములును (లేక సంకల్పములును), మనంబే = మనస్సే, సర్వధర్ములున్ = సమస్తమయినధర్మములును, మనంబే = మనస్సే, బంధమోక్షములు - బంధ=బంధము (అనఁగా సంసారమును), మోక్షములు=ముక్తి (అనఁగా: సంసారాభావంబును),

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మనంబే=మనస్సే, దృశ్యమంతయుఁన్=కనంబడు సర్వపదార్థములును, క్రమంబుచేన్=క్రమముగా, ఎఱింగినన్=తెలిసికొనినయెడల, మనంబె=మనస్సే (అగును).

తా. ఓయాంజనేయా! బాగుగ విచారించినచో నీప్రపంచమంతయు మనస్సునకంటె భిన్నము కాదు. స్థూలశరీరంబును సూక్ష్మశరీరంబును ప్రమాణములచే విషయముల గ్రహించుప్రమాత వానికి సాధనమగుప్రమాణము. ఆసాధనముచే ప్రమేయము కామరాగాదిసర్వవృత్తులును సర్వధర్మంబులును బంధమోక్షంబులును మఱియుఁ గల సర్వప్రపంచంబును మనస్సే.

తే. సర్వసంసారమును మానసమున నొదవు
సర్వసంసారమును మానసమున నుండు
సర్వసంసారమును మానసమున నడఁగు
సర్వసంసారమును మానసంబె యగును. 48

టీ. సర్వసంసారమును-సర్వ=సమస్తమైన, సంసారమును = సంసారము, మానసమునన్=మనస్సునందు, ఒదవున్ = పుట్టును. సర్వసంసారమును = సమస్తసంసారమును, మానసమునన్ = మనస్సునందే, ఉండున్ = నిలిచి యుండును. సర్వసంసారమును, మానసమునన్, అడఁగున్ = లయ మగును, సర్వసంసారమును, మానసంబే = మనస్సే (అనఁగా మనోరూపమే), అగున్ = అయియున్నది.

తా. ఇంతయేల సర్వసంసారంబును మనస్సే. దాని కుత్పత్తిస్థితిప్రళయకారణంబును మనస్సే.

వ. అది యెట్లంటేని. 49

అవ. పై నిరూపించినవిషయమునకు నిదర్శనమును జూపుచున్నాఁడు:—

మ. మనసు సుషుప్తియం దెనసి మ్రగ్గిన నేమియుఁ దోఁపకుండు న
మ్మన మటు మేలుకొన్నను సమస్తజగంబులు గల్గి తోఁచు నీ
ఘనతరబంధమోక్షమయకారణకార్యము లెల్లఁ దాన యై
యనిశములో వెలిం దిరుగు నారయ నెమ్మన మట్లు గావునన్. 50

టీ. ఆరయన్ = విచారింపఁగా, మనసు=మనస్సు, సుషుప్తియందున్=సుషుప్త్యవస్థయందు, ఎనసి = స్వకారణ మగు నవిద్యతోఁ గూడి, మ్రగ్గినన్ = లయము నొందిన, ఏమియున్ = ఏపదార్థంబును, తోఁపకుండున్ = కానరాదు. అమ్మనము = ఆమనస్సు, అటు మేలుకొన్నన్ = జాగ్రదవస్థయందు మేల్కొనఁగానే, సమస్తజగంబులు = సర్వప్రపంచంబులు, కల్గి = యథార్థరూపములై, తోఁచున్ = కానవచ్చును. ఈఘన...ములు - ఈ = ఈచెప్పఁబడిన, ఘనతరం=అధికము లైన, బంధ... బంధసంసా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రంబును, మోక్ష=మోక్షంబును (అనఁగా: ప్రపంచము, కానవచ్చుటయుఁ గానరాకుండు టయుం ననునవియే), మయ = స్వరూపముగాఁగల, కారణ = కారణము లగునవిద్యా దులు, కార్యములు = వానివలనఁ బుట్టిన పగు శబ్దాదులు, ఎల్లన్ = అన్నియుం (కారణ కార్యరూపమగు నీప్రపంచమే యాత్మకు "నాది" యని తోఁచినప్పుడు బంధంబును అట్లు తోఁపక లయ మైనప్పుడు మోక్షంబును సహజముగనే కలిగించుచున్న దని భావము.) తానయై = తానే యై, అనిశము = ఎల్లప్పుడును, నెమ్మనము = మనస్సె (ఈప్రపంచము మనస్సునకంటె వేఱు కా దనుట.), లోన్ = లోపలను (అనఁగా: నంతర్ముఖముగాను), వెలిన్ = వెలుపలను (అనఁగా: బహిర్ముఖముగాను), తిరుగున్= సంచరించుచుండును, అట్లుగావునన్ = కాఁబట్టి.

తా. సుషుప్త్యవస్థయందు మనస్సు లయమునొందిన నప్పు డేమియుఁ దోఁప కుండుటయుం జాగ్రదవస్థయం దది మేలుకొనఁగానే సర్వమును దోఁచుటయు ననుభవ సిద్ధమైయున్నది. కావున 'మనస్సే ప్రపంచము' అనుటలో సంశయము లేదు కదా. ఇట్లు బంధమోక్షరూపము (అనఁగా 'నాది' యని తోఁచినప్పుడు బంధంబును అట్లు తోఁప నప్పుడు మోక్షంబును గలిగించు నీప్రపంచమంతయు స్వస్వరూపముగా నొప్పుచుండ నామనస్సు లోపలను వెలుపలను స్వేచ్ఛగా సంచరించుచుండును). ఇట్లగుటచేత.

అవ. ఇట్లు మనస్స్వరూపస్వభావముల నెఱింగించి యమనస్కరూపము నెఱిం గించుచున్నాఁడు:—

వ. మఱియు నమ్మనంబు కార్యాకారం బై సంకల్పంబు నసారంబు సర్వ
వాసనామయంబు బంధమోక్షకరంబు నన నొప్పుఁ గారణాకారంబై
యవిద్య ప్రకృతి యజ్ఞానంబు మాయ యనం దనరు నట్టిమానసంబు
లేమియ యమనస్కం బ ట్లగుటం జేసి. 51

టీ. మఱియున్-అమ్మనంబు = అమనస్సు, కార్యాకారంబై = కార్యము లగు శబ్దాదులయాకారముగలదియై, సంకల్పంబు = సంకల్పమనియుం, సంసారంబు = సంసార మనియుం, సర్వవాసనామయంబు = సర్వకర్మవాసనలతోఁ గూడినది, బంధమోక్ష కరంబును = బంధమోక్షములు కలిగించునదియుం, అనన్=అని, ఒప్పున్ = ప్రసిద్ధమై యున్నది. కారణాకారంబై = ప్రపంచకారణస్వరూపమై, అవిద్యయున్ = అవి ద్యయుం, ప్రకృతియున్ = మూలప్రకృతియుం, అజ్ఞానంబును, మాయయున్, అనం దనరున్ = అని ప్రసిద్ధి వహించును. అట్టిమానసంబు = ఈవిధముగా సర్వరూపమైన మనస్సు, లేమియుం = లేకుండుటయే, అమనస్కంబు = అమనస్కయోగ మనంబడును. అట్లగుటం జేసి= కాఁబట్టి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఈప్రపంచము కారణప్రపంచ మనియుఁ గార్యప్రపంచ మనియుఁ రెండు విధములు. సర్వప్రపంచంబును మనస్సే కావున దానికి కారణరూపము నాశ్రయించి అవిద్య అజ్ఞానము మాయ అను మొదలగు వ్యవహారములను కార్యరూపము నాశ్రయించి సంకల్పము సంసారము సర్వవాసనామయము బంధమోక్షములు కలిగించునది అను మొదలగు వ్యవహారములును కలుగుచున్నవి. ఇట్టి సర్వరూప మయినమనస్సు యేయోగమున నుండదో అదియే యమనస్కయోగము. కావున.

అవ. ఇట్లు అమనస్కస్వరూపము నెఱింగించి ఆయోగమును సాధించుటకై క్రొత్తగాఁ జేయవలసిన దెద్దియుఁ లేదనియుఁ విజ్ఞానము మాత్రమే చాలు ననియుఁ నిరూపించుచున్నాఁడు:—

సీ. ఆరోపితభుజంగ మమరఁ గన్పట్టునే
స్ఫురదధిష్ఠానరజ్జువును గనిన
నారోపితమనుష్యుఁ డలరఁ జూపట్టునే
భువి నధిష్ఠానదారువును గనిన
నారోపితోదకం బరయంగఁ దోఁచునే
కనదధిష్ఠానార్కకరము గనిన
నారోపితాచ్ఛరౌప్యము లక్ష్య మగునె య
ధిష్ఠాన మైనశుక్తికను గనినఁ
తే. దలఁప నారోపితాసితత్త్వంబు మరలఁ
గాన నగునె యధిష్ఠానఖంబుఁ గనినఁ
దెలియ నారోపితమనంబు దృశ్య మగునె
తగ నధిష్ఠానపూర్ణతత్త్వమును గనిన. 52

టీ. స్ఫుర...వుᳲ = స్ఫురత్ = ప్రకాశించునట్టియుఁ (అనఁగాఁద్రికాలముల యందును ఏకరూపముతో నున్నట్టియుఁ), అధిష్ఠాన=భ్రాంతికినాధారమైనట్టియు, రజ్జువుᳲ = త్రాటిని, కనినᳲ=చూచినయెడల, ఆరోపితభుజంగము-ఆరోపిత = ఆరోపింపఁబడిన, భుజంగము=సర్పము, అమరᳲ=ఒప్పునట్లుగా, కన్పట్టునే=కనంబడునా? భువిᳲ= భూమియందు, అధిష్ఠానదారువుᳲ - అధిష్ఠాన, దారువుᳲ = స్తంభమును, కనినᳲ = చూచినయెడల, ఆరోపితమనుష్యుఁడు-ఆరోపిత, మనుష్యుఁడు=పురుషుఁడు, అలరᳲ = ఒప్పునట్లుగా, చూపట్టునే = కనంబడునా? కనదధి...మున్-కనత్ =ప్రకాశించుచున్న (అనఁగా భ్రాంతికిఁ బూర్వమునను భ్రాంతికాలమునను భ్రాంతి తొలఁగినపిదపను ఒక్క రీతిగనే యున్న), అధిష్ఠాన,అర్కకరమున్=ఎండమావులను, కనినᳲ,ఆరోపితోదకంబు=

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆరోపింపఁబడినజలము, అరయఁగన్ = విచారింపఁగా, తోఁచునే = కానవచ్చునా! అధిష్ఠానమైనశుక్తికన్ = భ్రాంతి కాధార మగు ముత్యపుచిప్పను, కనినన్, ఆరోపితాచ్ఛ రౌప్యము-ఆరోపిత, అచ్ఛ=స్వచ్ఛమైన, రౌప్యము=వెండి, లక్ష్యమగునె=కానవచ్చునా! అధిష్ఠానఖంబుఁగనినన్ =ఆధారమగునాకసమును చూచినయెడల,తలంపన్ =విచారింపఁగా, ఆరోపితాసితత్వంబు-ఆరోపిత, అసితత్వంబు = నలుపు, మరలన్ = తిరిగి, కాననగునె= చూచుటకుశక్యమగునా? తగన్ = ఒప్పునట్లుగా, అధిష్ఠానపూర్ణతత్త్వమున్-అధిష్ఠాన= మనోభ్రాంతికాధారమైన,పూర్ణ=సర్వవ్యాపకమైన(లేక అద్వితీయమైన),తత్త్వమున్= బ్రహ్మస్వరూపమును, తెలియన్ = తెలియునట్లుగా, కనినన్ = చూచినచో, ఆరోపిత మనంబు=ఆబ్రహ్మమునందు ఆరోపింపఁబడియున్నమనస్సు, దృశ్యమగునే=కానవచ్చునా (కానరాదు).

తా. ఈయమనస్కయోగము సిద్ధించుటకై క్రొత్తగా సంపాదింపవలసిన సాధనము లేవియు లేవు. ఆయోగము విజ్ఞానవంతులకు కరతలామలక మైయే యున్నది. వాస్తవస్థితిలో ఆమనస్సుభ్రాంతిచే పరబ్రహ్మమునం దారోపింపఁబడినదే కావున బ్రహ్మస్వరూపము నెఱింగినవారికి ఆమనస్సు కనఁబడనే కనుపడదు. రజ్జువునందు సర్పభ్రాంతి నొందినవానికి 'ఇది రజ్జువు' అని యధిష్ఠానమును దెలిసికొనఁగానే ఆరోపితమగు సర్పము కానరానట్లు అధిష్ఠాన మగు స్తంభమునుఁ దెలిసికొనిన దానియం దారోపింపఁబడిన మనుష్యుఁడు తోఁపనివిధంబున నెండమావులఁ దెలిసికొనినపిదప నం దారోపింపఁబడిన జలము దృష్టిగోచరము కానిభంగి, 'ఇది ముత్యపుచిప్ప' అని యథార్థస్థితిని దెలిసికొనఁగానే దానిపై భ్రాంతిచే నారోపింపఁబడిన వెండి మరల కానఁబడనిమాడ్కి 'ఇది యాకాశముకాని నలుపు కాదు' అనిగ్రహించినపిదప నానలుపు మరలఁ గానరాని పోలిక సర్వాధిష్ఠాన మగు బ్రహ్మమును విజ్ఞానముచే నెఱింగిన యాయనయం దారోపింపఁబడినమనస్సు చొత్తుగనే కానరాదు. కావున నిట్టిమనోభావమును సాధించుటకు విజ్ఞానమునకంటె నితరసాధనము లేల?

అవ. పైవిషయమునే వివరించుచున్నాఁడు:—

వ. అది యెట్లనిన వినుము సాధనచతుష్టయసంపత్తిపూర్వకంబుగాఁ బూర్ణాధికారివై యున్నసమయంబున స్వాధిష్ఠానచిదాభాసుండ వైన నీకునావరణంబులైనచతుర్వింశతితత్త్వాత్మకపంచకోశంబుల వేర్వేఱ విభజించి 'నేతి నేతి' యనుమహావాక్యంబు చెప్పినవిధమున నేనుగాననని నిషేధించి కేవలకూటస్థచైతన్యమాత్రుండ నైతి నని తెలిసి యంతట నీప్రకారంబున దేవతిర్యఙ్మనుష్యాదిసర్వభూతంబులఁ బంచ కోశంబులఁ బంచమహాభూతంబుల నొక్కపట్టసాకరించి యచ్చట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బరబ్రహ్మచైతన్యంబుండ భావించి యామీఁదటఁ ద్వంపదాహం పదాత్మపదప్రజ్ఞానపదలక్ష్యార్థభూతప్రత్యగాత్ముండ నైననేన తత్పద బ్రహ్మపదలక్ష్యార్థభూతపరమాత్ముండ ననియుఁ దత్సత్యజ్ఞానానంద స్వరూపపరమాత్ముండ సచ్చిదానందలక్షణప్రత్యగాత్ముండ నైననే ననియు నిట్లనోన్యాఖండసమరసైక్యం బనుభవించి నిరావరణాధి ష్ఠాన పరిపూర్ణాద్వితీయశుద్ధచైతన్యప్రకాశమాత్రుండ వై ప్రకా శించు నీకుఁ బ్రచండమార్తాండున కంధ కారంబుగనుపట్టని తెఱంగున సర్వకారణకార్యాత్మకం బైనమనంబు గలుగదు రజ్జ్వారోపితసర్పంబు గని యది సర్పంబు గాదని తన్నిరసనంబు గావించి మఱి యిది రజ్జు వని విధించి యయ్యధిష్ఠానంబు నెఱింగినపిమ్మటఁ గల్పితభుజంగం బభావం బై రజ్జుమాత్రంబు శేషించు తెఱంగున శరీరత్రయం బాత్మ కాదని కడఁద్రోచి యాత్మమాత్రుండ వైననీకు మనంబు లేదు మఱియును. 53

టీ. అది=ఆమనోభావము, ఎట్లనినన్ = ఎట్లు కలుగుననఁగా, వినుము. సాధ... బుగాన్-సాధనచతుష్టయ = నిత్యానిత్యవస్తువివేకము మొదలగు నాలుగుసాధనముల యొక్క, సంపత్తిపూర్వకంబుగాన్ = సంపదయే ప్రధానముగా, పూర్ణాధికారివి-పూర్ణ=పరిపూర్ణుఁడవైన, అధికారివి = బ్రహ్మజ్ఞానాధికారివి, ఐయున్నసమయంబునన్ = అయి యున్నప్పుడు, స్వాధి...మవు-స్వాధిష్ఠాన = తానే (అనఁగా: బ్రహ్మమే యాధారముగాఁగల), చిత్=జ్ఞానరూపుఁడగు బ్రహ్మముయొక్క, ఆభాసుండవు=ప్రతిబింబమైన వాఁడవు, ఐననీకున్=అయినట్టినీకు, ఆవరణంబైన = ఆచ్ఛాదనములైన, చతు...లన్-చతుర్వింశతితత్త్వాత్మక=ఇరువదినాలుగు తత్త్వములే స్వరూపములు గాఁగల, పంచకోశంబులన్=అన్నమయాదిపంచకోశంబులను, వేర్వేఱన్=ప్రత్యేకముగా, విభజించి =విభాగించి, 'నేతినేతి'యనుమహావాక్యంబు='నేతి=ఇది కాదు' అనునట్టివేదవాక్యము, చెప్పినవిధంబునన్ = చెప్పినట్లు, ఏనుగానని = 'ఈపంచకోశములు నేను కాను' అని, నిషేధించి=నిరాకరించి, కేవల...డన్-కేవల=అద్వితీయుండైన, కూటస్థ=జీవసాక్షియైన చైతన్యమాత్రుండన్=జ్ఞానమాత్రస్వరూపుఁడను (అనఁగా: బ్రహ్మమాత్ర స్వరూపుఁడను), ఐతినని తెలిసి = అయియున్నాను అని గ్రహించి, అంతటన్ = తర్వాత, ఈప్రకారంబునన్ = ఇదియేవిధముగా (అనఁగా: బంచకోశముల నిరాకరించినట్లే), దేవ...బులన్-దేవ=దేవతలు, తిర్యక్ = పశువులు, మనుష్య = మనుష్యులు, ఆది=మొదలైన, సర్వభూతంబులన్ = సమస్తజంతువులను, పంచకోశంబులన్ = అన్నమయాదికోశము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లై దింటిని, పంచమహాభూతంబులన్ = ఆకాశాదిపంచభూతంబులును, ఒక్కపెట్టన్ = ఒక్కమాటే, నిరాకరించి = నిషేధించి, అచ్చటన్ = ఆదేవాదులయందు, పరబ్రహ్మ చైతన్యంబు=జ్ఞానరూపుండగుపరబ్రహ్మయె, ఉండన్ = ఉన్నాఁడని, భావించి=తలంచి, అమీఁదటన్ = అపైన, త్వం... నేన-త్వంపద='తత్త్వమసి' అనుమహావాక్యమునందలి త్వం పదముయొక్కయు, అహంపద = 'అహం బ్రహ్మాస్మి' అనుమహావాక్యమునందలి యహంపదముయొక్కయు, ఆత్మపద='అయమాత్మా బ్రహ్మ' అను మహావాక్యమునందలి యాత్మపదముయొక్కయు, ప్రజ్ఞానపద='ప్రజ్ఞానం బ్రహ్మ' అను మహావాక్యమునందలి ప్రజ్ఞానపదముయొక్కయు, లక్ష్యార్థీభూత=లక్ష్యార్థమైన (అనఁగా: కేవలము చెప్పఁదగిన యర్థముగాక ప్రమాణసిద్ధముగా నిరూపింపం దగిన యర్థమైన) ప్రత్యగాత్ముండ నైన=కూటస్థుఁడనైన, నేన = నేనే, తత్పదబ్రహ్మపదలక్ష్యార్థభూతపరమాత్ముండన్ = 'తత్వమసి' అను మహావాక్యమునందలి తచ్ఛబ్దమునకును 'అహం బ్రహ్మాస్మి అయ మాత్మా బ్రహ్మ ప్రజ్ఞానం బ్రహ్మ' అను మహావాక్యములందలి బ్రహ్మపదమునకును లక్ష్యార్థ మైన పరమాత్ముఁడను, అనియున్ = అనియును, తత్సత్య...పరమాత్ముండ-తత్ =ప్రసిద్ధ మైనట్టియు, సత్య = సత్యము, జ్ఞాన = జ్ఞానము, ఆనందస్వరూప = ఆనందము, ఇదియే స్వరూపముగాఁగలిగిన, పరమాత్ముండ = పరమాత్మయే, సచ్చి...త్ముండన్ - సత్ = సత్యము, చిత్ = జ్ఞానము, ఆనందం=ఆనందము, లక్షణ=గుర్తులుగాఁగలిగిన, ప్రత్యగా త్ముండన్ = కూటస్థరూపుఁడను (కూటస్థునికిఁ గలవని చెప్పఁబడుచున్న సత్యజ్ఞానానంద ములు పరిచ్ఛిన్నములని శరీరోపాధివశమునఁ దలంపఁబడుచున్నవి. బ్రహ్మకుఁ గల సత్య జ్ఞానానందములు సమష్ట్యుపాధివలన నపరిచ్ఛిన్నములని తలంపఁబడుచున్నవి. ఈభేద మునుబట్టి జీవబ్రహ్మలకుఁ గల సత్యజ్ఞానానందములు పరస్పరభిన్నములుగాఁ జెప్పంబడి యున్నవి. వాస్తవస్థితిలో బ్రహ్మమునకుఁ గాని కూటస్థునికిఁ గాని సత్యజ్ఞానానంద రూపములే లేవని తెలిసికొనవలయును.), ఐననేననియున్ = అయినట్టినేను అనియును, ఇట్లు=ఈవిధముగా, అన్యోన్యాఖండసమరసైక్యంబు-అన్యోన్య = పరస్పరము, అఖండ= అపరిచ్ఛిన్నమైనట్టియు, సమరస=స్వతస్సిద్ధమైనట్టియు, ఐక్యంబు = ఏకత్వమును అనుభ వించి, నిరావరణా...డవై-నిరావరణ=ఆవరణరహితమైన, అధిష్ఠాన = సర్వాధారమైన, పరిపూర్ణ=సర్వవ్యాపకమైన, అద్వితీయ = రెండవది లేని, శుద్ధ = నిర్మలమైన, చైతన్య ప్రకాశమాత్రుండవై = జ్ఞానప్రకాశరూపుఁడవై, ప్రకాశించునీకున్ = ప్రకాశించు చున్ననీకు, ప్రచండమార్తాండునకున్ = బాగుగ ప్రకాశించుచున్నసూర్యునకు, అంధ కారంబు=చీఁకటి, కనుపట్టని తెఱంగునన్ = కనఁబడనట్లు, సర్వ...బైన-సర్వ = సమస్త మైన, కారణ=కారణములు, కార్య=కార్యములు, ఆత్మకంబైన = స్వరూపముగాఁగల, మనంబు=మనస్సు, ... = ..., రజ్జు...బు-రజ్జు = త్రాటియందు, ఆరో

Jangamwadi Math Collection. Digitized by eGangotri

పిత=ఆరోపింపఁబడిన, సర్పంబుఁ = సర్పమును, కని=చూచి, ఇది సర్పంబుగాదని, తన్ని రసనంబు-శతఁ=ఆసర్పముయొక్క, నిరసనంబు = నిరాకరణమును, కావించి=చేసి, మఱి= మఱియు, ఇదిరజ్జువనివిధించి = 'ఇది త్రాడు' అని నిశ్చయించి, అయ్యధిష్ఠానంబుఁ = ఆయాధారమును, ఎఱఁగినపిమ్మటఁ=తెలిసికొనినతరువాత, కల్పితభుజంగంబు=భ్రాంతిచేఁ గల్పింపఁబడినపాము, అభావంబై=లేనిదై, రజ్జుమాత్రంబు=త్రాడె, శేషించు తెఱంగునఁ= మిగులునట్లు, శరీరత్రయంబు=స్థూలసూక్ష్మకారణశరీరమును, ఆత్మ కాదని = కూటస్థుఁడు కాఁడు,అని, కడద్రోచి=నిరాకరించి, ఆత్మమాత్రుండవైన నీకుఁ=కూటస్థుఁడు మాత్రము అయియున్న నీకు, మనంబు లేదు=మనస్సు లేదు. (మనస్సు కూడ నాత్మయం దారోపింపఁ బడినదే కదా యని భావము.) మఱియు.

తా. 'మనస్సు నశించుటకు జ్ఞానముకంటె నితరసాధనములతోఁ బనిలేదు' అను విషయమును వివరించెద వినుము. నిత్యానిత్యవస్తువివేకము వైరాగ్యము శమాదిషట్క సంపత్తి మోక్షేచ్ఛ అనునాలుగుజ్ఞానసాధనములు సంపాదించి సంపూర్ణాధికారము కలి గిన పిదప నీవు నీయథార్థస్వరూపమునుం గూర్చి విచారించి నిర్ణయింపవలయును.

ఎట్లనిన:—ప్రస్తుతము నీవు 'నేను జీవుఁడను' అని తలంచుచున్నావు. శరీరము నంతయు నాత్మగా భావించుచున్నావు. అధిష్ఠానమగుబ్రహ్మము నెఱుంగ నేరకున్నావు. కావున నీభ్రాంతిని వదలి మొట్టమొదట 'నేతినేతి' (ఇది జడమగుటచే బ్రహ్మము కాదు) అనువాక్యము ననుసరించి 'ఇవి పంచకోశములు' అని శరీరమునంతయు (అనఁగా వ్యష్టి దేహాదుల నన్నిఁటిని) విభాగించి 'ఇవి నాకంటె వేఱు. వీనిని నేను చూచుచున్నాను. కావున నివి నాకు స్వరూపభూతములు కానేరవు' అని నిర్ణయించుకొనవలయును. అప్పుడు ప్రతిబింబభూతుఁడవగునీకు నధిష్ఠానభూతమగుబ్రహ్మమే (లేక కూటస్థుఁడే) స్వస్వరూపభూతుఁడని తెలియవచ్చును. వాస్తవస్థితిలో 'ఇతఁడు జీవుఁడు' అనుతలంపు. 'ఇది పాము' అని త్రాటిని జూచుచున్నను భ్రాంతిచేఁ గలిగినతలంపువలె సర్వపరిపూర్ణ బ్రహ్మమును జూచుచున్నను భ్రాంతిచేఁ గలుగుచున్నదియే కదా. కావున నైవిధముగ వ్యష్టినుండి నీస్వరూపమును విభాగించి కూటస్థమాత్రమునుగాఁ దెలిసికొని పిదప సమస్త దేవమనుష్యాదిపంచకోశములను అట్లే వానికిఁ గారణములగు పంచభూతములను 'ఆత్మ కాదు' అని నిషేధించి బ్రహ్మరూపమును వానికంటె వేఱుగా నిర్ణయింపవలయును. ఈవిధముగా కూటస్థబ్రహ్మలను వ్యష్టిసమష్టులనుండి వేఱు చేసి పిదప ప్రపంచమంతయు భ్రాంతిసిద్ధమే కావునను దానికి జ్ఞానముకంటె భిన్నమగుస్వరూపమే లేకపోవుటవలనను 'ప్రపంచము శూన్యరూపము. అది బ్రహ్మమునకంటె వేఱుకాదు' అని 'సర్వత్రా కూటస్థబ్రహ్మలుమాత్రమే కలరు. ఇతర మేమియు లేదు' అని నిశ్చయముగా తెలిసికొన వలయును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అట్టిజ్ఞానము కలిగినపిదప 'అహం బ్రహ్మాస్మి ప్రజ్ఞానం బ్రహ్మ అయమాత్మా బ్రహ్మ తత్త్వమసి' అనుమహావాక్యముల ననుసరించి 'యాకూటస్థబ్రహ్మలకు భేదము లేదు' అని శ్రుతియుక్త్యనుభవపూర్వకముగాఁ దెలిసికొనవలయును. సమష్టిప్రపంచరూప మగు వాచ్యార్థమును దొలఁగింపఁగా తత్పదమునకు బ్రహ్మపదమునకును లక్ష్యార్థ మగుపర బ్రహ్మంబును, వ్యష్టిప్రపంచరూప మగువాచ్యార్థమును దొలంగించినపిదప అహంపద మునకును ప్రజ్ఞానపదమునకును ఆత్మపదమునకును త్వంపదమునకును లక్ష్యార్థమగు కూట స్థుఁడు నీయిరువురును జ్ఞానరూపులే. కావున నీరలకు భేదము గలుగదని నిశ్చయించు కొనవలయును. ఇట్టినిశ్చయము కుదిరి జీవబ్రహ్మైక్య మనుభవమునకు వచ్చినపిదప సూర్యునకుఁ జీఁకటి కానరానట్లు నీకు కారణకార్యరూప మైనమనస్సు కానరాదు. వాస్తవస్థితిలో నీసర్వప్రపంచము (అనఁగా: సర్వప్రపంచాకార మైన మనస్సు) నీ యందు (పరబ్రహ్మమునందు) ఆరోపింపఁబడినదే కావున త్రాటియం దారోపింపఁబడిన పాము ఆరోపితనిరాకరణపూర్వకమగు నధిష్ఠానరజ్జుజ్ఞానమువలన నభావరూపమైనట్లు త్రికాలములయందును లేనిదే యగును. జ్ఞానసమయమునందు గాని యజ్ఞానసమయము నందుఁగాని యథార్థస్థితి ఇదియే. కావున నీకు నెప్పుడును మనస్సు లేదు. కావున నమ నస్కస్థితి స్వభావసిద్ధమే కాని సాధనసాధ్యము కాదు. మఱియును.

అవ. పైన సంక్షేపవిస్తరములచే నిరూపింపఁబడినవిషయమునే సుఖముగాఁ దెలి యుటకై మఱియొకమాఱు సంగ్రహించి చెప్పుచున్నాఁడు:—

క. లోభితస్వాధిష్ఠానచి,దాభాసుఁడ వైన నీకు నఖిలముఁ దోఁచున్
శోభితకేవలనిత్యని,రాభాసుఁడ వైనదృశ్య మంతయు నడఁగున్. 54

టీ. లోభిత...వైనన్-లోభిత = కామక్రోధాదియుక్తుఁడ వైనట్టియు, స్వ = తానే (బ్రహ్మమే), అధిష్ఠాన=ఆధారముగాఁ గల, చిత్ = జ్ఞానరూపుండయిన బ్రహ్మము యొక్క, ఆభాసుండ వైనన్ = ప్రతిబింబరూపుఁడ వైనయెడల (అనఁగా నట్టియభిమాన మున్నయెడల జీవుఁడు కూడ మాయాకల్పితుఁడే కావున పరబ్రహ్మమునందు భ్రాంతిచే జూడఁబడుచున్నవాఁడే కావున 'జీవభ్రాంతి యున్నసమయమునందు' అని భావము.) నీకున్, అఖిలమున్ = యీసమస్తసంసారంబును, తోఁచున్=కానవచ్చును, శోభి... డవు-శోభిత = స్వయంప్రకాశుఁడ వైనట్టియు, కేవల = ఏకస్వరూపుఁడ వైనట్టియు, నిత్య=శాశ్వతుండ వైనట్టియు, నిరాభాసుఁడవు = ప్రతిబింబశూన్యశుద్ధపరబ్రహ్మంబవు, ఐనన్=ఐనయెడల (అనఁగా జీవభ్రాంతి తొలఁగించినయెడల), దృశ్యమంతయున్=కానఁ బడుచున్న సంసారమంతయును, అడఁగున్ = నశించును (అనఁగా స్వస్వరూపమునకంటె నన్యముగాఁ గానరాదు).

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. నీవు ఏసమయమునందు జీవభ్రాంతి (అనఁగా అధిష్ఠాన మగుబ్రహ్మము నెఱుంగ లేక 'నేను జీవుఁడను. బ్రహ్మమునకు ప్రతిబింబమును. నాకు కామక్రోధాదులు కలవు' అనుభ్రాంతి) కలిగి యుందువో అప్పుడు ఈదృశ్యప్రపంచ మంతయు (అనఁగా ప్రపంచాకార మైనమనస్సు) కానవచ్చును. చేతనుఁ డగుజీవునకును జడమగుప్రపంచమునకును పరబ్రహ్మమే (స్వస్వరూపమే) యాధారము కావున 'నేను జీవుఁడను' అని తనకు జీవత్వమున్నదని తోఁచినట్లే యధిష్ఠానజ్ఞానముచే 'ఇది ప్రపంచము' అనికూడ ప్రపంచభ్రాంతి కలుగును. ఇట్లు కాక యథార్థస్వరూపవిజ్ఞానము కలిగి 'నేను బ్రహ్మమును' అని తోఁపఁగానే భ్రాంతి లేకపోవుటచే నీదృశ్యము (అనఁగా దృశ్యప్రపంచాకార మైనమనస్సు) కానరాదు. యథార్థస్థితిలో బ్రహ్మకు ప్రతిబింబమనునదియే లేదుకదా. ఈకారణమువలన నమనస్కస్థితి స్వాభావికమే కాని సాధనసాధ్యము కాదు.

క. కను మూసినఁ గను దెఱచిన
ఘనసచ్చిత్సుఖమయాత్మఁ గనుఁగొనకున్నం
గను మూసినఁ గను దెఱచినఁ
గనఁబడు వెలిలో మనోవికారమె వత్సా! 55

టీ. వత్సా=పుత్రా, కనున్=కన్గవను, మూసినన్=మూసినప్పుడును, కను తెఱచినన్=నేత్రములు తెఱచినప్పుడుగాని (అనఁగా లోపల వెలుపలనున్న సర్వపదార్థములయందును), ఘనసచ్చిత్సుఖమయాత్మన్=శ్రేష్ఠుఁడైన సత్యజ్ఞానానంద స్వరూపబ్రహ్మమును, కనుఁగొనకున్నన్=చూడకుండినయెడల (నామరూప భ్రాంతిని వదలి సర్వమును బ్రహ్మయే యని యెఱుంగకున్నయెడల), కనుమూసినన్, కనుదెఱచినన్, వెలిన్=వెలుపలను, లోన్=లోపలను, మనోవికారమే=మనస్సుయొక్క వికారములే (అనఁగా మనోమయమైన ప్రపంచమే), కనఁబడున్=చూడఁబడును.

తా. ఓ పుత్రా! ఇట్టి యఖండజ్ఞానమును సంపాదించినఁ గన్ను మూసినను తెఱచినను బాహ్యాభ్యంతరములయందు సచ్చిదానందరూప పరబ్రహ్మమే కానవచ్చుచుండును. అట్టి జ్ఞానము లేకుండిన నెచ్చటఁ జూచినను మనోవికారములే తోఁచుచుండును.

మ. ఘనతం దారకసాంఖ్యయోగములచేఁ గష్టింపఁగా నేల నె
మ్మనముం బట్టఁగ నేల యింద్రియములన్ మర్దింపఁగా నేలఁ జ
క్కనగా ముందటఁ గానిపించు ఘటముం గన్నట్లు బ్రహ్మంబుగాఁ
దనుఁ దాఁ గాంచినయంతలో నిఖిలముం దానై వెలుంగుం దగన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ఘనతఁ=అధికముగా, తారకయోగ సాంఖ్యములచేతఁ=తారకయోగము చేత సాంఖ్యయోగముచేతను (అనఁగా వాని నాశ్రయించి), కష్టింపఁగానేల = ఏల కష్టపడవలయును, నెమ్మనముఁ = మనస్సును, పట్టఁగనేల = ఏల నిగ్రహింపవలయును, ఇంద్రియములఁ=దశేంద్రియములను, మర్దింపఁగానేల=తమతమ వృత్తులయందు సంచరింపకుండున ట్లేల నిర్బంధింపవలయును (ఏమియుఁ జేయ నక్కఱ లేదనుట), చక్కనగాఁ=బాగుగా, ముందటఁ = ఎదుట, కానిపించు ఘటముఁ = కనఁబడుకుండను, కన్నట్లు = చూచినవిధమున, తనుఁ = స్వస్వరూపమును, బ్రహ్మంబుగాఁ = పరబ్రహ్మమునుగా, తాఁ గాంచినయంతలోఁ=స్వయముగా చూడఁగానే, నిఖిలముఁ = సమస్త ప్రపంచము, తగఁ=ఒప్పునట్లుగా, తానై వెలుంగుఁ=స్వస్వరూపమే యై ప్రకాశించును.

తా. పై కారణమువలన మనసును నిగ్రహించుటకై కాని యమనస్కస్థితిని సాధించుటకై కాని ప్రయత్నమేమియు నక్కఱలేదు. మనస్సే లేకుండిన దానిని నిగ్రహించుట యనునది ఎచ్చటనుండి వచ్చును? దానిని నశింపఁజేయవలయు ననుట యెట్లు సంభవించును? ఎదుర నున్నఘటముఁ జూచునంత సులభముగా వివేకదృష్టిచే బ్రహ్మమును జూడవచ్చును. అట్లు సర్వకాలములయందును స్వస్వరూపమును జూడఁగలిగిన మహాత్ముఁడు సర్వమయుండగును. వానికి మనస్సు బొత్తిగానే కానరాదుకదా! ఇట్లుండ మనోనిగ్రహమునకై తారకసాంఖ్యయోగముల నాశ్రయించి కష్టము నొందనేల? మొట్ట మొదట మనోనిగ్రహమే యనావశ్యకముకదా! ఇంద్రియములను బంధింపనేల! అవియుఁ లేనివేకదా!

క. తనుఁ దాఁ గానని మనుజుని
మనము నిరోధింపఁబడక మసలుచుఁ దిరుగున్
దనుఁ దాఁ గనుసత్పురుషుని
మన మానందాబ్ధియందు మగ్నత నొందున్. 57

టీ. తనుఁ = తనయథార్థస్వరూపమును (బ్రహ్మమును), తాఁ = స్వయముగా (బ్రహ్మము స్వప్రకాశుండే కాని యితరప్రమాణములకు గోచరమగువాఁడు కాఁడని ఇదివఱకే చెప్పియున్నాము), కానని...నము-కానని=చూడనట్టి, మనుజుని=మనుష్యుని యొక్క, మనము=మనస్సు, నిరోధింపఁబడక = నిశ్చలముగాక, మసలుచున్ = పరుగులిడుచు, తిరుగున్, తనుఁ, తాఁ, కను...మనము-కను = చూడఁగలిగినట్టి, సత్పురుషుని=సజ్జనునియొక్క, మనము=మనస్సు, ఆనందాబ్ధియందున్ = పరమానందసముద్రమునందు, మగ్నతనొందున్ = మునిఁగిపోవును. (అనఁగా బ్రహ్మానందానుభవమునందు మరిగి వెలికి రాదనుట).

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఆత్మావలోకనము చేయలేనివానిమనస్సు యథార్థజ్ఞానశూన్యతవలన నిగ్రహింపఁబడకుండును. భ్రాంతివశగతుఁడగుటచే వానిని చిక్కులఁ బెట్టును. అట్లుగాక యాత్మావలోకనము గలమహాత్మునిమనస్సు లేనిదైననగును. బ్రహ్మానందసముద్రమున మునిఁగి నిశ్చలమైన నగును. కావున నమనస్కమునకు విజ్ఞానమునకంటె నితరమగు సాధన మేమియుఁ బనిలేదు.

మ. వనితానందనచందనాదివిషయవ్రాతంబులం బొంది చ
యన్న నంతంతకుఁ జొక్కునెమ్మనము బ్రహ్మానందవారాశివా
సన యొక్కించుక సోఁకెనేనిఁ బ్రవినాశం బొందు నానాద్రుపు
ష్పనటద్భృంగము చంపకప్రసవసంస్పర్శాప్తిఁ గూలుంగతిన్. 53

టీ. వని...లన్-వనితా=భార్య, నందన = పుత్రులు, చందన=గంధము, ఆది = మొదలయిన, విషయ = విషయములయొక్క (శరీరేంద్రియములకంటె వేఱై యనుభవ యోగ్యమగునది విషయ మనంబడును. వ్రాతంబులన్ = సమూహములను, పొంది = ఆశ్రయించి, చయ్యనన్=విశేషముగా (లేక శీఘ్రముగా), అంతంతకున్ = క్షణ క్షణమునకు, చొక్కు నెమ్మనము = ఆనందించునట్టి మనస్సు, బ్రహ్మ...వాసన-బ్రహ్మానంద = బ్రహ్మానందమనెడు, వారాశి=సముద్రముయొక్క, వాసన=సంస్కారము, ఒక్కించుక= కొంచెము, సోఁకెనేనిన్=తగిలినయెడల, నానా...నము-నానా=అనేకములైన, ద్రు= వృక్షములయొక్క, పుష్ప=పుష్పములయందు, నటత్ = సంచరించుచున్న, భృంగము = తుమ్మెద, చంప...ర్శాప్తి-చంపక=సంపెఁగచెట్టుయొక్క, ప్రసవ = పుష్పముయొక్క, సంస్పర్శాప్తిన్=స్పర్శకలిగినంతమాత్రమున, కూలుగతిన్ = మృతిఁజెందునట్లు, ప్రవినాశంబొందున్=నశించును. (బ్రహ్మానందమును రుచిచూచిన నితరానందములు మనసులోని కెక్కవనుట.)

తా. తుమ్మెద సర్వపుష్పములయందును దిరుగునది యైనను సంపెంగ పువ్వుయొక్క వాసన తగిలినతోడనే మృతిఁజెందునట్లు ఈమనస్సుకూడ భార్య పుత్రులు చందనము మొదలగు విషయముల ననుభవించుచు నానందించునది యైనను బ్రహ్మానంద సముద్రవాసన ఇంచుకయైనను సోఁకినచోఁ దత్క్షణమే నశించును. (అనఁగా నభావ రూపమగును.)

క. చక్కెరయును లవణంబును
గ్రక్కున నుదకములయందుఁ గరఁగినరీతిన్
మిక్కిలి తనుఁ గనుఘనుమది
చొక్కుచు నానందజలధి నుడిసి నశించున్. 59

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. చక్కెరయున్, లవణంబును=ఉప్పును, గ్రక్కునన్ = శీఘ్రముగ, ఉదకములయందున్=నీటియందు, కరఁగినరీతిన్ = కరఁగిపోవునట్లు, మిక్కిలి = చక్కఁగా, తనన్=తన యథార్థస్వరూపమును (ఆనందస్వరూపమును), కనుఁగొనుమది = చూచునట్టి మహాత్మునిమనస్సు, ఆనందజలధిన్=ఆనందసముద్రమునందు, సుడిసి=సుడిదిరిగి, చొక్కుచున్=ఆహ్లాదమును జెందుచు, నశించున్.

తా. చక్కెర ఉప్పు మొదలగు పదార్థములు నీటియందుఁ గలుపఁగానే కొంతసేపటికి దానిలో నైక్యమగు విధమున సాత్మావలోకనముఁ జేయుపురుషుని మనస్సు ఆనందసముద్రమున నైక్యము నొందును.

తే. ఇతరసంకల్పములు లేక యెపుడు దాను
సచ్చిదాత్ముఁడ నని సుప్రసన్నవృత్తిఁ
దన్నుఁ గనువానిచిత్తంబు దనకుఁ దాన
పొలియు దనయంద నింధనానలముపగిది. 60

టీ. తాన్=తాను, ఇతర సంకల్పములులేక=రెండవసంకల్పమువిడిచి, సుప్రసన్నవృత్తిన్=శాంతవృత్తితో, ఎపుడున్=సర్వకాలములయందును, సచ్చిదాత్ముఁడనని=నేను సత్యజ్ఞానానంద రూపుఁడను, అని, తన్నుఁ గనువానిచిత్తంబు=తన యథార్థస్వరూపమును జూచువానిమనస్సు, తనకుఁదాన=తనంతనే, ఇంధ...పగిదిన్-ఇంధన = కట్టెలయందలి, అనలముపగిదిన్=అగ్నివలె, తనయంద=తనలోపలనే, పొలియున్=నశించును.

తా. సంకల్పములన్నియుఁ విడిచి సర్వకాలములందును "నేను పరబ్రహ్మమును" అని శాంతమగు చిత్తవృత్తితో ధ్యానించువాని మనస్సు వాస్తవముగా శూన్యరూపమైనదే. కావున కట్టె నిప్పువలె స్వయముగనే నశించును.

క. ఇనుఁ డస్తమించుతఱి నా
తనికిరణము లతనితోడఁ దగఁ జనురీతిం
బెనుమానసంబు పొలిసిన
మునుకొని తద్గతవికారములు పొలియుఁ గడున్. 61

టీ. ఇనుఁడు = సూర్యుఁడు, అస్తమించుతఱిన్ = అస్తమానమగునప్పుడు, ఆతనికిరణములు, అతనితోడన్ = ఆసూర్యునితో, తగన్=ఒప్పునట్లుగా, చనురీతిన్=పోవునట్లు, పెనుమానసంబు = ప్రధానమైనమనస్సు, పొలిసినన్ = నశించినయెడల, మునుకొని = సంపూర్ణముగ (లేక నామనస్సుతోఁ గూడనే), తద్గతవికారములు = ఆమనస్సునకు సంబంధించిన సర్వవికారములను (లేక మనోవికారరూప మగుప్రకృతియును), కడున్=నిరవశేషముగ నశించును.

Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఈవిధముగా మనస్సు నశింపఁగానే సూర్యుఁ డస్తమించునప్పు డాతని కిరణములు, తోడనే యస్తమించునట్లు జ్ఞానకర్మేంద్రియము లన్నియు తోడనే నశించును.

శా. నానాకర్మజవాసనాన్వితమనోనాశంబు గాకున్న బ్ర
హ్మానందానుభవంబు గల్గునె యనాయాసంబుగా నిప్పుడి
య్యానందాంబుధి నోలలాడకయ బాహ్యాభ్యంతరార్థానుసం
ధానోద్భూతనితాంతదుఃఖమయసంతాపంబు చల్లారునే? 62

టీ. నానా...కంబు-నానా = అనేకవిధములైన, కర్మజ = కర్మలవల్ల పుట్టిన, వాసనా=సంస్కారములచే, అన్విత=కూడిన, మనోనాశంబు = మనస్సుయొక్క వినాశము, కాకున్నన్ = కాకపోయినయెడల, బ్రహ్మానందానుభవంబు = బ్రహ్మానందముయొక్క యనుభవము, కల్గునె = కలుగునా (కలుగనేరదు), ఇప్పుడు, అనాయాసంబునన్=కష్టము లేకుండ, అయ్యానందాంబుధిన్ = ఆ బ్రహ్మానందసముద్రమునందు, ఓలలాడకయ = మునుంగ కుండిన, బాహ్య...తాపంబు-బాహ్య = వెలుపలనున్నట్టియు, అభ్యంతర = లోపలనున్నట్టియు, అర్థ = విషయములయొక్క, అనుసంధాన="నావి" అనుధ్యానముచేత, ఉద్భూత = పుట్టిన, నితాంత=అధిక మైన, దుఃఖమయ=దుఃఖరూప మైన, సంతాపము, చల్లారునే (చల్లారదనుట).

తా. ఈవిధముగా మనస్సు నశింపకుండిన బ్రహ్మానందానుభవము కలుగదు. అట్టి యనుభవము కలుగకున్న ననాదినుండియుం లోపల వెలుపల నుండు సర్వసిర్ణయముల నభిమానించుటవలన కలుగుదుఃఖములును ఆదుఃఖములే స్వరూపముగాఁ గల తాపత్రయములును నశింపవు.

అవ. ఇట్లు సయుక్తికముగా సదృష్టాంతముగా సఫలముగా నమనస్కయోగమును నిరూపించి దాని నుపసంహరించుచున్నాఁడు:—

వ. అని మఱియు నిట్లనియెఁ బరమభాగవతోత్తమా! నీవు దేహవ్యతిరిక్తుండవగుటం జేసి జన్మాస్తిత్వవృద్ధిపరిణామాపక్షయవినాశంబులును, బాల్యకౌమారయౌవనజరావస్థలును, వర్ణాశ్రమకులగోత్రనామరూపదేశకాలాదికంబులును, స్థూలత్వకృశత్వదీర్ఘత్వహ్రస్వత్వనీలత్వరక్తత్వాదికంబులును, నిరింద్రియుండవగుటం జేసి వచనాదానగమనవిసర్గానందకర్మంబులును, శబ్దస్పర్శరూపరసగంధవిషయసంగంబును, నప్రాణుండవగుటం జేసి చలనధావనకంపనాకుంచనప్రసారణాదికంబులును, క్షుత్పిపాసాదికంబులును, నమనస్కుండ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వగుటంజేసి సంకల్పవికల్పంబులును, రాగద్వేషకామక్రోధలోభమోహామదమత్సరేర్ష్యాసూయాదంభదర్పాహంకారేచ్ఛాతృష్ణావిచికిత్సాలజ్జాదయాభయశోకధైర్యదైన్యాదికంబులును, నిత్యానిత్యవస్తువివేకవైరాగ్యశమదమోపరతితితిక్షాశ్రద్ధాసమాధానముముక్షుత్వశ్రవణమనననిదిధ్యాసనజ్ఞానాదికంబులును, ధీవిలక్షణుండవు నిరహంకారుండ వగుటంజేసి వక్తృత్వదాతృత్వగంతృత్వవిసర్జయితృత్వానందయితృత్వంబులును, శ్రోతృత్వస్ప్రష్టృత్వద్రష్టృత్వరసయితృత్వఘ్రాతృత్వంబులును, గర్తృత్వభోక్తృత్వస్మర్తృత్వజ్ఞాతృత్వమంతృత్వాహంతృత్వప్రమాతృత్వధ్యాతృత్వాదికంబులును నీకు లేవు నీవు కేవలశుద్ధచిద్రూపప్రత్యగభిన్నబ్రహ్మచైతన్యప్రకాశమాత్రుండవు గావున నేను శరీరేంద్రియప్రాణమనోబుద్ధిచిత్తాహంకారంబులు గాను, స్వయంప్రకాశసచ్చిదానందస్వరూపమాత్రుండ నని నిన్ను నీవు విలోకించుసమాధిసమయంబున సకలవికారసమన్వితమనోరహితుండవు గావే, భూతభవిష్యద్వర్తమానకాలంబుల నవ్విధంబునఁ బ్రకాశించుటవలన నిరతంబును నిర్వికల్పుండవై యేకరూపుండవై యుండుటగాదె సర్వవికారశూన్యసహజామనస్కరాజయోగసమాధి యని తెలిపినం దెలిసి హనుమంతుండు సీతాకాంతున కిట్లనియె. 63

టీ. అని = ఇట్లుపదేశించి, మఱియుఁ, ఇట్లనియెఁ, పర...త్తమా-పరమ = శ్రేష్ఠులైన, భాగవత = భగవద్భక్తులలో, ఉత్తమా = శ్రేష్ఠుఁడైనవాఁడవు, నీవు, దేహవ్యతిరిక్తుండవు-దేహ = దేహమునకంటె, వ్యతిరిక్తుండవు=వేఱగువాఁడవు. అగుటంజేసి = కాఁబట్టి, జన్మా...లును-జన్మ = పుట్టుక, అస్తిత్వ = ఉండుట, వృద్ధి = వృద్ధిఁజెందుట, పరిణామ = పరిణామమును జెందుట, అపక్షయ=క్షీణించుట, వినాశంబులును = నాశము అనువికారములును, బాల్యకౌమారయౌవనజరావస్థలును = బాల్యము కౌమారము వయస్సు ముదుసలితనము అను నవస్థాభేదములును, వర్ణా...లును-వర్ణ = బ్రాహ్మణాదిజాతులును, ఆశ్రమ=బ్రహ్మచర్యాద్యాశ్రమములును, కుల = వంశములును, గోత్ర=కాశ్యపభారద్వాజాది గోత్రములును, నామ = రామకృష్ణాదినామములును, రూప = రక్తనీలపీతాది రూపములను, దేశ = రాష్ట్ర గ్రామాది భేదంబులు గలస్థళములును, కాల = భూత భవిష్యద్వర్తమానాదికాలములను, ఆదికంబులు = మొదలగునవియు, స్థూలత్వ...లును-స్థూలత్వ = లావుగా నుండుట, కృశత్వ = సన్నముగా నుండుట, దీర్ఘత్వ = పొడవుగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నుండుట, హ్రస్వత్వ = పొట్టిగా నుండుట, నీలత్వ = నల్లుపుగా నుండుట, రక్తత్వ = ఎఱ్ఱగా నుండుట, ఆదికంబులును = మొదలగు నవియును, నిరింద్రియుండవగుటంజేసి = ఇంద్రియములు లేనివాఁడవగుటచే, వచ...లును - వచన = మాటలాడుట, ఆదాన= ఇచ్చుటపుచ్చుకొనుట, గమన=నడుచుట, విసర్గ=మలమూత్రములు విడుచుట, ఆనంద= విషయానందములు అనుభవించుట, కర్మంబులును = అనుపనులను (ఇవి కర్మేంద్రియ కార్యములు.), శబ్ద...లును-శబ్ద = శబ్దము, స్పర్శ=స్పర్శము, రూప = రూపము, రస= రుచి, గంధ = వాసన, విషయ = అనువిషయములతోఁ, సంగంబును = కూడికయును, అప్రాణుండవగుటంజేసి=ప్రాణములు లేనివాఁడ వగుటచేత, చలన...లును, చలన = కదలుట, ధావన = పరుగెత్తుట, కంపన = వణఁకుట, ఆకుంచన = వంచుట, ప్రసారణ = చాచుట, ఆదికంబులును = మొదలగునవియును, క్షుత్పిపాసాదికంబులును - క్షుత్ = ఆఁకలి, పిపాస = దప్పి, ఆదికంబులును = మొదలగునవియును, అమనస్కుండవగుటం జేసి=మనస్సు లేనివాఁడ వగుటచే, సంకల్పవికల్పంబులును, రాగ...లును-రాగ = తన కున్నవాని ననుభవించుటయం దిచ్ఛ, ద్వేష = విరోధము, కామ = కోరిక, క్రోధ = కోపము, లోభ=అత్యాశ, మోహ=భ్రాంతి, మద=మదము, మత్సర = మాత్సర్యము, ఈర్ష్య = ఓర్వలేనితనము, అసూయ = తనకంటె నధికుఁడగువానిని జూచి సహింపలేక, వానియందు దోషము నారోపించు దుర్గుణము, దంభ = డంబము, దర్ప = గర్వము, అహంకార=అభిమానము, ఇచ్ఛా=సంకల్పము, తృష్ణ = ఆశ, విచికిత్సా = సంశయము, లజ్జా=సిగ్గు, దయా = దయ, భయ = భయము, శోక = దుఃఖము, ధైర్య = ధైర్యము, అధైర్య = ధైర్యము లేక పోవుట, దైన్య = దీనత్వము, ఆదికంబులును = మొదలగునవి యును, నిత్య...లును-నిత్య = (బ్రహ్మము) నిత్యము, అనిత్య=(ప్రపంచము) అనిత్యము అను, వస్తు=వస్తువులయొక్క, వివేక = యథార్థజ్ఞానము, వైరాగ్య = విషయములయం దిచ్ఛ లేకపోవుట, శమ=మనోనిగ్రహము, దమ = ఇంద్రియనిగ్రహము, ఉపరతి=చిత్త శాంతి, తితిక్షా=శీతోష్ణాదులయోర్పు, శ్రద్ధా = గురువేదాంత వాక్యములయందు శ్రద్ధ, సమాధాన = ఆయుపదేశములయందలి విశ్వాసము, ముముక్షుత్వ = మోక్షమునందలి దృఢానురాగము, శ్రవణ=వినుట (బ్రహ్మమునుగూర్చి వేదాంతశాస్త్రములను వినుట), మనన = వినినవిషయమును యుక్తుల ననుసరించి విచారించి సిద్ధాంతము చేసికొనుట, నిది ధ్యాసన = (సిద్ధాంతము చేసిన జీవబ్రహ్మైక్యమును రెండవ తలంపులేకుండ) ధ్యానము చేయుట, జ్ఞాన=అపరోక్షజ్ఞానంబును, ఆదికంబులును=మొదలగునవియును, ధీవిలక్షణుం డవు-ధీ=బుద్ధికంటె, విలక్షణుండవు=వేఱైన వాఁడవు, నిరహంకారుండవు=అహంకారము లేనివాఁడవు, అగుటంజేసి=ఐయుండుట వలన,వక్తృ...లును-వక్తృత్వ=చెప్పువాఁడుగా నుండుట, దాతృత్వ=ఇచ్చువాఁడుగానుండుట, గంతృత్వ=నడచువాఁడుగానుండుటయు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విసర్జయితృత్వ=మలమూత్రములు విడుచువాఁడుగా నుండుటయు, ఆనందయితృత్వంబులును=ఆనందించువాఁడుగా నుండుటయును, శ్రోతృత్వ=వినువాఁడుగా నుండుటయు, స్ప్రష్టృత్వ=స్పృశించువాఁడుగా నుండుటయు, ద్రష్టృత్వ=చూచువాఁడుగా నుండుటయు, రసయితృత్వ=రుచిచూచినవాఁడుగా నుండుటయు, ఘ్రాతృత్వంబులును=వాసన చూచువాఁడుగా నుండుట అనునవియును, కర్తృ...లును - కర్తృత్వ = చేయువాఁడుగా నుండుట, భోక్తృత్వ = అనుభవించువాఁడుగా నుండుట, స్మర్తృత్వ = స్మరించువాఁడుగా నుండుట, జ్ఞాతృత్వ = తెలిసికొనువాఁడుగా నుండుట, మంతృత్వ = సంకల్పించువాఁడుగా నుండుట, హంతృత్వ = సంహరించువాఁడుగా నుండుట (లేక, అహంకర్తృత్వ = అహంకారము గలవాఁడుగానుండుట.), ప్రమాతృత్వ = ప్రమాణములచే విషయముల నిర్ణయించువాఁడుగా నుండుట, ధ్యాతృత్వ = బుద్ధిచే ధ్యానించువాఁడుగా నుండుట, ఆదికంబులును = మొదలగునవియును, నీకు, లేవు, నీవు, కేవల...డవు-కేవల = ఏకమైనట్టియు, శుద్ధ = నిర్మలమైనట్టియు, చిద్రూప = జ్ఞానస్వరూపుఁడైనట్టియు, ప్రత్యక్ = కూటస్థునికంటె, అభిన్న = వేఱుగాని, బ్రహ్మచైతన్య = పరబ్రహ్మరూపమగు జ్ఞానముయొక్క, ప్రకాశమాత్రుండవు = ప్రకాశమే యైనవాఁడవు, కావునన్ = కాఁబట్టి, నేను, శరీర...గాను - శరీర = శరీరంబు, ఇంద్రియ =ఇంద్రియములును, ప్రాణ = ప్రాణంబులును, మనః = మనస్సును, బుద్ధి = బుద్ధియును, చిత్త = చిత్తంబును, అహంకారంబులును = అహంకారంబును, కాను = కానేరను, స్వయం...నని-స్వయంప్రకాశ = స్వప్రకాశరూపుఁడైన, సత్ = సత్యము, చిత్ = జ్ఞానము, ఆనంద = ఆనందము, స్వరూపమాత్రుండనని = స్వరూపముగాఁగలవాఁడను అని, నిన్నున్ = నీయథార్థస్వరూపమును, నీవు = నీవు స్వయముగా, విలో...నన్ - విలోకించు = చూచునట్టి, సమాధిసమయంబునన్ = యోగనిష్ఠాకాలమునందు, సక...డవు-సకల=సమస్తమైన, వికార = వికారములతో, సమన్విత = కూడిన, మనోరహితుఁడవు=మనస్సులేనివాఁడవు. కావే = కాకుందువా (అగుదువనుట), భూ...లన్-భూత= జరిగినట్టియు, భవిష్యత్ = జరుగఁబోవునట్టియు, వర్తమాన = జరుగుచున్నట్టియు, కాలంబులన్ = కాలములయందు, ఇవ్విధంబునన్ = ఈవిధముగా (అనఁగా మనస్సు లేనివాఁడవై), ప్రకాశించుటవలనన్ = ప్రకాశించుచుండుటచేత, నిరంతరంబును = ఎల్లప్పుడును, నిర్వికల్పుండవై = సంకల్పము వికల్పము లేనివాఁడవై, ఏకరూపుఁడవై = అద్వితీయుఁడవై, ఉండుటకాదే = ఉండుటేకదా. (యథార్థస్థితిలో నెప్పుడును నీకు మనస్సే లేదనుట దృష్టాంతమేకదా యనుట.) సర్వ...సమాధి-సర్వవికారశూన్య=సమస్త వికారములును లేని, సహజ = స్వభావసిద్ధమైన, అమనస్క = మనస్సులేని, రాజయోగ = రాజయోగముయొక్క, సమాధియని = నిష్ఠ (స్వభావముగా మనస్సులేదని,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యెఱుంగుటయే యమనస్క(యోగసమాధి) యని, తెలిపినన్ = తెలియఁజేయఁగా తెలిసి = తెలిసికొని, హనుమంతుండు = ఆంజనేయుఁడు, సీతాకాంతునకున్ = శ్రీరామచంద్రునకు, ఇట్లనియెన్ = ఈక్రిందివిధముగా చెప్పెను.

తా. ఓపరమభాగవతోత్తమా ! ఈవిషయమును ననుభవమునఁ జెప్పెదను వినుము. నీవు దేహేంద్రియాదులకు సాక్షి వగుటచే వానికంటె వేఱని చెప్పియున్నాను. నీవును సాంఖ్యయోగానుభవముచే నట్లే తెలిసికొని యుండనున్నావు కదా! ఆకారణమువలన దేహాభిన్నుఁడ వగుటచే పుట్టుట మొదలగు షడ్వికారములును బాల్యాద్యవస్థలును పొడవు పొట్టి మొదలగు సంస్థానభేదములును నీకు లేవు. ఇంద్రియముల కంటె వేఱగుటచే మాటలాడుట ఇచ్చిపుచ్చుకొనుట మొదలగు కర్మేంద్రియకర్మలును జ్ఞానేంద్రియకర్మ లగుశబ్దాదివిషయ సంబంధంబులును (అనఁగా శబ్దాదివిషయగ్రహణములును) నీకు నుండవు. ప్రాణములకంటె నన్యుఁడవు. కావున కదలుట పరుగెత్తుట వణఁకుట వంచుట చాఁచుట మొదలగునవియు ఆఁకలి దప్పియు నీకుఁ గల్గవు. మనస్సునకంటె బరుఁడ వైనకారణంబున సంకల్పవికల్పములును కామక్రోధములును అసూయ ఈర్ష్య రాగద్వేషములు అభిమానము మొదలగు దుర్గుణములును సాధనచతుష్టయసంపత్తి మొదలగుసద్గుణములును నీకు సంభవింపవు. మఱియు నీవు బుద్ధ్యహంకారములు కాకపోవుటచే వక్తృత్వము (వాగింద్రియకర్మ మగుమాటలాడుటను జేయువాఁడుగానుండుట, అనఁగా మాటలాడువాఁడుగానుండుట) దాతృత్వము (పాణీంద్రియకర్మ మగునిచ్చిపుచ్చుకొనుటను చేయుఁవాఁడుగా నుండుట) మొదలగునవియు, శ్రోతృత్వము (శ్రవణేంద్రియకర్మ మగువినుటను జేయువాఁడుగా నుండుట), స్ప్రష్టృత్వము (త్వగింద్రియకర్మ మగుస్పృశించుటను జేయువాఁడుగా నుండుట) మొదలగు జ్ఞానేంద్రియకర్మ కర్తృత్వములును, కర్తృత్వము ('నేను చేయుచున్నాను' అని సంకల్పపూర్వకముగాఁ జేయువాఁడుగా నుండుట), భోక్తృత్వము (అనుభవించువాఁడుగా నుండుట), స్మర్తృత్వము (స్మరించువాఁడుగా నుండుట), జ్ఞాతృత్వము (జ్ఞానముచేఁ దెలిసికొనువాఁడుగా నుండుట), మంతృత్వము (సంకల్పించువాఁడుగా నుండుట), హంతృత్వము (అభిమానించువాఁడుగా నుండుట), ప్రమాతృత్వము (ప్రమాణముచేఁ బదార్థముల నిర్ణయించువాఁడుగా నుండుట), ధ్యాతృత్వము (ధ్యానముచేయువాఁడుగానుండుట) మొదలగునవియు నీకు తటస్థింపవు. నీవు పరిశుద్ధుఁడవు. బ్రహ్మప్రకాశమే స్వరూపముగాఁ గలవాఁడవు. కావున "నేను దేహేంద్రియాదులను కాను. శుద్ధబ్రహ్మరూపుఁడను" అని యాత్మావలోకనముఁ జేయుసమాధి సమయమున "నీకు మనస్సులేదు కదా! మనస్సు లేకపోగాన సంకల్పాది వికారములు లేవు కదా ! నీవు త్రికాలములయందు నిట్లే యున్నావు కదా ! ఎప్పుడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిట్లే మనోరహితుఁడవై యుండుటవలన నీకు నమనస్కసమాధి స్వతస్సిద్ధమే కదా! కావున దీనిని సాధించుటకు నితరసాధనములతోఁ బని లేదు కదా! ఎప్పుడును నిర్వికల్పరూపముతో నున్నావనుట స్వభావసిద్ధ మగుటచే నమనస్కసమాధియు స్వభావసిద్ధమే యనుటకు సంశయము లేదు" అని ఓపార్వతీ! ఈవిధముగా సర్వము నుపదేశింపఁగానే సంశయావిష్టుఁడై యాహనుమంతుఁ డీక్రిందివిధముగాఁ బ్రశ్నించెను.

## సమాధియందు మనస్సు కలదా లేదా యని ప్రశ్న వేయుట.

అవ. ఇట్లు పరమేశ్వరుఁడు పార్వతికి అమనస్కయోగోపదేశప్రకారము నెఱిం గించి దానిని మఱింత దృఢముఁ జేయుటకై హనుమత్ప్రశ్నస్వరూపమును దెలుపు చున్నాఁడు:—

క ఇది యది యనాత్మ నేఁ గా
నిది బ్రహ్మము నే నటంచు నెఱుఁగునపుడు నె
మ్మది కలదో లేదో యిది
విదితంబుగఁ దెలియఁజెప్పవే శ్రీరామా. 64

టీ. శ్రీరామా-శ్రీ = బ్రహ్మజ్ఞానసంపన్నుఁడవైన, రామా = రఘురామా, ఇది= ఈ కానవచ్చునది, అది=ఆలోని ప్రపంచమును, అనాత్మ=ఆత్మ కాదు, నేఁగాను, (కావున ఈయనాత్మపదార్థములు నాస్వరూపములు కావు.) ఇది=అపరోక్షజ్ఞానమువలన గోచర మైన ఈవస్తువు, బ్రహ్మము = పరబ్రహ్మము, నేనటంచున్=ఈబ్రహ్మము నే 'నేను' అని, ఎఱుఁగునపుడు = తెలిసికొనునప్పుడు, నెమ్మది=మనస్సు, కలదో లేదో=ఉన్నదా లేదా! ఇది=ఈవిషయమును, విదితంబుగన్=స్పష్టముగ, తెలియన్=తెలియునట్లుగా, చెప్పవే= చెప్పుమా.

తా. "ఇది యనాత్మ, ఇది నేను కాను, ఇది బ్రహ్మము, ఇది నేను" అని విభ గించి తెలిసికొనునప్పుడు మనస్సు ఉన్నదా! లేదా! ఓ శ్రీరామాచార్య! ఈవిషయమును విశదముగా నిరూపింపవలయును.

వ. సమాధియందు మనంబు గలదం టేని. 65

టీ. సమాధియందున్=యోగనిష్ఠయందు, మనంబు=మనస్సు, కలదంటేని=ఉన్న దని చెప్పినయెడల.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. అందు "సమాధిలో మనస్సు కలదు" అని చెప్పినయెడల.

అవ. ఇట్లు ప్రశ్నించి మొదటిపక్షమున దోషమును జెప్పుచున్నాఁడు:—

సీ. మనసు గల్గిన బుద్ధియును దశేంద్రియములు
ప్రాణాదులును జతపడి వసించు
నవియు నీస్థూలదేహంబున విడిచియుం
డవు గాన నదియు నుండంగ వలసె
ఘనకారణము లేని కార్యంబు లిల లేవు
గావున వానినిల్కడయు నొప్పు
మూఁడు మేనులనంటి మొదలును దుది లేని
సంసార మంత యచ్చముగ నుండు
తే నట్టు లుండిన చో సహజామనస్క
రాజయోగసమాధి నిరంతరంబు
నెవ్విధంబున సిద్ధించు నెంచి చూడ
జానకీరామ! దేవతాసార్వభౌమ! 66

టీ. దేవతాసార్వభౌమ = దేవతలలోశ్రేష్ఠుఁడవగు, జానకీరామ = సీతారామా, మనసు=మనస్సు, కల్గినన్ = ఉండెనేని, బుద్ధియున్ = నిశ్చయాత్మికమైనబుద్ధియును, దశేంద్రియములు=పదియింద్రియములను, ప్రాణాదులును = ప్రాణాదిదశవాయువులును (అనఁగా సూక్ష్మశరీరమంతయును), జతపడివసించున్ =కూడనేయుండును, అవియున్ = ఆబుద్ధ్యాదులు, ఈస్థూలదేహంబున్ = ఈస్థూలశరీరమును, విడిచియుండవుగానన్, అదియున్ =ఆస్థూలదేహముకూడ, ఉండంగవలసె=ఉండవలసివచ్చును, ఇలన్ =ఈభూమియందు, ఘనకారణము లేని-ఘన=అధికమైన, కారణము లేని=కారణము లేకుండ, కార్యంబులు=కార్యములు, లేవుగానన్ =లేవు కాఁబట్టి (అనఁగా కారణమున్నప్పుడె దానివలనఁ గార్యములు కలుగును కావున), దాని=ఆకారణశరీరముయొక్క, నిల్కడయున్ =ఉనికియును, ఒప్పున్ =కావలసినదియే, మూఁడు మేనులన్ = ఈవిధముగానున్న శరీరత్రయమును, అంటి=సంబంధించి, మొదలునుతుది లేని=ఆదియు అంతంబును లేని, సంసారమంత= సంసారమంతయును, అచ్చముగనుండున్ = చక్కఁగానిలిచియుండును, అట్టులుండినచోన్ =ఆవిధముగాసంసారమున్న యెడల, సహజా...సమాధి-సహజ=స్వభావసిద్ధమైన, అమనస్క=మనస్సు లేని, రాజ=శ్రేష్ఠమైన, యోగ=యోగముయొక్క, సమాధి=నిష్ఠ, ఎంచిచూడన్ =విచారింపఁగా, నిరంతరంబును = ఎల్లప్పుడును, ఎవ్విధంబునన్ = ఎట్లు, సిద్ధించున్ =సిద్ధినొందును. (సిద్ధినొందనేఱదనుట.)

తా. దేవతలలోశ్రేష్ఠుఁడవగు శ్రీరామా! సమాధియందు మనస్సు కలిగిన దానితోఁ గూడ దశేంద్రియములను ప్రాణాదులు నుండును. అవి స్థూలదేహసంబంధము విడువవు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కావున నప్పుడు స్థూలదేహముకూడ నుండవలసివచ్చును. ఇట్లు సమాధియందు స్థూల సూక్ష్మశరీరములు రెండు నుండు ననిన వానికిఁ గారణమగు కారణశరీరముకూడ నుండ వలసివచ్చును. కారణములేక కార్యములుండవుకదా! ఇట్లు 'సమాధియందుమనస్సుకలదు' అనిన శరీరత్రయంబును దానినాశ్రయించి సర్వసంసారంబును సమాధియందుండవలసి వచ్చును. ఇట్లు సర్వము నుండిన నమనస్కసమాధి 'నేను బ్రహ్మమను' అను నపరోక్షాను భవము స్థిరము కానేరదు కదా!

వ అట్లగుటంజేసి మనంబు లేదం టేని. 67

టీ. అట్లగుటంజేసి=కాఁబట్టి, మనంబులేదంటేని='మనస్సులేదు' అనినయెడల.

తా. ఈదోషమువలన 'సమాధియందు మనస్సులేదు' అనునెడల.

అవ. ఇట్లు మొదటిపక్షమున (అనఁగా 'సమాధియందు మనస్సు కలదు' అనుపక్ష మున) దోషముజూపి ఇప్పుడు 'సమాధియందు మనస్సులేదు' అను రెండవపక్షమునందు దోషమును జూపుచున్నాఁడు:—

మ. తనరన్నెమ్మదియంతయుం బొలియఁగాఁ దత్త్వాత్ముఁడై యుండినం
బునరుత్థానము గల్గ దాతనికి నీపాం దొప్పిన న్ధాత్రిపైఁ
గనఁడాత్మానుభవంబు గాంచి యమనస్కం బెంచి బోధించుస
జ్జనులాచార్యులు గల్గరంచు మదిలో శంకింతు సీతాపతీ! 68

టీ. సీతాపతీ=శ్రీరామా, తనరన్=ఒప్పునట్లుగా, నెమ్మదియంతయున్=మనస్సం తయును, పొలియఁగాన్=నశింపఁగా, తత్త్వాత్ముఁడై యుండినన్=బ్రహ్మస్వరూపుఁడై యుండినచో, అతనికిన్=అట్లున్నపురుషునికి, పునరుత్థానము=మేల్కాంచుట యనునది, కల్గదు=సంభవింపదు, ఈపాందొప్పినన్ = ఇట్లుంటయే నిక్కమైనచో, ధాత్రిపైన్= భూమిమీఁద, ఆత్మానుభవంబున్=అపరోక్షానుభవమును, కనఁడు=(ఎప్పుడును) పొంద నేరఁడు (అనుభవమనునది మనస్సుచేతనే సాధింపఁబడవలయును. కావున నామనస్సు లేనిది యనుభవమనుమాటయే సంభవింపదుకదా యనిభావము). కాంచి=అట్టియపరో క్షానుభవమును పొంది, అమనస్కంబు=అమనస్కరాజయోగమును, ఎంచి=విమర్శించి, బోధించుసజ్జనులు-బోధించు = శిష్యులకు బోధ చేయునట్టి, సజ్జనులు = సత్పురుషులైన, ఆచార్యులు=సద్గురువులు, కల్గరంచున్=ఉండనేరరని, మదిలోన్=మనస్సునందు, శం కింతున్=సంశయించుచున్నాను.

తా. ఓ శ్రీరామా! "సమాధియందు మనస్సు లేదు" అనిన నాసమాధిస్థితునకుఁ బునరుత్థానము కల్గుటకు వీలు లేదు కదా! అట్లు సమాధినిష్ఠునకుఁ బునరుత్థానమే లేకున్న నమనస్కయోగానుభవము కలిగి దాని నుపదేశించు గురువులే భూమిపై నుండు టకు వీలులేదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇట్లు రెండవపక్షమున నొకవిరోధమును జూపి దానినాశ్రయించిన మఱి యొకవిరోధమును జూపుచున్నాఁడు:—

క. బోధాచార్యులు లేరని, సాధించినరాజయోగిసంతతికిని ద
ద్బోధంబునకుఁదదీయసమాధికి బాధకము వచ్చు మది కడులేమిన్.

టీ. బోధాచార్యులు=గురువులు, వేఱు అని=వేఱు అని, సాధించినన్ = యుక్తులచే సిద్ధాంతము చేసినయెడల, రాజయోగిసంతతికిన్ = రాజయోగము నాశ్రయించిన సత్పురుషుల సమూహమునకును, తద్బోధంబునకున్ = ఆరాజయోగోపదేశమునకును, తదీయసమాధికిన్ = ఆరాజయోగనిష్ఠకును, మది = మనస్సు, కడులేమిన్ = సంపూర్ణముగా లేకపోవుటచేత, బాధకమువచ్చు = బాధ వచ్చును. (అనఁగా నప్పుడు రాజయోగులు గాని రాజయోగోపదేశముగాని రాజయోగసమాధిగాని యుండుటకే వీలు లేదు అని భావము.)

తా. పైనఁ జూపినదోషము పోవుటకై యుక్తిబలమున నెట్లో యొకవిధమున "ఆచార్యులే లేరు" అని సాధించినచో నప్పుడు రాజయోగులకును ఆయోగమును గూర్చినబోధకును దానిసమాధికిని బాధ వచ్చును. (అనఁగా నది యుండుటకే వీలు లేక పోవలసి వచ్చును) యోగనిష్ఠులకు మనస్సే లేదు కావున రాజయోగము నెవ్వ రుపదేశింతురు? ఉపదేశింపకుండిన శిష్యులు యోగులెట్లగుదురు? సమాధి యెట్లు ప్రపంచమున విస్తరించును? ఇవియన్నియుం "సమాధియందు మనస్సులేదు" అనిన సంభవింపదు కదా!

అవ. ఇట్లు రెండుపక్షములను దూషించి మఱియొకపక్షము నుద్ధరించి యాక్షేపించుచు హనుమంతుండు తనప్రశ్నను నుపసంహరించుచున్నాఁడు:—

వ. ఇవ్విధంబు గాక జ్ఞానవిజ్ఞానసంపన్నులైనమహానుభావులు సమాధియందుఁ గొంతతడవు మనోరహితులై యుండి కొండొకసేపునకు మేల్కాని మెలంగుదురనినఁ బరమపదంబునొందినవారికిఁ బునరావృత్తి ప్రాప్తించునట్లైన మోక్షంబున కనిత్యత్వంబు వచ్చు నిట్లు బహువికల్పసమన్వితంబైనయీసంశయంబు నిశ్శేషంబుగా నివర్తించునట్లు పరమరహస్యార్థం బుపదేశించి నిరతిశయకరుణాకటాక్షవీక్షణంబుచేత నను గ్రహింపవే యని ప్రార్థించిన నయ్యాంజనేయుని కుశలతీవ్రసూక్ష్మప్రజ్ఞావిశేషంబునకు మెచ్చి సచ్చిదానందస్వరూపాభిరాముం డైనయాత్మారాముండు పరమానందభరితాంతఃకరణుండును వికసితముఖారవిందుండు నై సాదరంబుగా నిట్లనియె. 70

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ఇవ్విధంబుగాక = ఇట్లుకలదనికాని లేదనికానిచెప్పక, జ్ఞానవిజ్ఞానసంపన్నులైన-జ్ఞాన = పరోక్షజ్ఞానముచేతను, విజ్ఞాన = అనుభవజ్ఞానముచేతను, సంపన్నులైన = కూడియున్న, మహానుభావులు, సమాధియందుఁ=నిర్వికల్పసమాధియందు, కొంతతడవు= కొంతకాలము, మనోరహితులై యుండి = మనస్సు లేనివారై యుండి, కొండొకసేపునకుఁ=మఱికొంత సేపటికి, మేల్కని = సమాధిని విడిచి లేచి, మెలంగుదురనినఁ=సంచరింతురు అని చెప్పినచో, పరమపదంబుఁ = మోక్షమును, పొందినవారికిఁ, పునరావృత్తి=కొంతకాలము మోక్షమునం దుండి మఱికొంతకాలము సంసారమునం దుండుట, ప్రాప్తించుఁ = వచ్చును (లేక సంభవించును). అట్లైనఁ = అట్లు సంభవించినచో, మోక్షంబునకుఁ, అనిత్యత్వంబు = వినాశిత్వము, వచ్చుఁ=సంభవించును. ఇట్లు=ఈధముగా, బహు...లైన-బహు = అనేకవిధము లైన, వికల్ప = దోషములతో, సమన్వితంబైన=కూడి యున్న, ఈసంశయంబు = ఈసందేహము, నిశ్శేషంబుగాఁ = మిగులకుండఁగా, నివర్తించునట్లు = పోవునట్లు, పరమ...ర్థంబు-పరమ = అధికముగా, రహస్య=దాపఁదగిన, అర్థంబు=సూక్ష్మవిషయమును, ఉపదేశించి, నిరతి... చేతఁ-నిరతిశయ =అన్నిటికంటె నధికమగు, కరుణా = దయతోఁ గూడిన, కటాక్షవీక్షణంబుచేతఁ=కడగంటిచూపుతో, అనుగ్రహింపవేయని = దయ చూడుమా అని, ప్రార్థించినఁ=వేడుకొనఁగా, అయ్యా...నకు-అయ్యాంజనేయుని=ఆయాంజనేయునియొక్క, కుశల=నేర్పు కలిగినట్టియు,తీవ్ర=తీక్ష్ణమైనట్టియు (అనఁగా చురుకు కలిగినట్టియు),సూక్ష్మ=సూక్ష్మమైనట్టియు, ప్రజ్ఞావిశేషంబునకుఁ=బుద్ధ్యతిశయమునకు, మెచ్చి,సచ్చి...డైన-సచ్చిదానంద సత్యజ్ఞానానందములే, స్వరూప=స్వరూపముగాఁ గలిగినట్టియు, అభిరాముండైన=మనోహరుం డైనట్టియు(అనఁగా పరమప్రేమాస్పదుం డైనట్టియు వేఱే సత్యజ్ఞానానందరూపములచే మనోహరుఁడైనట్టియు),ఆత్మారాముఁడు=అంతర్యామియగు శ్రీరాముఁడు, పర...డును-పరమ=అధిక మైన, ఆనంద=శిష్యునకుఁ గలయభివృద్ధివలనం గలిగిన యానందముచే, భరిత=నిండిన, అంతఃకరణుండును = మనస్సుకలవాఁడును, వికసిత...డునై-వికసిత=వికసించిన (అనఁగా చిఱునగవుతోఁ గూడిన), ముఖారవిందుండనై=ముఖకమలము గలవాఁడును అగుచు, సాదరంబుగాఁ = ఆదరముతో, ఇట్లనియెఁ = ఈవిధముగా చెప్ప నారంభించెను.

తా. ఈ రెండుపక్షముల నాశ్రయింపక "జ్ఞాన విజ్ఞాన సంపన్నులగు మహాత్ములు స్వేచ్ఛాధీనముగాఁ గొంతసేపు సమాధియందు మనస్సులేనివారై యుండి మఱికొంతసేపు మేల్కని మనస్సహితులై వ్యవహరించుచుందురు" అనిన మోక్షమునకుఁ బోయినవారు సహితము కొంతసేపు బ్రహ్మానందము ననుభవించి మఱికొంతసేపు సంసారము ననుభవించుచుందురని చెప్పవలసివచ్చును గదా! అట్లైన మోక్షమనిత్యము కావలసివచ్చును. "నచ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పునరావర్తతే" "మోక్షమునకు పోయినవాఁడు మరల జన్మింపఁడు" అను శ్రుతి కప్పుడు విరోధము వచ్చును. ఇది సమ్మతము కాదు కదా! కావున నో శ్రీరామా! బహుదోషదూషితమగు నీ సంశయమును నిశ్శేషముగాఁ దొలఁగించి రహస్యార్థము నుప దేశించి కరుణచే నను గ్రహింపుము. ఓపార్వతీ! ఈ విధముగా నాంజనేయుఁడు ప్రశ్న జేయఁగానే యాతని తీవ్రబుద్ధికి నేర్పరితనమునకు విషయగ్రహణ సామర్థ్యమునకు విమర్శనాశక్తికి మెచ్చి కరుణాసమన్వితుఁడై యయ్యాత్మారాముఁ డిట్లని సమాధానముఁ జెప్ప నారంభించెను.

## సమాధియందు మనస్సుగల్గినను తద్వికారంబు లంటవనుట.

అవ. ఇట్లు హనుమంతుఁడు చేసిన ప్రశ్నమునకు శ్రీరాముఁ డుత్తరమును జెప్పు చున్నాఁడు:—

క. ఇది యిది యనాత్మ యేఁ గా
నిది బ్రహ్మము నే నటంచు నెఱుఁగునె జడమై
కదలని మది యిటు లామదిఁ
గదిసి తెలియునతఁడె స్వప్రకాశాత్ముఁ డగున్. 71

టీ. ఇది="ఈకనఁబడునది, అనాత్మ = జడమైనది, ఇది = ఈదృశ్యప్రపంచము, ఏఁగాను=నేను కాను, ఇది=అపరోక్షజ్ఞానమువలనఁ దెలియవచ్చునది. బ్రహ్మము = పర బ్రహ్మము, నేనటంచున్=ఈ బ్రహ్మమునే నేను" అని, జడమై = జ్ఞానశూన్యమై, కదలని మది=చలింపనేఱని నామనస్సు, ఎఱుఁగునె=తెలిసికొనఁగలదా? (తెలిసికొన లేదనుట.) ఇటులు=ఈవిధముగా "ఇది యనాత్మ, ఇది యాత్మ, నే నాత్మరూపుఁడను, అనాత్మను కాను" అని, ఆమదిన్=ఆమనస్సును, కదిసి=పొంది, తెలియునతఁడె=తెలిసికొనువాఁడె, స్వప్రకాశాత్ముఁడగున్=స్వప్రకాశస్వరూపుఁడై యున్నాఁడు.

తా. "ఇది యనాత్మ, ఇది బ్రహ్మము, నేను అనాత్మను కాను, బ్రహ్మమును" అని తెలిసికొనునప్పుడు మనస్సు కలదా? లేదా? యని ప్రశ్నఁజేసితివి కదా? వినుము. మనస్సు జడము. చైతన్యప్రధానములేక ప్రకాశింపదు. కావున నిట్టి మనస్సు "ఇది యనాత్మ" అను మొదలగు విషయముల గ్రహింపలేదు. జడమునకు జ్ఞానశక్తి లేదు కదా! కావున మనస్సు నాశ్రయించి "ఇది బ్రహ్మము", అను మొదలగు సర్వ విషయ ముల గ్రహించువాఁడు స్వప్రకాశరూపుఁడగు పరబ్రహ్మమే కావున సమాధినిగూర్చి చెప్పునపుడు మనోవిషయమగు నాక్షేపము సంభవింపదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇట్లు సంక్షేపముగా హనుమంతుని సంశయమును నివారించి "ఇట్టిప్రశ్నకే యవకాశములేదు" అనియుం "మనస్సు ఉన్నను లేకున్నను సమాధికి భంగ మేమియు రాదు" అనియుం నిరూపించుచున్నాఁడు:—

చ. మనసు జడంబు దృశ్య మణుమాత్ర మసన్నియతావితర్క్యముల్
జననవినాశయుక్తమును సంశయరూపము దీనియున్కిచే
తను సుఖచిత్ప్రకాశమయతం దగునీకుఁ గళంక మేమి చ
క్కనిశశిశృంగదోషములు గల్గునె సూర్యుని కెన్నఁడేనియున్ 72

టీ. మనసు=మనస్సు, జడంబు=జ్ఞానశూన్యమైనది, దృశ్యము = నీకు గోచరమగునది, అణుమాత్రము=అణుస్వరూపమైనది, అసత్ . . . ముల్-అసత్=శూన్యరూపమైనది, నియత = నిశ్చయముగ (లేక నియమముగ నుండునది యని), అవితర్క్యముల్ = ఊహింప (లేక నిర్ణయింప) శక్యముకానిది. జనన వినాశయుక్తమును=ఉత్పత్తి వినాశములు కలది, సంశయరూపము=సందేహమే స్వరూపముగాఁ గలది (లేక ఉన్నదనికాని, లేదనికాని నిర్ణయించుటకు వీలులేనిది), దీని యున్కిచేతన్=ఇది యుండుటచేత, సుఖచిత్ప్రకాశమయతన్-సుఖ=ఆనందము, చిత్=జ్ఞానము, ప్రకాశమయతన్ = స్వయం ప్రకాశము, అనునవియే స్వరూపముగా, తగునీకున్=ఒప్పుచున్న నీకు, కళంకమేమి=ఏ లోపము కలుగును (ఏమియుఁ గలుగ నేరదని భావము) ఎన్నఁడేనియున్=ఎప్పటికైనను, సూర్యునికిన్, చక్కని శశి శృంగదోషములు-చక్కని = సొగసైన, శశి = చంద్రుని యొక్క, శృంగ=కలలయొక్క (లేక శృంగములయొక్క), దోషములు=వృద్ధిక్షయాది దోషములు (లేక ఔన్నత్య తదభావాది దోషములు), కల్గునే = కలుగ నేర్చునా! (సూర్యుని తేజస్సునందలి యంశమే చంద్రునింజేరి రాత్రులయందుఁ బ్రకాశించును. ఇట్లున్నను చంద్రునకుఁ గలవికారములు సూర్యునంటవు. దీనికి చంద్రుఁడు దృశ్యమగుటయే కారణము అని తెలిసికొనవలయును.)

తా. బాగుగా విచారించిన మనస్సు జ్ఞానశూన్య మైనది. నీచేఁ బ్రకాశింపఁ జేయఁబడినది. ఈరెండు కారణములవలనను అది నీకంటె భిన్నమైనది యగును కదా. ఇట్లు లోకానుభవానుసారముగా "నీకంటె భిన్నమైన మనస్సొకటి యున్నది" అని తలంచినను పైన నిరూపించిన కారణమువలననే యది నీకుఁ గలంకమును గలిగింపఁ జాలదు. జడమగుటచే జ్ఞానరూపుఁడ వగునీకు నే విశేషమును గలిగింపనేరదు. సర్వమును జూచు సూర్యునికిఁ బ్రపంచగతవికారములేమియుఁ జెందనట్లు ఆమనస్సును బ్రకాశింపఁ జేయు నీకు యథార్థస్థితిలో దానివికారము లంటకూడదు. ఇదియుం లోకానుభవసిద్ధమే కదా! మఱియుం కేవలలోకానుభవమును విడిచి కొంత శాస్త్రానుగుణముగాఁ జర్చించిన నామనస్సు అణురూపము కలదు. ఏపదార్థమునకు నవయవము లుండునో అపదార్థ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మవశ్యము నశించును" అనునియమము సర్వశాస్త్రసమ్మతమై యున్నది. ఈనియమమును బట్టి చూచిన మనస్సు ఒకప్పుడు కాకున్న మఱియొకప్పుడైనను నశించునదియే యగును. నీవు నిత్యుఁడవు కావున నామనస్సు నీస్వరూపమునకు హానిని కలిగింపలేదు. సావయవ మగుపదార్థము నిరవయవ మగు వస్తువునకు నేవికారమును గలిగింపఁగలదు. ఇట్లుగాక యథార్థస్థితిని (వేదాంతసిద్ధాంతమును) బట్టి చూచిన నామనస్సు శూన్యరూప మైనది. "ఉన్నది అనఁగా: బ్రహ్మమునకంటె భిన్నముగ నున్నది" యని తలంచుటకే వీలులేనిది. సర్వప్రపంచంబును నీయందే యారోపింపంబడి యున్నది; కావున ఈమనస్సు కూడ నీకంటె నన్యము కానేరదు. మఱియుం "ఉన్నదా లేదా" అనుసంశయమునకు నాశ్రయ మైనది. (లేక సందేహమే స్వరూపముగాఁ గలది.) ఈయ భేదపక్షము నాశ్రయించిన "మనస్సు నిన్నేమియుఁ జేయనేరదు" అని మఱియొకమాటు చెప్ప నక్కఱలేదు కదా! ఆత్మరూపమైన యాత్మ నేమిచేయఁగలదు? ఇదియునుగాక నామనస్సున కుత్పత్తి వినాశము లుండుటయు నీకు నవి లేకుండుటయు ఈకారణమువలన నశ్వర మగుమనసు శాశ్వతుండ వగు నిన్నేమియుఁ జేయలేకుండుటయుం లోకమునందుఁ గూడ ననుభవసిద్ధ మైయేయున్నది. కావున భేదాభేదపక్షములనుబట్టి చూచినను శాస్త్రానుభవములనుబట్టి విచారించినను ఆమనస్సు నీకు వికారకారి కానేరదు. ఇదియంతయునట్లుండ సమాధియనిన సహజస్థితియే. కావున మనస్సుగాని మఱియేదిగాని నిత్యశుద్ధబుద్ధముక్తస్వరూపుఁడ వగు నీస్వభావమునకు భంగమును కలిగింపనేరదు. కావున సమాధిని జెఱుపనేరదు. ఈకారణమువలన లోకానుభవాదులనుబట్టి "సమాధియందు మనస్సు కలదు" అని తలంచినను "సమాధియందు మనస్సులేదు. అని తలంచినను ఆసమాధికిమాత్రము భంగము కలుగదు. త్రికాలములయందును లేని కుందేటికొమ్ముతో సర్వసాక్షి యగుసూర్యునికి సంబంధము లేనట్లు లేక నాకుందేటికొమ్మువలనఁ గలుగుదోషములు సూర్యునిఁజెందనట్లు శూన్యరూప మగు మనస్సువలనఁ గలుగుదోషములు నిన్నుఁ జెందవు కావున సమాధియందు మనస్సు వలన కలుగులోప మేమియుఁలేదు. సమాధినుండిమేల్కొనుట యనునదియుఁ మేల్కొనకుండుట యనునదియుఁ గూడ లేదు. భ్రాంతికాలమున భిన్నభిన్నములుగాఁ దలంపఁబడుచున్న సర్వపదార్థములను బ్రహ్మముగా నెఱింగినపిదప నీకు విక్షోభమె కలుగదుకదా? "దేహాభిమానే గళితే విజ్ఞాతే చ చిదాత్మని, యత్ర యత్ర మనో యాతి తత్ర తత్ర సమాధయః"="దేహాభిమానము వదలి పరబ్రహ్మమును సర్వమయునిగా నెఱింగినపిదప మనస్సు ఏద్రవ్యముపైఁ బ్రసరించినను ఆసర్వస్థలములయందును సమాధియే (నిర్వికల్పసమాధియే) యేర్పడును" అను ప్రమాణముననుసరించి సర్వమును బ్రహ్మముగా భావించువానికి నెప్పుడును సమాధియే కావున సర్వసంశయములను విడువుము.

Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇట్లు సర్వసంశయనివారకంబగు రహస్యార్థము నుపదేశించి దానినే మఱింత విశదము చేయుచున్నాఁడు:—

తే. శశవిషాణంబునకు నాకసంబునకును
గలుగునె పొసంగ సంగంబు దలఁచి చూడ
మనమునకు సచ్చిదానందమయుఁడ వైన
నీకుఁ బొందిక యెన్నఁడేనియును గలదె? 73

టీ. తలఁచిచూడఁగ=విచారింపఁగా, శశవిషాణంబునకుఁ=కుందేటికొమ్మునకును, ఆకసంబునకుఁ=ఆకాశమునకును, సంగంబు=కూడిక, పొసంగఁ=ఒప్పునట్లుగా, కలుగునే=సంభవించునా? మనమునకుఁ=మనస్సునకును (శూన్యరూపమైనమనస్సునకును), సచ్చిదానందమయుఁడవైననీకుఁ=సత్యజ్ఞానానందరూపుండవైననీకును, పొందిక=కూడిక, ఎన్నఁడేనియును గలదే=ఎప్పటికైన నున్నదా? (ఎప్పటికిని లేదనుట.)

తా. శూన్యరూపమగు కుందేటికొమ్మును శాశ్వతమగు నాకసమునకును సంబంధము లేనట్లు జ్ఞానాజ్ఞానములలో నెప్పుడును మనస్సునకును నీకును సంబంధము లేదు.

తే. స్వప్రకాశుండ వగునిన్ను సన్మనోవి
కారములు పొందునే పటికంపుఁగొండ
నెన్నఁడేనియుఁ గలలోనఁ గన్నయట్టి
సంజకెంజాయ లంటునే యాంజనేయ! 74

టీ. ఆంజనేయా! స్వప్రకాశుండవగునిన్నుఁ=స్వప్రకాశస్వరూపుఁడవైననిన్ను, సన్మనోవికారములు-సత్=శ్రేష్ఠమైన, మనః=మనస్సుయొక్క, వికారములు, పొందునే=పొందునా? (పొందవనుట.) ఎన్నఁడేనియుఁ=ఎప్పటికైనను, పటికంపుకొండఁ=స్ఫటికశైలమును, కలలోనఁ, కన్నయ...యలు-కన్నయట్టి=చూచినయట్టి, సంజ=సంధ్యాకాలపు, కెంజాయలు=ఎఱుపు, అంటునే=అంటునా? (అంటవనుట.)

తా. ఓయాంజనేయా! కలలోఁ జూచినసంధ్యారాగము వాస్తవమగు స్ఫటికపర్వతము నంటనియట్లు అసత్యరూపమగు మనస్సువలన జనించువికారములును అసత్యరూపములే యగుటచేత నిన్నంటవు.

వ. కపీంద్రా! జడఘటపటాదియుక్తంబులైన ఛిద్రత్వాచ్ఛిద్రత్వశ్లక్ష్ణత్వాశ్లక్ష్ణత్వస్పృష్టిమత్త్వాస్పృష్టిమత్త్వాదివికారంబులు విశ్వప్రకాశకుండైనయాదిత్యునిం బొరయనేరనితెఱంగున నహంకారాదిమానసేంద్రియశరీరాదివిషగుణదోషంబులు స్వయంప్రకాశాత్మకుండవైన నిన్ను బొందవు. వాయుతేజోజలభూములును దత్కార్యంబులును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దనయందుఁ గలిగియు దా నన్నిటియందు వ్యాపించియు నేమిటి
నంటని మింటిపగిదిఁ జిత్తాదిసర్వకారణకార్యంబును నిన్నాశ్రయించి
నీయందు నిలిచియుండ సర్వవ్యాపకుండవయ్యు నసంగుండవైన
నీవేమిటికిం జెంద వట్లగుటం జేసి. 75

టీ. కపీంద్రా=వానరశ్రేష్ఠా! జడ...లు-జడ=జ్ఞానశూన్యములైన, ఘట=కుండ, పట=మన్నవస్త్రము, ఆది=మొదలగువానితో, యుక్తంబులు=కూడియున్నవి, ఐన...బులు-ఐన = అయినట్టి, ఛిద్రత్వ=రంధ్రములు గలిగియుండుట (లేక రంధ్రరూపము లేకుండుట), అచ్ఛిద్రత్వ=రంధ్రములులేకుండుట (లేక రంధ్రరూపము రాకుండుట), శ్లక్ష్ణత్వ=సన్నముగా నుండుట, అశ్లక్ష్ణత్వ = లావుగానుండుట, స్పృష్టిమత్వ=స్పృశింప సర్హమైయుండుట, అస్పృష్టిమత్వ=స్పృశింప సర్హము కాకుండుట, ఆది=మొదలయిన, వికారంబులు, విశ్వప్రకాశుండైన=సర్వప్రపంచమును బ్రకాశింపఁజేయునట్టి (అనఁగా: ఆఘటపటాదులఁ బ్రకాశింపఁజేయునట్టి), ఆదిత్యునిన్=సూర్యుని, పొరయనేరని తెలఁగునన్ = పొందనట్లు, అహం...బులు-అహంకార=అహంకారము, ధీ=బుద్ధి, మానస=మనస్సు, ఇంద్రియ=దశేంద్రియములు, శరీర=శరీరము, ఆది=మొదలగు, విషయ=విషయములయొక్క (అనఁగా: పదార్థములయొక్క), గుణ=గుణములును, దోషంబులు=దోషములును, స్వయంప్రకాశాత్మకుండవైన=స్వయంప్రకాశరూపుఁడవైన, నిన్నుపొందవు. వాయు...లును - వాయు = వాయువు, తేజః=అగ్ని, జల=నీరు, భూములును=భూమియును భూతములును, తత్కార్యంబులును=ఆభూతములవలనఁ బుట్టినప్రపంచంబును, తనయందుఁగలిగియున్ = తనయందుండినను, తానన్నింటియందున్, వ్యాపించియున్=వ్యాపించి యుండియును, ఏమిటన్=దేనితోను, అంటనిమింటిపగిదిన్=సంబంధపడనిశూన్యాకాశమువలె, చిత్తాది...బులు-చిత్తాది=మనస్సుమొదలయిన, సర్వ=సమస్తములైన, కారణ=కారణములును, కార్యంబులు=ఆకారణములవల్ల జనించినప్రపంచంబును, నిన్నాశ్రయించి = పరమాత్మరూపుఁడవగు నిన్నాశ్రయించి, నీయందు నిలిచియుండన్, సర్వవ్యాపకుండవయ్యున్=సర్వమునందును నీవు వ్యాపించి యుండియును, అసంగుండవైననీవు=దేనితోను సంబంధపడుస్వభావములేని నీవు (అనఁగా: నీకట్టిస్వభావము లేకపోవుటచే అట్టిస్వభావము లేకపోవుటకు సాక్షియగుటయే కారణము సాక్షికిని సాక్ష్యమునకును సంబంధ మెన్నటికిని కలుగదుకదా!), ఏమిటం జెందవు = దేనితోను సంబంధపడవు, అట్లగుటంజేసి=కాఁబట్టి.

తా. సూర్యునిచేఁ బ్రకాశింపఁజేయఁబడు ఘటాదుల నాశ్రయించియున్న ఛిద్రత్వము (రంధ్రరూపమై యుండుట) అచ్ఛిద్రత్వము (నిండైయుండుట) సన్నముగా నుండుట లావుగానుండుట తాఁకుటకు శక్యమగుట కాకుండుట మొదలగు ధర్మము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లాసూర్యునిఁ జెందని విధంబున నీకు దృశ్యమగు మనస్సునకుఁగల సంకల్పాది వికారములు నిన్నంటవు; మఱియు పృథివ్యాపస్తేజోవాయువు లనువానివలనఁ బుట్టిన సర్వపదార్థములును దనయందున్నను తా నన్నిటియందు వ్యాపించియున్నను ఆకాశము దేనిలోను సంబంధపడనట్లు నీవును సర్వపదార్థములతోఁ గూడి సర్వపదార్థములకును ఆధారమై యున్నను వాని నంటవు కావున.

అవ. ఇట్లు సంశయమును నిశ్శేషముగాఁ దీర్చి యనుభవమును నుపదేశించుచున్నాఁడు:—

తే. ఇంద్రియమనంబు లటు చలియించెనేని
నేఁ జలించితి నంచు నీ వెఱుఁగఁబోకు
నిశ్చలుఁడ నంచుఁ దెలియుము నిన్నుఁ గాంచి
యవియు నతినిశ్చలము లగు నంతమీఁద. 76

టీ. ఇంద్రియమనంబులు-ఇంద్రియ = ఇంద్రియములును, మనంబులు=మనస్సును, అటు చలియించెనేనిన్-అటు, చలియించెనేనిన్=కదలినయెడల, ఏఁ జలించితినంచున్=నేను కదలితిని అని, నీ వెఱుఁగఁబోకు=నీవు తెలిసికొనవలదు. నిన్నున్=పరబ్రహ్మరూపుఁడవైన నిన్ను (అనఁగా: నీయథార్థస్వరూపమును), కాంచి=చూచి, నిశ్చలుఁడనంచున్=నేను చలించువాఁడను కాను అని, తెలియుము=నిశ్చయించుకొనుము, అంతమీఁదన్ = పిదప, అవియున్=ఆయింద్రియాదులు, అతినిశ్చలములగున్ = సంపూర్ణముగఁ జలింపనివియే యగును.

తా. పై కారణమువలన ఇంద్రియములుకాని మనస్సుకాని చలించినను నీవు స్వయముగాఁ జలించినట్లు భావింపకుము. నీవు సహజస్థైర్యము నవలంబించితివేని ఆ యింద్రియాదులును కదలనేరవు. నీవు అభిమానించుటవలననేకదా సర్వముఁ బ్రవర్తించుచున్నది. కాఁబట్టి దీని చాంచల్యము నిన్నేమియుఁ జేయదని విశ్వసింపుము.

తే. ఆత్మతేజంబు వీక్షించు నతనిమాన
సేంద్రియంబులు చేష్టల నెడల విడిచి
యొదిఁగి చెదరక కదలక యూఁకుందు
సింగములఁ గన్నగజములభంగి ననఘ! 77

టీ. అనఘ=ఓదోషరహితుఁడ, ఆత్మతేజంబున్=స్వస్వరూపమును, వీక్షించునతని ... ములు-వీక్షించునతని=చూచువానియొక్క, మానస=మనస్సు, ఇంద్రియంబులు=ఇంద్రియములు, చేష్టలన్=తమతమకార్యములను, ఎడలన్=సడలునట్లుగా, విడిచి, ఒదిగి=లీనములై, చెదరక, కదలక=కదలక, సింగములన్=సింహములను, కన్న గజములభంగిన్=చూచిన యేనుఁగులవలె, ఊరకుండున్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఓదోషరహితుఁడ! సింహమును చూచిన యేనుఁగువలె స్వస్వరూపము నవలోకించు పురుషుని చిత్తేంద్రియములు ఇటునటు దిరుగవు. బెదరవు. ఊరక యుండును. నీకు వానియం దాత్మాభిమాన ముండకపోవుటచేతను, స్వయముగాఁ దమకు జనించు సామర్థ్యము లేకపోవుటచేతను అవి కదలనేరవు.

చ. అవి యచలంబులైనయెడ నారయ నే నచలుండ నంచు నీ
ప్రవిమలదృష్టిఁ జూడకుము పావని వానిచలాచలత్వముల్
దవులవు నిన్ను నీవు సతతంబును వాని నెఱుంగుచుండుసా
క్షివి హృదయేంద్రియావిషయకేవలనిర్గుణమూర్తి వెప్పుడున్. 78

టీ. పావని=వాయుపుత్త్రా, అరయన్=విచారింపఁగా, అవి=ఆయింద్రియాదులు, అచలంబులైనయెడన్=కదలకుండునప్పుడు, నేన్=నేను, అచలుండనంచున్=కదులలేదు అని, నీప్రవి...దృష్టిన్-నీ=నీయొక్క, ప్రవిమల=నిర్మలమైన, దృష్టిన్ = జ్ఞానదృష్టి చేత, చూడకుముఁ=విచారింపవలదు (లేక చరింపవలదు), వాని చలాచలత్వములు=వాని కదలికయును కదలకుండుటయును, నిన్ను=బ్రహ్మరూపుఁడవైననిన్ను, తవులవు=అంటవు. నీవు, సతతంబున్ = ఎప్పుడు, వానిన్ = ఆయింద్రియాదులు (లేక వాని కదలికలు) మొదలగువానిని, ఎఱుఁగుచుండు సాక్షివి = తెలిసికొనుచుండుసాక్షివి, ఎప్పుడును, హృద...ర్తిని-హృదయ=మనస్సునకు, ఇంద్రియ=ఇంద్రియములకును, అవిషయ=గోచరముకాని, కేవల=అద్వితీయమైన, నిర్గుణ = గుణశూన్యమైన, మూర్తివి = ఆకారము గలవాఁడవు.

తా. ఓ వాయుపుత్త్రా! మఱియు నా చిత్తేంద్రియాదులు నిశ్చలములై యున్నప్పుడుకూడ నీవు స్వయముగా (అనఁగా నీకే నిశ్చలత్వము కలిగినట్లు) భావింపకుము. ఆ చిత్తేంద్రియాదుల చలనముతోఁగాని నిశ్చలత్వముతోఁగాని నీకు సంబంధము లేదు. నీవు సర్వసాక్షివి. సాక్ష్యగత వికారములతో సాక్షికి సంబంధము లేదనుట యనుభవసిద్ధమేకదా! మఱియు నిర్గుణమగు నీస్వరూపము మనస్సునకుఁ గాని ఇంద్రియములకుఁ గాని గోచరమగునదికాదు.

అవ. ఇట్లు జీవబ్రహ్మైక్యజ్ఞానమువలన నమనస్కయోగము సిద్ధించుననియు అప్పుడు మనస్సు కలదనినను లేదనినను విరోధము లేదనియుఁ జెప్పి యావిషయమునే మఱియొకవిధముగా నిరూపించువాఁడై మొదట దృష్టాంతమును వివరించుచున్నాఁడు:—

సీ. మును దండకారణ్యమున నొక్కపుణ్యాశ్ర
మమునఁ దాపసవేష మమరఁ దాల్చి
బ్రహ్మర్షిలోకసభామధ్యమంబున
నురుసుఖాసీనత నొప్పుచున్న

Jangamwadi Math Collection. Digitized by eGangotri

* సీతారామా—67

నను జూడఁగాఁ గోరి మునికన్యకలు సీత
ముందట నిడుకొని ముదిత యితఁడొ
యతఁడొ నీపతి యని యచటిమౌనులఁ బ్రీతి
విభజించి యడుగ నవ్వేలఁది సిగ్గు
తే. కలిమి వారల నందఱిఁ గాఁడు కాఁడ
టంచుఁ దల యూఁచుచుండి న న్గాంచినప్పు
డొకఁడ నౌఁ గాఁడనక యూర కుండె న త్తె
ఱంగుఁ గని సంతసిల్లి రారమణు లెల్ల. 79

టీ. మును = పూర్వమున, దండకారణ్యమునన్, ఒక్క-పుణ్యాశ్రమమునన్ = ఒక పవిత్ర మగు నాశ్రమమునందు, తాపసవేషమున్ = ఋషి వేషమును, అమరన్ = చక్కఁగా, తాల్చి = ధరించి, బ్రహ్మ...బునన్ - బ్రహ్మర్షిలోక = బ్రహ్మర్షిసమూహముయొక్క, సభా=సభయొక్క, మధ్యంబునన్ = నడుమను, ఉరుసుఖాసీనతన్-ఉరుసుఖ = మిగుల సుఖముగ, ఆసీనతన్=కూర్చుండి, ఒప్పుచున్ననన్ను=ఉన్ననన్ను, మునికన్యకలు=ఋషి కన్యలు, చూడఁగాఁగోరి = చూడవలయు ననుతలంపుతో, సీతన్ = సీతాదేవిని, ముందటన్=తమయగ్రభాగమున, ఇడుకొని = ఉంచుకొని, ముదిత = ఓసీత, నీపతి = నీభర్త, ఇతఁడో యతఁడో, అని, ప్రీతిన్=ప్రేమతో, అచటిమౌనులన్=అచ్చటనున్నమునులను, విభజించి = ప్రత్యేకముగాఁ జూపి, అడుగన్ = ప్రశ్నచేయఁగా, అవ్వేలఁది = ఆస్త్రీ (సీత), సిగ్గుకలిమిన్ = సిగ్గుచేత, వారలనందఱన్, కాఁడుకాఁడటంచున్ = ఈతఁడు నాభర్త కాఁడు, అని తలయూఁచుచుండి, నన్గాంచినపుడు = నన్నుఁ జూడఁగానే ఒకటన్ = ఒకరీతిగా, నౌఁగాఁడనక = "ఇతఁడే నాభర్త" అని కాని, "ఇతఁడు నాభర్త కాఁడు" అని కాని చెప్పక, ఊరకుండెన్, ఆరమణులెల్లన్ = ఆకన్య లందఱును, అత్తెఱంగున్ = ఆవిధమును, కని = చూచి, సంతసిల్లిరి = సంతోషము నొందిరి.

తా. పూర్వమున ఋషి వేషములు దాల్చి దండకారణ్యమున విహరించుచు నొక యాశ్రమమున మౌనులతోఁ గూడి నేను గూర్చుండియున్నప్పుడు ఋషిభార్య లంద ఱును నన్నుఁజూడవలయు ననుతలంపుచే సీతనుముందిడుకొని యాప్రదేశమునకు వచ్చిరి. సీతను జూచి "ఇచ్చట కూర్చుండి యున్నవారలలో నీభర్త యెవ్వఁడు" అని ప్రశ్నఁ జేయుచు నచ్చట నున్నమునుల వేఱ్వేఱఁజూపుచువచ్చిరి. ఈసీతయుఁ "ఇతఁడు కాఁడు" అని మౌనుల నందఱ నిషేధించుచువచ్చి నన్నుఁజూపఁగానే ఇతఁడు నాభర్త అని కాని అతఁడు నాభర్త కాఁడు అని కాని చెప్పక యూరకుండెను. దానివలన హృదయము నందలి యభిప్రాయము నెఱింగి యాఋషిపత్ను లందఱును సంతసించిరి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇట్లు దృష్టాంతమును జెప్పి దార్ష్టాంతికమును జూపుచున్నాఁడు:—

మ. స్థిరవైరాగ్యవివేకయుక్త యగుసద్ధీవృత్తి యారీతి ని
ప్పరమాభాసున కాత్మచిత్సుఖరసప్రత్యక్షపర్యంతముల్
గరిమన్ దేహగతేంద్రియాసుహృదహంకారంబులం దోఁచునా
త్మరతి న్నేనది కాను కాననిన నంత న్నిల్చుఁ గాష్ఠాకృతిన్. 80

టీ. స్థిరవైరాగ్యవివేకయుక్తయగు-స్థిరవైరాగ్య = స్థిర మైన వైరాగ్యముతోను, వివేక=జ్ఞానముతోను, యుక్తయగు=కూడియున్నట్టి, సద్ధీవృత్తి = శ్రేష్ఠ మైన బుద్ధివృత్తి, ఆరీతిన్ = అట్లే (అనఁగా సీత నావిషయమునఁ బ్రవర్తించినట్లే), అప్పరమాభాసున కున్ = ఆశ్రేష్ఠమగు బ్రహ్మప్రతిబింబమునకు (జీవునకు), ఆత్మచిత్సుఖరసప్రత్యక్షపర్యంతముల్-ఆత్మ = స్వస్వరూపమైన, చిత్సుఖరస = జ్ఞానానందరసముయొక్క, ప్రత్యక్ష పర్యంతముల్=ప్రత్యక్షస్థితివఱకును, గరిమన్=గౌరవముతో, దేహ...బులన్-దేహ= దేహమునందును, గత=ఆదేహమునందున్న, ఇంద్రియ=ఇంద్రియములయందును, అసు= ప్రాణములయందును, హృత్=మనస్సునందును, అహంకారంబులన్ = అహంకారమునందును, తోఁచున్=తోఁచునట్టి, ఆత్మరతిన్=ఆత్మాభిమానమును, నేనదికానుకాననిన్= ఈదేహము మొదలగునవి నాయథార్థస్వరూపములు కావు అని నిషేధించుచువచ్చి, అంతన్=పిదప (అనఁగా బ్రహ్మసాక్షాత్కారముకలుగఁగానే), కాష్ఠాకృతిన్=స్తంభము వలె (ఏమియుఁ జేయక), నిల్చున్.

తా. పైదృష్టాంతమునందు నావిషయమున సీత యాచరించిన విధముననే వివేక వైరాగ్యసంపన్న యగుధీవృత్తి పరబ్రహ్మవిషయమున నాచరించును. జీవునకును బ్రహ్మ సాక్షాత్కారము కలుగునంతవఱకు దేహాదులయం దదివఱ కున్నయాత్మాభిమానమును దొలఁగించుచు "నేను దేహమును కాను! ఇంద్రియములను కాను" అనునప్పు డంతయు నాధీవృత్తి యుండును. బ్రహ్మమును జూడఁగానే "ఇది నాస్వరూపము" అని కాని "ఇది నేను కాను" అని కాని చెప్పక స్తంభమువలె నూర కుండును.

అవ. ఇట్లు దృష్టాంతదార్ష్టాంతికముల వివరించి పర్యవసానమును జెప్పుచున్నాఁడు:—

తే. ఆచిదాభాసుఁ డాబుద్ధి నధిగమించి
యాత్మచైతన్యతేజంబునందుఁ దనదు
వెలుఁగు నైక్యంబుఁ జేయ ధీవృత్తి లేక
యెండలో దీప మున్నయట్లుండు ననఘ! 81

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. అనఘ=దోషరహితుఁడా, ఆచిదాభాసుఁడు = ఆజీవుఁడు, ఆబుద్ధిన్, అధిగమించి=పొంది, ఆత్మ...నందున్-ఆత్మ=స్వస్వరూపభూత మైన, చైతన్య=జ్ఞానమనెడు, తేజంబునందున్ = దివ్యప్రకాశమునందు, తనదువెలుఁగున్ = తనకాంతిని (తనను), ఐక్యంబుచేయున్ = సర్వపదార్థములను గ్రమముగ నిషేధించి యేకముఁ జేయఁగానే, ధీవృత్తి = బుద్ధివృత్తి, లేక = శూన్యరూపమై, ఎండలోన్, దీప మున్నయట్లుండున్ = స్వరూపహీనమైయుండును.

తా. ఓదోషరహితుఁడ! ఇట్లు బుద్ధివృత్తిశూన్యమై నిలుచునంతవఱకు ఆజీవుఁడును దాని నాశ్రయించి సర్వమును నిషేధించుచు వచ్చి తుదకు స్వస్వరూపభూతమగుకూటస్థచైతన్యము గానరాఁగానే తానందైక్య మగును. అప్పుడు బుద్ధియుం నిశ్చలయగుటచేత నుండియుం లేనిదై యెండలోని దీపమువలె స్వరూపశూన్యమై యుండును. ఇదియే సహజస్థితి కావున సమాధియందు మనస్సు కలదా? లేదా! అను ప్రశ్నమునకే యవకాశము లేదు.

అవ. పైవిషయమునే మఱియొకవిధముగాఁ దెలిపి యమనస్కోపదేశము నుపసంహరించుచున్నాఁడు:—

వ. ఇట్లు శరీరేంద్రియప్రాణమనోబుద్ధిసమన్వితం బైనయహంకారంబుతో సహజతాదాత్మ్యంబు గలస్వాధిష్ఠానచిదాభాసుండు నిద్రావసరంబున సర్వవ్యాపారంబులఁ జాలించి శయ్యాతలంబున స్థూలదేహంబు డించి యింద్రియంబుల విడనాడి ప్రాణంబుల డిగ్గవిడిచి మనశ్చిత్తంబుల నహంకారంబునం దడంచియయ్యహంకృతిని ధీవృత్తియందొదిఁగించి యంతర్ముఖుం డై యవిద్యాధిష్ఠానచైతన్యసాన్నిధ్యంబునకు సుఖంబుగా నరిగి ప్రియమోదప్రమోదాదివృత్త్యాత్మకానందమయకోశంబునం దనకు నుపాధిభూతంబై నానావిధవాసనావాసితం బగు ధీవృత్తి దిగనాడి యనాద్యనిర్వచనీయాజ్ఞానతమోభిభూతుం డై యంతట నిత్యనిరుపాధికనిరతిశయ బ్రహ్మానుభవసాగరమగ్నుం డైన చందంబునఁ బూర్ణాధికారియై సమాధిసమయంబున మొదల నేదృశ్యంబు గాను ద్రష్టననియు ద్రష్టనుగాను ద్రష్టనసువృత్తియు దృశ్యంబుగావున దీనికి ద్రష్టననియు నివ్విధంబునవిజాతీయప్రత్యయ శరీరేంద్రియ తిరస్కారసజాతీయ ప్రత్యయవ్యవహారాంగీకార పూర్వకంబుగాఁ గేవలనిజానందానుభవపర్యంతంబ శేషదృశ్యవృత్తి నిషేధంబొనరించుచు ధీవృత్తిసాక్షికూటస్థ చైతన్యసామీప్యంబు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సకుఁ జనుచుండ నెప్పుడఖండసచ్చిదానంద స్వరూపాత్మ సాక్షాత్కారం బగు నప్పుడు ప్రచండాతపమధ్య నిక్షిప్తకర్పూరదీపంబుభంగిఁ బరిపూర్ణప్రత్యగభిన్నపరబ్రహ్మచైతన్యంబుతో నేకీభూతుండై యానందించుచుండు నిట్లుండు నతండు తన్నుఁదాఁ గనుంగొనుచుఁ దనకు నభిముఖుండై యుండమింజేసి యమ్మనంబు జడంబు గావున నివాతదీపంబుభంగిఁ గదలక యుండియు సంకల్పరూపంబుగాఁ బరిణమింపమిం జేసి లేనియట్లుండు నిదియే సహజామనస్కరాజయోగసమాధి, యిదియే జీవన్ముక్తి యని యుపదేశించునెడ నిజముఖారవిందంబు విలోకించుచు ముసిముసి నగవులునగు సీతాదేవినెమ్మొగంబు వీక్షించి వికసితవదనకమలుండై యవ్విశుద్ధసత్వబ్రహ్మాత్మైక్యజ్ఞానాకారవృత్తియే యిప్పరమపతివ్రతాశిరోమణి యగుఁ జుమ్మి నాకు నిత్యానపాయినియు సర్వాభీష్టఫలప్రదాయినియు వశవర్తినియు నైయుండు నే నీధీవృత్త్యధిష్ఠానవిశుద్ధచైతన్యంబు మత్స్వరూపానుభవంబు సేయు మని జ్ఞానముద్రచే నభినయించి చూపి క్రమ్మఱ నిట్లనియె. 82

టీ. ఇట్లు = ఈవిధముగ, శరీర...బైన-శరీర=శరీరములతోను, ఇంద్రియ = ఇంద్రియములతోను, ప్రాణ=ప్రాణములతోను, మనః=మనస్సుతోను, బుద్ధి = బుద్ధితోను, సమన్వితంబైన = కూడియున్న, అహంకారంబుతోఁ = అభిమానముతో, సహజతాదాత్మ్యంబు - సహజ = స్వభావసిద్ధమైన (అనఁగా అవిద్యాకల్పితమైన), తాదాత్మ్యంబు =అభేదభావన, కలస్వాధిష్ఠాన...సుండు-కల = కలిగియున్న, స్వాధిష్ఠాన = స్వస్వరూపమే ఆధారముగాఁగల, చిదాభాసుండు=జీవుఁడు, నిద్రావసరంబునఁ = నిద్రయందు, సర్వవ్యాపారంబులఁ = సమస్తకార్యములను, చాలించి, శయ్యాతలంబునఁ = పడకయందు, స్థూలదేహంబుఁ = స్థూలశరీరమును, డించి=విడిచి, ఇంద్రియంబులఁ = ఇంద్రియములను; విడనాడి = వదలి, ప్రాణంబులఁ, డిగ్గవిడచి, మనః చిత్తంబులఁ, అహంకారంబునందుఁ = అభిమానంబునందు, అడంచి = లయము చేసి, అయ్యహంకృతిఁ =ఆయహంకారమును, ధీవృత్తియందుఁ =బుద్ధి వృత్తియందు, ఒదిఁగించి=లీనముగావించి, అంతర్ముఖుండై = బ్రహ్మాభిముఖుఁడై, అవిద్యా...నకుఁ -అవిద్యా=అవిద్యకు, అధిష్ఠాన = ఆధారభూతుఁడైన, చైతన్య = బ్రహ్మముయొక్క, సాన్నిధ్యంబునకుఁ = సమీపమునకు, సుఖంబుగాఁ, అరిగి = పోయి, ప్రియ...బునఁ - ప్రియ = ఇష్టవస్తుసందర్శనమువలనఁ గలుగు నానందము, మోద = తత్ప్రాప్తివలనఁ గలుగు నానందము, ప్రమోద = దాని యనుభవమువలనం గలుగు నానందము, ఆద = మోద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లైన, వృత్త్యాత్మక = మనోవృత్తులే స్వరూపముగాఁగల, ఆనంద మయకోశంబునన్ = ఆనందమయకోశంబునందు, తనకున్, ఉపాధిభూతంబై = ఆవరణమై (అనఁగా జీవత్వమునుగలిగించినదై) నానా...తంబు-నానావిధ = అనేకవిధములైన, వాసనా=కర్మవాసనలచేత, ఆవాసితంబు = నివసింపఁబడినది, అగుధీవృత్తిన్ = అయినట్టి బుద్ధివృత్తిని, విగనాడి=వదలి, అనా...తుండై-అనాది=మొదలు లేనట్టియు, అనిర్వచనీయ = "ఇట్టిది" అని చెప్పరానట్టియు, అజ్ఞానతమః = అజ్ఞానాంధకారముచే, అభిభూతుండై = తిరస్కరింపఁబడియుండియు, అంతటన్ = బుద్ధివృత్తిని విడచినపిదప, నిత్య...గ్నుఁడు-నిత్య=శాశ్వతమయినట్టియు, నిరుపాధిక=ఉపాధిలేనట్టియు, నిరతిశయ=సర్వాధిక మైనట్టియు, బ్రహ్మానుభవసాగరమగ్నుండైనచందంబునన్ = బ్రహ్మానుభవమున మునుఁగునట్లు, పూర్ణాధికారియై=సంపూర్ణమైనయధికారము కలిగి అనఁగా నజ్ఞానమును ధ్వంసము చేసినపిదప, సమాధిసమయంబునన్=నిర్వికల్పసమాధియందు, మొదలన్=మొట్టమొదట, నే, దృశ్యంబుగాను=నేను దృశ్యపదార్థమును (బ్రపంచమును) గాను, ద్రష్టననియున్ = 'చూచువాఁడను' అనియుఁను, ద్రష్టనుగాను='నేను' చూచువాఁడనుగాను, ద్రష్టననువృత్తియున్ =నేను ద్రష్ట అనుచిత్తవృత్తియు, దృశ్యంబుగావునన్ = చూడఁబడుచున్నదియే కావున, దీనికిన్=ఈచిత్తవృత్తికి, ద్రష్టననియున్=నేనే ద్రష్టను (అనఁగా సాక్షిని) అనియుఁను, ఇవ్విధంబునన్ = ఈవిధముగా, విజా...ముగాన్-విజాతీయ = విరుద్ధజాతిగల (అనఁగా స్వస్వరూపమునకు విరుద్ధములైన,) ప్రత్యయ = జ్ఞానములను (అనఁగా సంకల్పములను,) శరీరేంద్రియ=శరీరములను ఇంద్రియములను, తిరస్కార = తిరస్కరించుటయును, సజాతీయ=సమానజాతిగల (అనఁగా స్వస్వరూపావిరుద్ధములయిన) ప్రత్యయ = జ్ఞానములను, వ్యవహార=అట్టివ్యవహారములను, అంగీకార = అంగీకరించుటయును, పూర్వకంబుగాన్ = మొదలుగా, కేవల...తంబు-కేవల = అద్వితీయమైన, నిజ = స్వకీయమైన (అనఁగా స్వస్వరూపభూతమైన), ఆనంద = బ్రహ్మానందముయొక్క, అనుభవపర్యంతంబు = అనుభవము గలుగువఱకు, అశేష...దంబు-అశేష = సమస్తములైన, దృశ్యవృత్తి = చూడఁబడునట్టి చిత్తవృత్తులయొక్క, నిషేధంబు = నిరాకరణము, ఒనరించుచున్=చేయుచు, ధీవృత్తి...నకున్-ధీవృత్తి = బుద్ధివృత్తికి, సాక్షి=ద్రష్టయైన, కూటస్థచైతన్య = కూటస్థబ్రహ్మముయొక్క, సామీప్యంబునకున్=సమీపమునకు, చనుచుండన్=పోవుచుండఁగా, ఎప్పుడు = ఏసమయమున, అఖండ...బగున్ - అఖండ = అపరిచ్ఛిన్న మయిన, సచ్చిదానందస్వరూప = సత్యజ్ఞానానందస్వరూపమైన, ఆత్మ = బ్రహ్మముయొక్క, సాక్షాత్కారంబగున్ = ప్రత్యక్షమగునో, అప్పుడు = ఆసమయమునందు, ప్రచండ...భంగిన్-ప్రచండ = తీవ్రమైన, ఆతప = ఎండయొక్క, మధ్య = మధ్యాయందు, నిక్షిప్త = ఉంచఁబడిన, కర్పూరదీపంబుభంగిన్ = కర్పూరదీపమువలె, పరి...బులోన్

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పరిపూర్ణ=సర్వవ్యాపక మైనట్టియు, ప్రత్యక్=కూటస్థునికంటె, అభిన్న = వేఱు కాన ట్టియు, పర = ప్రపంచమునకంటెవేఱైనట్టియు, బ్రహ్మచైతన్యంబుతో = బ్రహ్మస్వరూప ముతో, ఏకీభూతుండై = ఐక్యమునొంది, ఆనందించుచుండుక్, ఇట్లుండునతండు=ఇట్లు న్నవాఁడు, తన్నుక్ = తనయథార్థ స్వరూపమును, తాక్ = స్వయముగా, కనుంగొను చుక్=చూచుచు, తనకుక్ (మనస్సునకు), అభిముఖుండై=ఎదుటై, ఉండమింజేసి=ఉండ కుండుటవలన, ఆత్మనంబు=అమనస్సు, జడంబుగావునక్ = స్వాభావికముగా జ్ఞానశూన్య మైన దగుటచే, నివాతదీపంబుభంగిక్ = గాలిలేనిచోటనున్న దీపముచలె, కదలక యుం డియుక్, సంకల్పరూపంబు గాక్=సంకల్పరూపముతో, పరిణమింపమింజేసి = వెలినరా కుండుటవలన, లేనియట్లుండుక్ = శూన్యమయినవిధమున నుండును, ఇదియే, సహజా మనస్క....సమాధి-సహజ = స్వభావసిద్ధమైన, అమనస్క=మనస్సు లేని, రాజ = శ్రేష్ఠ మైన, యోగ=యోగముయొక్క, సమాధి=నిష్ఠ, ఇదియే, జీవన్ముక్తియని = జీవునిముక్తి యని, ఉపదేశించునెడక్=ఉపదేశించునప్పుడు, నిజముఖారవిందంబుక్=తన (రాముని) ముఖకమలమును, విలోకించుచుక్ = చూచుచు, ముసిముసినగవులునగు = మందస్మిత ముచేయుచున్న, సీతా దేవి నెమ్మొగంబు=సీతాదేవియొక్క ముఖమును, వీక్షించి=చూచి, వికసి...లుండై-వికసిత = వికసించిన, వదనకమలుండై = ముఖకమలము గలవాఁడై, అవి...వృత్తియే-అవిశుద్ధసత్వ = అనిర్మలసత్వముగలిగినట్టియు, బ్రహ్మ=పరబ్రహ్మము, ఆత్మ = తాను, ఐక్య = ఒక్కటియే, జ్ఞానాకార = అనుజ్ఞానమే యాకారముగాఁగల, వృత్తియే=బుద్ధివృత్తియే, ఇప్పరమపతివ్రతాశిరోమణి = ఈపరమపతివ్రత (సీత), అగుఁ జుమ్మి = అయున్నదిసుమా, నాకుక్, నిత్యానపాయినియుక్-నిత్య = ఎల్లప్పుడును, అన పాయినియుక్ = తొలఁగిపోనిదియును, సర్వాభీష్టఫలప్రదాయినియు-సర్వాభీష్ట=సర్వ విధములైనకోరికలయొక్క, ఫల=ఫలములను, ప్రదాయినియుక్ = ఇచ్చునట్టిదియును, వశవర్తినియునై=నాకుస్వాధీనమైనదియునునై, ఉండుక్, నేక్ = నేను, ఈధీ...బుక్-ఈ =ఈపైచెప్పఁబడిన, ధీవృత్తి=బుద్ధివృత్తికి, అధిష్ఠాన=ఆశ్రయభూతమైనట్టియు, విశుద్ధ= నిర్మలమైనట్టియు, చైతన్యంబుక్ = జ్ఞానమేస్వరూపముగాఁ గలవాఁడును, మత్స్వరూ పానుభవంబు-మత్ = నాయొక్క, స్వరూప = సచ్చిదానందస్వరూపముయొక్క, అను భవంబు=అపరోక్షానుభవమును, చేయుమని, జ్ఞానముద్రచేక్ = అంగుష్ఠతర్జనీసంయోగ రూపమైన చిన్ముద్రచేత, అభినయించి=అభినయముచేసి, చూపి, క్రమ్మఱక్=మఱియు, ఇట్లనియెక్=ఈవిధముగాఁ జెప్పెను.

తా. భ్రాంతివశగతుఁడైనజీవుఁడు సహితము నిద్రాసమయమునందు పరబ్రహ్మమున నైక్యమగుచుండును. దేహేంద్రియాదులతోఁ గూడినయహంకారమునం దాత్మాభి మానముగలిగి ఒక్క.......(ప్రతిజీవుండును) .......ప్రదేశములయందు వ్యవహరించు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చున్నాఁడుగదా! ఇట్టివ్యవహారమును మాని స్వప్నావస్థయందు (అనఁగా నిద్రాసమయమున) స్థూలదేహమును శయ్యపై వైచి యహంకారసహితుఁడై యంతర్ముఖముగా వెళ్లలును. సుషుప్త్యవస్థయం దహంకారమును గూడ బుద్ధివృత్తియందడంచి క్రమముగా ప్రియమోద ప్రమోదరూప మగునానందమయకోశమున నాబుద్ధివృత్తిని కూడ నిలిపి బ్రహ్మమున నైక్యమునొందును. ఇట్లే భ్రాంతిరహితుం డగుయోగియు నంతర్ముఖుండైనప్పుడు మొట్టమొదట "నేను దృశ్యపదార్థమును కాను సాక్షిని" అని మొట్టమొదట దృశ్యపదార్థముల నన్నిటిని నిషేధించును. పిదప "నేను ద్రష్టను అనువృత్తియును దృశ్యమే కావున నదియు నేను కానేరను" అని ద్రష్టృత్వమును కూడ నిషేధించును. ఇట్లు సర్వమును నిషేధించుచు నాత్మాభిముఖుఁడై పోవఁగాఁ బోవఁగా నెప్పుడు స్వస్వరూపావలోకనము కలుగునో యప్పుడు సర్వసంబంధవర్జితుఁడై నిర్వికారుఁడై నిలుచును. ఈవిధముగా స్వరూపావలోకనమును జేయువాఁడు మనస్సు (లేక బుద్ధి) నభిమానింపఁడు. కావున నది (మనస్సు) యుండియు లేనిదేయగును. ఎండయం దున్నకర్పూరదీపమువలె స్వరూపశూన్యమైనదే యగును. ఇదియే యమనస్కయోగము. ఇదియే జీవన్ముక్తి. ఓ పార్వతీ! శ్రీరాముఁ డీవిధముగా సర్వము నుపదేశింపఁగానే సీతాదేవి తనస్వరూపము నెఱిఁగింపలేదను నభిప్రాయమున చిఱునగవుతో నారాముని మొగము నవలోకించెను. దానివలన సర్వము నెఱింగి యమ్మహాత్ముఁడును నగుచు నానందముతో నయ్యాంజనేయునిఁ జూచి ఇట్లనియె. ఓపుత్రా! మఱియొకవిశేషమును వినుము. పైవర్ణింపఁబడిన బుద్ధివృత్తియే ఈపతివ్రతాశిరోమణి; నన్నెప్పుడు విడిచియుండదు. భక్తులకు సర్వాభీష్టముల నొసంగుచుండును. బ్రహ్మాకారము గలబుద్ధివృత్తికి (సీతకు-మూలప్రకృతికి) నాధారభూతుఁడనైనబ్రహ్మరూపుఁడను నేనే. దీని నంతయు నెఱింగి వివేకయుక్తుఁడవై నా స్వరూపమును ననుభవింపుము. ఓగౌరీ! ఇట్లు సర్వము నెఱింగించి చిన్ముద్రచే జీవబ్రహ్మైక్యము నభినయించి చూపెను. మరల నీక్రిందివిధముగా నారంభించెను.

అవ. ఇట్లమనస్కయోగమును సమగ్రముగా నుపదేశించి మంత్రపూర్వకముగా తదనుభవము నెఱిఁగించుచున్నాఁడు:—

తే. ప్రేమ మీఱంగ శ్రీరామ! రామ! రామ!
యనుచు సతతంబు మత్స్వరూపానుభవముఁ
జేయువారలఁ దక్క నీసీత మిగుల
నెట్టివారలఁ జిక్కులఁ బెట్టు ననఘ! 33

టీ. అనఘ = ఓపాపరహితుఁడ, ప్రేమమీఱఁగన్ = మిగులప్రీతితో, శ్రీరామరామరామయనుచున్, సతతంబు=ఎల్లప్పుడును, మత్స్వరూపానుభవమున్-మత్స్వరూప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

=సాద్వితీయస్వరూపముయొక్క, అనుభవమున్ =అపరోక్షానుభవమును, చేయఁ వారలం దక్క =చేయఁనట్టివారలనుగాక, ఈసీత (మాయ), ఎట్టివారలన్ =ఎంతసామర్థ్యముగల వారినైనను, మిగులన్ =అధికముగా, చిక్కులఁబెట్టున్.

తా. ఓదోషరహితుఁడా "శ్రీరామరామరామ" అనుమంత్రము ననుష్ఠించుచు నేపురుషుఁడు మత్స్వరూపానుభవమును జేయునో వానికి నేసమాధివిఘ్నములును రావు. ఇట్లుకాక నీక నేయన్యమార్గము నాశ్రయించినను ఈసీత వారలను కలవర పెట్టకమానదు.

అవ. మాయాప్రభావమును వివరించుచున్నాఁడు:—

సీ. ఉన్నది లేదని యూహింపఁగా నేర్చు
లేనిది కలదన లెస్స నేర్చు
నజడంబు జడమని యాగడింపఁగ నేర్చు
జడ మజడంబని చాట నేర్చు
సుఖము దుఃఖంబుఁగాఁ జూపి చెప్పఁగ నేర్చు
దుఃఖంబు సుఖమనఁ దొలుత నేర్చు
నిది యది గాదని యింపుగా నననేర్చు
నది యిది గాదని యనఁగ నేర్చుఁ
తే. బిదపఁ గలదియ గలదు లేనిదియ లేదు
కడగి యజడంబె యజడము జడ మజడము
సుఖమె సుఖము తలంప నసుఖ మసుఖము
అదియె యిది యిది యది యని యాడ నేర్చు. 84

టీ. ఉన్నది = సత్యమైనపదార్థమును, లేదని = అసత్యమైనదని, ఊహింపఁగా నేర్చున్ =అనుమానముచే చెప్పుటకు సమర్థురాలు, లేనిది=అసత్యమైనది, కలదనన్ = సత్యమయినదని చెప్పుటకు, లెస్సనేర్చున్ =బాగుగ నేర్చును, అజడంబున్ =జడముగాని పదార్థమును, జడమని=జడపదార్థమని, ఆగడింపఁగనేర్చున్ =అల్లరిచేయసమర్థురాలు, జడము, అజడంబనిచాటనేర్చున్ =చాటిచెప్పసమర్థురాలు, సుఖమున్, దుఃఖంబుగాన్, చూపి, చెప్పఁగనేర్చున్, దుఃఖంబున్, సుఖమనన్ =సుఖమనిచెప్పుటకు, తొలుతన్ = ముఖ్యముగా, నేర్చున్, ఇది=ఈకనఁబడుచున్నపదార్థము, అదిగాదని = నీవుతలంచు చున్నది కాదు అని, ఇంపుగాన్ =యుక్తియుక్తముగా, అననేర్చున్, అది=ఆపదార్థము, ఇదిగాదని=నీవుచెప్పినది (లేక, నీవుచూచునది) కాదని, అనఁగనేర్చున్, పిదపన్ = తర్వాత, కలదియ కలదు = సత్యమేసత్యము, లేనిదియ లేదు = అసత్యమే అసత్యము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః"="అసత్యమునకుఁ గలిమియు సత్యమునకు లేమియు నెప్పటికిని లేదు" అని గీతావాక్యము. కడఁగి=చక్కఁగా, అజడంబె యజడము = చేతనమే చేతనము, జడనుజడము = జడమే జడము, సుఖమేసుఖము, తలంపఁగా=విచారింపఁగా, అసుఖమసుఖము=దుఃఖమేదుఃఖము, అదియే యిది=నీవు చూచునది నీవు తలంచినదియే, ఇదియదియని=నీవు చూచునదియేః నీవు చెప్పుపదార్థము అని, అడనేర్చుఁగా=చెప్పఁగలుగును.

తా. ఈసీతయొక్క సామర్థ్యము వినుము. ఉన్నపదార్థమును లేనిదానిఁగాను లేనిదాని నున్నదానినిగాను సిద్ధాంతము చేయఁగలదు. జడపదార్థమును 'చేతనపదార్థము' అనియు, చేతనమును 'జడము' అనియుఁ జెప్పఁగలదు. సుఖమును దుఃఖముగాను దుఃఖమును సుఖముగాను నిరూపింపఁగలదు. 'ఇది యది కాదు' అనియు, 'అది ఇది కాదు' అనియు వాదింపఁగలదు. ఇట్లు మొట్టమొదట సర్వమును విరుద్ధముగాఁ జెప్పి తర్వాత 'ఉన్నపదార్థమే యున్నది' యనియు, 'లేనిదే లేదు' అనియు నిట్లు విశ్వమును యథార్థముఁగానే నిరూపింపఁగలదు.

అవ. ఇట్లు మా[illegible]ప్రభావమును జెప్పి కర్తవ్యము నుపదేశించుచున్నాఁడు:—

వ. అట్లు గావున నతిదుర్ఘటకారిణియు బ్రహ్మాత్మైకత్వవిద్యాస్వరూపిణియు మదీయయోగమాయాశక్తియు నిత్యానపాయినియుఁ బరమపావనియుఁ బ్రసన్నముఖియు నైన యీ సీతాభగవతి నభిముఖింగావించుకొనుము. నీకతిశీఘ్రంబుగా నిత్యనిరుపాధిక నిరతిశయ నిర్మలనిజానందానుభవంబు గలుగు నయ్యుపాయంబుఁ జెప్పెద నాకర్ణింపు మని యి ట్లనియె. టీ

టీ. అట్లుగావునన్=కాఁబట్టి, అతి...ణియున్-అతి=మిగుల, దుర్ఘట=అసాధ్యములగువానిని, కారిణియున్=చేయునదియు, బ్రహ్మ...ణియున్-బ్రహ్మ=పరబ్రహ్మము, ఆత్మ=జీవుఁడు, ఏకత్వ = వీరలకుఁగల స్వభావసిద్ధైక్యమును, విద్యాస్వరూపిణియున్=తెలిసికొనునపరోక్షజ్ఞానమే స్వరూపముగాఁగలదియు, మదీయ...శక్తియున్-మదీయ=నాసంబంధమయిన, యోగ=ఐక్యరూపమయిన, మాయాశక్తియున్=మాయయైనట్టియు, నిత్యానపాయినియున్ = నన్నెప్పుడు విడువనిదియు, పరమపావనియున్ = పరమపవిత్రయు, ప్రసన్నముఖియున్ = అనుగ్రహయుక్తమైన ముఖము కలదియు, ఐన... వతిన్-ఐన=ఐనట్టి, ఈసీతాభగవతిన్ = ఈసీతాదేవిని, అభిముఖింగావించుకొనుము = నీయం దనుగ్రహము గలుగునట్లుచేసికొనుము, నీకతిశీఘ్రంబుగాన్ = నీకు మిగుల త్వరతో, నిత్య...లుగున్ - నిత్య = శాశ్వతమైనట్టియు, నిరుపాధిక = ఆవరణశూన్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మైనట్టియుం, నిరతిశయ = సర్వాధికమైన, నిర్మల = పరిశుద్ధమైన, నిజ = ఆత్మరూప మైనట్టియుం, ఆనందానుభవంబు=బ్రహ్మానందానుభవము, కలుగన్ =దొరకుసు, అయ్యుపాయంబు=అమాయను స్వాధీనము చేసుకొను నుపాయమును, చెప్పెదన్, ఆకర్ణింపుమని, ఇట్లు, అనియెన్.

తా. పైనిరూపించినవిధముగా అసాధ్యములగు కార్యములఁ జేయుసామర్థ్యము గలదియు బ్రహ్మైక్యమును దెలిసికొనుటయే స్వరూపముగాఁగలదియు ఎప్పుడును నన్ను (పరబ్రహ్మమును) విడువనిదియు యోగమాయాస్వరూపిణియు అతిపరిశుద్ధయు నీయందనుగ్రహదృష్టితో నున్నదియునగు నీసీతను ప్రసన్నురాలినిగాఁ జేసికొనుము. అట్లు చేసికొంటివేని నీకు శాశ్వతమైనట్టియుఁ బరిశుద్ధమైనట్టియు నుపాధిరహిత మైనట్టియు స్వస్వరూపానందము శీఘ్రకాలమునం గలుగును. అట్లు సీతకుఁ బరమానుగ్రహము కలుగునట్లు సేయుటకు నుపాయమును చెప్పెదను వినుము.

అవ. 'శ్రీరామరామరామ' యని జపము సేయుచు వాత్మానుభవము సేయువానిని సీత (మాయ) యేమియుఁ జేయదని ఇదివఱకె చెప్పియున్నాఁడు గదా! దానినే మంత్రార్థకథనపూర్వకముగా వివరించుచు మొట్టమొదట రామపదమున కర్థము నెఱింగించుచున్నాఁడు:—

క. గౌరీశివాదు లాత్మా, కారా కారితసువృత్తిగతి నాయందుం
జేరి రమించుచు నుండుట, కారణముగ రామపదము గలిగెన్నాకున్.

టీ. గౌరీశివాదులు-గౌరీ=పార్వతియును, శివ = ఈశ్వరుఁడు, ఆదులు = మొదలగువారు, ఆత్మా...గలిన్-ఆత్మ=ప్రత్యేకభిన్నపరమాత్మయొక్క, ఆకార=ఆకారము చేత, ఆకారిత=ఏర్పడిన, సువృత్తిగతిన్ =ధీవృత్తినాశ్రయించి, నాయందున్, చేరి, రమియించుచునుండుట=క్రీడించుచుండుట (అనఁగా నానందము ననుభవించుచుండుట), కారణముగన్ = కారణముగా, నాకున్, రామపదము గలిగెన్ = రామనామము వచ్చెను.

తా. ఆత్మాకారముగల చిత్తవృత్తిచే (అనఁగా 'అహం బ్రహ్మాస్మి' అనువృత్తిచే) పార్వతీపరమేశ్వరులు మొదలగుసర్వదేవతలును సర్వమునులును, ఇంత ఏల! సర్వజ్ఞానులు సర్వకాలములయందును, నాయందే (బ్రహ్మయందే) క్రీడించుచుండుటచే 'రమయతి రమంతే అస్మిన్ ఇతి వా రామః'='క్రీడింపంజేయువాఁడు, లేక నందఱు నీతనియందుఁ గ్రీడింతురు, కావున ఈతఁడు రాముఁడు' అను వ్యుత్పత్తి నాశ్రయించి నాకు (బ్రహ్మమునకు) రామనామము కలిగెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆ. జగతి నిట్లు రామశబ్దవాచ్యుఁడ నైన
నేను బుధులు బుద్ధిమానసేంద్రి
యాంగముల ననాత్మయని కడఁ ద్రోయఁగ
మిగులుదును జిదాత్మ నగుచు నెపుడు. 87

టీ. జగతిన్=భూమియందు, ఇట్లు=ఈవిధముగ, రామ...నేను - రామశబ్ద=రామశబ్దము చేత, వాచ్యుఁడనైన నేను=చెప్పఁదగిన నేను, బుధులు=విద్వాంసులు, బుద్ధి...ములన్-బుద్ధి=బుద్ధిని, మానస=మనస్సును, ఇంద్రియ=ఇంద్రియములును, అంగములన్=శరీరములును, అనాత్మయని=ఆత్మకాదని, కడఁ ద్రోయంగన్=నిషేధింపఁగా, ఎపుడు=ఎప్పుడును, చిదాత్మనగుచున్=జ్ఞానరూపుఁడనగుచు, మిగులుదున్.

తా. ఈవిధముగా నేను రామశబ్దముచేఁ జెప్పంబడుదు; బ్రహ్మజ్ఞానులు అంతర్ముఖులై బుద్ధిమనోదేహాదుల నిరాకరింపఁగ జీవరూపుఁడనై (లేక, కూటస్థరూపుఁడనై) శేషించును.

అవ. ఈవిధముగా రామశబ్దార్థము నెఱింగించుటచే సంక్షేపముగా మంత్రార్థముసుచెప్పి ఇప్పుడు నామత్రయమును బ్రయోగించుటయందుఁ గలయభిప్రాయ విశేషములను క్రమముగాఁ దెలుపుచున్నాఁడు:—

క. సారబ్రహ్మాకారా, కారితధీవృత్తి నాకుఁ గలుగుటవలన
శ్రీరామనామ మొప్పెను, శ్రీరమ్యబ్రహ్మవిద్య శ్రీయనఁ దగుటన్

టీ. నాకున్, సార...వృత్తి-సార=శ్రేష్ఠమైన, బ్రహ్మ=పరబ్రహ్మముయొక్క, ఆకార=స్వరూపము చేత, ఆకారిత=ఏర్పడిన (అనఁగా బ్రహ్మాకారరూపమయిన), ధీవృత్తి=బుద్ధివృత్తి, నాకుఁగలుగుటవలనన్=నాకుండుట చేత, శ్రీరమ్య=కాంతిచే మనోహరమైన, బ్రహ్మవిద్య=బ్రహ్మజ్ఞానము, శ్రీయనఁదగుటన్=శ్రీశబ్దము చేఁ జెప్పఁదగియుండుట వలన, శ్రీరామనామ మొప్పెన్=శ్రీరామనామము కలిగెను.

తా. ఇఁక నామత్రయప్రయోజనమును వినుము. బ్రహ్మవిద్యకు 'శ్రీ'అని పేరుండుటవలనను నాకు బ్రహ్మవిద్య (అనఁగా బ్రహ్మాకారముగాఁ గలబుద్ధివృత్తి) నిత్యాపాయినియై యుండుటచేతను 'మాయాసహిత (లేక మాయాభిన్న) మగు పరబ్రహ్మ' యనునర్థమును బోధించుటకై మంత్రమున 'శ్రీరామా' యనునామము ప్రయోగింపఁబడియున్నది.

తే. తెలఁప ధీవృత్తి కేప్రొద్దు ద్రష్టనగుచుఁ
బ్రత్యగాత్ముఁడ నైననాభావ మరసి
తెలియుటకు నొప్పు మఱి యాద్వితీయరామ
నామము [illegible] మనుచు. 89

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. తలఁపన్ =విచారింపఁగా, ధీవృత్తికిన్=బుద్ధివృత్తికి, ఎప్రొద్దు=ఎప్పుడును, ద్రష్టనగుచున్ =సాక్షినై, ప్రత్యగాత్ముండనైన=కూటస్థుఁడనైనట్టి, నాభావము=నాస్వభావమును, అరసి=విచారించి, తెలియుటకున్ =తెలిసికొనుటకు, మఱి=మఱియు, అద్వితీయ రామనామము-అద్వితీయ=రెండవదియైన, రామనామము=రామపదము (శ్రీరామ రామ రామ అనునామములలోని రెండవరామనామము), సమస్త...చున్-సమస్త=సమస్తములైన, వేదాంత = వేదాంతములకు, ధామమగుచున్ = స్థానమై, ఒప్పున్=ప్రకాశించుచున్నది (ప్రయోగింపఁబడుచున్నది.)

తా. బుద్ధివృత్తికి నెప్పుడును సాక్షినై నిర్వికారుఁడ నైయున్న నాస్వభావమును సవిశేషముగా నెఱింగి భావించుటకై (అనఁగా నట్లు భావింపవలయునని సూచించుటకై) రెండవరామనామము ప్రయోగింపఁబడియున్నది. ఇట్లు చెప్పుటవలన 'బ్రహ్మవిద్యాసహితుఁడ వగు నోరామశబ్దవాచ్యపరబ్రహ్మమా! నీవే వ్యష్ట్యుపాధికకూటస్థుఁడవు' అని యర్థమేర్పడును. ఇదియే వేదాంతసారము.

తే. ఆతతప్రత్యగాత్ముఁడ నైన నేను
బ్రహ్మరూపుఁడ నని నాస్వభావ మరసి
తెలియుటకు నొప్పు మఱి యాతృతీయరామ
నామము క్షరాక్షరవిలక్షణంబు నగుచు. 90

టీ. ఆతతప్రత్యగాత్ముఁడన్ - ఆతత=విస్తారమైనఁ ప్రత్యగాత్ముఁడన్=కూటస్థుఁడను, ఐననేను=ఐనట్టినేను, బ్రహ్మరూపుఁడనని=పరబ్రహ్మము నేయని, నాస్వభావమరసి-నా=నాయొక్క, స్వభావము=నిజస్థితిని, అరసి=విచారించి, తెలియుటకున్ = తెలిసికొనుటకు, మఱి, ఆతృతీయరామనామము=ఆమూఁడవరామనామము, క్షరాక్షర... గుచున్-క్షర=క్షరమగుప్రపంచమునకంటెను, అక్షర=అక్షరుండగు జీవునికంటెను, విలక్షణంబునగుచున్=వేఱై, ఒప్పున్=ప్రకాశించును.

తా. మఱియు 'కూటస్థరూపుఁడనైన నేనే పరబ్రహ్మంబును' అని నిశ్చయించి భావించుటకై మూఁడవరామనామము ప్రయోగింపఁబడియున్నది. దీనివలనఁ 'గూటస్థునకును బ్రహ్మమునకును భేదము లేదు' అని యర్థమేర్పడుచున్నది. కావున 'మాయాసహిత రామశబ్దవాచ్య పరబ్రహ్మమా! నీవే కూటస్థుండవు. కూటస్థుఁడే నీవు. అని మంత్రమున కంతయుఁ నర్థము.

అవ. ఇట్లు మంత్రార్థము నెఱింగించి తదుపాసనాఫలమును జెప్పుచున్నాఁడు:—

తే. ప్రేమచే నట్లు శ్రీరామ! రామ! రామ!
యనుచు దన్ను భజించుమహాత్ములకును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మిగుల నిత్యానపాయిని యగుచు యోగ
సిద్ధిఁ గావించుచుండు నీశ్రీవధూటి. 91

టీ. ప్రేమచేన్=ప్రీతితో, ఇట్లు=ఈవిధముగా నర్థజ్ఞానముగలిగి, శ్రీరామరామ రామయనుచున్ = శ్రీరామ రామ రామ యని, నన్నుభజించుమహాత్ములకున్=నన్ను సేవించు మహానుభావులకు, ఈశ్రీవధూటి=ఈబ్రహ్మవిద్యాస్వరూపిణియైనసీత, మిగులన్=అధికముగా, నిత్యానపాయినియగుచున్=ఎప్పుడును విడువనిదియై, యోగసిద్ధిన్=అప నక్కయోగసిద్ధిని, కావించుచుండున్=చేయుచుండును.

తా. పైన నిరూపించినవిధముగా మంత్రార్థము నెఱింగి యర్థభావనాపూర్వకముగా నుపాసించు మహాత్ములకు నీసీత శీఘ్రముగా యోగసిద్ధిని గలిగించును. వా నెప్పుడును విడువక యనువర్తించుచుండును. కావున నీ మాయాశక్తిని స్వాధీనము చేసికొనుట కిదియే (అనఁగా నన్నాశ్రయించుటయే) చక్కని యుపాయము. 'దైవీహ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా, మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే' = 'దైవియగు నీశుద్ధసత్త్వప్రధాన త్రిగుణాత్మక (అనఁగా శుద్ధతత్త్వము ప్రధానముగాఁగల దనుటయే) కాని త్రిగుణములు నిందుఁ గలవు. ఇదియే నా యోగమాయ. దీనినిఁ దరించుట మిగులఁ గష్టమగుపని. అయినను నన్నాత్మరూపునిఁగా నెఱింగి సేవించువారు ఈ మాయను సుఖముగాఁ దరింపఁగలరు.' అను వాక్యముచే గీతాచార్యుఁ డీ విషయమునే స్పష్టము చేసియున్నాఁడు.

అవ. ఇట్లు సర్వము నుపదేశించి యర్థవాదము నుపక్రమించుచున్నాఁడు:—

మ. తలఁపం బూర్ణము నిర్వికార మగుతత్త్వం బిట్లు భాసిల్లఁగాఁ
దెలియన్నేరక మూఢులైననరు లీదేహేంద్రియప్రాణబు
ద్ధుల నెల్లప్పుడు నిగ్రహించుటకు నెంతో రక్తులై యాత్మనిం
దెలియం జూతురు వారికిం గలుగునే ధీసాక్షి నీక్షింపఁగన్. 92

టీ. తలఁపన్=విచారింపఁగా, పూర్ణము=సర్వవ్యాపకము, నిర్వికారము = వికారశూన్యము, అగు తత్త్వంబు=ఐన పరమాత్మస్వరూపము, ఇట్లు = ఈవిధముగా, భాసిల్లఁగాన్ = ప్రకాశించుచుండఁగా, మూఢులైననరులు = అజ్ఞానులైనమనుష్యులు, తెలియన్నేరక=ఈ యథార్థస్థితినిఁ దెలిసికొనలేక, ఈదే...బుద్ధులన్-ఈ, దేహ=దేహములను, ఇంద్రియ=ఇంద్రియములను, ప్రాణ=ప్రాణములను, బుద్ధులన్=బుద్ధిని, ఎల్లప్పుడున్ = ఎప్పుడును, నిగ్రహించుటకున్=నిర్బంధించుటకు (లేక, జయించుటకు), ఎంతోరక్తులై= ఎంతో ప్రయత్నము చేయువారై, ఆత్మునిన్ = పరబ్రహ్మమును, తెలియంజూతురు = తెలిసికొనవలయునని ప్రయత్నింతురు, వారికిన్ = అట్టివారికి, ధీసాక్షిన్-ధీ = బుద్ధికి,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సాక్షిన్=ద్రష్టయైనబ్రహ్మమును, ఈక్షింపఁగన్ = చూచుటకు, కలుగునే=సాధ్యమగునా, (కాదనుట).

తా. ఓ యాంజనేయా! సర్వపరిపూర్ణమగు పరబ్రహ్మతత్త్వ మాత్మభిన్నమై ప్రకాశించుచుండ నెదుటనున్న ఘటమును జూచినట్లా బ్రహ్మమును జిత్తేంద్రియ నిగ్రహముతోఁ బనిలేకయే చూచుటకు శక్యమైయుండ నజ్ఞానులగువారు మనస్సును ఇంద్రియములను నిగ్రహించుటకై ప్రబల ప్రయత్నములఁ జేయుచు నాత్మకు సాక్షాత్కరింపఁ దలంతురు. ఈ చిత్తేంద్రియములు శూన్యరూపము లగుటను దెలిసికొనలేక వీనినిగ్రహమువలననే కాని బ్రహ్మసాక్షాత్కారము కలుగదని భావించుచున్నారు. ఇట్టివారికి వేయుం జన్మములకైనను బుద్ధిసాక్షిని జూడఁ దరమగునా! జ్ఞానము సమగ్రము కాక పోవుటచేఁ దరముకాదు.

క. సర్వేంద్రియములచేఁ ద,త్సర్వవిషయముల నెఱుంగుచందంబునఁ ద
త్సర్వజ్ఞు సర్వగతునిన్, సర్వమయుం దెలియవచ్చు సమరసదృష్టిన్.

టీ. సర్వేంద్రియములచేన్=సమస్తేంద్రియములచేతను, తత్సర్వవిషయములన్=ఆయాయింద్రియముల విషయములను, ఎఱుఁగు చందంబునన్ = తెలిసికొనునట్లే, తత్సర్వజ్ఞున్ = ఆ యింద్రియములను వాని విషయములనుగూడఁ దెలిసికొనునట్టి సాక్షిని, సర్వగతునిన్ = సర్వవ్యాపకుని, సర్వమయున్ = సర్వరూపుని (బ్రహ్మమును,) సమరస దృష్టిన్=ఐక్యజ్ఞానముచే, తెలియవచ్చున్=సుఖముగఁ దెలిసికొనవచ్చును.

తా. శ్రోత్రాదీంద్రియములచే శబ్దాది విషయముల నప్రయత్నముగ ననాయాసముగాఁ దెలిసికొనునట్లు సర్వవ్యాపకుఁడగు నింద్రియసాక్షిని సమరసభావనచే (అనఁగా "ప్రపంచమంతయును శూన్యము కావున సర్వమును పరబ్రహ్మమే" అను భావముచేఁ) దెలిసికొనవచ్చును కదా! ఇంతమాత్రమున కంత శ్రమ యేటికి?

సీ. ఘటశరావాదిమృత్కార్యజాతంబుల
నెంచి మృత్తిక యని కాంచుపగిది
నమలకుండలకిరీటాదిభూషణముల
స్వర్ణంబని యెఱుంగుచందమునను
నసికుంతశూలచక్రాదికంబుల నెల్ల
నినుమని యరసి కన్గొనినభంగిఁ
బొలుపారు ఫేనబుద్బుదతరంగంబుల
మంచినీరని విలోకించురీతిఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. దనరు బహువిధపటములఁ దంతు వనుచుఁ
దెలియు కైవడి మొదలిసందియము విడిచి
భ్రాంతిని దొలంగి సర్వంబు బ్రహ్మ మనుచు
సుఖముగాఁ సంతతంబును జూడు మనఘ! 94

టీ. అనఘ=దోషరహితుఁడ, ఘట...బులన్-ఘట=కుండ, శరావ=మూఁకుడు, ఆది=మొదలైన, మృత్కార్య=మృణ్మయ పదార్థములయొక్క, జాతంబులన్=సమూహములను, ఎంచి=విభాగించి (లేక, విమర్శించి) మృత్తికయని = "ఇవి యన్నియు మృత్తికయే" యని, కాంచుపగిదిన్=తెలిసికొనినట్లును, అమల...ముల-అమల=పరిశుద్ధమైన, కుండల = కర్ణకుండలములు, కిరీట=కిరీటము, ఆది = మొదలయినవి, భూషణములన్ = సొమ్ములను, స్వర్ణంబని="ఇవి యన్నియు సువర్ణమునకంటె వేఱుకావు" అని, ఎఱుఁగు చందంబునన్=తెలిసికొనునట్లును, అసి...నెల్లన్-అసి=ఖడ్గము, కుంత=బల్లెము, శూల=శూలము, చక్ర=చక్రము, ఆదికంబులనెల్లన్=మొదలయినవాని నన్నిటిని, ఇనుమటంచు "ఇవి యన్నియుఁ నినుమే. (నామరూపములే తప్ప మఱేమియుఁ నిం దధికములేదు") అని, అరసి= విచారించి, కన్గొనినభంగిన్ = తెలిసికొనినట్లును, పొలు...ములన్-పొలుపారు=ఒప్పుచున్న, ఫేన=నురుగు, బుద్బుద=బుడకలు, తరంగంబులన్=అలలు అనువానిని, మంచినీరని = "శుభ్రమైనజలమే" అని, విలోకించురీతిన్ = చూచునట్లును, తనరు...ములన్-తనరు=ఒప్పుచున్న, బహువిధ=అనేకవిధములైన, పటములన్ = వస్త్రములను తంతువనుచున్=దారమేయని, తెలియుకైవడిన్ = నామరూపభేదములను పాటింపక గ్రహించునట్లును, మొదలి సందియము విడిచి=అనాదియగు సంశయమును ("అనృతజడదుఃఖాత్మకమగు ప్రపంచము సత్యజ్ఞానానంద రూపుఁడగు బ్రహ్మమే యెట్లగును" అను సంశయమును) వదలి, భ్రాంతిని దొరంగి="ప్రపంచము వేఱు బ్రహ్మము వేఱు కావున ప్రపంచాంతర్గతుండనగు నేను (జీవుఁడు) బ్రహ్మమునకంటె వేఱు" అను భ్రాంతినివిడిచి, సర్వంబు బ్రహ్మమనుచున్=అంతయు బ్రహ్మమే యని, సతతంబున్=ఎల్లప్పుడును, సుఖముగాన్, చూడుము.

తా. కావున నో దోషరహితుఁడా! నీవు వారివలె నిరర్థకశ్రమను జెందకుము కుండ మూఁకుడు ముంత మొదలగు మృణ్మయపదార్థముల నామరూపనిషేధపూర్వకముగా "ఇది మృత్తిక" యని కేవల కారణమాత్ర రూపములుగాఁ దెలిసికొనునట్లును, కిరీటకుండలాది భూషణముల "ఇవి సువర్ణములకంటె వేఱు కావు. నామరూపములకంటె నిందు విశేష మేమియుఁలేదు" అని తెలిసికొనునట్లును, ఖడ్గములు బల్లెములు శూలములు చక్రములు మొదలగువాని నామరూపములు నిషేధించి 'ఇవియన్నియు నినుము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాత్రమే!' యని గ్రహించు విధంబునను, నురుఁగు బుడకలు అలలు మొదలగువానిని నీటినిఁగా భావించుచందంబునను, వస్త్రములనెల్లఁ దంతు మాత్రంబులనుగాఁ దలంచు రీతిని, మిగుల సులభముగా "ఈ సకల ప్రపంచమునంతను నామరూపములకంటె వేఱగు పదార్థము లేదు" అనియు కావున నీ నామరూపములు సత్యములు కావు. ఘట శరావాది నామరూపములవలె నసత్యములైనవే యనియు ఘటశరావాదులు మృత్తికకంటె వేఱు కానట్లు ఈ ప్రపంచంబును కారణమగు బ్రహ్మమునకంటె వేఱుకాదు అనియును దెలిసికొనుము.

అవ. ఇట్లర్థవాదమును ముగించి ఫలమును జూపుచున్నాఁడు:—

సీ. స్థూలశరీరంబు సుస్థిరంబుగ నుండు
సకలేంద్రియము లుపశాంతి నొందు
సన్మనః పవనముల్ సంచలింపక యుండుఁ
గామాదిశత్రువర్గము నశించు
స్ఫురదమానిత్వాదిసుగుణము ల్సమకూరు
ఘనగుణాతీతలక్షణము నొదవుఁ
బొలుపారు వైరాగ్యబోధోపరతులు సం
పూర్ణంబు లై మదిఁ బొదలుచుండుఁ
తే. బరమసుఖవార్ధి యుప్పొంగి పాఱుచుండు
ముంధట వసించు మోహించి మోక్షలక్ష్మి
సంశయము లేక దృఢముగా సంతతంబు
సర్వమును బ్రహ్మ మని చూచు శాంతినిధికి. 95

టీ. సంశయములేక = సందేహముమాని, దృఢముగాన్ = నిష్కర్షగా, సతతంబున్ = ఎల్లప్పుడును, సర్వమున్ = అంతయును, బ్రహ్మమని, చూచుశాంతినిధికిన్ - చూచు=తెలిసికొనునట్టియు, శాంతి=చిత్తశాంతికి, నిధికిన్.= స్థానభూతుఁడైనట్టియు, సాధకునకు, స్థూలశరీరంబు, సుస్థిరంబుగనుండున్ =కదలకనిలుచును, సకలేంద్రియములు= పదియింద్రియములును, ఉపశాంతినొందున్ =తమతమవిషయములపైకుఱుకక నిలుకడను జెందును, సన్మనః పవనములు-సత్ =శ్రేష్ఠమైన, మనః=మనస్సును, పవనములు=వాయువులును, సంచలింపకయుండున్ = చలింపకనిలుచును, కామాదిశత్రువర్గము=కామక్రోధాదులు, నశించున్, స్ఫుర...ములు-స్ఫురత్ =ప్రకాశించుచున్న, అమానిత్వ= అభిమానములేకుండుట, ఆది=మొదలైన, సుగుణములు=సద్గుణములు, సమకూఱున్ = కలుగును, ఘన...ములు-ఘనగుణ=శ్రేష్ఠములైన సత్త్వరజస్తమోగుణములను, అతీత=అతిక్రమించినవానియొక్క, లక్షణమును=వృత్తులు, ఒదవున్ =లభించును, [illegible]...తులు-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పొలుపారు=ఒప్పుచున్న, వైరాగ్య=విషయములందు ఇచ్ఛలేకపోవుట, బోధ=జ్ఞానము, ఉపరతులు = చిత్తశాంతి అనునది, సంపూర్ణంబులై, మదిన్ = మనస్సునందు, పొరలుచుండు=అభివృద్ధి చెందుచుండును, పరమ...వార్ధి - పరమసుఖ = పరమానందమనెడు, వార్ధి=సముద్రము, ఉప్పొంగిపాఱుచుండున్=ప్రవహించుచుండు, మోక్షలక్ష్మీ=మోక్షమనెడు లక్ష్మి, మోహించి, ముందటన్ = ఎదుట, వసించున్ = నివసించి యుండును (మోక్షము హస్తగత మగు ననుట.)

తా. ఈవిధముగా 'సర్వము బ్రహ్మమే' అని దృఢనిశ్చయము గలిగి సర్వకాలములయందు నాత్మానుభవముఁ జేయుశాంతిపరునకు స్థూలశరీరము స్వయముగనే నిశ్చలమగును. ఇంద్రియములు వానివానివిషయములపై కురుకక శాంతి నొందును. మనస్సు కాని ప్రాణవాయువులు కాని ఇటునటుఁ గదలవు. కామక్రోధాదులు స్వయముగా నడంగును. అమానిత్వము మొదలగుసద్గుణములు స్వయముగనే చేరవచ్చును. గుణాతీతలక్షణములు కలుగును. వైరాగ్యము, బోధ, ఉపరతి యనునీమూఁడును పరిపూర్ణములై మనసున నెలకొనును. పరమానందసముద్రము ప్రవహించును! అమ్మహాత్ముని మోక్షకాంత వరించును.

## అమానిత్వాదివివరణము.

1. 'అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్,
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః.'

2. 'ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవచ,
జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్.'

3. 'అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు,
నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు.'

4. 'మయి చా నన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ,
వివిక్తదేశసేవిత్వ మరతి ర్జనసంసది.'

5. 'అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్,
ఏతత్ జ్ఞానమితి ప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా.'

1. అభిమానము డంబము వాక్కాయకర్మములచే పరులను హింసించుటయను దుర్గుణములు లేకుండుట, ఓర్పు నిష్కాపట్యము గురువులసేవించుట బాహ్యాభ్యంతరపారిశుధ్యము స్థిరచిత్తత్వము దేహేంద్రియాదులును మోక్షార్థమున నుపయోగించుట.

2. ఇంద్రియ విషయములగు శబ్దాదులయం దిచ్ఛలేకపోవుట, అహంకారము లేకుండుట, పుట్టుక చావు ముసలితనము వ్యాధులు తాపత్రయము మొదలగువానివలన గలుగుదోషముల నెఱింగి వానిఁ దుచ్ఛములుగా భావించుటయుఁ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

3. పుత్రులు భార్య గృహములు మొదలగువానియందు 'ఇవి నావి' అను నభిమానముకాని వానికిఁ గలసుఖదుఃఖములు దగినవిగాఁ భావించుటకాని లేకుండుటయు, ఇష్టముగాని యనిష్టముగాని వచ్చినప్పుడు హర్షశోకముల నొందక సమచిత్తములో నుండుటయు.

4. నాయందు (కృష్ణునియందు) దృఢమై యైక్యభావనతోఁగూడిన భక్తియును ఏకాంత దేశమున నిలిచి యాత్మ భావనఁ జేయవలయుననుతలంపును జనసమూహమధ్యమున నివసింపక నిష్టములేక పోవుటయు.

5. ఎప్పుడును బ్రహ్మజ్ఞానమునందు దృఢచిత్తము గలిగియుండుటయు బ్రహ్మజ్ఞానమువలనమాత్రమే మోక్షముకలుగుననువిషయము నెఱింగి యామోక్షమునం దాశకలిగియుండుటయునను నీయిరువదియును జ్ఞానసాధనము లగుటచే 'జ్ఞానము' అని చెప్పఁబడుచున్నవి. వీనికంటె భిన్నములగు నభిమానాదులు సంసారదుఃఖమును గలిగించునవి యగుటచే 'అజ్ఞానము' అని చెప్పఁబడుచున్నది. అని యమానిత్వాదులు శ్రీకృష్ణపరబ్రహ్మముచే గీతలయందు వివరింపఁబడియున్నది.

## గుణాతీతలక్షణములవివరణము.

1. 'ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహ మేవ చ పాణ్డవ,
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి.'
2. 'ఉదాసీనవదాసీనో గుణై ర్యో న విచాల్యతే,
గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే.'
3. 'సమదుఃఖసుఖస్స్వస్థస్సమలోష్టాశ్మకాఞ్చనః,
తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిందాత్మసంస్తుతిః.'
4. 'మానావమానయో స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః,
సర్వారమ్భపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే.'
5. 'మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే,
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే.'

1. "ఓయర్జునా! సత్వకార్య మగుజ్ఞానము కాని రజోగుణకార్య మగు వ్యాపారము (కర్మలు) చేయవలయు ననుసిచ్ఛ కాని తమోగుణకార్య మగు భ్రాంతి (లేక మూర్ఛ) కాని వచ్చినప్పుడు వాని నెప్పుడు ద్వేషింపఁడో రానిశుభముల (జ్ఞానము మొదలగువానిని) నెవ్వఁడు కోరఁడో."

2. "మధ్యస్థునివలె స్థిరుఁడై యెప్పుడు గుణములచేఁ గదలింపఁబడక (అనఁగా: రాగద్వేషాధీనుఁడై చలింపంజేయఁబడక) 'గుణములు వానికార్యములందుఁ బ్రవర్తించుచున్నవి' అని స్థిరచిత్తముతో నుండునో యించుక యైన నిటు నటుఁ జలింపఁడో."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

3. "ఎవ్వనికి సుఖదుఃఖములును మట్టిపెళ్ల రాయి బంగారము అనునవియు (అనఁగా: నట్టిహీనాధికపదార్థంబులును) ప్రియాప్రియములును నిందాస్తోత్రంబులును సమానములై యుండునో పరమచిత్తశాంతి కలిగి యెవ్వఁడు జ్ఞానవంతుఁడై (లేక ధైర్యవంతుఁడై) యుండునో."

4. "పరులు తన్ను గౌరవించినను అవమానించినను ఎవ్వఁడు సమచిత్తముతో నుండునో శత్రుమిత్రుల నెవ్వఁడు సమచిత్తముతోఁ జూచునో యెవ్వనికి నే ప్రయత్నమును కాని లేవో, వాఁడు గుణాతీతుఁ డగును."

5. "మఱియుం దృఢమగు నభేదభావనకలిగి నన్నెవ్వఁడు సేవించునో (అనఁగా: స్వాత్మానుభవము చేయునో) వాఁడును గుణాతీతుఁడై బ్రహ్మరూపుఁడగును."

అని గీతలయందు గుణాతీత లక్షణములు వివరింపంబడియున్నవి.

క. రాజత్వ మమరినంతనె
భూజనములు వానిఁ జేరి పూజించుగతిన్
రాజిలి సర్వముఁ దనుఁగా
యోజించినయపుడె పొందునుత్తమగుణముల్. 96

టీ. రాజత్వము = రాజుగానుండుట, అమరినంతనె = కలుగఁగానే, భూజనములు = భువిలో నున్నమనుష్యులు, వానిన్ = ఆపురుషుని, చేరి, పూజించుగతిన్ = పూజచేయునట్లు (అనఁగా: గౌరవించునట్లు), రాజిలి = ప్రకాశించి, సర్వమున్ = ఈసమస్తప్రపంచమును, తనుఁగాన్ = స్వస్వరూపముగా, యోజించినయపుడె = తెలిసికొను తత్క్షణమే, ఉత్తమగుణములు = సద్గుణము లన్నియును, పొందున్ = ఆపురుషుని చేరును.

తా. ఇంతయేల? పురుషుఁ డెట్టివాఁ డైనను వానికి రాజరికము వచ్చెనేని తత్క్షణమే సర్వజనులును వానిని సేవించునట్లు మొట్టమొదట భ్రాంతికిఁ జిక్కియే యున్నను అమానిత్వము మొదలగుసుగుణములచే విడువఁబడియే యున్నను భ్రాంతి వదలి 'సర్వము బ్రహ్మమే' అని తెలిసికొనినతత్క్షణమే సర్వగుణములును నప్పురుషు నాశ్రయించును.

అవ. ఇట్లగుటకుఁ గారణమును జెప్పుచున్నాఁడు:—

తే. తరుణివేషంబుఁ గైకొన్న పురుషుఁ డరయఁ
బురుషుఁ డగుఁ గాక పరికింపఁ దరుణి యగునె
జీవభావంబుఁ జేకొన్న కేవలాత్ముఁ
డాత్ముఁ డగుఁ గాక మఱి జీవుఁ డగునె తెలియ? 97

టీ. అరయన్ = విచారింపఁగా, తరుణివేషంబున్ = స్త్రీవేషమును, కైకొన్న పురుషుఁడు = అంగీకరించినపురుషుఁడు, పరికింపన్ = విచారింపఁగా, పురుషుఁడగుఁగాక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

=పురుషుఁడేయగునుగాని, తరుణియగునె = స్త్రీయగునా! తెలియన్ = విచారింపఁగా, జీవభావంబున్ =జీవత్వమును, కైకొన్న కేవలాత్ముఁడు=అంగీకరించిన యద్వితీయబ్రహ్మము, ఆత్ముఁడగుఁగాక=బ్రహ్మమే యగునుగాని, మఱి, జీవుఁడగునె=జీవుఁ డగునా? (ఎప్పటికిని గాఁ డనుట.)

తా. ఒకపురుషుఁడు స్త్రీవేషమును దాల్చినంతమాత్రముననే వానిపురుషత్వము నకు భంగము లేనట్లు బ్రహ్మము జీవరూపముతో నున్నను ఆయనకుఁ గలబ్రహ్మత్వమున కెప్పటికిని భంగము లేదు కదా. అమానిత్వాదిగుణములును బ్రహ్మమునకు స్వాభావికములే (అనఁగా: బ్రహ్మమునకు మనస్సు లేదు కావున మానదంభాదు లుండుటకే వీలులేదనుట) కావున యోగి బ్రహ్మము నాత్మఁగా నెఱుఁగఁగానే యాగుణములు కలుగుటకు సంశయ మేమి? స్వభావగుణములై యుండి యవి యజ్ఞానబలముచే బ్రహ్మసాక్షాత్కారమునకుఁ బూర్వము తిరోధానమును జెందియుండును. జ్ఞానానంతరమునఁ బ్రకాశించును. ఇందుఁ గ్రొత్తగా వచ్చుట యనునదియే లేదుకదా.

తే. దంతిరూపంబుచే నొప్పుదారు వరయఁ
దారు వగుఁ గాక పరికింప దంతి యగునె?
విశ్వరూపంబుచేఁ దోఁచువిష్ణుమూర్తి
విష్ణుఁ డగుఁ గాక పరికింప విశ్వ మగునె? 98

టీ. అరయన్=విచారింపఁగా, దంతిరూపంబుచేన్ = ఏనుఁగుగా, ఒప్పుదారువు = ఉన్నకొయ్య, దారువగుఁగాక = కొయ్యయేయగునుగాని, పరికింపన్ = విచారింపఁగా, దంతియగునె = యథార్థమగు యేనుంగగునా, విశ్వరూపంబుచేన్ = ప్రపంచస్వరూపముతో, తోఁచు విష్ణుమూర్తి = కానఁబడునట్టి పరబ్రహ్మము, విష్ణుఁడగుఁగాక = పరబ్రహ్మమే యగునుగాని, పరికింపన్ = విచారింపఁగా, విశ్వమగునె = ప్రపంచమగునా? (కానేరదనుట.)

తా. మఱియుఁ గొయ్యతోఁ జేయంబడినయేనుఁగు యేనుఁగగునా? కానేరదు. కావున గజరూపముతో నున్నదారువు ఎప్పటికిని దారువే. అట్లే ప్రపంచరూపముతో నున్న పరబ్రహ్మ మెప్పటికిని పరబ్రహ్మమే కాని ప్రపంచము కాదు కదా!

ఉ. వారణమంచు భ్రాంతుఁడగువానికి దారువు తోఁప దాక్రియన్
దారువటంచుఁ గాంచు విహితజ్ఞునకుం బరికింపఁ గల్గునే?
వారణ మట్లు సర్వ మనువానికి బ్రహ్మము గానిపింప ద
ట్లూరక బ్రహ్మమందుఁ గను యోగికి సర్వము గల్గి తోఁచునే. 99

టీ. వారణమంచున్ = యథార్థమగు నేనుఁగు అని, భ్రాంతుండగువానికిన్ = భ్రాంతిచే దలఁచువానికి, దారువు దోఁపదు = కొయ్యకానంబడదు, ఆక్రియన్ =అట్లు,

Jangamwadi Math Collection. Digitized by eGangotri

దారువటంచున్ =(ఇది కొయ్య) అని, కాంచు...నకున్ -కాంచు=యథార్థస్థితిని దెలిసి కొనునట్టి, విహితజ్ఞునకున్ =వివేకవంతునకు, పరికింపన్ =విచారింపఁగా, వారణము=ఏనుఁగు, కల్గునే=కానఁబడునా (కనఁబడదు). అట్లు = అదియేవిధముగా, సర్వమనువానికిన్ ='ఇది ప్రపంచము' అని భ్రాంతిఁ జెందువానికి, బ్రహ్మముగానుపింపదు=సర్వాధిష్ఠాన మగు పర బ్రహ్మము కానరాదు, అట్లు=ఆవిధముగానే, ఊరక, బ్రహ్మమందున్ =(ఇది యంతయు బ్రహ్మమే) యని, కనుయోగికిన్ = చూచినట్టి రాజయోగికి, సర్వము = నామరూపభేద ములుగల ఈప్రపంచము, కలిగితోఁచునే=ఉన్నట్లు కానవచ్చునా? (కానరా దనుట.)

తా. యథార్థస్థితి ఇదియే యైనను 'ఇది యేనుఁగు' అని తలంచువానికి 'ఇది దారు వేకాని వేఱు కాదు' అని తోఁపదు. 'ఇది దారువు' అని యథార్థజ్ఞానము గలవానికి గజభ్రాంతియుఁ గలుగదు. ఇట్లె 'ఇది ప్రపంచము' అను భ్రాంతునకు బ్రహ్మస్వరూప జ్ఞానంబును 'ఇది బ్రహ్మము' అనుజ్ఞానికి ప్రపంచభ్రాంతియును గలుగదు.

వ అనిన విని హనుమంతుండు సీతారామున కిట్లనియె. 100

టీ. అనినన్ = అని ఇట్లు చెప్పఁగా, విని, హనుమంతుఁడు, సీతారామునకున్, ఇట్లనియెన్.

తా. స్పష్టము.

## సర్వము బ్రహ్మమనువాని వర్తనము.

అవ. ఇట్లు రాజయోగోపదేశము ముగియఁగానే 'బ్రహ్మజ్ఞానమువలన లోకవ్యవ హారమునకు హాని వచ్చును' అని సందేహించి హనుమంతుఁడు ప్రశ్నఁ జేయు చున్నాఁడు:—

క. మీరలు నుడివినవడువున, నారసి,సర్వంబు బ్రహ్మ మని కనుఘనుఁడే
ప్రారబ్ధవ్యవహారం, బేరీతిం జేయు దీని నెఱిఁగింపుఁ డనన్. 101

టీ. మీరలు=మీరు, నుడివినవడువునన్ =చెప్పినట్లు, ఆరసి=విచారించి, సర్వంబు= సమస్తప్రపంచము, బ్రహ్మమని = పరబ్రహ్మమని, కనుఘనుఁడు = తెలిసికొనునట్టి మహా త్ముఁడు, ఏప్రారబ్ధవ్యవహారంబున్ -ప్రారబ్ధ = ప్రారబ్ధకర్మవలన కలిగిన, ఏవ్యవహారంబున్ = ఏక్రియాకలాపమును, ఏరీతిన్ జేయున్ =ఎట్లు నిర్వహించును, దీనిన్ =ఈవిషయమును, ఎఱింగింపుఁడు= తెలియ నుపదేశింపుఁడు, అనన్ =అని ప్రశ్నింపఁగా.

తా. ఓ శ్రీరామా! మీరు చెప్పినవిధమున 'సర్వము బ్రహ్మమే' యనుమహాత్ముఁడు సాధనసాధ్యసాధకాది భేదసాధ్య మగు ప్రారబ్ధకర్మము నేవిధమున నిర్వహించును! ఈవిషయమును నరుణించి నాకెఱుఁగఁజేయుఁడు. అనఁగా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. అనిన శ్రీరామచంద్రుం డవ్వానరేంద్రున కిట్లనియె. 102

టీ. అనినన్, శ్రీరామచంద్రుఁడు, అవ్వానరేంద్రునకున్=ఆవానరశ్రేష్ఠుండైన హనుమంతునకు, ఇట్లనియెన్=ఈవిధముగా నుపదేశింప నారంభించెను.

తా. అనిన రాముఁ డి ట్లని సమాధానముఁ జెప్ప నారంభించెను.

అవ. 'బ్రహ్మజ్ఞానమువలన లోకానుభవమునకు (లేక లోకవ్యవహారమునకు) హాని లేదు' అను విషయమును దృష్టాంతపూర్వకముగా నిరూపించుచున్నాఁడు:—

చ ఘటకటకోర్మికాపటనికాయము లంచు వివేకదృష్టిచేఁ
దటుకున మృత్సువర్ణజలతంతువు లంచు నెఱింగినంతఁ ద
త్స్ఫుటతరనామరూపములు పోవమినన్నియుఁ గార్యకోటికె
ప్పటివలె వచ్చు వచ్చినను బాధకమున్నదె హేతుదృష్టికిన్. 103

టీ. ఘట...ములన్-ఘట = కుండ, కటక=కడియములు, ఊర్మిక=అలలు, పట=వస్త్రము, నికాయములన్=అనువానియొక్కసమూహములను, సువివేకదృష్టిచేన్=చక్కనిజ్ఞానముచే, తటుకునన్=ఏకకాలమునందు, మృత్సువర్ణ...లంచున్-మృత్=మృత్తికయనియు, సువర్ణ = స్వర్ణమనియు, జల = నీరనియు, తంతువులంచున్=దారమనియు, ఎఱింగినంతన్=తెలిసికొనఁగానే, తత్స్ఫుట...ములు-తత్=ఆఘటాదులయొక్క, స్ఫుటతర=స్పష్టమైన, నామరూపములు=నామములును ఆకారములును, పోవమిన్=నశింపవు కావున, అన్నియున్ = ఆనామరూపములన్నియు, కార్యకోటికిన్ = అవసరము కలిగినప్పుడు, ఎప్పటివలెవచ్చున్ = భ్రాంతి యున్న సమయమునందు వలెనే, వచ్చినన్ = వ్యవహారమునకు వచ్చుచున్నను, హేతుదృష్టికిన్ = యథార్థజ్ఞానములకు, బాధకము ఉన్నదె=విరోధము సంభవించునా? (సంభవింపనేర దనుట.)

తా. ఘటము మృత్తిక గాను కటకములు మొదలగువానిని సువర్ణముగాను అలలను జలముగాను వస్త్రములను తంతువులను గాను తెలిసికొనినను, వ్యవహారసమయమునను ఘటకటకాదులు మృత్తికాదిరూపములతోఁ గాక ఘటాదిరూపములతోనే వచ్చుచుండును. ఇట్లు వచ్చుటవలన 'కార్యము లన్నియుఁ గారణములకంటె భిన్నములు కావు' అనుజ్ఞానదృష్టికి భంగ మేమియు లేదు కదా.

అవ. ఇట్లు దృష్టాంతమును నిరూపించి దార్ష్టాంతికమున సంయోజనఁజేసి బ్రహ్మవేత్తయొక్క యనుభవము నెఱింగించుచున్నాఁడు:—

శా. ఆరీతిన్ సకలంబు తత్త్వమని దివ్యాధ్యాత్మయోగంబుచే
నారూఢిం గను[illegible]యెవ్వఁ డదీయాంగేంద్రియాత్మాళికిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రారబ్ధానుభవంబు గల్గునటు లొప్పారంగఁ దా ద్రష్టయై
సారోదారవిచారదృష్టి నరయున్ సర్వంబు బ్రహ్మంబుగాన్. 104

టీ. ఆరీతిన్=ఆవిధముగా, సకలంబు=సమస్తమును, తత్త్వమని=బ్రహ్మ స్వరూప మని, దివ్యా...బు చే-దివ్య=శ్రేష్ఠమయిన, అధ్యాత్మయోగంబుచేన్=జ్ఞాన యోగముచే, ఆరూఢిన్=దృఢముగా, కనుయోగికిన్=చూచునట్టిజ్ఞానయోగికి, ఎయ్యెడన్ = ఎచ్చట నైనను, తదీ...లికిన్-తదీయ=ఆయోగిసంబంధమయిన, అంగ = శరీరములయొక్కయు, ఇంద్రియ=ఇంద్రియములయొక్కయు, ఆత్మ = జీవులయొక్కయు,ఆళికిన్ = సమూహ ములకు, ప్రార...వంబు-ప్రారబ్ధ = పూర్వజన్మకర్మలయొక్క (అనఁగా: తత్ఫలముల యొక్క), అనుభవంబు=అనుభవము, కల్గునే=సంభవించును, అటులు=ఆవిధముగ, ఒప్పా రంగన్ = శరీరాదులకుఁ బ్రారబ్ధానుభవము గలుగుచుండఁగా, తాన్ = బ్రహ్మస్వరూపు డైనతాను, ద్రష్టయై=సాక్షియై (అనఁగా: ఆప్రారబ్ధానుభవమునకును, దానిననుభవించు దేహాదులకును, సాక్షియగుచు తా ననుభవించువాఁడు కాక), సారోదారవిచారదృష్టిన్- సార=శ్రేష్ఠమైనట్టియు, ఉదార=గంభీర మయినట్టియు, విచారదృష్టిన్=జ్ఞాననేత్రముల చేతను, సర్వంబున్=సమస్తప్రపంచమును, (అనఁగా: ప్రారబ్ధంబును తదనుభవంబును దాని ననుభవించు దేహాదులునుగూడ), బ్రహ్మంబుగాన్ = పరబ్రహ్మంబని, అరయున్ = నిర్ణ యించును.(మొట్టమొదట 'నేను ప్రారబ్ధానుభవమునకు సాక్షిని గాని ప్రారబ్ధము ననుభవిం చువాఁడను కాను' అని నిశ్చయించి పిదప ఈ ప్రారబ్ధకర్మము కూడ బ్రహ్మరూపుఁడ నగు నాకంటె వేఱైనది కాదు. ఈప్రారబ్ధానుభవము దీని ననుభవించు దేహాదులును నా కంటె భిన్నములైనవి కావు అని నిశ్చయించుకొనుము.)

తా. అట్లే సర్వమును పరబ్రహ్మమునుగా భావించుదృఢవిజ్ఞానము కలిగినవానికి వ్యవహారదశయందు దేహాదులు గానవచ్చినను లోప మేమియుఁ గలుగదు. సర్వము భ్రాంతియే! కావున ప్రారబ్ధానుభవము కలుగుచున్నట్లు తోఁచుట కూడ భ్రాంతియే! కాని యథార్థము కాదు. ఎట్లైన నేమి ? జ్ఞాని (బ్రహ్మము) సర్వసాక్షియే కావున నాప్రారబ్ధానుభవమునుగూడఁ జూచును. సర్వము స్వస్వరూపమునకంటె భిన్నము కానిదానినిగా దృఢవిజ్ఞానముచే భావించుచుండును. ఈకారణమువలన 'సర్వముబ్రహ్మమే' యను తలంపునకును కల్పితభేదసాధ్య మగువ్యవహారంబునకును విరోధమేమియు లేదు' ఆపరమార్థవిషయముతోఁ బరమార్థవిషయమునకు విరోధము వచ్చుననుట తగదు కదా! 'చిత్తరువునందు వ్రాయఁబడియున్న పులి మనుష్యులఁ జంపును' అనుట యెంత హాస్యా స్పదమో ఇదియుం (అనఁగా. నయథార్థమై భ్రాంతికల్పితమై యున్నవ్యవహారము యథార్థస్థితిని బాధించుననుటయుం) నంత హాస్యాస్పదమే.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. మఱియు ననేకదృష్టాంతములచే పైవిషయమునే వివరించుచున్నాఁడు:—

శా. గానంబు న్నటనంబుఁ దాళగతులం గావించుచుం జారువి
ద్యానైపుణ్యముఁ జూపుచున్ శిరముమీఁదం గల్లుపెందొంతరం
బూనం గైకొనునాట్యశీలునిగతిన్ బుంఖానుపుంఖోజ్వల
న్నానార్థానుభవజ్ఞుఁడయ్యు బుధుఁ డానందాత్మఁ గాంచున్ మదిన్.

టీ. గానంబున్ = పాటను, నటనంబున్ = ఆటను, తాళగతులన్ - తాళ = తాళముయొక్క, గతులన్=నడకల ననుసరించి, కావించుచున్ = చేయుచుండియును, చారు...ణ్యము-చారు = మనోహర మైన, విద్యా = గాననాట్యాదివిద్యలయందలి, నైపుణ్యమున్ = నేర్పును, చూపుచున్, శిరముమీఁదన్ = తనతలపై, కల్లుపెన్దొంత రన్-కల్లు=ఉన్నట్టి, పెన్=పెద్దదైన, దొంతరన్ = కుండలదొంతిని, పూనన్ = చెడకుండ ధరించుటకు, కైకొనునాట్యశీలునిగతిన్ = నేర్చునట్టినటునివలె, పుంఖా...డయ్యున్ - పుంఖానుపుంఖ = వరుసలువరుసలుగా, ఉజ్జ్వలత్ = ప్రకాశించుచున్న, నానార్థ = అనేకవిషయములయొక్క, అనుభవజ్ఞుఁడయ్యున్ = అనుభవమును తెలిసికొనుచున్నవాఁడయ్యును, బుధుఁడు = జ్ఞాని, ఆనందాత్మన్ = ఆనందరూప మగు స్వస్వరూపమును, మదిన్ = మనసునందు, కాంచున్ = చూచుచుండును. (ప్రారబ్ధ వ్యవహారము లెన్నియున్నను ఆత్మనిష్ఠకు భంగము కలుగదని భావము.)

తా. ఆడుచుఁ బాడుచు భరతశాస్త్రప్రావీణ్యమునంతయుఁ జూపుచునుండియుఁ జమత్కారి యగునటుఁడు తనశిరముపై నున్నదొంతర నించుక యైన నేమరక చిత్తము నంతయు నందే నిలిపి యుండుట లోకమునఁ జూచుచున్నాము. ఇట్లే బ్రహ్మజ్ఞాని సర్వేంద్రియములతో సర్వవిషయముల ననుభవించుచున్నను సర్వకారణమగు స్వస్వరూపమును జూచుచునే యుండును.

చ. స్వకృతవిచిత్రపట్టణ మసన్మయ మంచు నెఱింగి భ్రాంతి నొం
దక యిల నింద్రజాలకుఁడు దాని సృజించువిధంబున న్నిజ
ప్రకృతికృతప్రపంచమున భావముగా వివరించి కాంచి త
ద్వికృతులఁ జెందకే ఘనవివేకి యొనర్చు సమస్తకార్యముల్. 106

టీ. ఇలన్=భూమియందు, ఇంద్రజాలకుఁడు = ఇంద్రజాలముఁ జేయువాఁడు, స్వకృ...ణము-స్వ = తనచే, కృత=చేయఁబడిన, విచిత్ర = చిత్రమైన, పట్టణము, అసన్మయమంచున్=అభావరూపమని, ఎఱిఁగి = తెలిసికొని, భ్రాంతినొందక = భ్రమలేక (అనఁగా 'ఈ పట్టణము యథార్థమైనది' అని యెన్నటికిని తలఁపక), దానిన్=ఆపట్టణమును, సృజించు విధంబునన్=కల్పించునట్లు, ఘనవివేకి=మహాజ్ఞాని, నిజ...చమున్-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిజ=తనయొక్క (బ్రహ్మమునకును జ్ఞానికిని భేదము లేదు కావున నిట్లు చెప్పఁబడెను) ప్రకృతి=మాయచేత, కృత=చేయఁబడిన (అనఁగా సృజింపఁబడిన), ప్రపంచమున్, అభావముగా వివరించి=అభావరూపముగా విమర్శించి, కాంచి=తెలుసుకొని, తద్వికృతులన్=ఆ ప్రపంచ సంబంధమయిన వికారములను, చెందకే=పొందకయే, సమస్త కార్యములు, ఒనర్చున్=చేయును.

తా. మఱియు నైంద్రజాలికుఁడు తనమాయచేఁ గల్పింపఁబడిన పట్టణము శూన్యరూపమే యని యెఱింగినవాఁ డగుటచే భ్రాంతిలేక సర్వమును జేయునట్లు జ్ఞానియుఁ దనమాయచేఁ (జ్ఞానికిని బ్రహ్మమునకును భేదము లేదు కావున నిట్లు చెప్పఁబడెను) గల్పింపఁబడు ప్రపంచము మిథ్యయని యెఱింగినవాఁడు కావున సర్వకార్యముల నాచరించు చున్నను దాని వికారములతో సంబంధపడఁడు.

మ. శివజీవైక్యసమాధియందు విలసచ్చిన్మాత్రతత్త్వంబుఁ దా
నవలీలం గని పూర్ణుఁడై పిదప మాయాసంసృతిం జెందినం
దవులన్నేర్చునె యోగి పాలు పెరుఁగై త్రచ్చంగ వేఱైన యా
నవనీతం బిఁకఁ జల్లలోఁ గలయునే నానాప్రకారంబులన్. 107

టీ. యోగి=జ్ఞానయోగి, శివ...యందున్-శివ=పరమాత్మకును, జీవ = జీవునకుఁ గల, ఐక్యసమాధియందున్ = ఏకత్వరూపయోగ నిష్ఠయందు, విలస...త్త్వంబున్-విలసత్=ప్రకాశించుచున్న, చిన్మాత్ర=జ్ఞానమాత్రమైన, తత్త్వంబున్ = పరబ్రహ్మతత్త్వమును, తాన్=స్వయముగా, అవలీలన్=సుఖముగా, కని=సాక్షాత్కరించి, పూర్ణుఁడై=తద్రూపమునుదాల్చి (అనఁగా దృఢమగు నైక్యజ్ఞానము కలిగి), పిదపన్ = తర్వాత, మాయాసంసృతిన్=మాయారూపమైన సంసారమును, చెందినన్ = పొందినప్పటికిని, తవులన్నేర్చునే = ఈ సంసారమునకును ఆతనికిని సంబంధము కలుగునా? (కలుగనేరదనుట), పాలు, పెరుగై, (మాఱి) త్రచ్చంగన్=చిలుకఁగా, వేఱైన = ఆ పెరుఁగునుండి వేఱుగా వచ్చిన, ఆనవనీతంబు=ఆవెన్న, ఇఁకన్=పిదప, నానాప్రకారంబులన్= ఎన్నివిధములుగాఁ బ్రయత్నించినను, చల్లలోన్=మజ్జిగలో, కలయునే=కలియునా!

తా. ఇదియును గాక భ్రాంతి దొలఁగి జీవబ్రహ్మైక్యమును దెలిసికొని సర్వపూర్ణుఁడై యోగారూఢుండైయున్న మహాత్ముఁడు కల్పితసంసారమును జెందినను వానికి వికారములంటవు. పాలను పెరుఁగుఁజేసి దానిని మథించి తీయఁబడిన వెన్న ఆపాలకంటెను పెరుఁగునకంటెను వేఱే యగును కాని యెప్పటికైన దానియందు కలియునా! కలియదు కదా! అట్లే బ్రహ్మజ్ఞానియు దేనితోను సంబంధపడఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. ప్రజ్వలత్పావకావృతపర్వతంబు
నాశ్రయించునె మృగవిహంగాదికములు
బ్రహ్మమయుఁడై ప్రకాశించు బ్రహ్మవిదుని
నంటునే పుణ్యపాపంబు లాంజనేయ! 108

టీ. ఆంజనేయ! ప్రజ్వల...తంబున్-ప్రజ్వలత్=మండుచున్న, పావక=అగ్ని హోత్రముచేత, ఆవృత=చుట్టఁబడిన, పర్వతంబున్, మృగ...ములు-మృగ = మృగములు, విహంగ=పక్షులు, ఆదికములు=మొదలగునవి, ఆశ్రయించునె, బ్రహ్మమయుఁడై=బ్రహ్మరూపుఁడై, ప్రకాశించు బ్రహ్మవిదునిన్=ప్రకాశించుచున్న బ్రహ్మజ్ఞానిని, పుణ్యపాపంబులు, అంటునే=తగులునా? (తగులవనుట.)

తా. ఆంజనేయా! మండుచున్న యగ్నిచే నావరింపఁబడిన యగ్నిపర్వతమును మృగములుకాని పక్షులుకాని యాశ్రయింపనట్లు బ్రహ్మవేత్తయు బ్రహ్మరూపుండగు మహాత్ముని పుణ్యపాపములు (అనఁగా మంచి చెడ్డలు; సర్వవికారములును మంచివనియుఁ జెడ్డవనియుం రెండువిధములుగా విభాగించుట యుక్తిహీనముకాదు. కావున నిట్లు చెప్పఁబడెను.) అంటనేరవు.

కవిరాజవిరాజితము:—

తరణి సమస్తరసంబులఁ గ్రోలుచుఁ దద్రసనిష్ఠవికారములం
బొరయనిచందమునన్విషయంబులఁ బొందుచుఁ దద్గుణదోషములన్
నిరతము నంటక యోగివరుం డతినిర్మలనిశ్చలమానసుఁడై
పరమసుఖామృతవార్ధిని గ్రుంకుచుఁ బావనుఁడై విలసిల్లుఁ దగన్.

టీ. యోగివరుఁడు = శ్రేష్ఠుండగు జ్ఞానయోగి, తరణి = సూర్యుఁడు, సమస్త=సర్వవిధములైన, రసంబులన్=ద్రవపదార్థములను, క్రోలుచున్ = కిరణములచే నాకర్షించుచు, తద్రస...ములన్-తత్ రస=ఆరసద్రవపదార్థములయందు, నిష్ఠ = ఉన్న, వికారములన్=ఉప్పు మొదలగువికారములను, పొరయనిచందమునన్ = పొందనట్లు, విషయంబులన్ = శబ్దాదుల నన్నిటిని, పొందుచున్ = ఆశ్రయించు చుండియును, తద్గుణదోషములన్-తత్=ఆవిషయములయందలి, గుణ = గుణములను గాని, దోషములన్=దుర్గుణములను గాని, నిరతమున్ = ఎల్లప్పుడు, అంటక=పొందక, అతి...సుఁడై-అతి=మిగుల, నిర్మల=పరిశుద్ధమైనట్టియు, నిశ్చల = చలింపనట్టియు, మానసుఁడై = మనస్సుకలవాఁడై, పరమసుఖామృతవార్ధిన్-పరమ = శ్రేష్ఠమయిన, సుఖ=ఆనందమనెడు, అమృత=అమృతముయొక్క, వార్ధిన్=సముద్రమునందు, క్రుంకుచున్ = మునుగుచు, పావనుఁడై=నిర్మలుఁడై, తగన్=ఒప్పునట్లుగా, విలసిల్లున్=ప్రకాశించును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. మఱియు సూర్యుఁడు సర్వద్రవపదార్థముల నాకర్షించుచున్నను వాని యందున్నలవణాదిరసములను గాని సుగంధదుర్గంధములను గాని పొందనట్లు ఈరాజయోగియు సర్వవిషయముల ననుభవించుచున్నను అందలిగుణదోషములఁ జెందఁడు, పరిశుద్ధమైనట్టియుఁ నిశ్చలమైనట్టియు మనస్సుగలవాఁడై బ్రహ్మానందసముద్రమున నోలలాడుచు నతినిర్మలుఁడై యుండును.

తోదకవృత్తము:—

చారువివేకి యసారమహాసం, సారముఁ జెంది యసంగతనుండున్
నీరజపత్రము నీరము నేప్రొ, ద్దారయ నంటియు నంటనిభంగిన్.

టీ. అరయన్ = విచారింపఁగా, చారువివేకి=చక్కనిజ్ఞానము కలవాఁడు, అసారమహాసంసారమున్-అసార=నిస్సార మయిన, మహత్=గొప్పదయిన (అనఁగా: తొలఁగించుకొనుటకు వీలులేని,) సంసారమున్, చెంది=ఆశ్రయించి (అనఁగా: సంసారమున కనుగుణముగాఁ బ్రవర్తించుచుండియును,) నీరజపత్రము = తామరయాకు, నీరమున్= నీటిని, ఏప్రొద్దున్=ఎప్పుడును, అంటియున్=తాకియును, అంటనిభంగిన్=తాఁకనట్లు, అసంగతనుండున్ = సంబంధపడనివాఁడై యుండును.

తా. నీటియందే సర్వకాలములయందు నుండియు దానితో సంబంధపడని తామరయాకువలె దివ్యజ్ఞానసంపన్నుఁడు సర్వవ్యవహారముల నాచరించుచు సంసారమునం దున్నను దానితో సంబంధపడక యసంగుఁడై యుండును.

ఆ. పావకుండు సర్వభక్షకుం డయ్యు ని
ర్దోషుఁడైనభంగి దూరదర్శి
విషయరాగి యయ్యు వీతరాగియునై వె
లుంగుచుండు ముక్తసంగుఁ డగుచు. 111

టీ. పావకుండు=అగ్ని, సర్వభక్షకుండయ్యున్ = సమస్తపదార్థములను భుజించువాఁడయ్యును (అనఁగాఁ గాల్చువాఁ డయ్యును), నిర్దోషుఁడైనభంగిన్ = దోషములేనివాఁడైనట్లు, దూరదర్శి=జ్ఞాని, విషయరాగియయ్యున్-విషయ=శబ్దాదులయందు, రాగియయ్యున్=ఇచ్ఛగలవాఁడయ్యును, వీతరాగియునై = వైరాగ్యవంతుఁడు కూడనగుచు, ముక్తసంగుఁడగుచున్-ముక్త = విడువఁబడిన, సంగుఁడగుచున్=అభిమానము గలవాఁడై, వెలుంగుచుండున్=ప్రకాశించుచుండును.

తా. అగ్నిహోత్రుఁడు పరిశుద్ధము లైనపదార్థములను గాని యపరిశుద్ధములైన పదార్థములను గాని భక్షించువాఁడైనను పరిశుద్ధుఁడే యైనటు రాజయోగియు సకలవిషయముల ననుభవించుచున్నను వైరాగ్యవంతుఁడే (అనఁగా: నిత్యపరిశుద్ధుఁడే) యగును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. తనరుసాత్త్వికరాజసతామసములఁ
బొంది పొందఁడు నిర్గుణానందపరుఁడు
మంటి నంటియు నంటక యొంటి మెలఁగు
విమలమృత్కీటకంబు చందమున ననఘ!. 112

టీ. అనఘ=ఓదోషరహితుఁడ, మంటికిన్, అంటియున్ = తగిలియు, అంటక = తగులక, ఒంటికిన్ = స్వతంత్రముగా, మెలం...మునన్-మెలంగు = సంచరించునట్టి, విమల = పరిశుద్ధమయిన, మృత్కీటకంబుచందమునన్=కుమ్మరిపురుగువలె, నిర్గుణానంద పరుఁడు-నిర్గుణ=సత్త్వాదిగుణశూన్యమైన, ఆనంద=బ్రహ్మానందమునందు, పరుఁడు=ఆశగల వాఁడు (లేక బ్రహ్మానందమే ముఖ్యస్థానముగాఁ గలవాఁడు), తనరు...ములన్-తనరు= ఒప్పునట్టి, సాత్త్వికరాజసతామసములన్ = సత్త్వరజస్తమోగుణముల, బొంది పొందఁడు= ఆశ్రయించియు ఆశ్రయింపనివాఁడే.

తా. ఓదోషరహితుఁడా! కుమ్మరపురుగు మట్టియందే తిరుగుచున్నను దాని నంట నట్లు బ్రహ్మానందానుభవరసికుఁడు సత్త్వరజస్తమోగుణములను (అనఁగా: వానివలనఁ గలుగు ప్రకాశప్రవృత్తిమోహములను) జెందియు వానితో సంబంధపడఁడు.

చ. పరపురుషానురక్తి గలభామిని యెల్లపనుల్ గృహంబునం
బొరిఁబొరిఁ జేయుచుం బ్రియునిపొందు సుఖంబుగఁ జూచురీతి భా
స్వరపరతత్త్వవేది నిజవర్ణనిజాశ్రమయోగ్యధర్మముల్
నిరతము సల్పుచుం బరమనిర్మలసౌఖ్యముగాంచు నెమ్మదిన్. 113

టీ. పర...మిని-పర = ఇతరుఁడైన, పురుష = పురుషునియందు, అనురక్తిగల = ప్రీతిగల, భామిని=స్త్రీ, ఎల్లపనులు=సమస్తకార్యములను, గృహంబునన్ = తనయింటి యందు, పొరిన్ పొరిన్ = శీఘ్రముగా, చేయుచున్, ప్రియునిపొందున్ = తనచేఁ గావింపఁబడిన పురుషునియొక్క సంబంధమును, సుఖముగన్=సుఖమని, ఎంచురీతిన్ = సర్వకాల సర్వావస్థలయందును దలంచునట్లు, భాస్వర...వేది-భాస్వర = ప్రకాశించు చున్న, పరతత్త్వ=పరబ్రహ్మతత్త్వమును, వేది = తెలిసికొన్నవాఁడు, నిజ...ములు-నిజ వర్ణ = స్వకీయమైన జాతికిని, నిజాశ్రమ = స్వకీయమైన ఆశ్రమమునకును, యోగ్య= తగిన, ధర్మముల్=విధులను, నిరతము = ఎల్లప్పుడును, సల్పుచున్ = చేయుచును, నెమ్మ దిన్=మనస్సునందు, పరమ...చేతన్-పరమ=శ్రేష్ఠమైన, నిర్మల=పరిశుద్ధమైన, సౌఖ్య మున్=బ్రహ్మానందమును, కాంచున్=సర్వకాల సర్వావస్థలయందును జూచుచుండును.

తా. పరపురుషానురాగముగల స్త్రీ ఇంటియందలి సర్వకార్యములను చక్కఁగా నిర్వహించుచున్నను, ఆపరపురుష సమాగమసుఖమునే మనసున సర్వకాలములయందును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భావించుచున్నట్లు జీవబ్రహ్మైక్యము నెఱిఁగిన యోగి తన వర్ణాశ్రమ ధర్మములు పూని కతో నాచరించుచున్నను సర్వకాలములందును మనసున బ్రహ్మానందమునే కనుఁగొను చుండును.

వ. అట్టిమహానుభావుండు ప్రారబ్ధవశంబుచే స్వవర్ణాశ్రమోచితధర్మంబుల యందుఁ బ్రవర్తించు సమయంబున. 114

టీ. అట్టి మహానుభావుఁడు, ప్రారబ్ధవశంబుచేన్-ప్రారబ్ధ = పూర్వజన్మకర్మము యొక్క, వశంబుచేన్=స్వాధీనమం దుండుటవలన, స్వవర్ణా...యందున్-స్వవర్ణ=తన జాతికిని, ఆశ్రమ=తన యాశ్రమమునకును, ఉచిత=తగిన, ధర్మంబులయందున్=విధుల యందు, ప్రవర్తించు సమయంబునన్ = ప్రవర్తించుచున్నప్పుడు (అనఁగా: నాయా కర్మల నాచరించుచున్నప్పుడు.)

తా. స్పష్టము.

ద్విరదగతిరగడ.—

మొదలు సరిగాఁగఁ గనుమోదమును ఖేదమును
వదలుకొనియుండుఁ బరవాదమును ఖేదమును
గలఁతపడి సల్పఁడు వికర్మమును గర్మమును
దలఁపఁ డొకయించుక యధర్మమును ధర్మమును
మరులుకొని చేయఁ డభిమానమును మానమును
మఱచియును మానఁ డతిమానమును జ్ఞానమును
గ్రందుకొని పొందఁడు సుకాంతలను వింతలను
జెందఁ డతిదుర్విషయచింతలను వంతలను
సొలయక జయించు నతిసుప్తియు నసుప్తియును
దెలిసి కను నాత్మసుఖతృప్తియును జ్ఞప్తియును
లౌల్యమతిఁ దాల్పఁ డభిలాషమును వేషమును
దుల్యముగఁ గాంచు ఘనతోషమును రోషమును
జెలఁలపై నుంచఁ డిల స్నేహమును మోహమును
దెలియఁ డిది సత్యమని దేహమును గేహమును
విరసముగ నెంచు నలవిత్తముల మొత్తముల
సరసముగ నెంచు మది సత్తములఁ జిత్తముల
భ్రమ గొని భజింపఁ డిలఁ బౌత్రులను బుత్రులను
సమముగఁ దలంచు సుగుణ త్రులను మిత్రులను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గర మభిలషింపఁ డొకకల్మియును బల్మియును
సిరియును గొనుఁ బుధులచెల్మియును దాల్మియును
సడలఁ డొకయింతయును శాంతియును దాంతియును
గడ కరుగనీఁడు ముఖకాంతియును క్షాంతియును
బ్రాపనుచుఁ జూచు గురుభక్తియు విరక్తియును
నోపిక నెఱుంగు శ్రుతియుక్తియును ముక్తియును. 115

టీ. మోదముఁ=సంతోషమును, ఖేదముఁ=దుఃఖమును, మొదలుసరిగాఁగఁ= సమానముగా, కనుఁ=చూచును, పరవాదముఁ = ఇతరులతో వాదించుటయును, భేద ముఁ=భేదబుద్ధియును, వదలుకొనియుండుఁ=విడిచిపెట్టును. వికర్మముఁ = నిషిద్ధకర్మ మును, కర్మముఁ=విహితకర్మమును, కలఁతపడి=(ఇది నిషిద్ధమే. దీని నెట్లు చేయుదును? ఇది విహితకర్మమే. దీని నెట్లు చేయకుందును? అని) కలఁతజెంది, సల్పఁడు=చేయఁడు (అనఁగా దాను కర్తకాఁడు. కావున విధియైనను నిషిద్ధమైనను సమచిత్తముతో నాచ రించుచుండు ననుట). అధర్మముఁ, ధర్మముఁ, ఒకయించుక = కొంచెమైనను, తలం పఁడు=విచారింపఁడు, అభిమానముఁ=అహంకారమును, మానముఁ=గర్వమును, మరులు కొని=ఆసక్తుఁడై, చేయఁడు=కలుగచేసికొనఁడు, అతిమానముఁ=అధికమగు మానమును, జ్ఞానమునుఁ=బ్రహ్మజ్ఞానమును, మఱచియుఁ=ప్రమాదముఁ జెందియైనను, మానఁడు= విడువఁడు, సుకాంతలఁ = చక్కని స్త్రీలను, వింతలఁ = ఆశ్చర్యకరములగు (లేక ఆనందకరములగు) వానిని, క్రందుకొని=అధికముగా, పొందఁడు=ఆశ్రయింపఁడు, అది దుర్విషయచింతలఁ=శబ్దాదివిషయములను అందలి యాలోచనములును, వంతలఁ = ఆ విషయములు దొరకక పోవుటవలనఁ గలుగు దుఃఖములను, చెందఁడు, అతిసుప్తి = అతి నిద్ర, అసుప్తియుఁ = నిద్ర లేకుండుటను, పొరయక, సుఖముగ, జయించుఁ, ఆత్మ సుఖతృప్తియుఁ-ఆత్మ = బ్రహ్మరూపమైన, సుఖ = ఆనందముచే, తృప్తియుఁ, జ్ఞప్తి యుఁ=జ్ఞానమును (లేక జ్ఞానరూపమయినబ్రహ్మమును), తెలిసి = శాస్త్రయుక్త్యనుభవ ములచేఁ దెలిసి, కనుఁ=చూచును, లౌల్యమతిఁ = ఆసక్తమగుచిత్తముతో, అభిలాష ముఁ = కామమును, వేషమును=వస్త్రాలంకారాదులను, తాల్పఁడు = ధరింపఁడు. ఘన తోషముఁ=అధికమగు సంతోషమును (అనఁగా బరులకుఁ దనమీఁదంగల మంచియభి ప్రాయమును). రోషముఁ = (పరులకుఁ దనపై కలిగిన) రోషమును, తుల్యముగఁ = సమానముగా, కాంచుఁ = చూచును, ఇలఁ = ఈ భూమియందు, స్నేహముఁ = అనురాగమును, మోహముఁ=భ్రాంతిని, చెలులపైఁ = స్త్రీలపై (లేక మిత్రులపై), ఉంచఁడు, దేహముఁ=ఈదేహమును, గేహముఁ=గృహమును, ఇదిసత్యమని="ఇది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యథార్థము" అని, తెలియఁడు = తలంపఁడు; అలవిత్తములన్ = ధనములను, మిత్తములన్=బంధుసమూహములను, విరసముగనెంచున్=రసహీనములని తలంచును, మదిన్=మనస్సునందు, సత్తములన్=శ్రేష్ఠులను (అనఁగా బ్రహ్మజ్ఞాననిష్ఠులను), చిత్తములన్=బ్రహ్మాకారవృత్తులను, సరసముగన్ = సారవంతములుగా, ఎంచున్ = నిశ్చయించును, పౌత్రులన్=మనుమలను, పుత్రులన్=కుమారులను, భ్రమగొని=(వీరు నావారు; నేను వీరివాఁడను; మాకిరువురకు సంబంధముకలదు అని భ్రాంతిచెంది,) భజింపఁడు=సేవింపఁడు (అనఁగా నభిమానింపఁడు), ఉరుశత్రులన్=గొప్పశత్రువులను, మిత్రులన్=స్నేహితులను, సమముగఁదలంచున్=సమానముగాఁజూచును, ఒకకల్మియున్=ఏవిధమగు సంపదనుగాని, బల్మియున్ = బలమునుగాని, కరము = మిగుల, అభిలషింపఁడు=కోరఁడు, బుధులచెల్మియున్=విద్వాంసులస్నేహమును, తాల్మియున్=ఓర్పును, సిరియనుకొనున్=మహాసమృద్ధిగాఁ దలంచును, శాంతియున్=చిత్తశాంతిని, దాంతియున్=ఇంద్రియనిగ్రహమును, ఒకయింతయున్=కొంచెమైనను, సడలఁడు=విడువఁడు, ముఖకాంతియున్, క్షాంతియున్=శీతోష్ణసహనంబును, కడకరుగనీఁడు=తొలఁగిపోనీయఁడు (అనఁగా నెప్పుడును విశేషమగు ముఖకాంతినిగలిగి శీతోష్ణాదుల సహించుచు నుండును.) గురుభక్తియున్, విరక్తియున్ = వైరాగ్యంబును, ప్రాపనుచుఁజూచున్ = "ఇవియే మనకు శరణము" అని తలంచును, శ్రుతియుక్తియున్=వేదయుక్తులను (లేక వేదములనుయుక్తులను.) ముక్తియున్=మోక్షంబును, ఓపికనెఱుంగున్=పరిశ్రమముఁజేసి తెలిసికొనును.

తా. మఱియు నాబ్రహ్మజ్ఞాని వ్యవహారములు చేయునప్పుడు సుఖదుఃఖములు సమముగాఁ జూచును, పరు లెట్లుచెప్పినను "అవును కాదు" అనఁడు. "వారు నావారు కారు. వీరు నావారు. నేను వేఱు, వాఁడు వేఱు" అని భేదసంకల్పమును జేయఁడు. "ఇది నిషిద్ధకర్మ. ఇది విహితకర్మ. దీనిని చేయరాదు. దీనిని చేయవచ్చును" అని కొంచెమైనను లక్ష్యము చేయఁడు. మనసున కలఁత నొందఁడు. ధర్మాధర్మములఁ గొంచెమైనను విమర్శింపఁడు. (అనఁగా నేది యెప్పటికిఁ దటస్థించునో దానినప్పుడు కలఁత యేమియు లేకుండ నొనర్చును.) అహంకారగర్వముల నెన్నటికిని జెందఁడు. త్రివిధమానములను బ్రహ్మజ్ఞానంబును విడువఁడు. స్త్రీలను కాని యాశ్చర్యకరములగు నితర విషయములను కాని యాశ్రయింపఁడు. విషయానురాగమును కాని అవి దొరకకుండుట వలన దుఃఖమును కాని పొందఁడు. నిద్రను జాగ్రత్తనుకూడ జయించును. బ్రహ్మానందానుభవమునఁ గలుగుతృప్తిని కూటస్థరూపమగు నిత్యజ్ఞానప్రకాశమును వివేకదృష్టిచే నెఱుంగును. ఏవిషయమునందైనను గోర్కి [illegible] లనుగాని యాసక్తుఁడై

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేయఁడు. అట్టివానికిఁ బరులేమిచేసినను వికారముండకపోవుటచే దోషములేదు కదా! తన్ను జూచి ఇతరులు సంతసించినను కోపించిన నొక్కటిగాఁ జూచును. మిత్రులపై స్నేహభావమును కాని స్త్రీలపై ననురాగమును (లేక భ్రాంతిని) కాని యుంచఁడు. ఈదేహమును గృహమును సత్యములఁగా నెన్నఁడును భావింపఁడు. ధనసమూహములను బంధువులను నిస్సారభూతములుగాఁ జూచును. సత్పురుషులను జ్ఞానముచేఁ బ్రసన్నము దివ్యహృదయములను సారభూతములునుగాఁ జూచును. పుత్రులైనను పౌత్రులైనను వారియెడ భ్రాంతినుంచఁడు. శత్రుమిత్రుల సమముగాఁ జూచును. తనకు సంపదను గాని బలమును గాని కొంచెమైనను గోరఁడు. విద్వాంసులతో స్నేహముచేయుంటయు, నోర్పు కలిగియుండుటయుం ననునవియే మహైశ్వర్యమని భావించును. చిత్తశాంతిని ఇంద్రియనిగ్రహమును కొంచెమైన వదలఁడు. ముఖకాంతిని ఓర్పును ఇటునటులఁ జలింప నీయఁడు. (అనఁగా నెప్పుడును ముఖకాంతితోఁ గూడియే యుండును.)గురుభక్తివైరాగ్యములే శరణములని నమ్మియుండును. వేదములును దానికనుగుణములగు యుక్తులను (లేక వేదమునందలి యుక్తులును) మోక్షమును (అనఁగా మోక్షస్వరూపమును) బూన్కితో విచారించును.

వ. అని మఱియు నిది శాస్త్రోక్తప్రకారం బింక ననుభవంబు వినుము.

టీ. అని, మఱియున్, ఇది=ఈచెప్పినదంతయు, శాస్త్రోక్తప్రకారంబు=శాస్త్రము ననుసరించి చెప్పంబడినది, ఇంకన్, అనుభవంబు=అనుభవముననుసరించి చెప్పంబడుదానిని వినుము.

తా. ఓపార్వతీ! ఈవిధముగాఁ జెప్పి శ్రీరాముఁడు హనుమంతునితో నిట్లనియె. ఓయాంజనేయుఁడా! పైచెప్పిన బ్రహ్మజ్ఞచర్యయంతయుం శాస్త్రోక్తమైనది. ఇఁక మహాత్ముల యనుభవము ననుసరించి సర్వమును వివరింతును.

అవ. ఇట్లు ప్రతిజ్ఞఁ జేసి దృష్టాంతపూర్వకముగా ననుభవము నెఱింగించుచున్నాఁడు:—

మ. తలఁపన్ గాఢవిరక్తియున్ స్ఫుటతరాద్వైతాత్మవిజ్ఞానము
జ్జ్వలసర్వేంద్రియమానసోపరతియున్ సంపూర్ణమై నిత్యమున్
వెలయంగాఁ దనుఁ గాంచుకేవలునకున్ విశ్వంబు చూపట్టునే
కలలోఁ గన్నగజంబు మేలుకొనినం గన్పట్టునే మారుతీ! 117

టీ. మారుతీ=ఓవాయుపుత్రా, తలంపన్=విచారింపఁగా, గాఢవిరక్తియున్-గాఢ=అత్యధికమైన, విరక్తియున్=వైరాగ్యంబును, స్ఫుట...నమున్, స్ఫుటతర=స్పష్టమైన, అద్వైత=ఏకరూపమైన, ఆత్మ=పరబ్రహ్మముయొక్క, విజ్ఞానమున్=అనుభవజ్ఞానమును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉజ్జ్వల...రతియున్-ఉజ్జ్వల=ప్రకాశించుచున్న, సర్వ=సమస్తములయిన, ఇంద్రియ=ఇంద్రియములయొక్కయు, మానస=మనస్సుయొక్కయు,ఉపరతియున్=శాంతియును, నిత్యమున్=ఎల్లప్పుడును, సంపూర్ణమై, వెలయంగాన్=అభివృద్ధిచెందుచుండఁగా, తనున్=తనస్వరూపమును, కాంచు కేవలునకున్=చూచునట్టియేకస్వరూపునకు, విశ్వంబు=ప్రపంచము, (అసత్యమైన ప్రపంచము), చూపట్టునే=కానవచ్చునా? (కానరాదు.) కలలోన్, కన్నగజంబు=చూచినయేనుఁగు, మేలుకొనినన్, కన్పట్టునే=కానవచ్చునా? (అనఁగా కానరాదు.) కలలోనిపదార్థములవలె భ్రాంతియున్నప్పుడు మాత్రమే కనంబడుప్రపంచము భ్రాంతిలేని సిద్ధునకు గానరాదు అని భావము.

తా. ఓయాంజనేయా! దృఢమగు వైరాగ్యంబును ఆత్మస్వరూపవిజ్ఞానంబును దానివలనఁ గలిగిన చిత్తేంద్రియశాంతియును గలమహాత్మునకు సర్వకార్యములయందు నాత్మావలోకనముఁ జేయంగలధన్యులకు నీప్రపంచము బొత్తిగనే కానరాదు. భ్రాంతికల్పితమగుటచే నీప్రపంచము స్వప్నతుల్యమైనది. పారమార్థికమగుటచే నాత్మరూపము జాగ్రదవస్థాతుల్యమైనది. కావున యథార్థజ్ఞానముకల మహాత్మునికి స్వప్నదృష్టమైన గజము జాగ్రతయందుఁ గానరానిభంగి నీప్రపంచము బొత్తిగనే కానరాదు. ఇది యనుభవసిద్ధమే కదా! కావున బ్రహ్మజ్ఞాని ప్రారబ్ధానుభవముఁ జేయుచున్నట్లు భ్రాంతులకుఁ దోఁచు నంతియే కాని వాని కాయనుభవమే లేదని నిశ్చయించుకొనవలయును.

## బ్రహ్మవిద్బ్రహ్మవిద్వర బ్రహ్మవిద్వరీయ బ్రహ్మవిద్వరిష్ఠులలక్షణము.

వ. ఇంక నొక్కవిశేషతాత్పర్యంబు వివరించెద నాకర్ణింపుము బ్రహ్మవిదుండు 'బ్రహ్మవిద్వరుండు' బ్రహ్మవిద్వరీయుండు బ్రహ్మవిద్వరిష్ఠుడన మత్స్వరూపతత్త్వజ్ఞులు నలువురు గల రందు దేహేంద్రియాదికర్తృత్వంబును కర్మఫలకాంక్షయు లేక నిత్యనైమిత్తికంబులైన యజ్ఞదానతపఃప్రముఖవైదికకర్మంబుల యథావిధిగా నాచరించుచుఁ గామ్యకర్మంబుల విడిచి శాస్త్రగర్హితంబులు గాని లౌకికకర్మంబుల యథోచితంబుగా నొనర్చుచుఁబుత్రమిత్రకళత్రవిత్తక్షేత్రాదులయందు వైరాగ్యంబు గలిగి యదృచ్ఛాలాభసంతుష్టుండుఁ గామరాగద్వేషభయలోభమోహమదమత్సరాదినానావిధ చిత్తవికారరహితుండు సతతవిజితశరీరేంద్రియప్రాణాంతఃకరణుండు నిరహంకారుండు నిత్యప్రసన్నచిత్తుండుఁ బరమకారుణికుండుఁ బరమశాంతుండు జ్ఞానవిజ్ఞానసంపన్నుండు నంతర్ముఖుండు నంతరారా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముండు నంతగ ప్ర కాశుండు నాత్మరతుండు నాత్మతృప్తుండు నాత్మసంతుష్టుండునై సంచరించునతండు బ్రహ్మవిదుండు. మఱియు సకల వైదికలౌకికకర్మంబుల విధిపూర్వకంబుగా సన్యసించి పూర్వోక్త లక్షణంబుల విలసిల్లి సంప్రాప్తదుఃఖంబుల ద్వేషింపక నివృత్తసుఖంబులఁ గోరక ప్రకాశవృత్తిమోహంబుల నుదాసీనునిచందంబునఁ జూచుచు సుఖదుఃఖమోహాదికార్యాకార్యగుణంబులయందుఁ జిత్తేంద్రియాదివికారకారణగుణంబులు ప్రవర్తించుచుండ వాని చేతం జలింపం జేయఁబడక నిశ్చలుండుసమదుఃఖసుఖుండు స్వస్థుండు సమలోష్టాశ్మకాంచనుండుఁ దుల్యప్రియాప్రియుండుఁ దుల్యనిందాస్తోత్రుండుఁ దుల్యమానావమానుండుఁ దుల్యశత్రుమిత్రపక్షుండు సంపరిత్యక్తసర్వారంభుండు నగుగుణాతీతుండు బ్రహ్మవిద్వరుం డనందగు మున్ను వివరించిన గుణంబు లన్నియుఁ బ్రకాశించుచుండ సంతతసహజామనస్క రాజయోగనిష్ఠాగరిష్ఠుండై యెడనెడఁబరులవలన మేలుకొలుపంబడి కించిదాహారంబు గొనుచు సుప్తుండైనవాని తెఱంగున విశ్వంబును మఱచి యుండునతండు బ్రహ్మవిద్వరీయుండు దనవలననొరులవలనఁ బునరుత్థానంబు లేక బాహ్యాభ్యంతరంబుల మఱచి నిరంతరనిర్వికల్పసమాధినిష్ఠుం డై పరిపూర్ణప్రత్యగభిన్నపరబ్రహ్మచైతన్యప్రకాశమాత్రుండై వెలుంగునతండు బ్రహ్మవిద్వరిష్ఠుం డనందగునందు మొదలయినవురకుఁ బ్రారబ్ధంబు దోఁచియు మిథ్యాభూతం బై యుండు వరీయునందుఁ గలిగియు లేకుండు వరిష్ఠున కేమాత్రంబు లేదు గావున నిమ్మహానుభావుల యనుభవంబులు నీవడిగినప్పటినుండి యేర్పఱచి చెప్పితిగాదే యని వెండియు నిట్లనియె. 118

టీ. ఇంకన్, ఒక్క విశేషతాత్పర్యంబున్=మఱియొక ప్రధానాంశమును, వివరించెదన్, ఆకర్ణింపుము=వినుము, బ్రహ్మవిదుండు=బ్రహ్మవిదుఁడనియు, బ్రహ్మవిద్వరుండు=బ్రహ్మవిద్వరుఁడనియు, బ్రహ్మవిద్వరీయుండు = బ్రహ్మవిద్వరీయుఁడనియు, బ్రహ్మవిద్వరిష్ఠుండు=బ్రహ్మవిద్వరిష్ఠుండనియు, అనన్, మత్స్వ...జ్ఞులు-మత్స్వరూప=నాయథార్థస్వరూపముయొక్క, తత్త్వజ్ఞులు = నిజమును దెలిసినవారు, నలువురుగలరు, అందున్=వారిలో, దేహేం...త్త్వంబు-దేహ=దేహము, ఇంద్రియ = ఇంద్రియములు, ఆది=మొదలగువానియొక్క, కర్తృత్వంబు = కర్తృత్వము (అనఁగా దేహాదులు చేయుకార్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములం దానే చేసినట్లు భావించుట, కర్మఫలకాంక్షయుఁ - కర్మ = తనచేఁజేయఁబడిన కర్మలయొక్క, ఫలకాంక్షయుఁ = ఫలములయందలియాశయును, లేక, నిత్యనైమిత్తికంబులైన = ప్రతిదినమునాచరింపవలసిన సంధ్యావందనాదులును కారణాంతరమువలన నాచరింపంబడుశ్రాద్ధాదులును, యజ్ఞదానతపంబులు-యజ్ఞము=యజ్ఞము మొదలయిన పూజలు, దాన=దానంబు, తపంబులు = తపస్సులు, ప్రముఖ = మొదలైన, వైదికకర్మంబులఁ = వేదోక్తకర్మములను, యథావిధిగాఁ = శాస్త్రోక్తప్రకారముగా, ఆచరించుచుఁ=చేయుచు, కామ్యకర్మంబులఁ=ఫలాపేక్షచేనాచరించునగ్నిష్టోమాదులను,విడిచి, శాస్త్రగర్హితంబులుగాని = శాస్త్రమునందు నిషేధింపఁబడని, లౌకికకర్మంబులఁ = లోకోచితములగు ధనార్జనాదికర్మంబులును, యథోచితంబుగాఁ = తగినట్లు, ఒనర్చుచుఁ=చేయుచు, పుత్ర...యందుఁ-పుత్ర = పుత్త్రులు, మిత్ర=స్నేహితులు, కళత్ర=భార్య, విత్త=ధనము, క్షేత్ర=భూములు, ఆదులయందుఁ = మొదలగుసర్వపదార్థములయందును, వైరాగ్యంబుగలిగి = విరక్తుఁడై, యదృచ్ఛాలాభసంతుష్టుండును = అప్రయత్నముగా దొరికినదానితో తృప్తినొందువాఁడును, కామ...కను - కామ = కోరిక, రాగ=ఉన్నదాని ననుభవింపవలెనను నిచ్ఛ, ద్వేష=వైరము, భయ=భయము, లోభ=కలకున్నదానిని నొకరి కియ్యకుండవలెనను దుర్వృత్తి, మోహ=మోహము, మద=మదము, మత్సర=దీర్ఘక్రోధము, ఆది = మొదలైన, నానావిధ = అనేకవిధములైన, చిత్తవికారరహితుండును = మనోవికారములు లేనివాఁడును, సతత...డును-సతత = ఎల్లప్పుడును, విజిత = జయింపఁబడిన, శరీర=శరీరములు, ఇంద్రియ = ఇంద్రియములు, ప్రాణ=ప్రాణవాయువులు, అంతఃకరణుండును = మనోబుద్ధిచిత్తాహంకారములునుకలవాఁడును, నిరహంకారుండును = అభిమానములేనివాఁడును, నిత్య...చిత్తుండును-నిత్య = ఎల్లప్పుడు, ప్రసన్న = శాంతినిపొందిన, చిత్తుండును=మనస్సుకలవాఁడును, పరమకారుణికుండును = మిగుల దయగలవాఁడును, పరమశాంతుండును-పరమ = మిగుల, శాంతుడును = చిత్తశాంతి గలవాఁడును, జ్ఞాన...డును-జ్ఞాన = అపరోక్షజ్ఞానముతోను, విజ్ఞాన = అనుభవజ్ఞానముతోను, సంపన్నుండును = కూడినవాఁడును, అంతస్సుఖుండును = బ్రహ్మానందమే యానందముగాఁ గలవాఁడును, అంతరారాముండును = తనలోనే క్రీడించువాఁడును, అంతఃప్రకాశుండును = ఆత్మప్రకాశమే ప్రకాశముగాఁ గలవాఁడును, ఆత్మరతుఁడును-ఆత్మ = పరబ్రహ్మమునందు (లేక తనయందు), రతుండును = ఆసక్తిగలవాఁడును, ఆత్మతృప్తుండును = తనయందె తృప్తినొందువాఁడును, ఆత్మసంతుష్టుండునై=తనయందే సంతోషించువాఁడునయి, సంచరించునతఁడు=తిరుగుపురుషుండు, బ్రహ్మవిదుండు=బ్రహ్మవిదుం డనఁబడును. మఱియుఁ, సకల...ములఁ-సకల=సమస్తమైన, వైదిక=వేదోక్తమయినట్టియు, లౌకిక=లోకోచితమైనట్టియు, కర్మంబులఁ = కార్యములను, విధిపూర్వ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కంబుగాఁ=శాస్త్రోక్తముగా, సన్యసించి = సన్యాసముచేసి (అనఁగా సన్యాసాశ్రమము నంగీకరించి), పూర్వోక్తలక్షణంబులన్ - పూర్వోక్త = పూర్వము చెప్పఁబడిన, లక్షణం బులన్ = బ్రహ్మవిదునిలక్షణములతో, విలసిల్లి = ప్రకాశించి, సంప్రాప్తదుఃఖంబులన్ = వచ్చుచుండుదుఃఖములను, ద్వేషింపక = వద్దనక, నివృ...లన్-నివృత్త=పోయిన, సుఖం బులన్=సౌఖ్యములను, కోరక, ప్రకా...బులన్-ప్రకాశ=జ్ఞానము (ఇది సత్వగుణమభి వృద్ధియగునప్పుడు కలుగువృత్తి) వృత్తి = కర్మాసక్తిని, (ఇది రజోగుణమభివృద్ధియగు నప్పుడు కలుగునది), మోహంబులన్ = అజ్ఞానమును (ఇది తమోగుణమభివృద్ధియగు నప్పుడు కలుగునది), ఉదాసీనునిచందంబునన్ = మధ్యస్థునివలె, చూచుచున్, సుఖ... యందున్-సుఖ = సుఖము (ఇది సత్వగుణజన్యము), దుఃఖ = దుఃఖము (ఇది రజోగుణ జన్యము),మోహ=భ్రాంతి లేక మైమఱపు,(ఇది తమోహాగుణజన్యము, ఆది=మొదలైన కార్య = విహితకర్మములయొక్కయు, అకార్య=నిషిద్ధకర్మలయొక్కయు, గుణంబుల యందున్ = ఫలములయందు (అనఁగా రాగద్వేషములతోఁగూడి సుఖఫలములయందు రాగంబును దుఃఖములయందు ద్వేషంబుననుండుట), చిత్తేం...బులు-చిత్త = మనస్సు, ఇంద్రియ=ఇంద్రియములు, ఆది = మొదలగువానియొక్క, వికార=వికారంబులు (లేక వృత్తులకు), కారణ=కారణములైన, గుణంబులు = సత్వాదిగుణములు, ప్రవర్తించుచుం డన్, వానిచేతన్=అస్వభావములచేత, చలింపంజేయఁబడక = కదలింపఁబడక (అనఁగా 'సుఖదుఃఖఫలములకై నేను బ్రవర్తించుచున్నాను' అనునభిమానము కలుగునట్లు చేయం బడక), నిశ్చలుండును = చలనములేనివాఁడును, సమదుఃఖసుఖుండును = దుఃఖసుఖముల యందనుభవముగలవాఁడును, స్వస్థుండును = చిత్తశాంతిగలుగుటచే సుఖముగానుండు వాఁడును, సమలో...నుండును-సమ = సమానమయిన, లోష్ట=మట్టిపెళ్ల, అశ్మ=ఱాయి, కాంచనుండును = బంగారముగలవాఁడును, తుల్యప్రియాప్రియుండును=ప్రియమైనవిష యమునందును కానివిషయమునందును సమబుద్ధిగలవాఁడును, తుల్యనిందాస్తోత్రుండును= ఒకఁడు తన్ను నిందించినను భూషించినను సమచిత్తముతోనుండువాఁడును,తుల్యమానావ మానుండును = ఒకఁడు తన్ను గౌరవించినను అవమానించినను ఒకటిగానుండువాఁడును, తుల్యశత్రుమిత్రపక్షుండును=శత్రుమిత్రుల నేకరూపముతోఁ జూచువాఁడును, సంపరి... భుండును-సంపరిత్యక్త = విడువఁబడిన, సర్వ = సమస్తములయిన, ఆరంభుండును, ప్రయ త్నములు (లేక, కార్యములు) గలవాఁడును, అగుగుణాతీతుండు-అగు=అయినట్టి, గుణ = సత్త్వరజస్తమోగుణములను, అతీతుండు = అతిక్రమించినవాఁడు, బ్రహ్మవిద్వరుండనంద గున్ = బ్రహ్మవిద్వరుఁ డని చెప్పఁబడును. మున్ను = పూర్వమున, వివరించినగుణంబు లన్నియున్ = సద్గుణము లన్నియు, ప్రకాశించుచుండన్=ప్రకాశించుచుండఁగా, సం తత...ష్ఠుండై-సంతత=ఎల్లప్పుడును, సహజ=స్వభావసిద్ధమయిన, అమనస్క=అమనస్క

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మనెడు, రాజయోగ=రాజయోగముయొక్క, నిష్ఠా=నిష్ఠచేత, గరిష్ఠుఁడై = ఒప్పుచున్న వాఁడై, ఎడనెడ=నడుమనడుమ, పరులవలనన్=ఇతరులకారణమున, మేలుకొలుపంబడి=సమాధిని విడిచి లేచునట్లు చేయఁబడి, కించిదాహారంబున్-కించిత్ = కొంచెము, ఆహారంబున్, కొనుచున్=అంగీకరించుచు, సుషుప్తుండైనవాని తెఱంగునన్=నిదురించువానివలె, విశ్వంబు=ప్రపంచమును, మఱచియుండునతండు = మఱచియుండువాఁడు, బ్రహ్మవిద్వరీయుండు=బ్రహ్మవిద్వరీయుఁడనఁబడును. తనవలనన్=స్వయముగాఁగాని, ఒరులవలనన్=ఇతరులమూలమునంగాని, పునరుత్థానంబులేక = సమాధినుండి లేచుటయనునదియేలేక, బాహ్యాంతరంబులమఱచి = లోపలవెలుపల నున్నపదార్థములన్నిటిని మఱచి, నిరంతర...ష్ఠుండై-నిరంతర=సర్వకాలము, నిర్వికల్ప = సంకల్పవికల్పములులేని, సమాధి = ఆసనస్క-రాజయోగ సమాధియందు, నిష్ఠుండై = స్థితిగలవాఁడై, పరి...త్రుఁడై-పరిపూర్ణ=సర్వవ్యాపకమైనట్టియు, ప్రత్యగభిన్న=జీవాభిన్నమైనట్టియు (అనఁగా కూటస్థునికంటె వేఱుకానట్టియు, పరమశ్రేష్ఠమైనట్టియు) బ్రహ్మచైతన్య = బ్రహ్మరూపమగుజ్ఞానమనెడు, ప్రకాశమాత్రుఁడై = ప్రకాశమే తానై, వెలుంగునతండు=ప్రకాశించువాఁడు, బ్రహ్మవిద్వరిష్ఠుండనందగున్=బ్రహ్మవిద్వరిష్ఠుఁడనఁబడును. అందున్=ఈనలుగురిలో, మొదలివురకున్=బ్రహ్మవిదునకును, బ్రహ్మవిద్వర్యునకును, ప్రారబ్ధంబు = ప్రారబ్ధకర్మము, తోఁచుచున్=కానవచ్చుచుండియు, మిథ్యాభూతంబై యుండున్=అసత్యమైయుండును. వరీయునందున్=బ్రహ్మవిద్వర్యునియందు, కలిగియుఁ లేకుండున్=ప్రారబ్ధముండియును లేనిదే యగును, వరిష్ఠునకున్ = బ్రహ్మవిద్వరిష్ఠునకు, ఏమాత్రంబు = అల్పముగానైనను లేదు. కావునన్=కాఁబట్టి, ఇమ్మ...బులు-ఇమ్మహానుభావుల = ఈమహాత్ములయొక్క, అనుభవములు, నీవడిగినప్పటినుండి, ఏర్పఱచి = విభాగించి, చెప్పితిగాదే=చెప్పితినిగదా (బాగుగా దెలిసికొంటివా, అని వాక్యశేషము.) అని, వెండియున్ = మఱియును, ఇట్లనియెన్=ఈవిధముగా చెప్ప నారంభించెను.

తా. ఓయాంజనేయా! మఱియొకవిశేషమును నిరూపించెదను వినుము. బ్రహ్మవిదుఁ డనియు బ్రహ్మవిద్వరుఁ డనియు బ్రహ్మవిద్వరీయుం డనియు బ్రహ్మవిద్వరిష్ఠుఁ డనియు బ్రహ్మజ్ఞానులు నాలుగువిధములు గలవారై యున్నారు. అందు బ్రహ్మవిదుఁడు బ్రహ్మవేత్త యయ్యును సర్వప్రపంచంబును పరబ్రహ్మంబుగా భావించుచు దేహేంద్రియాదులకుఁ గలకర్తృత్వమును దనపై నారోపించుకొనక ఫలకాంక్షారాహిత్యముగా నిత్యనైమిత్తిక కర్మముల వేదోక్తప్రకారంబుగా నాచరించును. కామ్యకర్మములను నిషిద్ధకర్మములను బరిత్యజించును. పుత్రమిత్రకళత్రాదులయందు వైరాగ్యము కలవాఁడయ్యును అప్రయత్నముగా దొరకినధనముతో వారలఁ బోషించును. శాస్త్రమునందు దూషింపఁబడని లౌకికకర్మముల ప్రేమ నాచరించును. ఈమొదలగు వికారములు లేక సర్వ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాలములయందును శరీరేంద్రియప్రాణములజయించి సర్వభూతములయందును,దయకలిగి పరమశాంతుఁడై యాత్మాలోకనముచే నానందించుచు నాత్మప్రకాశముచేఁ బ్రకాశించుచు నాత్మయందు తృప్తిఁజెంది యాత్మస్వరూపావలోకనముచే సంతసించుచు నెన్ని కార్యము లాచరించుచున్నను స్వస్వరూపావలోకమునందే యాసక్తుఁడై సంచరించుచుండును. జ్ఞానము, అనుభవము పరిపూర్ణమైయుండ సర్వవ్యవహారముల నహంకారరహితముగా నాచరించుచు సర్వదా యాత్మనిష్ఠతో నొప్పుచుండును. బ్రహ్మవిద్వరుఁడు సకలలౌకికవైదికకర్మంబుల సన్యసించును. తక్కినశాంత్యాదిగుణము లీయిరువురకును సమానములే అయిన నీబ్రహ్మవిద్వరునికి గుణాతీతలక్షణములు ప్రధానములైయుండును. ఇఁక బ్రహ్మవిద్వర్యుఁడు వైలక్షణములతో నొప్పుచుండును. ఇఁక విశేషమేమనిన, నతఁడు సర్వకాలములయందును నిదురించువానివలె నిర్వికల్పసమాధియందే యుండును, అయినను ఉచితసమయములందు పరులచే మేలుకొలుపంబడును. తగినంతవఱకు నాహారవిహారాదుల నంగీకరించును. బ్రహ్మవిద్వరిష్ఠుఁ డిట్లుగాక నెప్పటికిని స్వయముగాఁగాని పరులప్రేరేపణచేఁగాని మేలుకొనఁడు. ఎల్లప్పుడును కూటస్థునకంటె నభిన్నుఁడైనపరబ్రహ్మమే తానై ప్రపంచమునంతయుం మఱచి యుండును. ఈనల్వురిలో మొదటియిరువురకును ప్రారబ్ధము కలదు; కాని, యది శూన్యరూపమై యుండును. మూఁడవవానికిఁ గొంచెముండును; కాని లేనిదే యగును. నాలవవానికి బొత్తిగనే లేదు. ఇట్లు వీరి యనుభవములఁ బ్రత్యేకముగా నెఱుంగుము. ఓపార్వతీ! ఇట్లు చెప్పి యారఘురాముఁడు మరల నిట్లనియె.

## వైరాగ్యబోధోపరతుల తారతమ్యకారణరూప కార్యాచార ప్రకారము.

అవ. ఇట్లు విభాగించి వారలకుఁ గలభేదముల నెఱింగించుచున్నాఁడు:—

తే. అతులవైరాగ్యబోధోపరతులు మూఁడు
గలవు తారతమ్యంబుల నలువురకును
సుఖము లారీతి నించుమించులుగ నలరు
గాని కేవలమోక్షమొక్కటియె వత్స. 119

టీ. వత్స = పుత్రా! నలువురకున్ = బ్రహ్మవిదుఁడు మొదలగునీనలుగురకును, మూఁడు, అతుల...రతులు-అతుల=శ్రేష్ఠమైన, వైరాగ్య=విరక్తి, బోధ=జ్ఞానము, ఉపరతులు-చిత్తశాంతి యనునది, తారతమ్యంబులన్=ఎక్కువతక్కువలుగా, కలవు=ఉన్నవి. సుఖములు=ఆనందములును, ఆరీతిన్=వైరాగ్యాదులవలెనే, ఇంచుమించుగన్=హెచ్చుతక్కువలుగా, అలరుగాని = ఉండునుగాని, కేవలమోక్షము = ప్రధానమగుమోక్షము, ఒక్కటియే=ఏకమే.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఓపుత్రా ! వైరాగ్యము జ్ఞానము ఉపరతి యనుమూఁడును పైనఁ జెప్పఁబడు నలువురకును తారతమ్యములుగానుండును. ఈతారతమ్యమువలన నానందముకూడ తారతమ్యముగల దైయేయుండును. ఇట్లుండుటవలన హానియేమియులేదు. జ్ఞాన మందఱకు నొక్కటియే కావున జ్ఞానసాధ్యమగు మోక్ష మందఱకు నొక్కటియే.

అవ. ఇట్లు చెప్పి ప్రస్తాపవశమున వైరాగ్యబోధోపరతుల వివరించు చున్నాఁడు:—

తే. అతులవైరాగ్యబోధోపరతులు యతుల
మతుల నెడఁబాయ వన్యోన్యగతుల నెనసి
సూఁటి దప్పి యొకానొకచోట నొండు
రెండు ప్రతిబంధవశమున నుండునసఘ. 120

టీ. అనఘ=దోషరహితుఁడ ! అతుల...రతుల-అతుల=శ్రేష్ఠములైన, వైరాగ్య=విరక్తి, బోధ=జ్ఞానము, ఉపరతులు=చిత్తశాంతియనునవి, అన్యోన్యగతులన్=అన్యోన్య సంబంధములతో, ఎనసి=కలసి, యతులమతులన్ - యతుల=బ్రహ్మానుభవమునకై ప్రయత్నించువారియొక్క, మతులన్=మనస్సులను, ఎడఁబాయవు=విడిచియుండవు, ప్రతిబంధ వశమునన్=ఆగామివర్తమానభూతప్రతిబంధమువలన (ఒకవస్తువునందు అత్యధికమగునభిమానము కలిగియుండుట మొదలగు పునర్జన్మకారణము. ఆగామిప్రతిబంధములు; రాగద్వేషాదులు తొలఁగిపోకుండుట,మొదలగునవి వర్తమానప్రతిబంధములు గడచినవిషయము నందలి ప్రేమ మొదలగునవి సంస్కారరూపములై మనసునందుండి సమయమున బాధించు చుండుట, (అనఁగా సమాధియందు మనసు స్థిరముగా నీకుండుట భూతప్రతిబంధము అని తెలిసికొనవలయును.) సూటిదప్పి = సంబంధములువిడిచి, ఒకానొకచోటన్=ఒకానొక స్థలమునందు, ఒండు=ఒకటిమాత్రమే, రెండు=రెండుమాత్రమే, ఉండున్=నిలచియుండును. (అనఁగా వైరాగ్యబోధోపరతులు మూఁడును నేకముఖముగానుండుటకు ప్రతిబంధములు భంగము కలిగించుటయుఁ గూడ కలదు).

తా. ఓదోషరహితుఁడా ! ఆవైరాగ్యబోధోపరతులు పరస్పరము నిత్యసంబంధము కలవై బ్రహ్మానుభవప్రయత్నము గలవారిమనస్సులను విడిచియుండవు. ఒకానొకచోట ప్రతిబంధబాహుళ్యముచే నొకటిమాత్రమే యుండుటయుఁ రెండుమాత్రమే యుండుటయుఁగూడఁ గలదు.

తే. వీనిలో బోధ మెక్కుడజ్ఞానమునకు
గడమ రెండును దగ సహకారు లరయ
వరుస నీమూఁడు గలిగినవారలకును
గరతలామలకంబు మోక్షంబు వత్స. 121

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. వత్స=బిడ్డా! వీనిలోన్=ఈమూఁడింటిలో, బోధము=జ్ఞానము, ఎక్కుడు=ఉత్తమమైనది (లేక, ముఖ్యమైనది), అజ్ఞానమునకున్=అబోధమునకు, కడమరెండును=మిగిలినరెండును, (అనఁగా వైరాగ్యోపరతులురెండును), తగన్=ఒప్పునట్లుగా, అరయన్=విచారింపఁగా, సహాకారులు = సహాయ్యము చేయునవి. (అనఁగా నభివృద్ధిజేయునవి), వరుసన్=క్రమముగా, ఈమూఁడు గలిగినవారలకున్=వైరాగ్యబోధోపరతులు మూఁడునున్నవారలకు, మోక్షంబు, కరతలామలకంబు-కరతల=చేతియందలి, ఆమలకంబు=ఉసిరికకాయవంటిది. (సులభమైనది.)

తా. ఆమూఁడింటిలో జ్ఞాన మధికము (ఇదియే బోధ మనంబడును.) తక్కిన రెండు నాబోధమునకు సహాయకారులు. ఓపుత్రా! యీమూఁడును నీపురుషునికిఁ గలవో అతనికి మోక్షము కరతలామలకము.

క. అక్షరతత్త్వజ్ఞానము,
సాక్షాన్మోక్షప్రదంబు సాంసారికదుః
ఖక్షయకరమగుఁ దక్కిన
లక్షణములు సుఖతరములు లలితాత్ములకున్. 122

టీ. లలితాత్ములకున్=నిర్మలచిత్తులకు, అక్షరతత్త్వజ్ఞానము-అక్షర=జీవునియొక్క, (లేక, కూటస్థునియొక్క,) తత్త్వజ్ఞానము = యథార్థస్వరూపపరిజ్ఞానము (బోధము) సాక్షాన్మోక్షప్రదంబు-సాక్షాత్=ప్రత్యక్షముగా.(అనఁగా ఇతరసాధనముల నపేక్షింపకయే 'జ్ఞానాదేవ తు కైవల్యం'='జ్ఞానమువలననే మోక్షము కలుగును' అనుశ్రుతి ఈవిషయమునఁ బ్రమాణము.) మోక్షప్రదంబు=మోక్షము నిచ్చునది, సాంసారికదుఃఖక్షయకరము-సాంసారిక=సంసారసంబంధమైన, దుఃఖ=దుఃఖమును, క్షయకరము= నశింపఁజేయునది, అగున్=అయియున్నది. తక్కినలక్షణంబులు=తక్కినవి (అనఁగా వైరాగ్యోపరతులు.) సుఖకరములు=చిత్తశాంతిని గలిగించుననియగుటచే సుఖమును గలిగించునవి, అగున్=అగుచున్నవి.

తా. మఱియు నిర్మలచిత్తులకు ప్రత్యక్షముగా అనఁగా మఱియొకదాని సహాయముతోఁబనిలేకయే) మోక్షమునొసంగునది జ్ఞానమే. "జ్ఞానాదేవ తు కైవల్యం" అను శ్రుతి ఈవిషయమునే చెప్పుచున్నది. ఇట్లగుటచే నీజ్ఞానమే (బోధమే), సంసారదుఃఖమును సంపూర్ణముగా నశింపఁజేయును. తక్కినవైరాగ్యోపరతులు రెండును చిత్తశాంతిని గలిగించునవి యగుటచే నానందకరములు.

అవ. ఇట్లు వైరాగ్యబోధోపరతులలోని విశేషముల నెఱిఁగించి వానికారణములను స్వరూపమును కార్యములను క్రమముగా నెఱిఁగించుచున్నాఁడు:—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. కారణము దోషదృష్టియె
వైరాగ్యమునకు జిహాసవరరూపము సాం
సారికసుఖముల మరలం
గోరకయుండుటయె సుమ్ము గురుకార్యమగున్. 123

టీ. వైరాగ్యమునకున్, దోషదృష్టియే='విషయములు దోషయుక్తములు' అని తెలిసికొనుటయే, కారణము, (విషయములయందలి దోషముల నెఱుంగుటవలన వైరాగ్యము జనించును), జిహాస=సర్వప్రపంచమును విడుచుటయే, వరరూపము=దానిశ్రేష్ఠమగుస్వరూపము, సాంసారికసుఖములన్=సంసారసౌఖ్యముల, మరలన్=తిరిగి, కోరక యుండుటయే, గురుకార్యము-ఆవైరాగ్యమునకుపని (అనఁగా వైరాగ్యముగలవారు సంసారసౌఖ్యములను కోరరని భావము), అగుసుమ్ము=అగును సుమా!

తా. అందు "విషయములును వానివలనఁ గలుగుసుఖములును దోషయుక్తములే" అనుజ్ఞానమే వైరాగ్యమున కుత్పత్తికారణము. ఆవిషయాదులయం దిచ్ఛ లేకపోవుటయే దానికి స్వరూపము. మరల నెన్నటికి విషయాదులకై నభిమానము నొందకుండుటయే దానికి పని (అనఁగా నావైరాగ్యమువలన గలుగుఫలము).

మ. శ్రవణాదిత్రితయంబు కారణ మసత్సత్సంవిభాగంబు శు
ద్ధవిబోధంబునకున్ స్వరూపమున నాత్మస్వాత్మతాదాత్మ్యసం
భవరాహిత్యము కార్య మౌ యమముఖాభ్యాసాత్మధీనిగ్రహ
వ్యవహారక్షయము ల్తలంప నుపరత్యాదిస్వరూపార్థముల్. 124

టీ. శుద్ధవిబోధంబునకున్-శుద్ధ = నిర్మలమైన, విబోధంబునకున్=జ్ఞానమునకు, శ్రవ...యంబు-శ్రవణ=శ్రవణము (అనఁగా వేదాంతవాక్యములను వినుట), ఆది= మొదలయిన, త్రితయంబు=మూఁడును, అనఁగా,శ్రవణ మనన నిదిధ్యాసములు మూఁడును (వేదాంతవాక్యములవినుట శ్రవణము. తాను వినినయర్థమును యుక్తులచే స్థిరపఱుచుకొనుట మననము. ఇట్లు స్థిరపడిన బ్రహ్మాత్మైక్యమును ఏకాగ్రచిత్తముతో ధ్యానించుట నిదిధ్యాసము. ఇదియే నిర్వికల్పసామాధి లేక యపరోక్షజ్ఞాననిష్ఠ), కారణము, అసత్సత్సంవిభాగంబు-అసత్='ఇది శూన్యరూపమైనది' యనియు, సత్='ఇది (బ్రహ్మము) సద్రూపమైనది' అనియు, సంవిభాగంబు=విభజించి యెఱుంగుట, స్వరూపమును='జ్ఞానముయొక్క' స్వరూపమును, అనాత్మ...త్యము-అనాత్మ = ఆత్మగానిప్రపంచమునకును, స్వాత్మ=కూటస్థుఁడైనతనకును, తాదాత్మ్య = అభేదభావముయొక్క (లేక, అభేదముయొక్క), సంభవరాహిత్యము=లేకపోవుట అనఁగా తొలఁగిపోవుట, కార్యము=ఈజ్ఞానముచే నాచరింపఁబడుపని, ఔన్=అవుచున్నది. యమ...ములు-యమముఖ=యమము నియమము మొదలయినవానియొక్క, అభ్యాస = వాడుకయును, ఆత్మ = శరీరము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యొక్కయు, ధీ=బుద్ధియొక్కయు, నిగ్రహ=జయించుటయును, వ్యవహారక్షయములు=సర్వవ్యవహారములును క్షయించుటయు ననునది, తలంపఁగ=విచారింపఁగా, ఉపరత్యాదిస్వరూపార్థములు-ఉపరతి=ఉపరతికి, ఆది=కారణము, స్వరూప=స్వరూపము, అర్థములు=కార్యము, క్రాన్=క్రమముగా నగుచున్నవి. (అనఁగా యమనియమాద్యభ్యాసము యుపరతికిఁగారణము. శరీరబుద్ధుల నిగ్రహించుట యుపరతికి స్వరూపము. సర్వవ్యవహారములు నశించుట యుపరతిచేఁ జేయంబడు కార్యము.

తా. ఇట్లే జ్ఞానమునకు శ్రవణమనననిదిధ్యాసములు, అనఁగా వేదాంతవాక్యముల గురుశాస్త్రములమూలమున వినుటయు యుక్తులచే వినిన యర్థమును మనసున స్థిరము జేసికొనుటయు నట్లు స్థిరమైనజీవబ్రహ్మైక్యమును సర్వకాలములందును రెండవసంకల్పము లేకుండ ధ్యానించుటయు ననునవి యుత్పత్తికారణములు. "ఇది సత్పదార్థము. అనఁగా నిత్యము. ఇది యసత్పదార్థము. అనఁగా నెప్పటికిని లేనిది" అని తెలిసికొనుటయే లేక విభాగించుటయే దానిస్వరూపము. భ్రాంతిని విడిచి ఇదివఱకు నున్న దేహాత్మాభిమానమునుఁ బరిపూర్ణముగా వదలుటయే యాబోధమువలనఁ గలుగుఫలము. మఱియు యమనియమాదుల నభ్యసించుట యుపరతికి నుత్పత్తికారణము. మనోబుద్ధుల నిగ్రహించుటయే దానిస్వరూపము. వ్యవహారము నశించుటయే దానిఫలము.

అవ. ఇట్లు సర్వము నెఱింగించి ఈవైరాగ్యాదుల సంపాదించుటవలనఁ గలుగు ఫలమును జెప్పుచున్నాఁడు:—

శా. వైరాగ్యంబు దృఢంబుఁ జేసి పరతత్త్వజ్ఞాన మార్జించి స
ర్వారంభోపరమంబుఁ గైకొని తురీయం బంది యీరీతి యో
గారూఢుం డగువానికిం గలుగునే యాగామియు న్సంచిత
ప్రారబ్ధంబులు సంతతంబును బరబ్రహ్మాత్ముఁడై యుండఁగన్. 125

టీ. వైరాగ్యంబున్ = వైరాగ్యమును, దృఢంబుజేసి = స్థిరముఁజేసి, పరతత్త్వజ్ఞానము-పర=క్షరాక్షరవిలక్షణమైన పరబ్రహ్మముయొక్క, తత్త్వ=యథార్థస్వరూపముయొక్క, జ్ఞానము=జ్ఞానమును (అనఁగా బోధము), ఆర్జించి=సంపాదించి, సర్వారంభోపరమంబున్-సర్వ=సమస్తమైన, ఆరంభ=ప్రయత్నములయొక్క, ఉపరమంబున్=శాంతిని (అనఁగా నుపరతిని); కైకొని=ఆశ్రయించి, తురీయంబంది = తుర్యసమాధిని జెంది, ఈరీతిన్ = ఈవిధముగా, యోగారూఢుండగువానికిన్ - యోగ = రాజయోగమును, ఆరూఢుండగువానికిన్=అధిష్ఠించినవానికి (అనఁగా యోగసిద్ధిని జెందిన),ఆగామియున్=రాఁబోవునట్టిదియు, సంచి...బులు -. సంచిత = సంపాదింపఁబడినట్టియు, ప్రారబ్ధంబులు=ప్రస్తుతమున్న ... ఫలము నీయనారంభించినట్టియు, కలుగునే=అగునకర్మముం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డునా? సతతంబు = ఎల్లప్పుడు, పరబ్రహ్మాత్ముం డైయుండఁగాన్ = పరబ్రహ్మరూపుండై యుండఁగా.

తా. పైన వివరింపఁబడినవైరాగ్యమును దృఢముఁ జేసి దానిప్రభావమువలన చక్కనియథార్థ జ్ఞానమును సంపాదించి చిత్తేంద్రియశాంతినొంది నిర్వికల్పసమాధినను ష్ఠించుచు యోగారూఢుం డై యున్నమహాత్మునకు ద్వివిధకర్మములు నుండవు. ఆగామి కర్మ వానికి జన్మపరంపరను గలిగింపనేరదు. సంచితము వాసనారూపముగా పరిపాక కాలము వచ్చునంతవఱకు నిలువనేరదు. ప్రారబ్ధకర్మము శరీరము నారంభించినను ఫలమును బలాత్కారముగా ననుభవింపఁజేయనేరదు. పరులకు నన్నియుం నున్నట్లు తోఁచినను వానికేవియును లేదు. సర్వము నజ్ఞానకృత మగుటచే జ్ఞానము కలుగఁగానే నశించు ననుటలో నాక్షేపమేమియుఁ లేదు కదా.

శ్లో. "యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున!
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా".

"ప్రజ్వలించుచున్నయగ్ని ఇంధనముల నెన్నిఁటినైన క్షణములో భస్మము కావించునట్లు జ్ఞానాగ్ని యుత్పత్తియైనక్షణముననే సర్వకర్మముల భస్మము గావించును" అనుగీతావాక్య మీవిషయమునఁ బ్రమాణము.

## వైరాగ్యశబ్దార్థవిమర్శనము

అవ. ఇట్లు సామాన్యముగా సర్వము నుపదేశించి విశేషమును జెలుపుచున్నాఁడు:—

క. వైరాగ్యం బింతటికిని, గారణ మానందకరము గావున నది చే
కూరిన సమస్తమునుసమ, కూఱుం దను దానపరమగుహ్యమిదిసుతా.

టీ. సుతా=పుత్రా! ఇంతటికిన్ = ఈవైరాగ్యబోధోపరతులకన్నింటికిని, వైరాగ్యంబు=వైరాగ్యమే, కారణము, ఆనందకరము=ఆనందమును కలిగించునది, కావునన్ = కాఁబట్టి, అది చేకూఱినన్=ఆవైరాగ్యము కలిగినచో, తనుదాన=స్వయముగానే, సమస్తమును = బోధోపరతులుఁకూడ, సమకూఱున్ = సంభవించును, ఇది=ఈవిషయమును, పరమగుహ్యము = మిగుల రహస్యమయినది.

తా. ఓపుత్రా! పైఁజెప్పినజీవన్ముక్తస్థితిని సంపాదించుటకు వైరాగ్యమే ప్రధాన కారణము. బ్రహ్మానందమునకు నిదియే ముఖ్యకారణము. కావున నది దృఢ మైనచో నప్రయత్నముగనే బోధోపరతులు స్వయముగా వచ్చిచేరును. కావున వైరాగ్య మొక్కటియే ప్రయత్నపూర్వకముగ సంపాదింపఁబడవలసినది. ఈవిషయము పరమరహస్యము.

అవ. ఇట్లు సంక్షేపముగాఁ జెప్పినవిషయమునే వివరించుచున్నాఁడు:—

వ. అది యెట్లనిన వినుము. మూలప్రకృతి యాలవాలంబు, సుఖదుఃఖంబులు ఫలంబులు, త్రిగుణంబులు మూలంబులు, ధర్మార్థకామమోక్షం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బులు రసంబులు, పంచేంద్రియంబు లూడలు, షడూర్ములు స్వభావంబులు, సప్తధాతువులు పొర,లష్టప్రకృతులు విటపంబులు,నవరంధ్రంబులు కోటరంబులు, దశవిధప్రాణంబులు పత్రంబులు, శబ్దాదివిషయంబులు పల్లవంబులు, రాగద్వేషాదు లుపశాఖలు,నానావిధకర్మంబులు పుష్పంబులు, జీవేశ్వరులు పక్షులుగాఁ గలిగి, మందిరారామక్షేత్రపుత్రమిత్రకళత్రబంధుమధ్యస్థద్వేష్యజనతీక్ష్ణ దుష్కంటక త..గుల్మలతాసంకీర్ణంబుఁ గామాదిచోరదుస్సంచారంబురోగవ్యాఘ్రభయంకరంబు దుఃఖదావానలసమావృతంబు మృత్యుసింహభయగ్రస్తంబు జరాపిశాచసమన్వితంబు దైన్యపర్వతసంకటంబుదురితరాక్షసఘోరంబుఁదృష్ణాభీకరకాకోదరసమాకులంబు హర్షామర్షజంఝానిలదూషితంబు స్వర్గనరకదుర్మార్గతిరోహితాపవర్గసన్మార్గంబు నైనమహాదుఃఖారణ్యంబునం గాఁడుపడి పుణ్యపాపవిధేయుండై జీవుండంతటందిరిగి తిరిగి చీకాకుపడి యెచ్చోట విశ్రాంతింగానక విసివి ముందరం గాంచి యనంతం బని వెనుకం జూచి యనాది యని కలయంగనుంగొని యసాధ్యం బని తెలిసి మహాగాధదుఃఖ భయశోకవ్యాకులితచిత్తుండుఁదాపత్రయాదిత్యప్రదీప్తాతపసంతప్తుండునై యంతట నిరంతరనిత్యాంతాగమచ్ఛాయల నాశ్రయించి స్రక్చందనవనితాధనధాన్యపశుసంతానశయ్యానికేతనోద్యాన ప్రముఖవిషయ సంపాదనసాధనంబు లైనకృషివాణిజ్యసేవాయాచ్ఞాదిలౌకికకర్మంబులఁ బరిహరించి స్వర్గాదిసత్యాంతపరలోకవిషయసుఖసాధనంబు లైననిత్యనైమిత్తికాదికర్మంబులు ఫలకాంక్ష చేతఁ జేయక పరమేశ్వరార్పణంబుగా నాచరించి యప్పరమేశ్వరానుగ్రహంబువలనఁ బరిశుద్ధహృదయుండై యమానిత్వమదంభిత్వ మహింస యార్జవంబు క్షాంతి యాచార్యోపాసనంబు శౌచంబు స్థైర్యం బాత్మవినిగ్రహం బింద్రియార్థంబుల వైరాగ్యంబనహంకారంబు జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషానుదర్శనంబుఁ బుత్రదారగృహాద్యనాసక్తియనభిష్వంగంబు నిత్యేష్టానిష్టోపపత్తిసమచిత్తత్వంబు మదనన్యయోగనిశ్చలభక్తి వివిక్తదేశసేవిత్వంబు జనసంగాసక్తివిసర్జనం బధ్యాత్మజ్ఞాననిత్యత్వంబుఁ దత్త్వజ్ఞానార్థదర్శనం బనువింశతిగుణంబు లెప్పుడు సంగ్రహించు...వాత్మ...స్వాత్మ...రవిచారాధికారి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మునా? సతతంబు = ఎల్లప్పుడు, పరబ్రహ్మాత్ముఁ డైయుండఁగాన్ = పరబ్రహ్మరూపుండై యుండఁగా.

తా. పైన వివరింపఁబడినవైరాగ్యమును దృఢముఁ జేసి దానిప్రభావమువలన చక్కనియథార్థ జ్ఞానమును సంపాదించి చిత్తేంద్రియశాంతినొంది నిర్వికల్పసమాధినను ష్ఠించుచు యోగారూఢుం డై యున్నమహాత్మునకు ద్వివిధకర్మములు నుండవు. ఆగామి కర్మ వానికి జన్మపరంపరను గలిగింపనేరదు. సంచితము వాసనారూపముగా పరిపాక కాలము వచ్చునంతవఱకు నిలువనేరదు. ప్రారబ్ధకర్మము శరీరము నారంభించినను ఫలమును బలాత్కారముగా ననుభవింపఁజేయనేరదు. పరులకు నన్నియుం నున్నట్లు తోఁచినను వానికేవియును లేదు. సర్వము నజ్ఞానకృత మగుటచే జ్ఞానము కలుగఁగానే నశించు ననుటలో నాక్షేపమేమియు లేదు కదా.

శ్లో. "యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున!
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా".

"ప్రజ్వలించుచున్నయగ్ని ఇంధనముల నెన్నిఁటినైన క్షణములో భస్మము గావించునట్లు జ్ఞానాగ్ని యుత్పత్తియైనక్షణముననే సర్వకర్మముల భస్మము గావించును" అనుగీతావాక్య మీవిషయమునఁ బ్రమాణము.

## వైరాగ్యశబ్దార్థవిమర్శనము

అవ. ఇట్లు సామాన్యముగా సర్వము నుపదేశించి విశేషమును దెలుపుచున్నాఁడు:—

క. వైరాగ్యం బింతటికిని, గారణ మానందకరము గావున నది చే
కూరిన సమస్తమునుసను, కూఱుం దను దానపరమగుహ్యమిదిసుతా.

టీ. సుతా=పుత్రా! ఇంతటికిన్ = ఈవైరాగ్యబోధోపరతులకన్నింటికిని, వైరాగ్యంబు=వైరాగ్యమే, కారణము, ఆనందకరము=ఆనందమును కలిగించునది, కావునన్ = కాఁబట్టి, అది చేకూఱినన్=ఆవైరాగ్యము కలిగినచో, తనుదాన=స్వయముగానే, సమస్తమును = బోధోపరతులఁకూడ, సమకూఱున్ = సంభవించును, ఇది=ఈవిషయమును, పరమగుహ్యము = మిగుల రహస్యమయినది.

తా. ఓపుత్రా! పైఁజెప్పినజీవన్ముక్తస్థితిని సంపాదించుటకు వైరాగ్యమే ప్రధాన కారణము. బ్రహ్మానందమునకు నిదియే ముఖ్యకారణము. కావున నది దృఢమైనచో నప్రయత్నముగనే బోధోపరతులు స్వయముగా వచ్చిచేరును. కావున వైరాగ్యమొక్కటియే ప్రయత్నపూర్వకముగ సంపాదింపఁబడవలసినది. ఈవిషయము పరమరహస్యము.

అవ. ఇట్లు సంక్షేపముగాఁ జెప్పినవిషయమునే వివరించుచున్నాఁడు:—

వ. అది యెట్లనిన వినుము. మూలప్రకృతి యాలవాలంబు,సుఖదుఃఖం బులు ఫలంబులు, త్రిగుణంబులు మూలంబులు, ధర్మార్థకామమోక్షం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బులు రసంబులు, పంచేంద్రియంబు లూడలు, షడూర్మిలు స్వభావం
బులు, సప్తధాతువులు బొర, లష్టప్రకృతులు విటపంబులు, నవరంధ్రం
బులు కోటరంబులు, దశవిధప్రాణంబులు పత్రంబులు, శబ్దాదివిషయం
బులు పల్లవంబులు, రాగద్వేషాదు లుపశాఖలు, నానావిధకర్మంబులు
పుష్పంబులు, జీవేశ్వరులు పక్షులుగాఁ గలిగి, మందిరారామక్షేత్ర
పుత్రమిత్రకళత్రబంధుమధ్యస్థద్వేష్యజనతీక్ష్ణ దుష్కంటక తరుగుల్మ
లతాసంకీర్ణంబుఁ గామాదిచోరదుస్సంచారంబు రోగవ్యాఘ్రభయం
కరంబు దుఃఖదావానలసమావృతంబు మృత్యుసింహభయగ్రస్తంబు
జరాపిశాచసమన్వితంబు దైన్యపర్వతసంకటంబు దురితరాక్షసఘోరం
బుఁ దృష్ణాభీకరకాకోదరసమాకులంబు హర్షామర్షజంఝానిలదూషి
తంబు స్వర్గనరకదుర్మార్గతిరోహితాపవర్గసన్మార్గంబు నైనమహాదుఃఖా
రణ్యంబునం గాడుపడి పుణ్యపాపవిధేయుండై జీవుండంతటం దిరిగి
తిరిగి చీకాకుపడి యెచ్చోట విశ్రాంతింగానక విసివి ముందరం గాంచి
యనంతం బని వెనుకం జూచి యనాది యని కలయంగనుంగొని య
సాధ్యం బని తెలిసి మహాగాధదుఃఖ భయశోకవ్యాకులితచిత్తుండుఁ
దాపత్రయాదిత్యప్రదీప్తాతపసంతప్తుండునై యంతట నిరంతరనిగాం
తాగమచ్ఛాయల నాశ్రయించి స్రక్చందనవనితాధనధాన్యపశు
సంతానశయ్యానికేతనోద్యాన ప్రముఖవిషయ సంపాదనసాధ
నంబు లైనకృషివాణిజ్యసేవాయాచ్ఞాదిలౌకికకర్మంబులఁ బరిహ
రించి స్వర్గాదిసత్యాంతపరలోకవిషయసుఖసాధనంబు లైననిత్య
నైమిత్తికాదికర్మంబులు ఫలకాంక్షచేతఁ జేయక పరమేశ్వరార్పణం
బుగా నాచరించి యప్పరమేశ్వరానుగ్రహంబువలనఁ బరిశుద్ధహృద
యుండై యమానిత్వమదంభిత్వ మహింస యార్జవంబు క్షాంతి
యాచార్యోపాసనంబు శౌచంబు స్థైర్యం బాత్మవినిగ్రహం బింద్రి
యార్థంబుల వైరాగ్యంబనహంకారంబు జన్మమృత్యుజరావ్యాధి
దుఃఖదోషానుదర్శనంబుఁ బుత్రదారగృహాద్యనాసక్తియనభిష్వం
గంబు నిత్యేష్టానిష్టోపపత్తిసమచిత్తత్వంబు మదనన్యయోగనిశ్చల
భక్తి వివిక్తదేశసేవిత్వంబు జనసంగాసక్తివిసర్జనం బధ్యాత్మజ్ఞాన
నిత్యత్వంబుఁ దత్త్వజ్ఞానార్థదర్శనం బనువింశతిగుణంబు లెప్పుడు
సంగ్రహించుచున్నప్పు డాత్మబ్రహ్మైక్యసాక్షాత్కారవిచారాధికారి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యగు నింతవట్టుంగూడి వైరాగ్యశబ్దంబునకుఁ దాత్పర్యార్థం బింక
బోధ్యస్వరూపం బెఱేఁగించెద నాకర్ణింపుమని యిట్లనియె. 127

టీ. అదియెట్లనినన్=వైరాగ్యమువలన సర్వమునుగలుగుటయెట్లనఁగా, వినుము. మూలప్రకృతి = సృష్టిస్థితిసంహారకారణభూతమగునాశక్తి, ఆలవాలంబు=పాదు, సుఖదుఃఖంబులు, ఫలంబులు=పండ్లు, త్రిగుణంబులు = సత్వరజస్తమోగుణంబులు, మూలంబులు=వేరులు, ధర్మా...బులు-ధర్మ = ధర్మము, అర్థ=ధనము (ఇది రెండవపురుషార్థము,) కామ=కామసుఖము (లేక, భోగములు), మోక్షంబులు = ముక్తి యనునాలుగుపురుషార్థములును, రసంబులు = రుచులు (లేక పాలు, సంసారవృక్షమునకుపాలు), పంచేంద్రియంబులు=జ్ఞానేంద్రియములును, ఊడలు, షడూర్ములు=ఆఁకలి దప్పి దుఃఖము భ్రాంతి ముసలితనము మరణము అనునాఱును, స్వభావంబులు, సప్తధాతువులు = రసము రక్తము మాంసము మేదస్సు ఎముఁకలు మజ్జ శుక్లము అనునేడును, పొరలు, అష్టప్రకృతులు = పంచభూతములు మనోబుధ్యహంకారములు అనునెనిమిదిప్రకృతులును, విటపంబులు = కొమ్మలు, నవరంధ్రంబులు=నేత్రశ్రోత్రనాసికావక్త్ర పాయూపస్థరంధ్రములు తొమ్మిదియు, కోటరంబులు=తొఱ్ఱలు, దశవిధప్రాణంబులు = పంచప్రాణంబులును పంచోపప్రాణంబులును గలసి పదివాయువులును, పత్రంబులు = ఆకులు, శబ్దాదివిషయంబులు = శబ్దము మొదలగునైదువిషయంబులును, పల్లవంబులు=చిగుళ్లు, రాగద్వేషాదులు-రాగ = రాగము, (తన కున్నవాని ననుభవింపవలయు నను నభిలాష), ద్వేష=విరోధము, ఆదులు =మొదలగునవి, ఉపశాఖలు = చిఱుగొమ్మలు, నానావిధకర్మంబులు = అనేకవిధములగుపనులు, పుష్పంబులు = పూలు, జీవేశ్వరులు = అవిద్యాప్రతిబింబమైనజీవుఁడును మాయాప్రతిబింబమైనఈశ్వరుండును, పక్షులుగాఁగలిగి=పక్షులుగాఁగలవై, మంది... బులు-మందిర = ఇల్లు, ఆరామ=తోఁటలు, క్షేత్ర=భూములు, పుత్ర=పుత్రులు, హిత=హితులు, కళత్ర = భార్య, బంధు=బంధువులు, మధ్యస్థ=(శత్రులై కీడుచేయక మిత్రులై హితముసేయక యూరకుండువాఁడు మధ్యస్థుఁడు) ఇట్టిమధ్యస్థుఁడును, ద్వేష్యజన = వైరులును, తీక్ష్ణ = వాడియైన, దుష్కంటక = చెడ్డముండ్లతోను, తరు=చిన్న చిన్నచెట్లతోను (లేక, ముండ్లచెట్లతోను), గుల్మ=పొదలతోను (మొదలు బోదెలేనిచెట్లు గుల్మములనఁబడును—"అప్రకాండా స్తంబగుల్మా" అని యమరము) లతా = తీఁగలతోను, సంకీర్ణంబును = కూడియున్నదియును (లేక వ్యాపింపఁబడియున్నదియును), కామా...రంబును-కామ = కామము (తనకు లేని పదార్థము కావలయు నని కోరుట), అవి=మొదలైనవనెడు, చోర = దొంగలచేత (అనఁగా దొంగలించుటచేత), దుస్సంచారంబు = సంచరించుట కశక్యమైనదియు, రోగ...రంబు-రోగ = రోగములనెడు, వ్యాఘ్ర = పులులచేత, భయంకరంబు = భయమును కలిగించునదియు, దుఃఖ...తంబు-దుఃఖ=దుఃఖ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మనెడు, దావానల = కార్చిచ్చునే, సమావృతంబు = ఆవరింపఁబడినదియుఁ, మృత్యు... స్తంబు-మృత్యు = మరణ మనెడు, సింహ = సింహముయొక్క (లేక సింహమువలనఁ గలుగు), భయ = భయముచే, గ్రస్తంబు = ఆవరింపఁబడినదియుఁ, జరా...తంబు-జరా = ముసలితనమనెడ, పిశాచ = పిశాచముతో, సమన్వితంబు = కూడినదియుఁ, దైన్య...టంబు-దైన్య = దీనత్వమనెడు, పర్వత=కొండలచేత, సంకటంబు = ఇఱుకైనదియుఁ, దురి...రంబు-దురిత = పాపమనెడు, రాక్షస = రాక్షసులచేత, ఘోరంబు = భయంకరమైనదియుఁ, తృష్ణా = ఆశయనెడు, భీకర = భయంకరములైన, కాకోదర = సర్పములచేత, సమాకులంబు = వ్యాపింపఁబడినదియు, హర్ష...అంబు-హర్ష = సంతోషమనునట్టియుఁ, అమర్ష =రోషమనునట్టియుఁ, ఝంఝానిల=ఝంఝావాతముచే, దూషితంబు= దూషింపఁ బడినదియుఁ, స్వర్గ...నైన-స్వర్గ=స్వర్గ మనునట్టియుఁ,నరక=నరకమనునట్టియుఁ, దుర్మార్గ=తప్పుత్రోవలచేత, తిరోహిత = కప్పఁబడిన, అపవర్గ=మోక్షమనెడు, సన్మార్గంబునునైన=చక్కనిత్రోవ గలది (లేక స్వర్గనరకములఁ బొందించుకర్మలనెడు తప్పుత్రోవలచే మరుగుపఱుపఁబడిన మోక్షమార్గము అనఁగా మోక్షమును బొందించుమార్గము కలదియైన) మహాదుఃఖారణ్యంబునన్=సంసారదుఃఖ మనెడునరణ్యంబున, గాడుపడి = దిక్కు తెలియక, పుణ్యాపాపవిధేయుండు-పుణ్యా = పుణ్యమునకు, పాప = పాపమునకు, విధేయుండై = స్వాధీనుండై, జీవుండు = జీవుఁడు, అంతటన్, తిరిగితిరిగి, చీకాకుపడి= వ్యాకులతం జెంది, ఎచ్చోటన్ = ఎచ్చటను, విశ్రాంతిగానక = విశ్రమించుటకు స్థలమును జూడలేక, విసివి, ముందరగాంచి = తనయెదుటఁ జూచి, అనంతంబని = "ఈసంసారారణ్యమునకుఁ గొనలేదు" అనియుఁ, వెనుకఁజూచి = తనకు వెనుక భాగమునందు తిరిగిచూచి, అనాదియని = "ఈసంసారారణ్యమునకు మొదలు లేదు" అనియుఁ, కలయంగనుంగొని=అంతటంజూచి, అసాధ్యంబని=దీనిని సాధించుట (అనఁగా దీనిని దాఁటుట యశక్యము అని,) తెలిసి = తెలిసికొని, మహా...దును-మహాగాధ = మిగుల భారమైన, దుఃఖ=దుఃఖముతోను, భయ=భయముతోను, శోక = దిగులుతోను, వ్యాకులిత = కలతఁ జెందిన, చిత్తుండును=మనస్సు కలవాఁడును, తాప...దునునై-తాపత్రయ=ఆధ్యాత్మికాదితాపములనెడు, ఆదిత్య = సూర్యులయొక్క ప్రదీప్త=తీక్ష్ణమైన, ఆతప = ఎండచేత, సంతప్తుండును నై = తాపము చెందినవాఁడై, అంతటన్ = పిదప, నిరం...యలన్ = నిరంతర = దట్టము నైనట్టియుఁ, నితాంత = అధికము లైనట్టియుఁ, ఆగమ = వేదశాస్త్రములనెడు వృక్షములయొక్క, ఛాయలన్ =నీడలను, ఆశ్రయించి= పొంది (అనఁగా వేదశాస్త్రార్థములనెఱింగి), స్రక్చం...రించి-స్రక్ = పుష్పమాలికలు, చందన=శ్రీగంధము, వనితా=స్త్రీలు, ధన=ధనము, ధాన్య=ధాన్యము, పశు = పశువులు, సంతాన = సంతానము, శయ్యా=పడక, నికేతన=గృహము, ఉద్యాన = ఉద్యానవనము,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రముఖ=మొదలయిన, విషయ=విషయములను, సంపాదన = సంపాదించుటకు, సాధనంబులైన = కారణములైన, కృషి = వ్యవసాయము, వాణిజ్య=వర్తకము, సేవా = సేవ, యాచ్ఞా=యాచించుట, ఆది = మొదలైన, లౌకికకర్మంబులు=లౌకవ్యవహారములను, పరిహరించి = విడిచిపెట్టి, స్వర్గా...లైన-స్వర్గాది = స్వర్గము మొదలు, సత్యాంత=సత్యలోకమువఱకుఁగల, పరలోక=పరలోకములయందలి, విషయసుఖ = విషయసుఖములను, సాధనంబులైన = సాధించునట్టి, నిత్యనైమిత్తికాదికర్మంబులు = నిత్యకర్మములైన సంధ్యావందనాదులును నైమిత్తికకర్మములైన శ్రాద్ధాదులును కామ్యకర్మములైన యజ్ఞాదులు మొదలగు నన్నిటిని (కామ్యకకర్మలనఁగా ప్రత్యేకఫలముల సంపాదించుటకై చేయఁబడు యజ్ఞాదికర్మలు.) ఫలకాంక్షచేతఁజేయక = ఫలమునుగోరి చేయక (అనఁగా అనిత్యఫలములను కలిగించునవి యగుటచేత లౌకికవైదిక కర్మలనన్నింటిని విడిచియుఁ నావశ్యకములగుటచే నిత్యనైమిత్తికములమాత్ర మాచరించుచు), పరమేశ్వరార్పణంబుగాఁ = పరమేశ్వరప్రీతిగా, ఆచరించి = చేసి, అప్పరమేశ్వరానుగ్రహంబువలనఁ=ఆపరమేశ్వరుని యనుగ్రహమువలన (అనఁగా చిత్తశుద్ధివలన; చిత్తశుద్ధియే పరమేశ్వరానుగ్రహమని ఇదివఱకే చెప్పియున్నాము,) పరిశుద్ధహృదయుండై = నిర్మలచిత్తుఁడై, అమానిత్వంబు = అభిమానము లేకపోవుట, అదంభిత్వంబు = డంబము లేకపోవుట, అహింస = మనోవాక్కాయములచేఁ బరులహింసింపకుండుట, ఆర్జవంబు = చక్కఁగ (అనఁగా వికారము లేవియుఁ లేకుండ నిష్కపటమైన చిత్తముతో నుండుట), క్షాంతి = ఓర్పు, ఆచార్యోపాసనంబు = గురుసేవ, శౌచంబు = బాహ్యాంతరశుద్ధి, స్థైర్యంబు = స్థిరచిత్తము, ఆత్మవినిగ్రహంబు = ఇంద్రియజయము, ఇంద్రియార్థంబుల వైరాగ్యము = ఇంద్రియవిషయములం దాశలేకపోవుట, అనహంకారంబు=అహంకారములేకుండుట, జన్మంబును, జన్మ = పుట్టుకయందును, మృత్యు= మరణమునందును, జరా=ముసలితనమునందును, వ్యాధి=రోగమునందును, దుఃఖ=దుఃఖమునందును (లేక జన్మాదులయందలి దుఃఖమునందు), దోషం = దోషమును, అనుదర్శనంబు = పలుమాఱుచింతించుటయును, పుత్ర...సక్తి-పుత్ర = పుత్రులు, దార=భార్య, గృహ = ఇల్లు, ఆది = మొదలగువానియందు, అనాసక్తి = ప్రేమ లేకపోవుటయు, (అనఁగా 'ఇవి నాకుఁగావలయును' అనుతలంపు లేకపోవుటయుఁ) అనభిష్వంగంబు='ఇవి నావి' అనునభిమానము లేకుండుటయు, నిత్య...త్వంబు-నిత్య=ఎల్లప్పుడును, ఇష్టానిష్ట= ప్రియాప్రియములయొక్క, ఉపపత్తి = సంప్రాప్తులయందు (అనఁగా ఇష్టానిష్టములు వచ్చినప్పుడు), సమచిత్తత్వంబు = రాగద్వేషములు లేక సమానమైన మనస్సు కలిగియుండుట, మదనన్యయోగనిశ్చలభక్తియును-మత్ =నాయందు, (పరమేశ్వరునియందు) అనన్యయోగ = రెండవతలంపులేని (లేక, ఇతరదేవవిషయముకాని), నిశ్చలభక్తి = స్థిర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భక్తియును, వివిక్తదేశసేవిత్త్వంబు = ఏకాంతదేశనివాసంబును, జన...నంబు-జన = మనుష్యులతోఁ, సంగ=కలసియుండుటయందలి, ఆసక్తి=ఆశను, విసర్జనంబు = విడుచుట యును, అధ్యా...త్వంబు-ఆధ్యాత్మజ్ఞాన = స్వస్వరూపవిజ్ఞానమునందు, నిత్యత్వంబు = స్థిరచిత్తము కలిగియుండుటయు, తత్త్వ...నంబు-తత్త్వజ్ఞాన=యథార్థస్వరూపజ్ఞానము యొక్క, అర్థదర్శనంబు = ప్రయోజనమును [అనఁగా మోక్షమును చూచుచుండు టయు, (అనఁగా మోక్షేచ్ఛయు),] అనువింశతిగుణంబు=అనునట్టియిరువదిగుణములను, ఎప్పుడు సంగ్రహించుఁ = ఎప్పుడు సంపాదించునో, అప్పుడు, ఆత్మ...కారి-ఆత్మ= తనకును, బ్రహ్మ = పరబ్రహ్మమునకుఁ గల, ఐక్య=సహజాభేదమును, సాక్షాత్ = ప్రత్య క్షముగా, కార = చేయుటయందును (లేక చేసికొనుటయందును, విచార=దానినిగూర్చి విచారించుటయందును, అధికారి = అర్హుఁడు, అగుఁ, ఇంతవట్టుంగూడి = అంతయుఁ గలసి, వైరాగ్యశబ్దంబునకు = వైరాగ్యమనుశబ్దమునకు, తాత్పర్యంబు, ఇంకఁ = ఇఁక, బోధస్వరూపంబుఁ=జ్ఞానస్వరూపమును, ఎఱింగించెదఁ = చెప్పెదను, ఆకర్ణింపుము = వినుము, అని, ఇట్లనియెఁ.

తా. "వైరాగ్యమే సర్వమునకు మూలము" అనువిషయమును బాగుగా వివరించె దను వినుము. ఈసంసారారణ్యమునకు మూలప్రకృతి కుదురు. సత్వరజస్తమోగుణ ములు మూలములు. సప్తధాతువులు పొరలు. పంచేంద్రియములూడలు. అష్టప్రకృతులు కొమ్మలు. షడూర్ములు (ఇవియే షడ్వికారములు) స్వభావములు. ధర్మార్థకామమోక్ష ములు రసములు. రాగద్వేషాదు లుపశాఖలు. శబ్దాదులు చిగుళ్లు. సకలకర్మలును పుష్ప ములు. సుఖదుఃఖములు ఫలములు. జీవేశ్వరులే వానిఁదినుపక్షులు. నవరంధ్రములు తొఱ్ఱలు. ఇండ్లు తోటలు భూమి ధనము మిత్రులు శత్రులు బంధువులు మధ్య స్థులు అను మొదలగువారే ముండ్లు పొదలు వృక్షములు మొదలగునవి. ఆయరణ్యమున కామాదిచోరులు సంచరించుచుందురు. రోగములను పులులు భయంకరములై యుండును. దుఃఖ మనుదావాగ్ని యేవైపున నైనను ప్రజ్వలించుచునే యుండును. మృత్యు వను సింహ మెప్పుడు నందు సంచరించుచు వారికి భీతినిగలిగించుచుండును. ముసలితన మను పిశాచి యం దెప్పుడును నివసించుచుండును. దీనత్వమనుపర్వతములచే నందలిమార్గము లన్నియును సంచారమున కశక్యములై యుండును. పాపములనురాక్షసు లతిభీకరులై యందు నిలిచియుందురు. ఆశయనుమహాసర్పము లెందుఁజూచినను సరించుచుండును. ఎప్పుడు చూచినను హర్షశోకము లనెడు ఝంఝామారుతములు వీచుచుండును. అందు మోక్షమునకుఁ బోవు చక్కనిమార్గము కలదు. గాని దానిని స్వర్గనరకమార్గములు కప్పి యున్నవి. ఆయరణ్యమున సంచరించువారు స్వర్గనరకమార్గములలోఁ బడి మోసపోవు దురు కాని మోక్షమార్గము [illegible] జీవుఁడు ఈమహారణ్యమున నీవల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కావలకుఁ దిరిగితిరిగి పుణ్యపాపవశగతుఁడై యెటుఁబోయినను విశ్రాంతిఁ గానక చిక్కుపడి కొంతకాలమునకును విసుకుఁజెందును. (అనఁగా "ఈసంసారము దుఃఖరూపము. దీనిని అనుభవించుటవలన నెన్నటికిని శాంతిలేదు. కావున దీనిని విడువవలయును" అని తలంచును). ఇట్లు తలఁచి ముందుచూచినను వెనుకచూచినను యేవైపు పరికించినను వానికి త్రోవ దొరకదు. దానివలన "ఈయరణ్యము నెట్లు దాటుటకును వీలులేకున్నది. ముందుచూచిన దీనియంతము కానరాలేదు. వెనుకఁజూచిన నేదియుఁ దెలియలేదు. ప్రక్కఁజూచిన దరి కానరాలేదు. దీనిని దాఁటుట యసాధ్యమై యున్నది. ఎట్లుదాటుదునో కదా!" అని మిగుల దిగులునొంది భయముఁజెంది మిగుల కలతఁజెందినమనస్సుతో తాపత్రయమనుసూర్యసంతాపముచేఁ గలుగుబాధతో శ్రమనొందుచు వేదము లను మహావృక్షములనీడ నాశ్రయించును. ఇదివఱకే విసికియున్నవాఁడు కావున స్త్రీలు ధనముతోటలు గృహములు మొదలగుసాంసారికభోగములను సంపాదించుటకు సాధనములైన కృషివాణిజ్యాదులును బరిపూర్ణముగాఁ బరిత్యజించును. శ్రమఁ జెందినవాఁడు మఱలఁ దనకు శ్రమగలిగించినవాని గాని వానిసాధనములను గాని యెన్నటికిని గోరఁడు కదా? ఇట్లు లౌకికకర్మముల వదలి యావశ్యకము లగునిత్యనైమిత్తికములను భగవదర్పణముగా నాచరించును. ఇట్లాచరించుటవలన నాజీవునియందుఁ బరమేశ్వరునకు ననుగ్రహము కలుగును. దానివలన నాపురుషునికి (జీవునకు) క్రమక్రమముగా నమానిత్వాది గుణము లిరువదియును గలుగును. ఆగుణము లన్నియు నెప్పుడు పరిపూర్ణములగునో అప్పుడే పరబ్రహ్మసాక్షాత్కారము కలుగును. ఈఇరువదిగుణములకే కదా జ్ఞాన మని పేరు. పైని నిరూపించిన విసుకు లేకుండిన నీజ్ఞానము కలుఁగదు. ఆవిసుకే వైరాగ్యము కావున నీవైరాగ్యము జ్ఞానమునకు ముఖ్యకారణము. వైరాగ్యముకలిగినపిదప నీజ్ఞానము (అనఁగా నమానిత్వాదిగుణములుకూడ నప్రయత్నముగనే వచ్చుననుట). స్పష్టమయ్యెను కదా? ఓపార్వతీ ! ఇట్లు చెప్పి శ్రీరాముఁడు "బోధరూపము నెఱిఁగించెను" అని ఇట్లు చెప్ప నారంభించెను. రసము రక్తము మాంసము మేదస్సు (ఇది చర్మమునకును మాంసమునకును నడుమనుండునీరు ఎముకలు మజ్జ (ఇది ఎముకలలో నుండుక్రొవ్వు). శుక్లము అను నీయేడును సప్తధాతువు లనంబడును. ఆకాశాదిపంచభూతములును మనోబుద్ధ్యహంకారములు మూఁడును గలసి యష్టప్రకృతు లనఁబడును. ఉండుట పుట్టుట వృద్ధినొందుట పరిణమించుట క్షీణించుట నశించుట యను నీయాఱును షడూర్ములు.

## బోధశబ్దార్థవివరణము.

అవ. ఈవిధముగా వైరాగ్యస్వరూపమును వివరించి జ్ఞానోత్పత్తికారణవ్యాఖ్యానపూర్వకముగా జ్ఞానస్వరూపము నెఱిఁగించుచున్నాఁడు:—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. అట్టిసుగుణాభిరాముఁ డత్యార్తితోడ
శాంతచిత్తుండు గారుణ్యసాగరుండు
జ్ఞానవిజ్ఞానసంపన్నుఁ డైనగురుని
వినయభయభక్తు లమర సేవించుననఘ!. 128

టీ. అనఘ = ఓదోషరహితుఁడా! అట్టిసుగుణాభిరాముఁడు-అట్టి = పూర్వోక్తమైన, సుగుణ = సద్గుణములచే, అభిరాముఁడు = మనోహరుఁడైనవాఁడు, ఆత్యార్తితోడఁ = మిగులసంసారబాధకువెఱచి, శాంతచిత్తుండు = చిత్తశాంతిగలిగినట్టియు, కారుణ్యసాగరుండు=దయాసముద్రుఁడైనట్టియు, జ్ఞాన...దును-జ్ఞాన = పరోక్షజ్ఞానము చేత, విజ్ఞాన=అనుభవజ్ఞానముతోడను, సంపన్నుఁడును = కూడినట్టివాఁడును, ఐన=ఐనట్టి, గురునిఁ=సద్గురుని, వినయభయభక్తులు-వినయ=వినయము, భయ=భయము, భక్తులు = భక్తి, అమరఁ=ఒప్పునట్లుగా, సేవించుఁ=సేవఁజేయును.

తా. ఓదోషరహితుఁడా! అట్లమానిత్వాదిగుణములు గలపురుషుఁడు మిగుల శ్రద్ధాయుక్తుండై శాంతుఁడును కరుణాసముద్రుఁడు బ్రహ్మాత్మైక్యజ్ఞానతదనుభవనిష్ఠుఁడు నగుసద్గురు నాశ్రయించును.

## గురువే పరబ్రహ్మమని బోధించుట.

క. గురుఁ డజుఁడు గురుఁడు విష్ణుఁడు
గురుఁడు మహాదేవుఁ డఖిలగురుఁడు గురుఁడు స
ద్గురుఁడె పరబ్రహ్మం బని
గురుని నుపాసించు నతఁడు గురుతరభక్తిన్. 129

టీ. అతఁడు=ఆశిష్యుఁడు, గురుఁడు=గురువు, అజుఁడు=చతుర్ముఖుఁడు. గురుఁడు, విష్ణుఁడు, గురుఁడు, మహాదేవుఁడు = రుద్రుఁడు, గురుఁడు, అఖిల = సమస్తమునకంటె, గురుఁడు=అధికుఁడు, సద్గురుఁడే, పరబ్రహ్మంబని='పరబ్రహ్మము' అని, గురుతరభక్తిన్= అధికభక్తితో, గురునిఁ=తనగురువును, ఉపాసించుఁ=ఉపాసన చేయును.

తా. ఇట్లాశ్రయించి బ్రహ్మవిష్ణుమహేశాది సర్వదైవంబులును తుదకు పరబ్రహ్మంబునుఁ గూడ గురువే యనియు గురువునకంటె నధికు లెవ్వరు నెందును లేరనియు నతి భక్తితో నాతని సేవించును.

## గురుశుశ్రూష ముఖ్యంబని చెప్పుట.

అవ. ఇట్లు ప్రస్తాపవశమున "గురువే సర్వాధికుఁడు" అని తన యభిప్రాయము నెఱింగించి ఇప్పుడు గురుశుశ్రూషయే జ్ఞానసాధనము." అని చెప్పుచున్నాఁడు:—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. గురుపదాంభోజముల్ గొలువక కల్గునే
ప్రవిమలవైరాగ్యభాగ్యమహిమ
గురుపాదతీర్థంబు గ్రోలక కల్గునే
జ్ఞానవిజ్ఞానయోగానుభవము
గురుసుప్రసాదంబుఁ గొనకున్నఁ గల్గునే
ప్రతిలేనిచిత్తోపరతిసుఖంబు
గురుతత్త్వ మాత్మఁ గన్గొనకున్నఁ గల్గునే
నిరతిశయంబైనపరమపదము
తే. అట్లు గావున విద్యార్థి యైనయోగి
వినయభయభక్తుఁ లెదలోనఁ బెనఁగొనంగ
నలచతుర్విధశుశ్రూష లాచరించి
కొనుచు ననిశంబు గురువులఁ గొలుచునఘ. 130

టీ. అనఘ = దోషరహితుఁడా, గురుపదాంభోజములు = సద్గురునిపాదపద్మంబులును, కొలువక = సేవింపక, ప్రవి...మహిమ-ప్రవిమల = పరిశుద్ధమయిన, వైరాగ్య=వైరాగ్యమనెడు, భాగ్యమహిమ = అదృష్టము, కల్గునె=దొరకునా, గురుపాదతీర్థంబుఁ-గురు=సద్గురువుయొక్క, పాద = పాదములయొక్క, తీర్థంబుఁ=జలమును, గ్రోలక = పానముచేయక, జ్ఞాన...భవము-జ్ఞాన = జ్ఞానముయొక్కయు, విజ్ఞాన=అనుభవజ్ఞానముయొక్కయు, యోగ=నిర్వికల్పసమాధియొక్కయు, అనుభవము, కల్గునే=సంభవించునా! గురుసుప్రసాదంబు = సద్గురుప్రసాదమును, కొనకున్నఁ = భుజింపంబడిన, ప్రతి...సుఖంబు-ప్రతిలేని=సాటిలేని, చిత్తోపరతిసుఖంబు=చిత్తశాంతి, కల్గునే, గురుతత్త్వముఁ=గురునియథార్థరూపమును, ఆత్మఁ = తనయందు, కన్గొనకున్నఁ = తెలిసికొనకుండిన, నిరతిశయంబు=సర్వాధికమైన, ఐనపరమపదము=అయినట్టిమోక్షము, కల్గునే=దొరకునా, అటుగావునఁ = కాఁబట్టి, విద్యార్థియైనయోగి-విద్యార్థియైన = బ్రహ్మజ్ఞానమునుగోరు, యోగి=రాజయోగి, వినయభయభక్తులు-వినయ=వినయము, భయ = భయము, భక్తులు=భక్తి, ఎదలోనఁ = మనసునందు, పెనఁగొనఁగఁ = అభివృద్ధియగుచుండఁగా, అల...షలు-అల=చతుర్విధస్థానాంగభావాత్మరూపములైన (వీనిలక్షణములను ప్రథమాశ్వాసమున వివరించియున్నాము.), శుశ్రూషలు = గురుసేవలను, ఆచరించి = చేసి, అనిశంబు=ఎల్లప్పుడు, గురువులఁ, కొలుచుఁ=సేవించును.

తా. గురువునకు నమస్కరింపకున్న నిర్మలవైరాగ్యము దృఢముకానేరదు. బ్రహ్మజ్ఞానంబును తదనుభవంబును సమాధినిష్ఠయు గురుపాదతీర్థమును పానముఁ జేయకున్న సమకూఱదు. గురుప్రసాదము సంగ్రహింపకున్న సాటిలేని యాచిత్తశాంతిసుఖము దొర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కదు. గురుని యథార్థస్వరూపమును దెలిసికొనకున్న సర్వాధిక వగు మోక్షముఁ బొందుట కశక్యము. సర్వంబును గురునియనుగ్రహమువలన నేకాని చేకూరదు కదా? ఓదోషరహితుఁడా! ఈకారణమువలన బ్రహ్మజ్ఞానమును గోరుయోగి గురువు నాశ్రయించి వినయభయభక్తులు మెఱయ చతుర్విధశుశ్రూషల నాచరించుచు సేవించును.

క. వారలయుపదేశముచేఁ, దారకసాంఖ్యామనస్కతత్త్వాత్మకమౌ
శ్రీరాజయోగమార్గం, బారూఢముగా నెఱుంగునంతట ననఘా!.

టీ. అనఘ=పాపరహితుఁడ, అంతటన్=పిదప, వారలయుపదేశముచేన్-వారల=ఆగురువులయొక్క, ఉపదేశముచేన్=ఉపదేశమువల్లను, తారకసాంఖ్యామనస్కతత్త్వాత్మకమౌ = తారకసాంఖ్యామనస్కరూపమయిన, శ్రీరాజయోగమార్గంబు-శ్రీ = సంపద్యుక్తమైనట్టియు, రాజ = సర్వయోగములలో నుత్తమమైనట్టియు, యోగ=జ్ఞానయోగముయొక్క, మార్గంబు = త్రోవను, ఆరూఢముగాన్ = చక్కఁగా, ఎఱుంగున్ = తెలిసికొనును.

తా. ఓదోషరహితుఁడా! ఇట్లు సేవించుచుండి వారియనుగ్రహమును సంపాదించును. అప్పుడు వారును తారకసాంఖ్యామనస్కయోగములఁ గ్రమముగ నుపదేశింతురు. ఇట్లు వారియుపదేశమువలన రహస్యార్థముల నన్నింటి నాపురుషుఁ డెఱుంగును.

## మహావాక్యార్థవివరణము

అవ. ఇట్లు శిష్యునియభివృద్ధిప్రకారం బెఱింగించి గురువులయుపదేశము నభివర్ణించుచున్నాఁడు:—

మ. క్రమ మొప్పార నహంపదంబునకు నీకాయేంద్రియప్రాణచి
త్తమనోహంకృతిబుద్ధిరూపజడజాతం బెల్ల వాచ్యార్థ మా
ద్యము సచ్చిత్సుఖరూపమై తనరు శుద్ధప్రత్యగాత్మప్రకా
శము లక్ష్యార్థము వేదశాస్త్రగరహస్యం బింత నిక్కంబగున్. 132

టీ. క్రమ మొప్పారన్=క్రమముగా, అహంపదంబునకున్ = 'అహం బ్రహ్మాస్మి' అనుయజుర్వేదమహావాక్యమునందలి యహంపదమునకు, ఈకాయే...జాతంబు - ఈ, కాయ=శరీరములు, ఇంద్రియ=ఇంద్రియములు, ప్రాణ = ప్రాణములు, చిత్త = మనస్సు (లేక సంశయాత్మకమయిన యంతఃకరణము), మనః=మనస్సు (ఇది సంకల్పాత్మకమైన యంతఃకరణము). అహంకృతి=అహంకారము, బుద్ధి=బుద్ధి, రూప = అనునదియే స్వరూపముగాఁగల, జడ=జ్ఞానశూన్యమైన ప్రపంచపదార్థములయొక్క, జాతంబెల్లన్=సమూహమంతయును, వాచ్యార్థము=చెప్పఁదగినయర్థము, ఆద్యము=అనాది యైనట్టియు, సచ్చిత్సుఖరూపమై=సత్యజ్ఞానానందస్వరూపము నగుచు, తనరు...శము-తనరు = ఒప్పుచున్న, శుద్ధ=పరిశుద్ధమయిన, ప్రత్యక్...మైన, ఆత్మప్రకాశము=స్వప్రకాశమే, లక్ష్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్థము=ఊహించి నిర్ణయింపఁదగినయర్థము, వేదశాస్త్రగరహస్యంబు-వేద=వేదములయం దును, శాస్త్రగ=శాస్త్రములయందునున్న, రహస్యంబు = రహస్యార్థమిదియే, ఇంత=ఈ చెప్పఁబడినదంతయు, నిక్కంబగుఁ=యథార్థము.

తా. వారు 'అహం బ్రహ్మాస్మి' అనుమహావాక్యమున కర్థము నీరీతి నుపదేశింతురు. 'అహం = నేను' అనుపదమునకు శరీరము ఇంద్రియము ప్రాణము బుద్ధి మనస్సు అహంకారము అను మొదలగువానియొక్క సమూహము వాచ్యార్థము. (అనఁగా: సర్వజనుల చేతను, సామాన్యముగా విచారశూన్యదృష్టితోఁ జెప్పఁబడు నర్థము. వీనికన్నిటికిని సాక్షియగు కూటస్థుఁడు లక్ష్యార్థము. (అనఁగా: విచారణ చేసి నిర్ణయింపఁదగిన యర్థము.) ఇది సత్యముగ వేదశాస్త్రములు బోధించునర్థము. ఇదియే సర్వసార మగునంశము.)

క. సర్వము వాచ్యార్థము త
త్సర్వాధిష్ఠాన శుద్ధచైతన్యము చి
త్పూర్వకలక్ష్యార్థంబు సు
పర్వవినుత వినుము బ్రహ్మపదమున కరయన్. 133

టీ. సుపర్వవినుత-సుపర్వ = దేవతలచే, వినుత = స్తోత్రము చేయఁబడినవాఁడా, వినుము. బ్రహ్మపదమునకుఁ = బ్రహ్మశబ్దమునకు, అరయన్ = విచారింపఁగా, సర్వము= సర్వప్రపంచము, వాచ్యార్థము = చెప్పఁదగినయర్థము. తత్సర్వాధిష్ఠానచైతన్యము - తత్=ఆ, సర్వ = సమస్తమునకును, అధిష్ఠాన = ఆధారభూతుఁడైన, శుద్ధ=నిర్మలమైన, చైతన్యము = జ్ఞానరూపమగు బ్రహ్మము, చిత్పూర్వకలక్ష్యార్థము=వివేకముచే విచారించి నిర్ణయింపఁదగిన యర్థము.

తా. దేవతలచేతఁ గూడ వినుతింపఁబడునో యాంజనేయా! "బ్రహ్మ పద బ్రహ్మము" అనుపదమునకుఁ గూడ సర్వప్రపంచము, వాచ్యార్థము. ఆప్రపంచమున కాధారభూతుఁడైన శుద్ధచైతన్యస్వరూపుఁడు లక్ష్యార్థము.

తే. ఉభయవాచ్యార్థములతోడ నొప్పుచున్న
యుభయలక్ష్యార్థముల కైక్య మొదవ దట్లు
గాన వాచ్యార్థముల రెంటిఁ గడకుఁ ద్రోచి
యొనయ లక్ష్యార్థ మొకటిగా నెఱుఁగవలయు. 134

టీ. ఉభయవాచ్యార్థములతోడన్-ఉభయ = ఈచెప్పినరెండు, వాచ్యార్థముల తోడన్=వాచ్యార్థములతో (అనఁగా: విచారరహితమగు దశయందు దూరక చెప్పఁదగిన యర్థములగు దేహాదులతో), ఒప్పుచున్న=కూడియున్నచో, ఉభయలక్ష్యార్థములకున్- ఉభయ=రెండువిధములగు, లక్ష్యార్థములకు = విచారముచే నూహింపఁదగినయర్థము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లకు (అనఁగా: కూటస్థబ్రహ్మలతో), ఐక్య మొదవదు=ఏకత్వముసిద్ధింపదు, అట్లుగానఁ =కాఁబట్టి, వాచ్యార్థములరెంటఁ = రెండువాచ్యార్థములను, కడకుఁద్రోచి = తొలఁగించి, ఎనయఁ = ఒప్పునట్లుగా, లక్ష్యార్థములు=లక్ష్యార్థము లైనకూటస్థబ్రహ్మలు, ఒకటిగాఁ=అభిన్నులుగా, ఎఱుంగవలయుఁ = తెలిసికొనవలయును.

తా. ఇఁక "అస్మి=అయియున్నాను. (అనఁగా: నేనున్బ్రహ్మంబు నొక్కటియే)" అనుపదమునకు జీవబ్రహ్మైక్యమే; లేక కూటస్థబ్రహ్మైక్యమే యర్థమగు ననుట స్పష్టమే. అట్టియైక్యము వాచ్యార్థసహితము లగులక్ష్యార్థమునకుఁ గలుఁగ నేరదనుటయు సుప్రసిద్ధము. కావున నవిచారపూర్వకము లగువాచ్యార్థముల నిషేధించి లక్ష్యార్థముల రెంటినిమాత్రమే యంగీకరింపవలయును.

సీ. అద్వితీయప్రత్యగాత్ముండ నగునేను
        బరిపూర్ణనిర్గుణబ్రహ్మమగుదుఁ
    బరిపూర్ణనిర్గుణబ్రహ్మంబె యద్వితీ
        యప్రత్యగాత్ముండ నైననేన
    టంచు నీరీతి నహంబ్రహ్మపదముల
        వాచ్యార్థముల నెల్ల వదలి శుద్ధ
    లక్ష్యార్థములఁ గొని లక్షణచేఁ దత్త
        దన్యోన్యసమరసైక్యంబు గనుట
తే 'యస్మి' యనుపదమున కర్థమగును గాన
    నిమ్మహావాక్యతాత్పర్య మిట్లు సద్గు
    రుప్రసాదంబువలన నిరూఢముగ న
    బాధకంబుగ నెఱుఁగుట బోధ మనఘ! 135

టీ. అనఘ = ఓదోషరహితుఁడా! అద్వితీయ...త్ముండఁ-అద్వితీయ = రెండవపదార్థము లేని (అనఁగా: ఏకరూపుఁడయిన), ప్రత్యగాత్ముండఁ = కూటస్థుఁడను, అగు నేను=అయినట్టినేను, పరి...గుదుఁ-పరిపూర్ణ=సంపూర్ణమైన, నిర్గుణ=గుణశూన్యమైన, బ్రహ్మమగుదుఁ=పరబ్రహ్మమైయున్నాను. పరి...బ్రహ్మంబె=పరిపూర్ణ,నిర్గుణ,బ్రహ్మంబె, అద్వి... నేను - అద్వితీయ, ప్రత్యక్, ఆత్ముఁడనైననేను = జీవుఁడనైననేను, అటంచుఁ =అని, ఈరీతిఁ = ఇట్లు, అహం బ్రహ్మపదముల వాచ్యార్థములఁ-'అహం=నేను' అను పదముయొక్కయు, బ్రహ్మ = పరబ్రహ్మము అనుపదముయొక్కయు, వాచ్యార్థములను (అనఁగా: దేహాదులును సర్వప్రపంచంబును), వదలి = విడిచి (అనఁగా: వివేకదృష్టిచే నిరాకరించి), శుద్ధలక్ష్యార్థములఁ =నిర్మలమైన లక్ష్యార్థములను (అనఁగా: కూటస్థబ్రహ్మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లను), కొని=గ్రహించి, లక్షణచేఁ=లక్షణావృత్తిచేత, తత్తత్ = ఆయాకూటస్థబ్రహ్మ లకు, అన్యోన్య = పరస్పరముగల, సమరస=సమానమైన, ఐక్యంబు = స్వభావసిద్ధమైన యేకత్వమును, కనుట = తెలిసికొనుట, అస్మియనుపదమునకుఁ - 'అస్మి=అయితిని' అను పదమునకు, అర్థమగుఁ=అర్థమైయున్నది. కానఁ=కాఁబట్టి, ఇమ్మహావాక్యతాత్పర్యము ='అహం బ్రహ్మాస్మి' అను మహావాక్యముయొక్క తాత్పర్యార్థమును, ఇట్లు = పైచెప్పిన విధముగా, సద్గురుప్రసాదంబువలనఁ = సద్గురుని యనుగ్రహమువలన, నిరూఢముగఁ =స్పష్టముగా, అబాధకంబుగఁ=బాధలేకుండ (అనఁగా: భంగములేకుండ స్థిరంబుగా), ఎఱుఁగుటఁ=తెలిసికొనుట, బోధము=జ్ఞానము.

తా. "అద్వితీయకూటస్థుఁడ నగునేనే సర్వపరిపూర్ణబ్రహ్మము. ఆసర్వపరిపూర్ణ బ్రహ్మమే నేను" అని పిదప (అనఁగా: వాచ్యార్థముల నిషేధించి లక్ష్యార్థముల నంగీక రించిన పిదప) లక్షణావృత్తిచే.(అనఁగా: జహదజహల్లక్షణచే) సమరసైక్యమును గ్రహించి యనుభవింపవలయును. (జహదజహల్లక్షణయును మహావాక్య తాత్పర్యార్థమును నిర్ణ యించువిధంబును ద్వితీయాశ్వాసమున సవిమర్శముగా వివరించియున్నాము.) ఇట్టియై క్యమే 'అస్మి' అను పదమున కర్థము. కావున నీమహావాక్యార్థమును గురూపదేశపూర్వ కముగా నెఱిఁగి శ్రుతియుక్త్యనుభవములమూలమున నిర్ణయించుకొనుటయే 'బోధము' అనంబడును. ఓదోషరహితుఁడా! ఇదియే జ్ఞానముయొక్క స్వరూపము. దీనికి వైరాగ్యమే మూలమనుట. (అనఁగా: వైరాగ్యము దృఢముగాఁ గలిగిన నీబోధము తనంత నదియే వచ్చుననుట ఇంతకుముందే వివరించియున్నాము కదా!)

అవ. ఇట్లు గురూపదేశమును వివరించి ప్రస్తుత మనుభవమును బ్రకటించు చున్నాఁడు:—

క. నిత్యముగా దేహాత్మ, ప్రత్యయ మజ్ఞునకు గల్గుపరిపాటిఁ దగం
బ్రత్యగభిన్నబ్రహ్మ, ప్రత్యయ మొప్పారవలయుఁ బండితున కిలన్.

టీ. అజ్ఞునకుఁ = అజ్ఞానికి, నిత్యముగాఁ = సర్వకాలములయందును, దేహాత్మ ప్రత్యయము-దేహ = దేహమే, ఆత్మ = జీవుఁడు, ప్రత్యయము = అనుభ్రాంతిజ్ఞానము, కల్గుపరిపాటిఁ=కలుగునట్లు, పండితునకుఁ=జ్ఞానికి, ఇలఁ = ఈభూమియందు, ప్రత్య గభిన్న=కూటస్థునికంటె వేఱుకాని, బ్రహ్మప్రత్యయము, పరబ్రహ్మమునే 'నేను' అనుతత్త్వ జ్ఞానము, తగఁ=ఒప్పునట్లుగా, ఒప్పారవలయుఁ=అభివృద్ధి చెందవలయును.

తా. లోకమున నజ్ఞానులగువారు 'దేహమే నేను' అని యెట్లు సామాన్యముగాఁ దలంతురో అట్లే బ్రహ్మజ్ఞాని యగువాఁడు 'కూటస్థునకంటె భిన్నుఁడు కాని బ్రహ్మమే నేను' అని తలంచును. పైన నిరూపింపఁబడిన యధికారి సర్వపూర్ణ మగు వైరాగ్యముచే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంపాదించి దానివలనఁ బూర్వోక్తజ్ఞానము (అనఁగా: మహావాక్యతాత్పర్యజ్ఞానము) నార్జించి యట్టి యనుభవమును బొందును. ఇదియే జ్ఞానమునకు ఫలము. ఈనిశ్చయము కలిగిననే కాని పురుషుఁడు కృతార్థుఁడు కానేరఁడు.

తే. ఇదియె బోధప్రకార మౌ నింక నీకు
సుపరతివిధంబు వినిపింతు నొనర వినుము
ఉత్తమోత్తమమై యొప్పుచిత్తశాంతి
బ్రహ్మవిద్యాగమమునకు ఫలము వత్స! 137

టీ. వత్స=పుత్రా! ఇదియే=పైనఁజెప్పినదియే, బోధప్రకారము = బోధలక్షణము, ఔను = ఐ యున్నది, నీకున్, ఇంకన్=ఇఁకపైన, ఉపరతిసుఖంబున్=ఉపరతిసౌఖ్యమును గూర్చి, వినిపింతున్ = తెలియఁజేసెదను, ఒనరన్=ఒప్పునట్లుగా, వినుము, ఉత్తమోత్తమమై = సర్వసుఖములలోను శ్రేష్ఠమై, ఒప్పుచిత్తశాంతి - ఒప్పు = ప్రకాశించుచున్న, చిత్తశాంతి=చిత్తశాంతి, బ్రహ్మవిద్యాగమమునకున్-బ్రహ్మవిద్యా=బ్రహ్మజ్ఞానము, ఆగమమునకున్=వచ్చుటకు, ఫలము, ఔన్=అయియున్నది.

తా. ఓపుత్రా ! బోధమునుగూర్చి సర్వము నెఱింగించితిని. 'వైరాగ్యము బోధమైనంతమాత్రముననే బోధయెట్లు స్వయముగ జనించునదియు వివరించితిని. ఇఁక నుపరతినిగూర్చి తెల్పెదను ఉపరతి యనఁగాఁ జిత్తశాంతి. అదియే బ్రహ్మజ్ఞానమునకు ఫలము.

అవ. ఇట్లు ప్రతిజ్ఞఁ జేసి యాయుపరతినిఁ బ్రశంసించుచున్నాఁడు:—

చ. ఉపకృతిదానభోగముల కొప్పనిమర్త్యునికల్మిశీల మె
ల్లపుడును లేనివిప్రునిగమాధ్యయనంబును నెమ్మనంబునన్
విపులశమంబు గైకొననివీరతపస్వితపంబు నింద్రియా
ద్యుపరతిసౌఖ్యముం గననియోగివివేకము రిత్తయారయన్. 138

టీ. ఉప...లకున్-ఉపకృతికి = పరోపకారమునకు, దాన = దానము చేయుటకును, భోగములకున్ = స్వానుభవమునకును, ఒప్పనిమర్త్యునికల్మి - ఒప్పని = రానట్టి, మర్త్యుని = మనుష్యునియొక్క, కల్మి = సంపదయును, శీలము = సదాచారము, ఎల్లపుడును=ఎప్పటికిని, లేనివిప్రుని నిగమాధ్యయనంబును-లేని=లేనట్టి, విప్రుని = బ్రాహ్మణునియొక్క, నిగమ=వేదములయొక్క, అధ్యయనంబును = పాఠమును, నెమ్మనంబునన్=మనస్సునందు, విపులశమంబున్-విపుల = అధికమగు, శమంబున్ = శాంతిని, కైకొనని వీరతపస్వితపంబును-కైకొనని=అంగీకరింపని, వీరతపస్వి = మహాదీక్షతో కూడియున్న మౌనియొక్క, తపంబును = తపస్సును, ఇంద్రియాద్యుపరతి సౌఖ్యమున్-ఇంద్రియ=ఇంద్రి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యములు, ఆది = మొదలగువానియొక్క, ఉపరతి=శాంతియనెడు, సౌఖ్యమున్=సుఖమును, కననియోగివివేకము-కనని=పొందని, యోగి=రాజయోగియొక్క, వివేకము=జ్ఞానంబును, అరయన్=విచారింపఁగా, రిత్త=నిరర్థకంబు.

తా. విచారింపఁగా పరోపకారమునకును దానమునకును స్వానుభవమునకు నుపయోగింపనిధనికుని ధనమువలె నాచారహీనుఁ డగుబ్రాహ్మణుని వేదాధ్యయనమువల్ల శాంతిలేని మునీశ్వరునితపముచందమున చిత్తేంద్రియశాంతి (అనఁగా: నుపరతి) యను సౌఖ్యమునుఁ జెందనిరాజయోగి యోగాభ్యాసముకూడ నిరర్థకమే.

సీ. వేదశాస్త్రంబులు విపరించి బుధులచేఁ
  జదివింపవచ్చుఁ దాఁ జదువవచ్చు
యజ్ఞదానతపంబు లధికారిజనముచేఁ
  జేయింపవచ్చుఁ దాఁ జేయవచ్చు
నిలలోనఁ గలతీర్థముల కేఁగ నన్యుల
  బోధింపవచ్చుఁ దాఁ బోవవచ్చు
నష్టాంగయోగవిద్యల నార్యులకు నుప
  దేశింపవచ్చు సాధింపవచ్చుఁ
తే. గాని యెవ్వారికైన విజ్ఞానయోగ
గతిని దేహేంద్రియము లరికట్టి మనము
నాఁగి యంతర్ముఖముఁ జేసి యనవరతము
నిశ్చలసమాధినిష్ఠచే నిలుపరాదు. 139

టీ. కలతీర్థములకున్ - కల=ఉన్న, తీర్థములకున్, ఏగన్=పోవుటకు, బోధింపవచ్చున్ = బోధచేయవచ్చును, తాఁబోవవచ్చున్=స్వయముగాపోవచ్చును, అన్యులకు, అష్టాంగయోగవిద్యలన్-అష్ట = ఎనిమిదియగు, అంగ = యమనియమాద్యంగములలోఁ గూడిన, యోగ = యోగములయొక్క, విద్యలన్ = విద్యలను, ఉపదేశింపవచ్చున్, సాధింపవచ్చున్=తాను స్వయముగా కూడ నాచరింపవచ్చును, కాని=అయినను, ఎవ్వారికైనన్=ఎవ్వరికైనను, బుధులచేన్ = పండితులచే, వేదశాస్త్రంబులు-వేద = వేదములును, శాస్త్రంబులు=శాస్త్రంబులును, విపరించి=విమర్శించి, తాన్ = తాను, చదివింపవచ్చున్=చదువునట్లు చేయవచ్చును. చదువవచ్చున్ = స్వయముగాఁ గూడ నభ్యసింపవచ్చును, అధికారిజనముచేన్=తగినవారిచేత, యజ్ఞదానతపంబులు-యజ్ఞ = యజ్ఞములను, దాన=దానములను, తపంబులు = తపస్సులును, చేయింపవచ్చున్ = చేయునట్లు చేయవచ్చును, తాఁజేయవచ్చున్, అన్యులన్ = ఇతరులను, ఇలలోనన్ = భూ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మిలో, విజ్ఞానయోగగతిక్-విజ్ఞాన = అనుభవజ్ఞానమనెడు, యోగ=యోగముయొక్క, గతి=రీతిచేత, దేహేంద్రియములు-దేహ=దేహములను, ఇంద్రియములు = ఇంద్రియములను, అరికట్టి = నిరోధించి, మనముక్ = మనస్సును, ఆఁగి = నిర్బంధించి, అంతర్ముఖముఁజేసి=బాహ్యవృత్తులనుండి మఱలించి, అనవరతము = ఎల్లప్పుడును, నిశ్చలసమాధినిష్ఠచేక్ - నిశ్చలసమాధి = చలనములేనిసమాధియొక్క, నిష్టచేక్ = స్థితిచేత, నిలుపరాదు = నిలుపుట యశక్యము (సర్వకార్యములకంటె మనోనిగ్రహము దుష్కరమని భావము).

తా. మఱియు వేదశాస్త్రాదుల శిష్యులకు బోధించుటయుఁ దా నభ్యసించుటయుఁ గూడ సాధ్య మైనపనియే. యజ్ఞదానతపోరూపము లైనకర్మలఁ దగినవారలచే నాచరింపఁజేయుటయుఁ స్వయముగ నాచరించుటయును సులభమే. "పుణ్యతీర్థములకు నవశ్యముగఁ బోవలయును" అని పరులకు బోధ చేయుటయును స్వయముగ నట్లాచరించుటయును శక్యమే. యమనియమాద్యష్టాంగయుక్తము లగుయోగములఁ బరులకు బోధించి వారిచేత ననుష్ఠింపఁజేయవచ్చును. తానును సాధింపవచ్చును. ఇట్లెన్నికార్యములనైనను జేయఁగలిగియున్నను ఇంద్రియముల నిగ్రహించి మనస్సును నిరోధించి లోనికిఁ ద్రిప్పి సర్వకాలములయందును నిర్వికల్పసమాధినిష్ఠుండై నిలుచుట (అనఁగా: నుపరతిఁ జెందుట) యెట్టివారికైన నశక్యము.

క. చిత్తేంద్రియోపరమము మ,హత్తరమిది యెల్లవారి కబ్బదు వినుమా
యుత్తమదశ గలిగినవి,ద్వత్తముఁడతిదుర్లభుఁడు సదామన్మయుఁడున్.

టీ. వినుము, చిత్తేంద్రియోపరమము - చిత్త=మనస్సుయొక్కయు, ఇంద్రియ= ఇంద్రియములయొక్కయు, ఉపరమము=శాంతి, మహత్తరము=మిగుల శ్రేష్ఠమైనది (లేక అసాధ్యమయియున్నది), ఇది = ఈచిత్తశాంతి, ఎల్లవారికిక్ = అందఱకును, అబ్బదు= దొరకదు. ఆయుత్తమదశ=ఆయుత్తమస్థితి, కలిగినవిద్వత్తముఁడు = కలవిద్వాంసుఁడు, అతిదుర్లభుఁడు = మిగులకష్టముతో కాని దొరకఁడు (కోటిమందిలో నొక్కఁడయిన నుండఁ డనిభావము). సదామన్మయుఁడుక్ =ఎప్పుడును ఆవిద్వాంసుఁడు నాస్వరూపము తోనే యుండును.

తా. చిత్తేంద్రియశాంతి (అనఁగా: నుపరతి) యందఱకును దొరకదు. ఇది మిగుల గొప్పది. ఈయుపరతి యెవ్వరికి నుండునో వాఁడు దుర్లభుఁడు. అట్టివానికిని నాకును రామునకు (పరబ్రహ్మమునకును) గొంచెమైనను భేదము లేదు. వానినిఁ బ్రతివారును బరమేశ్వరునివలెఁ బూజింపవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. కొందఱాత్మతత్త్వము నెఱుంగుదుమటంచు
గర్వులై నిక్కి చిత్తనిగ్రహము లేమి
నుపరతిసుఖంబుఁ గానక విపులవిషయ
రాగలోలతఁ జెడుదు రూరక మహాత్మ! 141

టీ. మహాత్మ = గొప్పబుద్ధిగల ఆంజనేయా! కొందఱు ఆత్మతత్త్వమున్ = పరబ్రహ్మస్వరూపమును, ఎఱుంగుదుమటంచున్ = తెలిసికొన్నామని, గర్వులై = గర్వించి, నిక్కి, చిత్తనిగ్రహము లేమిన్ = చిత్తజయము లేకుండుటవలన, ఉపరతిసుఖంబున్ = చిత్తశాంతిసుఖమును, కానక = పొందక, విపులవిషయరాగలోలతన్ - విపుల = అధికములైన, విషయ = శబ్దాదులయందలి, రాగ = కోర్కిచేత, లోలతన్ = చంచలులై, ఊరక = నిరర్థకముగా, చెడుదురు = చెడిపోవుదురు.

తా. ఓగొప్పబుద్ధిగల యాంజనేయ! కొందఱు "మేము పరబ్రహ్మము నెఱుగుదుము" అని గర్వించి తగినంతమనోనిగ్రహము లేకపోవుటచే నుపరతిసుఖమును జెందలేక నిరర్థకముగా చెడిపోవుచున్నారు.

తే. జ్ఞానవిజ్ఞానయుతుఁడయ్యు సంతతంబు
నాత్మభావన లేకున్న యతనియింద్రి
యంబులు మనంబు తమకు వశంబుచేసి
విషయసుఖములచవిఁ జూపి వెతలఁబెట్టు. 142

టీ. జ్ఞాన...డయ్యున్ - జ్ఞాన = పరోక్షజ్ఞానముతోను, విజ్ఞాన = అనుభవజ్ఞానముతోను, యుతుఁడయ్యున్ = కూడియుండియును, సతతంబున్ = ఎల్లప్పుడును, ఆత్మభావన = నిర్వికల్పసమాధి (అనఁగా కూటస్థుండె పరబ్రహ్మ మని ధ్యానముచేయుట), లేకున్న యతనియింద్రియంబులు = లేనివానియింద్రియములను, మనంబు = మనస్సు, తమకు వశంబుచేసి = ఆపురుషునిఁ దమకు స్వాధీనుని జేసికొని, విషయసుఖములచవిన్ - విషయసుఖముల = విషయసుఖములయొక్క, చవిన్ = రుచి, చూపి = కనుపఱచి, వెతలఁబెట్టున్ = కష్టపెట్టును.

తా. మఱియు పరోక్షాపరోక్షజ్ఞానములు గలపురుషుఁ డైనను చిత్తమును నిగ్రహించి సర్వకాలములయందును నిర్వికల్పసమాధినిష్ఠుఁడై యుండవలయును. అట్లుండకపోయిన ననాదియగువిషయాభిలాష లేక "విషయములే సుఖకరములు" అనుతలంపు తొలఁగదు. దీనినిబట్టి యింద్రియమును మనస్సును వానికి స్వాధీనములు కావు. దీనిచే వాఁడు మిగులఁ గష్టపడును. కావున నెట్టివానికైన నుపరతిసుఖము నొందుట. (లేక సంపాదించుట) యావశ్యకము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## సుస్థితప్రజ్ఞునిలక్షణము.

అవ. ఇట్లు ఉపరతిప్రాముఖ్యతను దెల్పి తత్స్వరూపనిరూపణపూర్వకము స్థిత ప్రజ్ఞునియునికి నభివర్ణించుచున్నాఁడు:—

సీ. అట్లు గావున నింద్రియమనంబుల నజస్ర
  మాత్మభావనచేత నాఁగఁబట్టి
యంతర్ముఖములుగా నలరించి యామీఁదఁ
  గామాదిశత్రువర్గము నడంచి
విమలబోధాకారవృత్తిచేఁ గేవల
  పరిపూర్ణతత్త్వరూపంబుఁ గాంచి
యానందమూర్తియై యఖిలంబుఁ దనయందు
  సమయించి చిత్తవిశ్రాంతి నొంది
తే. యెఱుకమఱపులఁ బొరయనియెఱుక యైన
పరమపురుషుండు సుస్థితప్రజ్ఞుఁ డన గు
ణత్రయాతీతుఁ డన నమనస్కరాజ
యోగనిద్రాసమేతుఁ డై యుండు ననఘ!. 143

టీ. అనఘ = దోషరహితుఁడా ! అట్లుగావునన్ = కాఁబట్టి, ఇంద్రియమనంబు లన్-ఇంద్రియ=ఇంద్రియములను, మనంబులన్ = మనస్సును; అజస్రము=ఎల్లప్పుడును, ఆత్మభావనచేతన్=ఆత్మధ్యానముచేత (అనఁగా నిర్వికల్పసమాధిచేత), అగఁబట్టి=నిలిపి, అంతర్ముఖములుగాన్ = బాహ్యవృత్తులపైకి పోకుండ, అలరించి = ఏర్పఱిచి, ఆమీఁ దన్ = పిదప, కామాదిశత్రువర్గమున్-కామాది = క్రోధ లోభ మోహ మదమాత్స ర్యములనెడు, శత్రు=శత్రువులయొక్క, వర్గమున్=సమూహమును, అడంచి = నశిం పఁజేసి, విమలబోధాకారవృత్తిచేన్ - విమల = నిర్మలమైన, బోధాకార=జ్ఞానరూపమ యిన, వృత్తిచేన్=చిత్తవృత్తిచే, కేవలపరిపూర్ణతత్త్వరూపంబున్-కేవల=ఏకస్వరూపమై నట్టియు, పరిపూర్ణ = సర్వవ్యాపకమైనట్టియు, తత్త్వ = కూటస్థుని యథార్థమైన, రూపంబున్=బ్రహ్మస్వరూపమును, కాంచి=చూచి, ఆనందమూర్తియై = బ్రహ్మానందరూ పుఁడై, అఖిలంబున్=సర్వప్రపంచమును, తనయందున్=తనలో, సమయించి=లయము చేసి, చిత్తవిశ్రాంతినొంది = చిత్తశాంతినినొంది, ఎఱుకమఱపులన్ = జ్ఞానాజ్ఞానము లను (బాహ్యవిషయములఁ బ్రకాశింపచేయుటకు వెలుపలికిఁ బ్రసరించు చిత్తవృత్తిని జ్ఞానమనియు, అట్లు ప్రసరింపని సమయమున, లేక యింద్రియగోచరములు కాని విష యములనుగూర్చి ప్రసరించుచున్న చిత్తవృత్తి నజ్ఞానమనియుఁ జెప్పుచున్నాము అని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తెలిసికొనవలయును) పొరయని = పొందని, ఎఱుకయైన పరమపురుషుఁడు = నిత్యజ్ఞానరూపుఁడైన (లేక బ్రహ్మరూపుఁడైన) విద్వాంసుఁడు, సుస్థితప్రజ్ఞుఁడనన్ - సుస్థిత = స్థిరమైన, ప్రజ్ఞుఁడనన్ = జ్ఞానముకలవాఁడని, గుణత్రయాతీతుఁడనన్ = త్రిగుణముల నతిక్రమించినవాఁడనియుఁ, ప్రసిద్ధుఁడై, అమనస్క...తుఁడై-అమనస్క = మనస్సులేని, రాజ = శ్రేష్ఠమైన, యోగనిద్రా = జ్ఞానయోగనిద్రతో, సమేతుఁడై = కూడినవాఁడై, ఉండున్ =ఉండును.

తా. ఓదోషరహితుఁడా! యి ట్లుపరతి యత్యావశ్యకమైనది కావున వివేకులగు వారందఱును దాని నీక్రిందివిధముగా సంపాదింపవలయును. అది చిత్తేంద్రియశాంతియే యనియు సమాధినిష్ఠుఁడు కాకుండిన నవి పూర్వవాసనను మాన వనియు నిదివఱకే చెప్పియున్నాను. కావున దివ్యజ్ఞానసంపన్నుఁ డగుయోగి మొట్టమొదట బ్రహ్మైక్య ధ్యానమును (ఇదియే నిదిధ్యాసనము) గావించుచు నాయింద్రియాదుల శబ్దాదులపై కుఱికకుండ నిరోధింపవలయును. ఇట్లు చిత్తేంద్రియముల విషయములనుండి త్రిప్పి యంతర్ముఖములఁ జేసినపిదప వానిచాంచల్యమునకుఁ గారణము లగు కామక్రోధాదుల జయింపవలయును. చిత్తము బాగుగ స్వాధీన మయ్యేనేని దానికి బ్రహ్మసంబంధముచే సత్వగుణ మబ్బును గావున రజోగుణము నశించుటచే దానివలనఁ బుట్టుకామాదులు స్వయముగనే నశించును. "అహం బ్రహ్మాస్మి" అనుచిత్తవృత్తిచే సర్వపరిపూర్ణబ్రహ్మము నాత్మరూపముగాఁ బిదప నవలోకింపవలయును. ఇట్టియవలోకనము చిత్తశాంతి లేనివారలకు దొరకుటయే దుర్ఘటము కదా? ఇట్లు పరబ్రహ్మావలోకనముఁ జేయువాఁడు పరమానందరూపుఁడె యగును. అట్టివాని మనస్సు పరమశాంతి నొందును. (అనఁగా నెప్పటికిని బహిర్ముఖముగాదు.) ఇదియే యుపరతి. ఇట్టియుపరతిని జెంది జ్ఞానాజ్ఞానములు (జ్ఞానాజ్ఞానములను గూర్చి ద్వితీయాశ్వాసమున పెక్కుమాటలు వివరింపఁబడినవి) లేక చిత్సంవిజ్ఞానస్వరూపుఁ డై యున్న మహాత్ముఁడు స్థితప్రజ్ఞుఁడనియు గుణాతీతుఁడనియుఁ జెప్పఁబడును. సర్వకాలములయందును అమనస్కరాజ యోగనిద్ర నొంది సుఖించుచుండును.

తే. ధర్మవిధి నెవ్వఁడు మనోగతంబులైన
సర్వకామంబులను గడు సన్యసించి
యంచితాత్మాత్మసంతుష్టుఁ డగుచు నుండు
నాతఁ డాత్మస్థితప్రజ్ఞుఁ డగుఁ గుమార! 144

టీ. కుమార=పుత్రా! ఎవ్వఁడు=ఏమహాత్ముఁడు, ధర్మవిధిన్ - ధర్మ = ధర్మమైన, విధిన్ =నియమముచే,మనోగతంబులైన=మనస్సునందున్న, సర్వకామంబులన్ =కోర్కెల నన్నింటిని, కడున్ = మిగుల, సన్యసించి = విడిచి, అంచితాత్మాత్మసంతుష్టుఁడగుచున్

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అంచిత=ఒప్పుచున్న, ఆత్మా=పరమాత్మునియందె, ఆత్మ సంతుష్టుఁడగుచుర్=మనస్తృప్తి గలవాఁడై, ఉండునాతఁడు = ఉన్నవాఁడు, ఆత్మస్థితప్రజ్ఞుఁడగుర్-ఆత్మ = పరమాత్ముని యందు(లేక తనయందు), స్థిత=ఉన్న (లేక, నిశ్చలమయిన, అనఁగా సంతర్ముఖమయిన), ప్రజ్ఞుఁడగుర్ = బుద్ధిగలవాఁడగును. (యోగసిద్ధిఁ జెందినవానికి స్థితప్రజ్ఞుండని పేరు).

తా. ఓపుత్రా! శాస్త్రోక్తరీతిగా మనసునందలి సర్వకామములను (అనఁగా వానికి సాధనములగుకర్మలనుగూడ) పరిత్యజించి సర్వకాలములయందు నేమహాత్ముఁ డాత్మ సమాధినిష్ఠుఁడై యుండునో అట్టివాఁడు స్థితప్రజ్ఞుఁ డనఁనొప్పును. "ప్రజయలి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్, ఆత్మ న్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదో చ్యతే" అనువాక్యముచే గీతాచార్యుఁ డీవిషయమునే వివరించియున్నాఁడు (ఇచ్చట నుదహరింపంబడు గీతావాక్యములకుఁ గూడ పైన వ్రాయఁబడియున్నదే తాత్పర్యము కావున మఱల వ్రాయ లేదు.)

తే. ప్రాప్తదుఃఖములకు భయపడక యోర్చి
కొసరి యప్రాప్తసుఖములఁ గోరికొనక
వీతరాగభయక్రోధుఁ డై తనర్చు
నాతఁ డాత్మస్థితప్రజ్ఞుఁ డగుఁ గపీంద్ర!. 145

టీ. కపీంద్ర = వానరశ్రేష్ఠా! ప్రాప్తదుఃఖములకుర్-ప్రాప్త = వచ్చిన, దుఃఖము లకుర్, భయపడక, ఓర్చి, కొసరి, అప్రాప్తసుఖములర్-అప్రాప్త = రాని, సుఖములర్ కోరికొనక = కావలయుననక, వీతరాగభయక్రోధుఁడై-వీత = పోయిన, రాగ=తనకున్న వాని ననుభవింపవలయుననునిచ్ఛ, భయ=భయము, క్రోధుఁడై = కోపంబును కలవాఁడై, తనర్చునాతఁడు=ఉన్నవాఁడు, ఆత్మస్థితప్రజ్ఞుఁడగుర్.

తా. వానరశ్రేష్ఠా ! దుఃఖములు వచ్చినప్పుడు కలఁతనొందక రానిసుఖములఁ గోరక రాగము (ఇదితనకుఁ గలవాని ననుభవింపవలయు ననునిచ్ఛ) భయము కోపము అనునవి లేక నిర్వికారుండై యుండువాఁడు స్థితప్రజ్ఞుండనంబడును.

శ్లో. "దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః,
వీతరాగభయక్రోధః స్థితధీ ర్మునిరుచ్యతే."

అను గీతావాక్య మీవిషయమునే బోధించుచున్నది.

తే. అఖిలవిషయానభిస్నేహుఁ డగుచు శుభము
నొంది మురియక యశుభంబు నొంది కినియ
కుండు నెవ్వాఁడు సమత నప్పండితుండు
సంస్థితప్రజ్ఞుఁ డగు సూరిజనవరేణ్య. 146

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. సూరిజనవరేణ్య = విద్వాంసులలో శ్రేష్ఠుఁడా ! అఖిలవిషయ...గుచుఁన్ - అఖిలవిషయ=సమస్తవిషయములయందును, అనభిస్నేహుఁడగుచున్ = ప్రేమలేనివాఁడై, శుభమునొంది మరియక = శుభమునుపొంది సంతోషింపక, అశుభంబునొంది కినియక= దుఃఖమును పొంది దానిని ద్వేషింపక, సమతన్ = సమచిత్తముతో, ఎవ్వాఁడు = ఏ పురుషుఁడు, ఉండున్, అప్పండితుండు = ఆజ్ఞాని, సంస్థితప్రజ్ఞుఁడగున్ = స్థిరజ్ఞానము గలవాఁ డగును. (స్థితప్రజ్ఞుఁ డని పిలువఁబడును.)

తా. విద్వాంసులలో శ్రేష్ఠుఁడా ! ఏపురుషుఁడు సర్వపదార్థములయందును ప్రేమనుంచఁడో శుభము వచ్చిన సంతోషింపఁడో యశుభము వచ్చిన దుఃఖింపఁడో వాఁడు స్థితప్రజ్ఞుఁడు.

శ్లో. "యస్సర్వత్రానభిస్నేహస్తత్తత్ప్రాప్య శుభాశుభమ్,
నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా."

అను గీతావాక్య మీవిషయమునం బ్రమాణము.

తే. కూర్మమఖిలావయవములఁ గుదియముడుచు
మాడ్కి నేయోగి యింద్రియమానసముల
నమర మరలించు నింద్రియార్థములవలన
నాతఁ డాత్మస్థితప్రజ్ఞుఁ డగు మహాత్మ!. 147

తా. మహాత్మా=గొప్పబుద్ధి గలయాంజనేయ! ఏయోగి=ఏరాజయోగి, కూర్మము =తాఁబేలు, అఖిలావయవములన్ = సమస్తములైన అవయవములను, కుదియముడుచు మాడ్కిన్=తనకర్పరములో నిముడ్చుకొన్నట్లు, ఇంద్రియమానసములన్ = ఇంద్రియములును మనస్సును, ఇంద్రియార్థములవలనన్ = ఇంద్రియవిషయములైనశబ్దాదుల నుండి, అమరమరలించున్ = చక్కఁగా త్రిప్పునో, అతఁడు=ఆయోగి, ఆత్మస్థితప్రజ్ఞుఁ డగున్.

తా. ఓగొప్పబుద్ధిగలయాంజనేయా! ఏరాజయోగి తాఁబేలు సర్వావయవములును లోనికి ముడుచుకొనునట్లు చిత్తేంద్రియముల వానివాని విషయములనుండి మరలించునో అతఁడు స్థితప్రజ్ఞుఁ డనఁబడును.

శ్లో. "యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః,
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా."

అనువాక్య మీవిషయమునఁ బ్రమాణము.

తే. విను మొకరహస్య మెఱిఁగింతు వేయు నేల?
యేమహాప్రాజ్ఞునకు మానసేంద్రియములు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పంచిన ట్లాజ్ఞలో నిల్చి పనులు సేయు
నతఁడు నాత్మస్థితప్రజ్ఞుఁ డగు బుధేంద్ర! 148

టీ. బుధేంద్ర=విద్వాంసులలోశ్రేష్ఠుఁడా! ఒకరహస్యము, ఎఱిఁగింతున్=తెలియ చేయుదును, వినుము, వేయుసేల = వేయుమాటలు చెప్ప నేటికి, ఏమహాప్రాజ్ఞునకున్ = ఏమహాజ్ఞానికి, మానసేంద్రియములు=ఇంద్రియములు మనస్సు, ఆజ్ఞలోన్, నిల్చి, పంచినట్లు = ప్రేరేపింపంబడినట్లు (లేక చెప్పినట్లు! అనఁగా ఆపురుషుని ఇష్టానుసారముగ), పనులు=కార్యములను, చేయున్=చేయుచుండునో, అతఁడు=ఆమహాత్ముఁడు, ఆత్మస్థిత ప్రజ్ఞుఁడు, అగున్.

తా. విద్వాంసులలో శ్రేష్ఠుఁడా! వేయుఁ జెప్ప నేటికి? పరిపూర్ణాభిప్రాయము సంక్షేపములుగా వివరించెదను. ఏజ్ఞానికి వశవర్తులై మనంబును ఇంద్రియంబులును ప్రవర్తించుచుండునో వాఁడె స్థితప్రజ్ఞుఁడు. శ్లో. "వశేహి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా" = "ఏజ్ఞానవంతునికి నింద్రియములు స్వాధీనమున నుండునో వాఁడే స్థిత ప్రజ్ఞుఁడు" అను గీతావాక్య మీవిషయమునఁ బ్రమాణము.

ఆ. ఎల్లభూతములకు నెద్ది శర్వరి దాని
యందు మేలుకని మహాత్ముఁ డలరు
నఖిలజగము దేనియందు మేల్కనియుండు
నదియె నిశి జితేంద్రియాత్మునకును. 149

టీ. ఎల్లభూతములకున్ = భ్రాంతులైనసర్వజీవులకును, ఎద్ది=ఏది (అనఁగా ఏ బ్రహ్మరూపము, లేక యేయథార్థతత్వము), శర్వరి=తెలిసికొన నశక్యమగుటచే నంధకారప్రాయమై యుండునో, లేక, సర్వేంద్రియములకును విలయకాలమగు రాత్రియో (అనఁగా సుషుప్తియో), దానియందున్=ఆయథార్థ తత్వమునందు (లేక ఆసుషుప్త్యవస్థయందు), మహాత్ముఁడు=విజ్ఞానవంతుఁడు, మేలుకని=జాగరూకుండై (అనఁగా సంపూర్ణ ప్రకాశవంతుఁడై,) అలరున్=ఒప్పును. జితేంద్రియాత్మునకున్ ఇంద్రియనిగ్రహముగల యోగికి, అఖిలజనము=సర్వజీవులును, దేనియందున్=ఏసంసారమునందు (లేక యేపగటి యందు), మేల్కనియుండున్=(అసత్యమయ్యును భ్రాంతివశమున సత్యరూపముగాఁ గానవచ్చుచుండుటచే "ఇదియే యథార్థతత్వము. ఇంతకంటె వేఱేమియులేదు" అని) జాగరూకులై, (లేక ప్రకాశముగలిగి యుందురో), అదియే = ఆసంసారమే (లేక, ఆపగలే), నిశి=రాత్రివంటిది. (అనఁగా నది యథార్థస్థితిలో నసత్యమైనది కావున జ్ఞాని దానియందు చిత్తవృత్తినిఁ బ్రసరింపనీయఁడు).

తా. మఱియు, పరబ్రహ్మతత్వము స్పష్టము కాకుండుటచే, నజ్ఞానాంధకార మునందున్న సర్వభూతములకు నది రాత్రిప్రాయమై యుండును. సంసారముమాత్రము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శూన్యరూపమేయైనను భ్రాంతివలన సత్యముగాఁదోచును. గావున నది పగటివలె (అనఁగా ప్రకాశరూపమై) ఉండును. బ్రహ్మస్వరూపానుభవము కలవాఁడగుటచేతను ప్రపంచమును శూన్యరూపముగా (లేక తనకంటె నభిన్నముగాః) జూచువాఁ డగుటచేతను బ్రహ్మజ్ఞాని యగువానికి భూతములరాత్రియే (అనఁగా పరబ్రహ్మమే) పగలు (అనఁగా ప్రకాశరూపమైనది) వానిపగలే (అనఁగా సంసారమే) రాత్రి (అనఁగా నప్రకాశస్వరూపమైనది.) వాస్తవస్థితిలో వానికి (బ్రహ్మజ్ఞానికి) సంసారమే (లేక ప్రపంచమే) కానరాదు కదా.

## రెండవతాత్పర్యము.

తా. సర్వజీవులును జితేంద్రియ లయమగుటచేత రాత్రికాలమునందు మైమఱతురు (లేక అప్రకాశస్వరూపులై యుందురు) పగటియందు భ్రాంతిసిద్ధసంసారమును సత్యముగాఁదలంచి వ్యవహరించుచుండుటచే మేల్కని (అనఁగా 'ప్రకాశరూపులము' అని తలంచుచు) ఉందురు. ఆత్మానుభవముగల మహాత్ముఁడు బ్రహ్మనిష్ఠుఁడగుటచే నింద్రియలయమైనను (అనఁగా సుషుప్త్యవస్థ వచ్చినను "నాకుఁ బ్రకాశములేదు" అని తలంపఁడు. స్వప్రకాశరూపముతో నుండును గావున నప్పుడు నిదురింపఁడు. పగటియందును వానికి భ్రాంతి లేకపోవుటచే ప్రపంచవ్యవహారములఁ జేయఁడు. కావున నప్పుడు 'నాకుఁ బ్రకాశము కలిగినది ఇప్పుడు నాకన్నియుఁ దెలియుచున్నవి.' అని తలంపఁడు. ఈకారణమువలన జీవులరాత్రి జ్ఞానికి పగలు, వారలపగలు జ్ఞానికి రాత్రి యని తెలిసికొనవలయును. "యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ, యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః." అను గీతావాక్య మీవిషయమునఁ బ్రమాణము.

వ. అట్లు గావున నింద్రియమనంబుల ననాత్మనిషేధపూర్వకాత్మాలోకనంబుచేత జయించి వశీకృతమానసేంద్రియుం డైనపుణ్యపురుషుండు సర్వభూతాద్వేష్టయు సకలలోకమిత్త్రుండు పరమకారుణికుండు నిర్మముండు సమదుఃఖసుఖుండు నిరహంకారుండు క్షమావంతుండు నిత్యసంతుష్టుండు యోగారూఢుండు నియతాత్ముండు దృఢాత్మనిశ్చయుండు నిఖలజనాభయప్రదుం డఖిలలోకభయరహితుండు ముక్తహర్షామర్షభయోద్వేగుండు నిరపేక్షుండు శుచియు దక్షుం డుదాసీనుండు గతవ్యథుండు పరిత్యక్తసర్వారంభుం డిష్టానిష్టప్రాప్తిహర్షద్వేషవిహీనుండు సంప్రాప్తేష్టవియోగదుఃఖవిరహితుం డప్రాప్తార్థకామశూన్యుండు యదృచ్ఛాలాభసంతుష్టుండు శుభాశుభపరి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్యాగియు సమశత్రుమిత్రుండు సమలోష్టాశ్మకాంచనుండు సమశీతోష్ణసుఖదుఃఖుండు దుల్యప్రియాప్రియుండు దుల్యనిందాస్తవుండు మానావమానతుల్యుండు మౌనశీలుం డనికేతనుండు సుస్థితప్రజ్ఞుండు గుణాతీతుండు మద్భక్తుండు మదర్పితమనోబుద్ధియు మత్పరాయణుండు నై ప్రకాశించు యోగీంద్రుండు సంతతసహజామనస్కరాజయోగ సమాధియందు సూర్యుండు సమస్తరసంబులం దీల్చిన తెఱంగున బడబానలంబు జలరాశిం బానంబు చేసినకైవడి మహాదవానలం బరణ్యంబునం గలతృణాదిసర్వపదార్థంబులం గబళించిన తెఱంగుననావిద్యకంబులైనయనంతగుణంబుల నశేషంబుగా మ్రింగి కేవలపరిపూర్ణశుద్ధచిన్మాత్రస్వరూపకుండై యుండునద్దశావిశేషం బుపరతి యననొప్పు నయ్యుపరతిప్రాప్తికి యమనియమత్యాగమౌనదేశకాలాసనమూలబంధదేహసామ్యదృక్స్థితిప్రాణాయామప్రత్యాహారధ్యానధారణసమాధులను పంచదశయోగాంగంబులు గాన వాని వేర్వేఱ విభజించెద నాకర్ణింపుము. 150

టీ. అట్లుగావునన్ = కావున, ఇంద్రియమనంబులన్ -ఇంద్రియ = ఇంద్రియముల, మనంబులన్ =మనస్సును, అనా... చేతన్ - అనాత్మ=ఆత్మగాని ప్రపంచముయొక్క, నిషేధపూర్వక=నిరాకరణమే ముందుగాఁగల, ఆత్మ=స్వస్వరూపమును, ఆలోకనంబుచేతన్ =చూచుటచేత, జయించి, వశీకృతమానసేంద్రియుండు-వశీకృత=స్వాధీనముగా చేసుకొనఁబడిన, మానస=మనస్సును, ఇంద్రియుండు=ఇంద్రియములునుగలవాఁడు, ఐనపుణ్యపురుషుండు = అయినట్టిపుణ్యాత్ముఁడు, సర్వభూతాద్వేష్టయున్ - సర్వభూత=సమస్తజంతువులను, అద్వేష్టయున్ = ద్వేషింపనివాఁడును, సకలలోకమిత్రుండు=సకలలోకములకును హితుం డగువాఁడును, పరమకారుణికుండు=దయామయుఁడును, నిర్మముండు=మమకారము లేనివాఁడును, సమదుఃఖసుఖుండు=దుఃఖసుఖములయందు సమచిత్తముగలవాఁడు, నిరహంకారుండు=అహంకారములేనివాఁడు, క్షమావంతుండు=ఓర్పుగలవాఁడును, నిత్యసంతుష్టుండు=సర్వకాలములయందును దృప్తిగలవాఁడును, యోగారూఢుండు=యోగసిద్ధిఁ బొందినవాఁడును, నియతాత్ముండు=ఆత్మనిగ్రహముకలవాఁడును, దృఢాత్మనిశ్చయుండు = ఆత్మబ్రహ్మైక్యనిశ్చయము కలవాఁడును, నిఖిలజనాభయప్రదుండు=సమస్తజనులకును అభయము నొసంగువాఁడును (అనఁగా, నెవ్వనిని బాధింపనివాఁడును, అఖిల...తుండు-అఖిలలోక=సమస్తలోకమువలనను, భయరహితుండు=భయము లేనివాఁడును, ముక్త... సుండు-ముక్త = విడువఁబడిన, హర్ష = సంతోషము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అమర్ష = రోషము, భయ = భయము, ఉద్వేగుండు = త్వరయును గలవాఁడును, నిర పేక్షుండు = దేనిని గోరనివాఁడును, శుచియుఙ్ = పరిశుద్ధుఁడును, దక్షుండు=నేర్పరి యును, ఉదాసీనుండు=సర్వేంద్రియములును తమతమకార్యములయందుఁ బ్రవర్తించు చున్నను దాను వానియం దభిమానమును బూనక సాక్షియై యూరక చూచువాఁడును, గతవ్యథుండు-గత = పోయిన, వ్యథుండు = తపములుగలవాఁడును, పరిత్యక్తసర్వారం భుండు = సర్వసంకల్పములును (లేక సర్వకార్యములును) విడిచినవాఁడును, ఇష్టా... నుఁడు-ఇష్ట=ప్రియమైనదిగాని, అనిష్ట = అప్రియమైనదిగాని, ప్రాప్తి=వచ్చినప్పుడు కలు గుటచే, హర్ష =సంతోషముగాని, ద్వేష = దుఃఖముకాని, నిహీనుండు = లేనివాఁడును, సంప్రా...తుండు-సంప్రాప్త=వచ్చిన, ఇష్ట=ప్రియమయినపదార్థము, వియోగ=పోవుట చేతం గలిగిన, దుఃఖ = దుఃఖము, విరహితుండు = లేనివాఁడును, అప్రా...న్యుండు- అప్రాప్త=రాకుండిన, అర్థ = విషయములపై, కామశూన్యుఁడు = కోర్కి లేనివాఁడును, యదృచ్ఛాలాభసంతుష్టుండు = అప్రయత్నముగా దొరకినదానితోఁ దృప్తినొందిన వాఁడును, శుభాశుభపరిత్యాగియుఙ్=శుభాశుభముల రెంటిని విడిచినవాఁడును, సమ శత్రుమిత్రుండును = శత్రుమిత్రులయందు సమభావముకలవాఁడును, సమలోష్టాశ్మ కాంచనుండు=మట్టి రాయి బంగారము నొక్కటిగఁ జూచువాఁడును, సమశీతోష్ణసుఖ దుఃఖుండు=శీతోష్ణ సుఖదుఃఖములయందు సమచిత్తము గలవాఁడును, తుల్యప్రియా ప్రియుండు=ఇష్టానిష్టములయందు సమభావము గలవాఁడును, తుల్యనిందాస్తవుండు= తన్నొకఁడు నిందించినను దూషించిన నొక్కటిగఁ జూచువాఁడును, మానావమాన తుల్యుండు=గౌరవాగౌరవములయందు సమచిత్తము గలవాఁడును,మౌనశీలుండు-మౌన= త్రివిధమౌనములనాచరించువాఁడును (మౌనములనుగూర్చి రెండవ యాశ్వాసమున వివ రింపఁ బడియున్నది), అనికేతనుండు="ఇది నాకు నివాసము" అని లేక (అనఁగా అభి మానములేక) సర్వస్థలములయందు నుండువాఁడును, సుస్థితప్రజ్ఞుండు=స్థిరమగు బ్రహ్మ జ్ఞానముగలవాఁడును, గుణాతీతుండు=త్రిగుణములనతిక్రమించినవాఁడును, మద్భక్తుండు= నాయందు (బ్రహ్మయందు) దృఢభక్తి (అనఁగా ఆత్మసమర్పణము; తానె బ్రహ్మ మని తెలిసికొని తనను బ్రహ్మమునందు సమర్పించుట; అనఁగా నైక్యభావముతోఁ జూచుట) గలవాఁడును, మదర్పితమనోబుద్ధియుఙ్ = మనోబుద్ధుల నాయందే సమర్పించిన వాఁడును (అనఁగా సర్వకాలసర్వావస్థలయందును నిదిధ్యాసనము జేయువాఁడును), మత్ప రాయణుండై= నేనే (బ్రహ్మమే) శ్రేష్ఠమగు గతిగాఁగలవాఁడగుచు, ప్రకాశించుయోగీం ద్రుఁడు=ప్రకాశించుయోగి, సంత...యందుఙ్-సంతత=ఎల్లప్పుడును, సహజ=స్వాభా వికమైనట్టియు, అమనస్క=అమనస్కము (మనస్సు లేనిది) అను పేరుగలిగినట్టియు, రాజ=సర్వయోగములలోఁ నుత్తమమైనట్టియు, యోగ=జ్ఞానయోగముయొక్క, సమాధి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యందుర్=నిర్వికల్పసమాధియందు, సూర్యుండు, సమస్తరసంబులర్ = సర్వవిధములగు జలములను, పీల్చిన తెఱంగునర్ = ఆకర్షించినట్లును, బడబానలంబు = బడబాగ్ని, జల రాశిర్=సముద్రమును, పానంబుచేసినకైవడిర్ = పీల్చుచున్నట్లు, మహాదవానలంబు= గొప్పదియగుదవాగ్ని, అరణ్యంబునర్ = అరణ్యమునందు, కలతృణాదిసర్వపదార్థం బులర్=ఉన్నగడ్డిమొదలగు సమస్తవస్తువులును, కబళించిన తెఱంగునర్=మ్రింగినట్లును; అవిద్యకంబులైన=అవిద్యామయములైన, అనంతగుణంబులర్-అనంత=పెక్కగు (మిక్కిలి యగు), గుణంబులర్=స్వభావములను, అశేషంబుగార్=మిగులులేనట్లుగా, మ్రింగి= నశింపఁజేసి, కేవల...కుండై-కేవల=ఏకస్వరూపుఁడై నట్టియు, పరిపూర్ణ = సర్వవ్యాపక మైనట్టియుం, శుద్ధ=నిర్మలమైన, చిన్మాత్రస్వరూపకుండై=జ్ఞానమాత్రరూపుఁడై, ఉండుర్ =ఉండును. అద్దశావిశేషంబు = ఇప్పుడు వర్ణించినస్థితి, ఉపరతియననొప్పుర్ = ఉపరతి యని చెప్పంబడును. అయ్యుపరతిప్రాప్తికిర్ = ఆయుపరతి కలుగుటకు, యమనియమ త్యాగమౌనదేశకాలాసనమూలబంధదేహసామ్యదృక్థ్సితిప్రాణాయామప్రత్యాహారధ్యాన ధారణసమాధులు=యమము, నియమము, త్యాగము, మౌనము, దేశము, కాలము, ఆస నము, మూలబంధము, దేహసామ్యము, దృక్థ్సితి, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యానము, ధారణ, సమాధి, అనుపంచదశయోగాంగంబులు = అను పేర్లుగల పదునైదు యోగాంగంబులును, సాధనంబులుగావునర్=సాధనములగును కాఁబట్టి, వానిర్=ఆపదు నైదింటిని, వేర్వేఱర్=ప్రత్యేకముగా, విభజించెదర్ = విభాగించి చెప్పెదను, ఆకర్ణిం పుము=వినుము.

తా. ఓయాంజనేయా! పైనఁ జెప్పినవిధముగా నేమహాత్ముఁడు "అనాత్మయగు ప్రపంచము నేను కాను" అని సర్వపదార్థముల నిషేధించి, పరబ్రహ్మరూపునిగాఁ దనను దలంచి, స్వస్వరూపానుభవబలముచే మనస్సును ఇంద్రియములను నిగ్రహించియుండునో అట్టివాఁడు ఎవ్వనియందును ద్వేషము ఉంచఁడు. సర్వజీవులయెడ మైత్రిగలిగి యుం డును. దయ గలిగియుండును. "నేను నాది" అను నభిమానమును బొందఁడు. సుఖ దుఃఖములయందు సమచిత్తముతో నోర్పు గలిగియుండును. యదృచ్ఛాలాభముచే సంతోషించును. యోగమునందే యాసక్తి గలిగియుండును. చిత్తేంద్రియాదిసమూహ మును నిగ్రహించి దృఢమగు బ్రహ్మాత్మైక్యనిశ్చయముతోఁ బ్రకాశించును. సకలభూత ములకును భయప్రదుఁడుగాక స్వయముగాఁ గూడ నన్యులవలన భీతినొందక సంతోష మును రోషము భయము బెదురు అనునవి లేక నిర్వికారుఁడై యుండును. మఱియు దేనియందు నాశలేనివాఁడుగాను సర్వకాలములయందు బాహ్యాభ్యంతరపారిశుధ్యము కలవాఁడుగాను సర్వకాలములయందును (లేక నావశ్యకములగుకార్యములయందు) కాలోచితముగాఁ ప్రవర్తించువాఁడుగాను కష్టసాధ్యము (లేక దుర్యోధను) .జెందక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యేకార్యములనుగాని యహంకారపూర్వకముగా నారంభింపక నారంభింపఁబడిన కార్యములవలన సుఖమువచ్చిన సంతోషింపక దుఃఖమువచ్చిన ద్వేషింపక ఆసుఖము పోయినప్పుడు దుఃఖింపక రానిదానిని గోరక సమచిత్తుఁడుగానుండును. వానికి శుభాశుభములతోఁ బనిలేదు. మఱియు నామహాత్ముఁడు దొరకినదానితోఁ దృప్తినొందును. శత్రువులందుఁగాని మిత్రులయందుఁగాని మానావమానములయందుఁగాని శీతోష్ణసుఖదుఃఖములయందుఁగాని యిష్టానిష్టములయందుఁగాని నిందాస్తోత్రములయందుఁగాని రాగద్వేషముల నుంపఁడు. ఎప్పుడును త్రివిధమానముల ననుష్ఠించును. "ఇది నాయిల్లు" అని యొకచోట గృహాభిమానము నుంపఁడు. స్థితప్రజ్ఞుండును గుణాతీతుఁడు నగుచు మనోబుద్ధుల నాయందే (బ్రహ్మమునందే) సమర్పించి మద్భక్తుండైయుండును. ఆతనికి నాకంటె వేఱగు శరణములేదు. ఇట్టియోగి సూర్యుండు ద్రవపదార్థముల నన్నిటిని బీల్చినవిధంబున బడబాగ్ని సముద్రజలమును పానముచేసినట్లు దావాగ్ని యరణ్యమునంతయు భస్మముఁజేసినకైవడి యవిద్యాకృతములగు సర్వవికారములను నశింపచేసి (అనఁగా యథార్థస్వరూపము నెఱుంగుటచే నసత్యములని తెలిసికొని) సర్వకాలములయందును నిర్వికల్పసమాధినిష్ఠుఁడై యుండును ఇదియే యుపరతి. దీనియందు యోగి పరిపూర్ణబ్రహ్మచైతన్యమాత్రుఁడైయుండును. ఇట్టియుపరతి దొరకుటకు యమము నియమము త్యాగము మౌనము దేశము కాలము ఆసనము మూలబంధము దేహసామ్యము దృక్స్థితి ప్రాణాయామము ప్రత్యాహారము ధ్యానము ధారణ సమాధి యని పదునైదుసాధనములు కలవు. వీనిస్వరూపములఁ బ్రత్యేకముగాఁ దెలియఁజేసెదను వినుము.

## పంచదశయోగాంగముల విభాగము

అవ. ఇట్లు ప్రతిజ్ఞఁ జేసి యాపదునైదంగములఁ గ్రమముగా నిరూపించుచున్నాఁడు:—

మ. సమతన్భూజలవహ్ని వాయుఖతనూసర్వేంద్రియప్రాణచి
త్తమనోహంకృతిబుద్ధిరూపబహిరంతర్దృశ్యమున్ దృక్స్వరూ
పముగాఁ జూచుచుఁ దద్దృగాత్మకపరబ్రహ్మంబు దా నంచుని
త్యము భావించిన నా యమం బిది యచింత్యం బంజనానందనా.

టీ. అంజనానందనా=అంజనేయా, సమతన్=చక్కఁగా, భూజల... మున్—భూ=భూమి, జల=నీరు, వహ్ని=అగ్ని, వాయు=వాయువు, ఖ=ఆకాశము, తనూ=స్థూలశరీరము, సర్వేంద్రియ=జ్ఞానకర్మేంద్రియములు, ప్రాణ=పంచప్రాణములు, చిత్త=చిత్తము, మనః=మనస్సు, అహంకృతి=అహంకారము, బుద్ధి=బుద్ధి, రూప=ఇవియే స్వరూపముగాఁ గల, బహిరంతర్దృశ్యమున్—బహిః=వెలుపలనున్నట్టియు, అంతః=లోపలనున్నట్టియు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దృశ్యముఁ=దృశ్యపదార్థమును (అనఁగా సాక్షిచేఁ జూడఁబడుపదార్థము), దృక్స్వరూపముగాన్=సాక్షికంటె నభిన్నముగా (సాక్షి జ్ఞానరూపుండే కావునను ఈప్రపంచము. [అనఁగా దృశ్యము] భ్రాంతిసిద్ధమై యగుటచేత దీనికి జ్ఞానమే స్వరూపము కావునను, దృశ్యమునకును సాక్షికిని భేదములేదు. అని ద్వితీయాశ్వాసముననే యనేకవిధముల నిరూపించియున్నాము.) చూచుచున్=భావించుచు, తద్దృగాత్మకపరబ్రహ్మంబు=ఆసాక్షిరూపుఁడైన బ్రహ్మమే, తానంచున్=తానని (అనఁగా కూటస్థుని యథార్థరూపమని), నిత్యము=ఎల్లప్పుడును, భావించినన్=తలంచుచుండినయెడల, యమంబు=ఈస్థితియనంబడునది, ఔన్=అగును. అచింత్యంబు=ఇది అవాఙ్మానసగోచరమైనది (అనఁగా మిగులఁ గష్టసాధ్యమైనది.)

తా. ఓయాంజనేయా! పృథివ్యాదిపంచభూతముల దేహత్రయము ఇంద్రియములు ప్రాణము మనోబుధ్యహంకారములు మొదలగు దృశ్యపదార్థముల నన్నిటిని జ్ఞానమాత్రరూపములుగా (అనఁగా సర్వసాక్షియగు పరబ్రహ్మమునకంటె వేఱు కానివానినిగాఁ) దెలిసికొనుటయు భ్రాంతిసిద్ధములగు రజ్జుసర్పాదులకు భ్రాంతిజ్ఞానవ్యతిరిక్తమగురూపమేమియు లేనట్లు ప్రపంచమునకుఁ గూడ జ్ఞానవ్యతిరిక్తమగు రూపములేదు. పిదప 'పరబ్రహ్మమే తాను' అని నిర్ణయించుకొనుటయు యమమను యోగాంగము. ఇది లేక యీస్థితి యవాఙ్మానసగోచరము.

సీ. వినుచు ముట్టుచుఁ గనుఁగొనుచు నానుచు మూరు
కొనుచుఁ బల్కుచుఁ బనుల్ గొనుచుఁ గనుచు
వర్ణాశ్రమోచితవ్యాపారముల నిచ్చ
సలుపుచుఁ దలఁచుచు మెలఁగునెడల
నీయింద్రియంబు లీయింద్రియార్థంబులఁ
బూని వర్తించునే వీని కెల్ల
సాక్షిని గేవలసచ్చిదానందస్వ
రూపుఁడ గుణజాతిరూపనామ
తే. రహితుఁడ నటంచుఁ దెలిసి నిరంతరంబు
దన్నుఁ దాఁ జూచుకొనుచు సత్యముగ నీయ
ఖండనియమంబు వదలక యుండు టరయ
నియమయోగం బనం దగు నిర్మలాత్మ! 152

టీ. నిర్మలాత్మ=పరిశుద్ధమైనమనస్సుకలవాఁడా, వినుచున్, ముట్టుచున్=చేతితో నొకపదార్థమును తాకుచును, కనుఁగొనుచున్=కంటితోఁ జూచుచును, ఆనుచున్=

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాలుకచే రుచిచూచుచును, మూరుకొనుచున్ = ఘ్రాణముచే వాసనఁజూచుచును, పల్కుచున్=మాటలాడుచును, పనుల్గొనుచున్=ఒకరిచేఁ జేయంబడుకార్యములనంగీకరించుచును, చనుచున్=నడచుచును, వర్ణాశ్రమోచితవ్యాపారములన్-వర్ణ=బ్రాహ్మణాది జాతులకును, ఆశ్రమ=బ్రహ్మచర్యాద్యాశ్రమములకును, ఉచిత=తగిన, వ్యాపారములన్= కార్యములను, నిచ్చసలుపుచున్=నియమముతో నాచరించుచును, తలఁచుచున్=మనస్సుచే సంకల్పించుచు, మెలఁగునెడలన్ = ఉన్నప్పుడు, ఈయింద్రియములు=ఈశ్రవణేంద్రియములు, ఈయింద్రియార్థంబులన్ = వానివానిపనులయందు, పూనివర్తించున్ = ప్రయత్నపూర్వకముగా సంచరించును, ఏన్ = నేను, వీనికెల్లన్ = ఈశ్రవణాదుల కన్నిటికిని, సాక్షిన్ = ద్రష్టను, కేవల సచ్చిదానందస్వరూపుఁడన్ . కేవల = ఏకస్వరూపుఁడను, సత్ = సత్యము, చిత్ = జ్ఞానము, ఆనంద = ఆనందము, స్వరూపుఁడన్ = అనునవియే స్వరూపముగాఁగలవాఁడను, గుణ...డన్-గుణ = స్థూలత్వాదిగుణములుకాని, జాతి = బ్రాహ్మణాది జాతులుగాని, రూప = నీలపీతాదిరూపములుగాని, నామ = రామకృష్ణాది నామములుగాని, రహితుఁడన్ = లేనివాఁడను, (లోకమున నేపదార్థమునైనను దానిగుణమును బట్టిగాని, జాతినిబట్టిగాని క్రియను బట్టిగాని, రూపమునుబట్టిగాని వ్యవహరింతురు. ఈబ్రహ్మమునకు గుణాదులలో నేదియు లేదుకావున నీయనకు నామమే లేదు. దీనిని గూర్చినవివరమును నాచేవివరింపఁబడిన బ్రహ్మగీతద్వితీయాధ్యాయమున చూచునది.) అటంచున్ = అని, తెలిసి = గ్రహించిన, నిరంతరంబున్ = ఎల్లప్పుడును, తన్నున్ = స్వస్వరూపమును, తాన్ = స్వయముగా, చూచుకొనుచున్ = అపరోక్షజ్ఞానముచే ననుభవించుచు (అనఁగా సమాధినిష్ఠుఁ డగుచు, లేక, సర్వవ్యవహారముల చేయుచున్నను చిత్తము నాత్మస్వరూపమునందె నిలుపుచు), సత్యముగన్=యథార్థముగా లేక, దృఢముగా), ఇయ్యఖండ నియమంబున్=ఈప్రశస్త విధిని, వదలకయుండుట=విడువకుండుటయే, అరయన్=విచారింపఁగా, నియమయోగంబనంబడున్=నియమయోగమని చెప్పఁబడుచున్నది.

తా. ఓనిర్మలచిత్తుఁడా ! శ్రోత్రేంద్రియముచే, శబ్దమును గ్రహించుచున్నను పాణీంద్రియముచేఁ బదార్థముల స్పృశించుచున్నను, నేత్రేంద్రియముచేఁ జూచుచున్నను, జిహ్వేంద్రియముచే రుచుల గ్రహించుచున్నను, ఘ్రాణేంద్రియముచే సకల గంధముల నాఘ్రాణించుచున్న పరులచేఁ బనులను జయించుచు వాని నధికారియై చూచుచున్నను మనస్సుచే సంకల్పించుచున్నను 'ఇంద్రియములు తమతమ కార్యములయందుఁ బ్రవర్తించుచున్నవి; కాని నాకు చాంచల్యము లేదు. నేను వీనికి సాక్షిని' అని జ్ఞాననిష్ఠుఁ డగుయోగి తలంచును. (లేక, తలంపవలయును) ఈనియమము నెప్పుడును విడువకుండుటయే నియమ మనుయోగాంగము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. ప్రత్యగాత్మస్వరూపుఁడై పరఁగుతనకు
నన్య మైనట్టి దేహేంద్రియాదిదృశ్య
వితతి యంతయు నొల్లక విడుచు టరయఁ
ద్యాగ మన నొప్పు నిది రాజయోగతిలక! 153

టీ. రాజయోగతిలక = రాజయోగులలో శ్రేష్ఠుఁడా! అరయన్ = విచారింపఁగా, ప్రత్యగాత్మస్వరూపుఁడై = కూటస్థరూపుఁడై, పరఁగుతనకున్ = ఉన్నతనకంటె, అన్య మైనట్టి = వేఱైయున్న, దేహేంద్రియాదిదృశ్యవితతి అంతయున్-దేహ = దేహము, ఇంద్రియ = ఇంద్రియంబులు, ఆది=మొదలైన, దృశ్య = కనఁబడుచున్న పదార్థముల యొక్క, వితతియంతయున్ = సమూహము నంతయును, ఒల్లక=అభిమానింపక, విడుచుట = (భ్రాంతి సిద్ధమని యథార్థస్వరూపజ్ఞానముచే) విడిచి వేయుట (అనఁగా దేహాదులయందు దేహాదిబుద్ధిని వదలి బ్రహ్మబుద్ధిని స్థిరముచేయుట,) ఇది=దృశ్యపరిత్యాగమే, త్యాగమననొప్పున్=త్యాగ మనుయోగాంగ మగును.

తా. రాజయోగులలో శ్రేష్ఠుఁడవగు నోయాంజనేయా! తాను కూటస్థస్వరూపుఁడుకదా! కావున తనకంటె నన్యమై దృశ్యమై (అనఁగాఁ దనచేఁ జూడఁబడునదియై) యుండు దేహాదిసమూహము నంతయును యోగియగువాఁడు సంపూర్ణముగాఁ బరిత్యజించును (అనఁగా వానియందాత్మభావము నుంపఁడు) ఇదియే త్యాగమనుయోగాంగము,

కవిరాజవిరాజితవృత్తము.—
పలుకులకందక భావము నంటక భాసిలుబ్రహ్మము దా నగుచుం
బలుమఱుఁ బల్కక పల్కినచో నవి పల్కితినంచుఁ దలంపక యే
తలఁపులు లేక నిరంతరసౌఖ్యసుధారస మూనుచు నుండుట ని
ర్మలమగుమౌనము మారుతనందన! మౌనక దీని భజింపఁదగున్.154

టీ. మారుతనందన = వాయుపుత్త్రా, పలుకులకున్=వాక్కులకు, అందక=అలవిగాక (అనఁగా చెప్పుటకు సాధ్యము గాక,) భావమున్ = మనస్సును, అంటక = తగులక (అనఁగా మనస్సునకు గోచరుఁడుగాక,) భాసిలుబ్రహ్మము=ప్రకాశించుపరబ్రహ్మమే, తానగుచున్ = తానై, పలుమఱుపల్కక = పలుమాఱులు మాటలాడక, పల్కినచోన్ = ఎప్పుడైనను మాటలాడినను, అవిపల్కితిన్ = 'ఆమాటలను నేను మాటలాడితిని', అంచున్ = అని, తలంపక=సంకల్పింపక (తాను వాగింద్రియమునకును అదిచేయు కార్యములకును శిక్షయె కావున 'మాటలాడినవాఁడను నేనే' యని తనకుఁ గర్తృత్వము కలదని యభిమానింపక), ఏతలంపులేక = ఏసంకల్పములేక, నిరంతరసౌ...సమున్-నిరంతర = సర్వకాలములయందును లేక అవిచ్ఛిన్నమైన, సౌఖ్య = బ్రహ్మానందమనెడు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సుధారసమున్ = అమృతరసమును, అనుచున్=పానము చేయుచు, ఉండుట, నిర్మలము =పరిశుద్ధము, అగుమానము = అయినట్టిమానమను యోగాంగము, దీనిన్ = ఈమానమును, మానక=విడువక, భజింపఁదగున్=సేవింపవలయును.

తా. ఓవాయుపుత్త్రా! అవాఙ్మానసగోచరమైన బ్రహ్మమే స్వస్వరూపభూతమైనదని నిశ్చయించి, యెప్పటికైనను ఏమాటలనైనను మాటలాడక యోగి సదాయాత్మానుభవనిష్ఠుండై యుండును. ఒకవేళ మాటలాడినను 'నేను మాటలాడితిని' అని తలంపఁడు. ఇంత యేల? యాతనికి సంకల్పములే యుండవు. ఇట్టిస్థితి కలిగి సర్వకాలములయందును స్వస్వరూపానందానుభవమును జెందుచుండుటయే మాన మనుయోగాంగము. దీనిని సర్వకాలములయందు నాశ్రయింపవలయును.

సీ. ధీరులచేత నేదేశ మాచార్యోప
దేశంబుచే నర్థిఁ దెలియఁబడియెఁ
బరమపవిత్త్రమై భాసిల్లు నేదేశ
మేదేశ మన్నింటి కెక్కుడయ్యె
నేదేశ మురుమానసేంద్రియప్రాణాది
సంచారశూన్యమై సమత నొప్పు
నేదేశమున సాధ్వసేచ్ఛామదక్రోధ
దుఃఖగంధలవంబు దోఁపకుండుఁ
తే. గరము నిరుపద్రవంబు నిష్కంటకంబు
నిరతిశయమును నిత్యంబు నిర్మలంబు
దివ్య మానంద మగుచు నేదేశ మలరు
నదియె యేకాంతదేశ మాంజనేయ! 155

టీ. ఆంజనేయ! ఏదేశము = ఏస్థలము, ధీరులచేన్=పండితులచేత, ఆచార్యోపదేశంబుచేన్=గురూపదేశమూలమున, అర్థిన్=ఆశతో, తెలియఁబడియెన్=తెలిసికొనఁబడియెను, ఏదేశము, పరమపవిత్త్రమైభాసిల్లున్=మిగులపరిశుద్ధమై ప్రకాశించునో, ఏదేశము, అన్నింటన్=అన్నిటికంటెను, ఎక్కుడయ్యెన్ = శ్రేష్ఠమైయున్నదో, ఏదేశము, ఉరు...న్యమై-ఉరు = అధికమైన, మానస = మనస్సు, ఇంద్రియ = ఇంద్రియములు, ప్రాణ=ప్రాణములు, ఆది = మొదలైనవానియొక్క, సంచారశూన్యమై = సంచారము లేనిదై, సమతన్ = ఏకరూపముతో (లేక నిర్వికారరూపముతో), ఒప్పున్=ప్రకాశించునో, ఏదేశమునన్ = ఏస్థలమునందు, సాధ్వస...లవంబు-సాధ్వస = భయముయొక్కయు, ఇచ్ఛా=కోర్కియొక్కయు, మద=మదముయొక్కయు, క్రోధ=కోపముయొక్కయు, దుఃఖ=దుఃఖముయొక్కయు, గంధ=సంబంధముయొక్క, లవంబు=లేశమైనను,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తో(పఁపఁడుక్ =కానరాకుండును, ఏ దేశము, కరము=మిగుల, నిరుపద్రవంబు=ఉపద్రవములు (అనఁగా బాధలు) లేనిదియు, (అనఁగా దేశము నాశ్రయించిన నెట్టిబాధయుం గలుగదో) నిష్కంటకంబు = ముండ్లు, (అనఁగా ముండ్లవలె క్షణక్షణమునకు బాధించు నట్టి విక్షేపములు) లేనిదియుం, నిరతిశయమును=సర్వాధికమైనదియు, నిత్యంబు=నాశము లేనిదియుం, నిర్మలంబు = పరిశుద్ధమైనదియుం, దివ్యము = లోకోత్తర మైనదియుం, ఆనందము=ఆనందరూపమైనదియుం, అగుచుర్ =ఐ, అలరుర్ = ఒప్పుచున్నదో, అదియె=అస్థలమే, (బ్రహ్మమే) (ఈలక్షణములు పరబ్రహ్మమునకుఁ దప్ప మఱియొకపదార్థమున కుండుట అసంభవమగుటచే నిట్లు చెప్పఁబడెను.) ఏకాంతదేశమార్ = యోగాంగమగు నేకాంత దేశ మనంబడును.

తా. ఓయాంజనేయా! విద్వాంసు లగువారు (లేక బ్రహ్మజ్ఞానార్థు లగుబుద్ధి మంతులు) సద్గురువు నాశ్రయించి మిగుల శ్రద్ధతో నేదేశమును (బ్రహ్మమును) దెలిసి కొందురో, ఏది పవిత్రము లగుపదార్థములకంటెఁ బవిత్రమైయున్నదో, దేనికంటె నధికమగునది మఱియొక్కటి లేదో, దేనియందు మనస్సు నింద్రియములు మొదలగునవి సంచరింపవో, దేని నాశ్రయించిన భయము కామక్రోధాదులు దుఃఖము అనువిక్షోభ కారణము లించుకయైనను గానరావో, ఏది మిగుల పరిశుద్ధమై యానందరూపమై లోకోత్తరమై శాశ్వతమై సర్వాధిక మై యుండునో, దేని నాశ్రయించిన నేవిధము లగుబాధలును గలుగవో, చిత్తాదిచాంచల్యము కలుగదో అట్టిబ్రహ్మమే (లేక బ్రహ్మైక్యసమాధియే) యేకాంత దేశ మనఁబడును. ఇదియే దేశ మనుయోగాంగము.

అవ. ఇట్లు దేశమును వివరించి దానిని విస్తరించుచున్నాఁడు:—

తే. అట్టిసువివిక్తదేశంబు నధిగమించు
ఘనునకు నిరంతరసుఖంబు గలుగుఁగాని
యన్యవిజనంబు నొందుదేహాత్మవాది
కబ్బునే నిర్మలానంద మనిలతనయ! 156

టీ. అనిలతనయ = వాయుపుత్రా! అట్టి సువివిక్తదేశంబుర్-అట్టి = పూర్వోక్తమైన, సువివిక్త = అతినిర్మలమైన, దేశంబుర్ = స్థలమును, అధిగమించుఘనునకుర్ = పొందినమహాత్మునకు, నిరంతరసుఖంబు-నిరంతర = శాశ్వతమైన, సుఖంబు = ఆనందము, కలుగుఁగాని = దొరకును గాని, అన్యవిజనంబుర్ = ఇతరమైన నిర్జనస్థలమును, ఒందు దేహాత్మవాదికిర్-ఒందు = పొందునట్టి, దేహ="దేహమే, ఆత్మ = కూటస్థుఁడు" అని, వాదికిర్=వాదించువానికి, నిర్మలానందము-నిర్మల = పరిశుద్ధ మైన, ఆనందము=బ్రహ్మానందము, అబ్బునే=దొరకునా? (దొరక దనుట.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఓవాయుపుత్త్రా ! పైన వివరింపఁబడిన బ్రహ్మరూపమైన దేశము నాశ్ర యింపఁగలమహాత్ములకు శాశ్వత మగుమోక్షముసుఖము కలుగును, గాని సామాన్యమగు నిర్జనప్రదేశము నాశ్రయించువారికి నట్టిసుఖము లభించునా? దేహాత్మాభిమానము కల వారు మాత్రమే బ్రహ్మరూప మగునేకాంతదేశము లేదనుతలంపుతో దానినే యాశ్ర యింతురు. అజ్ఞానులగుటచే వారికి ముక్తి కలుగదనుట నిర్వివాదాంశమే కదా!

అవ. ఇఁక రెండుపద్యములచే కాల మనుయోగాంగమును వివరించుచు దానిని సన్నుతించుచున్నాఁడు:—

తే. కాల మెద్దానిచేఁ బరికల్పితంబు
నెల్లకాలంబు నొకరీతి నెద్ది వెలుఁగుఁ
గాలనియమంబు లెందేనిఁ గానిపింప
వదియె కాలం బనాది యనంత మనఘ!. 157

టీ. అనఘ = ఓదోషరహితుఁడా, ఎద్దానిచేన్ = దేనిచేత, కాలము = లోకము నందు వ్యవహారములోనున్న నిమిషక్షణాదికాలము, పరికల్పితంబు = కల్పింపఁబడెనో, ఎద్ది=ఏది, ఎల్లకాలంబున్ =సర్వకాలములయందును, ఒకరీతిన్ =ఒకరూపముగా, వెలుఁ గున్ = ప్రకాశించునో, ఎందేనిన్ =ఎచ్చట, కాలనియమంబులు=కాలనియమములు, కానిపింపవు = కానరావో, అదియె = అట్టిపదార్థమే, కాలంబు = కాలమనుయోగాం గము, అనాది=ఆకాలమునకాది లేదు, అనంతము=అంతమును లేదు.

తా. ఓదోషరహితుఁడా! దేనిచే (ఏబ్రహ్మముచేఁ) గాలము సృజియింపఁబడెనో, ఏది సర్వకాలములయందును మార్పులేక నొక్కరీతిగాఁ బ్రకాశించునో, దేనికి భూత భవిష్యద్వర్తమానాదికాలములు (అనఁగా వానిచేఁ గల్గువికారములు, లేక భేదములు) లేవో అట్టిబ్రహ్మమే (లేక అట్టిబ్రహ్మమునందు నిలుచుటయే) కాలము, అనఁగా ఉప రతిని సంపాదించుట కుచిత మైనకాలము. ఈకాలమున కాదియు నంతంబును లేవు. యోగి యీకాలము నే యాశ్రయించును. ఇదియే కాల మను యోగాంగము.

తే. అట్టియాద్యంతరహిత కాలాత్మకాత్ముఁ
డై నిమేషాది యై ప్రళయాంత మైన
కాలమును దూలకణము నఖండదావ
శిఖపగిది మ్రింగి యోగి భాసిల్లు ననఘ. 158

టీ. అనఘ=దోషరహితుఁడా, యోగి=రాజయోగి, అట్టి...త్ముఁడై-అట్టి = అటు వంటి, ఆద్యంతరహిత=మొదలును తుదయును లేని, కాలాత్మక=కాలరూపమైన బ్రహ్మ మే, ఆత్ముఁడై = స్వరూపముగాఁ గలవాఁడై, నిమేషాదియై=నిమేషము మొదలు, ప్రళ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యాంతమయినకాలముఁ = బ్రహ్మప్రళయమువఱకుఁ గలకాలము నంతయు, తూలకణముఁ = స్వల్పమగు దూదిని, అఖండదావశిఖపగిదిఁ = గొప్పదియగు దావాగ్నివలె, మ్రింగి=లయింపఁజేసికొని (అనఁగా కాలము నతిక్రమించి), భాసిల్లుఁ=ప్రకాశించును.

తా. ఓదోషరహితుఁడా! పైన వర్ణింపఁబడినకాలరూపుఁడగుబ్రహ్మమే తానై ప్రకాశించుయోగి, నిమేషము మొదలు ప్రళయమువఱకుఁ గలవ్యవహారసిద్ధమైనకాలము నంతయును దూదిపింజను దావాగ్ని తనయం దడంచికొనునట్లు తనస్వరూపమునందే లీనముఁ జేసికొనును. ఈకాలమును దనకంటె భిన్నముగాఁ జూడఁడు.

క. చలనము కాయక్లేశము, నలసతయును జాడ్యనిద్రలాయాసం బి
మ్ముల నెట్టియునికివలనను, గలుగ వది సుఖాసనం బకల్పిత మనఘా!.

టీ. అనఘ=నిర్మలుఁడా, చలనము=కదలికయును, కాయక్లేశము=శరీరకష్టంబును, అలసతయుఁ=సోమరితనమును, జాడ్యనిద్రలు=జడత్వంబును నిద్రయును, ఆయాసంబు =శ్రమము, ఇమ్ములఁ=అధికముగా, ఎట్టియునికివలనను=ఏస్థితివలనను, కలఁగవు=సంభవింపవో, అది=అట్టిస్థితియే, సుఖాసనంబు = సుఖమైన యాసన మనుయోగాంగము, అకల్పితంబు=ఈయోగాంగము (లేక నీయాసనము) ఎప్పుడుగాని యెవ్వనిచేతను కల్పింపఁబడినది (అనఁగా నిర్మింపంబడినది) కాదు.

తా. ఓదోషరహితుఁడా! తారకసాంఖ్యయోగులయాసనము అవయవసంస్థానభేదములచేఁ గల్పింపఁబడినవే, యొకానొకప్పుడు చాంచల్యము శరీరకష్టము పాలుమాలిక జడత్వము నిద్ర అనువానిని గలిగించునవియే; అమనస్కయోగియొక్కయాసనము శాశ్వతసుఖప్రద మగుబ్రహ్మమే (లేక బ్రహ్మనిష్ఠయె) కావున స్వతస్సిద్ధము. చలనాదులను గలిగింపదు. ఇదియే (యీ బ్రహ్మనిష్ఠయే) యాసన మనుయోగాంగము.

ఆ. ఎద్ది సిద్ధ మగుచు నేప్రొద్దు విలసిల్లు
నరసి చూచి యెద్ది యైన యపుడె
సర్వసిద్ధు లొక్కట సమకూఱు నదియె సి
ద్ధాసనంబు కేవలాత్మరూప!. 160

టీ. కేవలాత్మరూప-కేవల = ఏకరూపమైన, ఆత్మరూప=పరబ్రహ్మమే స్వరూపముగాఁగలవాఁడా, ఎద్ది=ఏది, సిద్ధమగుచుఁ = స్వతస్సిద్ధమై (అనఁగా స్వభావముగానే సర్వకాలములయందు నుండునదియై), ఏప్రొద్దు = అన్నిసమయములయందును, విలసిల్లుఁ=ప్రకాశించునో, అరసిచూచి = విచారించి తెలిసికొని, ఎద్దియైనయపుడె = దేనిస్వరూపమైనప్పుడు, సర్వసిద్ధులు=సమస్తయోగసిద్ధులు, ఒక్కటఁ = ఒక్కమాటే, సమకూఱుఁ=దొరకునో, అదియె=అదే (బ్రహ్మమే), సిద్ధాసనంబు=సిద్ధాసన మగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. పరబ్రహ్మరూపమై మఱియు నేది సర్వకాలములయందును నిత్యసిద్ధమై యున్నదో, విచారపూర్వకముగా దేని నాత్మాభిన్నముగా నెఱింగి యాశ్రయించిన సర్వసిద్ధులు నొక్కమాఱు కలుగునో అట్టిస్థితియే (సహజమైన ముక్తియే) సిద్ధాసనమగును.

ఆ. బంధములకు మూలబంధంబు ప్రకృతి త
దృంధ మెద్ది గనినఁ బాయునపుడె
యఖిలతత్త్వములకు నాదిమూలం బెద్ది
యదియె మూలబంధ మాంజనేయ! 161

టీ. ఆంజనేయ! బంధములకున్ = సమస్తసంసారబంధములకును, మూలబంధంబు = అధారమగుకుదురు, ప్రకృతి = మాయ, తద్బంధము = ఆమాయాబంధము, ఎద్దిగనినపుడె = దేనిని చూచినప్పుడె, పాయున్ = తొలఁగునో, అఖిలతత్త్వములకున్ = సమస్తమైన తత్వములకును (అనఁగా క్షణచిత్తములగు నిరువదినాలిగింటికిని అక్షరతత్వమగు నిరువదిదైదవదానికిని), ఆదిమూలంబు = ఆదికారణము, ఎద్ది = ఏదియో, అదియె = అబ్రహ్మమే, మూలబంధము = మూలబంధమనుయోగాంగము.

తా. ఓయాంజనేయా! సమస్తబంధములకును (అనఁగా సర్వవిధప్రపంచములకును) ప్రకృతియే మూలబంధము (అనఁగాఁ గుదురు). అట్టిప్రకృతి యేమూలకారణము నెఱింగిన లయము నొందునో, యేది సర్వాధార మైనదో అదియే మూలబంధము.

క. వారినిధియందుఁ జెందిన
యేఱులగతిఁ జిత్సుఖమున నింద్రియవృత్తుల్
చేరిసమభావ మొందుట
యారయఁగా దేహసామ్యమగు వాయుసుతా! 162

టీ. వాయుసుతా = వాయుపుత్రా, వారినిధియందున్ = సముద్రమునందు, చెందిన యేఱులగతిన్ = కలిసిననదులవలె, చిత్సుఖమునన్ = జ్ఞానరూపమగు బ్రహ్మానందమునందు, ఇంద్రియవృత్తులు = సర్వేంద్రియవ్యాపారములను, చేరి = కలసి, సమభావమొందుట = ఏకత్వమును జెందుట, ఆరయఁగాన్ = విచారింపఁగా, దేహసామ్యము = దేహసామ్యమనుయోగాంగము, అగున్.

తా. ఓవాయుపుత్రా! సముద్రంబునందుఁ జేరి నామరూపవిహీనములై యైక్యము నొందునదులవలె నీసర్వేంద్రియములును బ్రహ్మానందసముద్రమున మునిఁగి యందే తృప్తి నొంది యుండుట దేహసామ్య మనుయోగాంగ మగును.

అవ. ఇఁక దృక్స్థితి నభివర్ణించుచు దృగ్దృశ్యదర్శనముల విభజించుచున్నాఁడు. అందు మొదట దర్శనమును గూర్చి వివరించుచున్నాఁడు:—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. ఏచూపు సకలబాహ్యేంద్రియార్థంబులఁ
గనునది వెలిచూపు కపికులేంద్ర!
యేచూపు వివిధాంత రేంద్రియవృత్తులఁ
గనునది లోచూపు కపివరేణ్య!
యేచూపు బాహ్యాంత రేంద్రియార్థంబులఁ
గనునది మధ్యలక్ష్యము కుమార!
యేచూపు దగ మానసేంద్రియషట్కంబుఁ
గనునది షణ్ముఖి దనుజవైరి
తే. చూచు నేచూడ్కి యీనాల్గుచూపులను న
జస్ర మది శాంభవీదృష్టి సంగరహిత!
యిదియె యన్నిటిలో నెక్కుడిట్టులగుచుఁ
బరమగుహ్యాతమం బగుఁ బవనతనయ! 163

టీ. కపికులేంద్ర = వానరశ్రేష్ఠా ! ఏచూపు, సకల...బులన్ - సమస్తమైన, బాహ్యేంద్రియ=వెలుపలనుండు నింద్రియములును, అర్థంబులన్ = వాని వెలియంబడు విషయంబులును, కనున్=చూచునో (లేక తెలిసికొనునో), అది=ఆచూపు, వెలిచూపు=వెలుపలిచూపు, అగున్=ఐయున్నది, కపివరేణ్యా = వానరులలో నుత్తముఁడ! ఏచూపు, వివిధాంత...త్తులన్-వివిధ = బహువిధములయిన, అంతరింద్రియ = అంతఃకరణములను, వృత్తులన్=వానివృత్తులను, కనున్, అది, లోచూపు=లోపలిచూపు, అగున్, కుమారా=పుత్రా, ఏచూపు, బాహ్యాంతరింద్రియార్థంబులన్ = లోపల వెలుపల నున్నసర్వేంద్రియములను వానిచేఁ బ్రకాశింపఁజేయఁబడువిషయములను, కనున్, అది, మధ్యలక్ష్యము=మధ్యలక్ష్యము, అగున్, దనుజవైరి = రాక్షసులను మర్దించువాఁడ. ఏచూపు, తగన్=ఒప్పునట్లుగా, మానసేంద్రియషట్కంబులన్ = జ్ఞానేంద్రియములు అయిదును మనసు) ఒకటి కలిసి ఆఱింటిని, కనున్, అది, షణ్ముఖీ=షణ్ముఖీముద్రయందలి లక్ష్యము, అగున్, సంగరహిత = అభిమానము లేనివాఁడా, ఏచూడ్కి = ఏచూపు, ఈనాల్గు చూపులన్ = పయి చెప్పిననాలుగుదృష్టులను, అజస్రము = ఎప్పుడును, చూచున్=చూచుచుండునో, అది, శాంభవీదృష్టి=శాంభవీముద్ర, పవనతనయా = వాయుపుత్రా, ఇదియె=ఈశాంభవీదృష్టియే, అన్నిటిలో నెక్కుఁడు = అన్నిటికంటె శ్రేష్ఠమైనది, ఇట్టులగుటన్ = కాఁబట్టి, పర...బగున్ - పరమ = అధికముగా, గుహ్యాతమంబగున్ = రహస్యమగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఓవానరశ్రేష్ఠా! ఇఁకదృక్స్థితిని (అనఁగా దృక్రూపముతో; సాక్షిరూపముతో నుండుట) యనుయోగాంగమును వివరించెదను వినుము. దీనిని తెలిసికొనుటకు మొట్టమొదట దృశ్యమును (అనఁగా 'ఇవి చూడఁబడుపదార్థములు') అని తెలిసికొనవలయును. దర్శనమును (అనఁగా చూపును) గూర్చియుం దెలియఁగవలెను. అందు దర్శనమునుగూర్చి యిప్పుడు వివరింతును. తారకయోగంబునందుఁ జెప్పఁబడినట్లే యిచ్చట చూపునకు బాహ్యాంతరమధ్య భేదములును షణ్ముఖీశాంభవీముద్రలును గలవు.

అది యెట్లనిన; జ్ఞానరూపుఁడగుసర్వసాక్షి (స్వస్వరూపభూతుఁడగుబ్రహ్మము) వెలుపల నున్నశబ్దాదులను లోపలనున్న చిత్తేంద్రియాదులను జూచుచునే యున్నాఁడు. కావున నిందు బాహ్యపదార్థములఁ జూచుచూపు ("వెలిచూపు=బహిర్లక్ష్యము")అనియు చిత్తేంద్రియాదులఁ జూచుచూపు 'లోచూపు=అంతర్లక్ష్యము' అనియుఁ జెప్పఁబడును. ఓపుత్రా! యిట్లే బాహ్యాంతరపదార్థములఁ గలయఁ జూచుచూపు మధ్యలక్ష్య మనియు మనస్సునకును జ్ఞానేంద్రియములకును గలసంబంధమును, లేక మనస్సు జ్ఞానేంద్రియ మూలముగా వెలుపలికి వ్యాపించి విషయములఁ బ్రకాశింపఁజేయుంటయును, లేక మనస్సొకటి జ్ఞానేంద్రియము లైదును గలిసి యాఱింటిని జూచుచూపు 'షణ్ముఖీముద్ర' యనియు, పైఁజెప్పిన నాల్గుచూపులను జూచునట్టిచూపు 'శాంభవీ' యనియుఁ జెప్పఁబడుచున్నది. ఈశాంభవీ సర్వోత్తమము; పరమరహస్యము; ఇదియే దర్శనము; దీని దెలియుటయే దర్శనస్వరూపము దెలియుట.

ఎట్లనిన; పైఁ జెప్పినవిషయముల నన్నిటిని సర్వసాక్షియొక్కఁడై చిత్తేంద్రియ మూలముగా వ్యాపించి ప్రకాశింపఁజేయుచున్నను, (అనఁగా చూచుచున్నను) తత్త్వజ్ఞానము లేనివారు బహువిధములుగా భావించుచున్నారు. బాహ్యవిషయములఁ జూచునవి యింద్రియములేయనియు నాయింద్రియములఁ జూచునది చిత్తవృత్తియే యనియు దానిని బుద్ధి చూచుననియుఁ దలంతురు. ఇందు ఇంద్రియములదృష్టి 'వెలిచూపు' అనియు చిత్తవృత్తియొక్కయు బుద్ధియొక్కయు లేక అంతఃకరణమంతయు నొక్కటియేయను పక్షమునాశ్రయించి మనస్సుయొక్కదృష్టి 'లోచూపు' అనియుఁ జెప్పఁబడును. కొంత విచారించిన మనస్సును జూచునదియే యింద్రియములను బాహ్యపదార్థములను గూడఁ జూడఁగలదని యేర్పడును. గావున నాబుద్ధిదృష్టియే 'మధ్యలక్ష్యము' అని వ్యవహరింపఁబడుచున్నది. ఆకారణమువలననే (అనఁగా ఇంద్రియమనంబులను జూడఁగలది యగుట చేతనే) అదియే (ఆబుద్ధివృత్తియే) 'షణ్ముఖీముద్ర' యనియు వర్ణింపఁబడియున్నది. ఈవిధముగా భ్రాంతుల యనుభవమునుబట్టి వారి నుద్ధరించుటకై దర్శనముల సోపానక్రమమున బోధించి శాంభవీముద్ర యనుపేర పరమార్థ తత్త్వము బోధింపఁబడియున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"పైవివరించిన దర్శనములు నాలుగును తనకు దృశ్యము లగుచున్నవి" (అనఁగాఁ దనచేఁ జూడఁబడుచున్నవి) యనుటకు సందియము లేదు. "నేను శ్రోత్రేంద్రియముచే వినుచున్నాను. నాచెవికి నేమియుఁ వినరాలేదు. నామనస్సు పుణ్యకార్యములనే సంకల్పించును. నేను బుద్ధిచే సర్వమును దెలిసికొనుచున్నాను" అను మొదలగు ననుభవము విషయమునఁ బ్రమాణములు కదా! కావునఁ దాను సర్వసాక్షి; తనస్వప్రకాశమే నాల్గుమూపులఁ జూచునట్టి శాంభవీముద్ర. ఈవిషయము నంతయు బాగుగా విమర్శించి శాంభవీముద్రయే సర్వోత్తమము; ఇదియే దర్శనము అని వివరింపఁబడెను. వాస్తవస్థితిలో పరబ్రహ్మప్రకాశమే చిత్తాదిమూలమున సర్వమును జూచుచున్నది. గాని యన్యమేమియుం లేదు. కావున దర్శన మనఁగా నిదియే కదా.

మానినీవృత్తము.—

దృశ్యమె నాకము దృశ్యమె వాయువుదృశ్యమెభూజలతేజములున్
దృశ్యమెదేశముదృశ్యమెకాలముదృశ్యమెదేహమునింద్రియముల్
దృశ్యమె ప్రాణముదృశ్యమె చిత్తము దృశ్యమహంకృతిధీమనముల్
దృశ్యమెవిద్యయుదృశ్యమవిద్యయుదృశ్యముగానిదిదృక్కరయన్.

టీ. అరయన్=విచారింపఁగా, నాకము = ఆకాశము, దృశ్యమె = చూడఁదగినదియె, వాయువు, దృశ్యమె, భూజలతేజములు = భూమి నీరు అగ్ని, దృశ్యమె, దేశము = స్థలము, దృశ్యమే, కాలము, దృశ్యమే, దేహమును, దృశ్యమే, ఇంద్రియములు, దృశ్యమె, ప్రాణము, దృశ్యమె, చిత్తము = సంశయాత్మకమైన యంతఃకరణవృత్తి, దృశ్యమె, అహంకృతిధీమనములు-అహంకృతి = అహంకారము, ధీ = బుద్ధి, మనములు=మనస్సు, దృశ్యము, విద్యయున్=జ్ఞానమును, దృశ్యమె, అవిద్యయున్ = అజ్ఞానంబును, దృశ్యమె, దృశ్యముగానిది = ఏది పరులచేఁ జూడంబడక తానన్నిటినిఁ జూచునో అదియే, దృక్కు=సాక్షి (ఇదియే దృక్స్థితి యను యోగాంగము.)

తా. బాహ్యములగు నాకాశాది పంచభూతములును దేశ కాలములును స్థూలదేహ స్థూలేంద్రియములును అంతరములగు సూక్ష్మకారణ దేహములును ఇంద్రియ ప్రాణచిత్త మనోహంకారబుద్ధులును జ్ఞానాజ్ఞానములును దృశ్యములే (అనఁగా పైన నిరూపింపఁబడిన దర్శనముచే నెఱుంగఁదగినవియే.) ఈవిధముగా నిరూపింపఁబడిన దృశ్యముల నెఱుఁగువాఁ డెవ్వఁడో వాఁడే ద్రష్టపుఁడు. వాఁడే స్వస్వరూపభూతుఁడు. "ఈద్రష్టపుఁడే తాను" అని తెలిసికొని స్థిరచిత్తముతో దృక్ స్థితి అను యోగాంగము.

తే. ద్రష్టృదర్శనదృశ్యవిరామ మెచట
నగు నచట దృష్టి నిలుపంగ నగును గాని


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చెదరి నాసాగ్రమునఁ జూపుఁ జేర్పఁదగదు
కోరి యమనస్కరాజయోగులకు వత్స! 165

టీ. వత్స=పుత్త్రా! అమన...గులకున్-అమనస్క=అమనస్కమనెడు, రాజ=శ్రేష్ఠమైన, యోగులకున్ = జ్ఞానయోగము గలవారికి (అనఁగా జ్ఞానయోగము నాశ్రయించినవారికి), ద్రష్టృ...మము-ద్రష్టృ=చూచువాఁడు, దర్శన = చూపు, దృశ్య=చూడఁబడునది, విరామము=వీనివిలయము, ఎచటనగున్=ఏస్థలమునందగునో, అచటన్=ఆస్థలమునందె, దృష్టి నిలుపంగనగునుగాని=లక్ష్యమును నిలుపవలయును గాని, చెదరి=అచ్చట నిలుపనేరక, నాసాగ్రమునన్ = ముక్కుకొనపై, చూపున్, చేర్పఁదగదు=నిలుపకూడదు.

తా. ఓపుత్త్రా! చూపు చూచువాఁడు చూడఁబడునది అను భేదము లెచట నుండవో అట్టి స్థలమునందే (స్వస్వరూపమునందే) దృష్టిని నిలుపవలయును గాని తారకయోగులవలె నాసాగ్రమునందు (దృష్టి) నిలుపరాదు. అమనస్కయోగి యట్లు జేయఁడు. దానివలనఁ బ్రయోజన మేమియు లేదుకదా! ఇదియే దృక్స్థితి యను యోగాంగము.

అవ. ఇకఁ బ్రాణాయామము నిరూపించుచున్నాఁడు:—

శా. ప్రాణాంతఃకరణేంద్రియాద్యఖిలసద్భావంబులన్ భూషణ
శ్రేణిన్ స్వర్ణముగా నెఱింగినగతిం జిన్మాత్రముం గాఁగఁ ద
త్ప్రాణాంతఃకరణాదివృత్తులు నశించుం దన్నుఁగాఁ గాంచినం
బ్రాణాయామ మనంగ నొప్పు నిది సంభావ్యంబు మేధానిధీ! 166

టీ. మేధానిధీ, మేధా = సూక్ష్మబుద్ధికి ("ధీర్ధారణావతీ మేధా" = సూక్ష్మముగా గ్రహించి చిరకాలము జ్ఞప్తియందుంచుకొనఁగల సామర్థ్యము గలిగిన బుద్ధి మేధ యనఁబడును). నిధీ = ఆధారభూతుఁడా, భూషణశ్రేణిన్ = అనేకవిధములగు సొమ్ములను, స్వర్ణముగాన్ = సువర్ణముగా, ఎఱింగినగతిన్ = తెలిసికొనునట్లు, ప్రాణా...బులన్, ప్రాణా=ప్రాణములు, అంతఃకరణేంద్రియాది=అంతఃకరణములు ఇంద్రియములు మొదలగు, అఖిల = సమస్తమయిన, సత్ = "ఉన్నది" అని చెప్పఁబడు (అనఁగా సత్తుతోఁగూడిన), భావంబులన్ = భావపదార్థములను, చిన్మాత్రముగాఁగన్ = జ్ఞానరూపముగా, తన్నుఁగాఁగాంచినన్=స్వస్వరూపముగా నెఱింగినచో, తత్ప్రాణాం...వృత్తులు-తత్=ఆప్రాణ = ప్రాణములు, అంతఃకరణాది = అంతఃకరణములు మొదలగువానియొక్క, వృత్తులు=వ్యాపారములు, నశించున్=శూన్యరూపములగును, ఇది = ఈవర్ణించినస్థితియే, ప్రాణాయామమనఁగనొప్పున్=ప్రాణాయామ యోగమని చెప్పఁబడును. సంభావ్యంబు=ఈయోగాంగము మిగుల గౌరవనీయమైనది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఓ బుద్ధిమంతుఁడా! ప్రాణము మనస్సు ఇంద్రియములు మొదలగు సర్వ దృశ్యపదార్థములును, కిరీటకుండలాది భూషణముల స్వర్ణమాత్రములుగా నెఱుఁగునట్లు బ్రహ్మమాత్రములుగా నెఱుంగవలయును. కారణములకంటె కార్యములు వేఱుకానేరవు కదా! ఇట్లు గ్రహించిన నాప్రాణాదులన్నియుఁ శూన్యరూపములగును. (అనఁగా వాని వృత్తులు ఆపురుషుని బాధింపవు.) ఈవిధముగా సర్వమును స్వస్వరూపమాత్రముగాఁ జూచుటయే ప్రాణాయామ మను యోగాంగము. యథార్థస్థితి నెఱుంగుట యగుటచే నిది మిగుల గౌరవనీయము. భ్రాంతిసిద్ధమగుటచే నీప్రపంచమునకు జ్ఞానమునకంటె నితరమగురూపమే లేదనియు,అజ్ఞానమే బ్రహ్మము కావున నదియే జగత్కారణమనియు, కారణకార్యములకు భేదము లేదనియు నిదివఱకే వివరించియున్నాము కదా!

అవ. ఇట్లు ప్రాణాయామమును వర్ణించి రేచక పూరక కుంభకముల స్వరూపము నిఱూపించుచున్నాఁడు:—

మ. వెలిలోఁ గన్పడు నామరూపవితతిన్ వేమాఱు రేచించి యి
మ్ముల సచ్చిత్సుఖరూపతత్త్వము మదిం బూరించి యామీఁద ని
శ్చలమై తన్మయమై తగన్ మనము నశ్రాంతంబు గుంభించినన్
నలువొప్పన్ బుధసేవ్యమైతనరుప్రాణాయామయోగంబగున్. 167

టీ. వెలిలోన్=వెలుపలను లోపలను, కన్పడు...వితతిన్-కన్పడు=తోఁచునట్టి, నామ = నామముల యొక్కయుఁ, రూప=రూపములయొక్కయు (అనఁగా నామరూపాత్మకము లైనప్రాపంచిక పదార్థములయొక్క), వితతిన్=సమూహమును, వేమాఱు= పలుమాఱు, రేచించి=వెలుపలికిపాఱఁదోలి (అనఁగా నిషేధించి), ఇమ్ములన్=బాగుగా, సచ్చిత్సుఖరూపతత్త్వమున్ = సచ్చిదానందరూప మగుపరబ్రహ్మతత్త్వమును, మదిన్= మనస్సునందు, పూరించి = నించిచి (అనఁగా మనసునందు రెండవసంకల్పము లేకుండ చేసి), ఆమీఁదన్ = పిదప, నిశ్చలమయి = చాంచల్యములేనిదై, తన్మయమయి=బ్రహ్మ రూపమై, తగన్ = ఒప్పునట్లుగా, అశ్రాంతంబు=ఎల్లప్పుడును, మనమున్ = మనస్సును (లేక అంతఃకరణము), కుంభించినన్ = నిరోధించినచో, నలువొప్పన్=యుక్తముగా, బుధసేవ్యమయి = పండితులచే సేవింపఁదగినదై, తనరు ప్రాణాయామయోగంబు=ఒప్పునట్టి ప్రాణాయామయోగము, అగున్=ఐ యున్నది.

తా. నాసికారంధ్రములనుండి వాయువును విడుచుట రేచక మనియు లోపలికిఁ బూరించుట పూరక మనియు లోపలనే నిలిపియుండుట కుంభక మనియుఁ దారకయోగమునఁ జెప్పఁబడియున్నది కదా! అట్లే యిచ్చటను బ్రాణాయామయోగాంగమునకును రేచకపూరకకుంభకములు కలవు. వెలుపల తనకంటె నన్యముగాఁ గానవచ్చు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నామరూపముల నన్నిటి నాత్మ కాదని విడుచుట రేచకము. సర్వపదార్థములయందు నాత్మను జూచుట సర్వప్రపంచమునందు నాత్మను నింపుట పూరకము. లేక మనస్సునందు 'పరమేశ్వరుఁడే సర్వవ్యాపకుఁడు' అని తలంచుచు నేయే సంకల్పములు గలిగి ఏయేవస్తువులు గోచరము లైనను వానినంతయు నాత్మమాత్రముగానే చూచుట పూరకము. మనస్సును నిశ్చలముఁ జేసి సర్వకాలములయందును పరబ్రహ్మమునందే నిల్పుట కుంభకము. ఈమూఁడును గలసి ప్రాణాయామ మనుయోగాంగ మగును.

క. సత్యానృతవిషయంబులఁ, బ్రత్యగ్బోధస్వరూపపరమాత్మునిగా
నిత్యము నవలోకించుట, ప్రత్యాహారం బనంగఁబరఁగుఁ గపీంద్రా!

టీ. కపీంద్రా=వానరశ్రేష్ఠా! సత్యానృతవిషయంబులన్-సత్య=సత్యములని చెప్పంబడునట్టియు, అనృత = అసత్యము లని (అనఁగా లేవని చెప్పంబడునట్టియు), విషయంబులన్ = పదార్థములను, ప్రత్య...నిఁగాన్-ప్రత్యగ్బోధస్వరూప = కూటస్థజ్ఞానరూపుఁడైన, పరమాత్మునిగాన్=పరబ్రహ్మమునుగా, నిత్యమున్=ఎల్లప్పుడును, అవలోకించుట= తెలిసికొనుట, ప్రత్యాహారం బనంగఁబరఁగున్ = ప్రత్యాహార యోగాంగమని చెప్పఁబడును.

తా. మఱియు ఓవానరశ్రేష్ఠా! భ్రాంతులగువారు ప్రపంచమునందలి కొన్నిపదార్థములు సత్యములనియు మఱికొన్నిటి నసత్యము లనియుఁ జెప్పుచున్నారు. వాస్తవస్థితిలోఁ బ్రపంచ మంతయు శూన్యరూపమేయైనను, అల్పకాలము నివసించి యుండు వాని నసత్యములనియుఁ గొంతయాలస్యముగా నుండువానిని సత్యములనియు వ్యవహరించుచున్నారు. యిట్టి సత్యత్వాసత్యత్వములఁదొలఁగించి సర్వకాలములయందును సర్వపదార్థములను కూటస్థమాత్రములనుగాఁ జూచుట ప్రత్యాహార మను యోగాంగము. ప్రత్యాహార మనఁగా మఱలించుట యని యర్థము. పైన వర్ణింపఁబడిన స్థితియందు విషయములయందలి విషయత్వము త్రిప్పఁబడి బ్రహ్మత్వ మారోపింపఁబడినవి గావున నీస్థితికి ప్రత్యాహార మను పేరు కలిగినది.

తే. మహితదేహేంద్రియప్రాణమానసాది
దృశ్యములు గాను నే వీనిఁ దెలియుచుండు
దృక్స్వరూపుఁడ ననుచుఁ జింతించు టరయ
ధ్యానయోగంబు బ్రహ్మవిద్యానిధాన! 169

టీ. బ్రహ్మవిద్యానిధాన = బ్రహ్మజ్ఞానము కలవాఁడా, మహిత...ములు-మహిత =ఒప్పుచున్న, దేహ = దేహములు, ఇంద్రియ=ఇంద్రియములు, ప్రాణ=ప్రాణములు, మానసాది = మనస్సు మొదలగు, దృశ్యములు = సాక్షిచేఁ జూడఁబడుపదార్థములు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాను = నేనుకాను, నేన్ = నేను, వీనిన్ = ఈదృశ్యములనన్నిటిని, తెలియఁచున్ = తెలిసికొనుచు, ఉండుదృక్‌స్వరూపుఁడన్ = ఉన్నట్టిసాక్షిరూపుఁడను", అనుచున్ = అని, చింతించుట = ఎప్పుడు ధ్యానించుట, అరయన్ = విచారింపఁగా, ధ్యానయోగంబు = ధ్యాన మనుయోగాంగము.

తా. బ్రహ్మజ్ఞానమున కాధారభూతుఁడ వగునో యాంజనేయా! మనస్సు దేహము ఇంద్రియములు మొదలగు దృశ్యపదార్థములు నాకు స్వరూపభూతములు కావు. నేను వీనికి 'సాక్షిని' అని సర్వకాలములయందును దలంచుచుండుటయే ధ్యానమగుయోగాంగము.

క. మది యెద్ది దలఁచు మది యె
యృది గనుఁగొను నదియె బ్రహ్మ మను నగ్గుఱి నా
హృదయంబున నిలుపుట దీ
నదయాపర! పరమధారణాయోగ మగున్. 170

టీ. దీనదయాపర = దీనులయందుదయగలవాఁడా, మది = మనస్సు, ఎద్దిదలఁచున్ = దేనిని సంకల్పించునో, ఎయ్యది గనుఁగొనున్ = దేనిని చూచునో, అదియే = అదే, బ్రహ్మము = పరబ్రహ్మము, అగునగ్గుఱిన్ = అనులక్ష్యమును, ఆహృదయంబుననిలుపుట = ఆమనసునందు స్థిరముఁజేయుట, పరమధారణాయోగము = శ్రేష్ఠమగుధారణ యను యోగాంగము, అగున్ = ఐయున్నది.

తా. మఱియు దీనులయందు దయగల యోయాంజనేయా! మనస్సు దేనిదేనిని సంకల్పించునో తనవృత్తిచే దేనిదేనిని బ్రకాశింపఁజేయునో దానిదానిని బ్రహ్మమాత్రమునుగానే (అనఁగా నాత్మకంటె నభిన్నముగానే) చూచుట ధారణయను యోగాంగము.

క. సర్వావస్థలయందును, సర్వంబును బ్రహ్మ మనుచు సతతము గనినన్
సర్వవికృతిరహితసహజ, నిర్వాణసమాధి యగు వినిర్మలరూపా!.

టీ. వినిర్మలరూపా = పరిశుద్ధమగు స్వరూపము గలవాఁడా, సర్వావ...యందున్-సర్వ = సమస్తమైన, అవస్థలయందున్ = స్థితులయందును, సర్వంబును = సమస్తపదార్థములును, బ్రహ్మమనుచున్ = "పరబ్రహ్మమే"యని, సతతముగనినన్ = ఎప్పుడును తెలిసికొనుచుండినచో, సర్వ...మాధి-సర్వ = సమస్తమయిన, వికృతి = వికారములు, రహిత = లేని, సహజ = స్వభావసిద్ధమైన, నిర్వాణసమాధి = నిర్వికల్పసమాధి (లేక మోక్షరూపమైన సమాధి,) అగున్ = అగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. నిర్మలమగు బ్రహ్మరూపముకల యోమహాత్మా! జాగ్రదాదిసర్వావస్థల యందును అనుభవింపఁబడు సర్వపదార్థములను (అనఁగా భ్రాంతులచే భిన్న భిన్నములుగా భావింపఁబడుచున్న ద్రష్టృదర్శన దృశ్యములను మాఁటిని) బరబ్రహ్మమాత్రములుగాఁ జూచుచు నుండుటయే సమాధియని యోగాంగము. ఇదియే ముక్తి ఇది స్వభావసిద్ధమేకాని సాధన సాధ్యము కాదు. సాధనసాధ్యము లయినవాని కన్నిటికి ననిత్యత్వము కలదు. మోక్షమున కవి లేదుకదా. మఱియుం బరబ్రహ్మమే (అనఁగా నాత్మయే) మోక్షము. కావున నది యోగాంతక మనుటకే వీలు లేదు కదా.

అవ. ఇట్లు యోగాంగముల వివరించి యుపసంహరించుచున్నాఁడు:—

క. ఈపదియేనంగంబుల, దీపితవిజ్ఞానసూక్ష్మదృష్టి ననిశముఁ
జేపట్టి యభ్యసించుమ,హాపురుషున కబ్బుఁ బరమమగునుపరమమున్.

టీ. ఈపదియేనంగంబులన్-ఈపదియేను = ఈచెప్పఁబడిన పదునైదు సంఖ్యలుగల, అంగంబులన్ = అవయవములచే, దీపిత...దృష్టిన్-దీపిత, విజ్ఞాన = అనుభవజ్ఞానమయమైన, సూక్ష్మదృష్టిన్=సూక్ష్మదృష్టిని, అనిశమున్ = ఎల్లప్పుడును, చేపట్టి = అంగీకరించి, అభ్యసించుమహాపురుషునకున్=అలవాటు చేయునట్టి మహాత్మునకు, పరమము = మిగులశ్రేష్ఠము, అగు=ఐనట్టి, ఉపరమమున్=ఉపరతి, అబ్బున్=దొరకును.

తా. ఈవిధముగా పైన వర్ణింపఁబడిన పదునేను సాధనములను సంపాదించి జ్ఞానవంతుఁడై సర్వకాలము నాత్మబ్రహ్మైక్యనిష్ఠ నభ్యసించిన నాయోగికి సంపూర్ణమగు నుపరతిసుఖము కలుగును.

## చిత్తలయము గలపురుషునిలక్షణము.

క. చిత్తోపరమము గలపురు
షోత్తముఁడు జగంబు మఱచి యుండుఁన్ బాలో
న్మత్తపిశాచనిభుండై
యెత్తఱి సుప్తునికరణి నిరింద్రియుఁ డగుచున్. 173

టీ. చిత్తోపరమము గలపురుషోత్తముఁడు = చిత్తశాంతి గలపురుషశ్రేష్ఠుఁడు, నిరింద్రియుఁడగుచున్ = ఇంద్రియములు (అనఁగా నింద్రియవికారములు లేనివాఁడై), బాలో...భుండై-బాల = బాలునితోను, ఉన్మత్త = పిచ్చివానితోను, పిశాచ = గ్రహావేశముగలవానితోను, నిభుండై = సమానుఁడై, ఎత్తఱిన్ = సర్వకాలములయందును, సుప్తుకరణిన్=నిదురించువానివలె, జగంబున్=ప్రపంచమును, మఱచియుండున్.

తా. ఇట్లు చిత్తశాంతి కలిగినపురుషశ్రేష్ఠుఁడు సర్వకాలములయందును ప్రపంచమును మఱచి యింద్రియవికారములు లేక బాలునివలెను పిచ్చివానివలెను గ్రహావిష్టునివలెను నిదురించువానివలెను ప్రవర్తించుచుండును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. గాలిం దూలిన వానచేఁ దడిసినన్ గాఢాగ్నిచేఁ గాలినన్
వ్యాలం బాత్మవిముక్తకంచుకముపై వ్యామోహముం దాల్పన
ట్లాలోలాంగముపై నిరూఢమమతాహంకారము ల్లేక యా
త్మాలోకస్థితి నుండుఁ బండితుఁడు నిత్యానందముం బొందుచున్.

టీ. గాలిందూలినన్ = గాలిచే కదలినను, వానచేఁదడిసినన్, గాఢాగ్నిచేన్ = అధికమగునగ్నిచే, కాలినన్, వ్యాలంబు = సర్పము, ఆత్మ...ముపైన్ = ఆత్మ=తనచే, విముక్త=విడువఁబడిన, కంచుకముపైన్=కుబుసముమీఁద, వ్యామోహముం దాల్పనట్లు= అభిమానమును వహింపనట్లు, పండితుఁడు = బ్రహ్మజ్ఞాని, ఆలోలాంగముపైన్-ఆలోల= చంచలమైన (అనఁగా నాశయుక్తమైన, లేక యసద్రూపమైన), అంగముపైన్ = శరీరముమీఁద, నిరూఢ...ములు-నిరూఢ = అనాదినుండియు దృఢమైయున్న, మమతా= మమకారము (అనఁగా ఇది నాది యను నభిమానము), అహంకారములు = అహంకారము (అనఁగా నేను అను నభిమానము), లేక, నిత్యానందమున్=శాశ్వతమగు బ్రహ్మానందమును, పొందుచున్, ఆత్మా...స్థితిన్-ఆత్మ=స్వస్వరూపమును, ఆలోక = చూచుట యనెడు, స్థితిన్=అవస్థయందు, ఉండున్.

తా. మఱియు నాజ్ఞాని యెల్లప్పుడును బరమానందము ననుభవించుచు నాత్మావలోకన పరాయణుండై యుండుచుఁ దనశరీరముపై (లేక శరీరములపై) నహంకారమమకారముల (అనఁగా 'నేను నాది' అను నభిమానముల) నించుకయైన నుంపఁడు. సర్పము తాను విడచిన కుబుసము గాలి కటు నిటుఁ దిరిగినను వానచేతఁ దడిసినను అగ్నిచే మండినను దానిపై నించుకయైన నభిమానము నుంపనట్లు (ఆయోగియు) తన దేహ మెట్లైనను లక్ష్యము సేయఁడు.

మ. మదిరాపానమదాంధుఁ డాత్మపటమున్ మైనుండినన్ జాఱినన్
వదులై వ్రేలినఁ జూడఁ డప్పగిది జీవన్ముక్తుఁ డుద్యత్సమా
ధిదశాప్రాప్తసుఖామృతానుభవతృప్తి న్మత్తుఁడై మేను నె
మ్మదిఁ గూర్చుండిన లేచినన్ నడిచినన్ మన్నింపఁ డేనంచుఁ దాన్.

టీ. మదిరా...దుఁడు-మదిరాపాన=మద్యపానమువలనఁ గలిగిన, మద=మదముచేత, అంధుఁడు=గ్రుడ్డియైనవాఁడు (అనఁగా నొడ లెఱుఁగనివాఁడు), ఆత్మపటమున్= తనవస్త్రమును, మైనుండినన్ = శరీరముమీఁద నిలిచినను, జాఱినన్ = క్రిందపడినను, వదులై=వదలి, వ్రేలినన్=వ్రేలాడినను, చూడఁడు, అప్పగిదిన్=అట్లె, జీవన్ముక్తుఁడు = జీవన్ముక్తినిఁ జెందినవాఁడు, ఉద్యత్...తృప్తిన్-ఉద్యత్ = అధికమైన, సమాధిదశా = నిర్వికల్పసమాధిస్థితియందు, ప్రాప్త=కలిగిన సుఖ=బ్రహ్మానందసుఖముయొక్క, అమృత=

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అమృతముయొక్క, అనుభవ = అనుభవించుటవలనఁ గలిగిన, తృప్తిన్ = తృప్తిచేత, మత్తుఁడై=మదించి, మేను=శరీరము, నెమ్మదిన్=శాంతముగా, కూర్చుండినన్, లేచినన్, నడిచినన్, తాన్=స్వయముగా, ఏనంచున్ = "నేను కూర్చుంటిని నేను, లేచితిని, నేను నడచితిని" అని, మన్నింపఁడు=తలంపఁడు.

తా. మద్యపానమువలన మత్తుఁడైనపురుషుఁడు తనవస్త్రము వీడినను వీడకున్నను జాఱుచున్నను లక్ష్యము సేయనట్లు యోగియుఁ దనశరీరము కూర్చున్నను లేచినను నడిచినను లక్ష్యము సేయఁడు. అం దాత్మాభిమానము నుంపఁడు.

మ. తరుణీనందనబంధుసాధురిపుమిత్రవ్రాతము ల్తన్నుఁ బ
ల్మరు నిందించిన సన్నుతించిన మహామానావమానాదులన్
నెఱి నొందించిన నిర్వికారుఁ డగుచున్ నిశ్చేష్టుఁడై యుండుభా
స్వరతత్త్వానుభవజ్ఞుఁ డెయ్యెడల జీవత్యక్తదేహస్థితిన్. 176

టీ. 'భాస్వర...జ్ఞుఁడు-భాస్వర = స్వయంప్రకాశమైన, తత్త్వానుభవజ్ఞుడు = బ్రహ్మస్వరూపాపరోక్షానుభవముగలవాఁడు, ఎయ్యెడలన్ = ఎప్పటికిని, తన్నున్=తనను, పల్మరున్=పలుమాఱు, తరుణీ...ములు-తరుణీ=స్త్రీలయొక్కయు, నందన = పుత్రుల యొక్కయు, బంధు=బంధువులయొక్కయు, సాధు=సత్పురుషులయొక్కయు, రిపు = శత్రువులయొక్కయు, మిత్ర=మిత్రులయొక్కయు, వ్రాతములు = సమూహములు, నిందించినన్, సన్నుతించినన్ = కొనియాడినను, మహామానావమానాదులన్ = అధికమగు పూజనుగాని తిరస్కారములనుగాని, నెఱిన్=అధికముగా, బొందించినన్=పొందునట్లు చేసినప్పటికిని, నిర్వికారుఁడగుచున్=ఏవికారములును జెందక, నిశ్చేష్టుఁడై = ఏ కర్మలను (అనఁగా పరిహారోపాయములు మొదలగువానిని) చేయక, జీవన్ముక్తదేహస్థితిన్=ప్రాణములేని శరీరమువలె, ఉండున్.

తా. మఱియు స్త్రీలు పుత్త్రులు బంధువులు శత్రువులు మిత్రులు సజ్జనులు దుర్జనులు మొదలగువారందఱును దన్ను నిందించినను స్తోత్రముఁజేసినను సన్మానించినను అవమానించినను రాగద్వేషములఁజెందక యోగి ప్రాణహీనమగు దేహమువలె నిశ్చేష్టుండై యుండును.

ఆ. బహుళసంకటములు ప్రాప్తంబు లైనచోఁ
దల్లడింపఁ డాత్మతత్త్వవిదుఁడు
వాయుశీతవహ్నివర్షాతపంబుల
కించు కైన గిరి చలించనట్లు. 177

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. గిరి=కొండ, వాయు...లకు-వాయు=గాలికిని, శీత=చలికిని, వహ్ని = నిప్పుకును, వర్ష=వానకును, ఆతపంబులకున్=ఎండకును, ఇంచుకైనన్=కొంచెమైనను, చలించనట్లు=కదలకుండునట్లు, ఆత్మతత్త్వవిదుఁడు = తన యథార్థస్వరూపము నెఱింగిన మహాత్ముఁడు, బహుళ...ములు-బహుళ=అనేకములైన, సంకటములు = కష్టములు, ప్రాప్తంబులైనచోన్=వచ్చినప్పుడు, తల్లడింపఁడు=కలఁతఁజెందఁడు.

తా. గాలి వాన చలి ఎండ మొదలగువానికి పర్వత మించుక యైనను కదలని విధంబున బ్రహ్మాత్మైక్యజ్ఞానము కలయోగి యెన్నికష్టములు వచ్చినను కలఁతనొందఁడు.

—వైరాగ్యబోధోపరతులుగల యోగిలక్షణము.—

వ. ఇట్టి వైరాగ్యబోధోపరతియుక్తుం డైనజీవన్ముక్తుఁడు ప్రత్యగభిన్న బ్రహ్మతత్త్వసాక్షాత్కార ప్రచండమార్తాండప్రకాశనిరస్తానాద్యనిర్వచనీయాజ్ఞానాంధకారపటలుండు పరిత్యక్తవర్ణాశ్రమాచార కోలాహలుండు నిరంతరచిత్తవిశ్రాంతిపరాయణుండు విషయాసక్తి విపర్జితుండు ప్రబలప్రారబ్ధాధీనశరీరచేష్టుం డంతస్సుఖుం డంత రారాముం డంతఃప్రకాశుం డాత్మరతుం డాత్మతృప్తుం డాత్మసంతుష్టుఁడు దూరీకృతదురితక్రియుండు ప్రశాంతమానసుండు విజితేంద్రియుండు గృతకృత్యుండు ప్రాప్తాప్రాప్తవిహీనుండు సర్వవ్యవహారాతీతుం డశరీరుండు సర్వశరీరస్థుండు నిరింద్రియుండు సర్వేంద్రియద్రష్టయు నప్రాణుండు సర్వప్రాణిప్రేరకుండు సర్వేంద్రియోపశాంతిసుఖరసికుండు వివేకహృత్సంగుండు నిత్యాసంగుండు ప్రజ్ఞాప్రౌఢసహాయుం డసహాయుండు దృఢాపరోక్షాత్మనిశ్చయ సంపన్నుండు వర్ణాశ్రమసదాచారదురాచార కామక్రోధలోభ మోహదంభదర్పకుహకక్రౌర్యశౌర్యజాడ్య మాత్సర్యద్వేష కార్పణ్య నిందాస్తుతి మానావమానేర్ష్యాసూయాదయా నైష్ఠుర్య వాక్పారుష్యాది నానావిధచిత్తవికారరహితుండు స్త్రీవాసనార్థ వాసనాప్రతిష్ఠావాసనా శాస్త్రవాసనా దేహవాసనా లోకవాసనా కర్తృత్వభోక్తృత్వాది వాసనావివర్జితుండు విగతబ్రహ్మవేత్తృత్వాభిమానవాసనుండు నిత్యనిర్మలుండు నిత్యశాంతుండు నిత్యోదాసీనుండు నిష్ప్రపంచుం డవ్యక్తమహదహంకార పంచతన్మాత్రాకాశాది సర్వప్రపంచ మాయాగంధర్వనగరాశ్రయుండు నిరాశ్రయుండు సర్వ[illegible] పరమసుఖైక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్వరూపకుండు దూరీకృతసంసారుండు దేహేంద్రియగుణాతి రిక్తుండు దేవతాస్పృహణీయశీలుండు నానాపాశవినిర్ముక్తుండు రాజసతామసవస్తుసేవాదూరుండు సాత్త్వికవస్తుసేవావిజితనిద్రుం డక్రియాత్మపూజాపరుండు మానజనపరాయణుం డచింత్యధ్యాన నిష్ఠుం డనిచ్ఛాసుఖతత్పరుండు విశ్వవంద్యుండు యథేచ్ఛాసంసార శీలుండు ధీరుండు దాంతుండు నిత్యప్రబుద్ధచిత్తుండు స్వాత్మసమాధి నిష్ఠుండు జగదింద్రజాలద్రష్టయు విశేషప్రాప్తాశేషపురుషార్థుండు త్యక్తాశేషదుఃఖుం డధిగతపరమస్వాస్థ్యుండు సంగృహీతచిత్తుండు మితవాక్యుండు పరమకారుణికుండు సర్వభూతమిత్రుండు పేశలా చారమధురుండు పాణిపాత్రనిపతితమాత్రాశనుండు యోగ రూఢుండు తితిక్షుండు పరమైకాంతికుండు నిష్కళంకుండు నిస్పృహుండు ప్రారబ్ధవశప్రాప్తదేహేంద్రియాది వ్యాపారరూప పుణ్యపాపక్రియా కర్తృత్వాభిమానపూర్వక ముఖవికాసదైన్య శూన్యుండు సదా ప్రసన్నచిత్తుండు వికసితముఖుండు దుష్టశిష్టజన సంగదూరుండు సాధువిద్వజ్జనసంగుండు సర్వపదార్థోపేక్షాబుద్ధి యుక్తుండు కుశలాకుశలక్రియాదూరుండు వేదాంతశాస్త్ర విచార ఘోరదావానలభస్మీకృత సర్వవేదశాస్త్రాగమపురాణ గుర్వీశ్వర విధి ప్రతిషేధాదివాసనారణ్యుం డవ్యక్తలింగుం డవ్యక్తాచారుం డేకచారియు ననికేతనుండు గిరిగుహావిహారుండు మృత్యుభయ వర్జితుండు పరలోకభయవిరహితుం డనిర్వ్యాజశాంతాత్మకుండు బంధమోక్షనిరాకాంక్షుండు సర్వాతీతసర్వపరిపూర్ణాప్రతిద్వంద్వ బ్రహ్మచైతన్యప్రకాశస్వరూపమాత్రుండు నై ప్రకాశించు మతి యును. 178

టీ. ఇట్టి...డైన-ఇట్టి=పైనవివరింపఁబడిన, వైరాగ్య=వైరాగ్యముతోను, బోధ=జ్ఞానముతోను, ఉపరతి = చిత్తశాంతితోను, యుక్తుఁడైన = కూడుకొనియున్న, జీవన్ముక్తుండు=జీవన్ముక్తిఁజెందిన మహాత్ముఁడు, ప్రత్య...లుండు-ప్రత్య = కూటస్థునికంటె, అభిన్న = వేఱుకాని, బ్రహ్మతత్త్వ=పరబ్రహ్మముయొక్క యథార్థస్వరూపమును, సాక్షాత్కార=ప్రత్యక్షము చేసికొనుట యనెడు, ప్రచండ = తీవ్రమైన, మార్తాండప్రకాశ = సూర్యప్రకాశముచేత, నిరస్త = పోఁగొట్టఁబడిన, అనాది = ఆదిలేనట్టియు, అనిర్వచనీయ = "ఇది యిట్టిది" అని చెప్పరానట్టియు, అజ్ఞాన = అజ్ఞాన మనెడు, అంధకార=

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చీఁకటియొక్క, పటలుండు = సమూహము గలవాఁడును, పరి...లుండు-పరిత్యక్త = విడువఁబడిన, వర్ణ=బ్రాహ్మణాదిజాతులయొక్కయు, ఆశ్రమ = బ్రహ్మచర్యాద్యాశ్రమములయొక్కయుఁ, ఆచార=ఆచారములయొక్కయు, శాస్త్ర=వానినివిధించు శాస్త్రములయొక్కయు, కోలాహలుండు=సంక్షోభము కలవాఁడును, నిరంతర...ణుండు-నిరంతర=సర్వకాలములయందును, చిత్తవిశ్రాంతి=చిత్తశాంతియే, పర=శ్రేష్ఠమగు, అయనుండు = ఆధారముగా (లేక ఆశ్రమముగాఁ) గలవాఁడును, విష...తుండు-విషయ = శబ్దాది విషయములయందలి, ఆసక్తి = ప్రేమచేత, వివర్జితుండు = శూన్యుఁడును (అనఁగా విషయేచ్ఛలేనివాఁడును), ప్రబ...ష్ఠుండు-ప్రబల = మిగుల బలవంతమగు, ప్రారబ్ధ=పూర్వజన్మకర్మమునకు, అధీన=స్వాధీనమైన, శరీరచేష్టుండు = శరీరసంబంధములైన భోజనాది వ్యాపారములు కలవాఁడును, నిశ్చేష్టుండు = స్వభావముగాఁ గర్మలులేనివాఁడు, అంతస్సుఖుండు = లోపలనె (అనఁగాఁ దనయందే) యానందించువాఁడును, అంతరారాముండు=లోపలనే క్రీడించువాఁడును, అంతఃప్రకాశుండు = లోపలనే ప్రకాశించువాఁడు, ఆత్మరతుండు=తనయందే తృప్తినొందువాఁడును, ఆత్మతృప్తుఁడు = తనయందే తృప్తినొందువాఁడును, ఆత్మసంతుష్టుఁడు = తనయందే సంతోషించువాఁడును, దూరీ...యుఁడు-దూరీకృత=తొలఁగింపఁబడిన, దురితక్రియుఁడు=పాపకృత్యములు గలవాఁడును, ప్రశాంతమానసుండు-ప్రశాంత=శాంతిఁజెందిన (లేక సంకల్పములేని), మానసుండు = మనస్సుకలవాఁడును, విజితేంద్రియుండు = ఇంద్రియజయము కలవాఁడును, కృతకృత్యుండు = చేయవలసినపనిని (అనఁగా నాత్మస్వరూపానుభవమును) జేసినవాఁడును, ప్రాప్తాప్రాప్తవిహీనుండు=కలిమిలేములు లేనివాఁడును, సర్వవ్యవహారాతీతుండు=సమస్తలోకవ్యవహారములను మించినవాఁడును, అశరీరుఁడు = స్వభావముగా శరీరములు లేనివాఁడును, సర్వశరీరస్థుండు=భిన్నభిన్నములుగాఁ గానవచ్చుచున్న శరీరములయందుండువాఁడును, నిరింద్రియుండు=స్వభావముగా నింద్రియములు లేనివాఁడును, సర్వేంద్రియద్రష్టయుఁ = సర్వేంద్రియములను (అనఁగా వానికార్యములను) జూచువాఁడును, అప్రాణుండు=ప్రాణములు స్వభావముగా లేనివాఁడును, సర్వప్రాణప్రేరకుఁడు = సమస్తప్రాణములను బ్రేరేపించువాఁడును, సర్వేం...కుండు-సర్వేంద్రియ = సమస్తజంతుచయములయొక్కయుఁ, ఉపశాంతి = శాంతివలన (అనఁగాఁ బ్రత్యాహారమువలనఁ) గలిగిన, సుఖరసికుండు=ఆనందానుభవజ్ఞుఁడును, వివేకహృత్సంగుండు-వివేక = జ్ఞానయుక్తమైన, హృత్ =మనస్సుతో, సంగుండు=సంబంధము కలవాఁడును, నిత్యాసంగుండు=ఎప్పుడును దేనితోను సంబంధము స్వాభావికముగా లేనివాఁడును, ప్రజ్ఞా...యుండు-ప్రజ్ఞా=బుద్ధియనెడు (లేక అనుభవజ్ఞానమనెడు), ప్రౌఢసఖి = ప్రౌఢ (అనఁగా సంపూర్ణయౌవనయగు భార్యతో), సహాయుండు = కూడినవాఁడును, ... = స్వభావముగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నద్వితీయుఁ డగుటచే తోడులేనివాఁడును, దృఢా...న్నుఁడు-దృఢ = స్థిరమైనట్టియు, అపరోక్ష=ప్రత్యక్షమైనట్టియు, ఆత్మ=స్వస్వరూపవిషయమైన (అనఁగా "నేనే బ్రహ్మమును" అను) నిశ్చయసంపన్నుండు=నిశ్చయము కలవాఁడును, వర్ణా...తుండు-వర్ణ=జాతులు, ఆశ్రమ=ఆశ్రమములు (అనఁగా వీనియందలి యభిమానములు), సదాచార = చక్కనియాచారములు, దురాచార=చెడ్డయాచారములు, కామ = కోరిక, క్రోధ = కోపము, లోభ=అత్యాశ, మోహ=భ్రాంతి, దంభ=డంబము, దర్ప=గర్వము, కుహక = మోసము, క్రౌర్య=క్రూరత్వము, శౌర్య=శౌర్యము, జాడ్య=మొద్దుతనము, మాత్సర్య=దీర్ఘక్రోధము, ద్వేష=ద్వేషము, కార్పణ్య=దీనత్వము, నింద = నిందించు స్వభావము, స్తుతి=కొనియాడుస్వభావము, మాన = గౌరవము,అవమాన=అగౌరవము, ఈర్ష్య=ఓర్వలేనితనము, అసూయ = గుణములయందును దోషముల నారోపించు స్వభావము, అదయా=దయలేకుండుట, నైష్ఠుర్య=పరుషముగా నుండుట, వాక్పారుష్య = కఠినముగా మాటలాడుట, ఆది=మొదలైన, నానావిధ=అనేకవిధములైన, చిత్తవికార = మనోవికారములు, రహితుండు=లేనివాఁడును, స్త్రీవాసనా...తుండు-స్త్రీవాసనా=స్త్రీజనితసంస్కారంబును, అర్థవాసనా=ధనజనితసంస్కారంబును, ప్రతిష్ఠావాసనా = కీర్తిజనితసంస్కారంబును, శాస్త్రవాసనా=శాస్త్రజనితసంస్కారంబును, దేహవాసనా=దేహజనితసంస్కారంబును, లోకవాసనా = లోకజనితసంస్కారంబును, కర్తృత్వ="నేను కర్తను" అను ననుభవమువలనఁ గలిగిన సంస్కారంబును, భోక్తృత్వ = "నేను అనుభవించువాఁడను" అను ననుభవమువలనఁ గలిగిన సంస్కారంబును, ఆది=మొదలైన, వాసనా=సంస్కారములు, వివర్జితుఁడు=లేనివాఁడును, విగత...నుండు-విగత = పోయిన, బ్రహ్మవేత్తత్వ = "నేను బ్రహ్మజ్ఞానిని" అను, అభిమాన=అభిమానమువలనఁ గలిగిన, వాసనుండు=సంస్కారము కలవాఁడను, నిత్యనిర్మలుండు=సర్వదా పరిశుద్ధుఁడగువాఁడును, నిత్యశాంతుండు = ఎప్పుడును శాంతి కలవాఁడును, నిష్ప్రపంచుండు = ప్రపంచము (అనఁగాఁ బ్రపంచ వికారములు లేనివాఁడును), అవ్యక్త...యుండు-అవ్యక్త=అవిద్య, మహత్ = సమష్టి బుద్ధి, అహంకార=సమష్ట్యహంకారము, పంచతన్మాత్ర = ఆకాశాది సూక్ష్మభూతములు, ఆకాశాది=ఆకాశాది మహాభూతములును మొదలగు, సర్వప్రపంచ = సమస్తప్రపంచమనెడు, మాయా=మాయామయమైన, గంధర్వనగరీ = ఐంద్రజాలిక పట్టణమే, ఆశ్రయుండు=ఆశ్రయముగాఁ గలవాఁడును, నిరాశ్రయుండు=స్వభావముగా నేయాశ్రయమును లేనట్టివాఁడును, సర్వ...త్రుండు-సర్వ=సమస్తంబును, అభావ=లేనట్టి, కేవల = అద్వితీయమైన, చిత్=జ్ఞానమనెడు, ఆకాశమాత్రుండు=ఆకాశమే స్వరూపముగాఁగలవాఁడును, పరమ...కుండు-పరమ=సర్వోత్తమమైన, సుఖ=ఆనందమే, ఏక=ముఖ్యమైన, స్వరూపకుండు=స్వరూపముగాఁగలవాఁడును, దూరీకృతసంసారుండు-దూరీకృత=విడువఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బడిన, సంసారుండు=సంసారము కలవాఁడును, దేహేం...క్తుండు-దేహ=దేహములయొక్కయుం (లేక దేహములకంటెను),ఇంద్రియ=ఇంద్రియములకంటెను,గుణ=సత్త్వాదిగుణములకంటెను, అతిరిక్తుండు=వేఱగువాఁడును, దేవ...లుండు-దేవతా=ఇంద్రాది దేవతలకుఁగూడ, స్పృహణీయ=కోరఁదగిన, శీలుండు = సత్స్వభావము కలవాఁడును, నానా...కుండు-నానా=అనేకము లైన, పాశ=బాధములచేత, వినిర్ముక్తుండు = విడువఁబడినవాఁడును, రాజ...రుండు-రాజస=రజోగుణసంబంధములు (అనఁగా రజోగుణము నభివృద్ధిఁజేయునట్టియు), తామస = తమోగుణసంబంధము లైనట్టియు (అనఁగా తమోగుణము నభివృద్ధిఁజేయునట్టియు), వస్తు = ఆహారపదార్థములను, సేవా = సేవించుటను, దూరుఁడు = విడిచినవాఁడును, సాత్త్విక...ద్రుండు-సాత్త్వికవస్తుసేవా=సత్త్వగుణము నభివృద్ధి సేయునట్టియాహారపదార్థముల సేవించుటవలన, విజిత = జయింపఁబడిన, నిద్రుండు=నిద్ర కలవాఁడును, అక్రియాత్మపూజాపరుఁడు-అక్రియా = క్రియాశూన్య మైన, ఆత్మపూజా = బ్రహ్మస్వరూపముయొక్క పూజసేయుటయందు, పరుండు = ఆసక్తిగలవాఁడును, మౌనజపపరాయణుండు-మౌన = కార్యములఁ జేయకుండుట (లేక మాటలాడకుండుట) యను, జప = జపమునందు, పరఅయణుండు = ఆశగలవాఁడును, అచింత్యాధ్యాననిష్ఠుండు - అచింత్య = తలంపరాని బ్రహ్మము (లేక తలంపులేకపోవుట) యనెడు, ధ్యాననిష్ఠుండు = ధ్యానము నాచరించువాఁడును, అనిచ్ఛాసుఖతత్పరుండు - అనిచ్ఛా=కోర్కిలేకపోవుట యనెడు, సుఖ=ఆనందమునందు, తత్పరుండు = ప్రేమగలవాఁడును, విశ్వవంద్యుండు-విశ్వ = ప్రపంచముచే, వంద్యుండు = నమస్కరింపఁదగినవాఁడును, యథేచ్ఛానుసంసారశీలుండు-యథేచ్ఛా=స్వేచ్ఛగా, సంసార = సంచరించుటయే, శీలుండు=స్వభావముగాఁగలవాఁడును, ధీరుండు=ధైర్యవంతుఁడును, దాంతుండు=ఇంద్రియనిగ్రహము కలవాఁడును, నిత్యప్రబుద్ధచిత్తుండు-నిత్య = ఎప్పుడును, ప్రబుద్ధ=మేల్కనిన, చిత్తుండు = మనస్సుకలవాఁడును, స్వాత్మసమాధినిష్ఠుండు-స్వ = స్వస్వరూపభూతుఁడైన, ఆత్మ=పరబ్రహ్మమువిషయమైన, సమాధి=యోగమునందు, నిష్ఠుఁడు = స్థితిగలవాఁడును, జగదింద్రజాలద్రష్టయుఁ-జగత్=ప్రపంచమనెడు, ఇంద్రజాల=ఇంద్రజాలమును, ద్రష్టయుఁ=చూచువాఁడును, ప్రాప్తా...ర్థుండు-ప్రాప్త = పొందఁబడిన, అశేష=సంపూర్ణమైన, విశేష=లోకోత్తరమైన, పురుషార్థుండు=మోక్షరూప మైనపురుషార్థము కలవాఁడును, త్యక్తా...ఖుండును-త్యక్త = విడువఁబడిన, అశేష=సంపూర్ణమైన, విశేష=అత్యధిక మైన, దుఃఖుండు=దుఃఖములు కలవాఁడును, అధి...స్థ్యుండు-అధిగత = పొందఁబడిన, పరమ=సర్వోత్తమ మైన, స్వాస్థ్యుండు = శాంతి కలవాఁడు, సంగృహీత చిత్తుండు = బాగుగనిగ్రహింపఁబడినమనస్సుకలవాఁడును, మితవాక్యుండు = మితముగా మాటలాడువాఁడును, పరమ... దయగలవాఁడును, సర్వభూత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మిత్రుండు=సకలజంతువులకును స్నేహితుఁడును, పేశ...రుండు-పేశల=మనోహరమైన, ఆచార=వర్తనములచే, మధురుండు=రమ్యమగువాఁడును, పాణి...నుండు-పాణి=హస్త మనెడు, పాత్ర=పాత్రమునందు, నిపతితమాత్ర=పడినదానినే, అశనుండు=భక్షించువాఁడును,యోగారూఢుండు - యోగ=యోగమును, ఆరూఢుండు=అధిష్ఠించినవాఁడును, తితిక్షుండు=ఓర్పుకలవాఁడును, పరమైకాంతికుండు = ఏకాంతస్థలమునం దుండువాఁడును, నిష్కళంకుండు = లోప మేమియులేనివాఁడును, నిస్పృహుండు = ఆశలేనివాఁడును, ప్రార...స్యుండు-ప్రారబ్ధవశ=ప్రారబ్ధవశమువలన, ప్రాప్త=వచ్చిన, దేహ=దేహములు, ఇంద్రియ=ఇంద్రియములు, ఆది=మొదలగువానియొక్క, వ్యాపార=వ్యాపారములే, రూప=స్వరూపముగాఁ గల, పుణ్యపాపక్రియా = పుణ్యపాపకర్మములయొక్క, కర్తృత్వాభిమానపూర్వక='నేను వీనిని చేయుచున్నాను' అనునభిమానమువలనఁ గలిగిన, ముఖ వికాస=సంతోషము, దైన్య=దీనత్వము (అనఁగా మంచిపని చేసినవాఁడు అని లోకులు చెప్పికొనుటవలన సంతోషము కాని చెడ్డపని చేసినవాఁడు అని నిందించుటవలన చిన్న దనముగాని), శూన్యుండు=లేనివాఁడును, సదాప్రసన్నచిత్తుండు = ఎప్పుడును పరిశుద్ధ చిత్తము కలవాఁడును, వికసితముఖుండు=వికసించిన ముఖము కలవాఁడును, దుష్టశిష్ట జనసంగదూరుండు=చెడ్డవారు మంచివారు నగుజనులయొక్క సమూహములతో చేరనివాఁడును, సాధువిద్వజ్జనసంగుండు = సత్పురుషులును బ్రహ్మజ్ఞానులు నగువారితోఁ జేరువాఁడును, సర్వపదార్థోపేక్షాబుద్ధియుక్తుండు = సమస్తపదార్థమును ఉపేక్షించునట్టి బుద్ధితోఁగూడినవాఁడును, కుశలాకుశలక్రియాదూరుండు = పుణ్యపాపకర్మలవిడిచినవాఁడును, వేదాంత ... ణ్యుండు - వేదాంతశాస్త్రవిచార = వేదాంతశాస్త్రవిచారమనెడు ఘోరదావానల = భయంకరమైనదావాగ్నిచే, భస్మీకృత = భస్మముచేయఁబడిన, సర్వ= సమస్తమైన, వేద = వేదములు, శాస్త్ర = శాస్త్రములు, అగమ = శైవాద్యాగమములు, పురాణ = పురాణములు, గురు = గురువు, ఈశ్వర = ప్రభువులు, విధి = విధులు, ప్రతిషేధ=నిషేధములు, ఆది=మొదలైనవానియొక్క, వాసనా = సంస్కారములనెడు, అరణ్యుండు = అడవికలవాఁడును, అవ్యక్తలింగుండు-అవ్యక్త = కనఁబడని, లింగుండు= చిహ్నములు గలవాఁడును, అవ్యక్తాచారుండు = తెలియఁబడని ఆచారముకలవాఁడును, ఏకచారియుఁ=ఏకాకియును, అనికేతనుండు = నివాసస్థానము లేనివాఁడును, గిరిగుహావిహారుండు=పర్వతగుహలయందు సంచరించువాఁడును, మృత్యుభయవివర్జితుండు=మరణ భయములేనివాఁడును, బరలోకభయవిరహితుండు = పరలోకభయములేనివాఁడును, నిర్వ్యాజ...త్మండు-నిర్వ్యాజ=నిష్కపటమైన, శాంత = పరిశుద్ధమైన, ఆత్మకుండు= మనస్సుకలవాఁడును, బంధమోక్షనిరాకాంక్షుండు-బంధ=బంధమునందుఁగాని, మోక్ష= మోక్షమునందు...క్షుండు = కోర్కెలేనివాఁడును, సర్వాతీత...డునై -

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సర్వాతీత=సమస్తము నతిక్రమించినట్టియు, సర్వపరిపూర్ణ=సమస్తము వ్యాపించినట్టియు, అప్రతిద్వంద్వ = సాటి లేనట్టియు, బ్రహ్మచైతన్య = బ్రహ్మయొక్క, ప్రకాశస్వరూప మాత్రుఁడునై=ప్రకాశరూపుండై, ప్రకాశించుఁ=ప్రకాశించుచుండును, మఱియుఁ =మఱియును.

తా. ఈవిధముగా వర్ణింపఁబడిన వైరాగ్యబోధోపరతులు గలిగిన యోగి అనాదియు "అది యిట్టిది" అని చెప్పరానట్టిదియు నైనయజ్ఞానాంధకారమును బ్రహ్మాత్మైక్య జ్ఞాన మనుసూర్యప్రకాశముచే ధ్వంసము గావింపఁగలఁడు. అప్పుడు వానికి పామరులకు వలె వర్ణాశ్రమాచారములకు సంబంధించినకలత యించుకయైన నుండదు. మనసు సర్వకాలములయందును విశ్రాంతినొందియుండును. విషయేచ్ఛ లేకున్నను ప్రారబ్ధకర్మవశముచే గొన్ని వ్యాపారముల నసంగుఁడై యాచరించుచుండును. వ్యవహారము లెట్లు ప్రవర్తించుచున్నను అతఁడు సర్వకాలములయందు నంతర్ముఖుఁడై క్రీడించుచు స్వప్రకాశస్వరూపుఁడై పరమానందము ననుభవించును. ఆత్మయందే ప్రీతిగలవాఁడై స్వస్వరూపానుభవముచేతనే తృప్తినొందుచు సంతసించుచునుండును. ఇంద్రియములును మనంబును శాంతి నొందియుండుటచే నెప్పుడును పాపకర్మములను సంకల్పింపఁడు ఇట్టివాఁడగుటచేఁ గృతార్థుఁ డగును. "ఇది దొరకినది. దీనిని సంపాదింపవలయును" అను సంకల్పములు లేనుండుటచే సర్వవ్యవహారముల నతిక్రమించియుండును. ఇట్లు బ్రహ్మరూపుఁడగుటచే శరీరములేనివాఁ డయ్యును సర్వశరీరములందును వ్యాపించి యింద్రియవిహీనుఁడయ్యును వానికిఁబ్రేరకుండై ప్రాణములకంటె వేఱై (లేక ప్రాణములు లేనివాఁడయ్యును సర్వభూతములఁ బ్రేరేపించువాఁడై) సర్వకాలములయందు నుపరతిసుఖము ననుభవించుచుండును. మఱియు స్వాభావికముగా దేనితోను సంబంధము లేనివాఁడయ్యును జ్ఞానవంతమగుమనస్సుతో మాత్రము సంబంధము కలిగియుండును. అద్వితీయుఁ డగుటచే తోడులేనివాఁ డయినను అనుభవజ్ఞాన మనుభార్యతో సర్వకాలములయందును గూడియే యుండును. బ్రహ్మాత్మైక్యమునందు దృఢనిశ్చయముకలిగి వర్ణములు ఆశ్రమములు సదాచార దురాచారములు అనువానియం దభిమానమును విడిచి కామక్రోధాదులు రాగద్వేషములు శోకమోహములు శౌర్యధైర్యాదులు ఈర్ష్యాసూయాదులు డంబము గర్వము మాయ కఠినత్వము దయ మొదలగుచిత్తవికారము లేవియు లేక నిర్వికారుఁడై యుండును. స్త్రీలు ధనము కీర్తిశాస్త్రములు దేహము లోకము "నేను కర్తను నేను భోక్తను" అనువ్యవహారము మొదలగువానివలనఁ గలిగిన సంస్కారములు లేనివాఁడై నిర్మలచిత్తముతో నిలిచియుండును. ఇంతయేల? "నేను బ్రహ్మము నెఱుంగుదును" అనునభిమానమువలన జనించినసంస్కారము కూడ వానిమనంబున నుండదు. వాస్తవస్థితిలో సంస్కారములన్నియు భ్రాంతిబంధములే కదా! సర్వకాలములయందును పరి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శుద్ధుఁడై శాంతుఁడై యేదివచ్చినను రాగద్వేషములు లేక సమచిత్తుఁడై ప్రపంచరహితుఁడై (అనఁగా ప్రపంచవికారరహితుఁడై) యుండును. స్వభావముగా నివాసస్థానమేదియు లేనివాఁ డయ్యును అవ్యక్తము మహదహంకారము పంచతన్మాత్రలు భూతములు మొదలగుసర్వప్రపంచమును మాయాపట్టణము నాశ్రయించి సర్వమును దేహేంద్రియాదులయందలి అభిమానమును విడచి దేవతలకుఁ గూడఁ గోరఁదగినస్వభావము కలవాఁడై యొప్పుచుండును. మఱియుఁ దనకు నెట్టిబంధములును కలుగవు. రజస్తమోగుణముల నభివృద్ధి సేయువస్తువులఁ బరిత్యజించి సత్వగుణము నభివృద్ధిఁ జేయఁగల మధురాదిపదార్థముల భుజించుటచే తమోగుణరూపిణి యగునిద్ర వానిస్వాధీనములో నుండును. మఱియు కర్మశూన్యమైన స్వస్వరూపమును బూజించుటయందును మౌన మనుజపము నాచరించుటయందును మనస్సునకు నగోచర మగు రూపమును ధ్యానించుటయందు నిలుకడ కలవాఁడును, ఇచ్ఛలేకపోవుట యనుపరమానందము ననుభవించువాఁడును అయియుండును. సంసారమును స్వేచ్ఛగా నాచరించుచు ధైర్యవంతుఁడై మనోనిగ్రహము కలిగి జ్ఞానప్రకాశయుక్త మగుమనస్సుతో నాత్మసమాధియందే నిలిచి ప్రపంచము నింద్రజాలప్రాయముగాఁ జూచుచు సర్వపురుషార్థముల నిశ్శేషముగా సంపాదించి సర్వదుఃఖముల నిషేధించియుండువాఁడగుటచే సర్వజనులచేతను స్తోత్రనమస్కారములఁ జేయఁబడుచు నుండును. ఇట్లు పరిపూర్ణ మగుచిత్తనిగ్రహముకలవాఁడు సర్వాధిక మగుసుఖమును జెంది మితవాక్యములఁ బల్కు దయామయుఁడై సకలభూతములకును మిత్రుఁడై మనోహర మగు నాచారమువలన సర్వజనచిత్తముల నాకర్షించుచు నుండును. తనహస్తమునం దప్రయత్నముగాఁ బడినదానిని మాత్రమే భుజించుచు నధికమును గోరఁడు. ఇట్లు యోగసిద్ధి నొంది యోర్పు గలిగి యేకాంతవాసి యగుచు కళంకంబును ఆశయుఁ లేక ప్రారబ్ధవశమున వచ్చినదేహేంద్రియాదులు చేయుకార్యములయందు (అనఁగా పుణ్యపాపములయందు) కర్తృత్వాభిమానము లేక యెప్పుడు గలుగు దైన్యశోకముల నొందక నిర్మలచిత్తుఁడై యుండును. బ్రహ్మానందానుభవముకలవాఁ డగుటచే సర్వదా సంతోషము గలిగియుండును. ఎవ్వనితోను సంబంధములేనివాఁడయ్యును సత్పురుషులతోను బ్రహ్మజ్ఞానులతోను చెలిమి గలిగియుండును. ఇతరులగుదుష్టులతోఁగాని శిష్టులతోఁగాని చేరఁడు. సర్వపదార్థముల నుపేక్షించును. మంచికార్యములనుగాని చెడ్డకార్యములనుగాని లేక శుభాశుభముల నొందించు కార్యములనుగాని చేయఁడు. వేదాంతశాస్త్రవిచార మనుదావాగ్నిచే నన్యశాస్త్రాగమములను నరణ్యమును ధ్వంసము చేయును. (అనఁగా నితరశాస్త్రముల నన్నింటిని వర్జించి వేదాంతశాస్త్రాభ్యాసమునందే, లేక పరతత్వనిష్ఠయందే యాసక్తుండై యుండును.) గురువు ఈశ్వరుఁడు విధిప్రతిషేధములు మొదలగునవివలనఁ గలుగుసంసారంబులు వానియందుండవు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'ఇట్టి డిట్టివాఁడు' అని గుఱుతులచేతఁగాని యాచారముచేతఁగాని యాయోగిని నిర్ణయించుటకును వీలులేదు. నివాసమనునది లేక యేకాకియై పర్వతగుహలయందు మృత్యుభయవర్జితముగా విహరించుచు పరులవలన (లేక నరకాదులవలన) బాధనొందక పరిపూర్ణశాంతి గలమనస్సుతో బంధమోక్షములఁగోరక యాయోగి విహరించుచుండును. మోక్షము స్వతస్సిద్ధమే కావున దానిని కోరుట యనునదియే సంభవింపదు; కోరినయెడల నదియుఁ గామమేయగు ననుటకు సందియము లేదు కదా! కావున యోగికి మోక్షకామముకూడ నుండదు. ఇట్టివాఁడు సర్వప్రపంచము నతిక్రమించినట్టియు సర్వవ్యాపకమైనట్టియు సాటిలేనట్టియుఁ పరబ్రహ్మమే తానైయుండును. మఱియును సాత్త్విక రాజస తామస ఆహారముల వివరణము.—

శ్లో. "ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః,
రస్యాస్స్నిగ్ధా స్థిరా హృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః.
కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః,
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః.
యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్,
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్."

"ఆయుస్సు ఉత్సాహము దేహబలము ఆరోగ్యము సౌఖ్యము పరులయందలిఅనురాగము వీని వృద్ధిచేయునట్టియుఁ మంచిరుచియుఁ చమురును గలిగినట్టియుఁ శరీరమునఁ జాలకాలముండునట్టియుఁ మనస్సునకింపైనట్టియు నాహారములు సత్త్వగుణము కలవానికిఁ బ్రియములు. కారము పులుసు అధికమగునుప్పు వేఁడి చమురులేకపోవుట దాహముం గలిగించుట లేక మంటలను బుట్టించుట అనుగుణములుకలిగి దుఃఖమును మనస్సునందు సంతాపమును బహువిధములగువ్యాధులను కలిగించునట్టియాహారములు రజోగుణవంతుల కిష్టములు. పండినపిదప నొక్కజాము గడచినట్టియుఁ రుచిలేనట్టియుఁ దుర్గంధమైనట్టియుఁ నాహారంబును చల్దియాహారంబును ఉచ్ఛిష్టాన్నంబును దేవతాసమర్పితము కానియన్నంబును దమోగుణవంతులకు నిష్టములు" ఏయే ఆహారము లేయేగుణముగలవారల కిష్టములై యుండునో ఆయాయాహారము లాయాగుణముల నభివృద్ధి సేయుఁ నని తెలిసికొనవలయును.

క. శాంతి వర కామధేనువు
సంతోషమె కల్పలత విషయవిరతి యగుఁ
జింతామణి యని నెమ్మదిఁ
జింతించుచు ... సుఖము జెందు బుద్ధిం ద్రావా!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. బుధేంద్రా=పండితులలో శ్రేష్ఠుఁడా, శాంతి=చిత్తశాంతి, వర=శ్రేష్ఠమైన, కామధేనువు, సంతోషమె=తృప్తియే, కల్పలత = కల్పవృక్షము, విషయవిరతి-విషయ=విషయములయందలి, విరతి=వైరాగ్యము, చింతామణి, అగునని=అని, నెమ్మదిఁ=మనస్సునందు, చింతించునతండు=తలఁచువాఁడు, సుఖముఁ జెందుఁ=బ్రహ్మానందమును జెందును.

తా. ఓవిద్వాంసుఁడా! శాంతిని కామధేనువుగాను సంతోషమును గల్పవృక్షముగాను విషయములయం దిచ్ఛ లేకుండుటయే చింతామణి యనియుఁ మనసున భావించువాఁడు మోక్షసుఖము నొందును.

తే. పరమతృష్ణను భయదవైతరణి గాఁగఁ
గామమును ఘోరతరనరకంబు గాఁగ
దారుణక్రోధమును దండధరుని గాఁగఁ
జూచునాతండు నిర్వాణసుఖము నొందు. 180

టీ. పరమతృష్ణఁ=అధికమైనయాశను, భయదవైతరణిగాఁగఁ = భయంకరమైన వైతరణినదిగాను, కామముఁ=కోర్కెని, ఘోరతరనరకంబుగాఁగఁ=భయంకరమైన నరకముగాను, దారుణ క్రోధమును = భయంకర మైనకోపమును, దండధరునిగాఁగఁ=యమధర్మరాజునుగాను, చూచునాతండు = చూచునట్టిపురుషుఁడు, నిర్వాణసుఖము నొందుఁ=మోక్షసుఖమును జెందును.

తా. ఆశను వైతరణినదిగాను కామమును నరకముగాను క్రోధమును యమునిగాను చూచువాఁడు మోక్షము నొందును.

సీ. తతవియన్నీలవితానభూషిత మగ్ని
రవిచంద్రదీపవిరాజితంబు
నతులభూచక్రసింహాసనాలంకృతం
బనిలవ్యజనమరుద్వ్యాపితంబు
ధనికసేవకసేవితం బై తనర్చుజ
గత్పురంబున వివేకప్రకాశ
మానేంద్రియతురంగమానసప్రగ్రహ
బుద్ధిసారథియుక్తపురుశరీర
తే. మంజులరథాధిరూఢుఁ డై మహిమతోడ
నమరుప్రజ్ఞాంగనాయుక్తుఁ డగుచు నిత్య
విభవుఁడై సర్వజనము సేవించుచుండ
రాజయోగీశ్వరుం డలరారు సనఘ! 181

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. అనఘ=పాపరహితుఁడా ! తత...తము-తత=వ్యాపించిన, వియత్=ఆకాశ మనెడు, నీలవితాన=నల్లని మేల్కట్టుతో, భూషితము=అలంకరింపఁబడినదియు, అగ్ని...తంబు-అగ్ని=అగ్ని యనునట్టియు, రవి=సూర్యుం డనునట్టియు, చంద్ర = చంద్రుఁడను నట్టియు, దీప=దీపములచే, విరాజితంబు = ప్రకాశించునది, అతుల...తంబు-అతుల=సాటిలేని, భూచక్ర=భూమియనెడు, సింహాసన=సింహాసనముచేత, అలంకృతంబు=అలంకరింపఁబడినదియు, అని...తంబు-అనిల = వాయువనెడు, వ్యజనమరుత్ = వింజామర నుండివచ్చుగాలితో, వ్యాపితంబు = వ్యాపింపఁబడినదియు, ధనిక...తంబై-ధనిక=ధనికు లనెడు, సేవక=భటులచేత, సేవితంబై = సేవింపఁ బడినదై, తనర్చు...బునన్-తనర్చు=ఒప్పుచున్న, జగత్ = ప్రపంచమనెడు, పురంబునన్ = పట్టణమునందు, రాజయోగీశ్వరుండు = రాజయోగి, వివే...డై-వివేక=జ్ఞానముచేత, ప్రకాశమాన=ప్రకాశించుచున్న, ఇంద్రియ=ఇంద్రియములనెడు, తురంగ=గుఱ్ఱములచేత, మానసప్రగ్రహ=మనస్సనెడు పగ్గములచేతను, బుద్ధిసారథియుక్త = బుద్ధి యనెడుసారథిచేతను కూడిన, పురుశరీర = స్థూలశరీర మనెడు మంజులరథాధిరూఢుండై =శ్రేష్ఠమైనరథము నెక్కి, మహిమతో దగ్=అభివృద్ధితో, అమరు...డగుచున్-అమరు = ఒప్పుచున్న ప్రజ్ఞ=బుద్ధియనెడు, అంగనా=స్త్రీతో, యుక్తుండగుచున్=కూడియుండి, నిత్యవిభవుఁడై=శాశ్వతసమృద్ధిగలవాఁడై, సర్వజనము సేవించుచుండన్=సమస్తజనులు సేవ సేయుచుండఁగా, అలరారున్ = ఒప్పుచుండును.

తా. ఓ దోషరహితుఁడా ! ఆకాశమను నల్లని మేల్కట్టుతో నొప్పునదియు సూర్యచంద్రాగ్నులను దీపములచేఁ బ్రకాశించుచుండునదియు భూమి యనెడి సింహాసనముచే నలంకరింపఁబడినదియు వాయువను వింజామరలు లేక వింజామరలనుండి వచ్చు గాలిని కలిగినదియు ధనికులను సేవకులచే సేవింపంబడుచున్నదియు నగు లోకమను పురమున జ్ఞానయుక్తేంద్రియను లను గుఱ్ఱములతోను మనస్సను పగ్గములతోను బుద్ధియను సారథితోను గూడిన స్థూలశరీరమను రథము నెక్కి యనుభవజ్ఞానమను భార్యతోఁ గూడి శాశ్వతసమృద్ధికలవాఁడై సర్వజనులును తనను సేవించుచుండ రాజయోగి ప్రకాశించుచుండును.

## జీవన్ముక్తునిలక్షణము.

మ. అనపేక్షుం డసమానుఁడై ధనికదీనాలాపముల్ వీనులన్
వినకే కర్మతదేహచేష్టల నొగిన్ వీక్షింపకే నిత్యముం
దనుఁ దాఁ జూచుచుఁ భావనాత్మకసుతీర్థశ్రేణి నత్యంతపా
వనముం జేసి నివసించుచుం దెల్లఁగు జీవన్ముక్తుఁ డానందుఁడై. 182

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. జీవన్ముక్తుఁడు = జీవన్ముక్తిని జెందినవాఁడు, ఆనందుఁడై = ఆనందయుక్తుఁడై, అనపేక్షుండు=కోర్కి లేనివాఁడును, అసమానుఁడై = సాటిలేనివాఁడై, ధనిక...ములు-ధనిక=ధనికులయొక్క, దీన=దీనములైన, ఆలాపములు=వాక్యములును, వీనులన్ = చెవులతో, వినకే=వినకుండనే, కర్మఠ...ష్టలన్-కర్మఠ=కర్మయుక్తమైన, దేహచేష్టలన్ = దేహముయొక్క పనులను, ఒగిన్=అధికముగా, వీక్షింపకే = చూడకయే, నిత్యమున్= ఎల్లప్పుడు, తనుదాఁజూచుచున్ = తన్నుదాను జూచుకొనుచు, పావనాత్మ...శ్రేణిన్-పావనాత్మక=పరిశుద్ధరూపములైన, సుతీర్థశ్రేణిన్ = శ్రేష్ఠమగు తీర్థములను, అత్యంత పావనము గాన్=మిగుల పవిత్రములను, ఒనరించున్=చేయుచు, చెలఁగున్=ఒప్పును.

తా. ఇట్లు జీవన్ముక్తుఁడగు మహాత్ముఁడు పరమానందరూపుఁ డగుటచే నేపదార్థము నైనను గోరఁడు. సర్వజనులచేతను గోరఁబడునది యానందమే కావున నదియే స్వరూపభూతముగాఁ గల తాను కోరుట కేపదార్థంబును లేదుకదా ? కావున నాశలేక సర్వాధికుఁడై ధనవంతులయొక్క దీనులయొక్క సంభాషణముల నించుక యఁయిన నాలకింపక దేహము ప్రారబ్ధానుసారముగాఁ గర్మల నాచరించుచున్నను కోర్కి లేనివాఁడగుటచే వానివైపుఁ జూడక సర్వకాలములయందు నాత్మాలోకనముఁ జేయుచుఁ దన సంచారముచే స్వభావపరిశుద్ధము నగు తీర్థముల నతిపవిత్రముల గావించుచు నామహాత్ముఁడు విహరించుచుండును.

సీ. ఒకవేళఁ దనయందు సకలప్రపంచంబు
కల్పితం బని యెంచి కాంచి నవ్వు
నొకవేళ సర్వభూతోపాధితతియందుఁ
దనుఁ జూచి మిగుల సంతసముఁ జెందు
నొకవేళ దేహాదు లొప్పుగా విహరింప
సర్వసాక్షి నటంచు సంభ్రమించు
నొకవేళ నన్య మించుక లే దొకండ నే
నని నిర్వికల్పసమాధి నొందు
తే. నతులవైరాగ్య బోధోపరతులఁ గలుగు
నతనిమహిమలు గణుతించి యభినుతింప
హరిహరహిరణ్యగర్భుల కైనఁ దరమె
యపరిమితసద్గుణనికాయ! యాంజనేయ! 183

టీ. అప...నికాయ-అపరిమిత=అధికమైన, సద్గుణ=సద్గుణములయొక్క-నికాయ సమూహముగల, ఆంజనేయ, ఒకవేళన్=ఒకసమయమునందు, తనయందున్ = తనలో,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సకలప్రపంచంబులు=సర్వప్రపంచంబులు, కల్పితంబని=కల్పింపఁబడినవని, ఎంచి = విచారించి, కాంచి=చూచి, నవ్వున్=నవ్వును, ఒకవేళన్=ఒకసమయమున, సర్వ...యందు-సర్వభూత = సమస్తభూతములనెడు, ఉపాధి = ఉపాధులయొక్క, తతియందున్ = సమూహమునందు, తనుఁజూచి=తనస్వరూపమును చూచి, మిగులన్=అధికముగా, సంతసముఁజెందున్ = సంతోషించును, ఒకవేళన్, దేహాదులు = దేహము మొదలగునవి, ఒప్పుగాన్=చక్కఁగా, విహరింపన్ = సంచరించుచుండఁగా, సర్వసాక్షినటంచున్ = "నే నన్నిఁటికిని సాక్షిని" అని, సంభ్రమించున్=సంతోషమును జెందును. ఒకవేళన్, అన్యము=తనకంటె భిన్నమైనది, ఒకండు = ఒకఁడనే నేను, ఇంచుకలేదు = కొంచెమైనదియుు లేదు, నేనని=నేను అని, నిర్వి...నొందున్-నిర్వికల్పసమాధినొందున్ = నిర్వికల్పసమాధిని జెందును, అతులవైరాగ్య...తులు-అతుల=సాటిలేని, వైరాగ్య = వైరాగ్యము, బోధ=జ్ఞానము, ఉపరతులు=చిత్తశాంతి, కలఁగునతనిమహిమలు=కలవానిప్రభావములను, గణుతించి=విమర్శించి, అభినుతింపన్ = స్తోత్రము చేయుటకు, హరిహరహిరణ్యగర్భులకైనన్=రుద్రవిష్ణుబ్రహ్మలకైనను, తరమె=శక్యమా ?

తా. సద్గుణములుగల యో యాంజనేయా ! ఆమహాత్ముఁ డొక్కసమయమున సమస్తప్రపంచమును కల్పితముగా నెఱిఁగి దానిని జూచి నవ్వును. మఱియొకవేళఁ దనను సర్వభూతోపాధులయందును గన్గొని సంతోషము నొందును. మఱియొక సమయమున దేహాదిపదార్థములు తమతమ కార్యములయందు సంచరించుచుండఁగా 'తాను సర్వసాక్షి' యని తృప్తినొందును. మఱియొకసమయమున "ప్రపంచము శూన్యము. నాకంటె నన్యము లేదు" అని తలంచి నిర్వికల్పసమాధినిష్ఠుఁడై నిలుచును. కావున వైరాగ్యబోధోపరతులుకలమహాత్ముని గుణముల విమర్శించి వర్ణించుట హరిహరహిరణ్యగర్భులకుఁగూడ నలవికాదు.

సీ. తనపాదధూళి సోకినఁ జరాచరము ల
త్యంతపావనములై యలరుచుండఁ
దనదు నెమ్మేను సందర్శించుజనములు
నిష్పాపులై కడు నెఱయుచుండఁ
దను నిరంతర ముపాసనము చేయుమహాత్ము
లతులితైశ్వర్యంబు లనుభవింపఁ
దనయనుగ్రహము నొందినభక్తులకు ముక్తి
కరతలామలకంబుకరణిఁ దోఁపఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. దనదువంశ్యులు ముయ్యేడుతరమువారు
స్వర్గమున దివ్యసుఖ మొంది సంతసింప
నార్యులు నుతింపఁ ద్రిభువనాచార్యుఁ డగుచు
నెలమి విహరించు రాజయోగీశ్వరుండు. 184

టీ. రాజయోగీశ్వరుండు = రాజయోగి, తన...సోఁకినన్-తన = తనయొక్క, పాద=పాదమునకంటిన, ధూళి = పరాగము, సోఁకినన్ = తాఁకినంతమాత్రముతోడనే, చరాచరములు = జంగమస్థావరరూపమైన సర్వప్రపంచంబులు, అత్యంతపావనములై = మిగుల పరిశుద్ధములై, అలరుచుండఁగన్ = ప్రకాశించుచుండఁగా, తన...ములు-తనదు = తనయొక్క, నెమ్మేను=శరీరమును, సందర్శించు = చూచునట్టి, జనములు = మనుష్యులు, నిష్పాపులై=పాపములేనివారై, కడున్ = మిగుల, నెఱయుచుండఁగన్ = ప్రకాశించుచుండఁగా, తనున్=తనను, నిరంతరము = ఎప్పుడును, ఉపాసనముచేయుమహాత్ములు = సేవించునట్టి మహానుభావులు, అతులి...రమ్యంబులు-అతులిత=సాటిలేని, ఐశ్వర్యంబులు= భాగ్యములను, అనుభవింపన్=అనుభవించుచుండఁగా, తనయనుగ్రహమున్=తనదయను, ఒందినభక్తులకున్=చెందినభక్తులకు, ముక్తి = మోక్షము, కరతలామలకంబు కరణిన్ = చేతిలోని యుసిరికకాయవలె, తోఁపన్=కానఁబడుచుండఁగా, తనదువంశ్యులు = తన వంశమువారు, ముయ్యేడుతరమువారు=21 తరములవఱకు, స్వర్గమునన్=స్వర్గలోకమునందు, దివ్యసుఖము=అపరిమితమగు సౌఖ్యమును, ఒంది = పొంది, సంతసింపన్=సంతోషించుచుండఁగా, త్రిభువనాచార్యుఁడగుచు = త్రిలోకములకు గురువై, ఎలమిన్= సంతోషముతో, విహరించున్=సంచరించుచుండును.

తా. మఱియు నా యోగియొక్క పాదధూళి సోఁకగానే సర్వస్థావరజంగమంబులును పరిశుద్ధములగును. అతని శరీరమును జూడఁగలిగిన జనులందఱును సమస్త పాప వినిర్ముక్తులగుదురు. అతని సేవించు మహానుభావులందఱు మహాసమృద్ధి ననుభవింతురు. ఆఘనునివలన నుపదేశమునొందిన మోక్షము కరతలామలక మగును. ఏ యుపదేశమైనను అనుభవజ్ఞానము కలవారిచే జేయఁబడెనేని యధిక ఫలవంతము (శీఘ్రముగ ఫలమును గలిగించునది) అగును గదా ? మఱియు నాబ్రహ్మజ్ఞానియొక్క వంశస్థులు ఇరువదియొక్కతరములవారు స్వర్గలోకమున నివసించి పరమ సౌఖ్యము ననుభవింతురు. ఈవిధముగా సమస్త కళ్యాణమయుఁడై త్రిలోకగురువై మహాత్ములచే వినుతింపఁబడుచు నాజీవన్ముక్తుఁడు సంతోషముతో విహరించుచుండును.

అవ. ఇట్లు జీవన్ముక్తుని లక్షణముల నిరూపించి వానిమరణమును మోక్షప్రాప్తిని వర్ణించుచున్నాఁడు.—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. అట్టిజీవన్ముక్తుండు ప్రారబ్ధభోగావసానసమయంబున జలంబునజలంబు క్షీరంబున క్షీరంబు ఘృతంబున ఘృతంబుఁ దేజంబునఁ దేజం బాకా శంబునం దాకాశంబు పొందినచందంబున భూతకార్యంబులైన చతుర్వింశతి తత్త్వంబు లాయాకారణంబులఁ గలియుచుండఁగా వానితోఁ దాదాత్మ్యంబు లేమిం జేసి తమంబు దేజంబు గాక కేవ లంబు దతంబు స్తిమితంబు గంభీరం బనాఖ్యం బనభివ్యక్తం బవాచ్యం బచింత్యంబు నిర్వికల్పంబు నిష్ప్రపంచానందమాత్రంబు సర్వశూన్యంబు సనాతనం బప్రమేయం బాదిమధ్యాంతవిరహితం బపర్యంతంబు హేతుదృష్టాంతవివర్జితంబు సర్వాధిష్ఠానం బీశ్వ రావ్యాకృత హిరణ్యగర్భవిరాట్ప్రాజ్ఞతైజస విశ్వరూప చిత్ప్రతి బింబప్రకాశభూతంబు బింబప్రతిబింబభావకల్పనావిరహితంబు పరి పూర్ణంబు నైనపరమమోక్షస్వరూపంబునం బొందు సందేహంబు లేదు నీ విప్పు డట్టిమోక్షస్వరూపమాత్రుండవు గావే యని యాన తిచ్చి వెండియు నిట్లనియె. 185

టీ. అట్టి జీవన్ముక్తుఁడు = పైనవివరింపఁబడిన జీవన్ముక్తుఁడు, ప్రారబ్ధ...బునన్- ప్రారబ్ధ=పూర్వజన్మకర్మయొక్క, భోగ=అనుభవముయొక్క, అవసానసమయంబునన్ = అంతకాలమునందు, జలంబునజలంబు = జలభూతమునందు జలభూతము, క్షీరంబున క్షీరంబు=పాలయందు పాలు, ఘృతంబున ఘృతంబు = నేతియందు నెయ్యి, తేజంబున దేజంబు = నిప్పున నిప్పు, ఆకాశంబున నాకాశంబు, పొందినచందంబునన్ = చేరినట్లు, భూత...బులు-భూత=పంచభూతములకు, కార్యంబులైన=కార్యములు (అనఁగా భూత ములవలనఁ బుట్టినవి) ఐన, చతుర్వింశతి తత్త్వంబులు = ఇరువదినాలుగు తత్వంబులు, ఆయాకారణంబులన్=వానివానికిఁ గారణములగు భూతములందు, కలియుచుండన్ = కలసిపోఁగా, తాన్=తాను, వానితోన్=ఆతత్వములతో, తాదాత్మ్యంబు లేమిం జేసి= "ఈ దేహాదులే నేను" అను భేదభావన లేకుండుటవలన, తమంబు = చీఁకటియును, తేజంబుగాక = తేజస్సునుకాక (కానిదియు), కేవలంబు = తనకంటె రెండవపదార్థము లేదనియు, తతంబు = సర్వవ్యాపకమైనదియు, స్తిమితంబు = నిశ్చలమైనదియు, గంభీ రంబు=అగాధమైనదియు, అనాఖ్యంబు = పేరులేనిదియు, అనభివ్యక్తంబు=ప్రకాశింప నదియును, అవాచ్యంబు = పలుకరానిదియు, అచింత్యంబు = తలంపరానిదియు, నిర్గు ణంబు=గుణశూన్యమైనదియు, నిర్వికల్పంబు=సంకల్పవికల్పంబులులేనిదియు, నిష్ప్రపం ...మాత్రంబు-నిష్ప్రపంచ=భేదములేని, ఆనందమాత్రంబు=ఆనందమే స్వరూపముగాఁ గలదియు, సర్వశూన్యంబు=[illegible] లేనిదియు, సనాతనంబు=అనాదియైనదియు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అప్రమేయంబు=ప్రమాణములకగోచరమైనదియు, ఆదిమధ్యాంతవిరహితంబు=మొదలు తుది నడుము లేనిదియు, అపర్యంతంబు=కొనలు లేనిదియు, హేతు...తంబు-హేతు= కారణములు గాని (లేక లింగములు అనుమానప్రమాణముచే నొకపదార్థమును నిర్ణయింపవలసినప్పుడు దానినిర్ణయమునకై "ఇచ్చట పొగయున్నది కావున నగ్నియున్నది" అని యేపదార్థము గురుతుగా (లేక సాధనముగా) నాశ్రయింపఁబడునో దానికి లింగమని పేరు (కాని, దృష్టాంత = సాధన సాధ్యములకుఁ గల సంబంధమును నిరూపించు వ్యాప్తి దృష్టాంతంబును "పొగయున్నచోట నగ్నియుండును. వంటయిల్లు మొదలగు స్థలములయందు మన కీవిషయము ప్రత్యక్షమైయున్నది" అను నియమము వ్యాప్తి యనఁబడును. వంటయిల్లు మొదలగునవి దృష్టాంతంబులు), వివర్జితంబు = లేనిదియు, (పరబ్రహ్మము అనుమానప్రమాణమునకు గోచరముకాదు. కావున నీయనను నిశ్చయింపవలసినప్పుడు లింగాదులులేవు), సర్వాధిష్ఠానంబు-సర్వ=సమస్తప్రపంచమునకును, అధిష్ఠానంబు=ఆధారమైనదియు, ఈశ్వర...భూతంబు-ఈశ్వర = ఈశ్వరుఁడు, అవ్యాకృత = అవ్యాకృతుఁడు (లేక నామరూప ప్రసిద్ధిలేనివాఁడు; ఈరెండును సమష్టికారణశరీరమునందలి ప్రతిబింబమునకుఁ బేర్లు.) హిరణ్యగర్భ=హిరణ్యగర్భుఁడు (ఇది సమష్టి సూక్ష్మశరీరప్రతిబింబము), విరాట్ = విరాట్ పురుషుఁడు (ఇది సమష్టి స్థూలశరీరాభిమానియగు నీశ్వరుని ప్రతిబింబము), ప్రాజ్ఞ=ప్రాజ్ఞుఁడు (ఇతఁడు వ్యష్టికారణ శరీరాభిమానియగు జీవుఁడు), తైజస=తైజసుఁడు (వీఁడు వ్యష్టి సూక్ష్మశరీరాభిమాని), విశ్వరూప = విశ్వరూపుఁడు (వీఁడు వ్యష్టిస్థూల శరీరాభిమాని), అను, చిత్=జ్ఞానముయొక్క, ప్రతిబింబ = ప్రతిబింబములయొక్క, ప్రకాశభూతంబు = ప్రకాశమైన స్వరూపముగాఁగలదియు, బింబప్రతి...తంబు-బింబ=ఇది ముఖ్యబింబము, ప్రతిబింబ = ఇది దానియొక్క ప్రతిబింబము, భావ=అను, కల్పన = స్థితి (లేక ఏర్పాటు), విరహితంబు = లేనిదియు, పరిపూర్ణంబునైన = అంతట నిండినదియునైన, పర...బునన్-పరమ = సర్వాధికమైన, మోక్షస్వరూపంబునన్ = మోక్షరూపమునందు (లేక మోక్ష రూపముతో, బ్రహ్మరూపముతో), పొందున్ = పొందును, సందేహంబులేదు=సంశయములేదు. నీవు, ఇప్పుడు, అట్టి, మోక్షస్వరూపమాత్రుండవు గావె=మోక్షస్వరూపుఁడవేకదా, అని యానతిచ్చి= అనిచెప్పి, వెండియున్=మఱియు, ఇట్లనియెన్=ఇట్లు చెప్పెను.

తా. ఈవిధముగా నాజీవన్ముక్తుఁడు ప్రారబ్ధఫలము ననుభవించి ముగియువఱకు (అనఁగా ప్రారబ్ధము దేహమును గల్పించును కావున దేహాంతరమే ప్రారబ్ధభోగావసానము. ఇదియుంగాక యొక్కొక్కప్రారబ్ధము జ్ఞానికిఁ గూడ నొకటిరెండు జన్మములఁ గలిగించుటయుం గలదు) పైన వర్ణించినవిధముగా విహరించుచుండును. పిదప (అనఁగా అంతకాలమున [illegible] సాలలోపాలు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నేతిలో నేయి అగ్నియం దగ్ని ఆకాశమున నాకాశము కలిసిపోవునట్లు తమతమ కారణము లగుభూతములయందుఁ గలియును. ఈయోగి యాయింద్రియాదులతో నభేదాభిమానము (అనియే నేను అనునభిమానము) లేనివాఁడగుటచేతఁ బ్రత్యేకముగా నిలుచును. చీఁకటియుఁ బ్రకాశమును గానిదియుఁ నేకరూప మైనదియు సర్వవ్యాపకమైనదియుఁ నిశ్చలమైనదియును గంభీరము నామరూపరహితము అవాఙ్మానసగోచరము నైనదియుఁ సర్వజనులకు బయలుగాఁ బ్రకాశింపనిదియు నిర్గుణంబును సంకల్పవికల్పములు లేనిదియును భేదరహిత మగుపరమానందమే స్వరూపముగాఁగలదియు, నేమియు (అనఁగా నేవికారములును) లేనిదియు ననాదియుఁ బ్రమాణముల కగోచర మైనదియుఁ నాదిమధ్యాంతములు లేనిదియుఁ మితిలేనిదియుఁ 'ఇది యిట్టిది' అని యనుమానము చేయుటకుఁ దగిన దృష్టాంతంబును కారణంబును లేనిదియుఁ సర్వమునకు నాధారమైనదియుఁ అవ్యాకృతుఁడు హిరణ్యగర్భుఁడు విరాట్పురుషుఁడు ప్రాజ్ఞుఁడు తైజసుఁడు విశ్వుఁడు (వీరు సమష్టివ్యష్టి దేహాభిమానులగునీశ్వరజీవులు) అను ప్రతిబింబముల ప్రకాశమే స్వరూపముగాఁ గలదియుఁ (అనఁగా వానికంటె భిన్నము కానిదియుఁ) బింబప్రతిబింబ భావము లేనిదియు సర్వపరిపూర్ణమైనదియుఁ నగు మోక్షరూపమే (బ్రహ్మమే) స్వస్వరూప మగుటచేత దానియందే యైక్యమును జెందును. దీనికేమియుఁ సంశయము లేదు. "ప్రారబ్ధావసానమునం దిట్టిరూపమునొందును." అన నేల? సర్వకాలములందును స్వతస్సిద్ధస్థితి యిదియే కదా? నీవు ఇప్పు డిట్టివాఁడవే కదా? పరులకు దేహము కానవచ్చుచున్నపు డీస్థితి యుండిన జీవన్ముక్తి యనియు దేహము కానరానప్పు డిది విదేహముక్తి యనియుఁ జెప్పఁబడును గాని ముక్తియం దెప్పటికిని భేదము లేదు కదా?

శా. ఏ వేళన్ భువి నెట్టిచోట మఱి యేయేబాధలం బొందుచున్
జీవన్ముక్తుఁడు దేహము న్విడిచినన్ సిద్ధం బనాద్యంతమున్
భావాతీతము నిర్వికల్పము పరబ్రహ్మాత్మకం బైనయా
కైవల్యంబును బొందు సత్య మనహంకారాత్మతత్త్వాత్మకా! 186

టీ. అనహంకా...త్మకా-అనహంకార=అహంకారశూన్యమైన (లేక లోకము నందు అస్మచ్ఛబ్దార్థమని తలంపఁబడుచున్న యహంకారములకంటె వేఱైన), ఆత్మతత్త్వాత్మకా=పరమాత్మతత్త్వమే స్వరూపముగాఁగలవాఁడా, జీవన్ముక్తుఁడు,భువిన్=భూమియందు, ఎవ్వేళన్=ఏసమయమునందుఁగాని, ఎట్టిచోటన్=ఏస్థలమునందుఁగాని, మఱి, ఏయేబాధలన్=ఎట్టిశ్రమలనైన, స్థూలోపాధికిన్ = స్థూలశరీరమునకు, పొందుచున్, దేహమున్=స్థూలసూక్ష్మదేహములను, విడిచినన్=వదలిపెట్టినను (అనఁగా మృతిఁజెందినను), సిద్ధంబు=నిశ్చయము, అనాద్యంతమును = ఆద్యంతములులేనిదియు, భావా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తీతము=సంకల్పమునకు అతీతమైనదియు, నిర్వికల్పము=సంకల్పవికల్పములు (లేక భేదములు లేనిదియు), పరబ్రహ్మాత్మకంబు-పర = క్షరాక్షరపురుషులకంటెవేఱైన, బ్రహ్మాత్మకంబు=పరబ్రహ్మమే స్వరూపముగాఁ గలదియు, ఐనయ...బున్-ఐన,ఆ,కైవల్యంబున్=మోక్షమును, పొందున్ = పొందును. సత్యము=నిశ్చయము (బ్రహ్మజ్ఞానము కలవానికి నుత్తరాయణాదిపుణ్యకాలములతోఁ గాని పుణ్యక్షేత్రములతోఁ గాని పనిలేదు. వ్యాధులు కలిగినను లోపము లేదు. అన్నియు పూర్వకర్మాధీనములై స్థూలశరీరమునకు మాత్రమే వచ్చును. కావున సర్వసాక్షి యగుబ్రహ్మము నేమియుఁ జేయనేరవు. కావున ఈస్థూలదేహ మెప్పుడు పోయినను ముక్తికలుగుటకు హాని లేదనిభావము.)

తా. అహంకారములేనట్టి (లేక నహంకారముకంటె వేఱైనయాత్మయే) స్వరూపముగాఁ గలవాఁడా! మఱియొకవిశేషము. కర్మనిష్ఠులకుఁ గాని యుపాసనాపరులకుఁ గాని సామాన్యజనులకుఁగాని మరణమునందు దేశకాలనియమములు కలవు. దుర్మరణాదులవలన నధోగతియుఁ గలదు. ఈయమనస్కయోగికి మాత్ర మట్టినియమములు లేవు. ఎచ్చటనైనను ఏసమయమునసైనను ఏవిధముగానైనను ఏబాధచేతనైనను మృతిఁ జెందవచ్చును. దేశకాలాదు లెంతదుష్టము లైనను వానిమోక్షమునకు భంగమురానేరదు.

వ. అని యుపదేశించి. 187

టీ. అని యుపదేశించి=అని బోధించి.

అవ. ఇట్లు సర్వము నుపదేశించి. యుపసంహరించుచున్నాఁడు:—

ఉత్సాహ—

ఇదియె వేదశాస్త్రసార మిది యనంతసౌఖ్యదం
బిదియె రాజయోగశాస్త్ర మిదియె బ్రహ్మవిద్య మ
ద్ధృదయ మిదియె దీని నిరత మెవ్వఁడేని భక్తితో
సదమలాత్ముఁ డగుచు మిగులఁ జదువ వినిన వ్రాసినన్. 188

టీ. ఇదియె=ఈపైనవివరించినదియె, వేదశాస్త్రసారము-వేద = వేదములయొక్కయును, శాస్త్ర=శాస్త్రములయొక్కయును, సారము = నిష్కృష్టార్థము (అనఁగా వేదశాస్త్రముల విమర్శించిన పైఁజెప్పినవిషయమే యగును) ఇది, అనంత=అపరిమితమైన, సౌఖ్యదంబు=మోక్షసుఖము నిచ్చునది, ఇదియె, రాజయోగశాస్త్రము, ఇదియె, బ్రహ్మవిద్య=బ్రహ్మజ్ఞానము, ఇదియె, మద్ధృదయము=నామనసునందున్న విషయము, దీనిన్=ఈచెప్పినవిషయమును (లేక ఈశ్రీరామహృదయమును), నిరతము=ఎల్లప్పుడును, ఎవ్వఁడేనిన్=ఎవ్వఁడైనను, భక్తితోన్, సదమ...గుచున్-సత్ = శ్రేష్ఠమైనట్టియు, అమల=నిర్మలమైనట్టియు, ఆత్ముఁడగుచున్=మనస్సుకలవాఁడై, మిగులన్=మిక్కిలి, చదువన్=చదివినను, వినినన్=వినినను, వ్రాసినన్=వ్రాసినను, (పైపద్యముతో నన్వయము.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సుందరీవృత్తము.—

యుక్తియు నస్మద్భక్తియు జీవ
న్ముక్తియు సాక్షాన్ముక్తియుఁ గలుగున్. 189

టీ. యుక్తియును = రాజయోగంబును, అస్మద్భక్తియున్ = నాయందు భక్తియును, జీవన్ముక్తియున్=శరీరముతో నున్నను బంధరాహిత్యంబును, సాక్షాన్ముక్తియున్= విదేహకైవల్యంబును, కలుగున్=కలుగును.

తా. ఓయాంజనేయా! వేదశాస్త్రములన్నియుఁ జెప్పువానిలో సారాంశమైన దిదియే (అనఁగా నధికారభేదము ననుసరించి, యేవేవి యెట్లెట్లు చెప్పినను అన్నిటి యొక్క పరిపూర్ణాభిప్రాయ మిదియే). సుఖ మనఁదగిన మోక్షము దీనివలనమాత్రమే కలుగును. బ్రహ్మవిద్య యనఁగా నిదియే. రాజయోగశాస్త్ర మనఁగా నిదియె. నాహృదయమునం దున్న పరమాభిప్రాయ మిదియె. కావున నేపురుషుఁడైనను దీనిని శ్రద్ధతో చదివినను వినినను వ్రాసినను వానికి చక్కని బ్రహ్మాత్మైక్యయుక్తియు నాయందలి భక్తియు జీవన్ముక్తియుం విదేహకైవల్యంబును గలుగును.

వ. అట్లు గావునఁ బరమేశ్వరుం డైననానెమ్మనంబునఁ బరమనిక్షేపంబుగాఁ బ్రకాశించు సర్వోపనిషత్సారభూతం బైనయీదివ్యజ్ఞానంబును మద్భక్తుఁడవు మత్పూజాపరుండవు మదర్పితమనోబుద్ధివి మత్పరాయణుండవు నగుటంజేసి నీ కుపదేశించితి నింతకంటె రహస్యం బైనయర్థంబు నాడెందంబున లే దట్లగుట నిప్పరమార్థతాత్పర్యంబు దెలిసి తమఃపూర్ణంబు రజోమీనంబు క్రోధనక్రంబు గామశైవాలంబు జన్మమరణతరంగంబు రోగబుద్బుదంబు లోభ ఫేనంబు మోహావేలయు దుఃఖాగాధజలప్రవాహగంభీరం బైన సంసారపారావారంబు దరించి మోక్షపారంబుఁగాంచి కృతకృత్యుండవై మత్స్వరూపసమాధినిష్ఠుండవై యానందింపు మని పలికిన నప్పవననందనుఁడు సీతాదేవి లక్ష్మీదేవియనియు లక్ష్మణుండు శేషుం డనియు భరతశత్రుఘ్నులు పాంచజన్యసుదర్శనంబు లనియు సింహాసనంబు సుపర్ణుం డనియు శ్రీరామచంద్రుం డాదినారాయణుం డనియు నిప్పు డుపదేశించినపరబ్రహ్మతత్త్వజ్ఞానంబు సకలవేదశాస్త్రపురాణాగమేతిహాసస్మృతిసారం బనియు నెఱింగి పరమానందకందళితహృదయారవిందుండై యా శ్రీసీతారామాచార్యులచరణారవిందంబుల కనేకవంద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నంబులు గావించి నిలువఁబడి కరకమలంబులు ముకుళించి నిరతిశయ
వినయపూర్వకంబుగా నిట్లనియె. 190

టీ. అట్లుగావునన్ = కాఁబట్టి, పరమేశ్వరుండవైన = ఈశ్వరుండ వైన, నాస్వాంతంబునన్=నామనస్సునందు, పరమనిక్షేపంబుగాన్=అధికమగునిధిగా, ప్రకాశిం...బైన-ప్రకాశించు=ప్రకాశించుచున్న, సర్వోపనిషత్=సమస్తములైనయుపనిషత్తులకును, సారభూతంబైన = సారాంశమైన, ఈదివ్యజ్ఞానంబును = ఈబ్రహ్మజ్ఞానమును, మద్భక్తుండవు=నాయందుభక్తిగలవాఁడవును, మత్పూజాపరుండవు = నన్ను పూజించువాఁడవును, మద...బుద్ధివి=మత్=నాయందు, అర్పిత=అర్పింపఁబడిన, మనోబుద్ధివి=మనస్సుబుద్ధియు గలవాఁడవును,మత్...నుండవు-మత్=నేనే, పర=శ్రేష్ఠమైన, అయనుండవు=గతిగాఁగల వాఁడవును, అగుటం జేసి = అయియున్నావుగావున, నీకుపదేశించితిన్=నీకు బోధించితిని, ఇంతకంటెన్, అతిరహస్యంబైన = మిగులరహస్యమైన, అర్థంబు=విషయము, నాడెందంబున లేదు=నామనస్సునందు లేదు, అట్లగుటన్=కాఁబట్టి, ఇప్పర...బు - ఇప్పరమార్థ = ఈసత్యమయిన - (శ్రేష్ఠమగునిర్ణయమునుం గూర్చిన), తాత్పర్యంబున్ = యథార్థాభిప్రాయమును, తెలిసి==తెలిసికొని, తమఃకూర్మంబు=తమోగుణమను తాఁబేలు గలదియు (తాఁబేలు సర్వాంగములఁ గానరాకుండ ముడుచునట్లు తమోగుణము సర్వవిషయములఁ బ్రకాశింపకుండ నావరించును. కావున తమోగుణమును తాఁబేటితోఁ బోల్చియున్నాఁడు.), రజోమీనంబు=రజోగుణ మను చేఁపగలదియు (రజోగుణము చేఁపవలెను మిగులఁ జలించు స్వభావముకలది), క్రోధనక్రంబు = కోపమనెడు మొసలి గలదియు (మొసలి తానుబట్టిన జంతువును లోనికి (లేక క్రిందికి) నిశ్చయముగా నీడ్చికొనిపోవునట్లు క్రోధంబును దానుబట్టినవాని నధోగతినొందించును), కామశైవాలంబు = కోర్కెయనుసాచుకలదియు (పాచివలె కోర్కె లప్పటప్పటికి పుట్టుచు నప్పటప్పటికి తొలఁగుచు స్వచ్ఛత్వమునకు భంగమును గలిగించును), జన్మమరణతరంగంబు=చావుపుట్టుకలను నలలుకలదియు (సముద్రమున నలలవలె సంసారమున జననమరణములు ముందరకును వెనుకకును వచ్చుచుపోవుచు తిరుగుచుండును), రోగబుద్బుదంబు=రోగములను బుడకలు గలదియు (నీటియందు బుడకలువలె నీరోగములును వచ్చుచుఁ బోవుచుండును), లోభఫేనంబు=అత్యాశయను నురుఁగుకలదియు (నీరుండిన నురుగవశ్యముగానుండునట్లు సంసారాభిమానముండిన నత్యాశ యవశ్యముగానుండును. కావున నిట్లు పోల్పంబడెను),మోహవేలయున్ = మోహమను చెలియలికట్టగలదియు (చెలియలికట్ట సముద్రమును నిలుపుచున్నట్లు అజ్ఞానము సంసారమును నిలుపుచున్నది), దుఃఖా...రంబు - దుఃఖ = దుఃఖమనెడు, అగాధ...మైన, జలప్రవాహ=జలప్రవాహములచేత, గంభీరంబు = భయం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కరమైనదియు (సముద్రములం దెచ్చటఁజూచినను లోఁతగు జలప్రవాహము లుండుటచే నడుగుపెట్టుటకు నశక్యమైనట్లు సంసారమునందును సర్వము దుఃఖమయమై యగుటచేత స్పృశించుటకైన నది (సంసారము) యశక్యమైయున్నదనిభావము), ఐన = ఐనట్టి, సంసారపారావారంబుఁ=సంసారసముద్రమును, తరించి=దాఁటి, మోక్షపారంబుఁ= మోక్షమనెడు నావలితీరమును, కాంచి = చూచి, కృతకృత్యుండవై = కృతార్థుఁడవై, మత్స్వ...డవై-మత్=నాయొక్క, స్వరూపసమాధి=స్వరూపమునాశ్రయించిన యోగ నిష్ఠయందు, నిష్ఠుండవై=స్థిరుఁడవై, ఆనందింపుమనిపలికినఁ = ఆనందింపుమని చెప్పఁగా, అప్పవనసందనుండు=ఆయాంజనేయుఁడు, సీతాదేవిలక్ష్మీదేవియనియు,లక్ష్మణుండు శేషుం డనియుఁ=లక్ష్మణుఁడు ఆదిశేషుఁడెయనియు, భరతశత్రుఘ్నులు పాంచజన్యసుదర్శనంబు లనియుఁ=భరతుఁడు శంఖమనియు శత్రుఘ్నుఁడుచక్రమనియు, సింహాసనంబు సుపర్ణుఁ డనియుఁ = రాముఁ డధిష్ఠించినసింహాసనము గరుత్మంతుఁడనియుఁ, శ్రీరామచంద్రుం డాదినారాయణుండనియుఁ=శ్రీరాముఁడు మహావిష్ణువనియు, ఇప్పుడు, ఉప...సంబు- ఉపదేశించిన=బోధించిన, పరబ్రహ్మ=పరబ్రహ్మముయొక్క, తత్త్వ = యథార్థస్వరూప మునుగూర్చిన, జ్ఞానంబు=జ్ఞానము (లేక విమర్శ), సక...యుఁ-సకల = సమస్తమైన, వేద=వేదములయొక్కయు, శాస్త్ర = శాస్త్రములయొక్కయు, పురాణ = పురాణముల యొక్కయు, ఆగమ=శైవవైష్ణవాద్యాగమములయొక్కయు, ఇతిహాస = భారతరామా యణాదీతిహాసములయొక్కయు, స్మృతి = స్మృతులయొక్కయు, సారంబనియుఁ = సారాంశమనియును, ఎఱింగి=తెలిసికొని, పరమ...దుండై-పరమ=శ్రేష్ఠమైన, ఆనంద = ఆనందముచేత, కందళిత=మొలకలెత్తిన (అనఁగా వికసించిన), హృదయారవిందుఁడై = హృదయకమలముగలవాఁడై, ఆశ్రీ...లకుఁ-ఆ=మహాత్ములగు, శ్రీ=శోభాయుక్తుఁడైన, సీతా=సీతయనెడు, రామ = రాముఁడనెడు, ఆచార్యుల = గురువులయొక్క, చరణార విందంబులకుఁ = పాదకమలములకు, అనేక వందనంబులొనరించి = అనేక నమస్కార ములుచేసి, నిలువఁబడి, కరకమలంబు=హస్తకమలములను, ముకుళించి = మోగిడ్చి, నిరతి శయవినయపూర్వకంబుగాఁ=లోకోత్తరమైన వినయముతో, ఇట్లనియెఁ.

తా. కావున ఓయాంజనేయా! నాహృదయమునఁ బ్రబలనిధానముగా నుంచు కొనినట్టియు సర్వోపనిషత్సారాంశమైనట్టియు నీవిషయమును, నాయందు భక్తిగల వాఁడవును మనోబుద్ధుల నాయంద సమర్పించి నాకంటె నితరమగుగతి లేదని తలంచు వాఁడవును సర్వకాలములయందును నన్నే సేవించువాఁడవు నగుటచే ననుగ్రహబుద్ధిచేత నీ కుపదేశించితిని. నాహృదయమున నింతకంటె నధికమగువిషయము లేదు. కావున నీ యభిప్రాయమును సంపూర్ణముగాఁ గ్రహించి, తమోగుణము తాఁబేలుగాను రజో గుణము చేఁపగాను [illegible] పుట్టుక చావు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అనునవి యలలుగాను రోగములు బుడగలుగాను ఆశ నురుగుగాను మోహము చెలియలి కట్టగాను దుఃఖము మహాజలప్రవాహములుగాను గలిగి మిగుల భయంకరమైయున్న సంసారసముద్రమును దాటుము. మోక్షమను నావలితీరమును జేరుము. కృతార్థుడవై యాత్మానందము ననుభవింపుము. నిర్వికల్పసమాధినిష్ఠుండవు కమ్ము. ఓ పార్వతీ! ఈవిధముగా శ్రీరాముఁడు సర్వము నుపదేశింపఁగానే యాహనుమంతుఁడు "సీతాదేవి లక్ష్మి, భరతశత్రుఘ్నులు శంఖచక్రములు, లక్ష్మణుఁడు శేషుఁడు, సింహాసనము గరుత్మంతుఁడు, శ్రీరాముఁ డాదినారాయణుఁడు, ఈబోధ సర్వశాస్త్రసారము" అని తెలిసికొని పరిపూర్ణానందము నొందెను. ఆసీతారామగురునకు ననేకనమస్కారంబు లాచరించి హస్తముల ముకుళించి యిట్లని వినుతింప నారంభించెను.

## ఆంజనేయుఁడు శ్రీరాముని వినుతించుట.

అవ. పరమేశ్వరుఁ డీవిధముగా శ్రీరామహృదయమును పార్వతికి నుపదేశించి యాంజనేయుని స్తోత్రవాక్యముల నుపన్యసించుచు నుపసంహరించుచున్నాఁడు:—

క. శ్రీరామ! రామ! రామ! రమారామామణిమనోరమారమణా శ్రీ
నారాయణ! నారాయణ!, నారాయణ! నిజసహస్రనామస్తుత్యా!

టీ. శ్రీరామ=బ్రహ్మవిద్యతోఁ గూడినవాఁడా, రామ = సృష్టిస్థితిలయములే క్రీడలుగాఁ గలవాఁడా, రామ = సమస్తయోగులును దనయందును తాను సమస్తయోగులయందును విహరించువాఁడా, రమా...రమణా-రమా = లక్ష్మియనెడు, రామామణి=స్త్రీరత్నముయొక్క, మనః = మనస్సును, రమా = రమింపఁజేయునట్టి, రమణా= భర్త యగువాఁడా, శ్రీనారాయణ-శ్రీ = జ్ఞానశక్తితోఁగూడినట్టియు, నారాయణ = సకలతత్వములను ఆశ్రయములుగాఁ గలిగినట్టియు, (లేక, సకలతత్త్వములకు నాశ్రయుఁడవైనట్టియు 'రిజ్ క్షయే' అను ధాతువు నాశ్రయించిన "రః" అనుపదమునకు "నశించువాఁడు" అని యర్థ మేర్పడును. కావున "నరః" అనఁగా నశింపనివాఁడు; బ్రహ్మము అని యర్థమగును. సకలతత్త్వములును బ్రహ్మమునుండి జనించినవి కావున వానికి 'నరాజ్జాతాని నారాణి' అను వ్యుత్పత్తి నాశ్రయించి 'నారములు' అని పేరు. ఆనారములు ఆశ్రయములుగాఁ గలవాఁడు, లేక నారములకు నాశ్రయమైనవాఁడు, 'నారాః ఆయనం యస్య సః' అను వ్యుత్పత్తిచేఁగాని 'నారాణా మయనం' అను వ్యుత్పత్తిచేఁ గాని నారాయణుఁ డగును.) నారాయణ = అపరోక్షజ్ఞానమున కాశ్రయ మగువాఁడ (లేక అపరోక్షజ్ఞానమే యాశ్రయముగాఁ గలవాఁడ), నారమనఁగా జ్ఞానము. నారాయణ=సర్వశబ్దవాచ్యుఁడా! 'శైవద్దే' ధాతు నాశ్రయించిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'రః' అనుపదమునకు 'శబ్దము' అని యర్థమేర్పడును. కావున శబ్దములకు గతి అనఁగా శబ్దములచేఁ బొందఁదగినవాఁడు; 'రాణా మయనః' 'రాః అయనం యస్యసః' అను వ్యుత్పత్తులచేత రాయణుఁ డగును. రాయణుండు కానివాఁ డరాయణుఁడు. అరాయణుండు కానివాఁడు అనఁగా రాయణుఁడె నారాయణుండు నిజ...స్తుత్యా=నిజ = స్వకీయమయిన, సహస్రనామ=సహస్రనామములచేత, స్తుత్యా=స్తోత్రము చేయఁదగినవాఁడా!

తా. బ్రహ్మవిద్యతోఁ గూడినట్టియు సృష్టిస్థితిసంహారములఁ జేయునట్టియు, రాజయోగులకు క్రీడాస్థాన మైనట్టియు, రాజయోగులయందు నివసించునట్టియు, లక్ష్మికి భర్తయయినట్టియు, సమస్తతత్వములకు నాశ్రయభూతుఁడవై సమస్తతత్వములు నాశ్రయముగాఁ గలిగినట్టియు, అపరోక్షజ్ఞానమునకు నివాసభూతుఁడ వైనట్టియు, సర్వశబ్దవాచ్యుఁడ వైనట్టియు నో మహాత్మా!

శ్లో. దేహబుద్ధ్యాఽస్మి దాసోఽహం జీవబుద్ధ్యా త్వదంశకః,
ఆత్మబుద్ధ్యా త్వమేవాహ మితి మే నిశ్చితా మతిః. 192

టీ. అహం=నేను, దేహబుద్ధ్యా = "శరీరమే నేను" అనుతలంపుచే, (అనఁగా: అనాది యగు నజ్ఞానముచే), దాసః=నీకు సేవకుఁడను, అస్మి=ఐయున్నాను. జీవబుద్ధ్యా= "నేను దేహములకంటె భిన్నుఁడను జీవుండను" అనుకలంపుచే (అనఁగా: పరాపరాప్రకృతులను వేఱుచేసిన వివేకముచే), త్వదంశకః=నీయంశము, అస్మి = ఐయున్నాను. ఆత్మబుద్ధ్యా = "నేను జీవుండను కాను జీవసాక్షి యగుకూటస్థుండను" అనుతలంపుచే (అనఁగా: దృశ్యవివేకముచే), అహం = నేను, త్వమేవ = నీవే (అనఁగా: నీకంటె వేఱు కానివాఁడను.), అస్మి, ఇతి=ఈవిధముగా, మే=నాయొక్క, మతిః=మనస్సు, నిశ్చితా=దృఢమై యున్నది.

తా. దేహాత్మాభిమాన మున్నపుడు నేను నీకు దాసుఁడను జీవాత్మాభిమాన మున్న నీలోనిభాగమునగుదును. ఈరెండభిమానములును వదలి "కూటస్థుఁడే" నేను అని నిశ్చయించితినేని యిప్పుడు మన కిరువురకును భేదమేలేదు. ఈవిషయము మీఅనుగ్రహమువలన నామనస్సునందు స్థిర మైనది.

వ అని పల్కి సాదరంబుగా ననుజ్ఞాతుం డై నిజాశ్రమంబున కరిగి యాహనుమంతుం డొక్కపరమైకాంతస్థలంబున సుఖాసీనుండై శ్రీరామచరణకమలభక్తియుక్తుండును శ్రీరామనామజపపరాయణుండును శ్రీరామ బ్రహ్మతత్త్వావలోకననిరతిశయనిర్వికల్పసమాధినిష్ఠుండునై జీవన్ముక్తిసుఖం బనుభవించుచు నిమ్మహాస్తంబున నున్నవాఁ డని శ్రీమహాదేవుం డప్పార్వతీదేవి కిట్లనియె. 193

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. అనిపల్కి=అనిచెప్పి, సాదరంబుగాన్ = ప్రీతిపూర్వకముగా, అనుజ్ఞాతుండై=రామునియొద్ద నుండి యాజ్ఞనుగైకొని, నిజాశ్రమంబునకున్=తనయాశ్రమమునకు, అరిగి=పోయి, ఆహనుమంతుండు, ఒక్కపరమైకాంతస్థలంబునన్=ఒకయేకాంతస్థలము నందు, సుఖాసీనుండై = సుఖముగాఁ గూర్చుండి, శ్రీరామచరణకమల...డును-శ్రీ=శోభాయుక్తుఁడైన, రామ = ఆత్మారామునియొక్క, చరణకమల=పాదకమలములయందలి, భక్తి = భక్తితో, యుక్తుండును = కూడినవాఁడును, శ్రీ...డును-శ్రీ = బ్రహ్మరూపిణి యగు సీతాదేవిని, రామనామ=రమింపఁజేయునట్టి శ్రీరామునియొక్క నామమును, జప=జపము సేయుటయే, పరాయణుండును = ముఖ్యమైనరీతిగాఁ గలవాఁడును, శ్రీరా...డునై-శ్రీరామబ్రహ్మ = శ్రీరామరూపుఁడగుపరబ్రహ్మయొక్క, తత్త్వ=యథార్థరూపమును, అవలోకన = చూచుటయనెడు, నిరతిశయ=లోకోత్తరమైనట్టియు, నిర్వికల్ప=సంకల్పవికల్పములు లేనట్టియు, సమాధి అమనస్కరాజయోగమునందు, నిష్ఠుండునై = స్థైర్యముగలవాఁడును అగుచు, జీవన్ముక్తిసుఖంబు = జీవన్ముక్తి సుఖమును అనుభవించుచున్, ఇమ్ముహూర్తంబున నున్నవాఁడు=మనముమాటలాడుసమయమునందుఁగూడ నున్నాఁడు.(హనుమంతుఁడు చిరంజీవికావున నిట్లు చెప్పఁబడెను—"అశ్వత్థామా బలి ర్వ్యాసో హనుమాంశ్చ విభీషణః, కృపః పరశురామ శ్చ సప్తైతే చిరజీవినః" అనువాక్య మిందుకు ప్రమాణము.) అని పలికి = అనిచెప్పి, శ్రీమహాదేవుండు = ఈశ్వరుఁడు, అప్పార్వతీదేవి కిట్లనియెన్.

తా. ఓపార్వతీ! ఈవిధముగా శ్రీరాముని వినుతించి యమ్మహాత్మునివలన నాజ్ఞ గైకొని స్వాశ్రమమునకుఁ జనియెను. అచ్చట శ్రీరామతత్త్వానుభవముఁ జేయుచు శ్రీ రామనామమును జపించుచు శ్రీరామభక్తిని వదలక నిర్వికల్పసమాధియందు నిలిచి మోక్షసుఖము ననుభవించుచుఁ జిరంజీవి యగుటచే నిప్పటికి నున్నవాఁడు.

అవ. ఇట్లు సర్వము నుపదేశించి పార్వతికి పరమేశ్వరుఁ డిట్లని సారాంశమును జెప్పుచున్నాఁడు:—

తే. మంత్రమంత్రార్థమంత్రాభిమానదేవ
తాస్వరూపంబులను నీకుఁ దాఁప కేను
నెఱుఁగ నుపదేశ మిచ్చితి నింతకంటె
ఘననిధానంబు లేదు నామనమునందు 194

టీ. నీకున్, ఏను = నేను, మంత్ర...బులన్-మంత్ర = తారకమంత్రమును, మంత్రార్థ=దానియర్థమును, మంత్రాభిమానదేవతా = మంత్రాధిదేవతయొక్క, స్వరూపంబులన్=స్వరూపములను, తాఁపక=దాఁచిపెట్టక, ఎఱుఁగన్=బాగుగఁ దెలియునట్లుగా,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉపదేశమిచ్చితిర్ , ఇంతకంటెర్=దీనికంటె, నామనమునందుర్ = నామనస్సునందు, ఘన...నంబు-ఘన=అధిక మైన, నిధానంబు=నిధి (లేక నిక్షేపము), లేదు.

తా. ఓగౌరీ ! నీవడిగినప్రశ్నమునకు సంపూర్ణముగా నుత్తరమును జెప్పితిని. శ్రీరామమంత్రమును దానియర్థమును తద్దేవతాస్వరూపమును ఇతిహాసకథనద్వారముగఁ దెల్పితిని. అంతకంటె రహస్య మగువిషయ మెద్దియుఁ నామనస్సునందు లేదు.

క. నిఖిలకలుషసంక్షయకర,మఖిలాభీష్టప్రదం బనంతవ్యయచి
త్సుఖదము జగదధిపత్యభి,ముఖకర మగుమంత్రరాజము మహాదేవీ!

టీ. మహాదేవీ=ఓపార్వతీ, మంత్రరాజము = ఈతారకమంత్రము, నిఖిలకలుష సంక్షయకరము = సమస్తపాపములను నశింపఁజేయునది, అఖిలాభీష్టప్రదంబు = సమస్త మైనకోరికలను నిచ్చునది, అనం...త్సుఖము-అనంత=తుదిలేనట్టియుఁ, అవ్యయ=నాశము లేనట్టియుఁ, చిత్=జ్ఞానమనెడు (లేక జ్ఞానరూపమైనట్టి), సుఖ=సౌఖ్యమును (అనఁగాః బ్రహ్మానందమును), దము=ఇచ్చునట్టిదియుఁ, జగదధి...కరము-జగత్ = ప్రపంచమునకు, అధిపతి=ప్రభువైనపరమాత్మను, అభిముఖ=ఎదురగునట్లు, కరము=చేయునదియుఁ.

తా. సమస్తపాపముల నశింపఁజేయునదియుఁ సర్వకామముల నొసంగునదియుఁ నపరిమితము నక్షయము నగుబ్రహ్మానందము నిచ్చునదియుఁ ప్రపంచమున కధీశ్వరుఁ డగు పరబ్రహ్మను నభిముఖునిగా నాచరించునదియుఁ నగుమంత్రోత్తమ మిదియే. ఓమహాదేవీ! దీనికంటె నధిక మైనది లోకమున లేదు.

సీ. బహుజన్మసంచితపాపంబులు నశించు
విమలధర్మము లభివృద్ధినొందు
నాయురారోగ్యంబు లధికంబులై యొప్పుఁ
బటుతరైశ్వర్యసంప్రాప్తియగును
ధృతియును గీర్తియుఁ దేజంబు బలమును
శాంతిదాంతిక్షమార్జవము లబ్బు
ధనధాన్యపుత్రపౌత్రకళత్రబాంధవ
పశుగజాశ్వాదిసంపదలు గలుగుఁ
తే. బుడమిలో నెన్నిసద్గుణంబులు చెలంగు
నన్నిగుణములు ప్రాప్తించు నార్తితోడ
సతత మీరామహృదయంబు చదువుకొనుచుఁ
దద్విచారంబుఁ [illegible] ధన్యులకును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ఆర్తితోడన్=ఆతురతతో, సతతము=ఎల్లప్పుడును, ఈశ్రీరామహృదయంబు = ఇంతవఱకు వర్ణింపఁబడియున్న శ్రీరామహృదయ మనుకథను, చదువుకొనుచున్, తద్విచారంబు=దానియర్థముయొక్క విచారము, కావించుధన్యులకు, బహు...లు-బహుజన్మ=పెక్కుజన్మములయందు, సంచిత=ఆర్జింపఁబడిన, పాపంబులు, నశించున్, విమల ...ర్మములు-విమల=నిర్మలమైన, ధర్మములు, అభివృద్ధినొందున్, ఆయురారోగ్యంబులు-ఆయుః=ఆయుస్సు, ఆరోగ్యంబులు=ఆరోగ్యము, అధికంబులై, ఒప్పున్ = ప్రకాశించును. పటుతరైశ్వర్యసంప్రాప్తి-పటుతర=అధికమైన, ఐశ్వర్య=ఐశ్వర్యముయొక్క (లేక ధనముయొక్క), సంప్రాప్తి=దొరకుట, ధృతియున్ = ధైర్యంబున్, కీర్తియున్, తేజంబున్=ప్రతాపమును, బలమున్, శాంతి...ములు-శాంతి, దాంతి=ఇంద్రియనిగ్రహంబు, క్షమ=ఓర్పు, ఆర్జవములు=నిష్కాపట్యము అనునది, అబ్బున్ = కలుగును, ధన...దలు-ధన=ధనము, ధాన్య=ధాన్యము, పుత్ర=పుత్రులు, పౌత్ర=మనుమలు, కళత్ర=భార్య, బాంధవ=బంధువులు, పశు=పశువులు, గజ=ఏనుఁగులు, అశ్వ=గుఱ్ఱములు, ఆది = మొదలైన, సంపదలు=సంపత్తు, కలుగున్, పుడమిలో = భూమియందు, అన్నిసద్గుణంబులు చెలంగున్=ఏసద్గుణము లున్నవో, అన్నిగుణములు=ఆగుణము లన్నియును, ప్రాప్తించున్ =వచ్చును.

తా. శ్రీరామహృదయమును చదువుచు నర్థవిచారము చేయుమహాత్ములకు ననేక జన్మములనుండి యార్జింపఁబడిన పాపములు హరించి పుణ్యములభివృద్ధియగును.ఆయుస్సు ఆరోగ్యము వృద్ధియై మహైశ్వర్యముకలిగి యిహలోకసౌఖ్యము సంపూర్ణముగఁ గలుగును. ధైర్యము కీర్తి ప్రతాపము బలము శమదమములు ఓర్పు నిష్కాపట్యము ధనము ధాన్యము సుశీలయగుభార్య విద్యావంతుఁ డగుపుత్రుఁడు గజములు అశ్వములు మొదలగుసంపదలును ప్రాప్తించును. ఇంతయేల? భూమిలో నుత్తమము లనంబడునవి యేవి యేవి కలవో యవి యన్నియుఁ నబ్బును.

క. శ్రీరామహృదయమును బ
ల్మారు న్వీక్షించు బుధసమాజంబునకున్
శ్రీరామతత్త్వసాక్షా
త్కారం బగుఁ గలుగుఁ బరమకైవల్యంబున్. 197

టీ. శ్రీరామహృదయమున్=శ్రీరామహృదయమను నీచరిత్రను, పల్మారున్ = ఎల్లప్పుడును, వీక్షించు...నకున్-వీక్షించు = చూచునట్టి, బుధ = విద్వాంసులయొక్క, సమాజంబునకున్ = సమూహమునకు, శ్రీరా...రంబు - శ్రీరామతత్త్వ = శ్రీరాముని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యథార్థస్వరూపముయొక్క, సాక్షాత్కారంబు = ప్రత్యక్షమును (అనఁగా: నపరోక్ష జ్ఞానము), పరమకైవల్యంబుఁ = శ్రేష్ఠమగు మోక్షంబును, కలుగుఁ = దొరకును.

తా. ఈయితిహాసము మాటిమాటికి విమర్శించువిద్వాంసులకు ఆశ్రీరాముని యథార్థతత్త్వస్వరూపసాక్షాత్కారము గలిగి మోక్షము దొరకును.

క. ఆతతముగ నెఱిఁగించితి, సీతారామాంజనేయచిత్సంవాదం
బీతత్త్వామృతమాని నిరాతంకసుఖాబ్ధి నోలలాడుము గిరిజా. 198

టీ. గిరిజా = ఓపార్వతీ! ఆతతముగఁ = వివరముగా, సీతారా...దంబుఁ-సీతా=సీతకును, రామ=రామునకును, ఆంజనేయ = ఆంజనేయునకును, జరిగిన, చిత్సంవాదంబు = బ్రహ్మస్వరూపవిషయక మైనసంవాదమును, ఎఱిఁగించితిఁ = తెలియఁజేసితిని, ఈతత్త్వామృతముఁ=ఈబ్రహ్మతత్త్వమనెడు అమృతమును, ఆని=పానముఁజేసి, నిరా...బ్ధిఁ-నిరాతంక=ఆటంకములేని (అనఁగా: భంగములేని), సుఖాబ్ధిఁ = బ్రహ్మానంద సముద్రమునందును, ఓలలాడుము=మునుఁగుము.

తా. కావున నోపార్వతీ! సీతారామాంజనేయులకుఁ గలిగినబ్రహ్మవిషయసంవాదము పరిపూర్ణముగాఁ దెలియఁజేసితిని. కావున నీవును ఈసర్వము నెఱింగి ఏవిఘ్నములు లేక పరమానందసముద్రమున నోలలాడుము.

అవ. కవి యీవిధముగా రాజయోగమునువర్ణించి యుపసంహరించుచున్నాఁడు.—

వ. అని పలికి యయ్యనాదిదంపతులు రామబ్రహ్మానందామృతరసపాన మదపరవశు లై యన్యోన్యాలింగనంబులు గావించి పరమసుఖైక స్వరూపు లై నిజచరణకమలసేవాసక్తులైన భక్తుల రక్షించుచుఁ బ్రకాశించుచుండి రంత. 199

టీ. అనిపలికి=ఇట్లుచెప్పి, అయ్యనాదిదంపతులు = ఆయనాది సతీపతులు, రామ...వశులై-రామబ్రహ్మ = రామపరబ్రహ్మరూపమగు, ఆనంద = ఆనందమనెడు, అమృత రస=అమృతమును, పాన = పానముచేయుటచేత, పరవశులై = అస్వాధీనచిత్తులై (లేక నిశ్చేష్టులై), అన్యో...బులు-అన్యోన్య = ఒకరొకరియొక్క, ఆలింగనంబులు, కావించి = చేసి, పరమసుఖైకస్వరూపులై = పరమానందరూపులై, నిజ...చుచుఁ-నిజ = తమ యొక్క, చరణకమల = పాదకమలములయొక్క, సేవ=సేవయందు, ఆసక్తులై=ఆశగల వారైన, భక్తులఁ=భక్తులను, రక్షించుచుఁ, ప్రకాశించుచుండిరి. అంత=తర్వాత.

తా. కృతినాయకుఁడ వగునోమహాదేవాచార్యా! ఈవిధముగ నప్పరమేశ్వరుండు పార్వతికి సర్వము నుపదేశించెను. అప్పుడు బ్రహ్మానందరసమగ్నులై వారిద్దరు నన్యో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్యాలింగనములఁ గావించి సంతుష్టులైరి. తమపాదముల భక్తితో సేవించువారల కిష్టార్థముల నొసంగుచుఁ బ్రకాశించుచున్నారు.

అవ. ఈక్రిందిపద్యముచే కవి స్వాహంకారనిరాకరణపూర్వకముగ గ్రంథమును ముగించుచున్నాఁడు:—

మత్తకోకిల.—

నీవు నాహృదయాంబుజంబున నిల్చి భానునికైవడిం
గేవలాత్మవివేకముఁ వెలిఁగించుచుం బరికింపఁగాఁ
బావనం బగురాజయోగము పల్కితిం దగ శ్రీమహా
దేవ! సద్గురురాయ! కావుము దీని నీయిల రంజిలన్. 200

టీ. శ్రీమ...రాయ-శ్రీ = జ్ఞానవంతుఁడైన, మహాదేవ = మహాదేవుఁడను పేరుగల, సద్గురురాయ=సద్గురుశ్రేష్ఠా! నీవు, నాహృదయాంబుజంబునన్ = నాహృదయకమలమందు, నిల్చి = ఉండి, భానునికైవడిన్ = సూర్యునివలె, కేవలా...కముఁన్-కేవల=అద్వితీయమైన, ఆత్మవివేకముఁన్ = ఆత్మజ్ఞానమును, వెలిఁగించుచున్=ప్రకాశింపఁజేయుచు, పరికింపఁగాన్=విచారింపఁగా, పావనంబు = పరిశుద్ధమైన, అగు రాజయోగము=అయినట్టిరాజయోగము, తగన్=ఒప్పునట్లుగా, పల్కితిన్=వర్ణించిచెప్పితిని. (అనఁగా: గ్రంథముగా వచింపఁగలిగితిని), దీనిన్=ఈగ్రంథమును, ఇయ్యిలన్=ఈభూమియందు, రంజిలన్=అభివృద్ధిఁ జెందునట్లుగా, కావుము. రక్షింపుము.

తా. గురుశ్రేష్ఠుఁడ వగునోమహాదేవాచార్యా! నీవు నాహృదయమునందునిలిచి సూర్యునివలె నామనఃకమలమును బ్రకాశింపఁ జేయుచు నాత్మబ్రహ్మైక్యజ్ఞానమును బ్రకాశింపఁజేయుచుండుటచే నీగ్రంథమును జెప్పఁగలిగితిని కాని దీనియందు నాసామర్థ్యమేమియుం లేదు. దయచే దీనిని భూమిపై నభివృద్ధి నొందునట్లుగా రక్షింపుము.

అవ. 201-202-203 పద్యములచేఁ గృతిపతిని సంబోధించుచున్నాఁడు:—

శా. దత్తాత్రేయగురుస్వరూప! నిజభక్తాంతస్తమోదీప! స
చ్చిత్తానందకరానులాప! ఖమరుచ్చిత్రాంశువార్వ్యాప! ధీ
వృత్తిత్యాగకలాప! నిత్యసుఖసంవిద్వ్యాప! శుద్ధాత్మశ
శ్వత్తేజోభిహతాదిపాప! సుజనేష్టప్రాపకా! వ్యాపకా! 201

టీ. దత్తాత్రే...రూప - దత్తాత్రేయగురు = దత్తాత్రేయుఁడనెడుగురువే (ఈయన మహాదేవాచార్యులనుట), స్వరూప=స్వరూపముగాఁ గలవాఁడ, నిజ...దీప-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిజ=తనయొక్క, భక్త = భక్తులయొక్క, అంతః = హృదయమునందలి, తమః = అంధకారమునకు (అనఁగా: నజ్ఞానాంధకారమునకు), దీప = దీపమువంటివాఁడా (అనఁగా దానిని నశింపఁజేయువాఁడా), సచ్చి...లాప-సత్ = సత్పురుషులయొక్క, చిత్త = మనస్సులకు, ఆనందకర = ఆనందమును కలిగించునట్టి, అనులాప = వాక్యములు గలవాఁడా, ఖమరు...ర్భూప-ఖ = ఆకాశమునకును, మరుత్ = వాయువునకును, చిత్రాంశు = అగ్నికిని, వార్ = జలమునకును, భూ = భూమికిని, ప = ప్రభువా! ధీవృత్తీత్యాగకలాప - ధీ = బుద్ధియొక్క, వృత్తి = వృత్తులకు (అనఁగా: కామక్రోధాదులను), త్యాగ=విడుచుటయే, కలాప = భూషణములుగాఁ గలవాఁడా, నిత్య... ద్వ్యాప-నిత్య=శాశ్వతమైనట్టి, సుఖ=ఆనందరూపమైనట్టి, సంవిత్=పరబ్రహ్మరూప మగుజ్ఞానమునందు, వ్యాప=వ్యాపించియున్నవాఁడా (లేక జ్ఞానము నాత్మస్వరూపముగాఁ జెందినవాఁడా), శుద్ధా...పాప-శుద్ధాత్మ = నిర్మలమగు మనస్సుకలవాఁడా, శశ్వత్=అపరిమితమైన, తేజః = ఆత్మప్రకాశముచేత, అభిహత = కొట్టఁబడిన, ఆది= అనాదియైన (లేక మొదటినుండి వచ్చుచున్న) పాప = పాపము కలవాఁడా (లేక అజ్ఞానముగలవాఁడా), సుజ...ప్రాపకా-సుజన=సత్పురుషులయొక్క, ఇష్ట=ఇష్టమును, ప్రాపకా=కలుగఁజేయువాఁడా, వ్యాపకా=సర్వవ్యాపకుఁడా!

క. ప్రణవాత్మక! సదసత్కారణ! సంపూర్ణప్రభాభిరామ! సగుణ! ని
ర్గుణ! నిర్వికార! నారాయణ! సీతారామగురుమహాదేవ! శివా!

టీ. ప్రణవాత్మక=ఓంకారరూపుండ!, సదసత్కారణ = నేత్రములకు గోచరములగు భూతములకును, అట్లు కాని వాయ్వాకాశములకును కారణభూతుఁడ!, సంపూర్ణ= సర్వపరిపూర్ణమయిన, ప్రభ = కాంతిచేత, అభిరామ=మనోహరుఁడా!, సగుణ = గుణవంతుఁడా!, నిర్గుణ = గుణరహితుఁడా!, నిర్వికార = పుట్టుక మొదలగు వికారములు లేనివాఁడా!, నారాయణ = పరబ్రహ్మస్వరూపుఁడా!, శివా = ఆనందస్వరూపుఁడా!, సీతారామగురుమహాదేవ-సీతారామ = సీతారామరూపుఁడవైన, గురుమహాదేవ = మహాదేవాచార్యా.

మాలిని.—

ఘనతరసువివేకా! కల్పితాశేషలోకా!
వినమితబుధలోలా! విశ్వవిఖ్యాతలీలా!
జననుతగుణతంత్రా! సర్వతంత్రస్వతంత్రా!
మునిసరసిజమిత్రా! మోక్షలక్ష్మీకళత్రా!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ఘనతర... వేకా-ఘనతర=మిగులశ్రేష్ఠమైన, సువివేకా = అపరోక్షజ్ఞానము గలవాఁడా, కల్పి...లోకా-కల్పిత = సృజింపఁబడిన, అశేష=సమస్తములగు, లోకా= లోకములుగలవాఁడా, విన...లోలా-వినమిత = నమ్రులైన, బుధ = పండితులయందు, లోలా=ఆసక్తిగలవాఁడా, విశ్వ..,లీలా-విశ్వ = ప్రపంచమునందు, విఖ్యాత = ప్రసిద్ధమైన, లీలా = విలాసముగలవాఁడా, జన...తంత్రా-జన = లోకముచేత, నుత=స్తోత్రముచేయఁబడిన, గుణ=త్యాగముభోగము మొదలగుగుణములే, తంత్రా=పరివారముగాఁగలవాఁడా, సర్వ...తంత్రా-సర్వతంత్ర=సమస్తశాస్త్రములందును, స్వతంత్రా=కర్తృత్వము గలవాఁడా! ('తంత్రం స్వరాష్ట్రచింతాయాం తంతువాయే పరిచ్ఛదే, యాగప్రయోగే సిద్ధాన్తే శాస్త్రే' అని రత్నమాలానిఘంటువు), ముని...మిత్రా - ముని=ఋషులనెడి, సరసిజ = కమలములకు, మిత్రా=సూర్యుఁడైనవాఁడా! మోక్ష...కళత్రా-మోక్షలక్ష్మీ=మోక్షసంపదయే, కళత్రా=భార్యగాఁగలవాఁడా!

గద్య. ఇది శ్రీమన్నారాయణమహాదేవగురుకరుణాకటాక్షవీక్షణవిమలీకృతనిజహృదయకమలకర్ణికాంత సందర్శితాఖండ సచ్చిదానందరసైకస్ఫూర్తిషట్చక్రసీతారామమూర్తిపరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తిప్రణీతంబైన శ్రీసీతారామాంజనేయసంవాదం బను యోగశాస్త్రంబున నమనస్కయోగానుభవవిచారం బనునది సర్వంబును తృతీయాశ్వాసము.

ఇట్లు వెన్నెలకంటి సుందరరామశర్మచే రచియింపఁబడిన సీతారామాంజనేయ సంవాదతాత్పర్యము సమాప్తము.

శ్రీ సీతారామాంజనేయసంవాదము

సంపూర్ణము.



మ. పరమానందమయాత్ముఁ డెవ్వఁడు మనోవైచిత్రి నానాకృతుల్
పరఁగన్ విష్ణుభవాదినామముల నేవం బొందునయ్యాశుఁ డా
దర మొప్పన్ వెలయించు నిత్యమును సీతారామవాతాత్మభూ
వరసంవాదప[...]ంధ్ర[...]కా[...]వి[...]ర్భూమి[...]గాన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ. సరసామోదకరంబు నార్యజనధీసారంబు లోకద్వయీ
నిరతానందవదాన్య మవ్విబుధవాణీకావ్య మద్దానికిన్
సరియాంధ్రోక్తియు నీద్వయంబును వెసన్నానాఁట క్షీణించె నా
దరశూన్యం బయి పెంపు లేక విగళత్తాళీదళాక్రాంతమై

ఆ. దాని నుద్ధరింపఁ దనవిత్తకాయసం
క్లేశములకుఁ గొంకి క్రిందువడక
నుత్సుకతఁ గడంగె నొనర రామస్వామి
శాస్త్రి భువనహితము సల్పవేడ్క.

క. వావిళ్లవంశరత్నం
బావిద్వన్మణికిఁ దనయుఁ డార్యస్తుతుఁడౌ
నా వేంకటేశ్వరుఁడుసౌ
ఖ్యావహుఁడై పూనెనంత నధికతరముగాన్.

తే. ఆఘనుని చోదనమున నే నల్పవేది
నయ్యు లోకోపకృతివాంఛ యతిశయిల్ల
వివృతిని బొనర్పఁ బూనితి విభునికరుణ
విబుధగుణలౌల్యపోషణ వెలయుఁగాత!



చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్‌వారి
వావిళ్లప్రెస్సున ముద్రితము—1934.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆంధ్ర వచనభారతము

సంస్కృతభారతము పదునెనిమిదిపర్వములును సులభశైలిలో తెనిగించి ఆదిసభాపర్వములొకసంపుటముగను, ఆరణ్యపర్వము రెండవసంపుటముగను, విరాటోద్యోగపర్వములుమూడవ సంపుటముగను, భీష్మద్రోణపర్వములునాలవసంపుటముగను, కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు ఐదవసంపుటముగను, శాంతిపర్వమాఱవసంపుటముగను, ఆనుశాసనిక అశ్వమేధ ఆశ్రమవాస మౌసల మహాప్రస్థానిక స్వర్గారోహణపర్వములు ఏడవసంపుటముగను బ్రకటించినారము.

| | | | |
|---|---|---|---|
| ఆదిసభాపర్వములు1-కి రూ.2-8-0 | | శాంతిపర్వము 1-కి రూ. | 4-0-0 |
| ఆరణ్యపర్వము | 2-8-0 | ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు | 4-0-0 |
| విరాటోద్యోగపర్వములు | 2-8-0 | | |
| భీష్మద్రోణపర్వములు | 4-0-0 | | |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | 2-8-0 | | |

# వాల్మీకిరామాయణము, వచనము

సంస్కృత శ్రీమద్వాల్మీకిరామాయణమును సమగ్రముగఁ దెనుఁగున వచనముగసులభశైలిలోవ్రాయించి ప్రకటించియున్నారము ఇందు మొదటిసంపుటమున బాల, అయోధ్య, ఆరణ్య, కిష్కింధా కాండలును, రెండవసంపుటమున మొదట పారాయణమునకుపయుక్తముగ సుందరకాండము మూలసహితముగను యుద్ధ, ఉత్తర కాండలును గలవు.

రెండుసంపుటములు, కాలికోబైండు రూ. 12-0-0

ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, సంస్కృతమునకు సరియైనతర్జుమా. శ్రీశతఘంటము వేంకటరంగశాస్త్రి కృతము. 6 8

డిటో 3 వాల్యములు 7 0

## వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, మదరాసు.

SRI JAGADGURU VISHWARADHYA
JNANA SIMHASAN JNANAMANDIR
LIBRARY
Jangamwadi Math, VARANASI.
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri.

శ్రీవిద్యారణ్యవిరచిత

# జీవన్ముక్తిప్రకాశిక, సాంధ్ర తాత్పర్యము.

(అద్వైతవేదాంతగ్రంథము.)

ఇయ్యది వేదభాష్యప్రణేతయు, పూర్వాశ్రమమున మాధవాచార్యులని ప్రసిద్ధులునైన శ్రీ శ్రీ విద్యారణ్యస్వాములవారు వ్రాసిన యద్వైతపరమగు వేదాంతగ్రంథము. ఈగ్రంథమునందు శ్రీస్వాములవారు అయిదుప్రకరణములలో సమస్తవేదాంతసారము నిమిడ్చి చిన్నచిన్న సంస్కృతశ్లోకములు, అనుష్టుపులలో, ముముక్షువులు ప్రతిదినము మననముచేయుట కనువగునట్లు వ్రాసిరి. యుక్తియుక్తముగా జీవన్ముక్తిపలని ప్రయోజనములను సాకల్యముగ వివరించిరి. ఇట్టి గ్రంథమును సంస్కృతభాషాపరిచయములేని ముముక్షువుల కుపయోగించునట్లు తేటతెల్లమైన ఆంధ్రతాత్పర్యమును వ్రాయించి సంస్కృతమూలశ్లోకములతో ముద్రించితిమి. కాన, అనేకజన్మములకుగాని లభింపని జీవన్ముక్తిని అరచేతిలోనిఫలమువలె నందించు నీగ్రంథమును ప్రతివారును చదువదగినది.

ప్రతి 1-కి రూ. 2 0

శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యవిరచితమగు

# ఉ ప దే శ సా హ స్రి

గద్యపద్యాత్మకము భాగద్వయాత్మకము-ఆంధ్ర తాత్పర్యసహితము.

శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యవిరచితములగు అద్వైతవేదాంతగ్రంథరత్నములలో నియ్యది చింతామణి. వేదాంతశాస్త్రసిద్ధాంతమును ప్రతిపాదించుచున్న ప్రస్థానత్రయమునందు పూర్వపక్షనిరాకరణ స్వమతస్థాపనపూర్వకముగ నిర్ణయింపఁబడిన సకలవిషయములు న్యాయవైశేషికమీమాంసాదిశాస్త్రపరిచయము లేనివారికి సులభముగా తెలియఁజాలవు. కనుక శాస్త్రజ్ఞాన మంతగా లేని ముముక్షువులకు సైతము వేదాంతశాస్త్రసిద్ధాంతము కరతలామలకమువలె తెలియుటకుగాను గురుశిష్యసంభాషణరూపముతో ఉపనిషద్వాక్యప్రమాణములతో నిరూపించియున్నారు. శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యకృతమగు "ఉపదేశసాహస్రి" అనుగ్రంథమును విద్వాంసులకును పామరులకును ఉపయోగించుటకొఱకు శ్రీరామతీర్థవిరచితవ్యాఖ్యానమననుసరించి ఆంధ్రతాత్పర్యసహితముగ ముద్రించినారము.

ప్రతి 1-కి రూ. 2 8

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri